1982 కేంద్ర సాహిత్య అకాడమీ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీల
అవార్డులను అందుకొన్న ఏకైక నూరు కథానికల సంపుటి
''స్వర్ణ కమలాలు''

# స్వర్ణకమలాలు

ఇల్లిందల సరస్వతీదేవి

1981

1981 First Edition



**SWARNA KAMALAALU**
– an anthology of short stories
by Smt. Illindala Saraswati Devi

Price : Rs. 80/- $ 20.00 £ 10.00

Copies available with :

**Smt. Illindala Saraswati Devi**
'SUDARSANA'
New Nallakunta, Hyderabad–44.
Andhra Pradesh : India.
Phone No : 43563

Paper used for the Printing of this book was made available by the Government of India at concessonal rate.

Published by the author and Printed at Padma Power Press, Kuthiguda, Hyderabad-500 027. Phone : 53266

# తొలిపలుకులు

"స్వర్ణ కమలాలు" అన్న మకుటంతో వెలువడిన ఈ సంకలనం శతకథా సుందరి.

కథా రచనలో, నవలా నిర్మాణంలో, వ్యాస విన్యాసంలో ఇల్లిందల సరస్వతీదేవిగారు విజయం సాధించిన విదుషీమణి. మూడు దశాబ్దాలుగా సాహిత్య సేవ చేస్తూ ఒక విశిష్టస్థానం సంపాదించుకున్న విఖ్యాతరచయిత్రి.

నవల మానవ జీవితాన్ని సమగ్రంగా ప్రదర్శించే సినిమా చిత్రమైతే, కథానిక జీవితంలో కొన్ని సన్నివేశాలు చూపించే ఆకస్మిక ఛాయా చిత్రం (snap shot) అన్నాడొక ఆంగ్ల విమర్శకుడు.

ఈ రెంటికీ తేడా నిడివిలోనే కాదు. వైఖరిలో కూడా భేదం వుంది. విస్తృతమైన పరిధిలో నవలారచన సాగుతుంది. కాని కథానిక ఒక కేంద్ర స్థానం చుట్టూ అల్లుకుని భావతీవ్రతను వెలయిస్తుంది. కాబట్టి వచనంలో సాగిన భావగీతం కథానిక అంటారు కొందరు.

నవలకు విస్తరణమూ కథానికకు కేంద్రీకరణమూ విశిష్ట గుణాలు. ఈ కేంద్రీకరణంవల్లనే ఒక గొప్ప కథానిక చదివినవాళ్ల మనస్సుల మీద చెరగని ముద్రగా నిలిచిపోగలుగుతుంది కథానికలో ప్రతివర్ణనా, ప్రతి సంభాషణా, ప్రతి వాక్యమూ ఒకే కేంద్రం వైపు పయనిస్తూ రసస్ఫూర్తి ఇనుమడింపజేస్తాయి. అల్పాక్షరాలతో అనల్పార్థస్ఫురణ కలిగించే కవితలాగా మంచికథానిక కూడా పరిమిత పరిధిలో అపరిమితమైన రసస్ఫూర్తి కలిగిస్తుంది రవీంద్రుని 'కాబూలీవాలా' లాగా.

సాగదీసిన కథానిక నవల కాలేదు. కుదించిన నవల కథానిక అనిపించుకో లేదు. రెంటి స్వరూప స్వభావాలూ భిన్నమైనవి.

ఈ వ్యత్యాసాన్ని గుర్తించిన రచయిత్రి సరస్వతీదేవిగారు తాత్కాలికమైన ఉల్లాసంకోసం కాక మారని విలువలనూ శాశ్వతసత్యాలనూ ప్రతిపాదన చేయటం కోసం కలంపట్టి కథారచన సాగిస్తున్నారు.

అసభ్యతా, అశ్లీలమూ, కామపిపాసా, హింసా ప్రవృత్తీ సాహిత్య రంగంలో స్వైరవిహారం చేస్తున్న తరుణంలో మానవునిలో దాగిన మహనీయ లక్షణాలైన దయా, సానుభూతీ, సమదృష్టీ, మైత్రీ మధురిమా ఆదర్శ ప్రియత్వమూ ఆవిష్కరించాలనే ధర్మ దీక్షతో రచనలు సాగిస్తున్న వారు అరుదు. వినోదంకోసం, విలాసజీవితాలను చిత్రించే రచనలు నీటి అలలమీద విసిరిన కుండపెంకులాగా గంతులేస్తూ పోతాయి. మనిషిలోనున్న జంతు ప్రవృత్తులను రెచ్చగొట్టే నగ్న రచనలు ఉద్రేకాలను రగిలించి రక్తాన్ని భగ్గున మండిస్తాయి. అటువంటి రచనలకు అలవాటుపడిన పాఠకులు సరస్వతీదేవిగారి [illegible]విరిగా మానవ మనోధర్మాలను నిరూపిస్తూ నరులను ఇంకా ఉన్నతస్థాయికి చేర్చాలనే ఆదర్శంతో వెలువరించే రచనలు చూసి రెండు వాక్యాలు చదివి "బోరింగ్....చాదస్తం" అని పెదవి విరుస్తారు. తాటిచెట్టు ఇచ్చే కల్లును మెచ్చుకునే వారు కొబ్బరికాయ లోని తియ్యని నీటిని మెచ్చలేరు. రెండు చెట్లూ ఒకే నేలలోంచి మొలుచుకు వచ్చినవే మరి!

సరస్వతీదేవిగారి కథలు ఉన్నతాదర్శాలనూ ఉత్తమాభిరుచులనూ పెంపొందించే ఉదాత్తదృష్టితో తీర్చిదిద్దిన రచనలు.

ఈ కథల్లో ప్రధానంగా ఆకర్షించే విశేషం అపారమైన వస్తు వైవిధ్యం. ఎన్నో తరాల వాళ్లు ఎన్నో తరహాల వాళ్లు ఇక్కడ మనముందు మెదులుతారు. మూసలో పోసిన అచ్చులుకాక రక్తమాంసాలతో జీవించే నరనారీ జనాన్ని పాత్రలుగా మలచటంలో నైపుణ్యం కనబరిచారు.

చాలా కథల్లో సామాన్య మానవుల సుఖదుఃఖాలూ, ఆశా నిరాశలూ, విజయ పరాజయాలూ, విలాస విలాపాలూ సహజ సుందరంగా ప్రతిబింబించారు

ఆర్థిక వ్యత్యాసాలు పసిపిల్లల లేత మనసులను ఏవిధంగా కలచివేస్తాయో కొన్ని కథల్లో ఎంతో జాలి పుట్టేట్టు వర్ణించారు

అధికార దర్పంవల్ల తెచ్చిపెట్టుకునే గొప్పలకీ విశిష్ట విద్యాసంస్కారాల ద్వారా లభించే ఉన్నతికీ ఎంతటి వ్యత్యాసమో "మహోన్నతుడు" అనే చిన్న కథలో గొప్పగా ప్రకటించారు.

మిల్టన్ మహాకవి కాల పురుషుణ్ని "the subtle thief of youth" అని వర్ణించాడు. ఆ చోరాగ్రేసరుడి బారిని పడకుండా చిరయౌవనగా విలసిల్లాలనే వింత వనిత మనస్తత్వం "అనాఘ్రాపిత"లో చక్కగా చూపించారు.

అభ్యుదయవాదం కవితలో కుమ్మరిస్తూ సాటివారిపట్ల అమానుషంగా ప్రవర్తించే రచయితలను, గతాన్ని విస్మరించి విర్రవీగే కవులనూ "మనసులోని ఇజమ్" కథలో బండారం బైట పెట్టేశారు.

"వీడిన మబ్బులు" అనే కథలో భార్యాభర్తల అనురాగానికి అంతరాయం తెచ్చిన ఒక ఉత్తరాల పెట్టెను ప్రవేశపెట్టి అందులో ఏముందో తెలుసుకోవాలనే ఉత్కంఠ చివరి దాకా సడలకుండా దాచిపెట్టారు. తన,భార్యను బాల్యంలో ఆదుకున్న ఒక కరుణామయి రాసిన లేఖలను ఆమె ప్రాణప్రదంగా పెట్టెలో పదిల పరుచుకుంటుంది అగ్ని ప్రమాదం నుంచి ఆ పెట్టెను కాపాడుకోటానికి ప్రాణాలకూ తెగిస్తుంది. పెళ్లి కాక మునుపు ఆమెకు ప్రియుడు రాసిన ప్రణయ లేఖలు ఆ పెట్టెలో దాచుకుందని భర్త అనుమానిస్తాడు.

"చీకట్లో చెదరని మనిషి" అనే కథలో ఒక రచయిత జీవితంలో ఎంత హాలాహలం వున్నదో ఆయన దాన్ని గరళకంఠుడై ఎట్లా భరిస్తున్నాడో, అయినప్పటికీ రచనల్లో సదాశివస్వరూపాన్ని ఏవిధంగా ఆయన ప్రదర్శిస్తున్నాడో చిత్రించి ఒక ధీరోదాత్త పాత్రను సృష్టించారు. కళాకారులంతా గరళకంఠులేకాని జటాజూటంలో జాబిల్లిని మెరిపిస్తూ, గంగాజలం జగత్తుమీద కురిపించే శంకరమూర్తులని స్ఫురింపజేశారు.

మళ్లీ మళ్లీ చదవాలనిపించేది గొప్ప కావ్యం అన్నాడు కోల్‌రిడ్జ్. ఒకసారి చదివితే మనస్సులో చెరిగిపోకుండా నిలిచేవి గొప్ప కథలు. అవి ఎన్నిసార్లు చదివినా ఎప్పటికప్పుడు కొత్తగానే కనిపిస్తాయి నిత్యనూతనంగా అలరించే అనాది సూర్యోదయంలాగా.

అటువంటి లక్షణాలున్న కథలు ఈ సంపుటంలో కొన్ని వున్నాయి. అవి ఏవో పాఠకులే గుర్తించుకోవాలి. ఎవరి అనుభూతి వారిది. ఎవరి అభిరుచి వారిది పాత్రను బట్టి జలం.

స్వర్ణకమల సంశోభితమైన ఈ కథాసరోవరంలో విహరించే రాజ హంసలుగా పాఠకుల హృదయాలు అలరారవలెనని నా ఆకాంక్ష.

4/19 బ్రాడీపేట,
గుంటూరు.

అమరేంద్ర

# ముందుమాట

నా రచనా వ్యాసంగము కథానికలతో ప్రారంభమైంది. 1949 వరకూ కథానికలు వ్రాసుకుంటూ దిద్దుకుంటూ వాటిని భద్రపరచుకోవటమేగాని ఏ పత్రికకూ పంపలేదు. దక్కన్ రేడియో ఆలిండియా రేడియోగా మారిన తరువాత, కీ.శే. కురుగంటి సీతారామయ్యగారి ప్రోత్సాహంతో నా కథానికలు రేడియోలో ప్రసారమవుతూ వచ్చాయి. రేడియోవారి సౌజన్యంతో మొదట భారతి మాస పత్రికలో అచ్చవుతూ వచ్చాయి. ఆ తరువాత వ్రాసినవి వారపత్రికలలో ప్రచురింపబడుతూ ఉండేవి. అప్పటి నుంచీ వ్రాస్తూ వచ్చిన కథానికలు నూటికి మించాయి. కుటుంబ నియంత్రణ మీద వ్రాసిన కథానికలను కొన్నిటిని తొలగించి రాసిలో నుంచి వాసి అనిపించిన నూరు కథానికలను ఎన్నిక చేశాను. ఈ నూరు కథానికలలో 42 కథానికలు ఇదివరలో ("పండుగ బహుమానము", "అక్కరకు వచ్చిన చుట్టము". "ముత్యాలు మనసు") మూడు సంపుటాలుగా ప్రచురణ పొందాయి. అందుచేత ఈ ''స్వర్ణ కమలాలు'' సంపుటిలో వెలువడిన కొన్ని కథానికలకు ఇది మలి ముద్రణ అయితే కొన్నిటికి తొలి ముద్రణ.

ఈ సంపుటిలో చేర్చిన వాటిలో ఎన్ని కథానికలుగా నిలబడగలవో, ఎన్ని గల్పికలనిపించుకుంటాయో నేను చెప్పలేను. వాటిలో సామాజికస్పృహ ఎంత ఉన్నదో నాకు తెలియదు. సాహిత్యములో ఒక్కొక్క కాలములో ఒక్కొక్క 'ఇజమ్' ఒక్కొక్క దృక్పథం ప్రాధాన్యత వహిస్తూ ఉండటం చూస్తున్నాము. కాని మానవనైజంలో మార్పు ఉండదనీ, హృదయ స్పందనకు దేశ కాల పాత్రలనే అవధులు లేవనీ, సార్వజనీనమైన భావాలను ఏ రాజకీయ సూత్రాలూ బంధించలేవనీ నమ్మే వాళ్లలో నేనొకదాన్ని. ఈ విశ్వాసముతో రచింపబడినవే ఈ కథానికలు.

నేను సంతోషాతిరేకంలో ఉన్నప్పుడు పొంగి పోకుండానూ, స్తోత్రసుధకు లొంగిపోకుండానూ, నేను ఆవేదనతో క్రుంగిపోయినప్పుడు సమాశ్వాసిస్తూనూ

నన్ను అహరహమూ కనిపెట్టి కాపాడుతున్న ఈ రచనా వ్యాసంగము నా ఆరాధ్య దైవము. నా అభిమాన కళ.

ఏ పాఠకుడినయినా మెప్పించటం సులభమేమోగాని మనసుకు సంతృప్తి నివ్వగల రచన-మనసు మీద గాఢమైన ముద్ర వేయగల రచన చేయటం చాలా కష్టమని నా అనుభవం నేర్పిన పాఠము. ఒక మంచి రచన చదివిన తరువాత పాఠకుడికి కలిగేది ఆనందం మాత్రమే. ఒక మంచి రచన చేసిన తరువాత ఆ రచయితకు కలిగేది అలౌకికమైన ఆనంద రసానుభూతి అటువంటి రచన చేయాలన్న ఆకాంక్షతో ఎదురుచూస్తూ.—

ఇల్లిందల సరస్వతీదేవి

# కృతజ్ఞతలు

ఈ గ్రంథం ముద్రించాలని రెండు సంవత్సరాలపాటు ప్రయత్నించినా కాగితం దొరకటం దుర్లభమైంది. కథలు అచ్చువేయటానికి ఏ పబ్లిషరూ ముందుకు రాలేదు. నిరాశ చేసుకుని ఈ నూరుకథలనూ కట్టకట్టి ఒక మూల పెట్టాలనుకుంటున్న తరుణంలో ఆపద్బాంధవుల్లా శ్రీ యం. యస్. రాఘవన్, ఐ.ఏ.యస్, విద్యాశాఖా కార్యదర్శి శ్రీ గోపాలకృష్ణన్ ఐ. ఏ. యస్. గార్లు నాకు కావలసిన పేపరు లభింప చేశారు. వారిద్దరికీ నా హార్దికాభివందనాలు.

నా కోరికను మన్నించి ఈ నూరుకథలను ఓపికతో చదివి గ్రంథ పరిచయము వ్రాసిన శ్రీ 'అమరేంద్ర' (డాక్టర్ సి యన్. శాస్త్రి) గారు ఆంధ్రాంగ్ల భాషల్లో బహు గ్రంథావలోకనముచేసి ఉభయ భాషల్లోను రచనలు చేసి ఆచార్య పీఠమలంకరించిన సహృదయులు, సద్విమర్శకులు, వారికి నా నమః పరంపర.

ఈ నూరు కథల సంపుటిని అచ్చువేయించటానికి ముందు కథలన్నిటినీ ఒక పర్యాయము చదివి తగిన సలహానిచ్చినవారు ఉస్మానియా యూనివర్శిటీ రీడరు డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తిగారు. ఈ గ్రంథం అచ్చుకాక ముందూ అచ్చవుతున్న కాలంలోను నాకు కలిగిన సందేహాలను తీరుస్తూ తగిన సలహానిచ్చిన వారు శ్రీ డి. రామలింగంగారు, ఈ గ్రంథం యొక్క గెటప్ విషయంలో నాకు సలహాలిచ్చిన వారు బుక్ లింక్స్ కార్పొరేషన్ యజమానులు శ్రీ సత్యనారాయణ గారు. నా కథలకు తగినట్టుగా వ్యక్తి కమలాలను కుంచెతో చిత్రించి జాకెట్‌నూ బ్లాకులూ తయారు చేయించటంలో శ్రద్ధ తీసుకున్నవారు ప్రముఖ చిత్రకారులు శ్రీ శీలా వీర్రాజుగారు వీరందరికీ నా హృదయపూర్వకమైన కృతజ్ఞతాభివందనాలు.

ఈ కథలను ఇంతకు పూర్వము పాఠక లోకానికి పరిచయము చేసిన ఆలిండియా రేడియోకీ పత్రికలకూ నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథము మొదలుపెట్టినప్పటి నుంచీ అతి శ్రద్ధతో ప్రూఫులు చూపిన శ్రీమాన్ యన్.సి యస్ పార్థసారథిగారు మా కుటుంబ శ్రేయోభిలాషి, వారికి నా నమస్సులు

ఈ గ్రంథము అందముగా ముద్రించి సకాలమున ఇచ్చిన పద్మా పవర్ ప్రెస్ హైదరాబాదు వారికి నా కృతజ్ఞతలు.

ఇల్లిందల సరస్వతీదేవి

# విషయసూచిక

పుట

# కొండమల్లెలు

ఆ ఏటి నీళ్ళతో ముఖం కడుక్కొని-ఆ తియ్యటి నీళ్ళు దోసెళ్ళతో తాగి-ఆ ఏటి ఒడ్డున ఇసుకలో కాసేపు కూచుని-ఆ నీటి మీదినుంచి వచ్చే చల్లటి గాలికి ప్రాణము తన్మయమౌతూఉంటే - ఏవేవో మధురస్మృతులను తలంచుకుంటూ గొంతెత్తి కమ్మగా పాడుకునే శివనాథానికి గంట ఎంతయిందో కూడా తెలియకుండా పోయింది. అలా పాడుకుంటూ అతడు తుండుగుడ్డను ఇసకనేలమీద పరచి, తల కింద చెయ్యిపెట్టుకుని పడుకున్నాడు. ఏడు గుర్రాలదొర వేటచాలించాడు. ఆకాశము మీద మేఘాలు అనేక రూపాలు ధరించి జేవురురంగు అంటీ అంటనట్టు పూసుకుని పరుగులెత్తు తున్నాయి.

అతడలా ఒంటరిగా - హాయిగా - కమ్మగా తనివితీర పాడుకుని చీకట్లు కమ్ముకుంటుండగా లేచాడు. తువాలు దులుపుకుని ఇంటిముఖము పట్టాడు. నది ఒడ్డున ఇసుకనేల దాటిన తరువాత కొంతదూరము తాటివనము ఉన్నది. ఆ వనములో అక్కడక్కడా ఒకటీ రెండూ గుడిసెలను దాటిపోతేగాని ఊరురాదు. శివనాథుడు పెద్దపెద్ద అంగలువేస్తూ వనము దాటుతుండగా మడమదగ్గర ఎడమకాలు భగ్గుమన్నది ఆ చురుక్కుమనటములో అతడేదో పురుగు కరిచిందనుకుని ఒక్కగావు కేక పెట్టాడు. ఆ కేకకు అక్కడున్న గుడిసెలోనుంచి పిల్లా పెద్దా బిలబిలలాడుతూ బయటికి వచ్చారు.

అందరూ చూస్తూ నిలబడితే-గురవడు గుడిసెలోనుంచి వస్తూనే "ఏందండీ పంతులుగారూ ?" అంటూ సమీపించాడు.

శివనాథము నేలమీద చతికిలబడి కాలు ఒడిలో పెట్టుకుని చీకటిలో కనబడక పోయినా కాలుపట్టి తడిమి చూచుకుంటున్నాడు. గురవడు ఒక్క అంగలో బుడ్డి దీపము తెచ్చాడు. ఆ వెలుగులో అతడిని సమీపించి కాలు పట్టుకుని 'తుమ్మ ముల్లండీ పంతులుగారూ !' అంటూ బలవంతాన చేత్తో ముల్లుపెరికి పారవేశాడు గురవడు. శివనాథం కాలు తడిమి చూసుకుంటూ 'అమ్మయ్య' అన్నాడు.

'మా గుడిసె ముందుకు రండి. నొప్పి పుట్టకుండా మందు వేస్తా'నని గురవడు శివనాథాన్ని తీసుకువెళ్ళి జిగురువంటి పదార్థము పూశాడు. అతడు వద్దు వద్దంటూ వుండగానే బుడ్డిదీపము చేతబట్టుకుని తాళ్ళదాపే వరకూ సాగనంపాడు శివనాథాన్ని.

శివనాథానికి గురవడితో అలా పరిచయమయింది మొదట. అది మొదలు కొని శివనాథం ఏటికి వస్తూనో - పోతూనో 'గురవా బాగున్నావా?' అనటము మామూలయింది, వారిద్దరి మధ్యా అది అలవాటయి స్నేహబంధముగా మారింది. అతడికి ఆ ఏటిఒడ్డూ గురవడి పలకరింపూ నిత్య జీవితంలో కలిసి పోయాయి.

శ్రావణ భాద్రపదాలలో శివనాథము ఇంట్లోనే ఉండి పోయాడు. ఆ యేమి మోపుగా వర్షాలు ఆరంభించాయి. అదిగాక కొత్త సంసారములో అతడికి తీరిక లేకుండా పోయింది. భార్య శకుంతల వంటలో కూడా అతడి సహాయము కోసము కనిపెట్టుకుని కూచునేది. అతడు కల్పించుకోకపోతే వస్తువులు నాలుగూ నట్టింటనే ఉండేవి. బటలు నాలుగుమూలల్లో పడి దొర్లేవి. అది నాపనికాదని ఆమె ముడుచుకు కూచుంటే ఆఫీసునుంచి వచ్చిన లగాయితు అతడే యిల్లు చక్కబెట్టేవాడు.

శివనాథం ఎక్కువజీతాల తెగలోవాడు. కలిగినదాంట్లోనే జీవితానికి కావలసిన నాలుగూ అమర్చుకోవా లనుకుంటాడు. అతడి కేదయినా 'లేదు-చాల'దనుకోవటానికే అసహ్యము. శకుంతల దీనికి సరిగ్గా వ్యతిరేకము. పొద్దున్నే లేచి 'మా మేనమామ గారింట్లో అంటే మా అత్తయ్య ఎప్పుడు నిద్రలేచినా ఆవిడకి చెల్లిపోతుంది. అప్పుడు కబుర్లు వేసుకుని కూర్చుందంటే పన్నెండయినా స్నానానికి లేవదు' అంటుంది. ఆ మాట వినిపించుకోకుండా తొమ్మిదింటికి ఆఫీసుకు వెళ్ళవలసిన శివనాథం. ఆమెకు వంటప్రయత్నాలన్నీ చేసి పెడతాడు. వంటయిన తరువాత-అతడికి పీటవేసి విస్తరి వేయకుండా-'చూశారూ! మా అక్కయ్య విప్పిన చీరెలన్నీ లుంగచుట్టి పారేస్తుందండీ! అయితే దానికి రెండు బీరువాల నిండా చీరెలు ఉంటాయి కనుక లెక్కలేదనుకోండి' అంటూ చేతిగాజులు చూచుకుని 'అరిగి బద్దలయిపోతున్నాయి. ఎవరికి పట్టింది?' అనుకుంటూ పచ్చడి నూరటానికి బయలుదేరుతుంది. ఈ లోపల శివనాథం తానే వడ్డించుకుని తిని ఆఫీసుకి బయలుదేరి పోతూ 'వెళ్ళుతున్నా. తలుపేసుకో' అంటాడు. 'అయ్యోరామా! ఇంత

-లోనే ఇంత తొందరపడాలా!' కనుబొమలు చిట్లించుకుని మూతి సాగదీసుకుంటూ వెళ్ళి తలుపు గడియవేసుకునేది.

ఆశ్వీజమాసంలో చిరుచలి ప్రవేశించింది. శివనాథము పాత అలవాటు ప్రకారము ఏటిఒడ్డుకు వెళ్ళి, ఒంటరిగా ఇసుకలో పడుకుని బరువెక్కిన మనసును గాలికి ఆరబెట్టి - కమ్మగా హాయిగా కూనిరాగాలు తీసుకుంటూ చీకటి పడేవరకు ఉండి తిరుగుముఖ మవుతున్నాడు అవి శారదరాత్రులు. శరచ్చంద్రికలు గుడిసెలలోకి దూరి వింతవెలుగు నిస్తున్నాయి. శివనాథం మందంగా అడుగులువేస్తు తాటివనంలో ప్రవేశించుతూ ఉండగా 'పంతులుగారూ!' అన్న కేక వినబడ్డది. వెనక్కితిరిగి చూశాడు. 'ఏం గురవయ్యా' అన్నాడు శివనాథం.

'పంతులుగారు! మిమ్మల్ని ఒకమాట అడుగుదామనుకుంటున్నా. ఈ మధ్య మీరు కండ్ల బడలేదు' అన్నాడు.

ఏమిటన్నట్లు శివనాథ , గురవడి వైపు చూశాడు.

'మా పోచాలును ఊరి నుంచి తీసుకురావాలి. మంచిరోజు చూచి చెప్పరూ!' అన్నాడు.

శివనాథానికి నవ్వు వచ్చింది. తనకంతా తెలుసుననుకున్నాడు కాబోలు గురవయ్య. అయినా అతడంతగా తనను నమ్మి, గురిగా అడుగుతున్నప్పుడు కాదనట మెందుకని 'చూడు గురవయ్యా! నీకు తొందరగా తీసుకురావాలని ఉన్నదా!' అన్నాడు.

సిగ్గుతో కూడిన నవ్వు నవ్వుతూ చేతులు నలుపుకుంటూ 'అవునండీ!' అన్నాడు.

'అయితే ఎల్లుండి బుధవారము దశమి బాగుంది. ఏం నీకు వీలవుతుందా!' అన్నాడు.

గురవడు ఎగిరి గంతేశాడు. 'దణ్ణం పంతులుగారూ! మళ్ళీ కలుస్తా'నంటూ ఆ చీకట్లో కలసిపోయాడు.

తరువాత పదిహేను రోజులవరకూ శివనాథం ఎటూ కదలలేక పోయాడు. ఆఫీసులో పని - ఇంటిలో గృహచ్ఛిద్రాలు, మధ్యమధ్య వర్షమూ వీటితోనే సరి పోయింది. అతడికి ఏటికి వెళ్ళనినాడు మనసంతా చికాకుగా ఉంటుంది. ఏదో బరువుగా ఉంటుంది. ఒంటరిగా-ఇసుకలో పడుకుని-ఆ విశాలమయిన అనంతాకాశాన్ని చూస్తూ-మిణుకు మిణుకు మనే చుక్కలను లెక్కిస్తూ తాచుపాములా పరుగెత్తే ఆ సెలయేటితో మనసు పొంగుతీర ఆవేదనలను వెళ్ళబోసుకోవాలని అతడి ఆకాంక్ష. కాని డబ్బుఖర్చు లేని ఆ కోరికకూడా ఓ పక్షము వరకూ తీరిందికాదు.

ఆనాడు ఈదరగాలి లేదు. ఆకాశము స్వచ్ఛంగా ఉన్నది. కులాసాగా ఈల పాటతో మందంగా నడుస్తూ శివనాథం తన మామూలు చోటికి చేరుకున్నాడు. అతడు తువాలు పరవబోతుంటే గురవడు సవ్వడి కాకుండా అక్కడికి చేరాడు. 'పంతులుగారూ! పంతులుగారూ!' అనుకుంటూ.

గురవడిని చూడగానే పోచాలును తీసుకు రావటానికి తాను మంచిరోజు చూసి చెప్పటము శివనాథానికి జ్ఞాపకము వచ్చింది. గురవడు ముసిముసి నవ్వులు నవ్వుతూ 'పంతులుగారూ! మీరు చెప్పిన వేళకే తీసుకువచ్చానండి. ఎవరూ వద్దన లేదండీ' అన్నాడు.

'అయితే యింకేం? మంచిదేగా!' అన్నాడు.

'కాదండీ! నే నెప్పుడెళ్ళినా ఈ వారంకాదు-మరోవారం అనో-మళ్ళీరా అనో తిప్పేవాళ్ళండీ. మీరు ఏం ముహూర్తం పెట్టారో. వెళ్ళగానే వెంట పంపే రండీ. అప్పటినుంచి నండీ కమ్మనికూడు తింటున్నానండి. మా అమ్మపోయిన తరువాత కమ్మటికూడే కరవయిం దండీ''.

'అయితే సుఖంగా ఉన్నావన్నమాట' అన్నాడు అతని సంతోషాన్ని చూసి ఆనందిస్తూ.

'మీదయ అండీ. మీరు మాగుడిసెకు రావాలండి ఒకసారి'

'నీ వెప్పుడు రమ్మంటే అప్పుడే వస్తా. ఎప్పుడు రమ్మంటావు చెప్పు' అన్నాడు.

'ఇప్పుడే రండి. నా వెంటరండి' అని దారితీశాడు. శివనాథము చివాలున లేచి తువ్వాల దులుపుకుని గురవడి వెనుక నడిచాడు. తాటి వనములో మొదటి మలుపు తిరగగానే అతడి గుడిసె కనబడుతుంది. కుడిచేతి పక్కగా వెళ్ళితేగుమ్మం ఎదురవుతుంది. అది తాటి కమ్మల గుడిసె. దానిముందర రెండడుగుల వెడల్పున రెండుపక్కలా అరుగులు ఎర్రమట్టితో అలికి ముగ్గులు వేసి ఉన్నాయి. గుడిసె ముందర ముచ్చటగా నాలుగు ముగ్గుకర్రలు పలుకరిస్తున్నాయి. అరుగుమీద శివనాథాన్ని కూచోబెట్టి గురవడు లోపలికి వెళ్ళి ,నాలుగు అరటిపళ్ళు పళ్ళెములోపెట్టి తీసుకు వచ్చాడు.

పోచాలు నల్లటి ముఖంలోంచి పెద్దకళ్లు వెలుగును చిమ్ముతున్నాయి. తల నున్నగా దువ్వుకుని ఎర్రటిపూలు ముడుచుకున్నది. చంద్రకాంతరంగు నేతచీరె- సెనగపూల రవిక ఆమె దేహకాంతికి కొట్టవచ్చినట్టున్నాయి. ఆమె తలవంచుకొని గురవడి పక్కన నిలబడింది.

వాళ్ళిద్దరిని చూస్తూంటే అతడికి కడుపు నిండినట్లయింది. ఏదో ఘనకార్యము చేసినట్టుగా శివనాథం మనసు ఉక్కిరిబిక్కిరి అయింది. చిరకాలము సుఖంగా ఉండండని దీవించి లేచాడు. ఇద్దరూ చేతులు జోడించి శివనాథాన్ని సాగనంపారు.

అడవిలో కొట్టిన కట్టెపుల్లలు మోపులుగా కట్టి ఊళ్ళోకి తెచ్చి అమ్ముతాడు గురవడు. వస్తూవస్తూ ఆనాటి సరుకులు తెచ్చి యింట్లో పడేస్తాడు. బుడ్డి దీపపు వెలుగులో సరుకు బాగుచేసి- గురవడు ఏటికి పోయి కాళ్లూచేతులూ కడుక్కొని మడతమంచము వాకిట్లో వేసుకుని సేదతీర్చుకునే అంతలో పోచాలు వండి వారుస్తుంది. ఊసులాడుతూ యిద్దరూ ఒక పళ్ళెంలోనే పెట్టుకు తింటారు. ఈ సంగతులన్నీ గురవడు శివనాథానికి చెప్తుంటే అతడి కేదో చెప్పరాని ఆనందము కలిగేది.

దీపావళి వెళ్లిన నాలుగోనాడు కాబోలు శివనాథము తాటివనము దాటుతూ ఉండగా చప్పున గురవడు జ్ఞాపకము వచ్చి వాళ్ళ గుడిసెవైపు నడిచాడు. గుడిసె తలుపు దగ్గరగా వేసి ఉన్నది. సందులలోనుంచి బుడ్డి దీపపు వెలుగు కనిపిస్తున్నది. గురవడిని పిలిచాడు. పోచాలు బయటికి వచ్చి 'అయ్యగారూ! గురవడు లేవటం లే'దన్నది. పోచాలు వెంట అతడు లోపలికి వెళ్ళాడు. గురవడు మంచమ్మీద పడుకొని మూలుగుతున్నాడు.

‘ఏమిటి గురవా ఈ పడక ! మూలుగుతున్నా వెందుకు ?’ అన్నాడు.

‘దివ్వేల పండుగునాడు పటాసు చేతిలో పేలిందండి’ అన్నాడు గురవడు. మూలుగుతూనే లేచి కూర్చుని ‘పంతులు గారికి చాపవెయ్యి’ మని పోచాలును పిలిచి వేయించాడు. ‘దణ్ణాలండీ పంతులు గారూ? మీదయవల్ల బతుకుతున్నాం. పోచీ! నీకోక చూపించవే వారికి!’.

‘మీరొస్తే మూలుగంతాపోయింది చూశారా? పండుక్కి వద్దంటునే ఉన్నా. ఈ చుక్కల చీరె గువ్వకన్ను రవిక కొన్నాడు. నేడిక్కడికి వచ్చినాకనే ఈదండ కడియం కొన్నాడు.’’ పోచాలు తీసి చూపించింది.

‘గురవా ! నీ సంపాదనే బాగున్నది! నాకంటె నీవే నయమన్న మాట!’ శివనాథము అంటుంటే గురవడు మొలక నవ్వులతో తల వంచుకొని ‘బాబయ్యా! పోచి చేసిన పని వినరూ? అది ఇక్కడికి వచ్చేనాటి గాజులకని పోశలకసి తల్లి పది రూపాయలు చేతిలో పెట్టిందట. అవి పెట్టి నాకు ధోవతులు కొన్నది. కట్టుకునే వరకూ చంపింది’ అన్నాడు.

ఆ యిల్లు-ఆ వాతావరణమూ- ఆ జంట- ఆ కబుర్లు-ల పరస్పరాకర్షణ- ఒకరిపైన ఒకరు సరసమైన నేరాలు చెప్పుకోవటమూ శివనాథానికి మధురంగా ఉన్నది. కొంతసేపటికి తెప్పరిల్లి ‘నీ చెయ్యి ఎట్లాఉన్నది. గురవా !’ అని అనగలిగాడు శివనాథము.

‘వేళ్ళన్నీ ముడుచుకు పోయాయి. చెయ్యి బాగా తెరవలేను’ అని చెయ్యి చూపించాడు గురవడు.

‘తొందరగా నయంచేసుకో. రెక్కల కష్టంచేసి బతికే వాడివి’ అంటూ శివనాథము ఇంటిదారి పట్టాడు

తరువాత గురవడి సంగతి కనుక్కోవటానికి శివనాథానికి వీలు కలుగక పోయింది. ఆఫీసు పనుల తొందరలో అతడి మాటే జ్ఞాపకం రాలేదు. ఒకనాడు శివనాథము కచేరినుండి ఇంటికి వస్తూ ఉండగా దారిలో కట్టెల మోపు ఎత్తుకు పోతున్న పోచాలు కనబడ్డది. గురవడి సంగతి అడిగాడు అతడికి నయముకాలేదట అంచేత తాను కట్టెలమ్ముతున్నా నన్నది. గురవడు శివనాథం కోసం కలవరి

స్తున్నాడని చెప్పింది. 'సరేలే చూద్దాం' అని ఆమెతో చెప్పి ఇంటికివెళ్ళిపోయాడు. కాని వెంటనే గురవడిని చూడటానికి వెళ్ళలేక పోయాడు.

శివనాథము ఇట్లా అనుకుంటూ అనుకుంటూ ఉండగానే ఋతుచక్రము ఒకసారి చుట్టివచ్చింది. ఈ లోగా అతడు బిడ్డ తండ్రి అయినాడు. ఆరునెలలయినా తిరక్కముందే అతడి తండ్రి కాస్తా పోయాడు. ఇద్దరు తమ్ముళ్ళతో తల్లి అతడి దగ్గరకే వచ్చింది. ఆ సంసారములో మునుగుతూ తేలుతూ ఉన్నాడు శివనాథము.

ఆనాడు శివనాథము ఆఫీసు నుంచి ఒక గంట ముందుగా బయలుదేరాడు. సగము దారిలో కొచ్చేవరకు ఈ గంట సేపట్లో ఇంట్లో ఏదైనా పనిచూచుకో వచ్చనుకున్నాడు. కాని సగము దూరము వచ్చిన తరువాత గురవడు జ్ఞాపకము వచ్చి తిన్నగా అక్కడికి వెళ్ళాడు. గడపలో నిలబడి చూశాడు. గురవడు మంచము మీద కూచుని మేదరి ఉయ్యాల తొట్టె ఊపుతున్నాడు. 'ఎన్నాళ్ళకు చూశాను, పంతులుగార్ని! లోపలికిరండి' అన్నాడు లేచి నిలబడి.

'చెప్పావు కావేం? పిల్లా- పిల్లవాడా?' అనడిగాడు శివనాథము గడపలో నిలబడే ఆశ్చర్యపోతూ.

'ఒకటి కాదు బాబయ్యా రెండు. ఇద్దరూ ఆడపిల్లలు' అన్నాడు నవ్వుతూ.

'ఇంకేం అదృష్టవంతుడివి అవును గానీ-నీవు యింట్లో ఉన్నావేం! పోచాలు ఎక్కడికి వెళ్ళింది?'

'నా చెయ్యిచూశారా? చచ్చుపడి పోయింది. గొడ్డలి పట్టలేను. ఈకాలు ఈడుస్తూ నడవ్వలసిందే. నాబదులు పోచాలే గంజి నీళ్ళకు డబ్బులు తెస్తుంది. ఏం చేస్తాం? ఈపిల్లలికీ ఆగంజే యింత పోస్తున్నాం.'

శివనాథం మాట్లాడకుండా గురవడివైపు చూస్తున్నాడు. అతడికి కళ్లుగుంటలు పడ్డాయి, ముఖం దోక్కుపోయింది. బాగా నల్లబడ్డాడు. అంతలో పోచాలు వచ్చింది.

'అయ్యగారు చాలా కాలానికి వచ్చారు. పిల్లల్ని చూశారా అంటూ ఒక్కొక్క పిల్లనే తీసుకు వచ్చి చూపించింది. పోచాలులో అది వరకు ఉన్న

విగారింపు లేదు. కాని కళ్ళ తేజస్సు తగ్గలేదు. శివనాథం జేబు తడుముకొని రెండు రూపాయలు తీసి పోచాలు చేతిలో పెట్టి 'పిల్లల కేదైనా కొనిపెట్టు' అన్నాడు. అంతదూరము రానేవచ్చాను గదా అని ఏటి ఒడ్డుకు వెళ్ళాడు. ఏడు గంటలవాటే వరకు పడుకున్నా డక్కడ ఇసుకలో. చప్పున జ్ఞాపకం వచ్చింది. ఆసాయంత్రానికి తాను కూర తెస్తానని యింట్లో చెప్పినట్లు. మెల్లగా లేచి బయలుదేరాడు.

ఇల్లు చిన్నది, ఒక వంటయిల్లూ, గదీ, వసారా, అందులో ఇంతమందీ కాలక్షేపము చెయ్యాలి, తమ్ముళ్లు చదువుకోవాలి. తల్లి వచ్చినప్పటినుంచీ ఇంటిపనీ అవిడే చూచుకుంటోంది.

సంసారము బయట పడకుండా ఉండాలని తన తల్లి చాలా [illegible] సంగతే ముందు చూస్తుంది. ఇంటింటా ఉన్న గృహచ్ఛిద్రాలు ఒక్కొక్కటే నాడు శివనాథానికి ఎదురవుతూ ఉంటాయి. అనాడతడు అలస్యంగా యింటికివస్తూ ఉంటాడు.

ఉగాదినాడు సాయంత్రము అరు గంటలవేళ తల్లి చేసిన పూర్ణపుబూరెలు పొట్లం కట్టుకొని శివనాథం గురవడి యింటికి బయలుదేరాడు. గురవడి యింటి ముందు నిలబడి చూస్తే తలుపు దగ్గరగా వేసివున్నది. అతడా అరుగుమీద కూర్చుని ఆ యింటి ముందు వేసివున్న ముగ్గులనూ, గడపకు కట్టిన తోరణాన్నీ చూస్తున్నాడు. అంతలో లోపల్నించి ఏవో మాటలు వినబడ్డాయి.

'నా మాట విను. ముఖం కడుక్కొని బొట్టు పెట్టుకో. పెట్టెలో నుంచి ఆచీరెతీసి కట్టుకో. పిల్లలకి బాబుగారిచ్చిన రూపాయలతో కుట్టిన అంగీలు తొడిగాను'

'అంతా చేస్తా-కాని-నీవు ముందు లేచి నేను అప్పుడు కొన్న ఆ కోక కట్టుకుంటానంటే'

'నేను ఏ మొగం పెట్టుకొని కట్టుకోను నీవే చెప్పు: [illegible] [illegible] ఉండి నీవు తెచ్చినదాంతో బతుకు తున్నాను: సగం సచ్చినట్టుంది నా బతుకు'

'అదుగో అదే వద్దు.'

అయిదు నిముషాల వరకూ ఏనందడీ లేదు. ఇద్దరూ బట్టలు కట్టుకున్నారేమో ననుకున్నాడు శివనాథం.

తటాలున పోచాలు తలుపు తీసి పిల్లనెత్తుకుని బయటకు వచ్చింది. శివనాథాన్ని చూడగానే తెల్లబోయి 'ఎంతసేపయింది వచ్చి' అన్నది. ఈ మాట విని గురవడు ఇంకొక పిల్లనెత్తుకుని కాలు ఈడుస్తూ బయటికి వచ్చి అరుగుమీద కూర్చున్నాడు.

'పంతులుగారు నిలబడితే కూచుంటావా!' అన్నది పోచాలు.

పోచాలు కొత్తగా కాపరానికి వచ్చినప్పుడు కొన్న చుక్కలచీరె గురవడు చెప్పినట్లు కట్టుకున్నట్టుంది. తలలో ఎర్రటి కాగితపువ్వులు పెట్టింది. గురవడూ అప్పటి ధోవతి కట్టుకున్నాడు. వాళ్ళిద్దరూ దీపావళినాడు చూసినట్టే ఉన్నారు. ఇద్దరి ముఖాలూ నవ్వుతూ ఉన్నాయి. మధ్యమధ్య పిల్లలని పలుకరిస్తూ నవ్విస్తున్నారు.

"గురవా! పండగనాడు ఈ పూర్ణాలు తినండి" అని చేతిలో పెట్టాడు. పోచాలు అందుకుని 'తినమని' గురవడి చేతిలో పెట్టింది.

'నీవు?" అన్నాడు గురవడు

'నామాట కేంలే నీవు తిను'

'అయ్యగారు! దీని పంతం చూడండి. ఉన్నదికాస్తా నాకూ పిల్లలకూ కాచి పోసింది. పొద్దుటిపూట దానికేం మిగల్లేదు' అన్నాడు.

'అదంతా చెప్పకు' అన్నట్లు పోచాలు గురవడి వంక చూసింది. కాని గురవడు అటు చూడలేదు.

'అయితే నాముందరే మీ యిద్దరూ చెరికొంచెము తినండి' అన్నాడు శివనాథం.

ఇద్దరూ తినగా చూసి లేచాడు శివనాథం.

అతడిని తాటివనం దాకా ఇద్దరూ సాగనంపారు. అప్పుడన్నాడు శివనాథం 'గురవా! నాకీ ఊరునుంచి బదిలీ అయింది. నాలుగు రోజుల్లో వెళ్ళిపోతాను' అని.

వెళ్ళిపోతారా అన్నట్టు యిద్దరూ జాలిగా చూశారు. 'ఆనాడు ముల్లుతీసి నప్పటి మంచి బాబయ్యగారు తండ్రిలాగున్నారు' అనికళ్ళల్లో నీరు నింపుకున్నాడు.

శివనాథానికి కూడా కళ్లు చెమ్మగిల్లాయి. అతడు కనబడే వరకూ చూపి వాళ్ళు వెనక్కి మళ్ళారు.

ఆ రాత్రి శివనాథానికి చాలాసేపు నిద్రపట్టలేదు. ఈ ఊరు వచ్చిన మూడేళ్లూ ఆఫీసులో పని ఎక్కువయినా-చివాట్లుతిన్నా-ఇంట్లో గృహకల్లోలాలు ఒత్తిడి చేసినా ఆయేటిఒడ్డుకు పోయి గంటలతరబడి పడుకుని అన్నీ మరిచిపోయేవాడు. ఆయేటి ఒడ్డును చూడగానే మనసుశాంతపడేది. కాని అతడి అంతరాత్మ ఎదురు తిరిగింది. 'నీకు మనశ్శాంతిని కలిగించిందీ.హాయిని గొలిపిందీ గురవడి కుటుంబం. వాళ్ళ పొందిక-తృప్తి ఆప్యాయత నీకు బ్రహ్మానందాన్ని కలిగించాయి. అని గదమాయించింది అంతరాత్మ. 'అయితే ఇటువంటి గిరిజనులను బాగుచేయటానికా నన్ను ప్రభుత్వం బదిలీ చేసింది?''అనుకుంటూ చాలా సేపు పక్కమీద దొర్లాడు శివనాథం.



# డైరీ

మిలిటరీ యూనిఫారములో ఉన్న ఉద్యోగి కాబోలు అతడు; ముఖము నిండా చెమటలు కారుతున్నా లక్ష్యపెట్టకుండా మిలటరీనడక సాగిస్తున్నాడు, బెంగుళూరులో బసవన్ గుడి పెద్దరోడ్డుమీద. క్రొత్తవాళ్ళకు పెద్దరోడ్డునుంచి చీలే చిన్న సందులన్నీ ఒక మాదిరిగానే కనబడ్తాయి. అతడు రెండు సందులు తిరిగి మళ్ళీ పెద్దరోడ్డుకే వచ్చాడు. నాలుగు దినాల క్రిందట ఒక ఆయా, ఏడెనిమిది సంవత్సరాల పిల్లను వెంటపెట్టుకుని, ఒక సందులోఉన్న పెద్దగేటుగల ఇంట్లోకి పోతుండగా అతడు చూశాడు. పిల్లలు ఆడుకొనే స్థలము దగ్గర్నుంచి ఆ మనిషి పిల్లను ఎటు తీసుకొని పోతుందో,.... ఆ పిల్ల ఎవరిపిల్లో.... వాళ్ల ఇల్లు ఏదో.... తెలుసుకోవాలన్న ఉద్దేశ్యముతో ఒక కన్ను వాళ్లమీదనే ఉంచాడు. వాళ్ళు బయలుదేరే సమయానికి తనూలేచి, దూరంనుంచి వెంబడిస్తూ ఇల్లుచూసి మనసులో బాగానే గుర్తుపెట్టుకున్నాడు. కాని యీవేళ యిల్లు త్వరలో దొరికేటట్లు లేదు.

విసుగులేకుండా మరొక సందులో ప్రవేశించాడు నడుస్తూనే ఇళ్లన్నీ పరిశీలించి చూస్తూ చప్పున ఒక గేటుగల ఇంటి ముందర ఆగాడు. గేటుప్రక్క మేజరు యల్. వి. శాస్త్రి అని వ్రాసివుంది. సందేహిస్తూ లోపలికి వెళ్లి, తన పేరుగల కార్డును పనిమనిషిచేత లోపలికి పంపించాడు. ఆహ్వానము రాగానే వెళ్లి డ్రాయింగు రూములో కూర్చున్నాడు. యజమాని కాబోలు ఆయన—ఆంధ్రుడి వేషము ధరించుకొని తువ్వాలు భుజంమీద వేసుకొని, సామాన్యంగా వచ్చి మామూలు పద్ధతిలో నమస్కారమని—తనూ ఒక కుర్చీలో కూర్చున్నాడు. ఎప్పుడూ ఎరుగకపోయినా మిలిటరీ వేషధారణవల్ల కలిగిన గౌరవం పురస్కరించుకొని మాట్లాడిస్తున్నాడు.

'నేను ఇక్కడ మిలిటరీ ఎక్కౌంట్సు డిపార్టుమెంటులో ఉన్నాను. ఒంటరిగానే ఉంటున్నాను. అందుకని ఏమీతోచక అట్లా బయలుదేరి పోతూ, మీ పేరు గేటుమీద చూచి లోపలికి వచ్చాను. నేను ఆంధ్రుడను. మీ పేరుకూడా అలాగే ఉండేసరికి నన్ను ఆకర్షించింది' అంటూ డ్రాయింగ్‌రూముకు యిటుఅటు ఉన్న

తలుపులవంక చూశాడు. ఆ చూడటము గమనించి, 'మీ కేమయినా కావాలా?' అన్నాడు శాస్త్రి. 'నాకేమీ వద్దు. కాని మీ యిల్లు నిశ్శబ్దంగా ఉందే. పిల్లలెవరూ కన బడరేం? మీరూ ఒక్కరే ఉన్నారా?' అన్నాడు. మనసంతా పిల్లలెవరైనా ఎటు నుంచైనా వస్తారేమోనన్న కుతూహలంతో.

'మాకు ఒక్కతే అమ్మాయి. ఆడుకోవటానికి ఎటో పోయి ఉంటుంది' అన్నాడు శాస్త్రి.

'లేదండీ. అమ్మాయి పిల్లలాడుకునే స్థలంలో లేదు.'

'మీకెట్లా తెలుసు? మా అమ్మాయి పరిచయమా? ఎక్కడ చూశారు?'

'అమ్మాయిని నేను రోజూ చూస్తూనే ఉన్నాను. ఆమెను ఎత్తుకోవాలనీ, దగ్గర కూర్చోపెట్టుకోవాలనీ నా కెంతో ఆపేక్ష. ఒకసారి పిలువరూ?'

'పిలుస్తాను. కూర్చోండి, మీరు కొంచెము ఈ గ్లాసు తీసుకుంటారా?' అంటూ సీసా తీశాడు శాస్త్రి.

'క్షమించండి. నేను అలవాటు చేసుకోలేదు' అన్నాడు. 'నయమే. ఆర్మీలో ఉన్నా అలవాటు కాకపోవటము ఆశ్చర్యమే. అదిగో మా అమ్మాయి ఉష వచ్చింది చూశారా?'

'ఏది' అంటూ అమ్మాయిని ఎత్తుకొని హృదయానికి హత్తుకున్నాడు.

'శాస్త్రిగారు! నాది ఒక కోరిక. రోజూ నన్ను యీ అమ్మాయిని యిలా ఎత్తుకోనియ్యాలి. నా జీవితానికి ఇదే తృప్తి' అన్నాడు కళ్లు తుడుచుకుంటూ.

'ఏమిటి? అలా కళ్లు తుడుచుకుంటున్నారు. మీకు పిల్లలంటే అంత ప్రీతా? మా అమ్మాయి బహు అల్లరిదీ చిలిపిదీను' అన్నాడు శాస్త్రి.

'నా జీవితములో ఆకస్మికంగా జరిగిన దైవ సంఘటనకు నేనూ నాభార్యా రెండు సమరేఖల మయినాము' అన్నాడు దీనంగా మిలిటరీ యూనిఫారంలో ఉన్న ఉద్యోగి.

* * * *

దుర్గాప్రసాదు సెక్రెటేరియటులో పనిచేస్తూ భార్య కృష్ణవేణితోను, ఎనిమి దేళ్ల కూతురు సంధ్యతోను కాపురం పెట్టాడు. సంధ్య చాలా చురుకైన పిల్ల. తల్లి హృదయంలో స్థాన మేర్పరచుకొన్నది కాని తండ్రి హృదయాన్ని కదిలించలేక పోయిందా కిశోరి. అతడు చాలా సామాన్యంగా ఇంట్లోఉన్న ఒక వస్తువులాగ చూసేవాడు.

ఒకరోజు 'కృష్ణా! ఇక్కడ పెట్టిన స్టాంపు లేమయినాయి?' అని భార్యను అడిగాడు ఉత్తరాలు వ్రాస్తూ.

'నేను చూడలేదే? గాలికి ఎగిరిపోయినాయేమో!' అన్నది.

'గాలిరాందే? నీ కవిత్వము మరీను. సంధ్య తీసిఉంటుందా?' అన్నాడు.

'అది ఈవైపుకు రాందే అసలు?' అన్నది.

ఆ సాయంకాలము, 'కృష్ణా! సంధ్య అల్లరి ఎక్కువగా ఉంది. ఒక టీచ రును మాట్లాడాను. రేపట్నుంచి వస్తాడు. ఆయనదగ్గర కూర్చోపెట్టు, దానికి చదువు ధోరణేలేదు' అన్నారు.

ఆ టీచరు వారముదినాలు వరుసగా రావటము, అరగంటకుపైగా రోజూ ఒక్కదే అరుగుమీద కూర్చోటము జరిగింది. నిదానంగా మంచి మాటలతో వర్ణిస్తూ చెప్పలేకపోవటమే దానికి కారణమయింది.

'సంధ్యా! టీచరు ఏం చెప్పాడు? ఎంతసేపు చదువుకున్నా'వని తండ్రి అడగగానే 'నాన్నగారూ, ఆ మేష్టరు కంటె బావ బాగా చెప్పాడు పాఠం. ఆయ నకు చెప్పడమే తెలీదు.' అంది కొంటెగా.

'కృష్ణా నీ కూతురికి మంచిగుణాలే నేర్పిస్తున్నావు. చదువూ సంధ్యా అబ్బే యోగ్యత లేదు' అని తప్పంతా భార్యదయినట్లు ఆమెను చీవాట్లు పెట్టాడు. సంధ్య మంచి యోచనాపరురాలు. ఆమె వేసే ప్రశ్నలకు అందరు విసుక్కునేవాళ్లు. తండ్రి కిధోరణి నచ్చేదికాదు. చిన్నవయసుగల సంధ్యలో పెద్దవాళ్లకుండే గాంభీర్యము, మర్యాద, తనకిప్పుడున్న జ్ఞానము లేవని ఏవగించుకొనేవాడు.

కొంటెతనముతో కూడిన ఆమె ముద్దు చేష్టలను అతడు అల్లరిఏ మంకుతన మనీ అనుకునేవాడు.

ఒకనాడు దుర్గాప్రసాదు, తన స్నేహితుని యిల్లు చూపించమని, సంధ్యను ఒక పెద్దమనిషివెంట పంపాడు. కొంత దూరము వెళ్లాక, 'మీకు ఎవరిల్లు చూపించాలి?' అన్నది.

'నీకు తెలుసుగా దివాకర్లవారి యిల్లు' అన్నాడు వచ్చిన పెద్దమనిషి. 'అదయితే నాకు తెలియదు. మా రామంబావ యిల్లు చూపిస్తాను, మీరువస్తే' అంది నవ్వుతూ.

'అయ్యో! మీ నాన్నగారు చెప్పేటప్పుడు నాకు తెలుసునంటివిగా'అన్నాడు. అది ఎండాకాలము. బయట తిరగటమే కష్టంగా ఉన్నదారోజు మరీ.

'అయితే రండి మా బావదికూడా దివాకర్లవారి యిల్లే. చూద్దురుగాని. మంచి ఆల్బము ఉన్నది. మేడలు కట్టటానికి ప్లానులు ఉన్నాయి. అవన్నీ చూడాలని ఉంటే త్వరగా రండి' అన్నది. ఆ పెద్దమనిషి ఆలోచనలో పడ్డట్లు కనబడగానే 'ఏం రారా ఏమిటి! చెప్పండి నేను వెళ్లాలి' అన్నది. పాపం ఆయన ముందూ వెనకా చూసిచూసి యింటికి వెళ్ళిపోయాడు,

'నాన్నగారూ! ఆయన రామంబావ యింటికి రమ్మంటే రానని వాళ్లయింటికి వెళ్ళిపోయాడు' అన్నది.

ఆ రాత్రి- మర్యాద మార్గాలు నేర్పటంలేదు పిల్లకని కృష్ణవేణి చీవాట్లు తిన్నది.

ఉన్నట్టుండి సంధ్యకు న్యుమోనియా జ్వరము వచ్చింది. క్షణాలమీద జ్వరం రావటం, ఊపిరితిత్తులు రెండూ శ్లేష్మముతో నిండిపోవటము, వ్యాధి ముదిరటము కష్టంగా కనబడటమూ జరిగింది. ఆరోజు మధ్యాహ్నము డాక్టరు వసంతరావు ఊపిరి స్తున్ననాడిని క్రమము చేసే ఆఖరు ఇంజక్షను యివ్వటానికి వచ్చాడు. అస్తమించబోతున్న సంధ్యను చూసేసరికి డాక్టరుకే కళ్ళకు నీళ్లువచ్చాయి. చిన్నప్పటి నుంచీ, 'మామయ్యా' అనితిరుగుతూ, అత్తయ్యకు మామయ్యకు మధ్య సంధి కుదుర్చే ముద్దుల రాయబారి, కారుచీకట్లలో లీనముకాబోతున్న ఆచిన్నారిసంధ్య. 'మామా! దాచిపెట్టిన పిన్ను, అత్తకిచ్చావా లేదా' అని పక్షముక్రింద, తమ దంపతులలో జరిగిన ప్రణయలీలను జ్ఞాపకము చేస్తున్నదా కిశోరి, యీలోకంలోనుంచి విశ్రమ-

.మించబోతూ, ఆచిన్నారితో కలిగిన స్నేహమువల్ల నే విరసుడైన దుర్గాప్రసాదును 'బావగారూ' అని పిలవటము అలవాటు చేసుకున్నాడు డాక్టరు వసంతరావు. ఆకస్మికంగా రాలిపోయిన ఆపసిమొగ్గను ఎరిగినవాళ్ళల్లో కంట తడిపెట్టనివాళ్లులేరు.

మనిషిలోని నవనాడులనూ క్రుంగదీసే కడుపుదుఃఖాన్ని ఎవరు ఉపశమింపజేయగలుగుతారు ? కృష్ణవేణిని బలవంతంగా అన్నగారు తీసుకొనివెళ్ళి, అనేక రకాల ప్రకృతిదృశ్యాలను చూడటముతో మామూలుస్థితికి వస్తుందేమోనని ప్రయత్నిస్తున్నాడు.

దుర్గాప్రసాదుహృదయంలో కృష్ణవేణి ఎదురుగా ఉన్నంతసేపూ సంధ్యాస్తమయము తరువాత చిరుచీకటే గాని కారు చీకట్లు అలుముకోలేదు.

కృష్ణవేణి వెళ్ళిన తరువాత దుర్గాప్రసాదు ఇల్లంతా సర్దుకొని, తాను కూడా ఎక్కడైనా నాల్గురోజులపాటు వెళ్ళాలని సంకల్పించాడు. ఇల్లంతా సర్దటమైనతరువాత సామాను గది సర్దటానికి పూనుకున్నాడు. గదితలుపు తెరవగానే నల్లటి తోలుపెట్టె ఒకటి కనపడ్డది అది తన ప్రయాణానికి వీలుగా ఉంటుందని, దాన్ని ఖాళీ చేయటానికి పెట్టెను బోర్లా వేశాడు.

దాంట్లో నుంచి అనేకరకాల సామాన్లు పెద్దచప్పుడుతో గదినిండా దొర్లి పడ్డాయి. కనబడలేదని తాము ఎన్ని సార్లో వెతుక్కొని విసిగి వేసారిపోయిన చిన్నచిన్న వస్తువులు- చిన్న చిన్న చంచాలు మేజోలు స్కూలుపుస్తకాలు పెన్సిళ్ళు-పలక-ఒకటేమిటి, ఒక చిన్న సంసారానికి కావలసినవన్ని బయట పడ్డాయి.

వాటిలో నుంచి ఎర్రటిఅట్ట పుస్తకము ఒకటి బయటపడింది దుర్గాప్రసాదు ఆఫీసుకు సంబంధించిన ముఖ్య గణితము వ్రాసుకొన్న పుస్తకమది; అది కనబడక ఎన్నో దినాలు వెతకి వేసారిపోయాడు ఆఫీసులోని లెక్కలు కొన్ని అదిలేకుండా పూర్తి చేయటము చాలా కష్టమయి పోయింది

ఇప్పుడు ఆపుస్తకంలో. బిలిబిలిగా. పెద్ద అక్షరాలతో 'కానూరి సంధ్యాదేవి' అని మొదటి కాగితంమీద వ్రాసి ఉన్నది రెండవ కాగితంలో ఆడాస్టాంపులు ఎరుపొకటి నలుపొకటి చొప్పున వరుసగా అంటించి ఉన్నాయి మూడవ కాగితం మీద. 'రామం బావ వేసిన అరటిచెట్టుకి రంగులే లేవు నేను నాపుస్తకంలో వేసిన అరటిచెట్టుకి రంగుల కాయలు' అని వ్రాసిఉంది దానిక్రింద రంగురంగుల పళ్ళ

నిచ్చే-ఏటవాలుగా వాలిపోయిన-ఒక కదళీవృక్షము చిత్రించి ఉంది: దానిక్రింద, 'బావాబావా పన్నీరు- బావను పట్టుక తన్నేరు' అని వ్రాసి ఉంది.

నాలుగవ పేజీలో 'లతను వాళ్ళబాబు ఎప్పుడూఎత్తుకొని ముద్దు పెట్టుకుంటాడు, నాన్న నన్ను ఎత్తుకోరు- నాన్నపేరు నాపుస్తకంలో వ్రాయనే వ్రాయను' మరో పేజీలో 'అమ్మ ఏదడిగినా ఇస్తుంది. నాన్నకే నామీదకోపము.'

ఇక కాగితాలను తిప్పలేకపోయ్యాడు తనకాగితాలను చింపివేసి డైరీగారి చేసుకొని వ్రాసిన సంధ్యవ్రాతలవి: ఒక్కొక్క అక్షరం నాగాస్త్రంలాగా వేయి నాలుకలతో తనను కాటువేయటానికి వస్తున్నట్లుగా ఉన్నది:

కడుపులోంచి అలలవలె ఉప్పొంగివస్తున్న దుఃఖము ఆపలేక మంచముమీద బోర్లాపడి పోయాడు.

బ్రతికినన్నాళ్ళూ ప్రేమతో లాలించని నీవూ తండ్రివేనా అని ఆచిన్నా వస్తువులన్నీ వెక్కిరించాయి దుర్గాప్రసాదును: పగపట్టి వెన్నాడేతాచులాగ-ముద్దులొలికే ఆ చిలిపిచిన్నారి ముఖము ఎత్తని అవనిక అయినది:

ఈబాధ భరించలేక, భార్యముఖము చూడలేక, విరక్తితో దుర్గాప్రసాదు ఆర్మీలో చేరిపోయాడు తాను ఆ యుద్ధసమయములో ఏలాగయినా మృత్యువును సమీపిద్దామనుకున్నాడు కాని తెండేళ్ళ తరువాత ప్రాణాలతో తగుమాత్రము ప్రమోషను మీద యింటికి చేర్చింది జన్మతార:

* * * *

ఏడు చంచాలరక్తమువట్టే ఆ మానవహృదయంలోనుంచి అనంతమయిన సముద్రపుహోరు వినబడింది శాస్త్రికి ఆకథ విన్న తరువాత:

'పిచ్చివాడా: నీకే యిట్లా ఉంటే అతల్లి కెట్లాఉందో నీభార్యను కలుసుకో' నీహృదయం ఆమెముందర విప్పు. ఇద్దరి హృదయాలకు శాంతి కలిగించుకోండి' అన్నాడు మేజర్ ఎల్. వి. శాస్త్రి.

# పండుగ చీరె

రాజ్యలక్ష్మి సంధ్యదీపం వెలిగించి తులసిచెట్టు దగ్గరపెట్టి వీధి వాకిట్లోకి వచ్చి గుమ్మానికి ఆనుకుని నిలబడ్డది.

ఎక్కడో ఢామ్మన్న చప్పుడు వినిపించగానే ఉలిక్కిపడి రెండు చెవులూ మూసుకుంది.

ఏమిటో దీపావళి అప్పుడే దగ్గరికి వచ్చేసిందా? అందరికంటె ముందు పిల్లల కాసంగతి బాగా తెలుసు. దీపావళి వస్తోందన్న మాట. రాజ్యలక్ష్మి మనసులో ఏవేవో ఆశలు రెపరెప లాడాయి.

పండుగ! పండుగకో కొత్త చీరె ఉండదా. తన కెన్నాళ్ళనుంచో మంచి చీరె తన ఇరుగుపొరుగుల దగ్గరలేని చీరె వాళ్లు కొనుక్కోలేని చీరె– తను కొనుక్కోవాలనీ– పండుగనాడు ఆ చీరె కట్టుకుని అందరి మధ్యా తిరగాలనీ– అలా తిరుగుతోంటే వాళ్లు విస్మయంగా చూడాలనీ– 'ఎంతకు కొన్నావు? ఎంతకు కొన్నావు?' అంటూ వాళ్లంతా తన చుట్టూ చేరి అడగాలనీ అప్పుడు తను దాని ధర వాళ్లకందుబాటులో లేదన్నట్టుగానూ కొంచెం నిర్లక్ష్యంగా చెప్పాలనీ ఆమె కోరిక.

ఈ చిన్న కోరిక ఆమె పెళ్లి అయినప్పటి నుంచీ తీరకుండా వచ్చింది.

ఆ రాత్రి భోజనాలమేటప్పుడు భర్తతో "వింటున్నారా చప్పుళ్లు?" అడిగింది.

అతడు తెల్లబోయి చూశాడు.

"అలా చూస్తారేం? పండుగండీ పండుగ. దీపావళి పండుగ వచ్చేస్తోంది. ఎక్కువ గడువులేదు" అంది

"ఊఁ" అన్నాడు భోజనం ముగించి గ్లాసెడు నీళ్లు తాగుతూ.

"ఊఁ ఏమిటి? దీనిని మీరు సస్పెండ్ చేయటానికి వీలులేదు మరి" అంది అతడికేసి చూస్తూ.

తానెప్పుడూ ఉపయోగించే మాట- సస్పెండు చేయటమనేది- రాజ్యలక్ష్మి నేర్చుకొని ఉపయోగించిందన్న ఆశ్చర్యము కంటె- రాబొయ్యే ఈ పండుగను గురించి పదేపదే జ్ఞాపకము చేయటములోను, దానిని గురించిన ఉపోద్ఘాతము యివ్వటములోను, అతనికేదో మరొక భావము ధ్వనించింది. అసలు నాలుగు దినాల నుంచీ రాజ్యలక్ష్మి మనసులో మాటను మనసులోనే మాయము చేస్తున్నది. తన భావమేమిటో భర్త తెలుసుకోలేదన్నట్లుగా చికాకు పడిపోతున్నది. ఆమెతో కాపురము చేస్తున్న ఈ నాలుగేళ్ల అనుభవమువల్ల తనకేదో ముప్పు రానున్నదన్న భయము అతని ఎడదలో ఒక మెరుపులా మెరిసింది.

"అప్పనులే. మనమేమి చేస్తాము? వస్తుంటే చూద్దాము" అని క్లుప్తముగా ముగించాడు సంభాషణ.

"సరేలెండి. నేను అనేదొకటీ మీరు చెప్పేదొకటీను. పాపము, ఏమి ఎరుగని వాళ్లలాగ....అమాయకంగా....అట్లా మాట్లాడుతారేం?" అన్నది. అప్పటికే చిరుకోపము ముఖము మీద కనబడుతున్నది.

దానితో కొంత చురుకెక్కింది భావనారాయణుడు. తెలియకపోయినా తెలుసుకున్నట్లుగా మాట్లాడాలని ప్రయత్నించాడు.

"ఏమిటీ అట్లా దాపాలు వదుస్తున్నావు? చెప్పు నీకు పుణ్యముంటుంది మాలక్ష్మకు నేనొక్కడినే సుమా!" అన్నాడు.

"అన్నీ నా నోటిమీదుగా చెప్పించాలని చూస్తున్నట్లున్నారు? పండగ వస్తే ఇంట్లోకి ఏమి కావాలో భార్యకేమి [illegible] మగవాళ్ళను నేనెక్కడా చూడలే" అని నిండా గర్భితమయిన వాక్యాన్ని ఒకటి అతని మీదికి విసిరింది.

"కొంప తీశావు! నేనెన్నో వాడినో కాస్త చెప్పు?" అన్నాడు.

ఎదుటివారి కోపమును తానుకూడా కోపదృష్టితో చూసే శక్తి అతనిలో ఇప్పుడు లేదు. ఎంతటి గడ్డుసమస్య నయినా నవ్వుతూ తేల్చిపారవేస్తూ జీవితాన్ని

తేలిక చేసుకోవటము నేర్చుకున్నాడు భావనారాయణ. నిజంగా నాన్‌గెజిటెడ్ ఉద్యోగికున్న ఓపిక, శాంతము మరొకరికి ఉండదు. నరాలు అరిగిపోయే చాకిరి చేయాలి గాని విసుగుకుంటే లాభములేదు. శాణపరీక్షకు ఆగిన రత్నాలవలె అనుభవ మెక్కువయిన కొద్దీ శాంతమూర్తులవుతారు.

"మీకు అంతా హాస్యమే. పోనీ మీకంత సరదాగా ఉంటే నానోటిమీదుగానే చెప్తాను లెండి. దీపావళిపండుగకు కొత్తచీరెకట్టుకునే అలవాటు నాకు ఉన్నది. అది నేనే జ్ఞాపకము చేయవలసివచ్చింది. నగలమాట ఈ జన్మలో తలపెట్టటానికి వీలులేదు నాకు. మీరు ఒకచీరయినా తీసుకొని రారూ!"

"అదా నీ ఉపాయం! నేనింకా చిచ్చుబుడ్డీ అడుగుతావో మతాబా అడుగుతావో అనుకుంటున్నాను."

"అప్పుడే మన ఇరుగుపొరుగు అందరూ చీరెలు కొనుక్కున్నారు నాకు మాత్రం చీరె సరదా ఉండదూ? పేరంటాళ్ళింటికి వెళ్ళినా....అంతా అడుగుతారు ఏం కొనుక్కున్నావని? మీ సంపాదనలో ఒక చీరె అయినా కొనలేరూ?"

"అట్లా చెప్పు! వాళ్ళూ వీళ్ళూ అంటారని నాకీశిక్ష విధించటం? అందరి అభిమతాల ప్రకారము మనము నడుచుకోవాలంటే ఒక నిమిషమయినా మన జీవితంలో సుఖమన్న మాట ఉండదు మాటవరుసకు అంటున్నాగాని వాస్తవాలో చించు, మన సంసారాన్ని నడిపేది మన [illegible] వాళ్ళ అభిమతాలా?"

"మీకెప్పుడూ ఇంతే ఒక సరదాలేదు — ఒక సంతోషమూ లేదు ఏది కావాలన్నా ఒక పెద్దఉపన్యాసమూ, ఒక పెద్ద గొడవాను మనఇంట్లో. కొంత మందికి నోటిమాట నోట్లోనే ఉండగా సరదాలన్నీ తీరుతాయమ్మా చక్కగా! ఇంతకూ నేనుచేసిన పూజ మంచిది కాదు" అంటూ కళ్లు తుడుచుకుంటూ లేచింది. ఆమె సంభాషణకాలము సమాప్తి చెందిందని భావనారాయణ లేచాడు.

ఏమిటి ఈ దీపావళిపండుగ! దేనికి వస్తున్నది? రెండు దినాలు సెలవులని పేరేగాని నాలుగుదినాల ప్రాతపని ఉంటుంది. సెలవు దినాలలో ఖులాసాగా ఇంట్లో కాలక్షేపమా అంటే భావనారాయణ జన్మకది తలచుకోలేని కోరిక!

* * * *

రాజ్యలక్ష్మి పల్లెటూరిలో పెరిగిన పిల్ల. కూతురు సుఖపడుతుందికదా అని బ స్త్రీసంబంధము ఏరికోరి పట్టుదలతో చేసింది తల్లి.

ఆమె పల్లెటూరి పడుచులవలె ఏమీ ఎరుగనట్టుగా ఉండదు. ఆమె అక్కడ అయిదవక్లాసు పాసయిన విద్యావతి; బస్తీలలోని స్త్రీలకంటె మిన్నగా నాజూకు లెరిగిన జాణ. నాటకాలు సినిమాలు పార్కువిహారాలు ఆమె మనోవీధిని మెరిసే మెరుపులు. ఏ సినిమాలో ఏతార నటించినదీ వాళ్ళ వేషములతోసహా అనర్గళంగా ఒప్పచెప్పగల తెలివి ఆమెలో ప్రవహిస్తూఉంటుంది. చీనావాళ్ళదగ్గర కొన్న పెద్ద సవరముతో అల్లిన జడ రెండణాలకు తక్కువకాని మల్లెపూలదండ-జడ చివర నలగనిది గజము రిబ్బను పెట్టుకొని రకరకాల స్నోలను ఉపయోగించుకుంటూ.... సినిమాపాటలు పాడుకుంటూ....తారల ననుకరిస్తూ.... ఉంటుంది. సినిమా తారల కొత్త పోకడలతో ఆమె తన జీవిత వలయమేర్పరచు కొన్నది.

సరిగా రెండునెలల క్రిందట ఆమె పినతల్లికూతురు వచ్చి నాలుగుదినాలుండి వెళ్ళింది. తాను వచ్చిన యిన్ని సంవత్సరాలకు తన కోరికలన్నీ తీరినవి. రోజూ సాయంకాలము పార్కుకు వెళ్ళటము, సినిమాలకు వెళ్ళటము, అద్దెకారులో వెళ్ళి ఊరు చూడటము, నడుమనడుమ మంచి రెస్టారెంటులకు వెళ్ళటము అంతా సరదాగా....సంతోషంగా గడిచి పోయింది. పట్టణములోఉంటూ పట్టణసౌకర్యాలను అనుభవించలేక పోవటమా?

ఇక్కడినుంచి వెళ్ళిన తరువాత పినతల్లికూతురు దంపతులను అభినందిస్తూ ఒక పెద్దఉత్తరము వ్రాసింది "భావనారాయణ చాల మర్యాదతెరిగిన యోగ్యుడట. భార్య సరదాలన్నీ ఇట్టే తెలుసుకొని అట్టేతీర్చే మనిషట. పూజ కొద్దీ పురుషుడట...." ఏమిటేమిటో ఇంకా చాలా వ్రాసింది. చదవటానికి తనకెంతో సిగ్గనిపించింది.

ఆమె ఉన్న నాలుగు దినాలు నిజంగా తనకెంతో కష్టమనిపించింది. తన పెనిమిటి సణగటము ఆమె చెవిన ఎక్కడ పడుతుందోనని భయపడుతునే ఉంది. 'రాబడికి మించిన ఖర్చనీ, డబ్బు విలువ తెలియదనీ నిర్దాక్షిణ్యంగా పురమాయిం చటమే కాని ఆదాయము చూసుకోవద్దా' అని ఏమేమిటో ఒకటే రొద చెవిలో. మర్యాద ఎట్లా వస్తుంది? డబ్బు పెట్టి కొంటే వస్తుంది. వాళ్ళ యింట్లో వాళ్ళుం

లేను మన యింట్లో మనముంటేను, ఎవరి డబ్బు వారి సంచిలో ఉంటేను, మర్యాదలు వస్తాయా? డబ్బు ఖర్చయితే తిరిగి సంపాదించగలము, కాని పోయిన మర్యాద తిరిగిరాదు. డబ్బుకు సంబంధించనంతవరకు ఆయనకూడా సరదా మనిషే. కాని అక్కడే వస్తోంది పేచీ.

ఈ దీపావళికి చీరె కొనటములో ఏమి కథ జరుగనున్నదో! తన తల్లి ఈసారి తప్పకుండా అడుగుతుంది ఏ చీరె కొన్నావని, అప్పుడే ఎటువంటివి కొంటావని ఇరుగుపొరుగు అడుగుతున్నారు. వాళ్ళకు సమాధానాలు చెప్పలేకపోతున్నది. తన మాట నెగ్గుతుందో నెగ్గదో యీసారి! ఇంతకూ ఎవరేమన్నా.... ఎంత హోళన చేసినా.... ఒక చీరె ఈ పండుగకు తెచ్చెనా.... కాసేపటిలో అందరి నోళ్ళూ మూతపడతాయి

రాజ్యలక్ష్మికివే ఆలోచనలు! వస్తోంది పండుగ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ.... పరుగులతో!

* * * *

భావనారాయణ కలెక్టరు ఆఫీసులో గుమాస్తా. వారాలు చేసుకొని భోజనము చేస్తూ, రోడ్డు మీద వెలుగుతున్న దీపాల దగ్గర చదువుకుంటూ, చిన్న చిన్న పిల్లలకు అయిదు రూపాయల చొప్పున రెండు ట్యూషన్లు చెప్పుతూ మెట్రికు చదవటమే కష్టమయి పోయింది.

అధికారుల చుట్టూ కాళ్ళరిగిపోయేటట్టు తిరిగి ఆ ఉద్యోగము సంపాదించుకున్నాడు. కులాల సమస్య ప్రబలంగా ఉన్న కాలము కాబట్టి ఎంత ప్రయత్నించినా పైకి ఎక్కి రాలేకుండా ఉన్నాడు.

చేసే చాకిరి మాత్రము జీతము కంటె అధికము. తరగని దొంతరల కొద్దీ కాగితాల కట్టలు! ఉదయము పది గంటలకు వంచిన నడుము సాయంత్రము ఆరు గంటలకే ఎత్తటము. నడుమ ఒక్కసారి టీ త్రాగటానికి అక్కడినుంచి కదులు తాడు. అంతే.

తొందరలో ఉదయము తొమ్మిది గంటలకు ఉడికీఉడకని వంటకాలతో భోజనమూ, పగలు రెండు గంటలకు ఒక కప్పు టీ నీళ్ళూనూ ఆ మానవాకారపు

ఇంజనులో పడే సరుకు, సాయంకాలము ఆరు గంటల తరువాత బయలుదేరి కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి వస్తాడు. అతని జీవితములో ఇబ్బంది లేకుండా వృత్తి గడచిన దినమే పర్వదినము.

భార్యను కాపురానికి తీసుకొని వచ్చేనాడు అతని హృదయము ఉప్పొంగి పోయింది. తన కష్టసుఖాలలో భాగము తీసుకోవటానికి—తనకై మానసికంగా కలిగే గాయాలను మాన్పటానికి—ఈ జీవితయాత్రలో తోడునీడగా ఉంటుందని హృదయపూర్వకంగా నమ్మాడు.

కాని గులాబీలోని అందము సౌరభము అతనికి కనబడలేదు. తాకగానే ముళ్ళు మాత్రము చేతికి తగిలాయి. కంటకభూయిష్ఠమైన ఆ గులాబితోనే........ ఏం చేస్తాడు?

భార్య కాపురానికి వచ్చిన దగ్గర్నుంచీ అతనికి కచేరిలో ఏ విధమయిన మర్యాద ఉన్నదో ఇంట్లోనూ అంతే. నాన్ గెజిటెడ్ ఆఫీసరు!

ఈ కాలానికి తగినట్లుగా—అధునిక ఆదర్శాలతో—జీవితము గడపాలని ఆమె కోరుతుంది. అది అతని కసాధ్యమవుతున్నది.

కచేరిలో కొంతవరకు, తన పని తాను చేసుకుంటూ, ఎవ రేచిన్నచూపు చూసినా తనను కాదని తిరుగవచ్చును. కాని యింట్లో జరిగే హంగామాలను తనను కాదనుకొని ఎట్లా ఊరుకోగలడు?

గుండె గుభేలుమనేటట్లుగా యీ దీపావళి వస్తున్నది. తన ఆర్థిక పరిస్థితిని గమనించకుండా ఒకచీరె కొనమని జరిమానా విధించింది రాజ్యలక్ష్మి.

అతని జీతము, పట్టుమనివాడితే, అ పట్నములో ఒకరికే సరిపోతుంది. ఆ బస్తీలో నీళ్ళ దగ్గర్నుంచీ కొనుక్కుంటూ—కొద్దిజీతములో బ్రతకటమే కష్టముగా ఉంటే—ఈ పండుగ రావడమేమిటి అతని ప్రాణముమీదికి!

అక్కడికీ, కటుకు స్వభావము కాదు కాబట్టి, సామరస్యముతో కూడిన జీవితమే కోరుతూ, ఒకనాటికయినా పరిస్థితులు చక్కబడతాయేమోనన్న ఆశతో, జీతము ఖర్చుకాగానే బాకీలుచేస్తూ నెలపొడుగునా ఆమె కనుగుణంగానే నడుచు

కుంటాడు. బాకీలు చిన్నవల్లా పెద్దవయి మార్వాడీలదాకా వచ్చేశాయి. ఇంతఅయినా ఏ పూట కేమిప్రళయము వస్తుందో నన్న భయము ఎప్పటికప్పుడు కలుగుతూనే ఉంటున్న దతనికి.

ఆమె వినోదవిలాసాలు, తలచుకొన్నప్పుడల్లా, నమకూర్పలేకపోతున్నాడు. ఈమధ్య భార్య అతనినిగూర్చి క్రొత్త సమాసము వాడటము మొదలుపెట్టింది. 'అయినదానికి కానిదానికి అప్రయోజక చక్రవర్తిలాగ చేయకండి' అని. ఏ విషయంలో నయినా ఆమె తలిదండ్రులు ఆమె పాటకు తాళముపేయటమే కాని బుద్ధులు నేర్పేటట్లు కనపడదు. తమ బిడ్డకు రెండుపూటలా కాఫీ ఏర్పాట్లులేవని ఒకసారి వాళ్ళుచేసిన గొడవ అంతా భావనారాయణకు కళ్లకు కట్టినట్లుగా కనబడ్డది.

రాజువలె తనను గౌరవించవలసిన అత్తమామలు గడ్డి పరకలాగ చూసిన, దేవుడిలాగ చూసుకోవలసినభార్య తృణీకరించిన బ్రతుకు తనది. ఎంత కష్టపడినా ఎదుగు బొదుగులులేని ఉద్యోగములో తన భార్యకు ఏ విధంగా తృప్తికలిగిస్తాడు పండుగ చీరెలు, పట్టు సౌకర్యాలు, ఆధునిక వేషాలు, ఎట్లా తన బ్రతుకు !

చాలీచాలని జీతములో అరిలిరిని భోజనముతో దినదిన గండముగా ఉన్న అతని కఠోరజీవితానికి ఎవరయినా 'దీర్ఘాయుష్మంతుడవు కమ్మ'ని దీవిస్తే-అతని హృదయములో ఆరనిజ్వాలలు విజృంభిస్తాయి. అందరికి అది దివ్య దీపావళి కాని. అతనికి మాత్రము.........

సంతానము ఏర్పడకముందే తనబ్రతుకు ఏ దినమున కాదినము సమస్యగానే ఉన్నది. స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యము రావాలని పెద్ద సంచలనము కలుగుతున్నది దేశములో. అది ఏ దావతో ? స్త్రీలకు సంఘములో స్థానము లేదంటారు గాని తన యింట్లో తనకే స్థానములేదు, నిజము విచారిస్తే, పెద్దలను సలహా అడిగితే తన భార్యకు ఏ విధమయిన స్వాతంత్ర్య మివ్వమని సలహాయిస్తారో ?

* * * * *

ఆరోజు ఒక్కరోజే విరామము. తెల్లవారితే నరక చతుర్దశి. పండుగ వస్తున్నది పరుగులతో !

భావనారాయణ ఎక్కినగడప ఎక్కకుండా స్నేహితుల ఇళ్లన్నీ తిరిగాడు చేబదులుకోసము. తనకు తెలిసిన బట్టలవర్తకు లెవరూ దీపావళి ముందర అరువు యివ్వరాయెను.

క్రుంగిపోయే నాడులతో ఇంటి ముఖమవుతున్నాడు. ధుమధుమలాడే రాజ్యలక్ష్మి ముఖమూ, ఆమె ఎత్తి పడవేసే గిన్నెలు చెంబులు అతని మనోవీధిలో సంచరిస్తూనే ఉన్నాయి!

ఇంతలో దేవుడిలాగ చిన్ననాటి స్నేహితుడు మల్లికార్జునరావు కనబడి 'ఎంతవరకు నీ ప్రయాణము' అని అడిగాడు. కళ్లనీళ్ళతో తన పరిస్థితి అంతా చెప్పుకొని ఏభయి రూపాయలుంటే యిమ్మని ప్రాధేయపడ్డాడు.

"మా యింటిభాగ్యము నీ వెరుగనిదా! నేనింకా పిల్లల తండ్రిని. మా యింట్లో పురుడు వచ్చేరోజులని సరిగా ఏభయి రూపాయలు మందులకని ఉంచాను. నీకిస్తే ఆ సమయానికి యివ్వగలవా?" అన్నాడు.

భావనారాయణకు అమృతము చిలికినట్లయింది. మల్లికార్జునరావుకు అతని తత్వమూ పరిస్థితీ బాగుగా తెలుసును, కాని తనకుగూడ పరీక్ష సమయముగానే ఉన్నది.

"నీవు సమయానికివ్వలేకపోయినా నేనెట్లాగో తంటాలు పడతాను. ఒక పాతిక తీసుకో" అంటూ యింటికి తీసుకొనివెళ్ళి యిచ్చాడు.

త్రోవలోనే ఒక చీరెకొని యింటిమార్గము పట్టాడు భావనారాయణ.

* * * * *

పండుగనాడు కట్టిన కొత్త చీరె తళతళతో రాజ్యలక్ష్మి చాలా హడావడిగా తిరుగుతూ దీపాలు పెట్టున్నది. పండుగ భోజనమువల్ల కలిగిన ఆయాసంతో ఆ చీరె తనకొక లెక్కలోది కాదనీ, ఇంకా మంచిదే కొనాలనుకున్నారు కాని నాలుగు దుకాణాలు తిరుగలేక యిప్పటికాచీరె తెచ్చారనీ, ఇంకా రెండునెలలలో సంక్రాంతి రానే వస్తోందికదా అప్పటికి మంచి చీరె కొంటానని భర్త వాగ్దానము చేశాడనీ, కనబడ్డ వాళ్ళందరితోటీ చెప్తున్నది రాజ్యలక్ష్మి.



# గ్రహపాటు

'నరుడా కర్మదాటవశమా'.... అని రాగాలు తీసుకుంటూ సుందరరావు సైకిలు వడిగా తొక్కుకుంటూ పోతున్నాడు. దట్టంగా మబ్బు పట్టటం చేత- ఆ మసక చీకట్లో మనిషికి మనిషి కనబడటము లేదు. వర్షము వచ్చినట్లయితే త్రోవ లోనే తడవడము తటస్థపడుతుందేమోనని ఒక చిన్న సందులోంచి దారితీశాడు. నిజానికది దీపాలు పెట్టే సమయం కాకపోయినా పెద్దరోడ్లమీద అంతటా వెలిగిం చారు దీపాలను. విద్యుద్దీపాలతో నిత్య దీపావళిగా ఉండే పట్టణాలలో కూడ కొన్ని సందులు కుగ్రామాలను మరపిస్తాయి. మురుగు కాలవలతో-రస్తాకు అరగజము యిటు అరగజము అటు చెత్తతో నిండిపోయి చీకటి పడగానే కీచురాళ్ళ ధ్వనితో- ఎంతో ప్రాణం మీదికి వచ్చినట్లుగా ఉంటుంది సందుల్లోంచి పోవటానికి.

అటునుండి వస్తున్న ఒక మనిషికి ఇటునుండి వడిగా వస్తున్న సైకిలుకీ మధ్య- ఆరు ఏడు సంవత్సరాలుగల పిల్ల బోర్లాపడిపోయింది. సుందరరావు సైకిలు దిగి, పిల్లను లేవదీసి ఎత్తుకున్నాడు. దెబ్బ తదిలిందేమోనని టార్చి దీపముతోచూసి, 'ఎక్కడ తగిలిందమ్మా' అని బుజ్జగిస్తూ అడిగి దుమ్ము దులుపుతున్నాడు అప్పటి కప్పుడే పదిమందీ పోగయి "పాటపాడుకుంటూ వస్తున్నావు. పిల్లను చూడలేదు టయ్యా!" అని పావుగంట వరకూ ఒకరి తరువాత ఒకరు మందలించి వెళ్ళి పోయారు. పిల్లను ఎత్తుకొని టార్చిదీపము చేతికిస్తూ "ఇది కావాలా నీకు? తీసుకో. మీ ఇల్లెక్కడ?" అని అడిగాడు.

"మా యిల్లు అదిగో. నేను పోతాను. మా అమ్మ పిలుస్తున్నది" అంటూ దిగిపోయింది.

రెండు గజాల దూరాన వాకిట ముందర నిలబడి. "సరళా! సరళా!" అంటూ పిలుస్తున్నది ఒక స్త్రీ. విరియబోసుకున్న తల వెంట్రుకలను చిక్కు తీసు కుంటూ బయట నిలబడ్డది పిల్ల కోసము. సైకిలు తగిలి పడ్డానని సరళ చెప్పగానే తననెంత తిట్టుతుందో- ఎంత తగవులాట జరుగుతుందోనని సుందరరావు భయ

పడుతూ సైకిలు నడిపించుకొని ఆమె దగ్గరకు వెళ్లి నిలబడ్డాడు. ఆమె పిల్లను ఎత్తుకుని సమాధాన పెట్టుతూ 'ఎక్కడ తగిలిం'దని అడుగుతోంది. టార్చి దీపముతో సమాధాన పడిన సరళకు దెబ్బ ఎక్కడ తగిలిందో జ్ఞాపకమే లేదు.

తనను ఏమాట అనకుండా సరళ తల్లి అట్లా పిల్లతోటే మాట్లాడటము సుందరరావుకు ఆశ్చర్యం కలిగించింది. "నేను తొందరలో వెళ్లుతున్నాను. నా సైకిలు తగిలి సరళపడిందండీ. పాపం దెబ్బ తగిలింది కాబోలు" అని పిల్ల చెయ్యి పట్టుకొని ఊపి వెళ్ళిపోయాడు. పిల్లమీద చెయ్యివేసి అతడు వెళ్ళిన వైపు శూన్య దృష్టితో చూస్తూ- చైతన్యం లేకుండా అక్కడ ఎంతసేపు నిలబడిపోయిందో- ఆమెకే తెలియదు.

ఆమె ఒక పంతులమ్మ. ఆ రోజు కొంచెము అనారోగ్యముగా ఉండటము వల్ల స్కూలుకు సెలవు పెట్టి తల్లి పిల్ల యింట్లోనే ఉన్నారు. ఆ దినమంతా పుస్తకము తెరవకుండా పిల్లలతో ఆడుకోవటానికి మధ్యాహ్నమే సరళ ఇంటి నుండి వెళ్లింది. పక్కింటి పిల్లలతోనే గదా ఆడుకొంటున్నదని తల్లి అశ్రద్ధగా ఉంటుకున్నది. ఆడుకొని తిరిగి యింటికి వస్తున్న సరళ సుందరరావు సైకిలుక్రిందపడ్డది.

ఆ ఇరుకు సందులో మేడమీద భాగంలోనే సరళ తల్లి ఉండేది. అది రెండు గదుల భాగము. చెక్కలతోను బంకమట్టితోను కట్టబడిన పురాతనపు కట్టడము గల మేడ అది. బొమ్మరిల్లుకు సరిపడే కిటికీ ఒకటి ముందుగదిలో దక్షిణపు వైపుగా ఉండటము వల్ల, గాలీ వెలుతురు చాల పరిమితిగా ప్రసారమవుతున్నాయి ఆ పంతులమ్మకు అలవెన్సుతో కూడా నూరు రూపాయలు జీతము. అదే వాళ్ళ జీవనాధారము కావటం వల్ల క్లుప్తముగా కొద్ది సామాన్లతో చాల సామాన్యమైన జీవితము గడుపుతున్నారు. ఇరుగూ పొరుగూ ఆమె గురించి ఎక్కువ తెలుసుకొనే అవకాశము కలుగలేదు. ఆమె ఎవరితోను ఎక్కువ మాట్లాడదు. మొగవాళ్ళెవరు ఇంట్లో లేకపోవడం వల్ల వితంతువేమోననీ, వితంతువైతే బొట్టు మంగళసూత్ర మెందుకు ఉంటాయనీ, ఒకదాని తరువాత ఒకటి లెక్కలేనన్ని సందేహాలు కలిగినాయి వాళ్ళకు. అందులో ఒంటరిగా ఉండే స్త్రీలను గురించి బోలెడన్ని అనుమానాలు శంకలు కలుగుతాయి ప్రజానీకానికి. అల్లాగే మొదట్లో కొంత కాలము ఉబుసుపోనప్పుడల్లా ఆమె విషయములో ఒక నిర్ధారణకు రావలెనని ఆ వాడలో ఉన్న వాళ్ళంతా చాలా ప్రయత్నించారు. వాళ్ళకు పైకి ఎంత కనబడ్డదో అంతకంటే

ఎక్కువ ఊహించడానికి ఆధారాలు ఏవీ దొరకలేదు. సామాన్యమైన ఆమె జీవితములో ప్రత్యేకత ఏమీ లేకపోవటం వల్ల ఆమెను విస్మరించారు.

ఆ రాత్రి పిల్లను పడుకోపెట్టి పుస్తకమేదయినా చదవాలని ఆమె ప్రయత్నించింది. పుటలు తిరగవేయటము తప్ప విషయ గ్రహణము కాలేదు. మనసంతా చెదిరిపోయినట్లుగా ఏమిటో ఏమిటో చీకాకుగా ఉన్నది ఆమెకు. సాయంకాలము సైకిలు మీద వచ్చిన పిల్లవాడిని గురించే ఆలోచనలు పోతున్నాయి. సన్నగా-తెల్లటి పిల్లవాడు-ఉంగరాల జుట్టు-ఎడమ చెంపకు చిన్న గుంట-సుమారు పది హేను సంవత్సరాల వయసులో ఉన్న ఆ పిల్లవాడెవరు? అతడు మాట్లాడుతుంటే తన కెందుకో కడుపులోనుంచి బాధ బయలుదేరింది! అనిర్వచనీయమైన ఆ బాధ దేనికి? ఎంత మళ్లించినా తన మనసు తిరుగదెందుకు? మెలకువతో ఉన్నంత సేపూ ఆమె కివే ఆలోచనలు.

కొంతసేపటికి కళ్లు మూతలు పడినాయి. పట్టీపట్టని ఆ నిద్రలో పీడ కలలు. ఒళ్లు బద్ధకించినా తెల్లవారి లేవక తప్పదు. పిల్లకోసమైనా లేచి కాఫీ వంట చేయాలి. మాయ బ్రతుకు! దీని కొక కడుపు—దానికోసం బోలెడు తిప్పలు! స్కూలులో పిల్లలకు పరీక్షలు దగ్గరికి వచ్చాయి. కొంతమంది పిల్లలు తన యింటికి వచ్చి పాఠాలు చెప్పమని వేధించుకొని తింటున్నారు. దేశంలో జరిగిన అలజడివల్ల, ఆ మధ్య కాందిశీకులుగా ఇటుఅటు తిరిగి ఇప్పుడిప్పుడే స్వస్థానాలు చేరుకుంటున్నారు ప్రజలు. ఆ కారణంగా విద్యార్థులకు పోర్షను సరిగాకాలేదు. ఈ పరీక్షలకు పిల్లలతో పాటు ఉపాధ్యాయులుకూడా కష్టపడాలి ముఖ్యమైన పాఠములమీద కంఠతః చదువు కోవటానికి సులువైన నోట్సు తయారుచేసి యివ్వమని గొంతుమీద కూర్చుంటు న్నారు విద్యార్థులు. అటువంటి నోట్సు పిల్లలకు తయారుచేయాలని ప్రయత్నించింది కాని సాగలేదు! పేపరు చదవటానికి యత్నముచేసినా మనసు స్వాధీనములోలేదు!

ఆ పిల్లవాడే.... తెల్లగా.... సన్నగా.... కళ్లకు కట్టినట్లుగా.... ఎదురుగా సిద్ధమవుతున్నాడు. తా నెవరు-ఆ పిల్లవా డెవరు? దారే పోయేవాడు తననేమి చేశాడని ఆ విధంగా మనసు పాడయింది? సీలలు తీసిన యంత్రములాగ తననుచేశాడు ఆ బాలుడు! అతని నెప్పుడయినా తాను చూసినట్లా ఎక్కడైనా పలకరించినట్లా! ఆ ఊరు వచ్చిన ఏడాదిలో స్కూలుకుతప్ప తాను యింకెక్కడికి వెళ్లి యెరుగదే! అందులో తానా ఊరు వచ్చిన కొద్ది దినాలకే పెద్ద అలజడి ప్రతివాళ్లు కాందిశీకు

లుగా క్షేమంకరమైన పరిసరాలకు వెళ్లి తలలు దాచుకొన్నారు. తనెక్కడికీ వెళ్ల లేదు. తన కెవరయినా దిక్కా మొక్కా? బయట ఎంత అల్లరి జరుగుతున్నా, చుట్టు ప్రక్కల గుడిసెలు దహింపబడుతున్నా, ఇరుగు పొరుగుల ఇళ్లు బజారులు శవాలతో నిండిపోయినా, భయంకరమైన అరుపులు తుపాకి చప్పుళ్లు చెవులకు హోరెత్తించి భయము పుట్టించినా, తలుపులు వేసుకొని బిడ్డను దగ్గర కూర్చోపెట్టు కొని రామస్మరణ చేయటము తప్ప తానేమీ ఎరుగదే! ఇంతమాత్రపు అదృష్టముతో నయినా తనను బ్రతకనిచ్చాడా దేవుడు! ఏ జన్మలో చేసిన పాపమో యీ జన్మలో అనుభవిస్తున్నా మంటారు. ఇప్పుడు తాననుభవిస్తున్నది ఎప్పటి పాపఫలమో! తానేమి పాపము చేసినందువల్ల యీ పరితాపము - యీ సంక్షోభములతో జీవచ్ఛ వము లాగ యిన్ని సంవత్సరాలనుంచీ జీవితము గడుపుతున్నది! తినే తిండి అయినా ఒంటికి పట్టకుండా నీళ్లు కారిపోతున్నదే! ఒక జన్మలో చేసిన పాపానికి మరుజన్మలో శిక్ష ననుభవించే మానవుడు-తనకెందుకు శిక్ష విధించాడో తెలుసుకునే అవకాశము లేదాయెను! భగవంతుని మాయ మానవశక్తికి అతీతము.

* * * *

గోవిందరాజుల కేశవరావు అబ్కారీ ఇన్స్పెక్టరుగా పనిచేస్తూ తల్లిని చెల్లె లిని వెంట బెట్టుకొని కొత్తగా బదిలీఅయిన ఊళ్లో కాపురము పెట్టాడు. పుట్టింటికి వెళ్లిన భార్యను తీసుకు రావాలని పురుడు వచ్చిన పదకొండో రోజునుంచి ఉబ లాట పడుతున్నాడు. కాని ఆ ఉద్యోగులలో అతనికి కోరినప్పుడు సెలవు దొరక టమే లేదు. 'మూడవ నెలలో అయితే మేమే దిగపెట్టుతా'మని మామగారు వ్రాసిన ఉత్తరము కేశవరావుచేత అవమానిత మయింది. 'సాధ్యమైనంత త్వరలో భార్యను కొడుకును తీసుకువచ్చే ఉపాయమేమిటా' అని వెతుకుతూ ఉండగా దేవు డల్లే మేనమామ వెంకయ్యగారు వచ్చారు. ఇంకేమి. ఆ సాయంత్రమే మేన మామను పంపి మూడోనాటికల్లా ఇరవయి ఒక్కరోజు వెళ్లిన బాలెంతను పసి బిడ్డను పిలిపించాడు. ఇరవయి అయిదో రోజు అత్తవారికి తెలుపమని తల్లి అంటున్నా లక్ష్యపెట్టకుండా బారసాల చేసుకొని సుందరరావని తన తండ్రి పేరు పెట్టాడు.

ఆ యింట్లో పదిహేనేళ్లనుంచి చిన్నపిల్లలు లేకపోవటమువల్ల ఇంట్లో ఉన్న వాళ్లందరికీ బాలుడు అపురూప మయ్యాడు. కొడుకుని ప్రేమతో ఎత్తుకున్నప్పటికీ

బాలుడు ఎక్కువ ముదము కూర్చలేదు తండ్రికి. తమ దాంపత్య జీవితంలోకి ఆ బాలుడంత తొందరగా-పిలువని పేరంటంలాగ-ప్రవేశించినందుకు ఎక్కువ ఆహ్లాదము చూపలేకపోయేవాడు. కేశవరావు పెండ్లి అయి సరిగా పదమూడు నెల లయినది. అందులో ఏడవనెల రాగానే ఉమ పురిటికి వెళ్ళింది. నోటితో ఆర్భాటపడే రకము కాకపోయినా ఆతనికి ఒంటరి జీవితము విసుగు పుట్టింది. అందులో అతనిది అదొక మాదిరి ప్రకృతి. ఎక్కడ ఉండవలసినవాళ్లు అక్కడ—ఎక్కడ ఉండవలసిన వస్తువులు అక్కడ—ఉంటేనే గాని తోచదు. లేనిపక్షాన చికాకుపడి మహాసంగ్రామం జరిగించేటంత పని చేస్తాడు. తాను ఏదో ఆలోచిస్తూ మౌనంగా ఉన్నా భార్య సమక్షంలో ఉండాలని నిర్దేశించేవాడు. లేకపోతే తోచేది కాదు.

ఉమ పుట్టింటినుంచి వచ్చిన రెండు నెలలకే, కేశవరావుకు చిన్న గ్రామాలు పర్యటన చేయవలసిన పని కలిగింది. ఆ విషయమై కచేరీ నుంచి వచ్చిన దగ్గర్నుండి ఆలోచిస్తున్నాడు. ఇష్టం లేకపోయినా వెళ్లక తప్పదు. రెక్కలమ్ముకున్న తరువాత ఎంతటి వారైనా ప్రభుత్వానుచరులే కదా!

"కేశవా! ఉమను పుట్టింటికి పంపితే బాగుండదూ? బాలెంతరాలామెను. ఎంత వద్దన్నా తడిలో తిరగక మానటములేదు. నీవు వచ్చేవరకు పంపిస్తే, పిల్లవాడుకూడా కాస్త ఒళ్లుచేసి బాగుంటాడు." అన్నది తల్లి అన్నపూర్ణమ్మగారు.

"ఎందుకమ్మా మళ్లీ వాళ్లింటికి పంపటము కష్టమో, నిష్ఠురమో పిలిపించాము. ఉండనీ వచ్చినవాళ్లను. మళ్లీ వాళ్లను పిలిపించటానికి ఇంకో మనిషి కావాలి. ఎక్కడ ఉండవలసిన వాళ్లను అక్కడ ఉండనీ" అని తనకు ఎంతమాత్రము ఇష్టములేదని తల్లి తెలుసుకోవాలనే ఉద్దేశ్యముతో కనుబొమలు ముడివేసి గట్టిగా అన్నాడు

అతనికిష్టములేని విషయము ఏదయినా తరచి ఎరుగదు తల్లి అన్నపూర్ణమ్మగారు. ఒకరు చెప్పితే వినే రకముకాదని ఆమె మొదటినుంచీ ఎరుగును.

ప్రయాణానికి దంపతులిద్దరు సర్దటము మొదలుపెట్టారు. ఇంట్లోఉన్న సామాను బయటికి తీసి శుభ్రముచేయటానికి ఉమకు, లేనివస్తువులు కొనుక్కొని రావటానికి తిరిగి తాను వచ్చేవరకు ఇంట్లోకి కావలపిన ఏర్పాట్లు చేయటానికి కేశవరావుకు ఒక రోజంతాపట్టింది.

ఆ సాయంత్రము రైలుకు సగము ప్రాణంతో బయలుదేరాడు. బండి కను చూపు దాటేవరకు 'జాగ్రత్త, జాగ్రత్త' అని తల్లితో చెప్పుతూనే ఉన్నాడు.

'నేను త్వరలో పని పూర్తిచేసుకొని వస్తాను' అని కళ్లతో భార్యను లాలి స్తూనే ఉన్నాడు. బండి గబగబా స్టేషనుదిశకు వెళ్లిపోయింది. బండిచక్రమువలెనే అతని హృదయము తిరుగసాగినది; కళ్ళలో నీళ్లు సుళ్లు తిరిగినవి.

అన్నపూర్ణమ్మగారికి కూతురెంతో ఉమ అంతగా తోచేది. అందులో కొడు కునుగన్న కోడలాయెను ఉమ! తెల్లవారు ఝామున నాలుగుగంటలకే లేచి మను మడికి ఉగ్గుపెట్టి తనదగ్గరే పడుకోపెట్టుకొనేది. నాలుగురోజు లయేసరికి బామ్మగారి బట్టలు మనుమడి బట్టలు ఒక రంగులోకి వచ్చాయి.

కోడలిని కింద నడవనీయటము లేదు అన్నపూర్ణమ్మగారు. తడిలో తిరుగ కూడదనీ, ఎక్కువగా బయటకు రాకూడదనీ కోడలిని జాగ్రత్తపరచేది అత్తగారు.

కాని భయపడేవాళ్లకు ఏదోఒకటి రానే వస్తుంది. పెనిమిటి వెళ్లిన పదో నాడు ఉమకు పెద్దజ్వరము. డాక్టరు పరీక్షచేసి పిడుగులాంటిమాట అన్నాడు!

"ఈమెకు డిఫ్తీరియా వచ్చింది. ఇది అంటువ్యాధి. ప్రతి నిమిషమూ వ్యాధిలో మార్పు కలుగుతూ ఉంటుంది. అనుక్షణమూ డాక్టరుసలహాతో అవసర ముంటుంది. మీరు ఐసొలేషను ఆసుపత్రిలో చేర్చండి. మగవాళ్లుకూడా ఎవరూ లేనట్లున్నారు. ఇంట్లోనే అట్టేపెట్టుకుంటే యిబ్బంది పడతారు. ఏమంటారు?" అన్నాడు డాక్టరు. ఆయన కేవలము సంప్రతించి సలహాలు మాత్రమే యిచ్చే డాక్టరు. మందులు ఏ డాక్టరువద్ద తీసుకోవలసినదీ, పేటెంటు మందులు ఎక్కడ కొనవలసినదీ ఖండితంగా చెప్పుతాడు. తన యింటికి వచ్చి చూపించుకున్నదాని కంటె రెట్టింపు ఫీజు రోగియింటికి వస్తే తీసుకుంటాడు, వందలుగా రోగులను నిత్యమూ పరీక్షిస్తాడు. విసుగులేదు. విరామములేదు. కేవలము ధనోపార్జనే చూసు కోకుండా రోగియొక్క స్థితిగతులుకూడా గమనించి సలహాయిచ్చే రకము.

"బాబూ! అమ్మాయి పసిబిడ్డతల్లి. పిల్లవాడికి పాలయిబ్బంది జరుగమా తల్లిని అక్కడకి పంపితే? ఆసుపత్రిలో తల్లిదగ్గిర ఉండటానికీ, ఇంట్లో పసిపిల్ల

వాడిని చూసుకోటానికి నే నొక్కదాన్నే ఉన్నాను. నా కొడుకు ఊళ్లోలేడు. నేనేమి చేసేది నాయనా?'' అన్నది అన్నపూర్ణమ్మగారు. భయంవల్ల కాళ్లు వణికినాయి.

''డిఫ్తీరియా కేసులే యిప్పుడు చాలా ఎక్కువగా ఉన్నాయి. అందులో మీ వాడలో చాలా ఉమ్మరంగా ఉంది. మీరు ఆలోచిస్తూ కూర్చోటానికి ఇది సమయముకాదు. ఒక గంటలోపల ఆసుపత్రికి తీసుకొనివెళ్లి చేర్పించండి. ఆపైన అనుకొని లాభములేదు. ఈ చీటి అక్కడ చూపించండి'' అంటూ తన ఫీజు తీసుకొని అన్నపూర్ణమ్మగారిని మరిమరి హెచ్చరించి వెళ్లిపోయాడు.

అన్నపూర్ణమ్మగారికి పెద్దచిక్కు వచ్చింది. ఆలోచించటానికి సమయమూ లేదు-సలహాయిచ్చే దిక్కూలేదు యింట్లో. హిందుస్థానీ మాట్లాడే ఊరు కావటంవల్ల పరిచయమున్న వాళ్లైనా లేరు. విధిలేని నిశ్చయంతో-నౌకరు సహాయంతో-అద్దెకారులో కోడలిని వైద్యాలయంలో చేర్చింది. కోడలికి ధైర్యంచెప్పి ఇంటికి వచ్చి పసివాడిని చూసి దుఃఖము పట్టలేక గట్టిగా ఏడ్చింది. పట్టుపట్టుమని ఆనాటి కానాడు అలవాటు చేసిన పోతపాలతో కడుపునిండక ఒకటే ఏడుపు పిల్లవాడు. ఇంట్లో పసిపిల్లవాడిని చూసుకోవటమూ వైద్యాలయములో ఉన్న కోడలిని కనుక్కోవటమూ అన్నపూర్ణమ్మగారి కొక్కదానికి దుష్కరమైనది. కొడుకు ఎక్కడున్నాడో తెలియదు ఈ సంగతి వ్రాయటానికి. 'అల్లుడు ఏదో కొంపమునుచుకొని పోయినట్లుగా కూతురిని నెలరోజులక్రిందట తీసుకొనివెళ్లాడు. ఆ పిల్ల చేతికింద ఉంటే చాల సులువుగా ఉండే'దని అన్నపూర్ణమ్మగారు అల్లుడిమీద కోపము చేసుకుంది; కాని తిప్పుకున్నది వెంటనే. 'తన కొడుకువంటివాడేల ల్లుడూను' అనుకొని తన అవ్యక్తతకు నవ్వుకొన్నది అంత అయోమయంలోనూ.

ఐసొలేషను ఆసుపత్రిలో ఉమను చూడటానికి వెళ్ళి అన్నపూర్ణమ్మగారిని అక్కడివాళ్ళు నానాయిబ్బందులు పెట్టేవాళ్ళు. భాషరాని కారణంచేత - అమాయకత్వంవల్ల-నలుగు రయిదుగురిని అడుగుతూ- వాళ్ల సహాయంవల్ల కోడలిమంచము దగ్గరికి వెళ్లేది. మెడ యిటు అటు కదలించటానికి వీలులేకుండా ఒకే పొజిషన్ ఉండేఏర్పాటు చేశారు ఉమకు. ఆ మంచాలు-ఆ గదులు-శుచిశుభ్రానికి నియమాలు-ఊరి బయట నిర్మలమైన వాయువు-అంతమంది ఘనవైద్యులు, రోగులకు పరిచర్య చేయటానికి నర్సులు-ఈ అట్టహాసమంతా చూసి అన్నపూర్ణమ్మగారు తప్పకుండా తన కోడలికి నయమవుతుందనీ, పెద్దపెద్ద డాక్టర్ల సమక్షాన ఉమను చికిత్స పొంద

టానికై అక్కడ ఉంచటములో వ్యాధికితగిన జాగ్రత్తపడ్డానని తృప్తిచెందింది. ఆ వాడలో అప్పుడప్పుడే ఏడెనిమిది కేసులు బయలుదేరాయి. చేర్పించిన దగ్గర్నుంచీ గంటలు లెక్కపెట్టుకుంటూ-పిల్లవాడితో అవస్థపడుతూ-ఆందోళనతో ఒక్కొక్క రోజే గడుపుతున్నది. ఈ మూడు రోజులనుంచీ ఏవేళప్పుడు అన్నపూర్ణమ్మగారింట్లో పొయ్యిరాజిందో, ఆమె విస్తరాకు ఎప్పుడు మడిచిందో, ఇంట్లోఉన్న నౌకరుకూడా ఎరుగడు. ఆవిధంగా మరో రెండు రోజులు గడచాయి గడ్డుగా.

ఒకరోజంతా ఉమను చూడటానికి వెళ్లలేదు. ఆ రోజంతా పిల్లవాడు ఒకటే ఏడుపు అంటువ్యాధుల దగ్గరకి పసివాడిని తీసుకొని వెళ్లటానికి మనసొప్పలేదు. ఆ సాయంకాలము తలవని తలంపుగా అయిదుగంటల రైలులో అన్నపూర్ణమ్మ గారి తమ్ముడు వెంకటరామయ్యగారు దిగారు. కళ్లకునీళ్లు తెచ్చుకొని అన్నపూర్ణమ్మ గారు తమ్ముడికి వివరాలన్నీ చెప్పి వైద్యాలయనికి వెళ్ళి చూసిరమ్మని పంపించింది. నౌకరు సహాయంతో వెళ్ళిన వెంకయ్యగారు వైద్యాలయమంతా నాలుగుసార్లు కలయతిరిగారు; ప్రతి మంచము దగ్గరకు వెళ్ళిచూశారు. వెళ్ళినమంచము దగ్గరకే మళ్లీవెళ్లి చూశారు; దాటివచ్చిన గదినే తిరిగి ప్రవేశించి పరిశీలించారు. అక్కడ ఉన్నవాళ్లెవరు ఉమనుగురించి వివరంగా చెప్పలేకపోయినారు. అన్నపూర్ణమ్మగారు చెప్పిన గుర్తులుగల హాలులో ఉన్నవాళ్లందరూ ఆ మధ్యాహ్నమే-అవతల వరండా లోనుంచి-లోపలికి వచ్చినవాళ్లు. అక్కగారు చెప్పిన 32వ నెంబరు గల మంచము మీద ఎవరో కొత్తవాళ్లున్నారు. వాళ్లది మార్వాడీభాష. ఇటు అటు తిరిగి వేసారి పోయిన వెంయ్యగారు ఆపాదమస్తకమూ చెమటతో తడిసిపోయారు.

ఆరుగంటలు కావచ్చినది వైద్యాలయపు నౌకరు వెంకయ్యగారిని ఇంటికి వెళ్లమని అన్నాడు.

"నేను 32వ నెంబరు రోగిని చూడటానికి వచ్చాను. సాయంకాలము ఆరు గంటలనుంచీ ఆసుపత్రిఅంతా కలయతిరిగి చూశాను. ఎక్కడా కనబడలేదు. చూడ నిదే ఎట్లా వెళ్లను? నీవు చూపించగలవా?" అని ఆశతో మాట్లాడారు.

ఈ దవాఖానాలో బ్రతికున్నవాళ్లు మంచాలమీదఉంటారు. ప్రాణాలు పోయిన వాళ్లు- మెట్లదగ్గర గదిలో-శవాలయి ఉంటారు. 32వ నెంబరు రోగి మంచముమీద లేదంటే క్రిందగదిలో ఉండవచ్చును. రోజుకు లెక్కలేనంతమంది చచ్చిపోతు న్నారు. రోగుల సంఖ్యకు తగినంతమంది నౌకర్లులేరు. అక్కడికి వెళ్లి చూసు

కోండి, అటువైపు వెళ్ళండి' అంటూ తన పనిమీద వెళ్ళిపోయాడు.

"అయితే యిక్కడ డాక్టర్లు లేరూ? రోగిని గురించి వివరాలు మాకు ఎవరు తెలుపుతారు? మంచంమీద లేకపోతే క్రింద గదిలో ఉండవచ్చని అవాచ్యము మాట్లాడుతావేం? మనిషివి కాదూ?" అంటూ వెంకయ్యగారు అన్న మాటలలో ఒక్కటయినా ఆ నౌకరు వినిపించుకోలేదు. హిందూస్థానీ రాని కారణం వల్ల ఈ ప్రశ్నలకు జవాబులిచ్చేవాళ్ళు లేకపోయినారు. తెలుగులో పెట్టిన మొరలు ఆలకించే వారు లేరు!

తొమ్మిది కావచ్చింది.

ఆ పగలంతా ఉపవాసము చేసి-క్రిక్కిరిసిపోయిన మూడవ తరగతిలో- చెమటలు కారుకుంటూ హైరానగా ప్రయాణము చేసినందువల్ల చాలా బడలికగా ఉన్న ఆయన- వైద్యాలయములో రోగి కనబడకపోవటము, అక్కడి నౌకరు నిర్లక్ష్యముగా అవాచ్యంపలుకుతూ వెళ్ళిపోవటము చూసి స్తంభించిపోయారు. ఎటూ పాలుపోక....నిర్ఘాంతపోయి....అక్కడే స్తంభానికి చేరగిలబడిపోయారు.

అప్పుడు వెళ్ళిన నౌకరు ఒక గంటకు తిరిగి వచ్చాడు. ఈసారి మందు సీసాలన్నీ ఖాళీగా ఉన్నాయి.

"డాక్టరుగారు ఎప్పుడు వస్తారు?" వెంకయ్యగారు నిస్త్రాణతో అడిగారు.

"ఇంకా వెళ్లలేదూ? నేను చెప్పినది వినబడలేదా? డాక్టరుగార్లు యిక్కడ చాలామంది ఉన్నారు. మీకు ఎవరితో పనిఉంది? రాత్రి పది తరువాత ఒక డాక్టరు గారు వస్తారు. ఉదయము ఎనిమిది గంటల తరువాత ఇంకొక ఆయన వస్తారు, పన్నెండు గంటలకు ఒక డాక్టరుగారు వస్తారు. ఎవరు వచ్చినా బ్రతికి ఉంటేకదూ మందు మార్చి మందు యివ్వటానికి? నేను అప్పుడు చెప్పినట్లుగా చేయండి. ఆ గది మీద ఉండే నౌకరు కూడా యింటికి వెళ్లతాడు-కొత్తవాడు వస్తాడు. దానిలో కూడా మీకు ఆలస్యమవుతుంది." సామానులు లెక్క చూసుకొని అలమారీలో పెట్టి తన పని మీద వెళ్ళిపోయాడు. వాడు ఒక్కడే అక్కడ వచ్చీరాని తెలుగులో మాట్లాడగలిగినవాడు.

ఇంటి నౌకరు వెంకయ్యగారిని చెయ్యిపట్టుకొని క్రిందికి తీసుకొని వచ్చాడు.

ఆ మెట్ల దగ్గరే ఎవరో ఇద్దరు నిలబడి కళ్ళు తుడుచుకుంటున్నారు.

"ఏం నాయనా! మాకు పట్టిన ఖర్మము మీకు పట్టిందా? ఈ రాత్రివేళ ఏం చేదాము? దగ్గరలో బండి కూడా దొరకదే? ఎట్లా నాయనా?" అన్నారు వెంకయ్యగారు.

"నేను వెళ్ళి బండి తెస్తాను, కాని మనకు రెండు బళ్ళు దొరకుతాయో లేదో?" అవతల నుంచి ఒకాయన అంటున్నాడు.

"ఈ రాత్రివేళ-ఈ అంటువ్యాధి శవాలు ఇంటికి తీసుకుని వెళ్ళడము ఎందుకు? ఇటునుంచి ఇటే తీసుకొని వెళ్ళితేసరి. ఏమండి మీరేమంటారు?" అని వాళ్ళల్లోనుంచి ఇంకో గొంతు అంటున్నది.

"నేను ఇంటికి తీసుకొని పోకతప్పదు. మావాళ్లు ఏమంటారో? ఈ కబురు వాళ్లు వినందే? నేను స్వతంత్రించి ఏపనీ చేయలేను." అని బిగుసుకొనిపోయిన కంఠంతో వెంకయ్యగారు అనలేక అన్నారు.

"చూడండీ ఏమి లాభము? పనికిరాని వస్తువయిన తర్వాత, ఇంకా మన దన్న వ్యామోహము ఎందుకు? అంటువ్యాధి శవాలను ఎవరయినా దహనపరచరు. మీ యిల్లు యిక్కడి నుంచి రెండు మైళ్లైనా ఉంటుంది. మరీ రాత్రయిపోతే తెల్ల వారితే గాని తీసుకొనిపోవటానికి వీలుండదు తెల్లవార్లూ శవ జాగరణ కష్టము-అందులో అంటువ్యాధి. వింటున్నారా? కనుక మనము నాలుగు శవాలను ఒక బండిలోనే తీసుకొని వెళ్ళవచ్చును. పని పూర్తి చేసుకొని ఎవరిదారినవాళ్లు వెళ్లుదాం అంటూ మరొక ఆయన సలహాగా చెప్పాడు.

వెంకయ్యగారు స్వతంత్రించి ఏమీ చెప్పలేకపోయారు. వాళ్ళను కాదంటే తనకు వేరే సహాయము దొరకదు వాళ్ళకేదోవిధంగా కొంచెము తెలుగుమాట తెలుసును. రాత్రి పదిగంటల వేళ- మాట తెలియని కొత్త ఊళ్లో- తమకు ఎవరు? ఇంట్లో అయినా మరొక దిక్కులేదు. తన అక్కగారు ఆడది- అందులో పెద్దదీను. అసలు ఈ దుఃఖాన్నే తట్టుకోలేకుండా ఉంటుంది. ఎంతసేపు ఆలోచించినా ఏమీ

తోచలేదు. చివరకు వాళ్ల సలహా ప్రకారమే వెళ్లాలని నిశ్చయించారు. ఆగదిలో నంబర్లువేసి ఉంచిన నాలుగు శవాలను బండిలో పెట్టుకొని పని ముగించి ఎవరి త్రోవన వారు వెళ్లారు.

"ఎక్కడ పుట్టి ఎక్కడ మన్ను అయినావు తల్లీ! ఎవరికీ తెలియకుండా ఎంత పని జరిగిపోయింది!" అనుకుంటూ వెంకయ్యగారు ఇంటికి వచ్చి తలుపు కొట్టారు

ఆ రాత్రికి వైద్యాలయములో పడుకొన్నారేమోఅనుకొన్నది అన్నపూర్ణమ్మగారు. తలుపు కొట్టగానే భయంతో తీసింది. లోపలికి వచ్చిన వాళ్లు మాటా మంచీ లేకుండా ప్రతిమల్లాగ- నిలబడిపోయినారు.

ఎంతోసేపటికి "అన్ని పనులు ముగించివచ్చానే అక్కయ్యా!" అంటూ కుప్పగా కూలిపోయారు వెంకయ్యగారు.

అన్నపూర్ణమ్మగారిని పట్టసాధ్యం కాలేదు. కొడుకు లేనప్పుడు ఇంత పని జరిగిందని తల నేలకు వేసి కొట్టుకొన్నది. ఆ రాత్రి గడపటమే కష్టమయింది. తెల్లవారిన తరువాత ఎరిగిన రెండు మూడు ఊళ్ళకు కేశవరావు కొరకు కబురు చేశారు కాని ఎక్కడున్నదీ సరిగా తెలియలేదు. బాధలో యిది ఒక బాధగా పరిణమించింది.

తెల్లవారితే పదోరోజనగా ఆ రాత్రి పదిన్నర రైలులో కేశవరావు వచ్చాడు. భార్యకని తెచ్చిన బహుమానాలతో- మల్లెపూలు మరువంతో.

ఉమాదేవి కర్మలకు సర్వమూ సిద్ధము చేస్తున్న వెంకయ్యగారు తలుపు తీసి "నాయనా ఎంత పని జరిగిందిరా" అని పట్టుకొని దుఃఖించాడు. కేశవరావు అయోమయంలో "ఏమిటి చెప్పు మామయ్యా" అంటూ తన తల్లికేమయినా సంభవించిందేమోనని ఊహించాడు.

ఒక్కొక్క మాటే వెంకయ్యగారి నోటి వెంట విని- అక్కడే- ఆ నిలుచున్నచోటనే- కుప్పగా కూలిపోయాడు!

శ్మశానముదాకా వెళ్ళి చూస్తే శ్మశాన వైరాగ్యమన్నా కలుగుతుందేమో, ఉమ చనిపోయినట్లుగా లేదు- తన తల్లి తాను వద్దంటున్నా వినక పుట్టింటికి పంపినట్లుగా ఉంది కేశరావుకు! పాలకొరకేడ్చే పిల్లవాడిని చూడగానే గుండెజల్లుమనేది.

ఆ రాత్రంతా వెంకయ్యగారు వైరాగ్యబోధ చేశారు. ఆ సమయంలో ఎవరు చెప్పగలిగేదీ అదేకదూ!

కర్మలు యధావిధిగా జరిపించారు.

* * * *

కేశవరావు భార్య మరణం వల్ల నిర్ఘాంతపోయిన మనిషి నిర్ఘాంతపోయినట్లుగానే ఉన్నాడు. మనిషి చాలా గంభీరుడై మౌనము ఎక్కువ చేసుకొన్నాడు.

తల్లికుండే బాధ్యతతో అన్నపూర్ణమ్మగారు కొడుకు పునర్వివాహము మాట ఎత్తుతూ వచ్చింది. కాని కేశవరావు ఆ ధ్యానలో లేకపోవటము గమనించి నిరుత్సాహపడేది. కోడలు పోయిన మూడవ ఏట వృద్ధురాలు రాలిపోయినది.

కేశవరావు తల్లిపోయిన తరవాత నౌకర్ల సహాయంతో కొడుకు సంరక్షణకు స్వయంగా పూనుకొన్నాడు. భార్యపోవటంతో అత్తవారు వగవారయినారు. తమ కూతురిని సరిగా చూచుకోలేదనీ, అశ్రద్ధగా ఆసుపత్రిలో చేర్చారనీ, మరణమే వింతగా ఉందనీ, ఏమేమిటో పుకార్లు బయలుదేరతీశారు

కాని కేశవరావు మాత్రము మౌనముద్రాలంకారుడయినాడు! నీళ్ళలో రాయి వేస్తే —రాయి కనబడుతున్నంత వరకు నీళ్ళల్లో సందు—రాయి మునిగిన తరవాత ఎప్పటి ప్రవాహము! పదిహేనుసంవత్సరాలు కాలగర్భములో కలిసిపోయాయి.

తండ్రీ కొడుకులు ఒకరికొకరు తోడునీడలయినారు. ఉద్యోగరీత్యా ఎన్నో ఊళ్ళు తిరిగారు. ఆనాటి పసికందు సుందరరావు పెద్దవాడయి కాలేజీలో ప్రవేశించాడు కొత్తగా.

అంత పెద్దయింట్లో తండ్రీకొడుకు లిద్దరే. బంధువుల రాకపోకలు అసలే లేవు. తండ్రికి మౌనము ఎక్కువయిన కొద్దీ కొడుకుకు ఒంటరితనమెక్కువ కాజొచ్చినది. పిల్లలతో చాల సరదాగా సంతోషంగా కాలక్షేపము చేస్తూ ఉంటాడు.

* * * * *

పరమపదించిన గాంధి మహాత్ముని అస్థికలు గంగలో కలిపే దినమది. ఆ పవిత్రోత్సవంలో అందరు పాల్గొన్నవారే. నది ఒడ్డున ఇసుక వేస్తే రాలకుండా

ఉన్నారు జనము. సరిగా అస్థికలను గంగలో కలుపుతున్న సమయాన పై నుంచి ఒక విమానము పుష్పవృష్టి కురిపించింది. విమానం వైపు అందరూ తలలు పైకెత్తి చూస్తున్నారు. పైనుంచి క్రిందికి దృష్టి మరల్చే కేశవరావు కళ్లు గర్ల్ గైడ్సు నడుమ తెల్లచీరె కట్టుకొని నిల్చున్న యువతిపైన పడ్డాయి. ఆ గుంపంతా టీచర్లూ-విద్యార్థినులూను. వాళ్ళంతా ఒకరినొకరు సంప్రతించుకొని బస్సు ఎక్కుతున్నారు. ఆమె ఎవరు? ఆమె ఎవరు? మనసు పదే పదే ప్రశ్నించింది.

కేశవరావు సుందరావును పిలిచి కారుదగ్గరికి వెళ్ళాడేగాని దృష్టి ముందుగా సాగిపోయిన బస్సుతోనే వెళ్ళింది

నదికి ఊరికి సుమారు ఏడు మైళ్ళ దూరము. కేశవరావు తన కారును వేగంగా నడిపిస్తున్నాడు. సగము దూరములో నిలిచిపోయిన బస్సును తండ్రికి చూపించి "నాన్నా! బస్సు ఎందుకో నిలిచిపోయింది నాన్నా! ఒకరోజు నేను వస్తుంటే నా సైకిలు తాకి పడ్డది . అటుపక్కగా కూర్చున్నదే ఆమే ఆ పిల్లతల్లి. ఆనాడు పిల్ల పడగానే నన్ను ఎంత తిట్టుందోనని భయపడ్డాను. కాని ఏమీ అనలేదు, మాట్లాడకుండా ఊరుకుంటే నాకే ఆశ్చర్యమనిపించింది" అని తండ్రికి వాళ్ళిద్దరిని చూపించాడు

ఆమె! నదీతీరాన తాను చూచి చకితుడయిన యువతే! ఎవరు ఆమె: ఇంత చేటు ఒకరి పోలికలు ఇంకొకరిలో ఉంటాయా? సృష్టిలో ఈ విగ్రహాలన్నీ-ఒక కర్మాగారములో-ఒక చేతిమీదుగా తయారవుతాయి కాబోలు! రక్తపుస్పర్శ ఉంటేనే గాని పోలికలు కలవవని అంటారు, మానవుడి పుట్టుక-పోలికలు-చూచిన కొద్దీ విచిత్రము!

ఆ దేవతాదర్శనమైన దగ్గర నుంచీ కేశవరావు మరింత గంభీరుడైనాడు!

* * * * *

ఒంటరిగా పెరుగుతున్న సరళకు మంకుపట్టు జాస్తి, అందులో తల్లి పర ధ్యానంతో-తనను విసిగించకుండా ఉంటే చాలునని-అన్నింటికీ పిల్లమాటే చెల్లిస్తూ వచ్చింది. ఆరోజు స్కూల్లో జరగబోయే నాటకానికి వెళ్ళితీరాలని గంటనుంచి పేచీ పెట్టున్నది. నాటకానికి వెళ్ళినట్లయితే ఆరాత్రికి చాల పొద్దుపోయేటట్లున్నది యింటికి రావటానికి. తోడు ఎవరూ లేకుండా, అంత రాత్రివేళ యింటికి రావటము ప్రమాద కరము. అందులో దెబ్బతిన్న ప్రాణానికి మరీ భయము!

ఎన్ని కొత్త వస్తువులు యిచ్చినా.... ఎన్ని మాటలు చెప్పినా....తల్లికి లొంగటము లేదు, ఏ మాటాఆలకించని ఏడుపు.... ఒకటే మారాము ఆరంభించింది.

ఆ దారినే తండ్రితో కారులో పోతున్నాడు సుందరరావు. ఇరుకుసందులో నిదానంగా పోతున్నది కారు. పిల్లఏడుపు వినబడగానే జ్ఞాపకము వచ్చి-తండ్రితో చెప్పి కారు ఆపు చేయించాడు. కారు దిగి తలుపుకొట్టాడు.

తలుపు కొట్టేది పక్కయింటి పిల్ల కాబోలనుకొని, ''సరళ ఆడుకోవటానికి యిప్పుడు రాదమ్మా'' అని జవాబిచ్చింది తల్లి. అప్పటికే తలుపు నెట్టుకొని సుందరరావు లోపలికి వచ్చాడు.

''ఎందుకండీ ఏడుస్తోంది! నేను ఎప్పుడు ఈ దారిన వచ్చినా తలుపులు వేసే ఉంటున్నాయి. మేము మా కారుతో సిటీ వైపు వెళ్ళుతున్నాము. అమ్మాయిని పంపుతారా! మేము తిరిగి యింటికి వెళ్ళేటప్పుడు దింపేసి వెళ్ళుతాము. పంపరూ?'' అన్నాడు క్రాపు సవరించుకుంటూ.

''రోజూ పేచీ పెట్టే పిల్లలను ఎంతవరకు సముదాయించగలను? కొత్త వాళ్ళతో వస్తుందో-రాదో? నానాయిబ్బంది పెట్టుంది నాయనా! అది సామాన్యురాలు కాదు'' అన్నది.

''ఏం సరళా? నాతో రావూ? కారులో తీసుకొనివెళ్ళి మళ్ళీ తీసుకు వస్తాను. బొమ్మలు బిస్కట్లు కొనుక్కుందాము. రాపోదాము'' అంటూ చేతులు చాపాడు.

వాకిట్లోకి వెళ్ళి కారు నిజంగా ఉన్నదో లేదోనని చూసి వచ్చింది. ''అమ్మా నాకు బట్టలు వేసి పంపవే. నేనూ కారులో వెళ్ళి వస్తా''నని గంతులు వేసింది సరళ. బట్టలు వేసుకొని తల దువ్వుకొని ముస్తాబైంది తల్లి మెడలో ఉన్న ముత్యాలహారము తీసి పెట్టించుకున్నది. వెనుకకు తిరిగి చూడకుండా సుందరరావుతో వెళ్ళి కారెక్కింది

ఆ పిల్లవాడు వచ్చి రమ్మని పిలువటము-సరళ వెళ్తానని పరదాపడి వెళటము-అయిదు నిముషాలలో జరిగిపోయింది. తల్లికి వారించే ఆలోచన కలుగలేదు కాని వాళ్ళు వెళ్ళిన దగ్గర్నుంచి ఆమెకు ఒకటే ఆలోచన! భావనావరంపర! తనను యింతటితో బ్రతకీయ డాదేవుడు? ఈక్రొత్త సంక్షోభము తన ప్రాణం

మీదికి బయలుదేరిందేమిటి ?'' అలాగే కిటికీదగ్గర కూర్చుని ఆలోచిస్తున్నది. రాత్రి తొమ్మిది....పది....కారు యింకారాదు. చీమ చిటుక్కుమన్నా కారాగిందేమోనని సంభ్రమము- ఎదురు చూడటముతో రాత్రి గడిచిపోయింది !

అంగడిలో తనకు కావలసిన సామాన్లు కొనుక్కొని సరళకు ఒక పెద్ద రబ్బరు బొమ్మ కొన్నాడు సుందరరావు. బిస్కట్లు చాకొలెట్లు కాగితపు సంచిలో పోసి చేతికిచ్చాడు. సరళ ఆనందభరితురాలయింది.

సుందరరావు తండ్రిని ప్రోత్సహించి సినిమాకు తోవతీశాడు. తనకు మిగిలిన ఈఒక్క కొడుకు మనసు చిన్నబుచ్చటము యిష్టములేక కేశవరావు బయలు దేరాడు.

సరళ సినిమా అసలు చూడలేకపోయింది. బిస్కట్లు చాకొలెట్లు తన దగ్గర ఉన్నవన్నీ తిన్నది. నిద్ర వచ్చినట్లున్నది. కళ్ళు నులుపుకుంటూ ఆవలించింది. మొదలు సుందరరావు- తరువాత కేశవరావు కాళ్ళమీద కూర్చోపెట్టుకున్నారు. ఆట సగమయింది. దీపాలు వెలిగించారు అప్పటినుంచీ తన చేతికి గుచ్చుకుంటున్న వస్తువేమిటీ అని యోచిస్తున్న కేశవరావుకు సరళ మెళ్ళో ఉన్న ముత్యాలహారములో బిళ్ళ కనబడ్డది. ఆశ్చర్యముతో ఆ పిల్ల తల ఒక పక్కకు జరిపి హారము ఊడదీసి చూశాడు అది రూపాయంత వెడల్పు బిళ్ళ; దాని చుట్టూ ముత్యాలు కెంపులు తాపిన చక్రమూ. ఒక పక్కకు బెట్టాను. అది నొక్కగానే రెండు తలుపులవలె తెరచుకొన్నది తలుపులకు రెండు వైపులా రెండు చిన్న చిన్న ఫోటోలు, వాటి కింద ఏవో సన్నటి అక్షరాలు అంకెలూను. కొకెను ఇంజక్షను యిస్తే గిల్లినా తెలియదు. ఆ బాబతేమో యీ హారము ! కేశవరావు దానిని చూస్తున్న కొద్దీ దిగ్భ్రాంతుడై బాహ్యస్మృతి లేకుండా అయిపోయాడు. ఈ హారము అతనికి చాలా పరిచయమైనదానివలె ఉన్నది ! తాను ఉమకు ప్రథమ సమావేశసందర్భంలో ఒక్క శరద్రాత్రి ఇచ్చాడు అటువంటి హారము ! అందువల్ల ఉమకు తనకు ఎంతో ప్రియమైనదావస్తువు. అందులో ఒక వైపు తన ఫోటో - మరొక వైపు ఉమ - ఆ లాకెటులో అమర్చాడు దానిని ప్రత్యేకంగా ఆర్డరు యిచ్చి చేయించాడు. రెండు తలుపులు నొక్కగానే బిళ్ళలాఉంటుంది. ఆరోజున ...యీ హారములో ... ఉమను స్వయంగా అలంకరిస్తూ... సిగ్గుతో ముడుచుకొనిపోయిన ఆమెను తానెంత విస్మయపరిచాడు ! కాలప్రవాహంలో తన వైవాహిక చరిత్ర అడుగునపడి, కథగా, గాథగా మారిపోయింది. పదహారు ఏళ్ళనాటి మాట ఆ హారమూ—దాని చరిత్రానూ !

అప్పటికప్పుడు తిరిగి యీ హారములో సమావేశమా తనకు! ఇది అదేనో-లేక మరొకటో! తనకీ మధ్య ఉమవంటి మనిషి- సరిగా ఆ ఎత్తు లావు....అదే రంగు....పోలిక....అంతా ఉమే అనుకోవచ్చు....కనబడ్డది! ఇప్పుడు ఉమ హారము వంటి హారము కనబడ్డది! ఈ మాయ ఏమిటి? ఇంతలోకే దీపాలు ఆరి పేశారు సినిమా కధ తిరిగి ప్రారంభించారు. కొత్త యోచనలతో-విస్మయంతో-హారస్పర్శవల్ల కలిగిన సంభ్రమంతో కేశవరావు సినిమా కథే చూడటములేదు.... అతడు చూసేది ఉమను....ఆమె హారాన్ని! జేబులోంచి టార్చి దీపము తీసి ఆ ఫోటోలను పరిశీలించి చూశాడు. ఒక వైపు తను- మరొక వైపు ఉమ కల్యాణపు బొట్టు పెట్టుకొని తీయించుకొన్న ఫోటోలవి. తమ పేర్లు. పెండ్లి తేదీ సన్నగా చెక్కి ఉన్నాయి. 'ఈ హారము వీళ్ళదగ్గరి కెట్లా వచ్చింది. అయితే ఈ తల్లీపిల్లా ఎవరు?'

సినిమా అయిపోయింది. అందరూ లేచారు. అందరితోపాటు తానూ లేచాడు పిల్లనెత్తుకొని.

సుందరరావు కారు ఎక్కుతూ ''నాన్నా! పెట్రోలు మాటేమిటి?''అన్నాడు.

''ఎట్లాగో సరిపెట్టుకుందాము. ఈ రాత్రివేళ ఆ సందులో నుంచి కారు పోనివ్వటమే కష్టము. ఈ పిల్లను తీసుకొని యింటికి వెళ్ళిపోదాము, రేపు చూడ వచ్చునులే'' అంటూ కారు పెద్ద రోడ్డు వైపుకు తిప్పాడు.

'నాన్నా ! ఆమె పిల్లను తొందరగా తీసుకొని రమ్మని పదిసార్లు చెప్పింది. ఈ అమ్మాయి ఒక రాత్రివేళ ఏడవదూ ?'' అన్నాడు సుందరరావు.

''ఏం ఫరవాలేదు. రేపు ఉదయమే వెళ్ళి ఆమెను తీసుకొని వచ్చి పిల్లను ఒప్పగించు'' అంటూ కారు యింటికి పోనిచ్చాడు.

సరళను ఒక మంచముమీద పడుకోబెట్టి తల దగ్గర ఒక పళ్లెంలో బిస్కట్లు పెట్టి ఉంచారు.

కేశవరావు తన గదిలోకి వెళ్లి పడకకుర్చీలో కూర్చున్నాడు. అనంత మయిన సముద్రపుకెరటంవలె.... భావాలు ఉద్భవిస్తూ....అంతరిస్తూ....తిరిగి ఉద్భ విస్తూ.... ఉన్నాయి. సైకిలువలె మనసు గిరగిర తిరుగుతున్నది! ఎంతసేపు

యోచించినా తిరిగి మొదటికే రావటము జరుగుతున్నది. గ్రంథమంతా హృద్గత మైనప్పటికీ, మొదటిప్రశ్నకే జవాబు దొరకటంలేదు........ ఎప్పుడు తెల్లవారిందో అతనికి తెలియదు.

ఉదయము కారులో సుందరరావు వెళ్ళి ఆమెను రమ్మన్నాడు. ఆమెకేమీ అర్థము కాలేదు. "నీవు వచ్చేటప్పుడు పిల్లను తీసుకొని రాకపోయినావా ?" అన్నది.

"పిల్ల నిద్రలేవలేదు. మీరువచ్చి తీసుకొని వెళ్లండి" అన్నాడు. ఆమెకా కొత్తకథ అర్థము కావటములేదు. ఆమె జీవితమంతా కథలాగానే ఉన్నది. జరుగబోయేది ఏనాదిరి ఘట్టమో !

ఆమెను తీసుకొనివచ్చి డ్రాయింగురూములో కూర్చోపెట్టి లోపలికి వెళ్లి తండ్రికి చెప్పాడు. రాత్రి నిద్రలేనందువల్ల భారంగా అడుగులుపెట్టూ కేశవరావు వచ్చి కూర్చున్నాడు. ఆమెను చూడగానే ఒడలు జలదరించింది !

ఒక్కొక్క సందేహమూ తీరిపోతున్నది ! ఉమకూడా సరిగా.... కూర్చున్నా యిలాగే.... నిలుచున్నా.... యిలాగే.... ఉండేది !

ఆమె ! అంతులేని కన్నీళ్ళు కారుస్తూ.... ఆపాదమస్తకమూ వణికి పోతున్నది !

'చూడండి. అమ్మాయి యింకా నిద్రలేవలేదు. రాత్రి చాలా పొద్దు పోయిందని అటు రాలేక యింటికి వచ్చేశాము. అయినా మీ పిల్ల ఏడవలేదు' ఆమె ముఖము చూస్తూ మార్పు కలుగుతుందేమోనని గమనించాడు.

ఆమె తలన్నా ఎత్తలేదు.

'అమ్మాయి సినెమా చూడలేదు. వెంటనే నిద్రపోయింది.'

'.... .... .... .... .... ....'

'మాతో పంపేటప్పుడు ఆహారము పెట్టారెందుకు ? పోతుందేమోనని భయము వేసింది.' ఆత్రంతో తీవ్రంగా చూస్తున్నాడు ఆమె ముఖలక్షణాలను.

ముఖానికి చెయ్యి అడ్డము పెట్టుకొని. 'పిల్ల లేవకపోయినా నేను తీసుకొని వెళ్తాను. నాకు పనిఉన్నది.' అంటూ వణుకుతూ లేచింది.

"చూడండి, నేను ప్రమాదము తలపెట్టే వాణ్ణికాను మీ అమ్మాయి మెడలో ఉండే ముత్యాలహారము....అలాంటిదే మాది ఒక హారము పోయింది. ఆహారము ధరించే ఆమెకూడా పోయింది. ఆ రెండు యిప్పుడు దొరకవలసి యున్నవి. నేను వాటికోసము చాలా పరితపించిపోతున్నాను. ఒకవేళ నా జీవితంలో ఆ రెండు తిరిగి దొరకటము దుర్లభమయితే.... మీ హారాన్ని .. న్ని.... మా సుందుకు చూపించి....నేను వాటికిచ్చే ప్రాముఖ్యము....వివరాలు తెలుపుతాను."

ఈ మాటలన్నీ ఆమె కళ్ళుమూసుకొని వింటున్నది. హారమును గురించి చర్చ వస్తుందేమోనని తనను పిలువటానికి సుందరరావు వచ్చినప్పుడే ఊహించింది! తాను ఒక్కసారి మారుపేరుతో....పట్టుపడకుండా....తన....దర్శనము చేసుకుందా మని వచ్చింది! కాని ముఖము ఎత్తిచూసే ధైర్యము కలుగలేదు.

"ఆ హారము నాకు ప్రాణప్రదమైనది. పిల్లను యిస్తే తీసుకొని వెళ్ళు తాను." అంటూ లేచింది.

"ఈ హారము నాకు ప్రాణప్రదమైనదే! దానిసంగతి చాలా అనుమానంగా ఉంది. చూడండి....మీరెవరో....నేనెవరో....మీ లాకెట్టులో నా ఫోటో ఉన్నదే!"

".... .... .... .... .... .... .... .... ..."

"మరొకవైపు నేను దేవతగా చూసుకొనే మా ఉమ ఫోటో ఉన్నది. దానికి తగిన సాక్ష్యము— ప్రమాణములు ఉన్నాయి నా దగ్గర. ఆహారము మీదెట్లా అవు తుంది?" వాదనలోకి దిగితే ఏం జరుగుతుందో చూడాలన్న ఉద్దేశ్యంతో అన్నాడు.

"అది నాది. దయచేసి యిస్తే నేను వెళ్తాను. ప్రతిరోజూ ఉదయము దానిని చూస్తూ లేస్తాను. దానిని చూపెట్టుకొని జీవచ్ఛవములాగనయినా బతుకుతు న్నాను.... " ముఖానికి కొంగు అడ్డము పెట్టుకున్నది. దుఃఖపు అలలు కాబోలు మనిషిని కదుపుతున్నాయి.

"నాకన్నీ తెలిశాయి. మొదట్లో పుకారేమో ననుకున్నా.... చాలా రోజులు అనుమానించాను. హాస్పిటల్లో డాక్టరు చేసిన వంచన గుప్తంగా విచారించాను. విన్న చాలా హింసించి లొంగదీశాడనీ, నాకు ఉత్తరము వ్రాయటానికి ప్రయ

త్నించిన నిన్ను చాలా బాధపెట్టాడనీ, క్లోరోఫారము ప్రయోగించి నిన్ను ఊరి నుంచి తీసుకొని వెళ్లాడనీ, అంతా తెలిసింది. అప్పుడప్పుడు అటువైపులకు వెళ్ళి స్వయంగా కనుక్కుందామని అనుకునేవాడిని. కాని ఆ డాక్టరు అప్పుడే నిన్ను తీసుకొని సెలవుమీద బొంబాయి వెళ్ళాడని తెలిసింది. మనసంతా ఒలికిన పాదరసమయి.... విరక్తి తోచింది. ఏంచేయాలో తోచలేదు. ఇలాగే.... నెలలు....సంవత్సరాలు.... ఒకదాని తరువాత ఒకటి గడిచిపోయాయి. అప్పుడు మూడు నెలల పసికందు యీ సుందు.... చూశావా! పెద్దవాడయాడు!"

".... .... .... .... .... .... .... .... ...."

"నీవు యిక్కడికి ఎప్పుడు వచ్చావో తెలియదు. ఆ డాక్టరు చనిపోయాడని విన్నాను. కాని ముందుసంగతి దారి తెన్ను తెలియక స్తంభించిపోయాను. ఉమా! గుర్తుపట్టావా!" అన్నాడు. ఏకవచనప్రయోగం చేసిన తరువాత ఆమె ముఖము చూడాలన్న ఉద్దేశ్యంతో ధైర్యంతోనూ.

".... .... .... .... .... .... .... .... ...."

"నిన్ను మహాత్ముడి అస్థికలను నదిలో కలిపే దినము చూశాను. మొదలు చూసినప్పుడు నమ్మలేక పోయినాను. నా కళ్ళను నేనే అనుమానించాను."

".... .... .... .... .... ...."

"సుందును చూపి అయినా నీవు గుర్తు పట్టలేవా? నీవా యీడులో ఉన్నప్పటి ముఖమే వాడిది. గమనించలేదా?" ఆశాదృష్టితో ఆమెను తిలకించాడు.

"ఒకరోజు యింటిముందర సైకిలు తగిలి పడ్డదని చెప్పటానికి నా దగ్గర కొచ్చాడు. అనుమానము తగలటానికి అదే మొదలు. రెండవసారి వచ్చినప్పుడు బాగా నిర్ధారణకు వచ్చాను. ఈవేళ అడగగానే-వాని నోటితో అడగగానే నిరాకరించ లేకపోయాను. కాని.... నాకెందుకు బాధ కలుగజేస్తారు? ఆ పిల్లనివ్వండి... నేను వెళ్లాలి...." అని వెక్కివెక్కి ఏడుస్తూ కుర్చీలో కూలిపోయింది.

"ఉమా! నాసంగతి తెలియదూ నీకు? ఎక్కడుండేవాళ్లు అక్కడ ఉంటేగాని నాకు తోచదు తెలిసిందా అర్థము?"

"నేను.... .... ఏం లాభము? ....పిల్ల?"

"తెలుసు. పిల్లసంగతీ తెలుసు. జరిగిన యీ సంఘటనలో నీ భాగం ఎంతో తెలుసు. సందేహిస్తావెందుకు?"

"కాని నేను........ "

"నీవు నీవే! ఉమవే.... గోవిందరాజుల ఉమాదేవివే"

"అది ఒకనాటిమాట. కాని—— ఇప్పుడు కాదు."

ఆమె ఆ కుర్చీలోనే స్పృహ కోల్పోయింది.



# 'బలీయసీ కేవలమీశ్వరాజ్ఞా'

అది వైశాఖపున్నమి. ఆఊరి జమీందారిణికి ఆనాడు బ్రాహ్మణులను బీద సాదలను తోచినరీతిగా సత్కరించే అలవాటు, అరఎకరముమేర ఆక్రమించిన ఆ భవనముచుట్టూ తాటియాకు పందిళ్ళు వేశారు.

పాడ్యమినుండి జమీందారిణికి తీరికలేదు. ఎవరికేది ఇచ్చేది, ఏ వస్తువులు కావలసినదీ విడివిడిగా దేనికది ప్రత్యేకంగా పట్టికల తయారుచేయించి వస్తు సామగ్రి సిద్ధపరచింది.

పౌర్ణమినాడు తెల్లవారుజాముననే లేచి, తలంటి పోసుకొని, దైనికములను ముగించుకొని, పందిటిలోకి ప్రవేశించింది. ప్రతిఏటా జరుగుతున్న దానధర్మాలు కనుక సూర్యోదయము కాకముందే పండితులు, పటువులు, ముత్తైదువలు నిర్దేశింప బడిన ప్రదేశాలలో ఆసీనులయారు. బీదవారంతా చాపలమీద కూర్చున్నారు; లెక్కలేనంతమంది.

సుమారు ఏడున్నరగంటలకు వర్జ్యము వెళ్ళిన తరువాత జమీందారిణి సత్కారము ప్రారంభముచేసింది. బ్రాహ్మణులు మంత్రసూక్తాలు శ్లోకాలు చదివి, సంభావనలు అందుకొని, స్వయంగా తమచేతికి అందిస్తున్న జమీందారిణిని దీవించి పోతున్నారు

పదిగంటలయేసరికి జనము పలచబడినది. పందిటిలోని జనమునంతా కలయ జూచిన జమీందారిణికి ఆత్మీయులెవరో రాని వెలితి చటుక్కున తోచింది. ఆమె విశాలనయనాలు మరొకసారి.... మరొకసారి.... ఆ పందిటిలో ఉన్న ఒక్కొక్క రిని పరిశీలించి వెతకినాయి. 'ఇంకా రాలేదేమి.... ఇంకా రాలేదేమి' అని ఆత్ర పడుతున్నది ఆమె హృదయము.

'వీరయ్యా! చెల్లమ్మా రామయ్యలు ఇంకారాలేదు. నేను నిన్న సాయం కాలము కబురుకూడా చేశాను సుమా. ఎందుకురాలేదో? నీవు స్వయముగా వెళ్ళి

తీసుకొనిరా. అద్దాలబండి తీసుకొని వెళ్లు' అని పంపింది. మాట పొంతము చెప్పక ముందే వీరయ్య కదిలివెళ్లాడు.

అప్పటికి అంగవస్త్రాల-చెంబుల దొంతరలు తరగిపోయాయి. బీదలకిచ్చే ధాన్యపుబస్తాలు ఖాళీఅయాయి. రవికపీటీల పళ్లేలు వట్టివయాయి.

వెళ్ళిన అరగంటకే వీరయ్య బండితో వచ్చాడు. బండిలోనుంచి సుమారు పాతిక ఏళ్ళ చెల్లమ్మ ముందుగాదిగి చేతులు పట్టుకొని రామయ్యను దింపింది. కొయ్య కాళ్ళతో, చేతులక్రింద పెట్టుకొన్న కర్రలసహాయంతో, రామయ్య నిముషానికి ఒక అడుగు వేస్తూనూ, చెల్లమ్మ అతనికి ఆసరాగా ప్రక్కనుంచి నడుస్తూనూ వస్తుంటే హృదయవిదారకమైన ఆ దృశ్యానికి జమీందారిణి కళ్లవెంట ఆపలేని అశ్రుప్రవాహము బయలుదేరింది. కొత్తగా అదృశ్యము చూసేవారికి కళ్లవెంట వచ్చేవి నీళ్లుకాదు, రక్తపుబొట్లేమో అన్నట్లుగా ఉంటుంది.

ఆ దృశ్యము ఆమె నాలుగు సంవత్సరాలుగా చూస్తూనేఉన్నది. చూసినప్పు డల్లా అంతదుఃఖము కలుగుతూనే ఉన్నది. ఏనాడు ఆ పుణ్యదంపతుల దర్శనముతో తన హృదయము విప్పారి ప్రేమాంకుర మేర్పడినదో ఆ వైశాఖపున్నమినుండి దాని స్మారకచిహ్నముగా ప్రతిఏటా బ్రాహ్మణ బీదసాదలకు తోచినరీతిగా దానము చేయటము ప్రారంభించినది.

* * * *

జమీందారిణి శకుంతలాదేవి వేసవికాలములో తన భవనమును చల్లగాఉంచే ఏర్పాట్లు చేయిస్తున్నది. ఫిబ్రవరినెలలోనే, 'నీలగిరి వెళ్లటమా, బెంగుళూరు వెళ్ల టమా' అని యోచించి ఏర్పాట్లు చేసుకునే ఆమెకు, రెండేళ్ల క్రిందట, పెద్దవిపత్తు తటస్థించింది. బలంగాలేచి తిరుగుతూ తిరుగుతూ ఉన్న జమీందారుకు రెండువినాల జ్వరంతో మాట నిలిచిపోయింది. స్థలము కదల్పకుండా చికిత్సచేసి చూడాలని స్థానిక ఘనవైద్యులు తంటాలు పడుతున్నారు. అందుకనే పందిళ్లతోటి తడకల తోటి ఉన్నచోటనే చల్లదనము ఆపాదించాలని సకల ప్రయత్నాలూ చేస్తున్నది జమీందారిణి.

ఆ ఉదయమే మేదరిగుడిసెలలోనుంచి చెల్లమ్మ రామయ్యల జోడా జమీం దారుగా రింటికి తడకలు తీసుకొని బయలుదేరింది. పల్లెపదాలతో-యౌవనపు సరా

గాలతో ఒకరినొకరు తోసుకుంటూ రాసుకుంటూ-రాజభవనము సమీపించేసరికి ఎని మిది దాటింది.

'పడమరన ఉన్న గదిముందర వసారా మాదిరిగా వంపుగా తడక కట్టిస్తే ఎండయొక్క తీక్షణము లోనికి రాకుండానూ, గాలి వచ్చేటట్లుగానూ ఉంటుం'దని జమీందారిణి శకుంతలాదేవి మేదరరామయ్యకు చెప్పి తన గదిలోకి వెళ్ళిపోయింది.

'మామా! ఊఁ పని మొదలుపెట్టు. కానీ ... అక్కడొక్కటీ.... ఇక డొక్కటీ గడలు పాతు. పురికొస జేబులో పెట్టుకో. ఊఁ ధోవతి పైకికట్టు....'

'పెద్దపెద్ద మాటలు చెప్తున్నావుగాని చేసేదానిని కాదుగా. గునపము తీసు కరా. కూర్చుని ఎన్నికబుర్లయినా చెప్పవచ్చు.... అవునా'

గజములోతు గుంటలు తవ్వి గడలను వాటిలో దింపుతున్నాడు రామయ్య. గడ్డపార తిరుగవేసి గుంటలను మట్టితోపూడ్చి దిమ్మెన చేస్తున్నది చెల్లమ్మ. ఈ రెండు పనులు పూర్తిచేసి రామయ్య గోడకు నిచ్చెన వేసుకున్నాడు. సుమారు పన్నెండు గజాల ఎత్తునుంచి స్లోపు దింపుకుంటూ, ఆరు ఏడు గజాల ఎత్తుకు తీసు కొని రావాలి. ఒక నిచ్చెన పొడుగుచాలక రెండు నిచ్చెనలను కలిపి తాళ్ళతో గట్టిగా బిగించి కట్టున్నాడు.

రామయ్య రెండు నిచ్చెనలను కలిపి తాటితో బిగించి కట్టుంటే ఆమె స్నిగ్ధ హృదయానికి అశ్చర్యము కలిగింది. 'మామా బ్రహ్మదేవుడు ముళ్లువేసినట్లుగా వేస్తున్నావే. రెండు నిచ్చెనలను కలిపి తాళ్లతో బిగించి కట్టున్నావే? ఈ బిగింపు సళ్లిచ్చినా, తాడు నలిగినా, ఏమవుతుందో ఊహించావా మామా.'

'ఊహించకేం? వెర్రిముఖానికి నీకేనా ఆలోచనాశక్తి? రెంటినీ బంధించే తాడు నన్నగిల్లినా, బిగింపు సళ్లిచ్చినా ఏ క్షణానికి విడిపోతాయో అన్నట్లుగా ఉంటాయి నిచ్చెనలు. నేనయితే గట్టిగానే బిగించి కట్టున్నాను.'

'అబ్బా! ఎంత చెమటపోసిందో? తుడవనీ అప్పుడు తాగిన గంజినీళ్లు కాస్తా అరిగిపోయినట్లున్నాయి, వచ్చేటప్పుడు మూటకట్టి తీసుకొచ్చిన అన్నము రొట్టెలు ఈవైపు తడక కట్టిన తరువాత తిందుగాని.'

'నేనొక్కణ్ణే తింటానా? నీకు మాత్రము ఆకలి కావటములేదూ?'

'నేనూ తింటాను. నేనే కలిపి ముద్దలుచేస్తాను.'

కూనిరాగాలు తీస్తూ నిచ్చెనమెట్లు ఎక్కిపోతున్నాడు పురికొన, పెద్దకత్తి మేకులు జేబులో పెట్టుకొని, జుట్టు సవరించుకుంటూ, కిందకిచూస్తూ........

'చూస్తూ నిలబడక, కాస్త నిచ్చెన గట్టిగా పట్టుకో.'

'నీ పనితనము చూద్దాము. ఈ తడకను కాసేపటిలో ఆ మేకులకు తగిలించు. మాటలలోఉన్న వడి పనిలో ఉందో లేదో చూస్తాను.' కవ్వించింది.

'నీవు పనిముఖ మెరుగుదువా పిల్లా? 'ఏ ఊరు ఏ దేశము పిల్లా నీది?' రాగచ్చాయ లెరుగని రామయ్యపాటకు చెల్లమ్మ పక్కున నవ్వింది.

వీళ్ల మాటలు శకుంతలాదేవి చెవిన పడుతున్నాయి. ఆమెకు నవ్వటాలు త్రుళ్ళటాలు అసలే పనికిరావు. 'ఏమిటీ? మీ రిద్దరూ పనిచేయటానికి వచ్చారా లేక సరసాలాడటానికి వచ్చారా? మీ అల్లరే అప్పటినుంచీ నా చెవిని పడుతున్నది. పని జరుగుతున్నట్లు లేదు.' అని కిటికీదగ్గర నిలబడిన శకుంతలాదేవి మందలించింది. ఆ జంటను

'దొరసానీ, అది ఆపితే నేను పనిచేయకుండా ఆగుతానా? అదంతే. మాట్లాడుతూ-పాటలు పాడుతూ-నాకు అడ్డమువచ్చి పని జరగకుండా చేయాలని చూస్తుంది. నేనేమీ పని ఆపి ఓసేవాణ్ణి కాదు తల్లీ' అన్నాడు పైకి ఎక్కిన రామయ్య.

'ఏయ్ అమ్మీ. నీవు సిగ్గైనా లేకుండా వాడినెందుకు ఊరకే పలుకరిస్తావు? వాడు చేసేపనికి అడ్డము వస్తున్నావు తెలిసిందా?' 'నేను మాట్లాడిస్తూ పదాలు పాడుతుంటేగాని ఆయన పని చేయలేడమ్మా అసలు, నా మాట నిజమవునో కాదో చూడండి, కాస్త నేనటు పోయివస్తాను' అని ధీరాలు పలుకుతున్నది చెల్లమ్మ.

'ఆఁహాఁ. అదొకటా ఈ మేదరివాడికి? బాగానే ఉన్నది లక్షణము!' అనుకుంటూ శకుంతలాదేవి లోపలికి వెళ్ళిపోయింది.

ఆమెను లోపలికి పోనిచ్చి గవ్వలు గలబరించినట్లుగా ఇద్దరూ నవ్వుకున్నారు. ఆ నవ్వులోని శబ్దతరంగాలు నలుదిశలూ వ్యాపించి మారుమ్రోగాయి.

'మామా! వాళ్ళలాగ మనము నోరుమూసుకొని పని చేయగలమా? మాటా

మంచీ లేకుండా. ఎవరిగదిలో వాళ్లు కూర్చుని కాలము వెళ్లదీస్తారు. మనమయితే అట్లా ఒక్క క్షణముకూడా ఉండలేము.'

మనసును ఉఱ్ఱూతలూగించే రాగంలో జానపదుల పాట పాడుతోంది. అతడు తన గొంతుకూడా కలిపాడు. అతడి మనసు ఏదో ఏదో అయిపోతున్నది.

'మామా, పాట పాడావుగాని ముసలివాళ్లు ఏరి మనకు? పిల్లోణ్ణి చంక నేసుకొని కదూ వెళ్లేది? ఊరికే వెళ్దామనుకున్నావు?'

'అవునుకదూ! సరిసరి. చాలాఉందే? పోనీ నీవో పదము పాడు?'

'నీవు పాడినట్టుగా-సన్నగా....తియ్యగా....నేను పాడగలనా? నవ్వకుమరి! నా కొచ్చినట్లుగా నేను పాడతాను ఏం?'

ఉప్పొంగినహృదయంతో, జగమంతా రామమయంగా తోచిన చెల్లమ్మ అప్రయత్నంగా అలకలో పెనివిటికి దూరంగా జరిగి కవ్వించే పాట ఒకటి పాడింది.

నిచ్చెన మీద కాళ్లు ఆనించి, ఒక చెత్తో మేకు పట్టుకొని మరొక చేత్తో మేదరికత్తి తిరగవేసి మేకును కొట్టున్నాడు రామయ్య. ధ్యాసంతా దాని మీదనే కేంద్రీకరించి.

ఇంతలోకే పై నుంచి పెద్దబరువు క్రిందపడ్డచప్పుడు! 'అయ్యో! అయ్యో!' అన్న కేకలు ప్రక్కగదిలో ఉన్న శకుంతలాదేవికి వినపడ్డాయి. ఆమె యివతలికి వచ్చి చూసేసరికి కూలీలంతా చెల్లమ్మచుట్టూ మూగారు. అందరూ ఒక్కసారే "ఏమయింది ఏమయింది? ఎట్లా పడ్డాడు?" అని అడుగుతున్నారు.

రామయ్య రెండు కాళ్ళూ మోకాళ్ళ క్రింది నుంచి ఊగులాడుతున్నాయి. ముఖం నిండా రక్తము! మాటలేకుండా మూలుగుతున్నాడు.

"అయ్యో! మామా, కాళ్ళు....నీ కాళ్ళు....విరిగి పోయాయా?" అంటూ తడిబట్టతో ముఖము తుడిచి విసరుతున్నది చెల్లమ్మ.

అక్కడ మూగిన కూలీజనమంతా చెల్లమ్మ దుఃఖము చూడలేక కంట తడి పెట్టారు.

ఆ దృశ్యానికి శకుంతలాదేవి హృదయములో కదలిక కలిగింది. ఆమె కెవరో బోధించినట్లయింది. కారులో రామయ్యను ఆసుపత్రికి పంపే ఏర్పాట్లు చేసి, కూడా వెళ్తానని పట్టుపట్టిన చెల్లమ్మను ఆపుచేసింది.

చెల్లమ్మ నోటతడి ఆరేవరకు ఏడ్చింది. మితిమీరిన దుఃఖమువల్ల యిప్పుడామె కంటికి నీరు రావటములేదు. కూలిజనమంతా చెల్లమ్మను ఓదార్చుతున్నారు.

శకుంతలాదేవికి ఇదంతా అయోమయంగా ఉంది.

“అయ్యో! మా మామకు కాళ్ళు విరిగిపోయినాయి. గడ్డం క్రింద రాయి లోతుగా దిగబడి పోయింది. క్రిందపడితే ఏదో పడ్డదనుకున్నాను గాని....మామ పడ్డాడని అనుకోలేదు. ఇంకెక్కడి కాళ్ళు? అయిపోయినట్లే....”

“ఏడవకు కాళ్ళు విరిగిపోలేదులే కట్టుకట్టించుకొని వస్తాడు. ఏడిస్తే వస్తాయా?” అంటూ సమాధానపెట్టున్నారు కూలీలంతా.

“ఎంత పాటు పడ్డాడు! ఇంకా అన్నము పెట్టాలని సిద్ధము చేస్తున్నాను ఎప్పటిలాగ నడుస్తాడా మా మామ? ఇవాళ లేచినవేళ మంచిది కాదు వచ్చేటప్పుడు వాళ్ళ పిల్ల తుమ్మింది. అప్పుడే అనుకున్నా ఏదో మూడుతుందని. అబ్బా! ఎంత రక్తము....ఎంత బాధపెట్టిందో....” అంటూ చెల్లమ్మ ముఖము తిరిగి పడి పోయింది.

దెబ్బ తగిలిన రామయ్యను పంపివేసి చెల్లమ్మకు రెండు మూడు గజాల దూరాన శకుంతలాదేవి చూస్తూ నిలబడిపోయింది. ఇంతచేటు బాధపడుతుందేమిటి ఈ మనిషి? ఇదంతా నిజమైన మానసికోద్రేకమేనా? చెల్లమ్మ ఇంత ఆరాటపడవలసిన అగత్యమేమిటో శకుంతలాదేవికి అవగాహన కావటములేదు. ఇన్నాళ్ళ నుంచీ కాపురము చేస్తున్న పెనిమిటికి దెబ్బ తగిలి రక్తము కారినందువల్ల మనసులో కొంచెము కష్టముగా ఉండవచ్చు కాని....అయినా చెల్లమ్మకు ఇకముందు తమ జీవనోపాధిని గురించి దిగులేమో అనుకొని,

"ఇంక సంపాదించలేదన్న దిగులా నీకు? అందుకేనా ఏడవటము" అని దూరాన నిలబడి కాస్త ధీమాగా జమీందారిణి అడిగింది.

"అమ్మా పోషణ కొరకు ఏడవటము లేదు. ఆయన పోషించలేకపోతే నేను పోషించలేనూ? నాకు మేదరిపనులన్నీ వచ్చు. తడకలు బుట్టలు అల్లి నేను కూడా సంపాదిస్తూనే ఉంటాను; కాని మా మామ నవ్వుకుంటూ నడచుకుంటూ మరి రాగలడా? నేను వీళ్ళ గూడెం వచ్చి నాలుగేళ్ళయింది. ఒక్కనాడైనా నేను మా అమ్మగారింటికి వెళ్ళలేదు. మా మామ తాను కలుపుకొని అన్నము తినలేదు. నాకు నమ్మకములేదు ఆ కాళ్ళతోటి నడుస్తాడని."

"అయితే మీ కులములో మారుమనువు లేదూ? మీ కులాలలో దిగులు పడవలసిన అవసరము ఏముంది?" అన్నది శకుంతలాదేవి.

"అమ్మా. మారుమనువు ఎవరికి కావాలి తల్లీ? మా మామ మనసిచ్చి మనసును ఆకర్షించుకున్నాడు. ఒక పొల్లు మాట ఒక కల్లు బొట్టు ఎరగడు. ఒకరి జోలికి పోడు" చెల్లమ్మకు నాలుక ఎండిపోయింది, మాట్లాడే శక్తి లేక నేలకు ఒరిగిపోయింది.

అంతవరకూ నడుము మీద చేతులు పెట్టుకొని చూస్తున్న శకుంతలాదేవి హృదయము దురహంకారపూరితమైన ఆచ్ఛాదనమును విదలించుకొన్నది. మంచి నీళ్లు తెప్పించి చెల్లమ్మ గొంతులో పోయించి అరుగుమీద చాప వేయించి పడుకో పెట్టించింది. అక్కడే తానొక కుర్చీ వేయించుకొని కూర్చున్నది.

*     *     *     *     *

జమీందారిణి శకుంతలాదేవి కాపురానికి వచ్చిన పదిహేను ఏళ్ళలో నలుగురు పిల్లల తల్లి అయింది. బాల్యములో ఆమె విద్య నేర్చినట్లు కనబడదు కాని సంగీతములో ప్రావీణ్యము కలిగించుకొన్నది. మాటలో, ప్రవర్తనలో, జమీందారీ ఠీవి ఉట్టిపడేటట్లుగా మెలగట మామెకు పుట్టుకతో అబ్బిన విద్య. పెద్దవయి అత్త వారింటికి వచ్చినా ఆమెకు నలుగురితో కలిసి ఉండటము, అందరితో కలిమిడిగా మాట్లాడటము అలవాటు కాలేదు. తనతో మాట్లాడ వచ్చిన వారితో ముఖాముఖి మాట్లాడ నిచ్చగించక దాసీలతో రాయబారము జరిపించటము, చాలా వరకు దాసీల మధ్యనే వాళ్ళతో ప్రసంగిస్తూ కాలక్షేపము చేయుటము, ఆమె కభ్యాసమయినది.

ఆమె స్వభావమేమిటో గాని బిడ్డలనయినా ఆప్యాయంగా పిలిచి దగ్గర కూర్చోబెట్టుకొని ఎరుగదు. ఒకసారి బిడ్డకు ప్రమాదకరమైన జబ్బుచేసింది. బిడ్డ నిద్రపోయే విధము, రాత్రివేళ ఆహారము కోరటము మొదలయిన ఒకటి రెండు విషయాలు వైద్యుడు అడిగాడు. ఆయన సమక్షంలోనే దాసీని ఆమె అడగటము, అది సరిగా సమాధానము చెప్పలేకపోవటము జరిగింది. అందుకు ఆయన, "బిడ్డల విషయములో జబ్బుగా ఉన్నప్పుడయినా స్వయముగా గమనించాలండీ, నౌకర్లతో యీ పని కా"దని ఆయన అన్నాడు, ఆమెకు చాల అభిమాన మనిపించి వెంటనే వైద్యుని మార్చివేసింది.

ఆమె జీవితంలో భర్తతోటి సంభాషణలు సమావేశాలు అధికారితో ఇంటర్వ్యూ వలెనే ఉంటూ వచ్చాయి. ఆమె వచ్చినప్పటి నుంచీ ఆయన పద్ధతు లేమిటో ఆయన రుచులేమిటో తెలుసుకోవాలని ఆమెకు తోచనేలేదు. ఆ భవనములో ఆమెకు కొన్ని గదులు ప్రత్యేకము- ఆయనకు కొన్ని గదులు ప్రత్యేకము. ఆయన సేవకులు వేరు- ఆమె నౌకర్లు వేరు. అందువల్ల వాళ్ళిద్దరు ఒకరిని గురించి ఒకరు ఎరుగవలసినంత ఎరుగరు. జమీందారున కిప్పుడు అనారోగ్యము కలిగి రెండు సంవత్సరాలయింది. ఆరోగ్యము అభివృద్ధి చెందవలసినంత చెందలేదు. ఆమె ఆయన దర్శనము చేసి చాలా రోజు లయినది. వ్యాధిని గురించి ఆతురతతో ఆమె ఆయనను ఎప్పుడూ అడుగనూలేదు, అడిగినప్పుడయినా ఆయన సుముఖంగా జవాబివ్వనూ లేదు. ఒకరికొకరు మర్యాదలు చేసుకోవటము మన్నించుకోవటము మిగిలింది ఆ దంపతులకు

భర్త విషయములో ఆమె హృదయము ఇంతవరకు విచ్చని మొగ్గగానే ఉంటూవచ్చింది.

"సా కిం న రమ్యా, స చ కిం న రంతా
బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా"

మేదరి దంపతుల చర్యలు ఆమెకు మొదట విపరీతముగాను ఏహ్యముగా నూ కనబడి ఆఖరుకు హృదయానురంజకములయినవి!

మేదరి చెల్లమ్మ మనసు పరిపక్వమై అనురాగపూరితమయినది! తనదో....

తన జీవితఘట్టాలను సింహావలోకనము చేసుకుంటూ చెల్లమ్మ ముఖము చూస్తూ కూర్చున్న శకుంతలాదేవి, చెల్లమ్మ దగ్గర ఒక మనిషిని ఉంచి, చివ్వున లేచి జమీందారుని గదిలోకి చరచర నడచింది. తలుపులు దగ్గరగా వేసి సేవకుడు మంచము దగ్గరగా ఒరిగినాడు. నీరసించిన దేహముతో ఒత్తిగిలి పడుకొని ఉన్న భర్తను ఒక్కసారి ఆపాదమస్తకమూ వీక్షించినది. సేవకుని బయటికి పంపి, వారికి నిద్రాభంగము చేయలేక, కాళ్ళ దగ్గరగా స్థాణువువలె నిలిచిపోయినది.

కాలికి తగిలిన స్పర్శవల్ల జమీందారుకు మెలకువ వచ్చింది. అకాలములో దర్శనమిచ్చిన శకుంతలాదేవిని చూడగానే ఆశ్చర్యము కలిగిన దాయవకు, లేచి కాగితము కలము చప్పున అందుకొని "దొరసానిగారు యిట్లా వచ్చిన పని ఏమిటి? నౌకరులేమయినారు" అని వ్రాసి చూపించాడు. ఆమె అది చదువుకొని కన్నీళ్ళతో "నేను మీకు ఇక నుంచి 'దొరసానిగారిని' కాను, అర్ధాంగిని. మనయిద్దరి మధ్య ఇక నుంచి నౌకర్లు ఉండరు" అంటూ మోకరిల్లింది.

అత్యాశ్చర్యములో మునిగిపోయిన జమీందారునికి వెంటనే 'ఆఁ ఏమిటీ' అంటూ రెండేళ్లుగా నిలిచిపోయిన మాటలు తిరిగి రా నారంభించినవి.

*(1958లో దక్షిణ భాషా పుస్తక సంస్థవారి సంకలనం, "కథామంజరి"లో చేర్చబడి తెలుగు (కన్నడ, తమిళ, మళయాళ భాష లలోకి అనువదించబడిన కథ ఇది.)*



# కాగితపు పూలు

తోటలో ఒక ఏడాది బిడ్డను ఎత్తుకొని, అటూఇటూ తిప్పుతూ, నడుమ నడుమ గేటు దగ్గరకు వచ్చి చూస్తున్నది అచ్చమ్మ. కడుపునిండా అన్నము తిన్నా కంటి నిండా నిద్రపోయినా, కడుపులో బాధ పోవటములేదు. ఏమిటో అర్థముగాని బాధ, ఆవేదనా మనసులో.

తనను ఎంతో ప్రేమించిన యువకుని కూడా, ఆ మొలక కోసం, వదులు కుంది! తన నెంత ప్రేమించినా- సౌఖ్యమే కాని. సుఖము యొక్క ఫలితము వద్దని తోసిపారేస్తే ఏ మాతృ హృదయము భరించగలదు ?

బిడ్డ పుట్టక ముందే తానెన్నో సుఖస్వప్నాలను కన్నది. అట్లాంటిది కనం గానే, బిడ్డను—తన బంగారు తండ్రిని—మాయం చేశారు డబ్బు కక్కుర్తికి నర్సులు! ఎంతకైనా తెగిస్తారు!

నవమాసాలు మోసి కన్న పసిబిడ్డ కోసం పరితపించే హృదయాన్ని ఒక చేత్తో పట్టుకుని, పరాయిబిడ్డల సంరక్షణతో కొంతవరకు తృప్తిని కలిగించుకుంటు న్నది అచ్చమ్మ.

అయినా కడుపులోంచి వచ్చే ఆ బాధ, అర్థము కాని ఆవేదన పట్టలేదు హృదయాన్ని!

"అమ్మా, ఏమైనా తెలిసిందా బిడ్డ విషయమై? కొంతవరకైనా భోగట్టా చేయగలిగారా? మీ కడుపున పదిమంది కొడుకులు పుట్టాలమ్మా! మీ ఋణము ఏ విధముగా తీరుస్తానో" అని ఆత్రముతో పలుకరించింది, అప్పుడే కారు దిగిన శాంతను.

"తెలిసింది. అతి కష్టముమీద నీ బిడ్డ ఆచూకీ తెలిసింది. ఎక్కడుండేది కూడా చెప్పారు నర్సులు" అని కొంచెము సందేహంతో, పెదవి విరుస్తూ చెప్పింది శాంత.

"చెప్పండి. నా బిడ్డ ఎక్కడున్నాడో? నా తండ్రికోసం నా హృదయము కొట్టుకొంటోంది. చెప్పరూ? ఈ ఊళ్లోనే ఉన్నాడా? నా దేహంలోని ప్రతి నరమూ వాడికోసం పరితపించి పోతున్నది."

".... .... .... .... .... .... .... ...."

"చెప్పండి, ఆలస్యమెందుకు? నా కొడుకు- నా ప్రేమనిధి- నా నోముల పంట- నన్ను సుఖసాగరంలో ముంచితేలుస్తాడని స్వప్నాలను కంటున్నాను. మనోవీధిలో మేడలు కట్టున్నాను. నా బంగారు నాయన ఎక్కడున్నాడో చెప్పి, పుణ్యం కట్టుకోండి."

"అచ్చమ్మ! నీ కొడుకు....నీవు ఎత్తుకున్నవాడే! నా కొడుకని భయంతో, జాగ్రత్తగా, మాతృదేవతకంటె అధికంగా సంరక్షణ చేస్తున్నావే, వాడే నీకొడుకు. ముద్దుల జగదీశు నీ కొడుకే!" దడదడ కొట్టుకుంటున్న హృదయాన్ని ఒకచేత్తో అదుముకుంటూ, ఆయాసంతో, చెప్పలేకచెప్పలేక చెప్పింది.

"ఓసి రాక్షసీ, నానోట మట్టి కొట్టి, నాకన్ను మూసి నర్సులకు లంచమిచ్చి, నా బంగారు నాయనను దొంగిలించావా? ఏడాదినుంచి నా కడుపున చిచ్చుపెట్టిన మహాఇల్లాలవు నీవేనా? నీది మానవ జన్మమేనా?"

అచ్చమ్మ ఆవేశంతో నేలమీద విరుచుకుని పడిపోయింది. శాంత గజగజ వణికిపోయింది. భయంతో నాడులూ, నరాలూ క్రుంగిపోయినాయి. ఈ గడబిడలో ఆఫీసుకు వెళ్లిన రామమోహను రాడుకదా! అతడు వింటె కొంప మునిగిపోతుంది! తన జీవితంలో జరిగిన భయంకరమైన ఘట్టము ఒక్కసారిగా స్మృతికి తెచ్చుకుంది.

* * * *

కొత్తగా పెండ్లి చేసుకొన్న శాంతారామమోహనులు మూడునిద్రల సౌఖ్యము అనుభవిస్తున్నారు. బొంబాయికి తీసుకొనివెళ్లి వింతలూ, విశేషాలూ చూపిస్తున్నాడు. శాంతకు పెండ్లికొడుకు.

ఒకరోజు రాత్రి వెన్నెల్లో కూర్చుని——

"శాంతా, మన ఇద్దరి ప్రేమ శాశ్వతంగా ఉండేటందుకు ఒక కొడుకు పుట్టితే నా ధనమూ, నా కోరికలూ, నా ప్రేమా చరితార్థమవుతాయి. నా ప్రార్థన

లన్నీ ఫలిస్తాయి. నా యిష్టదేవతలు నాకు ఒక కొడుకును ప్రసాదించితే నా పితృ దేవతలంతా ధన్యులవుతారు ''

ఆ సందర్భంలో, పితృదేవతల తృప్తికోసం పిల్లల్ని కోరే రామమోహను మాటలు విని అరుచి అనిపించి, "ఇప్పటినుంచి పిల్లలయితే మన స్వేచ్ఛకు భంగం కాదూ ?'' అని మాత్రము అనగలిగింది శాంత.

సమయానికి ఆ మాట అన్నా రామమోహను మనస్సు గ్రహించినట్లే కన బడుతుంది శాంత. తనకొక కొడుకు పుట్టితే అమితంగా ప్రేమిస్తాడేమో తన పెని మిటి ! ఎప్పుడూ తోచదనుకుంటూ ఇటూ అటూ తిరుగుతూ ఉంటాడు. తన పెని మిటి ఛాయ—భర్తయొక్క ప్రేమ శాశ్వతంగా నిలిచే చిహ్నము—ఇద్దరి ప్రణ యపు రాశీ—నిజంగా పుట్టితే ఎంత ప్రేమిస్తాడో భర్త తనను ? అతనికి తెలియ కుండా ఒక నిట్టూర్పు విడిచింది శాంత.

* * * * *

ఆ రోజు సాయంకాలము రామమోహను ఆఫీసునుంచి తొందరగా ఇంటికి వచ్చాడు. భార్యాభర్తలు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ టీ త్రాగుతున్నారు.

నగముపూరీ నోట్లో పెట్టుకొని తింటూ, "ఇవాళ ఒక సంతోషకరమైన వార్త తెలిసింది, శాంతా ! నీకు ఆ సంగతి చెప్పాలని ఎంత జోరుగా కారు నడి పొననుకున్నావు ! కరాచీలో మా కంపెనీ బ్రాంచి ఒకటి ఉన్నది. అక్కడ దాన్ని వాళ్లు సరియైన పద్ధతులలో నడపకపోవటమువల్ల నష్టమువచ్చింది. అందునుంచి నన్ను అక్కడ కొంతకాలము పనిచేయమన్నారు. అంతే, ఏడాదికి తక్కువ కాకుండా. నీవు కరాచీ చూడలేదు కదూ ? నా స్నేహితులు చాలామంది నిన్ను తీసు కొని రమ్మని వ్రాస్తున్నారు ఇదివరకే. రెండూ కలిశాయి. ఒక వారంలోపల మనము వెళ్లాలి.'' బుజాలు ఎగురవేస్తూ చెప్పాడు.

"నేనా ? ఈసమయములో మీతోకూడా వస్తే, మీరు ఆఫీసుపని ఏం చేయ గలుగుతారు ? నాకు సేవచేయటమే సరిపోతుంది ఇంకా కొన్నాళ్లపాటు ఒంటరిగా మీరు—''

"ఏం ? నాతో కరాచీకి రావటాని కేం అభ్యంతరం ? ఈ అవకాశము నేను ఎన్నోదినాలనుంచి ఎదురుచూస్తున్నా. ఏందుకురావు ?''

కెంపెక్కిన చెంపలతో, సిగ్గుతో ఒకసారి కళ్లెత్తి మళ్లీ వాల్చింది శాంత, పెదవి కొరుక్కుంటూ మాట పెకలనివ్వక చిరునవ్వు నవ్వింది.

"నాతో చెప్పలేదేమి యిన్నాళ్లు" అంటూ ప్రణయ సముద్రములో ముంచి యెత్తాడు.

మాటమాత్రానికే అతనికి కలిగిన సంభ్రమమూ, తృప్తీ శాంతను ఉక్కిరి బిక్కిరి చేశాయి.

* * * * *

రామమోహనుకు ప్రతిరోజూ గంటలకొద్దీ కూర్చుని జాబులు వ్రాసేది శాంత. ఒక ఉత్తరం వ్రాయాలంటే ఎన్నో కాగితాలు వ్రాసి చింపేది. ఎన్ని వ్రాసినా తృప్తిలేక ఒక్కసారి ఫోనులో మాట్లాడేది.

అతడు కరాచీకి వెళ్ళిన ఆరు నెలలకు మగబిడ్డ పుట్టాడనీ, మాతాశిశువులు క్షేమంగా ఉన్నారని జాబు వెళ్ళింది.

ఇంక నిలువలేకపోయాడు. స్నేహితులందరికీ పార్టీ యిచ్చాడు.

"ఎప్పుడొచ్చి ఆ కొడుకును చూద్దునా" అనే ఉత్సాహం ఉద్రేకం కెరటం వేస్తూ ఉండేది మనసులో? పాపం ఆ ఉద్యోగానికి సెలవన్నా దొరకదు.

ఏం చేస్తున్నాడు, ఎట్లా ఉన్నాడు అన్న జాబులకు విధీ విరామమూ లేదు.

ఎన్నో దినాల నుంచి ఎదురు చూసిన రోజు వచ్చింది. తన ప్రణయ నిధిని చూపిద్దామని తాపత్రయపడుతున్న సమయం వచ్చింది శాంతకు. ఆ సాయంకాలము రామమోహను వస్తాడు. ఆ రోజల్లా తీరికేలేదు ఆమెకు. పిల్లవాడి మీద ముద్దుల వర్షము కురిపిస్తూ పాటలు పాడుకుంటూ గృహాన్ని కొత్తపద్ధతిలో అలంకరించింది ఆనందోత్సాహాలను పట్టలేకుండా ఉంది.

కొడుకుతో సహా స్టేషనుకు వెళ్ళి భర్తకు స్వాగతమిచ్చింది.

ఆనందబాష్పాలు తుడుచుకుంటూ కొడుకును ఎత్తుకుని ముద్దులాడాడు.

వాళ్ళిద్దరిని విడిచి ఒక్క క్షణమైనా ఉండలేదు.

*  *  *  *

భర్త కొడుకును ముద్దుపెట్టుకొనేటప్పుడు శాంత మనస్సంతా కలవరపడేది. వస్తూన్న కళ్ళనీళ్ళను అతి కష్టముతో ఆపుకొని ముఖము అవతలకు తిప్పుకొనేది

ఒకసారి రామమోహను కంటపడ్డవా దృశ్యము.

"కళ్ళ నీళ్ళెందుకు శాంతా? ఎంత ఆనందం అనుభవిస్తున్నావు? నీకేదయినా లోపమయితే నాకు చెప్పు" అని బుజ్జగించి అడిగాడు.

"ఈ సంతోషము—సుఖము—శాశ్వతమనుకున్నారా? భగవంతుడు అంతరాయము కల్పిస్తాడేమో! అంతవరకు ధన్యులమే" అంటూ కళ్ళు ఒత్తుకున్నది.

పైకి ఆ మాట అన్నా, అంతరాత్మ అహోరాత్రాలూ పీడిస్తూనే ఉండేది. తాను చేసిన ద్రోహము! తన పెనిమిటికి తాను కృత్రిమ సౌఖ్యము ఒక ద్రోహము వల్ల కల్పించింది! నిజంగా తనకే ఆ కొడుకు పుట్టినట్లయితే తనకెంత సంతోషంగా ఉండేదో?

కాని పాపం, ఆ తల్లి, ఆసుపత్రిలో పిల్లవాడిని కనపడకుండా చేస్తే, ఎంత తపించిందో?

కృత్రిమమైన తన మాతృ హృదయానికే ఒక క్షణము పిల్లవాడు కనబడక పోతే తోచదే? ఆ తల్లికో?

ఈ విధంగా పరుగులెత్తుతూ పరితపించే హృదయాన్ని పోగు చేసుకుంటూ తన జీవితంలోని గంభీరమైన రహస్యాన్ని భర్తకు తెలియకుండా కాలము గడుపుతున్నది శాంత.

*  *  *  *

జగదీశు సంరక్షణ కోసం నియమింపబడ్డ అచ్చమ్మ, తనకు పదాది క్రింద ఆసుపత్రిలో పుట్టిన బిడ్డను నర్సులు మాయం చేసిన విషయమై భోగట్టా చేసే షరతు మీద, పనికి కుదిరింది.

సంగతి సందర్భమంతా తెలిసిన తరువాత పై ప్రాణాలు పైన ఎగిరిపోయినాయి శాంతకు.

ఏం చేస్తుందో అచ్చమ్మ. ఆవేదన అనుభవించే మాతృ హృదయము ఎంతకైనా తెగిస్తుంది. అల్లరి చేసి పోలీసుల దాకా వెడితే కొంపలంటుకుపోతాయి అన్నిటికంటె ముందు రామమోహనుకు తెలిస్తే ఇంకేమయినా ఉందా?

రామమోహనుకు నిజం తెలిసిందంటే—ఎవరిని తాను తన రక్తపుముద్ద అని ప్రేమిస్తున్నాడో, ఆ వంశవర్ధనుడు తన బిడ్డడు కాడని తెలిసిందంటే భరించ గలడా?

తన కష్టసుఖాలు పంచుకుంటూ-తనకు వంశవర్ధనుణ్ణి ప్రసాదించింది శాంత అని మురుస్తున్న రామమోహనుకు, శాంత-వట్టి బూటకంతో-హృదయాన్ని కలచి వేసే నాటకానికి సూత్రధారిణి అయిందని తెలిపిందంటే, ఆమెకు మనిషికి విధించే శిక్ష విధిస్తాడా? కలలో మాట!

పోనీ—తనకు సహజమైన, ప్రకృతి సిద్ధమైన స్త్రీ విధిని పాలించటానికి ఏమైనా అవకాశము ఉందా అంటే, తాను తలక్రిందుగా తపస్సు చేసినా బిడ్డ తల్లి కాలేదని ఎంతమంది డాక్టర్లు చెప్పలేదు?

అచ్చమ్మకు డబ్బు ఆశ పెట్టింది. ఎప్పటికీ తన యింట్లో తన మాదిరిగానే ఉండమంది. ఏది కావాలంటే అది యిస్తానంది, ఆ బిడ్డను తప్ప,

ఆ బిడ్డ వచ్చిన తరువాత తననెంతో ప్రేమిస్తున్నాడు తన పెనిమిటి. అన్ని ఆశలు—అన్ని కోరికలు అడుగంటిపోవలసినదేనా ఆ దంపతులకు?

శాంత అచ్చమ్మను పిచ్చి ఆసుపత్రిలో చేర్పించింది. అచ్చమ్మ మళ్ళీ మామూలు స్థితికి రాజాలదని డాక్టర్లంతా చెప్పారు.

'జగదీశు నా కొడుకు, నీవు దొంగవు-రాక్షసివి' అని కనబడ్డ వాళ్ళందర్నీ తిట్టూనే ఉంటుంది అచ్చమ్మ.

రోజూ సాయంకాలము అచ్చమ్మను చూచి వచ్చిన తరువాత కడివెడు నీళ్ళకు ఏడుస్తుంది శాంత, తాను తన పెనిమిటి అమూల్యమైన ప్రేమను కాంక్షించి నంతవరకూ అచ్చమ్మ ఆవిధంగా ఉండవలసిందే కదూ!



# ఉదర నిమిత్తం

మధ్యాహ్నము సరిగా 12 గంటల సమయము. ఉమాసుందరి పెనిమిటిని ఆఫీసుకు పంపి చిన్న చిన్న పనులు చక్కబెట్టుకుంటున్నది. గదిలో బట్టలన్నీ చిందరవందరగా పారవేసే అలవాటు వెంకట్రావుకు. తన కెన్నిఅందిచ్చినా, ఎంత సరిపెట్టినా, ఆ గది రెండుపూటలూ తిరిగి సర్దవలసిందే. ఇవన్నీ సర్దుకొని ఉమా సుందరి భోజనానికి ఏర్పాట్లు చేసుకుంటున్నది. పళ్లెం పెట్టుకొని పీట వేసుకుంటుం డగా 'గోవిందా' అన్నమాట వినబడింది. తానుతప్ప ఎవరూలేని ఆయింట్లో మారుమనిషిమాట వినబడేసరికి ఉమాసుందరి ఉలిక్కిపడింది. జుట్టు విరబోసుకొని, పట్టెనామాలతో - కాషాయవస్త్రాలతో - నల్లటి ఆజానుబాహువు, చేతిలో పళ్లెము దాంట్లో తిరుపతి పట్టెనామాల చెంబు పెట్టుకొని-నిల్చున్నాడు గడపకు ఎదురుగా, ఉమాసుందరి కెవ్వన కేకవేసి గోడ నానుకొనిపోయింది. ఆ కేకతో క్రింద చెట్ల దగ్గర కూర్చున్న బోయవాడు వచ్చాడు సంగతేమిటో కనుక్కుందామని.

"నాకు వేంకటరమణుడు కలలోకి వచ్చి, మీ ఇంటివైపు చూపించి. ఇక్కడినుంచి ఆరగింపు, తేరుగట్టటానికి ధోవతి, కర్పూరము వెలిగించటానికి- డబ్బులు తీసుకురమ్మన్నాడు. వేంకటేశ్వర్లు ఆజ్ఞ ఇచ్చాడు. తీసుకురా" అంటు న్నాడు అధికారంతో.

సుందరి నిర్ఘాంతపోయింది. తమ దగ్గర్నుంచి ఆరగింపా వేంకటేశ్వర్లకు! ఎట్లా? ఇంట్లో ఆరాత్రికి బియ్యము లేవు. అక్కడికి ఆ పూటకే బదులు వ్యవహార మయింది. తాను వడ్డించుకున్న అన్నము తప్ప ఇంక ఒక్క మెతుకయినా లేదు. తాను వడ్డించుకొన్నదయినా తనకు తప్ప మరొకరికి పనికిరాదు; వెంకట్రావు భోజ నము చేసిన పళ్లెములో తినే అలవాటు తనకు, ఈ యోచనతో సుందరి, అలాగే, గోడనానుకొనే చూస్తున్నది.

"ఏమి! ఆలోచిస్తున్నావా? వేంకటరమణునికి ఆరగింపుచేయవూ?" అంటూ చెయ్యి విసిరాడు దగ్గరికి రమ్మని. భయపడుతూ సుందరి రెండడుగులు ముందరికి

వేసింది. చేతిలో ఇంత విభూతి నలిచి వేస్తూ, "ముఖానికి పెట్టుకో. ఆలోచిస్తావా, వేంకటేశ్వర్లకు కోపము వస్తుంది. తీసుకురా" అని ఆజ్ఞాపించాడు. సుందరి గజ గజ వణుకుతూ అతని ముఖము చూసింది. చెంపకు ఇటువైపునుంచి పొడుచు కొన్న ఇనుపచువ్వ అటువైపుకు వచ్చింది। భయంకరంగా ఉంది దృశ్యము. ఇవ్వకపోతే ఏంచేస్తాడో। ఇస్తే నిష్కారణంగా తాను పస్తుపడుకోవాలి। వెంటనే తిరిగి, బోయివంక చూస్తే వాడు సాష్టాంగపడ్డాడు ఈ వేంకటేశ్వర్లముందర। ఏమీ తోచనిస్థితిలో ఆ పళ్లెము తెచ్చి ముందర పెట్టింది. ఇత్తడి పళ్లెములో అన్నముపెట్టి ఇవ్వాలని మనసులో ఉంది. కాని ఇంతలోకి పళ్లెం మారిస్తే ఏం చేస్తాడోనన్న భయమువేసింది.

"తేరు కట్టటానికి ధోవతి తీసుకురా, పట్టుది-జరీ అంచులది. వెంకటేశ్వర్ల అనుగ్రహం పొందుతావు. యోచన చేయకు." ఆజ్ఞాపిస్తున్నాడు.

కాలు కదపటానికి సుందరికి ధైర్యములేదు; అసలు సాగటం లేదు. గజ గజ వణికిపోతోంది. వెనుకకు నడుచుకుంటూపోయి, తన పెండ్లిలో పెట్టిన జరీ అంచుల ధోవతి-వెంకట్రావుది-తెచ్చి యిచ్చింది.

"ఊఁ కర్పూరం వెలిగించటానికి డబ్బులు"

కొంగుకు ముడి వేసుకొన్న అయిదు రూపాయలు ఇచ్చేసింది, కొంత అట్టిపెట్టుకునే ధైర్యం లేక.

"ఇస్తున్నావు గాని నీ మనసు ధరించటము లేదు. జ్ఞాపకము చేసుకో వెంక టేశ్వర్లను. 'గోవిందా' అనండి" అంటూ మెట్లు దిగి సాగిపోయాడు.

అసలు సుందరికి నెలదినాల నుంచి ఆరోగ్యము సరిగాలేదు. ఏమిటో నల తగా ఉంటున్నది. అందులో రేషనింగు భోజనము సరిపడటము లేదు. ఆ భయా నక సంఘటనకు పాపమామె ఒళ్లు తిరిగి పడిపోయింది. సాయంకాలము నాలుగు గంటలకు వెంకట్రావు వచ్చేసరికి వంట యింట్లో ఎక్కడి సామాన్లు అక్కడే పడి ఉన్నాయి. సుందరి పెద్ద జ్వరముతో ఒళ్లు తెలియకుండా పడి ఉంది. పిలిచినా పలికే స్థితిలో లేదు. బోయిని పిలిచి, "ఏమిటి ఇదంతా" అని అడిగాడు. వాడు చెప్పినది వింటుంటే, ఎంతో సేపటికి గాని వెంకట్రావుకు విషయము తలకెక్క

లేదు. హోటలు నుంచి వేడి వేడి కాఫీ తెప్పించి త్రాగించి కూర్చోపెట్టాడు సుందరిని.

"ఏమిటి సంగతి, ఏమి జరిగింది?" అని అడిగాడు.

మళ్ళీ చెమటలు పోశాయి సుందరికి. ఉదయము జరిగిన సంఘటన తిరిగి కళ్ళకు కట్టినట్లయింది. కెవ్వున కేక వేసింది. ఈసారి సుందరి ముఖము చూసి వెంకట్రావుకు భయము తోచింది. చెమటలు తుడుస్తూ అడిగాడు. "వాకిట్లో ఎవరు వచ్చేది చూడకుండా బోయవాడు ఏం చేస్తున్నాడు? ఆ వచ్చినవాడిని చూసి భయ పడ్డావా?"

"అసలు వాడిని చూడగానే నా ప్రాణాలు పైకి ఎగిరి పోయాయి. దబా యించి బెదిరిస్తూ, నిలబెట్టి. అన్నీ తీసుకున్నాడు." మాటతడబడుతూ చెప్పసాగింది.

"అయితే ఏమేమి ఇచ్చావు?"

"మీరు భోజనము చేసే పళ్ళెము, మీ పెళ్ళినాటి సేలము ధోవతి నా చేత బలవంతంగా ఇప్పించుకున్నాడు. అదేమిటో ఇనుపవుల్ల ఒకటి చెంపమీద అటు నుంచి ఇటు వచ్చేలా పొడుచుకున్నాడు. దాన్ని చూసేసరికి నాకు భయం వేసింది. 'తీసుకురా, తీసుకురా' అన్న గద్దింపులతో అన్నీ వసూలు చేశాడు. నల్లటిముఖము మీద పంగనామాలు- భయంకరమైన ఎఱ్ఱని కళ్ళ అబ్బా!" అంటూ కళ్ళు రెండు మూసుకుంది.

బోయి తలవాచేటట్లు చివాట్లు తిన్నాడు. "నీవూ వాడు కలిసి ముందర మాట్లాడుకున్నారా ఏమిటి? లేకపోతే ఇంత కథ నడుస్తుంటే చూస్తూ ఊరుకున్నావా? నిన్ను పోలీసులకు పట్టిస్తే సంగతంతా బయటపడుతుంది" అన్నాడు వెంకట్రావు.

"దొరా, నన్ను ఏం చేసినాసరే. నేను సిద్ధంగా ఉన్నాను. కాని ఆ సమ యంలో-నేను కాదు-మీరయినా అదేపని చేస్తారు, వాడిమహిమ! 'వెంకటరమణా, గోవిందా' అనగానే ఏమి తోచదు. చేతులు రెండూ వాటంతట అవే కలుసు కుంటాయి" అన్నాడు.

"నీవు ప్రతివాడిని లోపలికి ఎందుకు రానిస్తావు. ముందు ఈ మాటకు జవాబు చెప్పు" అన్నాడు వెంకట్రావు

"అమ్మగారితో వెంకట రమణ యిచ్చిన ఆదేశము చెప్తానన్నాడు. 'నన్నడ్డు పెట్టావా' అని కళ్లు తెరిచాడు. నేనేం చేసేది? నాకు అక్కడికే కాళ్లు వణికి పోయాయి" అన్నాడు, చేతులు నులుపుకుంటూ.

"సరేలే నీ కవిత్వము బాగుంది" అంటూ వెంకట్రావు గొణిగాడు.

*  *  *  *

ఆ రోజు శుక్రవారము. వెంకట్రావు ఉదయము కాఫీ త్రాగి బజారుకు బయలు దేరాడు. ఇద్దరు స్నేహితులు త్రోవలో కలసి మాట్లాడుతూ, ఫస్టేమైదానం దగ్గరకు తీసుకువెళ్ళారు. అక్కడ చౌరస్తా మీద నిలబడి మాట్లాడుతూ, ఒక గంట కాలం గడిపి హోటల్లో ఫలహారము చేశారు. వాళ్ళను అటునుంచి పంపి, తాను ఇంటికి వస్తుండగా, ఒక బైరాగి 'మహరాజ్' అని పిలిచాడు 'ఏ'మని వెనుకకు తిరిగి చూశాడు వెంకట్రావు భవిష్యంలో జరుగబోయే ఒకటి రెండు శుభాలు చెప్పి "మహారాజ్ ఒక గురిగింజకు రెండు గింజల ఎత్తు బంగారము చేయగల విద్య నాకు వచ్చు. పరీక్ష చేస్తారా? కొంచెము ఇస్తే ఎహాము చూపిస్తాను. మీది మీరు తీసుకుందురుగాని" అన్నాడు. ఏ ధ్యాసలో ఉన్నాడో వెంకట్రావు తన వేలి ఉంగరము తీసి యిచ్చాడు. అక్కడే– పెద్దరోడ్డుకు ఆనుకొని ఉన్న కాలిబాట మీదనే– తన జోలెలో ఉన్న చిన్న కుంపటి తీసి మంట పెట్టాడు. ఆ మంటలో ఉంగరం వేసి ఏదో పొడి చల్లాడు. దానితో అపరిమితమయిన పొగ లేచి ఒకరి కొకరు కనబడకుండా అయిదు నిముషాల పాటు గడిచింది. కళ్ళు మూసుకుంటూ తెరుచుకుంటూ పొగ ఉధృతము తగ్గిన తరువాత వెంకట్రావు చూస్తే ఏమున్న దక్కడ? పొగతో పాటు బైరాగి కూడా వెళ్ళి ఉంగరముతో మాయమైనాడు.

తన యింట్లో జరిగిన దానికే బుద్ధిమాంద్యాము వల్ల ప్రాపంచక జ్ఞానము లేకపోవటం వల్ల అంతపని జరిగిందని అనుకున్నాడు! కాని తానెందుకు భ్రమిం చాడు? సరిగా నెల కాలేదు. ఇంతలో రెండు మోసపు సంఘటనలకు తన సంసా రము గురి అయింది!

కొన్నాళ్ళ తరువాత వెంకట్రావు క్లబ్బులో స్నేహితులతో మాట్లాడుతూ కూర్చున్నాడు ఒక ఎర్ర సైకిలు వచ్చి ఆగింది గేటు దగ్గర. 'శ్రీధరరావు వకీలు, టెలిగ్రాము' అంటూ వచ్చినవాడు ఒక కవరు ఇచ్చాడు వెంకట్రావు ప్రక్కన కూర్చున్న సభ్యుడు 'నేనే' అంటూ లేచి వెళ్ళి అందుకున్నాడు. టెలిగ్రాము వచ్చిందనగానే మంచి చెడ్డలు తెలుసుకోవాలని అందరూ అతని చుట్టూ మూగారు. "ఏమీ లేదండీ మా వాళ్లు పుట్టింటి నుంచి వస్తున్నామని టెలిగ్రాము యిచ్చారు" అని చాలా సామాన్యమైన విషయముగా జవాబిచ్చాడు. తిరిగి ఎవరి ఆటలలో వాళ్ళు నిమగ్నులయారు.

"రెండు నెలల నుంచి ఇక్కడ లేని వాళ్ళు వస్తామని టెలిగ్రాము యిస్తే దిగులుగాచూస్తావెందుకయ్యా సంతోషపడక" అంటూ చనువుగామెలిగే స్నేహితు డొకాయన పలికించి అడగటము ప్రారంభించేసరికి శ్రీధరరావుకు నిజంగా బిక్క ముఖము పడింది. ఒకరి తరువాత ఒకరు అందరూ, ఆయన వంకకే తిరిగి వేధించటము మొదలుపెట్టారు. ఇక గెలువజాలక "ఉన్నదేమిటో చెప్తా"నంటూ ఒక బల్లమీద కూర్చున్నాడు. ఆ మాటలు వినటానికి అందరు చెవులు దోరగిల పెట్టుకొని కూర్చున్నారు.

"చూడండి, మొన్న మధ్యాహ్నం నేను నా గదిలో పడుకొని ఉండగా తలుపు నెట్టిన చప్పుడు వినబడింది. ఆ కలత నిద్రలో మా పెద్ద అబ్బాయేమో అనుకుని 'తలుపు వెయ్యరా' అని అటు ఒత్తిగిలి పడుకున్నాను. 'అంబః కాళిః వచ్చిం'దని ఒక కేక వినపడ్డది కళ్లు తెరచి చూతును గదా, ముఖానికి రూపాయంత బొట్టుపెట్టుకొని, చేతిలో త్రిశూలము పట్టుకొని కాషాయ వస్త్రాలతో-నల్లటి మనిషి-ఎర్రటి కళ్ళతో ఒక ఆడది ఎదురుగా వచ్చి నిలబడింది. నేను కలతనిద్రలో లేచాను కనుక- ఈ దృశ్యము కనడగానే నిద్రావస్థ అయినదీ, జాగ్రదవస్థ అయినదీ తెలుసుకోలేకి చెయ్యిమీద గిల్లి చూసుకున్నాను. ఇక చూడండి; ముత్తైదువకు బొట్టుపెట్టి తాంబూలమియ్యమని ఆజ్ఞాపించి, నాకెటు తోచకుండా చేసి, చివరకు మా ఆవిడని వెంకటగిరి జరీచీరె, కుంకుమభరిణ తీసుకువెళ్ళింది. ఇచ్చేవరకు గద్దించి భయపెట్టటమాయెను! ఇప్పటి వరకూ నేను ఎందుకు అట్లా ఇచ్చానా అని నాలో నేనే తర్కించుకుంటాను. అక్కడే-ఆ తలుపుమూలే- రెండు చేతి కర్రలున్నాయి. నేనయినా బలహీనుణ్ణి కాదుగదా. దాన్ని ఎదిరించగల ఉపాయాలు సాధనాలు ఉండి కూడా ఏమి గతి పట్టిందని ఆలోచిస్తున్నాను" అన్నాడు.

ఇది విని కార్యదర్శి అన్నాడు. "వాళ్ళ దగ్గర ఏదో కనికట్టు ఉంటుందండీ. ఒక విధంగా మెస్మరిజమ్ అనుకోవాలి మనము. తెనాలిలో మా బావమరిది బుట్ట లల్లుతూ వచ్చిన ముష్టిదాని వెంబడి నాలుగుమైళ్లు నడుచుకుంటూవెళ్లి, గుడిసె ముందరగా ఒక మంచముమీద కూర్చున్నాడు. ఎంతమందివెళ్లి రమ్మన్నా కదల లేదు. పంపమంటే, 'వస్తే తీసుకెళ్లండి' అంటుంది. చివరకు దాని చేతిలో అయిదు రూపాయలు పెట్టేసరికి, 'వెళ్లవయ్యా వెళ్లు మీవాళ్లు వచ్చారు' అని అన గానే మావెంట వచ్చాడు. 'ఏమిటో వెళ్లామనిపించింది దాని వెంబడి' అంటాడు. తరువాత అడిగితే" అని తన అనుభవము చెప్పాడు కార్యదర్శి.

రాత్రి తొమ్మిదయింది. అంతా లేచారు ఇళ్ళకు వెళ్ళటానికి. వెంకట్రావు సైకిలు మీద ఇంటికి వెళ్ళటానికి త్రోవతీసాడు. రెసిడెన్సీ కోఠీ గల్లీలో-ఆ చీకట్లో వెంకట్రావుకు ఏవో మాటలు వినబడినాయి.

"మన సంపాదన బాగానే ఉంది కదూ సత్తీ. ఈ వారంలో ఒక వెండి పళ్లెము, ఒక జరీచీరె, ధోవతి. పళ్లెము ఇంకో ఊరు వెళ్లాక అమ్మివేద్దాము. చీర నీవు కట్టుకో-ధోవతి నేను కట్టుకుంటాను. ఏం? పెళ్ళయిన తరువాత మనమింత బట్టలు కట్టుకోలేదు కదూ!" అని ఒక గొంతు. "ఎట్లాగయినా ఇంతో అంతో చదువుకున్న తెలివాయెను. ఉద్యోగము చేసినా ఇంత కంటె ఎక్కువ సంపాయిద్దురా" అని ఇంకో గొంతు వినబడింది.

పట్నవాసులందరినీ మోసగిస్తున్న దంపతులు వీళ్ళేనేమోనని వెంకట్రావు సైకిలు వెనక్కు త్రిప్పి మరో గంటకు ఇద్దరు పోలీసులతో వచ్చేసరికి, వాళ్ళ తాలూకు గుడ్డపీలికయినా అక్కడ లేదు.



# సప్తమ భావం

సాయంకాలమయింది, స్కూలు నుంచి పిల్లలు ఇండ్లకు వస్తున్నారు. కచేరీలకు వెళ్ళిన వారంతా తిరిగి వచ్చారు. కాని 'గౌతమ్‌నివాస్' ప్రాంగణంలో రెండు కుర్చీల మీద కూర్చుని ఉన్న ఇద్దరు వ్యక్తులు జ్యోతిషగుణకారము చూస్తూ చీకటి పడుతున్నా అలాగే కూర్చున్నారు. చూస్తుండగానే సూర్యుడస్తమించాడు. చీకట్లు నలుప్రక్కలా అలుముకుంటున్నాయి. దృష్టి సౌకర్యము కోసము పెట్రోమాక్సు తెప్పించుకున్నారు. తలలు వంచుకొని తిరిగి గుణకారము మొదలుపెట్టారు. ఎనిమిదయింది. వాళ్లు అక్కడి నుంచి లేవలేదు. తొమ్మిది....పది....గంటలయింది. లేవనేలేదు.

''భోజనాలకు లేస్తారా'' అని భయంతో గేహిని నిదానంగా అడిగింది. దానితో కూర్చున్న వాళ్లిద్దరికి మెలకువ వచ్చినట్లయింది. ఇద్దరూ తలలెత్తి, 'లేస్తున్నా'మని అంటూ ఒకరి ముఖము ఒకరు పరకాయించి చూసుకున్నారు.

''ఏదయినా మార్పు కనబడిందా శాస్త్రిగారూ'' అని వాసుదేవరావు గారు ఆందోళనతో ప్రశ్నించారు.

''లేదు బాబూ, ఎన్ని లెక్కలు వేసినా అదే సారాంశము తేలుతున్నది'' అంటూ శాస్త్రిగారు పంచాంగములన్నీ కలిపి కట్ట కట్టుకున్నారు.

''మా వాడు పుట్టిన ఏడు అధిక మాసము వచ్చింది. అది చూసుకున్నారా?''

''ఆహా! అది చూడకుండా కుండలి ఎట్లా వేస్తాను?''

''గుంటూరులో మా అబ్బాయి జననమయింది. అక్కడి పంచాంగములోని ఘడియ విఘడియలలోని విభజన చూశారా?''

''అవన్నీ చూడకుండా పని ప్రారంభము చేస్తానా?'' అంటూ శాస్త్రిగారు లేచారు.

"అయినా నేను కూడా చూస్తాను. నా దగ్గర కొన్ని ఇంగ్లీషు పుస్తకాలు ఉన్నాయి. ఆ గుణకారము ప్రకారము కుండలి వేసి చూస్తాను. దాని ప్రకారము ఫలితాలు ఎలా ఉంటాయో చూద్దాము" అంటూ కళ్లజోడు తీసి కేసులో పెట్టి వాసుదేవరావుగారు లేచారు.

"చూశారూ! కష్టసుఖాలు ప్రతి జాతకుడికి ఉంటాయి. వాటిని ఎవరూ తప్పించలేరు. కాని జాతకములో వ్రాసినట్లు మారకము అని ఉన్నచోట గండమయినా వచ్చితీరుతుంది; ప్రాణం పోయినంత పని జరుగవచ్చు. ఆ సమయాన తాత్కాలిక గ్రహాల మార్పు, వాటి ప్రత్యేక వీక్షణాలవల్ల కొంచెము వ్యత్యాసంగా, ఎక్కువ భేదము లేకుండా జరుగవచ్చు. అబ్బాయిగారి జాతకములో సప్తమ భావమున్నదే దానిలో కుజుడున్నాడు. కళత్ర మారకభావాన్ని ఇంకా ఎన్నో బలపరుస్తున్నాయి. అసలు కళత్రము యొక్క జాతకాన్ని కూడా పరిశీలించి చూడాలి, ఒక్కొక్కసారి భార్యాభర్తల జాతకాలు రెండింటిలోను ఈ భావమే తటస్థించితే ఒక దాని పీడను ఇంకొకటి కొట్టివేయవచ్చును. ఎందుకు చెప్తున్నానంటే, 'వ్రాసినట్లుగా జరుగలేదేమయ్యా!' అని మీవంటివారు ప్రశ్నించవచ్చును, అక్షరాలా జాతకము వ్రాసినట్లుగా జరుగకపోయినా....ఛాయా మాత్రంగానయినా జరుగుతాయనుకోండి. నేనే నెల్లూరిలో ఒకరికి జాతకము వ్రాశాను. జాతకములో సంతానమని ఉన్న కాలములో అతని భార్యకు గర్భస్రావము జరుగుతూ వచ్చిందట. 'చాలా విషయాలు వ్రాసినని వ్రాసినట్లు జరిగా'యని వ్రాశాడు. అయితే నేను కూడా యీ మధ్య పట్టుదలతో ఏ జాతకము చూడలేదు. మీకు కూడా అందులో ప్రవేశమున్నది కనుక మీరు కూడా చూడండి నేను సెలవుతీసుకుంటా"నంటూ శాస్త్రిగారు గేటుదాటి వెళ్ళారు. వాసుదేవరావుగారు భోజనానికి లేచారు.

ఆ తరువాత రెండు దినాలు తన జ్యోతిషవిద్యనంతా వినియోగించి కుండలి వేసి చూశారు వాసుదేవరావుగారు. ఫలితాలను చూస్తే ఏమున్నది? ప్రాక్పశ్చిమ జ్యోతిషశాస్త్రాలు కలువక గుణించిన కొద్దీ కొత్త కొత్త అనుమానాలు బోలెడు బయలుదేరి మనిషిని కలవరపరిచాయి.

వాసుదేవరావుగారి కుమారుడు వివేకానందుడి వివాహాన్ని గురించి ఒక పెద్ద సమస్య అయిపోయింది. వేలకు వేలు కట్నాలు తీసుకొని, ఎంతో ఖర్చుచేసి పెండ్లిచేస్తే, కాపురానికి రాకపూర్వమే ఒకరు, రెండు నెలలు కాపురముచేసి ఒకరు,

ఇద్దరు కోడళ్లు పోయినారు, పాపము ఆ వృద్ధ దంపతులకు కోడలి మీద మనసు తీరనేలేదు. పిల్లవాడికి పాతిక ఏళ్లు రాకముందే మూడవపెండ్లి అవసరము తటస్థ పడ్డది.

అ ఊళ్ళోనేకాదు-చుట్టుప్రక్కల గ్రామాలలో కూడా పుకారు బయదేరింది. 'ఫలానా వారికి ఒక్కడే కొడుకు—ఆస్తి బాగానే ఉంది; లా ప్యాసయి ప్రాక్టీసు చేస్తున్నాడు-కాని అతనికి భార్యలు దక్క'రని, ఏనోట విన్నా ఈ గుసగుసలే.

వృద్ధదంపతులకు ఇది తీరని ఆవేదనగా పరిణమించింది. ముద్దుగా కోడలు కాపరానికి రావటము-మనుమలు మనుమరాండ్రు పుట్టటము-తామీ వయసులో పిల్లలతో కాలక్షేపము చేయటము పోయి బ్రహ్మచారివలె ఉన్న కొడుకును చూస్తూ వాపోవలసి వచ్చినందుకు క్రుంగిపోతున్నారు.

ఇప్పుడాయింట్లో పెండ్లిమాటే లేదు!

* * * * *

ఉదయము లేచి కాలకృత్యాలు తీర్చుకొని భోజనము చేసి కోర్టుకు వెళ్ళటము- ఇంటికివచ్చి ఉపాహారానంతరము టెన్నిసుకు వెళ్ళటము-ఇంటికి రావటము-భోజనము-నిద్ర-మార్పులేని కార్యక్రమము వివేకానందుడికి విసుగుపుట్టించింది.

అవి బొంబాయిలో రేస్ దినాలు. కోర్టుకు క్రిస్మస్ సెలవులు! వివేకానందుడు తన స్నేహితులను కొందరిని ప్రోత్సహించి బొంబాయి ప్రయాణము తలపెట్టాడు.

ఆ పది దినాలలో కొన్ని వందలు ఖర్చయినా అతని మనస్సు చాలా ఉత్సాహము పొందింది. తిరిగి వచ్చిన తరువాత చురుకుగా కోర్టుపనులు చూసుకుంటున్నాడు

సరిగా ఆ సమయములోనే వాసుదేవరావుగారి రెండవ చెల్లెలు, అన్నగారిని చూడాలని, వచ్చింది. ఆమె బాలవితంతువు. అత్తమామల దగ్గర, బావమరదుల దగ్గర అణగి మణగి బ్రతికిన బ్రతుకు ఆమెది. ఎక్కడయినా ఇట్టె అతికి పోయే మనిషి. ఏ బంధువుల యింటికి వెళ్ళినా పని భారము వహించి ఇల్లంతా దిద్దుకొని

పోతూ ఉండటమువల్ల 'ఈమె వెళ్ళితే ఎట్లా' అనుకుంటారు. ఆ విధంగా ఆమె ప్రతి ఇంటికి వస్తూ సౌఖ్యము ఆనందము, వెళ్ళుతూ భారము వియోగవిచారము కలిగిస్తూ ఉంటుంది. ఒకరి తరువాత ఒకరు. బంధువులందరు దరఖాస్తులు పెట్టు కుంటూనే ఉంటారు పురుళ్ళకు పెళ్ళిళ్ళకు రమ్మని.

వివేకానందుడికి బొంబాయి నుండి వచ్చిన దగ్గర్నుండీ, ప్లీడరు వృత్తి మానేయాలనీ బొంబాయిలోనే ఏదో ఉద్యోగము చేయాలనీ. ఏదీ లేకపోతే వ్యాపారము చేయాలనీ ఆలోచనలు కలుగుతున్నాయి. ఈ ఆలోచనలు మేనత్తను చూసిన దగ్గర నుండి వేళ్ళు పారినాయి, ఒక రోజు తండ్రి దగ్గర యీ విషయము కదలించి, తల్లి చెవినివేసి, మేనత్తతో దృఢ నిశ్చయముతో చెప్పేశాడు.

వృద్ధులకు ఈ పథకము ఏ మాత్రము నచ్చలేదు. జీవిత సంధ్యలో కొడుకుతో ఎడబాటుకు వాళ్ళిద్దరు తమ అసమ్మతి వెలిబుచ్చారు. అయినా వివేకానందుడు పట్టు పట్టనే పట్టడు, పట్టితే విడవడని అందరికీ తెలుసు. రోజుకొకసారి యీ విషయము కొడుకు ఎత్తటము వృద్ధులు సంకటపడటము చూసి ఒకనాడు వాసుదేవరావుగారి చెల్లెలు-

"పోనీ వాడి సరదా తీర్చండి అన్నయ్యా! ఒక ఏడాది చూద్దాము. ఈ రోజుల్లో వాడి.ంటి మనిషి కనబడటమే అరుదుగా ఉన్నది. ఇంతవరకూ వాడు అనుకున్నట్లుగా ఈ ఒక్క విషయములో పోనీయండి. మీరు ఒంటరిగా వుండకుండా నేను కూడా ఉంటాను" అని మేనల్లుడి ప్రయాణానికి ఏర్పాటు చేసింది.

ఏడాదిలో రెండుతడవలు వచ్చి చూశాడు వివేకానందుడు. తమ కెంత కష్టంగా ఉన్నా కొడుక్కు ఉత్సాహభంగము చేయటము యిష్టములేక సంతోషం కనబరచేవాళ్లు తల్లీ తండ్రీ.

* * * * *

ప్రతిరోజూ సాయంకాలము నాలుగు గంటలకల్లా బయట వరండాలో- కుర్చీల మీద కూర్చుని-టపాకోసము ఎదురు చూసే వాళ్లు, ఈసారి వివేకానందుడి దగ్గర నుండి జాబు వచ్చి పది దినాలకు పైగా అయింది. పాపమా తలిదండ్రులకు ఆదుర్దావల్ల దినమొక యుగంగా ఉంటున్నది. అందులో తల్లి ప్రాణము ఉండలేక

గుమాస్తాను వెళ్ళి చూసి రమ్మని పంపింది. అతడు చేరకముందే వివేకానందుడి దగ్గర నుంచి ఇద్దరు మనుష్యులు ఉదయము ఎనిమిది గంటల రైలులో దిగారు.

వచ్చినవాళ్ళలో ఒకతె ముసలమ్మ. ఇంకొకాయన నడివయస్సుమనిషి; మూడవవ్యక్తి నెల నిండీ నిండని పసిబాలుడు! వివేకానందుడు వీళ్లతో ఒక ఉత్తరము పంపాడు. ఉత్తరము చేతులో పట్టుకొని వాళ్లు ఎవరయినదీ, ఎక్కడనుంచి వచ్చినదీ, ఎవరింటికి వచ్చినదీ వాళ్ళద్వారానే తెలుసుకోవాలని. వాసుదేవరావుగారు ఎంత ప్రయత్నించినా వివరాలు తెలియలేదు. ఉత్తరము వివేకము వ్రాసినదేగాని ఆ మనుష్యులను వివేకము పంపాడంటే ఆయన నమ్మలేకపోయాడు.

'తన స్నేహితుడిభార్య బిడ్డను విడిచి చనిపోయిందనీ, అతనికెవరూ దిక్కు లేనందువల్లను, అతని దుఃఖము చూడలేకపోయినందువల్లను, ఆ బాలుడి భారము వహించవలసి వచ్చిందనీ. ఆ పసివాడి పెంపకమువల్ల తంలిదండ్రులకు మంచి కాలక్షేపమని భావించి తమదగ్గరికి పంపుతున్నాననీ, తనను క్షమించి తన మాట నిలబెట్టవలసినదనీ' మరీమరీ వ్రాశాడు.

అది చదువగానే దంపతులకు ఒక్కసారే వివేకానందుడిమీద కోపము వచ్చింది. దానితోపాటు ఆశ్చర్యము, విసుగు కలిగాయి. తాను దగ్గరలేని లోటు యీ పిల్లవాడు తీరుస్తాడన్నట్లుగా-ఎవరిపిల్లవాడివో, అనాథను-కాటికి కాళ్లు చాచుకొనిఉన్న వృద్ధుల దగ్గరికా పంపటము? కృష్ణా రామా అనుకుంటూ కూర్చునే సమయంలో-తమచేత బలవంతంగా అనాథ సంరక్షణ కొడుకు చేయిస్తున్నాడా? తమకీ అవకాశము కల్పించానని సగర్వంగా వ్రాసినట్లు ధ్వనిస్తున్నదే ఉత్తరములో? మతిగలవాడేనా వివేకానందుడు?

దంపతులిద్దరూ ఒక్కసారే గ్రీష్మభానుడిపలె చరచర లేచారు. "ముష్టి పిల్లవా డెవరట! కప్పినబట్ట తియ్యి! పంపినవాడికీ, తీసుకొచ్చిన వాళ్ళకూ ఏమైనా జ్ఞానమున్నదా?" అని వాసుదేవరావుగారు దగ్గర నిలబడి. ముసలమ్మను గద్దిస్తున్నారు.

ముసలమ్మ వణికిపోయింది! కంపిత హస్తములతో బాలుడిమీద బట్ట తొలగించి, వాసుదేవరావుగారివైపు ఒకసారి బాలుడివైపు ఒకసారి చూడటము మొదలుపెట్టింది. వచ్చిన రెండవమనిషి ఉగ్రాకృంతుడై చూస్తున్నాడు

ఏదో అందామని తెరచిన వాసుదేవరావుగారి నోరు అట్లా తెరచుకొని పోయింది ఆ బాలుని చూడగానే! శరచ్చంద్రునివలె పదహారు కళలతో పౌత్తిళ్ళలో వెలుగుతున్నాడు. నల్లని ముంగురులతో పద్మపత్రాలలాంటి కళ్లనువిప్పి దృష్టినిలిపి వృద్ధులని తేరిపార చూస్తున్నాడు.

ప్రథమవీక్షణముతోనే ఇద్దరికి నాభిదగ్గరనుంచి అవ్యాజానురాగాలు ఉద్భవించి హృదయముదాకావచ్చి నిండి, పైకి ఉబికినవి!

ఆ బాలుడు వాళ్లమీద సమ్మోహనాస్త్రము ప్రయోగించాడు!

ప్రళయభీకర నినాదాలు వెలువడవలసిన నోటివెంట పసిబిడ్డలను పలుకరించే శబ్దమూ, అగ్నికణాలు రాలబోతున్న దృష్టిలోనుంచి కరుణ ఒకసారే బయట పడ్డాయి వాసుదేవరావుగారికి.

వివేకము పెద్దవాడయిన తరువాత వాళ్ళు పసిపిల్లలను గమనించనేలేదు. ఆ పాపడిని ఎత్తుకొని హృదయము దగ్గర చేర్చుకొనేవరకు ఆయనకు మనసాగలేదు. ఇక ఆమెకు 'ఆయన ఇంకా ఎంతిసేపు ఎత్తుకుంటాడు తనకివ్వక!' అన్న ఆతురత!

ఇద్దరు చేరి అయిదు నిమిషాలపాటు బాలుడిని ఎత్తుకొని, "నీ కేమయినా కష్టంగా ఉంటుందా వీడిని అట్టిపెట్టుకోవటంలో? ఎంతముద్దుగా ఉన్నాడో చూశావా?" అన్నట్లుగా దంపతులిద్దరు ఒకరినొకరు చూసుకున్నారు. శిశుముఖావలోకనంలో ఒకరికి తెలియకుండా ఇంకొకరికి కోరికలు బయలుదేరాయి

ఆరోజు వైకుంఠైకాదశి, స్వర్గద్వారాలు తెల్లవారుఝామున నాలుగు గంటలనుంచీ తెరచే ఉంటాయట! తెల్లవారు ఝామున లేచి తలమీద స్నానముచేసి గజగజ వణుకుతూ వాసుదేవరావుగారి చెల్లెలు భావనారాయణస్వామి కోవెలకు వెళ్లింది. ఒకచేతిలో అరటిపళ్లు ఇంకొకచేతిలో కొబ్బరిచిప్పలు పట్టుకొని ఇంటికివచ్చిన ఆమెకు, పంతులు వేసుకుంటూ బాలుడిని ఎత్తుకొనే అన్నగారు వదినగారు కనబడ్డారు. తెల్లవారుఝామున కోవెలలో దేవదర్శనముచేసి వచ్చిన ఆమె, యింటికి రాగానే ప్రత్యక్షమయిన మనోహర దృశ్యానికి, అచ్చెరువుపడ్డది!

వెంటనే పసివాడికి కావలసిన ఏర్పాట్లు—ఒకగది శుభ్రము చేశారు; వివేకానందుడు ఊగిన ఉయ్యేలను అటుకమీదనుండి తీసి శుభ్రముచేసి గొలుసులకు తగిలించారు. నెల నిండీనిండని పసిబిడ్డకు పోతపాలు, ఎంత మేలురకము పోసినా, ఒంటికి పడునో పడకపోవునో? ఈ ఇబ్బందులకంటె దాయిని పెట్టటానికి నిశ్చయించారు. దీనికి తగినట్లుగానే పాలుపోసే గొల్లవీరమ్మ-మంచి ఆరోగ్యవతీ పసిబిడ్డతల్లీను—అది పిలువగానే వచ్చింది దాయిగా. బట్టలు, కావలసిన సామగ్రి క్షణాలమీద అమరి పోతున్నాయి.

బాలుడు దినదినప్రవర్ధమానంగా నెలలకు తగినఒళ్లుచేస్తూ, వెన్నెలలు కురిపిస్తూ, ముద్దులు మూటకట్టూ, పెరుగుతున్నాడు. వృద్ధులను మురిపిస్తున్నాడు.

ఒకరోజు ఎవరో రైతులు మాట్లాడటానికి వచ్చి వెళ్ళుతూ బాలుడిని చూసి, "మనుమడా అమ్మగారూ!" అని అడిగారు.

"ఆ నోము నోచుకోలేదు నాయనా! కోడలు, పిల్లలు, ఇల్లు పచ్చగాఉండే భాగ్యములేదు. మాకున్న ఒక్కకొడుకుకూడా ఇక్కడ ఉండటములేదు" అంటూ కంటినీరు తుడుచుకున్నది.

"మాకు తెలియక అడిగాము తల్లీ! ముఖము అబ్బాయిగారి ముఖములా ఉంటే మనుమడేమో ననుకున్నాము" అని కొంచెముసేపు పిల్లవాడిని ఎత్తుకొని వెళ్ళారు.

అనామకుడుగా పిల్లవాడు పెరుగుతూనే ఉన్నాడు. ఎనిమిదవనెలన అన్నప్రాశన జరిగింది. వినాయకచవితికి గణపతిపూజ చేశారు. భోగినాడు పళ్ళుపోశారు. పుట్టినరోజు పండుగకూడా చేశారు.

రోజూ సాయంత్రము కాగానే ఎవరో ఒకరు దోసెడు మిరపకాయలు, ఉప్పు దిగతుడిచి దృష్టితీసి పొయ్యిలో వేస్తారు. రవంతైనా కోరువచ్చినదని అనుకోరు.

ఆ ముగ్గురికి బాగా కాలక్షేపము అవుతున్నది. ఇప్పుడు వివేకానందము జాబు వ్రాయటము నాలుగుదినాలు ఆలస్యముచేసినా, ఏపని తొందరలో ఉన్నాడో అని తల్లిదండ్రులు సామాన్యంగా అనుకుంటారు. ఇప్పుడు తీరిక ఉంటేగా?

అనామకుడు ఇల్లంతా ప్రాకుతాడు-వస్తువులన్నీ పాడుచేస్తాడు. మడిగట్టుకొనిఉన్న వాళ్ళమీదికి ఉరికి మైలపడేస్తాడు-వాసుదేవరావుగారు పొడుంకాయకొరకు ఇల్లంతా వెతకవలసినంత పనిచేస్తాడు.

"వీడెక్కడ దొరికాడే మనకు?" అనుకుంటూ ముగ్గురూ నవ్వుకుంటారు!

*   *   *   *   *

ఆరోజు ఉదయము ఎనిమిదిగంటలకు వివేకము బొంబాయినుంచి వస్తాడని ఉత్తరమువచ్చి రెండు దినాలయినది.

పిల్లవాడికి స్నానముచేయించి బట్టలువేసి బయట అరుగుమీద కూర్చోపెట్టారు. వచ్చేవాళ్ళను పొయ్యేవాళ్ళను 'దా! దా!' అని పిలుస్తున్నాడు. చప్పట్లు కొట్టున్నాడు.

అప్పుడే బండిదిగిన వివేకము పిల్లవాడిని చూసి గుర్తించనేలేదు. బలంగా పుష్టిగా ఉన్నాడు ముద్దొస్తూ, కొత్తాపాతా లేనట్లున్నది. వివేకము చేతులు చాపగానే వచ్చాడు. ఎత్తుకొని లోపలికి వెళ్ళాడు. ఎవరికీ తెలియని జిలిబిలి పలుకులతో మాట్లాడించాడు వివేకాన్ని.

తల్లి ఎదురుగా వచ్చి, 'నీ దగ్గరకూ వచ్చాడూ? అందరిని పనులు మాను కొని ఎత్తుకొమ్మంటాడు గదా! అందరిని పలుకరిస్తాడు! ఎంత అల్లరనుకున్నావు! మనయిల్లుచూడు ఇప్పుడెట్లా ఉన్నదో? ఏ వస్తువు పాడేకదా! మీ నాన్నగారి పొడుంకాయ దక్కటం లేదుకదా!" అంటుండగానే, తండ్రివచ్చి, "బాబూ! వీడెక్కడ దొరికాడురా మాకు! ఒకచోట కూర్చోనివ్వడు, ఒకచోట నిలబడనివ్వడు! మాకు చేతినిండా పని" అంటూ వివేకము దగ్గర్నుంచి పిల్లవాడిని తీసుకొని ముద్దాడాడు.

తల్లిదండ్రుల వ్యవహారము తృప్తికరంగా ఉంది వివేకానందుడికి. తాను వాళ్ళదగ్గర లేనిలోటు యీ పిల్లవాడు తీరుస్తున్నాడు.

"అత్తయ్యా! బాగున్నావా?" అంటూ మేనత్తను పలుకరించాడు.

"బాగే నాయనా! నన్ను ఇక్కడ కట్టివేశావు కదా! మా ముగ్గురికి ఈ చిన్న సత్రకాయతో కాలక్షేపము. మా మడి మంటకలిసి పోతోందికదా! వీడితో

బాగానే జోడు కుదిర్చావు వాళ్ళిద్దరికి నన్ను, మా ముగ్గురికి వీడిని! బలే వాడ వురా!" అంటూ మేనత్త నవ్వింది.

"అయితే రోజూ నన్ను తిట్టూ కాలక్షేపం చేస్తున్నారన్నమాట. అట్టా అయితే చెప్పండి. వీన్ని తీసుకొని వెళ్ళి తండ్రికి ఇచ్చేస్తా"న్నాడు నవ్వుతూ.

"అయ్యో నాయనా, మాకు వాడితోనే కాలక్షేపము అసలు! వాడిని కాస్తా తీసుకొని వెళ్ళావంటే మేముకూడా వచ్చేస్తాము నీతో ఈసారి" అన్నారు ముగ్గురు ఏకకంఠంతో. ఇంతలోకే పిల్లవాడు చేతిలోనుంచి దిగిపోయి పొడుంకాయ తెచ్చాడు. అదిచూసి వాసుదేవరావుగారు జేబు తడిమి చూసుకొని "ఒరేయి దొంగా! అదియివ్వు" అని కేకపెట్టారు. అంతా విరగబడి నవ్వుకున్నారు.

ఆరాత్రి, వివేకము తండ్రితో, "నాన్నా! వీడికోసము బాగా డబ్బు ఖర్చు పెట్టున్నట్లున్నారుకదూ! ఎందుకు? ఏదో సామాన్యముగా పెంచితే చాలదూ?" అన్నాడు.

"సరేలే. వాడి ఖర్చెంత? పసివాడికి ఖర్చు ఏమిటిరా? పిల్లల విషయము అట్లా అనవచ్చునా?" అన్నారు.

"కాదులే. వీడికి-ఏదో నాలుగురోజుల మాత్రానికి మనము ఇంత ఖర్చు ఎందుకు పెట్టాలి అనిగాని...." ఇంకా పూర్తిచేయకముందే, తండ్రి అందుకొని. తటాలున స్మృతికి వచ్చినట్లయి. "అయితే వీడితండ్రి ఎక్కడ ఉండటము-ఏమి పని?" అని అడిగారు.

"బొంబాయిలోనే ఉంటాడు. పాపము ఎవరూ దిక్కులేరు. ఈ మధ్య అతన్ని నేను చూడనేలేదు" అన్నాడు తండ్రి ముఖముచూస్తూ.

"బాబూ! వీడికి పేరుపెట్టాలి కదూ" అన్నారు.

"పేరు కేమిటి? ఏదైనా పెట్టవచ్చు. చిన్నదిగా - ముద్దుగా - ముసలివాళ్లు పిలవటానికి వీలయినదిగా చూస్తే సరి!.... నాన్నా! గోపాలకృష్ణ అని పిలిస్తే?"

"ఆఁ.........బాగున్నదిరా. ఒరే గోపాలూ ఇటురా!" అనగానే పరుగున వచ్చిమీదపడ్డాడు. పిల్లవాడిని ముద్దాడుతూ, "అయితే వివేకా! వీడిని తండ్రి తీసుకు వెళ్లుతానని అనడూ?" అని వైరాగ్య ధోరణిలో అన్నారు.

"వాడికి పిల్లవాడు ఉన్నాడన్న ధోరణేలేదు. ఎటో తిరుగుతూ ఉంటాడు. వీడిక మన పాలిట పడుతాడో ఏమో!" అన్నాడు సంకోచంగా.

"పోనీలే. మనకూ పసివాళ్లులేని లోటు తీరుతుంది" అంటూ లేచారు.

మేనత్త ఎదురుగావచ్చి. "ఏమిటీ. తండ్రీ కొడుకు రహస్య సమావేశములో పిల్లవాడికి పేరు పెట్టేసి పిలిచేస్తున్నారే!" అన్నది చెయ్యి తుడుచుకుంటూ.

"అవును అత్తయ్యా. నాన్న పేరు పెట్టాలి కదా అని ఆలోచిస్తుంటే దానికీ పెద్ద బ్రహ్మాండమేమిటని 'గోపాల కృష్ణ' అని పిలిచాము" అన్నాడు.

"గోపాల కృష్ణుడా! మంచిపేరు పెట్టావురా. అవును గోపాలకృష్ణుడు ఒకచోట పుట్టి ఒకచోట పెరుగలేదూ? మన కృష్ణుడి పని అంతేగా! వైకుంఠైకాదశి నాడు గుడిలో స్వామి దర్శనము, ఇంటికి రాగానే యీ గోపాలుడి దర్శనము నాకు లభించాయి" అన్నది.

వివేకానందుడు ఉన్న వారముదినాలు సరదాగా కులాసాగా గడిచిపోయింది. తల్లిదండ్రులతో పిల్లవాడితో కాలక్షేపమయింది.

ప్రయాణమయ్యేనాడు మేనత్తను రహస్యంగా పిలిచి, "అత్తయ్యా! రాధ...." అంటూ మిగిలిన మాటలూ ఆమె చెవిలోనే చెప్పాడు. వింటున్న కొద్దీ విస్మయపడుతూ 'నీ ఇల్లు బంగారంగాను! ఎంత పని చేశావురా!" అని ముక్కు మీద వేలు పెట్టుకొన్నది.

కొడుకు ప్రయాణానికి ఊరగాయలు అప్పడాలు వడియాలు బుట్టలో సర్ది; బుట్టను తెచ్చి ఎదురుగా పెట్టి, "చూడరా నాయనా! మీ అత్తయ్య వెళ్లతానని గోల చేస్తోంది యీ మధ్య. తన కెవరున్నారని? తన బావగారి కూతుర్ని....రాధను పెంచిందే అనుకో. దానిని చూడాలంటుంది. ఆ పిల్లను ఎక్కడో దూరదేశాన ఉంచి చదువు చెప్పిస్తున్నారటగా! అధీనము తప్పాక దాన్ని మన బంధువులు చాలా మంది చూడనేలేదు. మీ అత్తయ్య కలవరిస్తోంది దాని కోసము. అదీ మీ అత్తయ్య వరుస!" అన్నది,

"ఏమిటి అత్తయ్యా! బెంగ పెట్టుకున్నావా? ఈసారి మీ రాధను........" తల్లిని చూసి నాలుక కరుచుకొని వాక్యము పూర్తి జేయకుండానే బండి ఎక్కాడు.

* * * *

షష్టి పూర్తి అయిన వాసుదేవరావుగారికి వారము దినాలు బద్ధకంగా ఉన్న ట్లుండి జలుబుచేసి దానిమీద జ్వరము అందుకొన్నది. మూడవరోజు నుండే వివేకానికి తంతి యిమ్మని తొందర ప్రారంభము చేశారు. ఆయన చెల్లెలికీ భార్యకూ పాపము భయంగా ఉన్నా, ఇరుగు పొరుగు చెప్పే మాటలకు డాక్టరు ఇచ్చిన సమాధానానికి ధైర్యంతోనే ఉంటూ వచ్చారు కాని వాసుదేవరావు గారు కొడుకును చూడాలని టెలిగ్రామ ఇచ్చేవరకూ విడువలేదు.

వస్తున్నానని తిరుగు టెలిగ్రాము యిచ్చి వివేకము బయలుదేరాడు. ఇంకో గంటకు వస్తాడనగా గోపాలుడిని దగ్గర కూర్చోబెట్టుకొని, చీమ చిటుక్కుమన్నా బండి ఆగిందనే, పిల్లవాడిని వాకిట్లోకి పంపి చూడమనేవారు.

ఇంతసేపటి నుంచి ఎదురుచూసిన బండి రానేవచ్చింది. ఎదురుగా వెళ్ళిన గోపాలుడు వివేకాన్ని లోపలికి తీసుకొని వచ్చాడు

"ఏమి నాన్నా! ఎట్లా ఉన్నది? మందు ఎవరి దగ్గర తీసుకుంటున్నారు." అంటూ మంచము మీద కూర్చున్నాడు వివేకము.

"కొంచెము జ్వరము వస్తోంది. నిన్ను చూడాలనిపించి తంతి యిమ్మన్నాను బాబూ! ప్రాణం అంటే ఏమిటి? ఎంతసేపు.... పెద్దవాళ్లము కాలేదురా? నీవు కులాసాయేనా?" అన్నారు.

"బాగా నీరసించిపోయారు నాన్నా మీరు" అంటూ లేచి తల్లి దగ్గరికి వెళ్లాడు. అప్పటికి రాధ బండి దిగి పిల్లతో లోపలికి వచ్చింది.

"ఈ రాధను ఎక్కడనుంచి తీసుకొచ్చావురా! ఇది ఎక్కడుంటోంది?" అంటూ తల్లి అడిగి రాధ చేతిలో నుంచి పిల్లను తీసుకొన్నది.

"ఇది బొంబాయిలోనే ఉంటోందే. ఇన్నాళ్ళ నుంచీ ఇది ఎక్కడ ఉన్నదో నాకు అసలు తెలియనే తెలియదు. బోర్డింగులో ఉండి చదువుకుంటున్నదట. ఒక రోజు నాకు ఎటో పోతూ కనబడ్డది" అన్నాడు,

"అయితే మళ్ళీ పెళ్ళి చేసుకున్నట్లున్నది కదూ. పిల్లను ఎత్తుకొచ్చిందిగా. చిలుకలా ఉన్నది పిల్ల. వీళ్ళ యిల్లు నీకు దగ్గరేనా? ఇంకా చదువుకుంటున్నదా?" అని అడిగింది.

"ఇంకేం చదువుతుంది? నేనుండే యింటికి దగ్గరలోనే... ఉంటారు అమ్మా. వీళ్ళంతా చిలుకలేనే. చిలుక సంప్రదాయంలా ఉన్నది. ఈ నాలుగు రోజులు మీకు సహాయంగా ఉంటుందని పిలుచుకొని వచ్చాను. అత్తయ్య రాధను చూడాలని కలవరిస్తోందన్న మాట జ్ఞాపకము వచ్చింది. అత్తయ్యా, మీ రాధను చూడలేదుగా బిడ్డలతల్లి అయిన తరువాత" అన్నాడు నవ్వుతూ.

రాధ విస్మయపడి....కొంటెగా నవ్వింది. చెప్పిన మాట చెప్పకుండా-వివేకంగా మాట్లాడి అందరినీ నవ్విస్తున్నాడు వివేకానందుడు.

ఒక వారము దినాలు. వివేకానందుడు పిల్లలతో వచ్చి ఉండేసరికి, పిల్లలతో సందడిగా ఇంటికెంతో కళవచ్చింది అందరిని చూస్తూ ఉంటే-వాసుదేవరావుగారి జ్వరము ఎటో వచ్చిన దారినే పోయింది.

అంతా సరదాగా సంతోషంగా గడిచిపోయింది.

వివేకానందుడు వెళ్లేనాడు తండ్రి దగ్గరికి వచ్చి, "నాన్నా! మీకు జబ్బుగా ఉన్నదని తంతిరాగానే, ఏట్లా ఉంటుందోనన్న ఆందోళనతో మనసులో మనసు లేకుండా అయిపోయింది, వచ్చినందుకు, జ్వరం తగ్గి....మామూలుగా మీరు తిరుగుతుంటే నాకెంతో సంతోషంగా ఉంది. మరి....నేను వెళ్ళనా?" అంటూ మంచము మీద కూర్చున్నాడు.

వాసుదేవరావు వాళ్లు వచ్చిన నాలుగుదినాలకే చాలావరకు....ఇంచుమించుగా అంతా....గ్రహించుకున్నారు. వితంతువయిన రాధను పెండ్లి చేసుకోవటంలో వివేకానందుడి సప్తమ స్థానములో గల పీడ తొలగిపోయినట్లే ఉన్నది! తమకు చెప్పకపోతే ఏం? ఆయన కించిత్తయినా నొచ్చుకోలేదు.

"వివేకా! నిన్ను కుటుంబసహితంగా చూచి సంతోషించాను. నీవెంత యుక్తిపరుడవురా! అందరూ అడగటమే 'గోపాలుడెవరు మనుమడా' అని, మీ అమ్మ ఒకసారి కళ్ళనీళ్లు పెట్టుకొన్నది ఏదీ చిన్నపిల్ల! ఇటు పిలిస్తే అటు అటు పిలిస్తే ఇటు పరుగులు! నీ పెళ్ళిమాట తలుచుకోవటానికే భయంగా ఉండేది..

శాస్త్రం చూచిన కొద్దీ అనుమానాలు ఎక్కువయ్యేవి. పోనీ ఎవరి కర్మాన వాళ్లుంటారు. చేతిమీదుగా చేసి బాధపడటమెందుకని నేను సం[illegible]పించుకొన్నాను నాయనా! చాలా సంతోషము'' అంటూ లేచి కూర్చున్నారు.

తండ్రీ కొడుకులు హృదయపూర్వకముగా ఒకరి నొకరు అభినందించుకొంటుండగా రాధ పిల్లలతో వచ్చి, మామగారికి నమస్కరించింది.



# తనదాకా వస్తేనే గాని....

''అబ్బాయీ! నీవు వసంతను ఎందుకు తీసుకొని రావు? నీవు చెప్పే కారణాలు నాకు సహేతుకంగా లేవు.''

''లేదు వదినా! ఇప్పటినుంచీ ఆ బరువు మోయటమెందుకని గాని వేరే ఏమీ లేదు సుమా.''

''బరువేమిటి? భార్యను తీసుకొని వచ్చి గృహస్థాశ్రమము స్వీకరించవయ్యా అంటే కొత్త సూత్రాలను ఏకరువు పెట్తావేమిటి? ఏమిటి నీ ఆలోచన? చేదస్తపు మాటలు చెప్పక ... రేపు పంచమినాడు వెళ్ళి తీసుకురా. లోకము నానా రకాలుగా అంటుంది. నీవు వెళ్ళటానికి సందేహిస్తే నేను వెళ్ళి తీసుకొని వస్తాను'

''నన్ను చూస్తుంటే మీ కందరికీ కష్టంగా ఉన్నట్లుందే! నా మటుకు నేను చాలా తేలికగా-హాయిగా ఉన్నాను. ఒక్కొక్క దంపతులను చూస్తుంటే....నరకము....ఘోరమైన నరకముగా ఉంటుంది. అబ్బా! తలుచుకొంటేనే భయముగా ఉంది. వదినా క్షమించు!''

''అన్ని రకాల నరకాలు ఆశ్చర్యాలు వదుల్తాయి నాలుగుదినాల కాపురంతో ఇట్లా వెగటుగా చూసేవాళ్ళు....మరీ దాసులవుతారు చివరకు....వింటున్నావా? వసంతను తీసుకొనిరావటానికి వెళ్ళకపోతే.... నిన్ను విశాఖపట్నం పిచ్చాసుపత్రికి పంపవలసి వస్తుంది.''

''ఏమిటమ్మా! నీ సరదా నీవు చూసుకుంటున్నావు గాని....నా సంగతి ఆలోచించటము లేదు. ఇన్నేళ్ళుగా స్వేచ్ఛావాయువును పీల్చి స్వతంత్రంగా బతికిన నన్ను....చేయాలని చూస్తున్నావా! ఒక పురుషుడయినా స్వేచ్ఛగా జీవించటము మీ ఆడవాళ్ళు చూపి భరించలేరు కాబోలు'',

"క్షణములో భార్యలకు వశులయ్యేవారు....ఎంత గంభీరంగా....మేఘ గర్జనలతో....వైముఖ్యము చూపిస్తారనుకొన్నావు! వాళ్ళే భార్య గీసిన గీరలో నృత్యము చేస్తారు, తత్వశాస్త్రాన్ని ధిక్కరించాలని చూడకు....నీవు దానిని ఎదిరించలేవు అసలు మాట!"

ఇదీవరుస రామదత్తుకు అతని వదిన భూషణమ్మకు. ఈ రకమైన వాదోపవాదాలు ప్రతిరోజూ జరుగుతునే ఉంటున్నాయి ఈ మధ్య. అన్ని అద్దంకులు తీరిన తోటికోడలిని మరిది ఎందుకు తీసుకొని రావటము లేదో....అతనికేమి సంకోచమో వదినగారికి అర్థంకావటములేదు. పోనీ....నిరుద్యోగి అయినా కొంత సందేహము ఉంటుంది కాని....లక్షణంగా అన్నగారున్న ఊళ్ళోనే ఉద్యోగము చేస్తూ.... ప్రత్యేకమైన ఇంటి బాధ్యత లేకుండా....తల్లిచాటు బిడ్డలా ఉన్నాడు. మరిదియొక్క పెడమతము భూషణమ్మ కేమీ అర్థం కావటములేదు.

వంతులాడుకోవటంలో కొంతకాలము జరిగింది. తాత్సారము వల్ల మరికొన్ని నెలలు గడిచాయి.

హఠాత్తుగా ఒకరోజు మధ్యాహ్నం ఒంటి గంటకు వసంత తండ్రి దగ్గర నుంచి తంతి వచ్చింది. వసంతకు రేడియో పాట ప్రోగ్రాము ఉండటము వల్ల, ఆ సాయంకాలము రైలులో తండ్రీ కూతురు వస్తున్నట్లుగాను, స్టేషనుకు రావలసినదనీను తంతి యిచ్చారు. ఆ వేళకు అన్నదమ్ములిద్దరిలో, ఎవరు ముందు వస్తే వాళ్ళను స్టేషనుకు పంపాలని భూషణమ్మ అనుకొన్నది. కాని నాలుగు గంటలయినా ఇద్దరిలో ఎవరూ రాలేదు. నాలుగున్నరకు తానే స్టేషనుకు వెళ్ళాలని తయారవుతూ ఉండగా రామదత్తు సైకిలు దిగాడు.

వచ్చే నవ్వును పెదవులతో అణచుకొంటూ, "రామదత్తూ! మా బాబాయి వస్తారట. టెలిగ్రాము వచ్చింది. స్టేషనుకు వెళ్లాలి. మీ యిద్దరూ వేళకు రాకపోతే నేనే వెళ్దామని తయారవుతున్నాను" అన్నది భూషణమ్మ, అతని ముఖము చూస్తూ.

"సరేలే. నీవేమి వెళ్తావు. అన్నయ్య ఎన్ని గంటలకు వస్తాడు? నేనే వెళ్తాలే."

"అన్నయ్య ఆరు గంటలకు గాని రారుట. టెలిఫోను వచ్చింది."

రామదత్తు కాఫీ త్రాగి స్టేషనుకు వెళ్లేసరికి, అప్పటికే రైలు ప్లాటుఫారము మీదికి వచ్చింది. రామదత్తు భార్య వసంత, ఆయన మామగారూ సామానులు దింపుకొంటున్నారు.

ఇదా తన వదినగారు చెప్పకుండా చేసిన వంచన. ఆమె తన బాబాయి వస్తారని స్టేషనుకు వెళ్లమన్నది. అవును ఆమె బాబాయియే వచ్చింది! తానే ఏధ్యాసలో ఉన్నాడో మరి ఆలోచించలేదు!

ఈ ధోరణిలో వాళ్లను పలుకరించనైనా లేదు. మామగారు మాత్రము "బాగున్నారా అందరూ? మీకు అంతా వివరంగా ఉత్తరము వ్రాయాలనుకొన్నాను గాని తొందరయిపోయింది. నీవు రేడియో ప్రోగ్రాము లిసెనరులో చూశావనుకొంటాను. మన వసంత రేపు సాయంకాలము అయిదుగంటలకు పాటలు పాడుతున్నది. నేను ఇచ్చిన టెలిగ్రాము సమయానికి అందిందా?" అంటూ తమ ముఖాలను చూస్తూ నిలబడ్డ రామదత్తును పలుకరించి మాట కలిపాడు.

"ఆ! వేళకే అందింది" అని మామగారు అడిగినదానికి సమాధానమిచ్చాడు. అతని తలలో రైళ్లు వడితో పరుగులెత్తుతున్నట్లుగా ఉంది! తన భార్య వసంత రేడియోలో పాట పాడటమా? తాను కలలోనైనా ఊహించలేదు డబుల్ గ్రాడ్యుయేటు. తన నొక్కసారి అయినా వాళ్ల ప్రసంగానికి తన కెంతటి అవమానము! ఇదంతా వదినగారి కుట్రే! అనుకుం మాట్లాడుతూ వాళ్లిద్దరిని అదేకారులో ఇంటికి తీసుకొనివచ్చాడు.

ఆ రోజంతా చాలా బెట్టుసరిగా.... మామగారిదగ్గర గాం భార్యదగ్గర ఉన్నతాధికారి వలె ఠీవితోను.... గడిపాడు రామదత్తు.

తోటికోడలి పాట వినటానికి భూషణమ్మ అయిదు నిమి గానే రేడియో త్రిప్పి సిద్ధంగా ఉంచింది. తా నేపనిలో ఉన్నా వాల్యూము పెద్దది చేసి పెట్టింది. తన తోటికోడలి పాట నాలుగిళ్లకు

ఆ ఉదయమే భూషణమ్మ మరదికి కట్టడి చేసింది.

"నీ వీ సాయంకాలము ఎక్కడికీ వెళ్లటానికి వీలులేదు."

"ఏమిటి అంత ముఖ్యమైన పని?"

"వసంతకోకిల గానము వినటానికి."

"వేసవి వస్తే మనము వద్దంటున్నా కోకిలగానము వినబడుతునే ఉంటుంది. ఇప్పుడు పని చెడగొట్టుకొని.... ఎదురుచూడట మెందుకు?"

"ఆ వేసవే వచ్చింది! ఈ ఒక్కరోజూ ఇంట్లో ఆగలేవయ్యా!"

"వీలులేదమ్మా. మా ఆఫీసువాళ్లందరము కలిసి ఒక హోటల్లో భోజనము ఏర్పాటు చేసుకున్నాము. కుశాసాగా మాట్లాడుకోవటానికి ఒకగంట ముందర చేరాలి అక్కడికి. నీకూ తెలుసుగా సంగతి? ఇప్పుడు తొందరగా ప్రమోషను కావాలంటే పైవాళ్ల నందరిని అనుసరించుకొని తిరగాలి."

"ఈవేళ కొంచెముసేపు ఇంట్లో ఉండి శ్రుతిసేయమైన సంగీతము విన డముకంటె ఎక్కువ దా భోజనము? నీ భోజనము ఆయాసము కలిగిస్తుంది గానము వింటే తన్మయత్వము పొందుతారు. వసంత పాటను నీవు మన ఇంట్లో వినకపోతే.... నే నేమనుకుంటానో తెలుసా?" అంటూ భూషణమ్మ పకపక

తల వంచుకున్నాడు. మొత్తముమీద వసంత పాటను అతడు

* * *

కూడా వచ్చిన వసంత తోటికోడలి ప్రోద్బలమువల్ల ఇక్కడే

ంగా వదినగారి కంట పడకుండా.... అథవా కనబడ్డా సాధ్యమై గా తిరుగుతూ, కాలక్షేపము చేస్తున్నాడు రామదత్తు. సందు దొరి సే భూషణమ్మ చూస్తూనే ఉంటున్నది.

దిలో కులాసాగా.... సరదాగా.... ఉండే పెనిమిటి ఇవతలికి రాగానే మారిపోతున్నాడని వసంత త్వరలోనే గ్రహించింది! ఒకసారి తిరస్కారము— ఇంకొకసారి హేళనము అతని ప్రవర్తనములో ద్యోతక మవుతున్నాయి.

బ్రహ్మదేవుడు తన పుట్టుకను తెలుసుకోవాలని తానాసీనుడై ఉన్న పద్మము లోనుంచి.... తామరతూడుగుండా మూడుసార్లు క్రిందినించి పైకి తిరిగాడట. ప్రయత్నము వ్యర్థమయి ఇక తపస్సుకు కూర్చునాడట! అట్లా వుంది వసంత పని! ఎంత ప్రయత్నముచేసినా.... ఎన్ని విధాలుగా చూచినా.... అతని తత్వమేమిటో ఆమెకు తెలియుటలేదు. వచ్చిన కొన్ని నెలలకే వసంత జిజ్ఞాస బయలుదేరింది!

ఆనాడు పౌర్ణమి. రాత్రి భోజనాల సమయము. అన్నగారింట్లో లేడు. భోజనానికి లేవవలసినదని రామదత్తుకు కబురువచ్చింది. ఆరుబయట మూడు వళ్లేలలో వడ్డించారు.

గడపవరకు వచ్చిన రామదత్తు, వడ్డించిన పద్ధతి చూసి, అన్నగారు వచ్చే వరకు భోజనానికి రానని గడపలోనే ఆగాడు.

'తాను చాలా ఆలస్యంగా వస్తారు కనుక భోజనాలను ముగించుకోవలసినదిగా అన్నగారి దగ్గర్నుంచి ఫోను వచ్చిం'దని భూషణమ్మ చాలాదూరము చెప్పింది.

ఎంత చెప్పినా ఏదో అడ్డంకులు చెప్తూ, కాలక్షేపము చేశాడు. ఎవరూ పీటలమీద కూర్చోలేదు! పదార్థాలు వెన్నెల చలువకు చల్లారిపోయాయి.

అన్నగారు వచ్చారు!

వసంతమనసు చివుక్కుమన్నది. ఆ రాత్రి బయట పౌర్ణమి-గదిలో అమావాస్య! ఆ కటికచీకట్లో వసంతకు దారీ తెన్నూ తెలియలేదు,

మరునాడు ఉదయము దినకృత్యంగా రామదత్తు ఆఫీసుకు వెళ్లటానికి పది గంటలకు బయలుదేరబోతుండగా, ఆసుపత్రినుంచి అన్నగారు టెలిఫోను ఇచ్చారు "మనకు గురు సమానులయిన వారిని భోజనానికి పిలిచాను. ఆ సమయానికి నేను ఇంటికి రావటానికి వీలుపడేటట్లు లేదు. నీవు ఆఫీసుకు సెలవుపెట్టి ఈ పూటకు ఇంట్లోనే ఉండు. నీవూ నీ భార్యా కలిసి యింట్లో ఏర్పాట్లన్నీ చేయండి" అని.

మోయజాలని బరువు తనమీద పెట్టినట్లుగా 'సరే' అన్నాడు. 'తనూ-తన భార్యా! ఇద్దరు కలిసి ఏర్పాట్లు చేయాలట! ఒకమనిషి భోజనానికి వస్తే ౯

మాత్రము వదినెగారు చూసుకోలేదూ? తనకు కష్టమయేపని పురమాయిస్తారు ఇద్దరు. అదే తనకేవగింపు. ఒకసారి సినిమాకు బలవంతంగా అన్నగారు తనను తీసుకొనివెళ్లి, వెనుకనుంచి ఆడవాళ్ళను పిలిపించాడు. తన అన్నగారయినా క్రూరమనిషే.' ఆ దినము అన్నగారు పురమాయించిన ప్రాణాంతకమయిన భారము అతి కష్టముమీద నెరవేర్చాడు.

*　　*　　*　　*

అది సెలవుదినము. సాయంకాలము తోడికోడళ్ళు ఇద్దరూ దొడ్లో తులసి కోటదగ్గర పూలు గుచ్చుతూ కూర్చున్నారు. భూషణమ్మ వసంతను పాట పాడమని చాల బలవంతపరచింది.

ముందు 'మనసు కరుగదేమి' అనే కృతి పాడు. దాని తరువాత 'నను పాలింప నడచివచ్చితివా' అనేది తరువాత పాడు. వసంతా! నాకు సంగీతము రాదుకాని నాకు దానిమీద అభిరుచి ఎక్కువ. పాడవూ?''

''అక్కయ్యా! నా పాటకు ఇక్కడికి వచ్చినతరువాత శ్రుతులు చెడ్డాయి. ఉత్సాహంగా లేదు.''

''నీవు పాడకపోతే ఒట్టు సుమా''

''చైతన్యరహితమైన పాట వసంత పాడింది. ఆ పాటకు జీవమే లేదు!

సరిగా అదే సమయంలో పెద్దచప్పుడు ఇంట్లోనుంచి వినపడ్డది. లోపలికి వెళ్ళి చూసేసరికి-రామదత్తు తొందరగా అవతలికి వెళ్ళటములో బల్లమీద పెట్టిఉన్న సీసాలు రెండు క్రిందపడి పగిలిపోయాయి. గదినిండా గాజుపెంకులే. దాని తాలూకుది కాబోలు ఒక చిన్న అణువు వచ్చి వసంత హృదయానికి గుచ్చుకొని వైద్యునికలవిగాని గాయమైనది!

*　　*　　*　　*

''రామదత్తూ! పాప ఎట్లా ఉందనుకున్నావు? ఎనిమిది పౌండ్లపిల్ల. ఉంగరాలు తిరిగిన నల్లటిజుట్టు ముఖముమీద పడుతూ ముద్దుగా ఉన్నది పిల్ల. తెల్లగా ఉంది. ముక్కు, ముఖము అంతా తల్లిపోలికే. నీవు చూడటానికి వెళ్ళవూ? ఆఫీసు

నుంచి ఇంటికివచ్చి వెళ్ళుతావా? లేక అటునుంచే ఆసుపత్రికి వెళ్ళుతావా? నేను వెళ్ళాలని అనుకుంటున్నాను" అని అడిగింది భూషణమ్మ.

"ఇప్పుడు నేనెందుకమ్మా చూడటము? పురిటిపిల్లను తండ్రి చూడకూడదసలు. చెప్పావుగా బాగానేఉందని. ఇంటికి వచ్చిన తరువాత ఇరవయి నాలుగు గంటలూ చూడవచ్చు."

"అన్నిటికి ఒకటే మంత్రము. నీ ప్రకృతి ఇంకా మారలేదు కదా?"

"నేనా మారేది? ఇక నేను పుడకలతోటే మార్తాను. బాధలు! గృహస్తుడి బాధలు ఎవరికి తెలుస్తాయి. ఇందులో తమాషా ఏమిటంటే అనుభవించేవాళ్ళు బాధలని తెలుసుకోలేరు. అవ్యక్తములోపడి కొట్టుకలాడుతూ ఉంటారు."

"ఏమి వేదాంతము! గృహస్థాశ్రమములో ఉంటూ అంటీ అంటని తామరాకుమీది నీటిబొట్టువలె ఉంటున్న మహాయోగుల సాహచర్యము మాకు లభించినందుకు చాల ధన్యులము! రామదత్తూ!"

తల వంచుకొని తన గదిలోకి ఒక్క అంగలో వెళ్ళాడు రామదత్తు. ఆసుపత్రిలో ఉన్న వసంతను, పసిపాపను చూసిరమ్మని ఎన్నిమారులో వదినగారిచేత చెప్పించుకున్నాడు.

వసంత సాయంకాలము నాలుగు గంటలనుంచీ 'ఎవరు వస్తారా' అని ఎదురుచూసేది. పుట్టిన బిడ్డలను చూడటానికి వచ్చిన తండ్రులను-మనుమలను చూడాలని వచ్చిన వృద్ధులను ఆమె ఆప్యాయంగా గమనించేది. కాని తన పాపను చూడటానికి పాపతండ్రి ఎన్నిసార్లు చెప్పి పంపినా రాడేమి? సిగ్గా?

వివాహము చేసుకున్న ప్రతిపురుషుడు తన స్వాతంత్ర్యాన్ని కోలుపోతాడనీ, భార్యా విధేయుడై ఆమె చెప్పుచేతలలో మెలగుతూ బానిస అవుతాడనీ, అభిప్రాయాలు రామదత్తు పెరుగుతున్న కొద్దీ దృఢపడసాగినవి. ఒక గృహస్థుడయినా సహజరీతిని సంసారము చేస్తున్నాడని అతడు నమ్మడు. ఒక స్త్రీ నయినా సహజరీతిని గౌరవించి అతడు మాట్లాడగా ఎవరూ చూడలేదంటారు. తనకు వివాహము నిశ్చయము చేయాలనుకొన్నప్పుడు, అప్పటికి బ్రతికిఉన్న తల్లితో, "నన్నుకూడా భార్యకు కాళ్ళు కడగమంటావా అన్నయ్యలాగ!" అని పదిమందిలో అడిగాడు.

పెళ్ళి అయినదగ్గర్నుంచీ తాను పెండ్లికూతురు వైపు చూస్తుండగా ఎవ రయినా చూస్తారేమోననీ మాట్లాడితే ఎవరయినా వింటారేమోననీ భయమొకటి అత నిని ఆవహించింది. చివరకు ఈ విశాల ప్రపంచమంతా-తన అన్నగారు, వదినె గారు కూడా-తన ఆనందమయ జీవితానికి అడ్డము వస్తున్నారనే ఒక భావము స్ఫుటము కాసాగినది. ఇక భార్యతో కాపురము చేయటమే అందరి ముందర కష్టంగా ఉంటే, తనకు ఒక బిడ్డ ....కొత్తగా.... !

ఎంతైనా, స్వేచ్ఛగా స్వతంత్రంగా మెలగలేక పోతున్నాడు

ఆనాడు సాయంకాలము అన్నగారు ఆసుపత్రికి వెళ్ళి గదిలో చూసేసరికి రామదత్తు ఆపురిటి పాపను ఎత్తుకొని ముద్దు పెట్టుకుంటున్నాడు ! చిరునవ్వు పెదవు లతో, నీరేజ పత్రాలలాంటి కళ్ళను తిప్పుతూ, "నలపకండి ఆరు రోజులుకదూ !" అంటోంది వసంత.

"అబ్బ ! మీ తమ్ముడు మహాబాధ - గృహస్థుల బాధ-పసిబిడ్డ తండ్రి పడే బాధ.... పడుతున్నాడండి ! నే నతని బాధను చూడలేకుండా ఉన్నాను" అంటూ భూషణమ్మ అనేవరకూ రామదత్తుకు వాళ్ళు వచ్చారనే తెలియదు ! తల వంచు కున్నాడు.

ఆ తరువాత ఒక నెలకే రామదత్తుకు ఆ ఊరినుంచి బదిలీ అయింది. తన అన్నగారే.... కుత్రమనిషి అయిన వదినెగారి సలహాతో తనకు బదిలీ చేయించా డని అతనికి ఒక పెద్ద అనుమానము ! అయినా మనసులోని భారము దిగిపోయి నట్లుగా పెద్ద నిట్టూర్పు విడిచాడు !



# పితృ హృదయము

ఆ మాట విన్న తరువాత వెంకట్రామయ్య నిలువునా నీరయిపోయినాడు. కాలి క్రింద భూమి కదలిపోతోంది! భూకంపము వచ్చిందా? తాను ఆ ఇంట్లో అన్ని సామాన్లతోటి గిర్రున తిరిగిపోతున్నా డేమిటి? విశాలఫాలముమీద ముత్యాలులా జాలువారుతున్న స్వేదబిందువులను ఆయన తుడుచుకున్నాడు.

శేషమ్మ సౌందర్యరాశి! అనన్యము. అప్రతిమానమూ అయిన ఆమె సుందరాకారము ఆభరణాలకే ఆభరణమై దేదీప్యమానంగా ఉండేది. తల్లి చనిపోయిన తరువాత తల్లీ తండ్రీ తానే అయి, మూడునెలల పసికూనను పెంచి పెద్దదాన్నిచేసి, తన స్థితిగతులకు తగినట్లు, ఆ రోజుల్లో, బి. కామ్. ప్యాసయిన అల్లుడిని. కొద్దిపాటి ఆస్తితో. వెతకితెచ్చి ఐదురోజులపెళ్లి వైభవంతో చేశాడు. తల్లి చనిపోయినా పిల్ల కేలోపము కలుగనీయకుండా తల్లి నగలన్నీ పిల్లకిచ్చి, కూతురినీ అల్లుడిని తృప్తిపరచి, అమ్మాయిని అత్తవారింటికి పంపాడు. అది ఆరేళ్ల నాటి మాట.

* * * * *

అత్తవారింటికి వెళ్ళిన దగ్గర్నుంచి తన గారాబుశేషు తిరిగి తన గడప త్రొక్కలేదు. మూడు పురుళ్ళయినవి, తాను ఏడాదికో ఆరు నెలలకో వెళ్ళి చూడటమేగాని ముద్దు మనుమలతో తనయిల్లు ఒక్కసారయినా కళకళ లాడలేదు. ఎక్కడున్నా బాగుంటటమేకదా కావలసింది? అలాగే వీలుగా ఉన్నప్పుడు తాను వెళ్ళి చూసీ. తన వాళ్ళను ఎవరినయినా పంపీ, క్షేమము తెలుసుకుంటున్నాడు. ఈసారి ఆమె కబురు తెలిసి నాలుగు నెలలయింది. ఎన్ని ఉత్తరాలు వ్రాసినా జవాబే ఇవ్వదాయెను! ఆ స్థితిలో తన గారాబు శేషు పెనిమిటి మాధవరావు పూనాలో మళ్ళీ పెళ్ళి చేసుకొని నూతన వధువుతో హోటల్లో దిగాడని కబురు!

"బావా! నీవు మన మాధవరావును ఎరుగుదువుగా! బాగా పరకాయించి చూశావా? మనవాడవునో కాదో?" మనసు ఇంకా స్థిరపరచుకోలేక అడిగాడు.

"అయ్యో! అంత పొరపడుతాననుటయ్యా? మాధవరావును నేను ఎరుగక పోవటమేమిటి? బాగా నేఉంది! తన స్నేహితులకు ఆ వధువును నా ముందరే పరిచయము చేస్తున్నాడు 'మిసెస్ మాధవరా'వని. కాని అతడు నన్ను బాగా గుర్తుపట్టి నట్లు లేదు. బావా! నా కళ్ళతో నేను చూసిన దృశ్యముగాని ఇంకొకరు చెప్పిన మాట కాదు. నీ కూతురికి కష్టమొస్తే ఒకటీ, నా కూతురికి కష్టమొస్తే ఒకటీనా? గాలికబురు చెప్పి నిన్ను క్రుంగదీస్తావా?" అన్నాడు బావమరిది కామయ్య.

"ఏడువకపోయినాడు! పరిచయము చేస్తున్నాడా నలుగురితో? శేషునీ, ఇద్దరు పిల్లలనీ ఏం చేద్దామని ఉద్దేశ్యము? ఆ చేసుకొనేదానికయినా సిగ్గులేదా కుటుంబీకుడిని పెళ్ళిచేసుకోవటానికి!" ఆపాదమస్తకమూ వణకిపోయాడు. ఉత్తరీయంతో కళ్ళు తుడుచుకున్నాడు వెంకట్రామయ్య.

"ఇదుగో బావా! మన బంగారము మంచిదయితే కదూ కంసాలివాడిని తిట్టటము? అతనినన్న లాభములేదు. అయినా దానికి సుఖపడే గీత, యోగమూ, ఉంటే బ్రహ్మ అయినా అడ్డం రాలేడు" అన్నాడు కామయ్య వేదాంతదృష్టితో.

"ఇంతకూ నేను బ్రతికిఉండటము వచ్చింది పెద్ద ఇబ్బంది. పెద్దవాళ్ళు ఉండటము సుఖానికి కాదు."

"బావా! నేను వెళ్ళవస్తాను. ఊరికే విచారపడి ఆరోగ్యం చెడగొట్టుకోకు. ఏం లాభము?"

ఇంకా విచారమేమిటి? నిండా మునిగినవాడికి చలేమిటి? అసలు తన గారాబుశేషు ఈ మాట వింటే బ్రతుకుతుందా? కళ్ళు రెండు మూసుకున్నాడు బాధకొద్దీ.

* * * * *

"శేషూ! కులాసాయేనా? పిల్లలేరీ?" అంటూ ఉదయము బండిలో దిగిన వెంకట్రామయ్య శేషమ్మ ముఖము తేరిపార చూశాడు.

"ఆ! అంతా క్షేమమే బాబూ. పిన్నీ, పిల్లలు కులాసాయేనా? వస్తూ, ఉత్తరమయినా వ్రాశావుకావేం బాబూ?" అంటూ లోపలికి తీసుకొనివెళ్ళి కాఫీ ఇచ్చింది.

మిసమిసలాడుతూ నిండు యౌవనములో ఉన్న శేషు ఈసారి తాను చూచే సరికల్లా క్షయపాతకురాలయి కంఠగతప్రాణ అయిపోయింది: ఎన్ని ఉత్తరాలు వ్రాసినా జవాబే లేదాయెను!

"శేషూ, ఏమిటమ్మా మరీ ఇట్లా అయిపోయావు? ఏదన్నా అబ్బా? మందేమయినా తీసుకుంటున్నావా? నాకు ఉత్తరంముక్క వ్రాయవెందుకమ్మా" అంటూ పెట్టెతెరచి చీరె, రవికెలబట్టలు, పిల్లలకు బొమ్మలు తీసియిచ్చాడు.

"శేషూ! మొన్న పుట్టిన తమ్ముడు ఎట్లాఉన్నాడో చూశావా? వాడి ఫొటో ఇదిగో, మీ పిన్ని నిన్ను రోజూ జ్ఞాపకం చేస్తూఉంటుంది! వాడంతా నీ పోలికే నట-వంకరనవ్వులు, బుగ్గన సొట్ట తల ఒరగపెట్టి నడవటము - అంతా నీవేనని శేషయ్య అనే పిలుస్తుంది."

"బాబూ! పోనీ, వాళ్ళను తీసుకొని రాకపోయినావా? నేను పిన్నిని చూసి ఆరేళ్ళయింది, అమ్మాయి బాగుందా? స్కూలుకు పంపుతున్నారా" అన్నది.

"ఇంకా వాళ్ళనుకూడా తీసుకురావాలా? ఇక్కడికి నేను రావటమే బేజా పని! నీవు పిల్లలతో నా గడప తొక్కావా? పండగకయినా మాధవరావు నిన్ను తీసుకొనివచ్చాడా? నేను ఏదో కన్నకడుపు పట్టలేక వచ్చి చూసి పోదామని-ఏడాదికీ, ఆరు నెలలకూ సిద్ధమవుతాను, అభిమానం చంపుకొని." వెంకట్రామయ్యకు ఈ మాట లనేటప్పుడు మచ్చెమటలు పోశాయి. ఆపాదమస్తకమూ కంపించి పోయాడు.

"బాబూ! ఆడపిల్లను అత్తవారింటికి పంపినతరువాత ఇక వాళ్ళ ఇష్టము. నీవు నీ ఇంటికి రమ్మన్నప్పుడల్లా వస్తుందా?" అన్నది.

"శేషూ! మాధవరావు ఊళ్ళోలేడా? కనబడదేమి ఇంట్లో?" అని అడిగి ఆమె ముఖము రెప్పవాల్చకుండా చూశాడు.

"ఇప్పుడు వారిని కంపెనీకి మేనేజరుగా తీసుకున్నారు. ఈ పని వచ్చినప్పటి దగ్గర్నుంచీ తరుచు బొంబాయి పూనా వెళ్తున్నారు. ఇప్పుడు వాళ్ళ పనిమీదనే పూనా వెళ్ళారు. మొన్న ఎవరో గుమాస్తా కాబోలు వచ్చి, ఒక నెల సెలవు పెట్టారని చెప్పాడు" అని తల ఎత్తకుండానే చెప్పింది.

కంపెనీ పనిమీద బొంబాయి పూనా తిరిగేవాడు, సెలవుపెట్టి, అక్కడేం చేస్తున్నాడు? తన కూతురిని మాయచేస్తున్నాడు. చెప్పగానే ఏ మాటలయినా ఆలోచన లేకుండా నమ్ముతుందా శేషు! చిన్నప్పుడు చాలా చురుకుగా ఉండేది, అతని పోకడలు తెలుసా దీనికి? అనుకొని, "శేషూ! నిన్నూ, పిల్లలనీ తీసుకొని వెళ్ళాలని ఎన్నాళ్ళనుంచో ఆలోచన. ఇప్పుడు కష్టంమీద నాలుగురోజులు సెలవు తీసుకొని వచ్చాను. ఈ రోజుతో రెండురోజు లయిపోయినాయి. మనం రేపు సాయంకాలము బయలుదేరితేనే గాని నేను ఎల్లుండి ఆఫీసుకు చేరుకోను. వింటున్నావా?" అన్నాడు.

"ఆయన లేనప్పుడు నేను ఎట్లారాను? పిల్లలను తీసుకొని నీతోకూడా ఇల్లు తాళంవేస్తే ఆయన ఏమనుకుంటారు? బాబూ! మమ్మల్ని ఇక్కడే చూశావుగా! వస్తాలే, ఆయన రాగానే అందరం కలిసి వస్తాము" అని సర్ది చెప్పింది.

'ఇంకా ఆయన వస్తాడు, తనతో ప్రయాణాలు చేస్తాడు! వెర్రిపిల్ల! ఉత్త అమాయకురాలు' అనుకుంటూ వెంకట్రామయ్య పని ఉన్నట్లుగా బయటికివెళ్ళి కళ్ళు తుడుచుకొని లోపలికి వచ్చాడు.

* * * * *

మరునాడు వెంకట్రామయ్య భోజనాలయిన తరువాత మంచముమీద పడుకొని ఆలోచిస్తున్నాడు. ఎంత ప్రయత్నించినా నిద్ర రాలేదు. శేషు ఏ విధంగాను ఉన్నసంగతి బయట పెట్టేటట్టు లేదు. తెలిసి చెప్పటంలేదో, తెలియక చెప్పటంలేదో, ఈ రెండు దినాలనుంచీ వెంకట్రామయ్యకు అర్థమే కావటంలేదు. తాను చెప్పితే నమ్ముతుందో, నమ్మదో? పైగా ఆయనమీద లేనిపోనివి చెప్పాడని మాట్లాడటంకూడా మానివేస్తే చేసేపని ఏమిటి? ఎన్నాళ్ళని ఇక్కడ ఒంటరిగా పిల్లలను పెట్టుకొని ఉంటుంది? ఎప్పటికయినా మాధవరావు వచ్చి వెళ్ళిపొమ్మని గోలచేస్తే ఆప్తు లెవరూ లేని ఈ ఊళ్ళో, బిడ్డలను తీసుకొని ఎటుపోతుంది? అడిగినా, కన్నతండ్రికి ఉన్న సంగతి చెప్పని ఇంత అభిమానముతో ఎట్లా బ్రతుకు

తుంది? పైకి ఏమీ తెలియనట్లు కనబడుతుంది గాని సునిశితబుద్ధిగల విశాలా హృదయే? అమాయకంగా ఉన్నట్లే ఉంటుందికాని అత్యద్భుతమైన తెలివితేటలే ఉన్నాయి! కాని.... వెంకట్రామయ్య మధనపడుతూ, ఎట్లాగయినా తనకూతురుతో కాఫీ త్రాగేటప్పుడు ప్రసంగిద్దా మనుకున్నాడు. ఆ భయంకర రహస్యాన్ని కడుపులో పెట్టుకొని భరించలేడు.

శేషను పిల్లలిద్దరు పీడిస్తున్నారు తండ్రికోసము. వాళ్లను మాటలతో మరపించాలని సతమత మవుతున్నది.

"బాబూ! కాఫీ తీసుకో, నిద్రపట్టిందా?" అంటూ శేషమ్మ మంచానికి దగ్గరగా ఉన్న కుర్చీమీద కూర్చున్నది.

"అమ్మా! నేను సాయంకాలము బండికి వెళ్ళితీరాలి. నిన్ను వదలి వెళ్ళవలసిందేకదూ." తలవంచుకొని ఒక్కొక్కమాట నిదానంగా అంటున్నాడు.

"అప్పుడే వెళ్తావా బాబూ? పిల్లలు 'తాతయ్య' అంటూ తిరుగుతున్నారు. నాకయినా ప్రాణం లేచివచ్చినట్లుంది నిన్నుచూస్తే. ఉండు బాబూ నాలుగు రోజులపాటు" అన్నది గునుస్తూ శేషమ్మ.

"ఎట్లా ఉండనమ్మా? నీవు వస్తే కళ్ళకద్దుకొని తీసుకొని వెళ్తాను. పిల్లలిద్దరు ప్రయాణం అంటే సరదా పడుతున్నారు. నామాట వినవూ? బయలుదేరవూ?" దైన్యంతో బ్రతిమిలాడాడు.

"ఏమిటో బాబూ! ఇప్పుడు రాలేను. నా మనసంతా ఏమిటోగా ఉంటోంది బాబూ" అంటూ పెదవులు చప్పరించింది

"ఎందుకూ? నీకు ఏమయినా ఇబ్బందిగా ఉందా చెప్పు. డబ్బుకు ఇబ్బంది పడుతున్నావా? నాకు వ్రాస్తే నేను పంపనూ? నా దగ్గర ముఖమాటపడి అంతా దాచిపెట్టితే ఎట్లాగమ్మా? నీ మనసెందుకు పాడయిపోయింది చెప్పు? మొన్న పుట్టిన పిల్లవాడి కోసమా? ఇంత చిన్నతనంలో ఈ కాన్పులను ఎవరు ఆహ్వానించినట్లు?" విసుగువల్ల కలిగిన వైరాగ్యంకొద్దీ ముఖము చిట్లించాడు.

ఆ మాటలకు జీవకళలేని నవ్వు నవ్వింది శేషమ్మ.

"మనము ప్రకృతి సిద్ధమయిన వాటిని ఆక్షేపించే ఘనులనూ బాబూ! నా మనసును తొలిచివేసి, జీలుగు బెండును చేసిన విషయాలు వేరు. అసలు.... ఏమిటో నాకే అర్థముకాకుండా ఉన్నది. జీవితంలో కలిగే చిన్న చిన్న తపానులకు భయపడేదాన్ని కాదు నేను. కలిగినదానితో తృప్తిపడి, అందులోనే ఆనందం అనుభవించాలనే పద్ధతి గలదాన్ని. నేను కట్టుకున్న ప్రణయసౌధంచుట్టూ కారుమేఘాలు ఆవరించినట్లుగా అప్పుడప్పుడు తోస్తున్నది. ఆయన, ఏమిటో పరధ్యానంగా, చికాకుగా ఉంటున్నారెందుకో!" అన్నది చిన్నబోయిన ముఖంతో, తలవంచుకొని.

"ఏమిటమ్మా శేషూ అది? నీతో మాటవరుసకయినా అనటంలేదూ అతను?" అన్నట్లు అడుగ మరచాను. నాకు మొన్న స్టేషను దగ్గర ఒకాయన కనబడి 'ఎవరింటికి వెళ్ళుతున్నా'రని అడిగాడు. నేను చెప్పాను. ఏమిటో మరి-మాధవరావును గురించి ఒకటి రెండు మాటలు చెప్పాడు. నాకే ఆశ్చర్యము వేసింది వింటే. మీతో బాగా పరిచయము ఉన్నవాడేటగా" శేషమ్మ వైపు రెప్పవాల్చకుండా చూస్తూ అన్నాడు.

"ఏమిటో పుకార్లు బాబూ. నేను వినలేకుండాఉన్నాను." ముఖం సొంతము ప్రక్కకు త్రిప్పుకున్నది అభిమానంకొద్దీ.

"అయితే శేషమ్మా! నీవు నిదానంగా విచారించు. ఊళ్లో ఉన్న పుకార్లు-మీ ఆయన పరధ్యానము-రెండూ కలిపి చూడు నీకే తెలుస్తుంది." అంటూ ఆమె ముఖం తదేకదీక్షతో చూశాడు.

"ఇందుకే బాబూ, నేను ఎవరితోనో చెప్పనిదీ, నీ దగ్గరకు రమ్మంటే రానిదీను. లోకులు కాకులు, సహృదయత్వం ఎవరికీ లేదు. ప్రతివాళ్ళనూ అనుమానించి, చెడిపోయినారని ధ్రువపరుస్తారు. బాగుపడే అవకాశమున్నా, బాగుపడ నివ్వకుండా.... ఇంకా.... క్రిందికి, పాతాళలోకానికి అణగత్రొక్కివేస్తారు. ఛీ! ఏం లోకము?" కోడెత్రాచులాగ చర్రుమన్నది

ఇక తానేమి మాట్లాడగలడు! ఎక్కడికక్కడ నోరు మూస్తున్నది శేషమ్మ.

"బాబూ, నీవూ సందేహిస్తున్నావా ఆయనను? ఆ.... నమ్మే ఉంటావు వీళ్లు వాళ్లు చెప్పినవన్నీను. నేనుమాత్రం పుకార్లను నమ్మలేను! నమ్మను! బెల్గాంలో ఆయన ఉన్నప్పుడు నాకు వ్రాసిన ఉత్తరాలలో ఆయన హృదయమంతా కరగించి పోశారు. వాటి రచయిత-ఆవ్యక్తి-నన్నిట్లా మోసగిస్తారని ఎట్లా ఊహిస్తాను? ఉదయభాస్కరుడూ నీరజమూ ఒకరినొకరు వీక్షించుకుంటూ, వికసించుకుంటూ ప్రకతృరంగంలో పందేలు వేసుకొని పరుగెత్తుతున్నట్లుగా ఉండే మా యిద్దరి అనురాగము ఈనాడు గగనప్రసూనవాదమయిందా? అబ్బ! నా తల తిరిగిపోతున్నది. బాబూ, నన్నెందుకు అంత గారాబంగా పెంచావు? నాలో ఆత్మ గౌరవము ఎందుకు వృద్ధికానిచ్చావు?" తలను రెండు చేతులతో పట్టుకొని కళ్లు మూసుకున్నది.

"నమ్మక చేసేదేమిటి? తెల్లముఖము వేసుకొని ఆయన ఇంకా వస్తాడని ఎదురుచూస్తానంటావా? మీ యిద్దరి అనురాగమూ గగనప్రసూనవాదమయిం దనుకుంటున్నావు నీవు-కాని ఆ విషయము తలచినకొద్దీ కాకదంతపరీక్షగా మారుతుందని నా అనుమానము. నా బాధకొద్దీ ఉన్నమాట అనేస్తున్నాను క్షమించు" అల్లుడిమీద కోపముకొద్దీ అన్నాడు కాని కూతురిని చూసేసరికి దుఃఖము పొంగిపోయి, ఆ సముద్రానికి చెలియలికట్ట లేదా అనిపించింది.

"అమ్మా నా మాట విను. నీ బాధ నేను చూడలేకుండా ఉన్నాను. నాలుగు రోజులపాటు నా దగ్గర ఉందుగాని రా" అన్నాడు.

తలవెంట్రుకలు చేత్తో ముడి వేసుకుంటూ "బాబూ. నాలుగు రోజులలో నా మనసు సర్దుకుంటుందా? నీ వెర్రిగాని?" శూన్యంలోకి చూస్తూ అన్నది.

వెంకట్రామయ్యకు పితృ హృదయంలోనుంచి వేదన పుట్టుకొస్తోంది. ఆవేదన కోపంగా మారుతున్నది.

"శేషూ, ఎక్కడోఉన్న మాధవరావుకోసం ఇక్కడ చిన్న పిల్లలను పెట్టుకుని ఉంటావా ఒంటరిగా? నా కిష్టంలేదు".

శేష మూతి ముడుచుకున్నది. ఎంత తండ్రి అయినా తమ బంధాన్ని తీసి పారేస్తూ మాట్లాడుతుంటే ఆమె సహించలేకపోతున్నది.

మధ్యాహ్నం భోజనాలయిన తరువాత పడుకున్న శేష ఎర్రగా జ్యోతుల్లా ఉన్న కళ్లతో తండ్రికి కాఫీఇచ్చి వెళ్లి మంచంమీద పడుకున్నది.

వీధి అరుగుమీద కూర్చుని కూతుర్ని గురించే ఆలోచిస్తున్న వెంకట్రామయ్య పిల్లల ఏడుపు విని లోపలికి వెళ్ళాడు.

శేష మంచంమీద అడ్డంగా పడుకునుంది. పిల్లలు ఏడుస్తున్నారు.

వెంకట్రామయ్య వెంటనే డాక్టర్ని తీసుకు వచ్చి చూపించాడు. మందులు ఇస్తాడు. రోజూవచ్చి చూస్తున్నాడు డాక్టరు. కాని జ్వరం వస్తూనే ఉంది. వెంకట్రామయ్య సెలవును పొడిగించాడు.

"చాలా రోజులనుంచీ ఒంట్లో జీర్ణించుకుపోయిందండీ మలేరియా. దీన్ని అశ్రద్ధచేయకూడదు" అని మరొకసారి హెచ్చరించి వెళ్లాడు డాక్టరు. ఈ దెబ్బతో నిశ్శేషంగా జ్వరాన్ని వదిలించాలి. జీవితంలో తనకు గలిగిన వైరాగ్యంవల్ల, ఆరోగ్యముమీద అశ్రద్ధ చూపెట్టి ఆత్మహత్య చేసుకోవాలని చూస్తున్నదా శేషమ్మ? మరి పిల్లలగతి?

ఆ జ్వర తీవ్రతలో ఎన్నో విషయాలు పలవరించేది శేషమ్మ మాధవరావు మాట ఏమైనా వస్తుందేమోనని వెంకట్రామయ్య చెవులు దోరగిలపెట్టుకొని వినేవాడు, కాని పల్లెత్తు మాటయినా వినవచ్చేది కాదు.

ఎన్నో ప్రయత్నాలు చేయగా ఏడోనాటికి శేషమ్మకు జ్వరము తగ్గింది. కాని మాట ఖావిలోనుంచి వస్తున్నట్లుగా ఉంది: రోగి చాల నిస్త్రాణ పడిపోయింది.

ఆ రోజు మధ్యాహ్నము శేషమ్మకు పూనానుంచి ఒక ఉత్తరము వచ్చింది. ఆ స్థితిలోఉన్న శేషమ్మకు మాధవరావు దగ్గర్నుంచి వచ్చిన వుత్తరము చూపటము ఇష్టములేకనూ, అసలు కథ ఏమిటో కనుక్కుందామన్న కౌతుకంతోనూ బయట వరండాలో నిల్చుని కవరు చింపి చూశాడు తండ్రి.

"శేషూ,

వ్యవహారము చాలా చిక్కుపరిస్థితికి వచ్చినందువల్ల నేను ఇంకా కొంత కాలము ఇక్కడ ఉండవలసి వస్తుంది. నీవు పిల్లలను తీసుకొని మీ బాబుగారింటికి వెళ్లు అన్ని సంగతులు. వివరంగా తరువాత వ్రాస్తాను.

నీ క్షేమం కోరే

పూ॥ నా మాధవరావు

ఇంకా శేషు క్షేమంకోరే మాధవరావేనా ఆయన? వ్యవహారమనీ చిక్కులనీ దాన్ని మధ్యపెట్టి నలిపి చంపుతున్నాడు! సరిగా యముడే దాని ప్రాణానికి. ఒక్కసారే పెళ్లి చేసుకున్నానని ఏడవకూడదూ? ఈ ఉత్తరముచూస్తే శేషు ప్రాణం ఉంటుందా?

ఆ రోజు ఉదయము కాఫీ త్రాగిన తరువాత శేషమ్మ కెదురుగా కుర్చీలో కూర్చుని, "శేషూ నీవు ఇంత తొందరలో తేరుకుంటావని అనుకోలేదమ్మా. ఒక రోజు నాకు అధైర్యముతోచి మాధవరావుకు టెలిగ్రాము యిద్దామనుకున్నామ గాని డాక్టరుగారు వద్దన్నారు. ఇంతకూ మా అదృష్టం బాగుంది" అని దానికేమని సమాధాన మిస్తుందోనని చాలాసేపు ఆమె ముఖంవంక చూస్తూ ఆగాడు.

"నావంటి వాళ్లకు చావు వస్తుందా బాబూ? నేను మొండిదాన్ని. మృత్యువును జయించాను!" అన్నది విరక్తితో శేషమ్మ.

అమ్మాయీ, నీవు జ్వరతీవ్రతలో ఉన్నావని చూపించలేదు. నీకొక ఉత్తరము వచ్చింది పూనానుంచి. తీసుకో" అని కూతురి చేతిలో పెట్టాడు వెంకట్రామయ్య.

నీరసంగా ఉన్న శేషు చేతులు వణికాయి ఉత్తరం చదువుతుంటే. కళ్లలో కాంతి తగ్గింది. ముఖం పేలవమయిపోయింది.

వెంకట్రామయ్య ఆమె నోటివెంట ఏమాట వస్తుందో వినాలని చూస్తున్నాడు.

"అమ్మా. శేషూ'

కళ్లు మూసుకుని గోడకు తలానించి బరువుగా నిట్టూరుస్తున్న శేషు చటుక్కున కళ్లు తెరచుకుని కనుబొమలు ముడిచి "బాబూ. ఈ ఉత్తరంతో నా మనసు మారుతుం దనుకున్నావా? చెడి పుట్టింటికివస్తే గౌరవ మేముంటుంది బాబూ? నే నిక్కడికివస్తే నాకూతుర్ని అల్లుడు వదలిపెట్టాడని నలుగురికీ చెప్పుకుని కళ్లు తుడుచుకుంటావా? ఆ స్థితి నీకు రానివ్వను" ఉద్రేకంతో మాట్లాడినందువల్ల శేషుకు ఒళ్లంతా వణికిన ట్లయింది. కళ్లు మూయగానే కన్నీళ్లు జలజల రాలాయి.

ఆ స్థితిలో కూతుర్ని చూసిన వెంకట్రామయ్య గుండెనొప్పితో కుర్చీలోనుంచి ఒరిగి కిందికి జారాడు.

# అసమర్థుడు

బొంబాయి పట్టణములో - మూడంతస్తుల భవనములో-నాలుగు గదుల భాగము అద్దెకు తీసుకొని కుటుంబంతో ఉంటున్నాడు కరి రంగారావు. ముఖ కవళికలను బట్టి భావాలను తెలుసుకొనే సామర్థ్యమూ. మంచి శాంతమూ కలిగినవాడు. స్ఫురద్రూపీ-మాట పైకి పొక్కనీయని నియమశీలీ కూడా.

కాపురం పెట్టిన ప్రథమంలో భార్యతోగూడా ఒక్కటే గదిలో ఉంటూ ఉండేవాడు. పెద్దరోడ్డు ప్రక్కకు ఉన్న కాలిబాటమీద కూర్చుని స్కూలు పిల్లలకు పుస్తకాలు అమ్మటం ప్రారంభించాడు క్రమేణ ఆ వ్యాపారము పెద్దదయి, అన్ని రకాల పుస్తకాలు దొరికే దుకాణమయి, పెద్దరోడ్డుమీద కేవలరామ్ బట్టల దుకాణము ప్రక్కకు 'కరి బుక్ హౌస్'గా మారింది. కొద్ది కాలానికే తృప్తికరమైన ఫలితము కనబడుతూ వచ్చింది.

ఇద్దరు పిల్లలతో భార్యతో-బొంబాయివంటి మహా పట్టణములో-మధ్య తరగతి జీవితము సాగిస్తున్నాడు. అక్కడి ఆంధ్రులలో పేరు తెచ్చుకుంటూ నలుగురిలో ఔ ననిపించుకుంటున్నాడు.

ఒకనాడు తలవని తలంపుగా, రంగారావుకు ఒక బంధువుతో హఠాత్సమావేశము కలిగింది. రంగారావును, ఆ పెద్ద షాపులో కూర్చుని ఉండగా చూసి, నమ్మలేకపోయినా బంధువు గుర్తుపట్టినప్పటికీ మాట్లాడదలచుకొనక ఊరుకున్నాడు రంగారావు.

''ఏమిరా! రంగా! నీవీ షాపులో నౌకరీకి ఉన్నావా? నిన్ను ఇక్కడ చూస్తున్నా నమ్మలేకుండా ఉన్నాను. నీ విక్కడ ఉన్నట్లు ఇంటికి కబురు చేయక పోయినావా?'' అన్నాడు ఆశ్చర్యంతో.

''నేను గుమాస్తాగా లేను. నా స్వంత షాపే యిది. మనవాళ్ళకు తెలియజేయటాని కేమి తొందర వచ్చింది ఇప్పుడు? ఇంటికి పోదాం రా!'' అన్నాడు రంగారావు.

"మరి యిక్కడో?"

"నా చేతిక్రింద ఇద్దరు గుమాస్తాలు ఉన్నారు. వాళ్లు చూస్తూ ఉంటారు. మనము ఇంటికి వెళ్దాము."

తన ఇంటికి తీసుకొనివచ్చి భార్యాపిల్లలను ఆ బంధువులకు చూపించాడు.

వాళ్ళ ఉనికీ, ఇంటివైఖరీ చూసి బంధువు చాలా ఆశ్చర్యపడ్డాడు. తనపని ముగించుకొని మరో రెండు దినాలు వాళ్ళ దగ్గర ఉండి బయలుదేరాడు. అతన్ని సాగనంపుతూ, 'మంచిది ఉంటాను' అన్నాడు రంగారావు. ఆయన మాత్రము తల్లిదండ్రులకు ఎన్నో సంగతులు చెప్తాడని ఎదురుచూశాడు.

ఆరాత్రి భోజనాలదగ్గర మామగారి ప్రసక్తి తెచ్చింది జానకి. "బిడ్డలను చూపించినట్లుగా ఉంటుంది, ఒకసారి వెళ్దామా" అన్నది.

"ఈ ఊళ్ళో అందరికీ చూపించు.... ఆనందించు" అన్నాడు వికటంగా.

"మన మే స్థితిలోఉన్నా మనవాళ్ళు చూపి ఆనందిస్తేగాని ఆత్మకు సంతృప్తిగా ఉండదు. అక్కడికి వెళ్ళాలనీ, పిల్లలను అందరికీ చూపించాలనీ నాకెన్నాళ్ళ నుంచో మనసులో ఉన్నది. నా కేమిటో వెలితిగా ఉన్నట్లుగా ఉంది" అన్నది జానకి.

"నీకు తెలియదు. చూసి సంతోషపడేవాళ్ళు అవతలఉంటే తృప్తిగా ఉంటుంది, మహాసంతోషంగానూ ఉంటుంది. లేకపోతే?" అన్నాడు.

"మనము పొరపడ్డామేమో? చూశారా? ఎంతైనా కడుపు కదండీ! మీ పిల్లలు మిమ్మల్ని.... యీ విధంగా భావిస్తే మీ మనసుకెలా ఉంటుంది?"

"అదే పొరబాటు. నా పిల్లలను నేను పెంచుతున్న దృష్టితో.... మావాళ్ళు నన్ను పెంచలేదు. నాకొరకు ఖర్చుపెట్టే ప్రతిదమ్మిడీ 'వ్యర్థము చేశా'మని అనుకునేవాళ్ళు.... నాకు ఆ సంగతులు పదేపదే జ్ఞాపకము చేయవద్దు" అని చికాకుపడి అక్కడినుంచి లేచిపోయాడు.

ఎన్నిమార్లు బోధపరచినా జానకికి రంగారావు మాటలు అర్థం కావటము లేదు. మాతాపితల వాత్సల్యం మనిషికొాక తీరా ?

* * * * *

జగ్గయ్యశాస్త్రికి ముగ్గురు కూతుళ్ళు నలుగురు కొడుకులు, మొదట ఇద్దరు కొడుకులు-తరువాత వరుసగా ముగ్గురు ఆడపిల్లలు కావటమువల్ల పెద్దకొడుకులు ఇద్దరూ చేతికి వచ్చారు. భూ వసతి బాగా ఉండటమువల్ల మొగపిల్లలకు చదువులు ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు.... సంసారపక్షంగా నిశ్చింతతో జరిపిస్తున్నాడు.

రంగారావు ఇంటర్మీడియేటు పరీక్ష కాగానే మెడికల్ కోర్సుకు వెళ్ళతానని తండ్రితో చెప్పాడు. తనకిక దేనిలోనూ అభిరుచి లేదని నిక్కచ్చిగా తెలిపాడు. కాని జగ్గయ్యశాస్త్రికి మొదటినుంచీ రంగారావు తెలివితేటలమీద, శక్తిసామర్థ్యాల మీద అట్టే నమ్మకము లేదు. అదిగాక ఇతడు పుట్టిన మూడవ నెలలోనే తనతల్లి మారకము జరిగింది. అప్పటినుంచి ఒక మాదిరి జుగుప్స అతనికి తెలియకుండానే శాస్త్రి మనసులో ఉద్భవించి అభివృద్ధిచెందుతూవచ్చి రంగారావు జీవితంలో చాలా మార్పు కలుగజేసింది. అందువల్ల రంగారావు కొరకు ఖర్చుపెట్టేది వృథా ఖర్చు అన్న భావమేర్పడ్డది తండ్రికి మెడికల్ కోర్సును భరించలేననీ, ఇంకా చదువుకొనవలసిన పిల్లలున్నారనీ, నిర్మొగమాటంగా కొడుకుతో చెప్పాడు శాస్త్రి. దానితో రంగారావు మనసుకు విరక్తితోచి చదువు చాలించాడు. అంతకుముందే వివాహము అయివుండటమువల్ల తల్లిదండ్రులు ఈ సంగతి ఎక్కువ పట్టించుకో లేదు. తాను ముందు ఏమి చేయదలచుకొన్నదీ అతడెవరితోనయినా చెప్పటముగాని, ఇంట్లో అందరితో కలసిమెలసి ఉంటూ ఇంటి వ్యవహారాలు ఏవైనా తండ్రి చేతి క్రింద చూస్తూ ఉండటముగాని, జరుగలేదు. రంగారావు భార్య జానకి మాత్రము ఇంట్లో అత్తగారికి చేదోడు వాదోడుగా ఉంటూ చాలావరకూ అంతా సర్దుకొని పోయేది. తప్పించుకొని తిరిగే రంగారావుమీద ఉన్న కసి జానకిమీద తీర్చుకునే వారు. అతనేమిచేస్తున్నాడో-ఎక్కడికి వెళ్లుతూ ఉంటాడో తెలుసుకోవాలన్న కుతూహలంతో కాక వెక్కిరింపుగా జానకిని అడుగుతూ ఉండేవారు. ఎవరెంత ప్రయత్నించినా జానకి బయట పెట్టేదికాదు.

ఒకరోజు అత్తగారు "ఏమిటాపని? ఉదయము ఎనిమిది గంటలకు వెళ్లి మధ్యాహ్నము 12 గంటలకు గాని రాడుకదా. భోజనానికయినా ఒకరితో కలవడు.

మధ్యాహ్నము మూడు గంటలకు వెళ్లి రాత్రి ఎనిమిదింటికి వస్తాడు. ఏమిటి వాడి సంగతి? ఈ తిరుగుబోతువాడికి ఆలోచనలేదూ? కూర్చోబెట్టి ఎవరు పెట్తారని అనుకుంటున్నాడు-మంచి ప్రయోజకుడే...." అంటూ మనసులోనిదంతా వెళ్ల గ్రక్కింది. కళ్లు తుడుచుకోవటము తప్ప జానకికి జవాబు తోచలేదు.

ఆరోజు జగ్గయ్యశాస్త్రి రెండవకొడుకు ఆనందరావు ఏలూరునుంచి వస్తున్నాడని ఉత్తరము వచ్చింది. ఏలూరులో వకీలుగా నాలుగేళ్లనుంచీ ప్రాక్టీసు చేస్తున్నాడు. కోర్టుకు వేసవికాలపు సెలవులు కావటమువల్ల భార్యతో బయలుదేరాడు తండ్రిదగ్గరకి.

"ఏమే! ఆనందం ఎనిమిదింటికి వస్తాడు జ్ఞాపకముఉందా?" అని భార్యను హెచ్చరించాడు శాస్త్రి.

"అయ్యో! నాకేం మరపు? వాడికి గది సిద్ధంగా ఉంది. కాఫీ ఫలహారము కోడలు తయారుచేస్తోంది" అన్నది శాస్త్రి భార్య శాంతమ్మ.

"ఒరే రంగా! ఎక్కడికిరా వెళ్లుతున్నావు?" అని బైటికి వెళ్తున్న పెద్ద కొడుకును అడిగాడు.

"రోజూ వెళ్లేచోటికే. ఈ వేళ కొత్త ఏమున్నది? ఏం! పని ఏమయినా ఉన్నదా నాతో" అని కోటు సవరించుకొంటూ ఒక నిముషము ఆగాడు.

"పనేమిటి? ఆనందం వస్తున్నాడు ఎనిమిది గంటలకు, కార్డు చదువలేదూ?"

"చదివాను. వస్తే ఉండేవాడేగా ఈ సెలవుల్లో? నేను పది గంటలకు తిరిగి రానేవస్తుంటిని" అని కదిలాడు.

"కాదోయి. స్టేషనుకు వెళ్లి రావాలి" అన్నాడు శాస్త్రి కాస్తగట్టిగా.

"నాకు పనిఉన్నది. వాడికి యిల్లు తెలియదా-ఊరు తెలియదా" అంటూ చరచర నడిచాడు రంగారావు.

'వాని పోకడ చూస్తున్నారా' అన్నట్లు భార్య- 'చూస్తూనే ఉన్నా' అన్నట్లు శాస్త్రి, ఒకరినొకరు చూసుకున్నారు.

ఇంతలోకే వాకిట్లో బండిఆగిన చప్పుడు అయింది. గడపలోకి ఎదురుగా వెళ్లి, కుశలప్రశ్నలు వేశాడు జగ్గయ్యశాస్త్రి కొడుకును. శాంతమ్మ లోపలికి తీసుకొనివెళ్లి, కొడుకు-కోడలు-సంసారము-ప్రసంగించి కాఫ్యాదులు ఇచ్చింది.

రాత్రి జానకి భోజనాల కేర్పాట్లు చేస్తోంది. పీటలు చెంబులు సర్దుతూ ఉండగా శాంతమ్మ వచ్చి, "ఆనందానికి పెద్ద పీట తండ్రి దగ్గిరగా వేసి ఆ వళ్లెం పెట్టు. వెన్న కరగవేశావా, ఉంచావా?" అంటూ వచ్చి వడ్డనలో భాగము తీసుకున్నది.

"రంగన్నయ్య రాడేం భోజనానికి? చిన్న పిల్లలంతా వచ్చారా?" అంటూ ఆనందరావు తనకొరకు వేసిన పీటమీద కూర్చున్నాడు.

"ఏఓ రంగడు, పిలువు" అంటూ శాస్త్రి కోడలిని లోపలికి పంపాడు. వెళ్లిన రెండు నిమిషాలకు జానకి తిరిగివచ్చి "అత్తయ్యా? పడుకున్నారు. ఇప్పుడు రారుట. అందరి భోజనాలు కానివ్వమని అంటున్నారు" అన్నది.

"తన సంగతి చెప్పమను? అందరికి సలహాలు ఇవ్వ నక్కర్లేదు. తన కోసము ఇక్కడెవరూ కనిపెట్టుకొని కూర్చోలేదు" అంటూ శాస్త్రి ముఖమవతలికి తిప్పుకున్నాడు.

ఆనందము వచ్చిన దగ్గర్నుంచి రంగారావు గదిలోనుండి ఇవతలికి రావటము, మానివేశాడు. బయటనుంచి రావటము,గదిలోప్రవేశించటము,జరుగుతోంది.

భోజనానంతరము శాస్త్రి ఆనందరావుతో "మీ అన్నయ్య సంగతి నాకేమీ బోధపడటము లేదురా.తన సంగతి ఒకరితో చెప్పడు-ఒకరి సంగతి తాను పట్టించుకోడు. ఇంటరు ప్యాసయినాడుకదా.నలుగురు పిల్లలకు చదువు చెప్పినా బాగుండును అదీ కాకపోతే నా చేతిక్రింద పొలం పనులు చూస్తూ ఉన్నా బాగుండును. పరో జినిని అత్తవారింటినుంచి పిలిపించాలి. మనలోఎవరయినా వెళ్ళి తీసుకొనిరావాలి. వేలకువేలు సంపాదించేవాడికైనా తీరుబడి ఉంటుంది కాని వాడికి తీరిక లేదు" అని ఏదో కష్టం సుఖం చెప్పుకున్నట్లుగా అన్నాడు.

"అవును, నాకు తీరుబడి ఉంటే నేనే వెళ్ళేవాడిని. మొన్నటివరకు కోర్టులో పని చేసివచ్చాను? నాకు కొంచెము విశ్రాంతి కావాలి. అయినా తాను ఊరికేనే ఉన్నాడుగా?" అన్నాడు ఆనందరావు.

"నీమాట కాదురా. వాడి సంగతే చెప్తున్నాను. ఇంట్లో ఉన్న మనిషి ఇంటి బాధ్యత పట్టకుండా తిరుగుతూ ఉంటే ఎంతని సహించను? పోనీ సంపాదనఅయినా ఉంటే అనుకోవచ్చు. వాడిని వాడి భార్యను కూర్చోబెట్టి పెట్టాలి. అందులో ఇప్పుడామె గర్భిణి, ఇక వరుస సాగిస్తుంది ఇల్లునిండేవరకూ" అన్నాడు శాస్త్రి.

"ఓహో! అదా?" అన్నాడు హేళనగా ఆనందరావు.

"వంశాభివృద్ధి వీరివల్లనే కావాలి. లేకపోతే ఆగిపోతుంది. ముందు తమకిద్దరికి జీవనోపాధి లేదుగాని...."

ఇంతలోకి జానకి మంచినీళ్ళు తమలపాకులు తెచ్చి మామగారి బల్లమీద పెట్టటానికి వచ్చింది. జగ్గయ్యశాస్త్రి వాక్యంపూర్తి చేయలేక, "పొద్దు చాలగడిచింది ఆనందూ! పడుకో" అంటూ లేచాడు.

రాత్రి పదిగంటల సుమారుకు రంగారావు భోజనం చేశాడు. తమలపాకులు అందిస్తున్న భార్య ముఖం, లాంతరు పైకెత్తి చూశాడు.

"జానూ, జలుబు చేసిందా, మాట భారంగా ఉంది?" అన్నాడు రంగారావు. జానకి నీళ్ళు కారిన తన కళ్ళను, ముఖాన్ని కనబరచకుండా తల వంచుకున్నది.

* * * *

ఆ సెలవుల్లో మూడవకొడుకును పంపి కూతురిని అల్లుడిని పిలిపించాడు శాస్త్రి. పండుగలాగ ఇల్లు పచ్చగా నలుగురితో కలకలలాడుతున్నది. శాస్త్రిగారి భార్యకు తీరికే లేదు పిల్లలతో.

కాఫీ త్రాగిన తరువాత అంతా కబుర్లలో పడ్డారు

సరోజినికి జానకి జడ వేస్తున్నది. ఆమె అత్తవారింటి కబుర్లు వదినగారయిన జానకితో చెప్పటము మొదలుపెట్టింది.

"వదినా, పెళ్ళిలో నగలు పెట్టకుండా డబ్బు యిస్తాము తరువాత చేయించుకుంటామంటే ఎవరికీ మనసొప్పదు. నా సంగతి చూడు. నగలకింద యిచ్చినవేగా రూపాయలు? ఏదైనా చేయించుకుందామంటే ఇక [illegible] ఒప్పటంలేదు-

అక్కడ వాళ్ళు ఒప్పటంలేదు. నాకు విసుగ్గా ఉంది. చేతిగాజులు రెండుతీసి, నెక్లేసు చేయించుకుందామని అనుకుంటున్నాను. ఏమంటావు? అవునుగాని, నీచంద్ర హారము నెక్లేసు పెట్టుకోవెందుకమ్మా.ఇక్కడున్నాయా మీ వాళ్ళింట్లో ఉన్నాయా'' అన్నది సరోజిని.

''లేదమ్మా ఇక్కడే ఉండాలి'' అంది అశ్రద్ధగా.

''తీసుకురావమ్మా. మేమంతా ఉన్నప్పుడయినా పెట్టుకో. ఏమిటీ యింత అశ్రద్ధ?'' అని గట్టిగా బలవంతము చేసింది.

జానకి తాళపుచెవులు తన దగ్గర లేవని బొంకింది. కాని సరోజిని నిలవదీసి అడిగేసరికి, ''మీ అన్నయ్య తన పెట్టెలో పెట్టుకున్నారు రెండు నెలల క్రిందట తరువాత నేను అడగనూ లేదు, వారు ఇవ్వనూలేదు. అయినా నాకు నగలమీద అంత అపేక్ష లేదమ్మా'' అని జానకి నిజము చెప్పేసింది. 'అయ్యో!' అని బుగ్గలు నొక్కుకుంటూ సరోజని శాంతమ్మగారితోను, శాంతమ్మగారు శాస్త్రిగారితోను-ఒక నిముషంలో ఈ వార్తను వెల్లడిచేశారు. అప్పటికప్పుడే పెద్ద హంగామా జరిగి పోయింది.

''అయితే ఏం చేసినట్లు వాటిని? ఏమే జానకీ! ఇంట్లో పెద్దవాళ్ళముఉన్నాము కదా, చెప్పకుండా ఏమిటాపని? అడుగుతున్నాడని మాటమాత్రమూ మాచెవినవేయ గూడదా?'' శాస్త్రి రుద్రుడయినాడు. జవాబిచ్చే ధైర్యము లేకపోయింది జానకికి.

''బెల్లము కొట్టిన రాయిలాగ మాట్లాడవేమిటి? నన్ను అడగకుండా ఎందుకు ఇచ్చావు? నీవు సామాన్యురాలివా? అసలు నీవే మావాడిని ఎందుకూ పనికిరాకుండా చేశావు. ఇదంతా నీమాయే!'' అంటూ శాంతమ్మ చేతులు చాపుతూ జానకి మీదికి వెళ్ళింది.

జానకి పెద్ద చిక్కులో పడింది భర్తదగ్గర తన నగలు ఉన్నాయని తాను చెప్పటంలో, భర్త అడగగానే త్యాగబుద్ధితో అనుకూలవర్తినిలాగ వెంటనే ఇచ్చి వేసిందని తనకు మెప్పు రాకపోగా, కానీ సంపాదన లేకుండా భార్యాసహితంగా ఉంటూ భారమనిపిస్తున్న రంగారావు ఈ నగలన్నీ అమ్మి పాడుచేశాడన్న కోపము వాళ్ళందరికీ కలిగింది. కూర్చుంటే తప్పుగానూ, నిలబడితే అపరాధంగానూఉన్నది-పెద్దకొడుకు అన్న గౌరవము వీసమంతైనా కనబడలేదు.

"అవి నా నగలు కనుక వారు అడగగానే ఇచ్చాను. వీటిని ఏం చేస్తారని నేను నిలవదీసి వారినడుగలేదు. నా అంతరాత్మ వారిని సందేహించదు." ఊపిరి బిగబట్టుకొని జేవురించిన ముఖంతో చెప్పలేక చెప్పింది జానకి

"ఆహా! ఇంతవరకూ వచ్చిందీ నీసంగతి కూడా? మూగదేవతలాగ ఉన్నట్లే ఉండి, ఎంత పని చేశావు? ఆ నగలు నీవనుకున్నావా? శ్యామమోహన్ పెళ్ళికి ఉపయోగపరచాలని అనుకున్నాను అయ్యో! ఎంత పని జరిగింది!"

దొంగలుపడి సర్వమూ దోచుకున్న తరువాత కలిగే పరితాపము కలిగింది వాళ్ళకు. కళ్ళు తుడుచుకోవటానికి జానకి గదిలోకి వెళ్ళింది.

ఆ రాత్రి భోజనాల సమయానికి అయిదునిముషాల ముందర రంగారావు కూడా భోజనాల ఇంట్లోకి వెళ్లాడు.

"రంగా నీవు ఇటురా. అక్కడ బావగారు, ఆనందు కూర్చుంటారు, నీవు ఇటుప్రక్క పీటమీద కూర్చో" అంటూ తల్లి పిలిచింది. అందరికి వెండిపళ్ళెలు పెట్టి, తనకు ప్రత్యేకంగా విస్తరి వేసింది తన తల్లి! కూర్చున్నట్లే కూర్చుని తన గదిలోకి వెళ్ళి చూసేసరికి తన సామాను ఆ గదిలో లేవు! తన పెట్టె, బట్టలు బయట వరండాలో ఒక మూలకు పడిఉన్నాయి, తన మంచముమీద బావమరదికి పక్క వేశారు. ఇంకో గదిలో తమ్ముడు మరదలు! ఒకదాంట్లో తండ్రి సామాను పుస్తకాలు ఉన్నాయి, మరొకటి తల్లి చిన్న పిల్లలు! ఇంక ఆ ఇంట్లో తన కే గదీ లేదు-స్థలము లేదు!

చివాలున లేచి బయటికి వెళ్లి బండి తెచ్చి వాకిట్లో నిలబెట్టాడు. తన సామానులన్నీ అందులో పెట్టించాడు, వడ్డించి చేతులు కడుక్కుంటున్న జానకిని మాట్లాడనీయకుండా బండి ఎక్కించాడు. బండి నిముషాలమీద కదిలిపోయింది. ఇదంతా జరగటానికి అయిదు నిముషాలన్నా పట్టలేదు.

పీటమీదనుంచి రంగారావు ఎందుకు లేచాడో ననుకున్నవాళ్లకు- అప్రయోజకుడివల్ల ఇంతపని జరుగుతుందని తోచలేదు. వంట ఇంట్లోనుంచి నేతిగిన్నె తీసుకొని జానకి ఇంకా రాదేమని పిల్లలు పెద్దలు కేకలు పెట్టారు. శాంతమ్మ వంట ఇంట్లోకి పోయి చూసింది. పిల్లలు లేచి ఇల్లంతా వెతికారు. "అన్నయ్య కూడా లేడు ఏదో బండిచప్పుడవుతోంది వీథిలో" అన్నారు పిల్లలు.

కుండెడు పాలు విరిగినందువల్ల గృహిణికి కలిగేసంచలనమన్నా కలుగలేదు శాంతమ్మకు

"ఎక్కడికి వెళ్తారు? అత్తవారు మాత్రము ఇటువంటి వారిని నెత్తిన పెట్టుకొని చూస్తారా?" అనుకొని అందరూ తలకొకమాట అన్నారు. అంతే దుష్టాంగము దానంతట అదే ఛేదించుకొనిపోయినంత హాయి ననుభవించాడు శాస్త్రి.

*　　*　　*　　*

ఆరు సంవత్సరాలు గడచిపోయాయి. బొంబాయిలో రంగారావును అతని బంధువు అకస్మాత్తుగా కలుసుకోవటము తటస్థించిన తరువాత జగ్గయ్యశాస్త్రి దగ్గర్నుండి ఒక ఉత్తరము వచ్చింది రంగారావుకు.

"చి. రంగారావును పుత్రపౌత్రాభివృద్ధిగా దీవించి వ్రాయునది ఏమనగా:- నీవు భార్యాసమేతంగా బొంబాయిలోఉంటూ పుస్తకాల దుకాణం పెట్టినట్లు మన సుబ్బారావువల్ల తెలిసింది. నీ పిల్లలు నీస్థితి అంతా చెప్పాడు. చాలా సంతోషమయినది. అ. మీ అమ్మ. నీ తమ్ముళ్ళు, నిన్ను చూడాలని అనుకుంటున్నారు. నేను కూడా పెద్దవాణ్ణి అయ్యానుకదా నీ బిడ్డలను తీసుకొనివచ్చి చూపించు. క్షేమం వ్రాయి.

ఇట్లు
జగ్గయ్యశాస్త్రి వ్రాలు.

అది చదువుకుని తిరుగుటపాలో రంగారావు తండ్రికి జాబు వ్రాశాడు.

"బ్రహ్మశ్రీ నాయనగారికి-నమస్కారములు. మీరు వ్రాసిన జాబు చేరింది నేను ఇక్కడికి వచ్చి పుస్తకాల వ్యాపారము పెట్టుకున్నాను. వివరాలు సుబ్బారావువల్ల మీకు తెలిసే ఉంటాయి. మీ సంతానంలో నేను ఒక అప్రయోజకుడివలె ఎంచబడ్డాను. నా సోదరీ సోదరులమధ్య నేను- అసమర్థుని స్థానము ఆక్రమించుకొని- జీవచ్ఛవంవలె ఉండలేక పోయినాను. నాకభిరుచిగల వృత్తిలోకి మీరు పోనివ్వలేదు. అక్కడ ఉన్నప్పుడే ప్రక్కగ్రామంలో హోమియోపతివైద్యముచేసి చూశాను. రాబడి తృప్తికరంగా లేక, జానకి నగలన్నీ అమ్మి వేసి. షాపు పెట్టాను.

ఆదాయం తృపికరంగానే ఉంది. ఇక్కడికి వచ్చిన తరువాత ఇద్దరు బిడ్డలు పుట్టారు. అయినప్పటికీ నాకు ఏవిషయంలోనూ పెద్దల ఆశీర్వచనము లేదు. నేను నా పుట్టుకతో ఎరుగని ఆత్మగౌరవము ఇక్కడికివచ్చి సంపాదించాను. ఆ ప్రాంతాలకు నేను ఇప్పుడు వచ్చి గడచిపోయిన నాజీవితము జ్ఞాపకము తెచ్చుకొని బాధపడలేను. అయినా నేనుమాతృపితృఋణము తీర్చవలసియున్నది. పిల్లలకొరకు నెలకు ఏభయి రూపాయలు పంపుతూ ఉంటాను, సెలవు. ల. అమ్మగారికి నమస్కారములు.

ఇట్లు
రంగారావు"

ఉత్తరము చదువుకొని జగ్గయ్యశాస్త్రి ముఖము ముడిచాడు. 'చెప్పుడు మాటలు తల కెక్కినాయి. అయినా అడ్డాలప్పుడు బిడ్డలుగాని గడ్డాలు వచ్చిన తరువాత బిడ్డలుకారు' అంటూ శాంతమ్మ కొంగు దులుపుకున్నది.



# పునర్లబ్ధము

ఉదయము ఎనిమిది గంటలకు 'కస్తూరిబాయి నర్సింగు హోము' ముందర కారు ఆపి శ్రీనివాసరావు రాధ లోపలికి వెళ్ళారు.

సంప్రతించవలసిన సమయానికి సరిగా డాక్టరు ఆ గదిలోకి వచ్చి కుర్చీ మీద కూర్చున్నాడు. అక్కడికి వచ్చిన వాళ్ళలో రాధ పన్నెండవది. ఆమె తరువాతకూడా చాలామంది వచ్చారు. రోగులు 'క్యూ'లో నిల్చున్నట్లుగా ఉన్నారు.

రాధవంతు వచ్చేసరికి పదిగంటలు కావచ్చింది. రోగి భర్తను పిలిచి, ఆయన ముందర రోగిని పరీక్షచేశాడు డాక్టరు శంకరము.

శ్రీనివాసరావును కాస్త అవతలికి తీసుకొని వెళ్ళి ఆమె వినకుండా నెమ్మదిగా చెప్పాడు డాక్టరు. శ్రీనివాసరావుకు ఆయనమాటలు వినగానే చెమటలు పోశాయి.

"అయితే ఏమంటారు? ఇక్కడ ఉంచటము తప్పంటారా?"

"తప్పకుండా ఉంచాలి. క్షయక్రిందకి దింపే సూచనలున్నాయి. ప్రారంభములోనే సరైన చికిత్స నడిపితే తగ్గిపోతుంది. చూశారా క్షయవ్యాధి భయంకరమైనది. ఆవ్యాధి వచ్చినవారు నష్టమయిన సరుకుక్రింద లెక్కే. ఈమెను, మా నర్సింగ్‌హోములో ఉంచండి. ఇళ్ళలో జరిగే అశ్రద్ధలు జరుగవు. సరిగా రెండు నెలలు-లెక్కపెట్టి-ఉంచండి. ఇంక మీరు ఏవిధమయిన బెంగపడనక్కరలేదు..

"ఎంత అకస్మాత్తుగా జరిగిందనుకున్నారు? సినిమాకు వెళ్ళిన ఒక గంట వరకు బాగానే ఉంది. నేను డ్రింకుతెచ్చి, చేతికిచ్చేసరికల్లా ఆ చేతికి పట్టులేదు. కాళ్ళు చేతులు చలువలుకమ్మాయి - నోట్లోంచి నురుగు-కళ్ళు మూసుకుపోవటము- అన్నీ ఒక్కసారి జరిగాయి."

"ఎన్ని దినాలనుంచి ఉన్నదో-నిన్న పైకి కనిపించింది. శ్రద్ధతో చికిత్స చేస్తే అన్నీ తగ్గిపోతాయి. ఇక మీరు నిశ్చింతగా ఉండండి."

"నిన్నటినుంచీ నా మనసు చాలా ఖేదపడుతోంది, డాక్టరుగారూ! నా జన్మకు సుఖమనేది లేదు." కళ్ళనీళ్ళు అపుకుంటూ గొంతు సవరించుకొని "నా మొదటిభార్యకు పురుడువచ్చిన నెలకు పిచ్చిఎక్కింది. ఏ మందువాడినా, కొంత కాలానికిగాని తగ్గదని డాక్టరు అన్నాడు. కొట్టటము-తిట్టటము; ఇంట్లో ఉంచుకోవ టము దుర్భరమయిపోయి, డాక్టర్ల సలహామీద విశాఖపట్టణములో ఉంచాను. తొమ్మిది సంవత్సరాలయినా, మార్పు లేకపోవటంవల్ల, రెండేండ్లక్రింద ఈమెను వివాహము చేసుకున్నాను. ఇంతలోకే ఈ విఘాతము."

"మీరు ఏమీ భయపడవద్దు. నియమంగా ఆహారము-పరిచర్య-ఔషధసేవ జరుగుతాయి. డబ్బుకు మాత్రము వెనుదీయకండి."

"మీరు ఎంతకావాలంటే అంతకు సిద్ధము. నా జన్మంతా యింతేనా అని కుమిలిపోతున్నాను."

"వారికొక గది ప్రత్యేకించుతాము. అవసరమయిన ఏర్పాట్లన్నీ జరుగు తాయి. ఉదయంగాని సాయంకాలంగాని మీరు రావచ్చును. ఒక నెలబిల్లు అడ్వాన్సు కట్టండి, మిగిలినవి మేము చూస్తాము. కాని చూడండి-ఆమెకు మనసు కలత చెందకుండా చూడాలి. బిడ్డలున్నారా?"

"లేరు."

"సరే నేను సెలవు తీసుకుంటాను. చెప్పవలసినన్నీ చెప్పినట్లేగా" అంటూ డాక్టరు శంకరం ప్రక్క గదిలోకి వెళ్ళాడు.

"రాధా! నేను రెండుపూటలూ వచ్చి చూస్తాను. నీ కెప్పుడు ఏది కావా లంటే, అది పనివాడిచేత తెప్పించుకో. వాడు ఇక్కడే ఉండేటట్లు ఏర్పాటుచేస్తాను దేనికయినా, అవసరానికి ఈ రూపాయలు ఖర్చుపెట్టు. నెలబిల్లు అడ్వాన్సు యిచ్చాను. ఎం? నిశ్శబ్దంగా. చిన్నబోయిన ఆ యింట్లో, మురళీ నేను ఎట్లా ఉండగలమా అని ఆలోచిస్తున్నాను. నీవు లేకపోతే మురళి దిగులు పడడు? అయినా రెండు నెలలేగావి........"

"రెండు నెలలు? అంతకాలము నన్ను ఇక్కడ ఖైదీగా ఉంచుతారా? ఈ మాత్రపు దానికి ఇక్కడ ఉండటము అనవసరముకాదా? డాక్టర్లకేం? చెప్తారు. వాళ్లకేమన్నా మన కష్టసుఖాలు అర్థమవుతాయా? మీరు అనవసరంగా లేనిపోని ఆదుర్దా పడుతున్నారు."

"దేనికయినా జాగ్రత మంచిది చూడు. మురళికి ధైర్యము చెప్పు. అదిగో నీ గడ్డము వణుకుతోంది. అదే వద్దన్నాడు డాక్టరు. సాయంకాలము నాలుగు గంటలకు ఇద్దరము వస్తాము. నీకు చదువుకోటానికి పుస్తకాలు పంపుతాను. ఇంక వెళ్ళనా?"

రాధ ముఖము ప్రక్కకు త్రిప్పుకొని కళ్ళు తుడుచుకుంటుండగా, వెనక్కి చూడకుండా శ్రీనివాసరావు భారంగా నడుస్తూ వెళ్లిపోయాడు!

ఆ సాయంకాలము నాలుగు గంటలకు కాఫ్యాదులు ముగించుకొని శ్రీనివాసరావు మురళితో సహా నర్సింగ్‌హోముకు వచ్చాడు. తండ్రి సరిగా భోజనము చేయలేదనీ, కాఫీ త్రాగలేదనీ, తల్లితో చెప్పుదామనుకొన్న మురళికి, వాచి ఎర్రగాఉన్న తల్లి ముఖము చూసేసరికి దుఃఖము ఉబికివచ్చింది.

కులాసాగా కబుర్లతో ఒక గంట గడిపి, బరువెక్కిన హృదయంతో మురళీ చేయి పట్టుకొని శ్రీనివాసరావు ఇల్లు చేరాడు. అరమైలు దూరము గంటన్నర నడిచాడు. ఆ రాత్రి కన్ను మూతపడలేదు. తనకు కళత్ర స్థానములో పాప గ్రహాలు కూడినట్లున్నాయి. కాకపోతే ఒకరయినా సరిగా ఉండకూడదూ!

ఆఫీసుకు వేళకు వెళ్ళి యింటికి రావటము, మురళితో నర్సింగుహోముకు వెళ్ళటము, తిరిగి ఇంటికి వచ్చి భోజనంచేసి పడుకోవటము. కలతనిద్రతో, శ్రీనివాసరావు ఒక నెలకల్లా చిక్కి సగమయ్యాడు. పాలిపోయిన ముఖము-సంతోషము లేని నవ్వు-రాధ కనిపెట్టింది. ఒంటరితనము-మనసులో దిగులు!

తీర్చిదిద్ది, అందాల పోటీకి నిలబెట్టినట్లుంది రాధ విగ్రహము బాల్యంలోనే. తల్లీ తండ్రీ కరవయిపోతే బంధువులంతా పట్టించుకోకపోగా వెలివేశారు రాధను. పరిచయస్థులంతా చందాలు వేసుకొని, అనాథ శరణాలయంలో చేర్చారు. రాధ పెద్దది కాకపూర్వమే వాళ్ల జాలి కాఠిన్యరూప మెత్తింది. శరణాలయాధికారుల

ఆదరంవల్ల అక్కడికి వచ్చి, చూచిపోయే వారి అభిమానమువల్ల, బి. ఏ. వరకు వచ్చింది.

పదిహేను సంవత్సరాలు శరణాలయంలో గడిపింది రాధ, చింపిరి జుట్టుతో జీర్ణవస్త్రాలతో — వచ్చిన ఏడు సంవత్సరాల పిల్ల పట్టభద్ర అయింది! కాని, ఇప్పుడు ఎక్కడికని వెళ్లుతుంది? ఆమె కెవరున్నారు? శరణాలయంలో ఉంటూ ఉద్యోగ ప్రయత్నాలు చేస్తున్నది.

ఆనాడు శుక్రవారము. ఉదయం పది గంటలకు రాధగదిలో కూర్చొని ఆలోచిస్తున్నది. లోకంలో 'నా' అన్నవాళ్లు లేకపోతే ఎంత కష్టము? తననింత పైకితెచ్చిన శరణాలయమువారు తన కెంతో పూజ్యులు. వాళ్లకు తనంటే ఎంతో అభిమానము. కాని ఆ ప్తుల ప్రేమ ఎట్లా ఉంటుందో? అనుభవమూ లేదు—లోకం చూడనూలేదు; ఏదో పుస్తక పరిచయము తప్ప, పెండ్లిచేసుకొని సంసారజీవనం చేస్తే? ఆ విషయం తనంతట తానే ఆలోచించుకోవాలో, ఎవరయినా నిర్ణయము చేస్తారో అంతకంటె అర్థము కావటంలేదు కాకపోయినా, పెండ్లి తనవంటివారు తలపగూడని సమస్యేమో? చదువుకుంటూ ఉన్నన్ని దినాలు ఏ సమస్యలు లేకుండా కాలం కడిచింది. కాని యిప్పుడు అన్నీ సమస్యలే. చదువుకుంటూ శరణాలయంలో ఉంటే అర్థమున్నదిగాని—ఊరికే తింటూ ఎన్నాళ్ళు? తన మనసు నొచ్చకుండా వాళ్ళు ఏదో గౌరవమైన పనులు చెప్తూ ఉంటారుగాని.... పేపర్లో చూసిన ప్రకటన కల్లా దరఖాస్తు పంపిందిగాని అందులో ఒక్కదానికయినా జవాబు రాలేదు. గౌరవ మైన వృత్తులు స్త్రీలకు బోలెడున్నాయి. కాని తనను-ఒంటరి జీవిని—ఎవరు కడుపు లో పెట్టుకొని, కష్ట సుఖముల బాధ్యత వహిస్తారు? ప్రతి నిమిషానికి క్రుంగటం మొదలుపెట్టింది అప్పుడే కాలేజీ వదలి పెట్టడము, చాలినంత లోకానుభవము లేక పోవటము దిగులుకు అనువైనయి.

ఇంతలో తపాలామనిషి వచ్చి పిలిచేసరికి గుండె గబగబ మన్నది. తనకు ఉద్యోగము వచ్చినట్లు, తెలిపేవాడు ఆ దేవుడేగా! 'అమ్మా' అని పిలవగానే, అమాంతము లేచి వెళ్లింది గడపలోకి తెచ్చిన ఉత్తరము చింపి, చదివి, "చూడూ! ప్రస్తుతము నీ కివ్వదగినది నా దగ్గర ఏమీలేదు. ఈచీరె తీసుకో! నీ భార్యకియ్యి!" అని తన చీరెలలోంచి ఒకటి తీసి ఇచ్చింది.

ఉత్తరము మరొకసారి చదువుకుంది. తనకు ఉద్యోగము వచ్చింది! ఎంతో అంత ఇస్తారు. తన తిండి తాను తినవచ్చు. ఎంత ఇస్తే నేం? తొంభయి రూపాయలకంటె తాను ఏంచేసుకుంటుంది? తాను ఎల్. టి. అయినా కాలేదు.

మళ్లీ తలుపును ఎవరో తట్టిన శబ్దము. కనుబొమల ముడితో తలుపు తెరచింది-వాళ్ళరాక తనకేమిటో చికాకును కలిగించినట్లుగా. శరణాలయాధికారి ఒక యువకుని వెంటబెట్టుకొని వచ్చాడు. అతడెవరయితే తనకేమిటి, ఒక గంటక్రింద తానూ ఒక ఉద్యోగి అయింది. ఈ ఆలోచనతో వాళ్ళను కూర్చోమనటముకూడా మరచిపోయి, కళ్ళురెండూ ఒప్పగించి ఊరుకుంది.

"రాధా! మేము నీతో కొన్ని విషయాలు మాట్లాడాలని వచ్చాము. వీరు శ్రీనివాసరావుగారు. శరణాలయానికి మొదటినుంచీ చేతనయినంత సహాయము చేస్తున్నారు. భవనము పూర్తిఅయిన అరువాత చూడలేదని వచ్చారు. నీకు వీరిని పరిచయము చేయాలని నీ గదికి తీసుకొని వచ్చాను."

తల ఎత్తకుండానే 'సరే' అన్నట్లుగా తల ఊపింది రాధ.

"నీవు పరీక్ష ప్యాసయావు. చదువు పూర్తిచేశావు. నీ భారము వహించే బంధువులు ఎవరూ నీకు లేరు. నీ విషయంలో కొంతభారము మేము వహించవలసి ఉన్నది. ఇప్పుడు కాకపోయినా, ఇంకా కొన్నాళ్ళకయినా నీకు ఉ్యదోగము దొరకకపోదు. కాని నీకు 'నా'అన్నవాళ్ళు ఎవరూ లేరు. కాబట్టి ఉద్యోగంకన్న ముందర వివాహమే యోగ్యమైన సలహా అని భావిస్తున్నాను బాగా ఆలోచించుకో. మీ కులస్థులు శ్రీనివాసరావుగారు, వయసు నలభయిలోపుగా ఉంటుంది. పిత్రార్జితము బాగా ఉంది. అదిగాక ఉద్యోగము చేస్తున్నారు. విజ్ఞానం విత్తంతో కూడా తనను అర్పించుకుంటానంటున్నారు. ఒక కొడుకున్నాడు చిన్నవాడు. నీ అభిప్రాయం చెప్పు. కాని నిన్ను ఏదోవిధంగా ఇక్కడినుంచి పంపాలని, నా ఉద్దేశ్యం కాదని గ్రహించుకో. నీ ఇష్టప్రకారమే, మేము ఏసలహా అయినా ఇవ్వగలము. మీ ఇద్దరు ముఖాముఖి మాట్లాడుకోవచ్చును. ఏమైనా సందేహాలుంటే తీర్చుకోవచ్చును."

రాధ తలఎత్తకుండానే కాలి బొటన వ్రేలితో నేల రాస్తున్నది.

చాల నేర్పుతో అయస్కాంతాన్ని ఇనుము ముందర పెట్టాడు అధికారి. రాధ ఏమంటుంది? ఈ సమస్యలో ఉద్యోగపు సంబరము మరచిపోయి తన శ్రేయోభిలాషి అయిన ఆ పెద్ద మనిషికి తెలుపనైనా లేదు.

ఒకసారి తలఎత్తి శ్రీనివాసరావును చూడగానే తన కళ్లయొక్క శక్తికొంత తగ్గినట్లనిపించింది రాధకు. సులోచనాల వెనుక మెరుస్తున్న శ్రీనివాసరావు కళ్ళను కాదనలేకపోయింది. మంగళసూత్ర మొకచేతిలో-మంత్రాక్షత లొకచేతిలో పట్టుకొని, దీవించటానికి సిద్ధంగాఉన్న శరణాలయాధికారిని వారించలేకపోయింది. ఒక్కసారే ఇద్దరూ నమస్కరించారు అధికారికి.

ఒక శుభముహూర్తమున దంపతులయ్యారు.

* * * *

కొత్త కాపురం రాధకెంతో ముచ్చటగా ఉంది. మురళి ఎంత ముద్దుగా ఉన్నాడని! వాడిని చూసేసరికి తన చిలిపితనమంతాపోయి. తల్లియై సంరక్షణ చేయాలనిపించింది. 'అమ్మ!' అని పిలవటము. అన్ని పనులు తనచేత చేయించుకోవటము తమ ఇద్దరి నడుమ రాయబారాలు నడపటము- ఒక్కక్షణమైన తనను ఒంటరిగా ఉండనీయకపోవటము-అంతా వింత!

తండ్రీ అంతే. ఆఫీసునుంచి రాగానే. ఇల్లంతా వెతుక్కుంటూ వచ్చి ఆప్యాయంగా పలుకరించటము-తననొక దేవతగా చూడటము-ఆ ప్రణయ మూర్తులతోసహా తానా ఇంటిని పాలించటము! ఈశ్వరమాయ! శరణాలయంలో అనాథలతో పెరిగిన జీవి తాను, రూపాయ అంటే పదహారణాలా అని విస్తుపోతూ 'తన జన్మలో ఎప్పటికయినా అదృష్టము పట్టుతుందా' అని నిట్టూర్చే తనకేమిటి- సిరి సంపదలతో-అందచందాలతో-శ్రీనివాసరావు లభించట మేమిటి? ఎక్కడి కే దరి? ఇదంతా కలయేమోననీ, మెలకువ వస్తుందేమోననీ రాధ కొకొక్కసారి జలదరింపుగా ఉండేది.

శ్రీనివాసరావుకుగాని మరళికిగాని ఈమె సాహచర్యము—ఈ మెరాక— సామాన్యంగా లేదు. మురళికైతే స్వర్గంలో ఉన్నట్లే ఉంది. శ్రీనివాసరావు ఇల్లాలిని ఎన్నడు ఎరుగనట్లే ఉన్నాడు. ఇంట్లో అగ్గిపెట్టె తేవటము దగ్గర్నుంచి తాను

కొనుక్కోవలసి వచ్చిన జన్మ తనది! బాధ్యతాయుత ప్రభుత్వమంటే అక్షరాలా తన ఇంటిలో ఇప్పుడు అమలులో ఉన్నదే! అది తన ఇల్లు కాదో-తాను శ్రీనివాసరావు కాడో- లేక తన కళ్ళను తానే నమ్మలేకపోతున్నాడో! అప్పుడప్పుడు దేవతలు శాపదగ్ధులై, భూలోకంలో జన్మిస్తారని పురాణాలు చెప్తాయి. ఆ బాపతేమో ఈ రాధ!- ఇదీ శ్రీనివాసరావు వరుస.

అతి మధురంగా గడచే రోజుకీ ఇరవయినాలుగు గంటలే! ప్రకృతి చిత్రం!.

* * * * *

అక్కడికి రెండు దినాలనుంచీ రాధ తహతహలాడుతోంది. సాయంకాలం నాలుగు కాగానే రోగులందరికోసము విజిటర్లు గుంపులు గుంపులుగా వస్తారు. తన కోసము ఎవ్వరూ రావటములేదు. రెండుదినాలనుంచి, ఎదురుచూసి చూసి, కళ్లు కాయలు కాచే యనుకున్నది.

'అమ్మయ్య, మురళివచ్చాడీవేళ' అనుకొని మంచము మీదనుంచి లేచింది. కాని ఏడుపు ముఖంతో ఉన్నాడెందుకనో?

"మురళీ! విన్నా మొన్నా రాలేదేమిరా? నాన్నగారు కూడా రాలేదేం?" అంటూ దగ్గరికి తీసుకుంది. బుజ్జగిస్తూ అడిగేసరికల్లా మురళి బావురుమన్నాడు. ఎక్కు వచ్చేవరకు ఏడ్చాడు సంగతేమిటో చెప్పకుండా.

ఎంతోసేపు బ్రతిమిలాడగా, బయటపెట్టాడు. నాన్నగారు చికాకుగా ఉన్నారనీ, ఊరినుంచి ఒకావిడ వచ్చిందనీ, తనకు తల్లినని చెప్తున్నదనీ, వాళ్ళిద్దరూ వాదించుకుంటూ నడుమ తనను కొట్టారనీ, తనను నర్సింగుహోముకు వెళ్ల వద్దంటే తానాదినము తప్పించుకొచ్చాననీ ఏకరువు పెట్టాడు.

"నీవెప్పుడు వస్తావమ్మా ఇంటికీ? నా పాఠాలన్నీ పోతున్నాయి. నాబొమ్మల ఆల్బములోకి కొత్త బొమ్మలు లేవు. నాన్నగారు పెట్టిన పంతులు రానే రావటము లేదు. నాన్నగారు కనుక్కోనయినా కనుక్కోరు. ఈ దినమునుంచీ నేను ఇక్కడే ఉంటా' నంటూ మారాము చేశాడు.

"చూడు మురళీ! ఇక్కడ రోగులుతప్ప మంచివాళ్లు ఉండరు. డాక్టరుగారితో చెప్పి నేనే తొందరగా వస్తానుగాని నీవు ఇంటికి వెళ్లు. మా నాయన మురళి మంచి

వాడు, ఉప్పుసత్యాగ్రహం చేస్తున్న గాంధి-కస్తూరీబాయి సమేతుడయిన గాంధి-వైస్రాయితో మాట్లాడుతున్న గాంధి-ఈ మూడు గాంధి బొమ్మలను, నీ ఆల్బములో మూడు కాగితాలమీద మూటివి అంటించుకో, కొత్త ఆల్బములో, మొదటి పేజీమీద నేనిచ్చిన బుద్ధుని బొమ్మ అంటించు. అన్ని ఆల్బములు నీట్‌గా ఉండాలి. అన్నముపెట్టి అంటించేటట్లయితే బొమ్మల కాగితానికి ఎత్తుపల్లాలు వస్తాయేమో-చూసుకో బాబూ. చీకటి పడుతుంది. ఇంటికి వెళ్ళమ్మా'' అంటూ మురళిని ఇంటికి పంపింది, రాధ హృదయము పాదరసం అయింది,

* * * * *

రాధ నర్సింగుహోములో ఉండి ఉపచారము పొందటము అయింది, ఇంటికి వెళ్ళి నిశ్చింతతో ఉండవచ్చునని డాక్టరు చెప్పాడు.

రాధ ఇంటికి చెప్పి పంపదలచుకోలేదు. కొన్నాళ్లుగా శ్రీనివాసరావు ముఖం కనబరచటములేదు.అతడు తప్పించుకొని తిరుగుతున్నట్లుగా కనబడుతున్నది సంగతి చూస్తే. ఆ స్థితిలో తానెందుకూ తనసంగతి జ్ఞాపకము చేయటము?

ఇవ్వవలసిన బిల్లు ఇదివరకే శ్రీనివాసరావు చెల్లించాడు. మిగిలిన చిల్లర ఖర్చులు తన దగ్గరున్న డబ్బుతో పెట్టింది. ఆమె బట్టలు చాలావరకు నర్సింగుహోములోనే ఉన్నాయి. ఇక్కడినుంచి శ్రీనివాసరావుకు తెలియకుండా ఎట్లాగయినా ప్రయాణము కావాలి.

ఆమె టాక్సీకారు తెప్పించుకొని స్టేషనుకు వెళ్ళింది. సరిగా మద్రాసుకు వెళ్లేరైలు ఇంకో అరగంటలో బయలుదేరుతుంది.

తాను ఎక్కడినుంచి ఇక్కడికి వచ్చినదో-ఇప్పుడు తిరిగి అక్కడికే-మద్రాసుకే, వెళ్ళిపోవలెనని టికెటు కొన్నది.

వెయిటింగురూములో కూర్చుని తన సంచిలో దాచిఉంచిన తన ప్రణయమూర్తుల ఫోటోలను చూస్తున్నది.

అనాథ అయిన తనకు అమరుల సాహచర్యము ఎంత అకస్మాత్తుగా కలిగిందో-అంత ఆకస్మికముగానే విడిపోబోతున్నది!

ఆ మూర్తుల సాహచర్యము ఇప్పుడొక పెద్దబాధ అయింది.

ఇంతలోనే ఏమూలనుంచో, 'ఇక్కడికి ఎట్లా వచ్చావమ్మా' అంటూ మురళి పరుగెత్తుకుంటూ వచ్చాడు.

దిగ్భ్రాంతితో ఆమె మురళిని దగ్గరకి తీసుకొన్నది.

వెనుకనుంచి వస్తున్నాడు శ్రీనివాసరావు ఇంకొక ఆమెతో. మురళిని రాధనుచూసి ఒక్కఅంగలో సమీపించాడు.

"రాధా! ఇక్కడికెట్లా వచ్చావు? ఎక్కడికి వెళ్లాలని?" అంటూ ఆమె రెండు చేతులను తన చేతులతో పట్టుకున్నాడు.

రాధవైపు మొదలు చురచుర చూసిన సావిత్రి, "రాధంటే! ఈమేనా తన వాళ్ళను మంత్రముగ్ధులను చేసినది ఈ వ్యక్తేనా?" అనుకుంటూ వాళ్ల ముగ్గురి వైపు చూసింది.

అదేమిటో–వాళ్ల నోటిమాట లేకుండా ప్రతిమలవలె నిలబడి పోయినారు! ముత్యాలలాగ కన్నీటిబొట్లు బొటబొట నేలమీద పడుతున్నాయి.

మరొకసారి వాళ్ళను చూసేసరికి సావిత్రి మనసు వెన్నలా అయింది. బాధ పడుతున్నవాళ్ల సంగతి బాధపడ్డవాళ్లకే తెలుస్తుంది.

"రాధా! వీళ్లిద్దరిని నీ దగ్గరనుంచి తీసుకొని వెళ్ళాలని నేను వచ్చాను. ఆ తరువాత నీ భవిష్యత్తు నీవే నిర్ణయము చేసుకుంటావని అనుకున్నాను. నీ పరోక్షాన నా మనసెంత దహించుకొని పోయిందో – నీ సమక్షాన అంత ఆనందము అనుభవిస్తోంది. నీ సాహచర్యంలో వీళ్ళిద్దరు ప్రణయ మాధుర్యాన్ని రుచిచూశారు. నా కంటె నీవే వీళ్ళిద్దరికి సన్నిహితురాలవు. ఒంటరి జీవితానికని వీళ్లఫొటోలు తీసుకొని బయలుదేరినట్లున్నావు. నీ సామానులన్నీ టికెటుతోసహా నాకివ్వు." అంటూ సావిత్రి సామానులన్నీ రైలులో పెట్టించుకొని ఎక్కి కూర్చున్నది.

విడువమంటే పాముకు కోపము వస్తుందో–కరవమంటే కప్పకు కోపము వస్తుందో–అని తలముసకలుగా ఉన్న సమస్యను ఏ విధంగా పరిష్కారము చేయాలని ఆలోచిస్తున్న శ్రీనివాసరావు, సావిత్రిచేసిన మార్పును గ్రహించుకోలేక, కదలబోతున్న రైలు దగ్గరకు వెళ్ళాడు.

"రాధ చెన్నపట్నము వరకు టికెటు తీసుకొన్నది. మద్రాసునుంచి అరుణా చలము భగవాన్ దగ్గరికి వెళ్తాను. మూర్తిత్రయము సుఖముగా ఉండ కోరుతాను. సెలవు" అని సావిత్రి అంటుండగా మిగిలిన మాటలు రైలు రొదలో కలిసి పోయాయి.

పొగడపూలచండ ఘుమఘుమవలె- ఆనందము వెదజల్లుకుంటూ, ముగ్గురూ గృహోన్ముఖు లయ్యారు. మళ్ళీ ఒకరి కొకరు దైవికంగా లభించారు-ముచ్చటగా:



# సలహా

మోటారు కంపెనీనుంచి వస్తున్న లక్ష్మీకాంతరావును ఎగాదిగా చూస్తో, ఏం ఇంతపొద్దున బయలుదేరావు ఇటు?'' అన్నాడు రామారావు.

తల వంచుకుని 'ఆ కారు ఎంతచేస్తుందో తెలిసినవాళ్లకు ఎవరికయినా చూపించి ధరచేయాలి' అని యోచిస్తున్న లక్ష్మీకాంతము రామారావుని చూడగానే ఉలిక్కిపడ్డాడు.

కంపెనీలో ఉన్న స్నేహితుడితో మాట్లాడటానికి వచ్చానని సమాధానము చెప్పినా, మనసులో బాధగానే ఉంది తనమీద రాజ్యంతో ఏం చాడీలు చెప్తాడో అని. సహాయం లేకపోగా ఆలివంకవారు ఇందుకు పనికివస్తారు.

నాలుగేళ్లనుంచి అకౌంట్సు ఆఫీసరుగా పనిచేస్తున్న లక్ష్మీకాంతరావు సంసారాన్ని జాగ్రత్తగా, గౌరవంగా నెట్టుకొస్తున్నాడు. పొదుపు విషయానికి వస్తే, భర్త ఎంత పొదుపరో భార్య అంత జాగ్రత్త కలది. అట్లా అని వాళ్లు ఖర్చులంటే వెనుకడుగు వేసే రకముకాదు. అవసరాన్ని పట్టి, అతని పరిస్థితులనుపట్టి ఎప్పటికప్పుడు ఖర్చులే వస్తున్నాయి. అయినా సిగరెట్టుముక్కన్నా పీల్చే అభ్యాసం లేదు. కాబట్టి ఏదోకొంత నిలువచేశాడు. కొద్ది పిత్రార్జితంతో సంసారం గడుపుకుంటూ నిలవలో పడ్డాడంటే ఈ కాలంలో చెప్పుకోతగ్గ విషయమే అంటారు ఇరుగు పొరుగు. ఆ నిలవ కావటమే ఈమధ్య భార్యాభర్తలలో కొంత అశాంతిని పుట్టించింది.

ఏమిటంటే అసలుసంగతి-లక్ష్మీకాంతము మొదటినుంచీ ఏదో ఒక ఉద్దేశము మనసులో పెట్టుకొనే జాగ్రత్తగా డబ్బు వాడుకొనేవాడు కొంత నిలువ కాగానే ఆ ఊహను అమలుపరచాలని దృఢపరచుకున్నాడు. అప్పుడప్పుడు స్నేహితులతో 1945 సం. తాను రేడియో ఒకటి, చిన్న కారు ఒకటి కొంటానని చెప్తూ వచ్చాడు. ఆ మాటలు మెల్లగా రాజ్యం చెవినిపడ్డాయి. అదివరకు తనతో మాట మాత్రమయినా చెప్పని భర్త, అందరితో చెప్పటమే మొదలు ఇద్దరికీ........

ఒకరోజున భర్తకు మజ్జిగ వడ్డిస్తూ, "మన పక్కనందు కవతలి వీధిలోని రెండవయిల్లు వేలము వేస్తున్నారు. పదిహేనువేలపై చిల్లరట విన్నారా?" అన్నది రాజ్యము. "వెధవది తుక్కు ఇల్లు అయి ఉండవచ్చు. అందుకే పదిహేనువేలు. మాటమాటకు రిపేరు చేయవలసివస్తుంది." అని కనుబొమలు ముడివేసి అన్నాడు లక్ష్మీకాంతము.

ఆ యిల్లు కొనమని భార్య అడగనూలేదు; భర్త నిరాకరించనూలేదు. అంతే ఆ సంభాషణ. ఇరుగు పొరుగు విషయంగా ఆమె చెప్పింది; తగిన సమాధానము ఇచ్చాడు అతడు.

దానితోటి ముక్తసరిగా మాట్లాడుకోవటం మొదలు పెట్టారు దంపతులు. కొన్నాళ్ళకు భోజనానికి లేవమని చెప్పటానికి రాజ్యముకు, వంటయిందా కనుక్కో అని అడగటానికి లక్ష్మీకాంతానికి, రామారావు అవసరమయినాడు. ప్రతివాళ్లకు కోపంరాగానే ఒక మధ్యవర్తి ఉంటే, వాళ్లతో కోపం వెళ్ళబోసుకుంటూ ఉంటారు. సంధి రాయబారాలు కూడా పెడ్తారు. తప్పంతా మధ్యవర్తిమీద పెట్టి చివరకు వారే తప్పుకొని కులాసాగా ఉంటారు

* * * *

"బాబుగారూ మీరు చెప్పండి కాస్త. ఏదో నాలుగు డబ్బులు నిలువ ఉన్నప్పుడే ఇల్లు అనేది చూస్తే బాగుంటుందని నా మనసులో ఉంది. ఏది చేసినా పిల్లలు ఎదగకముందే చూడాలి. పిల్లలు పెద్దవాళ్ళయితే ఖర్చు లెక్కువవుతాయి చదువులని సంధ్యలని. తరువాత మనం ఏం కట్టగలము చెప్పండి, ఇప్పుడు రేడియో అని, మోటారని కూర్చుంటే ఎట్లా? దీనికేమో వాటి ఖరీదుకాకుండా నెలనెలకు ఖర్చు. ఇల్లంటే ఒకసారి కొంటే ఇంక దమ్మిడీ అయినా ఖర్చులేదు. పైగా అద్దె ఇవ్వకుండా స్వంత ఇంట శాశ్వతంగా పడిఉంటుంది. మీరు కాస్త చెప్పండి ఆయనకు" అంది రాజ్యము నరసింహారావుతో.

నరసింహారావు లక్ష్మీకాంతానికి మేనమామ. రాజ్యానికి పినతండ్రి. ఇప్పుడు రిటైరు కావటమునుంచి ఉచితంగా బంధువులకు, ఇరుగుపొరుగవాళ్ళకు న్యాయమైన సలహాలిస్తూ ఉంటాడు. మంచి సానుభూతి చూపిస్తాడు ప్రతివాళ్ళ విషయంలో, ఎవరికీ మనసు నొప్పించకుండా తగవు పరిష్కారం చేయాలనే ఉద్దేశంతో, "రాజ్యం! చిక్కిపోయావెందుకూ ఈమధ్య" అన్నాడు.

"ఏమిటోబాబూ" అని తప్పించుకొన్నది రాజ్యం. దానితో రాత్రీ పగలు రాజ్యానికి ఇంటిధోరణి ఎక్కువయిందనీ, చాలా పట్టుదలగా ఉందనీ గ్రహించి, "కనుక్కుంటాలే రాజ్యం. నరేగాని పిన్ని లేవటంలేదు బొత్తిగా. వంటవాళ్ళకు ఎంతచెప్పినా సరిగా కుదరటములేదు పథ్యము. నాలుగు రోజులపాటు పథ్యం పానం ఇక్కడ ఉండి చూద్దూ. లక్ష్మీకాంతానికి నేను కబురు చేస్తాలే. భోజనానికి వస్తాడు" అన్నాడు యుక్తిగా.

తమలపాకులు వేసుకుంటూ "మామయ్యా! నాకు చాల ఇబ్బందిగా ఉంది ఆఫీసుకు వెళ్లటానికి. ఒకచిన్న కారు కొందామనుకుంటున్నా. మీ సలహా ఏమి" టని అడిగాడు లక్ష్మీకాంతం, అంతవరకు తనకారు విషయమై ఏ విధమైన రిపోర్టు పోలేదనే ఉద్దేశంతో.

"అయితే కారులేకపోతే ఇంకనుంచి గడవదంటావు. అంతేనా" అన్నాడు న్యాయశాస్త్రవేత్త.

"కాదుగాని అందరికి ఉంది, నాకే లేదు అక్కడ. అందుకని నాకు చిన్నతనంగా ఉంది. ఇంతెందుకు-నాకంటె చిన్న ఉద్యోగి ఆస్టినులో ఎక్కి తిరుగుతాడు. నాలుగయిదు వందలుపెట్టి మంచి రేడియో కొన్నాడు ఈమధ్య. ఎంత బాగుందనుకొన్నారు. వాడి ఇంటికి వెళ్లితే నాకు రావలెనని బుద్ధిపుట్టదు" అన్నాడు.

"అవునులే. నాకు మాత్రము తెలియదూ నీ అవసరం? అయినా ఈ కాలపువాళ్లకు అవునన్నది కాదంటే జబ్బుచేస్తుంది. నీవూ మంచి యోజనాపరుడ వేగా-నా సలహాకేం గాని" అని సముదాయించాడు.

ఎటువాళ్లకు అటు సర్దిచెప్పి సానుభూతి చూపిస్తూ మాట్లాడాడుగాని ఏ సలహా ఎవరికివ్వాలో ఆయనకేమీ పాలుపోలేదు. అన్నాళ్లు జిల్లాజడ్జి పనిచేశాడు-అన్ని కేసులుతీర్పుచెప్పాడు-అంతమందికి సలహాలిచ్చాడు-ఇప్పటికి ఆ వాడలో ఏ తగవు వచ్చినా పరిష్కారం చేస్తాడు, అత్తా కోడళ్ల తగవులతో సహా. అటువంటి ఆయన ఈ దంపతుల కిద్దరికీ సలహా ఇవ్వలేకుండా ఉన్నాడు.

తల్లీదండ్రీ పోయినప్పటినుంచి, తననే తల్లీదండ్రిగా భావించిన రాజ్యాన్ని భర్తమాట విని కారుకొనమంటే ఎంత చిన్నబుచ్చుకుంటుదో-ఆడపిల్ల!

పోనీ ఇల్లు తీసుకొనవయ్యా కారుకేం తొందర అంటే-లక్ష్మీకాంతం- అసలే కచ్చమనిషి-తనకు అనుగుణంగా సలహాయిస్తేనే తప్ప, లేకపోతే గడవ అయినా తొక్కడు.

ఎవరికి ఎటు సమాధానము చెప్పకుండా గోడమీదపిల్లివాటంగా మాట్లాడుతూ దినాలు గడుపుతున్నాడు.

ఎవరివైపు తీర్పుచెప్తాడో అని భార్యకూ ఆందోళనే- భర్తకూ ఆందోళనే. కదిలిస్తే రంగం చెడుతుందని ఒక భయం మళ్లీ యిద్దరికు. సలహా లేకుండానే సమాధానపెట్టూ, దినాలు దాటవేస్తుంటే ఇద్దరికీ కష్టంగానే ఉంది

ఎవరికయినా ఎన్నాళ్ళుంటుంది ఓపిక ? తన వ్యవహారాలే గాని ఇంకోటిలేదు ఆయనకు !

చివరకు విసుగెత్తి "ఏం మామయ్యా ఊరుకున్నా"రని బొమలు ముడి వేస్తూ అడిగాడు లక్ష్మీకాంతం.

"నాయనా తొందరపడితే పనులవుతాయా ? నీ ఆలోచన బాగానే ఉంది. ముఖ్యంగా ఉండవలసినవే కారు, రేడియో. అక్కడక్కడ కంపెనీలలో చెప్పి ఉంచు. నేనూ చూస్తూ ఉంటాలే" అన్నాడు నరసింహారావు.

"ఆ యిల్లు మరీ యిరుకుసందులో ఉందమ్మా. ఎక్కడయినా రోడ్డుమీద ఉన్న స్థలముగాని, ఇల్లుగాని బేరంచేస్తూ ఉంటాలే లక్ష్మీకాంతము ఏదయినా అడావడి చేస్తే నొచ్చుకోకు. నీ సంగతి నాకు తెలియదా ఏమిటి ?" అని రాజ్యాన్ని సమాధానపెట్టాడు.

ఒకటి రెండుసార్లు కంపెనీల నుంచి సెకండ్‌హాండ్ కార్లు తీసుకొచ్చాడు లక్ష్మీకాంతం చూపించటానికి, రోడ్డు చివరదాకా కారులో తిరిగి "అబ్బే పదినాళ్లు ఉండదురా ఇది" అని పెదవి విరిచాడు నరసింహారావు.

తప్పకుండా మామ మెచ్చుతాడనే ఉద్దేశంతో ఉన్న లక్ష్మీకాంతానికి ఈ మాటలు వినగానే మింగుదామన్నంత కోపం వచ్చేది మనసులో, ఒకసారి ఆయన యిచ్చిన సలహాను పాటించకపోతే యింక పలుకరించనె నా పలుకరించని స్వభావం నరసింహారావుగారికి. ఆ సంగతి బాగా ఎరిగిఉన్నాడు లక్ష్మీకాంతం.

ఈ విధంగా ఏదీ పడనివ్వడని తాత్కాలికమైన కోపాలతో గడుపుతున్నారు దంపతులు.

రాజ్యం చిన్నబుచ్చుకున్నప్పుడు లక్ష్మీకాంతం తనమాటే నెగ్గుతుందనుకొనే వాడు. లక్ష్మీకాంతం హతాశుడైనప్పుడు రాజ్యము తానే గెలుస్తాననుకొనేది.

నాలుదు-అయిదు సంవత్సరాలు దొర్లిపోయాయి,

* * * *

సంవత్సరాది పండుగకు దంపతుల నిద్దరిని తన యింటికి ఆహ్వానించాడు నరసింహారావు.

భోజనాలయిన తరువాత ఊరికి పడమరవైపు తోటలోకి వెళ్దాము రండని పిలుచుకొని పోయాడు.

జర్మన్ డిజైనులో కట్టబడిన చిన్న బంగళా-చుట్టూ చిన్నతోటా — ఒక ప్రక్కగరాజ్ అందులో టూసీటర్ కారు-అన్నీ చూపిస్తూ తోటలో ఉన్న సిమెంటు సీట్లమీద కూర్చోబెట్టి మాట్లాడుతున్నాడు నరసింహారావు.

ఇంతలోకే బంగళా లోపలినుంచి రేడియోపాట :

దంపతులిద్దరు ఆనందభాష్పాలతో నరసింహారావు గారికి ఒక్కసారే నమస్కరించారు.

# డోలారోహణ

అది కార్తికమాసము. ఉదయము ఏడుగంటలయింది. స్నానసంధ్యాదులు ముగించుకొని-రాత్రి తీసుకున్న పాలతోటి కాఫీ చేసుకొని త్రాగి తనయిద్దరు కొడుకులకు మూసిపెట్టి, చావడిలో ఉయ్యాల బల్లమీద కూర్చుని, అప్పుడే వచ్చిన పత్రిక మడత విప్పుతున్నాడు పద్మనాభరావు.

ఆయనకు ఏభయి సంవత్సరాలు సమీపించినవేమో, ఒకనల్లటి వెంట్రుకయినా లేని క్రాపు; ఖద్దరు వస్త్రాలు ధరించిన సుమారయిన విగ్రహము ఆయనది. సంపాదకీయము చూసిన తరువాతగాని మరొకటి చదవటం అలవాటు లేకపోవటం వల్ల, పత్రిక మడత విప్పటమే మధ్యభాగానికి విడదీసి తనకనుకూలముగా కుడుచుకుంటున్నాడు.

సరిగా ఆ సమయానికే ప్రక్క-ఇంట్లోనుంచి గ్లాసు ఎత్తి పడవేసిన చప్పుడు వినిపించింది.

''అబ్బా! తెల్లవారిందీ వీళ్ళగోలకు'' అనుకుంటూ పత్రిక అక్కడ పడవేసి, తమభాగానికీ అవతల భాగానికీ నడుమఉన్న తలుపుదగ్గర నిలబడ్డాడు.

''ఇన్ని ఏళ్ళయింది. కాఫీ చేయుటమయినా రాకపోతే ఎట్లా? మగవాళ్ళు చేసుకుంటారు! ఎవరింటికిపోయినా ఎంతో ముచ్చటగా ఉంటుంది. మన యింటి కాఫీ ఉడుకునీళ్ళలా ఉంటుంది ఎప్పుడూను. ఏమిటి మనగతి?''

''.... .... .... .... .... .... .... .... ....''

''నేను మాటవరున కడుగుతున్నాను. గింజలోపమా, వేపుడు లోపమా, దేని దంటావు!''

''ఏమో.... మరి''

''కుంటిజవాబు కాదు నేను కోరేది. అసలు మనయింటి కాఫీ తత్వమూ దాని కారణమూను నేను కోరేది.''

ఒక్కొక్కమాట ములికిలాగ నిర్దేశించినచోట సూటిగా వెళ్ళి తాకుతున్నది.

''ఏదయితే నేమి? మీరు కాఫీగ్లాసు విసిరి పారవేయటమూ, ఆ చప్పుడు నలుగురి చెవిని పడటమూ అయిన తరువాత.''

కొరడాదెబ్బలాగ ఆమాట పద్మనాభరావు ఎదలో తాకింది. వెంటనే ఉయ్యాల బల్ల దగ్గరకి వచ్చి, తిరిగి తన పేపరువిప్పి చదువుకోవాలని చూశాడు. కాని సాగలేదు. తన మనసుకు సూటిగా తాకిన ఆ మాటనుగురించే ఆలోచనలు పోతున్నాయి. తాను తలుపుదగ్గర నిలబడి వాళ్ళను గమనించటము ఆమె కని పెట్టింది కాబోలు! పాప మామెకెంత అభిమానము కలిగిందో-తాను వాళ్ళ వివాదాలు వింటున్నాడని! తనకయినా ''రోజూ ఈయన పుల్లవిరిచినట్లుగా కటువుగా మాట్లాడుతాడు భార్యతోటి; ఈవేళ దేనిమీదనుంచి వచ్చిందో'' అన్న సామాన్యమైన కౌతుకంతోనే గాని వేరు దృష్టితో కాదు వాళ్ళను గమనించింది! పాపము ఆమె మనసెంత నొచ్చుకున్నదో? మగవాళ్ళు చప్పున రెండు మాటలనివేసి బయట పడతారు. ఆడవాళ్లకెన్నో బాధలు, అనిపించుకొన్న కష్టమొకటి, అంటూఉండగా ఎవరయినా విన్నారని తెలిసినతరువాత కలిగే అభిమానమొకటీను.

ఇట్లా గుణించుకుంటూ ఉండగా, నాన్నా! కాఫీలో చక్కెర వేశావా? నేను వేసుకోనా?'' అని కొడుకు అడిగాడు.

''నేను వెయ్యలేదురా.'' డబ్బా అక్కడేఉంది వేసుకో! అని అన్నాడే గాని, నిజంగా వేశాడో లేదో ఆయనకే జ్ఞాపకములేదు. ఒకరు చేసినపనిని విమర్శించే అధికారము ఇంకొకరికి ఉన్నంతవరకు ప్రతి చిన్నపొరబాటూ, సామాన్య విషయమూ కొండంతగా కనబడుతుంది. అరగంట క్రిందటి పొరుగింటి వివాదము ఇటువంటిదేనేమో! అక్కడ చేసేదొకరు, అనే దొకరు. తమదగ్గర చేసేది తాను-కాని అనే అధికారము మరొకరికి లేదు. కనుక హెచ్చుతగ్గులన్నీ పొరబాట్లుగా కన బడుతున్నాయి. అయినా పొరుగింటాయన కాస్త నిదానము నేర్చుకుంటే సుఖపడతాడు అని పద్మనాభరావు అనుకున్నాడు.

భార్య చనిపోయిన తరువాత పద్మనాభరావు నిజమైన విశ్రాంతిని కోరాడు. పదిహేను, పన్నెండు సంవత్సరాల ఈడుగల యిద్దరు కొడుకులను, పదిహేను సంవత్సరాలు కలిసి జీవించిన భర్తను, వదలి శాశ్వతంగా దివి నలంకరించింది. నాలుగేళ్లనాడు అంబుజమ్మ-పద్మనాభరావు సహధర్మచారిణి.

ఊరు మారిస్తే సగము దిగులు విచారము తగ్గుతుందన్న భావనతో కొడుకు లిద్దరిని చేతబట్టుకొని-ఇంకా సర్వీసు ఉన్నప్పటికి-పెన్షనుకొరకు దరఖాస్తు పెట్టి-పట్టణము చేరాడు. భూవసతివల్ల వచ్చే సంవత్సరాదాయముతోటి, పెన్షనుతోటి, గడచిపోతున్నది జీవితము. తాను ఇన్ని సంవత్సరాల ఉద్యోగములో ఒక్క కాని అయినా నిలువ చేయలేకపోయినా పిత్రార్జితము వ్యయపరచలేదు. పాలకొల్లు నరసాపురము ప్రాంతంలోఉన్న అంటుమామిడితోట-బాగా విలువకలది-అమ్మి పట్న వాసపు కాపురానికి సుమారైన ఇల్లు కొని ఒక భాగంలో తాను తన పిల్లలు ఉంటూ అవతల భాగము అద్దెకిచ్చాడు. అదేమిటో-ఈ కాలానికి ఎంతటి ఆదాయము చాల నట్లే కనబడుతుంది. ఇటీవల ఒక దినపత్రికకు, ఒక వారపత్రికకు ముఖ్యమైన వ్యాసాలు, సంపాదకీయము వ్రాసిఇచ్చే ఏర్పాటు చేసుకున్నాడు. చాలవరకూ గ్రంథ కాలక్షేపమే ఆయన దినచర్య.

* * * *

ఆయన తన భార్యతో గడపిన జీవితములో మూడువంతులు చాలా సామాన్యంగా-నిర్లక్ష్యముతో కాకపోయినా-ఎక్కువ గమనిక లేకుండానే గడిపాడు. ఒకటి తరువాత రెండు, రెండు తరువాత మూడు.... పునరపి రజనీ పునరపి దివసం.... అన్నట్లుగా కాలకృత్యాలు తీర్చుకొని ఆఫీసుపని చేసుకోవటము, తిరిగి కాలకృత్యాలు, భోజనము, నిద్ర.

కొంతకాలము ఉద్యోగము చేశాడు. భార్యతో వైవాహిక జీవితము గడిపాడు-పిల్లలు పుట్టారు-పెరిగారు-కాలము గడచిపోయింది! అంతే. ప్రకృతి సౌందర్యోపాసనతో-రసాస్వాదనముతో ...ఎందులో ఏముందో తొంగి చూడాలన్న కాంక్షలేకుండా గడపివేశాడు.... యాంత్రిక జీవితమువలె! అదేమిటో.... తలుచుకుంటే ఆయనకే ఆశ్చర్యము!

ఆరోజు ఆఫీసుకు సెలవు. కచేరీ కాగితాలు చూసుకుంటూ గదిలో కూర్చున్నాడు. అప్పుడు ఆకుపచ్చటి కాశ్మీరు శాలువ చెవులమీదుగా తలకు చుట్టుకొని

మకర కుండలాలు చెవులకు, దర్భముడి ఉంగరము వేలికి ధరించి పండితోచ్చా రణతో శంకరాచార్యులవారి భజగోవింద శ్లోకాలు హిందోళరాగంలో చదువుతూ-ఏభయి సంవత్సరాల బ్రహ్మతేజస్వి చరచర నడుచుకొంటూ నేరుగా ఆఫీసు గది లోకి వెళ్లి సుభమస్తు' అన్నాడు. ఆ పరమేశ్వరుడిలాగా ఎకాఎకి గదిలోకి వచ్చిన పండితునిచూసి, నమస్కారముచేసి. కూర్చోమని మర్యాదచేశాడు పద్మనాభరావు.

"మీ జన్మనక్షత్రము, సంవత్సరము నాకు చెప్పండి. మీ వ్రాతపని పూర్తి అయేవరకు గుణించి ఫలితాలను వ్రాస్తాను. హిమాలయ పర్వతము మొదలుకొని కన్యాకుమారి వరకు పెద్దల జాతకాలన్నీ పరిశీలించాను. మీదికూడా చూడాలని కుతూహలపడుతున్నాను" అన్నాడు పండితుడు

"ఏమోనండీ! నాకు జాతకము చూపించుకోవటములో ఎక్కువ నమ్మ కమూ ఉత్సాహమూ లేదు. దానికేమి గాని మీరు తాంబూలము తీసుకోండి." అంటూ ప్రక్కగదిలోకి వెళ్ళి అయిదు రూపాయల కాగితము తాంబూలములో పెట్టి తీసుకొనివచ్చి ముందర పెట్టాడు.

ఆయన తీసుకోకుండానే బలవంతంమీద నక్షత్రము సంవత్సరము తెలుసు కొని, బయట వరండాలో బల్లమీద కూర్చుని గుణిస్తూ మధ్యమధ్య పద్మనాభరావు ముఖము, ఆకారము, అవయవశోభ తిలకిస్తూఉన్నాడు. మరో గంటకల్లా తిరిగి ఆఫీసుగదిలోకి వెళ్ళి, "చూడండి, మీకు నేను ఒక సంవత్సరము వరకు ఫలితా లను తెలుపుతూ ఒక పట్టిక వ్రాశాను. నేను జాతకాలను లెక్కలేనన్ని చూస్తూ వృద్ధుడనవుతున్నాను. కాని ఈ జాతకుడి కళత్రమువంటి ఇల్లాండ్రను మాత్రము వ్రేళ్ళమీద లెక్కించవలసిందే. ఆహా ఏమి ఇల్లాలండీ! తాటస్థ్యంగా-నిర్వి కారంతో-చూసీ చూడపట్లుగా కాపురము చేస్తున్న భర్తకొరకు-ఆ యింటికీ-దానికి సంబంధించిన మర్యాదకు ఎంతగా పాటుపడే యిల్లాలయ్యా! మనసులో ఉండగానే అన్నీ నమకూరుస్తూ, తనకు ప్రాముఖ్యాసు గమనిక ఇవ్వని భర్తకొరకు ఈ రోజులలో ఎవరు ప్రాకులాడుతారు? మీరు గ్రహించి విలువ యివ్వలేకుండా ఉన్నారు. కాని మంచి అదృష్టవంతులు. పోయి వస్తాను" అంటూ తాంబూలము తీసుకొని వెళ్ళిపోయాడు.

అదే ప్రారంభము అంబుజమ్మ అదృష్టరేఖ బయట పడటానికి. అప్పటి నుంచి ఆమెకు ఉచ్ఛదశ ప్రారంభమయింది.

అదేమిటో-జగత్తులో సూర్యచంద్రాదుల ఉదయాస్తమయాలను పరిగణించే సామాన్యదృష్టితో భార్యనూ, ప్రపంచాన్ని చూసే పద్మనాభరావుకు మరుసటిదినము లగాయతు వింతకలలే! ప్రకృతి శోభాయమానంగానూ, భార్య అనురాగమయిగాను కనబడసాగినది. అప్పటినుంచీ అంబుజమ్మ మాటలో ఉనికిలో అనురాగము తొణికిసలాడుతున్నట్లుగాను, పాకరుచులలో నల భీములను మరపిస్తున్నట్లుగాను, మాట నచ్చచెప్పటములో మంత్రిపుంగవులను మించుతున్నట్లుగాను తోచిందాయనకు.

తన భార్య ఏమికాదు! శాపదగ్ధయై భూలోకంలో అవతరించి నిద్రితుడైన తనను ఈ ప్రకృతిలో మేల్కొలపటానికై ఏతెంచిన అచ్చర!

పదమూడేండ్లుగా ఎండి బీటలువారిన ఆమె హృదయక్షేత్రానికి-ఆయనలో కలిగిన మార్పు తొలకరి చినుకు అయింది.

ఆయనకు అప్పుడు-ఆమెతో కూడాకూడా తిరగటానికి విసుగు జనించలేదు. పైగా సంతోషంగాను, ఉత్సాహంగాను ఉంది. ఆమె కాఫీ తయారుచేసేఅంతలో ఆయన గ్లాసులు సర్దటము, భోజనములయిన తరువాత ఆమె తలుపులు వేసే అంతలో ఆయన తాంబూలము తయారుచేయటము.... ఇష్టాగోష్ఠితో.... చిలకాగోరువంక లయ్యారు.

తాను సృష్టించిన ప్రకృతిని దానిశోభను దైవమే చూడలేడు! యౌవనపు ఒడుదొడుకులు లేకుండా-ఒకరినొకరు అర్థముచేసుకొని-తమ జీవితాలను రసమయం చేసుకుంటూ ఉండగా-జ్యోతిని చూపించిన దేవుడే జ్యోతిని మాయముచేశాడు.

ఇప్పుడాయన సాహచర్యం గ్రంథాలతోను, ప్రశాంతమైన జీవనముతోను.

* * * * *

ఆనాడు ఉగాది. విరోధినామసంవత్సరము ప్రవేశించింది. మన పండుగలు వస్తూనే ఇళ్లనూ, దేహాలను శుద్ధిపరుస్తాయి. పండుగ అల్లంత దూరాన ఉండగానే బూజుదులిపి, ఇళ్ళను శుభ్రంగా కడిగి ముగ్గులువేసి, ఆకర్షణీయంగా చేస్తారు. ప్రతివాళ్ళు అభ్యంగన స్నానాలు చేస్తారు.

ఏడు గంటలయేసరికి అందరిఇళ్ళలోను స్నానాలుచేయటము వేపప్రసాదము తీసుకోవటమూ జరిగింది.

అవతలి భాగంలోఉన్న దశరథరామయ్యగారు ఇంకా నిద్రలోనే ఉన్నారు. ఆయన గృహము తీర్చిదిద్దిన రంగవల్లులతో పండుగ నాహ్వానించింది.

ఏడు దాటినా ఆయన నిద్రలేవకుండా గురకలు పెట్టున్నాడు. పాపమామె ఇంట్లోకీ పెరట్లోకీ తిరుగుతున్నది. ఆయన నిద్రలేచి-అభ్యంగనమాడి-వేపప్రసాదముతో కాఫీ తీసుకొని-అవతలికి వెళ్ళాక వంట ఆరంభము చెయ్యాలనికాబోలు :

* * * * *

పద్మనాభరావు ఇంట్లో ఆడవాళ్ళు లేకపోయినా పండుగలను సక్రమంగావే ఆహ్వానిస్తున్నాడు. కొన్నిపనులు స్వయంగా చేసుకొంటూను, కొన్ని పనులు చేయించుకుంటూను, 'నామమాత్రంగా నయినా పండుగ చేయకపోతే ఎట్లా' అనుకుంటూ జరుపుతూనే ఉన్నాడు. మగసంసారమని ఎంత క్లుప్తముచేసినా... పాకరుచు లెరిగిన జిహ్వ ఆయనది! భార్య బ్రతికిఉన్న కాలములో భక్ష్యాలు చేయించుకొని ఆరగించినవ్యక్తి గనుక ఇప్పుడు కనీసము పూరీలయినా చేసుకోవాలని అనుకుంటూ కాలము నెట్టుకొస్తున్నాడు, భార్యపోయిన నాలుగు సంవత్సరాలనుంచి.

మధ్యాహ్నము భోజనాలు కాగానే పద్మనాభరావు ఒక నిద్రపోయి లేచాడు. మంచినీళ్లు త్రాగి లవంగమొకటి నోట్లో వేసుకొని తనచేతికి వచ్చిన పుస్తకమొకటి బల్లమీదనుంచి తీసుకొని తెరిచాడు.

కేచి దజ్ఞానతో నష్టాః-కేచి న్నష్టాః ప్రమాదతః
కేచిత్ జ్ఞానావలేపేన-కేచిన్నష్టై ర్వినాశితాః

అని చదువుతూ ఉండగా,

"ఏమయినా సరే మన యిద్దరికీ ఈ ఇంట్లో పొసగదు. ఇంత మాటనిర్లక్ష్యమయితే ఎట్లా?" అంటున్నాడు దశరథరామయ్య. అయనదగ్గర ఒక గుణమున్నట్లున్నది. ఆయన ఎంత గట్టిగా అరుస్తాడో అంతగట్టిగాను అరుస్తూ జవాబిస్తే తాను

అడిగినదానికి సమాధానమని ఎంచుకోవటము ; నిదానంగా-తగవు చంపుతూ మాట్లాడితే నిర్లక్ష్యమని నాసికాగ్రానికి ఎక్కిన కోపముతో చిందులు త్రొక్కటము ఆయనకు అలవాటు.

ఆమెదగ్గర తగవును చంపబోతున్నట్లుగా మాట్లాడే స్వభావ మున్నట్లున్నది. "నేనేమి వ్యతిరేకంగా నడిచాననీ ఈ రగడ అంతాను" అనుకుంటూ అక్కడ నిలబడకుండా అవతలికి వెళ్ళినట్లున్నది.

"నీకు నిర్లక్ష్యము లేకపోతే ఇక్కడ నిలబడి ఎందుకు మాట్లాడవు ?" అని ఆయన వెన్నంటిపోయి గద్దిస్తున్నాడు.

"పండుగపూట ఏమిటా గొడవ ? ఈ జన్మఅంతా ఇలాగే విరసంగా గడచేటట్లున్నది. ఈ వయసులో మీకూ నాకూ పొసగకపోవటమేమిటి ? పెద్దమనుష్యుల సమక్షంలో-ముగ్గురు పిల్లల ఎదుట రోజూ నన్ను ఈ వేపుకొని తినట మేమిటి ? మనమిద్దరికి ఇక కాపురము పొసగదు అనుకొన్ననాడు చడీచప్పుడు లేకుండా, వేరే ఉందాము లెండి. అరవకండి" అంటోంది గృహిణి గద్గద స్వరంతో.

ఈ రభసలో పద్మనాభరావు గ్రంథపఠనము సాగలేదు. అదిగాక-భార్యా వియోగమైన దగ్గర్నుంచీ-ఏ ఇల్లాలయినా దుఃఖిస్తుంటే అయన చూడలేడు. పైగా గతించిన తన జీవితంలోని దుస్స్వప్నమే జ్ఞాపకమొచ్చి-తనభార్య కన్నీళ్ళతో, నిరాశా హృదయంతో కృశించి పోతున్నట్లుగా కళ్ళకు కనబడి-ఆయన ఒక రకంగా మానసికమైన బాధకు గురిఅయ్యేవాడు ప్రశాంతమును కోరే తన జీవితసంధ్యలో తీరని ఆవేదనలు కలిగిస్తున్నారు ఆ దశరథరామయ్య దంపతులు.

"అక్కడికి నీవు మహా మర్యాదస్థురాలివీను నేను యాగీ చేసేవాణ్ణీ కదూ నీ దృష్టిలో !" అంటూ సాధిస్తున్నాడు ప్రక్కయింటాయన, భార్యను.

ఇక వినలేక పోయినాడు పద్మనాభరావు. ఒంటినిండా చీమలు పారినట్లయింది. శతకోటి ఆవేదనలతో, అనంతకోటి వ్యథలతో మంచముమీదనుండి లేచాడు. ఇక దుర్భరము ! ఒక నిముషమైనా తానుండలేడు ఆ ఇంట్లో ! తన అరికాళ్లక్రింద నిప్పులు పోస్తున్నదా మిధునము.

"దశరథరామయ్యగారూ! దశరథరామయ్యగారూ!" అంటూ లేచివెళ్లి తలుపుకొట్టాడు. తలుపులు దగ్గరిగా వేసి ఉండటమువల్ల 'రండి లోపలికి' అని లోపల ఉన్నవాళ్ళు అవగానే వెళ్ళాడు. ఆమె ఆప్రాంతాలలో లేకుండా లోపలికి వెళ్లిపోయినట్లుంది, ఆయన మాత్రము ఏమీ ఎరగనట్లే పేపరు చదువుకుంటూ ఒక కుర్చీలో కూర్చున్నాడు.

"దయచేయండి. ఈ కుర్చీలో కూర్చోండి" అని పద్మనాభరావుకు కుర్చీ చూపించి, "అన్నగారికి పండగ ఫలహారము తీసుకురావే" అంటూ గోడతో చెప్పినట్లుగా-జడపదార్థాన్ని సంబోధించినట్లుగా కేకవేశాడు.

"క్షమించండి నేను మీకు అన్నగారిని కాను. మీ భార్యకు అన్నగారిని అవుదామని ఇన్నాళ్ళనుంచీ తీసుకోని చనవును ఇప్పుడు తీసుకొంటున్నాను. ఒక పదినిమిషాలపాటు మీ ఇద్దరూ మా ఇంటికి రావాలి" అన్నాడు అభ్యర్థిలాగ.

"మీరు ముందు మా ఇంట్లో ఫలహారము చేయాలి. నామాట మన్నించరూ-బావగారూ" అన్నాడు దశరథరామయ్య. "ఇంత మర్యాదస్థుడు లలిత హృదయుడూ ఎందుకట్లా కటువుగా మాట్లాడుతూ ఇంటిలో భార్యను నలిపి చంపుతున్నాడు! ఏమిటబ్బా యీయన ప్రకృతి!" అనుకుంటూ కుశల ప్రశ్నలతో ఫలహారము ముగించి తన ఇంటికి వాళ్ళిద్దరిని తీసుకొనివెళ్ళి ఉయ్యాలబల్లమీద కూర్చోబెట్టి పద్మనాభరావు లోపలికి వెళ్ళాడు.

తాముపెట్టిన ఫలహారానికి బదులుగా ఆయనచేసిన పిండివంటకాలు ఏదో తెచ్చి ముందర పెట్టాడు కాబోలు ననుకుంటున్నారు దంపతులు. చీరె రవికెలబట్ట ఒకవైపు, ధోవతులచాపు తాంబూలాలు మరొకవైపు, ఒక పళ్ళెంలో పెట్టి వాళ్ళ కెదురుగా నిలబడ్డాడు, వాళ్ళిద్దరికి ఇదేమీ అర్థముకాక తెల్లబోయి చూస్తున్నారు.

"నేను ప్రతియేటా మా చెల్లెలికి బావమరిదికి బట్టలిస్తాను. వాళ్లు ఈ సంవత్సరము రాలేదు. ఈ సంవత్సరాది శుభదినాన మీ దంపతులిద్దరిని చెల్లెలు-బావమరిది వరుస చేసుకుంటున్నాను. బావమరిది హక్కుతో నేనొకటి మీ యిద్దరిని ప్రార్థిస్తాను. కటువుగా-విరసంగా-మీరు జీవితాలను గడపటము ఆరు నెలలనుంచీ నేను చూడలేకుండా ఉన్నాను. ప్రతి నిమిషమూ విలువగలదనీ. గడచినది తిరిగి

రాదనీ, రేపటితో మన జీవితము సరేనేమో అంతవరకూ ఆనందంగా ఉందామనీ నా సమక్షంలో స్థిరము చేసుకోండి'' అంటూ బట్టలు వాళ్ళ ముందరపెట్టి ఉయ్యాల బల్ల గొలుసును ముందుకు లాగి బలంగా వెనక్కుతోశాడు.

ఆ ఊపులో ఊపిరి సలుపక, ''అవునా! మనమట్లా ప్రవర్తిస్తున్నామా? పాపమాయనకు ఎంత కష్టమనిపించిందో చూశావా?'' అని కళ్ళతోటే ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు దంపతులు.

ఆ డోలారోహణే వాళ్ళ శేషించిన జీవితానికి 'తొలుత బ్రహ్మాండంబు తొట్టె గావించి, నాలుగు వేదాల గొలుసు లమరించి' అనే జోలపాటయింది. ఊగుతూనే చేతులు జోడించారు ఇద్దరూ.



# బహుమానము

కోర్టునుంచి అప్పుడే ఇంటికి వచ్చిన విశ్వనాథము బట్టలు మార్చుకొనక ముందే హిందూపేపరు పట్టుకొని పడకకుర్చీలో వాలాడు. కాస్మోపొలిటన్ క్లబ్బుకు వెళ్లినప్పుడే ఫలహారము బాగా చేశాడు. రాత్రికి కేరియరుతో భోజనము ఇంటికే వచ్చే ఏర్పాటు చేసుకున్నాడు. టెన్నిసు పనికూడా పూర్తి అయింది. ఇప్పుడిక తాపీగా పేపరు చదువుతూ కూర్చోవచ్చు; రాత్రి ఎనిమిదింటివరకూ తనను పలుకరించే వారూ ఆటంకపరిచేవారూ లేరూ గనుక.

మామగారు వచ్చి క్రిందటివారములో సరోజినిని తీసుకొని వెళ్లారు. ఆమె పోకడ, గ్రీష్మములో చెమటలుపోసిన శరీరానికి శీతలవాయువు సోకినట్లుగా ఉన్నది అతని ప్రాణానికి. అనిర్వచనీయమైన తేలిక, తెరపి హృదయములో కలిగాయి. హాయిగా ఎంతసేపయినా పేపరు చదువుకొనవచ్చు. ఎంత ఆలస్యంగా నయినా ఇంటికి రావచ్చును.

హిందూపత్రిక తిరగవేస్తున్నాడు. వార్తలు-విశేషాలు-ప్రకటనలు చూస్తు న్నాడు.

"రాష్ట్ర విభజన కావాలి"

"మాకు ప్రత్యేకరాష్ట్రం కావాలి"

"కాందిశీకుల ఆస్తి వేలము"

"మాట్రిమోనియల్ బ్యూరో"

"వరుడు కావలెను స్మార్త బ్రాహ్మణుడు-పాతిక సంవత్సరాలకు మించిన వయస్సు కలవాడు-ఉద్యోగము చేసేవాడు.... .... .... .... .... .... .... కుజదోషము లేనివాడు.... .... .... .... .... .... "

"వధువు కావలెను. ముప్పది సంవత్సరాలుగల నాగరిక శిఖామణి అయిన ప్లీడరునకు, స్మార్త బ్రాహ్మణ వధువు, భారద్వాజస గోత్రముకానిది, విద్యావతి కొంచెము పొడగరి,....వంట నేర్చినది.... దరఖాస్తుతో ఫోటో పంపవలెను...." సహజ కౌతూహలముతో—తనకు అవసరము లేకపోయినా-బాగా పరకాయించి చూస్తూఉండగా, తళుక్కున ఒక ఊహ మెరుపులాగ అతని మనస్సులో మెరిసింది! తనపేరు మార్చి ఫొటోసహితముగా ఒక దరఖాస్తు పంపితే? ఏమవుతుందో?....ఏమి జవాబు వస్తుందో?....ఎవరు సంప్రతిస్తారో?.... చూడాలి తమాషా!

వెంటనే లేచి, ఫొటో ఒకటి—తానెప్పుడో క్లబ్బులో తీయించుకున్నది—ఆల్బములోనుంచి తీసి, ఆకర్షణీయమైన కాగితముమీద దరఖాస్తువ్రాసి పోస్టులో వేశాడు.

అతనికి నమ్మకమే సరోజని ఇంకా రెండునెలల వరకూ రాదని. తాను చూచాయగా చెప్పాడుకూడాను, బాగా వేవిళ్ళు తగ్గితేగాని రావద్దని. ఆమె మంచి కోసమే....మనిషి లేవలేకుండా ఉన్నది....భోజనమన్న మాటలేదు....ఒకటే పైత్య వికారముతో బాధపడుతున్నది.ఈ పైత్యము తగ్గేసరికీ ఆరోనెలో....ఏడోనెలో.... రానే వస్తుంది. సాధారణముగా పురిటికి పుట్టింటికి వెళ్లేసమయము అది. ఇంక అప్పుడేమి వస్తుంది? అయినా వాళ్లు పంపుతారా? పురుడువచ్చి....ఆమె బ్రతుకు ....ఏ మూడవ నెలనో - తాను రమ్మని వ్రాస్తే-అప్పుడుకదా ఆమెగారు వేంచేయటము! ఇంకా ఎనిమిది తొమ్మిదినెలల మాట!

దరఖాస్తు వ్రాయనైతే వ్రాశాడుగాని సరోజినికి ఆమె తండ్రికి తెలుస్తుందేమో? ఎక్కువ చదువురాని ఇరవయ్యేళ్ల పిల్లను సమాధాన పెట్టటము సులభమైన పనే! అనుభవము లేని చిన్నపిల్ల కనుక తానేమి చెప్పినా నమ్మితీరుతుంది. తన కోసము కాదనీ, తన స్నేహితుడు ఒకడు ఏపిల్లా నచ్చక-చివరకు బ్రహ్మచారిలాగ ఉండిపోవటానికి నిశ్చయించుకొన్న వానికోసమనీ పిల్లను మాట్లాడి పెట్టేవరకు తాను భారము వహించాడనీ ఏమేమిటో చెప్పి ఆమెను నమ్మించవచ్చునుగాని మామగారి మాటే ఉన్నది. అవసరమయిన దానిలో జోక్యము కలుగజేసుకుంటే దానికి తగిన సత్కారము పొందుతాడు!

ఈ ఉత్తరము వాళ్లకెప్పుడు చేరుతుంది? వాళ్లు ఎప్పుడు జవాబు వ్రాస్తారు? వెంట వెంట తిరుగుటపాలో ఉత్తరప్రత్యుత్తరాలు నడిస్తేగాని వ్యవహారాలు తెమలవు. ఈ పద్ధతి రెండు పక్షాలవారు అవలంబించాలి. అయినా తనకున్న తొందర వాళ్లకెందుకు ఉంటుంది?

* * * *

కాస్మోపాలిటన్‌క్లబ్బు ఆవరణములో కారుదగ్గర నిలబడి పార్థసారథితో విశ్వనాథము మాట్లాడుతున్నాడు. సినెమాకు వెళ్లాలని స్నేహితుడి ప్రోద్బలముతో బయలుదేరాడు. 'Best years of our lives' అనే ఇంగ్లీషుచిత్రము చూడాలని వెళ్లారు, అక్కడ టికెట్లు దొరకక చాలామంది నిరాశతో తిరిగి పోతున్నారు. ముందుగా టికెట్లు కొనుక్కొని రిజర్వుచేసుకున్న వాళ్ళు లోపలికి వెళ్లి కూర్చున్నారు. చాలామంది క్యూలో నిలబడి టికెట్లు కొన్నారు. ఆట మొదలయ్యేవరకు నిలబడి జమంతా విసుక్కుంటూ వెనకకు మళ్ళుతుండగా చెంచులక్ష్మి చిత్రములో నటించిన నారాయణరావు కనబడ్డాడు. ఆయనకూ టికెట్లు దొరకలేదు కాబోలు. ఆయనను చూడగానే చెంచులక్ష్మి చిత్రము చూడాలనిపించి స్నేహితులిద్దరూ ఆథియేటరుకు వెళ్లారు.

నరసింహప్రాసాదితమయిన చెంచులక్ష్మి పెరిగి పెద్దదయింది. స్విమ్మింగు కాస్ట్యూముతో నదిలో ఈతకొట్టుతున్నది. కూర్చుంటే కనబడటములేదని చాలామంది నిలబడి చూస్తున్నారు.

లక్ష్మీనరసింహస్వామి చెంచితతో వైకుంఠము వెళ్తాడు. ద్వారము దగ్గరే నిలచిపోవలసివచ్చింది. లోపల ప్రవేశించటానికి ఆదిలక్ష్మి అనుజ్ఞలేదు: తన పెనిమిటి కొత్తభార్యతో వస్తున్నాడన్న వార్త తెలుసుకొని ద్వారము మూయించింది. ఏం చేస్తాడు నరసింహస్వామి అయితేమాత్రము? ఎంతటివాడయినా సమయము మించివచ్చినప్పుడు, తాటస్థ్యంగా ఊరుకోవటమే ఉత్తమమయిన పద్ధతా?

విశ్వనాథానికేమిటి ఎవరికేమిటి ఆ సవతుల తగవులాట.... ఆదిలక్ష్మి అలుక, అసందర్భము కాకపోయినా రసభంగముగా తోస్తాయి. చూడటానికి సౌఖ్యవంతముగాను - సులభముగాను - కనబడే సవతుల సామరస్యము, పొందికా - జీవితములో, పొసగినవా?

* * * *

అప్పటికి వారమయింది విశ్వనాథము వధువు కొరకు దరఖాస్తు వ్రాసి. ఆ విషయమయి జవాబు ఇంకారాలేదు. అతడు ఎదురుచూడని జాబులేవో వస్తూనే ఉన్నాయి; సరోజిని క్షేమంగా ఉందనీ, కొంచెముగా లేచి తిరుగుతున్నదనీ రెండు జాబులు వచ్చాయి.

ఈ సందర్భములో జరుగుతున్న ఆలస్యము ఆతనికి భరింపరానిదిగా ఉన్నది.

కఠినమయిన పది నిండుదినాలూ గడచిన తరువాత ఏలూరునుంచి ఒక ఉత్తరము వచ్చింది. దరఖాస్తు చూసుకున్నారట, ఫోటోను పిల్లచూసి మెచ్చినదట, వివరాలు తృప్తికరముగానే ఉన్నాయట! వాళ్ల బంధువులలో ఎవరికో విశ్వనాథము తెలిసినవాడేనట! ఒక నెల తరువాత ఎవరయినా స్వయముగా వచ్చి కలుసుకొని లగ్నము వగైరాలు నిశ్చయపరుస్తారనీ. 'వధువు ఫోటో పంపుతున్నాము చూసుకో'మని పెద్ద ఉత్తరము వచ్చింది.

విలాసంగా తమాషాగా రువ్వినరాయి గమ్యస్థానము చేరింది!

అవతలవాళ్ళు సహజంగానే జవాబు వ్రాశారు. ఇంత వరకు వ్యవహారం బాగానే నడచింది. ఇకముందు సంబంధం వాళ్లెవరైనా తనను చూడటానికి వచ్చి నప్పుడు వ్యవహరించవలసిన విధానమేమిటి?

తన ఫోటోపంపిన తరువాతకూడా వధువు విషయమై విశ్వనాథమున కెటువంటి ఆలోచనలు పోలేదు గాని, తన ఫోటోను చూసి ఆమె మెచ్చినతరువాతనూ, ఆమె ఫోటో తనకు పంపినతరువాతనూ, మనసు కొంచెము ఉద్రేకించిన మాట నిజమే!

తాను పెండ్లికొడుకని, తనతో మాట్లాడటానికే ఇంత దూరము వాళ్లెవరో వధువుపక్షాన వచ్చినప్పుడు, తన స్నేహితుని పేరు చెప్పి తప్పుకుంటే బాగుంటుందా! తాను ఏ వంకతో తప్పుకోవాలి? ఇంతవరకు దిగినతరువాత, ఇప్పుడు తప్పుకుంటేమాత్రము అవమానము కాదూ? నలుగురూ నవ్వుతారు కూడాను.

తిరిగి వివాహమాడటానికి సాహసించకూడదా? సరోజిని సహించలేదా? ఆమెకు ఎటువంటి లోపము చేయడు. ఆమెకు తాను పీసమంతైనా అగౌరవము కలుగనీయడు.

అప్పటికి సరోజిని సమాధానపడకపోతే-ఉండనేఉన్నది నలుగురు తొక్కిన తోవ? కాని తనకు మాత్రము పొందికతో-సరసంగా-సమానంగా దక్షిణనాయ.... లాగ సర్దుకుపోదామనే ఉంది!

అయినా మనదేశపు భార్యలు భర్తకు అంతచేటు ఎదురు తిరుగరు. కొంత వరకు బిగింపుగా ఉన్నా-క్షమ ఓరిమి వాళ్లదగ్గరనుంచే నేర్చుకోవాలి.

ఎటుపోయి ఎటువస్తుందో ఎందుకయినా మంచిదే, కొన్ని ఏర్పాట్లు చేసుకొని ఉండటమని తోచిందతనికి, వధువుకు అలంకార ప్రయత్నము చేయవద్దూ? అందరి కంటె సురాజ్‌మల్లు నగల వర్తకుడు అతని నాకర్షించాడు. ఆ కంపెనీకి ఒక జాబు వ్రాశాడు, ఒక నెక్లేసు ఒక గాజులజత కావాలనీ, ముందు క్యాటలాగు పంపమని. ఈ రోజుల్లో నగలెక్కువగా ఎవరూ పెట్టుకోవటములేదు. ఉన్నవేవో పెట్టెపూజ గానే ఉంటున్నాయి. 'ఇప్పటి కవిచాలు ఈ బంగారపు హెచ్చుధరలలో'నని అని పించింది విశ్వనాథానికి.

కంట్రాక్టరు వీరయ్యకు కబురుచేశాడు. మేడమీద మరొక పడకగది, దాని ప్రక్కన ఒక చిన్న వరెండా. అటువైపుకే మెట్లు కట్టించాలి క్రిందికి దిగ టానికి.

కారు ఎప్పటిదో 1936 మోడలు. గుడ్డటాపు-ఆకారు సర్వాసహ్యముగా ఉంది. కార్పొరేషను వాళ్లకు చెత్తమోయటానికి ఏమయినా పనికివస్తుందేమో! ఇప్పుడువచ్చే రకాలలో ఒకటి కొత్తదే కొనాలి.

వాళ్లెవరో వధువు వైపునుంచి తనను చూడటానికి వస్తారుకాబోలు! తను ఇంటర్వ్యూకి సిద్ధంగా ఉండాలి.

అతనిలో వెనుకటి నిరుత్సాహమూ నీరసమూ లేదు, చికాకు అసలే లేదు. ఇప్పుడు ఇంత శాంతమూ, ఉత్సాహము, నూతన జీవనము ఎట్లా వచ్చినదో అత నికే ఆశ్చర్యముగా ఉన్నది.

* * * * *

ముందుగా టెలిగ్రాముఇచ్చి వధువువైపునుంచి ప్రకాశరావు అనే అయన ఒకనాటి ఉదయము రైలుదిగి విశ్వనాథము ఇంటికి వచ్చాడు. మనిషి ఆడంబర

ముగా వేషభాషలలో నాగరీకముగానే ఉన్నాడు. తనకు తెలిసిన ఆయనను పంపుతా మని వ్రాశారుగాని వచ్చిన మనిషిని తానెరుగనే ఎరుగడు.

విశ్వనాధము చాలా జాగ్రత్తగా దెబ్బగా మాట్లాడుతూ మర్యాద చేశాడు. ఆయనకూడా సాలోచనగానే ప్రశ్నిస్తూ వివరాలను తెలుసుకున్నాడు. వధువును గురించిన వివరాలు చెప్పాడు. సంగీతము బాగా వచ్చునట. చదువుకున్న పిల్ల. విశ్వనాధము జాతకము తీసుకొని వెళ్లుతూ చెప్పాడు "త్వరగా లగ్నము పెట్టించి తెలుపుతా"మని. లాంఛనాల విషయాలుకూడా ఏవో మాట్లాడాడు

విశ్వనాధానికి పని తేలికే అయింది ఆ సందర్భములో, అతను చేయవల సిన పనులు-మెలగవలసిన రీతులు ఆలోచించుకుంటున్నాడు.

* * * * *

అది మాఘమాసము, పెళ్లిళ్ల తరుణము. శుభలేఖలు ఎక్కడనుంచో ప్రతి పోస్టులోనూ వస్తూనే ఉన్నాయి విశ్వనాధానికి.

కాని తన సంగతి ఏమయిందో! వెళ్లిన ఆయన జాబు వ్రాయనూలేదు-ఏర్పాట్లు చేయనూలేదు!

ఈ లోపల విశ్వనాధము తాను చేయదలచుకొన్నవన్నీ చేసేస్తున్నాడు.

ఇంటికి పైన గదులు మెట్లు తయారు అయినాయి. హిల్‌మన్‌మింక్సు కొత్త కారును గరాజిలో ప్రవేశపెట్టారు. సురాజమల్లు కంపెనీవారు ఆర్డరు ఇచ్చిన నగలు పంపారు.

సరోజిని ఏవారము కావారము క్రమము తప్పకుండా తన ఆరోగ్యాభివృద్ధిని గురించి వ్రాస్తూనేఉన్నది. ఈసారి ఆమె జాబుతోకూడా ఒక శుభలేఖను పంపింది. ఆమె పినతల్లి కూతురుపెళ్ళి భీమవరములో చేస్తారని, మాఘశుద్ధ సప్తమినాడు లగ్నము అని.

విశ్వనాధము మనసు ఈ పెళ్లికి వెళ్ళవలెనని ఉత్సహించలేదు. అతనికి స్వంత విషయాలే చాలా ఉన్నాయి ఆలోచించవలసినవి కాని, 'సరోజినికి ఏడవ నెల వచ్చింది. ఆమె నొకసారి చూసి కొత్త సమాధానపెట్టి వచ్చేస్తే.... చూసుకో

వచ్చు తరువాతిమాట. నందో రాజా భవిష్యతి. అప్పటికి రాజెవరో, రెడ్డి ఎవరో. అటువైపులకు వెళ్ళినప్పుడు వీలుగా ఉంటే పెళ్ళికికూడా వెళ్ళిరావచ్చు ఓపూట.' అనుకొని బట్టలు సర్దుకొని అంతా సిద్ధమయిన తరువాత అతని మనసుకు వధువు ఫోటో నగలు తనతో కూడా తీసుకొని వెళ్ళవలెనన్న ఆలోచన తోచినది. వాటిని కూడా భద్రంగా పెట్టెలో అడుగుగా, సరోజినిదృష్టి వాటిమీద పడకుండా ఉండే టట్లు సర్ది పైన బట్టలు అమర్చాడు.

అత్తవారింటికి వెళ్లగానే తెలిసింది, ఆడవాళ్లంతా పెళ్ళికి నాలుగుదినాల క్రిందటే భీమవరము వెళ్లారని. మరునాటి ఉదయమే పెళ్లి.

విశ్వనాథము బావమరిదిని తోడుగా తీసుకొని బస్సులో బయలుదేరి భీమవరము వెళ్ళాడు. ఇల్లంతా సందడిగా ఒకరిమాట ఒకరికి వినపడకుండా బాజా భజంత్రీలతో నిండిఉన్నది పెళ్ళి ఇల్లు.

అతనికి సరోజినితో మాట్లాడాలంటే వెళ్లగానే వీలే కలుగలేదు. ఆమె పెళ్ళికూతురికి జడవేస్తూను, బొట్టు పెట్టుతూను ఆ సందడిలో ఉన్నది. స్త్రీలకు పెళ్ళిళ్ళ సమయములో భర్తల ఆలోచనే ఉండదు.

ఆరాత్రి భోజనాలపందిరిలో మగవాళ్లు ఆడవాళ్ళు ఎదురుపడి పంక్తులుతీర్చి భోజనాలకు కూర్చున్నారు. పెండ్లికూతురు, సరోజిని, ఇంకా చాలామంది ఆడ వాళ్ళు విశ్వనాథముకు ఎదురుగా కూర్చున్నారు.

"ఈ పెళ్ళికూతురు.... ఇట్లా ఉందేమిటి? ఎవరు ఈ అమ్మాయి? తన దగ్గరున్న ఫోటోకూడా ఈ మాదిరిగానే ఉన్నదే? అయినా వ్యత్యాసము ఏమయినా ఉన్నదో,లేదో భోజనమయిన తరువాత పెట్టె తెరచి ఫోటోను చూడా"లని విశ్వనాథము, పెళ్ళికూతురును చూచిన దగ్గరనుంచి, విస్మయపడుతున్నాడు

ఇంతలోకే నేతిగిన్నె తీసుకొని వడ్డిస్తూ ఎవరో ఒకాయన పట్టుబట్ట కట్టుకొని వచ్చాడు.

"నెయ్యి పట్టండి సార్. సరోజినీ! మీ ఆయనకు ఇంత సిగ్గేమిటే" అంటూ గబగబ నెయ్యి వడ్డించుతూ వెళ్లిపోయాడు.

విశ్వనాథము తలఎత్తిచూశాడు. తనను చూడటానికి వచ్చిన ఆయనే వధువు బంధువు! అన్నము కలపడానికికూడా విశ్వనాధము చేతినరాలు స్వాధీనము కాలేదు!

ఆ రాత్రికి సరోజినిని ప్రత్యేకంగా పిలిచి కూర్చోపెట్టి, "నీకు ఏడవనెల వచ్చింది కదూ? మీవాళ్ళు సీమంతము చేస్తారేమోనని నేను నీకు గాజులజత, నెక్లేసు చేయించుకొని వచ్చాను. ఈపెళ్ళి కాగానే నీవు బయలుదేరిరా. నేను ఉండ టానికి వీలులేదు. తెల్లవారుజామున బస్సులో నా ప్రయాణము" అని అన్నాడు.

"అదేమిటి? లగ్నము చూడకుండా వెళ్తానంటారేమిటి? ఇంతదూరము వచ్చి ముహూర్తమయినతరువాత వెళ్లండి" అని సరోజిని బ్రతిమిలాడుతున్నది.

"నేను ప్రత్యేకంగా నిన్ను చూడాలనీ, నీకు గాజులు ఇవ్వాలనీ, వచ్చాను. పెళ్ళి చూడటానికేమిటి? వధూవరులను ఇందాక చూశానుగా. నేను వెళ్ళవలసిన అవసరము ఉన్నది" అని విశ్వనాధము అంటుండగా భోజనాల సమయములో నెయ్యి వడ్డించిన ఆయన అక్కడికేదో పనిమీదవచ్చి, "బావగారూ! సరోజిని నాకు చెల్లెలివరుస. మేము ఇన్నాళ్లనుంచీ దూరదేశాలలో ఉండటమువల్ల మిమ్మలందరినీ చూడటము తటస్థపడలేదు. పెళ్ళికూతురు అచ్చముగా నేను ఇచ్చిన ఫోటోలాగా లేదూ? సరోజినీ! మీఆయన నీకు శ్రద్ధగా చేయించుకొని వచ్చిన బహుమానాలు స్వీకరించవే" అంటూ తన పనిమీద వెళ్ళిపోయాడు.

విశ్వనాధము చేతిరుమాలుతో పాలిపోయిన ముఖము తుడుచుకున్నాడు.



# అక్కరకు వచ్చిన చుట్టము

"అన్నగారూ! ఇట్లా ఒక్కసారి వచ్చి వారిని చూసిపోతారూ?" అంటూ సీతమ్మ గడపకు అవతలగా నిలబడ్డది.

"అట్లాగే వస్తాను" అంటూ చదువుతూఉన్న పత్రికను ప్రక్కకునెట్టి ప్రకాశరావు కూర్చున్న చోటినుండి లేచాడు.

అతడికి సీతమ్మను చూడగానే చాలా ఆశ్చర్యము వేసింది. అవతల భాగంలో కాపురముఉంటున్న ఈ ఆరు సంవత్సరాల కాలములో ఇది రెండవసారి యేమో ఆమె తన ఎదుటికివచ్చి మాట్లాడటము! అయినా అతడు ఆమెను బాగా పరకాయించి చూడటమూ - ఇంతమాత్రము చనువుగా మాట్లాడటమూ ఇదే మొదటిసారి.

"వారికి నెలరోజులనుండీ జ్వరము వస్తున్నది. కొంచెము దగ్గుకూడా ఉన్నది. చాల బాధపడుతున్నారు. మీరు వెళ్ళి పెద్ద డాక్టరును తీసుకొనివచ్చి, చూపిస్తారేమో అడుగుదామని వచ్చాను. ఈ సహాయము చేసిపెట్టుతారూ?" అన్నది సీతమ్మ తలవంచుకొని.

"మీ యింటికి ఎప్పుడూ వచ్చి, మందు యిచ్చే డాక్టరు ఊళ్ళో లేడా ఏమమ్మా?" అని, ప్రకాశరావు తలుపుమీదఉన్న ఉత్తరీయము తీసి బుజముమీద వేసుకొని కాళ్లకు చెప్పులు తొడుగుకున్నాడు

"డాక్టరుగారు నెలరోజులనుండీ మందుయిస్తూనే ఉన్నారు. ఆ మందుది ఒకదారీ-రోగానిది ఒకదారిగా ఉన్నది. ఏ పెద్దడాక్టరైనా చూసి మందు యిస్తే తగ్గుతుందేమో నన్న ఆశ? నయము కాకపోగా-అసలు జబ్బు ఏమిటోకూడా తెలియకుండా ఉన్నది. విపరీతమైన ఆయాసముతో బాధపడుతున్నారు. ఈ నెలరోజుల నుండీ పెలవు పెట్టారు" అంటూ గోడకు చేరబడి నిలవబడ్డది సీతమ్మ.

"అట్లాగే! పెద్దడాక్టరుని తీసుకొనివచ్చి చూపిస్తాను. అయితే అంత జబ్బుగా ఉంటే-ఇన్నాళ్ళనుండీ ఒక్కమాటైనా నాతో చెప్పలేదేమమ్మా?" ఈ మాట అంటూనే ప్రకాశరావు వెళ్ళి అరగంటలో పెద్దడాక్టరును తీసుకొనివచ్చాడు.

డాక్టరు రోగిని పరీక్షచేస్తూ ఉండగా, ప్రకాశరావు వంటయింట్లోకి సీత మ్మను పిలిచి "డాక్టరుగారు ఇంటికివచ్చి రోగినిచూస్తే, మామూలుగా పదిహేను రూపాయలు తీసుకుంటారు" అన్నాడు నెమ్మదిగా. సీతమ్మ మారుమాట్లాడకుండా పెట్టెతీసి రూపాయలు లెక్కపెట్టి అతడి చేతిలో పెట్టినది

అంతలో-డాక్టరు రోగిని పరీక్ష చేయటమైనది కాబోలు-రోగిని ఒకటి రెండు ప్రశ్నలడిగి, వాకిటి తలుపు దగ్గర నిలువబడిన ప్రకాశరావును పిలిచి "నిస్సందేహముగా అదేనండి! స్పెషలిస్టుకు చూపించి త్వరగా వైద్యము చేయించండి. ఇప్పటికే ఆలస్యమైపోయినది" అని ప్రకాశరావు చేతికిచ్చిన రూపాయలను జేబులో వేసుకుని కారుఎక్కాడు. ప్రకాశరావు వెనుకకు తిరిగి గదిలోకి వస్తుండగా సీతమ్మ ఎదురుగావచ్చి 'డాక్టరు ఏమన్నాడు?' అని ప్రశ్నించినది. పాలిపోయిన ఆమె ముఖములో కండ్లు జ్యోతులవలె మెరిసాయి.

ఆమె ప్రశ్నకు జవాబు చెప్పబోయి ప్రకాశరావు తడబడ్డాడు. "అబ్బే!.... ఏమీలేదు! అది ఏంచేస్తుంది?.... మంచిమందు వెంటనే యిప్పించినట్లయితే ఈ పాటికి తగ్గిపోయేదే! ఇంకొక డాక్టరు-ఇలాంటి జబ్బులను త్వరగా నయముచేసే అయన ఉన్నాడట-ఆయనను తీసుకొనివచ్చి చూపించమన్నాడు. ఆయనను తీసుకొని రావటానికి నేను వెళ్ళుతున్నాను గాని సీతమ్మా! నేను తిరిగి వచ్చేవరకూ, గాలి బాగా వచ్చేటట్లు కిటికీ తలుపులన్నీ తెరచిఉంచు.... పిల్లలు తండ్రి దగ్గరికి రాకుండా చూస్తూ ఉండాలి" అంటూ ప్రకాశరావు సైకిలుమీద మరొక డాక్టరు దగ్గరికి వెళ్ళాడు.

అతడు తిరిగి వచ్చేలోపల సీతమ్మ రోగిపక్క చక్కగా దులిపివేసింది. రోగి ముఖము తుడిచి-ఒంటినిండా బట్ట కప్పినది. ఆ గది శుభ్రముగా తుడిచి అవసరములేని సామానులన్నీ అక్కడినుంచి తీసివేసింది.

అంతలో ప్రకాశరావు డాక్టరును తీసుకవచ్చాడు డాక్టరు అడిగిన ప్రశ్నలలో చాలవాటికి సీతమ్మా ప్రకాశరావులే జవాబు ఇచ్చారు. రోగి మాట్లాడటానికి తగినశక్తి లేకుండా ఆయాస పడుతున్నాడు.

"వ్యాధి చాలా ముదిరిపోయినది. శానిటోరియమ్‌లో చేర్పించి.... ఆపరేషన్ చేయించి చూడండి" అన్నాడు. తడి చేతులను తుడుచుకుంటూ—డాక్టరు.

"శానిటోరియమ్‌లో సామాన్యముగా స్థలము దొరుకుతుందా? మీవంటి డాక్టర్లు వ్రాసియిస్తే త్వరగా దొరుకుతుందేమో!" అని ప్రకాశరావు అంటూ ఆయన చేతిలో పదిహేను రూపాయలు పెట్టాడు.

"చాలా అర్జంటుకేసని నేను వ్రాసియిస్తాను.... పోనీ.... నేనే అక్కడికి వ్రాసి స్థలము దొరికేటట్లు చూస్తాను. అక్కడినుండి జవాబు రావటానికి వారము రోజులవుతుంది. ఈలోపల రెండు ఇంజక్షనులు ఇచ్చి చూద్దాము." అని మందు సూదిద్వారా చేతికి ఎక్కించాడు డాక్టరు.

రోగి సన్నగా దగ్గుతూఉండగా—డాక్టరును సాగనంపి ప్రకాశరావు లోపలికి వచ్చి రోగి మంచముదగ్గర నిలువబడి పోయినాడు. కండలుతేరి, రక్తమాంసములతో జవజవలాడుతూ ఉండిన వెంకట్రావు దేహము ఒక నెలదినములలోనే ఎముకలగూడై ఎండిన వరుగువలె మారిపోయినది. కండ్లూ చెంపలూ లోతుకుపోయి చూడటానికి ఎంత భయంకరంగా మారిపోయినది అతడిముఖము! ప్రకాశరావు ఒక వేడి నిట్టూర్పు విడిచి 'సీతమ్మా!' అని తడి ఆరిపోయిన గొంతుతో పిలచాడు.

సీతమ్మ బియ్యము కడిగి పొయ్యిమీద పెట్టి చేతులు తుడుచుకుంటూ అతడికి ఎదురుగా వచ్చి "డాక్టరుగారు మళ్ళీ ఎప్పుడు ఇంజక్షను యిస్తారు?" అన్నది.

"రేపు సాయంకాలము ఆయనే వచ్చి ఇస్తానన్నాడు.... గాని.... సీతమ్మా! ఈ జబ్బు ధనవంతులకు రాతగినదిగాని సామాన్యులకు రాతగ్గదికాదు. ఒక గంట సేపటిలో నలభై రూపాయలు ఖర్చు అయినవి. చూశావా? ఇంజక్షనుకు పది రూపాయలు తీసుకున్నాడు. ఇంకా ఇటువంటి నలభైలు ఎన్ని కావలసిఉన్నవో? శానిటోరియమ్‌లో ఉంచటమంటే మాటలతో కాదు. ఇంత సొమ్ము జతపరచగలవా? ఒకప్రక్క రోగిని చూసుకుంటూ-మరొకప్రక్క పైకము జతపరచాలి." అని ప్రకాశరావు ఆఖరుమాట పూర్తిచేయకముందే సీతమ్మకు కళ్ళల్లో నీళ్లు తిరిగి కంఠధ్వని అప్పటికప్పుడే మారిపోయినది.

"కళ్లనీళ్లు పెట్టుకోకమ్మా. ఇంట్లో మరోదిక్కు లేదని ఆమాట ఎత్తాను. మీకిద్దరికీ తెలియదని చెప్పాను. తప్పుగా ఎంచుకోకు?" అన్నాడు ప్రకాశరావు.

ఆ మాటకు దుఃఖము పొంగి పొరలిపోయింది సీతమ్మకు. "అన్నగారు! వారి జీతము మీరు ఎరుగనిదా? ఆ యిద్దరు పిల్లలను పెట్టుకొని-మేము ఎట్లా కాలము గడుపుతున్నామో-భగవంతుడికే తెలుసు తింటున్నామో-తినటములేదో.... ఈ మాత్రముగా బ్రతకనీయకూడదాదేవుడు?" అని చెంగు కళ్లకు అద్దుకున్నది సీతమ్మ.

"అధైర్యపడకమ్మా. అన్నీ మన మనుకున్నట్లే జరుగుతాయా? అట్లా జరిగితే ప్రపంచ మనిపిచుకుంటుందా? చూడుసీతమ్మా! ఏమాటయినా దాచిన దానికంటె నీకు చెప్పటము మంచిది వెంకట్రావుగారికి బాగా ముదిరిన క్షయవ్యాధి అని డాక్టరు అంటున్నాడు. పిల్లలను తండ్రిదగ్గరకి వెళ్ళనీయకు. ఆపరేషను చేయించితే చాలా కేసులు నయమైనాయట" అని ప్రకాశరావు మందగించిన స్వరములో అంటూ దొడ్డివైపు చూడసాగాడు.

"అమ్మయ్యో! క్షయే! అది నయమవుతుందంటారా?" సీతమ్మకు ఒళ్లంతా చెమటలు పట్టి వణికి పోయినది.

"భయపడకమ్మా. దానిదేమిటి.... అదే తగ్గిపోతుంది. అసలు ఇంజక్షనులకే చాలా కేసులు నయమై పోతాయట. నీవు జబ్బువిషయములో దిగులు పెట్టుకోవద్దు. సరే గాని.... ఇంట్లో చాలాఇబ్బందిగా గడుస్తున్నదని అన్నావుకదా! డాక్టరుకోసము వెంటనే పెట్టెతెరచి రూపాయలు ఎట్లా తీసియిచ్చావు? నే నిట్లా అడిగానని మరోవిధముగా భావించుకోకుసుమా? నీవు నా చెల్లెలివనుకొని అడుగుతున్నాను.... నీ సంగతే నాకు చాలా ఆలోచనగా ఉన్నదమ్మా." అని సీతమ్మ ముఖమువంక చూశాడు. సీతమ్మ కళ్ళలోనుండి అశ్రువులు చెంపలమీదుగా జాలువారి, బొట్లు బొట్లుగా నేలమీద పడటము అతడికి స్పష్టముగా కనపడ్డది.

"సీతమ్మా! పెద్దవాడువచ్చి నీ వెనుక నిలబడ్డాడు చూశావా? చిన్నవాడిని కూడా పిలిచి ఇద్దరికీ అన్నము పెట్టు.... వెంకట్రావుగారి ఒంటిసంగతి వాళ్ల చెవిన పడనియ్యకుసుమా. పసివాళ్ళు దిగులుపడతారు. ఏదయినా అవసరమువస్తే అబ్బాయిని పంపించు" అని ప్రకాశరావు తన భాగములోకి వెళ్ళిపోయాడు.

* * * * *

వెంకట్రావు మునిపల్లె కామమ్మగారి పెద్దకొడుకు. అతడు ఇంటరు చదువుతూవుండగా తండ్రి చనిపోవటమువల్ల ఇంటికి పెద్దఅయి - తల్లితోకూడా ఐదుగురిని పోషించే భారము వహించవలసినవాడైనాడు. చేనదైవా గత్యంతరంలేక-ఆనాడు బడిపంతులుగా ప్రవేశించాడు. జీవనోపాధికి ఏదైనాసరే నన్నట్లుగాఉన్న ఆ నాటి పరిస్థితికి అది ఘనముగానే తోచింది. ఆ కొద్ది జీతములోనే తనవెనుక పుట్టిన తమ్ములిద్దరికీ అతడు చదువు చెప్పించవలసి వచ్చింది. ఇద్దరు చెల్లెళ్ళకు కొద్దిపాటి కట్నకానుకలతో పెళ్ళిళ్లు చేయవలసి వచ్చింది. కామమ్మగారి అల్లుళ్ళు యిద్దరూ ఎప్పుడు వచ్చినా కొత్తబట్టలు కట్టుకొని రైలుఖర్చులు చేతిలోపోయించుకొని ఇల్లు కదిలేవారు.

కామమ్మగారికి పెనిమిటి హయాములో పెదవి మెదపే అవకాశం లేక పోయినది. భర్తఆజ్ఞలు ఆమెకు సుగ్రీవాజ్ఞలుగా వినిపించేవి. ఆయన బ్రతికి ఉండగా అణగిమణగి నడచిన కామమ్మగారు ఆతరువాత మబ్బు విడిచిన ఎండవలె విజృంభించింది. తండ్రి లేడన్న లోపము ఒకటేగాని ఉన్నదానికంటె ఘనముగా కూతుళ్ళకూ కొడుకులకూ యథావిధిగా శుభకార్యములను జరిపించుకొన్నది. ఆమె మనసు ఎప్పుడూ ఎడతెగని శుభకార్యపు పథకాలతో ఉవ్విళ్ళూరుతూ ఉండేది.

కామమ్మగారి హృదయములో మాటుమణగిన బంధు ప్రేమను పెనిమిటి పోయినతరువాత ఆమె బంధువులు ఇట్టే గ్రహించారు.

"మన కామమ్మ పెద్దకొడుకు ఆ ఊళ్ళోనే ఉన్నాడుగా, వాళ్ళయింట్లోనే దిగుదాము. ఇంకెక్కడైనా దిగితే కామమ్మకు కోపము వస్తుందికూడాను. అనవసరముగా యింకొకచోట దిగి ఆమెమనసు నొప్పించుట మెందుకు?" అనుకుంటూ బంధువులు వచ్చి నెలల పర్యంతమూ ఉంటూ ఉండేవారు. వ్యవహారాలకనీ-వైద్యాలకనీ ఎప్పుడూ ఎవరో ఒకరు ఉంటూ ఉండేవారు. బంధువులచేత పరిచయము చేయించుకొని కొంతమంది వస్తూఉండేవారు. కామమ్మగారిది పెద్దచెయ్యి. వేళకు నాలుగూ అమర్చి భోజనము పెట్టుతూ 'నీకేమమ్మ, అదృష్టవంతురాలవు. చెప్పినట్లు వినే కొడుకు — చక్కగా సంపాదించి పెడుతున్నాడు. నీవైనా దొడ్డమనసు కలదానవుగాని అందరివంటిదానవు కాదు' అని ఒక్కొక్కరు పొగుడుతూ ఉంటే ఆమెకు అరచేతిలో స్వర్గమున్నట్లే ఉండేది.

కామమ్మగారి కొడుకు లిద్దరూ వాళ్ళకు కావలసినవి అడగటము తప్ప మరొక విషయము ఎరుగనే ఎరుగరు. పెదవి జారకముందే చదువుకోటానికి పుస్తకాలు—వేసుకోటానికి బట్టలూ—చిరుతిండికి చిల్లరడబ్బులూ వాళ్ళకు అమరవలసినదే. ఒకరోజు ఆలస్యమైనా కామమ్మగారు వాళ్ళపక్షమున వెంకట్రావు మీద యుద్ధం ప్రకటించేది. "ఆ మహారాజు బ్రతికి ఉండగా నీ పెండ్లీ చదువూ వైభవముగా జరిగిపోయినవి.' నీవు ఎంత మూతివిరచినా బిడ్డలను పెట్టుకొని నీ పంచన పడిఉండక నాకు తప్పలేదు." అంటూ వీధినబడి అరిచేది. పొరుగింటి జగడము వినటాని కెంతో వేడుకగా ఉంటుంది. అందరూ ఆమె చెప్పినదంతా విని 'పాపము పెద్దతనానికి ఎంతకష్టము వచ్చిందో?' అనుకునే వారు.

వెంకట్రావు మెదడు కుటుంబభారము పైనబడిన తరువాత నిర్వికారముగా మారిపోజొచ్చింది. అతడి మనసులో ఎన్నడో ఒకనాడు ఇంటిపరిస్థితులు మెరపుల వలె మెరసేవి. మెరసినప్పుడు మాత్రము ఆదాయాన్ని వ్యయంతో సరితూచటానికి ప్రయత్నించ దలచేవాడు. తల్లితో తన పరిస్థితులను విప్పి చెప్పవలెనని వాంఛించే వాడు. ఈ ఆలోచనల కొక స్వరూప మేర్పడకముందే తల్లి మేఘగర్జనలు విన బడేవి—ఈ ఆలోచనలు మెరుపువలె మెరవటమువరకే అతడి జీవితములో నిలిచిపోతూ ఉండేవి. ఆఅనుభవంవల్లనే అతడికి కొన్ని లోకసత్యాలు గ్రహింపుకు వచ్చినవి. 'తాము ఇతరులకొరకు స్వార్థమును చంపుకొని ఎంత కష్టించినా— తమ దంపతుల కష్టసుఖాలు ఎవరికీ పట్టవు! ఆ యింటిలో ఉన్నవారికీ—వచ్చే బంధువులకూ కేవలము అవసరములను గడిపే యంత్రాలు ఆ దంపతులు!' అని.

ఆ దంపతు లిద్దరూ తమను అక్షరాలా యంత్రాలుగానే భావించుకున్నారు. కాకపోతే బాకులవలె ఎదలలోనుండి దూసుకొనిపోయే మాటలు పడుతూ కూడా చలించకుండా వాళ్ళ ధర్మాలను వాళ్లు నిర్వహించగలరా? ఇంతో—అంతో సంపాదించుతున్న వెంకట్రావు భోజనంలో రుచినీ—శుభ్రమైన బట్టలనూ జీవిత ములో ఎరుగనివాడుగానే ఉండగలడా? అతడి జీవితములో కొత్తకాపురపు ముచ్చటలుగానీ ఆనందరసానుభూతిగాని ఎరుగని విషయాలుగా నిలిచిపోగలవా? తమకు కావలసినవి నిష్ఠురముతోనూ—ఒత్తిడితోనూ జరపించుకుంటూ ఉండేవారి మీద ఏ భావమూ లేకుండా నిర్లిప్తుడుగా ఉండగలడా?

తమ్ముళ్లూ చెల్లెళ్లూ ఒక యింటివారయేసరికి వెంకట్రావు నడివయసులోకి వచ్చినాడు. సంసార శకటము కుంటుతూ గతుకులబాటమీద మందముగా నడచి పోతున్నది.

వెంకట్రావు తమ్ములిద్దరూ ఆరునెలల వ్యత్యాసముగా ఉద్యోగములలో చేరి, చెరి ఒక ఊరిలోనూ కాపురములు పెట్టినారు. కొత్త కోడళ్ళకూ కొడుకులకూ కొత్త కాపురము అమర్చబోయిన కామమ్మగారు నంజువ్యాధితో—ఇతరులు గుర్తుపట్టలేని రూపంతో వెంకట్రావుయింటికి నాలుగు నెలలకే తిరిగివచ్చింది ఆ వ్యాధి ఆమెను సంవత్సరముపాటు క్రిందుమీదులు చేసినది. ఆ రోజులలో వెంకట్రావు ఇంటిలో జనసందడి తీర్థప్రజను మరపించింది. ఆమె వైద్యమునకూ బంధువుల రాకపోకలకూ వెంకట్రావుకు అతడి శక్తికి మించిన వ్యయమైనది. కామమ్మగారి కొడుకులూ కూతుళ్లూ వచ్చి చూసిపోతున్నారు.

ఏడాదికిమీదుగా వైద్యముజరిగినది—కాని కామమ్మగారి దేహముమాత్రము వ్యాధి తగ్గి ఆరోగ్యమును పొందలేదు. వెంకట్రావు శారీరకకష్టమూ—ధన వ్యయమూ గమనించకుండా—అతడికి మాటదక్కకుండా కామమ్మగారు భౌతిక దేహము వీడి వెళ్ళిపోయింది.

బంధుకోటిలో కామమ్మగారు చాల పలుకుబడి గలది గనుక కర్మలు చేసే నాటికి అందరూ వచ్చినారు. చనిపోయినదన్నవార్త తెలియగానే వెంకట్రావు చెల్లెళ్ళూ తమ్ముళ్ళూ వచ్చినారు. కర్మలు యథావిధిగా జరిపించారు.

కామమ్మగారు చనిపోయిన పదమూడవ దినమది. బంధువు లందరూ ఎక్కడివారక్కడికి చేరుకొనే ప్రయత్నములో ఉన్నారు,

“కామమ్మ పోయినదంటే నమ్మలేకుండా ఉన్నాను. ఇంకా ఆమె లోపటి నుంచి మనలను పిలుస్తూ వస్తున్నట్లే కళ్ళకు కనిపిస్తున్నది. ఎంతఆదరణా—ఎంత మర్యాదా! అటువంటి మనిషి ఇదివరలో ఎక్కడైనా పుట్టినదంటావా?” అని కామమ్మ గారి మేనమామ బావమరిది తన తోడల్లుడితో అంటున్నాడు.

“ఆమె ఆదరించి అన్నము పెట్టడంలో సాక్షాత్ అన్నపూర్ణాదేవే అనుకోవాలి. ఈ ఊళ్ళో మరెక్కడ దిగినా ఊరుకునేదికాదు. ఎవరు వచ్చినా తన యింట్లో

దిగవలసినదే. మహా యిల్లాలు! ఆమెకు ఏమంత పెద్దవయసు ఉన్నదనీ కాలము చేయటానికి? ఆమెకంటె పెద్దవాళ్లు భూమిమీద లేరూ?'' అన్నాడు ఆయన.

"పాపము! మహా బాధపడ్డది. రోగానికి తగిన వైద్యము జరిగిందో లేదో? పట్నములాంటి ఊళ్ళకు తీసుకొనివెళ్ళి మంచిమందు యిప్పిస్తే నాలుగుకాలాలపాటు బ్రతికిఉండేదేమో!'' అని తన నమ్మకాన్ని తెలియబరచినాడు కామమ్మగారి చెల్లెలిమరది.

ఎప్పటినుండో ఎదురుచూస్తున్న వెంకట్రావు తమ్ముడికి ఈ మాటలవల్ల తన మనసులో ఉన్నదంతా వెడలగ్రక్కే అవకాశము చేతి కందిచ్చి నట్లయినది. "ఆ.... పెద్దవాళ్లు పోవటమే మంచిది. ఇంకా బ్రతికినకొద్దీ తిండికికూడా యిబ్బంది పడతారు'' అన్నాడు తెలివిగా.

''ఆమె కేమి కర్మము వచ్చిందనీ తిండకి ఇబ్బంది పడటానికి?'' అని అందరు ఒక్కసారే వెంకట్రావు తమ్ముడివైపుకు తిరిగాడు.

''ఆఁ....ఏమీ లేదు. ఆమెకు తిండి పెట్టటమే ఆయన గారికి కష్ట మనిపిస్తుంటే—మంచి వైద్యము చేయించలేదని అంటారేం?'' అన్నాడు వెంకట్రావు తమ్ముడు.

బంధువులందరూ ఒకరి ముఖము ఒకరు చూసుకొంటూ విమర్శనలు ప్రారంభించారు.

ఈ సందర్భములోకూడా వెంకట్రావు తాను యంత్రమన్నమాట మరువ లేదు. విషయ మెరుగని విమర్శనలకు అతడు తలమాత్రము వంచినాడు.

ఆ తరువాత తరువాత అతడు నెమ్మది నెమ్మదిగా తను కూడా ఒక మనిషే నన్నభావము కలిగించుకొని తన సంసారపు స్థితిగతులను సమీక్షించుకొనగా-అయ్యదారుపేల ఋణము తేలినది

తల్లిపోయిన తెరువాత తమ్ములుగానీ చెల్లెళ్ళుగానీ తిరిగి చూడలేదు. అతడి క్షేమం తెలిపికోలేదు.

సంవత్సరము గిర్రున తిరిగివచ్చినది. తల్లి సాంవత్సరికములకు తమ్ముళ్లూ చెల్లెళ్లూ తిరిగి సమావేశమయినారు. వెంకట్రావు తన సంసారపు విషయాలను సమగ్రంగా వాళ్ళతో చెప్పి—అతి సున్నితంగా ఋణముల ప్రశంసను ఎత్తినాడు.

"నాలుగేళ్ళు దగ్గలపెట్టుకొని చదువు చెప్పించావే అనుకో! అంతమాత్రాన అప్పులయినవని చెప్పటానికి నోరెట్లా వచ్చినదంట నీకు?" అన్నాడొక తమ్ముడు.

"మాకు ఆస్తి ఏమీ ఇవ్వకపోగా అప్పు యివ్వవలెనని తోచిందా? మాకు ఆస్తిలో భాగము వద్దులే అన్నయ్యా!" అన్నాడు మరొక తమ్ముడు.

తమ్ముళ్లిద్దరూ సూచించిన పిత్రార్జితపు ఆస్తి అంతా పల్లెటూరిలో ఉన్న మొండిగోడల మట్టియిల్లు. అది తండ్రినాటి బాకీల క్రింద—ఆ ఊరి కోమటి ఏనాడో లెక్క చూచుకొన్నాడు.

వెంకట్రావు చెల్లెళ్లూ తమ్ముళ్లూ ఊరికి వెళ్ళేనాడు తిరిగి ఆ ప్రశంస ఎట్లాగో తల ఎత్తినది.

తల్లి మెడలోని గొలుసు చెరిఒకపేటా—చేతిగాజులలో చెరి ఒక జతా తీసుకొని "అమ్మా నాన్నాలేని పుట్టింట్లో మమ్మల్ని ఎవరు పలుకరిస్తారు?" అంటూ ఆడపిల్లలు అన్నగారు కొని యిచ్చిన టికెట్టు తీసుకొని రైలు ఎక్కినారు.

మరునటి సంవత్సరము నుండీ తమ్ముళ్లిద్దరూ తలిదండ్రుల తద్దినములు వారివారి యిళ్ళలోనే పెట్టుకున్నారు.

అంతవరకూ రెండు రూపాయలైనా వెంకట్రావును అడుగనివారు గానీ సీతమ్మచేతి అన్నం తిననివారుగానీ బంధుజాలములో లేరు. తనకు ఋణము ఉన్నదని నలుగురిలో చెప్పటము వల్ల కాబోలు—అంత రాకపోకలుగల బంధుజాలము పల్చబడి పోయినది. మేనత్త కొడుకులూ మేనమామ బావమరదలూ తమకున్న బంధుత్వమును విస్మరించారు.

అదిమొదలుగా అతడు తన జీతములో సగము కుటుంబం క్రింద వ్యయపరచుకుంటూ సగము ఋణముల క్రింద జమకట్టుతూ కాలమును నెట్టుకుంటూ వస్తున్నాడు.

వెంకట్రావు కొడుకులు చదువులకు ఎదిగినారు. పన్నెండు ఏండ్లవాడు ఒకడూ—పదిఏండ్లవాడు ఒకడూను. ఇంటిలో ఉన్నంతసేపూ ఆపిల్లలిద్దరికీ తృప్తిగానే ఉండేది....కాని వీధి ముఖము చూడగానే 'మనకా వస్తువు ఉంటే బాగుండును ...మన కా మాదిరి బట్టలుఉంటే బాగుండును' అని వాళ్ళ మనస్సులు ఆరాటపడుతూ ఉండేవి. కాని సీతమ్మను కొడుకులు ఏది అడిగినా "బాబూ! నాన్నను వీటికోసం పీడించకండి. ఈ ఒక్క ఏడాది ఎట్లాగో గడిపితే మీ కిద్దరికి మంచి మంచి బట్టలు కుట్టిస్తాము. సైకిలు కొనియిస్తాము" అంటూ ఎన్నో గగనకుసుమాలిను ఏరి వాళ్ళకు వాసన చూపించేది. 'ఆ ఏడాది ఎప్పుడు అవుతుందా' అని ఆ అమాయకమైన హృదయాలు రోజులను లెక్కించేవి. 'కష్టాలతో కూడిన ఈ సంవత్సరము ఎట్లాగో గడిపివేస్తే — వచ్చే సంవత్సరములో తాము కోరినవన్నీ అనుభవించవచ్చును....అమ్మ తాము అడిగినవన్నీ కొనియిస్తుంది' అనుకుంటూ నిత్యమూ స్వప్నవీధులలో తిరుగాడుతూ ఒక్కొక్క సంవత్సరమే తరుపుకుంటూ వస్తున్నారు పిల్లలు.

గడచిన ఆరుసంవత్సరములనుండీ ఒక యింట్లోనే ఉండటమువల్ల వెంకట్రావు సంసారములో ప్రకాశరావు ఎరుగని విషయములేదు. సీతమ్మచెప్పక పోయినా విషయమంతా గ్రహించాడు.

'నెలదినములనుండీ వెంకట్రావు మంచంలోనే ఉన్నాడు కదా! సీతమ్మ పెట్టెలోనుండి రూపాయలనుతీసి డాక్టర్లకొరకు ఖర్చుచేస్తున్నదంటే ఎక్కడినుండి వచ్చినట్లూ ఈ డబ్బు?'

ప్రకాశరావుకు ఆశ్చర్యమే కలిగింది.

* * * * *

వెంకట్రావుకు డాక్టరు యింట్లోనే ఆరు ఇంజక్షనులు ఇచ్చాడు. శానిటోరియమ్‌లో బెడ్ దొరికినదనీ వచ్చే వారములో చేర్పించమనీ చెప్పి చీటీవ్రాసి ఇచ్చినాడు.

సీతమ్మ యింట్లో పడుతున్న యిబ్బందులను ప్రకాశరావుచూస్తునేఉన్నాడు, కట్టెలఖర్చు తగ్గించటానికని రెండుదినముల కొకసారి రొట్టెలు చేయటమూ—వాటిని మజ్జిగలో నానబెట్టి పిల్లలకు పెట్టటమూ, చాకలివాడికి బట్టలు వెయ్యకుండా తానే

డబ్బుతో ఉతికి పిల్లలకు వేయటమూ గమనిస్తూనే ఉన్నాడు. తమకు రేషను కార్డు మీద వచ్చిన బియ్యము వకీలుగారింటికి చీకటివేళ పంపుతూ-జొన్నలు గోధుమలతోనే గడుపుకుంటూ వస్తున్నది సీతమ్మ. తండ్రికి జబ్బుగా ఉన్నదని పిల్లలమనసు నొవ్వకుండా మరపిస్తున్నది. తాను మాసికలూ బ్రహ్మముడులూ వేసిన చీరలను కట్టుకుంటూ వెంకట్రావుకి కావలసిన ఖర్చులు పెట్టుతున్నది సీతమ్మ.

ఒకనాడు ప్రకాశరావు మధ్యాహ్నపువేళ వెంకట్రావు దగ్గర కూర్చుని మాట్లాడుతున్నాడు.

'మీరింత జబ్బుగా ఉన్నారుకదా! మీవాళ్ల కెవరికీ తెలుప లేదా ఏమిటి-ఒక్కరైనా రాలేదు' అన్నాడు ప్రకాశరావు.

'వచ్చి చూడటానికి వాళ్లకు వీలుకావద్దూ' అని హీనస్వరముతో జవాబిచ్చినాడు వెంకట్రావు.

"ఏదో విధముగా వీలుచేసికొని వచ్చి చూస్తారు. అబ్బాయిచేత వ్రాయించండి" అన్నాడు ప్రకాశరావు. ఆ తమ్ములనగా ఎవరు? వెంకట్రావు సగము కడుపుకు మాత్రమే తిని సంరక్షణచేసి చదువు చెప్పించిన తమ్ములేగా! అనుకున్నాడు ప్రకాశరావు.

"మీకు జబ్బుగా ఉన్నదాయెను. మనిషి సహాయమే కావలసి వస్తుందో-డబ్బు సహాయమే కావలసి వస్తుందో.... ఎందుకైనా మంచిది ఒకకార్డు వ్రాయించండి," అన్నాడు ప్రకాశరావు. అతడికి ఆ కుటుంబములోని లోతుపాతులు అప్పటివరకూ బాగా తెలియలేదు.

వెంకట్రావు ఒకవేడి నిట్టూర్పు విడచినాడు. దాని అర్థము 'అంతటి భాగ్యమా?' అని స్ఫురించినది ప్రకాశరావుకు.

"పోనీ నేను వ్రాయనా?" అన్నాడు అంతటితో పోనీయకుండా, "వ్రాయండి ఒక కార్డేగా నష్టము" అన్నాడు వెంకట్రావు ముఖము అటుప్రక్కకు త్రిప్పుకొని.

"నాకు చాలా ఆశ్చర్యముగా ఉన్నదండీ- ఆ యిల్లాలి సంగతి చూసినకొద్దీ నాకు కడుపు చెరువైపోతున్నది. ఇల్లు ఎట్లా గడుపుతున్నదో....ఏమి చేస్తున్నదో....

పిల్లల కేమిపెట్టుతున్నదో.... తానేమి తింటున్నదో.... ఒక్కమాట పైకి రానివ్వ టములేదు. 'నేను ఇంత దగ్గరగా ఉన్నాను.... ఒక్క విషయమైనా నాకు తెలియ టములేదంటే నమ్మండి. నెలరోజుల నుండీ మీరు మంచము మీదనే ఉన్నారా?.... మరొకరైనట్లయితే సంసారము ఈ పాటికి నడివీధిలో ఉండేది.'' అని ప్రకాశ రావు అంటూఉండగా వెంకట్రావు శుష్కవదనములో వేయి దీపాల వెలుగు వెలిగినట్లయినది.

* * * *

రాత్రి పదిగంటలవేళ వెంకట్రావు పిలిచినట్లు తోచి, సీతమ్మ నిద్రలో ఉలికిపడి లేచింది.

''నాకు నిద్రపట్టుటలేదు. కడుపులో ఏదో ఆరాటముగా ఉన్నది సీతా!'' అన్నాడు వెంకట్రావు ప్రక్కమీద మసలుతూ.

''కొంచెము పండ్లరసము తాగి పడుకోండి'' అని గ్లాసులోపోసి చేతి కిచ్చింది సీతమ్మ.

''సీతా! ఈ పక్క అమృతాంజనముతో రాయి'' అన్నాడు. సీతమ్మ అమృతాంజనముతో వెంకట్రావు వీపుమీద రాస్తూఉండగా, 'డాక్టర్లకు ఫీజు ఎక్కడి నుంచి ఇస్తున్నావు సీతా! ఇంజక్షను రూపాయలు ఎప్పటికప్పుడు చేతిలో వేసు కుంటున్నాడట కదూ డాక్టరు?' అన్నాడు వెంకట్రావు.

''........................''

''పండ్లకూ మందులకూ ఎంత లేదన్నా రోజుకు పది రూపాయలు ఖర్చవు తున్నది కదూ?''

సీతమ్మ ఆ మాటలు వినకుండా అమృతాంజనముతో రాస్తూ కూర్చున్నది.

వెంకట్రావుకేదో తటాలున మనసుకు తట్టి- ''నీ చేతిగాజు లేవే సీతా!'' అని ఆమె ముఖముచూస్తూ అడిగినాడు.

''........................''

"నేను అప్పుడే రెండు జతల గాజులు ఖర్చుపెట్టించానా? ఇంకా శానిటో రియమ్‌లో చేర్పిస్తా నంటున్నావు. అక్కడ బాగా ఖర్చవుతుంది. ఇంట్లో ఉంటే కొద్దిలో వెళ్ళిపోతుందిగా సీతా!"

"శానిటోరియమ్‌లో చేర్పిస్తే మీ ఆరోగ్యము త్వరగా బాగవుతుందట. ఆరోగ్యము బాగయ్యేటప్పుడు డబ్బు ఖర్చయితే మాత్రము ఏమి?" అన్నది సీతమ్మ తల వంచుకొని.

"డబ్బు కావద్దుటే? అప్పుడే ఇంత ఖర్చయినదా? ఇంకా ఎంత కావలసి ఉన్నదో? ఎక్కడినుంచి వస్తుంది డబ్బు?"

"ఎడమచేతికి ఇంకా రెండు గాజులున్నాయిగా!"

"సీతా! అవికూడా నాక్రిందే ఖర్చుపెట్టుతావా? తరువాత నీకెట్లాగే?"

"మీ ఆరోగ్యము కుదురుకుంటుంది కదండీ. మరి వాటి ఉపయోగము అవసరాలకి ఖర్చు పెట్టటానికేగా!" సీతమ్మ కళ్ళనుండి వెచ్చటి కన్నీటిబొట్లు వెంకట్రావు చేతిమీద పడ్డవి.

"సీతా! ఏడుస్తున్నావా?.... ఆరెండు గాజులు ఇప్పుడే ఖర్చుపెట్టకు. తరువాత ఇబ్బందిపడతావు. ఆ పదిరోజులలో రకరకాల ఖర్చులు వస్తాయి." అన్నాడు వెంకట్రావు ఆమె కన్నీళ్ళను తుడుస్తూ.

* * * * *

ఆ దినము వెంకట్రావును శానిటోరియములో చేర్పించవలెనని ప్రకాశరావు టాక్సీకారును తీసుకొనివచ్చి వాకిటిముందు నిలబెట్టి లోపలికి వెళ్ళి సామాను సర్దుతున్నాడు. వెంకట్రావుకు కావలసిన పరుపుచుట్టా పండ్లబుట్టా కట్టుతూ "సీతమ్మా ఆయనకు ఇస్త్రీ బట్టలు తొడిగించు. ఇంక బయలుదేరుదాము- " అన్నాడు

"అన్నగారూ! మీరు ఇట్లావచ్చి వీరిదగ్గర ఒక్కక్షణము కూర్చోండి. నేను ఒకసారి అట్లా వకీలుగారింటి కెళ్ళి ఆయన భార్యతో చెప్పివస్తాను. ఇంతలోకే వారికి- ఓవల్‌టిన్ తాగిన ఆయాసముకూడా తగ్గుతుంది" అంటూ అవతలికి వెళ్ళింది సీతమ్మ.

ఆమె అట్లా గడప దాటిందో లేదో.... వెంకట్రావు 'అమ్మా' అని ఒక్క కేకవేసి వాంతి చేసుకొన్నాడు.

అతనిని దిండుకాన్చి కూర్చుండబెట్టి, గుండెమీద రాస్తూ కూర్చున్నాడు ప్రకాశరావు. మంచంమీద అట్లా ఉండగానే వెంకట్రావు మరొక పెద్ద కేకపెట్టాడు.

అంతలో సీతమ్మ తిరిగి వచ్చింది. ఆమె మెడలోని మంగళసూత్రములు నూలుదారము లోనికి ఎక్కటానికే ఈ ఆలస్యము జరిగినదని ప్రకాశరావు ఆమెను చూసినవెంటనే గ్రహించినాడు. ఆమె అలికిడివిని వెంకట్రావు కళ్ళు తెరచి దగ్గరకు రమ్మని సీతమ్మకు చేతిసైగ చేశాడు.

సీతమ్మ అతడి తలక్రింద దిండ్లను సర్ది, మంచముమీద కూర్చుని "మళ్ళీ వాంతి అయిందా ఏమిటి? ఆయాసపడుతున్నారెందుకు?" అంటూ అతడి గుండె మీద చెయ్యివేసి రాయ నారంభించినది.

"సీతా! ఇటు చూడు. నా మాట విను.... డబ్బంతా లాభము లేనిదానికి ఖర్చుచేయకు. అపైన ఇబ్బందిపడిపోతావు. ఉన్నదికాస్తా ఇప్పుడే ఖర్చుచేయకు." అంటూ క్షీణించిన ధ్వనితో ఒక్కొక్కమాటే ఉచ్చరిస్తున్నాడు వెంకట్రావు.

"డబ్బు సంగతి మీకెందుకు చెప్పండి. మీరు మందు తీసుకుంటూ, శానిటోరియమ్‌లో ఉంటే తొందరగా జబ్బు తగ్గిపోతుందని డాక్టరు అన్నాడు. జబ్బు తగ్గిపోయినతరువాత మనము మళ్ళీ చేయించుకో కూడదూ? వాటికోసము యింత జబ్బులోఉన్న మీరు దిగులుపడుతున్నారా? అన్నగారూ! మీరైన ఒక తూరి చెప్పండి వీరికి. అస్తమానమూ డబ్బునుగురించి ఆలోచించటము ఎక్కువై పోయింది. అసలు ఇంత జబ్బు చేయటానికి కూడా అదే కారణమేమో!" అంటూ కళ్ళు ఒత్తుకొని వెంకట్రావు ఎదపైన రాస్తూ అతడి ముఖములోకి చూసింది సీతమ్మ.

వెంకట్రావు మరొక పెద్దకేక పెట్టినాడు.

సీతమ్మ మంచముమీద కూర్చుని వెంకట్రావును పట్టుకొన్నది. ఆయాస పడుతున్న వెంకట్రావు ఫాలభాగము ఆమె కన్నీటితో తడిసిపోయినది.

ఈలోపల ప్రకాశరావు కారులో సామానులన్నీ సర్ది- వెంకట్రావుకు ప్రక్కను అమర్చి- షర్టు చేతులను పైకి తోసుకుంటూ గదిలోకివచ్చి వెంకట్రావును లేవతీయబోయి "సీతమ్మా నీవు మంచము మీదనుంచి లేచి ఇవతలికి రా" అంటూ వెంకట్రావు ఒంటినిండా బట్ట కప్పినాడు.

"అన్నగారూ ఎండ ఎక్కిపోతున్నది. మనము త్వరగా బయల్దేరివద్దూ" అంటూ సీతమ్మ పెరటి తలుపులను మూసి వచ్చినది.

ప్రకాశరావు నీరవుడై "ఇంకా అక్కడికి ఎందుకు తల్లీ!" అంటూ గోడకు చేరబడిపోయినాడు.

సీతమ్మ నిలువునా నేలమీద పడిపోయినది.

వెంకట్రావు చాలా జబ్బుగా ఉన్నాడని, సీతమ్మకూ వెంకట్రావుకూ తెలియకుండా, ప్రకాశరావు సీతమ్మ మరదులకూ బంధువులకూ అనేక ఉత్తరాలు వ్రాసినాడు. 'ఎట్లా ఉన్నద'ని ఒక్కరి దగ్గరనుండైనా ఉత్తరముక్క రాలేదు. కాని వెంకట్రావు చనిపోయినాడన్న వార్త తెలియగానే బంధుజనము వచ్చి వాలినది.

తన నగలను అమ్మిన బాబతు పైకముతో సీతమ్మ తన కొడుకుచేత కర్మలను చేయించినది.

'మరొక యేభయి రూపాయలు ఖర్చు అయినా మంచి గోవును దానము ఇస్తే పుణ్యమూ పురుషార్థమూను' అంటూ దగ్గర ఉండి కర్మకాండ చేయించి మరీ యిళ్లకు వెళ్ళినాడు బంధుజనము.

సీతమ్మకు వెంకట్రావు తుది మాటలలోని అర్థము అప్పుడు గ్రాహ్యమైనది !



# ప్రత్యక్ష పరిచయం

“కనకలింగేశ్వరీదేవిగారి ఇల్లు ఇదేనాండి?” అని అడుగుతూ ఓరవాకిలిగా వేసిన తలుపులు నెట్టాడు. జవాబుకొరకు ఎదురుచూస్తూ చేతిలో ఉన్న సూటు కేసును మెట్టుమీదనే ఉంచి మరొకసారి తలుపుదగ్గర నిలబడి లోపలికి తొంగి చూశాడా యువకుడు.

“మగవాళ్లు ఇంట్లో లేరండీ! ఇంకో గంటకుగాని రారు” అంటూ లోప ల్నించి వచ్చింది ఇంటావిడ.

“ఆఁహాఁ! అట్లాగా! అయితే ఇది కనకలింగేశ్వరీదేవిగారి ఇల్లేనా” తిరిగి ప్రశ్నించాడా యువకుడు.

“నా పేరు కనకమ్మ అంటారు. మీ రన్న పేరుగలవాళ్లు ఈ వీధిలో ఎవరూ లేరే!” అన్నదావిడ పైటచెంగుతో పెదవులను అద్దుకుంటూ.

అతడు ముందుకు రాబోవటముచూసి కనకమ్మ వెనుకడుగు వేసింది. కోటు జేబులోకి చెయ్యి పోనిస్తూ అన్నాడు. “ఈ ఇల్లే అయిఉండాలి. నేను పొరబడ లేదనుకుంటాను.”

కనకమ్మ గోడకానుకుని నిలబడి చూస్తూ అతడిని కూర్చోమని కుర్చీ చూపిం చింది. పుట్టింటివారు చూసిరమ్మని పంపిచారేమో ఒకవేళ - లేకపోతే తనపేరే ముందుగా ఎందుకు ఎత్తుతాడు? అనుకున్నది. ఎంతసేపు జ్ఞాపకము చేసుకున్నా అతడిని అదివరలో చూపినట్టు గుర్తుకు రాలేదు.

“నేను మీ దర్శనము చేసుకుంటామని వచ్చాను” అన్నాడు తానే సంభాష ణకు ఆరంభము చేస్తూ అతడు.

“మీరు ఎక్కడినుంచి వస్తున్నారు?” అన్నది మామూలుగా కనకమ్మ. ఏ సిఫారసుకో వచ్చి ఉంటాడని అనుమానించింది. “ఆయినా తనవారు చెప్పిపంపిన

సమాచారమంతా గబగబ చెప్పడే''మని ఆమె అనుకునే అంతలో అతడే అందు కున్నాడు.

"నేను తెనాలిలో ఉంటానులెండి. నేను కవిత్వము నేర్చిన వాడిని కాను. రసాస్వాదకుడను. ఇటీవల వెలువడిన గ్రంథాలన్నీ చదివిన వాడిని. నాకు నేటి సాహిత్యములో అభిరుచి ఎక్కువ. మీ గ్రంథము అచ్చయినదని విన్నాను. వినట మేమిటి - దాని సమీక్ష ప్రతికలు ప్రకటించినంతవరకూ చదివాను. ఆ గ్రంథము చదవాలన్న ఆశకొద్దీ నేనే వ్రాసి ఒక ప్రతిని తెప్పించుకున్నాను. కోరిన వెంటనే మీరు ఒక కాంప్లిమెంటరీ కాపీకూడా పంపారు." అన్నాడు ఆమె ముఖములోకి చూస్తూ.

అతడు ఏ విషయాన్ని గురించి మాట్లాడుతున్నాడో ఆమెకు అర్థము కాలేదు. అతడు ఎవరికోసమో వచ్చాడు-తనను చూసి పొరబడ్డాడనుకున్నది కనకమ్మ.

ముఖము చేతిరుమాలుతో తుడుచుకుంటూ అతడు తిరిగి ప్రారంభించాడు "గ్రంథము చక్కగా ముద్రించారు. చాలా ఆకర్షణీయంగా ఉన్నది. నేనా పుస్తకాన్ని ఎన్నిమార్లు చదివానో చెప్పలేను అన్ని కథలూ ప్రత్యేకంగా ఎన్నతగినవే. ముఖ్యంగా ఆ చివరికథ నాకు చాలా నచ్చింది. అన్నిటిలోకి అది కొలికి పూసలా ఉన్నది. ఆ సన్నివేశాలు చాలా సహజంగా రమ్యంగా ఉన్నాయి."

కనకమ్మ గారెలపిండి రుబ్బుతూ వచ్చింది. కాఫీ నీళ్లు పొయ్యిమీద మరిగి పోతున్నాయి. తనకు ఎంత మాత్రమూ అర్థము కాని సోది ఎంతసేపు వింటూ కూర్చుంటుంది? వేళకు కాఫీ ఫలాహారము అందకపోతే కనుబొమలు ముడివేసే పెనిమిటి ఈ పాటికి వస్తూ ఉంటాడు ఇంటికి.

"వారు వచ్చే వేళయింది కూర్చోండి" అంటూ లోపలికి వెళ్లబోయింది కనకమ్మ. "వివరాలన్నీ అయనే అడుగుతాడు-తన కెందుకా గొడవ? లేని పోనిది!" అనుకుని.

వెంటనే అతడూ లేచినిలబడ్డాడు. "ఏంలేదండీ! మీ గ్రంథము చదివి నేను ఎంత ఆనందించానో ఇప్పుడు చెప్పలేను. నిజంగా స్త్రీలలో ఇటువంటి కథలు వ్రాసినవారు తక్కువ. నా సంతోషాన్ని స్వయంగా తెలుపుకుందామని ఇంతదూరము వచ్చాను. మీ కథలమీద నేనొక చక్కని సమీక్షకూడా వ్రాశాను..........."

అతడింకా మాటపూర్తి చేయకముందే ఇద్దరు లాల్చీ తొడుక్కున్న కనకమ్మ పెనిమిటి లోపలికి వచ్చాడు; వస్తూనే అతడి ముఖము చూసి నిలబడి పోయాడు.

పెనిమిటి రాగనే కనకమ్మ తన మీది బరువు దిగిపోయి నట్టుగా లోపలికి వెళ్లిపోయింది.

అతడు ఆమె పుట్టింటివారి వైపు చుట్టమేమోననుకుంటూ లోపలికి వెళ్లి చెప్పులు విడిచి కాళ్లుకడుక్కుని వస్తూ కనకమ్మ పెనిమిటి వంటయింట్లోకి తొంగి చూశాడు. కనకమ్మ తలవంచుకొని గారెలు చేస్తున్నది. శేషాచలపతి మాట్లాడకుండా వాకిటి గదిలోకి వచ్చి అతడి కెదురుగుండా కుర్చీలో కూర్చున్నాడు

ఆ యువకుడికి ఈ దంపతుల వైఖరి చాలా నిరాశ కలిగించింది. ముఖ్యంగా ఆమె ఈ విధంగా ఉంటుందని అతడు ఊహించనైనా లేదు. ఆ వ్రాతలు ఆమె కట్టూ బొట్టూ తీరులో కాక పోయినా మాటల్లోనయినా ప్రతిబింబిస్తాయని అతడు ఆశించాడు.

తన యింటికి వచ్చిన మనిషిని పలకరించకుండా కూర్చోవటము అమర్యాదగా తోచి శేషాచలపతి "మన దేవూరండీ" అన్నాడు.

"మాది అమలాపురము తాలూకాలెండి. కనకలింగేశ్వరీ దేవిగారు ఇటీవల రచించిన గ్రంథాన్ని చదివాను. అది నాకు చాలా నచ్చింది. చక్కని ముద్రణ. నా అభినందనాలు సమర్పిద్దామని వచ్చాను." అన్నాడు మెల్లగా - తనకు కలిగిన ఆశాభంగాన్ని పైకి కనబడనీయకుండా.

"అయితే మీరు ఆ గ్రంథాన్ని చదివారన్నమాట! మీరన్న మాటే చాలా మంది అన్నారు. ఇప్పుడు వెతికి చూద్దామన్నా ఒక్క కాపీ లేకుండా పోయింది" అన్నాడుశేషాచలపతి సంతోషముతో.

"అవును! ఆ సంపుటిలో ఉన్న కథలన్నీ చాలా ఆకర్షణీయముగానూ మనోరంజకముగానూ ఉన్నాయి మరి! ముఖ్యంగా ఆఖరుది నా మనసు చూరగొన్నది."

"నాఉద్దేశ్యములో కూడా ఆ కథే గొప్పదని! నా మిత్రులు చాలామంది నాతో ఏకీభవించారు"-అంటూ శేషాచలపతి ఆత్మానందాన్ని వెలిగ్రక్కాడు!

"ఆ కథలో స్త్రీ హృదయము బాగా వ్యక్తము చేయబడ్డది. స్త్రీ తప్ప స్త్రీ హృదయాన్ని మరెవరూ ఆ విధంగా చిత్రించలేరు. పురుషుడు ఎంత అనుభవముతో వ్రాసినా ఊహామాత్రముగానే ఉంటుంది ఆ చివరికథ ఉన్నదే - అదికొన్ని ఆంగ్లకథలతో పోటీచేయదగినది"-అన్నాడు ఉత్సాహముకొద్దీ యువకుడు

ఈ మాటలకు శేషాచలపతి మనసు ఆనందముతో గంతులు వేసింది. ఆ కథకులంత విలువ కట్టినందుకు కృతజ్ఞతను వెల్లడించకుండా ఉండలేక పోయి నాడు. కాని అకస్మాత్తుగా మనసుకు చురక తగిలినట్లయింది. అవమానకరమని పించింది; ముఖము కందగడ్డలా ఎర్రబడ్డది. వెంటనే లేచి నిలువబడి "ఆ కథలు వ్రాసింది నేనయ్యా నేను!" అని గుండెమీద చేత్తో కొట్టుకున్నాడు.

ఆ యువకుడి సంశయము తొలగిపోయింది. వెంటనే ముఖములో రంగు మారిపోయింది. తలగోక్కుంటూ పెదవి విరిచాడు

ఈ సంగతి గమనించ కుండానే శేషాచలపతి "మిత్రులు కొందరు ఆ కథ ముగింపు మీద చాల సలహాలిచ్చారు. నాకు మాత్రము ఆ ముగింపే కథను రాణింప చేసిందనీ ఏ మాత్రము మార్చినా శైంపో చెడిపోతుందనీ ఉద్దేశ్యము. మీరుకూడా నాతో ఏకీభవిస్తారా?" అన్నాడు.

ఆ యువకుడికి ఆ కథలను గురించి ఇంక మాట్లాడాలని లేదు. వాటిమీద కలిగిన అభిమానము కాస్తా కరిగిపోయింది "ముగింపు కేమిలెండి ఎట్లాముగించినా ముగిసిపోతుంది. అయినా ఆ కథను మరోసారి చదివితే ఆ ప్రత్యేకత ఏమీకన బడదు ఆ ముగింపు ప్రకృతివిరుద్ధంగా కూడా కనబడక మానదు రచయిత తాను చెప్పదలచుకున్నదంతా ముఖ్యపాత్రచేత అనిపించి నందువల్ల మరీ వెగటుగా ఉన్నది" అంటూ లేచాడు

శేషాచలపతికి అతడి ధోరణి అర్థము కాలేదు. "అప్పుడే లేస్తున్నారేం? కూర్చోండి. ఆవిషయాన్ని చర్చిద్దాము. మీ సలహాలను గురించి ఆలోచిద్దాము. రెండవ ముద్రణ వేయించాలను కుంటున్నాను" అన్నాడు.

"ఈ భాగ్యానికి అందరి సలహాలూ ఎందుకూ!" అంటూ అ యువకుడు బయలు దేరాడు శేషాచలపతి వంక చూడకుండా

"ఇంత దూరము ఎందుకు వచ్చినట్టు? ఇంత తొందరగా ఎందుకు వెళ్లి నట్లు?" గొణుక్కుంటూ శేషాచలపతి వంటయింట్లోకి వెళ్లి పీటమీద కూర్చున్నాడు గారెలపళ్లెం ముందరకు.

# స్వాతంత్ర్య సిద్ధి

కోమలవిలాన్ పన్నెండవ నెంబరు గదిలో దిగి రెండు రోజుల నుండీ భోజనవసతి సరిగా కుదరలేదని అవస్థ పడుతున్న దంపతులకు ఆ ఉదయము టీ త్రాగుతుండగా అకస్మాత్తుగా బాల్యస్నేహితురాలైన యశోధర జ్ఞాపకము వచ్చింది.

''యశోధర ఇక్కడే ఉన్నదటండీ. మా నాన్నగారు చాలసార్లు అన్నారు. ఆమె ఎడ్రసుకూడా నా డైరీలో ఉండే ఉంటుంది.'' అని మాలతి తలదువ్వు కుంటూ తటాలున లేచి నిలువబడ్డది

''యశోధరా? ఇక్కడేం చేస్తున్నది? అన్నట్లు ఆమె స్వాతంత్ర్యోపాసకురాలు కదూ! బాల్యములో ఎప్పుడూ వాదిస్తూఉండేది. చదువు పూర్తిచేసుకున్నదా?'' అన్నాడు మాధవరావు.

''పాపము! చదువు పూర్తిచేసుకోలేక పోయింది రెండేళ్ళ క్రిందట కెప్టెను పి. వి. రావును పెళ్లి చేసుకున్నది. ఢిల్లీలోనే ఉంటున్నారని మా నాన్నగారు వ్రాశారు'' అంటూ దువ్వెన శుభ్ర పరిచింది.

''మనము మొన్నటినుండీ అర్థాకలితో అవస్థ పడుతున్నాము కదా-ఇవి వివరాలు తెలిసికూడా మాట్లాడకుండా ఊరుకున్నావేం? ఆడవాళ్ళకు సమయానికి ఏదీ జ్ఞాపకానికి రాదు'' అంటూ మాధవరావు లేచి కోటువేసుకొని తయారు అయి నాడు.

''ఆడవాళ్లకే సమయానికి జ్ఞాపకంవస్తుంది. ఆమాట నాచేత ఎందుకు అని పించుకుంటారు? మనము వెళ్ళితే యశోధర చాలా సంతోషిస్తుంది- పదండి'' గదికి తాళము వేసి ఇద్దరూ బయలుదేరినారు.

మాధవరావు మనసు త్రోవ పొడుగునా మధనపడ్డది. యశోధర చిన్నప్పుడు పెళ్లి చేసుకోనని అందరితో చెప్పుతూ ఉండేది. వివాహము తన స్వాతంత్ర్యానికి

భంగం కలిగిస్తుందని భయపడేది. పెళ్లి ఆమె ఇష్టముమీద జరిగిందోలేదో నవి అనుమానించాడు.

''మీరు పొరపడుతున్నారు. పెద్దపిల్లలయిన తరువాత బలవంతముగా వివాహము ఎవరైనా చెయ్యగలుగుతారా? వరుడికి వయసు ఎక్కువని తలిదండ్రులు సందేహిస్తూఉంటే యశోధరే పట్టుపట్టింది. పెళ్లికాగానే అత్తవారింటికి వెళ్లింది. మళ్ళీ పుట్టింటికి యింతవరకూ వెళ్లలేదు'' అన్నది మాలతి. ఆమెకు యశోధర అంటే ప్రాణము.

''మిమ్మలనందరినీ ఏడిపిస్తూ ఉండేది కదూ? మీరంతా మగవాళ్లకు బానిస అయిపోతున్నారనీ- అంతరాత్మను చంపుకున్నారనీ- అసహ్యించుకుంటూ ఉండేది కదూ? నాకు బాగా జ్ఞాపకము. ఆడవాళ్లు నగలను చూసుకొని మురుస్తారు గాని, అవి దాస్యశృంఖలాలని తెలుసుకోరు. నగలు బానిసచిహ్నమని తెలుసుకున్ననాడే స్త్రీకి స్వాతంత్ర్యము వచ్చినదనుకోండి అని అంటూ ఉండేదికదూ?'' అన్నాడు మాధవరావు.

''ఒక విధముగా ఆమాట నిజమేనేమో! వాటిమీద తమకెక్కువ అధికారము లేకపోయినా స్త్రీలు నగలను చూసుకొనిమురుస్తూ జీవితాలను గడుపుతారు. అయినా యశోధర తెలివిగలది. ఆమె అన్యాయాలను ఏమాత్రము సహించే మనిషికాదు. ఒకసారి మా బావగారు మా అక్కయ్యను తీసుకొని వెళ్లాలని మా వాళ్ళింటికి వచ్చారు. తాను ఊళ్ళో ఉండకపోయినా మా అక్కయ్య వాళ్లయింట్లో ఉండాలంటాడు. దానిని తీసుకొని తనతల్లి దగ్గర విడిచిపెట్టి తాను ఎక్కడికో వెళ్లతానంటాడు. మా అమ్మా నాన్నగారూ వద్దంటారు. ఆయనకు తీసుకొని వెళ్ల వలెనన్న పట్టుదల. ఇలా అందరూ సంఘర్షణ పడుతూ ఉండగా యశోధర వచ్చింది. సంగతంతా విని 'మా అక్కయ్య బానిస కాదనీ- జడపదార్థముకాదనీ- జీవము గలదనీ- ఇచ్ఛగల జీవి అనీ- అంతరాత్మగల వ్యక్తిఅనీ' ఎన్నో విధాలుగా మా బావగారితో వాదించింది. అంతావిని మా అక్కయ్య రానన్నట్లయితే మా బావగారు వెళ్ళిపోతానన్నారు. అందరమూ అక్కయ్య ఏమంటుందో ననుకున్నాము. అది ప్రయాణానికి సిద్ధమై చెప్పులుకూడా వేసుకొని గడపదగ్గర నిలువబడ్డది. దానితో మా అక్కయ్యఅంటే యశోధరకు అసహ్యమువేసింది. అవివేకి అని మా అక్కయ్యను అందరిముందర అంటూ ఉండేది యశోధర. ఎట్లాగయినా మగవాళ్లు

అధికారం చలాయిస్తారని మా యశోధర అభిప్రాయము ఏమంటారు?'' అన్నది మాలతి. నడుస్తూ నడుస్తూ ఇంత దీర్ఘ సంభాషణ చేసేసరికి మాలతికి ఆయాసము, ఒగర్పు వచ్చినవి.

''కాదని నోటితో చెప్పితే అట్టే బాగుండదులే.... కాని.... చూశావా! నీ కెంత ఆయాసము వచ్చిందో? ఇంకా అయిదు నిముషా లయినా నడిస్తేగాని మనకు బస్సు దొరకదు. పది బారలయినా సునాయాసంగా నడవలేదుగాని పెద్దపెద్ద కబుర్లు చేస్తారు. ఈ కుసుమకోమల శరీరాలను జాగ్రత్తగా కాపాడే బాధ్యత మాత్రము మాది అవునా? త్వరగా నడుమరి. ఆ బస్సు కాస్తా వెళ్లిపోతుంది''- అనుకుంటూ ఇద్దరూ బయలుదేరి రెండు బస్సులు మారి, అతి ప్రయాసతో యశోధర ఎడ్రసు కాగితము పట్టుకొని అడుగుతూ వెళ్లారు.

ఉదయము పదకొండు గంటలయినది. నానా అవస్థలూపడి మాలతీ మాధవ రావులు ఎట్లాగో యశోధర యింటిని తెలుసుకొని వెళ్ల గలిగినారు.

యశోధర బాల్యస్నేహితులను చాలా ఆదరించింది. డ్రాయింగు రూములో కూర్చుండబెట్టి టీ యిచ్చింది. అందరూ సంభాషణలో పడ్డారు. అనేక విషయాలు- తాము వెనుక కలసికొన్నప్పటినుండీ నేటి వరకూ-యశోధర పెండ్లీ-ఆయన ఉద్యోగమూ-సంసారము అనేక ముఖాలుగా సంభాషణ నడచిపోయింది.

యశోధర వాళ్లిద్దరినీ టీ తీసుకొమ్మని బలవంతంచేసింది.

''నీవు కూడా తీసుకో, మమ్మల నిద్దరిని మాత్రమే తీసుకొమ్మంటే మేము తీసుకోము'' అన్నది మాలతి

''అదేమిటి మీరుకూడా తీసుకోవాలి'' అన్నది మాలతి.

''నేను కాఫీ, టీ త్రాగటము యిక్కడికి వచ్చిన తరుదాత మానివేశాను. పాలు అలవాటు చేసుకున్నాను. నా మాటకేంగాని మీరిద్దరూ తీసుకోండి'' యశోధర వాళ్లను బలవంతం చేసింది.

''కాఫీకూడా మాన్పించగలిగాడూ!'' అని మాధవరావు ఆశ్చర్యమునకు లోనైనాడు. యశోధర రుచులమీదకూడా అధికారము వహించిన ఆ వ్యక్తిని చూడ వలెనన్న కుతూహలను మాధవరావుకు ఇనుమడించ నారంభించింది.

యశోధర మాటలను ఆలకిస్తున్న మాలతి- వెనుకటి యశోధర ఛాయలు ఏమైనా ఇప్పటి యశోధరలో కనబడుతాయేమోనని వెదకసాగినది.

ఇప్పటి యశోధరలో. ఇంకా ఏఏ విషయాలలో వెనుకటి ఛాయలు ఉన్నాయోనని మాధవరావు పరిశోధనకు పూనుకున్నాడు.

అంతలో యశోధర తన యింటిని యావత్తూ వాళ్లిద్దరికీ చూపించింది. అప్పటికి పన్నెండు గంటలు దాటి పోయినవి. యశోధర తన స్నేహితులకు తగిన ఏర్పాట్లుచేసి భోజనానికి లేవమన్నది.

"నీవుకూడా మాతో భోజనము చేయవా?" అన్నది మాలతి.

"మీరు మాతో కలిసి భోజనము చేయకపోతే-మేము భోజనము చేయము" అన్నాడు మాధవరావు.

"మీరిద్దరూ మాకు అతిథులు. మీరు అట్లా పట్టు పట్టకూడదు. మీరిద్దరూ భోజనము చేయండి. ఆయన వచ్చేవరకూ నేను ఉంటాను. ఆయన ఒంటిగంటకు వస్తారు. ఒక్కరూ భోజనము చెయ్యలేరు. తోడుగా ఒకమనిషి ఉంటే కాస్త నయము. పాపము పనిచేసి చేసి వస్తారా- భోజనము సరిగా చేయకపోతే ఆరోగ్యము చెడిపోతుంది. అందుకని మీరిద్దరూ ముందు భోజనము చెయ్యండి" అని వాళ్లను ఒప్పించి భోజనము పెట్టించింది.

మాలతీ మాధవరావులు చెరి ఒక విధముగానూ ఆశ్చర్య పడిపోతున్నారు. మాధవరావు మరీను- మాలతివంక చూసి అప్పుడప్పుడు నవ్వటము మొదలు పెట్టాడు. ఆ నవ్వులో మాలతి పరాజయమే ప్రతిధ్వనించసాగింది.

భోజనాలయిన తరువాత యశోధర తమలపాకుల పళ్లెము తెచ్చి మాలతి చేతికి ఇస్తూండగా- మాలతి దృష్టి యశోధర చేతిపైన పడ్డది.

"ఇదేమిటే ఇటువంటి ఉంగరము పెట్టుకున్నావు? అంత మోటుగా చేయించుకున్నావేం?" అన్నది మాలతి వెంటనే.

"ఇదా? ఈ ఉంగరమూ - ఈ గాజులూ ఆయన సెలక్షను. అందుకని అవంటే నా కెంతో ఇష్టము. ఒక్కరోజయినా తియ్యను. తీస్తే ఆయన మనసు ఎక్కడ నొచ్చుకుంటారో నని నా భయము. నీకేమి నచ్చలేదా ఈ ఉంగరము.

మీరిద్దరూ ఆయనను చూడలేదుకాబోలు. అయిదు నిమిషాలలో వస్తారు సామాన్య ముగా నేను ఆయన వచ్చేలోపల పనులన్నీ ముగించుకొని తీరికగా ఉంటాను. లేక పోతే మరచిపోతూ ఉంటాను"_ ఈ ధోరణిలో యశోధర మాట్లాడుతూ ఉంటే 'ఆయన' అన్న ముక్కను మాలతి సహస్రముగా ఎంచింది.

యశోధర మాటలన్నీ విని "ఆయనవస్తే- మీరు మమ్మల్ని మరచి పోతా రేమో! ఎట్లా? మేము వెళ్ళమా మరి?" అన్నాడు మాధవరావు.

"చాచా! మిమ్మల్నిద్దరినీ మరచిపోవటమేమిటి? మీ రిద్దరూ నన్ను హాస్యముచేయటానికని రాలేదు కద!" అన్నది యశోధర.

అంతలో 'జేసూ! అంటూ నీలమేఘ శ్యాముడైన ఆజానుబాహువు మిలి టరీ దుస్తులతో లోపలికి వస్తున్నాడు.

యశోధర చివాలునలేచి ఎదురు వెళ్ళింది. ఆమె వదనము చంద్రదర్శనమైన కలువవలె మాధవరావుకు కనబడ్డది. వెంటనే మాధవరావు కూర్చున్నచోట నుండి లేచి 'యశోధరకు సిద్ధించిన స్వాతంత్ర్యాన్ని కన్నుల పండువుగా చూచావా?' అని చెవిలో ఊదాడు

మాలతీ మాధవరావులు ఉన్నచోటికి తిరిగి యశోధర వచ్చేసరికి ఆయిదు గంటలు కొట్టారు.



# సస్కారాలు

సుందరయ్య రెండు చేతులతో చూరు పట్టుకొని వీధివాకిలి వైపు చూస్తూ నిలబడ్డాడు. ఉదయము తొమ్మిది గంటలు దాటిన తరువాత ఆ దారిన సామాన్యంగా ఎవరూ నడవరు. అంతవరకూ బడిపిల్లలూ పొలాలకుపోయేగొడ్లూ సందడిచేయటమే తప్ప- జన సమర్దము కాదుకదా చూద్దామన్నా మనిషి కంటికి కనబడడు. సుందరయ్య వీధివైపు చూడటమంటే శూన్యంలోకి చూడటమన్నమాట.

షుమారు గంటన్నర తరువాత బుజాలమీద బరువుపడితే వెనక్కు తిరిగి చూశాడు. మూతక ధోవతి పైకి దోపుకుంటూ జగ్గయ్య సుందరయ్యను తన వైపుకు తిప్పుకొని "నిన్న మొన్న అటువైపు రాలేదేం?" అన్నాడు.

"వద్దామనే అనుకున్నా—పిల్లయింది కాదు" అన్నాడు ముభావంగా సుందరయ్య

"ఏం? అమ్మాయి వంట్లో కులాసా లేదా? చిన్న పిల్లకు తేలిగ్గాఉన్నదా?"

"ఆఁ ... అదే మామూలుగానే ఉన్నదనుకో. మన ఊరివైద్యుడు పట్నము తీసుకువెళ్ళి చూపించమన్నాడు. కడుపులో ఏదో పెరుగుతున్న దన్నాడు. ఫలానా జబ్బు అని ఆయనకూ అంతు చిక్కలేదు" అన్నాడు చేతిలోవున్న గడ్డిపుల్లను ముక్కముక్కలుగా విరుస్తూ.

జగన్నాధము షర్టు గుండీలు సవరించుకుంటూ ఆ గదిదాటి పంచలోకి వచ్చి నిలబడ్డాడు. తలుపులు దగ్గరకివేసి సుందరయ్య జగన్నాధము వెనకనే నడుస్తూ అన్నాడు - "ఆ పిల్ల సంగతైనా బాగుండలేదు. లివరు వ్యాధని అంటూన్నాడు వైద్యుడు."

ఏం జవాబు చెప్పటానికి తోచక, "మన వైద్యుడేనా అన్నది?" అన్నాడు జగన్నాధము.

'మన వైద్యుడూ అన్నాడు, సర్కారు డాక్టరూ అన్నాడు.'

జగన్నాథము చూరులోంచి తీసిన తాటాకు ముక్కనుచేత్తో నలుపుతూ, "ఇంత ముదర పెట్టావేం పరిస్థితులను? మొదటినుంచీ నీవు అశ్రద్ధ మనిషివే. అయినా వీటిలోకూడా నీ అశ్రద్ధ ప్రయోగించాలా?" అని మందలించబోయాడు.

సుందరయ్య ఆ మాటలకు పకపక నవ్వాడు ఆ నవ్వులో ఇమిడివున్న భావము జగన్నాథానికి అంతుచిక్కలేదు.

"నీకు అంత నవ్వు ఎట్లా వచ్చిందిరా సుందరయ్యా" అని మాత్రము కొంత సేపటికి అడిగాడు.

సుందరయ్య మళ్ళీ నవ్వుతూ, "నాకీ నవ్వు అలవాటయిపోయింది" అన్నాడు.

జగ్గయ్యకు ఆనవ్వు కొద్దిగా అర్థమైనట్లయింది. అతడు పై పెదవిని పళ్ళతో కొరుకుతూ నిలబడిపోయాడు. సుందరయ్య పెంపకపు తల్లి చాలా గడసరి. సుందరయ్య ఎనిమిదోక్లాసు ప్యాసయి ఆమె దగ్గరకివచ్చాడు. సెలవులుకాగానే స్కూలులో చేరుతాననీ బట్టలు కుట్టించుకుంటాననీ ఆమెతో చెప్పాడు. ఆమె మాట్లాడకుండా తను ఎరుగున్న వాళ్ళను పిలిపించింది. వాళ్ళు అతడిని దగ్గర కూర్చోబెట్టుకుని "అవిడ నీ కోసమేగా డబ్బు నిలవచేసింది? వెళ్ళేటప్పుడు కట్టుకుపోతుందా ఏమిటి? ఆవిడ తదనంతరం రైలు దగ్గరఉన్న రెండు ఇళ్ళూ, హోటలు దగ్గరవున్న కొట్లూ కాపరమున్న మేడ అన్నీ నీవే" అన్నారు. "కుదురుగా ఆమె చెప్పినటు విను" అని పెద్దలంతా తీర్పు చెప్పారు. అందులో జగ్గయ్య ఒకడు. అతడి ఆలోచనలు ముందుకు సాగాయి. ఇప్పుడు, అందరూ కలిసి ఆనాడు- ఒక ఆనాడేమిటి- అనేక సార్లు అట్లా తీర్పుచెప్పి దాటిపోయిన మాట నిజమే. ఎట్లా తీర్పుచెప్పితే తమ మర్యాద నిలబడుతుందీ అని ఆలోచించి సర్ది చెప్పినమాట నిజమే. ఏభయి ఏళ్ళ ముసలమ్మ ఒక దమ్మిడీ ఇవ్వనని పట్టుబట్టితే ఆ కొడుక్కి ఇరుగూ పొరుగూ చెప్పే సలహా అంతేగా- "ఆమె ఎన్నాళ్ళు బ్రతుకుతుందీ—ఆ తరువాత అంతా నీదేగా" అంటారు.

సుందరయ్యతల్లి మాణిక్యమ్మకు తన కొడుకులలో మూడవ వాడంటే ఎంతో ప్రాణము అతడిని ఎక్కువ సుఖపెట్టాలని ఆమె ప్రాణము కొట్టుకుపోయేది. ఆ ఆలోచనలలో ఈ పెంపకపు ఎత్తు వేసింది.

ఇరుగూ పొరుగూ-ఎరుగున్న వాళ్ళందరూ అన్నారు- "మంచినీళ్ళ బిందెలు మోసి పెంచినా నీ పిల్లలు చాలా బుద్ధిమంతులు. ఇంకా నాలుగేళ్ళు కష్టపడితే వాళ్ళకే రెక్కలు వస్తాయి. నీకంత కష్టంగా వుంటే వారాలు చేయించి చదివించు" అని.

మాణిక్యమ్మ మనసంతా కరణము రంగమ్మ ఆస్థిమీదనే ఉన్నది. తన బ్రతుకు మంచనీళ్ళ బిందెల బ్రతుకే—ఎంత కాలానికైనా మార్పులేని బ్రతుకు. కళ్ళఎదుట కొడుకు ఉండాలన్న మమకారాన్ని చూసుకుంటే తన దారిద్ర్యాన్ని పంచి యిచ్చినట్లవుతుంది. వట్టి స్వార్థ మనిపించుకుంటుంది. వదలిపెట్టి ఉండలేని బాధ తనకే-పిల్లవాడు హాయిగా సుఖపడతాడనుకున్నది వెర్రిబాగుల తల్లి.

పెంపకమయిననాటినుండీ సుందరయ్య పెంపకపుతల్లి నిద్రలేవక పూర్వమే తాను లేచి మూడు బఱ్ఱెల పాలుతీసి ఉట్టిమీద పెట్టాలి. జీతగాడితో సమంగా గొడ్ల దగ్గర ఉండాలి. చూసిన వాళ్ళందరూ ఘోరంగా చెప్పుకున్నారు - అంత వున్నవాళ్ళయినా కారపు మెతుకులే తింటున్నారని. మాణిక్యమ్మ మాత్రము సంసార పక్షంగా వున్నారనుకున్నది. కాని ఒక్క విషయానికి మాత్రము ఆమె మనసు చివుక్కు మన్నది. తాను మంచినీళ్ల బిందెలు మోసిఅయినా సుందరయ్యను స్కూలుకు పంపించింది. హెడ్మాష్టరుగారి యింట్లో పచ్చళ్లనూరి, అంట్లు తొలిచి పిల్లవాడికి జీతముకట్ట నవసరములేకుండా చేసుకున్నది. సుందరయ్య తన దగ్గర వుండగా పుస్తకాలు కొనుక్కోలేకపోయినా మార్కులు బాగా తెచ్చుకొనేవాడు. రెండంటే రెండే జతలు బట్టలు అయినా శుభ్రంగా వుతికి పెట్టుకునేవాడు. తన కొడుకు కష్టపడుతున్నాడని అందరూ అంటున్నా ఆమె మనసుకు కష్టమనిపించ లేదు. కాని పిల్లవాడిని బడి మాన్పించి ఇంట్లో కూర్చోబెట్టిందని వినగానే కళ్ల నీళ్లను ఆపుకో లేకపోయింది. సుందరయ్య తన తండ్రి పోలిక; తెలివికూడా ఆయనదే వచ్చినట్టుంది. బాగా చదువుకొని వృద్ధిలోకి వస్తాడనుకొని పెంపకానికి ఒప్పుకున్నది. అతడిని ఒక్కసారి వెళ్ళి చూడాలనిపించినా వెళ్ళటానికి మాణిక్యమ్మకు కుదరలేదు. పొరుగూరి వ్యవహారమాయెను. అందులో బిందెకు అణా చొప్పున రోజుకు 30 బిందెల సంపాదనకాస్తా ఊరు కదిలితే పోతుంది.

సుందరయ్య పెంపకపుతల్లి రంగమ్మ వంటచేసుకోలేని అశక్తత కొద్దీ సుందరయ్యను ఒక యింటివాడిగా చేయాలని సంకల్పించింది. అందరూ సలహా

-యచ్చి నట్టుగానే పెంపకపుతల్లి ఏరికోరి చేసిన సంబంధాన్ని సుందరయ్య చేసుకున్నాడు.

రంగమ్మ దగ్గరికి వచ్చిన దగ్గర్నుంచి సుందరయ్య మనసుకు బీగంవేశాడు. సన్నటి ధోవతులు కట్టుకోవాలనిగానీ, మంచి కమీజులు కుట్టించుకోవాలనిగానీ, ఏ ఒకటి రెండు పర్యాయాలు అనిపించిందో- అంతే- పైకి ఒక్కమాట రాలేదు. మనిషికి మనిషి తోడయేసరికి మనసులు ఏకమయి కోరికలు పుట్టుకొస్తాయి కాబోలు. చిత్రము. నిగ్రహ శక్తిగల సుందరయ్యకు భార్యను చూడగానే పడుచుదనపు కోరికలు సరదాలు తిరిగి పొటమరించ నారంభించాయి. ఆ ఊరికి కొత్తగా వచ్చిన సర్కసుకు భార్యతోకూడా వెళ్ళి చూడాలన్నకోరిక అదేమిటో అతడెంత అదిమిపెట్టినా ఆవిర్లు తేలటము మొదలుపెట్టింది. సన్నగా నాజూకుగా పసిమి చాయలు కక్కుతున్న కామాక్షి ఎర్రచుక్కల చీరె కట్టుకుంటే చూడాలని అతడి మనసు తహతహలాడిపోయేది. కొత్త జంట ఒక్కసారి ఎక్కడైనా నాలుగు రోజులపాటు వెళ్ళి రావాలని అతడి ఆశలు ఊటలూరాయి. వాటన్నిటిలో అతడిని చాలరోజులు పీడించింది-భార్యతో కూడా తల్లి దగ్గరికి వెళ్ళి రెండంటే రెండు రోజులు వుండి ఆమె చేతి అన్నము తినాలన్నదొకటి, సిగ్గుకొద్దీ చెప్పుకోలేక పోయినా సాయంత్రము కాగానే తన భార్య తలలో మల్లెలు విచ్చితే చూడాలనుకుని పూలకేక వినబడగానే వాకిటివరకూ వెళ్ళి చూసేవాడు.

దానికీ దీనికీ తెల్లవారినప్పటినుంచీ ఇంటికి అనేకమంది వస్తూ పోతూ వుండేవారు. ఒక్కరికయినా సుందరయ్య పరిస్థితి అర్థము కాలేదు. ఆ ఈడువాళ్లు మాత్రము అతడినిచూసి నవ్వినవారు చాలామంది ఉన్నారు. అతడికి అనుభవించటము తెలియదన్నవారూ, అతడు ఇక్ష్వాకులనాటి మనిషన్నవారూ విగరబడి నవ్వుతుంటే, ఆ గదిలో నులక మంచముమీదనే సుందరయ్యకూ నవ్వు వచ్చేది. ఆ నవ్వు వట్టినవ్వుకాదు. పక పక నవ్వినట్టుండేది.

ఆనాటి సాయంత్రము నీరెండ ముఖముమీద పడుతుండగా కామాక్షి బావిలోమంచినీళ్ళ తోడి కాళ్ళు కడుక్కుంటున్నది. సుందరయ్య చెట్ల పాదులకు నీళ్ళుపోసి లోపలికి వెళ్ళుతూ, "పాపాయి ఏడుస్తున్నద"ని ఆమె వినాలన్నట్టుగా పలికాడు.

ఆ మాటలకు జవాబు కామాక్షి అతడి బుజాలమీద వాలిపోయి, "పాపాయి కెందుకండి ఒళ్ళంతా పచ్చబడ్డది? కడుపు అంత గట్టిగా ఉన్నదేం? మీరు ఒకసారి ఎత్తుకుని చూడరూ?" అంటూ కళ్ళనీళ్ళు కార్చింది.

భార్యను మెల్లగా నడిపించుకుని వెళ్లి మంచముమీద పాపాయికి దగ్గరగా పడుకోబెట్టాడు సుందరయ్య. చేత్తో వాళ్లిద్దరి తలలూ నిమిరి గది దాటి వస్తూ వుండగా అతడికి పట్టలేనంతగా నవ్వు వచ్చింది

అతడు రంగమ్మ గదిలోకి వెళ్ళి పరిస్థితులన్నీ చెప్పి, పిల్లను పట్నము తీసుకెళ్ళా లనుకుంటున్నట్టు చెప్పాలనుకున్నాడు. ఆమె తన గదిలో ఆ మంచం మీద పడుకునే రైతులతో డబ్బు దగ్గర ఘర్షణ పడుతున్నది.

అ రైతు మళ్ళీ పంటలోగాని బాకీ తీర్చుకోలేనంటున్నాడు. తన భార్య జబ్బుగా ఉందంటున్నాడు. మందులకు ఎంతయినా ఖర్చుచేస్తున్నా నన్నాడు. ఆ క్షయవ్యాధి తనను ముందుకు రానివ్వటంలేదని మొరపెట్టుకున్నాడు. కాని రంగమ్మ అట్లా వీలులేదని అలసిపోయేవరకూ అరచింది.

సుందరయ్య గోడ కానుకునే వింటున్నాడు ఆమె కేకలు పెడుతున్నది ప్రాణము పోయినాసరే ముందు తన బాకీ తీర్చమంటున్నది. సుందరయ్య మాట్లాడ కుండా వెనక్కు అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

దీపావళి పండుగ రేపనగా జగన్నాధము చేతిలో ఒక పొట్లము పట్టుకొని ఇంటికి పోతూపోతూ సుందరయ్య ఇంటిముందర ఆగి పిలిచాడు.

పది నిమిషాల తరువాత కాబోలు-జగన్నాధమే లోపలికి వెళ్ళి, "ఏం చేస్తు న్నావు సుందరయ్యా" అంటూ పంచలో వాల్చిన మంచముమీద కూర్చున్నాడు.

"ఆఁ....ఏ....ఏ ముందీ?.... పిల్లకు రాత్రినుంచీ శ్వాస సరిగా ఆడటము లేదు" అన్నాడు- పళ్ళు బైటికి కనబరుస్తూ సుందరయ్య.

"మరి.... మందు సంగతి చూశావా? శ్వాస ఆడటములేదని ఇంకా నిదా నంగా అంటున్నావా?" అన్నాడు ఆదుర్దాతో.

"చూపించకేం? వైద్యుడా చూశాడు. మందు అవసరము లేదన్నాడు'" సుందరయ్య ఈసారి వచ్చిన నవ్వును అపుకోనాలని ప్రయత్నించి గదిలోకివెళ్లాడు.

"నేను ఈ పొట్లాము ఇంట్లో యిచ్చి వస్తాను. అంతవరకూ నీ పక్కనుంచి కదలకు సుందరయ్యా" అని జగన్నాదం వెళ్ళి అరగంటకే తిరిగి వచ్చాడు. జగన్నాథము మళ్ళీ ఆ గదిలో కాలు పెట్టేసరికి పాపాయి నిలువుగా పడుకొని ఉన్నది. కామాక్షి ముఖము చూడకుండా జగన్నాథం ఆమె నక్కడినుంచి లేవతీస్తున్నాడు.

కామాక్షి లేచి నిలబడబోయింది-కాళ్ళు నిలదొక్కుకోలేక నేలమీద పడబోతే జగన్నాథము పట్టుకున్నాడు. సుందరయ్య పెదవులమీద చిరునవ్వు నాట్యము చేసింది

ఒకరోజు సాయంత్రము సుందరయ్య పిచ్చివాడివలె కాలువ గట్టున తిరగటము మొదలెట్టాడు. రాత్రి పది కావచ్చింది. నీటి అలలను అదేపనిగా చూస్తున్నాడు. సుబ్రహ్మణ్యము దగ్గరగా వచ్చి పలకరించేవరకూ-గమనించలేదు. సుబ్రహ్మణ్యము సుందరయ్య పదేళ్ళు వచ్చేవరకూ ఒక స్కూల్లోనే చదువుకున్నారు.

"నీవు హఠాత్తుగా కనబడ్డావురా, ఇది అనుకోని సంగతిసుమా" అన్నాడు సుందరయ్య ఆశ్చర్యముతో.

ఇద్దరూ రాత్రి ఒంటిగంటవరకూ లోకాభిరామాయణం మాట్లాడుకున్నారు. సుందరయ్య స్వవిషయాన్ని గురించి మాట్లాడిన పావుగంటలో సుబ్రహ్మణ్యం అంతా గ్రహించుకొన్నాడు.

"కోర్టు కెక్కకూడదురా——ఇంత బాధ పడకపోతే?" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"ఎందుకూ కోర్టు కెక్కటము? దేని నాధారం చేసుకొని ఎక్కను?" అన్నాడు సుందరయ్య. అతడి సలహాను గేలిచేస్తూ.

"పోనీ-ఏదైన ఉద్యోగము చేస్తే బాగుండదూ?"

"మనము చదివిన చదువుకు ఏ తెలివి మాలినవాడుఉద్యోగ మిస్తాడు? అటువంటి అవకాశాలన్నీ నిరోధించబడ్డాయి బ్రదర్! అయినా ఇంకా ముప్ఫయి ఏళ్లు రాలేదనుకో" ఈ మాటలంటూ ఉండగానే సుందరయ్యకు నవ్వు వచ్చింది.

లాంతరు చేతబట్టుకొని అంతదూరం నుంచే గావుకేకలు వేస్తూ వచ్చాడు "ఏందండీ? మీ రిక్కడ కూచుంటే ఇంటికాడ అమ్మగార్నెవరు చూత్తారండీ? లెగండీ-మీ కోసం యెతుకుతున్నా నందె కాడనుంచి".

మారుమాట లేకుండా-సుందరయ్య లేచి నిలువబడ్డాడు. అందరూ ఇల్లు చేరుకొనేసరికి కామాక్షి చాపమీద వున్నది. చుట్టూ జనం మూగారు.

"ఇదేమిటి? ఇటువంటి భార్యను వదలిపెట్టి కాలవగట్టున తిరుగుతున్నావా" అన్నాడు సుబ్రహ్మణ్యము ఆయోమయముగా చూస్తూ.

"దీనికేం లే, ఇదీ అనుకొన్నదేగా" సుందరయ్య ఎప్పటి మాదిరిగానే నవ్వాడు

సుందరయ్య ఆ పదిరోజులలో అప్పుడప్పుడు కాస్త నవ్వటం, కళ్ళు చిన్నవి చేసుకొంటూ ఆలోచించటమూ తప్ప ఎవరితోనూ మాట్లాడలేదు.

ఒకరోజు సుబ్రహ్మణ్యమే ఆ ప్రసంగం తెచ్చాడు "ఒక నెల్లాళ్ళపాటు ఎటైనా ఖోదాము రా ప్రాణంహాయిగా వుంటుంది. నీకిప్పుడు స్థలం మార్పు చాలా అవసరము. నీ కేదయినా జీవనోపాధి నేను కల్పిస్తాను. హాయిగా బ్రతుకుదువు గాని-ఏమంటావు?" అన్నాడు. సుందరయ్య ముఖముచూస్తూ.

సుందరయ్యకు ఆపుకోలేనంత నవ్వు వచ్చింది.

"ఇన్నేళ్ల జీవితానుభవముతో నవ్వటము నేర్చుకున్నాను. నన్నుమళ్ళీ ఇంకో రొంపిలో దింపితివా- ఈ నవ్వుకాస్తా పోయి ఏడుపు వస్తుంది. కడపటి వరకూ ఈ నవ్వునే నా పెదవుల మీద నాట్యము చెయ్యనీ" అన్నాడు సుందరయ్య లేచి నిలబడి.

ఆ మాటలకు సుబ్రహ్మణ్యం తెల్లబోయాడు.



# అనాశ్వాసిత

బంగారమ్మ తెల్లవారివప్పటినుండీ కిటికీలో తలపెట్టి చూస్తున్నది. రెండు స్టేషనులు దాటినా బట్లరు కాఫీ తీసుకొని రాలేదు. కాఫీ కొరకు ఎదురు చూడటములో ఎప్పుడో ఆమెకు కన్ను మలిగింది. పెట్టె ఖాళీగా కూడా ఉన్నది. కాళ్ళు చాపుకొని తలక్రింద చెయ్యి పెట్టుకొని పడుకున్నది.

ఆమెకు నిద్రలోకూడ అప్పుడప్పుడు కలుగుతూ వచ్చిన మెలకువలో - వేళకు కాఫీ అందలేదని తలనొప్పి జ్ఞాపకము చేస్తూ వచ్చింది రైలుకుదుపుకు కళ్లు వాటంతట అవే మూతలు పడిపోతున్నాయి. రైలు ఎన్ని స్టేషనులు దాటి వచ్చిందో ఆమె గమనించలేదు. ఆమెకు మెలకువ వచ్చేటప్పటికి పెట్టె కొంత సందడిగా ఉన్నది. ప్రయాణీకుల మాటలు స్పష్టముగా వినబడుతున్నాయి.

"ఆమెకు వయసు ఎంత ఉంటుందను కుంటారు?"

"పాతికేళ్ళుఉంటాయేమో!"

"ఆఁ! అట్లా కనబడుతుంది గాని ఇంకా ఎక్కువే ఉంటాయని నా ఊహ."

"అవునులే. ఈ రోజుల్లో ప్రతివాళ్ళూ ముఖముమీద ముడతలు కనబడకుండాను-జుట్టు నెరవకుండాను జాగ్రత్త పడుతుంటే ఎదటివాళ్ళు ఏం తెలుసుకోగలుగుతారు?"

"మనము ఇంకో సంగతి గమనించాలి. ఈ కాలములో పదిహేనేళ్ళకే తల నెరసిన వాళ్లకూడా ఉన్నారు. వాళ్ళ సంగతేమిటంటారు?"

ఆ సంభాషణ ఎవరిని గురించి అయినదీ ఆమెకు స్పష్టముకాలేదు. కాని ఇంకా ఏమీ చెప్పుకుంటారో నన్న కుతూహలము మాత్రము కలిగింది, నిద్రబోతున్నట్లుగా పడుకున్నది.

అంతలో బట్లరు వచ్చి పిలిచాడు ఆమె దిగ్గునలేచి కాఫీ అందుకున్నది. తలవంచుకునే చేతిసంచి తెరచి వక్కపలుకు నోట్లో వేసుకుంటూ తన తోడిప్రయాణికులు నలుగురు ఉన్నట్లు గ్రహించుకున్నది. వాళ్ళల్లో ఒకాయన సూటు వేసుకున్నాడు. మిగతావాళ్ళు దేశీయ వేషధారణలో ఉన్నారు. ఆమె లేచి కూర్చోగానే వాళ్ళందరూ జాగ్రత్తగా సర్దుకొని పెద్ద మనుష్యులవలె - మర్యాదగా కూర్చున్నారు.

గాలి నిండుగాఉన్న సైకిలుటైరులాంటి తన దేహాన్ని ఆమె ఒకసారి తల యెత్తకుండా కలయజూసుకున్నది చేత బంగారు గాజుల కాంతి దేహకాంతులలో కలిసిపోతూ ఉండటాన్ని పదేపదే చూసుకొని మురిసిపోయింది. వయసును లక్ష్యము చేయని తన దేహదార్ఢ్యాన్ని బంగారమ్మ క్రీగంట గమనించుకున్నది. వెంటనే ఆమెకు ప్రయాణికుల సంభాషణ జ్ఞాపకము వచ్చి దేహము జలదరించింది. ఆమె దానిని పైకి కనబడనీయకుండా సర్దుకుంటూ కిటికీలో తలపెట్టుకొని చూడటము మొదలు పెట్టింది.

ఉదయము ఎనిమిదిగంటలు దాటుతున్నది. రైలు అతివేగముతో విసురుగా నడుస్తున్నది. బంగారమ్మ తోడి ప్రయాణికులు వాళ్ళలో వాళ్ళయినా మాట్లాడుకోకుండా - కదలకుండా - కూర్చున్నారు.

బంగారమ్మకు ఈ వాతావరణము అసిధారావ్రతములా కనిపించింది. ఆమె కెటూతోచక తోలుసంచీ తెరచి మరికొన్ని వక్కపలుకులను నోటి కందించుకుంటూ ఉండగా రైలు అకస్మాత్తుగా ఆగింది. చాలామంది ప్రయాణీకులు రైలు దిగి ఇంజనువైపు పరుగెత్తారు బంగారము పెట్టెలోంచి కూడా ఇద్దరు ప్రయాణికులు దిగివెళ్ళారు. మిగతా ఇద్దరూ ఆదుర్దాతో కిటికీలలో తలలుపెట్టి చూస్తున్నారు చూడటానికి వెళ్ళేవాళ్ళు వెళ్ళుతూ ఉంటే - చూసి వచ్చేవాళ్ళు వస్తున్నారు.

'పాపము చిన్నవయసుదే. తల బాగా చితికిపోయింది. వేషము చూస్తే పాటకజనములో మనిషిలా లేదు' అనుకుంటూ పోతున్నారు.

ఒకగంట తరువాత మృతదేహాన్ని తొలగించి రైలు కదలటానికి ఏర్పాట్లు జరిగాయి. ప్రయాణికులు ఎవరి స్థలాలలో వాళ్లు కూర్చున్నారు.

''పాపము! ఆ మనిషి ఎవరో ఎట్లా పడ్డదో-ఎందుకు పడ్డదో?'' అన్నా

డొక ప్రయాణీకుడు. ఆయన ఆ దృశ్యము చూడటానికి స్వయముగా వెళ్ళకపోవ టమువల్ల చూసినవాళ్ళను అడగటము మొదలు పెట్టాడు.

''ఆ ప్రశ్నలు మమ్మల్ని అడిగితే మాకేం తెలుస్తుంది? ఏదో వెళ్ళాము - అందరితో పాటు చూసివచ్చాము. తలంతా చితికిపోయింది'' అన్నాడు వెళ్ళిచూసి వచ్చిన ఒకాయన.

''ఆ మనిషి వయసు ఎంత ఉంటుంది?'' ఏదో కిటుకు తెలిసిన వాడివలె ప్రశ్నించాడు మొదటి ప్రయాణీకుడు.

''ఏమో! ఆడవాళ్ళ వయసు చప్పున చెప్పటము కష్టము, ఏమంత చిన్నదీ కాదు ఏమంత పెద్దదీ కాదు'' తన మామూలు ధోరణిలో అంటూ తటాలున బంగారమ్మను చూసి నాలుక కొరుక్కున్నాడు.

ఈ సంగతి గ్రహించని మరొకాయన ''పిల్లలు కూడా ఉన్నారుట. వాళ్ళను వదిలిపెట్టి రైలుక్రింద పడటానికి ఎంత ఇబ్బంది వచ్చిందో!'' అన్నాడు.

వాళ్ళ సంభాషణ దానంతట అదే ఆగిపోయింది రైలు మరొక స్టేషనులో ఆగింది. అక్కడ ఇద్దరు స్త్రీలు ఎక్కారు. ఎక్కిన రెండునిమిషాలకే 'ఏ వూరు వెళ్ళుతున్నావ'న్నది ఒకావిడ బంగారమ్మను చూసి. బంగారమ్మ చెప్పింది.

''అక్కడ ఎవరున్నారు?''

''మా అమ్మాయి ఉన్నది'' ఆ మనిషి ముఖము చూడకుండా ముఖావముగా అన్నది బంగారమ్మ

''అయితే అమ్మాయి అక్కడ ఏంచేస్తున్నది? పెళ్ళయిందా?'' ఎంతో అవ సరము ఉన్నట్లుగా - బంగారమ్మ జవాబు ఇచ్చి తీరాలన్నట్లుగా - అడిగింది.

''మా అమ్మాయికి పిల్లవాడు. వాడి పుట్టిన రోజుకే నేను వెళ్ళుతున్నాను'' జవాబు చెప్పటము ఇష్టము లేకపోయినా కనుబొమలు ముడివేసుకుంటూ జవా బిచ్చింది బంగారమ్మ.

ఆమె విస్మయపడి ''మనుమడికి పుట్టినరోజా? మిమ్మల్ని చూసినవాళ్ళు

మీకు మనుమలు ఉన్నారంటే నమ్మరు'' తానేదో క్రొత్త విషయాన్ని తెలుసుకున్నట్లు ముఖముపెట్టి, నవ్వుతూ అందరి ముఖాలవంకా చూసింది.

ఈ సంభాషణను శ్రద్ధగా ఆలకిస్తున్న మగ ప్రయాణికుల ముఖాలలో విస్మయము కనబడ్డవి. వాళ్ళల్లో ఒకాయన 'నేను అప్పుడే అనుకున్నా. మీతో సూచనగా అన్నాను కూడాను' అన్నట్లు అందరివంకా చూశాడు. మగ ప్రయాణికులలో అకస్మాత్తుగా మాటలులేవి సందడి ప్రారంభమైనది. మొదటినుండీ మాటలో ఉనికిలో వాళ్లు నిలుపుకొంటూ వచ్చిన గాంభీర్యము మర్యాద సడలిపోయింది. వాళ్ళలో వాళ్లు చౌకరకపు హాస్యముతో అతిగా సంభాషించుకోవటము మొదలు పెట్టారు. చదివివేసిన పత్రికలను అజాగ్రత్తగా పెట్టెలో దొర్లనిచ్చారు. ఈ మార్పును బంగారమ్మ గ్రహించటానికి ఎంతోసేపు పట్టలేదు. ఆమెకు ఇది రుచించక మనసులో వికారం పుట్టింది. ఒక విధమైన అసహ్యము కలిగింది.

ఇది జరిగిన తరువాత సరిగ్గా ఇరవై నిమిషాలపాటు ఆమె రైలులో కూర్చున్నది. స్టేషనురాకముందే సామానులన్నీ ఒకచోటికి చేర్చింది. రైలు ఆగగానే దస్సున దిగిపోయి దూరముగా నిలబడ్డది. ఒక యువకుడు వచ్చి సామాను దింపించుకున్నాడు. రైలు కదులుతూ ఉండగా తోడి ప్రయాణికురాలు ''పిన్నిగారూ! ఆయన మీ అల్లుడా?'' అని గట్టిగా కేకవేసి అడిగింది. బంగారమ్మ ముక్కుచిట్లించి ముఖము ప్రక్కకు త్రిప్పుకున్నది.

వాకిటముందు బండి ఆగగానే కూతురు ఎదురుగావచ్చి తల్లిని లోపలికి తీసుకొని వెళ్ళింది. ఇంటినిండా బంధువులు కిటకిటలాడుతున్నారు. ఆడుకొంటున్న పిల్లవాటిని కూతురు ఎదురుగా తీసుకొని వచ్చింది. బంగారమ్మ వాటిని పలుకరించకుండానే పెట్టెతీసి బిస్కట్లడబ్బా చేతికిచ్చింది. దాని నందుకొని పిల్లవాడు పరుగెత్తాలని చూశాడు. కూతురు పట్టుకొని ఆపి ''అమ్మమ్మరా వచ్చింది! అట్లా పారిపోతావేం?'' అని కోపము చేసింది.

బంగారమ్మ మనస్సు చురుక్కుమన్నది.

పరధ్యానముతో భోజనాలయిన తరువాత సాయంత్రము అయిదు గంటల వరకూ పడుకొన్నది. కాఫీ త్రాగుతూ ఉండగా కూతురువచ్చి దగ్గరగా కూర్చున్నది. తెల్లవారితే పుట్టినరోజు పండుగ. పెద్ద విందు జరుగబోతున్నది. అతిధులు

ఎంతో మంది రావలసి ఉన్నది. వివరముగా తల్లితో చెప్పుతూ "మీఅల్లుడు చాలా సరదా పడుతున్నారమ్మా. పెద్ద ఎత్తులో దీనిని తలపెట్టారు. నా కేమీ తెలియటము లేదు. రేపటి సంగతంతా నీవే చూసుకోవాలి." అన్నది.

బంగారమ్మ విని ఊరుకున్నది. అంతలో పిల్లవాడు వచ్చాడు. ఉదయము ఇచ్చిన బిస్కట్లు తాను తినగా మిగిలినవి స్నేహితులకు పంచియిచ్చాడు. వాటిరుచి తెలుసుకున్న తరువాత అమ్మమ్మను మళ్ళీ మంచి చేసుకుందామని వచ్చాడు. పిల్లవాడు రాగానే తనతల్లి దగ్గర కూర్చుండ బెట్టుకుంటుందని కూతురు అనుకున్నది బంగారమ్మ ఆవైపే చూడలేదు. కూతురు ఊరుకోలేక "ఎందుకురా అమ్మమ్మ దగ్గరగా వచ్చి నిలబడ్డావు? మళ్ళీ బిస్కట్లు ఇస్తుందనుకున్నావా?" అని పిల్లవాడిని మందలించి "చూడవె అమ్మా! వీడి కొంటెతనము!" అని దగ్గరికి తీసుకున్నది.

బంగారమ్మ పొడినవ్వు నవ్వింది.

రాత్రి కూతురు అల్లుడితో అంటున్నది "మా అమ్మలో చాలా మార్పు వచ్చిందండీ. ఎవరితోనూ మాట్లాడకుండా ముభావముగా ఉంటున్నది. మధ్యాహ్నము నేను ఎంతోసేపు దగ్గర కూర్చుని రేపటి ఏర్పాట్లను గురించి అడిగితే ఒకదానికైనా సమాధానము యివ్వలేదు."

"అంత యింట్లో ఒక్కతీ ఉండలేక దిగులు పడిపోయినట్లుంది. పోనీ మనదగ్గరే ఉండిపోమ్మను" అన్నాడు అల్లుడు.

ప్రయాణపు బడలికలో ఉండి కూడా బంగారమ్మ ఈ మాటలను శ్రద్ధగా ఆలకించింది

మరునాడు బంగారమ్మ లేని ఉత్సాహాన్ని తెచ్చుకొని ఏర్పాట్లన్నీ స్వయముగా చేసింది. పిల్లవాడికి తాను తెచ్చిన బహుమతులన్నీ ఇచ్చింది. కూతురు చూస్తూ ఉండగా పిల్లవాడిని దగ్గరికి తీసుకున్నది.

బంగారమ్మకు ఈ కూతురితరువాత సంతానము లేకపోవటమువల్లనూ - ఉన్నపిల్ల కాస్తా అత్తవారింటికి వెళ్ళిపోవటము చేతనూ - దంపతులు ఇద్దరే ఉండవలసి వచ్చింది చూసేవాళ్ళకు ఆ దంపతులు కొత్తగా గృహస్థాశ్రమములో ప్రవేశించినట్లనిపించేది. మాతృధర్మము దైహికముగా గాని, మానసికముగా గాని,

ఆమె నెక్కువ వత్తిడి చేయలేదు అందుకు పెనిమిటి ఉద్యోగరీత్యా ఏడాదికొక ఊరు తిరగటము కూడా అనువైంది. ఎక్కడికి వెళ్ళినా 'ఆమె ఎట్లా ఉన్నదో చూడు' అని అందరూ అంటుంటే ఆమెకు మరీమరీ వినాలనిపించేది. ఆ మాటలు ఆమె కెంతో ఉత్సాహాన్ని ఇచ్చేవి. తరువాత ఆమె వితంతువైనా ఆ దుఃఖభారము వల్ల ఈ భావాలు అంతరించిపోలేదు. అందునుంచి ఆమె తన అలంకారాలన్నీ తీసివేయలేదు: ఆకారము వికారముగాలేదు.

బంగారమ్మ మేలైన సరంగు జార్జెటుచీరె కట్టుకున్నది అతిథులను లోపలికి ఆహ్వానిస్తూ - వాళ్ళలో మాట్లాడుతూ - చాలా ఉత్సాహముతో తిరిగింది. అందరూ పిల్లవాడిని బహూకరించి దీవించారు. విందు సక్రమంగా జరిగింది. అతిథులందరూ వెళ్ళటము మొదలుపెట్టారు. వెళ్ళుతూ ఒకావిడ "మీ అమ్మగారు వస్తారని చెప్పి తిరే - వచ్చారా :" అని కూతురిని అడిగింది.

కూతురు తల్లిని అందరికీ పరిచయము చేసింది.

"మీరేనా పిల్లవాడి అమ్మమ్మ! ఇంకా ఎవరో ననుకుంటున్నాను సుమా! మనుమడు అచ్చు మీ పోలికే. మీరు ఏమీ అనుకోకండేం? మీకు మనుమడు ఉండవచ్చునన్న ఊహా అయినా మాకు తట్టలేదు" అన్నారు ఇద్దరు ముగ్గురు ఆశ్చర్యపడుతూ.

కూతురు నవ్వింది. వాళ్ళ కెంత ఆశ్చర్యము కలిగిందో బంగారమ్మ మన సంత క్రుంగిపోయింది. హృదయ మెంతో భారమనిపించింది

రాత్రి భోజనాలైన తరువాత బంగారమ్మ చల్లగాలికి ఒంటరిగా వెళ్ళి కూర్చున్నది. ఆమెను వెదకుతూ అల్లుడి తల్లి దండ్రులు కూడా అక్కడికే వెళ్ళి కూర్చున్నారు. పగటివిందు విశేషాలు మాట్లాడు కుంటున్నారు.

పిల్లవాడు అక్కడికి తప్పటడుగులు వేస్తూ ఒక పెద్ద జపాను బొమ్మను ఎత్తుకొని వచ్చాడు. వచ్చీరానిమాటలు మాట్లాడుతూ ఎదురుగా నిలబడ్డాడు.

బంగారమ్మకు వాడిని చూడగానే ముద్దనిపించింది. ప్రేమతో వాడివంక చూసింది. దగ్గరికి రమ్మని చేతులు చాపింది.

అంతలో తాతగారు "అబ్బాయీ! ఆ బొమ్మ నా కిస్తావురా!" అన్నారు.

"నీ కియ్యను. అమ్మమ్మ కిస్తా" నన్నాడు.

ఏపురుగో కుట్టినట్టుగా - చాచిన చేతులను బంగారమ్మ చప్పున వెనుకకు లాగుకొన్నది.

మరునాడు బంధువులందరూ వెళ్ళారు. బంగారమ్మను కూతురు వెళ్ళనివ్వ లేదు.

అంత వైభవముగా పుట్టినరోజు జరిగిన వారానికే పిల్లవాడికి పెద్దజ్వరము వచ్చింది. నాలుగు దినాలయినా తిరుగుముఖము కాలేదు. డాక్టరు మందు ఇస్తు న్నాడు. కూతురూ అల్లుడూ చాలా భయపడిపోయారు. ఒకరాత్రి పిల్లవాడికి మరీ ఎక్కువ చేసింది. పిల్లవాడి తల్లిని సమాధానపరచటము చాలా కష్టమైపోయింది కూతురు పడుతున్న బాధకు బంగారమ్మ తల్లడిల్లిపోయింది. కూతురిని ఓదార్చా లని-తన హృదయానికి హత్తుకోవాలనీ ఆమెమనసు ఆరాటపడ్డది. తీరా గది ముంద రికి వచ్చేసరికి పిల్లవాడు 'అమ్మమ్మా ?' అని పిలిచిన పిలుపు వినబడ్డది. ఎవరో తనను తరిమివేసినట్లుగా బంగారమ్మ ఆ గదిలోనుంచి పరుగెత్తింది. కూతురు గది దాటి ఇవతలికి వచ్చిన తరువాత బంగారమ్మ ఆమెను కౌగిలించుకొని ఏడ్చింది. తన కూతురు కంటినిండా నిద్రపోయి-కడుపునిండా అన్నముతిని వారముదినాలు కావ చ్చింది ! బంగారమ్మకు దుఃఖము పొంగుకుంటూ వచ్చింది.

ఆ రాత్రి డాక్టరు పిల్లవాడిని చూడటానికి వచ్చి "పిల్లవాడిదగ్గర తల్లిని ఎప్పుడూ ఉండనీయకండి. అట్లా ఉంటే ఆమె కేదయినా జబ్బుచేస్తుంది" అన్నాడు.

కూతురు పడుతున్న ఆవేదనను బంగారమ్మ చూడలేక పోయింది. మనసు చిక్కబట్టుకొని పిల్లవాడిదగ్గర కూర్చున్నది. పిల్లవాడు కళ్ళుమూసుకొని పడు కున్నాడు. మందువేళయింది. లేపి ఇవ్వటము మంచిదా-కాదా అని మందు సీసా చేతబట్టుకొని ఆలోచిస్తూ గడియారమువంక చూస్తున్నది.

"అమ్మమ్మా !" పిల్లవాడు హీనస్వరముతో పిలిచాడు. బంగారమ్మ మన సులో ముళ్లకంప మెదలినట్లయింది.

వచ్చినప్పటినుండీ పిల్లవాడు ఆ చిన్న ఎర్రటి పెదవులతో తేనెలొలికిస్తూ మాట్లాడుతూ ఉంటే ఆమెకు హృదయంగమముగానే ఉన్నది. కూతురు ఆ పిల్లవాడిని చూసుకొని మురుస్తుంటే ఆమె హృదయములో ఆనందము వెల్లువలై పారేది. తన పెనిమిటి దురదృష్టవశముచేత ఈ ఆనందాన్ని అనుభవించలేక పోయినాడు. తాను చూసి ఆనందిస్తున్నది. కాని ఆ పిలుపు- 'అమ్మమ్మా !' అన్న ఆ పిలుపు-ఆమె గుండెలో చిచ్చుపెట్టిన ట్లవుతున్నది. మనుమలను ఎత్తుకోటాన్ని అందరూ ఎంతో అదృష్టముగా ఎంచుకుంటారు; కాని ఆ భావము బంగారమ్మ ఎదలో జ్వాలను రెచ్చగొడుతున్నది. పిల్లవాడు మళ్ళీ 'అమ్మమ్మా !' అన్నాడు. జాలిగొలిపేటట్టుగా చూస్తూ.

బంగారమ్మ అదిరిపడి తన దేహాన్ని క్రిందినుంచి మీదివరకూ ఒక్కసారి చూసుకున్నది. పిల్లవాడు పిలిచే ప్రతి పిలుపులోనూ ఆమె దేహదార్ఢ్యన్నీ యౌవనాన్నీ నశింపచేసే శక్తి ఉన్నట్టుగా ఆమెకు తోచనారంభించింది. పటిష్ఠముగా ఉన్న ఆమె దేహము ముడుతలుపడి. నరములు పైకితేలినట్లే - నిండుగాఉన్న ఆమె చెంపలు గుంటలుపడినట్లే-గట్టిగా తెల్లగా ఉన్న పళ్లన్నీ ఊడిపోయి నోరు బోసి పోయినట్లే-నల్లగా నిగనిగలాడే ఆమెకురులు నెరసినట్లే- తిన్నగా ఉన్న వెన్ను వంగిపోయినట్లే-భావపరంపర ఆమె మనసులో దొరలిపోయింది. చేతినరాలు పట్టు తప్పి మందుసీసా చేతిలోనుంచి జారి నేలమీద పడ్డది.

ఆ చప్పుడు విని అదిరిపడి కూతురూ అల్లుడూ పరుగెత్తుకొని వచ్చారు. బంగారమ్మ దేహము వణకుతూ ఉండగా చూసి కూతురు తల్లిని బైటికి తీసుకొని వచ్చింది.

రెండుదినాల తరువాత పిల్లవాడికి కాస్త నెమ్మదించింది. కూతురూ అల్లుడూ మామూలుగా మాట్లాడులంటూ ఉదయపువేళ పిల్లవాడి మంచముదగ్గర కూర్చున్నారు. 'తల్లి కాఫీ తీసుకొని వస్తుందిగదా' అని కూతురు ఎదురుచూస్తున్నది. ఎనిమిది గంటలు దాటింది కూతురులేచి తల్లిని పిలుస్తూ ఇల్లంతా వెదకింది. తల్లి పడుకునే గదిలోకి వెళ్ళిచూడగా బల్లమీద ఉత్తరము పెట్టి ఉన్నది.

అమ్మాయీ !

మిమ్మల్ని నిద్రనుంచి లేపటమెందుకని మీకు చెప్పకుండానే వెళ్ళిపోతున్నాను. సంసారములో ఉన్న బంధాలమీద విరక్తి కలిగింది. వైద్యాలయములో

నర్సుగా ఉండాలని ఎంతకాలమునుంచో నాకుకోరిక. నేను వేరే విల్లు వ్రాయనవసరంలేదు. నీ కొడుకే నా ఆస్తికి సర్వాధికారి బంగారమ్మ.''

ఉత్తరము చదువుకొని "మా అమ్మకు బొత్తిగా ధైర్యములేదు'' అన్నది కూతురు కన్నీళ్ళు తుడుచుకుంటూ పెనిమిటితో.

(1958 లో కేంద్ర సాహిత్య అకాడమీవారి సంకలనము కథామంజూషలో చేర్చబడినది)



# వ్యాపారము

ఉదయము పదకొండు గంటలవేళ రంగు కళ్ళద్దాలు ధరించి మ. స. క. అంటే మల్లాప్రగడ సత్య కనకలింగేశ్వరరావు పెద్ద పెద్ద అంగలువేస్తూ హరిజన వాడకు బయలుదేరాడు. కాకిరంగు పంట్లోను గళ్ళ బుష్‌కోటు ఆతడి గంభీరా కృతికి అందాన్ని చేకూర్చాయి. ఒకచేతికి కేమెరా తగిలించుకొని, మరొకచేత్తో తోలుసంచీ పట్టుకొని ఊపుతూ పెద్దపెద్ద అంగలువేస్తూ నడుస్తున్నాడు.

ఒక ఫర్లాంగు దూరాన పోలేరమ్మగుడి దగ్గర గూడేనికి పెద్దయిన వీరన్న నలుగురిని చుట్టూచేర్చికొని ఏదో మాట్లాడుతున్నాడు; అందరూ తలలూపుతున్నారు. మ. స. క. కు ఆరోజయినా తనపని సానుకూలమయితే బాగుండు ననిపించింది.

అతడు ఆ గూడేనికి వెళ్ళటము ఇది మూడవసారి. వెన్ను కంటుకొని పోయిన కడుపులతో- తడబడుతున్న పాదాలతో- కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకొని బ్రతుకుతున్న నిరుపేద స్త్రీ పురుషులను, తల్లి పాలకొరకు అక్కటిల్లిపోయే పసిబిడ్డకు మంచినీటి చుక్కలతో గొంతు తడుపుతూ కన్నీళ్ళుకార్చే మాతృమూర్తులను ఫోటో తీయాలని అతడి సంకల్పము, సూర్యచంద్రులు నిరాటంకముగా జొర బడగల గుడిసెలవి. దుమ్ములో పొరలాడుతూ అర్ధనగ్నముగా తిరుగుతూ తలి దండ్రుల చేతిక్రింద పనులుచేసే పిల్లలనీ ఫోటోలు తీసుకోవాలని కొండంత ఆశతో వచ్చాడు. అతడెన్ని విధాల ప్రయత్నించినా సఫలముకాలేదు. అక్కడికీ అతడు వివరించి చెప్పాడు-వాళ్ళను మోసము చేయటానికి రాలేదనీ, ఫోటోలు తీసుకొనేవరకు ఒక అయిదు నిమిషాలపాటు కుదురుగా కూర్చుని తనవైపు చూస్తే చాలనీ ఎంతో ప్రాధేయ పడ్డాడు. పోనీ-అనాడు కాకపోయిన మరి నాలుగురోజుల తరువాతనయినాసరే నన్నాడు.

కాని ఆ గూడెపువాళ్ళకు సంశయనివారణ కాలేదు. అతడికి తమ చిత్రా లెందుకు? ఊళ్ళో మంచి మంచి మేడలు ఉండగా-కూలటానికి సిద్ధముగా ఉన్న

తమ గుడిసెలే కావాలా ఫోటో తీసుకోవటానికి? కడుపునిండాతిని-కంటికింపుగా అలంకరించుకొని తిరిగే అంతప్రజ ఉండగా-గంజినీళ్ళతో కడుపునింపుకొని పాత చింపులు కట్టుకొనే పేదవాళ్ళకు ఫోటో తీస్తానంటాడేమిటి? అని వాళ్ళకు ఆశ్చర్యము కలిగింది. ఆ ఆశ్చర్యములో సందేహము కలిగింది- తమ ఫొటోలను అతడు ఏంచేసుకుంటాడా అని.

అతడు రెండవసారి వచ్చినప్పుడూ అట్లాగే అయింది - వాళ్ళకు అనుమానము తీరలేదు; ఆలోచనలు తెగలేదు. 'ఆలోచించుకొనిచెప్తాము-రెండురోజులు తాళి రమ్మ'న్నాడు వీరన్న ఆ గూడానికల్లా కాస్త ధైర్యముతో కొత్తవాళ్ళతో మాట్లాడగల శక్తి గలవాడు కనుక. మనసులో ఎంత నిరుత్సాహము కలిగినా పైకి కనబడనీయకుండా మ. స. క. తలవంచుకొని తిరిగి పోవలసి వచ్చినది.

అతడు కొంతదూరము వెళ్ళిన తరువాత 'ఆ బాబునట్లా తిప్పుతున్నావేం?' అన్న మాటలు వినబడ్డాయి. వెనక్కు తిరిగి చూశాడు. ఆ పడుచు బంతి పూలకొప్పు దమ్మిడీకానంత గులాబీ కుంకుమ బొట్టూ అతడికి అంతదూరానికి కూడా కనబడే టట్టుగా ఉన్నాయి. నడుముమీద చెయ్యిపెట్టుకొని చిలిపికళ్ళతో గుచ్చి గుచ్చి అడుగుతున్నది.

"నీకు తెల్దులే. ఆ బాబుకంటా మన పుటము కావాలంట. ఆర్చేటోడా-తీర్చేటోడా? మనజోలి ఆ బాబుకెందుకు?" అంటున్నాడు వీరన్న ఆ పడుచును విదిలించుకుంటూ.

మ. స. క. వాటిని విననట్టుగానే ఆ గూడెము దాటిపోయాడు. ఎంత నిరుత్సాహము కలిగినా భయము తీరిన తరువాతనైనా ఒప్పుకోకపోతారా అన్న ఆశ మాత్రము అతడిని విడిచిపెట్టలేదు. దేశపు ఆర్థిక సాంఘిక సమస్యలను గురించిన శాస్త్రాలను అతడు బి. యే. చదివేటప్పుడే ఆకళించు కొన్నాడు; క్లాసు తెచ్చుకొన్నాడు. అయితేనేమి అందరూ ఒహో అన్నవారేగాని ఉద్యోగమిచ్చినవారు లేకపోయినారు. అతడి తెలివితేటలను మెచ్చుకొనే వారేగాని సహాయపడినవారు కరువైనారు. కూనిరాగాలు తీస్తూ రోడ్లమీద ఎంతకాలము గడిపాడో ఎవరికీ పట్టలేదు. ఉన్నట్టుండి అతడు స్వంత ఊరినీ స్వజనులను వదలిపెట్టి నగరము చేరుకున్నాడు. బాల్యమునుండీ అతడికొక అలవాటు ఉండేది. తల్లిమీదగాని అన్నదమ్ములమీదగాని

కోపమువస్తే మాట్లాడకుండా-గదిలోకివెళ్లి వాళ్ళందరిమీద నాలుగు కాగితాలు వ్రాసి తండ్రికి చూపిస్తూ ఉండేవాడు. తనకేదయినా కావలసివస్తే ఇంట్లోఉన్న తండ్రికి పెద్ద పెద్ద ఉత్తరాలు వ్రాసేవాడు. ఆ అలవాటు చొప్పునే యిప్పుడు మ. స. క. గా మారి తారు రోడ్ల మీద తిరుగుతూ చెట్లక్రింద కూర్చుని వ్యాసాలు వ్రాయటము మొదలు పెట్టాడు. అతడి సంకల్పము ఏమిటంటే నిరుపేదల జీవితాలను గురించి సంక్రాంతి పంచికకు ప్రత్యేకవ్యాసము వ్రాయాలని; దానికితోడు రెండుమూడు మంచి ఫోటోలు కూడా ఉంటే మరీ బాగుంటుందని ; చిత్రాలతో కూడా పంపబడిన ఉత్తమమైన వ్యాసాలకు చాలా గిరాకీ ఉన్నదికదా అని ; అలాంటివి రెండు వ్రాస్తే నెలగడిచి పోతుందికదా అని.

వాళ్ల అన్నట్టుగా - రెండురోజుల తరువాత - మ. స. క. ఆ గూడేనికి బయలుదేరాడు. అతడు కంటికి కనబడగానే ఇంతవరకూ వీరన్నతో మాట్లాడు తున్న వాళ్ళందరూ గుడిసెలలోకి జారుకున్నారు. వీరన్న ఒక్కడే నిలబడి ఉన్నాడు. వీరన్నను చూడగానే గూడేనికి పెద్ద అని తెలిసిపోతుంది వాళ్ళందరిలోకీ అతడు స్వచ్ఛంగా మాట్లాడగలవాడు - కాస్త ఒంటినిండా గుడ్డలు కలవాడూను.

మ. స. క. ను చూడగానే వీరన్న చేతులు కట్టుకొని "బాబుగారు మర్చి పోకుండ వచ్చారే! గుడిసెల మీద ఎంత అపేక్షో బాబుగారికి!" అంటూ ఎదు రుగా వచ్చాడు.

"వీరన్నా! నా మీద మీకు విశ్వాసములేదా? మీ జీవితాలను చూస్తుంటే- నా హృదయము బ్రద్ధలై పోతున్నది. నా రక్తము కరడు కట్టుకొని పోతున్నది. ఊరిబయట - మురికి గుంటల పక్కన ఉన్న ఈ గుడిసెల్లో తోటిమానవులు కడు పుకు తిండిలేక, ఒంటికి గుడ్డలేక గాలికి బ్రతుకుతూ ఉంటే హృదయము గలవాడు చూసి ఊరుకోగలడా? మీ జీవితాలను గురించి పత్రికలకు వ్రాయాలనుకుంటు న్నాను. బొమ్మలు కూడా ఉంటే కళ్లకు కట్టినట్లుగా ఉంటుంది. ఆడవాళ్లకు మగ వాళ్లకు పిల్లలకు ఫోటోలు తీస్తానన్నది ఇందుకే. నేను వీటికోసమే వస్తున్నాను. పాపం - మీవాళ్ళ కందరికీ నన్నుచూస్తే భయంగా ఉన్నట్టుంది! నేను రాగానే పారిపోతున్నారు" అన్నాడు మ. స. క. చెమట తుడుచుకుంటూ.

వీరన్న తలపంకిస్తు "అట్లాగా!" అన్నాడు. "బాబుగారు ఏదోపనిమీదే

వస్తున్నారని అనుకున్నాను. వాళ్ళందరూ వట్టి పిరికివాళ్ళు. భయంకొద్దీ పారి పోతున్నారు'' అన్నాడు తాను వాళ్ళకంటె ధైర్యశాలి అని చెప్పలేక.

"వీరన్నా! వాళ్ళకు ధైర్యముచెప్పి బయటికి తీసుకురా'' అన్నాడు మ. స క. వినయ పూర్వకముగా.

వీరన్న ముఖము అంతలోకే మారిపోయింది. లేని గాంభీర్యము తెచ్చు కుంటూ "మా గుడిసెల్లో ఇట్టాటిపన్లు నోటి మాటలతో కుదరవు బాబూ! ఆళ్ళందరూ తిండికిలేనోళ్లు, తలకొక పావలా చేతిలోపెట్టితే వస్తారు'' అన్నాడు నిర్లక్ష్యంగా అటు తిరిగి.

"అదికాదోయి! నేను వాళ్ళనేమన్నా కష్టపడ మంటున్నానా? అయిదు నిమిషాలసేపు ఇక్కడ - ఈ చెట్టునీడన - నిలబడితే చాలు'' అన్నాడు.

"అయినా అట్టా అడిగితే పనికాదుబాబూ! పైన కనబడితేగాని పని జరుగదు'' అన్నాడు వీరన్న నిక్కచ్చిగా.

మ. స. క. ఎంతసేపు బ్రతిమిలాడినా వీరన్న దిగి రాలేదు. గత్యంతరము లేక అతడు జేబులోనుంచి మూడు రూపాయలు తీసి వీరన్న చేతిలోపెట్టి "ఇప్పుడయినా పిలుచుకొని వస్తావా?'' అన్నాడు వీరన్న ముఖములోకి చూస్తూ.

"చిత్తము చిత్తము'' అంటూ వీరన్న గుడిసెలలో ఉన్న వాళ్ళందరినీ కేకపెట్టి పిలిచాడు. అందరూ బయటికి వచ్చారు. రంగులువేసి అమ్మిన పాతబట్ట లను కొనుక్కున్నట్టున్నారు - అవి కట్టుకొని సవరించుకొంటూ నిలబడ్డారు వరసగా.

వాళ్ళను చూడగానే మ. స. క. కనుబొమలు ముడిపడ్డాయి. తల అడ్డ ముగా తిప్పుతూ "నాకు కావలసింది ఇటువంటి వేషాలు కావు! మీరు ఉన్నవాళ్ళు ఉన్నట్టుగా రావాలి. పిల్లలకు పాలు లేకపోతే - మీకు తిండిలేకపోతే ఎట్లా ఉంటారో అట్లా కనబడాలి. మీరంతా రోజూ ఇటువంటి బట్టలే కట్టుకుంటారా?'' అన్నాడు ఆవేశముతో.

అతడన్నది వాళ్ళకు అర్థము కాలేదు. అందరూ తెల్లబోయి చూస్తున్నారు. వీరన్న మాత్రము "అయితే యిప్పుడు కాదులెండి బాబుగారూ! నిదానంగా చూతాంలెండి'' అంటూ నిర్లక్ష్యముగా వెనక్కు తిరిగాడు.

వీరన్న నిర్లక్ష్యానికి మ. స. క. కు ఆశ్చర్యము కలిగింది. అతడికెందుకో వీరన్నమీద అనుమానము కూడా కలిగింది. ఆ గుడిసెలలో ఉన్నవాళ్ళందరూ ఇతడిచేతి కీలుబొమ్మలని తెలిసికొన్నాడు. కాస్త నిదానము తెచ్చుకొంటూ "వీరన్నా ! ఇది ఏమంత కష్టమైనదని నన్ను అంతగా తిప్పుతున్నారు?" అన్నాడు.

తనసంగతి మరొకసారి వీరన్నకు విపులంగా చెప్పాడు మ. స. క. తన పని ఎట్లాగయినా అయేటట్టు చూడమని బ్రతిమిలాడు కున్నాడు. వీరన్న నవ్వుతూ "ఆళ్ళు ఎవరూ దానికి ఒప్పుకోరు" అన్నాడు, ఎప్పటి మాదిరిగానే పెదవులను బిగిస్తూ.

మ. స. క. కు ఏంచేయాలో తోచలేదు. వ్యాసము పంపవలసిన గడువు దగ్గరికి వచ్చింది. గుడిసెలలో వాళ్ళేకదా ఎంతసేపు ఫోటో తీయాలనుకుంటే తీరా జరిగింది ఇది !

తుది ప్రయత్నముగా మ. స. క. వీరన్న భుజంమీద చేయివేస్తూ "వీరన్నా ! ఈ పని ఏవిధముగానన్నా అయేటట్టు నీవే చూడాలి." అంటూ జేబులో నుంచి అయిదు రూపాయల కాగితాన్ని తీసి అతడి చేతిలో పెట్టాడు.

వీరన్న ఆ కాగితాన్ని చూడనట్టే నలిపి "బాబుగారికి పేదవాళ్ళమీద యెంత ఆపేక్షో !" అంటూ వాళ్ళనందరినీ చాటుకు పిలిచి గుసగుస లాడాడు. అందరి చేతుల్లో ఒక్కొక్క బేడకాసు పెట్టాడు. దానికే వాళ్ళెంత సంతోషపడ్డదీ వీరన్న గ్రహించి తాను కాస్త తొందర పడ్డానను కున్నాడు.

మ. స. క. పిల్లలను పెద్దలను తనకు కావలసిన విధంగా ఫోటోలు తీసు కున్నాడు. తన వ్యాసముతో పాటు ఈ చిత్రాలను కూడా పత్రికకు పంపాడు. వాటి నందుకొన్న సంపాదకుడికి ఎంత ఆనందము కలిగిందో - వెంటనే ఒక పెద్ద ఉత్తరము మ. స. క. పేర వ్రాశాడు. ఇక ముందునుంచీ అతడి వ్యాసాలకు ప్రతి ఫలము ఎక్కువ చేస్తునట్టుగా.

# విజయము గర్వము

"నంబరు ౧౮వ పేపరు ఎవరిది?"

అని హైస్కూలు హెడ్‌మాస్టరయిన గోవిందరావుగారు స్కూలు ఫైనలు క్లాసు పిల్లలను అడిగాడు.

ఆయన కెదురుగా బల్లమీద వనజాక్షి, ఆమె తరువాత ఆరుగురు విద్యార్థినులు వరుసగా కూర్చున్నారు. క్లాసు చాలా నిశ్శబ్దముగా ఉన్నది. క్రిందటివారములో జరిగిన వ్యాసరచన పోటీ ఫలితాలు తెలిసే దినమది. దానిలో ప్రథములుగా వచ్చినవారికి బహుమానముగా గాంధీజీబొమ్మ చెక్కిన అరతులము బంగారు పతకము ఇస్తారు. బహూకరింపబడినవారికే కాకుండా, ఆ స్కూలుకు కూడా ఎంతో ఖ్యాతి వస్తుంది. అంతటి అత్యద్భుతమైన మేధావులెవరో-ఎవరు నోచుకున్నారో ఆ బహుమానానికీ, ఆ ఖ్యాతికీను!

హెడ్‌మాస్టరు అడిగిన ప్రశ్నకు "ఎవరిది - ఎవరిది" అనే సందేహపు ప్రశ్నలు ప్రతివారికీ కలిగి, దానికి జవాబు ఎవరు ఇస్తారో ఎవరిది ౧౮వ నెంబరు పేపరో అని విద్యార్థినులందరూ అప్పటి కప్పుడే తలలు త్రిప్పి చూస్తున్నారు.

వనజాక్షి తల త్రిప్పకుండా తన విశాలనయనాలను మాత్రము ఇటు అటు త్రిప్పి దృక్కులు సారించింది.

౧౮వ నంబరు గల పేపరు నాదండీ" అని ఒక సన్నని కంఠము నిశ్శబ్దాన్ని భేదిస్తూ ఆ గదిలో నాలుగుమూలలా విహరించింది.

దాదాపు నూటపాతికమంది విద్యార్థినులు సమావేశమయిన ఆ హాలులో ఆ బాలిక సన్నని కంఠధ్వని మారు మ్రోగింది.

చివరి బల్ల దగ్గరనుండి తెల్లటి చీరె ధరించిన ఒక బాలిక మందగమనముతో హెడ్‌మాస్టరును సమీపించి నమస్కరించింది.

"నీ పేరేమిటమ్మా" అన్నారు ఉపాధ్యాయులు.

"నా పేరు పద్మావతి" అని అక్కడే నిలబడిపోయిందా బాలిక.

"మన స్కూలులో క్రిందటి వారము జరిగిన 'యంత్రయుగము' అనే వ్యాసరచన పోటీలో ప్రథమురాలుగా పద్మావతి వచ్చింది. ఇదివరలో నిశ్చయించి నట్లుగా బంగారుపతకము ఇవ్వటమేకాకుండా రెండు సంవత్సరాలవరకు విద్యార్థి వేతనము నెలకు ౨౦ రూపాయల చొప్పున ఈ బాలికకు ఇవ్వవలసినదిగా మన పాఠశాల అధ్యక్షులు సెలవిచ్చియున్నారు. ఈ సందర్భములో కుమారి పద్మావతిని అభినందిస్తూ, తక్కిన విద్యార్థినులను ప్రోత్సహిస్తున్నాను" అంటూ హెడ్ మాస్టరుగారు విద్యార్థినుల నమస్కారములను అందుకొని ఆ గదినుండి వెళ్ళి పోయినారు.

బాలికలందరూ పద్మావతిచుట్టూ చేరి, "మాకు విందు ఎప్పుడు చేస్తావు పద్మావతీ? బహుమానము సంపాదించుకొని ఇంటికి వెళ్ళుదామని చూస్తున్నావేమో" అంటూ ఆ బాలికకు ఊపిరి సలుపనీయకుండా చేశారు.

వనజాక్షి కూర్చున్న చోటినుండి కదలలేదు. కాని జరుగుతున్న సందడి నంతా గమనిస్తూనే ఉన్నది. జరిగినదానికి ఆమె కన్నులు జపాకుసుమా లయినవి. ఆమె విశాల ఫాలభాగముమీద తిలకమునకు మారుగా అంటించుకున్న టిక్లీ ధూర్జటి మూడవ నేత్రమువలె మెరయజొచ్చినది. తత్తరపాటువలన ఆమె జడలు రెండూ త్రుళ్ళిన త్రాచులవలె గళమునకు రెండు ప్రక్కలా కదలసాగినవి. ముఖమునకు అద్దినపూత కరుగజొచ్చినది. అరకాళ్ళు చెమర్చినవి.

స్కూలు విడిచిన ఒక గంటకు బాలికలందరూ ఇళ్ళు చేరుకున్నారు.

అందరూ వెళ్ళిన తరువాత వనజాక్షి మెల్లగా లేచి పాఠశాల ఆవరణములో తనకొరకు ఎదురుచూస్తూ ఉన్న కారులో కూర్చుని డ్రైవరుకొరకు హారన్ మ్రోగించింది.

* * * * *

పద్మావతి ఒక పేదబాలిక. గుమాస్తా జీతముతో జీవితము గడుపలేక ప్రపంచ మహాయుద్ధ సమయములో ఆమెతండ్రి సైన్యములో చేరిపోయినాడు.

రెండు సంవత్సరాల వరకూ ఆయన పంపుతున్న పైకము చేరుతూవచ్చింది. అటు తరువాత ఆయనను గురించిన వివరాలు వీళ్ళకు తెలియలేదు. డబ్బు రావటము కూడా ఆగిపోయింది. తరువాత చాలాకాలానికి అతని జీతము తాలూకు పైకము, బట్టలు సర్కారు వారు పంపివేసినారు.

ఏకైక పుత్రికను ఆధారంగా చేసుకొని పద్మావతి తల్లి సుందరమ్మ ఆ ఊరు చేరింది. కూతురు పరీక్ష ప్యాసుకాగానే ఏదో ఒక ఉద్యోగములో చేర్పింప వచ్చునని ఆమె సంకల్పించింది.

పద్మావతి స్కూలునుండి ఇంటికి రాగానే తల్లితో తన బహుమానపువార్త చెప్తూ "అమ్మా! నేను క్రిందటినెలలో విద్యార్థి వేతనము కొరకు ఇచ్చిన దరఖాస్తు వల్ల-నాకు నెలకు ఇరువది రూపాయల వేతనము ఇకనుంచి ఇస్తారట ఈ వ్యాసరచన పోటీలో గెల్పొందినందువల్ల బంగారుపతకము ఇస్తున్నారమ్మా. ఇంక రెండేళ్ళవరకు నా చదువు విషయములో నిశ్చింతగా ఉండవచ్చును" అంటూ తల్లిపాదాలకు నమస్కరించింది.

"ఈ బాలికనూ, విద్యాభివృద్ధినీ చూచి ఆనందించే భాగ్యము తండ్రికి లేక పోయెగదా" అని ఆ మాతృదేవి కన్నులు చెమ్మగిల్లినవి.

* * * * *

మధ్యాహ్నము పన్నెండు గంటల సమయము. స్కూలు పిల్లలకు విడుపువేళ.

విద్యార్థినులు భోజనాలు చేయటానికి రేకులతో షెడ్డును క్రొత్తగా వేశారు. పిల్లలందరూ టిఫిన్‌కారియర్లతో అక్కడికి చేరుకుంటున్నారు. కొంతమందికి ఇళ్ళ దగ్గరనుండి అప్పుడే నౌకర్లు భోజనము తెస్తున్నారు.

పద్మావతి తన వెంబడి తెచ్చుకున్న ఫలహారపు డబ్బాను చేతపట్టుకుని షెడ్డులోనికి వచ్చింది.

కొన్నిదినాలనుంచీ తోటి విద్యార్థినులెవరూ ఆమెతో సంభాషించటము లేదు. ఆమె డబ్బాతో షెడ్డులో ప్రవేశించగానే అందరూ కలిసి ఒక్కపెట్టున పెద్దగా నవ్వారు.

ఏదో ఆలోచిస్తూ వస్తూఉన్న పద్మావతి, వాళ్లనవ్వుతో, తలయెత్తి ఒకసారి వాళ్లందరినీ వీక్షించింది. తిరిగి తల వంచుకొని దీర్ఘాలోచనతో ఒకబల్లమీద కూర్చుని జొన్నరొట్టెను తుంపుకొని తినుట కారంభించింది. అవతలవారి భోజనా లయినవి కాబోలు ఆటలలోకి దిగినారు. చేతులు తుడుచుకున్న తువ్వాలును ఉండగా చుట్టి బంతి ఎగురవేసినట్లుగా ఒకరి చేతిలోనుంచి ఇంకొకరు అందుకొంటూ ఎగురవేస్తున్నారు.

పద్మావతి రొట్టె తింటున్నది. చల్లారి బిగిసిపోయిన జొన్నరొట్టెను తిన టము కష్టమైన పని. ఫలహారము చేసిన తరువాత విడుపు సమయములో సంగీత సాధన కావలసియున్నది. అదిగాక పరీక్షలు దగ్గరకి వచ్చినవి కాబట్టి చదువుకో వలసినది చాలా ఉన్నదనే బెదురు మనసులో ఒక పక్కన ఉన్నది.

ఇంతలో అవతల ఆటలాడుతున్న విద్యార్థినుల చేతులలోనుంచి ఉండ చుట్టిన తువ్వాల వచ్చి పద్మావతి రొట్టెడబ్బామీద పడి, ఆమె తింటూతింటూఉన్న రొట్టెను మట్టిపాలు చేసి వేసినది.

తల పైకెత్తి వ్యవహారము గ్రహించిన పద్మావతి డబ్బాదులిపి మూతపెట్టు కొని అక్కడినుంచి వెళ్ళి సంగీత సాధనకొరకు అనువైన గదిలోకి వెళ్ళిపోయింది.

అరగంట తరువాత ఆమె గదిబయటికి వస్తుండగా ప్రక్కగదిలోనుంచి స్పష్టంగా మాటలు వినిపించినవి.

"మీరు నిజమనుకున్నాసరే. అబద్ధమనుకున్నాసరే-నేను చూసినది అక్షరాలా నిజము. ఆ పేపర్లన్నీ మీరు ఎవరిచేత దిద్దించినారో——వారి దగ్గరికి రెండు పూటలా పద్మావతితల్లీ, పద్మావతీ వెళ్లతూఉండేవారు. వాళ్లు చెప్పి మార్కులు వేయించు కొన్నారు. ఈ బూటకపు వ్యవహారానికి మీరు పతకము ఇచ్చి గొప్పగా సన్మాని స్తున్నారు. కానీయండి ఆపిల్లకు సహాయము చేయాలని మీ మనసులో ఉంటే వేరొక విధముగా చేయకూడదూ" అన్న వనజాక్షిమాటలు పద్మావతి హృదయానికి ములుకులవలె తాకినవి.

వ్యాసరచనపోటీ జరిగిన దగ్గరనుండి వనజాక్షి వైఖరి పద్మావతికి సందే హంగానే ఉంటున్నది. అంతకు పూర్వము మనసువిప్పి మాట్లాడకపోయినా ఇంత

వైముఖ్యము లేకుండా ఉండేది. తాను పట్టుచీరె కట్టుకున్న దానికంటె పద్మావతి పాదాచీరెకు రెండుమూడు చినుగులు కనబడితే ఆమెకు మహా సంతృప్తి కలిగేది.

"ఆ పద్మావతి అటువంటిది కాదు. నాకు బాగా తెలుసు. వాళ్ళు రెండు పూటలా ఎవరింటికి వెళ్ళగా నీవు చూశా నంటున్నావో వారికి కాదు మేము పేపరు యిచ్చినది. నీవు పొరబడుతున్నావు వ న జా క్షీ!" అని హెడ్‌మాస్టరుగారు అంటున్నారు.

ఈ మాటలన్నీ స్పష్టంగా విని పద్మావతి వికలమయిన మనస్సుతో క్లాసు లోకి వెళ్లి కూర్చున్నది.

ఆ సాయంత్రము ఆరుగంటల సమయములో వనజాక్షి, ఆమెతల్లి హెడ్ మాస్టరుగారింటికి వెళ్లారు. ఆయన ఎదురుగావచ్చి స్వాగతమిచ్చి లోపలికి తీసుకొని వెళ్ళారు.

వాళ్ళు ఏ పనిమీద వచ్చారో, తన కేవిధమైన ఉత్తరువులిస్తారో నని ఆయన హృదయములో ఆందోళన బయలుదేరింది. మేఘగర్జనము తరువాత పిడుగు పాటున కెదురుచూసినట్లుగా వాళ్ళ రాక తరువాత పెద్ద అవాంతరము వచ్చి తీరుతుందనే భయము కలిగింది ఆయనకు.

"ఏమిటండి! అమ్మాయి రేపటినుంచీ మీ స్కూలుకు రానంటున్న దేమండీ" అని వనజాక్షితల్లి అన్నది.

ఏదో తనమీద తల్లికి చాడీ చెప్పి ఉంటుందని హెడ్‌మాస్టర్‌గారికి తెలిసి పోయింది. అప్పటికి ఆయనకు స్ఫురించింది పద్మావతి విషయములో వనజాక్షి కేదో అసంతృప్తి కలిగిందని.

"ఏమిటమ్మా వనజాక్షి! నీ కేమీ కష్టము కలిగింది? నాతో చెప్పమ్మా" అన్నారు.

వనజాక్షి నేలచూపులు చూస్తూ తల పైకెత్త లేదు.

"ఏమిటోనండి. ఒకరోజు సాయంకాలము స్కూలునుంచి రాగానే ఏడుస్తూ పడుకున్నది. తండ్రిగారూ, నేనూ ఎంత అడిగినా జవాబు చెప్పలేదు. ఏమిటో

చిన్నబుచ్చుకుని ఇంట్లో తిరుగుతున్నది. వాచు సంగతేమిటో మీ దగ్గరికి వెళ్ళి తెలుసుకొమ్మని అన్నారు" అన్నది తల్లి.

"ఏమిటమ్మా వనజాక్షీ ! నాతో చెప్పవమ్మా" అని అడిగారు మాస్టరు గారు.

"నేను ఆ స్కూలులో ఇంక చదవనండీ. ముష్టి పిల్లలను మహాపెద్దవాళ్ళ వలె గౌరవించే చోటికి నేను ఎట్లా రావాలి ? ఆ పిల్లకు అసలే కళ్ళు నెత్తిమీద ఉన్నాయి. దానికితోడు మీరు చేసిన సన్మానముతో మరింత అహంకారము వచ్చి అందరినీ తృణీకరిస్తున్నది. నే నా స్కూలుకు రేపటినుంచీ రాను" అని వెక్కి వెక్కి ఏడవటము ప్రారంభించింది.

"అదిటమ్మా సంగతి ? మేము ఇంకా ఆ విషయము బాగా ఆలోచించ లేదుగా ? నీకు వచ్చిన సందేహము అదేనా ? నేను చూస్తాలే. నాతోనే చెప్పక పోయినావా ! ఇంత చిన్న విషయము అమ్మగారి వరకూ పోనిచ్చావా?" అన్నారు.

రకరకాల మనస్తత్వాలు కల పిల్లలతో మెలగిన ఉపాధ్యాయుడు కావటము వల్ల వాళ్ళను సమాధాన పరచి అప్పటికి పంపివేశారు. కాని ఆయన కది పెద్ద చిక్కుగానే తోచింది. పద్మావతి బీదబాలిక అయినా ఆత్మగౌరవము గలదీ, తెలివైనదీను. ఆమె స్వయంకృషి చేతనే పైకి వస్తున్నదని ఆయన అంతరాత్మకు బాగా తెలుసు. కాని వనజాక్షి విషయములో మాత్రము గౌరవముతో కూడిన అభిమానమువల్లనూ, పలుకుబడి గల పెద్ద అధికారి కుమార్తె కావటమువల్లనూ వ్యవహారరీత్యా ఆయన బుద్ధి అంతరాత్మను గెలువవలెనని పోరాటము సాగిస్తున్నది.

* * * * *

మరునాడు క్లాసులోకి పిల్లలంతా వెళ్ళుతున్నారు. పద్మావతి క్లాసు గదిలోకి వెళ్ళి బల్లమీద తన స్థానములో కూర్చొనబోయినది. బల్లమీద సరిగా ఆమె కూర్చొనేచోట ముష్టిపిల్ల అని ఇంగ్లీషులో వ్రాసిన చీటీ ఒకటి అంటించబడి ఉన్నది. దానిని చూసినవెంటనే ఆమె సుందరనయనాలలో నీళ్ళు తిరిగినవి. ఉపాధ్యాయులతో చెప్పవలెనని ఆమెకు ముందుగా తోచినదికాని, చెప్పినందువల్ల తెలియని వాళ్ళకు కూడా తెలిసిపోయి అనవసరమయిన అల్లరి జరుగుతుందేమోనని

జంకి వెంటనే సంక్షేపించుకొన్నది. ఆ చీటీ చింపివేసి ఆ క్లాసు అయ్యేవరకూ అట్లాగే కూర్చున్నది. ఆమె మనసంతా చీటీ చూసిన దగ్గరనుండి వికలమయి పోయికది.

స్కూలునుంచి ఇంటికి పోతూ ఉండగా ఏడెనిమిది మంది పిల్లలు 'ముష్టి పిల్ల' అని అరిచారు. ఆమె వెనుకకు తిరిగిచూడగా ఎవరూ కనబడలేదు!

ఆమె రెండు ఫర్లాంగులదూరము మూడు నిమిషాలలో చేరింది.

ఆ రాత్రంతా కన్నుమూయకుండా తెల్లవారే వరకూ వేగించి ఒక నిశ్చయానికి వచ్చింది.

ఆ మరునాడు స్కూలుకు పోయి నీళ్ళునిండిన కళ్ళతో క్లాసులోకి వెళ్ళి, "మాష్టరుగారూ! ఈ స్కూలులో ఇంక క్షణమైనా చదవలేను. దయచేసి నాకు సర్టిఫికేటు యిప్పించండి, నే నింకా మొండిదానివలె ఇక్కడే చదివితే మా కుటుంబానికి మిగిలిన ఆ ఒక్క మర్యాదకూడా పోతుంది. నాకు సెలవు ఇప్పించరూ" అన్నది.

"ఏమిటమ్మా పద్మావతీ, కళ్ళనీళ్ళెందుకు? నాతో చెప్పు" అన్నారు ఉపాధ్యాయులు.

"నేను ఏమనీ చెప్పలేను. ఇక ఒక్కక్షణము ఆలస్యమయినా నామర్యాద కాస్తా జారిపోతుంది." అని కళ్ళు ఒత్తుకున్నది.

పిల్లలంతా విషయము ఎట్లా మారుతుందోనని ఆతురతతో చూస్తున్నారు.

తాను సూచించదలచిన పథ్యమునే రోగి కోరటములో వైద్యునకు కలిగే సౌలభ్యము పద్మావతి కోరికతో ఉపాధ్యాయునికి కలిగింది.

వెంటనే ఆయన కుర్చీమీదినుంచి లేచి బయటికి వచ్చారు పిల్లలందరికి నమస్కరించి పద్మావతికూడా బయటికి వెళ్ళింది.

"అమ్మా పద్మావతీ! ఈ లోకములో ఎంతమంచివాళ్ళకయినా మంచిపేరు రావటము కష్టము. నేను ఈ స్కూలు కమిటీ వారితో మాట్లాడి నీకు ఏర్పాటయిన

విద్యార్థి వేతనము ఇస్తూ మరొక స్కూలులో నిన్ను చేర్పించే ఏర్పాటు చేస్తాను. దుఃఖపడకమ్మా" అని ఆమెను ఓదార్చారు.

పద్మావతి ఆయనకు నమస్కరించి గేటువైపుకు నడక సాగించింది.

టిష్యూచీరె ధరించిన వనజాక్షి బిరుసెక్కిన ముంగురులు ముఖంమీదికి జారగా తల పంకిస్తూ విజయగర్వముతో వికటాట్టహాసము చేయటము నాలుగు బారల దూరాన ఉన్న పద్మావతికి వినపడింది.



# శలభాలు

మీనాక్షమ్మకు తమ పొరుగింటిలోకి ఎవరో కాపరానికి వచ్చారని అప్పుడే తెలిసింది. ఒక అరగంటలో పంపిన మనిషి తిరిగి వచ్చాడు- "ఒక్క అయ్యగారే ఉంటున్నారు. 27 లేక 28 సంవత్సరాల వయసు ఉంటుంది. మన అబ్బాయిగారి కంటె ఒక ఛాయ తెలుపు-కాస్త పొడుగు-తటాలున చూస్తే అబ్బాయిగారిలా ఉంటాడు. వెంబడి వంటమనిషి కాబోలు ఉన్నాడు" అన్న సమాచారముతో.

ఈ వివరాలతో మీనాక్షమ్మ ఒక చక్కని రూపకల్పన చేసుకున్నది. మనసులో ఆ ఊహలు వాయువేగ మనోవేగములతో పరుగెత్తటము మొదలుపెట్టాయి. "అబ్బాయికంటె ఒక ఛాయ ఉంటే అందగాడిక్రింద లెక్క. తటాలున చూస్తే అబ్బాయిలా ఉన్నాడంటే ఏమర్థము? అబ్బాయి అమెరికా వెళ్ళి మూడేళ్ళు ఉండి వచ్చిన నాగరికుడు.

వెంటనే ఆమెకు పొరుగింటాయన ఈ మాదిరిగా ఉంటాడని ఒక నిశ్చితమైన అభిప్రాయమేర్పడ్డది. ఎక్కువ ఆలస్యము చేయకుండా చిన్న కొడుకును పంపి అతడి సైన్ బోర్డును చూచిరమ్మంది. రెండు నిమిషాలు కాకముందే దాని మీద ఉన్న విషయము 'రఘువీర్-అబ్కారీ ఇన్‌స్పెక్టరు' అన్న వార్త తెలిసింది.

ఆరోజు ఉదయము పదకొండు గంటల దగ్గరనుండి సాయంకాలము అయిదుగంటల వరకూ మీనాక్షిమ్మ తహతహలాడి పోయిందంటే అందరూ నమ్మరు.

ఆరోజు జీడిపలుకులు వేసిన ఉప్మా రామశర్మ యింటికి రాగానే మీనాక్షమ్మ స్వయముగా అందించి-చిక్కటి కాఫీ పెద్దగ్లాసుతో ఇచ్చింది. సిగరెట్టును నోటి కందించుతూ "అట్లా చల్లగాలికి వెళ్ళుదాము రారూ?" అన్నది.

ఎన్నడూ ఎరుగని ఈ గౌరవ మర్యాదలకు శర్మ విస్తుపోయాడు. మనసులో తట్టిన ఊహను అంత తొందరగా బైటపెట్టని స్వభావమే ఆమెతో కాపు

రము చేస్తున్న ఈ పాతికేళ్ళ నుండీ చాలా రక్షిస్తున్నది అతడిని. వెంటనే తల ఊపి చెప్పులు వేసుకొని బయలుదేరాడు. ఆమె తృప్తికరముగా ముఖముపెట్టి అత డిని అనుసరించింది.

వాళ్ళిద్దరూ ఎటు వెళ్ళాలనుకున్నారో గాని - మరో అయిదు నిమిషాలకు పొరుగింటి ముందర నిలబడి ఉన్నారు. గోడకు తగిలించిన సైన్‌బోర్డును ఆమె ఆయనకు చూపిస్తూ మిగిలిన వివరాలన్నీ ఒక్క గుక్కలో చెప్పింది.

మీట నొక్కితే గంట మ్రోగినట్లుగా - అతడు తలవంచుకొని నడుస్తూ "అవును అవును" అన్నాడు.

మరునాడు అతడు కచేరీనుంచి వచ్చేసరికి మసాలాదోసె చేతికి వచ్చింది. అతడు ఖాళీచేసిన ప్లేటును మీనాక్షమ్మ స్వయముగా అందుకొన్నది. అతడు కాఫీ త్రాగగానే-మాటల సందర్భములో చెప్పినట్టుగా మీనాక్షమ్మ చెప్పింది. "ఆ ఇన్‌స్పెక్టరుగారట దత్తపుత్రుడట! తోటలు దొడ్లు ఉన్నాయట - నగరములో రెండు పెద్ద ఇళ్ళు ఉన్నాయట-చక్కగా చిన్నతనములోనే మంచి ఉద్యోగము కుదిరింది కదండీ!"

"నిజమే-నిజమే! మంచి ఉద్యోగమే. చిన్న తనముకూడాను" వెనుకటి ధోరణిలోనే అన్నాడు శర్మ.

నాలుగు రోజులైన తరువాత మీనాక్షమ్మ నౌకరును పొరుగింటికి పూల కొరకు పంపి "అమ్మాయిగార్లకు ఆరంగు పూలంటే ఎంతో యిష్టము. పెరట్లో వున్నవి కోసుకో వచ్చునా?" అని అడగమన్నది.

వెళ్ళినవాడు వెంటనే తిరిగి వచ్చాడు. "దత్తుగారి అమ్మాయిలు ఉదయము ఏడుగంటలకే వచ్చి కోసుకుపోయా" రని చెప్పాడు.

మీనాక్షమ్మ తెల్లబోయింది. "పొరుగింటి ఆయనను గురించి దత్తుగారింట్లో అంత తొందరగా ఎట్లా తెలిసింది?"

సాయంకాలము రామశర్మ యింటికి రాగానే ఒక తీర్మానము ఆయన ముందర పెట్టింది. ఆయన "అంతకంటేనా!" అనుకుంటూ చెప్పినపని చేశాడు.

మరునాడు సాయంత్రము అయిదింటి వరకూ మీనాక్షమ్మ కూతుళ్ళు ముగ్గురూ నైలాన్ చీరెలు కట్టుకుని ముస్తాబై సిద్ధముగా ఉన్నారు. ఉపాహార విందుకు సర్వమూ సిద్ధముగా ఉన్నది. కూతుళ్ళతో మీనాక్షమ్మ గడపదగ్గరే నిలబడి ఎదురుచూస్తున్నది అతిథికొరకు.

రామశర్మ ఆనాలుగింటికే ఇంటికి రావలసింది. ఆయన రాకపోవటము మీనాక్షమ్మకు కొంత కొరతగానే ఉన్నది. కాని ఆ కారణముచేత ఏలోటూ జరుగకూడదన్న పట్టుదల ఉండటమువల్ల ఉత్సాహాన్ని ఇనుమడింప చేసుకున్నది.

సరిగా సమయానికి వచ్చిన అతిథిని చూడగానే ముఖము ప్రఫుల్లమయింది మీనాక్షమ్మకు. ఎదురుగా వెళ్ళి తీసుకొనివచ్చి కూర్చోబెట్టింది. తన కూతుళ్ళను ముగ్గురినీ పిలిచి ఒక్కొక్కరినీ ఆయనకు పరిచయము చేసింది.

"వారు ఎంతో సరదాపడి మిమ్మల్ని అల్పాహారవిందుకు పిలిచారుగాని— పాపము రావటానికి ఏదో అననుకూలమువచ్చి ఉంటుంది. మీరు అన్యథా భావించకండి" అంటూ క్షమాపణ కోరింది.

అతడు తగినట్లుగా సమాధానము ఇచ్చి - ముఖావముగా- స్వల్పముగా ఫలాహారము తీసుకున్నాడు.

"వీటి రుచి మీకు సరిపడలేదేమో!" అన్నది కాస్త నొచ్చుకుంటూ.

"లేదండీ. రాత్రి దత్తుగారింట్లో విందు భోజనము. ఇంకా నేను దానినుంచి తేరుకోలేదు"—అన్నాడు.

మీనాక్షమ్మకు దేహములో విద్యుచ్ఛక్తి ప్రవహించినట్లయింది. "తాను అల్పాహార విందుకు ఆహ్వానించకముందే వాళ్ళు తనకంటె ఒక అడుగు ముందు వేస్తున్నారు మొదటినుంచీ!" అనుకున్నది.

అతిథి సెలవు తీసుకుంటూ "విద్యావంతులూ సంస్కారులూ ఆయన మీ కూతుళ్ళ పరిచయభాగ్యము లభించినందుకు చాలా సంతోషంగా ఉన్నది. ఈ ఊరు నాకు నచ్చింది. అందులో ఇల్లు చక్కగా పొందికగా బాగా కుదిరింది. మంచి పొరుగు-ఒక గొప్ప విశేషము!" అన్నాడు.

మీనాక్షమ్మ మనసు పండు వెన్నెలయింది. అతడికి ప్రత్యేకముగా ఆ యిల్లు నచ్చటములోనూ-నచ్చినదని తనకు చెప్పటములోనూ ఏదో ప్రత్యేకత ఉండే ఉంటుంది. దత్తుగారి ఇల్లు కనబడుతునేవున్నా అవతల వీధిలో ఉన్నది. అందు లోనూ తన కూతుళ్ళందరూ విద్యావంతులన్న ప్రశంస కూడా వచ్చింది. విద్య దేమిటి-ఎవరికయినా వస్తుంది- కాని సంస్కారము వంటపట్టాలంటే మాటలా? ఆ మాటే కదూ అతడు వెళ్ళుతూ వెళ్ళుతూ తన కూతుళ్ళవంక చూస్తూ అన్నది?

ఒకరోజు సాయంత్రము మీనాక్షమ్మ కూతుళ్ళను తీసుకొని క్లబ్బుకు వెళ్ళింది. అక్కడ దత్తుగారి అమ్మాయిలు టేబిల్ టెన్నిసు ఆడుతున్నారు. మీనా క్షమ్మ కూతుళ్ళతో కాసేపు ఆడి, వాళ్ళు బయలుదేరారు.

"అంత తొందరపడతారేమిటి? ఉండండి మేమూ వస్తాము" అన్నది మీనాక్షమ్మ పెద్దకూతురు.

"ఇక్కడికి కొత్తగా వచ్చారే రఘువీర్ ఇనస్పెక్టరుగారు - ఆయన ఈ సాయంత్రము మా యింటికి వస్తానన్నారు. సంగీతపు పోటీ పెట్టారు మా యింట్లో" అన్నది.

మీనాక్షమ్మ పెద్దకూతురికి ఆవేశ మెక్కువై "ఆయనకు అసలు సంగీత మంటే అభిరుచి లేందేనా! అందులో మన కర్ణాటక సంగీతమంటే బొత్తిగా లేదు. ఇంకా భరతనాట్యములో బాగా అభిరుచి ఉన్నది"—మొదట ఏమీ అనకూడదను కున్నది గాని ఆపుకోలేక అనేసింది.

రోషములో అసూయ మేళవించగానే దత్తుగారి అమ్మాయి ముఖము కంద గడ్డవలె అయింది.

"నీకేం తెలుసు? ఆయన మా యింటికి వచ్చినప్పుడు భరతనాట్యాన్ని గురించి హేళనచేస్తూ-చాలా అసహ్యముగా మాట్లాడాడు" అన్నది

"అసంభవము! మీకాయన సంగతి పూర్తిగా తెలియదు" అని మీనాక్షమ్మ కూతురు గద్దించింది.

దత్తుగారమ్మాయి "మాకు ఆయన సంగతి తెలియదట గానీ- మీకేనా తెలిసింది ?" అని హేళనచేసింది.

అప్పటివరకూ ఊరుకున్న మీనాక్షమ్మ "అమ్మాయీ ; ఏమాటా తొందరపడి అనకూడదు. మా అమ్మాయీ-అతడూ పరస్పరమూ అభిమానముతో మెలగుతున్నారు. మేము వాళ్ళకు నిశ్చితార్థము చేద్దామనుకుంటున్నాము. మరి.... ఆయన సంగతి దానికి తెలియకుండానే మాట్లాడిందంటావా ?" అన్నది మందలింపుగా.

ఆ అమ్మాయి తెల్లబోయి "ఈ సంగతి ఆయనకు తెలుసునా ?" అన్నది.

"మేమే అనుకున్నాము. ఒక మంచిరోజు చూసి ఆయనతో చెప్పాలనుకుంటున్నాము" అన్నది.

దత్తుగా రమ్మాయిలు చేతిలో ఉన్న బంతులు అక్కడ పడేసి ఇంటిత్రోవ పట్టారు.

మీనాక్షమ్మ కూతుళ్ళను తీసుకొని ఇంటికి వెళ్ళుతూ "అయినా దత్తుగా రమ్మాయిలకు బొత్తిగా మర్యాద తెలియదు. తమకే అన్నీ తెలుసునని విరగబడిపోతారు" అన్నది.

శ్రావణమాసపు వర్షాలు నాలుగురోజులపాటు ఎవరినీ ఒకరి యింటినుంచి మరొకరి యింటికి పోనివ్వలేదు.

కాస్త తెరపిగా ఉన్ననాటి సాయంత్రము ఇన్‌స్పెక్టరుగారి నౌకరు అందరి యిళ్ళకూ ఒక్కొక్క బొమ్మ- చారెడు సున్నిపిండి చక్కిలాలూ పంచాడు ఏమిటంటే "అమ్మగారు అబ్బాయిగారిని ఎత్తుకొచ్చారు గదండీ !" అన్నాడు.



# పరిత్యక్తుడు

"బాబాయి గారిని కొట్టిన వాడిని అందరూ కలిసి పట్టుకున్నారండీ! వాడి పేరుట ఆనందమోహనుట!" అని పదిమంది పిల్లలు పరుగెత్తుకుంటూ వచ్చి సువర్ణతో చెప్పారు.

అంతలో ఆమె తల్లి వచ్చి "అమ్మాయీ! వాడిని మన వాకిట్లోకి తీసు కొచ్చారు. పోలీసులు కూడా వెంబడే ఉన్నారు. ఆయన దగ్గరికి వాడిని తీసుకొచ్చి చూపిస్తారుట. ఆయనేమయినా గుర్తు పట్టగలిగితే వాడికి శిక్ష పడుతుందని అంటున్నారు" అంటూ గదిలోకి వచ్చే వాళ్ళకు తోవ యిచ్చింది.

పదిమంది పట్టుకొని ఒక యువకుడిని లోపలికి తీసుకొని వచ్చారు. అతడు చిన్నవాడే ఇరవై రెండు-ఇరవై మూడు ఏళ్ళు ఉండీ లేనట్లు ఉన్నాయి. ఎర్రగా, బక్క-పలచగా ఉన్నాడు. చెదరిన క్రాపూ, నలిగిన ఉన్నిబట్టలూ, ఎడమ కణతకు రూపాయంత వెడల్పున ఎర్రటి పుట్టుమచ్చ. తలవంచుకొని అతడు వాళ్ళతో నడుస్తూ మునలమ్మను, ఆమెను ఆనుకొని ఉన్న సువర్ణను చూస్తున్నాడు సువర్ణ చెవిలో తల్లి మెల్లగా అంటున్నది. "నేనప్పుడే సందేహించానే—వీడు ఒక వేళ మన ఆనంద మోహను కాడు గద!" అని, ఆపోలిక చూశావా? ఎంత అచ్చు గుద్దినట్లుగా ఉన్నదో! వాకిట్లో వాళ్ళతో మాట్లాడుతుంటే విన్నాను. కంఠధ్వని ఎట్లా ఉన్నదనుకున్నావు?"

సువర్ణ తల పైకెత్తి తల్లి ముఖము చూసి 'ఆఁ' అంటూ కళ్ళుగట్టిగా మూసుకున్నది. తల్లి ఆమెను పడకుండా పట్టుకున్నది. సువర్ణ కళ్లు మూసుకుని గజగజ వణకిపోతున్నది. ఆ యువకుని లోపలికి తీసుకొనిపోయిందీ, తారకనాథు బాధతో మూలుగుతూ కూడా అతడిని కళ్లు తెరచి చూసినదీ, తిరిగి వాళ్ళందరూ అతడిని పట్టుకుని వెళ్ళిందీ ఏదీ ఎరుగదామె.

సరిగా పన్నెండు సంవత్సరాల క్రిందట ఒకసారి మధ్యాహ్నపు వేళ తల్లి అన్నది. సువర్ణతో "అమ్మాయీ ? ఆ వెలమ జమీందారుడు ఏదో పని మీద ఈ ఊరు వచ్చారడట. వాళ్ళతో పిల్లవాడు ఉన్నాడని తెలిసింది సుమా ! బాగా ఎదిగాడట ! మన తోటమాలిని లోపలికివెళ్ళి చూడమన్నాను. మనము ఒకసారి వెళ్ళి చూద్దామా ?"

ఆ మాటకే సువర్ణ నిలువునా వణకిపోయింది. కళ్లుగట్టిగా మూసుకుంది. పది పదిహేను దినాలవరకు వీధి ముఖము చూడలేదు. కడుపులోకి సరిగా ఆహారం లేదు. కంటిమీదికి కునుకులేదు. అకస్మాత్తుగా ఆమె వాడి వత్తిలా అయిపోవటము తారకనాథుని ఆశ్చర్యపరిచింది. వైద్యులు పరీక్ష చేశారు. ఎటూ నిర్ణయము చేయలేక పోయారు. చివరకు హిస్టీరియా అని శంకించారు.

తల్లి ఎంతో నొచ్చుకున్నది. ఉబుసుపోక తానే ఎందుకు చెప్పినట్లా కబురు? సువర్ణ యింకా మరచి పోలేదు. కన్న కడుపుకు మరపు ఉండదని తనకేం తెలుసు? తన కొక్కతే కూతురు. ఆ కూతురు చక్కగా బిడ్డలతో పచ్చపచ్చగా కాపురము చేస్తున్న దాయెను.

ఏడాది క్రిందట ఊరంతా గుప్పుమన్నది. జమీందారు భుజంగరాయడు పెంచుకున్న కొడుకు గ్రామాలన్నీ దోయించు తున్నాడట. ఎవరో యిద్దరు స్నేహితులల్లే ఉన్నన్నాళ్ళు ఉండి, చివరకు ఆ జమీందారుగారి కొడుకుని మోసగించి, అంతా తీసుకొని పోయారనీ, ఆ కొడుకు దౌర్జన్యమువల్లనే ఊరు ఊరంతా ఆ కుటుంబము మీద తిరుకబడి నాశనము చేశారనీ, ఆకుటుంబాని కంతకూ ఈ పిల్లవాడొక్కడే మిగిలాడనీ నీలివార్తలు పాకిపోయాయి. ఒకసారి జమీందారు ఈ కొడుకును కొట్టబోతే పాపము జమీందారిణి కళ్ళ నీళ్ళు కారుస్తూ "బాధ భరించలేకనేగా పరాయమ్మ కన్నబిడ్డ కొరకు కొంగు పట్టాను ? వాడినేమీ అనకండి. ఆ అనేదేదో నన్నే అనండి" అన్నదట. అతడికి కూడా కళ్లు చెమ్మగిలి పిల్లవాడెంత కావాలంటే అంతా యివ్వటము ఏది చేయమంటే అది చేయడమ్ము మొదలు పెట్టాడట.

ఈ వార్త వింటూనే సువర్ణగుండె బయటికి వినబడేతంట గట్టిగా కొట్టుకొనేది. ఆ తాకిడికి ఆమె ఊగిపోయేది. ఆమెకళ్ళు గట్టిగా మూసుకొని అను

కునేది "వాళ్ళు పెంచుతున్నారు గాని-కన్నారా? అంత వెర్రి ఏమిటి" అని. ఆమె నమ్మలేక పోయేది.

సరిగా ఇరవై రెండేండ్లనాడు సువర్ణ ప్రసూతి వైద్యాలయము నుండి ఇంటికి వచ్చింది. పుట్టినబిడ్డ విషయము ఆమె మరచి పోవాలని ఎంత ప్రయత్నము చేసిందో అంత ఎక్కువగా, ఇతరులు పరామర్శకని వచ్చి జ్ఞాపకము చేసిపోతూ ఉండేవారు.

"పండు వంటి పిల్లవాడు కళ్ళల్లో మెదుల్తున్నాడు. నీవు మనసు ఎట్లా సమాధాన పెట్టుకుంటుంన్నావో"నని తల్లి ఉదయాస్తమానమూ ఇదే మాట.

సువర్ణలతకు మూడు కాన్పులయినా అప్పటికి ఒక్కబిడ్డయినా ఇంట్లో తిరుగలేదు. నాలుగవసారి కాన్పుకు వైద్యాలయానికి వెళ్ళమని చెప్పి ఆమె తల్లిని పిలిపించి తారకనాథు విదేశాలకు వెళ్ళాడు. పుట్టబోయే బిడ్డ కంటె, బిడ్డపుట్టిన తరువాత జరుగబోయే సంఘటనలను గురించి మనసు రాయి చేసుకొమ్మని ఆమెకు అనేక విధాలుగా అతడు చెప్పి వెళ్ళాడు. సువర్ణకు ప్రసూతి వైద్యాలయలో పది పౌనుల పిల్లవాడు పుట్టాడనగానే నర్సులూ, డాక్టర్లూ ఆశ్చర్యముతో ఆ సాయంత్రము వరకు వచ్చి చూసి పోతూనే ఉన్నారు. తెల్లగా దంతపు బొమ్మలాంటి పిల్లవాడు మిసమిసలాడే బుగ్గలతో నల్లటి ముంగురులతో పుట్టగానే సువర్ణ తల్లి మురిసిపోయింది.

పిల్లవాడి అందచందాలను గురించీ. పోలికలను గురించీ అందరూ అనుకోగా విన్న సువర్ణ కళ్ళు గట్టిగా మూసుకుని ప్రక్కకు తిరిగి పడుకున్నది.

"దేవుడికి తనమీద ఎంతకోపమో! అంద చందాలతో చక్కటి పిల్లలను యిచ్చి-మురిపించినట్లే మురిపించి-మాయం చేస్తున్నాడు. ఇప్పుడు వీడి పనీ యింతే!" అప్పటి కప్పుడే సువర్ణ మనసులో ఆ పిల్లవాడు పెరిగినట్టూ-కొంత కాలము మురిపించి చనిపోయినట్టూ-ఆ బాధ కొద్దీ తాను మెలికలు తిరిగి పోయినట్టూ భావపరంపర వేగముగా సంచరించింది.

వెంటనే సువర్ణ డాక్టరును పిలిపించి-బుద్ధి పూర్వకముగా పిల్లవాడిని తాను ఎవరికైనా ఇవ్వదల్చుకొన్నట్లు చెప్పి-ఏదైనా ఏర్పాటు చెయ్యమన్నది. సువర్ణకు మతి పోయిందేమోనని తల్లితో పాటు డాక్టర్లుకూడా భయపడ్డారు.

ఎంత సేపటికీ సువర్ణ చెప్పేది ఒక్కటే మాట-"పుట్టిన బిడ్డను నేను కంటితో చూడను. నా చూపు తగిలితే పిల్లవాడు చచ్చిపోతాడు-కనుక ఎవరికైనా ఇచ్చివేయండి" అని.

తల్లి అనేకవిధాలుగా చెప్పి చూసింది-ఇతరులు చాలా మంది మందలించారు-ఆ పట్టు మానమని. కాని-సువర్ణది ఒకటేపట్టు.

మధ్యాహ్నము పన్నెండుగంటలకు పుట్టిన పిల్లవాడిని కంటితోనైనా చూడకుండా సాయంత్రము అయిదు గంటలవరకూ సువర్ణ కళ్ళుమూసుకునే పడుకున్నది.

కరారు పత్రము - సాక్షుల సంతకము అంతా పూర్తిచేసి - సువర్ణలత కుమారుని-నాలుగవ నెంబరు గదిలో చనిపోయి పుట్టిన కుమారుని తలచుకొని ఏడ్చే వెలమ జమీందారిణికి యిచ్చే ఏర్పాట్లు జరిగాయి.

సువర్ణలత అప్పుడు కళ్లు తెరచి నాలుగు మూలలూ కలయజూసింది. వైద్యాలయములో ఉన్న పదిరోజులూ తనమీది బారమేమిటో దిగిపోయినట్లు నిశ్చింతగా ఉన్నది.

ఇంటికి వెళ్ళిన తరువాత రాత్రిళ్ళు నిద్రపట్టక బాధపడేది ! ఆ వెలమ జమీందారిణిని ఆ పిల్లవాడు ఎంత దుఃఖ పెట్టుతున్నాడో..... పెంచిన మమకారము పాపమామెను ఒకవేళ బాధించడము లేదుకదా ! మరో అయిదు నిమిషాల పాటు ఆమె మనసులో ఆ హాలాహలాన్ని తాను మ్రింగకుండా-తన మనసు చెదరిపోకుండా- తనను తాను కాపాడుకొన్న విధమామెకు చాలా సంతృప్తి నిచ్చేది. దాని తరువాత తారాజువ్వలాంటి ఆలోచన పైకెగసి-క్రిందికి దూకేది-'వాడు.... బ్రతికి ఉండి ఆమెనెంత మురిపిస్తున్నాడో ! !

పక్కమీద మసలగా మసలగా తెల్లవారు జామునకు ఎప్పుడో కన్ను మూతపడేది.

అయిదు నెలల తరువాత తారకనాథు వచ్చాడు. ఉత్తరము ద్వారా తెలిసినా-కంటితో నాలుగవసారి కూడా పాపాయి లేకుండా ఒక సువర్ణనే ఆ యింట్లో చూసేసరికి అతడికి కూడా మనసు చివుక్కుమన్నది.

అతడి ఆగమనమూ - అతడందుకొన్న ప్రమోషనులూ ఆమెకు ఉత్సాహాన్ని కలిగించ లేకపోయాయి. కాలప్రవాహము ముందుకు నెట్టుకొని పోయి ఆమె చేత మరో యిద్దరు బిడ్డలను పెట్టింది. ఆమెకు ఒక్క-క్షణమైనా తరువాత తీరిక లేక పోయింది. బాలసఖ్యుల సందడి, జిలిబిలి పలుకుల చిన్నగేయాలకు తాళము వేసే చిరుపాదాల మువ్వల సవ్వడి అహర్నిషలూ ఆమె మనసును లయింపచేసు కున్నాయి. కాని-మెరుపులాంటి ఊహలు మెరసి ఆమె కళ్ళను మూయిస్తూనే ఉన్నాయి అప్పుడప్పుడు.

కొట్టిన యువకుడూ పోలీసులూ అందరు వెళ్ళిపోయిన తరువాత కళ్ళు మూసుకునే సువర్ణ తారకనాథుని పడుకోబెట్టిన గదిలోకి వెళ్ళి అతడి గాయాన్ని చేతితో తమిడిచూసింది. ప్రమాదము లేక పోయినా పెద్దగాయమే తగిలిందన్నారు వైద్యులు.

క్రిందపడి పోకుండా గోడనానుకొని సువర్ణ తారకనాథునితో అన్నది "వాడెవరనుకున్నారు? నాలుగవ సారి కూడా నన్ను ఏడిపించడానికి పుట్టిన బాకీ దారుడు. నా చూపు తగిలితే వాడు చనిపోతాడని ఎవరికో పెంచుకోటానికి యిచ్చే శాను. నా మటుకు నేను వాడిని పోయిన వాడి క్రిందే జమ కట్టుకున్నాను. వాడు పెరిగి పెద్దవాడై నాడు..... కాని దుర్మార్గుడైనాడని వింటున్నాను. వాడి విషయా లన్నీ మా అమ్మ ఎట్లాగో తెలుసుకుని నా చెవిన వేస్తూనే ఉంటుంది. వాడిని నాముందర అనేక విధాలుగా వర్ణిస్తూ ఉంటుంది. వాడు చనిపోయినా నాకు కష్టము కలుగకుండా నా మనసు బాధపడకుండా నేను పన్నిన ఉపాయమది, కాని నన్ను ఆ బాధ మరో రూపములో ఏడిపిస్తూనే ఉన్నది" అని.

తారకనాథు కళ్లు తెరచి ఆమె చెప్పినదంతా విన్నాడు. అ విషయములో అదివరలో సువర్ణ తనకు చెప్పుతూ వచ్చినదంతా వాస్తవమని అతడు ఎప్పుడూ అనుకోలేదు. గాని తరచి ఆమెను అడిగి బాధించదలచుకొనలేదు. కాని అపుకో లేక "ఆ మాట ముందుగా చెప్పితే పోలీసు వారితో మాట్లాడి ఉందునుగా! నా వెనుక ఎంత సేపటినుంచీ నడుస్తున్నాడో మరి-హఠాత్తుగా జేబులో చెయ్యిపెట్టి పర్సు తీశాడు. నేను చెయ్యి గట్టిగా పట్టుకున్నాను. తప్పించుకోటానికని తలమీద కొట్టాడు. ఒక్క-మాటలో శిక్ష తప్పించి వేద్దునే!" అని కొంచెము కఠినముగానే అన్నాడు.

సువర్ణ అసలే ఈ బాధతో మానసికంగాను దైహికంగాను అతిబలహీనమై పోయింది. దానిపైన రక్తము కారుతున్న గాయాన్ని చూపింది. ఈ స్థితిలో ఇంత కాలమునుండి చెప్పకుండా దాచిన మాటను ఈ విధంగా తారకనాథ్‌తో చెప్పవలసి వచ్చింది. ఆమెకు నరాలలో పట్టుతప్పి పోయింది.

"మీతో ఈ మాట ముందుగా చెబ్బితే-వాడిని యింటికి తీసుకొని వస్తారు. నా విషపు చూపు పడితే-వాడు కాస్తా........ఉండడు........భూమిమీద ఉండడు" అని హిస్టీరియా రోగి అరచినట్లు అరచి కళ్ళు గట్టిగా మూసుకొని నేలమీద పడి పోయింది సువర్ణ.



# మాయ ముత్యాలు

ఆ దుకాణము పెద్దబజారులో ఉన్న నగల దుకాణాలన్నిటిలోకీ ఆడంబర మైనది. సరీగ్గా దానిముందరే ఒక యువతి బండిదిగి నాలుగుప్రక్కలా కలయ జూస్తున్నది. ఆమె నడక ఏవైపుకు సాగుతుందోనని గమనిస్తున్న ఆ దుకాణపు నౌకర్లు ఆమెకు ఎదురుగా వెళ్ళి "దయచేయండి అమ్మగారూ!" అని ఆమెను ఆహ్వానించి లోపలికి తీసుకొని వెళ్ళారు; ఆమెకొక మంచికుర్చీ చూపించి కూర్చో మన్నారు; ఎలక్ట్రికు ఫాను పెట్టారు.

ఆమె సరిగా సర్దుకొని కూర్చోకముందే ఆ నౌకర్లలో ఒక యువకుడు "మీకేం కావాలో చెప్పండి. గాజులా—ఉంగరాలా? కొత్త కొత్త నమోనాలు చాలా వచ్చాయి. చూస్తారా?" అన్నాడు ఆమెకు ఎదురుగా నిలబడి.

ఆమె కంటికి కనబడ్డదగ్గర్నుంచీ నౌకర్లు చేస్తున్న హడావిడిని చిన్నసేటు కనిపెట్టుతునే ఉన్నాడు. కుర్చీవేసి కూర్చోపెట్టటము అయిన తరువాత దిగ్గునలేచి అక్కడికి వచ్చాడు ఆమె కెదురుగా. "మీకు పెద్దయింటి అమ్మగార్లతో మాట్లాడ టము తెలియదు. అవతలికి వెళ్ళి మీ పనులు చూసుకోండి" అంటూ నౌకర్ల నంద రినీ పంపివేసి, మందహాసముతో ఆమెవైపుకు తిరిగాడు.

"చూడండీ! మాదగ్గరికి మొన్న దీపావళికే కొత్త సరకు దిగింది. కొత్త కొత్త డిజైనులు- అంటే ఇంగ్లీషు, అమెరికా డిజైనులు వచ్చాయి. ఉంగరాలూ. గాజులూ అనేకరకాలలో ఉన్నాయి."

ఆమె తన మాటలను వింటున్నట్లు తోచగానే, క్రాపు సవరించుకొంటూ— చిరునవ్వుతో-ప్రతి మాటా చాలా జాగ్రత్తగా స్ఫుటముగా ఉచ్చరిస్తూ మళ్ళీ అందుకున్నాడు.

"ఒక మహారాజుగారు అంటే జమీందారుగారు ఇటువంటి ఉంగరాన్నే మొన్నకొన్నారు. ఇక్కడినుంచే పంపించారు వారి ప్రియతములకెవరికో. ఈ

ఉంగరాలు ప్రేమికుల మధ్య రాయబారము నడుపుతాయనుకోండి. మా దగ్గర ఇవి చాలా ఖర్చు అవుతున్నాయి. మీరుకూడా చూడండి" అంటూ చెవిలో వేలుపెట్టి ఆత్తరులో ముంచిపెట్టుకొన్న దూదిని సవరించుకున్నాడు.

ఆమె వింటూ కూర్చున్నది కాని పెదవి కదపలేదు.

మరో రెండు నిమిషాలు చూసి అతడు మళ్ళీ ప్రారంభించాడు "పోనీలెండి. ముత్యాలహారాలు చూస్తారా! ఒంటివరసవి-రెండు వరసలవి- మూడు వరసలవి- అందమైన లాకెట్లతో సిద్ధముగా ఉన్నాయి. పెద్దపెద్ద ఇళ్ళలో ఉండతగినవి. మహా రాజుల ఇళ్ళల్లో ఇటువంటి జాతి ముత్యాలే ఉండేవి. మీకు ఏ నమోనా కావాలంటే ఆ నమోనా చూడండి" ఆ యువకుడు ఆపకుండా చెప్పుకొని పోతున్నాడు. ఆమె ఈ మాటలన్నీ వింటున్నదో లేదో గాని అద్దాల కేసులో పెట్టిన వస్తుజాలాన్ని తల తిప్పకుండా కళ్ళతో పరికిస్తున్నది.

తాను చెప్పినవీ చూపించినవీ ఆమెకు నచ్చటము లేదేమో నన్న సంశయముకొద్దీ, తిరిగి వాటిని వర్ణించి వర్ణించి చెప్పటము మొదలుపెట్టాడు.

పావుగంట తరువాత ఆమె కూర్చున్న చోటనుంచి లేవగానే ఆతడి కేదో స్ఫురించి "మీరు లేచి స్వయముగా చూస్తే మంచిది. నిన్ననే వచ్చినవి. ఈ ఉదయమే షోకేసులో అమర్చాము. ఇట్లా వచ్చి చూడండి" అన్నాడు.

ఆమె అలంకరణ వయసును కప్పిపుచ్చుతున్నది. తెల్లటి నైలాన్ చీరె కట్టుకున్నది. తెల్లటిదే గుత్తమయిన చోలీ ధరించింది. ఎత్తుమడమల కాలిజోడు తొడగటమువల్ల నికరమైన ఆమె పొడవు చూపరులకు వెంటనే తెలియదు. తల వెంట్రుకలు కూడా ఎంత దీర్ఘములో తెలియటానికి అవకాశము లేదు. పొడుగుపాటి చేతిగోళ్ళకూ, కాలిగోళ్ళకూ రంగు వేసుకున్నది. ఆమె మెల్లగా ఒక్కొక్క అడుగే వేస్తుంటే. దుకాణము ముందు నిలబెట్టిన బొమ్మ కదలి వస్తున్నదేమో ననిపించిందాతడికి. ఆమె ముత్యాలహారాలు పెట్టిన షోకేసుదగ్గర నిలబడగానే అతడు చప్పున దానిని తెరచి ఇరవై డబ్బాలను పైకితీసి తెరచి బల్లమీద పెట్టాడు. ఆ యువకుడు ఒక్కొక్కదాన్నీ వర్ణించటము మొదలు పెట్టాడు.

ఆమె వాటిలోనుంచి ఒకటిదీసి తన మెడలో పెట్టుకోవాలని ప్రయత్నిం చుతూ ఉండగా "అద్దము ముందు నిలబడి పెట్టుకోండి" అంటూ ఆమెను అద్దము

ఎదుటకు తీసుకొనివెళ్ళాడు. ఆమె కళ్ళనార్పుతూ అద్దములో చూసుకొని ఆహారాన్ని అమర్చుకుంటూ ఆ యువకుని క్రీగంటితో గమనించింది. పొడుగాటి వేళ్ళతో ముత్యాలహారాన్ని అమె మెడలో సర్దుకోవటాన్ని అతడు అదేపనిగా చూస్తున్నాడు.

ఆమె తన దృష్టిని హారము మీదినుంచి మరల్చకుండా మెడలోనుంచి తీసి "దీని వెల ఎంత ?" అన్నది ఒయ్యారముగా

ఆమె వచ్చినప్పటినుంచీ పెదవులను కదల్పటానికి ఇదే మొదలు. సుమారు గంటకుపైగా పడిన శ్రమకు ఒక్క హారమైనా అమ్మెడు పోతుందన్న ఆశతో ఎంతో ఆప్యాయంగా అతడు దానివెల చెప్పాడు.

అతడికి ఆమె ముఖముమీద కొద్దిగా ఉదాసీన భావము కనబడ్డదో- లేక ఆ సమయానికి ఆ విధంగా తోచిందోగాని చప్పున వెనక్కు తగ్గి "మా నాయనను అడిగి సరైన ధర తెలుసుకొని చెప్తాను ఉండండి." అని వెళ్ళాడు ఆ హాలు దాటి.

పరుపుమీద దిండ్లనానుకొని కూర్చున్న పెద్దసేటు దిగ్గునలేచి కొడుకు కంటే ముందుగా ఆమె దగ్గరికి వెళ్ళి తనగదిలోకివచ్చి కూర్చోమని సవినయముగా కోరాడు. రెండు లెమను గ్లాసులను తెమ్మని నౌకరును పంపి పరుపుమీద కూర్చుని ఆమెవైపు తిరిగి మందహాసము చేశాడు.

"మీరు పసందు చేసే సరుకును మావాళ్ళు ఇంతవరకూ చూపనేలేదు. అప్పటినుంచీ మీరు చూసినది పురాతనపు సరుకు. ఆధునిక తారలందరూ ఈ హారా లను వాడుతున్నారు. సెలక్షను అంటే వాళ్ళదేనండీ ! అందాల పోటికి వెళ్ళిన వారందరూ ఈ హారాలను ఉపయోగించారు. దీన్ని తప్పకుండా మీరు మెచ్చి తీరుతారు." అంటూ ఆమె చేతికి కళ్ళు జిగేలుమనే డబ్బా ఒకటి అందిచ్చాడు.

ఆమె దానిని తెరచి చూసే అంతలో డ్రింక్సు వచ్చాయి. ఒక గ్లాసు ఆమె చేతి కందించి తానొకటి తీసుకొన్నాడు పెద్దసేటు. ఆమె సందేహిస్తూనే అందు కొన్నది.

"మాకు టౌన్లో ఒక థియేటరున్నది. మీకు తీరికయినప్పుడు దయ చేయ్యండి" అంటూ గ్లాసుకింద బెట్టాడు.

''మంచి హిందీ చిత్రము వచ్చినప్పుడు తెలుపండి'' అన్నది చిరునవ్వుతో ఆమె.

ఆకుబీడాల పళ్ళెము ఆమె ముందరపెట్టి ''ఇంతకూ అమ్మగారు ఏ హారము పసందు చేసినట్టు?'' అన్నాడు పెద్దసేటు బంగారు రేకు తొడగిన పళ్ళను పైకి కనబరుస్తూ.

ఆ యువతి తలవంచుకొని చేతిసంచిని ఒక చేతిలోనుంచి మరొక చేతిలోకి మార్చుకుంటూ ''మళ్ళీ ఒకసారి వస్తాను. మంచి హిందీ చిత్రము వచ్చినప్పుడు తెలుపుతానంటిరిగా!'' సన్నటి కంఠ స్వరముతో పాట పాడినట్టుగా అని లేచింది.

పెద్దసేటు దాని కెంతమాత్రమూ నిరుత్సాహ పడలేదు. ''మీరు ఎప్పుడు తీసుకోదలచినా మా దుకాణాన్ని మరువకండి. మాకార్డు మీ దగ్గర ఉంచండి'' అంటూ కార్డు ఒకటి ఆమెకిచ్చి ఆమె బండీ ఎక్కేవరకూ దుకాణము ముందర నిలబడే ఉన్నాడు. ఆమె బండీ కదలగానే లోపలికి వచ్చి తన పరుపుమీద కూర్చుని ''అమ్మయ్య'' అనుకున్నాడు.

అప్పటికే నౌకరులందరూ సందడిగా అటూ ఇటూ తిరుగుతూ గుసగుస లాడు కుంటున్నారు. భయము కొద్దీ ఒకరిద్దరు మూలమూలల కొరిగారు. పెద్ద సేటు కది అర్థముకాక ''ఏమిటది?'' అన్నాడు గట్టిగా.

కొంతసేపటికి వాళ్ళల్లో ఒకడు ముందుకు వచ్చి''ఆ అమ్మగారు ఖరీదుచేసిన ముత్యాల హారానికి బిల్లు వ్రాసింది ఎవరని గుమాస్తా అడుగుతున్నాడ''ని తడి ఆరిపోయిన గొంతుతో అన్నాడు.

పెద్దసేటు ముఖము ఆ మాట వినగానే ముడతలు ముడతలుగా ముకుళించు కొని పోయింది. చిరుచెమట పట్టింది. కళ్ళు పెద్దవిచేసి ''ఏ హారమంటున్నావు? ఆమె కొననిదే బిల్లు వ్రాయుట మెందుకు?'' అని అరిచాడు ఆందోళన కొద్దీ.

''డబ్బాలో హారములేదు. చిన్నసేటు కూడా అప్పటినుంచీ వెతికాడు'' అన్నాడా నౌకరు వణుకుతున్న కంఠముతో - పైకి వినిబడకుండా గొణుగుతూ చేతులను నలుపుకుంటూ ఒగిగి నిలబడ్డాడు.

పెద్దసేటు ఏదో అందామని నోరు తెరచాడు గాని మాట బైటికి పెకలి రాలేదు. ఆవేశము కొద్దీ దుకాణమంతా కలయ దిరిగి ఒక గంట తరువాత తన పరుపుమీద కూర్చుని హుక్కాగొట్ట మందు కొన్నాడు.

వృద్ధుడైన గుమాస్తా మాత్రము "ఆ తెల్లని తెలుపులో ఎంత మాయ ఉన్నదో ఎవరు తెలుసుకోగలరు? కొడుకు చేసే మంచి ముత్యాల బేరములో మోసము జరుగుతుందని తండ్రి మాయ ముత్యాల బేరము చేయబోయాడు-కాని ఎదుటి ముత్యము మరింత మాయదాయె!" అంటూ కలముతో తల గోక్కున్నాడు.



# పై మ ని షి

"నేను రావటానికి ఇంకా రెండేళ్ళవుతుంది. ఈ లోపల ఊరికే కూర్చుని ఏంచేస్తావు. హిందీ నేర్చుకో. ఆ భాష వచ్చి ఉండటము ప్రతివాళ్ళకూ అవసరము. తీరిక సమయములో సంగీతసాధన కూడా చేసుకుంటూ ఉండు. మన దేశపు స్త్రీలలో చాలామంది సంసారములో అడుగు పెట్టగానే తమకు వచ్చిన విద్యకు అవివేకముగా స్వస్తి చెప్పుతారు. మరో రెండేళ్ళకు నిరుత్సాహమూ నీరసమూ ఒంట్లో ప్రవేశించటమూ, ప్రతి విషయములోనూ 'మాకెందుకులే' అన్న వేదాంతములోకి దిగటమూ జరుగుతుంది. తారుణ్యములో ఉన్న స్త్రీలు-అందులోనూ విద్య నేర్చినవాళ్ళు - ఎంత ఉత్సాహముగా-నవనవోన్మేషముగా ఉండాలి? గిరిజా! ఈ దేశస్థులంతా ఎట్లా ఉంటారను కున్నావు? ఇక్కడి అరవై ఏళ్ళస్త్రీ - మన దేశములోని ఇరవై ఏళ్ళస్త్రీ కంటె ఉత్సాహముతో జీవితము గడుపు తుందంటే నమ్ము. అందుకని నేను చెప్పినట్లుగా విను. నీకు ఇదివరలో వచ్చిన విద్యలను విస్మరించకుండా - శ్రద్ధతో పెంపొందించుకో. నీకు సంగీతములో ఉన్న ప్రావీణ్యానికి మెరుగులు దిద్దుకో. మన భారతీయ నాగరికత - సంస్కృతి ఎంత గొప్ప వను కున్నావు! ఇక్కడికి వచ్చినప్పటినుండీ ఆ గొప్పతనము పదింతలుగా నాకు అనుక్షణమూ తోస్తున్నది. 'తెల్లవాళ్ళ దేశములో ఉన్న మీ ఆయన మడికట్టుకొని కూర్చున్నాడను కొన్నావా?' అని మనవాళ్ళందరూ అనే మాటలను నమి, నాకు జాబు వ్రాయకుండా ఊరుకునేవు! కనీసము వారానికి ఒక్కసారైనా జాబు వ్రాస్తూ ఉండు. మ॥ నాయనగారికి రెండు కళ్ళూ ఆపరేషను చేయవలసిన వచ్చినదా? ల॥ అమ్మగారికి నా నమస్కారములు."

ఈ ఉత్తరము చంద్రమౌళి అమెరికానుండి చెన్నరాజధానిలో ఉన్న గిరిజకు వ్రాశాడు. అప్పటికి అతడు అమెరికా వెళ్ళి ఎనిమిది నెలలు కావచ్చినవి. ఏకపుత్ర వియోగభారములో మునిగిపోయిన అత్తమామలకు ధైర్యము చెప్పుతూ వాళ్ళను కనిపెట్టుకొని ఉంటున్నది గిరిజ. వృద్ధులైన అత్తమామల దగ్గర ఆ కోడలు మేనకోడలివలె చనవుగా తిరుగుతూ ఉండేది.

చంద్రమౌళి వెళ్ళిన ఆరు నెలలకు అతని తండ్రి అయిన లక్ష్మయ్యగారికి రెండు కళ్లూ ఆపరేషను చేయవలసి వచ్చినది. ఆపరేషను చక్కగా జరిగినప్పటికీ చూపుమాత్రము యథాప్రకారముగా రాలేదు. అందువలన మామగారికి ఎప్పుడూ ఏదో ఒకటి చదివి వినిపిస్తూ వార్తలను తెలుపుతూ ఉండేది.

"మీరు వ్రాసినట్లుగా సంగీత సాధన చేసుకొంటూ - హిందీ నేర్చుకొంటూ ఉన్నాను. గాని నా ఆరోగ్యము వెనుకటివలె చురుకుగా లేదు. ఎప్పటివలె చాలా సేపు కూర్చుని ఏపనీ చేయలేకుండా ఉన్నాను. మ॥ మీ నాయనగారూ, ల॥ అమ్మ గారూ క్షేమముగా ఉన్నారు."

ఇది గిరిజ దగ్గరినుండి చంద్రమౌళికి వచ్చిన జాబులోని కొంత భాగము. ఈ జాబు వచ్చికూడా నెల పైగా అయినది. చంద్రమౌళి వ్రాసిన రెండు జాబు లకూ జవాబు రాలేదు. ఒక కేబుల్ కూడా యిచ్చాడు. అతడికి తనవాళ్ళ దగ్గర నుండి జాబు రాకపోవటమువల్ల చిరాకుగా ఉంటున్నది. పగలంతా కాలేజీలో ప్రొద్దు గడచిపోయేది. కాని యింటికి రాగానే తిరిగి అదేధ్యాస.........వృద్ధులైన తలిదండ్రులు ఎట్లా ఉన్నారో............గిరిజ ఏమి చేస్తున్నదో ?"

ఆ దినము సాయంత్రము ఏమీ తోచక సినిమాకు వెళ్ళాడు. ఇంటికిరాగానే అతడికి మనసులోని బాధ కెలకపేసింది. గిరిజ దగ్గరనుండి ఎప్పుడు ఉత్తరము వచ్చినా కిటికీదగ్గర తాను వచ్చేవరకూ క్రిందబడి దుమ్ములో కొట్టుకొని పోవటము చూచి భరించిలేక - అతడీమధ్య కిటికీకి దగ్గరగా ఒక చిన్నబల్ల వేసి దానిమీద మెత్తటి దిండును ఉంచుతూ వచ్చాడు. గిరిజ స్వహస్తములతో లిఖించిన ఉత్త రము కిటికీలోనుండి మెత్తటి దిండుమీద పడుతుంది. మనిషి తరువాత అప్యాయ ముగా చూసుకోవలసినవి ఆ మనిషి వస్తువులూ, ఉత్తరాలూను. అందుకొరకు అతడు గిరిజ దగ్గరనుండి వచ్చిన ఉత్తరాన్ని కళ్ళకు అద్దుకొనిగాని విప్పిచూడడు! అతడు లోపలికి వచ్చి దీపముపెట్టి కిటికీ మూలకు వెళ్ళి ఆ మెత్తటి దిండుపై తన దృష్టిని పోనిచ్చాడు. దానిపైన రెండుబల్లులు సన్నటి పురుగులను వేటాడు తున్నాయి. కాని జాబులేదు.

అతడు నిరాశతో ప్రక్కమీదికి వాలిపోయాడు. 'గిరిజకు జాబు వ్రాయ లేనంతటి అనారోగ్యమేదో కలిగి ఉండాలి....లేకపోతే....ఇన్నిదినాలు తనకు జాబు

వ్రాయకుండా ఉండగలదా? జాబు వ్రాయటానికి తన తండ్రికి పాపము దృష్టి మాంద్యమూ.........తల్లికి అక్షరజ్ఞానశూన్యతాను. ఆ యింటి సంగతులు తెలుప గలిగిన దొక్క గిరిజే.'' ఆవిధముగా అతడు ఆలోచింపుతూ ఉండగానే ఎప్పుడు వశపరచు కొన్నదో నిద్రాదేవి అతడి కళ్లు మూతపడ్డాయి.

మరునాటి ఉదయము కాలేజీకి వెళ్ళే సమయములో అతడికి తిరిగి ఇంటి విషయము జ్ఞాపకము వచ్చి ఆ దినముకూడా జాబు రానిపక్షములో తన స్నేహి తుల కెవరికైనా జాబువ్రాసి తనవారి క్షేమము తెలిసికోవాలనే నిర్ణయానికి వచ్చాడు. తన స్నేహితులలో సహృదయుడైన రామలింగము మదరాసులో ఉన్నాడు. వ్రాస్తే అతడికే వ్రాయాలి. అతడు తమ గ్రామమువెళ్ళి క్షేమము తెలిసికొని వ్రాయ గలడు. అది ఎంతలేదన్నా వారము దినముల పని.

ఆ మధ్యాహ్నము చంద్రమౌళి గది కిటికీకి దగ్గరగా తపాలామనిషి నడ చిన శబ్దము ప్రక్కయింటివారికి వినవచ్చింది. కొన్ని వేల మైళ్ళ దూరమునుంచి పయనము చేసి - అలసి సొలసి వచ్చిన నీలిరంగు కవరు కిటికీలోనుండి పడుతూ ఉండగానే మఖమల్ దిండు ఆ లేఖకు స్వాగతమిచ్చి - మెత్తటి శయ్యగా అమరి- సేదతీర్చి - చంద్రమౌళి రాగానే కిలకిల నవ్వుతూ వేయిదీపాల వెలుగుతో అత డికి అందించింది.

అతడు పట్టరాని ఆనందముతో తబ్బిబ్బయినాడు ఎప్పటివలెనే కళ్ళకు అద్దుకొని కవరు చింపాడు.

''మ॥ మీ నాయనగారూ, ల॥ అమ్మగారూ క్షేమముగా ఉన్నారు. మిమ్మల్ని చూడవలెనని చాలా ఆతురతతో ఉన్నారు. ఇక్కడి విషయాలన్నీ యథాప్రకారము గానే ఉన్నాయి. అన్నట్లు వ్రాయ మరచాను; రెండు నెలల క్రిందట మీ నాయన గారి వైపు చుట్టము వచ్చాడు. ఒక నెలరోజులవరకూ బెట్టుబెట్టుగా ఉన్నాడు గాని తరువాత నుండి ఒకటే గొడవచేస్తున్నాడు ఇంట్లోచేరి. అందుకొరకే వెనుకటివలె సంగీతసాధనకూ దానికీ - తగినంత విరామము చిక్కటములేదు. వెంటవెంట మీకు జాబులను కూడా వ్రాయలేక పోతున్నాను. మీరే తరచు వ్రాస్తూ ఉండండి.'

చంద్రమౌళి ఉత్తరము చదువుకొని ఆ దిండుమీదనే విసరి పడవేశాడు.

'ఇంతకూ అమ్మగారికీ నాయనగారికేనా తనను చూడవలెనన్న ఆత్రము? మరెవరికీ........లేదన్న మాట!'

మనసు చివుక్కుమన్నది. అయినా దానికి తగినట్లుగానే ఆ మరునాడు గిరిజ ఉత్తరానికి అతడు జవాబు వ్రాశాడు. అంతే........మరి రెండు నెలల వరకూ ఒక ఉత్తరమైనా అటునుండి యిటురాలేదు - ఒక్కటైనా ఇటునుండి అటుపోలేదు.

అతడి మనసు వేయి ఆలోచనలతో వికలమయి పోయింది. తరువాత అతడు ఏదో పరీక్షల తొందరలో ఉండగా- ఉన్నట్లుండి, గిరిజ దగ్గరనుండి ఒక జాబు వచ్చింది.

''మీదగ్గరనుండి ఉత్తరము రావటము లేదనీ మీ క్షేమము తెలియుటము లేదనీ మీ తల్లిదండ్రులు చాలా దిగులుపెట్టుకొన్నారు. మీకేమయినా మస్తీ చేయలేదు కదా! మన ఉప్పూ కారమూ తిని ఎన్నిరోజులయిందో? మీకిష్టమైన వంటకాలు చేసిన రోజున మీ అమ్మగారికి మీ స్మరణే. నాలుగు రోజుల వరకూ అదేమాట మాట్లాడుతూ ఉంటారు? పై మనిషి ఒక్కడే అయినా ఎంత చాకిరీ వాపోలపడిన దనుకున్నారు? అస్తమానమూ ఒక మనిషికి సరిపోతుంది ఆ పని. అందువల్లనే నాకు రాత్రిళ్లు నిద్రకూడా కరవై పోయింది. భోజనము మీదినుంచి - నిద్రలో నుంచి - లేపినప్పుడు అపరిమితమైన కోపము వస్తుంది నాకు. అయినా ఆ మనిషి ముఖంలో ఏమున్నదో........అంత కోపమూ కసీ ఒక్కసారి మాయమైపోతాయి. అదేమిటో మాయగానే ఉన్నది సుమా! ఆ చేతులూ ఆ ముఖమూ ఎంతసేపు చూసినా చూడాలనే అనిపిస్తుంది.''

ఇది చదివిన తరువాత అతడికి ముచ్చెమటలు పోశాయి. ఇటువంటి ఉత్తరము రాకపోయినా బాగుండేది. ప్రపంచము నిన్న ఉన్నట్లుగా యీ దినముకూడా ఉండాలన్న సిద్ధాంతాన్ని ఏ చదువుకున్న బుద్ధిమంతుడూ అంగీకరించడు గాని.... కొన్ని విషయాలలోనైనా నిన్నటి పోలికలు ఉండాలా మరి! నాయనగారివైపు చుట్టమట........పై మనిషట........తమయింటికి వచ్చి అన్ని నెలలపాటు తిష్ఠ వేసుకొని కూర్చుండగా తన తండ్రి ఎట్లా ఓర్చుకొని ఉండగలిగాడు? ఏదో తమకు యింత సహాయముగా ఉండగలడని తండ్రి అనుమతించాడేమో. ఈ పై మనిషి చాకిరీవల్ల గిరిజకు రాత్రిళ్లు నిద్రకూడా కరవైపోవట మేమిటి! ఎంత చుట్టమైనా

ఈమె తెల్లవార్లూ ఏమి ఉపచారము చేస్తున్నది ? ఇటువంటి కుటుంబ ద్రోహికేనా తండ్రి తెలుసుకోలేక ఆశ్రయమిచ్చింది ? ఇదిగాక అతడి క్రోధాన్ని ఇనుమడింప చేసిన మాట మరొకటి........ 'తన తల్లి తనకు యిష్టమైన వంటకాలను చేసిన నాలుగు రోజుల వరకూ కొడుకునే జ్ఞాపకము చేసుకొంటూ ఉన్నదట! ఇది సహజమైన మాటేగా! ఒక్క తల్లికయినా తనమీద మమకారము ఇప్పటివరకూ నిలచి ఉండటము గొప్ప అదృష్టమనే చెప్పుకోవాలి!'

ఈ ఉత్తరము వచ్చిన దగ్గరనుంచీ అతడిని పరధ్యానము ఆవహించింది. భోజనము చేసినా ఆకలి తీరినట్లు లేదు – నిద్రపోయినా దేహము విశ్రాంతి నెరుగనట్లే ఉన్నది. సినిమాలు చూసినప్పటికీ - నలుగురితో సంభాషించి నప్పటికీ అతడి మనసు వికాసము పొందలేదు. అది యేమి వ్యాధో గాని....అతడికి దేహములోని బలమూ - నరములలోని పటుత్వమూ క్షీణింప సాగింది.

*    *    *    *    *

ఆ దినము రాత్రి చాల ప్రొద్దుపోయేవరకూ చంద్రమౌళి సహాధ్యాయులతో తిరిగి తిరిగి యింటికి చేరుకున్నాడు. వేడి పానీయము త్రాగి పక్కమీద వాలబోతూ మరునాటికి ఏమైనా ముఖ్య విషయాలు డైరీలో వ్రాసి ఉన్నవేమోనని బల్లమీది డైరీ తెరచాడు

మరునాడు మహాశివరాత్రి-ఆ దినమే అతడి పుట్టిన దినము!

ఇరవై ఆరు సంవత్సరాల క్రిందట అతడి అమ్మమ్మ శివరాత్రినాడు ఉపవాసము ఉండి – మహేశ్వరారాధనకొరకు శివాలయములోకి వెళ్ళి - రుద్రాభిషేకము చేయించి ఇంటికి వచ్చేసరికి పుట్టాడని 'చంద్రమౌళి' అని పేరు పెట్టింది. మాతామహుల యింట తల్లీ – పితామహుల యింట తండ్రీ తప్ప మరొకసంతు లేక పోవటమువల్ల రెండు కుటుంబాలకూ చంద్రమౌళి మాట శిరోధార్యముగానే ఉండేది చేతులకు మురుగులు నడుముకు గజ్జెలు మెడలో పచ్చల పులిగోరు పెట్టుకొని - దిగంబరుడై - బాలకృష్ణుని చేష్టలను మరపించే బాల్యక్రీడలతో రెండు కుటుంబాలలోని ముసలివాళ్ళనూ పరుపులెత్తిస్తూ ఉండేవాడు. పన్నెండు పదమూడు సంవత్సరాలు వచ్చేవరకూ వాళ్ళే కలిపి అన్నము చంద్రమౌళి నోటికి అందిస్తూ ఉండేవారు. ఆ రెండు కుటుంబాలకూ దేవుళ్ళతోపాటు చంద్రమౌళి కూడా ఆరా

ధించవలసిన వాడైనాడు. అటు అమ్మమ్మకు ఇటు నాయనమ్మకు చంద్రమౌళి ఒక్క నాడు కనబడక పోతే తెల్లవారటము కష్టముగా ఉండేది.

తాతలిద్దరూ పోయిన తరువాత ఆ ముసలమ్మలిద్దరూ చంద్రమౌళి కోసము ఆ స్తిని రొక్కము క్రింద మార్చుకొని - నగకట్టును చేతపట్టుకొని చంద్రమౌళి తండ్రి దగ్గరనే ఉండి పోయారు.

ఇంతమందికి గారాబుపట్టి కనుక ఇరవై ఏళ్ళయినా రాకముందే దేశమంతా గాలించారు - చంద్రమౌళికి తగిన వధువు కొరకు. ఎక్కడ పిల్ల ఉన్నదని తెలిసినా ముసలమ్మలిద్దరూ ముందుగా వెళ్ళి చూసి వచ్చేవారు. చాలా సంబంధాలు చంద్రమౌళి వరకూ వచ్చేవేకావు. తిరిగి తిరిగి - వాళ్లే పసందుచేసి తెచ్చారు ఒక సంబంధాన్ని. ఆ వధువే గిరిజ. కొండలలో అవతరించి మహేశ్వరునికై ఇటు నటు తిరుగాడు హిమపుత్రికలా వాళ్ళదృష్టికి గిరిజ కనబడ్డది. ఆ బాలికను చూసి వచ్చిన వృద్ధులు అనేకముగా వర్ణించి-చంద్రమౌళిచేత మెప్పించి-తాళి కట్టించారు. ఆనాడు వాళ్ళిద్దరూ తమ నగలమూట విప్పి వంతులు వేసుకొని గిరిజను అలంకరించారు.

* * * * *

గిరిజ సంభాషణలో చమత్కారమూ వ్యంగ్యమూ పొదిగించి మాట్లాడేది. ఆమె మాటలలోని భావము మరునాటికిగాని చంద్రమౌళికి అర్థమయ్యేదికాదు. ముసలమ్మలు అవ్యక్తానందంలో ఈదులాడేవారు.

ఒకరోజు సాయంత్రము చంద్రమౌళి కచేరినుండి వచ్చి ముసలమ్మల గదిలోకి వెళ్ళి ఆనాడు తనకు కచేరిలో వేసిన పూలహారము చూపించి 'వాసన బాగున్నదా?' అంటూ బల్లమీద పెట్టాడు.

'మంచి దొంతర మల్లెల హారము వేశారు. అయితే మనము ఇక్కడ నుంచి బయలుదేరట మెప్పుడూ' అన్నది అమ్మమ్మ.

'వారము రోజులలో బయలుదేరాలి. ఈలోపల సామానులన్నీ సర్ది ఉంచండి'- అని అతడు వెనుకకు తిరుగుతూ ఉండగా హంసనడకలతో గిరిజ ఆ

గదిలోకి వచ్చింది. పూలహారాన్ని ఒకసారి వాసన చూసి ఆమె చేతిలో పెట్టాడు చంద్రమౌళి.

దాని నందుకుంటూ 'నేనొకమాట అంటాను. మీకు కోపము రాదుకదా! మీ స్నేహితుడు మీకెంత ఆప్తుడై తే మాత్రము నా మంచముమీద పడుకునేటంత చనవూ అలుసూ యివ్వటము మీకు భావ్యమేనా?' నదురూ బెదురూ లేకుండా అడిగింది గిరిజ.

ముసలమ్మలిద్దరూ నిర్విణ్ణులయి పోయారు! చంద్రమౌళి ఆలోచనలో పడ్డాడు. ఎవరూ ఆ స్నేహితుడు? తన స్నేహితులెవరూ తన యింటిలోపటికి-పడకగది వరకూ వచ్చేవాళ్ళులేరే! అతడికి ఉన్నదే ఒక్క స్నేహితుడు రామలింగము.... అతడే ఎప్పుడైనా వస్తుంటాడు. గాని లోపలికి ఎన్నడూరాడే! "నీ గదిలో అడుగు పెట్టగలిగిన వాడెవడబ్బా" అంటూ ముఖము చిట్లించాడు చంద్రమౌళి.

"నా మాట నిజమో అబద్ధమో వచ్చి చూడండి" అని తన గగి వైపుకు చంద్రమౌళిని తీసుకొని వెళ్ళింది.

గిరిజ గది మేడమీద కుడివైపుగా ఉన్నది. ముసలమ్మ లిద్దరూ నోరు తెరకుకొని మెట్లదగ్గరే నిలువబడి పోయారు.

చంద్రమౌళి గిరిజతో మెట్లుఎక్కి- గది తలుపులు తోసుకుంటూ లోపలికి వెళ్ళుతున్నాడు. తనకు ఇంతద్రోహము తలపెట్టినవాడిని- ఏదయినా చేసి కసితీర్చుకోవాలని పళ్ళు కొరుకుతూ లోపలికి వెళ్ళాడు. గిరిజ మాట్లాడకుండా గదిముందర నిలిచిపోయింది.

మంచము దగ్గరకి పళ్ళు కొరుకుతూ వెళ్ళిన చంద్రమౌళి పెద్దపెట్టున నవ్వుతూ "వీడేనా.... నీ మంచముమీద పడుకున్న నా ఆప్తమిత్రుడు? హీరో! నిన్ను చూస్తే గిరిజకంత అసహ్యమెందుకు?" అంటూ ఎత్తుకొని దాని శరీరమంతా చేతితో నిమురుతూ గిరిజ దగ్గరికి తీసుకొనివచ్చి 'ఎంతమంచిదో చూడు. యీ హీరో!' అన్నాడు. ఆమె మాట్లాడకపోవడము గమనించి 'దీనిని చూడకపోతే నా ప్రాణము నిలుస్తుందా?' అంటూ హీరోను ఎత్తుకొని కిందికి తీసుకొని వచ్చి ముసలమ్మలకు చూపించాడు.

గిరిజ మంచము మీద చనువుగా శయనించిన చంద్రమౌళి ఆప్తునిచూసి ముసలమ్మ లిద్దరూ ముక్కుమీద వేలు వేసుకొన్నారు.

అది చంద్రమౌళికి ప్రాణప్రదమైన మేలుజాతి కుక్క. పై ఆఫీసరు గారి జాతికుక్క, పిల్లలను పెట్టినదని ఏడాదికిందట- తెచ్చి-ఎంతో మక్కువతో దానిని సాకుతున్నాడు. దానిపేరు హీరో. అతడు తప్ప ఆయింట మరెవరూ దానినితాకరు. కుక్కపిల్ల అంటే ముసలిమ్మ లిద్దరికి అచారమూ-గిరిజకు అసహ్యమూను.

"ఇంకా ఎన్నాళ్లు ఈ కుక్క సిల్లతో ఆడుకుంటారు?" అనేవాళ్లు ఆ వృద్ధులు. 'చంద్రమౌళి తండ్రి ఎప్పుడవుతాడా' అని నిరీక్షించి నిరీక్షించి దైవ సాయుజ్యము పొందారు ముసలమ్మలు.

వాళ్ళ ఒడిలో తాను పెరగటమూ-తనను వాళ్ళు ప్రాణాధిక్యముగా చూచుకోనటమూ జ్ఞాపకము వచ్చింది చంద్రమౌళికి. బాల్యజీవితమెంత ఆనందకరమైనది? తలక్రిందులుగా తపముచేసినా నిన్నటిరోజు తిరిగి రాదుకదా! ఈ జగన్నాటక రంగములో నిష్క్రమించిన పాత్ర తిరిగి ప్రవేశించరుకదా! ఆ ముసలమ్మ లిద్దరిలో అమ్మమ్మను చూస్తే అతడికి మరీ ప్రాణము. ఆమె నిరుడే-చంద్రమౌళి ఒడిలో శివసాయుజ్యము నొందింది.

తన పుట్టినరోజున వాళ్ళిద్దరూ ఎంత హడావడి చేసేవారు! తన తలిదండ్రుల ప్రేమ-వాళ్ళ ఆపేక్ష చాటునబడి అణగిపోయేది. ఇంతకాలమూ వాళ్ళచేత ఎంతో ఆడంబరముగాను- వైభవముగాను జరుపబడిన అతడి జన్మదినము ఈసారి ఎవరి గమనికా లేకుండా జరిగిపోతున్నది. అతడు భోగజగత్తులో విహరించి పట్టిలకొట్టి నిద్రలో మునిగిపోయాడు.

* * * *

విమానముమీద చంద్రమౌళి అమెరికానుండి బొంబాయి చేరి వారమురోజు లక్కడే గడిపాడు. తరువాత మదరాసుచేరి తన స్నేహితుడిని కలుసుకొన్నాడు.

ఉదయము లేచిన దగ్గరనుండీ మదరాసు బజారులన్నీ తిరిగితిరిగి- రాత్రి రెండవఆట సినిమాచూసి పడుకోటానికి మాత్రము ఇంటికి వస్తున్న చంద్రమౌళిని పది దినములు గమనించిన స్నేహితుడు, "డ్యూటీలో చేరటానికి ఇంకా పైము

ఉన్నవా ఏమిరా ?” అన్నాడు. ఆపడి దినములలో ఆతని దినచర్యచూస్తే స్నేహితుడికి ఆశ్చర్యము వేసింది. తనకొడకు కలవరించిపోతున్న తలిదండ్రులను చూడాలని చంద్రమౌళి తహతహ లాడడు. తనకొరకు ఎదురు తెన్నులు చూస్తూ నిరీక్షిస్తున్న భార్యను స్మరించడు. విదేశీవాసనలు బాగా తలకెక్కినవేమో తాను గమనించ కుండా ఉంటేనే బాగుంటుం దనుకున్నాడు స్నేహితుడు.

*     *     *     *     *

నిండుపున్నమినాటి పండువెన్నెలలో లక్ష్మయ్యగారూ ఆయన భార్య, గిరిజ రాత్రి చాలా పొద్దుపోయేవరకూ ఆరుబైట కూర్చుని మాట్లాడుతున్నారు.

‘రెండునెలల క్రిందటే అబ్బాయి అక్కడినుంచి బయలుదేరుతాడని ఎవరో అన్నారు కాదుటే?’ అన్నారు లక్ష్మయ్యగారు.

‘వాడి దగ్గరనుంచి ఉత్తరమ్ముక్కకూడా బరువైపోయింది’ అన్నది తల్లి గద్గదస్వరముతో.

గిరిజ కండ్లనుండి కన్నీరు కాలువలై ప్రవహించింది. ‘అందుకేనమ్మా, మేము వాడి మాటయినా ఎత్తకుండా అంతా కడుపులోనే పెట్టుకుంటున్నాము.’ అని అత్తగారు గిరిజను చేరదీసుకొన్నది.

అంతలో వాకిటితలుపు చప్పుడుఅయింది. చెదరిన వెంట్రుకలతో తూలి పోతూ లోపలికి వస్తున్న వ్యక్తినిచూపి అదిరిపడి లేచారు.

‘ఇంతరాత్రివేళ రైలెక్కడిదిరా చంద్రమౌళీ?’ అన్నాడు తండ్రి.

“నేను ఉదయమే వచ్చాను” అని పంచంమీద కూర్చున్నాడు చంద్ర మౌళి.

“మీ ఆరోగ్యము ఎట్లా ఉన్నాది? మిమ్మల్ని చూద్దామని వచ్చాను. రేపు ఉదయపు రైలులో వెళ్ళిపోవాలి”.

“అదేమిటి? రావడమెప్పుడు-వెళ్ళటమెప్పుడు? మరి ఉదయము వచ్చినవా వాడవు యింటికిరాక ఏంచేస్తున్నావు? కాళ్ళు కడుక్కో. భోజనము చేద్దువుగాని!” తల్లి లేచి వంటయింట్లోకి దారితీసింది.

"వద్దమ్మా వద్దు. నా భోజనమయి చాలా సేపయినది. గ్లాసెడు మంచినీళ్లు ఇస్తే చాలు" అంటూ కోటు విడిచి చేతిమీద వేసుకున్నాడు.

అడిగిన ప్రశ్నలకు కురచ జవాబు లివ్వటమువల్ల "నాయనా! నిద్రవస్తున్నది కాబోలు. తెల్లవారిన తరువాత మాట్లాడుదాము" అని లక్ష్మయ్యగారు లేచారు.

చంద్రమౌళి ఇంట్లో కాలుపెట్టిన దగ్గరనుండీ అతడి వైపు ఉరిచూచి నిర్విణ్ణురాలై గోడకు బల్లివలె అంటుకొని పోయినది గిరిజ.

ముందుగా తల్లిలేచి హాలులో దీపముపెట్టి గది తలుపులు తెరుస్తూ ఉండగా చంద్రమౌళి ఆమె వెనుకనేవెళ్ళి 'నాకు నిద్రరావటము లేదమ్మా! ఆరు బైటఉన్న మంచముమీద కూర్చుంటాను' అంటూ యిల్లు నాలుగు మూలలా దృష్టిని పోనిచ్చాడు. 'ఆ యిల్లు తన యిల్లే.... కాని పరాయిదై పోయినది!' అనుకొని ముక్కు ముడుచుకొనిపోగా తల్లివెంట నడిచాడు. తల్లి గదిలోకి వెళ్ళి దీపము పెద్దదిచేసి 'వీడిన చూశావురా నాయనా!' అంటూ వుండగా లక్ష్మయ్యగారు కూడా ఆ గదిలోకి వచ్చారు.

ఒక మనిషికి బాల్యములోనూ - యౌవనములోనూ వార్ధక్యములోనూ తీసిన ఛాయాచిత్రములా ఉన్న ఆ ముగ్గురి ముఖాలనూ తల్లి ఆనందముతో పరికించింది.

బాలుడి ముఖము తండ్రి ముఖము తేరిపారచూసిన చంద్రమౌళి "వీడుకే నీవు అంతగా వర్ణించి వ్రాసిన పైమనిషి?" అంటూ చేతిమీది కోటు తలుపుమీద వేసి, వంచిన గిరిజతలను రెండుచేతులతో పైకెత్తాడు చంద్రమౌళి.



# కత్తిమీది సాము

సూర్యోదయాత్పూర్వమే కాఫీత్రాగి పడకకుర్చీలో మేనువాల్చిన కాంతారావు తలుపుతోసుకొని వచ్చిన మేనకోడలిని చూసి ఆశ్చర్యపడ్డాడు.

“అదేమిటే మీనా. తలయినా దువ్వుకోకుండా ప్రొద్దున్నే ఇట్లావచ్చావేం? శ్రీనివాసులు స్కూలుకు వెళ్లాడా!” అంటూ కాంతారావులేచి కూర్చుని షర్టు చేతులను పైకి తోసుకుంటూ - కూర్చోమని మీనాక్షికి ఒక కుర్చీని చూపించాడు.

ఎత్తుకున్న పిల్లను కిటికీలో కూర్చుండబెట్టి- పైటకొంగు చేతివేలికి చుట్టుకుంటూ “ఏమి తలదువ్వుకొనటమో- ఏమి కాపురము చెయ్యటమో మామయ్యా! నిన్నటినుంచీ ఆయన నోటికి వచ్చినట్లు తిట్టుతున్నారు. మధ్య నాకు చావు వచ్చింది-” అంటూ కూర్చోకుండానే వెక్కి-వెక్కి- ఏడవటము మొదలుపెట్టింది మీనాక్షి. తల్లి ముఖముచూసి పిల్లకూడా ఏడుపు సాగించింది.

మీనాక్షి ఏడుపు కాంతారావుకు అర్థము కాలేదు. ఆమెకు అంతదుఃఖము కలిగించే ప్రమాదమేదో జరిగి ఉంటుందని ఊహించాడు. ఈ పద్దెనిమిదిఏండ్ల మీనాక్షి అతడి అక్కకూతురు. సంసారపక్షముగా అవతల బజారులో కాపురము చేస్తున్నది. అక్కగారి ఆదేశానుసారముగా కాంతారావు అప్పుడప్పుడువెళ్లి మీనాక్షి కష్టసుఖాలను కనుక్కుంటూ అండగా ఉంటున్నాడు. శ్రీనివాసరావు స్కూలు టీచరు. బుద్ధిమంతుడు భార్యను ఆదరముగానే చూసుకుంటున్నాడు......... మరి.... మీనాక్షి ఈ విధముగా దుఃఖించటము దేనికి? కాంతారావు కేమీతోచక వంటయింట్లో ఉన్న భార్యను పిలచి మీనాక్షి ఏడుపుకు కారణమేమిటో తెలిసికొమ్మన్నాడు.

కాంతారావు భార్య లలిత మీనాక్షిని లోపలికి తీసుకొనివెళ్లి ఓదార్చి సంగతేమిటని అడిగింది. మీనాక్షి ఎంతసేపటికీ కారణము చెప్పలేకపోయింది. ఆమాట తలచుకుంటేనే మీనాక్షికి దుఃఖము పైకి ఉబికి ఉబికి రానారంభించింది. లలిత

మీనాక్షిని బుజ్జగించి-చేతిలో చెయ్యివేసి రహస్యముగా ఉంచుతానని ప్రమాణము చేసింది. అప్పటికి మీనాక్షి మేనమామయింటికి వచ్చి ఒకగంటసేపయినది. మీనాక్షి కళ్లుతుడుచుకొని గొంతుసవరించుకొని ప్రారంభించింది.

"మామయ్య వ్రాసిన కథ వచ్చినదని ఆ మాసపత్రిక నిన్న సాయంత్రము స్కూలునుంచి వస్తూ కొనుక్కొని వచ్చారుట. అది చదివారు కాబోలు-అప్పటి నుంచీ నామీద నిప్పులు కురిపించటము మొదలుపెట్టారు. నాకు ఆ పత్రికసంగతి-మామయ్య కథసంగతి ఏమాత్రము తెలియదు. సంగతేమిటో చెప్పకుండా తిట్ట టము మొదలుపెట్టారు. చివరకు చదువుకోమని ఆ పత్రికను నామీద విసిరి పడ వేశారు. మామయ్య వ్రాసిన కథను చదివి చూద్దునుగదా ఇట్లా ఉన్నది. 'నా మేన కోడలు నాఅంత పొడగరి' కాని దానికి పొట్టివాడు దొరికాడు. దానిని చూస్తేనే నాకు జాలివేస్తుంది. అనుకొంటూ కథా నాయకుడు మేనకోడలిని దగ్గరికి తీసుకుం టాడు. లోకము కోసమైనా అత్తవారింటికి వెళ్లాలికదా మామయ్యా!' అంటూ ఆ అమ్మాయి అత్తవారింటికి వెళ్లతుందట. అదిచూసి ఆయన ఎన్ని మాటలన్నా రను కున్నావు? నేనింకా మొండిదానను కనుక ఇంతదూరము వచ్చాను. మరొకరయి నట్లయితే ఏ భావిలోనో దూకేవారు." మీనాక్షి లలిత చేతులను పట్టుకొని ఏడ్చింది.

మీనాక్షిని నెమ్మదిగా వంటయింట్లోనుంచి ఇవతలికి తీసుకొనివచ్చి - "మీరు కథలు వ్రాయటము కాదుగాని మీనాక్షి కాపురానికే మోసము వచ్చింది. మీ కథలకు లోకము చాలా విలువ యిస్తున్నట్లున్నది?" అంటూ లలిత కాంతారావుతో మీనాక్షి విషయము వివరముగా చెప్పింది.

కాంతారావు హృదయము ఆనందముతో గంతులు వేయసాగినది. అతడికి పక్కున నవ్వువచ్చింది.

"పిచ్చిపిల్లా! ఇందుకేనా నీ వంత దుఃఖపడటము? నేను వ్రాసిన కథను ఆధారముగా తీసుకొని నిన్ను బాధిస్తున్నాడా శ్రీనివాసరావు! మీ ఆయన ఛాంద సుడిలా ఉన్నాడేమే! నేను అతడిని పిలిచి చివాట్లు పెడుతానులే. నీవు ఈ పూటకు ఇక్కడే ఉండి భోజనముచెయ్యి. సాయంత్రము శ్రీనివాసరావును ఇక్కడికి పిలి పిస్తాను" అంటూ మీనాక్షి చేతిలో ఉన్న పిల్లను ఎత్తుకున్నాడు కాంతారావు.

ఆ మాటకు మీనాక్షి కళ్ళు తుడుచుకుంటూ "వద్దు మామయ్యా వద్దు! ఆయన సంగతి నీకు ఇంకా బాగా తెలియదు. అన్నదే చాలని మామయ్య ఇంట్లోనే

ఉన్నావా ? అంటారు. నీ మేనకోడలి నయినందుకు నాకు జరుగవలసిన పరాభవము జరిగింది. ఈ సంగతి నీ చెవిన వేసిపోదామని వచ్చాను" అన్నది తలవంచుకొని.

అంతలో కాంతారావు మరదలు లాల్‌దర్వాజా దగ్గరనుండి వచ్చి "బావ ఉన్నారా ?" అంటూ లోపలికి వచ్చింది. కుశల ప్రశ్నలయినా కాకముందే "బావా ! నీకిది న్యాయమేనా ? మా సంసారము కూలిపోయేటట్టుగా కథ వ్రాశావేం బావా ! "మా తోడి అల్లుడి కంటె మా మరదలికి నేనే తగిన వాడినని దాని అభిప్రాయము. నాకూ అట్లాగే తోస్తుంది. పెద్దలు చేసిన పెళ్ళిళ్ళు నిజమైన పెళ్ళిళ్ళా ?" అని వ్రాశా వటగా ! అయిన కథలు చదవని మనిషయినా వాళ్ళూ వీళ్ళూ అంటుంటే రోషము రాదాబావా ! అందరూ నన్ను అనుమానముతో చూస్తున్నారు. నన్ను ఇట్లా అన్యా యము చేశావేమిటిబావా !" అంటూ భోరున ఏడ్చింది.

నిజముగా కాంతారావు ఆనాటి ఉదయము నిద్రలేచిన వేళ మంచిదయి ఉండదు. లేకపోతే కళకళలాడే చంద్రబింబమువంటి లలిత ముఖము చూస్తూ నిద్ర లేచిన వాడికి ఈ పిడిగుపాటు లేమిటి ?

మరదలికి ఏమి జవాబు చెప్పవలెనో ఆలోచిస్తున్న కాంతారావు - నాలుగు ఇళ్ళ అవతల, చిన్న పెంకుటింట్లో ఉంటున్న పార్వతమ్మను చూడగానే గతుక్కు మన్నాడు. ఆమెనుంచి కూడా తనకేవో దీవనలున్నాయని అనుమానించాడు మరు క్షణములోనే అతడు ఊహించినంతపనీ జరిగిపోయింది.

"నీ కేమి పొయ్యేకాలము వచ్చిందయ్యా ! నా మనుమరాలిని నీ కథలోకి ఎక్కించావటగా ! అన్నమూ నీళ్ళూ లేకుండా రాత్రినుంచీ ఏడుస్తున్నది. పెళ్ళి కావలసిన పిల్లను గురించి అట్లాగేనా వ్రాయవలసింది ? నీ సంగతి చాలాబాగున్నది వాయనా ?" అని కాంతారావు కెదురుగా నిలువబడి చేతి గాజులను వెనుకకు తీసు కున్నది. ఆమె వెనుక కాటుకకళ్ళను నలుపుకుంటూ ఆమె మనుమరాలు మనో రంజని నిలువబడ్డది. "చూడు నీమీద ఎటువంటి కేసువచ్చిందో ? నా కళ్ళు అంద ముగా ఉంటే మాత్రము నిన్ను కథలోకి ఎక్కించమన్నదెవరు ?" అని మనో రంజని కాటుక కళ్ళు కాంతారావును వెక్కిరించటము మొదలు పెట్టినవి.

కాంతారావుకు వీళ్ళందరినీ చూడగానే చిరాకు వేసుకొని వచ్చింది. ప్రొద్దున్నే లేచినవాడికి పిల్లి ఎదురైనట్లుగా వీళ్ళు తన మీదికి తగవుకు రావటం

మేమిటి ? కథను చదివి ఆనందించలేని వాళ్ళు-అక్షరాలు కూడబలుక్కొని చదవక పోతే ఏమి ? కల్చరంటే ఏమిటో-కళ అంటే ఏమిటో ఒక్కరికయినా తెలియదు." అని మనసులో అనుకుంటూ కిటికీవైపు ముఖముపెట్టి దూరాన ఉన్న చెట్లవైపు చూస్తూ నిలువబడి పోయాడు. నేరస్థుడిని అరెస్టు చేయటానికి వచ్చిన పోలీసు అధికారులవలె అందరూ కాంతారావు వైపు తీక్ష్ణముగా చూడటము మొదలు పెట్టారు.

"అయితే మీరంతా అనేమాట ఏమిటి ? నా కథలను చదివి మీరంతా అట్లా ఉలుక్కుంటారేం ?" అంటూ కాంతారావు ఒక నవ్వు నవ్వాడు.

"ఏమిటయ్యా నీ రౌడీతనము ! హద్దులేకుండా ఉన్నదే ! వాని వరుసలు పెట్టి వ్రాస్తూ-పైగా ఉలుకెందుకంటావేమిటి ? పోకిరీ మనిషిలా ఉన్నావు ! నీవు మా పొరుగున ఉండవలసినవాడవు కావు" అని పార్వతమ్మ గర్జించింది.

"మీరు మంచివాళ్ళయితే - నేనెట్లా వ్రాసినా మీకు నష్టములేదు. నేనేదో వినోదము కొరకు వ్రాశాను గాని దురుద్దేశముతో వ్రాయలేదు. నేను కథలు వ్రాసి ఆంధ్రదేశములో పేరు తెచ్చుకోవటము మీ కెవరికీ ఇష్టము లేదా ఏం ? నాకు ఉజ్వలమైన భవిష్యత్తు ఉన్నదని నా స్నేహితులందరూ అంటున్నారు. మీరంతా నన్ను అవమానపరుస్తున్నారు. నా పేరు ప్రఖ్యాతులను విని అసూయపడుతున్నారా మీరంతా ?" అన్నాడు కాంతారావు.

"ఎన్ని కథలయినా వ్రాసుకో-పేరు తెచ్చుకో మామయ్యా ! కాని.........నీ మేనకోడలనీ - నీ మరదలనీ వావి వరుసలతో వ్రాస్తావాయెను మరి ! అందులో ముద్దులూ ముక్కలూ వర్ణించి మా కొంపలమీదికి తెస్తావాయెను ! ఎరిగిన వాళ్ళందరూ ముఖము మీదనే అడుగుతున్నారు. నీకు నీ సంగతేగాని మా సంగతి పట్టక పోతే ఎట్లా ?" అన్నది మీనాక్షి- కాంతారావు మరదలినీ పార్వతమ్మనూ చూడగానే మీనాక్షికి కొంచెము ధైర్యము వచ్చినట్లయినది.

"నేను అనే ముక్క అదేబావా ! నీ ఇష్టము వచ్చినన్ని కథలు వ్రాసుకో- ఎవరు వద్దంటారు ? రచయితవు నీవు పూలహారాలు వేయించుకుంటూ అందరి అభిమానానికీ పాత్రుడవవుతున్నావు - బాగానే ఉన్నది. ప్రతి స్త్రీ పాత్రనూ బంధుత్వముతో నీ పడకగదిలో ప్రవేశ పెట్టుతావాయెను ! నీవు మా బంధుకోటిలోవి

వాడ వంటేనే మాకు తలవంపులుగా ఉన్నది. మేము తలయెత్తుకొని తిరుగలేకుండా ఉన్నాము. నీకు పుణ్యముంటుంది. ఇంక చాలించుబావా!" అని కాంతారావు మరదలు బ్రతిమిలాడింది.

"ఈ బజారునుంచి త్వరగా వెళ్ళకపోతే నలుగురు పెద్దమనుష్యులనూ పిలుచుకొని వస్తాను. నీ యిల్లు ఖాళీచేయిస్తాను చూచుకో. ఇప్పుడు వచ్చిన కలెక్టరు మా బంధువే! ఏమనుకుంటున్నావో?" అని పార్వతమ్మ రోజుతూ రంకెలు వేయసాగింది.

కాంతారావుకు మనసు ఆనందముతో నిండిపోతున్నది. తన కథ ఎంతస్వాభావికముగా ఉన్నది! దానివల్ల ప్రజలలో కలిగిన సంచలనమే అందుకు ప్రబలమైన సాక్ష్యము!

ఈ చివాట్లూ బెదిరింపులూ ఎట్లా ఉన్నాయంటే-మనిషికి గొప్ప అదృష్టము పట్టబోయేముందర చిన్నచిన్న కీడులెన్నో కలుగుతాయని జ్యోతిష్కులు చెప్పుతూ ఉంటారు. ఈ సంఘటన రానున్న శుభమును తెలుపుతునే ఉన్నది! సంతోషము కొలదీ కాంతారావు ఒక సిగరెట్టు వెలిగించి-పొగవదలుతున్నాడు.

అతడి మౌనము చూసి వాళ్లుముగ్గురూ లలిత ప్రక్కకుచేరి పాపపరిహారార్థము కాంతారావు రచనలన్నీ అగ్నితో శుద్ధిచెయ్యమని బెదిరించటము మొదలుపెట్టినారు. అశోకవృక్షముక్రింద రాక్షస స్త్రీలు సీతను బెదరించినట్లు బెదరిస్తున్నారు. సీతాదేవి శ్రీరాముడిని తలచుకుంటూ వాళ్ల బెదరింపులకూ షరతులకూ లొంగలేదు-కాని-కాంతారావు ధర్మపత్ని అయిన లలిత వాళ్లుపెట్టిన షతులన్నిటికీ సమ్మతించి వాళ్లను సమాధానపెట్టవలెననే ప్రయత్నములో ఉన్నది.

కాంతారావు ఇంకా కిటికీలోనుంచి చెట్లపై పుచూస్తూ ఆలోచిస్తున్నాడు. తన రచనలను ఎంతమంది చదువుతున్నారో? ఎందరు తనను ప్రశంసించి-తనకు అమరసింహాసన మమర్చుతున్నారో? తానంటే ప్రతి పత్రికకూ ఎంత అభిమానము! ఒక్క నెలలోనయినా తన రచన లేకపోతే పత్రికాధికారులూ పాఠకులూ ఎంత అలమటించి పోతారు! పత్రికలు ఎక్కువసంఖ్యలో అమ్ముడు పోవటమూ వాటి ప్రచారమూ తన రచనల వల్లనేనని ఎందరు అనలేదు? అబ్బా. ఆ విషయము తలచుకుంటే అతడికి కాలు నేలమీద ఆరదు.

అంతలో ఆ గదిలో ఒకమూలనుండి భగభగమంటలతో పొగపైకి లేచింది. సున్నంవేసిన గోడంతా మసిబారిపోయినది. పార్వతమ్మా, కాంతారావు మరదలూ, మీనాక్షీ మంటకెదురుగా నడుముమీద చేతులుపెట్టుకొని నిలువబడ్డారు.

లలిత లోపలినుంచి కాగితాల కట్టలూ ఫైళ్లూ తెచ్చి మంటలో పడవేస్తున్నది.

తన రచనలను గురించి మధురస్వప్నాలను కంటున్న కాంతారావు ఈ మంటలనుచూసి నిర్విణ్ణుడయిపోయాడు. తన రచనలు-తనను తారాపథానికి తీసుకొని పోతున్న రచనలు-తనకు పేరు ప్రఖ్యాతులను గడించిపెట్టక రచనలు-తన కళ్ల ముందరే భస్మమయిపోతున్నాయి! అగ్నిజ్వాలలు పైకిలేచి అతడికి తెలియకుండానే అతడి హృదయములో ప్రవేశించి నరాలలోకి ప్రాకిపోయాయి! అతడికి అంతులేని కోపము వచ్చింది. "లలితా! నీకేమయినా మతిపోయిందా? వాళ్లతోపాటు నీవుకూడా నన్ను అర్థము చేసుకోలేదా? దివారాత్రాలు కష్టించి రచించినవన్నీ మంటలో వేస్తున్నావా? ఒక్కొక్క అక్షరము ఒక్కొక్క రక్తపుబొట్టు అనుకో. రాక్షసులచేతులల్లో బిడ్డలు పడినట్లే అయినదే!" కాంతారావు నిర్జీవుడయ్యాడు. అతడి ఆశలన్నీ అడియాశలయ్యాయి! అతడు నిర్మించుకొన్న సౌధాలన్నీ గంధర్వనగరా లయిపోయినవి! అతడి ఆశయాలన్నీ నేలమట్టములయిపోయాయి!

ఆ మంటల్లోని కాంతి ఆ ముగ్గురు స్త్రీల నేత్రాలలో చేరి తళతళ మని మెరయసాగినది.

"చూడు! కాగితాలు కాలిపోయినా-వాటిమీది అక్షరాలుచూడు-ఎట్లా స్పష్టముగా కనబడుతున్నాయో! కొట్టవచ్చినట్లుగా ఉన్నాయి! మామయ్యా! గతంనాస్తి. నీవెనుకటి భావాలూ రచనలూ భస్మమైపోయాయి. మామీద దయఉంచు" అంటు అన్నది మీనాక్షి. యుద్ధములో శత్రువులను పొడిచి గెలిచినట్లుగా ఉన్నది ఆమె ముఖము.

"బావా! స్వాభావికముగా ఉండాలని స్త్రీల మనస్తత్వాన్ని మహాబాగా గ్రహించినవాడివలె వ్రాద్దామనుకున్నావా? ఎంత మందిని చూసి వ్రాశావు? ఏవో పుస్తకాలు చదివి మా కాపురాలు పాడుచెయ్యాలనుకున్నావా? హద్దులనూ అవధు

లనూ దాటించి రచించినవన్నీ అభ్యుదయ రచనలనుకున్నావా? నీకు నిజంగా దానిలో నమ్మకముంటే నీ భార్యగా పాత్రను సృష్టించుకో!.........చాలాబాగున్నది గాని నీ అభిప్రాయాలను కాస్త మార్చుకో" అన్నది కాంతారావు మరదలు.

"అందరిచేతా రౌడీ వనిపించుకుటావటయ్యా! ఏదో నాలుగు రాళ్ళు తెచ్చుకుంటున్న వాడవు చిలుకలా ఉన్న భార్యతో హాయిగా ఉండక ఈ వ్రాతలేమిటంట నీకు! సరేలే ఇకనయినా కుదురుగా ఉండు" అని మందలించి పార్వతమ్మ మనుమరాలిని తీసుకొని వెళ్ళిపోయినది.

పెద్ద ఘనకార్యము చేసినవాళ్ళ మాదిరి మీనాక్షి కాంతారావు మదరలూ నవ్వుకుంటున్నారు.

"నన్ను సర్వనాశనము చేశావు లలితా! వాళ్ళతోపాటు నీకు కూడా మతి పోయినట్లే ఉన్నది" కాంతారావు పని నిప్పులు త్రొక్కిన కోతి చందముగా ఉన్నది.

"నేను మాత్రము ఏంచెయ్యను? మీ రచనలు ముక్కుపచ్చలారని పసి బాలుడికి కూడా కాముకదృష్టితోనే స్త్రీని పరిచయము చేస్తున్నాయి. మీ కలానికి ప్రతి స్త్రీ అభిసారికగానే ఉండెను మరి. అర్ధరాత్రివేళ - శృంగారించుకొని ప్రేమాన్వేషణ చేసే పరకీయలను మాత్రమే మీరు చిత్రించుచుంటిరి. ఇతరులను గురించి మీరు ఆ విధముగా ఆలోచిస్తుంటే - మీ భార్యను ఇతరులు గౌరవిస్తారా? ఇంకా అన్యాయముగా చిత్రిస్తారు. కనీసము నా మర్యాద నిలపటానికైనా-నా ముఖము చూసి అయినా-మీ రచనా పాటవాన్ని మరొక మార్గానికి త్రిప్పండి" అని లలిత చేతులు జోడించింది.

"మరీ ఛండాలంగా ఉన్నాయి. బావా! ఇంకనుంచీ మానివెయ్యిబావా!" అన్నది మరదలు. ఆమె దృష్టిలో స్త్రీల వస్త్రాలను కాంతారావు కథలద్వారా అపహరిస్తున్నట్టు తోచింది.

కాంతారావు కోపముతో వణకిపోతూ "మీకివి ఛండాలముగా తోస్తే నేను చెప్పేదిలేదు. నా రచనలను అర్థము చేసుకునే విజ్ఞానము మీలో లేదనుకుంటాను.

మనదేశములో ప్రజలు ఎంత వెనుకబడి ఉన్నారో దీనినిబట్టి తెలుసుకొనవచ్చు.... ఇంకా కొంతకాలమయితేగాని అర్థముకాదు. నేను మాత్రము వ్రాయటమయినా మానివేస్తానుగాని మరొక విధముగా వ్రాయను ?"

అంటూ కాంతారావు కోపము కొద్దీ అగ్గిపుల్లను గీచి సిగరెట్టు వెలిగించు కొన్నాడు.



# సహోదరులు

వీరాస్వామి సంధ్య చీకటివేళ చంద్రయ్య ఇంటి తలుపు కొట్టినాడు తెలుగు దినపత్రికను ఎడమ చేతితో పట్టుకుని కుడిచేతితో తలుపు తెరచి— వీరాస్వామిని లోపలికి రమ్మన్నాడు చంద్రయ్య.

"చంద్రయ్య! మన ప్రయత్నాలన్నీ వ్యర్థమైపోయేటట్లు కనబడుతున్నాయి. ఏభయిమందిని పోగుచేసుకొని—చలమయ్య ఆ ఊరు వెళ్ళనే వెళ్ళినాడు. మనము ఖర్చుపెట్టిన సొమ్మూ—పడిన శ్రమా వ్యర్థమైపోతాయేమో ననిపిస్తుంది. ఏదో ఉపాయము చూసి నన్ను గట్టున పడవెయ్యి." నిలుచబడే. చంద్రయ్య ముఖము లోకి చూస్తూ అతడి రెండు భుజాలమీదా చేతులు వేశాడు వీరాస్వామి.

"చలమయ్య ఆ ఊరు వెళ్ళాడనేనా నీ భయము? నేను ఆ చలమయ్య కంటె ముందుగా—అంతకంటె ఎక్కువమంది జనముతో - తెల్లవారకముందే వెళ్ళి - నీవు కోరినంత ప్రచారము చేసివస్తే సరికదా! భారమంతా నా పైన పెట్టి-నీవు నిశ్చింతగా ఇంటికి వెళ్లు. కాని ఒక్కమాట మాత్రము మనసులో ఉంచుకో మనకు సహాయపడుతున్న వాళ్ళకు కాస్త ఓరివిగా డబ్బు ఖర్చు చేయ వలసి ఉంటుంది.... ....చూసుకో.... ....రేపు ఈ వేళవరకూ.... ....ఎంత పని జరుగుతుందో? ఆ చలమయ్యను చూస్తేనే అంత భయపడతా వెందుకు? వాడు లెక్క పెట్టతగిన మనిషినా నీ అభిప్రాయము?" చంద్రయ్య తనతోపాటు వీరా స్వామిని కూడా మంచముమీద కూర్చోబెట్టుకొని "ఏం వీరాస్వామీ! నా మాట మీద నీకు నమ్మకము కుదరటము లేదా?" అన్నాడు.

"లేకేం? చాలా ఉన్నది. ఆ చలమయ్య తగనివాడు. అతడి వాక్కు ఎటు వంటిదో గాని... ....ఒక్క మాటతో అందరూ అతడికి లోబడిపోతారు. చిల్లిపైసా చేతిలో లేకుండానే ప్రచారము సాగించుకొని వస్తున్నాడు. ఆ జిల్లా సాంతము అతడి మాటమీద నడుస్తుందని అందరూ అనుకుంటున్నారు" అని ఒక్కసారి దీర్ఘముగా ఊపిరి తీసుకొని విడిచాడు వీరాస్వామి.

"ఇదుగో స్వామీ! నీవు ఇప్పటినుంచీ ఊరికే దిగులుపడుతూ కూర్చోకు. జయాపజయాలు మొదలుపెట్టిన దగ్గరనుండే లెక్క చూసుకుంటూ దిగులుపడకు. నేను ఆ చలమయ్య అంతు కనుక్కొనిది ఈసారి విడిచిపెట్టను. నీకు చేసిన వాగ్దానము ఏ మాత్రము మరువను. ఆ భారమంతా నామీద ఉంచి నీవు నిశ్చింతగా ఉండు."

మంచము మీది నుండి ఇద్దరూ లేచి వాకిటిముందుకు వచ్చి నిలువబడ్డారు. వీరాస్వామి పది నూరురూపాయల నోట్లను రెండుసార్లు లెక్కపెట్టి చంద్రయ్య షర్టుజేబులో పెట్టి—అతడి ముఖమువంక చూశాడు

"రేపు పని పూర్తిచేసుకొని నా దగ్గరికి రా. ఇప్పుడిచ్చినవి రేపటి ఖర్చుకేలే" చంద్రయ్య ముఖము చూస్తూ—మనసులో ఆలోచించుకుంటూ వీరాస్వామి వెళ్ళిపోయినాడు.

ఆ జిల్లాలో మోతుబరి రైతు అయిన చలమయ్య—శాసనసభకు రంగయ్యను అభ్యర్థిగా నిలువబెట్టాలెనని తీవ్రముగా కృషిచేస్తున్నాడు. ప్రజలను సమావేశపరచి ప్రచారము చేస్తున్నాడు. ఆ జిల్లా ప్రజలకు మొదటినుండీ చలమయ్య మీద అపరిమితమైన భక్తి గౌరవాలు ఉన్నాయి. ప్రజల కోరిన వరము లిచ్చే దేవతగా కనబడుతున్నాడు.

స్వతంత్రముగా ఆ జిల్లాకు అభ్యర్థిగా నిలువబడదలచుకొన్న వీరాస్వామికి చలమయ్య చేస్తూ ఉన్న ప్రచారమువల్ల కలవరపాటు హెచ్చినది.

'రంగయ్య తెలివికి శాసనసభాసభ్యత్వము తక్కువైనది కాబోయి! నిజంగా సభ్యుడు కావటమే తటస్థించినట్లయితే — వాడిని పట్టపగ్గాలు ఉంటాయా? రంగయ్య! వట్టి పనికిమాలినవాడు! వాడి చదువెంత—వాడి రాజకీయపరిజ్ఞానమెంత? నలుగురిలో నిలువబడి నాలుగుమాటలైనా మాట్లాడలేడు! అప్పుడెప్పుడో దోచిన ధనముతో—ఇప్పుడు ప్రచారము చేసుకొని — ఎన్నికలలో నిలుపబడుతున్నాడు. ఒక వేళ గెలవటమే నిజమైతే పట్టపగలే దారులు దోయించడూ?.... వీడిని గెలువనిస్తే....నేను కోటయ్య కొడుకునేకాదు!' అనుకున్నాడు వీరాస్వామి. తెల్లవార్లూ కంటికి నిద్రలేకుండా యోచించసాగినాడు. తెలతెలవారుతుండగా చిన్న కునుకు పట్టినది. ఆ పట్టీ పట్టని నిద్రలో వీరాస్వామి కంటికి చంద్రయ్య ప్రత్యక్ష

మైనాడు. మెలికలు తిరిగిన వెంట్రుకల తల. స్వదేశీ వస్త్రధారణమూ — పట్నవాసపు పాపోసులూ — చేతిలో కర్ర — ముఖము పైకెత్తిచూస్తేనేగాని చూపందని విగ్రహము — ముఖముమీద చిరునవ్వు. టకటక తలుపుకొట్టి 'స్వామీ! అన్నిటికీ నేనున్నానుగా!' అని చంద్రయ్య చెప్పినట్లనిపించింది వీరాస్వామికి.

చంద్రయ్య! పదిమంది గ్రామస్థులకు జవాబు చెప్పగల దేహదార్ఢ్యము కలవాడు. మాటలతో ప్రజల నాకర్షించగలిగినవాడు. అదిగాక — ఆ జిల్లా మొత్తము మీద చలమయ్య పేరు వినగానే అసహ్యించుకొని పళ్లుకొరికేవాడు ఒక్క చంద్రయ్యే!

ఇతడే తన కన్ని విధములా అనుకూలమైన వ్యక్తి అని వీరాస్వామి భావించుకున్నాడు

*　　*　　*　　*

అది నవభారతములో ప్రజాప్రభుత్వపు ప్రథమ ఎన్నికల సంరంభ కాలము. అత్యుత్సాహముతో ప్రజలు కేరింతలు కొట్ట నారంభించినారు. ఏభయి సంవత్సరాల శాంతి సమరము తరువాత — నేడు సంపూర్ణ స్వాతంత్ర్యము. ప్రజాస్వామ్యము!

తెలిసినవారికీ తెలియనివారికీ ఒకటే సందడి. ఎన్నికల సందడి! ప్రతి గ్రామములోనూ ఎన్నికల ప్రచారము అఖండముగా సాగిపోతున్నది. జీపుకార్లూ - పెద్దకార్లూ - లౌడ్‌స్పీకర్ల నలంకరించుకొని-ప్రచారకులతో తిరుగ నారంభించినవి.

'కడుపునిండా అన్నమూ—ఒంటినిండా బట్టా మీకు దొరకవలెనంటే మన జిల్లాలోకి సమర్థుడైన రంగయ్యకే మీ ఓటు ఇవ్వండి' అని కేకలు వేస్తూ ఏభయి మంది జనము కాగితాలను పంచుతూ వీధులవెంబడి బయలుదేరినారు. ఆ గ్రామము లోని పిల్లలు వారిని వెంబడించినారు. ఊరిబైట రచ్చబండ దగ్గర పెద్ద సమావేశము జరిగింది. రంగయ్య ప్రతిభాసామర్థ్యములను గురించి సుమారు ఒక గంట సేపు ఒకరు ఉపన్యసించినారు. గ్రామస్థులకు రంగయ్య పేరు బాగా మనసున పట్టినది.

ఆ గుంపు ఆ దినము అక్కడి నుండి బయలుదేరి మరునాటికి మరొక గ్రామములో ప్రచారము చేయుటానికి ఏర్పాటు చేసుకున్నది.

ఆ మరునాడు ఆ గ్రామములోకి మరొకగుంపు బయలుదేరి వచ్చింది. 'బీద జనులకు న్యాయము జరుగవలెనంటే--బీదలు మానవులుగా భావింపబడవలెనంటే- దీనదయాళుడైన వీరాస్వామికే మీ ఓటు నివ్వండి. దాంభికులను నమ్మబోకండి !'

జనసమూహము ముందుకు సాగిపోతున్న కొలదీ—ఆ నినాదాలు ప్రజల హృదయాలలో నాట్యము చేయసాగినవి. 'ప్రతి మనిషికి కడుపులోకి అన్నమూ, ఒంటికి బట్టా ఏర్పాటు చేయకలిగినవాడికే మా ఓటు' అని నిశ్చయించుకొన్న ప్రజలకు—రెండవసారి జరిగిన ప్రచారముతో ప్రథమంలో కలిగిన అభిప్రాయము మారిపోయినది. బీదల కష్టాలను తొలగించి—బీదలనుకూడా మానవులుగా భావించే మహానుభావు డున్నట్లయితే తమ ఓటును ఖండితముగా ఆయనకే ఇవ్వవలెనని ప్రజలు నిశ్చయించుకున్నారు.

మూడవనాడు ఆ గ్రామవీథులలో మరొక సమూహము తిరిగినది.

ఆ సాయంత్రము మరొకటి సంచారము చేసినది. తాము అంతకు పూర్వము చేసిన ఘనకార్యములను విపులీకరిస్తూ కొన్ని జీపుకార్లు గ్రామసంచారము చేసినవి.

ఆ గ్రామములోని ప్రజల ఓట్లకు వారసు లనేకులైనారు. ఒక్కొక్క సంస్థ ప్రచారము చేసుకొని—ఓట్లను ఖాయపరచుకొని—సాగిపోయినది.

భుజబలముగల ఏభయిమంది జనముతో చంద్రయ్య బయలుదేరి గ్రామ గ్రామమూ సంచారము సాగించినాడు.

మార్గశిరమాసపు చలి మానవులను గడగడ వణకించి వేస్తున్నది. పుచ్చ పువ్వువలె వెన్నెల విరియకాస్తూ ఉండగా చంద్రయ్య వెంబడి బయలుదేరిన జనము ఏలపదాలు పాడుకుంటూ నడుస్తున్నారు. ఇంకా కోసెడు దూరము నడిస్తేనే గాని గమ్యస్థానము చేరుకొనరు. త్వరపడి - చలమయ్యకంటే ఆ గ్రామము చేరుకొని ప్రచారము చేసుకోవాలి.

పొడుగుపాటి కర్రలను చేతపట్టుకొని నలుగురు మనుష్యులు ముందు నడుస్తున్నారు. చంద్రయ్య లంకపొగాకు చుట్టను వెలిగించి గుప్పుగుప్పున పొగ విడుస్తూ - తలవంచుకొని ఆలోచించుతూ - నడుస్తున్నాడు. తక్కినవారంతా ముందుగా వెళ్ళిన వారిని అనుసరించుతున్నారు

గ్రామము కనుచూపుమేర వరకూ వచ్చినది. పొలిమేర సమీపములో-ఒక పాకలోనుండి జనసందడి చంద్రయ్యకు వినవచ్చినది.

ఆ సందడి చలమయ్య పార్టీది కాదుగద!

చంద్రయ్య మనసు ఉద్రేకించినది. చలమయ్య కంటె ముందుగా గ్రామము ప్రవేశించవలెనని అతడి సంకల్పము. ఆ చలమయ్య అదేమి మనిషో- జనాన్ని క్షణాలమీద కూడగట్టుకొని-తన చేతిక్రింద పెట్టుకుంటాడు! ఎక్కువగా డబ్బైనా ఖర్చుచేయడు.

చంద్రయ్య రక్తము ఉడుకెక్కినది. జేబులోని పైకము గలగలలాడింది. వెంటనే తలమీది ముసుగుతీసి - చంద్రయ్య తనజట్టువారి కందరికీ చేతిసైగ చేసినాడు.

అందరూ ఒక్కసారిగా పాకమీద పడినారు.

* * * * *

ఎన్నికలు జరిగేవరకూ చంద్రయ్య ఊళ్ళమీద తిరుగుతునే ఉన్నాడు. ఎన్నికల బాబతు పైకము అతడి సంచిలో ఏమాత్రమో నిలిచి- అతడిని కలకత్తా పట్టణము వరకూ లాగుకొనిపోయినది.

క్రొత్తగా పట్టణపు విశేషాలనూ వింతలనూ చూసి ఆనందిస్తున్న చంద్రయ్య-తిరిగి గ్రామము చేరుకొనటానికి కావలసిన పైకముమాత్రము అట్టి పెట్టుకొని-మిగిలినదంతా ఖర్చుచేయ నారంభించాడు. ఆతడి కా సంబరములో ఎన్ని దినాలు గడచినవో గమనికే లేదు.

ఒకనాటి ఉదయము హోటలులో కాఫీ త్రాగుతుండగా తెలుగు పత్రికలో ఎన్నికల ఫలితాలు పెద్దక్షరాలలో కానవచ్చినవి.

ఓట్లు ఎక్కువ సంఖ్యలో సంపాదించుకొని - ఎన్నుకొనబడిన వ్యక్తి చంద్రయ్యపార్టీ కాదు-చలమయ్యది అంతకంటె కాదు-మూడవపార్టీ వ్యక్తి!

చంద్రయ్య మనసు ఒక విధముగా సమాధానము చెందినది. తాను నిలువబెట్టదలదన వ్యక్తి ఓడిపోయినా చలమయ్య పార్టీ మనిషిమాత్రం గెలువలేదని!

* * * * *

చంద్రయ్య ఇంటికివచ్చి విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఈ సంగతి వీరాస్వామికి తెలిసి చూడటానికి వచ్చాడు.

"నేను రెండుసార్లు మీ యింటికి వచ్చాను అమధ్య. నీవు ఊళ్ళోలేవా ఏం-కనబడలేదు" అన్నాడు వీరాస్వామి.

"ఆ రోజులలో తిరిగిన తిరుగుడుకు శరీరము చాలా అలసిపోయినది. గాలి మార్చితే బాగుంటుందేమోనని బయలుదేరి వెళ్ళాను" తలవంచుకొని అన్నాడు.

వీరాస్వామికి చంద్రయ్యతో ఏమి మాట్లాడవలెనో తోచలేదు. 'అట్లాగా! ఇప్పుడు ఆరోగ్యము బాగున్నదికదా!' ఈ మాటమాత్రము నిర్వికారముగా అనగలిగాడు.

అయిదు విమిషాలపాటు ఇద్దరిమధ్య నిశ్శబ్దము భరించరానిదిగా తయారు అయింది. చివరకు చంద్రయ్య 'చూస్తున్నావుగా వీరాస్వామీ! న్యాయముగా గెలవటము చాలా కష్టమైన పని' అన్నాడు ఇంటి కప్పును చూస్తూ.

"అవును. ఓడిపోయినాను గనుక న్యాయము నావైపే ఉన్నదనుకోవాలి." తల ఆడిస్తూ వీరాస్వామి గడపదాటి వెళ్ళిపోయినాడు.

చంద్రయ్య మాట్లాడకుండా భోజనముచేసి పడుకున్నాడు.

రాత్రి పన్నెండు గంటలవేళ చంద్రయ్యకు నిద్రలో మెలకువ వచ్చింది. నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ ఎక్కడినుండో ఎవరో మూలిగిన శబ్దము చంద్రయ్యకు వినబడ్డది.

మొదటిసారి రెండవసారి పరాకుగా విన్నాడు.

మూడవసారి నాలుగవసారి బాగా స్ఫుటముగా వినబడ్డది.

మనసుపెట్టి విన్న కొలదీ సమీపమునుంచే వినవస్తున్నట్లుగా చంద్రయ్యకు తోచింది. భార్యను లేపి అడిగినాడు.

"మొన్నటి ఎలక్షను గడబిడలో బావగారికి బలమైన దెబ్బలు తగిలాయట. తలమీద పెద్ద గాయమైనదట. కాలి ఎముక విరిగిన దనుకుంటున్నారు. నిలబడ

లేదట. చాల బాధపడుతున్నాడట" కండ్లు నులుముకుంటూ జంకుతూ చెప్పింది. భార్య.

'నీ కెవరు చెప్పారు?' అన్నాడు ఆశ్చర్యముతో.

'బావగారి రాము చెప్పాడని మన పనిమనిషి అన్నది. వాళ్ళమ్మ నిద్రాహారాలు లేకుండా ఏడుస్తున్నదని చెప్పాడట!'

అంతలో 'అబ్బా!' అని బాధకొద్దీ మూలిగిన శబ్దము తిరిగి వినపడ్డది.

చంద్రయ్య బలవంతంగా నిద్రపోవటానికి ప్రయత్నించాడు మూలుగు చెవినపడినప్పుడల్లా దేహము జలదరించి మనసు కలతపడ నారంభించింది.

ఆ శబ్దానికీ ఈ హృదయానికీ ఏమి సంబంధమో - ఆ మూలుగునకు చంద్రయ్య హృదయములోని నరాలు తోడుపలుక నారంభించినవి.

రెండు చేతులతో తలపట్టుకొని చంద్రయ్య బోరగిల పడుకున్నాడు.

ఈ సమయములో తనతల్లే ఉన్నట్లయితే ఆమె హృదయ మెంత తరుగుకొని పోయేదో? చలమయ్యనూ చంద్రయ్యనూ కన్నతల్లి శంకరమ్మ ఇద్దరిని చెరి. ఒక కన్ను అనుకునేది. కుమారద్వయము జన్మించిన నెలకే తండ్రి హృద్రోగ. ముతో అకస్మాత్తుగా చనిపోయినాడు. ఆ యింటా-ఆ యింటా పనిచేసి-వరిటలు. చేసి బిడ్డలను పెంచుకొన్నది ఆ తల్లి ఆమెనోటి మంచితనమువల్ల బిడ్డలకు రెండు. అక్షరపు ముక్కలు అంటి జీవనోపాధులు కలిగినవి.

బాల్యములో అన్నదమ్ములిద్దరికీ-ఇతరులకు అసూయను పుట్టించేంత వాత్సల్యము ఒకరిపైన ఒకరికి ఉండేది పాఠశాళ్ళ కిందట కూడా-తమ్ముడికి జ్వరము రాగానే-ఆదుర్దాతో రెండు మైళ్ళదూరము నడిచివెళ్ళి అన్న మందు తెచ్చి యిచ్చేవాడు. అన్న పథ్యములోకి కావలసిన ఆవుపాలు పొరుగూరినుండి సూర్యోదయానికి పూర్వమే తమ్ముడు తెచ్చియిచ్చేవాడు. తనకు లభ్యమైన చిరుతిండిని చేతబట్టుకొని అన్న వచ్చేవరకూ ఎదురుచూస్తూ తమ్ముడు వాకిట్లో నిలువబడేవాడు. తమ్ముని తో పంచుకొననిదే ఏ వస్తువూ సహించేదికాదు వాళ్ళ హృదయాలు పరస్పరమూ మారుమ్రోగుతూ ఉండేవి.

యౌవనము పొడచూపి వ్యక్తిగత జీవితము లారంభమయే వరకూ ఏ మార్పూ ఉన్నట్లు కనబడలేదు. ఒకనాడు చంద్రయ్య సామానులకొరకు బజారుకు వెళ్ళాడు. బేరము కాగానే సెట్టి 'బేరములో అన్నయ్యగారిని మించిపోతున్నారేః' అన్నాడు.

"అంటే ?"

"అంటే ఏం లేదులెండి అన్నయ్య గారిది అదొకమాదిరి మనసు" అన్నాడు సెట్టి.

ఇంటికి వస్తూనే చంద్రయ్య తల్లిని భోజనము పెట్టమన్నాడు. "నాయినా ! వంట సాంతమయిన తరువాత భోజనము చేతువుగాని. అన్నయ్య కూడా తొందర పడుతున్నాడు పావుగంట తాళితే అయిపోతుంది" అన్నది.

మాట్లాడకుండా చంద్రయ్య వెళ్ళి గదిలో పడుకున్నాడు. అన్నగారి గదిలో నుంచి కిలకిలనవ్వులు వినబడుతున్నాయి. రెండేళ్ళ పిల్లవాడు వచ్చీరాని మాటలలో తండ్రితో దాగుడుమూత లాడుతున్నాడు.

చంద్రయ్య కానాడు మనసు స్వాధీనములోలేదు. కారణమేమో అతడి ఊహ కందలేదు బాలుడి కేరింతలు ఒకప్పుడు అతనికి ఆనందాన్ని కలిగించినవే గాని యిప్పుడు చిరాకుపరచాయి. అంతలో తల్లి భోజనానికి పిలిచింది–"అన్నయ్య పీట మీద కూర్చున్నాడు. నీవుకూడా రా నాయనా !" అని.

చంద్రయ్య అన్యమనస్కుడై మెల్లగా లేచి పీటమీద కూర్చున్నాడు' చంద్రయ్య భార్య నెయ్యి వడ్డిస్తున్నది. గిన్నె పట్టుకొని చంద్రయ్య దగ్గర ఒక నిమిషముసేపు నిలువబడ్డది. ఉతడు పరధ్యానములో ఉండగా చూసి బావగారికి నెయ్యి వడ్డించి వచ్చి మళ్ళీ నిలువబడ్డది. చంద్రయ్యకు నెయ్యి వేయించుకొన బుద్ధి పుట్టలేదు.

అప్పటికి నాలుగేళ్ళ క్రింద పొరుగూరినుండి - రామయ్య తన కూతురిని ఈ యింటికి యివ్వవలెనని అడుగువామని వచ్చాడు. తల్లి రెండవ పిల్లవాడికి-వచ్చే సంవత్సరము-ఆ పిల్లను చేసుకొంటానని చెప్పింది అతడు వినక వచ్చే

సంవత్సరమైనా పెద్ద పిల్లవాడికిగాని యివ్వనన్నాడు. తల్లి కాదనలేక పోయినది. నిజానికి ఆ పిల్ల దగ్గరికి వరుడు హీనంగా కనబడుతాడు.

చంద్రయ్యకు ఆ విషయము తలవని తలంపుగా అప్పుడు జ్ఞాపకము వచ్చింది. ఆ రామయ్యకు ఇద్దరన్నదమ్ములలో కనబడ్డ వ్యత్యాసమేమిటి? తాను తరువాత ఎకరపు పల్లపుభూమి కట్నము తీసుకొని చక్కని పిల్లనే పెళ్ళిచేసుకున్నాడు—కాని ఆ విషయము మాత్రము మరపుకు రావటములేదు.

లోతుగా ఆలోచించితే ఆ సంఘటనలలో ఒక్కటైనా పెద్ద కారణ మనిపించుకోదు కాని—ఇవన్నీ అతడి మనసులో ఒకమూల కాపురము చేస్తూనే ఉన్నాయి—ఇప్పటికీ.

మధ్యాహ్నము నిద్రపోయి లేచేసరికి భార్య గదిలోకి వచ్చి కాఫీ గ్లాసు చేతికందించింది, 'చక్కెర చాలలేదన్నాడు.' ఆమె అమాయికముగా 'ఎవరూ తక్కువైనదని అనలేదే' అన్నది. వెంటనే 'అన్నయ్యేనా అననిది?' అన్నాడు.

మరునాటినుంచీ అన్నగారి పిల్లవాడిని ఎత్తుకొని ముద్దులాడుతున్న తన భార్యను—అకారణముగా కోపపడి—పిల్లవాడిని వదలిపెట్టి రమ్మని అన బుద్ధి పుట్టింది అతనికి.

మనసులో బయలుదేరుతున్న ఆ విప్లవమేమిటో దాని నామరూపా లేమిటో అతడికి తెలియలేదు. కాని—ఆనాటినుండీ అతడి మనసులో ఒక భావము సంచారముచేయ నారంభించినది. సాంసారికముగా - సాంఘికముగా తమ యిద్దరికీ గల వ్యత్యాసమూ - తారతమ్యమూ బాగా ప్రచారానికి వచ్చినాయి కదా? ఆ భేదసాదృశ్యాలు ఏవేవి? దాని జవాబు ననుసరించుకొని మరొక ప్రశ్న ఉదయించిందది- 'అయితే ఏది ఎక్కువ?' అని. స్వాభిమానము నిర్ణయానికి రానివ్వలేదు.

తల్లిపోయిన తరువాత- చంద్రయ్యకు ఏడాది బిడ్డ చనిపోయింది ఆఊరిలో ఎరిగిన వాళ్ళంతా ఆడా మొగా వచ్చి దంపతులను పలకరించి సానుభూతి వాక్యాలు పలికి వెళ్ళారు. అన్న చలమయ్య మాత్రము నోటితో తమ్ముడి నేమీ పలకరించలేదు. కాని-అతడి ఒడిలోనే ఆ బిడ్డ కన్నుమూసింది. చలమయ్యే ఆ బిడ్డను తీసు

కొని వెళ్ళాడు. పది రోజులపాటు తమ్ముడి మంచముదగ్గర మంచము వేసుకొని పడుకొన్నాడు. తమ్ముడిని తన పంక్తికి భోజనానికి కూర్చుండ బెట్టుకొని తమ్ముడు నోట్లో ముద్దపెట్టుకొన్న తరువాతనే తాను మెతుకు కొరికేవాడు అప్పుడు ఇతరుల సానుభూతి వాక్యాలతో తాను అన్న సానుభూతిని పోల్చి చూసుకున్నాడు. అన్న నోటివెంట మాటే రాలేదు.

ఆ తరువాతనే ఆ యింటిని రెండు భాగాలుగా పంచుకొని మధ్య తలుపులను బంధించుకొన్నారు. క్రమాగతముగా ఒకరిని చూడగానే మరొకరు ముఖము త్రిప్పుకోవటము కుటుంబములోని శుభాశుభకార్యములలో ఒకరినొకరు పలుకరించుకొనకుండా ఉండటము జరుగుతూ వచ్చినది. బిడ్డలు మాత్రము ఇంటి ఆవరణలో తప్ప బయట మాట్లాడుకోవటము నిలుపుకొన్నారు.

"అబ్బా! తలపోటు!"

తిరిగి మూలుగు వినపడ్డది.

మంచముమీద పడుకొని సోదరునకూ తనకూగల గుహ్యభేదాలను గురించి ఆలోచిస్తున్న చంద్రయ్య మూలుగును విన్న తరువాత మంచముమీద లేచి కూర్చున్నాడు.

గోడ గడియారము ఖంగుఖంగున రెండుగంటలు కొట్టింది.

"అమ్మా! ఊఁ!"

చంద్రయ్య దిగ్గున లేచి నిలువబడి-రెండు నిమిషాలపాటు యోచించి-దక్షిణపు దిశన బంధించి ఉన్న తలుపును తెరువ ప్రయత్నించినాడు. ఆ తలుపులను బంధించి ఎనిమిది సంవత్సరాలకు పైగా కావటము వలన-గొడ్డలి సహాయముతోగాని గడియ పైకి లేచినది కాదు.

కరదీపిక చేత పట్టుకొని సావడిలోనుండి చలమయ్య గదిలోనికి వెళ్ళి నిలువబడినాడు.

ఒక మూల సన్నగా దీపము వెలుగుతున్నది. మంచముమీద అన్న పండుకొని మూలుగుతున్నాడు. తలకూ కాలికీ కట్లుకట్టి ఉన్నాయి. వదినెగారు రోగికి విసరుతూ దగ్గర కూర్చున్నది.

చంద్రయ్య చేతిలోవున్న కరదీపిక చేయిజారి నేలమీద పడ్డది. అన్నను ప్రత్యక్షముగా చూసిన తమ్ముడు 'చలమన్నయ్యా!' అంటూ మంచముమీద ఉన్న రోగిపైనబడి-తన హృదయానికి అతడిని అదుముకున్నాడు.

"తలబాధరా చంద్రీ! తలబాధరా!" తమ్ముని తన బాహువులతో బంధించుకొన్నాడు చలమయ్య.

అన్నదమ్ముల కౌగిలింతను గాంచిన తోడికోడళ్ళ హృదయాలలో 'ఎంతయినా వాళ్ళు ఒక తల్లిపిల్లలు!' అన్న భావము మెరుపువలె మెరసింది.

(1969లో దక్షిణభారత హిందీసంస్థవారు ప్రచురించిన కథాసంకలనము 'కథావీథి'లో చేర్చబడిన కథ)



# ముత్యాల మనసు

ముత్యాలు తల్లి వెంట తిరుగుతూ "అమ్మా! దీనిమీద ఎక్కుతానే" అంటూ కుర్చీ ఎక్కబోయాడు.

"అమ్మగారు చూస్తే తంతారు. దిగుదిగు" పిల్లవాడిని దించి తన పనిమీద అవతలికి వెళ్ళిపోయింది వెంకటి.

తల్లిని వెళ్ళనిచ్చి ముత్యాలు తనకు సరిపోయినట్లుగా కనబడ్డ ఆ చిన్న కుర్చీమీద కూర్చుని - కాళ్ళు నేలకు తాకేటట్లుగా ముందుకు జరిగి-చేతులు రెండూ కుర్చీ చేతులమీద పెట్టి తనను తాను చూచుకొని - తల ఇటూఅటూ తిప్పి చూసాడు. తన సంగతి ఎవరూ చూడలేదన్న ధైర్యముతో బాగా సర్దుకొని కుర్చీలో వెనుకకు జరిగి కూర్చున్నాడు. కాలిమీద కాలు వేసుకొని విలాసముగా ఊపుతూ ఒక్కసారి తల పైకెత్తాడు. ముత్యాల కెదురుగా గోడదగ్గర ముత్యాలు కూర్చున్నటువంటి కుర్చీలో - వాడివంటి పిల్లవాడే కూర్చున్నట్లుగా కనబడ్డది. సరిగ్గా వాడి చొక్కా ముత్యాలు వేసుకున్నదాని మాదిరిగానే ఉన్నది బుజముమీద చినుగూ అదీను. ముందు భాగమంతా నల్లగా మాసిపోయి అట్టకట్టి ఉన్నది. వాడి ముఖము, తల, జుట్టు అంతా ముత్యాలులాగే ఉన్నాడు. ముత్యాలు తననూ వాడినీ పరకాయించి చూస్తూ, పోల్చుతూ తన దేహాన్ని తడిమిచూసుకుంటూ ఆశ్చర్యపడి పోతున్నాడు.

ముత్యాలుకు కలిగిన ఆశ్చర్యము కౌతూహలము క్రిందికి మారటానికి ఎంతోసేపు పట్టలేదు. కుర్చీమీదినుంచి లేచి, మెల్లగా అడుగులు వేస్తూ, ఆ పిల్లవాడి దగ్గరికి బయలుదేరాడు ముత్యాలు. ఇట్లా రెండు అడుగులు వేశాడో లేదో, ఎదుటి పిల్లవాడు ఈ సంగతి గ్రహించినట్లే ఉన్నాడు - లేచి, ముత్యాలు కెదురుగా వస్తున్నాడు ముత్యాలు ఒక్కసారి ఉలిక్కి పడ్డాడు. మనుసు జంకుతున్నా, ధైర్యముచేసి ముందుకు అడుగులు వేశాడు ముత్యాలు. తీరా అక్కడికి చేరు

కుంటుండగా వాడి ఆశ్చర్యము మరీ ఎక్కువై పోయింది. ఆ పిల్లవాడు మొదలు అంత ధైర్యముగా బయలు దేరాడుగాని, తీరా ముత్యాలు తన దగ్గరికి వచ్చేసరికి తళతళలాడుతున్న గోడకు అంటుకొనిపోయాడు! అయినా అదలించి చూద్దామని ముత్యాలు చెయ్యి ఎత్తాడు. దానికి జవాబుగా వాడూ చెయ్యి ఎత్తాడు. ముత్యాలు దించగానే వాడూ దించాడు. తాను నవ్వితే వాడూ నవ్వుతున్నాడని ముత్యాలుకు అక్కసు కలిగి చేత్తో పట్టుకోబోయినాడు. కాని వాడు అందలేదు.

ముత్యాలుకు చాలా ఆశ్చర్యము కలిగింది. ఆ గోడలో ఈ పిల్లవాడే కాదు. ఆ గదిలో ఉన్న మంచాలు కుర్చీలు బల్లలు ఉయ్యాల అన్నీ కనబడుతున్నాయి. బట్టలు మడత చేస్తూ అటు తిరిగి నిలబడిన తల్లి కాలి దగ్గర్నుంచి తలవరకూ కనబడుతున్నది! ముత్యాలు మనసు ఆశ్చర్యముతో గంతులు వేసింది. వాడు పక పక నవ్వుతూ ఎడమ చేతిపైపుగా వెళ్ళి అక్కడ చిన్నగోడకు ఉన్న జాలీగుండా కిందికిచూశాడు, పెద్దతోటా,ప్రహరీగోడ నానుకొని ఉన్న ఓ చిన్నగదీ కనబడ్డాయి. 'ఆ గదిలో కటిక చీకటి. సన్నటి నూనెదీపము గాలికి కదులుతూ ఉంటుంది. ఈ గది ఎంత బాగుందో? నున్నటినేల, నేలమీద పరచిన రంగు రంగుల చాపలు, వాటిమీద నడుస్తుంటే ఇంకా నడవాలనిపించింది. ఆ మంచము ఎంత చక్కగా ఉన్నదో!'

హఠాత్తుగా ముత్యాలు ముఖము ముడుచుకొని పోయింది. తన తల్లి ఆ వెధవగదిలో చింకిచాపమీద బొంతగుడ్డ ఒకటి పడేసి పడుకోమని ఒక్కకేక పెట్టుంది. ఆ వాసనకొట్టున్న బొంతమీద కళ్ళనీళ్లు కారుస్తూ కళ్ళు మూసుకొని పడుకోవాలి. నాయనకూడా పడుకోమని కేక పెట్టూనే ఉంటాడు.

ముత్యాలు మెల్లగా అక్కడినుంచి లేచి మంచము దగ్గరికి వెళ్ళి దానిమీద పరచిన దుప్పటిమీద చెయ్యివేసి తాకి చూశాడు. అది వాడి బొంతనూ చొక్కానూ తాకినట్టుగా లేదు వాడి తండ్రి వేసుకునే ఖాకీబట్టలు తాకినట్టుగా కూడా లేదు. చేతికెంతో మెత్తగా తాకింది. వాడికెంతో బాగనిపించింది. మళ్ళీ మళ్ళీ తాకుదామనిపించుతున్నది. "అబ్బ! ఏమిటీ........ఎంత మెత్తగా తాకుతున్నది?" అనుకుంటూ కనుబొమ్మలు పైకెత్తాడు. వెంటనే వాడి కేమనిపించిందో, ఆ మంచమెక్కి రెండుకాళ్లూ చాపి వెల్లకిలా పడుకొని,సంభ్రమముకొద్దీ కళ్లు మెరస్తూండగా వాడిలో వాడే అనుకుంటున్నాడు "ఇంతబాగున్న మంచముమీద తనను పడుకో

బెట్టకుండా ఆ వెధవ చింకిచాపమీద పడుకోబెట్టుతుందేం తనతల్లి? అంత చెడ్డదేమిటి ?''

ముత్యాలు బాగా ఆలోచించి నిశ్చయించుకున్నాడు. ''ఏమయినా సరే-తానా మంచముమీద పడుకోవలసిందే! ఇక తానెప్పుడూ ఆ చింకిచాపమీద పడుకోడు. వాసన కొట్టుతున్న ఆ బొంతను చేత్తోఅయినా తాకడు.''

'ఆరివెధవా! అమ్మగారుచూస్తే తంతారు. దుప్పటి నలిగిపోయింది. లే'అని వెంకటి గదమాయించి రెక్కపట్టి కిందికి లాగేవరకూ ముత్యాలుకు ఆ ఊహే పోలేదు. 'నేను దానిమీదనే పడుకుంటా'నని ముత్యాలు మళ్ళీ మంచము ఎక్కబోయాడు. వెంకటి చెయ్యిపట్టి ఇవతలికిలాగి ''తప్పుతప్పు! నాయిన పిలుస్తున్నాడు కిందికిపో'' అని ఒక్కతోపు తోసింది. ముత్యాలు కెవ్వుమన్నాడు. వాడికి అక్కడినుంచి వెళ్ళాలనిలేదు. మళ్ళీ మంచమువైపుకు దారి తీశాడు.

అంతలో 'వెంకటీ' అన్న పిలుపు వినబడ్డది, వెంకటికి తొందర ఎక్కువైంది. ముత్యాలు తనమాట విననందుకు కోపము వచ్చింది. యజమానురాలు చూస్తే ఇంకేమయినా ఉన్నదా? బాబును నిద్రపుచ్చే వేళకూడా అయింది. బాబు చికాకు చేసుకొని కేకలు వేస్తున్నాడు. వెంకటి కోపముతో, ఆదుర్దాతో 'కిందికి పో వెధవా' అన్నది. తల్లి అంతగా ఎందుకు కోపము చేస్తున్నదో ముత్యాలు కర్థము కాక నిలబడిపోయాడు. యజమానురాలు మళ్ళీ పిలవటముతో వెంకటికి తొందర ఎక్కువై వాడి తలమీద దెబ్బవేసి అక్కడినుంచి వెళ్ళిపోయింది.

ముత్యాలు తలను తడిమిచూసుకుంటూ ఏడవటము మొదలు పెట్టాడు. అంతలో తండ్రి ఎటునుంచి వచ్చాడో మరో రెండు దెబ్బలు తగిలించి చెయ్యి పట్టుకొని ఈడ్చుకు వెళ్ళాడు.

ఆ మరునాటి ఉదయము ముత్యాలు నిద్రలేవగానే తల్లి ఎప్పటివలె కనబడలేదు. 'లేవరా ముత్తిగా?' అని తండ్రి గదమాయించాడు. ముత్యాలుకు ఏడుపు వచ్చింది. 'పెద్దమ్మగారి ఊరునుంచి ఇక్కడికి వచ్చినప్పటినుంచీ అమ్మా నాయన తనవిట్లానే గదమాయిస్తున్నారు. ఆ చీకటిగది దాటి బయటికి రానివ్వరు. ఎంత సేపయినా అక్కడే కూచోవాలి. పెద్దమ్మగారి ఊళ్ళో చల్లగాలికి చెట్లకింద పిల్లలతో గోలీలాడుతుంటే ఎంత బాగుండేది!' అనిపించింది ముత్యాలుకు.

అంతలో తండ్రి మళ్లీ తనదగ్గరికి రావటము ముత్యాలు కంటబడ్డది. మెల్లగా లేచాడు తండ్రి బలవంతముగా ఈడ్చుకొనిపోయి ముఖము కడిగించి, ఒక గిన్నెలో పట్టెడన్నము కారపుముద్ద పడేసి ముందు పెట్టాడు. కళ్ళనీళ్ళతో తండ్రి మీద కోపముకొద్దీ ముత్యాలు ఒక ముద్ద నోట్లో పెట్టుకోగానే దగ్గు వచ్చింది. 'కుండలో నీళ్ళు ముంచుకొని తాగరా వెధవా!' అని కసిరాడు తండ్రి. భయము కొద్దీ ఆ నాలుగు మెతుకులూ తిని యిన్ని నీళ్ళు తాగాడు ముత్యాలు.

'ఇక్కడే ఉండు. కదలకు!' అంటూ తండ్రి ఖాకీచొక్కా వేసుకొని తోట వైపుకు వెళ్ళిపోయాడు. ముత్యాలు చేతిగోళ్లు కొరుక్కుంటూ ఆ గడపమీద కూర్చున్నాడు.

మేడమీది వరండాలో తల్లి బాబును ఎత్తుకొని బిస్కట్లు తినిపిస్తూ బొమ్మలు చూపిస్తూ తిరుగుతున్నది. అది చూచి ముత్యాలు ఆత్రముతో 'అమ్మా అమ్మా' అని కేక పెట్టాడు. వెంకటి ఇటువైపు చూడనన్నాలేదు. బాబుచేతిలో ఉన్న బిస్కట్టు ముక్క చూడగానే ముత్యాలుకు తానుతిన్న కారపు మెతుకులు జ్ఞాపకము వచ్చాయి. 'అప్పుడు తల్లి దగ్గర ఉంటే ఆ బిస్కట్టు యిచ్చేదేమో!' ముత్యాలు తల్లి దగ్గరికి వెళ్ళాలని బయలుదేరుతుండగా తండ్రి రానే వచ్చాడు 'ఎక్కడికిరా వెళ్ళేది?' అని మళ్లీ వెనక్కిలాగి గదిలోకి నెట్టాడు.

వారమురోజుల తరువాత ముత్యాలుకు జ్వరము తగిలింది. పిల్లవాడిని చూసి పొమ్మని వెంకటికి ముత్యాలు తండ్రి చెప్పిపంపాడు. క్రమము తప్పకుండా అన్ని పనులూ చేసి వెంకటి మధ్యాహ్నపువేళ ముత్యాలును చూడటానికి వచ్చింది. ముత్యాలు మేలుకొనే ఉన్నాడప్పుడు. తల్లిని చూడగానే 'నీ వెంట వస్తా'నని ఏడుపు సాగించాడు. 'వద్దురా నీవు రాకూడదు' అంటూ వెంకటి ఎంత చెప్పినా ముత్యాలు ఏడుపు మానలేదు. బాబు ఏడుపు విని వెంకటి వెళ్ళిపోయింది. తండ్రి దగ్గర కూర్చొని కళ్లుతుడిచి చాపమీద ముత్యాలును పడుకోబెట్టాడు. కళ్ళనీళ్ళతో ముత్యాలు మేడవైపు చూశాడు. బాబును ఎత్తుకొని తనతల్లి నిలబడ్డది. బిస్కట్టుతినిపిస్తూ ముద్దు పెట్టుకుంటున్నది.

ముత్యాలు మనసు భగభగ మన్నది. ఏడుపు పెద్దదిచేసి లేచికూర్చున్నాడు. తండ్రి మంచిమాటలతో ఎంత చెప్పినా వినలేదు. ఏడుపు మానలేదు. అతడికి విసుగుపుట్టి వీపుమీద అయిదువేళ్ళూ అంటేటట్టుగా కొట్టాడు అ జ్వరపు ఒంటి మీద అయిదువేళ్ళూ వాతలు తేలాయి.

ఆరేళ్లు నిండీనిండని ముత్యాలు మనసులో ఆ ఊరు వచ్చిననాటినుండి ఒక విషయము కెలకవేస్తూ వచ్చింది. 'పెద్దమ్మగారి ఊళ్ళో ఉన్నప్పుడు తల్లి తనను ఎత్తుకొని తిరిగేది. దగ్గర పడుకోపెట్టుకొనేది. ఇక్కడికి వచ్చిన దగ్గరనుండీ తనను చీకటిగదిలో పడేసి, వాళ్ళ బాబును ఎత్తుకుంటున్నది. తనను దగ్గరికైనా రానివ్వటములేదు. తనకా చింకిచొక్కా తప్ప మరొకటి వెయ్యటము లేదు. బాబుకు మంచి మంచి బట్టలు వేస్తున్నది. ఆ బాబును ముద్దుకూడా పెట్టుకుంటున్నది. తనను నాయనా అమ్మా ఇద్దరు ఒకటే కొట్టటము మొదలు పెట్టారు. ఎందుకని?

ముత్యాలుకు ముఖ్యముగా ఆ ఊరు నచ్చలేదు. తనతో కూడా ఆడుకొనే పిల్లలు ఇక్కడలేరు. 'ముత్తిగా' అని ముద్దుగా పిలచే తల్లి 'వెధవా' అంటున్నది.

ముత్యాలుకు తన పెద్దమ్మగారి ఊరితోవ తెలియదు. కాని అక్కడినుంచి ఎనిమిదిరోజులు నడచిరావటము మాత్రము జ్ఞాపకమున్నది.

ముత్యాలు ఒంటిమీది జ్వరము జారలేదు. తండ్రి తోటపని చేసుకుంటూ ముత్యాలును చూస్తున్నాడు. వెంకటి బాబు నిద్రపోయినప్పుడుమాత్రము వచ్చి చూసిపోతున్నది - అదికూడా ముత్యాలు కన్నుమూసినప్పుడే. మెలకువగా ఉంటే ముత్యాలు తల్లిని విడవడుగదా!

అప్పటికి ముత్యాలు తల్లినిచూసి నాలుగు రోజులైంది. సాయంత్రపువేళ తండ్రి చెట్లకు నీళ్లు పోస్తున్నాడు. ముత్యాలు మెల్లగా లేచాడు. మేడమీదికి ఒకసారి చూశాడు. తల్లి కనబడలేదు. తలుపులు బాగా తెరచిన గేటును చూడగానే ముత్యాలు అడుగు ముందుకుపడ్డది. జ్వరపు ఒంటితో ఒకవీధి - రెండవ వీధి - క్రమముగా దాటిపోతున్నాడు. జ్వరతీవ్రతచేత ముత్యాలు శరీరము తూలిపోవటము మొదలు పెట్టింది. మూడవ వీధిలోకి రాగానే కళ్ళు చీకట్లు కమ్మినట్లయినది. కాళ్లు తడబడిపోయి, రోడ్డు ప్రక్కగా ఉన్న తూములో జారిపడ్డాడు. మరో రెండు నిమిషాలకు సారాబట్టీలోనుంచి పొగలు గక్కుతున్న వేడినీళ్ళు ఆ తూముగుండా ప్రవహించాయి.

చీకటిపడ్డ తరువాత వెంకటి అబ్బాయిగారిని ఎత్తుకొని ముద్దులాడుతూ ఉండగా ముత్యాలు కోసము తండ్రి వీధివీధి వెతకటము మొదలు పెట్టాడు

(1968 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీవారు రచయిత్రుల కథానికలను ఏరి సంకలనముచేసిన 'కథా మందారము'లో చేర్చబడినది.)

# సైకాలజీ

సాయంకాలము అయిదూ ఆరు గంటల మధ్య వీధి వాకిలి దాటి చంద్రరేఖ బయలుదేరింది. నల్లంచు తెల్లటి ఖద్దరు చీరె-సన్నచుక్కల గుత్తపు రెవిక ఆమె నిసర్గ సౌందర్యానికి మెరుగులు పెట్టినట్లున్నాయి. ఆమె తల వంచుకొని - నావ బయలుదేరినట్టుగా మందముగా అడుగులు వేస్తున్నది. ఆమె వీధి మలుపు తిరుగు తుండగా నలుగురు యువకులు ఎదురయినారు.

'ఈ వీధిలో శ్రీమతి చంద్రరేఖగారి యిల్లు ఏదండీ?' ఆ నలుగురిలో ఒక యువకుడు ప్రశ్నించాడు.

ఆమె వాళ్ళ ముఖాలను ఒక నిమిషముసేపు పరిశీలనగా చూసి 'వాళ్ళ ఇంటి పేరు?' అన్నది చేతిలో ఉన్న సంచిని త్రిప్పుతూ.

'పట్నములో ఉన్న సోమసుందరముగారి భార్య. వారి ఇల్లు ఈ వీధిలోనే ఉన్నదని చెప్పారు' ఆ యువకుడే ఒక అడుగు ముందుకు వేసి అన్నాడు.

'ఏ సోమసుందరంగారు?' ప్రశ్నించేటప్పుడు ఆమె నాలుక తడబడ్డది.

'కాలేజి లెక్చరరు పి. సోమసుందరం గారండీ'

'సైకాలజీ లెక్చరరుగారేనా? అయితే మీకు ఆమెతో ఏంపని?' ప్రశ్నించ తుండగా ఆమె నల్లటి కనుబొమ్మలు ఆత్మీయంగా కలుసుకున్నాయి. ముఖము ముకుళించుకు పోయింది.

'వారితో చాలా అవసరమయిన పని ఉండి వచ్చాము.'

'అయితే మీరు ఆ కనబడుతున్న గేటులోనుంచి లోపలికి వెళ్ళి-వరెండాలో ఉన్న కుర్చీలమీద కూర్చోండి. నేను అయిదు నిమిషాలలో తిరిగి వస్తాను'-వాళ్ళు

ఆ గేటులోనుంచి లోపలికి వెళ్ళేవరకూ చూసి-చంద్రరేఖ చేతినంచీ తిప్పుకుంటూ వెళ్ళిపోయింది.

వాళ్ళతో చెప్పినట్టుగా ఆమె ఐదు నిమిషాలకే రాలేకపోయింది. మరో ఐదు నిమిషాల తరువాత ఇంటికి వస్తూ ఆలోచనలో పడ్డది. వీళ్ళు కాలేజి విద్యార్థుల మాదిరిగా ఉన్నారు. లెక్చరరుగారి భార్యను చూడాలన్న కుతూహలము కొద్దీ బయలుదేరి రాలేదుకదా! జాగ్రత్తగా మాట్లాడటము ఎందుకయినా మంచిదనుకుని గేటులోనుంచి వస్తూనే 'క్షమించండి. సరిగా వస్తానన్న వేళకు రాలేక పోయాను' అంటూ వాళ్ళకు సమీపంగా ఉన్న కుర్చీలో కూర్చున్నది.

'ఫరవాలేదు లెండి. ఎంత ఆలస్యమయినా కాచుకొని ఉండి-మీతో సావకాశంగా మాట్లాడాలనే మేము వచ్చాము' మిగతా ముగ్గురూ తన ముఖంకేసి చూస్తుండగా నాలుగవ యువకుడు చంద్రరేఖతో అన్నాడు.

'సరే! మీరు వచ్చిన పనేమిటో తేల్చండి. చాలా శ్రమపడి ఇంతదూరము వచ్చారు.'

'అబ్బే! మాకు శ్రమ ఏమిటి? మేము కాలేజీ విద్యార్థుల మండీ-మేము నలుగురమూ సైకాలజీ విద్యార్థులము.'

'మిమ్మల్ని చూడగానే విద్యార్థులే అయి ఉంటారనుకున్నాను. ఆఁ.... అయితే?' అన్నది పొడి నవ్వు నవ్వుతూ.

'నీవు చెప్పవోయి మాణిక్యరావు! కవికుమారుడవు కనుక బాగా చెప్తావు' అన్నాడు ముందుగా మాట్లాడిన యువకుడు పక్కనున్న విద్యార్థితో నెమ్మదిగా.

'ఉన్న సంగతి ఉన్నట్టుగా చెప్పటానికి కవిత్వమెందుకోయి? అయినా ఈమె ముందర మనము వాదులాడుకోవటము బొత్తిగా బాగుండలేదు, నీవు చెప్పరా భీమశంకరం!' ఆ విద్యార్థి పక్కనున్న విద్యార్థితో అన్నాడు ఎవరికీ వినబడకుండా.

'చూడండీ! మమ్మల్ని గురించిగాని మారాకను గురించిగానీ మీరు అన్యథా భావించకూడదని నా మనవి. మాకు ఇప్పుడు పరీక్షలు దగ్గరికి వచ్చాయని మీకు కూడా తెలుసు ననుకుంటాను' అంటూ భీమశంకరము మెల్లగా ప్రారంభించాడు.

చంద్రరేఖ తలవంచుకుని వింటున్నది. ఆమె గుండె దడదడ కొట్టుకోవటము మొదలు పెట్టింది

'ఇది మాకు రెండవ సంవత్సరము; అందుకొరకే భయపడుతున్నాము. మూడవ తరగతితో ఉత్తీర్ణులయిన వాళ్ళకు ఎక్కడా ఉద్యోగాలు దొరకటంలేదన్న సంగతి అందరికీ తెలిసిందేకదా! ఇప్పటికి రెండు సంవత్సరాలనుండీ సైకాలజీ విద్యార్థులు రెండవ తరగతి అన్నమాట ఎరగరు.'

'ఈ విషయాన్ని విద్యార్థులు గ్రహించటము గొప్పసంగతే' కనుబొమలు పైకెత్తి అన్నది.

'ఈ ఆర్థిక మాంద్యపు రోజులలో మేము అస్తులన్నీ అమ్ముకొని-కన్న వారిని ఇబ్బంది పెట్టి-కాలేజి విద్య సాగిస్తున్నాము. ఇంత కష్టమూ పడ్డతరువాత ఉద్యోగము దొరక్కపోతే ఈ డిగ్రీ వ్యర్థమే కదండీ?'

'నిజమే ఈ దృష్టితో మీరంతా బాగా చదువుతున్నారనుకుంటాను' ఈ కాస్తమాటా అనకపోతే బాగుండదనుకుని అన్నది.

'అవును అందుకొరకే మేము చాలా పట్టుదలతో చదువుతున్నాము. కనీసము రెండవ తరగతిలో నయినా రావాలని మా ప్రయత్నము.'

'చాలా సంతోషము. మరి....నాతో....ప్రత్యేకంగా ఈ మాట చెప్పటానికే వచ్చామంటారా?' చివరి మాటను కాస్త గట్టిగా నొక్కి అన్నది.

'అదే మనవి చేస్తున్నాను. కనీసము రెండవ తరగతిలోనైనా ఉత్తీర్ణుల మవటానికి ఒక్క మా ప్రయత్నము చాలదు. ఎంత బాగా వ్రాసినా పరీక్షకులు కూడా ఈ విషయాన్ని కాస్త మనసులో ఉంచుకోకపోతే లాభము లేదు.'

'అది కూడా నిజమే. కాని వ్రాసిన దానిని బట్టేకదూ విలువ కట్టటము? ఇంతకూ అసలు సంగతి చెప్పండి___' మరొకసారి హెచ్చరించింది చంద్రరేఖ.

'అదే మనవిచేయబోతున్నాను. మా లెక్చరరుగారు కూడా శ్రద్ధగా చదువుకొమ్మని పదేపదే హెచ్చరిస్తున్నారు. నిరుడు ఎంతో కష్టపడిన విద్యార్థి ఒకడు మూడవ తరగతిలో ప్యాసయ్యాడు. అతడు మొదటి తరగతిలో వస్తాడని లెక్చరరు

కూడా అనుకున్నాడట. ఒక్క నిరుడేకాదు-ఇక్కడికి రెండేళ్ళనుంచీ విద్యార్థులు నానా అగచాట్లు పడుతున్నారు.'

'అలాగా !' అన్నది ఆశ్చర్యముతో.

'మా కిది ఆఖరు సంవత్సరము కూడానా - వాళ్ళూవీళ్ళూ చెప్పినవన్నీ వింటుంటే భయంగా ఉన్నది. ఒక విధంగాచూస్తే పరీక్షకులు కఠినంగా ఉండటము మంచిదే - కాని - విద్యార్థులకు గతులు లేకుండాపోతే ఎట్లా చెప్పండి. వాళ్ళ భవిష్యమంతా పాడై పోయినట్లేగా !'

'నిజమే మరి ! నేను మాత్రము కాదన్నానా ?' అన్నది నిర్వికారముగా.

'మా పేపర్లు సోమసుందరముగారి దగ్గరికి పంపబడతాయని మొన్నమొన్ననే తెలిసింది '

'అట్లాగా !' చంద్రరేఖ హృదయము ఒక్కసారి గతుక్కుమన్నది.

'సోమసుందరంగారు చాలా సహృదయులనీ—ఇది వరకూ విద్యార్థులను చాలా ఆదరంగా చూసేవారనీ చెప్పుకుంటూ ఉంటారు. ఇదివరలో ప్రథమ ద్వితీయ తరగతులలో విజయము పొందిన విద్యార్థులు కూడా ఉన్నారట. మీ బ్యాచ్‌లో కూడా ఇద్దరు ప్రథమ తరగతిలో వచ్చారట కదూ ! ఆ తరువాత నుంచే కొద్దిగా వారి ప్రకృతి మారినట్లున్నది. విద్యార్థులేదైనా అడిగితే చివాట్లు పెడుతూ ఉంటారనీ - అనవసరంగా చికాకుపడుతూ ఉంటారనీ చాలా మంది అంటున్నారు.

చంద్రరేఖ మౌనముతో పైటకొంగు కొనలు నలుపుతూ తలవంచుకొని వింటున్నది.

'ఈ సంవత్సరము పరీక్షకు కూర్చునే విద్యార్థులము నలుగురమూ సామాన్యస్థితిపరులము. మా వాళ్లు భరించగలిగిన దానికంటె ఎక్కువగానే పట్నవాసములో ఉంచి మాకు కాలేజి విద్యను చెప్పిస్తున్నారు. మా మీద వాళ్లు కొండంత ఆశ పెట్టుకొని ఉన్నారు. చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు - తమ్ముళ్ళ చదువులు మా భవిష్యము మీదనే ఆధారపడి ఉన్నాయి. మీతో ఇదివరలో మనవి చేసినట్టుగా మూడవ తరగతిలో ఉత్తీర్ణుల మయితే-మాకు ఉద్యోగాలు ఎవరు ఇస్తారు ?'

'మీరన్న మాటా నిజమే. పెద్దవాళ్ల ఆస్తి అంతా అమ్మి మీ విద్యకింద వ్యయపరుస్తున్న మాటా వాస్తవమే. కొండంత ఆశపెట్టుకొనే మాటా సత్యమే. మరి - దానికి నేనేం చెయ్యను ?'

'విద్యార్థుల భవిష్యత్తంతా క్లాసులోనే ఉన్నదని అధ్యాపకులకు తెలిసి కూడా ఇట్లా అన్యాయము చేస్తుంటే మేము ఎవరితో చెప్పుకోము ? మీరే చెప్పండి ?'

'అది సరే ! నేననే మాట ఏమిటంటే ఇందులో నేను చేయకలిగిన దేమున్నదీ అని !' కనుబొమలు ముడివేసి - కాస్త గట్టిగా అన్నది విసుగుతో.

'మా భవిష్యమూ - మా కుంటుంబాల అభ్యుదయమూ మా పరీక్షమీద ఆధారపడి ఉన్నాయి. మా విజయము మీ చేతిలో ఉన్నది.'

చంద్రరేఖ తెల్లబోయి 'అదెట్లా !' అనగలిగింది తడి ఆరిపోయిన గొంతుతో.

'మా విజ్ఞప్తిని పూర్తిగా వినండి. మేము కోరేది ఏమిటంటే.... మీరు....'

'ఏమిటి ?' తలపైకెత్తి ఆశ్చర్యముతో అన్నది చంద్రరేఖ.

'ఈ సహాయము మీరే చెయ్యకలుగుతారు. మీకు తప్ప మరొకరికి ఆ సామర్థ్యములేదు. సోమసుందరముగారు స్వభావరీత్యా సజ్జనులూ-సహృదయులూను. మీరు వారి మనసును ప్రశాంత పరచగలరని మా ఉద్దేశ్యము' భీమశంకరం కను రెప్పలు ఆర్పకుండా ఆమె ముఖంమీదనే దృష్టి నిలిపి అన్నాడు.

అతడి మాటలను వినగానే ఆమె నరాలలోని రక్తము వేగముగా ప్రవహించినట్లయింది. ముఖము జేవురించిపోయింది.

'పిచ్చిమాట ! వారి మనసును నేను ప్రశాంత పరచగలగటము అసంభవము. మీరు-ఈ విధంగా నా దగ్గరికి వచ్చి మాట్లాడటము నాకు నచ్చలేదు. వినేవాళ్ళు కూడా నవ్వుతారు. చాలా బాగుందిగాని ...వెళ్ళండి' చంద్రరేఖ తటాలున లేచి నిలబడి 'నమస్కారము' అన్నది.

కంగారుగా నలుగురు విద్యార్థులూ లేచి నిలువబడ్డారు. మిగతా ముగ్గురూ చేతులు నలుపుకుంటూ తలలు వంచుకున్నారు. భీమశంకరము మాత్రము 'మీరట్లా

అనటము భావ్యం కాదు. మా సంగతంతా అప్పటినుంచీ మీకు విపులీకరించాము. మీకూ మాకూ వయోభేదం ఎక్కువలేనట్లు కనబడుతుంది. కాని-మమ్మల్ని తల్లిలా రక్షించవలసిన వారు మీరే !' రెండు చేతులూ జోడించి నీళ్లు తిరిగిన కళ్ళతో ఆమె ముఖంలోకి దైన్యముతో చూశాడు.

'అబ్బా ! అయితే నన్నేం చెయ్యమంటారు ?' విసుగ్గా అన్నది.

'మీరు ఆ యింట్లో తిరిగి పాదం పెట్టాలి.'

'అర్థం లేని మాట ! నేను అక్కడికి వస్తే నాచేత మార్కులు వేయించుకోవచ్చుననా మీ ఉద్దేశ్యం ?' తన మనసులో బయలుదేరిన కలవరపాటును కప్పిపుచ్చటానికి పెద్ద పెట్టున నవ్వింది.

'కాదు-కాదు ! మా ఉద్దేశ్యం అది కాదండీ ! ఆ యింట్లో మీరు ఉంటేనే చాలు. మీ ఉనికే అన్నిటినీ చక్కబరుస్తుందని మా నమ్మకము' అన్నాడు సవినయంగా.

'అయితే అర్ధరాత్రివేళ వచ్చి మీ అంతట మీరే మార్కులు వేసుకోరు కదా !'

'అన్యాయం ! అది కాదండీ ! మీరక్కడ ఉన్నారంటే మాకు క్లాసు వస్తుందని గట్టి నమ్మకం ఉందండీ !'

'మీ మాటలు నా కర్థం కావటంలేదు.'

'ఇందులో అర్థం కాని దేమున్నది !' అరగంటకు పైగా భీమశంకరం చంద్రరేఖతో చర్చించి 'మీకు నీతులు చెప్పటానికిగానీ-మీకు కర్తవ్యము బోధించటానికి గానీ మేము రాలేదు. కనీసము ఒకనెల రోజుల పాటు-మా పేపర్లు వారు చూడటము అయేవరకైనా మీరు మా కోరికను మన్నించాలి——' రెండు చేతులు జోడించాడు భీమశంకరము,

చంద్రరేఖ మనసు కొంచెము మెత్తబడ్డది. కాని - తన గోడు వాళ్ళతో ఎట్లా చెప్పుకుంటుంది ? ఒకనెల రోజులు కాదు-ఒక్క రోజు ఉండటము కూడా యమయాతనే ! పెళ్ళికి ముందు కలుస్తాయనుకున్న తమ యిద్దరి అభిప్రాయాలూ

పెళ్ళి అయిన తరువాత-రెండు నెలల పాటు ఒక యింట్లో ఉన్నా కలవలేదు. అభిమానము చంపుకొని-వ్యక్తిత్వాన్ని పోగొట్టుకొని బ్రతకాలంటే విద్యావంతులకెంత కష్టము ? ఈ ఆలోచనలు మనసులోకి రాగానే అప్పటికప్పుడు ఆమె కంఠధ్వని మారిపోయింది. కళ్ళల్లో నీటి చుక్కలు ముత్యాలలా మెరిసాయి.

ఆమె కలవరపాటు భీమశంకరము గ్రహించ కలిగాడు. 'మీరేదో బాధపడుతున్నారు. మీ కష్టము మా కర్థమయింది ఇరవై నాలుగు గంటలూ ఆ మనిషితో వేగటము ఎంత కష్టమో మాకూ తెలుసు. ఆ హంగామా అంతా ఇంట్లో పడేవాళ్లు లేక పోయేసరికి అది రెట్టించిన వేగముతో విద్యార్థుల మీదికి వస్తుంది. మా కొరకు మీరీ త్యాగముచేయరూ ?' అతడి గొంతు బొంగురు పోయింది. అతడిని చూస్తున్న కొద్దీ చంద్రరేఖకు మనసంతా చేత్తో కలిపినట్లయింది.

'మీరట్లా మాట్లాడితే నేనేమనగలను ? నన్ను కొంచెము ఆలోచించుకోనీయండి అది చిన్న సమస్య కాదని మీకు కూడా తెలిసినట్లే ఉన్నది. నాకు కొంత వ్యవధి కావాలి'-ముఖము పక్కకు తిప్పుకొని కన్నీళ్ళను దాచటానికి ప్రయత్నించింది.

'మాకు తృప్తికరమైన సమాధానము లభించే వరకూ మేము ఇక్కడినుంచి కదలము. అవసరమయితే నిరశన వ్రతానికి కూడా సిద్ధపడి వచ్చాము.'

'అబ్బబ్బ ! మీరు మరీ చిన్నపిల్లలయి పోతున్నారు. మంచి చెడ్డలు తెలియటం లేదు ఈ విషయంలో మీరు విద్యార్థులని బాగా రుజువు చేసుకున్నారు'-అన్నది గాంభీర్యముతో.

'ఆ....అదే....అదే....ఆ భావమే మా మీద ఉండాలని మేము ఇంత శ్రమ పడ్డది' భీమశంకరము ముఖము సంతోషము కొద్దీ వికసించింది. మిగతా ముగ్గురూ అతడి విజయానికి పొంగిపోయారు.

చంద్రరేఖ వాళ్ళను పంపించి లోపలికి వెళ్ళి చేతిలో ఉన్న సంచిని బల్లమీదికి విసిరివేసి - కుర్చీలో కూలబడి పోయింది.

* * * *

ఉగాది పండుగ వెళ్ళిన మరునాడు చంద్రరేఖ బండి దిగుతూ ఉండగా - వృద్ధ నౌకరు ఎదురుగా వచ్చి 'ఎన్నాళ్ళకు వచ్చారు తల్లీ ! ఇంక మా కష్టాలు గట్టెక్కినట్లే" సంబరము కొద్దీ బరువుగా ఉన్న సామానులు ఒక్కడే లోపలికి చేర్చాడు.

గడపలోకి రాగానే ముసలమ్మ అన్నది "అమ్మాయీ ! నీరాక చూచి నేను బ్రతికిపోయాను. నా ఇంత కాలమూ ఓపిక పట్టాననుకో...." అంటూ కళ్ళు ఒత్తుకున్నది.

గడపలోకి రాగానే ముసలమ్మ అన్నది "అమ్మాయీ ! నీరాక చూచి నేను బండెక్కుదామనుకుంటున్నాను. ఈ యింట్లో ఒక్క క్షణమయినా ఉండలేను. నీ కొప్పగించి పోవాలని ఇంత కాలమూ ఓపిక పట్టాననుకో...." అంటూ కళ్ళు ఒత్తుకున్నది.

చంద్రరేఖ పెదవులను పళ్లతో కొరుకుతూ లోపలికి వెళ్ళింది. ఎవరికీ కన బడకుండా వంటయింట్లో ఒక పక్కగా పీటమీద కూర్చున్నది

పదిగంటలవేళ సోమసుందరము విడిగా ఉన్న భోజనాల గదిలో వచ్చి కూర్చున్నాడు. వడ్డించిన పదార్థాలన్నీ వాసన చూసి పక్కకు నెట్టటము మొదలు పెట్టాడు.

"పెరుగు తీసుకురా !" అంటూ ఉన్నట్టుండి ఒక పెద్దకేక పెట్టాడు.

"కూర బాగుంది నాయనా ! పులుసు నీ కిష్టమని చేశాను...." ముసలమ్మ ఎదురుగా నిలబడ్డది నేతి గిన్నె చేతబట్టుకుని.

"పెరుగు .... పెరుగు .... వినబడుతున్నదా ?" కొండకేకలు పెట్టాడు వంటయింట్లో ఒక మూలకు ఒదిగి కూర్చున్న చంద్రరేఖ గజగజ వణకి పోయింది.

ఆతడిని మేడమీదికి పోనిచ్చి "చూశావా అమ్మాయీ ! చస్తున్నాననుకో. ఆ నౌకరయినా సుఖపడుతున్నాడనుకున్నావా ! చేసిన పని మెచ్చడు. తనకేం కావాలో చెప్పడు. ప్రతిదానికీ చంపుతున్నాడనుకో. పసిగుడ్డును పెంచాను కనుక-మమకా రము వీడలేకపోతున్నాను. ఒక్కొక్క రోజు కళ్ళకు నీళ్లు వస్తున్నాయనుకో"- ముసలమ్మ మాట పూర్తిచేయక ముందే పైనుంచి పెద్ద చప్పుడు వినబడ్డది. చంద్ర రేఖ అదిరిపోయింది ఆమె కాళ్ళూ చేతులూ వణికిపోయాయి.

సోమసుందరము ఇంటినుంచి వెళ్ళిపోయిన తరువాత చంద్రరేఖ మేడ మీదికి వెళ్ళి చూసింది. పుస్తకాల షెల్ఫు కాస్తా బోర్లాపడి ఉన్నది. బల్లమీది

అద్దము ముక్కలై పోయింది. బట్టలన్నీ నేలమీద కుప్పలు కుప్పలుగా గదినిండా పడి ఉన్నాయి. చంద్రరేఖ ప్రతిమలా ఆ గదిలో మధ్యగా నిలబడిపోయింది పావు గంట సేపు.

ఎంతో సౌమ్యు డనిపించుకున్న సోమసుందరము కొద్ది రోజులలోనే చక్కెర పూతలో ఉన్న క్వైనా మాత్రగా మారిపోయాడు. మిలమిల మెరసిపోతే కాంచనమని భ్రమించింది. తనకు లభించిన లోహము ఇంతకూ బంగారమా ఇత్తడా? లేక ఈ మార్పు తాత్కాలికమా? ఆమె మనసు ఆలోచనలతో పరిభ్రమించి పోయింది.

చంద్రరేఖ సోమసుందరము కంటికి కనబడకుండా వంటయింట్లో చేరి తనకు చేతనైనవీ-సామాన్యముగా అందరూ తినేవీ నాలుగైదు రకాల వంటకాలను చేస్తూ ఉండేది. అతడికి అవసరమనుకున్నవీ - నచ్చుతాయనుకున్నవీ ఆ యింట్లో రెండుమూడు స్థలాలలో చంద్రరేఖ పెట్టించింది.

అలవాటు చొప్పున సోమసుందరము కేకలు పెట్టుతూ ఎదురుగా ఉన్న వస్తువులను అందుకుంటూ ఉండేవాడు. నౌకరు కంటికి కనబడగానే "ఛీ ఛీ! ఇదిగాదు. ఇంకోటి తీసుకురా" అని చిందులూ గంతులూ వేశాడు. కాని ఆ యిల్లంతా ఒక్క కట్టడిమీద నడిచిపోతున్నది. అతడెంత అరచినా ఎవరూ సమాధానమివ్వరు. గట్టిగా రెట్టిస్తే తలవంచుకోవటం తప్ప ఎదురు జవాబు రాదు.

పదిరోజు లయేసరికి వడ్డించిన పదార్థాలలో కొన్నిటిని క్రమముగా సోమసుందరము రుచిచూస్తూ వచ్చాడు. కొన్నాళ్లకు కేకలు కాస్త మందగించాయి.

ఒక రోజు అకస్మాత్తుగా ఆరవేసిన చీరె ఒకటి ఆతడి కంటబడ్డది. అతడా ప్రాంతాలకు వస్తాడని ఇంట్లో ఎవరూ ఊహించలేదు. ఆ చీరె చూడగానే అతడి కేదో గుర్తుకువచ్చింది. మనసులో చిటపట రేగింది.

"ఎవరి దాచీరె అమ్మమ్మా" గద్దించాడు. ముసలమ్మ కంపించిపోయింది.

"అభిమానము వంటపట్టాలిగాని కొంచే వస్తుందా? మళ్ళీ ఈ గడప ఎట్లా తొక్కింది?"

వంటయింట్లో నిలబడి కిటికీగుండా చెట్ల మీదికి దృష్టిని పోనిచ్చి ఆలోచిస్తున్నది చంద్రరేఖ. సోమసుందరము మాట్లాడిన ప్రతిమాటా ఆమె హృదయంలోనుంచి దూసుకుని పోయింది. ఆపదను కోరి తెచ్చుకున్నానని చింతించింది. రోషమూ అభిమానమూ పైకి ఉబికి ముఖము కందిపోయింది. తటాలున ఒక నిశ్చయానికి వచ్చి, గిరుక్కున తిరిగి, గడప వరకూ అడుగులు వేసింది. అంతలో ఆమె కళ్లముందర విద్యార్థుల దీనవదనాలు బొమ్మకట్టినట్లయింది. వెనుకకు అడుగు వేసి గోడకు అంటుకుపోయింది.

"తిరుగు బండి ఎక్కమని చెప్పు" నేలమీద చెప్పులు చప్పుడుచేస్తూ- తలుపులు రెండుచేతులతో తోసుకుంటూ వెళ్ళిపోయాడు.

చంద్రరేఖ కుమిలి కుమిలి కన్నీరు కార్చింది. ఆమె కక్కడ రోజుకొక పిడుగుపాటుగా ఉన్నది. బలవంతంగా రోజులను నెట్టుకు వస్తున్నది.

* * * * *

అది వసంతఋతువు. ప్రకృతి తన దేహాన్ని రమణీయంగా అలంకరించుకొని నవ్యవసంతుడికి హృదయపూర్వకమయిన స్వాగతమిస్తున్నది.

ముఖముమీద చెమటలు తుడుచుకుంటూ-చికాకుతో చిందులు తొక్కుతూ మధ్యాహ్నము ఒంటిగంటకు సోమసుందరము ఇంటికి వచ్చాడు. హాలు దాటి లోపలికి వెళ్లిగానే అతడికి మంచినీళ్ల కూజా-దానిపక్క గ్లాసూ కనబడ్డాయి. విసురుగా వెళ్ళి కూజా వంచుకొని రెండు గ్లాసుల నీళ్ళు తాగాడు. అక్కడినుంచి తిన్నగా తన గదికి వెళ్లి దుస్తులు మార్చుకొని బయటికి వస్తుండగా ఒక బల్లమీద ఐస్క్రీమ్ పళ్లై మొకటి కనబడ్డది. గాజు కూజాలో ఉన్న షర్బతు చూడగానే అడుగులు నిలిచాయి. ఆ బల్ల దగ్గర నాలుగు నిమిషాలపాటు నిలబడి వాటిని సేవించి పడకగదిలోనికి వెళ్ళి విశ్రమించాడు. ఆ గది శీతలమయమై-ఒక ప్రక్కనుంచి విసురుగా గాలికొడుతూ ఉండటమువల్ల అతడు తనకు తెలియకుండానే నిద్రకు వశుడై పోయాడు.

రాత్రి ఎనిమిది గంటలవేళ-సోమసుందరం భోజనానికి కూర్చున్నాడు. రెండు మూడు పర్యాయములు ముసలమ్మను పిలిచి "ఈ కూర ఇట్లా ఉన్నదేమిటి?" అని అరిచి కేకలు వెయ్యడానికి ప్రయత్నించాడు. కాని పాకరుచులు

అతడిని మాట్లాట నివ్వలేదు పనివేళ-నౌకరును పిలిచి రెండు నిమిషాల తరువాత కారణ మేమీదొరక్క "నీ పని చూసుకో పో" అన్నాడు.

ఇలాగ వారము రోజులయేసరికి అతడి గదిలోనుంచి సన్నటి కూనిరాగాలు మేడకింద ఉన్న ముసలమ్మకు వినబడటము మొదలయింది.

ఒకనాడు డాబామీద పడకకుర్చీలో పడుకుని అతడు మధురకంఠముతో ఎంకిపాటలు పాడుతుండగా పున్నమిచంద్రుడు కలకలనవ్వాడు.

* * * * *

సోమసుందరము అప్పుడే దుస్తులు మార్చుకొని గదిదాటి వస్తుండగా "అయ్యగారు వస్తున్నారు. తొందరగా ఈ పళ్ళెము బల్లమీద పెట్టిరా" అని ముసలమ్మ అంటున్నది.

ఆ మధురపదార్థాలను సేవించుతూ ఉండగా నౌకరు ఐస్క్రీము తెచ్చి బల్లమీద పెట్టాడు. సోమసుందరానికి ఈ మధ్య అది ఉంటే సరి-ఇక భోజన మక్కర లేదనిపిస్తున్నది. ఐస్క్రీము తన కంత ప్రీతికరమయిన పదార్థమని అదివరలో అతడికి తెలియనైనా తెలియదు. తెలియక పోవటమేమిటని అతడికే ఆశ్చర్యంగా ఉన్నది.

ఆ సాయంత్ర మాతడు మామూలువేళకంటె గంటముందుగా ఇంటికి వచ్చాడు. అతడు బట్టలు మార్చుకొని లోపటినుంచి వస్తూఉండగా వంటయింటి ముందర పత్రిక చదువుతున్న చంద్రరేఖ కనబడ్డది. వెనుకనుంచి వచ్చి ఆమె చేతిలో ఉన్న పత్రిక లాగేసి ముందుకు వచ్చి నిలబడ్డాడు.

విస్మయము ఒకపక్క-భయమొకపక్క ఆమెను కంగారు పెట్టాయి. ఏదో అఘాయిత్యం జరుగుతుంది కాబోలని వణుకుతూ నిలబడి పోయింది.

"నీవు వెళ్లలేదూ ? ఉండే దాగుడుమూతలాడుతున్నావా ?" అని నవ్వాడు.

సంభ్రమముతో ఆమె తబ్బిబ్బయి పోయింది. అతడి నవ్వులో ఆమెకెన్నో అర్థాలు-ఎన్నో స్వాగతాలు-ఎన్నో ఆహ్వానాలు గోచరించాయి.

ఆమె మనోవీథిలో ఆ నలుగురు విద్యార్థుల దీనవదనాలు ప్రఫుల్లములయి నట్లు కనబడ్డాయి.

*　　*　　*　　*　　*

మధ్య మధ్య ఐస్క్రీము ఆరగిస్తూ సోమసుందరము బల్లముందర కూర్చు న్నాడు. వర్జీనియా చుట్టపొగల మేఘాలు వలయాకారముగా ఆ గది నావరించు కున్నాయి. ఒకమూలనుంచి ఎలక్ట్రిక్కు-ఫాను విసురుతున్నది. విశ్రాంతిగా-ప్రశాంత ముగా సోమసుందరము పరీక్షాపత్రాలను తిప్పుతున్నాడు. అతడి చేతిలో ఉన్న ఎఱ్ఱటి పెన్సిలు విజయ సూచకమైన రేఖలను పత్రాలమీద రచిస్తున్నది.

*　　*　　*　　*

పరీక్షలో కృతకృత్యులయిన ఆ నలుగురు విద్యార్థులూ తమ పేర్లను అడుగున చెక్కించి ఒక ఫోటో ఫ్రేమును సోమసుందరము దంపతులకు పంపారు.

"ఇది ఎక్కడిది?" అన్నాడు సోమసుందరము. "ఇదా? ఇది సైకాలజీని అర్థము చేసుకొన్న చిహ్నం" అంటో చంద్రరేఖ మందహాసము చేసింది.

ఆ మందహాస మొక విరజాజిమాలికై అతడి గళసీమ నలంకరించింది.



# పరోక్షము - సమక్షము

వేణీరావు, హనుమాయమ్మ, నేను ఎట్లాగో అవస్థపడి కలకత్తా మెయిలు అందుకున్నాము. టిక్కెట్లు ఎంతముందుగా తెప్పించుకొన్నా మేము బయలుదేరిన సమయాన్నిబట్టి రైలు అందుతుందని అనుకోలేదు. రాత్రిపూట చిన్న చిన్న స్టేషనులలో పెద్ద తరగతుల పెట్టెల తలుపులను తెరిపించేలోపల రైలు కదులుతూ ఉంటుంది. గార్డుచేసిన హంగామాతో మేము ఎట్లాగో ఎక్కటము జరిగింది. రిజర్వు చేసుకోలేకపోయినా ప్రయాణీకులు హాయిగా కాళ్లుచాపుకొని నిద్ర పోతున్నారు. చొరవ చేసుకోలేని మేము ముగ్గురము మా పెట్టెమీద కూర్చున్నాము. ప్రయాణీకుల సౌకర్యార్థము కాబోలు దీపము ఆర్పివేయబడ్డది.

ఒక స్టేషను దాటిన తరువాత-వేణీరావు నా చేతిమీద తట్టి "ఆ మూలగా-పై బర్తుమీదనుంచి వినబడుతున్న మాటలను ఆలకించు" అన్నది.

"ఈ రోజుల్లో సంఘసేవ చేయని ఆడవాళ్ళు ఉన్నారంటారా? చేతి పంచులతో ఎక్కడ చూసినా వాళ్లేనంటే నమ్ముతారో-లేదో!"

ఆ కంఠస్వరము ఆగకముందే రెండుమూడు గొంతులు పెద్దగా నవ్వాయి.

"వాళ్ల షోకులనుగురించి చెప్పాలంటే ఎన్ని రోజులయినా చాలవనుకోండి. మనము ఎంత తలవంచుకొన్నా-వాళ్ళే పలకరించి మాట కలుపుతారు. నాకు వాళ్ల మొగుళ్లను తలుచుకుంటే విపరీతమైన జాలి కలుగుతూ ఉంటుంది"

విన్న వాళ్ళంతా తన ధోరణికి మెచ్చి అభినందన పూర్వకముగా నవ్వుతారని కాబోలు కాసేపు ఆగినట్లున్నాడు.

"మీకు అనుభవము ఉన్నదో లేదో-నలుగురు ఆడవాళ్ళు ఉంటారా-ఒకరితో మాట్లాడుతూ ఉంటే మరొకరికి కోపము. విధీ విసుగు లేకుండా పొగుడుతూ ఉంటేనే వాళ్ళు మనుష్యులనుకోండి."

అతడికి ప్రోత్సాహకరముగా ఈసారి నవ్వులు బాగా వినిపించాయి.

"ఏమిటో-పిల్లల తండ్రులను చూస్తే నాకు విపరీతమైన జాలి. ఎందుకో! మీకో తమాషా సంగతి చెప్తాను వినండి. ఈరోజుల్లో మనసుడిని ఎత్తుకుంటూ కూడా ఆడవాళ్ళు పౌడరు పూసుకుంటున్నారు. ఈ సంగతి తెలుసునా?"

ఈసారి సుమారు పదిగొంతులు కలిసి నవ్వినట్లే నవ్వాయి. అప్పుడు వేణీ రావు ముఖము వెలుతురులో చూడగలిగితే ఎంత ఎర్రబడ్డదో తెలిసేది. మా హనుమాయమ్మకు నిద్రే సరిపోయింది.

తరువాత మాకు మాటలు సరిగా వినపడలేదు కాని, అప్పుడప్పుడు నవ్వులు మాత్రము వినబడుతూ వచ్చాయి. తెల్లవారవచ్చింది. మెయిలు వేగము రాత్రికంటె కాస్త తగ్గినట్లనిపించింది. రైలు ఆగగానే మేము పెట్టెను కాస్త ప్రక్కకు జరిపి కూర్చున్నాము.

అయిదారుగురు గబగబా తోసుకుంటూ లోపలికివచ్చారు. మాకు వెనుకగా ఉన్న బర్తుదగ్గరగా నిలబడి "ఆయన ఇంకా లేవనట్లున్నారు. కాసేపు నిలబడదామా పోనీ-" అనుకుంటున్నారు. ఈ సందడికి ఆయన లేవనే లేచాడు. ఎన్ని రకముల అభినందనాలో-ఎన్ని పూలహారాలో లెక్కలేదు. వాళ్ళ ఆనందోత్సాహాలతో ఆయనకు ఊపిరి సలుపలేదు. అయినా చిరునవ్వుతో అన్నీ స్వీకరిస్తున్నాడు. వాళ్ళు స్పెన్సరు కాఫీ బిస్కెట్లు యిచ్చారు. ఆ స్టేషనులో దొరకే పత్రికలన్నీ ఆయనకు కొని యిచ్చారు. ఆయన "వద్దు! నాకెందుకు ఇవన్నీ?" అంటూనే రైలుదిగి-ప్లాటుఫారము మీద నిలబడి వాళ్ళు ఫోటో తీస్తామనగానే పూలహారాలు జరీ కండువా సర్దుకొన్నాడు!

ఇంత హడావుడి ఏమిటా అని కనుక్కుంటే ఆయనట ఒక సినెమా నటుడట.

ఏలూరు స్టేషను వచ్చేసరికి బండి లేటు ఆయిందేమో ఎనిమిదిన్నర కావచ్చింది.

అప్పటికి ప్రయాణికులు చాలావరకు దిగిపోయారు. పై బర్తులమీద ఉన్న వారందరూ క్రిందికి దిగారు.

మేము మాటల సందడిలో రైలు నాలుగు స్టేషనులు దాటడము గమనించనే లేదు.

అంతలో ఒక యువకుడు కూర్చున్న స్థలములోనుంచి లేచివచ్చి, మా కెదురుగా కూర్చొని, ఇంగ్లీషు డైజెస్టు చదవటము మొదలు పెట్టాడు. కొంతసేపటికి గాని అతను సరిగా చదవటము లేదని మేము కనుక్కోలేక పోయాము. మాలోకి కాస్త చూడటానికి బాగుండేది హనుమాయమ్మ నాలుగేళ్ళు పెద్దదయినా షాపుల ముందర నిలబెట్టబడిన బొమ్మలా అలంకరించుకునేది వేణీరావు.

"నమస్కారమండీ" అన్నా డాయువకుడు మావైపు తిరిగి. నేను ఆ నమస్కారము 'ఎవరికా' అనుకున్నాను. హనుమాయమ్మ తనకేమోనని సందేహమైనా పడదు. వేణీరావు అందుకున్నది.

"సమితికి చాలామంది సభ్యులున్నారా? మీరు ఆర్గనైజరులా?" అడిగాడు కుతూహలముతో.

అతడు దేనినిగురించి అడుగుతున్నాడో తెలియక నేనూ హనుమాయమ్మా తెల్లబోయాము. వేణీరావు జవాబిచ్చింది. "వెయ్యిమంది వరకు సభ్యు లున్నారు. వీళ్ళిద్దరు కార్యనిర్వాహక వర్గ సభ్యురాండ్రు. నేను కార్యదర్శినిని."

అతడు అందుకు తన సంతోషాన్ని తెలుపుతూ ఆ సమితి రిపోర్టు, నియమావళి ఇమ్మని అడిగాడు. ప్రస్తుతము అవి తనదగ్గర లేవని చెప్పుతూ-అనాథ శరణాలయము, హిందీక్లాసులు, వయోజన పాఠశాల, చేతిపనులు, బాలెంతల వైద్యశాల ఏకధాటిగా నడుపబడుతున్నాయని వేణీరావు అనర్గళముగా చెప్పేసింది. అతడు వాటి వివరాలను ఫొటోలను యిమ్మంటున్నాడు. ఆమె వెళ్ళి పంపుతానన్నది. తన చిరునామా తెలుపటానికి అతడు ఒక కార్డు ఇచ్చాడు. ప్రసన్న వదనముతో వేణీరావు అందుకొని తన సంచీలో పెట్టుకొన్నది.

"ఇప్పుడు స్త్రీలల్లో కూడా త్యాగమూర్తులు ఉద్భవిస్తున్నారు. సమాజ సేవకురాండ్రంటే నాకెంతో గౌరవము. మీకు ఎంత సామర్థ్యము లేకపోతే మీ యిళ్లతోపాటు సంఘాన్ని దిద్దగలుగుతారు! ఒక్కొక్క ఊళ్ళో ఎంత సోషల్ సర్వీసు చేస్తున్నారంటారు స్త్రీలు? ప్రతిశాఖ యంత్రములా నడుపబడుతున్నది. నా విచారమంతా ఒక్క దానికే-ఏమిటంటే-మన సంఘము ఉన్నదే-అది స్త్రీమూర్తి

విలువలను ఇంకా గ్రహించలేకపోతున్నది. మిమ్మల్ని కలుసుకునే భాగ్యము నాకు కలిగినందుకు చాలా సంతోషము. నమస్కారము. వెళ్ళివస్తాను'' అంటూ అతడు రైలుదిగి వెళ్ళిపోయాడు.

రైలు కదిలేవరకూ నిగ్రహించుకొని-ఈ నాటకమంతా ఏమిటంటే-వేణీరావు తన పెట్టెకు అంటించిన "మహిళాసమితి'' అనే కాగితము చూపించింది. అప్పటికీ నాకు అర్థము కాకపోయింది.

"ఈ కార్డు చూడు. అతడొక పత్రికా విలేఖరట!'' అంటూ ఒక కార్డు నా చేతికిచ్చింది. "రాత్రంతా మాట్లాడిన ఆ గొంతు విన్నావుకదా. ఆమాత్రము కంఠస్వరము గుర్తించలేవూ?'' అన్నది వేణీరావు నా ముఖము చూస్తూ. నేను తెల్లబోయాను.

ఆమె వాక్యము పూర్తిచేయక ముందే మేము దిగవలసిన స్టేషను వచ్చింది. దిగిన తరువాత నేను అతడిని గురించే ఆలోచిస్తున్నాను- 'ఆ నటుడికి సన్మానము చేసినవాళ్ళలో ఈ విలేఖరికూడా ఉన్నాడా - లేక ఎక్కడైనా ఉన్నాడా? విలేఖరి కనుక తప్పకుండా ఎక్కడో ఉండే ఉంటాడు' అని సమాధాన పడ్డాను. అంతలో వేణీరావు కూలివాడితో పెట్టెను తీసుకొని రమ్మని చెప్పుతూ "అత డెంత పత్రికా విలేఖరో నేనంత సంఘ సేవకురాలిని!'' అని పెట్టెకు అంటించిన చీటీకాస్తా లాగి పారేసింది.



# ప్రౌఢ వెన్నెల

కాఫీ గ్లాసు క్రిందబెట్టి పెదవులను తువాల్‌తో అద్దుకుంటూ "ఇల్లు నాలుగు మూలలా చూసి అన్ని విషయాలనూ తెలుసుకుందువుగాని రా" అన్నాడు సత్య నారాయణ.

"రాత్రేగా యీ యింట్లో అడుగు పెట్టింది ; ఇంక అన్నీ ఒక్కొక్కటే అవే తెలుస్తాయి" అరుంధతి తల ఎత్తకుండా అన్నది.

"నీవు కాఫీ తాగావా ? తాగకపోతే ఆ గ్లాసు ఇక్కడికి తెచ్చుకో"

రెండు నిమిషాలు చూసినా అరుంధతి లేవకపోవటమువల్ల - సత్యనారాయణే లేచి వంటయింట్లోకి వెళ్ళి కుంపటి దగ్గర గిన్నెలో కాఫీ ఉన్నదేమోనని చూశాడు. గిన్నెలన్నీ తొలిచి బోర్ల వేసినట్లున్నాయి.

"కాఫీ నా కొక్కడికే చేశావా ?" అన్నాడు తెల్లబోయిన ముఖముతో సత్యనారాయణ.

తల ఎత్తకుండానే 'అవును' అన్నది అరుంధతి.

"మరి నీవు ఏమీ తాగవా ।"

"నేను కాఫీ తాగను"

"ఉదయమున కాఫీకాక నీవు తాగేది ఇంకేదయినా ఉందా ?"

"కాఫీ టీ తప్ప ఇంకేదయినా తాగుతాను" సత్యనారాయణ ఆమె కెదురుగా వచ్చి నిలువబడినా—ఆమె తలవంచుకొని కూర్చునే జవాబిచ్చింది.

సత్యనారాయణ మాట్లాడకుండా చాకలివాడిచేత ఓవల్‌టీన్ డబ్బా ఒకటి తెప్పించి - ఆమె దానిని కలిపి తాగేవరకూ నిలబడి "ఇంకలే. నీకు ఇల్లంతా

చూపించి - అన్ని విషయాలనూ నీ చెవిన వేస్తాను" - ఆమె లేచి నిలువబడే వరకూ చూసి తరువాత ముందుకు నడిచాడు.

అరుంధతి మనసంతా అయోమయముగా ఉన్నది ఆమెకు తన పరిస్థితి ఏమిటో తెలియటములేదు ఉప్పెనవచ్చి తగ్గిన తరువాత వెలవెల పోతున్న గ్రామము వలె అయిపోయింది ఆమె మెదడు. ఈ క్రొత్త మనిషి సత్యనారాయణా-క్రొత్తయిల్లూ - క్రొత్త వాతావరణమూ ఆమె మెదడులోకి ఎక్కలేదు.

సత్యనారాయణ అరుంధతిని ఒక గదిలోకి తీసుకొని వెళ్ళాడు. ఆ గదిలో గోడకు తగిలించిన ఫోటో ఒకటి చూపించి "దీనిపేరు జానకి—ఇదే నన్ను మొదట గృహస్థాశ్రమములోకి దింపింది. చాలా సరదా మనిషి. ఊళ్ళు తిరగట మన్నా - అవీ ఇవీ కొనుక్కొచ్చి ఇంట్లో పడవెయ్యటమన్నా చాలా సరదా దానికి. ఈ గదిలో ఉన్న మంచాలూ-బీరువాలూ నల్లమానువి బెంగుళూరునుండి తెప్పించాను. ప్రతి వేసవిలోనూ మేము అక్కడ ఉండవలసిందే ననుకో. ఎంత డబ్బు ఖర్చయినా సరే దాని మనస్సు చిన్నబుచ్చకూడదని నా కనిపించేది" చెప్పటము ఆపుచేసి సత్యనారాయణ గదిలోనుంచి బయటికివచ్చి అరుంధతివంక చూశాడు.

అరుంధతి అతడు చెప్పినదంతా విని చివరలో తెలియక "కొంతమందికి జీవితాన్ని ఆనందించటము బాగా తెలుసు ఆమె అటువంటిదేమో!" అన్నది.

"దానికి పడకగది కిటికీ దగ్గరగా మల్లెపందిరి ఉండాలని ఉండేది. దాన్ని ఎక్కడినుంచో తెప్పించి వేశాను." కిటికీగుండా చేయి పోనిచ్చి-ఒక పువ్వుకోసి అరుంధతి చేతికిచ్చాడు.

"మంచి వాసనగలదే చెట్టు" అన్నది అరుంధతి.

"చూడు అది దాటిపోయిన తరువాత వచ్చిన శారద ఉన్నదే-దాని అభిరుచులన్నీ వేరు. మల్లె పందిరిని పీకించి దూరముగా వేయించింది. సువాసనలకంటె దానికి రంగులంటే ఇష్టముగా ఉండేది. నా మనసుకంటె-వేషాన్ని ఎక్కువ పాటించేది. ఇంట్లోకూడా డాబూ దర్పమూ ఎక్కువైంది. అన్నిటికీ అన్ని గదులనూ ప్రత్యేకించింది. నాకు కాఫీ తాగటము నేర్పింది అదే. మొదట్లో నేను ఉదయము లేవగానే స్నానముచేసి సంధ్య వార్చుతూ కూర్చునేవాడిని-అప్పుడంతా పోయింది.

ఈ యింటికి కావలసిన హంగులన్నీ ఏర్పరచి పోయింది అదే. దీని ఫోటో చూశావా? పట్టుమని రెండేళ్ళయినా ఉండలేదు'' అని ఎడమచేతివైపు వరెండా లోనికి తీసుకువెళ్ళి చెప్పటము మొదలు పెట్టాడు.

''తరువాత వచ్చిన శకుంతల ఉన్నదే అది—రాజకీయాలంటే సరి. అన్నము ముందునుంచైనా లేచేది. అభ్యుదయ పంథాలోది. ఉన్నమాట చెప్పొద్దూ, దాని చేతికి తాళపుచేతులు యివ్వలేదు. ఎదురుగా ఎంత ఉంటే అంత ఖర్చు. నేను కాస్త జాగ్రత్త నేర్చుకొని మసులుకున్నా. నేను చెప్పితే వినకుండా జైలుకు వెళ్ళింది. ఏం చెయ్యను? నాకేమీ సంబంధము లేదని సర్కారుకు చెప్పేశాను'' అని పెద్ద నిట్టూర్పు విడిచాడు.

తరువాత అరుంధతిని మరొక గదిలోకి తీసుకొనివెళ్ళి కూర్చోబెట్టి ఇనప్పెట్టె తెరచాడు. ''చూశావా! పెద్దదాని దగ్గర్నుండి చిన్నదాని వరకూ వాళ్ళకు కావలసినట్టుగా ఆ బంగారాన్ని చెరిపించి చేయించుతూ వచ్చాను'' అని ఒక డబ్బా తెరచి దాంట్లో ఉన్న నగలను ఒక్కొక్కటే తీసి చూపించాడు.

అరుంధతి ఏమీ అనకుండా ఉందామని ఎంతో ప్రయత్నించింది. కాని, చప్పున నోటివెంట ఈ మాటలు జారినాయి. 'బంగారము చెడగొట్టగా-చెడగొట్టగా తెల్లబారింది.'

''ఏమన్నాగాని – బంగారము ఏ వన్నెదో వాళ్ళు చూడలేదు. కావలసినది వస్తువు - అవే పెట్టుకొని తిరిగారు'' అని అన్నీ డబ్బాలో పెట్టి లోపల భద్రపరచాడు.

ఆ గదిలోనుంచి బైటికివస్తూ ''అసలు జరిగినదంతా నీవు వినే ఉంటావు. మీ నాన్నకు - నేను - నిన్న నీవుచూసిన సేటుగారు చాలా అప్పుపెట్టాము. మీ నాన్న పోయినారని తెలియగానే మీ చిన్నాయనగారు వచ్చి ఎక్కడిదక్కడ తీర్మానించుతానని – ఆ యిల్లు రాస్తా ఆ సేటు గారికి ఇచ్చేశాడు. ఇంట్లో ఉన్న సామానులతో నిన్ను నా దగ్గరికి పంపాడు'' తువాల కొసలు ముడివేస్తూ నిలబడ్డ అరుంధతి ముఖములోకి చూశాడు.

తన అసహాయస్థితికి గుండె చెరువై పోయింది.

వయసు ఎక్కువ లేకపోయినా ముగ్గురు భార్యలను చూసినవాడు సత్య నారాయణ. ఇంట్లో ఉన్న సామాన్లతో పాటుగా – తన పినతండ్రి–ఈ విధముగా పరాయివాళ్ళ యింటికి పంపించివేసి తాను రైలెక్కాడే! ఇంతకూ తన తండ్రి ననాలిగాని పినతండ్రినంటే ఏం లాభము ?

అంతలో సత్యనారాయణ రెండు ఆల్బములు తెచ్చి ఆమెముందరపడేసి, "చూశావా ? డబ్బు ఉన్నా అందరూ అనుభవించలేరు చూడు. నేను జానకితో తిరగని ఊరులేదు. ఈ ఫోటోలన్నీ అప్పుడు తీసినవే. నాకు ప్రకృతి దృశ్యాలంటే చాలా యిష్టము. ఒక కెమెరా ఉండేది. ఎక్కడికి వెళ్ళినా వెంట తీసుకొని వెళ్ళే వాడిని"

అరుంధతి అవన్నీ తిరగవేసి బాగున్నాయని పొడినవ్వు నవ్వింది.

"ఇది చూడు – నేను పాల్గొనని ఉద్యమము లేదు. వాటికి సంబంధించిన చిత్రాలు ఇవన్నీను. అప్పటికి పెద్దది పోయింది. అప్పటినుంచీ సంసారము మీది కంటె నామనసు రాజకీయాల మీదికి ఎక్కువ వెళ్ళేది. తరువాత ఈ చివరి చిత్రా లున్నాయే అవన్నీ వీళ్ళవీ వాళ్ళవీను"

ఇట్లా మాట్లాడుతూ సత్యనారాయణ కారియరుతో భోజనము తీసుకొని రమ్మని మనిషిని పంపాడు.

అరుంధతి స్నానము భోజనమూ అయిన తరువా౽ పగలు విశ్రాంతి తీసు కోవాలని భోజనాల యింటిముందరగా చాపమీద పడుకొన్నది. కాని ఆమె మెదడు విశ్రాంతిని కోరలేదు. ఊరికే కలతపరచటము మొదలు పెట్టింది.

తనను పెళ్ళి చేసుకొనమని సత్యనారాయణ అడుగుతాడేమో! అడగట మేమిటి....అన్ని సామానులతో పాటు - సర్వాధికారాలతో అప్పగించబడిన ఆడ పిల్లను సత్యనారాయణ పెళ్ళి చేసుకొమ్మని అడుగుతాడా ? ఆమె సమ్మతి అతడి కెందుకు ? అయినా ఈ ప్రస్తావన తన ముందర సత్యనారాయణ తీసుకొనివస్తాడు. తాను ఒకవేళ అసమ్మతిని తెలిపితే - అక్కడితో నిలుస్తాడా - లేదా - అన్నది పెద్ద సందేహాము. క్రమంగా ఆమె ఈ భావనల నన్నిటిని వదలి నిద్రకు వశురాలై పోయినది.

తరువాత వారమురోజులు మొదటి రోజువలెనే సత్యనారాయణ ఇంటి విషయాలను - అంటే ఏ వస్తువులు ఎక్కడున్నాయో వాటి ఖర్చు వివరాలు పూర్తిగా ఆమెకు చెప్పివేశాడు. సత్యనారాయణ పగలు భోజనము చేసిన తరువాత పత్రికలను చదువుకొని తనగదిలో నిద్రపోయేవాడు. కాఫీసమయానికి వచ్చి బల్లదగ్గర కూర్చునేవాడు. సాయంకాలపు వేళ తోటలో ఏదో సవరిస్తూ కాలక్షేపము చేసేవాడు.

అరుంధతికి ఇంతవరకూ అతడి మనసులో ఏమున్నదో తెలియలేదు. ఇంటికి ఎవరైనా పదిమంది స్నేహితులువస్తే మాటల సందర్భములోనైనా గ్రహించుకోవచ్చు - కాని అదీ జరగలేదు.

కాలక్షేపానికి ఒకనాడు అరుంధతి అన్నది "నాకు వంట చేతనవును. రేపటి నుంచీ నేనే చేస్తాను" అని.

"ఆఁ.... ఎందుకూ? నీవు వంటచేయటము మొదలుపెడ్తే ఆరోగ్యము తగ్గుతుందేమోనని నా భయము కులాసాగా కాలక్షేపము చెయ్యి. నీకేం కష్టంగా లేదుకదా? ఏదైనా ఉంటే చెప్పు, నిమిషములో చక్కబరుస్తాను" అన్నాడు సత్యనారాయణ.

అరుంధతి మెల్లగా తన గదిలోకి వెళ్ళిపోయింది.

గదిలో ఒంటరిగా కూర్చుని చదువుకుంటున్నా అరుంధతి మనసులో అవహించిన భయము అట్లాగే ఉండేది. ఉలిక్కిపడి వెనక్కు తిరిగి చూసేది. అడుగుల చప్పుడు వినబడ్డట్లయేది. భయముతో గుండెమీద చెయ్యివేసుకొని-అడుగులో అడుగువేసుకుంటూ గదులన్నిటిలోకీ తొంగిచూసేది. సత్యనారాయణ తలవంచుకొని ఏదో చదువుకుంటూ కనబడేవాడు. ఎప్పుడైనా ఆమె అలికిడిని గ్రహించినప్పుడు 'ఏం కావాలి?' అనేవాడు.

ఒకనెల ఈ విధముగా గడిచేసరికి అరుంధతికి వచ్చినప్పటి చురుకుతనము సన్నగిల్లడం మొదలుపెట్టింది. పుస్తకాలను చదవటములోగల ఆసక్తికూడా మందగించింది. సత్యనారాయణ అప్పుడప్పుడు "అట్లా ఉన్నావేం? సుస్తీగా ఉందా ఏమిటి?" అని అడిగేవాడు.

మొదలు మొదలు అరుంధతికి సత్యనారాయణను చూడగానే మనసులో భగ్గుమనేది. ముగ్గురిని చేసుకొన్నది చాలక నాలుగోదానికి ఎదురు చూస్తున్నాడని అసహ్యపడేది. అతడు వేసిన ప్రశ్నలకు కటువుగా జవాబిచ్చేది. అతడు ఆదరణగా పలుకరిస్తే పుల్లవిరిచినట్లుగా మాట్లాడేది. రానురాను అతడిమీద ఆమె కోపగించటానికి ఆధారము లేకుండాపోయింది. అతడు ఏ విషయములోను తూకము తప్పటము లేదు.

నెలరోజుల తరువాత అరుంధతికి ఒక మధ్యాహ్నము హఠాత్తుగా తోచింది "ఈయన నన్ను ఖైదీగా పట్టుకురాలేదుకదా!" అని.

ఇది అన్యాయము! ఒక వ్యక్తిని కావాలంటే భార్యగా తెచ్చుకోవటము ఉన్నది. సంఘములో భార్యను కొనుక్కోవటము ఉన్నదిగాని ఏ పేరులేకుండా తీసుకొని వచ్చి ఇంట్లో ఉంచటము ఎక్కడా వినలేదు. తన నిస్సహాయస్థితికి అరుంధతికి మరొకమారు గుండె చెరువైపోయింది. కన్నీరు జలజల రాలింది.

మరునాడు ఉదయము సత్యనారాయణ ముఖము కడుక్కొని బల్లముందర కూర్చుని అరగంట ఎదురుచూశాడు అరుంధతి కోసము. వేళతప్పని అరుంధతి ఏంచేస్తున్నదోనని గదిగదీ వెతికాడు. అరుంధతి వస్తువులన్నీ ఎక్కడివక్కడే పడి ఉన్నాయి. కొన్ని సర్దిఉన్నాయి. అవన్నీ అరుంధతికి అతడు కొని యిచ్చినవే కనబడకుండా పోయినది ఒక్క అరుంధతే-వచ్చేనాడు ఆమె కట్టుకొని వచ్చిన వెలిసిపోయిన చీర ధరించి.

సత్యనారాయణ మనసు అయోమయ మయిపోయింది ఆ రోజంతా మరునాటికి క్రొత్త తెప్పరిల్లి వార్తాపత్రికలో ఇలా ప్రకటించాడు:

"అరుంధతీ!

ఎందుకమ్మా నా మీద అంతకోపము వచ్చింది? అట్లా చెప్పకుండా వెళ్ళావేం? నేనేమీ నీకు కష్టము కలిగించలేదు కదా? నిన్ను చాలా గౌరవంగా చూశాననుకుంటాను. కాని నాదొక పొరబాటు జరిగింది. అవును అది తప్పే. నేనట్లా చేయకూడదనిమాటే అసలు. నెను ఒక అబ్బాయిని పెంచుకొని అమెరికాకు

చదువుకోసము పంపాను. ఇంకా పది రోజులలో వాడు వస్తున్నాడు, నీ ఫోటో పంపగానే వాడు ఆమోదించేడు అసలైన వజ్రాన్ని పిసలైన బంగారములో పొదిగి ఆనందించుదామని అనుకున్నానమ్మా! నేను చేసిన పాపము ఏమిటంటే. నీతో ఒక్కమాట నా పథకాన్ని గురించి ముందుగా చెప్పవలసింది. దానికే ఇంత నొచ్చుకొన్నావా తల్లీ! నీ వెక్కడున్నా ఈ ప్రకటన చదివి నీ ఇంటికి. తిరిగి రావమ్మా అరుంధతీ! నీవు వెళ్ళిపోగానే ఇంటి కళాకాంతులు నిన్ను వెతుక్కుంటూ వెళ్ళాయంటే అతిశయోక్తి కాదు.

సత్యనారాయణ"



# దొరలు

వీరన్న ఇస్త్రీలాగూ దానిపైన పొడుగాటి కోటూ వేసుకొని, జరీ తలపాగా పెట్టుకొని హడావిడిగా తిరుగుతున్నాడు. పగలు రెండు గంటలయినా భోజనము చేయటానికి అంతవరకూ తీరుబడి కాలేదు. వీరన్న భార్య ఎల్లి వీరన్న రాకకు ఎదురుచూస్తూ వాకిటి గడపమీద చేతిగోళ్ళను కొరుక్కుంటూ కూర్చున్నది.

ఆ రోజు సాయంత్రము ఆరు గంటలకు వీరన్న నౌకరిచేస్తున్న క్లబ్బు భవనంలో సభ్యుల సమావేశము జరుగనున్నది. ఇటువంటి సమావేశాలు నెలకొకటి వంతున జరుగుతూ ఉంటాయి. ఆ క్లబ్బు ఆవరణములోని తోటలో, లానుమీద కుర్చీలనూ బల్లలనూ అమర్చి, అక్కడక్కడ పూలచెట్లతో నిండిన తొట్లను పెట్టి అలంకరిస్తున్నాడు వీరన్న.

అంతలో కాంటీనునుండి పార్టీకి కావలసిన సామగ్రితో ఇద్దరు మనుష్యులు వచ్చి వీరన్నను పిలిచారు. ముఖముమీది చెమటను తుడుచుకొని, వాళ్ళను లోపలికి తీసుకొని వెళ్ళి సామానులన్నీ గదిలో పెట్టించాడు వీరన్న. సీసాలను బల్లమీద జాగ్రత్తగా భద్రపరిచాడు. అప్పటికి నాలుగు కావచ్చింది ఎల్లి రెండుసార్లు భోజనము మాట వీరన్నకు జ్ఞాపకం చేసింది. పని సందడిలో ఉన్న వీరన్న సరిగా కూర్చోకుండానే భోజనము ముగించి ఎంగిలి చేతిని సరిగా కడుగుకోకుండానే తిరిగి తన పనిలో నిమగ్నుడై పోయాడు.

ఆ పట్టణము పేరెన్నికగన్న పట్టణాలలో ఒకటి. ఆ క్లబ్బు భవనము తెల్లదొరల పరిపాలనలో ఒక మండలాధికారియైన శ్వేతవర్ణునిచేత నిర్మింపబడినది. ఊరిబైటగా ఎత్తయిన గుట్టమీద అందముగా కట్టబడినది. విశాలమైన భవనమూ, భవనములో మేలురకపు ఫర్నిచరూ, భవనము చుట్టూ రమణీయమైన పూదోటా, ఆవరణములో కుడి ప్రక్కగా ఈత కనువైన జలాశయమూ, దానిచుట్టూ పూపొదరిండ్లూ, భవనానికి ఎడమవైపుగా పెద్దలానూ, దాని చుట్టూ సున్నము పూసిన ఇటు

కల వలయమూ కన్నుల పండువుగా ఉంటుంది. వివిధ వర్ణములైన పుష్పజాతులతో తోట ఘుమాయిస్తూ ఉంటుంది. ఆ భవనములో పరులకు ప్రవేశములేదు. ఆ భవనాంతర్భాగము ఎల్లా ఉంటుందని ఆ పురవాసు లెవరైనా వీరన్నను అడిగితే మా ఊరి బాపనయ్య కథలో చెప్పిన ఇంద్రభవనములా ఉంటుందని నోరు ఊరేటట్లు ముచ్చటగా చెప్పుతూ ఉంటాడు వీరన్న. ఆ ఊరివాళ్ళు చాలా మంది దానికి కోలాహలపర్వతమని పేరు పెట్టారు. ఆవరణలో ఒక ప్రక్కగా చిన్న యిల్లు కట్టించి, ఆ తోటనూ ఆ భవనమునూ భద్రముగా కాపాడటానికై భవనమును నిర్మించిన మండలాధికారి వీరన్నను నియమించాడు. తన కేర్పరచిన జీతముతో వీరన్న తృప్తిగా జీవిస్తూ ఆ భవనమును కనిపెట్టుకొని ఉంటున్నాడు మొదలు దొరలతోనూ దొరసానులతోనూ మాట్లాడటము చేతగాక చేతిసైగలతో కాలక్షేపము చేశాడు. త్వరలోనే వ్యాకరణ ప్రశంస విడచి, స్వతంత్రముగా అంగిరీజు భాషలో సంభాషణ నేర్చుకొని, వ్యవహారము నడుపుకొనటము ప్రారంభించాడు. వీరన్న తన ఇరవై రెండవఏట ఈ నౌకరిలో చేరాడు. ఇప్పుడతనికి తలంతా పండిపోయింది. అరవై సంవత్సరాలు సమీపించాయి.

ఆ క్లబ్బుకు మొదలు మొదలు అంతా తెల్ల దొరలూ, దొరసానులూ వస్తూ ఉండేవారు. తరువాత, క్రమక్రమముగా నల్ల దొరలు కూడా ప్రవేశించటము మొదలు పెట్టారు. ఆ క్లబ్బులో ఇంతవరకూ సుమారు ముప్పైమంది కార్యదర్శులూ అధ్యక్షులూ మారగా వీరన్న చూశాడు. అధికారవర్గమూ, సభ్యులూ తమకు తెలియని వివరాలు ఏమైనా వీరన్నను అడిగి తెలుసుకుంటూ ఉంటారు.

ఆ క్లబ్బు పేరు "నవ్వు - నవ్వించు."

సుమారు ఆరుగంట లయ్యేసరికి సభ్యులు ఒక్కొక్కరే రావటము మొదలు పెట్టారు. సమావేశానికి కావలసిన సర్వసన్నాహము చేసి వీరన్న చేతులు కట్టుకొని గేటుదగ్గర నిలబడ్డాడు.

ఎల్లి అవయవ సౌష్ఠవముగల ఇరువదేండ్ల పల్లెపడుచు. ఆరు తులాల బంగారమూ, నలభై తులాల వెండీ పెట్టి వీరన్న రెండు నెలల క్రిందట ఎల్లిని పెళ్ళి చేసుకున్నాడు. వీరన్న తాళిగట్టిన పడుచులిద్దరూ వీరన్నకు సంతానము మాపెట్టకుండానే కాలము చేశారు. మూడవసారి చేసుకున్న ఎల్లి వీరన్నకళ్ళకు

మల్లెపువ్వులా కనబడుతున్నది. అక్కడికి రోజూ బంతి ఆడటానికి వచ్చే నల్ల దొరసానమ్మలను చూసి, పాదాల దగ్గరికి చీరె కట్టుకోవటమూ, తల వెంట్రుకలు మెడల మీదికి ముడి వేసుకొని దానిమీద పువ్వులను అర్ధచంద్రాకృతిలో అమర్చు కోవటమూ ఎల్లి నేర్చుకొని ఇప్పుడిప్పుడే 'పట్టణపు సోకు' అలవర్చు కుంటున్నది.

ఎల్లి వీరన్న దగ్గరికి వచ్చిన తరువాత క్లబ్బులో ఇది మొదటి సమావేశము. సభ్యులందరూ వచ్చిన తరువాత ఒకసారి తన యింటిలోపలికి వెళ్లి, 'తలుపులు వేసుకొని లోపలే ఉండ'మని ఎల్లికి గట్టిగా చెప్పి తిరిగి తన పనిలోకి వెళ్ళి పోయాడు వీరన్న. తన కొరకు కూర్చోవద్దనీ, అన్నము తిని పడుకోమనీ చెప్పి, వెళ్ళాడు.

ఏడు గంటల తరువాత ఎల్లి అన్నము తిని మంచముమీద పడుకొని దొర్ల టము ప్రారంభించింది. ఎల్లికి ఒంటరి భయము. వీరన్న ఎంతసేపటికీ రాడు!

ఉన్నట్లుండి వెయ్యికుక్కలు ఒక్కసారిగా అరచిన శబ్దము ఎల్లికి విన బడగా, అదరిపడి మంచముమీద లేచి కూర్చున్నది. మరి కాసేపటికి వేయి పిల్లులు మ్యావుమన్న అరపులు వినపడ్డవి. ఎల్లి భయపడి ఆ గదిలో ఒక మూలకు పరు గెత్తింది. తిరిగి అదే విధముగా ఒకసారి పిల్లుల అరుపూ. ఒకసారి కుక్కల అరపూ వరుసగా అరగంటసేపు వినవచ్చినవి. ఎల్లి భయముకొద్దీ కళ్ళు మూసు కొన్నది.

కాసేపటికి ఎల్లి ధైర్యము తెచ్చుకొని మెల్లగా కిటికీ దగ్గరకు వెళ్ళి, కొద్దిగా తలుపులను తెరచి, ఆ శబ్దము ఎక్కడనుండి వస్తున్నదోనని అటూఇటూ చూడ టము మొదలుపెట్టింది. ఎల్లి యింటికీ సభ్యులు సమావేశమైన లానుకూ సుమారు పదిగజాల దూరము ఉంటుంది. క్లబ్బు సభ్యులు రెండు వరుసలుగా చీలి ఎదురెదు రుగా నిలబడినట్లుగా ఎల్లికి కనబడ్డది. ఆ అరుపులకు వాళ్ళుకూడా భయపడి లేచి నిలువబడినట్లుగా ఎల్లి భావించుకున్నది.

మరి కాసేపటికి సహస్ర గార్దభము లొక్కసారిసా ఓండ్రపెట్టినట్లు ఎల్లికి వినబడ్డది. ఈసారి ఎల్లి భయపడకుండా కిటికీ తలుపుల సందుగుండా చూడటము మొదలుపెట్టింది. రెండు రెండు తెగలుగా ఎదురుబడి నిలువబడిన సభ్యులు

ముందుకు వంగి నోరు తెరచినట్లూ, ఆ శబ్దము అక్కడినుండే బయలుదేరి వస్తున్నట్లు ఎల్లి అర్థము చేసుకొన్నది. ఈ అరుపుల వలన కలిగిన ఆశ్చర్యము ఎల్లి ముఖముమీద అట్లా ఉండగానే, అందరూ కలిసి ఒక్కసారి గొల్లుమన్న శబ్దము వినవచ్చింది. ఎల్లి కిటికీ తలుపులను మరికొంచెము తెరచిచూసి నిర్ఘాంతపోతూ ఉండగా "ఇంకా పడుకోలేదూ?" అంటూ వీరన్న లోపలికి వచ్చాడు.

"అదేమిటి.... అటు చూడు?.... అటుచూడు!" అని ఎల్లి వీరన్నను గట్టిగా పట్టుకున్నది.

వీరన్న కిటికీలో తలపెట్టి చూశాడు. ఆ క్లబ్బులో నౌకరీ చేస్తున్న వీరన్న అటువంటి దృశ్యాలను అనేకము నిశ్చలముగా చూడటము నేర్చుకున్నాడు. చేతులనూ కాళ్ళనూ నేలకాన్చి, తలపైకెత్తి గాడిదలు ఓండ్రపెట్టుతున్నట్లు సభ్యులు చూపుతున్న ప్రదర్శన మది!

"అదేమిటి? వాళ్లు అట్లా చేస్తున్నారు?" అని ఎల్లి వీరన్న ఎదలో తలదాచుకున్నది.

"అవి దొరల ఆటలే ఎల్లీ! నీవు భయపడబోకు! వాళ్ళు దొరలు కదూ మరి! ఇక్కడున్నంతసేపూ అట్లా ఆడుకుంటారు." అంటూ వీరన్న ఎల్లి వీపు నిమిరాడు!



# గళ్లలుంగీ

గుడిసె ముందర ఈతాకుల చాపమీద రంగన్న వెల్లకిలా పడుకొని ఆలోచిస్తున్నాడు. అతని ప్రక్కన రెండేళ్ళ మంగ గులక రాళ్లు ప్రోగుచేసి చేతులలో పోసుకుంటూ జారుస్తూ ఆడుతున్నది.

సాయంత్రము ఆరు గంటల సమయము. ఒక ప్రక్క దట్టముగా మబ్బు పట్టి చీకటులు అలముకుంటున్నాయి. దినరాజు పశ్చిమ దిశకు చేరినట్లుగా అరుణ రాగాలు మరొక దిశన సాక్ష్యమిస్తున్నాయి. నీలి మబ్బుల నిర్మలాకాశములో నుంచి జేవురు రంగు మబ్బు తునకలు రత్నాలవలె మెరసిపోతూ ఆకసమున కొక వింత శోభను కలిగిస్తున్నాయి.

రంగన్న ఈ ప్రకృతి చోద్యాన్ని తిలకిస్తూ రేపటి సంగతి ఏమని ప్రశ్నించుకుంటున్నాడు

ఏడాది క్రిందట అతడు తండ్రి మీద అలిగి భార్యను తీసుకొని పసిబిడ్డతో. బ్రతుకుదామని పట్నము వచ్చాడు. నౌకరీ కొరకు తిరిగి తిరిగి రిక్షాను నడప నేర్చుకొని కాలము గడప సాగాడు. నాలుగయిదు నెలలపాటు రోజుకు మూడు నాలుగు రూపాయలు కండ్ల చూసేవాడు. వారానికీ పది దినాలకూ శాయి. తన పెట్టెలో చీరెమడతల అడుగున. రెండు మూడు రూపాయలైనా దాచేది. ఆనోటా ఆనోటా రంగన్న అభివృద్ధి ఊరి వాళ్ళందరికీ క్రమక్రమముగా తెలిసిపోయింది. అది మొదలు ఏదో ఒక పేరుమీద ఆ గుడిసెలో పై మనిషి లేనిరోజు లేదన్నట్లుగా ఉండేది. పట్నము వచ్చి బాగుపడిన వాళ్ళెవరంటే రంగన్నా శాయీలని అంతా చెప్పుకొనేవారు. ఆకలితీరిన సంతోషముతో- రోజును గడపగలిగిన సంపాదనతో- ఉప్పొంగే హృదయాలతో - పూలతెప్ప మీద శాయీ రంగన్నలు తేలిపోయినారు.

అతడి జీవితములో శుక్లపక్షము ముగిసినది కాబోలు-ఒకనాటి జ్వరముతో కాళ్ళురెండూ పడిపోయినవి.

కృష్ణపక్షము ఆరంభమయినది.

శాయి చిన్నవయసు గలది. ఆ యింటా ఆ యింటా పాచిపని చేసి, నెలకు తెచ్చే ఇరవయి రూపాయలలోనూ అయిదు రూపాయలు అప్పు క్రిందనే పోతున్నాయి. ఆ నెలలో రంగన్నకు కట్టుకోవటానికి ధోవతులచాపు కొన్నందుకే తిండికి కరవయి పోయింది. కడుపులోకి ఉంటే ఒంటికిలేదు. ఒంటికి ఉంటే కడుపులోకి లేదు. ఈ పరిస్థితిలో రంగన్న నాయనమ్మ-మనుమడిని చూడటానికని వచ్చి-రెండు రోజులున్నట్టే ఉండి, మూడవ నాటికి కళ్లుమూసింది. పదవనాడు కులము వాళ్ళందరినీ పిలిచి భోజనము పెట్టాలి. ఎంత తక్కువ ఖర్చుపెట్టినా మాపటివేళ కుండకూ, పగటివేళ భోజనానికీ పాతిక రూపాయలైనా కావాలి.

తెల్లవారితే పదవరోజు.

ఎంతసేపు యోచించినా జవాబు తోచని ప్రశ్నగా ఉన్నదతనికి.

అంతలో ఎర్రంచు పచ్చ చీరెను మీదికి కట్టి కంఠానికి బిగియగట్టిన నల్ల పూసలతో - బేడ కాసంత బొట్టుపెట్టుకొని - భుజముమీద నీళ్ళ కడవతో శాయి రావటము రంగన్న గమనించాడు. 'ఈ ఊరు వచ్చిన కొత్తలో ఆమె ఎంత నిండుగా ఉండేది! పని... తెల్లవారి లేచిన దగ్గరినుండి తీరని పని! ఇంత పని చేసినా డొక్కనిండా తిండిలేదు!'

ఆమె గుడిసెను సమీపించి కడవను దింపి 'ఇస్సు' అనుకుంటూ, ఆ చాప మీద అతడి తల దగ్గరగా కూర్చున్నది, కాలి మట్టెలను చేతితో తిప్పుతూ.

ఆమె రాకను గమనించినా రంగన్న దృష్టి మాత్రము ఆకాశము మీది నుంచి మళ్ళలేదు కాళ్ళ తడి చీరెతో తుడుచుకుంటూ 'రొట్టె తినటానికి లేస్తావా?' అని శాయి అడిగింది.

దృష్టి మరల్చకుండానే 'కొంచెమాగ'మని చేతితో సైగ చేశాడు.

"ఈ కడవ నీళ్ళకోసము ఆ రోడ్డు చివర వరకూ పోవాలి. గంటల కొద్దీ నిలబడాలి. అందరిచేతా విదలింపులూ తిట్లూ తినాలి. అక్కడ జాతరలో ఉన్నట్లుగా జనము. వాళ్ళలో నుంచి బయటపడటమే గండమవుతున్నది" అంటూ శాయి-తల వెంట్రుకలను విదలించి ముడివేసుకున్నది.

"నీకు నిద్ర వస్తున్నట్టుగా ఉన్నది. ఆయింత రొట్టెముక్కా నోట్లోవేసు కొని పడుకో" అన్నది శాయి.

"నీవు మూతపెట్టినది ఒక్క రొట్టేనా ?" అన్నాడు.

"నీకూ మంగకూ చాలదా ? తిని ముంతెడు నీళ్ళు తాగితే సరి" అన్నది ముఖము ప్రక్కకు త్రిప్పుకొని.

"హుం. ముగ్గురున్న యింట్లో నే నొక్కడినే పిల్లతో ఆ కాస్తరొట్టె తిననా ? నాకు అసలే ఆకలి కావటములేదు. నీవు నీళ్ళకు వెళ్ళిన తరువాత మన నరిసిగాడు ఇంటికి వెళ్ళిపోతూ ఇటు వచ్చాడు. వాడి మూటలో ఇంత రొట్టె ఉంటే, ఇద్దరమూ చెరికాస్తా తిన్నాము. నీవూ మంగీ ఆ ఉన్నరొట్టెను తినండి." అని ఆకాశము మీది దృష్టిని మళ్ళించకుండానే అన్నాడు.

"నా కడుపూ నిండుగానే ఉన్నది. పనిచేసేచోట ఇంత రొట్టెముక్క దొరికింది. ఆకలి అయినట్టుగా ఉంటే అక్కడే తిన్నా——" నన్నది ముఖ మవతలకు తిప్పి. ఆమె మాటలకు ఆమెకే నవ్వు వచ్చింది.

"పిల్లా నేనూ ఇక్కడ ఉండగా.... నీకు వాళ్ళ యింట్లోనే ఆకలయిందా ? దొంగ మాటల కేమిగాని.... పిల్లకు నిద్రవస్తున్నది. ఉన్న రొట్టెను తీసుకురా.... వాదించుకోవట మెందుకు ? అందరమూ తలాకాస్తా తుంచుకుందాము" అంటూ లేచి కూర్చున్నాడు.

"అయితే నరిసిగాడు, ఇంటికిపోతూ ఇటు రావటమూ—నీవు రొట్టె తినడమూ.... ఎంత నిజము ?" అంటూ రంగన్నను ఓరకంట చూసి కిలకిల మంటూ, లోపలికి వెళ్ళి రొట్టెను తీసుకొని వచ్చింది.

రంగన్నా శాయీల భోజనానికి పీటలూ, చెంబులు పళ్ళేలు అక్కర పడ లేదు. దీపముతో అసలే పని పడలేదు. శాయి చేతితో తెచ్చిన రొట్టెను తుంచు కొని, ముగ్గురూ మూడు కాస్తలు తిన్నారు. తలా ఒక ముంతెడు నీళ్ళుత్రాగి కడుపు నింపుకున్నారు.

రంగన్న తిరిగి చాపమీద పడుకొని, విపీలాకాశము మీద మిణుకు మిణుకు మనే నక్షత్రరాశిని కళ్ళతో ఎంచుతూ-మబ్బు మేడలలో దీపాలను వెలిగించటానికి ప్రయత్నిస్తున్నాడు,

"ఆకాశము అంత చోద్యముగా ఉన్నదా? దృష్టిని మళ్ళించకుండా అటే చూస్తున్నావు" అంటూ శాయి మళ్ళీ వచ్చి చాపమీద కూర్చున్నది.

"అకాశము కాదు చోద్యముగా ఉన్నది. రేపటి సంగతే!" అన్నాడు.

"మరి - ఏమిటీ ఆలోచన? అన్ని రూపాయలు ఎక్కడినుంచి వస్తాయి?" అంటూ ముఖముమీద పడిన ముంగురులను పైకి తీసుకున్నది.

"నేను జబ్బుపడ్డనాటి పాతిక రూపాయలూ తీర్చలేదు. రేపటి పనికి అధమము పాతికయినా కావాలి. ఎక్కడినుంచి వస్తాయి? ఏమీ తోచటము లేదు" అన్నాడు.

"అవును ఎక్కడినుంచి వస్తాయి? ఈపూట ఎట్లా గడిచిందో చూశావు కదా? రేపు ప్రొద్దుటికి చేరెడు పిండీ లేదు. పిడికెడు గింజలూ లేవు"

"నాకు తెలియదనుకున్నావా వెఱ్ఱి పిల్లా!.... తెలిసి ఏం చెయ్యను? నాకు తెలుసునని నీకు తెలిస్తే మరీ ధైర్యము విడుస్తావు" అన్నాడు గడ్డము తడిమి చూసుకుంటూ.

"పాతిక రూపాయలు మనకెట్లా పుట్టాయని? ఎవరి నడిగితే ఇస్తారు? మననెవరు నమ్ముతారు?" అంటూ పెదవి విరిచాడు రంగన్న.

"పోనీ మన దగ్గర ఏదయినా ఉంటే రూపాయలను పుట్టించగలము కాని. ఏమీ లేదుగా.... నీకు తెలియనిది నా మెడలో ఏదయినా ఉన్నదా?" తలవంచుకొని తన మెడలో నున్న నల్లపూసలను పట్టి చూసుకున్నది. మెడలోని గుండ్లూ చెవుల గెంటీలు అమ్మివేసి ఎనిమిది నెలలయింది. చేతి కడియాలను పిల్లకు జబ్బు చేసి నప్పుడు కుదువబెట్టి తీర్చలేకపోయాడు. ఆ వస్తువులన్నీ శాయి ఎదుట నాట్యము చేయసాగినవి.

"నీ మెడలో ఏమున్నదో నాకు తెలియకనే మాట్లాడుతున్నానా? ఆ నల్ల పూస లయినా ఉంచావా-కుంటివాడి నల్లపూసలు నా కెందుకని తెంపి పారేశావా?"

"మంచిమాటే! నాకు నల్లపూసలు కట్టిననాడు కుంటితనము లేదుగా!" అంటూ మూతి తిప్పింది శాయి.

అట్లా మాట్లాడుతూ ఉండగానే కళ్ళమీదికి నిద్ర వచ్చింది. ఆ చాపమీదనే ముడుచుకొని మంగను దగ్గరికి తీసుకొని శాయి నిద్రపోయింది.

ప్రాపంచిక కష్టసుఖాలను తాత్కాలికముగా మరపించి శారీరకముగాను, మానసికముగాను శాంతిని కలుగచేసి చైతన్యము నిచ్చేది సుషుప్తావస్థ ఒక్కటే. అదే పేదవారి యెడల కూడా నిష్పక్షపాతముగా ప్రకృతి చూపించే సర్వ సమత్వము!

రంయిమని గాలివీచి, చుట్టు ప్రక్కల నున్న పెంట పోగుల మీద చెత్త పైకి లేచింది.

మరొక గంట తరువాత సన్నటి తుప్పర రాల నారంభించింది. ప్రౌఢ స్త్ర మానమూ కష్టించిన కార్మిక దేహాలలో ఒక్కటైనా ఆ సన్నటి జల్లుకు కదలలేదు.

* * * *

ఉదయము ఆరుగంటలకే శాయి లేచి వాకిలి ఊడ్చి నీళ్ళు చల్లింది. రొట్టె చేసి పనిలోనికి పోదామనుకొన్నది కాని పొయ్యిలోకి కట్టెలేదు - రొట్టెకు పిండీ లేదు.

ఆ చుట్టుప్రక్కల గుడిసెల వాళ్ళందరినీ సలహా అడిగి వచ్చింది శాయి. అందరిలోకీ వీరి చెప్పిన సలహా సుమారనిపించినది శాయికి. గళ్ళ లుంగీవాళ్ళు అప్పులు యిస్తారనీ, వడ్డీ రూపాయకు పావలా వంతున తీసుకుంటారనీ, కచ్చిత ముగా నెల నెలకూ వడ్డీ వసూలుచేస్తారనీ చెప్పింది. ఆ దినము తొమ్మిది గంట లకు తమ గుడిసెకు వస్తాడనీ అవసరమయితే తనకు తెలపమనీ చెప్పింది.

రంగన్నతో శాయి ఈ మాట అనగానే "అమ్మో! వాళ్ళ దగ్గరే తీసుకోవ టము?" అన్నాడు. వాళ్ళను గురించి అనేక భయంకర వార్తలను విన్నాడు - కాని 'ఆ మాత్రము బదులుకు అప్పు యిచ్చేవాళ్ళు ఎవరు' అన్న సమాధానముతో తల వొగ్గ వలసి వచ్చినది. సుమారు పదిగంటల వేళ పాతిక రూపాయలు లెక్క పెట్టి తీసుకొని అందులో ఆరు రూపాయల పావలా ఆ నెల వడ్డీక్రింద గళ్ళ లుంగీ వానికి ఇచ్చారు శాయీ రంగన్నాను.

సంవత్సరము దాటింది. ఈఏడాదిలో ఆర్థికమాంద్యము మబ్బులు ఆకాశాన్ని ఆవరించినట్టుగా శాయీ రంగన్నలను ఆవరించి కదలకుండా చుట్టివేసింది. రంగన్న కూలికి పోలేకపోగా మరీ జబ్బునపడ్డాడు. శాయి ఒక్కతే నౌకరీచేసి తెచ్చేజీతము చాలటములేదు.

సిగరెట్టు ఫ్యాక్టరీ కూలీలకు వేతనాలు ఎక్కువ ఇస్తారని శాయి వింటూ వచ్చింది. అక్కడికి వెళ్ళవలెనని ఆశకలిగింది. అగూడెములో చాలా మంది వెళ్ళుతుంటే తానూ వెళ్ళింది.

అక్కడ పనిచేయుటానికి వచ్చినవాళ్ళను మాట్లాడి ఏర్పాటు చేయటానికి ఒక మేనేజరు కుర్చీమీద కూర్చుని విలాసంగా ధూమపానము చేస్తున్నాడు.

ఆ దినము ముప్పైమంది వరకూ వచ్చారు. కూలి పని కోసము వచ్చిన వాళ్ళలో పాతిక సంవత్సరాలలోపు వాళ్ళనూ - కంటికి ఇంపుగా ఉన్నవాళ్ళనూ ఏరి చీటీలిచ్చి లోపలికి పంపాడు. ఆవిధముగా రెండు అంచెలమీద చీట్లు తీసుకొని లోపలికి వెళ్ళివచ్చారు. వాళ్ళతో శాయి కూడ లోపలికి వెళ్ళి ఒకరోజు పనిచేసి వచ్చింది. అక్కడవున్న అధికారులకూ వాళ్ళచేతిక్రింది వాళ్ళకూ అన్ని విధములా లొంగిఉంటేనే గాని అక్కడ పనిచేయటము కుదరదు. ఫ్యాక్టరీలో పనికి కుదిరిన మరునిముషానికే శాయికీ విషయము గ్రాహ్య మయినది. అక్కడి వాతావరణము శాయికి కడుపులో వికారపెట్ట నారంభించింది.

ఆ మరునాడు-చేసిన కూలీకూడా చేతిలో వేయించుకోకుండానే ఫ్యాక్టరీ లోనికి శాయి వెళ్ళటము మానివేసింది.

ఈస్థితిలో రంగన్న ఆరోగ్యము మరింత దిగనాసిల్లిపోయింది మందు ఇప్పించటానికి కూడా శాయి దగ్గర చిల్లిగైెస అయినా లేదు. వారి వీరి సలహాలా మీద రంగన్నను ఆసుపత్రిలో చేర్పించింది.

క్రొత్త అప్పుకు నెలకు ఆరుంబావలా వంతున నెలనెలకూ యిస్తూఉండాలి. పాతఅప్పు అట్లాగే ఉన్నది. అక్కడికే శాయి రెండవపూట భోజనము వదలి పెట్టింది. ఇన్నాళ్ళూ చేసిన నౌకరీలోనే తిరిగి ప్రవేశించి వచ్చిన జీతములో సగము అప్పులకు కట్టుతూ ఉన్నదానితో కాలక్షేపము చేయటము కష్టమై పోతున్నది.

ఆరోజు కారోజు రంగన్నకు వ్యాధి ఎక్కువై పోతున్నది. డబ్బు ఖర్చు పెట్టుకొని మందుకొని తెచ్చినట్లయితే ఇంజక్షను యిస్తానన్నాడు డాక్టరు. ఆ మాటకయినా ఎంతోసేపు శాయి కాళ్ళమీదపడి బ్రతిమిలాడగా ఏడవగా అనగలిగాడు

మందుకొరకు ఎనిమిది రూపాయలు ఖర్చుపెట్టుకొని తెస్తే యిస్తాడు..... కాని మందుకయే ఎనిమిది రూపాయల మాట చిక్కు ప్రశ్నే! ఆ రాత్రి తెల్లవారే వరకూ తలకొట్టుకొని ఆలోచించింది శాయి. ఆమె యోచనవల్ల కాలహరణమే గాని ఆణాడబ్బులు పుట్టించే ఆలోచనన్నైనా మనసుకు తట్టలేదు.

చివరకు ఆమె తెగించి అప్పుకుకట్టే వడ్డీ రూపాయలకు మరికొంతచేబదులు చేర్చి మందుకొని రంగన్నకు ఇంజక్షను యిప్పించింది

ఆ మరునాడా వడ్డీవసూలు చేసుకోవటానికి గళ్ళ లుంగీవాడు రానేవచ్చాడు.

కాళ్ళు పట్టుకొని వచ్చే నెలలో యిస్తానని బ్రతిమిలాడి అప్పటికి గండము నుండి తప్పుకున్నది శాయి. వచ్చే నెలలో రెండు నెలల వడ్డీ యిచ్చే షరతుమీద గళ్ళలుంగీవాడు వెళ్ళినాడు.

నెలకు శాయి రాబడి ఇరవై రూపాయి కాగితాలు మాత్రమే. రాబడికి పెరుగుదల కనబడటము లేదు-కాని ఖర్చులు మాత్రము ఆమె శక్తికిమించి వెర్రి తలలు వేసనట్లే ఉన్నాయి.

సాయంకాలము ఆరు గంటలవేళ శాయి కాళ్ళుఈడ్చుకుంటూ ఆసుపత్రి నుండి ఇంటికివచ్చి గుడిసె ముందర కూలబడి పోయింది.

రంగన్నకు క్రిందటిసారి యిచ్చిన ఇంజక్షను బాగా పనిచేసింది. మరిరెండు ఇంజక్షనులు ఇస్తే రంగన్న సంపూర్ణారోగ్యము పొందుతాడని డాక్టరు ఆశ చూపించాడు.

నిరాశామయమయిన శాయి జీవితములో ఆశారేఖలు పొడసూపినవి. ఇంత కాలము నుండి ఒక్కపూటనే రొట్టె తింటున్న శాయి శుష్కవదనములో ఆనందము పొంగిపోయింది.

రంగన్న....ఇంకా రెండు ఇంజక్షనులిస్తే తొలిరోజుల నాటి రంగన్న అవుతాడట. ఇంతకాలమూ అన్నిటికి తానొక్కతే సతమత మవుతున్నది. ఇంక

దేనికీ భయమూ విచారమూ ఉండవన్నమాట. ఇద్దరూ నౌకరీచేసి రెండు చేతులతో రూపాయలను సంపాదించి అప్పులన్ని తీర్చి హాయిగా ఉండవచ్చు.

కాని అందుకు వ్యయమయే రూపాయల మాటే గడ్డు సమస్య. క్రిందటి నెలదీ ఈ నెలదీ కలిపి ఒక్కసారే ఇస్తానని గళ్ళలుంగివానికి క్రిందటి నెలలోనే వాగ్దానము చేసింది. అదిపోగా మందులకు చాలిన డబ్బేది? ఎక్కడినుండి వస్తుంది?

ఒక ప్రక్క సంపూర్ణారోగ్యముతో ముసిముసి నవ్వు లొలికిస్తూ తొలినాటి రంగన్న....తన కొరకు కష్టపడి మందులుతెచ్చి జబ్బు నయము చేసినదన్న కృత జ్ఞతాసూచకమైన చూపులతో ప్రత్యక్షమవుతున్నాడు.

మరొకప్రక్క నల్లటి కోలముఖము సుర్మాపెట్టిన కుత్సితమైన కళ్ళతో ఆజానుబాహువయిన గళ్ళలుంగివాడు నడుముకు చెక్కిన జంబియామీద చెయ్యి పెట్టుకొని గడ్డము మరొకచేత్తో సవరించుకుంటూ వడ్డీపైసలకు చెయ్యి చాపుతూ ఎదురుగా కళ్ళకు కట్టినట్లుగా కనబడుతున్నాడు.

రాగరసమయమయిన శాయి హృదయము రంగన్న ఆయురారోగ్యములను అనవరతమూ కాంక్షించే శాయి అమాయకమైన హృదయము గళ్ళ లుంగీకి యిచ్చిన వాగ్దానమును త్రోసి రంగన్న మందుల వైపుకు మొగ్గుచూపించింది.

'ఏమయినా గానీ....పైనదేవుడు లేడా.... ఆగళ్ళలుంగీ వానికైనా రంగ న్నకు ఆరోగ్యము కలగటము ఇష్టము కాదా? శాయికి రంగన్న మీదగల మమ కారముకొద్దీ మరొక ఊహ తట్టనేలేదు.

రంగన్న ఆరోజుకారోజుకు రుగ్మతంతా పోయి కొత్త రక్తంతో మును పటి రంగడవుతున్నాడు. ఇంకా ఒక్కటే ఇంజక్షను ఇవ్వవలసియున్నది. అది కూడా ఇచ్చిన తర్వాత రంగన్నను ఇంటికితీసుకొని పోవచ్చునని డాక్టరు చెప్పాడు.

శాయికి పెన్నిధి దొరికినట్లే ఉన్నది.

మరునాటి ఉదయము తొమ్మిదిగంటలకు రంగన్న ఇంటికి వస్తాడు. అబ్బ! ఈ వెధవరాత్రి-ఎంతవరకూ గడచి తెల్లవారదేమి? ఇంకా ఎప్పుడు తొమ్మిదవు తుంది? రంగన్న....ఆరోగ్యము పొందిన రంగన్న ఆసుపత్రి నుండి ఇంటికి

వస్తాడు. తామిద్దరూ కలిసి సంపాదిస్తే రెండుపూటలా భోజనముచేస్తూ హాయిగా ఉండవచ్చు. వస్తున్నాడు రంగన్న....మంగి తండ్రి వస్తున్నాడు....రేపు....రేపే!

ఆరుబయట చాపవేసుకొని మంగను దగ్గరికి తీసుకొని మింటనున్న నక్షత్ర రాసినంతా గుణించింది. ఏవో ఆశలు-జీవితములో భవిష్యాన్ని ఆనందపరచుకొన వలెనన్న కాంక్షలు-తీవ్రతరమై ఊహామాత్రపు ఆనంద సుఖానుభూతిలో శాయికి కన్ను మలగినది. ఆరాత్రి ఆమె కన్నవన్నీ మధురస్వప్నాలే....రంగన్న తాను నవ్వులను వెదజల్లుకుంటూ మంగనెత్తుకొని జాతరకు పోతున్నారట....దేవుని దగ్గర ఏం కోరుకుంటావు పిల్లా! అని తోవలో రంగన్న అడుగుతాడట....శాయి తెల్లటి పలువరస పైకి కనబడకుండా నవ్వి, తల వంచుకుంటుందట....అప్పుడు రంగన్న 'నాకు తెలుసులే....గుమ్మడిపండులాంటి కొడుకు కావాలని కోరుతున్నావు కదూ!' అంటాడట.. ఇద్దరూ నవ్వుకుంటూ సాగిపోతున్నారట....ఇవే....ఆమె మధుర స్వప్నాలు తెల్లవారేనరకు,

తెల్లవారింది. శాయి లేచి వాకిలి ఊడ్చి నీళ్ళుచల్లి గుడిసెనంతా ఎర్రమన్ను తో అలికింది. సామానులన్నీ చక్కగా ఎక్కడ ఉన్న వక్కడ శుభ్రంగా సర్దింది. వంగి ముగ్గులు పెట్టుతున్న దాగుడిసెలో శాయి.

ఏడు గంటలు కావచ్చినది. తాను ఎనిమిది గంటల వరకూ ఆసుపత్రిలో ఉండాలి.

గోడలకు జాజురంగు పట్టెలుపెట్టి తన తెలివినంతా ఉపయోగించి రంగన్నను మెప్పించే రంగవల్లులతో గృహాలంకరణ చేస్తున్నది శాయి.

'రంగన్నా!' కఠోరమైన గొంతు-అధికారయుతమైన పిలుపు.

శాయి వెనుకకు తిరిగిచూచేసరికి చేతికర్రను గిరగిరత్రిప్పుతూ గళ్ళలుంగీ!

"వడ్డీ పైసలు తీసుకురా....క్రిందటి నెలవి కూడా తీసుకురా" అని ఉర్దూ ఉచ్చారణతో తెలుగు మాట్లాడుతున్నాడు.

"నీకాళ్ళు మొక్కుతా దొరా: నీకిద్దామనుకున్న రూపాయలు మంగి తండ్రి కోసము ఖర్చయినవి. ఈ ఒక్కసారి తప్పుకాయి దొరా! నీపాదాల తోడు మళ్ళీ నెలలో ఇస్తాను దొరా! అంటూ కాళ్ళమీద పడ్డది.

"నాపై సలుపెట్టి మంగి తండ్రికి మందుకొన్నావు? నీమాటలు నాదగ్గర చెల్లవు....తీసుకురా పైసలు" ఆ కఠోరస్వరముతో గుడిసె మీద తాటియాకులన్నీ ఎగిరిపోయేటట్లు అరచాడు.

"మహారాజా! ఈఒక్కసారి రక్షించు. రంగన్న ఒళ్ళు నయమై ఇంటికి వస్తున్నాడు. మీ అప్పు తీరుస్తాడు. పాదాలు పట్టుకుంటాను దొరా!" అని జాలి పుట్టేటట్టు ఏడ్చింది శాయి.

"రంగన్న ఒళ్ళు నయము చేసుకొని ఇంటికి రావాలి.... కాని నేను మాత్రము వట్టి చేతులతో పోవాలా? ఇంకా ఎన్నాళ్ళు ఊరుకోమంటావు?" అంటూ ఆమె పైటచెంగు పట్టి లాగాడు.

దేహబలము చాలావరకూ క్షీణించినా రోషావేశములో శాయికి ఎక్కడి నుండో పుట్టెడు బలము వచ్చింది. ఒక్క విదలింపు విదలించి పొలికేక ఒకటి పెట్టింది.

"వడ్డీ పైసలు అడిగితే అరచి నలుగురినీ పిలిచి గోలచేయాలని చూస్తు న్నావు? నేనెవరనుకుంటున్నావు?" అంటూ గుడ్లురిమి, నడుముకు తగిలించుకున్న కున్న జంబియా తీసి శాయి వెన్నులో ఒక్కపోటు పొడిచి పైకిలెక్కాడు-గళ్ళ లుంగి.

శాయి రక్తపు మడుగులో విలవిల తన్నుకుంటూ ఉండగా రెసిడెన్సీలోని పెద్దగడియారము తొమ్మిదిగంటలు కొట్టింది.



# నాగరీకము

వెంకటేశ్వర్లు మలకాపురము నుంచి సైకిలుమీద లేడీడాక్టరు కొరకూ టౌనులోనికి వచ్చాడు. అతడి భార్య శకుంతల గతరాత్రి నుండీ ప్రసవవేదన బడుతున్నది. ఇంట్లో ఉన్నవాళ్ళందరూ ఆతురతకొద్దీ తలకొకమాటా అంటున్నారు కొందరు ఆసుపత్రికి తీసుకొని వెళ్ళితే మంచిదంటున్నారు. ఎంతడబ్బు ఖర్చు అయినా డాక్టరును ఇంటికి తీసుకొనివస్తే మంచిదంటున్నారు కొందరు. వెంకటేశ్వర్లుకు ఎటూ తోచక ఎంత ఖర్చు అయినా వైద్యురాలిని ఇంటికి తీసుకొని వెళ్ళితేనే మంచిదేమోనని టౌనుకు వచ్చాడు.

డాక్టరు పంకజవల్లీశర్మ మంచి హస్తవాసి గల వైద్యురాలు. కానుపుకేసులలో ఇంతవరకూ ఆమెకు అపజయమన్నది లేదు. ఆమె పేరు గ్రామగ్రామాలలో ప్రాకిపోయింది. నాలుగు సంవత్సరాల క్రిందట నేత్రవైద్యములో ప్రవీణుడైన రామశర్మను వివాహము చేసుకొన్నది. డాక్టరు పంకజవల్లీశర్మ అంటే అక్కడి మహిళామణుల కందరికీ ఎంతో అభిమానము. విద్యావంతురాలనీ విజ్ఞానవంతురాలనీ వైద్యములో సాటిలేని ప్రజ్ఞకలదనీ ఆమె నొక దేవతగా భావించారు. అక్కడ మహిళాసంఘము పక్షమున స్థాపించబడిన ఫ్యామిలీ ప్లానింగ్ సెంటర్లలో వారానికి రెండు పర్యాయములు ఉపన్యసించ వలసినదని ఎంతగానో ప్రాధేయపడి ఆమెను ఏర్పాటు చేసుకొన్నారు.

ఉపన్యాసాలు విన్నవారు ఆమె వచో మాధుర్యానికీ విషయవైశద్యానికీ సమ్మోహితులైపోయేవారు.

ఆమె ఉపన్యాసాలను గురించి ఎప్పటికప్పుడు వెంకటేశ్వర్లూ శకుంతలా పత్రికలలో చదువుతూ ఉండేవారు. టౌను లోనికి రాగానే వెంకటేశ్వర్లకు డాక్టరు పంకజవల్లీశర్మ పేరు తటాలున జ్ఞాపకము వచ్చి ఆమె యింటికి వెళ్ళాడు, ఆమె ఏదో పనిమీద బైటికి వెళ్ళినదని ఒక గంటసేపటిలో వస్తుందనీ తెలిసింది

ఉదయము తొమ్మిది గంటలకు ఇంటి నుండి బయలుదేరాడు వెంకటేశ్వర్లు. అప్పుడే పదకొండు గంటలు దాటిపోయినాయి. అతడిని ఆకలి ఒకప్రక్కనా శకుంతలను గురించిన ఆతురత ఒక ప్రక్కనా పేధించ నారంభించినవి. ఇంకొక గంట, అంటే పన్నెండు గంటలు దాటితేనే గాని డాక్టరు రాదు.

డాక్టరువచ్చేవరకూ క్షణమొక యుగముగా లెక్కించుకుంటూ వాకిటి వరండాలో పచారుచేయటము మొదలుపెట్టాడు వెంకటేశ్వర్లు.

సుమారు ఒంటిగంటకు డాక్టరు పంకజవల్లీశర్మ కారు పోర్టికోలోకి వచ్చి ఆగింది. ఆమె కారు దిగుతుండగానే ఎదురుగా వెళ్ళి తన సంగతిని చెప్పుకున్నాడు వెంకటేశ్వర్లు. ఒక అరగంటలో వస్తానని ఆమె లోపలికి వెళ్ళింది.

అరగంట-ముప్పావుగంట గడచిపోయినది గాని వైద్యురాలు బయటికి రాలేదు

భార్యను గురించి ఆందోళన పడుతున్న వెంకటేశ్వర్లకు ఆమె చేస్తున్న ఆలస్యానికి విసుగుపుట్టుతున్నది. కాని మరొకసారి ఆమెను పిలిచి తొందరపెట్టితే 'పల్లెటూరి వాడని' అంటుందేమోనని భయపడి తలుపుదగ్గరగా గోడకు ఆనుకొని నిలువబడ్డాడు వెంకటేశ్వర్లు.

లోపలినుంచి ఏవో మాటలు వెంకటేశ్వర్లకు అస్పష్టముగా వినుపించాయి.

"నేను ఆలస్యముగా వచ్చానని కోపము వచ్చిందా? ... ఆఁ? . ఎందుకూ అంత కోపము?" ఎంతో బుజ్జగిస్తున్నట్లుగా బతిమిలాడుతున్నట్లుగా ఉన్నది కంఠధ్వని. ఆ ధ్వని డాక్టరు పంకజవల్లీ శర్మగి.

కోపము వచ్చిన భర్తను బ్రతిమిలాడుతున్నది కాబోలు. ఆమె ఎంతటి విద్యావతి అయినా ఎంతడబ్బు సంపాదించి పేరు తెచ్చుకుంటున్నా భర్తను బ్రతిమిలాడుకొని ప్రాధేయపడటము స్త్రీకి తప్పదుకదా అనుకున్నాడు వెంకటేశ్వర్లు. 'విక్టోరియా రాణితో-ఆల్బర్టు అప్పుడప్పుడు తగాదాపడి ఇలాగే బ్రతిమిలాడించుకొనే వాడట. ఎట్లాగయినా పురుషుడు పురుషుడే' అనుకున్నాడు వెంకటేశ్వర్లు.

ఆ గదిలోని సంభాషణను చివరవరకూ వినవలెనని వెంకటేశ్వర్లకు కుతూహలము కలిగి తలుపుకు చెవి ఆనించి వినటము మొదలుపెట్టాడు

"నేను ఇంటికి రావటము ఆలస్యమైనదని దానికెంత కోపము వచ్చిందో చూశారా? నేను అక్కడికి వెళ్ళానన్నమాటే గాని నా ప్రాణమంతా దీని మీదనే కొట్టుకొని పోయిందంటే నమ్మండి....చూడండి నేను బిస్కట్లుయిస్తే తీసుకోదుట దగ్గరికి రమ్మంటే రాదుట....పోనీ మీరు దగ్గరకు పిలిచి కూర్చో బెట్టుకోండి. ముఖము చిన్నబుచ్చుకొని అమూలకు వెళ్ళి ఎట్లా నిలబడిందో చూడండి".

ఈ కంఠధ్వని వైద్యురాలిది. ఆమె ఎవరిని గురించి మాట్లాడుతున్నది? వెంకటేశ్వర్లకు అర్థము కాలేదు.

"దా. .దా ..నాదగ్గరికి రా... మమ్మీ మీద కోపము వచ్చిందా?"

ఇది స్పష్టముగా మగ గొంతు - డాక్టరు శర్మదై యుంటుంది అనుకున్నాడు వెంకటేశ్వర్లు.

"అబ్బ! దీనికెంత కోపమనుకున్నారు? నేను హాస్పిటల్‌కు వెళ్లతూ మొన్న దీనిని కారులో కూర్చోబెట్టుకొని తీసికొని వెళ్లతున్నాను. అక్కడ నాతో కూడా పనిచేసే డాక్టరు తన కారు చెడిపోయిందని ఈకారులో వస్తానంటే సరేనని ముందు సీటులో కూర్చోమన్నాను. ఆస్థలము దీనిదట. ఎంతలాగినా అక్కడ నుంచి రాక మారాము చేసింది. నేను బలవంతముగా ఎత్తుకొని నాఒడిలో కూర్చోబెట్టుకున్నాను. ఆకోపము మనసులో పెట్టుకొని ఆ రోజంతా నా దగ్గరికి రాలేదు"

తరువాత ముద్దుపెట్టుకున్న శబ్దము వినిపించింది వెంకటేశ్వర్లకు.

'అయితే...ఊరివారందరికీ జన్మనిరోధము గూర్చి ఉపన్యాసాలిచ్చి బిడ్డలను కనవద్దని ఉపదేశించిన డాక్టరు పంకజవల్లీశర్మ ఇంట్లో చేసేది ఈపనా? ఈమె కూడా పిల్లలను కన్నదికదా...' అని విస్మితుడైనాడు వెంకటేశ్వర్లు.

అంతలో కళ్లు జిగేలుమనే రంగుచీర కట్టుకొని ప్రక్కతలుపు తెరుచుకొని బయటికి వస్తూ 'ఆలస్యమైనట్లుంది ..రండి వెళ్లదాము' అంటూ కారును సమీపించింది వైద్యురాలు.

'ఎంత వైద్యులైనా-స్త్రీలకు ఇంటినుంచి బయటికి రావాలంటే ఎంతో సర్దుబాటు కావాలి'అని నవ్వుతూ వెంకటేశ్వర్లు అక్కడనుండి కదిలి కారు దగ్గ

రికి వచ్చి 'నా సైకిలు ఇక్కడే ఉంచుతాను. తరువాత తెప్పించుకుంటాను' అని కారులో ముందు సీటులో కూర్చున్నాడు.

గదిలోనుండి వరెండాలోకి వచ్చి నిలువబడిన ఆయన డాక్టరు శర్మ అయి ఉంటాడు. ఎరుపు డాలు గల కుక్కను ఎత్తుకొని 'మమ్మీనిచూడు... తొందరగా రమ్మని చెయ్యి ఊపు' అంటూ కుక్కను ముద్దు పెట్టుకుంటున్నాడు.

వెంకటేశ్వర్లకు కలిగిన ఆశ్చర్యానికి అంతులేదు ఈ కుక్కపిల్లల సంతానముతో ఆనందిస్తూ తనను ఎంతసేపు వాకిట్లో నిలబెట్టిందీ వైద్యురాలు! బాగున్నది! అయినా .. ఇద్దరూ బాగా సంపాదిస్తూ మంచి ఆరోగ్యముగా ఉన్న దంపతులు కదా, ఈ కుక్కపిల్లలనూ కుందేలుపిల్లలనూ పెంచుతూ పిల్లల సరదా తీర్చుకోవటము ఏంకర్మము?" వెంకటేశ్వర్లు తనకు కలిగిన విస్మయమును దాచుకొనలేక ముఖముమీదికి కనబరచాడు.

తన కుక్కను చూచి సంతోషపడుతున్నాడనుకొని "ఏమండీ! మా హైనీ స్వీట్‌గా లేదూ?" అని వెంకటేశ్వర్లను ప్రశ్నించి 'డార్లింగ్! టా...టా...'అంటూ చెయ్యి ఊపింది డాక్టరు పంకజవల్లీ శర్మ.

డాక్టరు శర్మ తిరిగి 'టా...టా...'అంటూ కుక్కపిల్ల చేత చెయ్యి ఊపించాడు.

వైద్యదంపతుల సంతానపు ముచ్చటలను చూసి 'ఏమి నాగరికము!' అనుకున్నాడు వెంకటేశ్వర్లు. అతడికా విస్మయములో భార్య ప్రసవవేదనను గురించిన తలంపులు కొంతసేపటివరకూ దూరమైనవి.



# తారతమ్యము

మహాత్మా ప్రసూతి వైద్యశాల ఆరోజున రాత్రి పదిగంటలకే సద్దుమణగినది. క్రొత్తకేసులు రానందున పనితీర్చుకొని రాత్రిడ్యూటీ నర్సులు హాలులో కూర్చుని ముచ్చటలాడుకొనసాగారు.

సంసార సుఖానుభూతి ఎరుగని ఆనర్సులు ఉదయమున ప్రసూతి కొరకు వచ్చిన వారిని తలచుకొని విడ్డూరమూ విస్మయమూ పడిపోతున్నారు. వారిలో చేరకుండా దూరముగా ఒకమూల కూర్చుని తదేకదీక్షతో పుస్తకము చదువుకుంటున్న సిస్టరుకు వాళ్ళ నవ్వులు కేరింతలు చికాకును కలిగిస్తున్నాయి.

అంతలో హాలుకు ఎడమప్రక్కగా ఉన్న గదిలోనుండి మూలుగు ఒకటి వినబడ్డది.

హాస్యరసాస్వాదనలో కేరింతలు కొట్టుతున్న నర్సులు ఆ మూలుగును వినిపించుకొనే ధోరణిలో లేరు.

“జేసూ! నీవు చూశావా ఈ తమాషా! నాలుగవ నెంబరు గదిలో ఉన్న బాలెంతను థియేటరులోకి తీసుకొని వెళ్ళుతుంటే ఆమెతో కూడా వచ్చిన ఆయన విజిటర్సు రూములో కూర్చుని ఒకటే వణకటము మొదలుపెట్టాడు నిమిషానికొకసారి ఆమెను చూచిరమ్మంటాడు. కాలుగాలిన పిల్లి మాదిరి ఇటు అటు తిరుగుతూ చెమట తుడుచుకుంటూ, ఒక సిగరెట్టు పెట్టెను అయిదు నిమిషాలలో కాల్చి పారవేశాడనుకో! నీవు గనుక ఆయనను చూసి ఉన్నట్లయితే విరగబడి ఆయన ముందరే నవ్వేదానవు” అంటున్న దొక నర్సు.

ఈ మాటలతో వాళ్ళ నవ్వు ఇనుమడించింది. వారిలో ఒక నర్సు లేచి ఆయన పాత్రను అభినయించ నారంభించినది. మరొక నర్సు మొదటి నర్సు అభినయము తృప్తికరముగా లేదని తాను అభినయిస్తూ సిగరెట్టుకు బదులుగా పుల్ల

నౌకధానిని నోటపెట్టుకొని - రెండుచేతులు వెనుకకు పెట్టుకొని ఆహాలులో ఆమూలనుంచి ఈమూల వరకు అడుగులు వేయసాగినది. నడుమ నడుమ వెనుకకు తిరిగి "ఎట్లా ఉన్నదో ఒకసారి చూసి రావూ?" అని కనబడినవారిని బ్రతిమి లాడుతూ చెమర్చిన ముఖమును తుడుచుకుంటూ నటిస్తున్న ఆ నర్సునుచూచి గవ్వలు గలబరించినట్లు అందరూ ఒకసారి పకాలున నవ్వినారు. దానితో వారి హాస్యము మేరలుదాటి వారి విధ్యుక్తధర్మమును విస్మరింపజేసినది.

అంతలో గేటు దగ్గర సందడి వినవచ్చినది. వైద్యాలయమున కొక క్రొత్త కేసు వచ్చినది, వెంటనే నర్సులందరూ లేచి హాలులోని పెద్దదీపమును వెలిగించి వచ్చినవారిని లోపలికి తీసుకొని వెళ్ళినారు.

రాత్రి మూడవయామము దాటకముసుపు ఆమె ప్రసవించినది-ఇద్దరు అమడ బిడ్డలు పుట్టినారు, ఆమె వెంట వచ్చినవారు ఆనందభరితులైనారు, ఆమె భర్తకు ఉద్యోగములో ఇటీవలనే ఉన్నత పదవి వచ్చినదట-ప్రాజెక్టుకు పెద్ద ఇంజనీరై నాడట-శుభములో శుభము!

"తెల్లవార వచ్చినది. ఇప్పుడు నిద్రపోవట మెందుకు?" అని నర్సులు తిరిగి వినోదకాలక్షేపములో పడినారు.

అంతలో టెలిఫోను గంట మోగినది. పుస్తకము తిరుగవేస్తున్న సిస్టరు రిసీవరు అందుకున్నది.

"హలో ....అది ప్రసూతివైద్యశాలేనా? నేను ఎవరితో మాట్లాడుతున్నాను?"

"ఆ....ఇది ప్రసూతివైద్యశాలే....నేను ఇక్కడి సిస్టరును".

"రాత్రి పదకొండు గంటలకు పురిటికి వచ్చిన నిర్మలాదేవి ఎట్లా ఉన్నది?"

"ఆమె సుఖముగా ప్రసవించినది. ఇద్దరు మగబిడ్డలు పుట్టినారు."

"ఆఁ!....ఇద్దరు మగబిడ్డలా? మా నిర్మలకేనా?"

"అవును"

"అయితే చూడండీ....ఆమెతో నేను ఒక్కమాట మాట్లాడవలసి ఉన్నది. టెలిఫోనులో మాట్లాడే ఏర్పాటు చేస్తారా?"

"ప్రసవించిన బాలెంత నిద్రపోతూ ఉండగా లేపటానికి వీలులేదు".

"ఆమెతో ఒక్క నిమిషమే మాట్లాడుతాను....మీరు కొంచెము ఏర్పాటు చేయరూ?"

"నాతో చెప్పండి. ఆమె లేవగానే నేను ఆమెతో చెప్తాను"

టెలిఫోనులో పెద్ద నవ్వు వినవచ్చినది.

"ఆమెతో చెప్పవలసినది మీతో ఎట్లా చెప్పను? కైలాసనాథ్ మాట్లాడవలె ననుకుంటున్నాడని ఆమెను ఒక్కసారి లేపండి."

"క్షమించండి మీరు కైలాసనాథులైనా ఇప్పుడు బాలెంతను లేపటానికి వీలులేదు. రేపు ఉదయము వచ్చి చూడండి." అంటూ మరొకమాటకు అవకాశము లేకుండా సిస్టరు రిసీవరు పెట్టివేసినది.

"అతడు కైలాసనాథుడా?....అతని భార్యయా....ఆ అమడబిడ్డలనుకన్నది"

సిస్టరు తలలో ఫిల్మురీళ్లు ఎన్నో తిరిగిపోయినట్లయింది. ఆమె వెనుకకు తిరిగి పరధ్యానములో వస్తూ ఉండగా-రూపాయను ఎగురవేసి తలాతోకా పరీక్షి స్తున్న నర్సులు పకాలున నవ్వినారు.

"సిస్టర్! కైలాసనాథుడి నోరు ఒక్కమాటతో అట్లా మూతావేమిటి? ఆయన ఎవరు?" అని జేసు ప్రశ్నించినది.

'ఏమో!' అన్నట్లుగా చేతిసైగచేసి అక్కడినుండి సిస్టరు వెళ్ళిపోయినది. ఆమె స్వభావరీత్యా మితభాషిణి. టెలిఫోనులో సంభాషణ జరిగిన తర్వాత ఆమె హృదయమెందుకో చురుక్కుమన్నది. గాయపడిన ఆమె హృదయముపై కారము చల్లినట్లే అయినది. బలవంతముగా, ఆమె పుస్తకము తెరచి పుటలను త్రిప్ప నారంభించినది. పది పుటలయినా త్రిప్పకముందే తెల్లవారినది.

ఉదయపు పనిలో ఆమె నిమగ్నురాలై తనకు కలిగిన మానసిక కల్లోల మును మరువ ప్రయత్నించినది. పని ముగించుకొని ఆమె హాలులోనికి వచ్చే వరికి ప్రక్కగదిలోనుండి చిరపరిచితమైన కంఠధ్వనీ-నవ్వులు వినపడినవి.ఆ కంఠ ధ్వని ఆంతరంగికమైనట్లే ఆమెను ఆకర్షించినది. కాని మనసును కలవరపరచినది!

ఆలోచనా పరంపరను ప్రక్కకునెట్టి ఆమె గదులలో నున్న బాలెంతలను చూచి, తిరిగి హాలులోకి వచ్చినది. అంతలో బూట్ల శబ్దము వినబడినది. 'డాక్టరు గారు ఈవేళ ఇంత ఉదయమే వచ్చారెందుకో?' అనుకొంటూ సిస్టరు తలఎత్తి చూసినది.

సుమారు నలభయి వసంతములను దాటిన ఒక స్థూలకాయము ముందుకు నడచిపోతున్నది.

ఎనిమిది సంవత్సరాల నాటికి - ఇప్పటికి....కొంచెముగా రూపములో మార్పు చెందినప్పటికి....చేతులూపుకుంటూ....వెన్ను విరుచుకొనే నడచే అతడిని వెనుక నుండే....సిస్టరు గుర్తించినది.

* * * *

పచ్చంచు నేవీబ్లూ చీరె కట్టుకొని మెడలోని ముత్యాలహారము సవరించు కొంటూ రేవతి దాక్షిణాత్యుల ఇళ్ళకు పసుపు కుంకుమకు బయలుదేరినది. అప్పటికి భానుడు స్వర్ణకిరణాలను వెదజల్లుతూ పడమటి దిశన వెలుగుతున్నాడు.

ఆ దినము వైష్ణవులకు శ్రీకృష్ణ జన్మాష్టమి. మైసూరు అయ్యంగార్ల గృహాలలో శ్రీకృష్ణుడు రజితమయమైన డోలికలలో పట్టుపొత్తిళ్ళలో - సర్వాం తర్యామియై-సహస్ర దీపార్చనల నడుమ జగజ్జేగీయమానముగా వెలిగిపోతున్నాడు.

రేవతి మొదట శ్రీనివాస అయ్యంగారింటికి వెళ్ళినది. హాలులో తివాచీ మీద ముత్తయిదువలు కూర్చున్నారు. తూర్పుదిశగా ఒకబల్లమీద నీలిమఖమలు బట్ట పరచి దానిమీద దేవుని విగ్రహముల నమర్చినారు. వాటి నడుమ వెండి ఉయ్యాలలో పైడికృష్ణుడు ఊగుతున్నాడు. ఆ ఉయ్యాల బల్లకు మధ్యగా ఉండి వచ్చినవారందరినీ ఆకర్షించుచున్నది. ఆబల్లమీదనే మరొక ప్రక్క ఆ కృష్ణుని బాల్యక్రీడల దృశ్యము, సుద్దబొమ్మలతో అమర్చబడినది. దానిలో నందగృహిణి అయిన యశోదాదేవి పద్మాసనము వేసుకొని ఆసీనురాలై ఉన్నది. పదిమంది గొల్ల పడుచులు బాలకృష్ణుని తీసుకొనివచ్చి ఆమె ముందర నిలువబెట్టి - అతడి దుడుకు చేష్టలను చేతులను చాపి వర్ణిస్తూ చాడీలు చెప్పుతున్నారు. తామా ఊరిలో ఒక్క నిమిషమైనా ఉండలేనట్లుగా కొంతమంది చేతులను త్రిప్పుతున్నారు. ఇంత మంది చెప్పిన చాడీలను విని యశోదాదేవి మురిపెముతో బాలుని దగ్గరకు పిలచి

ంకమున కూర్చుండబెట్టుకుంటున్నట్లుగానూ - అందుకు గోపికలు ముక్కుమీద ేలు వేసుకొంటున్నట్లుగానూ భావప్రకటన మవుతున్న దా బొమ్మలలో. యశోదాదేవి ుఖములో మాతృప్రేమ పొంగి పొరలిపోతున్నట్లుగానూ - అంత అల్లరిచేసి గోపి లను ఏడిపించిన కొంటె కృష్ణుడు, ముఖము మీద చిలిపితనముతో కూడిన చిరు వ్వు చిందులాడగా మారాము సాగించుకొన్నట్లుగాను ద్యోతకమవుతున్నదా బొమ్మ లో. రేవతి ఆ దృశ్యమును తదేకదృష్టితో చూడ నారంభించింది. చూడగా ూడగా నందగృహిణి అనిర్వచనీయమైన ఆనందమును పొందుతున్నట్లుగా రేవ ికి గోచరించినది.

అంతలో అయింటి యజమానురాలైన అంబుజమ్మ పిల్లల తగవులను ర్చి రేవతి దగ్గరగా కూర్చుని కుశలప్రశ్నలు వేయగా "ఏమండి....ఈ బొమ్మ ను కొన్నారా?" అని రేవతి అడిగినది.

"లేదండి నాచేత నయినట్లు నేనే తయారుచేశాను. అదైనా ఈ పిల్లలతో పనీ సక్రమముగా చేయలేకపోతున్నాను. ప్రతిదానికి ముందుగా వాళ్ళే సిద్ధమవు ారు. ఇంతకూ....ఏమయినా బాగున్నాయా?" అన్నది అంబుజమ్మ.

"అబ్బ! మీకేమీ చేతకానట్లూ పిల్లలు చెయ్యనివ్వకపోవటము వల్ల అన్ని నులూ ఆగిపోతున్నట్లూ చెప్తారేం? మీబొమ్మలు చిత్రకళాప్రదర్శనములో పెట్ట ిగినవిగా ఉన్నాయి. మీఅయ్యంగార్లలో శ్రీకృష్ణుడి డోలికారోహణ బాగా చేస్తా ండీ. ఈదృశ్యమును ఎంతసేపు చూపినా నాకు తృప్తి కలగటము లేదుసుమా! ుఖ్యముగా ఆ యశోదాదేవీ- ఆ గోపికలూ....నాహృదయము మీద మరువరావి ుద్రలు వేస్తున్నారు. మీచేతిలో జీవకళలు ఉట్టిపడుతున్నట్లుగా విగ్రహములను యారుచేయగల శిల్పకళా నైపుణ్యము ఇమిడి ఉన్నది. ఇదంతా చూస్తూ....నేను ుంటికి వెళ్ళవలెనన్నమాటే మరచినాను!" అన్నది రేవతి.

"ఉదయాస్తమానమూ పిల్లలతో వేగుతాను కనుక నాకు అనుభవములో న్న మాతృస్వరూపాన్ని భావాలకు తగినట్లుగా చిత్రించినాను...." అన్నది అంబు మ్మ.

"మీకు ఉన్న నైపుణ్యానికి అనుభవము మెరుగులు దిద్దినది" అన్నది రేవతి.

"మాతృత్వము లేకపోతే తెలియకూడదా? ఇకముందు టెస్టుట్యూబు సంతానము బయలుదేరుతుందట. విద్యతోనూ, విజ్ఞానముతోనూ అన్ని భావాలను అన్ని రసాలను అవగాహనము చేసుకోవాలి. ప్రతిదీ అనుభవానికి రావాలంటే ఎట్లా సాధ్యమవుతుంది?" అన్నది అంబుజమ్మ.

దానితో యిద్దరి సంభాషణ టెస్టుట్యూబు సంతానము యొక్క మనస్తత్వము మీదికి మరలినది.

"చాలా అదర్శవంతముగా ఉంటుందని మావారు అంటూ ఉంటారండీ. కాని మాతృ ప్రేమతో పొంగులువారే రక్తములో బిడ్డలు పెరుగకపోతే కొన్ని లక్షణాలు లోపిస్తాయేమో నన్న సందేహము నాకు తోస్తూ ఉంటుంది సుమా!" అన్నది రేవతి

"మీరు అలా ఊహించటానికి సెంటిమెంటు కొంతవరకు కారణమేమో! అయినా యింతలో ఆపద్ధతి మన దేశానికి వస్తుందేమోనని మీకు భయముగా నున్నదా ఏమిటి?" అంటూలేచి నిలువబడిన రేవతికి అంబుజమ్మ తాంబూలమిచ్చి పంపేసింది.

రేవతి తలవంచుకొని చూపిన దృశ్యమునే మాటిమాటికీ స్మృతికి తెచ్చుకుంటూ-ఆశ్చర్యపడుతూ-ఇంటిని సమీపించింది. ఆమె తల ఎత్తగానే ఆమె పెనిమిటి కైలాసనాథుడు పొరుగింటి పాపాయిని పలుకరించి ఆడించడము కనబడ్డది. పాపాయి సమక్షములో కైలాసనాథుడు కూడా ఒక చిన్న పాపాయి వలె చూపట్టినాడు.

అంతవరకు కైలాసనాథుకు పసిబిడ్డలంటేనే చీదరింపుగా వుండేది. సంతానము దాంపత్యానికి చీడపురుగువంటిదని అందరితోను వాదించుచుతూఉండేవాడు. 'సంతానోత్పత్తి మానవ జీవిత లక్ష్యముగా వారు ఎంచుతారు-వీరు ఎంచుతారు' అని పిల్లలు గల కుటుంబాలవైపు వేలెత్తి చూపుతూ ఉండేవాడు. అంతవరకు అతని ఆదర్శానికి తోడ్పడుతూ వచ్చినది ప్రకృతేగాని సైన్సు కాదు. అయినప్పటికీ అతడు తన లక్ష్యశుద్ధి వలననే జయము కలుగుతున్నదను మానసికపు బింకముతో సంచరిస్తూ వచ్చినాడు. అటువంటి తార్కికునకు పాపాయితో పనేమి వచ్చినదో? రేవతికి ఆశ్చర్యము కలిగినది.

ఈ సంఘటన జరిగిన కొద్ది దినాలకు ఒక వారము సెలవుపెట్టి మైసూరు వెళ్ళి చూసిరావలెననుకొన్న కైలాసనాథుడికి ఏమి బుద్ధిపుట్టినదో భార్యాసహితుడై తిరుపతి వెళ్ళినాడు. స్వామి దర్శనార్థము టికెట్టుకొని లోపలికి వెళ్ళటానికి తగిన సమయము కొరకు ఎదురుచూస్తూ నిలువబడినారు దంపతులు. ఆ తీర్థప్రజలను చూడగానే కైలాసనాథుడి మనసు ఆనందముతో ఉప్పొంగసాగినది. తిరుపతి వెంకటేశ్వరులవి ఎంతటి అద్భుత చర్యలు! ఎంత దూరము నుండియైనా తన భక్తులను పిలిపించుకుంటాడట, ఇంతకాలమునుండి కైలాసనాథుడికి ఈ తలంపే లేదు తిరుపతి దేవుడి దగ్గరనుండి సమనువచ్చినట్లే ప్రయాణము తటస్థపడినది! అందుకే కాబోలు కవిభక్తులొకరు

ఏడు కొండలూ ఎక్కినివాడూ
వెంకన్నా యని మ్రొక్కినివాడూ
ఇల్లుగట్టినా పిల్లబుట్టినా
ఒళ్లు కుదిరినా పెళ్ళి జరిగినా
చిల్లరబెట్టి మ్రొక్కినివాడూ

మన దేశములో సామాన్యముగా కానరాడని అన్నారు. తిరుపతి వెంకన్న నిర్మొగమాటముగా పుస్తెదగ్గర నుండీ పుణికి పుచ్చుకుంటాడట! తరములు దాటినా మ్రొక్కుబడిని అనువంశికంగా జ్ఞాపకము చేస్తూ వడ్డీతో సహా వసూలు చేస్తాడట! మ్రొక్కుబడి అక్షరాలా చెల్లించేవరకూ కొండను దిగనీయడట!

నిలువబడిన ఒక గంట సేపటికి స్వామిదర్శనము కొరకు కైలాసనాథు దంపతులకు పిలుపు వచ్చినది. గర్భగుడిలోనికి గుమాస్తా యాత్రికులను మిత సంఖ్యలో తీసుకొని వెళ్ళుతున్నాడు. కైలాసనాథు జంటతో మరొకజంట పిల్లలతో లోపలికి వచ్చినది. ఆబిడ్డలకు ఆ ఉదయమే నీలాలు తీయించినట్లున్నారు. నున్నటి తలతో-జిలిబిలి పలుకులతో తండ్రి చేతిలో ఒకరు-తల్లి చేతిలో ఒకరు ఉండి దేవుడి ముందర చేతులను జోడించారు.

బాలద్వయాన్ని చూస్తూ నిలబడిన కైలాసనాథుడు అక్కడికి తాను వచ్చిన పనే మరచినాడు. అర్చకుడు అతడి చేతిలో తులసి దళమును పెట్టిన తరువాత — తల వెనుకకు త్రిప్పుకొని ముందునకు అడుగు వేసినాడు.

ఇంటికి వచ్చినా కైలాసనాథుడు నోటిలోనే మాట్లాడుతున్నాడు. అతడి ప్రవర్తనలో చాలా మార్పు రేవతికి కానవచ్చినది.

అది మొదలు ఆ దంపతుల ధోరణి తీగలు వదులయిన వీణానాదము వలె మారి ధోరణి మూగవారినది.

కాలచక్ర మీ ధోరణిలో రెండు పర్యాయములు గ్రీష్మమును చుట్టినది.

ఒకనాడొక దుర్ముహూర్తమున రేవతి జీవితములో అరిష్ట సూచకమైన సంఘటన ఒకటి అనుకొనకుండా జరిగిపోయినది.

ఆనాటి ఉదయమున ఎనిమిది గంటలయినా కైలాసనాథు నిద్ర నుండి లేవకపోవటమువల్ల రేవతి గదిలోకి వెళ్ళి 'నిద్రలేవరూ?' అంటూ లేపబోయినది.

రెండేళ్ళనాటి తిరుపతి దివ్యస్మృతులలో....గతరాత్రి చూచి వచ్చిన చలనచిత్ర మహిమో లేక అప్పటి దుర్ముహూర్త బలమో అతడు కలత నిద్రలోనే ఉన్నాడో దుస్వప్నమేదయినా కలిగినదో.... కాని.... "ఉదయము లేవగానే గొడ్రాలి ముఖము చూస్తే మహాపాతక"మంటూ ప్రక్కకు ముఖముత్రిప్పుకున్నాడు.

రేవతి నిశ్చేష్టురాలయినది. గొడ్రాలి ముఖము చూడకూడదా! అప్పటి వరకూ అతిడి ఆదర్శము అదేగా!

మరొకగంట తరువాత కైలాసనాథుడు లేచి నిద్రమత్తును వదలించుకొని—స్నానభోజనాదులు ముగించుకొని ఛాయామాత్రపు పశ్చాత్తాపముతో మారుమాట లేకుండా కచేరికి వెళ్ళినాడు.

సాయంకాలము ఇంటికిపోగానే అతడికి తాళము వేయబడినద్వారబంధ మెదురైనది. తన దగ్గర ఉన్న తాళపుచెవితో తాళమును తెరుస్తుండగా అతడికి చేతులు వణకినవి. అడుగులో అడుగువేస్తూ అతడు పడకగదిని సమీపించాడు.

ఆ గదిలో అరమరలు లేకుండా ఇంతకాలము నుండి ఒకదాని ప్రక్కన మరొకటి జంటగా ఉంటూ వచ్చిన మంచాలలో ఒకటి ఏభాగమున కా భాగము ఊడగొట్టబడి గోడకు చేర్చబడినది.

బట్టల బీరువాలో కూడా రేవతి స్థానము ఖాళీగానే ఉన్నది!

దంపతుల ఛాయాచిత్రముల ఫ్రేములో రేవతి చిత్రము లేదు!

అతడి అర్ధాంగి తన స్థానము ఖాళీ చేసినది.

కలతబారిన మనసుతో అతడు ఇల్లంతా తిరుగాడుతూ ఉండగా రేవతి వ్రాసిన జాబు ఒకటి అతడికి కానవచ్చినది.

అది చదువుకొని అతడు విస్తుపోయినాడు. అతడి కనుబొమలు అత్మీయముగా కలుసుకున్నవి!

"తానన్న ఆ ఒక్కమాటకూ రేవతి ఎంతపని చేసినది? తానయినా కాని మాట ఏమన్నాడనీ? అది ఉన్నమాటేగా? తానొకవేళ కానిమాటే అన్నాడనుకొన్నా రేవతి ఇంతపని చేస్తుందా?"

అతడి మానసమహోదధిలో పెద్ద మథనము జరిగినది. పురాణగాథలో వలెనే మథింపబడిన మహాసముద్రము నుండి మొదట హాలాహలము బయలు వెడలినది. అతడది అమృతముగా భావించి పానము చేసినాడు.

స్త్రీ జీవితము అరటియాకు వంటిది. అరటియాకుమీద ముల్లుపడినా-ముల్లుమీద అరటియాకు పడినా నష్టము అరటియాకుదే!

త్వరలోనే కైలాసనాథుడి హృదయానికీ అతడి గృహానికీ మరొకరు యజమానురైనారు.

నిర్మలాదేవికి పురిటి పదిరోజులూ సుఖముగా వెళ్ళినవి. ఆనాడు ఆమె యింటికి వెళ్ళే ప్రయత్నములో ఉన్నది.

* * * *

ఉద్యోగములో చేరిన చాలా కాలానికి రెట్టింపు ప్రమోషను నిర్మలాదేవి భర్తకు దొరకినది ఆసంతోషములో ఇద్దరు మగ బిడ్డలు కలిగినారని ఆ కుటుంబము అపరిమితానందములో మునకలు వేస్తున్నది. వైద్యాలయములో ఉన్నవారికందరికీ విరివిగా బహుమానాలను యిస్తున్నారు.

బట్టతో కప్పబడిన పళ్ళెమొకటి నిర్మలాదేవి సిస్టరు చేతికి అందివ్వబోయినది.

ముఖము ప్రక్కకు త్రిప్పుకొని "పదండి కారు దగ్గరికి నేనూ వస్తాను" అంటూ ఒక బిడ్డను తాను తీసుకొని నిర్మలాదేవితో కారుదగ్గరికి వెళ్ళినది.

కైలాసనాథుడు కారుదిగి తలుపు తెరచి నిలువబడినాడు.

నిర్మలాదేవి కారులో కూర్చుని ఆ పళ్ళెమును తీసుకోవలసినదిగా సిస్టరును తిరిగి ప్రార్థించింది.

తెచ్చుకొన్న గాంభీర్యముతో రెండవ బిడ్డను-కైలాసనాధు చేతిలో పెట్టి "మీరు పొందిన విజయానికి నా అభినందనాలు' అంటూ వెనుకకు మరలినది సిస్టరు.

కైలాసనాథు డామెను బాగా తేరిపార చూసి "నీవు.... రేవతివా ఏమిః" అంటూ నోరు తెరచి నిలువబడి పోయినాడు!



# సాహిత్యోద్యానము

ఆ విద్యార్థికి చదువుకుంటున్న కాలములో కూడా సారస్వతోద్యానవనములో విహరించవలెననే వాంఛ బయలుదేరకపోలేదు. కాని తండ్రి అతనిని ఎప్పుడూ ఒక కంట కనిపెట్టుతూ ఉండేవాడు. "దానికి ఇప్పుడేమి తొందరలేదుగాని ముందు బాగా చదువుకో ఈపరీక్ష కాస్తా ప్యాసయిన తరువాత నీయిష్టము వచ్చినన్ని వ్రాతలు వ్రాయవచ్చు" అని మందలిస్తూ వచ్చాడు.

తండ్రి అపేక్షించినట్లుగా ఉత్తీర్ణుడు కాకపోయినా ఒక విధముగా పరీక్షలో అయినాననిపించుకొన్నాడు విద్యార్థి, జీవితములో ఉద్యోగము చేయవలసి వచ్చిన సమస్యలూ అవసరాలు అతనికి వెంటనే కలిగాయి. విద్యార్థి ఉద్యోగము కొరకు అన్వేషించటము మొదలుపెట్టాడు

ఉద్యోగము లభించే లోపల విద్యార్థిని అనేక గృహకల్లోలాలు పీడిస్తూ ఉండేవి అయినా అతని మనసులో సారస్వతాభిలాష అణగిపోలేదు. ఉబికి ఉబికి పైకి పొంగుతూ ఉండేది.

శారదాదేవి దగ్గర ఒక చిన్న గుణమున్నది. దానిని అవగుణ మనుకొంటే ఆమెకు కోపము వస్తుందేమో! ఆమెకు పొరుగు బొత్తిగా గిట్టదంటే అందరూ నమ్మరు. అయితే తనది పైచెయ్యి కావాలి-కాకపోతే చూసీచూడనట్టే ఉంటుంది. విద్యార్థికి సంతృప్తిని కలిగించేపాటి ఉద్యోగము లభించినట్లయితే అతని సాహిత్యాభిలాష అంతచేటు పొంగకపోవునేమో! అతని ఆవేశము అలలతో పైకి లేచి ఆకాశాన్ని అంటవలెనన్న కాంక్షతో పొంగిపొరలే కడలిరాజు ఆవేశములా ఉన్నది ఉద్రేకము ఏరూపములోనైనా బయటికి వస్తేగాని అతనికి శాంతి లభించేటట్లు లేదు. అంతకంతకు అతనికి ఏమీ తోచకుండాకూడా పోయింది.

వైద్యులు కొందరన్నారు. చల్లగాలికి విహరిస్తూ ఉంటే తాపోపశమనము అవుతుందని. నాలుగు సంవత్సరాల క్రిందట జరిగినట్టుగా కవిత్వానికి-కథానికకు

పోటీలు జరుగుతాయని సరిగా ఆరోజులలోనే పత్రికలు ప్రకటించాయి. విద్యార్థి తన మనసును పట్టలేకపోయినాడు ఒకినాడు మంచి ముహూర్తము చూసుకొని - హనుమంతుడు సీతాన్వేషణకు బయలుదేరేముందర చేసే ప్రతిజ్ఞలను ముమ్మారు పఠించి బయలుదేరాడు

పురోద్యానవనము సమీపించి ఒక ద్వారము దగ్గరికి విద్యార్థి వెళ్ళాడు. లోపల ప్రవేశించటానికి అందరికీ అధికారము ఉన్నదికదా అనుకొని పాదము పెట్టబోయే సమయానికి ఇటు నుంచి ఒకరు అటునుంచి ఒకరు రానే వచ్చారు. మనిషిని నిలువవేసి 'ఎక్కడికి ఎక్కడికి?' అన్నారు.

విద్యార్థి ధైర్యస్థుడే గాని నిలువదీసి అడిగేసరికి బిత్తరపోయి 'లోపల విహరించటానికని వెళ్ళుతున్నా' నన్నాడు కాస్త సర్దుకొని.

"అక్కడ వేళ్ళాడగట్టిన బోర్డును చూశావా?" అన్నారు.

"చూశాను" అన్నాడు.

"భాషాజ్ఞానమ బాగా ఉన్నదా?"

"తగినంత ఉన్నది"

"సంస్కృతభాషా ప్రవేశము ఉన్నదా?"

"వీళ్ళతో నిజము చెప్పవలెనని ఎక్కడ వ్రాసిపెట్టివున్నదనుకొని 'కొద్దిగా ఉన్నదన్నాడు".

"నీవు ఎన్ని కావ్యాలు చదువుకొన్నావు? గురుముఖముగా చదువుకున్నావా?' ఇత్యాది ప్రశ్నలు కురిపించారు? మనసులో అధైర్యము తోచినా పైకి చికాకుగా "మీరు ఏమదికారము ఉన్నదని ఇలా ఆభ్యంతరపరుస్తున్నారు". అన్నాడు విద్యార్థి సన్నగా.

"అబ్బే! మాకేమభ్యంతరము? మేము నీ మంచికోసమే చెప్పుతున్నాము. అటువైపున మరో ద్వార మున్నది. అక్కడ కఠిన నియమాలు లేవు. యతిప్రాసల గోల అసలే లేదు. నీవంటి ఉత్సాహపరులకు అది చాలా సులువైన మార్గము"అని దారి చూపించారు.

విద్యార్థికి వాళ్ళమీద అంతగా కోపము రాలేదు. ఎందుకంటె ఇటు వీలు లేకపోయినా లోపలకి వెళ్ళటానికి మరోదారి చూపించారుగా! పెద్దపెద్ద అంగలు వేస్తూ ఆద్వారము సమీపించి లోపల అడుగుపెట్టబోతూ ఇటు అటు చూశాడు. ఎదురుగా వచ్చిన కాపరులు నలుగురు నాలుగు ప్రశ్నలువేసి 'అబ్బాయీ! నీ మాటలను బట్టి చూస్తే ఈ మార్గము చాలా సులభమైన దనగా విని వచ్చినట్లున్నావు. నీ కిష్టమయితే ఈ ప్రక్కన మరో చిన్న బాట ఉన్నది. అది నీకు తగినదని మా అభిప్రాయము' అని దారి చూపించారు. తల ఎత్తిచూడగా అది కథావీథి. ఈ మార్గాన వెళ్ళినవారితో విద్యార్థికి మంచి పరిచయమే ఉన్నది. మరీ క్రొత్త చోట కాస్త ఎరిగినవాళ్ళు కనబడితే ధైర్యముగా ఉంటుందనుకొని ఆబాటన అడుగులు వేశాడు విద్యార్థి. ఎవరో తప్పటడుగుల వాడనుకున్నారు కాబోలు నాలుగడుగులు వేసేవరకు విద్యార్థిని ఎవరూ గమనించనే లేదు. అయిదో అడుగు వేయబోయే సరికి అక్కడ సిద్ధమైనారు కాపరులు.

సాహిత్యోపాసనకు ఇది సులువైన మార్గమని తనను అందరు ఇటు నెట్టిన విషయము వాళ్ళతో చెప్పక 'ఇది నా అభిమాన మార్గము' అన్నాడు విద్యార్థి చాలాచాలా గ్రంథాలు చదివానని చెప్పాడు వాళ్లు అడగక ముందే.

'అబ్బాయీ! కాస్త నిదానించు దీనికి సూక్ష్మపరిశీలన చాలా అవసరము తెలిసిందా?'' అన్నారు.

''దీనికి నియమాలేవీ లేవు చాలా సులభమైనదని మావాళ్ళంతా అనుకోగా విన్నాను. కథానిక అంటే నే నెరిగినవీ చూసినవీ నాలుగు సంఘటనలను గుదిగ్రుచ్చి వ్రాయటమేగా! పెద్ద పెద్ద సమాసాలు అందమైనవి కొన్ని నోటికి వచ్చులెండి. అవసర మనిపించినచో వాటిని తగిలిస్తాను. కథానికా మేడ్ ఈజీ (Kathanika Made Easy అనే గ్రంథము బాగా చదివాను. నేను చిన్నకథ వ్రాయలేనని సందేహము మీకు ఇంకా వున్నదా?'' అన్నాడు విద్యార్థి.

''బాహ్య లక్షణాలైనా నీకు తెలుసునో లేదో అని మాకు సందేహముగా వున్నది. కథను పెద్దపెద్ద సమాసాలతోను వర్ణనలతోను నింపివేయకూడదయ్యా నాయనా! పఠితలకు భయ సంభ్రమాశ్చర్యాలను కలిగించే విచిత్ర సంఘటనలతో రచన చేయాలి. కథాంశము అపూర్వమైనదిగా ఉండాలి కథకు దూరముగా సాగిపోకూడదనేది సామాన్యసూత్రము. ఈ విషయాలను దృష్టిలో పెట్టుకొని-చక్కని రచనా పాటవమును సంపాదించుకొని రా'' అన్నారు.

విద్యార్థి ఇంటి దారిన పడ్డాడు. పాత పత్రికలు కథల పుస్తకాలు బాగా చదివాడు. నాలుగు రోజులలో మొదటి కథను తయారుచేయగలిగాడు. ఆ విధంగా నాలుగుకథలను వ్రాసి వెంట తీసుకొని వెళ్ళాడు.

అక్కడ అందరు వాటిని చదివారు. "అబ్బాయి! భావమే కాదోయి కథలకు భావైక్యము కూడా అవసరము. అది లేకపోతే 'తీర్థానికి తీర్థము-ప్రసాదానికి ప్రసాదము'లా ఉంటుంది. ఉదాత్తమయిన భావాలతో రచించాలి. ప్రపంచవృత్తము ప్రకటించటానికి కథానిక అనువైనది. కాని కావ్యభాషతో దాని జీవకళ కాస్తా చెదరిపోతుంది, వస్తుగ్రహణములో కూడా వైవిధ్యము వైచిత్రము కనబడచాలి దానికి తగిన నైపుణ్యము మెచ్చుకోదగినది ముఖ్యమైనదీను, కథ అంటే కబుర్లు చెప్పటమని నీవు అనుకోలేదు కదా! అన్నారు

ఈ సంఘటన తరువాత విద్యార్థి బాగా కష్టపడ్డాడు. తెలుగులోనే కాకుండా ఆంగ్లములోను హిందీలోను అందినంత వరకు చిన్నకథలను విరామము లేకుండా చదివాడు. చదివినవే తిరిగి చదువుతూ విషయాలు బాగా మననము చేసుకుంటూ గడిపాడు.

వ్యక్తిని ముందుకు తీసుకొని పోగలిగినది పట్టుదల ఒక్కటే. విద్యార్థి తన రచనలను జేబులో ఇముడ్చుకొని జరీ వల్లెవాటు గాలికి ఊగిపోతుండగా దర్జాగా ఒకనాడు ఉద్యానవనములో అడుగుపెట్టాడు. మొదట వారిని దాటుకొని పోతున్న విద్యార్థి హృదయము పొంగిపోయింది. మందహాసంతో అడుగులు వేస్తున్నాడు, ఈసారి ఎదురైనవాళ్ళకు తన రచనలను అందించి సగర్వముగా నిలుచబడ్డాడు. తన రచనలను చదివిన తరువాత వాళ్ళు లోలోపల నవ్వుకుంటుంటే విద్యార్థికి చాలా చికాకు కలిగింది సంగతేమిటని నోటితో అడగలేక కళ్ళతో అడిగాడు.

"మన సమస్యలను పాశ్చాత్య దృక్పథంతో చూశావు!" అన్నారు,

"రెండవదాని మాట?" ఎర్రబడిన ముఖముతో విద్యార్థి అడిగాడు.

"ఈ సమస్యలు మనకు ఇంకా రాలేదుగా!" అన్నారు పెదవి విరుస్తూ. "కథను చదువుతుంటే కంటితో చూస్తున్నట్టుగా ఉండాలి. మన సంఘములో లేని వాటిని ఎలా చూడగలము?" అన్నారు.

కాగితాలను తిరిగి జేబులో పెట్టుకుంటూ "సమస్యలు కావాలంటారు. చూపిస్తే అవి మనవి కావంటారు. నిర్దాక్షిణ్యముగా విసరిపారవేస్తున్నారు. ఒక్కరయినా రచయిత దృక్పథాన్ని అర్థము చేసుకోలేరు కదా!" గొణుగుతూ విద్యార్థి తిరిగి వెళ్ళిపోయాడు. ఆరు నెలల వరకు ఆ ఉద్యానవనములో అడుగు పెట్టదలచుకొనలేదు

అభిమానము వెనుకకు లాగుతున్నప్పటికీ పట్టుదల విద్యార్థిని ఒక చోట కూర్చొన నివ్వలేదు ఆరు నెలలు కాదు గదా మూడు నెలలయినా నిలువలేకపోయినాడు. విద్యార్థిని చూడగానే ఉద్యానవనములోని కావలివారు ఆప్యాయముగా పలుకరించారు. ఇంకా పై వారు చిరునవ్వుతో ఎదురొచ్చి 'నిరుత్సాహపడ్డావా అబ్బాయి! శాపిడివల్లనే మంచి పదును వస్తుంది.' అంటూ వీపుమీద తట్టారు. ఇంకా కాస్త ముందుకుపోగానే అక్కడివారు నలుగురూ విద్యార్థి రచనలన్నీ చదివి 'శరత్ రచనతో ప్రారంభించి ఇంగ్లీషు కథతో ముగించావు! అయినా మంచి శైలి పట్టుపడ్డది. దీని మూలాధారము తెలియనివాళ్ళకు నీవు స్వయంగా వ్రాసినట్లే తోస్తుంది' వరుసగా నలుగురూ కరచాలనము చేస్తూ నవ్వటము మొదలుపెట్టారు.

విద్యార్థి ముఖము చిన్నబోయింది. చివాలున లేచి ఇంటికి దారితీశాడు. ఆనాటి నుంచీ విద్యార్థి ఎన్ని కథలు వ్రాయాలని ప్రయత్నించాడో లెక్కలేదు. ప్రఖ్యాతరచయితలచే వ్రాయబడిన మనస్తత్వశాస్త్రము లన్నీ తిరగవేశాడు. అనేకమంది కథకుల స్వగతాలను అనుభవాలను తెలుసుకొన్నాడు.

ఒకనాటి సాయంకాలము ఉద్యానవనములో ప్రవేశించి తలవంచుకొని ఆలోచిస్తూ విద్యార్థి నడుస్తున్నాడు. కాగితాలు చేతిలో లేవు కనుక అందరు చూచి ఊరుకున్నారు. పదిమంది చెట్టుక్రింద చేరి కథానికా రచనమీద చర్చించుకుంటున్నారు. విద్యార్థి కూడా వాళ్ళలోచేరి వింటున్నాడు. అంతా విన్న తరువాత తాను ప్రారంభించాడు. "కథానికను ఈ విధముగా ప్రారంభించాలనీ ఈ విధముగా ముగించాలనీ నియమాలను ఏర్పరుస్తున్నారు. మీది వృథాశ్రమ అని నా నమ్మకము. కథావస్తువును కథలో వ్రాయవలసిన విషయాలను గురించి కూడా మీరే నిర్ణయము చేస్తున్నారు. మీరు అనుకున్నట్లుగా కథ ప్రారంభము కాదు ఐతే బాగుండదు. మీరు చెప్పినట్టుగా ముగింపుకువస్తే అసహ్యముగా ఉంటుంది. ఇంగ్లీషు నవలలో పేరుపొందిన వాటిని గురించి చాలమంది చెత్తగంప అనటము మీరు వినలేదేమో!

అసలు రచయితకున్న దృక్పథము విమర్శకుడికి ఉండదు చూడండి. అభిరుచి అనేది మనిషినిపట్టి భిన్నిస్తుంది. అంతమాత్రపు విశాలభావము లేకపోతే మీరు కథలను ఎట్లా చదువగలుగుతారు? కథలలో సెక్సు రాకూడదు చావు రాకూడదు ఆకలి రాకూడదు పేదవాడు రాకూడదు. అన్నీ 'కూడదు' అంటే మరి కథకు వస్తు వేది? కాగా అన్నిటిని మించినది 'స్వంతము కాదేమో' నన్న అపనమ్మకము ఒకటి. చిన్న కథలను విమర్శించటమంటే సామాన్యమైన విషయ మనుకున్నారా? వ్రాసింది బాగా లేదని అనగలరు గాని ఎట్లా ఉంటే బాగుంటుందో మచ్చుకు ఒకటి వ్రాసిచూపించండి. మీరు వ్రాయలేరుచెప్పలేరుకాని వ్రాసినవి బాగాలేవనిమాత్రముఅనగలరు'' చెమటతో దేహము తడిసిపోయి స్వరము కంపించేవరకు విద్యార్థి మాట్లాడాడు.

''నీకు కోపము వచ్చినట్లుంది అబ్బాయీ! నీకు మాదొక చిన్న సలహా. మంచి విమర్శలుంటేనే గాని మంచి రచనలు ఉత్పత్తి కావు. నిరుత్సాహ పడకుండా వ్రాస్తూ ఉండాలి'' అందరూ చేరి విద్యార్థిని సమాధానపరచి పంపివేశారు.

విద్యార్థి తలవంచుకొని ఇంటికి దారితీశాడు. పది అడుగుల దూరము వెళ్ళగానే 'మన వాళ్ళల్లో కూడా బాగా వ్రాసేవాళ్ళు ఉన్నారు. లేరని మనము అనుకోకూడదు' అని వాళ్ళనుకొన్న మాటలు చెవినపడ్డాయి.

కథారచనతో తలక్రింద లవుతున్న విద్యార్థికి ఉబలాటము ఉత్సాహము నానాటికి పెరుగుతూనే వున్నాయి.

ఒక పర్యాయము మరొక పెద్ద చర్చ జరిగింది. ''ఒక్కొక్క కాలానికి, ఒక్కొక్క విషయానికి ప్రాముఖ్యము ఉంటుంది. ఈ కాలములో వంధ్యాత్వమును గురించి వ్రాసినదానికంటె సంతాన నిరోధమును గురించి వ్రాస్తే ఆకర్షణీయముగా ఉంటుంది. వరకట్నాలు శృంగార సంభాషణలు ప్రాత సమస్య లనిపించుకొంటున్నాయి. వితంతువుల సమస్య కొట్టినపిండి. మనకు కావలసినవి విశ్వజనీనములైన సమస్యలు మానవ స్వభావములోని వైచిత్ర్యాలు - స్వభావములోని పరస్పర విరుద్ధభావముల మధ్య సంఘర్షణలు మొదలైన నూతన విషయాలు. వీటిని కథలలో చిత్రించగలిగితే రచయిత కృతకృత్యుడైనట్లు భావించవచ్చును.''

విద్యార్థి రచయితగా ఈ విషయాలలో మునిగి తేలుతున్నాడు. వ్రాయటము చింపటము ఎన్ని కాగితాలు ఖర్చయినవో-ఎంత సిరా ఖర్చయినదో!

ఏ దేశములో గాని ఏ కాలములో గాని ఏ అంతస్తులో ఉన్న వారికి గాని హృదయాన్ని కదలించే సమస్యను తీసుకొని పోతపోసిన సమాసాలతో మనోజ్ఞమైన శైలిలో కథ ప్రారంభమైనట్లుగాని ముగిసిపోయినట్లుగాని ఎవరికీ తెలియకుండా కొన్ని కథలను విద్యార్థి రచించ గలిగాడు.

ఈ పర్యాయము విద్యార్థిని రచయితగా నీరాజనాలిస్తూ ఆహ్వానించారు. ఉన్నతాసనము మీద కూర్చోబెట్టారు. పూలహారాలు వేశారు. ఉద్యానవనములో తిరుగుతున్న పదిమంది చేరి అభినందించారు.

రచయితకు ఈ సన్మానాలు తృప్తిని కలిగించలేదు కథారచనను కైవసము చేసుకొని ఉద్యానవనములోని కథామంటపములో ఆసీనుడై అగ్రతాంబూలము నందుకొనవలెనని తహతహలాడి పోతున్నాడు 'తనకు అక్కడికి వెళ్ళగల అర్హత ఉన్నదని వాళ్ళకు ఎందుకు తోచదో' అతడికి అర్థము కాలేదు.

''నాకు ఈ పూలహారాలు ఈ సన్మానాలు లక్ష్యము లేదు. నేను ఆ మంటపములో ఆసీనుడను కావాలి-అదే నా కోరిక'' అన్నాడు.

''నీవు ఆ గౌరవానికి పాత్రుడవే, నీవి ఉత్తమరచన లనిపించుకుంటాయి. వ్రాసే వారిలో నీవు మొదటి తరగతికి చెందుతావు. అందులో సందేహము లేదు'' అన్నారు

''అయితే నన్ను అక్కడికి వెళ్ళనీయరేం? ఇంకా అభ్యంతరము ఏమిటి?'' అన్నాడు రచయిత ఆందోళనతో.

వారిలో వారు నవ్వుకొన్నారు. వారిలో ఒకరు ''అక్కడికి వెళ్ళాలని అంత వ్యామోహము ఏమిటి? బాగున్నాయని మేము అన్నాముగా! అక్కడి ప్రత్యేకత ఏమిటి?'' అన్నారు.

''దాని ప్రత్యేకతను గురించి కూడా నేనే చెప్పనా? అది కథామంటపము కథారచయితకుఅగ్రస్థాన మన్నమాట! నేను తగిన అర్హతను సంపాదించానని మీరేగా అన్నది. ఇంకా ఆలస్యము దేనికి? ఏమి అభ్యంతరము?'' రచయిత విసుగుకొద్దీ చేతులను పిండుకొన్నాడు.

వాళ్ళు నవ్వుకొన్నారు. "అబ్బాయీ! ఆ మంటపము మీదికి అందరినీ వెళ్ళ నీయము. ఈస్థానములో నిలువబడి దానిని పరమావధిగా భావించి రచనలుసాగిస్తూ ఉండు. నీమంచికోసమే చెప్పుతున్నాము. అందరికి అక్కడికి వెళ్ళాలన్న ఉబలాటమే గాని తీరా అక్కడికి వెళ్ళిన తరువాత ఒక్క మంచి కథను వ్రాయలేరు. నిజము చెప్పాలంటే ఇప్పుడు నీవు నిలువబడిన స్థానమే ఉత్తమమైనది'' అన్నారు.

"మీరంతా మొదటినుంచీ నన్ను ఇట్లాగే వేధిస్తున్నారు ఎటువంటి వాళ్ళయినా ఈ పరిస్థితిలో శాంతాన్ని కోల్పోతారని మీకు తెలియదేమో! చూడండి నేను అడుగుదామనుకుంటూనే మరచిపోతున్నాను. మీకు ఈ ఉద్యానవనములో ఏమి పనో చెప్పారుకారు!'' అన్నాడు విద్యార్థి.

'మాకా!' నలుగురూ నవ్వారు. 'మాది పోలీసు శాఖ' అన్నారు.

'అందుకే నేమో మాటలు కాస్త బిరుసుగాను నిర్మొగమాటముగాను ఉన్నాయి.' విద్యార్థి గిరుక్కున వెనుకకు తిరిగాడు.

విద్యార్థి రచనలు బీరువాలు నిండిపోతున్నాయి అందరు 'బాగానే ఉన్నాయని' అంటున్నారు గాని అతడి కోరికమాత్రము అప్పటికీ ఇప్పటికీ నెరవేరలేదు.....



# తండ్రి పోలిక

రాత్రి పది గంటలవేళ అనంతరావు చేతులు రెండూ వెనక్కు పెట్టుకొని వాకిలి వరండాలో పచారు చేస్తున్నాడు.

ఉదయము ఏడుగంటలకు కాఫీ త్రాగి ఇంటినుంచి బయటికి వెళ్ళిన కొడుకు అంతవరకూ ఇంటికి రాకపోవటము అనంతరావు మనసును కలచి వేస్తున్నది. కొడుకుమీద కోపము పుట్లకొద్దీ పెరిగిపోతున్నది. తలచుకొన్నకొద్దీ ముఖము జేవురించిపోతున్నది, ఒళ్ళంతా ఆవేశముతో వణికిపోతున్నది. ఎంతరాత్రి కయినాసరే ఇంటికి రాగానే అడగదలచిన నాలుగుమాటలు ముఖము మీదనే అడిగివేయాలన్న నిశ్చయానికి వచ్చి మరింత వేగముతో పచారుచేయటము మొదలుపెట్టాడు.

పదకొండు గంటలు కొట్టిన చప్పుడు వినబడ్డది. ఇక ఆనాటికి కొడుకు రాడేమో ననుకొని విసుగుదలతో వీథి తలుపులన్నీ భద్రముగావేసి అనంతరావు తన గదిలోకి వెళ్ళుతుండగా పెరటి త్రోవన ఎప్పుడు వచ్చాడో కొడుకు తల్లి చేత అన్నము పెట్టించుకొని తింటున్నాడు.

కొడుకు ప్రవర్తనవల్ల అనంతరావు మనసంతా చెదరిపోయింది. దానికితోడు కంటబడకుండా ఉండాలని చడీచప్పుడూ లేకుండా పెరటిత్రోవన వచ్చి తల్లిచేత అన్నం పెట్టించుకొని తింటున్నాడు కొడుకు. దీనితో తన రక్తమే తనపట్ల అంత శత్రుత్వము చూపుతున్నదన్న అనుమానము రూఢి అయింది. అతడి మనసంతా మంచువలె నీళ్ళు కారడము మొదలుపెట్టింది. జీవితములో ఓటమి ప్రారంభమయిన దేమోనన్న శంకకలిగిన వెంటనే ఆవేశ మెక్కువయింది.

"శేఖరమ్! నీవు పగలంతా ముఖం తప్పించి తిరిగావు. అయినా నా ప్రశ్నకు జవాబు ఇవ్వవలసిన బాధ్యత నీమీద అట్లాగే ఉన్నది సుమా! విద్యావంతుడవయి నందుకు ఇంతో అంతో విజ్ఞానాన్ని కూడా ఆర్జించావనుకున్నాను. అయితే నా ఊహ పొరపాటేనా?" అంటూ తన మనసులో రేగిన కలతనూ, కొడుకుమీద కలి

గిన ఏహ్యభావాన్ని వ్యంగ్యార్థములో బైటికి అనేసి, అనంతరావు తన మనసును తేలికపరచుకోవటానికి ప్రయత్నించాడు.

ఇంతలో తల్లి కూర మారు వడ్డించబోయింది. శేఖరమే చెయ్యి అడ్డం పెడుతూ మంచినీళ్ళ గ్లాసు అందుకున్నాడు. 'కూర చాలా రుచిగా ఉంది నాయనా!' అంటూ తల్లి అట్లాగే నిలబడి వెయ్యబోయింది. 'వీటి రుచి నాకు తెలిసే సమయమా ఇది?' అంటూ శేఖరమ్ తల్లి కళ్ళల్లోకి చూశాడు.

'ఏమాటా మాట్లాడవేం?' అంటూ పొడిచినట్లు ప్రశ్నించాడు అంతలోనే అనంతరావు.

''నాన్నా! మీరు చెప్పినమాట నేను ఎప్పుడు వినలేదు? ఇప్పుడయినా వినటానికీ సిద్ధంగా ఉన్నాను. కాని....ఈ ఒక్క విషయములో మన్నించండి నేను బాగా ఆలోచించుకొనే జవాబు ఇస్తున్నాను'' అన్నాడు శేఖరమ్ తలవంచుకొని.

''కాదురాబాబూ! మేము కట్నం కోసము ఆశపడుతున్నా మనుకుంటావేమో ఇతరుల ధనము నాకు తృణప్రాయము. మేము చూపించిన సంబంధము విషయములో అభిప్రాయపడిన దేమిటంటే గౌరవము గల కుటుంబమనీ వంశమర్యాదలు మంచివనీను.. తెలిసిందా? పెద్దవాళ్ళు ఇంతదూరము ఎందుకు చెప్తున్నారో కాస్త గ్రహించుకో—'' అన్నాడు కొద్దిగా హెచ్చించిన ధ్వనితో.

''నేను బాగానే ఆలోచించాను నాన్నా! మనసులు కలియనదే పెళ్ళి అనిపించుకోదని ఎంతమంది విషయములో మీరు అనలేదు? ఆ పిల్ల నాకిష్టములేదో అని నేను వెయ్యిసార్లు చెప్పాను. అయినా మీరు మళ్ళీ బలవంతం చేస్తున్నారంటే, నన్ను జీవితపర్యంతము బాధపడమనేగా మీఉద్దేశ్యం? ఈకాలంలో కూడా బలవంతపు వివాహాలు జరుగుతాయంటే మనకే కాదు మన దేశానికి కూడా అప్రతిష్ఠ. ఈ విషయంలో ఇంతకంటె నన్నెక్కువ వాగించరనుకుంటాను''. తలవంచుకొని భోజనపు ళ్ళెములో చూపుడువేలితో గీతలుగీస్తూ ఉదాసీనంగా పక్కకు జరిగాడు.

''అయితే నీవు స్వతంత్రుడవని ప్రకటించావన్నమాట. నిన్ను పెంచి పెద్దవాడిని చేసినందుకు మంచిబుద్ధి చెప్పావు. ఇంకా నీకు పెద్దచదువు చెప్పించి ఏమి చేమిటో చేదామని కలలుగంటున్నాను'' భుజము మీద వేసుకొన్న తువాలును రెండు

పొర్లు దులిపి మళ్ళీ వేసుకున్నాడు అనంతరావు. గది చివరివరకు వెళ్ళి మళ్ళీ వచ్చాడు. కొడుకు ఇంకా పీటమీదనే కూర్చున్నాడు. తల్లిమాత్రము గోడకానుకొని నిలబడ్డది.

"అయితే నీవు స్వతంత్రుడవుగానే ఉండు" అంటూ గబగబా అడుగులు వేసుకుంటూ వెళ్ళి అనంతరావు తన గదిలో మంచము మీది పరుపు దులుపుకొని పడుకున్నాడు. శేఖరమ్ మీది కోపాన్ని ఎన్ని మాటల్లో వెళ్ళగక్కినా అతడి మనసు తేలికపడలేదు. కాగా మరింత భారంగాతోచింది; అనేక రకాలుగా బాధించ టము మొదలు పెట్టింది.

పెద్దకొడుకు - చేతికి ఎదిగినవాడు; అందులో చదువంతా ముగించుకుని సంపాదనకు సిద్ధంగా ఉన్నవాడు. వీడిని ఆదర్శంగా పెట్టుకొని మిగితా పిల్లలనంతా ఈ బాటన నడపాలని అనంతరావు ఆశించాడు. పెద్దకొడుకు వంశానికి తల్లివేరు వంటివాడని భావించి ఏ చిన్నలోపమూ లేకుండా పెంచాడు. శేఖరమ్‌లో ఉన్న ఉత్తమ గుణాలను చూసి పొంగిపోయేవాడు. ఒక్కొక్కసారి అతడి సంతోషము మేరలు దాటేది.

అనంతరావు మంచముమీదినుంచి లేచి, పడక కుర్చీలో కూర్చున్నాడు. మిగతా పిల్లల గతేమిటని నొసలు కొట్టుకున్నాడు. తన కష్టము—ఇరవై రెండేళ్లు పడ్డ కష్టమూ వృథా అవుతుందా? అయితే గతేమిటి?" జుట్టు పీక్కున్నాడు; కళ్ళు నులుపుకున్నాడు. కుర్చీమీదినుంచి లేచి బల్లమీది పుస్తకాలన్నీ సర్దిపెట్టుకున్నాడు, కాలెండరులో తేది మార్చి కొత్తది పెట్టాడు.

అంతలో ఇంట్లో దీపాలన్నీ ఆర్పి కాంతమ్మ వచ్చింది. ఆమె మొదటి నుంచి బలహీనురాలు. అయినా వేళకు పని చేసుకొని మంచముమీద పడుకొం టుంది. యధావిధిగా వంటచేసి పిల్లలకూ పెనిమిటికీ వడ్డిస్తుంది. కొడుకు అటు వెళ్ళగానే, తన మంచము దగ్గరికివచ్చి పడుకోబోయింది. ఆమెను చూడగానే అనంతరావుకు ఆవేశ మెక్కువయింది.

"అటువంటి పనికిమాలిన వెధవకు నేను చూడకుండా అన్నం పెడుతు న్నావా? అయితే నీకూ వాడుచేసేపని ఇష్టమున్నమాట. మిగతా పిల్లలగతి ఆలో చించవన్న మాటేగా నీవు కూడా మన గతేమిటని ఎన్నడయినా ప్రశ్నించుకో

న్నావా? వాటి వొక్కడిని చూసుకుంటే నీకు రేపటి సంగతి అక్కర్లేదు?" ఈ మాటలన్నీ విసురుగా అనేసి మళ్ళీ గదిలో దీపము పెట్టాడు అనంతరావు.

కాంతమ్మ నిర్ఘాంతపోయింది. అయినా తొందరపడదలచుకోలేదు. తను జవాబియ్యకపోతే ఆయన తగ్గుతాడనుకొని అప్పటినుంచీ నోరు కట్టేసుకొనే ఉంది.

"మాట్లాడవేం" అన్నాడు అనంతరావు ఆమె ముఖములోకి చూస్తూ.

"మాటపట్టింపులకూ, భోజనానికీ సంబంధం లేదనుకొని అన్నంపెట్టాను." అని దుప్పటి కప్పుకుంటూ పక్కకు తిరిగింది. "తాడు తెగేవరకూ లాగకూడదనుకొని, 'రారా నాయనా!' అన్నాను" అంటూ కళ్లు మూసుకొన్నది.

విసురుగా అనంతరావు కూడా తన మంచం దగ్గరికి వెళ్ళాడు దిండ్లన్నీ సర్దుకున్నాడు. ఒక మఫ్లరు తెచ్చి తెచ్చి తలకు చుట్టుకొని పడుకున్నాడు. అంత మెత్తగా ఉన్న పరుపుమీద అతడిదేహము ఆనలేదు. ఏదో పొడుస్తున్నది. ఎక్కడినుండో పొగలూ, సెగలూ తాకుతున్నాయి. ఆ బాధకొద్దీ కళ్ళుమూసుకునే తనలో తాను మాట్లాడుకోవడం మొదలు పెట్టాడు "నా జీవితంలో నేనెన్ని కష్టాలు పడ్డాను. నా స్థితికిమించి పిల్లలను పెంచాను. ఒకడు పైకివస్తే మిగతా వాళ్ళను వాడే సంరక్షిస్తాడనుకున్నానే! ఈ శేఖరాన్ని కిందికి దించకుండా కంటిలో పాప మాదిరిగా కాపాడానే. అటువంటివాడు కాస్తా భ్రష్టుడయిపోతున్నాడు. ప్రణయమూ ప్రేమా అని వల్లిస్తున్నాడు; ఏ పిల్లను పెళ్ళి చేసుకున్నా రంభలా కనబడుతుంది; ప్రేమ కూడా దానంతట అదే పుట్టుకొస్తుంది, ఎంతయినా శేఖరమ్ అనుభవము లేనివాడు. అయినా ఇతరులు చెప్పినప్పుడు వింటే ఎంత బాగుంటుంది? తండ్రి అనుభవాన్ని ఆదర్శంగా పెట్టుకొనే సదవకాశము లోకంలో ఎందరు కొడుకులకు లభిస్తుంది? తెలివిగలవాడు గాని వినియోగించుకోలేడు. ఈ పెళ్ళివల్ల శేఖరానికే కాదు. కుటుంబానికంతా నష్టము. ఈ నష్టానికి పరిహారము ఉండదు" అనుకుంటూ దొర్లటము మొదలుపెట్టాడు. ఆ దొర్లటంలో అతడికి ప్రస్తుతావస్థ అడుగునబడి నలభై అయిదు సంవత్సరాలనాటి చరిత్ర పైకి తేలి కళ్ళకుకట్టినట్లయింది.

* * * * *

అనంతరావు కప్పుడు సరిగ్గా శేఖరమ్ వయసే ఉంటుంది. బి. ఏ. చదువుతున్నాడు. ఎక్కడయినా ఉద్యోగములో ప్రవేశించి తమకు కాస్త ఆధారమవుతాడని తండ్రి సీతయ్యగారు గంపెడాశతో ఉన్నాడు. ఆడపిల్లల పెళ్ళిళ్ళవరకు

ఎదిగిన కుమారుడివల్ల సహకారము లభిస్తుందని ఆయన పొంగిపోయాడు.

అనంతరావు రెండవ సంవత్సరము బి.ఏ. లో ఉండగా వితంతు శరణాలయం మేనేజరు అప్పుడప్పుడు ఇతడిని పలకరిస్తూ ఉండేవాడు. మేనేజింగు కమిటీలో ఉన్నవారి నందరినీ పరిచయము చేశాడు. అనంతరావు తన తీరిక సమయాల్లో వాళ్ళతోచేరి కబుర్లు చెబుతూ ఉండేవాడు.

ఆ శరణాలయపు సహాయ కార్యదర్శి వయోవృద్ధుడు. అనంతరావు కనబడినప్పుడల్లా బాలవితంతువుల బాధలను గురించి కళ్ళకు కట్టినట్టుగా - హృదయం కరిగిపోయేటట్లు వర్ణించి యువకులే వాళ్ళను రక్షించాలని ఉద్బోధించేవాడు. అవన్నీ వినగా వినగా అనంతరావుకు ఆ ఆశ్రమములో ఉన్న ఒక వితంతువును వివాహమాడాలని హృదయం ఉరకలువేస్తూ ఉండేది. అతడి ఎదలో దేశభక్తి, సంఘ సంస్కారమూ పొంగి పొర్లిపోయేది. తానొక్కడే కాదు. తన కాలేజిలో ఉన్న విద్యార్థులందరూ ఆ వితంతువులను వివాహమాడి సంఘాన్నీ, దేశాన్నీ ఉద్ధరించకూడదా అన్న ఆవేశము కలిగేది.

అనంతరావు హృదయము సంస్కరణ కోసమని గంతులువేసేది, కాని ఆ శరణాలయములో ఉన్న వితంతువులలో కంటికినచ్చిన పిల్లనే వివాహమాడాలనిపించేది కాదు. మేనేజరు 'నీ కంటికి నచ్చిన పిల్లను చూసుకోవయ్యా!' అని అంటున్న కొద్దీ 'ఎవరయితే నేమి?' అనేవాడు. ఆ రోజుల్లో అతడు ఎవరితో మాట్లాడినా వితంతువుల దుర్దశను గురించే - వితంతూద్వాహాలను గురించే.

తరువాత శీఘ్రకాలంలోనే అనేకమంది సంస్కర్తల సమక్షములో గౌరవనీయులైన అధికారుల సాన్నిధ్యములో కొన్ని వందలమంది ప్రేక్షకులు 'ఆదర్శ వివాహమ'ని కరతాళధ్వనులు చేస్తుండగా అనంతరావు, కాంతమ్మ అన్న వితంతువును వివాహము చేసుకొన్నాడు. వివాహము ఆ శరణాలయంలోనే అతివైభవంగా జరిగింది. అనంతరావు ధైర్యసాహసాలను గురించి శబ్దవైచిత్రితో పెద్దలనేకులు గంభీరోపన్యాసములు చేశారు. ఎన్ని కబుర్లయినా చెప్పవచ్చు గాని కార్యాచరణకు పూనుకోవటము సామాన్యమా మరి! మొదట అన్నిటికీ సమ్మతించిన యువకు లెందరో ముహూర్తము రేపనగా మనస్థైర్యము సడలి పలాయనము చేసేవారు. అనంతరావు నిశ్చలమైన దీక్ష గలవాడు కనుక కార్యము సఫల మయిందని

సంభ్రమాశ్చర్యాలను ప్రకటించారు. అనంతరావు దంపతులను చాలామంది అభి నందించారు; సన్మానించారు; గౌరవించారు; ప్రశంసించారు.

కాంతమ్మా అనంతరావుల వివాహాన్ని గురించి పొగడని పత్రికలేదు. ఈ వార్త వాయుప్రసారము వలె పట్టణాలకూ పల్లెలకూ పాకిపోయింది.

పట్టభద్రుడయి అనంతరావు సెలవులలో వస్తున్నాడని ఇంటిదగ్గర తండ్రి ఎదురు తెన్నులు చూస్తున్నాడు. చాలా రోజుల నుంచీ అనుకుంటున్న సంబంధా లను కూతుళ్ళిద్దరికీ నిశ్చయించవచ్చునుకున్నాడు. వాళ్ళ పెళ్ళిళ్ళు కాగానే కొడుక్కు కూడా ఒక అయినింటి పిల్లను చూసి ముడిపెడదామనుకున్నాడు.

ఆ ఉదయము రైతులతో మాట్లాడి వాళ్ళను సాగనంపి లోపలికి వస్తుం డగా పెద్దక్షరాలతో అనంతరావు వివాహాన్ని గురించి ప్రకటించిన పత్రికను ఎవరో అయన చేతికి అందించారు. "ఫోటోలు కూడా ఉన్నాయి పూలహారాలతో" అంటూ వివరాలు చదువుదామని కళ్ళజోడు పెట్టుకొని చూస్తూనే గోడకు చేరగిల బడిపో యాడు; నిలువునా నీరయిపోయాడు.

ఈ వివాహఫలితముగా సీతయ్యగారి సంసారములో అనేక మార్పులు జరి గాయి. మాట ఇచ్చిన సంబంధాలు రెండూ తప్పిపోయాయి. బంధువు లందరూ బహిష్కరించారు. వృద్ధాప్యములో కలిగిన మనస్తాపము వల్ల సీతయ్యగారి ఆరో గ్యం చెడిపోయింది.

ఆకాలంలో ప్రౌఢా వివాహాలు ఆచారములో లేవు. కుమార్తెల వివాహ సమస్య వృద్ధుడిని పీడించటము మొదలు పెట్టింది అనంతరావు చేసుకున్న వివా హము వల్ల కలిగిన లోపాన్ని కప్పిపుచ్చ గలిగిన పెద్ద మొత్తాన్ని కట్నంగా ఇవ్వ గలిగిఉంటే సీతయ్యగారికి మంచి సంబంధాలు దొరికేవేమో! ఒకచేత్తో కంటినీరు తుడుచుకుంటూ వివాహయోగ్యతలేని ముదుసళ్ళకు తన ముద్దు కూతుళ్ళను కట్ట బెట్టవలసి వచ్చింది. తండ్రి దుఃఖాన్ని తమ దురవస్థను తలచుకొని తల్లిలేని ఆ ఆడ పిల్లలిద్దరూ ఎంత వ్యపనపడ్డారో దురూహ్యము.

వృద్ధాప్యములో తనకు మానసికాందోళన కలిగించిన కుమారుడిమీద వృద్ధు డికి మమకారము నశించలేదు. సంక్షోభజనితమైన కోపములో—ఏ దురనుమా

లతో నయినా జాబు వ్రాస్తే క్షమించమనీ ఒక్కసారి వచ్చి కంటికి కనబడమనీ అదే తనకు ప్రాణవాయువని బ్రతిమిలాడుతూ సీతయ్యగారు అనంతరావుకు జాబులు వ్రాశాడు. నిత్యమూ తపాలావాడు వచ్చేవరకు వాకిట్లో కర్రనానుకొని నిలువబడి వాడు తమ ఇంటిని దాటిపోగానే లోపలికివచ్చి కళ్ళు తుడుచుకొనేవాడు.

అంతలో వృద్ధుల కిచ్చిన కుమార్తెలలో రెండవఆమె వితంతువై తిరిగి తండ్రి దగ్గరికి చేరుకున్నది కుమారుడి కొరకు ఏడ్చిఏడ్చి దృష్టిమాంద్య మేర్పడిన సీతయ్యగారికి కుమార్తె వైధవ్యము కరువులో అధికమాస మయింది. స్థితిగతులు వివరించి ఎన్నిజాబులు వ్రాసినా అనంతరావు హృదయము కరుగలేదు.

తన సంతానపు వైఖరి తలచుకొని వృద్ధుడు కుమిలిపోయేవాడు. చివరకు సీతయ్యగారు తన జీవితములో అనంతరావును తిరిగి చూడలేకపోయాడు.

తన తండ్రి ఎంత గుణవంతుడు!

తన మీద ఆయనకెంత మమకారము!

వృద్ధాప్యములో తాను ఆయన నెంత దుఃఖపెట్టాడు!

అనంతరావుకు తండ్రి మాట తలపుకు రాగానే కళ్ళవెంబడి నీళ్ళరాలేయి. తానెంత కఠినుడు కాకపోతే తన యెడల అమితవాత్సల్యము చూపిన తండ్రి హృదయాన్ని బ్రద్దలు చేస్తాడు?

ఈ ఆలోచనతో అనంతరావుకు మరిగిన నూనెచుక్క ఒంటిమీద పడి నట్టుగా చురుక్కుమన్నది. ఈబాధలో మరొక భయంకరమైన విషయము స్మృతి పథాన మెరిసింది 'కొంపతీసి....తండ్రిని దుఃఖపెట్టడములో శేఖరానికి తనపోలిక రాలేదు కదా!'

పుండుమీద కారము చల్లితే మండినట్లు అనంతరావు హృదయము భగభగ మండిపోయింది.

(1962లో పద్మప్రియ ప్రచురణలవారు స్త్రీలకథానికలను 'కల్పన' పేరున చేసిన సంకలనములో చేర్చబడిన దీ కథ)



# వేమూరి వారి కోడలు

కోడికూపినప్పుడు లేచిన కామాక్షమ్మ 'గంగాదేవి మేలుకొలుపు పాటలు' పాడుతూ చల్లచేయుటము ప్రారంభించింది. నాలుగు బఱ్ఱెల పాడిగనుక అరగంటకు పైగా పట్టింది వెన్నతీయటానికి. వెన్నముంత, పెరుగుకుండ ఉట్టిమీద సర్ది ఆమె పెరట్లోకి వచ్చేసరికి అరుణరాగాలతో బాలభాస్కరుడు తూరుపుదిశనుండి తొంగి చూస్తున్నాడు.

మిగతా పాచిపను లన్నీ కోడలికి ఒప్పచెప్పి, పెరట్లో పడమటిదిశగా ఉన్న జేమచెట్టు దగ్గరకు వెళ్ళింది కామాక్షమ్మ. ఆకుకూరల మడి చెట్లపాదులు వేసి శ్రద్ధగా నీళ్ళుపోసి పెంచుతూ ప్రతిఉదయమూ వాటి అభివృద్ధిని చూసి ఆనందపడుతూ ఉంటుంది. చెట్ల నన్నిటినీ పరిశీలించి ఏదో ఒకటి కోసి ఆరోజు వంటలోకి ఉపయోగిస్తూ ఉండటమువల్ల చెట్లముఖము చూస్తేనే గాని ఆ పూట చెయ్యవలసిన వంటకాలు నిర్ణయమయేవి కావు. ఈ పాదులకు కొంచె మవతల పెద్ద జామ చెట్టొకటి ఉన్నది. పిందెలు పడి కాస్తఎదుగుతున్న దగ్గరనుండే వాటిని కాపాడటము పెద్ద పనిగా ఉన్న దామెకు, పిందెలు దోరకాయలుగా మారిన తరువాత రెండుదినాల క్రిందట నాలుగు గజాలబట్ట చింపి దృష్టి తగులక్కుండాసూ చిలుకలు కొరక్కుండానూ ఆ కాయలకు కట్టి వేసింది. రోజూ తెల్లవారి లేవగానే కట్టిన బట్టలన్నీ సరిచూసు కుంటూ ఉంటుంది.

ఆరోజు బచ్చలికూర ఏరి పప్పులో వేయాలని చేట చేత పట్టుకొని మడి దగ్గరకు వెళ్ళుతూ జామచెట్టువైపు దృష్టిని పోనిచ్చింది. చూసీ చూడటముతోటే ఆమె గుండె అదరి పోయింది?

గత రాత్రివరకూ వంటయింటి వసారాలోకి కూడా స్ఫుటంగా కనబడ్డ జేమకాయలకు కట్టిన బట్టలు, ఇప్పు డామె కంటికి రెండు తక్కువనిపిస్తున్నాయి! తెల్లవారేలోపల జరిగిన ఈ పని ఎవరిదై ఉంటుంది? ఈ ఆలోచనలో ఆమె కను

బొమలు కలుసుకొన ప్రయత్నించాయి. ఆమెదృష్టి నిశితమైన రెట్టింపు వేగముతో గోడదాటి నైరుతిదిశగా ఉన్న సుంకరవారి పెంకుటింటిమీద పడ్డది.

నిమిషము తడవులో కామాక్షమ్మ బయటికి వినబడని మంత్ర మొకటి పళ్ళుకొరుకుతూ జపించి-చేతి వేళ్ళను లోపలికి మడచి, ఒక చేతి కొకటి తాకిస్తూ పటపటలాడించించిది.

ఆమె ప్రాణము ఉసూరుమన్నది. అనకాపల్లినుండి ప్రత్యేకముగా తెప్పించి వేసిన జామచెట్టు అది. దాని కాయలు చిన్న కొబ్బరికాయలంత పరిమాణములో ఉంటాయి. తగిన ఎరువు వేస్తూ, జాగ్రత్తగా నీళ్ళుపోస్తూ కామాక్షమ్మ పెంచుతున్నదా వృక్షాన్ని దాని మొదటికాపు ఇంటి యజమాని ఆఖరు రోజులలో వచ్చింది. 'పెరట్లో కాసిన కాయగదా ! ఆయనకు పెట్టకుండా ఎట్లా తినట మని ఆపేక్షకొద్దీ జబ్బుగా ఉన్న పెనిమిటికి ఎవరూ చూడకుండా పెట్టింది. ఆయన చనిపోయిన తరువాత కొన్ని వస్తువులతోపాటు పెరటిలోని ఈ జామచెట్టుకూడా ఆమెకు బహిః ప్రాణమయింది.

'ఇంతకూ ఎన్ని గుండెలు ఉండాలి....రాత్రి వేళ ఎవరూ చూడకుండా పెరట్లో ఉన్న జామచెట్టుమీద చెయ్యి వేసి, గుడ్డ చుట్టిఉన్న రెండుకాయలు కోసుకొనిపోవటానికి ?

ఆమె కొక అనుమానము తోచి....రెండు మూడు క్షణములలో దృఢపడి పోయింది. ఆమె కోపారుణ నేత్రాలలోనుండి రెండు అగ్నిబాణాలు నైఋతిదిశగా బయలుదేరినవి.

సుంకర చంద్రమ్మగారి కోడలికి రెండేళ్ళ క్రిందట పుట్టిన కొడుకు కాక తిరిగి గర్భము నాలుగవనెల. బహుశః ఏమిటి....తప్పకుండా ఆమెకు రుచిచూపటానికే ఈ కాయలు అపహరింప బడినట్లుగా కామాక్షమ్మ మనోవీధిన ఋజువయి పోయింది. దానికి తగిన పరిహారము కొరకు ఆమె మనసు అహోరాత్రాలు విద్యుద్వేగముతో పనిచేయ నారంభించింది.

* * * * *

కామాక్షమ్మ వేమూరివారి కోడలు. నిండుమనసుతో తీయటి కోరికలతో సర్వాంగసుందరమైన దేహముతో పదిహేనవ ఏట ఆమె అత్తవారింటికి వచ్చింది.

సుంకరవారింటి కోడలు చంద్రమ్మా, వేమూరివారి కోడలు కామాక్షమ్మా పది రోజులు తేడాగా అత్తవారిళ్ళలో పాదము పెట్టారు.

ఆ గ్రామములో సుంకర రమణయ్య కరణమూ, వేమూరి భావయ్య భూస్వామీను. ఇద్దరు అన్నదమ్ములలా ఉంటూ ప్రతి విషయానికి ఒకరి నొకరు సంప్రదించుకుంటూ ఉండేవారు.

ఈ యింటికీ ఆయింటికీ కోడళ్ళు జంటగా రావడమువల్ల ఆ గ్రామములోని అంగనలు తీరిక దొరికినప్పుడూ సీలాటిరేవులోను కోడళ్ళ చక్కదనాన్ని గురించి వారు తెచ్చిన సారెలను గురించీ సమీక్షలు చేయటము మొదలుపెట్టారు.

"కామాక్షమ్మ ముఖము చూస్తేనే కడుపు నిండుతుంది. కళ్ళల్లో లక్ష్మి తాండవమాడుతున్నది" అని దీక్షితులగారి భార్య అనీ అనకముందే "ఏం బాగుంది ఆ పిల్ల ముఖము? తెలుపయినా కంటికింపుగా ఉండద్దూ? చామనచాయలో కూడా కళగల ముఖము సుంకరవారి చంద్రమ్మది. నీ వెన్నన్నా అను లక్ష్మీదేవి అడుగు పెట్టినట్టుగా పెద్దఎత్తులో సారె తెచ్చింది. గదిసామానులు కూడా బోలెడుతెచ్చింది" అని పదిమంది తోటిస్త్రీలూ కలిపి నిర్ణయము చేసేశారు.

మరునాటికల్లా సుంకరవారి కోడలు కలవారియింటి ఆడపడుచు కనుక నలుగురి నోటా మంచిదయి, సుందరి అయి గ్రామంలో పేరుపొందింది వాయు ప్రసారముతో పాటు ఈవార్తలు కామాక్షమ్మ అత్తగారి చెవులకు సోకినవి. అంత వరకూ కామాక్షమ్మ కాలిమట్టెల రవళితో రాగాలాపనిచేసే అత్తమామల హృద యాలు మారి అసంతృప్తిచాయలు వాళ్ళ ప్రవర్తనలో ద్యోతకమవుతూ ఉండేవి.

క్షణంకపాటయినా విరామమెరుగకుండా శరీరకష్టము చేసి చూపింది కామా క్షమ్మ వినయవిధేయతలతో అత్తమామలకూ భర్తకూ శుశ్రూషలు చేసింది. కాని ఎంతచేసినా వాళ్ళదృష్టిలో సుంకరవారి కోడలు అందకత్తె - పెద్దఎత్తులో సారె తెచ్చినదీ కామాక్షమ్మ అందవికారము గల పేదయింటి బాలికాను.

ఇట్లా ఉండగానే సుంకరవారి కోడలు కాపురానికి వచ్చిన రెండేళ్ళకే పండు వంటి పాపడు పాలబుగ్గలతో నట్టింట అంబాడుతూ జనముద్దుబిడ్డడైనాడు.

"వస్తుసామగ్రితో అడుగుపెట్టిన కోడలు మనమలతో ఇల్లు కళకళ లాడి స్తున్నది సుంకరవారి చంద్రమ్మ. మన పెద్దమ్మ చూడు వట్టిచేతులతో ఇంట ప్రవే

శించింది. ఇంత వటుకు బిడ్డాలేదు పాపాలేదు" అవి దినానికి పదిసార్లయినా ఆ విషయాన్ని నెమరుకు తెచ్చుకొనేవారు కామాక్షమ్మ అత్తమామలు. అడుగడుగునకు తిట్లు శాపనార్థాలు కామాక్షమ్మకు తగులుతూ ఉండేవి అప్పటినుండీ.

దైవికముగా తనపట్ల జరిగే పక్షపాతమునకు కామాక్షమ్మ ప్రారంభములో లక్ష్యపెట్టలేదు గాని నానాటికి హైన్యదశను పొందుతున్న ఆమె దైనిక జీవితము రానురాను దుర్భరమయిపో నారంభించినది. అది మొదలు ఆ యింటి మట్టి నేల కామాక్షమ్మ కాళ్ళకు కాలిన ఇనుపరేకు వలె చురచుర మండ నారంభించినది. శిరీష కుసుమకోమలమైన ఆమె హృదయము క్రమముగా రాటుదేలి జుగుప్సాయసూయలకు అలవాలమై పోయింది. అమృతమయమై, అనురాగమునకు నిలయమైన ఆమె హృదయము విషసంకీర్ణమయిపోయింది.

కాలము నిర్మొగమాటి. కామాక్షమ్మ పరిస్థితులతో సానుభూతి చూపించకుండానే....నిర్దాక్షిణ్యముతో నడచిపోతూనే ఉన్నది.

"తోటివారి అదృష్టము చూడు....ఏది ఎట్లా ఉన్నా కడుపున ఒకకాయకాస్తే అయినా బాగుండును" అని తలపోసి తలపోసి కామాక్షమ్మమామగారు దాటిపోయినాడు.

మరు సంవత్సరము పంటలో నష్టము వచ్చింది: "ఇనుపగజ్జెల తల్లి ఇంట ప్రవేశించిన దగ్గర నుండీ అంతా తుడుపే" అంటూ అత్తగారు సాధించిపోసింది

కామాక్షమ్మ మనసు సాధింపులకు కాఠిన్యపడి శిలామయ మయిపోయింది.

అత్తవారిళ్ళలో అడుగుపెట్టటము తోనే ప్రతి విషయములోను పోటీలు రావడము వల్ల కామాక్షమ్మకు చంద్రమ్మకు సన్నివేశాలు సమావేశాలు కలుగనే లేదు. సుంకరవారి కోడలిని ఉదయాస్తమానాలు పొగిడి పూజించినకొద్దీ...తన దురదృష్టాని కంతకూ ఆమె కారకురాలన్న అపోహ బీజరూపమున కామాక్షమ్మ ఎదలో నాటుకొనిపోయి నీరుచల్లిన నారువలె పెరుగ నారంభించింది. దీనికి పర్యవసానముగా చంద్రమ్మతో పరిచయములేని కామాక్షమ్మ చంద్రమ్మ విషయము రాగానే అదత్రాచు వలె కస్సుమనటమూ అపశ్రుతిగా మాట్లాడటమూ ప్రారంభించింది.

తరువాత కొద్దికాలానికే కామాక్షమ్మ గర్భము ధరించినా అత్తగారు చూచి ఆనందించే భాగ్యము కలుగలేదు. బిడ్డ తల్లి అయినా కామాక్షమ్మ హృదయము మార్పు చెందలేదు.

పోయినంత పొడుగునా పెద్దమ్మవారి సాహచర్యము కామాక్షమ్మకు తప్పి నట్లులేదు! ఒక్క క్షణమయినా విడిచి ఉండని ప్రేమ కాబోలు! కామాక్షమ్మకూ చంద్రమ్మకూ కోడళ్ళు వచ్చారు. ఈతరములో కూడా గెలుపు చంద్రమ్మదే! ఆమె కోడలే ముందుగా బిడ్డల తల్లి అయింది.

*　　　*　　　*　　　*

జామకాయల దొంగతనము జరిగిననాటి నుండీ కామాక్షమ్మ హృదయా వేదన ప్రజ్వలిస్తూనే ఉన్నది. అక్కసుతోనే ఆమెకు కడుపు నిండిపోయింది.

చీకటిపాటున ఊరిబయట ఉన్న మాల శాయన్నను సలహాఅడిగి చంద్రమ్మ కోడలిగర్భము విచ్ఛిత్తుకావడానికి తుడుపు మంత్రాలతో గుమ్మడికాయను భూస్థాపి తము చేయించింది గాని ఏమి పొరపాటు జరిగిందో మరి....నవమాసములు నిండిన తరువాత చంద్రమ్మ కోడలు చక్కటి పిల్లవాడిని కన్నది.

అప్పటి నుండి తిరిగి నూతనోపాయాల కొరకు కబుర్లు మాల శాయన్నకు చేరుతునే ఉన్నాయి. ఏవిధాన గానీ చంద్రమ్మకు నష్టము కలగాలి - కామాక్షమ్మ నిద్రపోవాలి.

నాలుగురూపాయలు చేతవేసుకొని చేరెడు గన్నేరుపప్పులు పంపాడు శాయన్న-తినే పదార్థాలలో నూరి కలిపితే ఆమె కోరికలు ఈడేరుతాయని.

ఈ యింటిమీద కాకి ఆ యింట వాలక ఎన్ని సంవత్సరాలయినదో! ఈ తిను బండారము వాళ్ళకు చేరే మార్గమూ పట్టుబడని విధమూ ఎంత యోచించినా కనబడక కొట్టుకుంటున్న కామాక్షమ్మ సుంకరవారిమనుమడిని చాకలివాడు సాయం త్రవేళ ఎత్తుకొని బజార్లవెంట తిప్పటము గమనించింది. మరునాటి సాయంత్రము గారెలు చేసేటప్పుడు ప్రత్యేకముగా రెండు గారెలను గన్నేరుపప్పులు కలిపి చేసి సిద్ధముగా వాకిట నిలబడి ఎదురుచూస్తున్నది.

సుమారు ఆరుగంటలవేళ తెల్లటి నుదుటిమీద నల్లటి చాదుచుక్క పెట్టుకొని దోరమామిడిని మించిన తొక్కు పలుకులతో చూపరులను మురిపిస్తూ చాకలివాని చెయ్యిపట్టుకుని రెండేళ్ళ బాలుడు ఆవీథిన వస్తూ ఉండటము ఆమెకంటపడ్డది.

వెంటనే ఆమె అరుగుమెట్లు దిగి వాకిలిదాటి బాలుని సమీపించి "ఎంత ముద్దుగా ఉన్నావురా బాబూ! ఎత్తుకుంటాను వస్తావా?" అంటూ బలవంతముగా చంకబెట్టుకొన్నది.

చాకలివాడు వద్దంటూనే ఉన్నాడు. పిల్లవాడు రానని మెలికలు తిరుగుతూనే ఉన్నాడు ఆమె వేటినీ లక్ష్యపెట్టకుండా తిన్నగా వంటయింటిలోకి వెళ్ళి ప్రత్యేకముగా తీసిపెట్టిన గారెల కొరకు చూసింది. పాపిష్టిపిల్లి కాబోలు బోర్లించినపళ్ళెము మీదికి దూకినట్లున్నది-ప్రత్యేకముగా తీసిపెట్టిన గారెలు రెండూ గిన్నెలో ఉన్న గారెలతో కలిసిపోయినవి.

క్షణికముగా బయలుదేరిన ఆందోళనను ప్రయత్నపూర్వకముగా తగ్గించుకొని.... ఆ గిన్నెడు గారెలలో నుండి ఏరిఏరి రెండు గారెలను పిల్లవానిచేత తినిపించి గ్లాసెడు నీళ్ళు త్రాగించి 'వెళ్తావా బాబూ!' అంటూ చాకలివాని చేతికిచ్చింది.

తెల్లవారి ఎండ ఎక్కినా తల్లి లేవలేదు. కారణమేమని కొడుకు చేతితో తట్టి లేపపోతే చల్లగా తగిలింది కామాక్షమ్మ దేహము.

ఆందోళనతో వైద్యుని పిలిపించి చూపించాడు.

"ఒక రాత్రివేళ ప్రాణము పోయి ఉంటుంది. ముందుగా తెలిస్తే ఏదయినా ప్రయత్నము చేసేవాడిని" అన్నాడు వైద్యుడు.

"ఆమె కేమి జబ్బులేందే ముందుగా ఎట్లా తెలుపను? రాత్రి నాకు భోజనము పెట్టి తాను గారెలు ఫలహారము చేసికొన్నది. ఎప్పటివలె లేస్తుందనుకున్నాను" అంటూ కొడుకు కంటతడి పెట్టాడు.



# ప చ్చ బ ం గీ

ఆ ఉదయమే నాగవల్లి పూనానుండి తిరిగి తండ్రి దగ్గరకు వచ్చింది. నాగపూరు యూనివర్సిటీ ఇంటరు పరీక్ష తప్పిపోయిన తరువాత నాగవల్లి చాలా క్రుంగిపోయింది. ఆమె తనువల్లిక పచ్చదనము కోలుపోయినది. ఎప్పుడూ ఒకటే విచారము; పరీక్ష తప్పిపోవటము ఎంత అవమానకరమైన విషయము; ఆమె ఎన్నో కలలను గన్నది తాను మొదటితరగతిలో ఉత్తీర్ణురాలవుతుందనీ-ప్రథమురాలుగనే రావచ్చునని తోటి విద్యార్థినులు అధ్యాపకులూ తన నెంతో అభినందిస్తారనీ ఎన్నో ఆలోచనలు పరీక్షఇచ్చిన దగ్గర నుండి ఆమె హృదయములో కెరటములు లేస్తూనే వచ్చాయి కాని....ఏమి లాభము; ఆమె ఆశలన్నీ పరీక్షఫలితాలు వార్తాపత్రికలో వెలువడిన నాడు ఆమె నంబరు అందుతో కనబడకపోవటముతో అడుగంటిపోయినవి.

ఆమె గదిలో నుంచి బయటికి రాలేకపోయింది. తన ముఖము ఎవరికీ చూపలేకపోయింది.

ఆమెకు అహర్నిశలు అదే దిగులూ విచారమూను. మనసు మళ్ళించుకోవాలని ఎన్నో పుస్తకాలు చదివిచూపింది. చెల్లెళ్లకు తమ్ముళ్ళకు బట్టలు కుట్టూ.... వాళ్ళకు చదువుచెప్పాలని ప్రయత్నించింది. కాని ఆమెకు ఏదీ సాధ్యము కాలేదు.

ఆమె తండ్రి వరదరాజు ఆమెతోపాటు పరీక్షపోయినందుకు విచారపడ్డాడు. ఆమె ఆ విధంగా అన్నమూ నీళ్ళూ వర్జించి చింతాభరములో మునిగిపోవటమూ చూడలేక నాలుగు నెలలపాటు మేనమామ దగ్గర పూనాలో ఉంటే కాస్త ఉత్సాహముగా ఉంటుందన్న ఉద్దేశ్యముతో నాగవల్లిని పంపించాడు.

పూనా వెళ్ళిన రెండుమూడు దినాలపాటు క్రొత్తక్రొత్తగా ఉన్నా తరువాత అడుఃళ్లో నాగవల్లికి బాగానే ప్రొద్దు జరిగింది. మేనమామ, అత్తయ్య ఆమె మేధస్సుకు విశ్రాంతి లేకుండా చేశారు. పగలు మేనత్తతో గృహకృత్యాలలో పాల్గొ

నేది. సాయంత్రము అయిదు కాగానే మేనమామ ఆఫీసు నుంచి వచ్చి ఇద్దరినీ బయటికి తీసుకొని వెళ్ళేవాడు. ఇటుఅటు తిరిగి మెల్లగా సినిమాకు చేరుకునేవారు. రాత్రి ఏ పదిగంటలకో ఇల్లుచేరుకొని భోజనానంతరము చూసివచ్చిన సినిమాల గురించి పార్కులను గురించి చర్చిస్తూ నిద్రపొయ్యేవారు.

అక్కడ ఉన్న నాలుగు నెలలలో నాగవల్లి ఆరోగ్యము బాగా అభివృద్ధి పొందింది. ఆమె తనూలత నవనవలాడ జొచ్చినది. మనిషిలో ఎప్పటివలె మంచి ఉత్సాహము కలిగినది. తప్పిపోయిన ఆమె పరీక్ష సంగతి క్రమేణ మరచింది.

క్రొత్తగా తమ్ముడు పుట్టినట్లు ఉత్తరము వచ్చేవరకు ఆమెకు ఇంటిధ్యాసే కలుగలేదు. ఆమె మనసు తిరిగి గృహోన్ముఖమై తల్లిదండ్రుల మీదికి చిన్నచెల్లెళ్ల తమ్ముళ్ల మీదికి మరలింది.

బారసాలకు రమ్మని బావమరదికి వరదరాజు ఉత్తరము వ్రాశాడు. మేనమామకు సెలవు దొరకలేదని నాగవల్లి ఒక్కతే ప్రయాణమయి వచ్చింది.

కొత్తపాప ముచ్చట దీరిన తరువాత తిరిగి కాలేజి చదువుమాట ఎత్తుతుందేమోనని వరదరాజు అనుకున్నాడు. కాని నాగవల్లి ఆమాటే తలపెట్టలేదు. పూనా నుండి తెచ్చుకున్న పుస్తకాలతోటీ అత్తయ్య దగ్గర నేర్చుకున్న వింతవింత అల్లికలతోటీ కాలక్షేపము చేస్తున్నది.

* * * *

అవి హైదరాబాదు స్టేటుకాంగ్రెసు మీద ప్రభుత్వము ఆంక్ష పెట్టిన దినాలు. నాయకుల నియంతృత్వము క్రింద చాలా మంది ప్రభుత్వశాసనాన్ని ఉల్లంఘించి కారాగార శిక్షను పొందారు. చీమలబారు వలె ఎడతెగకుండా కొంతకాలము జట్టులు జట్టులుగా కాంగ్రెసువాదులు జైలుకు వెళ్ళితేనే గాని కాంగ్రెసు బలము ప్రభుత్వానికి తెలియదని నాయకులు ప్రజలలో చాలాతీవ్రముగా ప్రబోధమూ ప్రచారమూ కావించి సంచలనము కలిగిస్తూ వచ్చారు. అయితే ఇదంతా రహస్యంగానే జరుగుతూ వచ్చినది.

ఈ జట్టులలో కూడా పేరుపొందినవాళ్ళు వచ్చినట్లయితే కాంగ్రెసుకు విలువ ఎక్కువగా ఉంటుందనీ, పెద్దలలోనే కాస్త కదలిక కలిగించాలనీ ఆ

సంఘములోని యువకబృందానికి అభిప్రాయము కలిగింది. స్వాతంత్ర్యసమర ములో నాయకు లనబడేవారు ముందుగా నడుముకట్టి బయలుదేరవలెనని యువకులు పట్టుపట్టారు. "మీరు ఫలానారోజున బయలుదేరవలసిన" దని ఆకాశరామన్న ఉత్తరాలు వ్రాయటము కొంతమంది స్త్రీలచేత ప్రబోధము చేయించటమూ ప్రారంభించారు.

ఆవేశములేని కార్యకర్తలూ, పూర్వాపరాలను ఆలోచించిన లౌకికులూ వీటి నేమీ లక్ష్యము చేయలేదు.

ఉప్పొంగిపోతున్న ఉత్సాహముతో యువకబృందము కొంతమంది స్త్రీలను సమావేశపరచారు. అందరూ కలిసి ఒక తీర్మానము చేశారు. ఒక చీరె నాలుగేసి గాజులు పచ్చటి కాగితములో చుట్టి దానికి ఎర్రటి బొట్టుపెట్టి వారి పట్టికలో ఉన్న సంఖ్యకు సరిపడే బంగీలను తయారుచేయించారు. మరునాడే చిరునామాదారులకు అందజేయాలని సంకల్పించి తగు ఏర్పాట్లు చేశారు.

మరునాడు ఉదయము ఏడుగంటలకల్లా రెండు మోటార్లలో స్త్రీజనము బయలుదేరింది. ఉత్సాహవంతులయిన విద్యార్థులు కొందరు ఈ సంఘములో చేర టము చూసి నాగవల్లి కూడా చేరి పచ్చబంగీతో బయలుదేరింది.

నిర్దేశించిన ఇంటికి వెళ్ళటము చిరునామాదారుని పిలిచి ఆ బంగీ చేతుల్లో పెట్టటము ఆ బంగీ ఏమిటో వారు తెలుసుకొనే లోపలనే 'నమస్తే' అంటూ సెలవు పుచ్చుకొని కారు ఎక్కటము ఈ విధంగా తొమ్మిది పది గంటలయే సరికల్లా అందరి పనీ పూర్తిఅయి నాగవల్లి ఒక్కతే మిగిలిపోయింది.

సుమారు తొమ్మిదిన్నర గంటలకు ఆమె వంతునకు వచ్చిన ఇంటిముందర కారు ఆగింది. నాగవల్లి దిగి చీరె సవరించుకుంటూ లోపలికి వెళ్ళింది. బయట వరండాలో కళ్ళజోడు ధరించిన ఒక యువకుడు కుర్చీలో కూర్చుని పేపరు చదువు కుంటున్నాడు.

నాగవల్లికి అతడు యజమానిగా తోచలేదు. కాని ఆమె సంకల్పము యజ మానికే స్వయంగా యివ్వాలని కనుక 'వారిని పిలువండి' అని ఆ యువకుని ఉద్దే శించి అన్నది.

"లోపల మాట్లాడుతున్నారు. మీరు కూర్చోండి. వారు వస్తారు" అంటూ ఆ యువకుడు కుర్చీ చూపించాడు.

నాగపల్లి మర్యాదగా 'సరే' నని కూర్చున్నది. కాని ఆమెకు ముళ్ళమీద కూర్చున్నట్లుగా ఉంది. ఎంతో పని ముందుపెట్టుకొని ఊరికే కూర్చున్నట్లుగా ఉంది కాని యజమానివచ్చే వరకూ కూర్చోవలసిందేనని నిశ్చయించుకున్నది కనుక ఎప్పుడు ఆయన వస్తాడా ఎప్పుడు బంగీ చేతుల్లో పెడతానా అని ఎదురు తెన్నులు చూస్తు కూర్చుండిపోయింది.

ఇంతలో 'ఆ బంగీ ఏమిటండీ' అని సామాన్యకౌతూహలంతో ఆ యువకుడు ప్రశ్నించాడు.

దానితో నాగవల్లి అమాయక హృదయము ఉద్రేకించి ఆవేశపూరితమై "కాంగ్రెసు శంఖారావములు చెవినిబడిన తరువాతకూడా త్యాగముచేసి సమరములో పాల్గొనని నాయకులకు ఈ బంగీలను బహుమానముగా ఇస్తున్నాము. ఇందులో ఒక చీరె గాజుల జత ఉన్నాయి. సౌభాగ్యలక్షణమైన పసుపు కుంకుమ చిహ్నాలు గల ఈ బంగీలను స్వీకరించి ఆడదానివలె వాటిని ధరించి ఇండ్లలోనే ఉండమని మా సలహా" అంటూ జేవురించిన ముఖమును చేతిగుడ్డతో అద్దుకున్నది.

ఆ యువకుడికి మొదట ఆశ్చర్యము తరువాత ఆపుకోలేని నవ్వూ కలిగాయి.

"స్త్రీ అబల కాదు, పురుషునితో అన్ని విషయాలలోనూ పోటీ చేయగలదని పంచలనము జరుగుతూ ఉన్నది కదా, స్త్రీజాతి బాగా ఉన్నతస్థితికి వచ్చినట్లుగా మీ ఉనికి మీ విద్య చెప్తూనే ఉన్నాయి. అట్లాంటి ఈ రోజుల్లో స్త్రీలు ధరించే చీరెలోనూ గాజులలోను అబలత్వ మెక్కడున్నదండి? అందులో స్త్రీలే స్వయముగా పురుషులకు ఇవ్వటంలో మీ స్త్రీజాతిని మీరే చిన్నచూపు చూస్తున్నారేమో నని నాకు తోస్తున్నది. బాగా ఆలోచించారా?" అంటూ వచ్చే నవ్వును పెదవులతోనే అణచి పెట్టాడు.

సన్నగా పొడుగ్గా ఉన్న నాగవల్లి తనువల్లిక జార్జెటు చీరెతో అలంకరింపబడి ఉన్నది. కనుబొమలకు నల్లటిరంగు పెదవులకు ఎర్రరంగు వేసుకున్నది. చెంపలకు గులాబిరంగు పూసుకున్నది. పులిగోళ్ళవలె దీర్ఘములయిన ఆమె చేతిగోళ్ళు ఎర్రటి రంగుతో గోరింటాకును పెట్టుకొని కడుక్కున్నట్లుగా ఉన్నాయి. ఎత్తుమడమల కాలిజోడు ధరించటమువల్ల ఆమె మరింత పొడగరిగా చూపరులకు కనబడుతున్నది. ఆమెతనువల్లిక ఆ యువకుడు వేసిన అడ్డుప్రశ్నలవల్ల రోషముతో

ఊగిపోసాగింది.

ఈ అధునాతన జవ్వనిని చూసి - ఆమె తలపెట్టిన కార్యమును చూసి యువకుడు తిరిగి నవ్వదము మొదలు పెట్టాడు.

నాగవల్లికి రోషము ఎక్కువ కాజొచ్చినది. తక్కిన వాళ్ళంతా చిరునామా దారుడు లేకపోయినా ఎవరికో ఒకరికి యిచ్చివేసి వాళ్ళపనిని త్వరలో ముగించు కున్నారు. కాని తాను వాళ్ళవలె ముభావంగా బంగీ యిచ్చివేసి రావటముగాని, లేక యింకెవరికయినా యివ్వటముగాని చేయదలచుకోలేదు. తాను వచ్చినది నాయకులకు వీరావేశము కలిగించటానికీ - ఉద్రేకము కలిగించటానికీను. ఆ విషయములో ముందు వెనుకలు చూడదలచుకోలేదు. ఆమె తన ధోరణిని ఏ మాత్రమూ తగ్గించు కోకుండా "వస్తే ఈ క్షణంలో బయటికి రండి. లేకపోతే యిందులో ఉన్నవి ధరించండి" అంటూ చెమర్చిన ముఖమును మరొకసారి చేతిగుడ్డతో అద్దుకొన్నది.

యువకునికి నవ్వాగటమే లేదు !

"చీరె గాజులు ధరించిన స్త్రీలు పురుషులకంటె ఏమి తక్కువ? అన్నిటిలో మిన్నగానే ఉన్నారు కదండీ" నడుమ నడుమ నవ్వుతూ - ఒక్కొక్క మాటా అన్నాడు.

ఆమె ఈ మాటలలోని అర్థము గ్రహించే స్థితిలో లేదు !

'ఇతడెవరూ.........అడ్డు ప్రశ్నలు వేస్తూ తనను నిలవదీసి అడగటానికి?' కోపాగ్నితో ఆమె దేహము ఒక్కసారి భగ్గు మన్నట్లయింది.

"ఈ బంగీలో ఉన్న వస్తువులను ధరించటానికి మీరే అర్హులుగా కనబడు తున్నారు. మీరే వీటిని ధరించండి" అంటూ ఆ బంగీని ఆ యువకుని మీదికి విసరి వేసి, చరచర నడచి వెళ్ళిపోయింది నాగవల్లి.

ఆ యువకుని నవ్వు కారు బయలుదేరేవరకు నాగవల్లి చెవులలో రింగు రింగు మంటూ ప్రతిధ్వనిస్తూనే ఉన్నది.

* * * * *

నాగవల్లి వరదరాజుకు ప్రథమపుత్రిక. కుమార్తె చదువు నిలిపి వేయగానే మంచి సంబంధ మొకటి చూసి వివాహము చేయవలెనని సంకల్పించాడు.

లగ్నబలము లేకనో........కళ్యాణరేఖ బయట పడకనో........ఏ సంబంధమూ నచ్చక........నచ్చినది కుదరక............రెండు సంవత్సరాలు మనస్సు స్తిమితము తప్పి విసిగి వేసారి పోయాడు.

ఒక స్నేహితుడు ఏదో పనిమీద వచ్చి వరదరాజు కోరిన మీదట ఒక సంబంధము చూపించి వివరాలు తెలిపి పోయినాడు. వరుడు ఎం. ఎ., యల్ యల్. బి. ప్యాసయినాడట. రూపము చూడతగ్గదేనట. వరదరాజు వెంటచే వెళ్ళి పెండ్లి కుమారుని చూసి వచ్చి వధూవరుల చూపులకు ఏర్పాటు చేశాడు. వారిద్దరూ ఒకరికొకరు నచ్చినట్టుగానే ముసిముసి నవ్వులు నవ్వారు. అంతా సమ్మతించారు, కోర్దిగా ఉన్న భూపతి వర నిర్ణయాని కేమీ అడ్డురాలేదు. వెంటనే జాతకాలు చూసి సిద్ధాంతులు ముహూర్తమేర్పాటు చేశారు.

సూత్రధారణ అయినతరువాత వధూవరులను లోపలికి తీసుకొనివెళ్లి ఫలహారము పెట్టున్నారు. అంతలో పెండ్లికొడుకు చెల్లెలు

'అన్నయ్యా. కళ్ళజోడుతీసి యింకెంతసేపు కూర్చుంటావు? తలనొప్పి రాదూ? నేను తీసికొనిరానా?' అంటూ అతని దగ్గరకు వచ్చి కూర్చున్నది. ఆమె అన్నకు ముద్దుచెల్లెలు కావటమువల్ల అతనిని ఒక్కక్షణమైనా ఇతరులతో మాట్లాడనియ్యదు. అన్నిటికి తానే ముందుగా సిద్ధమయ్యేది.

అతడు వధువు నొకసారి అపాదమస్తకమూ తిలకించి-చెల్లెలివైపు తిరిగి 'ఇన్స్' అంటూ ముక్కు మీద వేలు పెట్టి నివారించాడు.

నాగవల్లి వరునిముఖము చూచి అర్థము కాక తలవంచు కున్నది.

"అరుణా! నా చిన్నసంచి ఒక్కసారి తెచ్చి యిస్తావూ? మంచిదానవు కదూ. ఒక్క క్షణములో తీసుకొని రావాలి" అంటూ చెల్లెలిని, పంపాడు దాని కోసము-వరుడు.

సంచిని పట్టుకొని మూడు అంగల్లో అరుణ అన్నను చేరింది. పెళ్లికొడుకు సంచిలో ఉన్న వస్తువుతీసి వధువు చేతికిస్తూ.

'మీరే వీటిని ధరించటానికి అర్హులంటూ నీవు ఆనాడు నాకు బహుమానము చేసిన పచ్చబంగీ యిదిగో. ఈ శుభసమయాన నేను ధరించనా? పోనీలే....ప్రేమ పూర్వకముగా నీకు తిరిగి బహుమానము చేస్తాను. తీసుకో'' అన్నాడు ఆమె ముఖము చూస్తూ.

నాగవల్లి తెల్లబోయింది. దానిని చూడగానే ఆమెకు ముచ్చెమటలు పోసినవి.

మూడు సంవత్సరాలనాడు నాయకులకు బహుమానాలుగా పంపిన పచ్చ బంగీలవి!

''మీరు........మీరు........కళ్ళజోడు ధరించిన ఆ యువకులా!'' అంటూ రెండు చేతులలో ముఖము దాచుకొన్నది నాగవల్లి.

ఆనాడు నిలువెల్లా ఆమెను రోషపూరితను కావించిన ఆ యువకుని నవ్వు.... నేడు నాగవల్లిని నిలువెల్లా లజ్జింప చేసినది.



# మ హో న్న తు డు

జిల్లాజడ్జీ అయిన బ్రహ్మానందము మేడమీద ఉత్తరపువైపున ఉన్న బాల్కనీలో నిలబడి కారుకొరకు ఎదురు చూస్తున్నాడు.

ఒక చిన్న పనిమీద పోయిన అతని కారు తిరిగి వచ్చిన వెంటనే తాను బయలుదేరవలెనని దాని కొరకు ఎదురుచూస్తూ నిలబడ్డాడు.

సరిగా సాయంకాలము ఆరుగంటలకు మధ్యప్రదేశమునుండి వచ్చిన నాయకునికి క్లబ్బులో స్వాగతమివ్వనున్నారు. ఆ సంస్థ నిర్వాహకులలో ఒకడైన బ్రహ్మానందము తగు ఏర్పాట్లను స్వయముగాచేసి ఇంటికి వచ్చినాడు - తాను దుస్తులు మార్చుకొని భార్యను కూడా తీసుకొని వెళ్ళవలెనని.

ఐదున్నర అయినా కారు రాలేదు. సమయము మించిపోతున్నది, సభ్యులందరి కంటె తాను ముందుగా అక్కడికి చేరుకొన వలసిన సందర్భమూ - సమావేశమూను అది.

కారు ఇంతవరకూ రాని కారణమేమిటో అతనికి అర్థమే కావటము లేదు, ముఖ్యమైనదీ - అత్యవసరమైనదీ అయిన ఆ సమావేశానికి తాను ముందుగా వెళ్ళటానికి వీలుకాకుండా పోతున్నదేమిటి ? అందులో తాను ఏ సామాన్య సభ్యుడూ - సాధారణుడూ అయినా కాదు.

కారు డ్రైవరు తెలివిగలవాడు - కారు కొత్తది-పెట్రోలు పుష్కలముగా ఉన్నది. కారు వెళ్ళినస్థలము ఎక్కువదూరమైనాలేదు. మరి.... ....ఈ ఆలస్యానికి హేతువేమిటి ? ఊహించరానిదిగా ఉన్నదే !

చూస్తూ ఉండగానే పావు తక్కువ ఆరుగంటలయినది. ఇక మిగిలినవి కొన్నే నిమిషాలు. కారు వస్తున్నదన్న ఆశ వదులుకొని గదిలో అటూ ఇటూ - పెదవిని కొరుక్కుంటూ పచారు చేస్తున్నాడు.

ఇంతలో బయట కారుహారన్ మ్రోగిన చప్పుడు వినబడ్డది. దాని కొరకే ఎదురుతెన్నులు చూస్తున్న బ్రహ్మానందము ఒక్కసారి అద్దము ముందర నిలబడి – తన వేషధారణమును చూచుకొని - క్రాపు చేతితో సవరించుకొంటూ - క్రిందికి దిగి బయట వరెండాలోనికి వచ్చి చూడగా కారులేదు! హారన్ మ్రోగిన ధ్వని మాత్రము అతడు విన్న సంగతి ఏ మాత్రమూ పొరబాటు కాదు. దానిని ధృవపరచుకొనటానికే అతడు గేటు దగ్గరికి వెళ్ళిచూశాడు

ఒక కారు మాత్రము రెండు ఇళ్ళ అవతల ఉన్న ఒక చిన్న యింటి ముందర ఆగి ఉన్నది. ఆ యింటి ముందర అంత పెద్దకారు ఎందుకు ఆగిందో – అతడికేమీ అర్థము కాలేదు.

అది సామాన్యమైన చిన్నకారువలెలేదు - టాక్సీకారూకాదు. అటువంటి కార్లు ఆ ఊరి మొత్తము మీద మూడో నాలుగో ఉన్నాయి. అందులో ఒకటి ఆ క్లబ్బు అధ్యక్షులదగ్గర ఉన్నది.

అతడు ఇంకా అట్లాచూస్తూ నిలబడి ఉండగానే – ఆ పెద్ద కారులో వచ్చిన వారెవరో దిగి లోపలికి వెళ్ళుతున్నారు.

ఆ యింటి యజమాని ఏమైనా పెద్దఘనుడా.........కాడు! ఏ మాత్రమూ కాడు! సెటిల్‌మెంటు శాఖలో పనిచేస్తూ ఉన్న చిన్న ఉద్యోగి ఆయన. ఆ సంగతి బ్రహ్మానందానికి బాగా తెలుసు!

ఆ వీథికి బ్రహ్మానందము వచ్చి ఏడాది కావచ్చింది. ఆ బజారులో ఉన్న ఇరవయి ఇళ్ళలోనూ అతడు వెళ్ళిరాగల ఇళ్ళు మూడే. మొదటిది బొంబాయి నివాసస్థులైన ప్రాజెక్టు ఇంజనీయరు గారిది. రెండవది ఆహారశాఖ డైరెక్టరుది. మూడవది ఇ యన్. టి. స్పెషలిష్టు అయిన ఒక పెద్ద డాక్టరుది. ఇక మిగిలిన వన్నీ సాధారణ గృహస్థులవి. వాటిలో ఏ ఒక్కటీ బ్రహ్మానందము వంటివారు వెళ్ళతగినవీ - తేరిపార జూసేవీ కావు. ఏమిటో.........అవన్నీ గాదెలో తాలు వడ్లు ఉన్నట్టే ఉన్నాయి. నామ మాత్రముగా. ఆ బజారులో ఉన్న ఆ పై ముగ్గురు సాటి వారిని చూసిగాని.........నిజానికి అది అతడు నివసించ తగిన వీథా మరి?

ఇది చాలా విచిత్రముగా తోచింది బ్రహ్మానందానికి. సర్వసామాన్యమూ సామాన్యాతిసామాన్యమూ అయిన ఆ పేద యింటి ముందర ఈ పెద్దకారు ఆగట మేమిటి?

సమయానికి కారు రాకపోవటమువల్ల అతడి మనసు అసలే చికాకుగా ఉన్నది. దానికితోడు పై సంఘటన వలన అతనికి కలిగిన చికాకు ద్విగుణీకృత మైనది. ఆ స్థితిలో అతడు భార్యనూ, పిల్లలనూ, ఎదురుగా వచ్చిన నౌకరునూ నోటికి వచ్చినట్లుగా తిట్టాడు. చివాలునలేచి లోపలికి వెళ్ళి 'టాక్సీకారు కావాలని' కంపెనీకి టెలిఫోను చేశాడు.

నిజంగా ఎక్కడికయినా సరియైన సమయానికి వెళ్ళటమనేది సంస్కృతికీ సభ్యత్వానికీ సంబంధించిన ఒక కళ. ఆ నేర్పు ఉండికూడా - దురదృష్టవశాన ఈ రోజు సమావేశానికి బ్రహ్మానందము వెళ్ళలేకపోతున్నాడు.

అయిదు నిమిషాలు దాటింది. స్వంతకారు జాడలేదు. టాక్సీకారు రాలేదు.

అతడు ఆ కోపములో నూట ఒక్కసార్లు డ్రైవరును శపించాడు. ఏభయి సార్లు టాక్సీ కంపెనీని తిట్టాడు.

ఈ అవస్థలో ఆ చిన్న యింటిముందర ఆగినకారును చూచినకొద్దీ - అతడు నిప్పులో పడ్డ ఉప్పుకణమువలె అయి పోతున్నాడు.

మరి రెండు నిమిషాలకు షార్క్‌స్కిన్ ఉడుపులు ధరించిన బ్రహ్మానందము ముందరనుండి - భృత్యతుల్యుడుగా భావింపబడుతున్న ఆ చిన్న ఉద్యోగిని ఎక్కించుకొని - ఆ పెద్దకారు విజయభేరీవలె హారన్ మ్రోగించుకొంటూ వెళ్ళి పోయింది!

అతని కనుబొమలు ఒకదానితో నొకటి కలుసుకొనవలెనని ప్రయత్నించాయి. ఎటూ తోచక - ఒక అంగలో లోపలికివెళ్ళి - చప్పుడుచేస్తూ కుర్చీలాగి కూర్చున్నాడు - అర్థము కాని చూపులను చూస్తూ.

తరువాత ఎంతోసేపటికి - కోపావేశములో మాట తడబడి - ఇంటి ఎడ్రసుకు బదులుగా క్లబ్బు ఎడ్రసు ఇవ్వటమువలన, టాక్సీకారు క్లబ్బుకు వెళ్ళటమూ-

కొందరగా కారు నడపటములో మేకపిల్లను బలిగొని - ఆ తగాదాలోనుండి హోదాతో బయటపడిన అతని కారు ఇంటికి రావటమూ ఒక్కసారే జరిగాయి.

*        *        *        *

గంగ ఒడ్డున నిర్మింపబడిన ఆ రెండతస్తుల పెద్దభవనము నదిలో ప్రతిబింబిస్తూ - తన నీడను చూసుకుంటూ ఉంటుంది. ఆ నీడనూ - ఆ భవనములో ఉన్న దీపాలనూ చూచిన వారికి ఇంగ్లీషు భాషలోని 'టి' అక్షరానికి విద్యుద్దీపాల హారము వేసినట్లుగా కనబడుతుంది. పై అంతస్తులోని చివరభాగము నీటిమీద తేలుతున్నట్లుగా కనబడుతుంది. వెన్నెల విందులకూ - పండుగ సమావేశాలకూ అనువైన భవనమది. ఆ భవనపు వరెండాలో కూర్చుంటే నీటిమీదినుండివచ్చే చల్లటిగాలి శరీరాన్ని మరపిస్తుంది. మబ్బులను చాటుచేసుకుంటూ మనతో దాగిలి మూతలాడే కలువలరేడు 'మీరక్కడా - నేనిక్కడా - మీరు నా దగ్గరికి రాలేరు!' అని ధీరాలు పలుకుతున్నట్లుగా కనబడతాడు. ఆ భవనములోనే క్లబ్బు సమావేశాలు జరుగుతూ ఉంటాయి. ఉపాహారవిందులకు తగిన ఏర్పాట్లూ సదుపాయాలూ అక్కడ ఉన్నాయి.

బ్రహ్మానందము క్లబ్బుకు వెళ్ళేసరికి అప్పటికే సమావేశమవటమూ-ప్రధానాతిథికి సభ్యులందరూ స్వాగత మివ్వటమూ జరిగి పోయినవి. కార్యదర్శి సభ్యులనందరినీ ఆయనకు పరిచయము చేస్తున్నాడు. సరిగా ఆ సమయానికి బ్రహ్మానందము సభ్యబృందములోకి చేరుకున్నాడు. ఎదురుగా లేకపోతే పరిచయ భాగ్యమైనా కలుగదని కార్యదర్శికి దగ్గరగా వెళ్ళి నిలబడ్డాడు.

ఎవరితో వచ్చాడో - ఎట్లా వచ్చాడో గాని.........ఆ చిన్న ఉద్యోగి ప్రధానాతిథికి ఎదురుగా నిలబడి ఉన్నాడు!

క్లబ్బు అధ్యక్షుడు ఆ చిన్న ఉద్యోగిని అతిథికి చూపిస్తూ - "వీరు గొప్ప జ్యోతిషశాస్త్రజ్ఞులు. వీరు చెప్పినట్లుగా భవిష్యము అక్షరాలా జరుగుతుంది. అంకెలూ - అంశాలూ గోటపెట్టుకొన్న అద్వితీయ మేధావులు. ఉద్యోగరీత్యాగానీ-సాంసారికముగా గానీ మనఃక్లేశాలు కలిగినప్పుడు నేను వారిని దర్శించుకుంటూ ఉంటాను" అని పరిచయము చేస్తున్నాడు.

అది విని అందరూ ఆశ్చర్యమూ అబ్బురమూ పడినారు.

నీరుకావి ధోవతీ - కాలరు చినిగిన పొడుగు కోటూ - తలకు పదిమూరల పాగా ధరించి - గంధాక్షతలు ముఖము మీద తీర్చుకొన్న ఆ నడుము ఒంగిన వ్యక్తిని ప్రారంభములో వింత మృగముగా చూచిన వారి ముఖములన్నీ మారి పోయినవి ! జ్యోతిషము చెప్పగలిగినవాడు - ఏ కష్టస్థితిలో ఉన్నప్పటికీ గణనీయుఁడూ, వంద్యనీయుడూను. భూతభవిష్యద్వర్తమానాలను సృష్టించిన బ్రహ్మ తరువాత పూజింప తగినవాడు జ్యోతిష్కుడే ! జ్యోతిష్కునిచే ఆకర్షింపబడనివారు అరుదు. అందరి మనసులలో ఈ భావాలు రహస్యంగా మెదిలాయి.

* * * * *

సుమారు పదిగంటలకు బ్రహ్మానందము ఇల్లు చేరుకున్నాడు. పరధ్యానముతో భోజనము చేశాడు. మేడమీద గది ముందరగా పచారుచేస్తూ ఆలోచిస్తున్నాడు. భోజనమైన తరువాత అలవాటు ప్రకారము తమలపాకు విడెముగాని సిగరెట్టుగాని సేవించలేదు.

ఆలోచనలు.........అంతు చిక్కని ఆలోచనలు - అతడిని ఒక దరికి చేర్చటము లేదు. "ఆ చిన్న ఉద్యోగి అంత గొప్ప జ్యోతిష్కుడా ! తమ క్లబ్బు అధ్యక్షుడు సామాన్యులను మెచ్చడే.........అటువంటి ఆయనను కూడా మెప్పించిన పండితుడు ఎంతటి మేథావో ! తానెంతకాలమో కోర్టు మునసబుగా ఉండగా ఉండగా జిల్లా జడ్జీపని అయినది. ఇది అయికూడా చాలా కాలము కావచ్చినది. తన తోటివాళ్ళు చర చర పై కెక్కి పోతున్నారు. తనకు ఏ కారణము వలన ప్రమోషను దొరకడములేదో.........ఎప్పుడు దొరుకుతుందో.........! వాటికి ఆ పండితుడు సమాధాన మివ్వగలుగుతాడేమో ! అయితే.........ఆ పండితు నొకసారి సలహా అడిగితే బాగుండును ! అందుకు ఆ చిన్న యింటికి పోవలసి ఉంటుందేమో !" ఈ ఆఖరి తలంపుకు అతడికి తన ఒంటిమీద గొంగడి పురుగు పాకినట్లయింది ! అతడు ఉద్యోగములో ప్రవేశించిన తరువాత బంధుమిత్రుల యిండ్లకు రాకపోకలు సూటిగా లేవు. వేళ్ళమీద లెక్కపెట్టినట్టుగా - బ్రహ్మానందము దృష్టికి ఆనినవారు ఎవరో బహుకొద్ది మంది ఉన్నారు. అతడి హృదయమైనా - పట్టుదలను దాటి వారినీ వీరిని కలిసి మాట్లాడవలెనని ఉబలాటపడదు. బాల్యములోనూ - విద్యార్థి దశలోనూ ఆత్మీయులనిపించుకొన్న స్నేహితులూ బంధువులూ చాలా మంది అతని స్మృతిపథమునుండి జారిపోయారు !

ఇప్పుడు ఆ చిన్న ఉద్యోగి ఎంతటి గొప్ప జ్యోతిష శాస్త్రజ్ఞుడైనా-ఆయనను ఇంటికి వెళ్లి దర్శించటమంటే అతడికి దాటరాని వారధిగా తోచసాగినది.

ఆశాజ్యోతి వాడియైన తన కిరణములను ప్రసరింపజేసి అతడి పట్టుదలనూ అభిమానాన్నీ మైనమును కరగించినట్లుగా కరగించి వేసింది. చాలా సేపటికి స్వేద రూపమున బయలువెడలిన మాలిన్యమును తుడుచుకొని.... అతడొక నిశ్చయానికి రాగలిగాడు.

బ్రహ్మానందము చర చర మెట్లుదిగి- హాలుదాటి- బయటి వరెండా ఆవరణమూ దాటి- గేటు దగ్గర ఒక క్షణము నిలబడి తటపటాయించి చూశాడు. మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళి- ఎవరూ తనను గమనించటము లేదన్న ధైర్యము చిక్కించుకొని ఆ చిన్న యింటి ద్వారము సమీపించాడు.

ఎవరితో మాట్లాడ దలచినా- ఎవరింటికి వెళ్ళదలచినా- వాళ్ళ ఆదాయము లోని అంతరమూ గ్రేడునూ చూచి వందలను లెక్కించే బ్రహ్మానందము మరొక సారి నాలుగు దిక్కులూ కలయజూచి- పరకాయించి- పండితుని యింటి తలుపులను తట్టాడు!

తలుపులు దగ్గరగా వేసి ఉన్నవేమో నెట్టగానే లోపలికి పోయినవి. గడపలో కాలుపెట్టి 'పండితులు లేరా?' అని తడి ఆరిన గొంతుతో ప్రశ్నించాడు- బ్రహ్మానందము.

"భోజనము చేస్తున్నాను కూర్చోండి" అని లోపలినుండి జవాబు వచ్చినది.

ఆ గదిలో ఒక చిరుచాప మాత్రమే పరచి ఉన్నది. చాపమీద ఎన్నడూ కూర్చుని ఎరుగని బ్రహ్మానందము- చాపమీదికి తన దృష్టిని పోనియ్యకుండా ఆనీ ఆననట్లుగా దాని మీద ఒక పావుగంటసేపు కూర్చున్నాడు.

అంతలో అంగవస్త్రముతో కాళ్ళనూ చేతులనూ తుడుచుకుంటూ వచ్చాడు పండితు డీవలికి.

"మా పేద కుటీరాన్ని పావనము చేసిన పెద్దలను నేను చాల సేపు

కూర్చుండబెట్టాను. క్షమించాలి.'' అంటూ రెండు చేతులను నలుపుకుంటూ క్షమాపణను వేడుకొన్నాడు పండితుడు.

"పెద్దలు- మీరట్లా అనకూడదు. మీ దర్శనము చేసుకోవాలని నేను చాల రోజులనుండీ అనుకుంటూనే ఉన్నాను. కాని నా సంకల్పము ఈనాటివరకూ నెర వేరలేదు. జ్యోతిషశాస్త్రములో మీకు గల పాటవమూ ప్రజ్ఞా నేను వింటూనే ఉన్నాను'' అన్న మాటలు బ్రహ్మానందము నోటివెంట తలవని తలంపుగా వచ్చేశాయి!

"అట్లాగా! నేను మాత్రము మిమ్మలను ఈ సాయంకాలమే చూశాను. మీ బస ఎక్కడ?'' అని తనకు తెలియనట్టుగానే పండితుడు ప్రశ్నించినాడు.

"నేనా? నేను.... ఇక్కడే!.... తమ యింటికి సమీపములోనే ఎదురుగా కనబడుతున్న యింట్లో ఉంటున్నాను. తమ దర్శనము నాకు రోజూ అవుతూనే ఉంటుంది. జిల్లా జడ్జీగా ఇక్కడ చాలా కాలమునుండీ ఉంటున్నాను'' ఆప్యాయమైన మాటల ధోరణి దానంతట అదే బయలుదేరింది.

"అట్లాగా!'' అని మాత్రము పండితుడు అనగలిగాడు. 'అట్లాగా' అని దీర్ఘము తీయటములో- తన గొప్పతనమును విని ఘనంగా భావిస్తాడని బ్రహ్మానంద మనుకొన్న ఊహలన్నీ పటాపంచలయాయి. అతడి దీర్ఘములో చాలా సామాన్యతే గోచరించినది.

"నాకు ఛీఫ్ జస్టిసు పదవి ఎప్పుడు దొరుకుతుంది? నాకు పుత్ర సంతానము ఎన్నడు కలుగుతుంది? నా జాతకము చూచి ఈ రెండు విషయాలూ తెలుపండి'' అని సవినయముగా అడిగాడు బ్రహ్మానందము.

"జాతకము చూచి చెప్పుతాను. మీ జన్మ కుండలి వేయటానికి జన్మ నక్షత్రమూ పుట్టిన తేదీ చెప్పండి'' అని పంచాంగముల కట్టను తెచ్చి విప్పాడు పండితుడు.

పండితుడి ప్రశ్నలకు జవాబులను యిస్తూ-కలము చేతపట్టుకొని సంతకము చేయటానికి చెక్కు పుస్తకమును బ్రహ్మానందము తెరచినాడు.

ఆపే చూస్తున్న పండితుడు బ్రహ్మానందాన్ని చేతితో వారించి "మన యిద్దరితో ఉన్న నాగరికతా సంస్కృతీ విభిన్న మార్గాలలో ఉన్నాయి. అంతే భేదము : మీరు నా దగ్గరికి వచ్చి సవినయముగా అడిగిన ఈ చిన్న ప్రశ్నలకు నేను మీ దగ్గరనుండి పతిఫలము తీసుకుంటానా ? అమూల్యమైన మీ రాక- పావుగంటసేపు మీ సాహచర్యమూ చాలవూ ?" అన్నాడు నవ్వుతూ.

ప్రాచీన నాగరికతా సంస్కృతితో నిండి- నిష్కల్మషముగా నున్న ఆ నిరుపేద హృదయములో బ్రహ్మానందము తన నీడను చూచుకొని నివ్వెరపోయాడు.



# నడచిన బాట

తప్పటడుగులు వేస్తూ రెండు మల్లెమొగ్గలు చేత పట్టుకొని తల్లి తలలో తురుమబోయాడు సుబ్బారావు.

సుభద్ర పెరటిలో చాపమీద కూర్చుని నాలుగు దినాలనాడు అల్లిన జడ విప్పుకుంటూ అస్తమించబోతున్న సూర్యబింబాన్నీ జేవురించిన పడమటి దిశనూ అదే పనిగా చూస్తున్నది. ఆ యిల్లు స్టేషనుకు దగ్గర కాకపోయినా రైళ్ళ రాకపోకలు తెలుస్తూనే ఉంటాయి. సూర్యాస్తమయానికి అక్కడి నుంచి ఒక బండి తూర్పుదిశగా బయలుదేరుతుంది. పెద్ద చప్పుడుతో ఆ ఊరు వచ్చిన రైలు విసురుగా బయలుదేరి ఆ ప్రదేశాన్ని వదలిపెట్టి వెళ్ళిపోతున్నది. రైలు శబ్దము అంతరించే వరకూ చూసిన సుభద్ర చెక్కిళ్ళమీద కన్నీళ్ళు జలజలా ప్రవహించాయి.

సరిగ్గా ఈ సమయంలో సుబ్బారావు తల్లితలలో మల్లెమొగ్గలు తురిమి ఆమె ముఖములో ముఖముపెట్టి చూశాడు.

ఫో అవతలికి'' అని చేతులతో పిల్లవాడిని నెట్టివేసి కళ్ళు తుడుచుకున్నది సుభద్ర.

పిల్లవాడికి వయసు స్వల్పమయినా రోషమెక్కువ. అందులో ఇద్దరు ముసలమ్మల బలము ఉన్నది. పిల్లవాడు నోరుతెరచి ఏడవకముందే వాళ్ళు సముదాయించుతూ ఉంటారు. తల్లి నెట్టగానే సుబ్బారావు ఇంట్లోఉన్న ముసలమ్మలకు వినబడేటట్టుగా పెద్ద రాగము తీశాడు.

వెంటనే ముసలమ్మలు చెరి ఒక వైపునుంచీ రానేవచ్చారు.

“ఎందుకే వాడు ఏడుస్తున్నదీ?” వస్తూనే అడిగింది బంగారమ్మ.

“ఎందుకే పసివాడిని అట్లా కసురుకుంటావు?” అంటూ పిల్లవాడిని ఎత్తుకొని జానకమ్మ లోపలికి తీసుకొని వెళ్ళింది.

సుభద్ర కళ్ళెత్తి ముసలమ్మల నిద్దరినీ చూసి ముఖము దించుకొన్నది.

"వాడేం చేశాడనీ—పసివాడిని అట్లా కసురుకుంటావు ? నీవు నిన్న 'దరిద్రుడా' అన్న ముక్క నా చెవిన పడలేదనుకున్నావా" అంటూ మెల్లగా సర్దుకొని చాపమీద కూర్చున్నది బంగారమ్మ. సుభద్ర మాట్లాడక పోవటముతో మళ్ళీ అందుకున్నది.

"పిచ్చిదానా ! వీడు దరిద్రుడనుకున్నావా ? వీడు కాదు. బంగారతాలాంటి సంసారాన్ని, మామిడిపండులా ఉన్న పిల్లవాడిని వదలి- కాని దేశాలలో నానా ఇబ్బందులు పడుతూ తిరుగుతున్న మొండివాడు దరిద్రుడు !"

సుభద్రకు దుఃఖములో ఆపుకోలేని ఎక్కిళ్ళు వచ్చాయి.

"ఆ కలకత్తాలో నానా అగచాట్లు పడుతున్నాడట. అవధాన్లుగారి మురళి చెప్పాడు. ఎవరి దగ్గరో నూటపాతిక రూపాయల ఉద్యోగము చేస్తున్నాడట. ఇక్కడ ఇంత ఉండికూడా అనుభవించే గీత లేకుండా దేశాలు పట్టుకొని తిరుగుతున్నాడే వాడూ పరమదరిద్రుడు !"

అక్కడికీ బంగారమ్మ కసి దీరలేదు. సుభద్ర వినక పోయినా అంతా చెప్పెయ్యా లనుకున్నది. "మిమ్మల్నిద్దరిని విడదీశాడని ఒక రోజున 'వెధవా' అన్నావు. వాడు పుట్టకపోయినా బాగుండేదన్నావట. ఈ వంశములో పిల్లలు పుట్టినందువల్ల దారిద్ర్యము ఇంతవరకూ రాలేదు."

సుభద్ర తన మనసులో ఉన్న మాటలను ముసలమ్మలతో చెప్పి బరువు తగ్గించుకోవా లనుకున్నది. కాని ధైర్యము చాలలేదు. ఆమె అనదలచుకొన్న దొక్కటే మాట- "వాళ్ళకు బిడ్డ ముఖ్యము కాని సుభద్ర హృదయములో ఉన్న బాధ గాని, శేషగిరి కాని దేశాలలో పడుతున్న అగచాట్లుగాని అంత ముఖ్యము కావు" అని.

"వాడు నామీద కక్షకట్టాడు. ఇంట్లోనుంచి వెళ్ళిపోయాడు. నన్ను సాధిద్దామనుకున్నాడు. నే నన్నది ఒక్కటేముక్క ! పుట్టిన పిల్లవాడికి సుబ్బారావు పేరు తప్ప మరొకటి పెట్టటానికి వీలు లేదని. ఎంతో సేపు వాదించాడు. చిన్న పేరు పెట్టాలనీ పిలవటానికి వీలయినదే పెట్టాలనీ అందంగా ఉండాలనీను. నేను వీల్లే

దన్నాను. ఆ పేరు తప్ప మరొకటి పెట్టే అధికారము తనకు లేదన్నాను. అధికారము లేకపోతే తనకు సంబంధము కూడా లేదన్నాడు. వెనకా ముందూ చూడకుండా తన సామాను లన్నీ తీసుకొని రైలుకు వెళ్ళాడు. వాడు వెళ్ళిన వేళకు రైలు ఉందనుకున్నావా? మధ్యాహ్నము మూడు గంటలకు వెళ్ళి కూర్చుంటే సాయంత్రము ఆరు గంటలకు గాని రైలులేదు."

బంగారమ్మ కోడలిచేత ఒక గ్లాసుతో మంచి నీళ్ళు తెప్పించుకొని త్రాగి, మళ్ళీ మొదలు పెట్టింది.

"వెనక మన వంశములో సింహాచలం గారికి ఆయన గర్భములో ఉండగానే తండ్రి మారకము సంభవించింది. ఆయనకు నలభై సంవత్సరాలు దాటాయి. ఆయన భార్య గంగమ్మ సంతానము కోసము ఎన్ని నోములు నోచిందో; ఎదురైన చెట్టుకూ పుట్టకూ మ్రొక్కింది. కనబడ్డ ప్రతి నదిలో మునిగింది. కాశీ రామేశ్వరాలు వెళ్ళి వచ్చింది. కాని ఏ దైవమూ ఆ దంపతుల మొరాలకించలేదు.

అది కార్తికమాసము. నాగచతుర్థి. స్త్రీలంతా ఉపవాసముండి పుట్టలో పాలు పోస్తున్నారు. నలుగురితోపాటు గంగమ్మకూడా పోసింది. చలిమిడీ, అరటిపళ్ళూ, నైవేద్యము పెట్టింది. గ్లాసులో అడుగున చారెడు పాలు మిగిలాయని పుట్టలో పొయ్యబోయింది. ఆమెకు కళ్ళు చీకట్లు కమ్మినట్లయింది. ఒంటికి శ్వేత పన్నగము చుట్టుకున్న ట్టనిపించిందట. అక్కడే ఒళ్ళు తెలియకుండా పడిపోయింది.

తొమ్మిది నెలలపాటు అలాగే మైకముతో పడి ఉండేది. విరుచుకొని పడిపోతూ ఉండేది. ఎన్నో మందులు మాత్రలు విఫలమయాయి. పదోనెల రాగానే ఒక పాముపిల్ల పుట్టింది. అమ్మలక్కలంతా బుగ్గలు నొక్కుకున్నారు. గంగమ్మ మూర్ఛపోయింది.

మనిషి కడుపున పుట్టటం వల్ల కాబోలు ఆ పాము చాలా సాధువుగా ఉండేది ఒక బుట్టలో పెట్టి ఉంచేవారు. ఒక పళ్ళెములో పాలుపోసి ముందు పెట్టేవారు. గంగమ్మకు తరువాత పదిమంది పిల్లలు పుట్టారు

ఒకనాడు ఆ పాము దాలిగుంటలో పడుకొని ఉండగా పెద్దకోడలు పిడకలు పేర్చి పళ్ళెము నిండా నిప్పులు తీసుకొని వెళ్ళి దానిమీద పోసింది. పదిశేర్ల పాలు

అటిక దానిమీద పెట్టింది. మరునాడు ఉదయపు చీకటులలో దాలిలో ఉన్న బూడిద మామూలుగానే మరొకకోడలు ఎత్తి పారబోసింది.

నాగన్న పుట్టిన దగ్గరనుండీ అష్టదరిద్రాలూ వదలి పోయాయనుకున్నవి మళ్ళీ చుట్టుకున్నాయి వాళ్ళను. ఒక నెలలో పిసి పిల్లలంతా చనిపోయారు. పెద్ద వాళ్ళు ఒక్కొక్కళ్ళే రాలిపోయినారు.

తరువాత వాళ్ళలో మిగిలినవాళ్లు శేషుడు పేరు పెట్టుకొని పోయిన ఆస్తి పాస్తులను తిరిగి సంపాదించుకున్నారు.

"మన వంశములో అందరూ నాగారాధనచేసే పైకివచ్చారు. వీడెందుకంట ఎదురు తిరగటము చెప్పు అమ్మాయీ! ఆ పేరుట–వీడికి పనికి రాలేదట! పనికి రాకపోతే వా డేంచేస్తాడు నన్ను? కోపము తగ్గితే వస్తాడు- లేకపోతే రాడు! అంతేనా?"

ఈ కథంతా చెప్పి బంగారమ్మ మరొక గ్లాసెడు నీళ్ళు త్రాగి విసురుకోవటము మొదలు పెట్టింది.

ఆ రాత్రి సుభద్రచేత అన్నము తినిపించటానికి ముసలమ్మలు చాలా అవస్థ పడ్డారు; ఆమె భోజనము చేయకపోతే తామూ చేయమన్నారు; ఒట్లుకూడా పెట్టుకొన్నారు.

సుభద్ర పళ్ళెము ముందర కూర్చుని లేచేసరికి రాత్రి పన్నెండు దాటింది.

* * * * *

మధ్యాహ్నము రెండు గంటల సమయము. ముసలమ్మలిద్దరూ పగటి నిద్ర పోతున్నారు. సుభద్ర గదిలో కూర్చుని పెరిగిపోయిన నల్లపూసలను గుచ్చు కుంటున్నది.

పిల్లవాడు ఇరుగు పొరుగు పిల్లలతో కలసి వాకిటి వరండాలో ఆడు కుంటున్నాడు.

"రంగా! ఈ బొమ్మలెక్కడివి చెప్పవూ?"

"ఇదా! మా నాన్న పట్నంనుంచి తెచ్చాడు. నాకొకటీ, మా చెల్లెలికొక టీను. బాగున్నాయి కదూ! పడుకోబెట్టగానే లేస్తుంది."

"చాలా బాగుంది. చూచి యిస్తాను ఇవ్వవూ?" ఈ గొంతు సుబ్బారావుది. ఈ కంఠధ్వని విన్నకొద్దీ సుభద్ర మనసు నీరయిపోవటము మొదలుపెట్టింది.

"ఊఁ హూఁ! మా నాన్న తెచ్చిన బొమ్మనిస్తానా? అమ్మ కోప్పడదూ?"

ఆ మాటలకు రోషము వచ్చినట్లున్నది సుబ్బారావుకు. "నాకు కావలసిన వన్నీ మా బామ్మ తెప్పిస్తుంది" అన్నాడు.

"నీకు మీ బామ్మ తెప్పిస్తుందా? నాకేమో మా నాన్న తెస్తాడు."

"నేనూ తెప్పించుకుంటాను" అభిమానముతో సుబ్బారావు కంఠధ్వని మారి నట్లనిపించింది సుభద్రకు.

"నీకు నాన్న ఏడీ? ఉత్తగా అంటున్నావు కదూ?" ఆ పిల్లవాడు గట్టిగా నవ్వాడు.

నల్లపూసలలో దారము ఎక్కలే. దారాన్ని నోటితో కొరికి కొనను నలుపు తున్నది. నల్ల పూసలోని రంధ్రము ఆమె కంటికి కనబడకుండా కంటినీరు కమ్మింది. నల్లపూసలన్నీ కాగితములో పొట్లముకట్టి లేచి హాలులోకి వచ్చి చూడగా పిల్లవాడు లేడు.

గదులన్నీ వెతికి వెతికి వాకిటి వరండాలోకి వచ్చి చూసింది. అక్కడా లేడు.

అంతవరకూ సుబ్బారావు గేటుదాటి ఒంటరిగా యెక్కడికీ వెళ్ళి యెరుగడు.

ముసలమ్మ లిద్దరూ గురకపెట్టి నిద్రపోతున్నారు. వాళ్ళను లేపకుండా సుభద్ర వాకిట్లోకి వచ్చి చూసింది. వీధి వాకిలి దాటి పక్క ఇంటి గడపదగ్గర నిల బడిపోయింది. ఆ ఇంటివారి మురళి సుబ్బారావు జతగాడు.

ఇద్దరూ కలిసి లోపలికి వెళ్ళి ఉంటా రనుకొన్నది. లోపలికి వెళ్ళటమా వద్దా అన్న సందేహములో అక్కడే నిలబడింది.

లోపల్నించి మాటలు వినబడుతున్నాయి గాని పిల్లలు ఎంతసేపటికీ బైటికి రాలేదు.

"ఎందుకురా సుబ్బారావు? అట్లా ఉన్నావేం?"

"............................................"

"ఎందుకమ్మా చెప్పు?"

జవాబుకు బదులుగా ఏడుపు వినబడ్డది సుభద్రకు.

"మా మురళి కొట్టాడా? ఎందుకేడుస్తున్నావు చెప్పు"

"ఊఁహూఁ"

"మరెందు కేడుస్తున్నావు? అమ్మ కొట్టిందా?"

"లేదు"

"బామ్మ కోపము చేసిందా?"

"లేదు"

"మరెందుకు? చెప్పమ్మా"

పిల్లవాడు కడుపు ఉబ్బిపోయేటట్లు ఏడుస్తున్నాడు. సుభద్ర లోపలికి వెళ్ళా లనుకుందేగాని ఆమెకే ఏడుపు ముంచుకొచ్చింది.

ఆ తరువాత ఎవరిదో మగగొంతు. వాళ్ళ మురళిని పిలిచి సంగతంతా అడిగాడు. మురళి చెప్పాడు. బొమ్మ దగ్గర తగాదా వచ్చిందనీ– "మా నాన్న తెస్తా" డని సుబ్బారావంటే "నాన్న ఏడీ" అని తా నన్నాడట.

"వాడి తండ్రిసంగతి నీకేం తెలుసునని మాట్లాడావురా? పిల్లలకు పెద్ద మాటలు ఎందుకు చెప్పు! కనకం! చూశావా? వీళ్ళ తగాదా ఎల్లా మారిందో! సుబ్బారావుకు ఆరోయేడుకూడా వచ్చిందాయెను! తండ్రిని చూడకపోయినా తండ్రి మీద ఎంత మమకారమో! మొన్న ఒకరోజు ఇంట్లో ఎవరిమీదనో కోపమువచ్చి తండ్రి దగ్గరికి పోతానని బయలు దేరాడట. వాడినిచూసి బంగారమ్మ ఏడవనూ సుభద్రమ్మ ఏడవనూట! అసలు ఇంతకీ ఎవరిమీద కోపము వచ్చిందంటావు ఆ శేషగిరికి?"

సుభద్ర ఇక నిలువలేక ఒక్క పరుగున తన గదిలోకి వచ్చిపడ్డది. మంచముమీద బోర్లా పడుకుని వెక్కి వెక్కి ఎంతసేపు ఏడ్చిందో ?

శేషగిరి గృహత్యాగము చిన్న పిల్లవాడిమీద దాని ప్రభావము చూపుతున్న దని సుభద్రకొక కొత్త ఆందోళన బయలుదేరింది.

జాలిగొలిపే సుబ్బారావు చిన్న ముఖమూ, దమ్మిడీ కాసంత ఎర్రని నోరూ, పాల బుగ్గలమీద చింది పడుతున్న కన్నీరూ చూసి- పిల్లవాడిని దగ్గరకు తీసుకొని శేషగిరిని కసితీరేవరకూ అందరూ ఆడిపోసుకున్నారు.

* * * * *

ఉదయము ఏడు గంటలవేళ శేషగిరి కాస్త ఓపిక తెచ్చుకొని స్టౌమీద కాఫీ చేసుకుంటున్నాడు.

తలుపుకొట్టిన శబ్దము వినబడ్డది.

శేషగిరి మూలుగుతూ లేచి తలుపుతీసి ఎదురుగా నిలబడ్డ చలపతిని చూసి తెల్లబోయాడు.

''ఏదైనా పనిమీద వచ్చావా ? లోపలికిరా''- అన్నాడు శేషగిరి. తన ఊళ్ళో పొరుగున ఉన్న చలపతిని ముసలమ్మలే కొత్తవేషము వేసి పంపి ఉంటా రను కున్నాడు.

''నిన్ను చూద్దామని వచ్చానురా !'' అన్నాడు చలపతి.

''చూశావుగా ! వెళ్ళు !''

''వెళ్తాను.... నేను వచ్చినపని అయింది గాని.... ఇంకా కాస్త ఉన్నది.''

''తొందరగా తేల్చు''

''నీకు జ్వరం వస్తున్నదా ఏమిటి ? మరి ఇట్లా ఉన్నావేం ? బాగా చిక్కి నల్లబడ్డావు ! అన్నముతిని ఎన్నాళ్ళయింది ? ఋషీశ్వరుడిమాదిరి ఆ గడ్డమేమిటి ?'' చలపతి ఆ గదంతా కలయజూశాడు. గదిలో సామానులు చిందర వందరగా పడి ఉన్నాయి. గదినిండా దుమ్ము.

''ఇక్కడ ఏం చేస్తున్నావు?'' చలపతి ఈ ప్రశ్న మూడుసార్లు వేశాడు.

''ఏదో చేస్తాను- ఏదీ లేకపోతే పస్తుంటాను. మీ కందరికీ అంత దిగులు ఎందుకురా?'' అన్నాడు శేషగిరి కనుబొమలు ముడివేసి. ''అదికాదురా! సంగ తేమిటో చెప్పకూడదూ? ఈ గొడవంతా ఏమిటి? నీ కోపము ఎవరిమీదా?'' శేష గిరి వికటంగా నవ్వి ''నా కర్మాన నన్ను ఉండనీయకూడదూ? నీ వేమయినా రాయబారానికి వచ్చావా?'' అన్నాడు హేళనగా.

''నేను రాయబారానికి రాలేదు. ఇక్కడికి వచ్చిన తరువాత నిన్ను చూద్దా మని నీ గదికి వచ్చాను. అబ్బాయీ!.... అవునుగానీ- ఆ సుభద్ర కృశించి పోతు న్నది ఆ విధంగా ఆమె ఇంకా ఎంతకాలము ఉండాలో నిన్ను అడిగి పోదామని వచ్చాను''

''అయితే ఇది ఆమెగారి రాయబార మన్నమాట .. నా కోసము తాను కృశించి పోవటమేమిటి? వెర్రితనము! ఆ ముసలమ్మలను అడక్కపోయిందా'' ఓపిక లేకపోయినా శేషగిరి పావుగంటసేపు నవ్వాడు.

''అదిసరే- బాగానే ఉందిగాని నీ కొడుక్కు సుబ్బారావు ఆరేళ్లవా డయి నాడు. నాన్న దగ్గరకి వెళ్ళా లంటున్నాడు. దాని కేంచెప్తావు?''

''వాడికి నాన్న ఎందుకు ఇద్దరు ముసలమ్మలు ఉండగా! ఇవి కదలిస్తా యనుకున్నావా నన్ను?''

''ఒరే శేషగిరీ! నీ సంగతీ నీ కోపమూ ఎవరికీ అర్థము కావడములేదు. ఆ ఇంట్లో వాళ్ళను చూడలేకుండా ఉన్నాము మేమంతా. నీ కొడుకు రోజూ నీ కోసం మారాము చేస్తున్నాడు. నాన్న బొమ్మలు తేవాలని మొన్న ఒక కొత్త పేచీ, నీకు సిగ్గుగా లేదుట్రా ఆ పిల్లవాడిని గురించి నేను చెప్తుంటే!''

''ఒరే చలపతీ! ఇవన్నీ పాత మాటలు! నీకు ఆ ముసలమ్మల సంగతి తెలియదు. నేను మానాన్న కుర్చీలో కూర్చుని మానాన్న చేసిన వకాలతు ఆ యింట్లో ఆ ఊర్లో చేయాలట! ఆ ముసలమ్మలు ఒక్క అడుగైనా ముందుకు జరుగనీయరు. సరే అదంతా ఇప్పుడు ఎందుకుగాని- అయిందిగా! ఇంక వెళ్ళు

బాబూ!" చలపతి ఇంకా ఏదో మాట్లాడాలని నోరు విప్పబోయాడు. శేషగిరి ఇంచుమించుగా అతడిని నెట్టి తలుపు వేసుకున్నాడు.

శేషగిరి మనసు ఆరు సంవత్సరాల క్రిందట వదలిపెట్టి వచ్చిన నాటి వలె ఉద్రిక్తమైపోయింది. ఆ గదిలోనే నాలుగు సార్లు ఇటూ అటూ కాలుగాలిన పిల్లి లాగా తిరిగాడు.

అతడి దేహములో దబ్బెత్తు సత్తువ లేదు. స్టౌ ముందర కూర్చుని రెండు మాత్రలు నోట్లో వేసుకున్నాడు. కళ్ళు మూసుకుని అతడు అట్లా ఎంతసేపు కూర్చున్నాడో- కళ్లు తెరవగానే మూలఉన్న నూనె డబ్బాలు కంటబడ్డాయి. కలకత్తా వచ్చిన దగ్గరనుండీ ఉద్యోగము కొరకు తిరిగి తిరిగి అతడి ప్రాణము విసిగి పోయింది. చేతిలో ఉన్న పైకము కాస్తా ఖర్చయిపోయింది. స్వగ్రామంలో అన్ని వసతులతో అంత పెద్ద ఇల్లూ, కోరినంత సౌఖ్యమూ, కావలసినంత డబ్బూ ఉంటే ఏం? పట్నవాసములో ఇంతకాలముండి అంత చదువు చదివి. తిరిగి నాయనమ్మ చూపించిన బాటన నడవటానికి అతని మనసు ఎంతమాత్రమూ అంగీకరించదు. "పిల్లవాడికి ఆ పేరుతప్ప మరొకటి పెట్టనీయదట! ఈ సుభద్ర.... ఇంగితమున్న మనిషైతే ఏడుస్తూ వాళ్ళ కిచ్చేసి తాను బయలుదేరి రాకూడదూ?.... సుభద్రకూడా నడచిన బాటనే చూసి భ్రమిస్తున్నది. కాకపోతే- మనసు విప్పి- ఒక ఉత్తరము వ్రాస్తే తప్పా! కానీ- ఎంత చేసుకొంటే అంత ఫలము!.... ఎవరేమి చేయగలరు?" అని గొణుక్కున్నాడు.

శేషగిరి లేని సత్తువ తెచ్చుకొని నూనె డబ్బాలను ఒక సంచిలో వేసుకొని బయలుదేరాడు. ఈ డబ్బాలను పెద్ద దుకాణమునుంచి తెచ్చి ఇళ్ళకు సప్లయి చేస్తున్నాడు. డజను డబ్బాలమీద రెండు రూపాయల లాభము. రెండు డజన్లమ్మితేగాని అతడికి దినము గడవదు.

అతడు లేచి తిరిగి నాలుగు దినాలయింది. ఇంకా పడుకొంటే గడవటము కష్టము. శేషగిరి మెల్లగాలేచి వాడుకఉన్న యిళ్ళల్లో డబ్బాల అమ్మకముచేసి, సరిగా మధ్యాహ్నము రెండుగంటలకు హోటలుకువెళ్ళి ఇంటికి దారితీశాడు. అతడికి రెండు బస్సులు ఎదురైనాయి. జేబులో చెయ్యిపెట్టి చూసుకొన్నాడు. చేతికేమీ తగులలేదు

నడచి నడచి శేషగిరి కాళ్ళు తడబడసాగాయి. కళ్లు చీకట్లు కమ్మినాయి.

మెల్లగా సాయంకాలము ఆరు గంటల వేళకు ఏదో విధంగా ఆ దేహాన్ని తన గదికి ఈడ్చుకొనివచ్చి పక్కమీద పడేశాడు. అంతే, ఆ తరువాత అతడికి ఒంటిమీద స్పృహ లేదు.

ఒక రాత్రివేళ అతడికి ఒళ్ళు తెలిసింది. దాహము వేసినట్లనిపించింది. దగ్గర ఉన్న కూజాలోని నీళ్ళు రెండు గ్లాసులు తాగాడు, అప్పుడుతోచింది శేషగిరికి. తనకు జ్వరం; ఒళ్ళంతా చెమట పట్టిందని. లేచి కిటికీతలుపులన్నీ తెరచి పక్కమీద కూర్చున్నాడు.

దూరాన రెండుగంటలు కొట్టిన శబ్దమయింది.

నిద్రపట్టక పరుపుమీద ఇటూఅటూ మసలి కిటికీలో ఉన్న పుస్తక మొకటి చేతబట్టుకొని చదువుతూ చదువుతూ కన్నుమూసాడు. ఆపుస్తకము ముఖం మీద బోర్లాపడిపోయింది.

ఉదయం ఎనిమిది గంటలవేళ ఏమి పీడకలవచ్చిందో-శేషగిరి దిగ్గునలేచి కూర్చున్నాడు. కళ్ళు జ్యోతులవలె ఎర్రబడి నీళ్లుకారటం మొదలుపెట్టాయి. అంతలో పెద్దగాలి వీచి కిటికీలో ఉన్న వార్తాపత్రికా దాని కింద ఉన్న కాగితాలూ ఎగిరి శేషగిరి పరుపుమీద నడటము తటస్థించింది. గాలి విసురుకు అందులో ఒక దళసరి కాగితము శేషగిరిమీద వాలింది. కళ్ళు తుడుచుకొని ఆ కాగితాన్ని చూపి తుళ్ళి పడ్డాడు. "అరే! ఇదెక్కడిది? ఎవరిది ఎట్లా వచ్చింది?" అన్న మాటలు అతడికి తెలియకుండానే నోటివెంబడి వచ్చాయి.

దానితో తనకేమి సంబంధమని శేషగిరి తన కళ్ళను మనసును మరొక పక్కకు తిప్పటానికి అనేక ప్రయత్నాలు చేశాడు.

దృష్టి మళ్ళినప్పుడు మనసు మళ్ళదు!

మనసు మళ్ళినప్పుడు దృష్టి మళ్ళదు!

క్రిందటిరోజు ఆ చలపతి చూడటానికని వచ్చి దీనిని వదలి పెట్టిపోయి ఉంటాడు! దుర్మార్గుడు—మాట్లాడుతూ ఎంత పని చేశాడు!

చలపతిమీద కోపము వెళ్ళగక్కటములో శేషగిరి తన చూపులను తిప్పు కోవటము మరచి పోయినట్లే ఉన్నాడు. కొంతసేపటికి లేచి కాఫీ తయారుచేసుకో వాలని స్టౌ వెలిగించాడు. కాని ముంగురులు కమ్మిన ఆ చిన్న జాబిల్లి ముఖాన్ని. ఆ కొంటె కళ్ళనూ తప్పుకొని తిరగలేక పోయినాడు.

ప్రయత్నపూర్వకముగా శేషగిరి గోడవైపు తిరిగి కాఫీ తాగుతున్నాడు. వీపు మీద ఏదో పాకినట్లయింది చేతిలో కప్పు కిందపెట్టి వీపు తడిమి చూసు కోవటములో నవ్వులొలికే ఆ ముద్దు ముఖము మళ్ళీ కనబడ్డది.

"ఆ దుర్మార్గుడు చలపతి తనను ఈ గదిలో కూడా నిలువనీయ దలచుకొ న్నట్లుంది! ఎంతపని చేశాడు?" అని తిట్టుకున్నాడు.

కాని చిత్రాన్ని అక్కడినుంచి తీయాలని అతడికి తోచలేదు.

*　　*　　*　　*　　*

అవి సంక్రాంతి రోజులు.

భజన కీర్తనలు పాడిన హరిదాసుకు మామూలు ఇవ్వటానికి బంగారమ్మ కోడలు వాకిటి తలుపు తీయగానే ఆ వెలుతురుకు నట్టింట ఉన్న పెట్టెలూ పరుపు చుట్టా కనబడ్డాయి. వాటిని చూడగానే ఆమె హృదయము పొంగి పరవళ్ళు తొక్కింది. ఓర వాకిలిగా వేసివున్న గదిలోనుంచి సందడి వినబడ్డది. ఆమె అక్కడే నిలబడి పోయింది.

"నాన్నా! ఏదీ ఒకసారి నవ్వు?"

అబ్బా! ఆ కంఠధ్వని విని ఎన్ని సంవత్సరాలయిందో! ముసలమ్మ కళ్ళ వెంబడి ఆనందాశ్రువులు జలజల రాలాయి.

"నీకు నాన్న తెచ్చిన బొమ్మ కావాలా! తీసుకో!" తిరిగి అదే కంఠధ్వని.

ఆమె ఒక్క పరుగున బంగారమ్మ దగ్గరికి చేరుకొన్నది. మరుక్షణములో ఇద్దరూ తలుపు తోసుకుని గదిలోకి వెళ్ళారు.

"దృష్టి పోకముందే మా కంట బడ్డావు నాయనా!" అన్నారు ఇద్దరూ కళ్ళు తుడుచుకుంటూ.

పిల్లవాడు తండ్రి తెచ్చిన బొమ్మలను ముసలమ్మలకు చూపించి మురుస్తున్నాడు.

"బామ్మా! వాడినాన్న తెచ్చిన బొమ్మను చూశావుగాని మా నాన్న తెచ్చిన బొమ్మను చూడవూ?" అన్నాడు శేషగిరి వెన్ను విరుచుకొంటూ.

దానికి జవాబుగా సుభద్ర "సుబ్బారావుకి వాళ్ళనాన్న తెచ్చిన బొమ్మ చక్కగా బొద్దుగా బలంగా ఉంది! కాని సుబ్బారావు తీసుకొచ్చిన బొమ్మకు కళ్ళల్లో ఉన్నాయి ప్రాణాలు. అన్ని బొమ్మలనుకూడా వాడే బాగుచేయాలి" అంది కిలకిల నవ్వుతూ.

సుబ్బారావు తండ్రి తెచ్చిన బొమ్మను ఒక చేత్తోను, తండ్రిని ఒక చేత్తోను పట్టుకొని ఇల్లంతా తిరుగుతుంటే బంగారమ్మ హృదయ క్షేత్రములో సప్తసముద్రాలూ ఒక్కసారిగా ఆనందరసరూపమున పొంగులెత్తి నట్లయింది.

(ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ఉర్దూ భాషలోకి అనువదించిన కథా సంకలనములో చేర్చబడినది.)



# కథ వెనక దాగిన నిజం

నిశ్శబ్ద నిశీధి. మహాత్మాగాంధీ వైద్యాలయంగా మారిన కింగ్ ఎడ్వర్డ్ మెమోరియల్ హాస్పిటల్లో రోగులు అక్కడక్కడ మూలుగుతున్నారు. అప్పుడప్పుడు నర్సుల బూట్ల టకటకలు వినబడుతున్నాయి. స్త్రీల మెడికల్ వార్డంతా నిశ్శబ్దంగా ఉండటం గమనించి లిల్లీ, హాల్లో టేబుల్ ముందు కుర్చీలో కూర్చుని బల్లమీద తల ఆనించి కళ్ళు మూసింది విశ్రాంతిగా.

గడియారం రెండు ముళ్ళూ పన్నెండు దగ్గిర కలుసుకొని విడిపోతున్నాయి.

హాస్పిటల్ ఆవరణలో చెట్లమీద ఉన్న పక్షుల రెక్కల రెపరెపలు.

వెక్కి వెక్కి ఏడుస్తున్నట్టు అస్పష్టమైన ధ్వని.

ఉలిక్కిపడి లేచి నిలబడ్డది లిల్లీ. సిస్టర్ లేవగానే దాయి రాజమ్మ మట్టెలు చప్పుడు తాకుండా మెల్లిగా అడుగులు వేస్తూ కొప్పు సవరించుకుంటూ ఆమె వెంట బయలుదేరింది. పరదా ఎత్తి ఒక్కొక్క గదిలోకి తొంగి చూస్తూ నడిచింది లిల్లీ.

"ఇక్కడ కాదమ్మా. క్యూబికిల్సులో చూద్దాం."

హాలుకు ఎడంవైపుగా నాలుగు క్యూబికిల్సు ఉన్నాయి. రెండవదానిలో పరదా ఎత్తి లిల్లీ లైటు వెలిగించింది.

"మిమ్మల్ని లేచి కూర్చోవద్దని డాక్టరు చెప్పారు కదండి. ఎత్తుగా దిండ్లు పెట్టుకుని పడుకోవాలిగాని మీ రిలా లేవకూడదు. మీ రసలు కన్నీళ్ళు పెట్టుకో కూడదు. మీరేమో ఇలా ఏడుస్తున్నారు ఎంత చెప్పినా. అవతల వార్డులోకి ఏడుపు వినపడితే పరిగెత్తుకుంటూ వచ్చాను. కాళ్ళు చాపుకుని దిండ్లకు తలఆనించి పడుకోండి, దుప్పటీ కప్పతాను."

లిల్లీ ఆమెకు దిండ్లు సర్ది మెల్లిగా తలవాల్చిపడుకోబెట్టి దుప్పటి కప్పింది. కళ్లు తుడిచి తలవెంట్రుకలు సర్దింది.

లిల్లీ చేతులు గుండె కానించుకుంటూ అంది ఆమె: "ఎలాకొట్టుకుంటూందో చూడండి, సిస్టర్, కొట్టుకుని కొట్టుకుని ఒక్కసారిగా ఈ గుండె ఆగిపోకూడదూ?" ఆమెగడ్డం వణికింది. పెదవులు వంకరలు పోయాయి.

"గుండె సంగతి మాకు వదలిపెట్టండి మేము చూస్తాం. మీరు ప్రశాంతంగా నిద్రపోవాలి. నిద్ర మాత్రలు లేకుండా నిద్రపోవటానికి ప్రయత్నించాలి."

"మాత్ర వేసుకోలేదు. కనుకనే నిద్ర పట్టలేదు."

"ఊరికే ఆలోచిస్తూ ఉంటే నిద్ర పడుతుందా? ఆలోచనలు మానేసి ఆ ప్రభువును తలచుకుంటూ నిద్రపోవాలి."

"దేవుణ్ణే తలుచుకుంటున్నాను. నిద్రపట్టించమనీ, ఆనిద్రను దీర్ఘ నిద్రగా చెయ్యమనీను."

"ఛీఛీ ఏమి మాటలు! ఆ పిల్లల్ని వాళ్ళ కర్మకు వదిలి హాయిగా దీర్ఘ నిద్ర పోదామనా మీ ఉద్దేశ్యం? పాపం, వాళ్ల తల్లి లేని వాళ్ళయి అల్లాడిపోరూ?" లిల్లీ ఆమె చెంపలు రాస్తూ స్టూలుమీద కూర్చుంది.

ఏడాది పసివాడూ రెండేళ్ళ పిల్లా ఆమె కళ్ళలో మెసిలారు. మళ్ళీ దుఃఖం పొంగుకుంటూ పైకి లేచింది.

"అబ్బబ్బ! అదే కూడదు. ఇక లాభంలేదుమీతో. ఈ మాత్ర వేసుకుని కళ్ళు మూసుకోండి." లిల్లీ మాత్ర ఒకటి తీసి ఆమె నోటి కందించి గ్లాసెడునీళ్ళు పోసింది గొంతులో.

"సిస్టర్! మీ చేతిని నా గుండెమీది నించి తియ్యరు కదూ! ఇక్కడే ఉంటారు కదూ!"

"ఇక్కడే మీ కెదురుగా స్టూలుమీద కూర్చుంటాను. ఇవాళ పిల్లలు వచ్చారా?"

"రాలేదు."

"మీ అక్కా చిన్న పిల్లలను తీసుకువచ్చిందా?"

ఆ మాటకే ఆమె గొంతులో ఏదో పడ్డట్టయింది. మాట పెకిలి బయటికి రాలేదు. ''నేను నా వాళ్ళందరి తోటీ, తల్లిదండ్రులతోటీ, అన్నదమ్ములూ అక్కచెల్లెళ్లూ —అందరితోటీ తెగతెంపులు చేసుకున్నాను'' అన్నది నిర్లిప్తంగా కళ్లు మూసుకుని రహస్యంగా అన్నట్టు.

''పోనీలెండి. ఇంతకూ ఆమె ఎవరు?''

''ఆమె....ఆమె....నన్నూ నా పరిస్థితులనూ చూసి జాలిపడే పొరుగింటావిడ.''

''ఆమె దగ్గిర బాగా చనువుగా ఉన్నారు పిల్లలు. మీరు దిగులు పడకుండా ఇక్కడ ఉండి మందు తీసుకుని నయంచేసుకోవాలి.''

శుష్కించిన చెంపలు గుంటలు పడేలా ఒక విరుపు నవ్వు నవ్వింది ఆమె.

''మీ ఇల్లెక్కడ?''

''తిలక్ రోడ్డు రాష్ట్రపతి రోడ్డుతో కలిసేచోట మొదటి సందు.''

''మేడమీదనా?''

''కాదు, కాదు. కిందనే. ప....పక్క....వా....కా'' కళ్లు మూతలుపడ్డాయి. లిల్లీ దీపం ఆర్పేసి పరదా వేసింది.

ఉదయం డాక్టరు వస్తూనే అడిగాడు: ''రాత్రి బాగా నిద్రపోయారా?''

ఆమె తల ఆడించింది.

''కళ్లూ ముక్కూ వాచి ఉన్నాయి. మీరు నిద్రపోలేదు. అబద్ధమాడుతున్నారు.''

''మొదట పట్టలేదు గాని తరవాత మాత్ర. వేసుకుని నిద్రపోయాను. సిస్టర్‌ని అడగండి.''

''మీరు కదలకుండా పడుకోవాలి. ఆలోచించకూడదు. ఆదుర్దాపడకూడదు. ఆందోళన చెందకూడదు. ఇలా కనీసం రెండు నెలలయినా ఉండాలి.''

ఆమె తల ఆడించింది. ఆమె వంకే చూస్తూ తలపంకిస్తూ డాక్టరు బెడ్ టికెట్ మీద కొత్త మందులు వ్రాశాడు.

డాక్టరు హాలు దాటగానే వరాండా ఆ చివరి కొన నుండి ఉరుకులతో పరుగులతో వచ్చింది లిల్లీ. "ఆ హార్టు పేషంటుకు రాత్రి గుండెనెప్పి బాగా వచ్చింది. చాలాదుడుకుగా నాడి కొట్టుకుంది. నేను రాసిపెట్టాను. చూశారా?"

"ఆమె హార్టు కండిషన్ బాగాలేదు. ఎన్‌లార్జ్ అయింది. చాలాబలహీనంగా ఉంది. రక్తపుపోటు కూడా హెచ్చుగా ఉంది."

"దానికి తోడు ఆమె పరిస్థితులు బాగా లేనట్టున్నాయి. వాటిని తలుచుకుని తలుచుకుని ఏడుస్తూ ఉంటుంది."

"ఈ జబ్బు ఎక్కువయ్యేది అందుకే. ఆమె మనస్సు తేలిక పడేటందుకు ఎవరయినా సన్నిహితులు ప్రయత్నించాలి." దీర్ఘంగా నిట్టూర్చాడు డాక్టరు.

సాయంత్రం నాలుగు గంటలకు బిలబిల్లాడుతూ రోగులను చూడటానికి అంతా వస్తున్నారు. నవ్వులూ కేకలూ ఏడ్పులూ ఆవరణ దాటి బయటికి వినవస్తున్నాయి. లిల్లీ పాలు, బ్రెడ్ ఆమె కిస్తూ, "మీకో ఉత్తరం వచ్చింది. చూశారా?" అని రోగి చేతి కందించింది ఒక కవరు.

ఆమె చదువుకుని అదోకలా చూస్తూ కవరు కింద పడేసింది.

"ఎక్కడినుంచో చెప్పరూ?"

"నేను పనిచేసే స్కూలునించి. నా సెలవు అయిపోయిందిట. తిరిగి పెట్టమని ఒక టీచరు రాసింది."

"పెట్టెయ్యండి మరి."

"ఇలా సెలవులు పెడుతూ పెళ్ళి కూతురిలా ఇక్కడ కూర్చుంటే జీతం రాదు. అంతా కోసేస్తారు."

గట్టిగా నవ్వితే ఆమెకు బాధకలుగుతుందని లిల్లీ అపుకుని ఆపుకునినవ్వింది. "పెళ్ళికూతుళ్ళే మాదగ్గిరికి వచ్చేది. యమధర్మరాజు పెళ్ళికొడుకులా ఠీవిగా సమీ

పించబోతాడు. మే మతణ్ణి రానియ్యకుండా ఉండాలని ప్రయత్నాలు చేస్తాము.' ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకుని మెల్లిగా ఆడిస్తూ నొక్కింది లిల్లీ .

తలుపులు తోసుకుంటూ వచ్చిన యువతిని చూసి, ''శారదా, వచ్చావా?'' అంటూ ఆమె లేవబోయింది.

''మీ రిలా ఉద్రేకపడకూడదు. లేచి కూర్చోకూడదు.'' ఆమెను ఎత్తయిన దిండ్లకు ఆనించి పడుకోబెట్టింది లిల్లీ.

''మాణిక్యం! నీ ఒంట్లో ఎలా ఉంది?'' మంచమ్మీద కూర్చోబోయింది శారద.

''మంచాన్ని కదిలించకండి. ఇలా కుర్చీమీద కూర్చుని ఆమెను ఉద్రేక పరచకుండా మెల్లగా మాట్లాడిస్తారు కదూ?'' లిల్లీ ఆమె చెవిలో చెప్పినట్లుగా చెప్పింది.

శారద మాణిక్యం చేతిని తన చేతిలోకి తీసుకుంటూ, ''మాణిక్యం! త్వరగా జబ్బు నయం చేసుకుని ఇంటికి వచ్చెయ్యి. నీ విక్కడికి వచ్చి ఎన్నాళ్ళయింది? మూడు వారాలు కాలేదూ?'' అన్నది.

''వారం కూడా కాలేదు. నీకు చెప్పగానే హాస్పిటల్లో చేరా ననుకుంటు న్నావా? లేదు, లేదు.'' ఆమె కన్నీరు కార్చింది. బాధకొద్ది నొసలు ముడిచింది.

'ఇస్స్' అంటూ ఆమెను చేత్తో వారించింది లిల్లీ ముక్కు మీద వేలు వేసుకుంటూ. ''మీ రామెను దేన్ని గురించయినా నిలవదీసి ప్రశ్నలు వెయ్యకండి. ఆమె మనస్సు బాధపడే విషయాలు మాట్లాడకండి. చేతనయితే ఆమెను నవ్వించ టానికి ప్రయత్నించండి.''

శారద తెల్లబోయి లిల్లీవంక చూసింది. ''నేను ఈమెకు మిత్రురాలినండీ. ఒక్క స్కూల్లో పని చేస్తున్నాం. ఆమెను నే నెందుకు బాధపెడతాను?'' చెమర్చిన కళ్ళను కొంగుతో అద్దుకుంది.

ఆమెకు కళ్లు మూతలు పడుతున్నాయి. లిల్లీ శారద చెయ్యిపట్టుకుని మెల్లగా వరాండాలోకి తీసుకువచ్చింది

''ఈమెను మీరు ఎంతకాలంగా ఎరుగుదురు?''

''మే మిద్దరం ఎనిమిదేళ్ళనించీ ఒక స్కూల్లో టీచర్లుగా పని చేస్తున్నాం. అప్పటినించీ ఈమె నా ప్రాణ స్నేహితురా లయింది.''

''అయితే ఈమె చరిత్ర అంతా మీకు తెలిసే ఉండాలి.''

''చాలావరకూ తెలుసు.''

''ఈమెకు గుండెజబ్బు. రక్తపుపోటు హెచ్చుగా ఉంది. ఉండుండి గుండె నెప్పి వస్తున్నది. బాధతో ఆమె మెలికలు తిరిగిపోతూంటే మేమే చూడలేక పోతున్నాం వీటికితోడు మనస్సులో ఏదో బెంగ ఉన్నట్టుంది. ఎప్పుడూ ఏడుస్తూ ఉంటుంది. ఉద్రేకంవల్ల రక్తవాహినులు మూసుకుపోయి రక్తపుపోటు హెచ్చుతూ ఉంటుంది. ఆమెకు ఎందుకు అంతబెంగ? అంత విచారం? మీరేమయినా మార్గం చూపించలేరా?''

శారద విషాదంగా నవ్వింది ''ఆమె బాధ నాకు తెలుసు. కాని, నివారణ నా చేతిలో లేదు.''

హార్టు స్పెషలిస్టు పెద్ద డాక్టరుతో లోపలికివస్తూ మధ్యలో ఆగి, ''ఇలాంటి కేసు ఒకటి మా నర్సింగ్ హోములో ట్రీట్ చేస్తున్నాను'' అన్నాడు.

''అది నాకు తెలుసు. మొదట నేను చూసిందే. దానికంటె ఇది ప్రమాద మయిన కేసు.''

స్పెషలిస్టును సాగనంపి పెద్ద డాక్టరు లిల్లీవైపు తిరిగి, ''ఆమె చరిత్ర కనుక్కున్నావా?'' అంటూ మందంగా అడుగులు వేస్తున్నాడు కారిడర్‌లో.

లిల్లీ శారదవంక చూసింది. శారద తల వంచుకుని రెండు కన్నీటి బొట్లు విడిచింది. చేతి సైగ చేసి డాక్టరు ఆమెను తన గదిలోకి తీసుకువెళ్లాడు.

''ఈమె భర్తని ఒకసారి నా దగ్గిరికి పంపగలరా? అతడిని చూసి మాట్లాడితే ఆమె బాధ నాకు కొంత అర్థమవుతుం దనుకుంటాను.''

''భర్తకూ ఆమెకూ ఈమధ్య రాకపోకలు తగ్గాయి.''

‘‘పిల్లలు?’’

‘‘ఈమె దగ్గిరే ఉన్నారు. జీవితమంతా అంధకారమయమయిపోయింది. ఒక చిన్న పొరబాటు-ఒకేఒక చిన్న పొరబాటువల్ల. ఇప్పుడు వెనక్కి తీసుకోవటానికి వీలులేదు.’’

‘‘వెనక్కి తీసుకోవటానికి వీలులేని దంటున్నారు. అయితే పెద్దదే అయి ఉండాలి.’’

కొంతసేపాగి శారద మళ్ళీ చెప్పటం మొదలు పెట్టింది:

‘‘ఈమె తలిదండ్రులనూ అన్నదమ్ములనూ ఎదిరించి ఒక యువకుణ్ణి ప్రేమించి పెళ్ళి చేసుకుంది.మూడేళ్లు కాపరం చేసింది.ఇద్దరు బిడ్డల తల్లిఅయింది. వివాహమయిన మరునటి రోజే అతడొక దుష్ట సంకల్పంతో తనని వివాహం చేసుకున్నాడని ఆమె పసి కట్టింది. ఎవరితో చెప్పుకోవటానికీ వీలుకాని స్వయంకృతాపరాధం. పెళ్ళిచేసుకున్నాను కదా అని వేయి విధాలుగా తాను సర్దుకుంటూ ఒదిగి ఒదిగి కాలం గడిపింది. కాని, సఫలీకృతురాలు కాలేకపోయింది.’’

డాక్టరు కిందికి చూస్తూ వింటున్నాడు.

‘‘తొలి చూపుతోనే కలిగిన ప్రేమకోసం, అతడి కోసం ఆమె పదిమెట్లు కిందికి దిగింది. కోరి చేసుకున్న వివాహం కదా అని అతడితో సామరస్యంతో కాపరంచేసి తల్లి దండ్రులవద్ద తన మాట నిలుపుకోవాలన్న పంతంకొద్దీ కష్టపడ్డది. ఆమెది శాకాహారం. మరొకటిచూస్తేనే అసహ్యం. అయినా గృహిణీ ధర్మ నిర్వహణకోసం అతడికి కావలిసిన వదుపాయాలన్నీ చేసింది.’

‘‘మరి బాధ దేనికి? అన్నీ నేర్చుకున్నదిగా?’’ డాక్టరు అడగకుండా ఉండ లేకపోయాడు.

‘‘నేర్చుకుంది. కాని ఆమెను అంతటితో అతడు వదిలిపెట్టలేదు. ఆమె వండుతున్నట్లు అందరికీ తెలియాలనీ, నలుగురిలో ఆమె ముఖ కవళికలు గమనించి తప్పు పట్టాలనీ స్నేహితులను పిలుచుకువచ్చి వడ్డించమనేవాడు. మాణిక్యంఅక్కడ కూడా వెలితిపడలేదు అతడికి దానితో తనివితీరక తానేది తింటే ఆమె అది తినాలని నిర్బంధం చేస్తూ వచ్చాడు.’’

డాక్టరు బరువుగా నిట్టూర్చాడు.

"అతడిది ఒక పెద్ద పథకం. అతడికి కాలేజీలో చదివే రోజుల్లో ఒక విద్యార్థినితో స్నేహమయింది. అది ప్రణయంగా మారింది. ఆమె తల్లిదండ్రులు అతడికి ఆమె నిచ్చి పెళ్ళి చెయ్యటానికి ఒప్పుకోలేదు. అయినా అతడి మొండి తనానికి జవాబు చెప్పలేక కాలేజి ప్రిన్సిపల్‌చేత చివాట్లు పెట్టించారు. తమ ఇంటి చాయలకు రావద్దని బెదిరించారు. ఆమెను అతడు కలుసుకోవటానికి వీలులేకుండా చేశారు. అతడు కక్ష కొద్దీ రాత్రిళ్లు ఆ ఇంటిచుట్టూ తిరుగుతూ పిచ్చి కేకలు పెట్టే వాడు. వాళ్ళ ఆధిక్యతను సర్వనాశనం చేస్తానని అరుస్తూ ఉండేవాడు. ఆఅమ్మాయి తల్లిదండ్రులకు పోలీసు కాపలా పెట్టుకోవలసిన అవసరం వచ్చింది. అది జరిగిన కొన్నాళ్ళకు అతడి వలలో కల్లా కపటం తెలియని మాణిక్యం పడిపోయింది."ధారా పాతంగా కారుతున్న కన్నీళ్ళను కొంగుతో తుడుచుకుని చెంపలను శుభ్రం చేసు కున్నది శారద.

"ప్రస్తుతం ఆమె పరిస్థితి ఏమిటి? ఇద్దరూ ఒక ఇంట్లో ఉండటంలేదన్నారు కదూ?"

"ఉండకపోతే ఏం? ఆమె అతని దగ్గరనుండి ఇవతలికి వచ్చి ఉద్యోగం చేస్తూ పిల్లలను సంరక్షించుకొంటూంది. వారాని కోసారయినా ఎక్కడినుండో ఊడిపడతాడు. తన పిల్లలను తాను తీసుకుపోతా నంటాడు. ఆమెతో ఘర్షణ పడతాడు. చెయ్యి చేసుకుంటాడు. ఒకసారి నెట్టినందువల్ల మండిగం మీదపడ్డది. కన్ను పోయేటంత పని అయింది. కణతకు తగిలినదెబ్బ నెల్లాళ్ళకుగాని మానలేదు. పిల్లను ఆమె చేతిలోనుంచి లాక్కొని పరిగెత్తాడు. తనవాళ్ళతో కలిసి ఆపిల్లను పెంచాలన్న ఉద్దేశ్యంట. ఆపిల్లను తీసుకుపోయినందుకు పదిహేను రోజులు నిద్రా హారాలు లేవు మాణిక్యానికి. ఆ పిల్లకు బెంగవల్ల జ్వరంవచ్చింది. శల్యావశిష్టంగా ఉన్న పిల్లను ఎవరి చేతికో ఇచ్చి పంపాడు. మాణిక్యం తననూ పిల్లలనూ కరు ణించి అంతటితో వదిలిపెట్ట మంటుంది. నా ఎదటనే అతడి కాళ్ళమీదపడిప్రాధేయ పడ్డది."

"మీ రిద్దరూ సన్నిహితంగా ఉండేవారు కదా. నాకొక్క సంగతి వివరంగా చెప్పండి. ఈ గొడవంతా మూడేళ్ళనుంచీ జరుగుతున్న దంటున్నారు. పిల్ల పుట్ట

నప్పటినుండి విడిపోవటానికి ఆమె ప్రయత్నిస్తూందన్నారు. సరే. ఉన్న జబ్బు ఇంత హఠాత్తుగా ఎక్కువయిన కారణం ఏమిటో ఊహించారా?"

శారద చెప్పటానికి తటపటాయిస్తూందని గ్రహించాడు డాక్టరు.

"మీరు మళ్ళీ ఒక రోజు రాగలరా?మీరు వస్తే ఆమెకు కొంచెంఉల్లాసంగా ఉంటుందేమో మనసు. ఆమె కా జబ్బు తగ్గాలంటే మనస్సు సంతోషంగా ఉండాలి. మనమంతా అందుకు ప్రయత్నించాలి." ప్రాధేయపూర్వకంగా అన్నాడు డాక్టరు.

అప్పటికి తప్పింది చాలు ననుకుంటూ శారద గదిలోకి వెళ్ళి ఆమెను చూడకుండానే వెళ్ళిపోయింది. మెట్లన్నీ దిగి కిందకి వచ్చినతరవాత ఎదురయిన యువకుణ్ణి చూసి గతుక్కుమన్నది. నాలుగడుగులు వేసి రిక్షాలో కూర్చున్నదల్లా దిగి మెట్లెక్కి పైకివెళ్ళింది.

అతడు, "ఆమె ఇక్కడ చేరినప్పటినుండీ రావాలని ఆరాట పడిపోతున్నానండీ, కాని వెధవది ఆఫీసులో ఇన్‌స్పెక్షను. ఏం చెయ్యను? ఒక ఊరినుంచి ఇంకో ఊరు రావాలంటే ఎన్ని అడ్డంకులు? ఎన్ని అడ్డంకులు?" అని చేతిగుడ్డతో ముఖాన్ని తుడుచుకుంటూ ఎవరితోనో చెబుతున్నాడు.

ఎదురయిన వాళ్ళనడిగి లిల్లీ నికలుసుకోవటానికి అతనికి పావుగంటకుపైగా పట్టింది.

కళ్ళు మూసుకుని పడుకున్న మాణిక్యం అడుగులచప్పుడు విని కళ్ళుతెరిచి చూసి కెవ్వున అరిచింది గుండె పట్టుకుని. వార్డుబాయిచేత లిల్లీ పెద్ద డాక్టరుకు కబురు పంపింది.

అతడు గోడవారగా మంచం పక్కన నిలబడ్డాడు కన్నార్పకుండా ఆమెకేసి చూస్తూ.

డాక్టరు ఆ గదిలోకి వచ్చేవరకూ లిల్లీ అక్కడే మాణిక్యం వెన్ను చేత్తో రాస్తూ నిలబడే ఉన్నది.

"ఏం జరిగింది? మాత్ర ఇచ్చావా?" అన్నాడు డాక్టరు గదిలో అడుగు పెడుతూనే.

ఆమె కళ్ళు తెరవలేదు. నాడి అతి వేగంగా కొట్టుకుంటున్నది. రక్తపు పోటు గంటకింద ఉన్నదానికంటె హెచ్చింది. కనురెప్పలు కదులుతూ ఉండటం చేత ఆమె నిద్రలో లేదని తెలుసుకున్నాడు డాక్టరు. ఆ గదిదాటి ఇవతలికివస్తూ, "మిస్టర్" అన్నాడు వెనక్కి తిరిగి చూస్తూ.

"ఆమెతో మాట్లాడాలని ఉందా?"

"మాట్లాడవచ్చా?"

"ముందు ఆమెకు మీ రేమవుతారో చెప్పండి."

అతడు సందేహించాడు చెప్పటానికి. కొంతసేపాలోచించి, "ఆమె పరిస్థితి ఇప్పుడెలా ఉంది?" అని చేతులు నులుపుకుంటూ అడిగాడు.

"మీ ఇద్దరి మధ్యాగల సంబంధాన్నిబట్టి ఆమె పరిస్థితి ఉంటుంది."

"అంటే?"

"అంటే ఆమె గుండె పరిస్థితి ఏమీ బాగాలేదు. మాటలవల్ల ఉద్రేకం కలిగిందా-కేసు చెయ్యిజారినట్లే."

"ఆమె నా భార్య. నేను మాట్లాడితే ఆమె మనసు ఉద్రేకపడుతుం దను కోను. కాగా, నాకోసం-నేను మాట్లాడలేదని ఆమె బాధ పడుతుందనుకుంటాను."

"ప్రేమాతిశయంవల్ల కూడా మనసు ఉద్రేకించవచ్చు. మీరు క్షమించాలి. ఇప్పుడామెను ఎవరూ మాట్లాడించ కూడదు. ఒక వారంవరకూ ఆమెను చూడ టానికి ఎవరూ రాకూడదని బోర్డు పెట్టాము. చూడలేదూ?" డాక్టరు చేతి సైగ చేసి లిల్లీని పిలిచి, "నీవు బెడ్ టికెట్ చదివావా?" అన్నాడు గంభీరంగా.

ఆమె బెదిరిపోయింది. మాట తడబడ్డది. "ఆయన.........ఆమెకు........"

"సంబంధాల సంగతి నీ కెందుకు? రాసినట్టుగా వ్యవహరించలేవూ?"

అతడు కొద్దిగా ధైర్యం తెచ్చుకుని, "నన్ను అనదలుచుకొన్న మాటలన్నీ ఆవిడ నంటున్నారు. మాట్లాడకపోయినా కంటితో చూద్దామని ఆ గదిలో అడుగు

పెట్టాను. అదీ నా అంతట నేను జొరబడలేదు. నామీద మీకేమయినా కోపం ఉందా?'' అని జేవురించిన ముఖాన్ని చేతిగుడ్డతో అద్దుకుంటూ అన్నాడు.

"లేదు. లేదు. అలా ఎందు కనుకుంటున్నారు? రోగి పరిస్థితి బొత్తిగా బాగుండలేదు."

చిన్నబోయిన ముఖాన్ని దించుకుంటూ, "సరే కానియ్యండి. మీ అధీనంలో ఉన్న రోగి విషయంలో మీరు చెప్పినట్లే నడుచుకోవాలి'' అని అతడు పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళాడు.

"డాక్టర్!"

అతడు వెళ్ళినదిక్కే వెర్రిగా చూస్తూ స్థాణువులా నిలబడిపోయిన డాక్టరు ఉలిక్కిపడి చూశాడు. శారద ఆయన గదిలోనుంచి వస్తున్నది.

"మీరు వెళ్ళలేదూ ఇంటికి?"

"లేదు. మెట్లన్నీ దిగిన తరవాత గౌరీశంకర్ ఎదురు పడ్డాడు. అతడు—అంటే మాణిక్యం భర్త వస్తున్నాడని మీతో చెబుదామని వచ్చి ఇంతసేపూ మీ గదిలోనే ఉన్నాను. అతణ్ణి చూస్తే ఆమె బ్రతకదు." ఆమె గబగబా అడుగులు వేస్తూ కారిడరు దాటి మెట్లుదిగి వెళ్ళిపోయింది.

"లిల్లీ! పేషంటు జాగ్రత్త. ఎవరినీ లోపలికి రానియ్యవద్దు." డాక్టరు ఏప్రన్ విప్పి తన గదిలో మేకుకు తగిలించి వెళ్ళి కారులో కూర్చున్నాడు.

పదకొండు గంటలు కొట్టింది చర్చి గడియారం. ఆమె కళ్ళు తెరిచి చూసింది. నిద్రకు మాత్రలు వేసుకున్నందువల్ల మధ్యాహ్నంనుంచీ నిద్రే. దేహం తేలిగ్గా ఉంది. కాని గుండె? చేత్తో గుండె రాసుకుని చూసింది. ముట్టుకుంటే నొప్పి, ఊపిరి తీసుకుంటే నొప్పి. ఇన్ని రోజులనుంచీ ఇలా బాధగా ఉన్నా ఇంకా గుండె ఆగకుండా ఉన్నదే!

**ఆమెకు ఆనాడు తన గుండె ఆగిపోవాలని లేదు. ఈ జీవితం అంతటితో చాలిద్దామని లేదు. తన బిడ్డలకు—పాప పుణ్యాలెరుగని పసికందులకు—దిక్కే**

వరు ? తల్లినీ తండ్రినీ కాదని గోతిలో పడ్డది. గోతిలో ఉండి వాళ్ళ సహాయం అపేక్షించటం సిగ్గులేనితనం. కాని నిజంగా అంతటి పరిస్థితే వస్తే ? ఆ బిడ్డ ఇద్దరూ పేవ్‌మెంటుమీద నిలబడి చింపిరి బట్టలతో బిచ్చమెత్తుకుంటారా ? 'అమ్మా, అయ్యా. ఒక పైస వెయ్యండి' అంటూ అందరి ముందరా చేతులుచాపుతారా ? ఛీ ఛీ ! ఏమాలోచనలు ! ఊహామాత్రానికే గుండె లవిసిపోతున్నాయి.

ఆమె దృష్టి కిటికీలోనుంచి బయటికి పోయింది పండువెన్నెల. ప్రకృతి అంతా ఈ వెన్నెలకు పరవశిస్తున్నదా ? తన జీవితంలో ఒకనాడు—ఒక్కటంటే ఒక్కటే రోజు—వెన్నెల కాసింది. చీకట్లో మెరుపులా ఆ ఒక్క రోజు. కటిక చీకటి ఆవరించుకుపోయిన మనసులో తళుక్కుమన్నది. మహదానందము పొందిన ఆ రోజు తెల్లవారగానే కాలగర్భంలో కలిసిపోయింది.

లిల్లీ పరుగెత్తుకుంటూ వచ్చింది. "ఏమిటమ్మా ! అక్కడికి వినబడేటట్టు అట్లా మూలిగారు. మళ్ళీ నొప్పి వచ్చిందా ?"

లేదని తల ఆడించింది.

"నేను ఎదురుగా ఆ హాల్లో ఉంటాను. ఓ కన్ను, ఓ చెవి ఇటే ఉంచు తాను. పెద్ద డాక్టరుగారు చాలా శ్రద్ధ తీసుకోమని చెప్పారు. కాస్త హెచ్చుతగ్గయితే నా ప్రాణం పోతుంది."

"నిజమా ? ఆయనకు నా కృతజ్ఞత ఎలా తెలుపుకోవాలి ?" కళ్ల నీళ్లు వచ్చాయి ఆమెకు.

"డాక్టర్లకు ఒక్కొక్క పేషంటు మీద అమితమైన శ్రద్ధ కలుగుతుంది. బహుశః జబ్బునుబట్టి కావచ్చు. ఈ డాక్టరుగారికి హార్టు పేషంట్లంటే ప్రాణం. మీకోసం సాయంత్రం కూడా హాస్పిటలుకు వచ్చి చూస్తున్నారు. ఉదయం వచ్చి నప్పుడు రెండు మూడు సార్లయినా ఈ గదిలోకి వచ్చి చూసిపోతూ ఉంటారు. ఇంత పొద్దుపోయేవరకూ మీరు మేలుకుని ఉండకూడదు. కళ్లు మూసుకు పడు కోండి."

**"సరే. కళ్లయితే మూసుకుంటా. కాని ఈ మెదడు ఊరికే పనిచేస్తూ ఉంటుంది. దాన్నెలా పడుకోబెట్టటము ?"**

''ఆలోచించటం మానెయ్యాలి.''

''ఆలోచనలు వాటంతట అవే ఉప్పెనలా వచ్చి మీదపడుతూ ఉంటాయి. నేనేం చెయ్యను?'' మళ్ళీ కళ్లలో నీరు ఊరింది.

''నాకు మిమ్మల్ని చూస్తే జాలిగా ఉంటుంది. నా స్వంత అక్కచెల్లెళ్ళ మీదకంటె మీమీద ప్రాణం గుంజుతున్నది. మీ మనసులో ఏదో బాధ ఉంది, అది మిమ్మల్ని పీడిస్తూంది. ఆ బాధేమిటో నాకు చెప్పండి. నా కడుపులో పెట్టుకుంటాను. రెండో కంటివాడికి తెలియనివ్వను. మీ బాధ ఎవరితోనయినా చెప్పుకుంటే మనసు తేలిక పడుతుంది. అదేమిటో నాకు చెప్పండి, నాకు చేతనయిన సహాయం చేస్తాను.'

ఆమె లిల్లీ రెండు చేతులూ దగ్గిరికి తీసుకుని ముఖాని కానించుకుని ఏడ్చింది.

ఆమె వీపుమీద చెయ్యివేసి రాస్తూ. ''డాక్టరుగారు వద్దన్నపనే మనం చేస్తున్నాం. మీదగ్గిర ఉంటే నాకూ కన్నీళ్ళు వస్తున్నాయి. ఇవాళ మీ బాధేమిటో నాతో చెప్పాలి ఎలాగయినా'' అంది లిల్లీ.

''నేను చచ్చిపోయానా, లిల్లీ? లేక చచ్చిపోతానా? నాకు చావు రాసిపెట్టి ఉంది కదూ!''

లిల్లీకి నవ్వు వచ్చింది. ఆమెకు చక్కిలిగింతపెట్టి అంత విచారంలోనూ నవ్వేటట్టు చేసింది. ''అందరూ ఏదో ఒకనాడు చస్తారు. అందరికీ చావు రాసిపెట్టే ఉంటుంది. దానికేనా మీరు భయపడుతున్నది? ఎంత అమాయికంగా ఉంది మీ భయం! మనం ఈ విషయాన్ని గురించి రేపు మాట్లాడుకుందామా?''

''నే చెప్పేది కాదు. ఒక మనిషి బ్రతికి ఉండగా ఆ మనిషి చచ్చిపోయిందని అంతా అంటే ఎట్లా ఉంటుంది?''

''ఎట్లా ఉంటుంది? తాను లక్షణంగా బ్రతికి ఉన్నట్టుగా ఆ మనిషి ఋజువు చేసుకోవాలి. వాళ్ల ముఖాన కొట్టినట్టు ఠీవిగా బజార్లలో వాళ్ళముందరే తిరగాలి. ఇంతేనా మీ రడిగే విషయం? రేపు మాట్లాడుకుందాము.'' ఆమె వెన్నుమీద చేత్తో రాస్తూ దీపం ఆర్పేసి చిన్న దీపం వెలిగించింది లిల్లీ.

ఉదయం పది గంటలవేళ పెద్ద డాక్టరు తన అసిస్టెంట్లుతో రౌండ్సు చేస్తున్నాడు. "ఆ పేషంటును గురించి పదిహేను రోజుల కిందట నేనో కబురు విన్నాను అవునో కాదో నని ఆమెనే అడుగుదామని మనసు గుంజాటనలోపడ్డది." అసిస్టెంటు పెద్ద డాక్టరుతో సమానంగా నడవక ఒక అడుగు వెనకే ఉంటున్నాడు.

"ఏ పేషంటు?"

"ఆదేనండీ క్యూబికిల్ నంబరు టూ ఫీమేల్ మేడికల్ వార్డు."

"ఆ ఆఁ అయితే ఏమిటా సంగతి?" ఆయన గిరుక్కున వెనక్కిమళ్ళారు

ఆమె విడాకుల కేసు హైకోర్టు కెక్కింది. అక్కడ తీర్పు ఆయనకు అనుకూలంగా లేదు ఆమెను ఏడిపించటానికి, ఆమెను అల్లరిపాలు చెయ్యాలని ఆమె జీవిత కథలంతా తలకిందులుగా నిజాలను అబద్ధాలుగా మార్చి ఆ అబద్ధాల కథ అంతా ఓ పత్రికలో అచ్చువేయించాడు. పత్రిక ఏం చేస్తుంది? అన్నికథలలాంటిదే ననుకుని అచ్చువేసింది. కథ చాలా బాగుందని పాఠకులు శరపరంపరగా లేఖలు వ్రాశారు. అందరూ ఆమెను వేలెత్తి చూపుతూ హేళన చెయ్యటం మొదలు పెట్టారు."

ఆఁ హాఁ అన్నాడు డాక్టరు. అటువంటి దేదో ఉంటుందన్న ఆలోచనతో "అయితే ఆ కథంతా ఆమెదేనని ఎవరు చెప్పారు?"

"మన రేడియాలజిస్టు సుబ్బారావు దగ్గిరుంటే నేనే తీసుకువచ్చి చదివాను. లిల్లీ అ పేషంటును గురించి చెప్పిన సంగతులతో ఆ కథ కలుస్తూందని కొంత ఊహించాను."

పెద్ద డాక్టరు గాఢంగా నిట్టూర్చాడు. "అయితే చివరి కేమయింది కథ?"

"కథలోనా? కథానాయిక మాటలతో చేష్టలతో భర్తను హింసించిహింసించి ఆయనను దూరం చేసుకుంటుంది. పిల్లలు తండ్రికోసం బెంగపెట్టుకుంటారు. అమె గుండె జబ్బుతో బాధపడుతూకూడా పట్టుదలగానే ఉంటుంది. ఒకనాడు గుండె నొప్పితో గిలగిల కొట్టుకుని చనిపోతుంది. పిల్లలను తండ్రి తీసుకు వెళతాడు."

తలపంకిస్తూ పెద్ద డాక్టరు తన గదిలోకి వెళ్ళాడు.

మెటిల్డా బెడ్ టికెట్లన్నీ చంకనబెట్టుకుని డాక్టరు గదిలోకి వెళ్ళి, "ఈ పేషంటుకు నిన్నంతా పల్చటి ఆహారం ఇవ్వమని రాశారు. ఇవాళ బ్రెడ్ పెట్టమని రాశారు. నిన్నటికంటె ఆమె పరిస్థితి మెరుగ్గా ఉందా?" అని అడిగింది.

బెడ్ టికెట్ చేతిలోకి తీసుకుని చదివి. "లిల్లీ ఏమయింది?" అన్నాడు కలం తెరిచి వ్రాస్తూ.

"నాలుగు రోజులు సెలవు పెట్టింది."

"ఈ పేషంటును జాగ్రత్తగా చూసుకో. గుండె చాలా బలహీనంగాఉంది. ఎక్కువగా మాట్లాడించకు. శబ్దం కూడా వినబడకూడదు. ఆమె గదిలోకి విజిటర్సును రానీయకు. లిల్లీ వచ్చేవరకూ కనిపెట్టిఉండు. పండ్లరసం తప్ప ఏమీ వద్దు. జ్ఞాపకం ఉంచుకో."

మెటిల్డా నవ్వుతూ వెళ్ళిపోయింది.

నాలుగు రోజులతరవాత లిల్లీ మెల్లిగా అడుగులు వేస్తూ లోపలికివచ్చింది. మాణిక్యం కళ్ళెత్తి చూసి ఆమెను దగ్గిరికి రమ్మని సైగ చేసింది.

"లిల్లీ! ఇన్నాళ్ళూ రాలేదేం? ఎక్కడికి వెళ్ళావు?" ఆమె కంఠ ధ్వని రహస్యం చెప్పినట్టుగా ఉంది.

చెదిరిన ముంగురులు సరిచేస్తూ, "ఈవారం రోజుల్లో మీ ఆరోగ్యం చాలా బాగయింది" అని లిల్లీ ఆమె కళ్ళల్లో చూస్తూ నవ్వింది.

"అమావాస్య ఇంకెన్నాళ్ళుంది? పది రోజులుందా?"

"చూసి మధ్యాహ్నానికి చెబుతా. మందు తాగారా?"

వెనక్కి తిరిగిచూస్తూ లిల్లీ వెళ్ళిపోయింది. తిన్నగా పెద్ద డాక్టరు దగ్గిరికి వెళ్ళి ఆ పేషంటు పిల్లలను చూడకూడదా, డాక్టర్' అని అడిగింది.

"ఎందుకు? అడుగుతూందా?"

''అవును వాళ్ళను తలుచుకుని ఏడుస్తూంది. ఒక్కసారి కళ్ళతో చూస్తే విచారం తగ్గుతుందేమో.''

''తగ్గదు. హెచ్చుతుంది. ఆ పిల్లలను గురించి కులాసా కబుర్లు చెప్పుతూ ఉండు.''

''అంతేనా?''

''అంతే.''

లిల్లీ ఒకొక్క చంచా పళ్ళరసం నోట్లో పోస్తూంటే రోగి గుటకలు వేస్తున్నది.

''అమావాస్య ఎప్పుడు? చూసి చెబుతాన్నావుగా?''

''మరిచిపోయానమ్మా. ఎవరినయినా అడిగి తెలుసుకోవాలి. తెలుగు తిథులు అందరికి తెలియవు. కాలెండరులో ఉండవుగా మరి?''

సాయంత్రం రోగులను చూడటానికి వచ్చినవాళ్ళంతా తిరిగి వెళుతున్నారు. వాళ్ళ మాటలతో హాస్పిటల్ ప్రతిధ్వనించిపోతూంది. ప్రకృతి వెలుగు నీడలతో దోబూచులాడుతున్నది. హాస్పిటల్ భవనాన్ని ఆశ్రయించుకున్న పక్షిజాలం వింత వింత కూజితాలతో సంతానాన్ని పలకరిస్తున్నది. రెక్కలు: టప టప లాడిస్తూ తాము చూసివచ్చిన వింతలనూ విశేషాలనూ ఆనందంతో ఒకదానితో ఒకటి చెప్పుకోవటానికి ఇటు నుంచి అటు, అటునుంచి ఇటు పరుగులెత్తుతున్నాయి పక్షులు. అంతలో ప్రకృతి తల విసిరేసినట్టు నల్లటి ముసుగుతో హాస్పిటల్ ఆవరణ అంతా కప్పేసింది. పక్షి జాలమంతా హాస్పిటల్ ఆవరణంలో ఉన్న చెట్లమీద గూళ్ళలోకి సర్దుకుంది.

ఆ చీకట్లో కళ్ళు చిట్లించుకుంటూ మాణిక్యం కిటికీలోనుంచి బయటికి చూస్తున్నది. త్వరగా నిద్రపట్టటానికి అనాడు ఇచ్చిన నిద్ర మాత్రలు ఇంకా పని చెయ్యటం మొదలుపెట్టలేదు. ఎందుకు? నిన్నటివి కానట్టున్నాయి?

ఆమెకు నిద్రమత్తు వచ్చీరాకుండా ఉన్నది. పెద్ద బొట్టు పెట్టుకుని పట్టంచు చీరె కట్టుకుని ఉమా సుందరమ్మ కనిపించింది. అబ్బ అమ్మను చూసి ఎంత

కాలమయింది! అమ్మ మాట చెవిని పడి ఎన్నాళ్ళయింది! ఉమను చూస్తే అంతా అమ్మమూర్తిలా ఉంటుంది. రోజూ చూసే తన కన్నతల్లిలో అమ్మను చూడాలనే ఆ పేరు కూడా పెట్టింది. నడుంమీద చెయ్యి పెట్టుకుని నడుస్తుంటే అచ్చు అమ్మలాగే, అంతా అమ్మే అనిపిస్తుంది. శేషుడు కొంటె నవ్వులు నవ్వుతూ పట్టు చిక్కకుండా పారిపోయేటప్పుడు వెనక్కి తిరిగిచూస్తాడు. తన పరాక్రమం ఎంతో ఇతరులకు చూపించాలని అదోమాదిరిగా ముఖం పెడతాడు. వాడు ముమ్మూర్తులా నాన్న. నాన్నకు పట్టుదల హెచ్చు. కడుపు తీపిని అధిగమించే పట్టుదల.

ఇప్పుడు నాన్న దగ్గరికి వెళితే?

పిల్లలను ఆయన చేతికి అందిస్తే?

నాన్నకు తెలుసు తన గుణాలు పుణికి పుచ్చుకున్న కూతురిలో ఎంత అభిమానమున్నదో. ముందడుగే కాని వెనకడుగువెయ్యటం ఆయనలో ఉన్నదా ఆమెకు రావటానికి?

ఆలోచనలతో మెదడు వేడెక్కింది. శరీరం అలిసిపోయింది. తల దగ్గరగా ఉన్న గంట నొక్కింది.

''ఏమిటి? నిద్రపోయారనుకుంటే గంట నొక్కారు?'' లిల్లీ గబగబా వచ్చి పెద్ద దీపము వేసింది. మంచినీళ్లు కావాలేమోనని నోటి కందించింది.

''మిమ్మల్ని ఎక్కువ మాట్లాడించ వద్దన్నారు డాక్టరు. కళ్లు మూసుకు పడుకోండి.''

దీపం ఆర్పి లిల్లీ కొంతసేపు ఆమె తల నిమురుతూ నిలబడ్డది.

ఉదయం తొమ్మిది గంటలకు పెద్దడాక్టరు ముందు ఆమె గదికే వచ్చాడు. కనురెప్పలు విరిచి చూశాడు. చేతి గోళ్ళు నొక్కి చూశాడు, పాదాలుఒత్తిచూశాడు.

''డాక్టరుగారూ!''

అతడు ఉలిక్కిపడి ఆమె ముఖంలోకి చూశాడు.

''నా దొక చిన్న విన్నపం ఉంది. ఆలకించాలి.'' అతడి చేతులు రెండూ పట్టుకుంది.

"ఏమిటి? జబ్బు సంగతేనా? త్వరగా నయమయిపోతుంది. మందులు పని చేస్తున్నాయి. రోజుకంటె ఇవాళ చాలా తేలిగ్గా ఉన్నట్టుంది కదూ!'

"జబ్బు సంగతి కాదు. నిన్నటినుంచీ జబ్బును గురించిన ఆలోచనలు మానేశాను. నే నేమయినా నా పిల్లల భవిష్యత్తు పాడు కాకూడదు. వాళ్ళిద్దరికి ఏదయినా ఏర్పాటు చెయ్యండి. ఇది మీ బాధ్యతకాదని నాకూ తెలుసు. అయినా ఈ దీనురాలి కోరిక మన్నించి ఏదయినా ఒక మార్గం చూడండి. వాళ్ళకు నేను ఇవ్వ గలిగింది చెరి అయిదు వందలూ తప్ప ఇంకేమీ లేదు. అవయినా ట్యూషన్లుచెప్పి సంపాదించాను. ఏమంటారు?"

జాలి గొలుపుతున్న ఆమె ముఖాన్ని ఎక్కువసేపు డాక్టరు చూడలేక పోయాడు.

'ఏమంటారు?' అన్నట్టు ఆమె చూపులు డాక్టరు ముఖంమీదనే ఉన్నాయి.

"సాయంత్రం నాలుగు గంటలకు వచ్చి చెబుతాను. మీరు నిశ్చింతగా ఉండండి. పుట్టించిన దేవుడు ఏదో విధంగా బతికిస్తాడు."

ఆయన రెండు చేతులూ తీసుకుని తన కళ్ళ కద్దుకుంది. సాయంత్రం నాలు గయ్యేవరకు చేతి గడియారం చూసుకుంటూనే ఉన్నది.

సుమారు అయిదు గంటలకు నలుగురు డాక్టర్లను వెంటతీసుకుని పెద్ద డాక్టరు వచ్చాడు. వాళ్ళనందరినీ చూసి తెల్లబోయింది రోగి. పెద్ద డాక్టరు ఆమె మంచానికి దగ్గరగా వచ్చి, "చూడమ్మా పీళ్ళదగ్గిర మీ పిల్లలను ఉంచే ఏర్పాటు చేశాను, వీళ్లు పిల్లలను కళ్ళ కద్దుకుని పోషిస్తారు. అప్పుడే వాళ్ళ ఇళ్ళకు తీసుకు వెళ్ళి మీ పిల్లలను భార్యల కందించారు. వాళ్ళ కే విధమయిన లోపమూ ఉండదు. ఇంక మీరు నిశ్చింతగా ఉండవచ్చు. తిరిగి నేను రేపు ఇక్కడికి వచ్చి కనబడ తాను" అంటూ ఆమె ముఖంలోకి చూశాడు. ఆమె కళ్ళలో నీళ్ళు నిలిచాయి. రెండు చేతులూ ఎత్తి జోడించింది, ఆమె ముఖంలో సంతోషం అనేక రీతులలో తాండవించింది.

ఆ రాత్రి లిల్లీ మందు గొంతులో పోస్తుంటే నవ్వుతూ తాగింది, ముఖం చిట్లించకుండా ఇంజక్షను తీసుకుంది. నిద్ర మాత్ర వేసుకుని సగం గ్లాసెడు నీళ్లు తాగింది.

"లిల్లీ!"

ఏమన్నట్టు చూసింది లిల్లీ.

"నీకు నేను ఋణపడి ఉన్నాను. ఇక్కడికి వచ్చినప్పటినుంచీ నా కెంతో సేవ చేశావు. నా జ్ఞాపకానికి గుర్తుగా ఈచిన్న ఉంగరం నీ వేలికి పెట్టుకో." ఆమె చెయ్యి బలవంతంగా లాక్కుని తన వేలి ఉంగరం పెట్టింది.

"లిల్లీ ఇవాళ నాకు నీతో వచ్చి ఈ హాస్పిటలంతా తిరగాలని ఉన్నది.

"రండి, పోదాము. లేవగలరా?" లిల్లీ పగలబడి నవ్వింది.

"ఓపిక లేదు గాని ఉంటే ఎంతపనయినా చేద్దామని ఉంది."

"పని చెయ్యొద్దు గాని ప్రశాంతంగా పడుకుని నిద్రపొండి. ఎప్పటి మాదిరిగా గంటకొడితే వస్తాను. కొట్టకపోయినా తెల్లవారేలోపల రెండుసార్లు వస్తాను." లిల్లీ గుడ్ నైట్ అంటూ పరదావేసి వెళ్ళిపోయింది.

ఉదయం అయిదున్నరకు లిల్లీ చేసిన ఫోను అందుకుంటూ ఇప్పుడేవస్తానని ఉరుకులు పరుగులమీద పెద్ద డాక్టరు వచ్చాడు. ద్వారం ముందర తల నెరిసిన దంపతులు నిలబడి ఉన్నారు.

"అయ్యా! ఈగదిలో ఉన్నది మా అమ్మాయి. మా పెద్దకూతురు. జబ్బుగా ఉందని విని వచ్చాము. లోపలికి వెళ్ళి చూడనివ్వాలి" ఆయన చేతులు నలుపుకుంటూ అడుగుతున్నాడు.

"వచ్చినప్పటినుంచీ ఏం చేశారు? ఇంతకాలంనుంచి ఆమె ఎట్లా ఉందోనని ఒక్క ఉత్తరం ముక్కయినా వ్రాశారా?"

"నిజం, నిజం, పెద్దవాణ్ణి నేను తప్పు చేశాను. నాలుగురోజులనాడు తల్లి, నా కలలో కనబడి 'నాన్నా! నన్ను ఇంటికి రానివ్వరా?' అంటూ కన్నీళ్ళతో అడిగి నట్లయింది. గతం మరిచిపోయి కట్టు బట్టలతో బయలుదేరి వచ్చాము. ఈ బస్తీలో అందరినీ అడిగి అడిగి ఎక్కడున్నదో తెలుసుకుని వచ్చేవరకు ఈ వేళయింది."

డాక్టరు చిన్నబోయిన ముఖం దించుకున్నాడు.

"మా తల్లిని ఒక్కసారి చూడనియ్యండి. ఎంత డబ్బయినా ఖర్చుచేసి. నా తల్లిని బతికించుకుంటాను."

"రండి." డాక్టరు చెయ్యి ఊపుతూ వాళ్ళను లోపలికి తీసుకువెళ్ళాడు. "తెల్లవారుఝామున అయిదింటికి ఆమె బాధలన్నీ తొలగిపోయాయని టెలిఫోను వస్తే వచ్చాను" అని పక్కన నిలబడ్డాడు డాక్టరు.

తల్లిదండ్రు లిద్దరూ మొదలు నరికిన వృక్షాలల్లే నేల కొరిగిపోయారు.

పెదవి కొరుక్కుంటూ లిల్లీ కన్నీళ్లు ఒత్తుకుంది.



# కలసి విడిన జోడు

శంకరయ్య సముద్రపుటొడ్డున నిలబడి చూస్తున్నాడు. సముద్రము ఆకలిగొన్న పులిలా నోరు తెరుచుకొని ఒడ్డుమీదికి వచ్చి పడుతున్నది. చేతులు వెనక్కు పెట్టుకొని ఉరవడితో వచ్చి విరిగిపడుతున్న అలలను చూస్తూ నిలబడిపోయాడు. ఆ హోరుకు అతడి గుండె దడదడలాడిపోయింది. ఉద్వేగంతో సముద్రము పొంగి పొర్లుకుంటూ పైకిలేచింది. ఆ పొంగు చల్లారటానికి గంటకుపైగా పట్టింది. చుట్టూకలయచూశాడు. గుంపులు గుంపులుగా ప్రజలు మూగి ఉన్న ఆ ప్రదేశము అతడికి నిర్లక్ష్యముగా కనబడ్డది.

రాత్రి ఎనిమిది గంటలు కావచ్చింది. శంకరయ్య చేతులు రెండూ కోటు జేబులో పెట్టుకొని బజార్ల వెంట తిరిగి తిరిగి మార్కెట్టు చేరుకున్నాడు. అప్పటికే మబ్బులు ఆకాశాన్నంతా ఆవరించుకున్నాయి. ఆతడు ఏదో ఆలోచించుకుంటూ దుకాణాల ముందుగా మందంగా నడుస్తున్నాడు. ఒక వరస దుకాణాలు చుట్టివచ్చే సరికి పెద్దపెద్ద చినుకులతో ప్రారంభమైన వాన. జోరున కురువటము మొదలు పెట్టింది. జనమంతా దుకాణములలోకి దూరారు. శంకరయ్య కూడా ఒక దుకాణము లోకి జొరబడి గోడవారగా నిలబడ్డాడు.

వర్షం విలిచి కురుస్తున్నది. దుకాణాలలో దూరిన జనమంతా ఒక్కొక్కళ్లే చోటుచేసుకొని కూర్చోవటము మొదలుపెట్టారు. శంకరయ్య కూడా ఒక మూలగా గోడ కానుకొని కూర్చున్నాడు. అక్కడ చేరినవాళ్ళంతా మెల్లగా కబుర్లలో పడ్డారు. వాళ్ళంతా నవ్వుకుంటుంటే శంకరయ్యను కూడా అనుకోకుండానే నవ్వు వస్తున్నది. కాని అతడి మనసులో ఇంటి సంగతులు సముద్రపుపొంగులో పొంగి పోతున్నాయి. మోడులాంటి తన జీవితము చిగిర్చి పుష్పించి ఫలించిం దనుకున్నాడు. కాని ఆ సంతోషము నీటిబుడగలా మాయమయింది. స్మృతి చిహ్నాలను తనకు మిగిల్చిపోయింది. అతడి గుండెను కరకర నమిలి మింగేస్తుంది.

అతడి జీవితంలో జరిగిన సంఘటనలు అట్లా జరక్క ఇంకొక మాదిరిగా జరిగితే ఎట్లా ఉండేదో! కొన్నాళ్ళగా మిల్లులోనే పెద్ద ఉద్యోగము దొరికేదేమో

ఎవరు చూడవచ్చారు? కాని అట్లా జరగలేదు. మిల్లులో ఉద్యోగముమాట అటుంచి గృహకల్లోలాలతో మనసు కుంచించుకుపోయింది. ఒకనాడా పరిస్థితుల మీద వెగటుపుట్టింది

శంకరయ్య మనసు పాదరసములా పరుగులెత్తటము మొదలుపెట్టింది. గతాన్ని విస్మరించాలని అతడు ఎంత ప్రయత్నించినా మనసాగలేదు. 'ఛీ: మన సెంత పాపిష్ఠిది?' అని విసుక్కున్నాడు. కళ్ళుమూస్తే గడచిన సంగతులు ప్రత్యక్షమయి కలత చెందిస్తాయని అతడు కళ్ళు విప్పుకొని చూడటము మొదలుపెట్టాడు. కాని కొంత సేపటికి కళ్ళు వాటంతట అవే మూతలుపడ్డాయి. మసక మసకగా గడచిన సంగతులు కళ్ళకు కట్టాయి.

అతడికి ఒంటిమీద స్పృహ వచ్చేసరికి కళ్ళు తుడుచుకుంటూ ఎదురుగా తల్లి కనబడ్డది. నాలుగు పక్కలా కలయచూచేసరికి అక్కడ తానొక్కడే కాడు. ఇలా చాలా మంది మంచాల మీద దుప్పట్లు కప్పుకొని పడుకొనిఉన్నారు. కొందరు మూలుగుతున్నారు. తన చేతుల వంక చూసుకున్నాడు. గట్టిగా పట్టీలు కట్టి ఉన్నాయి. బాధ తెలియకుండా ఉండాలని మందు యిచ్చినట్టున్నారు కాని చేతులలో నుంచి సన్నగా పోటు జివ్వుజివ్వున లాగినట్టు అనిపిస్తున్నది. చేతులమీద దృష్టి పడగానే కళ్ళవెంట నీళ్లు కారి ధారలు కట్టాయి.

అతడు పనిచేసే బట్టలమిల్లులో వారానికి పదిహేను రూపాయలు ఇచ్చేవారు ఏడాది కొకసారి బోనసూ ఇరవై గజాల బట్ట వచ్చేవి. మిల్లులో యంత్రాలు గిర గిర తిరుగుతూ ఉంటే అతడి మనసులో ఏదో సంతోషము లాంటిది పొంగులు వారేది. ఉడుకు రక్తము ఉరకలు వేసేది.

ఎప్పటిలాగే ఆనాడు కూడా అతడు రాత్రిపూట డ్యూటీలో ఉన్నాడు. పన్నెండు గంటల వరకూ చురుకుగా జాగ్రత్తగా పనిచేశాడు. తరువాత కొద్దిగా నిద్ర తూగటము మొదలుపెట్టింది. ఒకసారి మెషీను మీదికి ఒరగబోయాడు. కాని వెంటనే సర్దుకొని చన్నీళ్ళతో ముఖము కాళ్ళు కడుక్కొని పనిచేయటము మొదలు పెట్టాడు. ఒక గంట తర్వాత మళ్ళీ నిద్రమబ్బు వచ్చింది. అతడికీసారి సర్దుకోవటానికి అవకాశము లేకుండాపోయింది. రెండుచేతులూ మరలోపడి నలిగిపోయాయి అతడు కేకలు వెయ్యటమూ అక్కడ ఉన్నవాళ్లు యజమానికి టెలిఫోనుచేసి అంబు

లెన్సులో తనను ఆసుపత్రిలో చేర్చటమూ బాధ భరించలేక తను గావుకేకలు వెయ్యటమూ అతడికి బాగా జ్ఞాపకమున్నది.

బాహ్యస్మృతి కలిగిన తరువాత తల్లిని తనచేతులను గురించి ప్రశ్నించాడు. ఆమె చెప్పలేక కన్నీరు కార్చింది. ఆ మరునాటికల్లా అతడికి తెలిసిపోయింది మోచేతుల వరకూ కొట్టేశారని బాధతగ్గినపుండు నయమయిన తరువాత శంకరయ్య ఇంటికివచ్చాడు. మిల్లు యజమాని ఒక ఏడాది జీతము పంపాడు.

అతడి కిప్పుడు చేతులు పూర్తిగా లేవు. రెండూ మొండివి. ఒకరు బట్ట కట్టాలి. ఎవరయినా అన్నము పెట్టాలి. తమ్ముడు ధోవతి కడుతున్నాడు. చెల్లెలు అన్నము కలిసి నోటిలో పెడుతున్నది. అన్నము తిన్న తరువాత చీకటిపడే వరకూ వాకిటి అరుగుమీద కూర్చునేవాడు. ఆలోచనలు సుడులు తిరుగుతుంటే పట్టపగలు కూడా అతడి కంటిముందర కటికచీకటి తాండవించేది

ఇంతవరకూ తల్లీ తండ్రీ చాలా ప్రేమతో గౌరవంగా అతడిని చూస్తూ వచ్చారు. కాలచక్రము దొర్లిపోతున్నది. అతడి గాయాలు పాతబడిపోతున్నాయి. తల్లిదండ్రుల సానుభూతి కూడా క్రమంగా మాటుమణిగి పోతున్నది

అంతవరకూ ఇంట్లో ఏం జరుగుతున్నదో ఏం జరిగిందో అతడికి తెలియదు అప్పుడప్పుడు తల్లీదండ్రీ ఘర్షణపడుతూ ఉంటారు. తండ్రి ఎంతసేపటికి తగవును సాగదీస్తూనే ఉంటాడు. రాత్రిళ్లు నిద్రపట్టేవరకూ నోరు మెదుపుతూనే ఉంటాడు. అది అలవాటే కనుక శంకరయ్య అంతగా మనసు పట్టించుకోలేదు. కాని ఆనాటి ఘర్షణ తీవ్రరూపము దాల్చిందనే చెప్పాలి.

"నేను సంపాదించినన్నాళ్లు నీవూ నీకొడుకులు తిన్నారు. ముసలితనములో నాకు కానీ యిచ్చేవాళ్లులేరు. చిన్నవాడి జీతంలోంచి ఓ రూపాయివ్వు" తండ్రి గద్దించి అడుగుతున్నాడు.

"ఎక్కడిదయ్యా డబ్బు? శంకరయ్య బోనసుతో పిల్లపెళ్లి అయిందనుకుంటున్నావా? పెళ్ళిబాకీలు చిన్నవాడిజీతంలోనే తీరుతున్నాయి". తల్లి పనిచేసుకుంటూనే జవాబిచ్చింది.

తండ్రికి ఎక్కడలేని కోపం వచ్చింది. ఆమె జుట్టుపీకుతూ' ఆ మొండి వాడికి కమ్మగా వండిపెట్టగలవూ? నాకో రూపాయ చుట్టపీకలకిస్తే తప్పొచ్చిందా?' అంటూ అరుస్తున్నాడు.

తల్లి మీద చెయ్యిచేసుకుంటున్నాడేమో తండ్రి- అడ్డము పోదామని లోపలికి వెళ్ళుతున్న శంకరయ్యకు తండ్రి అనే చివరి మాటలు వినబడ్డాయి. అతడి గుండె మీద చమ్డాతో కొట్టినట్లయింది. త్రాణలేని అతడు మనసు ముందు వెనుకలు చూసింది. ఎటు చూసినా గాఢతిమిరము, అగాధము. కళ్ళనీళ్ళు గిర్రున తిరిగాయి. చప్పున అతడు వెనక్కు తిరిగాడు. అరుగుమీద కూర్చుని ఆలోచనలో పడ్డాడు. ఇంక ఇంట్లో ఒక్కొక్కరే తన నంత భారంగా ఎంచుకుంటారన్నమాట. తండ్రి సంగతి తెలిసిపోయింది. మరునాడు తమ్ముడుకూడా ఆ మాట అనవచ్చు. ఇకపోతే తల్లి. ఆమె తన నోటిమీదుగా అనకపోయినా సమర్థించలేదు. తన బ్రతుకెంతకు దిగజారిపోయింది. చప్పున శంకరయ్య లేచి నిలబడ్డాడు. అడుగులు ముందుకు పడ్డాయి. మెల్లగా నడకసాగింది.

అతడు నడిచి నడిచి నడిరాత్రివేళవరకూ ఒకచెట్టు దగ్గరికి చేరుకున్నాడు. ఆరాత్రి కక్కడ కళ్ళుమూసుకొని తెల్లవారగానే మళ్ళీ బయలుదేరాడు. అతడికి తన గమ్యస్థానము తెలియదు. కాని తెలిసినట్టుగానే తడబాటు లేకుండా గబగబా నడిచిపోతున్నాడు.

మధ్యాహ్నము పన్నెండు గంటలు కావచ్చింది. వైశాఖమాసపుయెండలు మండిపోతున్నాయి. వడగాడ్పు ఈ చెవి నుండి ఆ చెవికి దూసుకుపోతున్నది. శంకరయ్య ఆకలిచేత డస్సిపోయాడు. నీరసంచేత కాళ్లు తడబడుతున్నాయి, దాహంచేత నాలుక పిడచకట్టుకుపోయింది, తన అభిమానాన్ని చంపుకొని ఆ ఊరంతా తిరిగి తిరిగి ఓ యింటి ముందర ఆగి పట్టెడన్నం పెట్టమన్నాడు. అయిదు నిమిషాల తరువాత విస్తట్లో అన్నము పెట్టుకొని ఒక యిల్లాలు బయట నిలబడ్డది అన్నపువిస్తరి చూడగానే అతడి కళ్లు ఆనందంతో మెరిసిపోయాయి. చూస్తూ నిలబడి పోయాడు.

'అబ్బ! విస్తరిపట్టుకో అట్లా చూస్తావేం?' అన్నదామె ఆమె హెచ్చరికతో ఈ లోకానికి వచ్చాడు. మొండిచేతులతో విస్తరిని గుండె కానించుకొని బయలు

చేరాడు. చల్లదనానికి పక్షులు చెట్లమీదికి చేరిన ఆ మండుటెండలో అతడొక చెట్టు కిందికి చేరాడు. కూర్చుని ఆ విస్తరిని మెల్లగా నేలమీద ఉంచాడు అతడికి కడుపులో ఆకలి మండిపోతున్నది. ఇన్నాళ్ళనుంచీ లేని సమస్య ఒకటి వచ్చిపడ్డది. ఆ విస్తట్లో ఉన్న అన్నము తన నోటికి వచ్చేదెట్లా? అనుకుంటుండగా నవ్వు వచ్చింది. చప్పున నేలమీద బోర్లాపడుకొని విస్తట్లో నోరుపెట్టి గబగబా ఆ అన్నమంతా తినేశాడు. తింటూ ఉండగా గొంతు పట్టినట్లయింది. దగ్గరలో నీళ్ళు లేవు. ఉన్నా తాగటము ఒక సమస్య.

అతడు అన్నము తింటుండగా ఎవరో నవ్వినట్టు వినబడ్డది. కాని అతడు అన్నము తినే ధోరణిలో సరిగా వినిపించుకోలేదు మళ్ళీ అటువంటి నవ్వే వినబడితే వెనక్కు తిరిగి చూశాడు. అక్కడికి పది బారల దూరాన పదిహేడు పద్దెనిమిదేండ్ల పడుచు నీడలా తన వైపుకు తరలిరావటము అతడికి కనబడ్డది. ఆమె దగ్గరికి రాగానే ఆశ్చర్యముతో 'నీ కాళ్ళ కేమయింది?' అంటూ అతడు కళ్ళు పెద్దవిచేసుకుని అడిగాడు.

'నీ చేతుల కేమయింది?' అన్నదామె కళ్ళు చిన్నవి చేసుకుంటూ ఆదుర్దాగా. ఇంచుమించుగా ఇద్దరూ ఒక్కసారే ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు

ఆమె తన చేతులకేసి చూస్తూ ఉండటమువల్ల అతడికి మళ్ళీ మనసులో బాధ బయలుదేరింది. అయినా ఆమె కాళ్ళవంక చూడటము మానలేదు. కొంతసేపటికి అతడు తెప్పరిల్లుకొని 'ఆ సంగతి తరువాత చెప్తా. నాకు దాహమవుతున్నది. మంచినీళ్ళు తాగిస్తావా?'

'నీళ్ళేవి?'

'దగ్గరలో ఎక్కడయినా ఉన్నాయేమో?'

'చూదాం పద'

అతడామెను నిలువెల్ల మరొక్కసారి చూశాడు.

అది గ్రహించి ఆమె 'తొందరగా పోవాలంటే నేనురాలేను నా సంగతి చూస్తున్నావుగా?' అన్నది.

'నీవు తప్పుపట్టుకోకపోతే నా బుజాల మీద ఎక్కించుకుని తీసుకుపోతాను వస్తావా?'

ఆమె కొంచెము సందేహించింది. 'నాలుక పిడుచకట్టుకుపోతున్నది. సందేహించకు మరి' అంటూ అతడు మళ్ళీ హెచ్చరించాడు. ఆమె తలవంచుకొని వెలుగులాంటి నవ్వు నవ్వింది. నేల మీదికి ఒంగి శంకరయ్య ఆమెను బుజాల మీద కూర్చోబెట్టుకున్నాడు. సిగ్గుతో ముడుచుకొనిపోతూ అతడికి ఆమె దారి చూపిస్తున్నది, ఆమె చెయ్యి చూపించినట్లల్లా అతడు నడచాడు. చింతతోపు అవతల ఉన్న ఒక సన్నటివాగు మెరుస్తూ మెలికలు తిరిగి తాచుపాములా పరుగెత్తుతున్నది. శంకరయ్య వాగు ఒడ్డున ఆమెను దించాడు. ఆమె చేతులతో పాకుతూ వెళ్ళి ఆ సెలయేటి నీళ్ళు దోసిళ్లతో అతడికి తాగించింది. అతడు ఒడ్డెక్కుతుంటే ఆమె కూడా కడుపునిండా నీళ్ళు తాగింది.

'ఆ చెట్టు నీడన కాసేపు కూచుందాము' అంటూ అతడు ముందుకు నడిచాడు. అతడు దిక్కులు చూస్తూ నడుస్తుండగా ఆమె కాసేపటిలో చెట్టు క్రిందికి చేరుకుంది.

"అయ్యో నా మతిమరుపు చూడు, ఇసుకనేలన నీచేతులు కూరుకుపోతుంటే చూస్తూ ఊరుకున్నాను గాని నిన్ను ఎత్తుకురావాలని తోచలేదు. ఎంత పొరబాటు?" అతడు రెండు చేతులతో తలపట్టుకొని ఎంతోసేపు బాధపడ్డాడు.

"ఈ కాస్త దూరానికేనా అంత నొచ్చుకుంటున్నావు? ఇంకా ఇంత దూరము కూడా నా కలవాటే" ఆ దగ్గరలో ఒక బండ చూసుకొని దులుపుకొని కూర్చున్నదామె. శంకరయ్య చుట్టూ ఉన్న చెట్లవంక చూస్తూ మధ్య మధ్య ఆమె ముఖము కేసి చూస్తున్నాడు. ఆమె శరీరము నల్లగా బొద్దుగా నిగనిగలాడిపోతున్నది చందమామలాంటి ముఖము చారడేసికళ్లు కొనదేరిన ముక్కు సొట్టపడిన గడ్డము ఒకసారి చూస్తే మరపురాని సోయగము. ఆమె యవ్వనము అతడి ఉడుకురక్తాన్ని గిలకొట్టింది. అతడట్లా తనను చూస్తుంటే ఆమెకు సిగ్గు ముంచుకువచ్చింది. అతడి దృష్టి ఆమె కాళ్ళమీద మళ్ళీ పడ్డది.

"అయితే నీ కాళ్ళు ఇట్లా ఎందుకయినాయి?"

"పుట్టినప్పుడే ఇట్లా ఉన్నాయి".

పేరు అడిగితే సత్తి అని చెప్పింది.

"మెడకు నల్లపూసలు కట్టుకున్నావు పెళ్ళయిందేమిటి?"

"అవును."

తరువాత ఏమనడగాలో శంకరయ్యకు తోచలేదు. కొంతసేపటికి అయితే "నీవా చెట్టు కింద ఏం చేస్తున్నావు?" అన్నాడు.

"ఏం లేదు. నిన్న సాయంత్ర మనగా వచ్చాను, రాత్రి అక్కడే కొంగు పరచుకొని పడుకున్నా".

శంకరయ్య ధైర్యము తెచ్చుకొని అడిగాడు "నీ యిల్లెక్కడ? అక్కడి కెందుకు వచ్చావు?"

ఆ మాటతో సత్తి తల మళ్ళీ దించుకుపోయింది. ఆలోచిస్తూ కాసేపు ఊరుకుని మళ్ళీ హెచ్చరించాడు శంకరయ్య.

"మా చెల్లిని బావకిచ్చి చేశారు. దాని పెళ్ళిలోనే నాక్కూడా అతడిచేత పుస్తె కట్టించారు.........."

"అదేమిటి?"

"మరి నన్నెవరూ చేసుకోలేదు. పెళ్ళికాలేదనుకోకుండా బావచేతే పుస్తె కట్టించారు."

"అయితే నీ విప్పుడు ఎక్కడున్నావు?"

"మా అమ్మ దగ్గరే ఉన్నా. అమ్మ ఫ్యాక్టరీలోకి కూలికిపోతే ఇంట్లో పనంతా చేసి వండి పెడతా."

"మరెందుకు వచ్చావు చెట్టు కిందికి?"

సత్తి తలవంచుకుంది. ఆమె కన్నీళ్ళు జలజల రాలి ఇసుకలో ఇంకిపోయాయి. ముఖము పైకెత్తి ఆమె కళ్ళు తుడవాలనుకున్నాడు. చప్పున తనచేతుల సంగతి జ్ఞాపకమొచ్చి వెనక్కు తగ్గాడు.

"నీ కంత బాధ కలిగించేదయితే అడగనులే. పగటిపూట అన్నము తినేటప్పుడు నిన్ను చూడలేదు. చూస్తే ఆ అన్నమంతా నేను ఒక్కడినే తింటానా? నాతప్పు నాకు తెలిసినప్పటి నుంచి మాచెడ్డ బాధగా ఉంది."

నన్ను చూస్తే నీకు బాధెందుకు? అసలు నిన్నటి నుంచి నాకు తిండి మీద అయిష్టత పుట్టింది. ఎందుకో తెలుసా? మాబావ చెల్లిని తీసుకుపోవాలని వచ్చాడు. పప్పుచారు, మసాలా కూరా నేను వండాను. వెలుగుండగానే అంతా నవ్వుతూ పేలుతూ తిన్నారు. ఆ సంబరములో అమ్మయినా నేను తిన్నదీ లేనిదీ అడగలేదు. మాబావ రాకతోటే కుంగిపోయిన నా మనసు దాంతో మరీ కుంగింది. చిన్నా పెద్దా కలిసి నీఖర్మ అన్నట్లనిపించింది. ఇంట్లో ఉండలేకపోయాను.'' ఆమె కన్నీరు కార్వటము మొదలుపెట్టింది.

శంకరయ్య మనసు నీరయిపోయింది. అతడికి కూడా కంట్లో నీళ్ళువచ్చాయి ఆమె దగ్గరగా జరిగి ''ఏడిస్తే లాభం లేదు. నీవు కూడా బతకటం నేర్చుకోవాలి. నా సంగతి విన్నావా? సంపాదించినన్నాళ్ళు ఇంట్లో అందరూ గౌరవించారు. అవిటి వాడిని కాగానే అందరికి బరువయ్యాను. ఇల్లు బయలుదేరి మూడురోజులయింది అప్పటికి ఇప్పుడు తిన్నాననుకో.''

సత్తి తడికళ్ళతో అతడి ముఖంలోకి చూసింది.

''నే నో మాట చెప్తా. తప్పు పట్టుకోవు గదా?''

ఏమిటన్నట్టుగా చూసింది సత్తి తల ఎత్తి.

''నీవు మళ్ళీ యింటికి వెళ్ళదలచుకున్నావా?''

లేదన్నట్టుగా సత్తి తల తిప్పింది.

''చూడు సత్తీ నీకు కాళ్ళు లేవు. నా చేతు లెట్లా ఉన్నాయో చూస్తున్నావుగా. నిన్ను నా మెడమీద కూర్చోబెట్టుకుని ఎంత దూరమయినా తిప్పుతా. నాకింత అన్నం నోట్లోపెట్టు. మనిద్దరం కలిసి బతుకుదాం. ఏమంటావు?''

సత్తి తల వంచుకుని నేలమీద పుల్లతో గీతలు గీస్తున్నది ''ఏమంటావు చెప్పు?'' అన్నాడు.

ఆమె ఓరకంట చూసి ముసి ముసి నవ్వులు నవ్వింది. 'అయితే పోదాంలే.'

''ఎక్కడికి?''

''ఎక్కడికయినా పోదాం.''

ఆమె జాలిగా అతడి కళ్ళలోకి చూసింది. అతడు నేలమీదికి ఒంగి ఆమెను మెడమీదికి ఎక్కించుకున్నాడు వచ్చిన దారి కాక మరొకదారి పట్టాడు.

దారి పొడుగునా సత్తిని మాట్లాడించాలని శంకరయ్య ఎన్నో కబుర్లు చెప్పాడు. ఎనిమిదవ క్లాసువరకూ తాను చదివిన చదువంతా ఉపయోగించి ఆమెకు తెలియని విషయాలెన్నో చెప్పాడు. తప్పుపోయినా మంచి రాగములో పదాలెన్నో పాడాడు. సత్తి మౌనంగా వింటూ కూర్చున్నది. అతడు మాత్రము ఇనుమడించిన ఉత్సాహముతో అడుగు గబగబా వెయ్యటము మొదలు పెట్టాడు. రాత్రి తొమ్మిది గంటల పొద్దుకు ఒక దేవుడి గుడిదగ్గర సత్తిని దింపి శంకరయ్య లోపలికి వెళ్ళాడు. పూజారి రెండరటి పళ్ళు, ఒక కొబ్బరి చిప్ప అందరితో పాటు శంకరయ్యకూ పడేశాడు. అతడు వాటిని మొండి చేతులతో గుండె కదుముకొని సత్తి చేతికిచ్చాడు. తిని ఇద్దరూ బయలు దేరారు.

అది వెన్నెలరాత్రి. పాలు పుక్కిలించినట్టున్నది ప్రకృతి. శంకరయ్య సత్తిని తీసుకుని ఒక చెట్టు క్రిందికి వచ్చాడు. శంకరయ్య బుజాలమీది రుమాలు తీసి సత్తి నేలమీద పరచింది. చల్లగాలి మందంగా వీస్తున్నది. ఆకాశం మీద పట్టిన మబ్బు తునకలు అనేక రూపాలలో పరుగులెత్తుతున్నాయి. శంకరయ్య సత్తికి దగ్గరగా కూర్చుని మళ్ళీ కబుర్లు చెప్తున్నాడు. తను పనిచేసిన మిల్లులో దారము దగ్గరనుంచి బట్ట తయారయే వరకు వివరించాడు. ఆమె కళ్లు పెద్దవి చేసుకుని వింటున్నది. అయిదు నిమిషాల మౌనము తరువాత శంకరయ్య పురుషుడయినాడు. అతడిని చూసి ఆమె స్త్రీ అయింది. పొడిమాటలతో 'నేను నీ వాడిని' అన్నాడు శంకరయ్య సత్తి కళ్ళలోకి చూస్తూ.

సత్తి ఓరకంట చూసింది. ఆమె పెదవులు గులాబి మొగ్గ విచ్చుకున్నట్టు విచ్చుకున్నవి. ఏదో మాట్లాడబోయింది. కాని గొంతు మూగబోయింది.

దేవాలయంలో ఉన్న పొగడ చెట్టు కమ్మని తావులను విరజిమ్ముతూ పూలను కూడా రాల్చింది. ఆ వాసనలకు ఉక్కిరి బిక్కిరి అవుతూ చుక్కల రాజు సాక్షిగా సత్తి మైమరచి నిద్రించింది.

తెల్లవారి లేచి మళ్ళీ బయలు దేరారు. రాళ్ళనక - ముళ్ళనక శంకరయ్య నడిచి పోతున్నాడు - సత్తిని బుజాలమీదికి ఎక్కించుకుని. కొద్ది దూరములోనే

ఊరు తగిలింది. ప్రతి నాలుగిళ్ళ మధ్య ఒక హోటలున్నది. చెత్త కుండీ దగ్గర పిల్లలూ పెద్దలూ ఎంగిలాకుల కోసము తగాదా పడుతున్నారు. ఎంతసేపు నిలబడినా శంకరయ్యకూ సత్తికీ ఏ హోటలులోనూ తినుబండారాలు దొరకలేదు. హోటలులో నుంచి బయటికి వచ్చిన ఒకాయన నా సంచి స్టేషన్ వరకూ తీసుకువస్తే బేడ యిస్తానన్నాడు. శంకరయ్యకు బేడ మీద లక్ష్యంలేదు. ఎంత దూరమయ్యా స్టేషను అన్నాడు. అతడు దారి చూపుతూ సంచి చేతి కివ్వబోయాడు. శంకరయ్య వెనక్కి తగ్గి తన చేతులు చూపించాడు.

అతడు వెళ్ళిన దారినే నడుస్తూ శంకరయ్య స్టేషను చేరుకుని సామాన్లు తీసుకుని పరుగెత్తి కూలీలతో వెళ్ళి జనసమ్మర్దం బాగా ఉన్న డబ్బాలో ముందు సత్తిని ఎక్కించి తనూ ఎక్కాడు. రైలు సాగింతరువాత ప్రయాణికులంతా సర్దుకొని కూర్చున్నారు. శంకరయ్య జంకుతూనే సత్తిని వారగా ఒక బెంచీ మీద కూర్చోబెట్టాడు. కొంతసేపు నిలబడ్డ తరువాత తనుకూడా సత్తి పక్కనే సర్దుకున్నాడు.

చెట్లూ పొలాలూ గట్లూ గబగబా వెనక్కు పోతుంటే రైలు రయ్యిమంటూ ముందుకు పరుగెడుతున్నది. ప్రయాణికులంతా ప్రతి స్టేషనులోనూ ఏదో ఒకటి కొనుక్కొని తినటము మొదలు పెట్టారు. ఒక ముసలివాడు దగ్గుతూలేచి అరటి పళ్ళుకొన్నాడు. తాను రెండుతిని 'ఈ పిల్లకు ఏమీ కొనిపెట్టనా?' అని శంకరయ్యను అడిగాడు. సత్తి నాకేమి వద్దంది. సత్తి ఎందుకు అట్లా అన్నదో శంకరయ్య గ్రహించి నవ్వుకున్నాడు. ఆ ముసలివాడు రెండు పళ్లు సత్తి చేతిలో పెట్టాడు. అభిమానము కొంత - బిడియము కొంత సత్తిని తిననీయక పోయినాయి. శంకరయ్య గ్రహించి కనుసైగ చేసాడు. సత్తి శంకరయ్య నోటికి ఒకటి అందించి తానొకటి తిన్నది.

బాత్ రూముకు పోతూ వస్తూ ఒక నడియీడు ప్రయాణీకుడు శంకరయ్య చేతులు చూశాడు. మెల్లగా దగ్గరికి పిలిచి ఏమయిందని అడిగాడు. శంకరయ్య అంతా చెప్పింతరువాత 'బొంబాయిలో ఒక ఆసుపత్రి ఉన్నది. అక్కడ రబ్బరు చేతులు పెడతారు. అవి పెట్టించుకుంటే ఏవైనా తేలిక పనులు చేసుకోవచ్చు.' అన్నాడు.

"డబ్బు కావద్దూ? రబ్బరు చేతులు ఊరిక వస్తాయా?" అన్నాడు శంకరయ్య ఆశ్చర్యముతో

"పేదవాడనని డాక్టర్లకు చెప్పుకో. బీదవాళ్ళకు ఊరికేనే పెడతారు. నేను చూశాను" అన్నాడు.

శంకరయ్య అతడి చేత అడ్రసు రాయించుకుని చొక్కాజేబులో పెట్టించు కున్నాడు. ప్రయాణీకులందరు ఒక్కొక్కరే శంకరయ్యను పిలిచి-అతడి చేతులు ఎట్లా నలిగిపోయాయో అడిగి తెలుసికొన్నారు జాలిపడ్డారు.

రైల్లో ఉన్నంతసేపూ శంకరయ్యకూ సత్తికీ ఎవరో ఒకరు తినడానికి ఏదో ఒకటి యిస్తునే ఉన్నారు. శంకరయ్య అనుకున్నట్లుగా ప్రయాణీకులు మాకేం పట్టిందన్నట్టుగా లేరు. రాత్రివేళ శంకరయ్య కూర్చునే కునికిపాట్లు పడ్డాడు. సత్తి స్థలము దొరికినంతలో బాగానే నిద్ర పోయింది. మరునాడు చాలా మంది ప్రయాణీకులు దారిలో దిగి పోతున్నారు. శంకరయ్యకూడా సత్తితో వెనుక తలుపు గుండా దిగిపోయాడు. సత్తీ శంకరయ్యా బొంబాయి వీధులన్నీ తిరిగి పట్టణమంతా చూశారు. పెద్దపెద్ద దుకాణాల ముందర నిలబడి అడుక్కుని, డబ్బు సంపాదించి కడుపు నింపుకున్నారు. ఆసుపత్రి వెదికి తెలుసుకునే సరికి నాలుగురోజులుపట్టింది- ఆ జంటకు. పెద్ద డాక్టరుతో తనగోడంతా చెప్పుకుని శంకరయ్య కళ్ళ నీళ్ళు పెట్టు కున్నాడు, చేతులు పెట్టిన తరువాత అక్కడే ఒకచప్రాసీ పని యిప్పించమన్నాడు. శంకరయ్య కథంతా విన్న తరువాత ఆయన గుండె కరిగిపోయింది.

మరో పదిహేను రోజులకల్లా శంకరయ్య రబ్బరుచేతులు పెట్టుకుని అక్కడ చప్రాసీ పనిచేయటం మొదలుపెట్టాడు. ఒక గదిలోనుంచి మరో గదిలోకి కాగితాలు తీసుకుపోవటము, రోగులను ఒకవార్డునుంచి ఇంకొకవార్డుకు వెంటబెట్టుకు పోవటము లాంటి తేలికపనులు చేస్తున్నాడు. ఆసుపత్రి ఆవరణలో ఒక గది ఇచ్చారు. సత్తితో కాపరము పెట్టాడు. పనిచేసి ఇంటికివచ్చి సత్తి పెట్టిన అన్నం తిని కాస్త ఊసులాడి మళ్ళీ పనిలోకి వెళ్ళేవాడు.

సత్తికి కాళ్లు అసలు లేకపోలేదు. జానెడు పొడుగు మెలికలు తిరిగి సన్నగా ఉన్నాయి. వాటిని చెక్కితేగాని కొయ్యకాళ్ళు పెట్టటానికి వీలులేదన్నారు. అందుకు, సత్తి ఒప్పుకోకుండా వచ్చింది. శంకరయ్యకు ఆసుపత్రిలో పనిచేస్తున్నంసేపూ

ఏదో విధంగా పొద్దు గడిపేది. ఇంటికివచ్చి సత్తి కాళ్ల చూడగానే ప్రాణము చివుక్కుమనేది సత్తిని గురించిన ఈ బాధ అతడికి తను చేతులు పెట్టించుకున్న తరువాత మరీ ఎక్కువయింది.

'నేను మాత్రం యిలా రబ్బరుచేతులు పెట్టుకుని కులకనా చెప్పు సత్తి? నీ కాళ్ల అట్లా ఉంటే నా మనసెట్లా ఉందనుకున్నావు? నే చెప్పినట్లు కాళ్ల పెట్టించు కోవు సత్తీ అని బ్రతిమిలాడేవాడు. అతడి మాటలకు సత్తి' జవాబిచ్చేదికాదు, కాని కాసేపటిలో అతడి విచారము పోగొట్టేది. తన తెలివంతా ఉపయోగించి రుచిగా వంటచేసి శంకరయ్యకు అన్నము తినిపించేది. నాకు చేతులున్నాయిగా వాటితో చంచా పట్టుకుని తింటా'నని ఎప్పుడయినా శంకరయ్య అంటే నాచేతులతో అన్నం పెట్టాలనేగా నీతో వచ్చింది అనేది. అట్లాంటి సమయాలలో శంకరయ్య నేలకు వంగి ఆమెను గుండెకు అదుముకునేవాడు.

ఆ నెలలో ఆసుపత్రిలో ఆడనౌకరు పని ఖాళీ అయింది. ప్రయత్నముచేసి సత్తి తనకాపని యిప్పించమంది. శంకరయ్య వద్దంటే వద్దన్నాడు.

'ఎందుకు? నేనూ పనిచేస్తే డబ్బు వస్తుందిగా' అన్నది సత్తి కోమలంగా.

'నేను తెచ్చేది చాలు. నీవు యింట్లో ఉండు' అన్నాడు

'ఆపని కష్టమైంది కాదని అంతా అంటున్నారు. పోనీ చేస్తే ఏం?.'

'వద్దు సత్తి; చెప్పినట్టు విను '

సత్తి చిన్నబుచ్చుకుంది, మనసులో ఏవేవో ఆలోచనలు మెదిలాయి.

ఆసుపత్రిలో పెద్దడాక్టరు గారికి శంకరయ్యంటే అభిమానము. ఆయనే స్వయముగా అతడికి చేతులు పెట్టాడు. శంకరయ్యను చూసి తన పంట పండి నట్టు మురిసేవాడు. శంకరయ్య చేతులు కోటు జేబులో పెట్టుకుని జింక లాగ ఆసుపత్రి అంతా తిరుగుతూ ఉంటే తనగది గడపమీద కూర్చుని సత్తి విస్మయముతో కళ్ల విప్పి చూసేది. అతడు సంపాదించిన పలుకుబడికి ఆశ్చర్యపడేది. తెలియని వాళ్ళెవరయినా అతడెవరని అడిగితే మూతి తిప్పుకుంటూ 'నాకేంకాదు.' అనేది.

నిండుచేతుల కోటు తొడుక్కొని తెల్లటి లాగు పాపోసులూ ధరించి ఠీవిగా తిరిగే చప్రాసీ శంకరయ్య కాళ్లలేని సత్తికి మొగుడంటే అతడికే అవ

మానము. అందరి ముందర సత్తి అతడెవరో అన్నట్టు దూరందూరంగా తిరిగేది. అతడు యింటికి రాగానే వేడివేడి అన్నము పెట్టేది. అతడు ఆవురు ఆవురుమంటూ తిని ఆనందంతో సేదదీరేవాడు.

ఈ మధ్య సత్తి కాస్త చిక్కింది. తెల్ల బడ్డది. ఎక్కడ బడితే అక్కడే కొంగుపరచుకుని పడుకోడము మొదలుపెట్టింది. పాలిపోయిన చెక్కిళ్ళూ, దోక్కుపోయిన ముఖమూ, బావిలోంచి వచ్చినట్లుగా మాట. సత్తి గుర్తుపట్టలేకుండాఅయ్యే. పరికి అక్కడ పనిచేస్తున్న ఆడ నౌకర్లంతా పనిపెట్టుకునివచ్చి దీవించి పోయారు

శంకరయ్య ముసి ముసి నవ్వులు నవ్వుతూ తనలోతాను సంబరపడుతుంటే సత్తి ఆలోచనలో మునిగి పోయేది. మనసులోమాట పైకి రానీయకుండా బిగబట్టుకుని సత్తి నెలలు రాగానే మగపిల్లవాడిని కన్నది. సంబరపడుతూ శంకరయ్య పురిటిగదిలోకి వెళ్ళాడు. కాళ్ళూ చేతులూ బాగా ఉన్నాయా లేదా అని పరకాయించి చూశాడు. తనబిడ్డకేలోపమూ లేదనుకోగానే అతడి మనసు ఊరటచెందింది. ఆనందం కొద్దీ గంతులు వేసింది. అవయవ లోపము తన చిన్నారి తండ్రికి లేదు-లేదు-లేదు. పాపాయి పండులా ఉన్నాడు. ఆ సంతోషం కొద్దీ పాపాయికి పేరు పెట్టిననాడు తోటి నౌకర్లందరికీ విందుచేశాడు. డాక్టర్లకు పండ్లూ మిఠాయి సమర్పించాడు.

సత్తి పాపాయిని ఒళ్ళో పెట్టుకుని కాళ్లు ఒకచేత్తో నవరిస్తూ పాలిచ్చేది. అలా కాళ్లు నవరించేటప్పుడు ఆమె మనసులో ఏవేవో ఊహాలు మెరిసి పిడుగుపాటులా ఉండేవి. గుండె గబగబ కొట్టుకుంటుంటే సత్తి ఆయాసపడుతూ సర్దుకునేది.

శంకరయ్య చేతులు పెట్టించుకున్న తరువాత కేంద్ర ఆరోగ్యశాఖ మంత్రి ఆసుపత్రి చూడటానికి వచ్చాడు. కాళ్ళూ చేతులూ పెట్టించుకున్న వాళ్ళందరినీ పిలిచి చూశాడు. శంకరయ్య యింటికి వచ్చి సత్తికి చెప్పాడు మురుస్తూ.

'నిన్ను కూడా కాళ్లు పెట్టించుకోమని మంత్రిగారన్నారు. కాళ్లు పెట్టించుకో సత్తీ' అన్నాడు ఎంతో బాధగా.

భోజన సమయంలో శంకరయ్యకు మంచినీళ్ళు యిస్తూ అతడిముఖంలోకి చూసింది. సత్తి తనకు కాళ్ళు లేవని అతడెంత వేదనపడుతున్నాడో గ్రహించింది

శంకరయ్య చేతులు మధ్యలో పోగొట్టుకున్నా కృత్రిమపు చేతులు పెట్టించుకుని జీవితములో తనకు కావలసినవి సాధించుకున్నాడు. తోటివారిలో అధికారులలో మెప్పుపొందుతున్నాడు.

పాపాయికి మూడవనెల నిండవచ్చింది. మనుష్యులను చూసి గుర్తుపట్టు తున్నాడు. మనిషిని చూడగానే బోసినవ్వులు ఒలకపోస్తున్నాడు.

సత్తికి రాత్రిళ్లు సుఖంగా నిద్రపట్టి వారం రోజులయింది. పాపాయిని చూసుకుని మురిసే ఆనందంలో ఒక లిప్త విషాదము - శంకరయ్య ప్రయోజ కత్వము చూసుకుని పొంగే మనసులో ఏదో వెలితి ఆమె మనసు చుట్టూ సాలె గూడులో అల్లి బిగించివేస్తున్నాయి. ఆమె మనసు గిలగిల కొట్టుకుపోవటము మొదలుపెట్టింది.

ఆమె జీవితములో కాళ్ళులేని లోపము వల్ల మానసికంగా ఎన్నో బాధలు అనుభవించింది. కన్నతల్లే కడు హీనంగా చూసింది. ఇంటెడు పని చేయించేది. తోటివాళ్ళంతా నవ్వుతూ పేలుతూ ఉంటే తా నా పొయ్యి దగ్గర పొద్దంతా గడి పింది. తనను తీసుకుపోవటానికి బావవచ్చాడని చెల్లెలు మురిసిపోతుంటే తనకు తల కొట్టినట్టయింది. తనను తప్పించుకొని బావ తిరుగుతుంటే తనకేదో చెప్పలేని బాధ బయలుదేరింది. తనను చూసి అందరూ ఎంత అసహ్యించుకున్నారో తలచుకుంటే కడుపు చుట్టలు చుట్టుకుపోతుంది. అంతలో పాలకులేచిన పాపాయి మీదికి ఆమె ధ్యాస మళ్ళింది. అవును ఇప్పుడామెకు ఏలోటూ లేదు. తను గడ్డిపరక కంటె అధ మము అనుకున్ననాడు శంకరయ్య ఆదుకున్నాడు. నీవూ మనిషివే నని ధైర్య మిచ్చాడు. తన లోపాన్ని అతడు అసహ్యించుకోలేడు. తనను చూడగానే వెన్నలా కరిగిపోతాడు. పాపాయి పుట్టినప్పటి నుంచీ శంకరయ్యలో మరుపుఎక్కువయింది. కానీ కాళ్ళు పెట్టించుకుంటే బాగుంటుందంటాడు. పాపాయి పెద్దవాడవకముందే పెట్టించుకోమని బలవంతం చేస్తాడు, ఒత్తిడి చేస్తాడు.

అతడి ఒత్తిడికి ఆగలేక పెనుగాలికి ఊగిపోయే సన్నటి మొక్కలా ఉంది సత్తిపని. ఆనాటి పగటి భోజనానికి వచ్చిన శంకరయ్య సత్తి ముఖంలోకి చూస్తూ "కళ్లు ముఖము వాచి పోయా యెందుకు? కంట్లోకి పొగ పోయిందా?' అన్నాడు. ఆమెతెచ్చి పెట్టుకున్న నవ్వుతో తలవంచుకుని అన్నం పెట్టింది. మామూలుగా శంకరయ్య పాపాయి మంచము మీద కూర్చుని: సత్తీ! వీడు పెద్ద చదువు చదివి

డాక్టరవాలి. ఎన్ని ప్రాణాలనో రక్షించాలి. వాడి చదువుకోసము నెలకు పది రూపాయల సర్టిఫికెట్లు కొనమని డాక్టరుగారన్నారు. ఈ నెలలోనే మొదలుపెట్టా. తీసుకో నా జేబులోంచి, అన్నాడు. సత్తి కళ్ళలో నీళ్ళు నిలిచాయి. శంకరయ్య ఆమెను సమీపించి గుండె కదుముకున్నాడు. ఆనాడు చెట్టుకింద కనబడి పెళ్ళి చేసుకోమని తనడగగానే నవ్వుతూనే కళ్ళనీళ్ళు కార్చిన సత్తి ముఖము చప్పున శంకరయ్యకు స్మృతిపథాన మెరిసింది. కాని యిప్పటికీ అప్పటికీ ఎంతో తేడా శంకరయ్యకు.

"సత్తీ పెద్ద డాక్టరుగా రేమన్నారనుకున్నావు? వీడిని బాగా అభివృద్ధిలోకి తీసుకు రావాలన్నారు. మనకున్న లోపాలు కష్టాలు వాడికి లేకుండా చేయమన్నారు. చదువుకు కావాలంటే తాను కూడా సహాయము చేస్తానన్నాడు."

సత్తి పాపాయిని చూస్తూ వింటున్నది.

"కొంత బాధపడి అయినా సరే సత్తీ! డాక్టరుగారు నిన్ను కాళ్లు పెట్టించుకోమన్నారు. చూడు సత్తీ! ఆ దొరగారు చెప్పేదేమిటంటే గుడ్డివాళ్లు, గుడ్డివాళ్ళుగాను, కుంటివాళ్లు కుంటివాళ్లుగానూ ఉండనవసరము లేదు. ఆధునిక శాస్త్రంతో అనేక ఉపాయాలు, వసతులూ ఏర్పడ్డాయి. కుంటివాళ్లు గుడ్డివాళ్ళూ అందరిలాగే ఉండవచ్చు ఈ వసతులతోటి. అప్పుడు గాని వాళ్ళకు అందరిలో గౌరవమూ మర్యాదా రాదు. ఇతర దేశాలలో ఇటువంటి విషయాలలో చాలా శ్రద్ధ తీసుకుంటారట. మనం మాత్రం ఎందుకు చేయకూడదు సత్తీ!"

సత్తి మౌనంగా వింటూ కూర్చుంది.

"మనలో మనమాటఅనుకో. నేనూ నీవంటి అవిటివాడినే. నాకేమనిపించదు. మనము యితరుల సంగతి ఆలోచించాలి. వీడే ఉన్నాడనుకో. పెద్దవాడైన తరువాత మన్ని తలుచుకుని సిగ్గుపడే అవకాశము యివ్వకూడదు."

"ఆ కాళ్లతో నేను నడవగలనా?" అన్నది సత్తి దీర్ఘంగా ఆలోచించి.

"డాక్టరుగారు చేతనయినంత ప్రయత్నం చేస్తానన్నారు."

మరునాడు శంకరయ్య సత్తిని డాక్టరు దగ్గరికి తీసుకువెళ్లాడు. డాక్టరు పరీక్ష చేశాడు. కొయ్యకాళ్లు పెట్టించుకొంటే చంకల క్రింద కర్రలు పోటీచేసుకొని నడవవచ్చునన్నాడు. మరునాడు రమ్మన్నాడు.

సత్తి యింటికి వచ్చింది. శంకరయ్య డ్యూటీలోకి వెళ్లాడు. శంకరయ్య వెళ్లిన తరువాత సత్తి మంచానికి అడ్డంగా పడుకుని కుమిలి కుమిలి ఏడ్చింది. చిన్నబోయిన ముఖంతో ఇంటిపని చక్కబెట్టుకుంది శంకరయ్య అన్నము తిన్న తరువాత తనూ తిన్నట్టుగానే గిన్నెలవీ కడిగింది. శంకరయ్య ఏదో మాట్లాడు తున్నాడు. కాని ఆమె చెవినపడటము లేదు. ఏవో ఆలోచనలు సుళ్లు తిరుగు తున్నాయి. ఆమె ఊహించుకుంటోంది - అబ్బాయి పెద్దవాడయి పెద్దచదువులు చదివి పెద్ద డాక్టరు దయవల్ల మంచి స్థితికి వస్తాడు. అప్పు డతనికి తన తల్లిని గురించి నలుగురితో చెప్పుకోవటానికి చిన్నతనముగా ఉంటుందేమో! బాధపడి పెట్టించుకున్నా కొయ్యకాళ్లు చంకలకింద కర్రలూ ఈ పనికూ్కడా ఒక ఆపరేషను చెయ్యాలి; అదయినా ఎంతవరకూ సానుకూల మవుతుందో చేసి చూడాలట!

ఒకనాడు శంకరయ్యకు రాత్రిపూట పక్కవేస్తూ సత్తి అడిగింది. 'నా కాళ్ళు యిట్లా ఉంటే నీకు చిన్నతనముగా లేదుకదూ?' అని. ఈ మాట అనే టప్పుడు ఆమె గొంతు మామూలుగా లేదు.

శంకరయ్య నోటితో జవాబు యివ్వలేదు. లేచివచ్చి సత్తికి దగ్గరగా కూర్చుని 'ఆమాట యిప్పుడెందుకు జ్ఞాపకము వచ్చింది? ఎందుకట్లా అడుగు తున్నావు?' అన్నాడు. 'పెద్దవాళ్ళ మధ్య తిరుగుతున్నావు కనుక అడిగాను. నీవు వాళ్ళతో తిరుగుతుండగా నేను ఎదురయితే నీకు బాగుండదు కదూ?'

"ఎప్పుడయినా అన్నానా! ఆమాట అయినా నీ సంగతి అందరికీ తెలుసుగా"

"ఊరికేనే అడిగా ననుకో. మనబాబు పెద్దవాడైన తరువాత - వాడికెట్లా ఉంటుంది? చదువుకుని గొప్పవాడు కాబోతున్న నీ కొడుక్కు, వాడి తల్లి యిట్లా ఉన్నదంటే నీకూ ఎట్లా ఉంటుంది?"

"అంతా బాగుంటుంది - నీవు కాళ్లు పెట్టించుకుంటే."

"పెద్ద డాక్టరుగారు నమ్మకంగా చెప్పలేదుగా, ఆపరేషను చేసి చూడా లన్నారు కదూ?"

'చూడనీ' శంకరయ్య సంభాషణ అంతటితో తుంచేశాడు.

కాలము మర్చిపోయింది. కాని సత్తి మాత్రము కన్నవారింట్లో తనకు జరిగిన భంగపాటు మరవలేదు. ఆ భంగపాటు ఆమె భవిష్యాన్ని నిలవదీసి ప్రశ్నించుతోంది. తీపి చేదులమధ్య ఆమె మనసు ముందుకూ వెనక్కూ ఊగి పోతున్నది.

ఆ మధ్యాహ్నం వేళ సత్తి పిల్లవాడిని పడుకోబెట్టి శంకరయ్య బట్టలన్నీ చులిపి పెట్టెలో పెడుతున్నది. పిల్లవాడు లేచాడు సత్తి పలకరిస్తూనే ఉన్నది. కాని పాకటము నేర్చిన పిల్లవాడు ఆగలేదు. ఇదిచూసి సత్తి జరుగుతూ పిల్లవాడిని అందుకో బోయింది అంతలో వాడు గడపదాటి మెట్టుమీదనుంచి దొర్లాడు. మెట్టు చాలా చిన్నది. కాని ఆ పాటికే పిల్లవాడు గుక్కపట్టాడు. సత్తి పిల్లవాడిని ఎత్తుకుని సముదాయించుతూండగా శంకరయ్య వచ్చాడు అంతా విని "ముందు ముందు వీడికి నడక వస్తుంది. వీడిని నీవేం పట్టగలవు. దబ్బున ఒక అడుగు వేసి వాడిని పట్టుకోగలవా?" అన్నాడు.

సత్తి మాట్లాడకుండా తనపని తాను చేసుకు పోయింది ముక్క చెక్క అవుతున్న తనమనస్సు రాయిగా చేయాలని ప్రయత్నిస్తూ.

ఆ మరునాడుదయమే లేచిన సత్తి ఇంటి పనులన్నీ శ్రద్ధగా చేసుకుని, శంకరయ్యకు ఇష్టమయిన కూర వండింది. పాలుకొని పాయసము చేసింది. ఎప్పటిలాగే పక్కంటి ముసలమ్మచేత పిల్లవాడికి నీళ్ల పోయించింది. పెట్టెలో ఉన్న కొత్త చొక్కతొడిగింది శంకరయ్య రాగానే అన్నము పెట్టింది. అతడు డ్యూటీలోకి వెళ్ళుతుంటే కనుచూపు ఆనేంతవరకూ గడపలో నిలబడి చూసింది. పిల్లవాడిని ఒళ్లో వేసుకుని ఒళ్లో నిమురుతూ కడుపునిండా పాలిచ్చింది. ఉబికి ఉబికి వస్తున్న దుఃఖాన్ని అణచుకోలేక ఉక్కిరి బిక్కిరి అయింది. పిల్లవాడిని గుండెకు హత్తుకుంది. ముద్దులతో నలిపివేసింది. తలా బుగ్గలూ ఒళ్ళూ నిమిరి నిమిరి పడుకో బెట్టింది.

రోజూ వచ్చి పిల్లవాడికి నీళ్ళుపోసే ముసలమ్మను కేకవేయగానే వచ్చింది.

"కాస్త పిల్లవాడిని చూస్తూ ఉండు" అని బయలుదేరింది. గడపదాటి వెనక్కు తిరిగి చూడగానే బావురుమని ఏడవాలనిపించింది. ఒక్కసారి మంచము దగ్గరికి వెళ్ళి పిల్లవాడిని చేతుల్లోకి తీసుకోవాలని మనసు వేగిర పెట్టింది. అయిదు

నిమిషాలపాటు నిలబడి ఆలోచించింది. పెదవులూ గడ్డమూ దుఃఖముతో వణికి పోతున్నాయి. సత్తి నిగ్రహం తెచ్చుకుని కొంతదూరము పోయి వెనక్కు తిరిగి చూసింది. మళ్ళీ దుఃఖము పొంగింది. రాయి అయిన మనసు నీరు కారడము మొదలు పెట్టింది. ఆలోచనలు అడుగు ముందుకు సాగ నివ్వలేదు. కాని ఆమెలో నుంచి పట్టుదల ప్రజ్వరిల్లుతూ పైకి లేచింది. సత్తి తన శక్తినంతా కూడగట్టుకుని ముందుకు సాగిపోయింది.

శంకరయ్య ఆ సాయంత్రం డ్యూటీ నుంచి వచ్చేసరికి పిల్లవాడు ఏడుస్తు న్నాడు. ముసలమ్మ పట్టలేకపోతున్నది.

''ఏదయ్యా సత్తి. యిప్పుడే వస్తానని అప్పుడనగా వెళ్ళింది?''

''ఎక్కడికి వెళ్ళింది? ఎందుకు వెళ్ళింది?'' శంకరయ్యకు కలవరంపుట్టింది. భూమిమీద కాలు ఆనలేదు. పిల్లవాడు గుక్కపట్టి ఏడుస్తున్నాడు. ఎలా సమాధాన పెట్టాలో శంకరయ్యకు తెలియలేదు. గబగబా వెళ్ళి గ్లాసెడు పాలు తెచ్చి ముస లమ్మ కిచ్చాడు పిల్లవాడికి పట్టుమని. ముసలమ్మ కాళ్ళమీద పిల్లవాడిని పడు కోపెట్టుకుంటే శంకరయ్య చంచాతో నోట్లో పోశాడు.

సత్తి ఎక్కడికి వెళ్ళింది? ఎందుకు వెళ్ళింది? పిల్లవాడు ఏడుపుమాని నిద్ర పోగానే శంకరయ్య తడబడుతూ ఇల్లంతా తిరిగాడు. అతడికేమీ తోచలేదు. ఆదుర్దా ఎక్కువయింది. పిల్లవాడిని చూస్తూ ఉండమని ఆ ముసలమ్మకే ఒప్పగించి బయలుదేరాడు. బొంబాయి వీథులన్నీ తిరిగి వెదకటానికి ఎంతకాలము పడుతుంది? ఎంతకనీ ఆ మహాపట్నములో వెదకటం? పోలీసుస్టేషనులో చెప్పాడు. తిండి లేకుండా ఆ రాత్రంతా తిరిగాడు. జనసమ్మర్దము తక్కువన్న మాటేగాని రాత్రిళ్ల కూడా బజార్లు సందడిగానే ఉన్నాయి. తెలతెలవారుతూ ఉండగా కాసేపు కాలిబాట మీద కూర్చున్నాడు. అతడి మనసంతా పాడుబడ్డ మఠంలా ఉన్నది. శ్యామలా కాశంలో నుండి ఒక్కొక్క చుక్కే మబ్బు చాటున మరుగుపడి పోతున్నది. ఉండి ఉండి పిల్లవాడు కెవ్వు మన్నట్లు శంకరయ్య ఉలిక్కిపడుతున్నాడు.

శంకరయ్య ఎండి పోయిన పెదవులతో వాడిపోయిన ముఖంతో మళ్ళీ బయలుదేరాడు. ఏడు గుర్రాల దొర ప్రకృతి లోకి పొడుచుకుంటూ వస్తున్నాడు. శంకరయ్య దారివెంట నడుస్తూ కనబడ్డవారి నందరినీ అడుగుతూ ముందుకు సాగి

పోయాడు. మధ్యాహ్నమయింది, వచ్చి మంచినీళ్లు తాగలేదు. పొద్దు వాలి పోతున్నది.

సాయంకాలము నాలుగు గంటలనుండీ జనమంతా సముద్రపు ఒడ్డుకు చేరుకుంటారు. అక్కడే తినుబండారాలు, చిన్న చిన్న వినోదకరమయిన వస్తువులూ అమ్మకానికి వస్తాయి. జనం గుంపులు గుంపులుగా మూగి ఉంటారు. శంకరయ్య వాళ్ళను తప్పించుకుని పోతున్నాడు. అక్కడికి వంద గజాల దూరాన నీళ్ళ వైపు చూస్తున్న సత్తి కనబడ్డది. అతడికి ప్రాణము లేచివచ్చింది.

'సత్తీ' అని కేకలు వేసుకుంటూ శంకరయ్య ముందుకు పరిగెత్తాడు. ఎప్పటి నుంచో నీళ్ళ వంక చూస్తూ నిలబడ్డ సత్తి - శంకరయ్య కేక వినగానే పాకుతూ వెళ్లి నీళ్ళలో దబాలున పడిపోయింది. చూస్తూ ఉండగానే సత్తిని కెరటాలు లాక్కుపోతున్నాయి. సత్తికోసము పరుగెత్తి శంకరయ్య తాను నీళ్ళలోకి ఉరికాడు. సత్తి తలవెంట్రుకలు కనబడుతూ అలలతో పాటు పైకిలేస్తుంటే పట్టుకోవచ్చనుకున్నాడు.

'అయ్యో అయ్యో' అంటూ అందరూ అటు చూడటం మొదలుపెట్టారు. ధైర్యశాలు లిద్దరు నీళ్ళలోకి దూకారు, వాళ్ళను పట్టుకోవటానికి. వాళ్ళు ఎంత దూరము పోయినా సత్తి తలవెంట్రుకలు చేతికి చిక్కలేదు. ఈతరాని శంకరయ్య రబ్బరు చేతులు పైకెత్తుకొని కనబడ్డాడు. అతడిని ఒడ్డుకు చేర్చారు.

పదిమందీ చుట్టూమూగి ఏమిటేమిటని శంకరయ్యను గుచ్చిగుచ్చి అడిగారు. ఆదుర్దా ఆందోళన దుఃఖము పొంగి పొర్లొచ్చాయి శంకరయ్యకు. చిన్నపిల్లవాడిలా వలవల ఏడ్చాడు.

సత్తి ఎందుకు ఆత్మహత్య చేసుకుంది? ఎందుకంత సాహసానికి ఒడి కట్టింది? ఏ ఉద్దేశ్యముతో పండువంటి పాపాయికి అన్యాయము చేసింది. బంగారం వంటి సంసారంలో ఎందుకు చిచ్చు లేపింది? శంకరయ్య రబ్బరు చేతుల్లో తల బాదుకున్నాడు.

శంకరయ్యను తడిబట్టలతో ఒకాయన తన కారులో యింటికి చేర్చాడు. వాన జోరు తగ్గింది. దుకాణంలో కూర్చున్న వాళ్ళందరూ ఒక్కొక్కరే లేచి వెళ్ళారు. ముంగురులతో దోబూచులాడే జాబిల్లి లాంటి పాపాయి ముఖము జ్ఞాపకానికి రాగా శంకరయ్య గృహోన్ముఖుడైనాడు

# తోసుకు వచ్చిన ముహూర్తం

హేమలత కళ్ళు తెరచి చుట్టూ కలయజూసింది. తన క్వార్టర్సులో మధ్య గదిలో మంచమ్మీదనేనా ఉన్నది? ఆ సంగతి ఖాయపరచుకొనటానికి ఆమెకు అర గంటకు పైగా పట్టింది. ఒళ్ళంతా చెమట పట్టింది. లేస్తే కళ్లు తిరుగుతున్నాయి. లేవబోయి మంచమ్మీద వాలిపోయింది.

ఆమెకు ఉదయము హాస్పిటల్లో రౌండ్సు చేస్తుండగా తల తిరిగినట్టు జ్ఞాపకం. అంతే. తరువాత ఏం జరిగింది?

కళ్లు మూతలుపడ్డాయి. పనిమనిషిని కేకవేసే శక్తిలేక చేతిదగ్గరగా బల్లమీద ఉన్న గంటనొక్కింది. కాఫీ కావాలని చేతిసైగచేత తెప్పించుకుని తాగింది. తల నొప్పి తగ్గలేదు. కణతలు పగిలిపోతున్నాయి. కణతలకు మందురాసుకుంటూ కళ్లు మూసుకు పడుకుంది. ఒక గంటయినా కాలేదు కాని యుగాలు గడచినట్టుగా ఉంది ఆమెకు.

ఆమెకు ఆశ్చర్యంగా ఉంది. 'మాత్ర వేసుకుని కళ్లమూసుకు పడుకో' అని రోగులను మందలిస్తే వాళ్లు పడుకోలేదూ? తనలా పడుకోలేదేం? ఆమెకు నవ్వు వచ్చింది. తను డాక్టరుగా వాళ్ళను దబాయించి ఒక్కొక్క మంచాన్నే దాట వేసు కుంటూ తనలో తాను నవ్వుకునేది, 'వాళ్లు రోగులు-పాపం రోగులు' మనసులోనే గొణుక్కున్నది.

పక్కమీద దొర్లిదొర్లి ఒత్తిగిలి పడుకున్నది, దిండ్లు సర్దుకున్నది. శాలువ కప్పుకున్నది. అయినా పక్క కుదిరినట్టుగాలేదు. తలా ఒళ్ళూ నొప్పులు, సూదులు పెట్టి - కాదు దబ్బనాలుపెట్టి పొడిచినట్లుగా ఒకటే బాధ. డాక్టరయిన తరువాత ఏస్ప్రో వేసుకుంటే పోయిన నొప్పులే కాని ఇంతవరకూ పడకపెట్టలేదు. ఇలాంటి బాధ ఇంతవరకూ రాలేదు.

తలక్రింద రెండుచేతులూ పెట్టుకొని కప్పువైపు కళ్ళారకుండా చూస్తూ ఆలోచనా సముద్రంలో మునిగిపోయింది. సుమతి తలుపు తోసుకుని లోపలికి రావటంతో ఆమె ఆలోచనకు అంతరాయం కలిగింది.

''ఏమిటీ వాలకం? అలా పడుకున్నావేం? ముఖం చూస్తే పది లంఖణాలు చేసినట్టున్నావు?''

సుమతిని చూడగానే హేమలత ప్రాణాలు లేచివచ్చినట్లయింది. నవ్వుతూ పడక్కుర్చీలో కూర్చుని కబుర్లు చెప్పింది. బాధకూడా కొంచెం కొంచెంగా తగ్గుతున్నట్టుగా ఉంది. తలలోనుంచి బరువు దిగిపోతున్నట్లయింది.

'వెంకటచలం వస్తాడు సెలవుల్లో?'

హేమలత గుండె గతుక్కుమన్నది. ముఖం ఆంతలోకి ముడుచుపోయింది. 'నాకు తెలియదు'-చటుక్కున విసురుగా అన్నది.

సుమతి ఆశ్చర్యపడ్డ దామాటకు, కాని పైకి కనబడకుండా జాగ్రత్తగా సర్దుకుంటూ' వస్తానని నాకు రాశాడులే. అందుకని అడిగాను' అన్నది.

''వస్తే రావచ్చు సుమతీ. దానికేముందీ? పినతల్లి కూతురు ఉంటే చూడాలనిపించదా ఎవరికయినా?''

''అదేమిటి? కొత్తగా మాట్లాడుతున్నావు హేమా! ఇంతకాలమూ పినతల్లి కూతురుకోసమేనా సెలవుపెట్టి వస్తూ ఉండేవాడు?''

'ఇంక అంతే!'-హేమలత ముఖము అవతలికి తిప్పుకుంది.

సుమతి పైట చెంగు చాటుచేసుకుని నవ్వుకుంది. ఇది రెండవ పర్యాయము ఇలా జరగటము. రెండేళ్ళ క్రిందట డాక్టరు వెంకటచలానికీ హేమలతకూ పెళ్ళి అవుతుందని అంతా అనుకున్నారు. కాని అంతవరకూ రాలేదు. వెంకటచలము ఇల్లూ వాకిలీ ఏర్పరచుకొని కావలసిన ఫర్నీచరంతా కొన్నాడు. పెళ్ళి ఏర్పాట్లను గురించి మాట్లాడటానికి వచ్చినవాడు ఇంకెవరినీ కలవకుండానే తెల్లవారుఝామున బయలుదేరే రైలు ఎక్కి వెళ్ళిపోయాడు. ఇప్పుడూ అంతే కాబోలు!

'అబ్బ! నీవెంత పెంకిదానివి హేమా? నీమనసులో ఏమున్నదో ఎవరూ కనుక్కోలేరు' సుమతి ఎంతో గట్టిగా మందలించాలనుకుంటే నాలుక తడబడ్డట్టయింది

హేమలత పెదవుల మీద చిరునవ్వు మెరుపులా మెరిసి మాయమయింది. ''సరే గాని సుమతీ! నిన్ను చూడగానే నాతల నొప్పి ఒళ్ళు నొప్పులూ ఎట్లా మాయమయ్యాయో చూశావా? రాత్రంతా ఇలా కబుర్లు చెబుతూ ఇక్కడే ఉండిపోకూడదూ?'' మంచమ్మీది నుంచి లేచి సుమతి చేతిని తన చేతిలోకి తీసుకుంటూ అప్యాయంగా నొక్కింది హేమ.

''నన్ను చూడగానే నీకు నిజంగా బాధ తగ్గిందంటే ఇక్కడే ఉండి పోవాలని ఉంది. కాని ఇంట్లో పిల్లల నెవరు చూస్తారు? రేపు మళ్లీ వస్తాగా!''

''అయితే వెళ్తానంటావా?'' చిన్నపిల్లలా గునిసింది.

''మా యింటికి రారాదూ ఈపూటకు? తగ్గగానే వచ్చేద్దుగాని''

''ఈకాస్తకూ ఇల్లు బయలుదేరితే అంతా నవ్వరూ?'' సుమతి నవ్వుతుంటే హేమలత కూడా నవ్వేసింది.

సుమతి వెళ్ళగానే మళ్లీ ఒంటరిదయిపోయింది. తలలో ఏదోబాధ మళ్లీ బయలుదేరింది దబ్బనాలతో పొడిచినట్టుగా ఉంది ఈసారి.

నిద్ర రావటానికి ఒక మాత్ర సీసాలోనుంచి తీసి వేసుకున్నది. బొమ్మలు చూస్తూ కాగితాలు తిప్పింది. లేచి గ్లాసెడు మంచినీళ్లు తాగింది. కాళ్లకింద దిండు ఎత్తుగా పెట్టుకున్నది. ఎత్తు ఎక్కువయిందని మళ్లీ సర్దుకున్నది. మగతగా కళ్లు మూతలు పడుతున్నాయి. మధ్యమధ్య చురుక్కుమన్నట్టుగా బాధ! తనజన్మలో ఎప్పుడయినా వచ్చిందా? ఏమో? ఏమో?.... కళ్లు మూతలుపడ్డాయి.

ఆవలిస్తూ బద్ధకంగా కళ్లు తెరచిచూస్తే చిన్నముల్లు ఏడుమీద ఉన్నది. ఇది సాయంత్రమా? ఉదయమా? తూలుతూ వరండాలోకివచ్చి చూసింది. హాస్పిటల్లో దీపాలు_ఆవరణమంతా దీపాలు. మినుకు మినుకుమంటూ ఊరినిండా దీపాలు కనబడ్డాయి.

నౌకరు తెచ్చి ఇచ్చిన పాలుతాగి ఒక స్లయిసు బ్రెడ్ తిన్నది.

తనకిలా సుస్తీ ఎప్పుడయినా చేసిందా? ఉద్యోగంచేస్తున్న ఈ నాలుగేళ్లలో ఎప్పుడూ ఇంతబాధ కలుగలేదు. మెడికల్‌కోర్సు చదువుతుండగా వచ్చిన జ్ఞాపకం లేదు. కాని అంతకంటె పదిరెట్లుగా ఇంటరు చదువుతూ హాస్టల్లో ఉన్నప్పుడు వచ్చింది. గదిలో మంచ మ్మీద ఒళ్లు తెలియకుండా పడుకొని మూలుగుతూ ఉంటే వార్డను హాస్పిటల్లో చేర్పించింది. అది టైఫాయిడ్ అయింది.

జ్వరందేమిటి? డాక్టర్లు మందులు రాయటం, వేళచొప్పున నర్సులు ఆ మందులు మింగించటం అలా ఇరవై అయిదు రోజులు అక్కడ ఉండటం పెద్దబాధ అనిపించలేదు. మొదట్లో నాలుగు రోజులు బాధపడ్డమాట నిజము. పలకరించే దిక్కులేక, అలా మంచంమీద పడుకుని, సాయంత్రము కాగానే కిలకిల్లాడుతూ వచ్చే తమవాళ్లతో బాధలన్నీ మరచి మాట్లాడే రోగులను చూస్తూ ఉండేది.

జ్వరం తగ్గిపోయింది. హాస్టలుకు వెళ్ళవచ్చునన్నారు డాక్టర్లు, ఆలోచిస్తూ పడుకుంది. మళ్ళీ హాస్టలుకు వెళ్ళాలి. ఉక్కు మనిషిలాంటి వార్డెను చేతిలో మెలగాలి.

హేమలత మంచమ్మీదనుంచి లేచి నిడుపాటి జడను ఒయ్యారంగా ఆడిస్తూ తన కంటె ఎత్తుగా ఉన్న కిటికీ దగ్గర నిలబడ్డది. విశాలమైన ఆవరణంలో చుట్టూ ఉన్న తురాయిచెట్లు పాదం మునిగేటంతవరకూ పూలు రాల్తాయి. చెట్లకిందంతా ఎర్రటి కుంకుమ రాసులురాసులుగా పోసినట్లుంది. రెండో అంతస్తు పైనుంచి చూస్తే చెట్టుకు ఒక్క ఆకయినా కనబడదు. అన్నిపూలు, ఆ ఎరుపులోనుంచి తెల్లటిచీరె కట్టుకుని కుసుమ గేటుదాటి మెల్లగా లోపలికి వస్తున్నది. ఆమె ముఖం మంచుకు వికసించిన మల్లెమొగ్గలా ఉన్నది. మనిషి సన్నగా ఉన్నా నిండుగా ఉన్నది. కుసుమను చూడగానే ఎదురుగా వెళ్ళి బుజాలమీద చేతులువేసి తీసుకు వచ్చి కుర్చీమీద కూర్చోబెట్టుకుంది.

''ఈ ఇరవై అయిదు రోజులనుంచీ నీవు ఇక్కడున్నట్టు నాకు తెలియదు సుమా. నీవు కనబడకపోతే రెండు మూడు సార్లు నీ క్లాసుమేట్సును అడిగాను కూడాను. ఎవరూ సరిగా జవాబే చెప్పలేదు. నిన్న హాస్టలుకు వెళ్ళి మీ వార్డెను

ఇడిగాను. తెలిసినప్పటి నుంచీ నీవెలా ఉన్నావోనని బాధపడిపోతున్నాను. ఈ రొొట్టె తిను' ఆప్యాయంగా చేతిలో పెట్టింది.

''నర్సులు యిచ్చిన పాలుతాగి బ్రెడ్ తిన్నాను. ఇంకేం కావాలి ?''

''హేమా! యిన్నాళ్లనుంచీ ఒక్కదానవూ యిక్కడ ఎంత బాధపడ్డావ్. నేను ఊహించుకున్నాను. నాకు యిన్నాళ్లనుంచీ తెలియలేదని కాని తెలిస్తే ఎలా వచ్చేదాన్నో ? అన్నయ్యకు ఒళ్లు బాగాలేదు. అమ్మ ఒక్కతే! బజారు పనులన్నీ నేనే చెయ్యాల్సి వచ్చింది....''

హేమలత కళ్లల్లో అప్పటికే నిండా నీరు కమ్మింది.

''నేను తెచ్చిన బ్రెడ్ తినవూ ? నీవేమీ తినలేవని తెచ్చాననుకున్నావా ? తిన్నావులే. ఇది కూడా తినాలని తెచ్చాను. నీకు జ్వరం తగ్గిందిగా. ఇంటికి రావటాని కేమభ్యంతరం ?' బుజమ్మీద చెయ్యేసింది.

''డాక్టర్లు వెళ్లమన్నారు. రేపు వెళ్ళిపోతాను'' దిగులుగా ముఖంపెట్టి ఒక పక్కకు తిప్పుకుంది.

''డిస్చార్జి చెయ్యగానే హాస్టలుకు వెళ్ళిపోవాలా ? కాస్త బలంవచ్చి బాగా తిరగగలిగేటంతవరకూ మా యింట్లో వచ్చి ఉండు. ఇంతలోకి అరిగిపోవులే. పథ్యం బాగా వంటబట్టిన తరువాత నేను వచ్చి దింపుతాను సరేనా ?''

''జ్వరమయితే తగ్గిపోయింది. పథ్యం హాస్టల్లో పెడతారులే. ఈ కాస్త దానికి మీ యింటికి ఎందుకూ ?'' జడ కొనలను అరచేతిమీద కొట్టుకుంటూ ఓర కంటితో కుసుమ ఏమంటుందోనని చూసింది.

''అదికాదు హేమా. పథ్యమంటే మీ హాస్టల్లో పెట్టేదికాదు. ఇంటివాళ్లెవరయినా జాగ్రత్తగా చేసి ఆప్యాయంగా తినిపించాలి.''

హేమలతకు ఆ క్రిందటిరోజు నాలుగవ నెంబరు గదిలో చూసిన దృశ్యం మళ్ళీ కళ్ళ ముందర కనబడినట్లయింది. ఒకనాడు ఆ అమ్మాయి పాలుతాగనని రామారాము చేసిందట. అన్నం పెట్టమని గొడవచేసిందట. తను చూపిన్నాడు పాత

చింతకాయ పచ్చడి. పొట్లకాయ కూర అన్నములో కలిపి ముద్దలుచేసి చేతిలో పెడుతున్నది తల్లి. ఆ పచ్చడీ కూరా వొంటికి ఎంత మంచివో, వాటి రుచులు ఎంత బాగుంటాయో ఊరించి ఊరించి చెబుతున్నది. ఆ దృశ్యము తలవుకురాగానే హేమలతకు కళ్లల్లో నీళ్లు నిలిచాయి.

''ఏమిటీ ఆలోచిస్తున్నావు హేమా? మా యింటికి రాకూడదా? నీవు రానన్నా రెక్క పుచ్చుకుని లాక్కెళ్లుతాను ఏమకుంటున్నావో?'' కుసుమ కనుబొమలు పైకెత్తి బెదిరించింది.

హేమలత ఓపికలేకపోయినా కడుపు గట్టిగా పట్టుకుని శుష్కించిన చెంపలు గుంటలు పడేలా నవ్వింది.

''నీకెందుకూ పో శ్రమ అని చూస్తున్నాను కుసుమా'' ఆ మాటలో ఎంత మొహమాటము మూట కట్టినటుగా ఉన్నదో కుసుమ అంచనా వేసుకున్నది.

మరునాడు కుసుమవచ్చి హేమలతను వాళ్ల యింటికి తీసుకువెళ్లింది. కుసుమ తన గదిలోనే హేమలతకు మంచము వేసింది. వేడివేడి నీళ్ల స్నానము చెయ్యగానే అలసటవచ్చి హేమలత కళ్ళు మూసుకుని పడుకున్నది.

''ఇక్కడికే అన్నీ తెచ్చానమ్మా. మెల్లగా లేచి ఈ పీటమీద కూర్చుంటావా?''

హేమలత కళ్లుతెరచి గడియారము చూసుకున్నది. పదకొండు గంటలు.

'అమ్మాయీ! నీవు మొహమాటపడకు. అన్నరసం కడుపులో పడితేనే గాని నీకా దడ తగ్గదు. చారన్నం తిని నోటికి రుచిగాఉందో లేదో చెప్పు. ఇన్నాళ్ల నుంచీ నాలుక చవి చచ్చిపోయిందామెను. అందుకే కాస్త పుల్లపుల్లగా ఉండాలని చారు చేశాను. పాలన్నంలోకి ఈ నిమ్మకాయముక్క నంచుకో.'' కుసుమతల్లి హేమలతకు ఎదురుగా పీటవేసుకూర్చుంది.

హేమలత ఉక్కిరిబిక్కిరయిపోయింది. తన కెప్పుడూ అనుభవములేని ఆదరమూ ప్రేమా కుసుమతల్లి చూపిస్తుంటే హేమలతకు ఏమనటానికి తోచటంలేదు కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి.

"ఆ కాస్తఅన్నం కలుపమ్మా."

కళ్ళనీళ్లు చెంపలమీదుగా జారటంచేత ఆమె చూడకుండా ఉండాలని హేమ-లత ముఖం పక్కకు తిప్పుకున్నది.

"పిచ్చిపిల్లా ఎందుకు కన్నీళ్లు? రేపీపాటికి శుభ్రంగా తిరుగుతావు. మంచి టానిక్కు తీసుకుంటే బాగా బలం వస్తుంది. వచ్చే వారానికల్లా వెనకటి హేమ-లతకు మించిపోతావు".

"అందుక్కాదండీ" కన్నీళ్లు తుడుచుకుని నవ్వటానికి ప్రయత్నించింది.

"చూడు అన్నం తినగానే పడుకోకూడదు. నాతో పేకాటయినా ఆడు, అది యిష్టంలేకపోతే గవ్వలాటయినా ఆడు. అన్నం అరిగిన తరువాత నీ యిష్టం వచ్చినంతసేపు నిద్రపో-ఏం?" ఆమె ముఖం మూతి నొసలు చిన్నపిల్లలతో మాట్లాడేప్పుడు ఉన్నట్టుగా ఉన్నాయి.

"మా అమ్మ చెప్పినట్టు వినకపోతే ఊరుకోరు హేమా. ఆవిడ మా పెద్ద మనిషి. ఆమె మాట వింటేనే మనకు సుఖమనుకో. సాధింపులు ఉండవు" కుసుమ హేమలత పక్కన కూర్చున్నది బుజమ్మీద చెయ్యివేస్తూ.

కుసుమ యింట్లో వారంరోజులు నిమిషాల్లా గడిచిపోయాయి. ఆమె తల్లి మణెమ్మ హేమలతకు ఒకనాడు బలవంతంగా తలంటి నీళ్ళు పోసింది. సాంబ్రాణి పొగవేసి తలవెంట్రుకలు ఆరబెట్టింది.

ఎవరూ దగ్గరలేనప్పుడు దిగులుపడ్డ ముఖంతో శూన్యంలోకి చూస్తూ గంటల తరబడి కూర్చునేది హేమలత. అలాంటి సమయాలలో బలమైన చెయ్యి ఆమె వీపు మీద పడేది. 'ఏమిటమ్మా ఆలోచిస్తున్నావు?' మణెమ్మ ముఖంలో ముఖంపెట్టి అడగ్గానే కళ్ళు అదోకమాదిరిగా అయి బరువెక్కి మూతలుపడేవి. ఆమె ఒడిలో తలపెట్టుకొని ఆతల్లి వాత్సల్యాన్ని పొందాలని హేమలత మనసు తహతహలాడిపొయ్యేది. ఆమె బుజమ్మీద తల ఆన్చి తనకు జీవితంలో ఇంత వరకూ తెలియని ఆ ప్రేమను పొందాలనిపించేది. రాత్రిళ్లు పడుకోబోయే ముందు ఆమె వచ్చి 'పిచ్చిపిల్లా! వెర్రివెర్రి ఆలోచనలు పెట్టుకోక సుఖంగా నిద్రపో'అంటూ తల నిమిరితే ఎంతో హాయిగా నిద్రపట్టేది.

సాయంకాలము నాలుగుగంటలకు వాకిట్లో బండి వచ్చి నిలబడ్డది. హేమలత తన సామాను సర్దుకుంది. ఆమె మనసు బరువుగా వుంది. ఆత్మీయత ఆదరమూ ఇలా ఉంటాయని చూపెట్టిన మణెమ్మను వదలిపోవాలంటే గుండెలో పెద్ద బరువు పెట్టినట్టుగా ఉన్నది. బండిఎక్కేటప్పుడు వెళ్ళుతున్నానని చెప్పలేకపోయింది గొంతులో ఏదో అడ్డము పడ్డట్టయింది. మాట స్తంభించిపోయింది. కంఠము గద్గదమయింది. వెళ్ళుతున్నట్టుగా తల ఆడించింది.

"పిచ్చిపిల్లా అట్లా బాధపడతావేం? నీకెప్పుడు రావాలనిపిస్తే అప్పుడే వచ్చెయ్యి. ప్రతి ఆదివారము వార్డెనుకు చెప్పి వస్తూ ఉండు." వీపు నిమురుతూ మణెమ్మ హేమలతను బండిలో కూర్చోబెట్టింది.

ఏనాటి మాట యిది? పది సంవత్సరాలయింది. ఈ పది సంవత్సరాలలో ఎన్నో మార్పులు జరిగాయి. హేమలత డాక్టరయింది. మెటర్నిటీ స్పెషలిస్టయింది. ప్రాణం పోతుందనుకున్న తల్లులకు నిరపాయకరంగా పురుడుపోసి పండువంటి పాపాయిలను చేతికిస్తున్నది. అనపత్యతతో క్రుంగిపోయే స్త్రీల కెందరికో మాతృత్వము కలిగించింది. వైద్యురాలిగా ఎందరికో బాధోపశమనము కలిగిస్తున్నది. తన సర్వశక్తులూ కూడగట్టుకుని మానవసేవ చేస్తున్నది.

ఈ పదిసంవత్సరాల కాలంలో 'అమ్మ' అన్న శబ్దం వినిపించినప్పుడల్లా మణెమ్మ జ్ఞాపకము వస్తూనే ఉన్నది. స్నేహితులలో మణెమ్మవంటి వారెవరయినా ఉన్నారేమోనని చూపులతో వెదుకుతూనే ఉన్నది. తన ఇరుగుపొరుగులలో అటువంటి ఆమె ఎక్కడయినా ఉన్నదా అని గాలిస్తూనే ఉన్నది. తన రోగుల కెవరికయినా అటువంటి ఉపచార భాగ్యము కలుగుతున్నదేమోనని ఆమె కళ్ళు పరిశోధిస్తూనే ఉన్నాయి. ఆ ఆదరము ఆ వాత్సల్యమూ ఎక్కడ లభిస్తాయి? ఆ తల్లి మణెమ్మ ఎక్కడ ఉన్నది?

ఆ ఊరినుంచి బదిలీ అయిపోయిన ఎన్నాళ్ళకో కుసుమ పెళ్ళికి ఆహ్వానము పంపాడు ఆమె అన్న. పెళ్ళికోసం కాదు మణెమ్మను చూద్దామని ఆశపడ్డది మనసు. ఆఖరి సంవత్సరం పరీక్షలు దగ్గరికి వస్తున్నాయి. తెల్లవార్లు చదివినా చాలటంలేదు. క్షమించమని నాలుగుపేజీల ఉత్తరం వ్రాసింది.

పెళ్ళి అయిన తరువాత కుసుమ ఉత్తరాలు వ్రాస్తూనే ఉంది. ఉత్తరమంతా ఆయనను గురించీ తన చిన్న సంసారాన్ని గురించీ వ్రాసేది. అమ్మ ఎక్కడున్నది అన్నమాటకు జవాబు యివ్వకుండా.

ఒంటరి జీవితమన్న మాటే గాని హేమలతకు ఆ వృత్తిలో ఒంటరితనాన్ని గురించి ఆలోచించటానికి తీరటం లేదు. హాస్పిటల్లో రోగులు, ఇంటికి వచ్చిపోయే రోగులు. ఇంటికివచ్చి తనను తీసుకుపోయే రోగులు-వాళ్ళకు వైద్యము, మందులు వీటితో కాలక్షేపము. ఉదయం లేచినప్పటి నుంచీ ఇదే వ్యాపకము. మందులూ, రోగులూ.... వైద్యము.... జరిగినకాలాన్ని లెక్క వేసుకుంటే రెండేళ్ళ.

రాత్రి పదకొండు గంటలవేళ. హాస్పిటల్ ఆవరణలో డాక్టరుకోసం కేటాయించిన క్వార్టర్సులో మంచమ్మీద గుండెకు చేతులుచేర్చి పడుకుని కిటికిలో నుంచి వినీలాకాశంలో చుక్కలమధ్య పదహారు కళలతో మేఘమాలికలను తప్పించుకుంటూ పకపకనవ్వుతూ దాగుడుమూతలాడే ఆ జాబిల్లిని చూస్తున్నది. అంత నవ్వులోనూ ఆ చంద్రుడిలో మరునాటి నుండీ ఒక్కొకళ తరిగి పోతుందన్న దైన్యము తొంగిచూస్తూనే ఉన్నది. చంద్రకిరణాలు పక్కమీద పడుతూ ఉంటే హాయనిపిస్తున్నది. ఇంతచల్లగా ఇంతహాయిగా ఉండేది మణెమ్మన్నమాట. ఒక్కసారి మళ్ళీ తనకు జ్వరం వస్తే? మణెమ్మవచ్చి 'పిచ్చి పిల్లా' అంటూ వీపు మీద చెయ్యివేసి రాస్తూ పథ్యం తినిపిస్తే?

తలుపు కిర్రున చప్పుడయింది. నర్సు వచ్చి లేపింది 'సీరియస్ కేసు వచ్చింది. సిస్టరు రమ్మంటున్నది' అంటూ.

''పురిటి కేసా?'' కళ్ళు నులుముకుంటూ లేచింది.

''కాదు. గైనిక్ కేసు. మీరు త్వరగా రండి.''

నర్సును పోనిచ్చి స్టెతస్కోపు మెడలో తగిలించుకుని బయలుదేరింది. రోగికి నాడి బలహీనంగా ఉంది. ఋతుసంబంధమైన వ్యాధితో పాలిపోయి కృశించి ఉన్నది. హేమలత పరీక్షచేసి తాత్కాలికోపశమనం కోసం ఒక ఇంజక్షను ఇచ్చింది.

రోగి అమ్మా అని మూలిగినప్పుడు ఆ కంఠధ్వని ఎక్కడో విన్నట్లు ధ్వనిం

చింది. గుంటలుపడిన ఆ కళ్ళల్లో ఏదో వెలుగు తళుక్కున మెరిసింది. వెనక్కు తిరిగి ఆమె ముఖము చూస్తూ ముందుకు నడిచింది డాక్టరు.

మరునాడు రోజూకంటే అరగంట ముందుగావచ్చి ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని నాడిచూస్తూ 'మీది ఈ ఊరేనా? వెంబడి ఎవరూ లేరా?' అడిగింది.

"మాది విశాఖపట్నము. పదికాన్పులు కన్నాను; నలుగురు బ్రతికారు. కాని వెంట ఎవరూలేరు" తన చూపులు గోడవైపుకు తిప్పుకొని చెప్పింది రోగి. నూతిలోంచి వచ్చినట్లున్నాయి మాటలు. ఆకొద్ది మాటలకే ఆయాసము వచ్చింది.

''మీరిలా ఉంటే వెంట ఒక్కరూ రాలేదా?''

"అవునమ్మా అందరికీ అన్నిపనులు సంసారాలు. నన్ను కనిపెట్టుకునిఉండాలంటే ఎట్లా?'' తల ఎత్తకుండానే ముఖాన్ని వాల్చుకున్నది.

''ఇక్కడికి ఎలావచ్చారు మరి?'' ఆశ్చర్యంతో అడిగింది డాక్టరు.

''చెల్లెల్ని చూద్దామని వచ్చాను. రాగానే జబ్బుచేసింది. చెల్లెలి కొడుకు ఇక్కడ చేర్చాడు.''

ఆమె పరిస్థితి ఆనాడు చాలా అధ్వాన్నంగా ఉంది. ఆపరేషను చేస్తే గాని బాగుపడదు. ఆపరేషను చెయ్యటానికి రోగి దగ్గర శక్తిలేదు. రక్తము ఎక్కించాలని పెద్ద డాక్టరు అన్నాడు. సరిపడిన గ్రూపు రక్తముకోసం నాలుగురోజులు ఆలస్యము కూడా అయింది.

రోగి ముఖము ముడతలు ముడతలుగా ఒడిలిపోయింది. పళ్ళు లేకపోవటమువల్ల దవడలు లోపలికి పీక్కుపోయాయి. మాట స్పష్టంగా లేదు. అయినా హేమలతకు ఆమె నుండి ఏదో వినాలన్న ఆశలూ కాంక్షలూ మనసులో ఊరుతున్నాయి.

ఐదవనాడు ఆందోళనపడుతూ హేమలత తన రక్తముతీసి పరీక్ష చేయించింది. ముఖంలో వెలుగు తళుక్కుమన్నది. ఎంతో భక్తితో ప్రేమతో తన రక్తము తీసి ఆమెకు దానము చేసింది. మిగతా రోగులు ఆమె కొరకు డాక్టరు పడుతున్న శ్రమకు ఆశ్చర్యపడిపోతున్నారు.

తెల్లగా పాలిపోయి చావుబ్రతుకుల మధ్య ఉండి నోటకూటలేక పెదవులు కదుపుతూ ఉన్నదల్లా వారం తిరిగేసరికి కొత్తజీవం పోసుకొని నవనవలాడి పోయింది ఆమె. పక్కమీది నుంచి లేవలేకపోయినా మిగతా రోగుల నందరినీ మాట్లాడిస్తూ నవ్వుతూ కబుర్లు చెప్పుతున్నది. లేవలేకపోయినా అందరికీ సలహా లిస్తున్నది. ఆమరునాడు ఆమెకు ఆపరేషను చేశారు. ఆనాడంతా ఒంటిమీద తెలివిలేదు. హేమలత మూడురోజులపాటు ఆమెను కనిపెట్టుకుని ఉన్నది.

నాలుగవనాడు ఉదయము నాడి చూస్తూ ఉంటే 'తెల్లవారుఝామునుండి కడుపునొప్పి తల్లీ!' అన్నది.

''నాకు కబురుపంపలేకపోయారా? వచ్చి ఏదయినా మందు ఇచ్చేదాన్నిగా?''

''తిరిగి తిరిగి అలిసిపోయిన బిడ్డను రాత్రిపూట నిద్ర అయినా పోకుండా పిలిపించనా? తెల్లవారగానే ఎలాగూ వస్తారుగా?''

ఆమె మాటలు వింటుంటే హేమలత దేహము జలదరించింది. మనసులో పేరుకుపోయిన మమతలేవో కదలించినట్లయింది.

''ఈ రోగులంతా కాస్త నొప్పిరాగానే హాలు ఎగిరిపోయేటట్లు కేకలు పెడ తారు. డాక్టర్ని పిలవమని అరుస్తారు. మీరు అవసరం వచ్చినప్పుడయినా పిలవ టానికి మొహమాట పడతారేం?''

హేమలత ఆమెను జాగ్రత్తగా పరీక్షచేసింది. కళ్ళల్లో ఆందోళన తొణి కిసలాడింది. పెద్దడాక్టరుని పిలువనంపింది.

''మీరు చుట్టుపక్కల రోగులతో చాలా సరదాగా నిన్నామొన్నా మాట్లాడా రట నిజమేనా?''

''ఓపిక ఉంటే మాట్లాడకేం తల్లీ. పాపం వాళ్ళతో కులాసాగా మాట్లాడే వాళ్లు లేక బెంబేలు పడుతున్నారు. మనసులు ఆనందంగా ఉంటే సగం రోగాలు తగ్గుతాయి, పాపం వాళ్లనుచూస్తే జాలివేస్తుంది'' ముంజేతులు సవరించుకుంటూ ఒక్కొక్కమాటే అన్నది మెల్లగా.

పెద్దడాక్టరు వచ్చి రోగిలో కలిగిన మార్పు గమనించాడు. రెండు ఇంజక్షన్లు ఇవ్వమనిచెప్పి వెళ్లాడు. హేమలత రోగుల నందరినీ చూసి ఇంజక్షను యివ్వటానికి వచ్చేసరికి ఆమె ఫాలభాగమ్మీద చెయ్యివెట్టుకొని కళ్లు మూసుకొని సన్నగా మూలుగుతున్నది.

"ఏమండీ మీఊరు ఎట్లా ఉంటుందో చెప్పలేదు?' సూదితో మందుఎక్కిస్తూ ఆమె ముఖంలోకి చూసింది హేమలత.

"మా ఊరా అమ్మా! ఆ ఊళ్ళో ఏముంది తల్లీ. నేను బాగా బ్రతికిన స్మృతి చిహ్నాలున్నాయి. ఆ ఊరిపేరు తలుచుకుంటే కడుపులో పేగులు కదులుతాయి" కన్నీళ్లు కణతలగుండా జారి తల వెంట్రుకలను తడుపుతున్నాయి.

"అయితే వద్దులెండి. మీకు ఈ ఇంజక్షనుతో బాగా నిద్రపడుతుంది. తలనొప్పి తగ్గిపోతుంది. మీకెప్పుడు అవసరమనిపిస్తే అప్పుడు నాకోసం చెప్పి పంపండి."

పన్నెండుగంటలకు క్వార్టర్సుకు వెళ్ళుతూ హేమలత ఆమె మంచం దగ్గరగా నిలబడి 'మీకు నిద్రరాలేదూ?' అడిగింది ముందుకు వంగి.

"లేదమ్మా. కడుపులో నరాలన్నీ పీకుతున్నాయి."

హేమలతకు ఆపూట అన్నం సహించలేదు. గబగబా వార్డుబాయిని పంపించి వేడినీళ్ళ సంచి తెప్పించి కాపుతూ కూర్చుంది.

"నాకు చిన్నప్పుడు కుసుమ అనే స్నేహితురాలు ఉండేది విశాఖపట్నంలో. నేను హాస్టల్లో ఉండి చదువుకుంటున్నాను. ఓసారి కుసుమ తన యింటికి తీసుకు వెళ్ళింది.... .... .... ...."

"నా రెండో కూతురు కుసుమ ఓసారి తల్లీ తండ్రీ లేని పిల్లను యింటికి తీసుకు వచ్చింది. పాపము ఆ పిల్లకు తల్లీ తండ్రీ ప్రేమ తెలియనే తెలియదు."

"ఆఁ ఆఁ. అవునవును" సంతోషం కొద్దీ నోరు తెరిచింది హేమలత.

ఆమెకు కళ్లు మూతలుపడుతున్నాయి. హేమలత వార్డంతా ఒకసారి తిరిగి మళ్ళీ ఆ మంచందగ్గర కూర్చుంది. రోగికి బాగా నిద్రపట్టినట్టుంది. జాగ్రత్తగా చూడమని నర్సులకు చెప్పి క్వార్టర్సుకు వెళ్ళింది.

మరునాడు ఇంజక్షను యిస్తూ 'రాత్రి బాగా నిద్రపోయారా?' అడిగింది హేమలత.

ఆమె తల ఆడించింది.

''నన్ను చూసిన జ్ఞాపకము ఉన్నదా?''

''ఎప్పుడో ఎక్కడో చూశాననుకుంటున్నాను.''

''మీ యింటికి వచ్చి వారంరోజులు ఉన్న హేమలతను నేనే. మీరు మెత్తగా అన్నం వండిపెట్టారు. తలంటి నీళ్ళు పోశారు.''

''ఔనటమ్మా? నా తల్లే. ఎంత జ్ఞాపకము ఉందమ్మా నీకు?'' మాట పూర్తి కాకముందే కళ్ళ నీళ్ళు చెంపలవెంట ధారకట్టాయి.

''మీకు కాస్త తగ్గగానే నా క్వార్టర్సుకు వచ్చి ఉండాలి. అక్కడే ఉంచుకుని మందిస్తాను.''

''ఎంత చల్లటిమాట అన్నావు! అప్పుడే నా బాధంతా తగ్గిపోయినట్టుంది చూడు'' వొత్తిగిలి హేమ ముఖంలోకి చూసింది. ఆమె తల నిమరబోయింది కాని చెయ్యి పక్కకు వాలిపోయింది.

''మీరు పడుకోండి. ఒక్క గంటలో వస్తాను''.

హేమలత వార్డులో రోగులను చూడటానికి లేచింది.

ఆ పగలంతా వరహమ్మ మగతగా పడి ఉంది. ఆ సాయంత్రపువేళ కష్టపు కాన్పు కేసు వచ్చింది. అలిసిపోయిన హేమలత ఎనిమిదిగంటలకు పక్కమీద వాలింది. ఎప్పుడు నిద్రపట్టిందో నర్సు లేపితే లేచింది.

''డాక్టర్ ఆ ముసలమ్మ కళ్ళు తేలవేసింది.''

ఆందోళనా భయమూ అడుగు ముందుకు పడకుండా అడ్డంవచ్చాయి. తడబడుతున్న కాళ్ళతో మంచం దగ్గరికి చేరుకుంది. రోగికి స్పృహలేదు. నాడి చేతికి అందటంలేదు. ఆమెకు స్పృహరావటానికీ నాడి సరిగాకొట్టుకోవటానికీ మందులూ

ఇంజక్షనులూ ఇవ్వాలని మనసు పాకులాడింది. తోచిన వైద్యమంతా చేసింది. ఆమె చూస్తూ ఉండగానే రోగి తుదిశ్వాస విడిచింది.

"ఒక్కసారి కళ్లు తెరిచి హేమా అని పిలవరూ! పిచ్చిపిల్లా అంటూ వీపు మీద చెయ్యివేసి రాయరూ!" ఆమె గొంతు ఎవరో నొక్కినట్లయింది.

ఆ చూపుకోసం—ఆ మాటకోసం హేమలత అహర్నిశలా కష్టించింది. ఫలితం దక్కలేదు. ఆమె మనసు తల్లడించిపోయింది. ఒక్క అంగలో క్వార్టర్సు చేరుకుంది. అడ్డంగా మంచమ్మీద పడిపోయింది. దుఃఖపు టలలు ఉవ్వెత్తున పైకి లేచి ఆమెను ఊపివేస్తున్నాయి.

ఉదయము ఆరుగంటల బస్సులో కుసుమ వస్తూనే హేమలత క్వార్టర్సుకు వచ్చింది "కుసుమా నా గుండె బద్దలయిపోతున్నది. కడుపులో పేగులు చుమ్మలు చుట్టుకు పోతున్నయి" కుసుమ బుజమ్మీద తలపెట్టి వెక్కివెక్కి ఏడ్చింది.

"హేమా నన్ను ఓదార్చవలసిందిపోయి నీవే ఏడుస్తున్నావా? అమ్మ పెద్దదయి పోయింది. అయినా నీవు ఎంతమంది రోగులను బ్రతికించగలిగావు చెప్పు? నీచేతిలో ఎంతమంది రోగులు చనిపోలేదు? ఏమిటీ వెర్రి? డాక్టరువయి ఉండి ముఖం వాచేటట్టు ఏడుస్తున్నావా? అమ్మ అదృష్టవంతురాలు. ఆఖరిదశలో నీచేతి మీదుగా వెళ్ళిపోయింది" హేమలత ముఖాన్ని తనకేసి తిప్పుకుంది కుసుమ.

హాస్పిటల్లో ఆవార్డులో అడుగు పెట్టగానే హేమలత గుండె చెరువయి పోతున్నది. పదిరోజులు సెలవు పెట్టింది. క్వార్టర్సులో ఊరికే కూర్చుంటే మణెమ్మ ముఖం—ఆమె మాటలు గుండెను పిండేస్తున్నాయి. హేమలతకు దిగులు దిగులుగా ఎక్కడ కూర్చుంటే అక్కడే—ఎటువైపు దృష్టి మళ్ళితే అటే— పిచ్చికళ పడ్డది.

"సుమతి చూశావా ఒక్కసారయినా వచ్చిందికాదు" ఈమాట పదిసార్లు అనుకున్నది. చిందరవందరగా ఉన్న బల్లను శుభ్రపరుద్దామనుకున్నది. బీరువాలో ఎగుడు దిగుడుగా పడి ఉన్న పుస్తకాలు సర్దుదామనుకున్నది. బల్లమీద దుమ్ము కొట్టుకుపోతూ ఉన్న పాత ఉత్తరాలుతీసి బుట్టలో పడేద్దామనుకున్నది. మనసు దేని మీదా నిలవటంలేదు. మణెమ్మ ముఖం ఎత్తని అవనికలా ఏమూల చూసినా ఎటు వైపు చూసినా కనబడుతున్నది. 'హేమా! పిచ్చిపిల్లా........' అంటూ.

ఈ లోకమంతా కటిక చీకటి__మనసంతా చీకటి చీకటిగా ఉంది.

శనివారం ప్రొద్దున్నే తలుపు తోసుకుని లోపలికి వస్తున్నదెవరో సరిగా చూడకుండా డాక్టరు వెంకటచలం "అప్పలమ్మా. ఇల్లంతా గబగబా ఊడ్చెయ్యి. నీళ్లు కాగబెట్టు నేను లేచే లోపల కాఫీ ఇడ్లీ తీసుకురా హోటలునుంచి" తిరిగి ముసుగు బిగదన్ని పడుకున్నాడు.

కొంతసేపటికి వెంకటచలం కళ్ళు తెరిచి వప్పుకున్న సన్నటి దుప్పటిలో నుంచి చూశాడు. తలుపు సందులో నుంచి వెలుతురు వస్తున్నది. మధ్యలో ఎవరో నిలబడినట్లు నీడగా కనబడ్డది. అప్పలమ్మ ఇంతసేపు మాట్లాడకుండా అట్లా నిల బడి పోయిందేం ? ఇంతసేపు మాట్లాడకుండా ఉండటం అప్పలమ్మకు చేతకాదే?

ఎవరైనా తనను తీసుకుపోవటానికి వచ్చారా ?

"శనివారం దుర్ముహూర్తం దాటాలి. ఎనిమిదిదాటితేగాని నేను పక్కమీది నుంచి లేవను. ఎవరోగాని__తరువాత రండి"

హేమలత నవ్వాపుకోలేకపోయింది. కడుపు ఒకచేత్తో పట్టుకుని పక్కనున్న కుర్చీలో కూలబడ్డది.

వెంకటచలం ఆమెను చూసి ఆశ్చర్యపడ్డాడు. చెంపలు పీక్కుపోయాయి. కళ్ళు గుంటలు పడ్డాయి. దేహచ్ఛాయ వన్నె తిరిగింది.

"ఏమిటి హేమా. జబ్బుగాని చెయ్యలేదు కదా ? పది లంఖణాలు చేసి నట్టున్నావు ఏమిటీ ?" దుప్పటి అవతలికి నెట్టి క్రాపుసర్దుకుంటూ లేచాడు.

కాఫీ ఇడ్లీ అయిన తరువాత సిగరెట్టు ముట్టించి 'ఇహ చెప్పు' అన్నట్టు చూశాడు.

హేమలత తలవంచుకుని చేతివేళ్ళతో కుర్చీరాస్తూ 'చలం! నేను లాంగ్‌లీవు పెట్టాను. నాకు ఇక్కడికి మార్పించు. పెద్ద ఇల్లు తీసుకుని ముహూర్తం పెట్టించు' అన్నది.

వెంకటచలం తబ్బిబ్బయిపోయాడు "ముహూర్తం! దానికి ఇప్పుడు వచ్చిందా వేళ? అందుకేనా అట్లా దిగులుపడ్డావు!" ఒక్క ఉదుటన కూర్చున్నచోటు నుంచి లేచి ఆమె భుజాలు పట్టుకుని ఊపేశాడు.

ఆమె హృదయంలో రెండు వాక్యాలు తల్లడించి పోతున్నాయి. 'అమ్మా అని పిలవటానికి నాకెవరూలేరు. నన్ను పిలిచేవాళ్ళు కావాలి.' గొంతులో ఉండ అడ్డుపడినట్టుగా ఉంది. మాట పెగిలి బయటికి రాలేదు.

"చలం! చలం! నీ ట్లా ఉన్నావేం క్షౌరమన్నా చేసుకోకుండా?" అతడి గుండెలో తలదాచుకున్నది హేమలత మాట పైకి వినబడకుండా.

(ఆంధ్ర సచిత్ర వారపత్రిక)



# చీకటిలో చెదరని మనిషి

సరిగ్గా తొమ్మిదిగంటలయ్యేసరికి డాక్టర్ అమర్‌నాథ్‌కారు నర్సింగుహోమ్ పోర్టికోలో ఆగింది. కారుదిగి విసురుగా తలుపువేసి రెండేసి మెట్ల చొప్పున పదిమెట్లూ దాటుకుంటూ తన ఆఫీసుగదిలో అడుగుపెట్టాడు.

గది నాలుగువైపులా అలవాటు చొప్పున కలయజూశాడు. ఒకచోట దృష్టి నిలిచింది, చప్పున కనుబొమలు ముడిపడ్డాయి. కళ్ళల్లోని ఎర్ర జీరలు మరింత ఎరుపెక్కాయి.

"గంగులూ" పొలికేక పెట్టాడు.

పని అయిపోయిందనుకుని పెరటివరండాలో నిలబడి రాములమ్మతో పగలబడి నవ్వుతూ కబుర్లు చెబుతున్న గంగులు ఆ కేకకు అదిరిపడ్డాడు.

"అయ్యగారూ!" అంటూ ఒక్క అంగలో డాక్టర్ అమర్‌నాథ్ గదిలోకి వచ్చిపడ్డాడు చేతులు కట్టుకుని.

"కారు హారన్ వినబడలేదా?" తీవ్రంగా ఉంది డాక్టర్ కంఠధ్వని.

తలమీద ఉన్న గాంధీటోపీని బాగా సర్దుకుని భయంతోచూశాడు గంగులు.

"వినబడ్డదా?" మళ్ళీ గర్జించాడు డాక్టరు.

"వరెండా తలుపులు బిగుసుకుపోయాయి అయ్యగారూ! తలుపులు కొట్టి తీస్తుంటే తమరు వచ్చినట్టు తెలియలేదండి" చేతులు నలుపుకున్నాడు గంగులు.

"తలుపులు ఊడివచ్చాయా?"

"లేదండి"

నేను వచ్చేసరికి గేటు దగ్గర నిలబడిఉండాలనీ-కారు గేటులోపలికి రాగానే తలుపు తియ్యాలనీ ఎన్నిసార్లు చెప్పాను?''

''చిత్తం, చెప్పారండి''

''అదొకటి.రెండవది-కిటికీ తలుపులు తెరిచి తెరలు లాగమని చెప్పానా? మూడు-బల్లమీద ఉన్న ఫొటో కుర్చీకి ముఖం చేసి ఉండాలని చెప్పాను గుర్తు ఉందా? నాలుగు-పూలగిన్నెలో వాడిన పూలు తీసేసి ప్రతిరోజూ కొత్తవి పెట్టాలని చెప్పానా?''

''చెప్పారండి, అన్నీ చేశానండి''

''అట్లాగేనా చెయ్యటం?''

''తమరు చెప్పినట్టే చేశాను గదండి''

''ఛీ ఛీ, నీతెలివి తెల్లవారినట్టే ఉంది. ఎల్లుండితో నెలవుతుంది. నీ జీతం తీసుకు వెళ్ళు-నీతో వేగలేను''

''అయ్యగారూ!'' చేతులు జోడించాడు గంగులు.

''గంగులూ! నీవిక్కడ పని చేయటం మొదలుపెట్టి నాలుగేళ్ళుకావచ్చింది. ఏపని ఎప్పుడు ఎట్లాచెయ్యాలో ఇంకా నీవు గ్రహించలేదంటే అసలు పనికిరావన్న మాట. పని చేతగాని గాడిదలు ఈ నర్సింగ్‌హోములో అవసరం లేదు వెళ్ళువెళ్ళు. నీముఖమింక చూపించకు వెళ్ళిపో'' చీత్కారంతో ముఖం తిప్పుకున్నాడు అమర్‌నాథ్.

గంగులు అయిదు నిమిషాలసేపు అయోమయంగా చూసి, గదిదాటిబయటికి వెళ్ళాడు.

''అయ్యగారు చెప్పిన పనులన్నీ బాగానే చేశాను. రోజూ చేసినట్టేచేశాను. ఎప్పుడూ ఒక్కమాటయినా అనరు. ఇవాళ లేచినవేళ మంచిది కానట్టుంది. రాము లమ్మ మొగుడు రాత్రి కొట్టాడని చెబుతుంటే వింటున్నాడు తను వాడిని వదిలేసి, మారుమనుము వెళ్ళమని సలహా ఇస్తున్నాడు తను.

"కాస్త కోపం రాగానే నీ వెవరికయినా చీరె రవిక ఇచ్చి మారు మనుము కట్టుకున్నావా?" రాములమ్మ ఎదురు ప్రశ్నించింది.

ఆ సమయంలో ఇద్దరూ హాయిగా నవ్వుకున్నారు సరిగ్గా అప్పుడే రావాలా అయ్యగారు? ఆ నవ్వుల్లో హారన్ వినబడని మాట నిజమే. ఏం కష్టమొచ్చిందిరా బాబూ! నోటికాడి కూడు పడిపోతుందేమో డాక్టరుగారిచ్చే ఎనభై రూపాయలూ-పేషంట్ల దగ్గర వసూలుచేసే నూరు రూపాయలూ-కాంపౌండులో రెండు గదుల ఇల్లూ-ఎంతో సుఖంగా ఉంటున్నాడు. తన భార్య జోగులమ్మ నర్సింగ్‌హోములో ఊడవటమూ, కడగటమూ లాంటి పనులు చేస్తుంది. హాయిగా సాగిపోతున్న సంసారం వీధిన బడుతుంది కాబోలు డాక్టరుగారి నోటివెంట ఏ మాటయినావచ్చిందంటే అది జరిగి తీరాల్సిందే " భూమి కుంగిపోతున్నట్టుంది గంగులికి.

పక్కగదిలో డాక్టర్ అమర్‌నాథ్ అరుపులకు చంగున లోపలికి వరుగు తీశాడు.

"నిన్న చెప్పానా ఇవాళ డబ్బు తీసుకురమ్మని! ఎందుకు తీసుకు రాలేదు?డబ్బు ఇవ్వకపోతే మందెవరు ఇస్తారు? నాకు మందులు ఊరికే వస్తున్నాయా? నీవు డబ్బు తీసుకుని వచ్చినప్పుడే మందిస్తాను వెళ్ళు వెళ్లగంగులూ!ఇంకెవరున్నారో రమ్మను.",

ఆ రోగి ముఖం చిన్నబుచ్చుకుని కండువాతో కళ్లొత్తుకుంటూ బైటికివచ్చి నిలబడ్డాడు. అతడికి తల గిర్రున తిరిగి పోతున్నట్టుగా ఉంది. "ఏమిటది? డాక్టరుగారి దగ్గర ఎంతకాలంనుంచీ మందు తీసుకుంటున్నాను! ఒక్కనాడయినా డబ్బడిగారా? డబ్బు దేమిటి అనో-తొందరేమొచ్చిందనో-చూద్దాంలే అనో అంటే తానే బలవంతంగా చేతిలో పెట్టేవాడు. సరిగ్గా డబ్బు చేతిలో లేనప్పుడే బలవంతం చేస్తున్నా డేమిటి? తాకట్టు పెట్టటానికి కూడా ఇంట్లో ఏమీలేదు. అయినా ఇంత గొప్ప డాక్టరుగారు ఎప్పుడూ లేనిది ఒక్క పది రూపాయలకు ఇంత నిక్కచ్చిగా అడగటం చూస్తే ఆశ్చర్యంగా ఉంది" తలమీద చేతులు పెట్టుకుని వరండాగోడకు కాళ్లు ముడుచుకుని చేరగిల బడ్డాడు.

"వెంకటేశం! ఈపది రూపాయలూ డాక్టరుగారికిచ్చి మందుతీసుకో. నాకు తరువాత ఇవ్వచ్చు."

భుజంమీద చెయ్యి పడ్డంతోటే కళ్ళు తెరచి చూశాడు - ఎదురుగా రామ ప్రసాదు,

"మీకెట్లా తెలిసింది?"

"నాకా? నాకు ఈ డాక్టరుగారు బాగా తెలుసు. ఎంతో మంచివాడు డబ్బుకు తొందర పడడు.ఆయన మాటలతోటే సగంరోగం నయమయి పోతుంది.కాని...."

"ఏమిటీ? ఈ డాక్టరుబాబు మీకు బాగా తెలుసా?" వెర్రిచూపు చూసాడు వెంకటేశం.

"నాకు చాలా ఏళ్ళనుంచీ తెలుసు. తీసుకో ఈ పది పాపాయలు. మందు తెచ్చుకో."

"ఏమిటి ఈయనగారు ఎప్పుడూ ఇంతేనా? ఇటువంటి అనుభవం నాకెప్పుడు కాలేదే?"

నవ్వాడు రామప్రసాదు. "ఎప్పుడూ అంటే ఎప్పుడూ కాదు. అప్పుడప్పుడు మాత్రమే."

"అంటే?"

"అంటే ఏముంది? ఇంట్లో చికాకులు వస్తే అవి ఆయనమీద తమ ప్రభావాన్ని చూపిస్తాయన్నమాట. ఇక్కడికి వచ్చే పేషంట్లమీద విరుచుకుపడటం మామూలే-అంతే"

ఇద్దరూ ఉలిక్కిపడ్డారు–గదిలో జరుగుతున్న సంభాషణకు.

"క్రిందటి వారంచెప్పానా ఈకాలివేళ్ళు రెండూ తీసివేయాల్సివస్తుందని? వస్తానన్నావు రాలేదు ఇప్పుడింకా రెండు కొట్టెయ్యాలి ఏం మనుషులయ్యామీరు? ఇలాంటి వాళ్ళకు నేను వైద్యం చెయ్యను. వెళ్ళు వెళ్లు"డాక్టరుగారి గొంతు అరిచి అరిచి బొంగురుపోయింది.

"నా భార్య నాలుగు రోజులు నొప్పులు పడిపడి నిన్ననే హాస్పిటల్లో కన్నది డాక్టరుగారూ! నేనటుతిరగాల్సి వచ్చింది. ఇప్పుడు వచ్చానుగా, ఆ ఆపరేషనేదో చెయ్యండి డాక్టరుగారూ!"

"ఊఁహూఁ. నీకు వైద్యం చెయ్యను అంటే చెయ్యను అంతే"

ఆ పేషంటు గొణుక్కుంటూ వెళ్ళాడు విసురుగా.

వెంకటేశం రామప్రసాదు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

ఒక్కొక్క పేషంటే డాక్టరుగారి గదిలో నుంచి బైటికి వస్తున్నారు-ముఖాలు చిన్నబుచ్చుకుని, అందరూ గేటు దగ్గర గుమిగూడారు.

"నిన్న ఇక్కడ ఒకపిల్లకు టాన్సిల్సు ఆపరేషను చేశారట. ఆపిల్లప్రాణం బల్లమీదనే పోయిందట."

"పాపం, తల్లీదండ్రీ బాగా ఏడ్చారట. పినతండ్రి డాక్టరుగారిమీద కేసు పెడతానన్నాడట."

"అందుకేనేమో-డాక్టరుగారు అందరిమీదా మండిపడుతున్నారు."

"ఆయన చెయ్యి చాలా మంచిదే. అట్లా ఎందుకు జరిగిందో?"

"పరధ్యానం."

"ఛీఛీ. ప్రజల ప్రాణాలను కాపాడాల్సిన డాక్టరికి పరధ్యాన మేమిటి?"

"పరధ్యానం కాకపోతే చికాకనుకో. మనసుకు ప్రశాంతత లేదనుకో. ఎక్కడికి పోతారు పేషంట్లు? మళ్ళీవాళ్ళే వస్తారు. ఎప్పుడూ ఇట్లాగే ఉంటుందా?"

"అయితే అందరి ప్రాణాలతో చెలగాట మాడతాడా ఏమిటి? ఇట్లాచేస్తే ఎవరొస్తారాయన దగ్గరికి? ప్రైవేటు ప్రాక్టీస్ కూడాను. బోర్డు పీకెయ్యాల్సిందే" దురుసుగా అంటున్నారు.

గంగులూ, రాములూ వెనక వరెండాలో చేరుకున్నారు. నర్సులిద్దరూ ఆపరేషన్ థియేటరు ముందు నిలబడి గుసగుసలాడు తున్నారు. డాక్టరుగారి అసిస్టెంటు డాక్టర్ శ్రీరామ్ చేతులు కడుక్కుని తువ్వాలతో తుడుచుకుంటూ తన గదిలోకి వెళ్ళాడు.

రామప్రసాద్ మెల్లిగా లోపలికివెళ్ళి డాక్టరు గారితో మాట్లాడాలనుకుని లేవబోయాడు. అంతలో కాంపౌండరు గబగబా డాక్టరుగారి గదిలోకి వెళ్ళాడు.

డాక్టర్ అమర్‌నాథ్ ఒక చెయ్యి కళ్ళమీద పెట్టుకుని గదిలో ఒక్కడూ కూర్చున్నాడు.

"డాక్టరు గారూ"

ఉలిక్కిపడి కళ్లు తెరిచాడు.

"సర్వేశ్వరరావుగారి దగ్గరనుండి టెలిగ్రామ్ వచ్చింది."

"ఏమని ?"

"ఫ్యాక్టరీలో పనికి రిజైను చేశారట. రేపు ఉదయం. జి. టి. లో వస్తున్నారట ఇక్కడికి."

"ఆఁ ?" ఎందుకన్నట్లు కళ్ళతోనే ప్రశ్నించాడు.

"మెషీను ఫెయిలయిందట. ఇద్దరు చనిపోయారట. ఈయనదే తప్పని తేలిందట. యజమానులు రిజైను చెయ్యమని ఒత్తిడి చేశారట."

కనుబొమలు ముడిపడ్డాయి డాక్టర్ అమర్‌నాథ్‌కు.

"మెషినెందుకు ఫెయిలయింది ? ముందు చూసుకోలేదా ఇన్నాళ్ళనుంచీ పనిచేసేవాడు ?"

"పరధ్యానమా ?"

"ఇంజనీరుకు పరధ్యానమా ? కార్మికుల ప్రాణాలు అతడి చేతిలో ఉంటాయని తెలియదూ ? ఒళ్లు దగ్గరపెట్టుకుని పనిచెయ్యొద్దూ ? కర్మ కర్మ !" నొసలు కొట్టుకున్నాడు డాక్టరు.

భార్యాపిల్లలతో బావమరిది సర్వేశ్వరరావు తన యింటిమీద పడితే ఇంకేమన్నా ఉన్నదా ?

సర్లే అంటూ సర్దుకుని లేచి "గంగులూ !" పెద్దకేక పెట్టాడు.

గంగులు ఎదురుగా రాగానే "పేషంట్లు అందరూ వెళ్ళిపోయారా ? ఇంకెవరయినా ఉన్నారా ?" అడిగాడు కాస్త స్వరం తగ్గించి.

"లేరయ్యా. అంతా వెళ్ళిపోయారు."

"నేను ఇంటికి వెళ్ళుతున్నానని డాక్టరుగారితో చెప్పు" మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ కారు తలుపు తెరిచి కూర్చున్నాడు. కారు తిన్నగా హోటలు అమరావతికి దారితీసింది.

రామప్రసాదు ఇంటికి వచ్చేసరికి ఒంటిగంట దాటింది. అతడి కొడుకు కలెక్టరాఫీసులో యల్. డి. సి. గా టెంపరరీగా పనిచేస్తున్నాడు. ఏడాది నుండీ సాగుతున్నదా ఉద్యోగం. తలుపు తెరవగానే కొడుకు ఎదురుగా వచ్చాడు.

"శీనూ ! ఇవాళ ఆఫీసుకు వెళ్ళలేదురా ?" అదుర్దాగా అడిగాడు.

"వెళ్ళాను నాన్నా వెళ్ళిన అరగంటకే తిరిగి వచ్చాను" తలవంచుకున్నాడు.

"ఎందుకురా ?"

"ఊస్టింగ్ నాన్నా ఊస్టింగ్ !"

"అదేమిటి ! పర్మినెంటు చేస్తానని కిందటివారమే నాతో చెప్పాడు కలెక్టరు ! ఇంతలోనే ఏమయింది ? శ్రద్ధగా పనిచేస్తున్నావుకదా ?" నివ్వెరపోయాడు రామప్రసాద్.

"నే నొక్కడినేకాదు నాన్నా ! నాతోపాటు నలుగురికి ! ఊస్టింగ్, ఇద్దరు ఫ్యూన్లకు ట్రాన్స్ఫరు, మిగతావాళ్ళకు సస్పెన్షను. ఆయన నీకుస్నేహితుడా నాన్నా?"

"స్నేహమేకాదురా బంధుత్వముకూడా ఉన్నది. ఒక కాలేజీలో చిన్నప్పుడు చదువుకున్నాము. అందుకనే నోరు తెరిచి అడిగాను. వెంటనే నిన్ను ఉద్యోగంలో పెట్టాడు. నిన్ను వాడికి ఒప్పగించాను. కనుక క్రమంగా పైకి తీసుకువస్తానన్నాడు" ధైర్యం జారిపోతోంది రామప్రసాదుకు.

అంతలో విసురుగా వచ్చింది లోపలికి రామప్రసాదు కూతురు పారిజాతం. వస్తూనే పుస్తకాలు ఒక మూలకు గిరవాటేసింది. చెప్పులు ఒక మూలకు విసిరేసింది. విసురుగా కుర్చీ లాక్కొని కూర్చుంది.

"ఏమ్మా? తలనెప్పా? కళ్ళ డాక్టరు దగ్గరికి తీసుకువెళ్తానంటే వద్దంటావు. ఇట్లా అయితే చదువెట్లా సాగుతుంది చెప్పు? పరీక్షలు కూడా దగ్గరికి వస్తున్నాయి" అన్నాడు విసుగుదలతో.

"ఆ! పరీక్షలు రాసినట్లే ఉంది ఏం చదివామనీ - వాళ్ళేం చెప్పారనీ రాయటం? మా లెక్చెరర్‌కు తెలియంది ఏదడిగినా కోపం - విసుగు. ఇవాళ మా పద్మ ఏదో అడిగిందని "తెలివితక్కువ దద్దమ్మలు కాలేజికి వచ్చి మమ్మల్ని ఏడిపించకపోతే ఇంట్లో కూర్చోకూడదూ? హాయిగా పెళ్ళిళ్ళుచేసుకుని పిల్లల్ని కనరాదూ" అంటూ పుస్తకం గిరవాటేసింది విసురుగా ఆ అమ్మాయి ముఖమ్మీద. దానికి కంటి దెబ్బ తగిలింది. పిల్లలంతా క్లాసు బాయికాట్ చేశారు. ఇలా ఉంటే పరీక్షలేం జరుగుతాయి?" పెద్ద ఉపన్యాసం ఇచ్చింది పారిజాతం.

"హుఁ. నీ చదువిట్లా ఉంది. వాడి ఉద్యోగం అట్లా ఉంది. కానీ— ఎలాగో జరుగుతుంది. అన్నం తిని—అమ్మకు మందివ్వు. కావాలని అడిగితే కాచి ఇవ్వు" రామప్రసాద్ బైటికి వెళ్ళటానికి చెప్పులు వేసుకున్నాడు.

"నాన్నా! నేనేం చేస్తాను ఇక్కడ? ఎక్కడికయినా వెళ్ళి ఉద్యోగ ప్రయత్నం చేస్తాను" కొడుకు ఎదురుగా వచ్చాడు.

"ప్రయత్నం చేస్తానంటావా? చెయ్యి. ఏది దొరికితే దాంట్లో ముందు ప్రవేశించు. చిన్నదనీ పెద్దదనీ చూడకు. ఈ నూరు రూపాయలూ దగ్గరుంచుకో. పట్నం వెళ్ళి ఇంకా కావాలంటే రాయి - అమ్మ సంగతి చూస్తున్నావు కదా— ఉత్తరాలు రాస్తూ ఉండు. ఆల్ ది బెస్ట్ నాయనా వెళ్ళు."

రామప్రసాద్ మనసు మహా చికాకుగా ఉన్నప్పుడు ఊరికి మధ్యగా ఉన్న కాలువగట్టున కూర్చుంటాడు. అక్కడ ఒక పెద్ద చింత చెట్టొకటి ఉంది. దాని క్రింద రాయివేసుకుని కూర్చుంటాడు. అతడికి సిగరెట్ తాగే అలవాటులేదు. ఒక సన్నటి పుల్ల తీసుకుని పళ్ళు కుట్టుకుంటూ ఆలోచనలో పడతాడు. ఆలోచనలు ఎంత తీవ్రంగా సాగితే అంత తొందరగా పుల్లతో పళ్ళ సందులన్నీ కుడుతూ ఉంటారు. అక్కడ కూర్చుంటే అతడి మనసుకెంతో హాయిగా ఉంటుంది. మనసులో ఎంత బాధ ఉన్నా పక్కకునెట్టి ప్రశాంతతను అనుభవిస్తాడు.

రామప్రసాద్ భార్య పద్మావతమ్మకు కాన్సరువ్యాధి. ప్రభుత్వ వైద్యాలయంలో ఆపరేషను చేయించాడు నమ్మకంలేనికేసని అర్థం చేసుకున్నాడు. ఆమె తను ఉండగా పిల్లకు పెళ్ళిచెయ్యమని ఏడుస్తుంది. భార్యకోరిక సమంజసమైనదే. ఆయీడు పిల్లకు పెళ్ళి చేయవలసిన బాధ్యత కన్నతండ్రికున్నమాట నిజమే కాని-ఎట్లా చెయ్యటం ? డబ్బులేదు. అప్పు పుట్టదు. పెళ్ళి ఎట్లా జరుగుతుంది ?

పెళ్ళిమాటసరే—ఇల్లెట్లా గడుస్తుంది ?

తన ఉద్యోగం ఊడిపోయింది.

తన కొడుక్కు ఊస్టింగ్ అయింది.

ఏడాది క్రిందట ఇంజనీయరు సర్వేశ్వరరావు దగ్గరికి తన కొడుక్కు ఏదయినా ఉద్యోగం యిప్పించమని అడగటానికి వెళ్ళాడు. తను వెళ్ళిన సమయానికి ఆయన ఇంట్లోనే ఉన్నారు.

వీధి వరండాలో కూర్చున్నాడు ఆయనకోసం.

''మా అమ్మ మీ చదువుకెంత సహాయం చేసిందో అప్పుడే మరిచిపోయారా ? ఆమె ఆనాడు డబ్బు ఇవ్వకపోతే మీ రెక్కడుండేవారు ? మీకా కృతజ్ఞత ఏమయినా ఉన్నదీ ?''

''కృతజ్ఞత ఉంది. దాన్నెలా కనబరచమంటావో చెప్పు?''

''నన్ను మనిషిగా చూస్తున్నారా ? నాకేమయినా గౌరవమిస్తున్నారా ? ఒక సరదాలేదు—సంతోషంలేదు నాలుగొంద లిలా పారెయ్యండి మా చెల్లెలికి పురుడొచ్చిందట—వెళ్ళి చూసి రావాలి రేపే టికెటు కొనుక్కోవాలి'' మాటలు ఈటెల్లా విసురుతున్నది ఆవిడ.

''ఎప్పుడూ నీతో షికార్లు కొడుతుంటే ఉద్యోగ ముంటుందా ? పని చెయ్యకపోతే ఉద్యోగ మెవరిస్తారు ? రజనీ ! నీకు తెలియంది ఏముంది చెప్పు ?'' సర్వేశ్వరరావు ప్రాధేయ పడుతున్నాడు.

''అదంతా నాకు తెలియదు. నేను మీ ఫ్యాక్టరీలో ఉండే మెషీన్నుకాను. మనిషిని. పైగా చదువుకున్న దాన్ని. ఏ. బి. తిరగవేసిన డిగ్రీ నాది. హాయిగా

స్వతంత్రంగా ఉద్యోగం చేసుకొని బ్రతుకుతాను—ఈ సంసారంలో నీచంగా బానిసగా బ్రతికే కంటే.''

''నేనేమన్నా నని ఇంకెంత మాటలు రజనీ!''

''ఈ అతివినయానికేంలెండి. నాలుగొందలు ఇట్లా పారేస్తే ముందు మా చెల్లెలిని చూసివస్తాను.''

''వెళ్ళు. దానికేం? జీతం రానీమరీ!''

''అందాకా ఎవరాగుతారు? నేను రేపే వెళ్ళాలి.''

''సరే అంతగా కావాలంటే రేపు పొద్దున ఎక్కడినుంచయినా తెచ్చి ఇస్తాను. నీకు కావలసింది నాలుగు వందలు కదా?''

''ఆఁ హాఁ! నాపీడ నాలుగు వందలతో వదిలించుకుందామనా? నేను అక్కడినుంచి గోవాకాన్ఫరెన్సుకు వెళ్ళాలి. వెయ్యో పదిహేను వందలో చేతిలో ఉండాలి.''

''రజనీ. నా దగ్గర డబ్బెంత ఉందో నీకు తెలియదూ? నీకే ఇస్తున్నా జీతం రాగానే. నేనేమయినా దాచుకుంటున్నానా?''

''అదే మీ దగ్గరున్నది! నలుగురిలో నన్ను చిన్న బుచ్చటమంటే మీకు సరదా ఇప్పుడు వెళ్ళకపోతే మా చెల్లెలు ఏమనుకుంటుంది? తనకు కొడుకు పుట్టటం నాకిష్టం లేదనుకుంటుంది. నేను కాన్ఫరెన్సుకు వెళ్ళకపోతే. మా మెంబర్లంతా ఏమనుకుంటారు. ఇంత మాత్రం స్వాతంత్ర్యం ఇంట్లో లేని కార్యదర్శి స్త్రీల హక్కులను గురించి తీర్మానాలు ఏం ప్రవేశపెడుతుందని నవ్వుతారు. ఛీ ఛీ. ఈ ఇల్లు ఒక నరకంలా తయారయింది నాకు.''

''అడిగినప్పుడల్లా చిల్లర ఖర్చులకూ క్లబ్బులకూ వందలు ఇస్తుంటే నీకు స్వాతంత్ర్యం ఉన్నట్లా? లేకపోతే లేనట్లా? అయితే బీద వాళ్ళగతి ఏమిటి? ఇవేనా హక్కులంటే? ఈ ఇల్లు నీకే కాదు నరకం-నాకు. నాకు ఇంటికి రావాలంటేనే భయంగా ఉంది. ఈ నరకంలో పుట్టిన పిల్లలు రౌరవాది నరకాన్ని అనుభవిస్తున్నారు. ఈ ఇంట్లో నేనొక్క క్షణం ఉండలేను'' చెప్పులు వేసుకుని విసురుగా బైటికి వెళ్ళిపోయాడు సర్వేశ్వరరావు.

ఇంట్లో ఏవో వస్తువులు విసిరిపారేసిన చప్పుడు.

రామప్రసాదు ముందునుంచే వెళ్ళాడు సర్వేశ్వరరావు కాని ఆ విసురులో అతడు చూడలేదు. అతడు బరువుగా నిట్టూర్చి కూర్చున్న చోటినుంచి కండువా దులుపుకుని లేచాడు.

ఆయనకే మనస్తిమితం లేకపోతే తనకొడుక్కేమి సహాయం చేస్తాడు? నోరు తెరిచి అడిగితే తన కూ్కడా నాలుగు చివాట్లు తగుల్తాయి.

డాక్టర్ అమర్‌నాధ్ దర్శనము కోసం పదిరోజులనుంచీ తిరుగుతున్నాడు. ఆయనా తనకు స్నేహితుడే. ఆయనకూ కలెక్టరుకూ ఒకటే ప్రాణము. పైగా క్లబ్బు స్నేహము. డాక్టరుగారి చేత కూడా కలెక్టరుకు చెప్పిస్తే త్వరగా తన కొడుక్కు ఉద్యోగం పర్మినెంటు చేస్తాడన్న ఆశ. ఎప్పుడు వెళ్ళినా ఇంట్లోగాని—కన్సల్టింగ్ హోములో గాని ఆయనతో మాట్లాడే సందర్భమే కనబడటంలేదు.

ఏమిటో ఎప్పుడూ చికాకుగా ఉంటాడు.

ఏమయినా సరే—డాక్టరుగారు వచ్చేవరకూ కనిపెట్టుకుని ఉండి మాట్లాడితే గాని ఇంటికి వెళ్ళకూడదని ఆనాడు వాకిటి వరెండాలో పట్టుదలతో కూర్చున్నాడు రామ ప్రసాదు.

ఆరుగురు పిల్లలు. పెద్ద పిల్లవాడికి పదేళ్ళుంటాయేమో ఆఖరి పిల్లకు ఆరు నెలలు. వీళ్ళంతా ఇంట్లో నానా అల్లరి ఏడుపూను. పనిమనిషి వీళ్ళందరినీ సర్దలేక అదిలించి అరుస్తోంది. పసిపిల్లను రెక్కపట్టుకుని తీసుకునివెళ్ళి ఉయ్యాలలో పడేసింది. వంటమనిషి ఒక్కొక్కళ్ళనే వంటయింట్లోకి లాక్కెళ్ళి తినకపోతే చెంప దెబ్బ వేస్తానంటున్నాడు.

రామప్రసాదుకు లోపల జరిగేదంతా కనబడుతునే ఉన్నది. ఇంతహంగామా జరుగుతుంటే పిల్లల తల్లి ఏమయింది? గొప్పవాళ్ళ పిల్లలు నౌకర్లమీద ఇలాగే పెరుగుతారా? నిర్విణ్ణుడై పోతున్నాడు రామప్రసాదు.

ఆ సమయంలో అలసిపోయిన దేహాన్ని ఈడ్చుకుంటూ బ్యాగ్ ఊపుకుంటూ పైటకొంగు చీరెను సర్దుకుంటూ లోపలికి వచ్చింది ఒక యువతి.

ఆమె లోపలికి అడుగుపెడుతుండగానే పిల్లలంతా ఆమె చుట్టూ మూగారు. నౌకర్ల మీద చాడీలు చెప్పటం మొదలుపెట్టారు.

"ఛీ అవతలికి పోండి. ఇంటికి వస్తే బతకనివ్వరు. నా ప్రాణం పోతోంది. కాలేజీలో అరిచి అరిచి ఇంటికి వస్తే కాఫీనీళ్ళయినా తాగనివ్వరు ఈ పిల్లలు. ఆయనగారు నర్సింగ్‌హోమునుంచి క్లబ్బులకు వెళ్ళకపోతే ఇంటికివచ్చి పిల్లలను చూడకూడదూ? అబ్బా, ఇల్లొక నరకం రామయ్యా కప్పు తీసుకురా ముందు" ఆమె సోలిపోతూ కుర్చీలో కూలబడిపోయింది.

రామప్రసాదు లేవలేక లేవలేక లేచాడు. అప్పటికి ఆరుగంటలు కావచ్చింది. డాక్టరు అంతవరకూ ఇంటికి రాలేదంటే ఇంకెక్కడికో వెళ్ళిఉంటాడు.

కాళ్ళీడ్చుకుంటూ బయటికి వచ్చాడు.

"ఏమండీ పిల్లలకు సంబంధం చూడటానికి వెళ్ళేరా?" కనబడగానే భార్య అడిగింది.

"చూడు పద్మా నీవు చెప్తూనే ఉన్నావు. ఆమాట నేనేం మరిచిపోలేదు. అమావాస్య వెళ్ళిన తరువాత మీ తమ్ముడు చెప్పిన సంబంధం చూసి వస్తాను. నీవు ఈ లోపల ఆరోగ్యం బాగుచేసుకుంటావా? ఇలా ఉంటే పిల్లకు పెళ్ళెట్లా చేస్తావు? లేచి తిరగవద్దూ?" ఆమె మంచమ్మీద కూర్చుని శుష్కించి పోయిన చెంపలను చేతో నిమిరాడు. ఎక్కడో లోతుగా మిణుకు మిణుకుమనే ఆమె గాజు కళ్లల్లోకి ఆప్యాయంగా చూశాడు.

కాంతివిహీనమయిన ఆమె చూపులలో తన చూపులను కలపలేక తల పక్కకు తిప్పుకున్నాడు.

"అయితే నిజంగా అమ్మాయికి సంబంధం చూస్తున్నారన్నమాటే" ఆమె ముఖంలో హాస్యరేఖ పొడచూపింది.

రామప్రసాదుకు కన్నీరుబికింది. కాని ప్రయత్నం మీద కన్నీరు జారకుండా రెప్పలతో అదిమిపెట్టాడు.

"అమ్మాయికి పెళ్ళిచేస్తే అత్తవారింటికి వెళ్ళిపోతుంది కదండీ" వినీ వినబడకుండా అంటున్నది పద్మ. సని విచారంగా.

"అవును. వెళ్ళదూ మరి? నీవు వచ్చినట్లే అదీ వెళ్ళుతుంది" నవ్వటానికి ప్రయత్నించాడు రామప్రసాదు.

"నేను వచ్చినమాట నిజమే. కాని అది వెళ్ళితే నాకు బెంగగా ఉంటుంది. దాన్ని వదిలి మనము ఉండగలమా?" ఆమె ముఖంలో అప్పుడే విచారం తొంగి చూపింది.

"పోనీ పెళ్ళిచేయకుండా ఇంట్లో ఉంచుకుందామా?"

"ఊఁ హూఁ! అలా వీలులేదు. పెళ్ళి చెయ్యాల్సిందే"

"సరే-చేద్దాము. మరి వెళ్ళిపోయిందని బెంగపెట్టుకోవు కదా?"

"బెంగపెట్టుకోనా?" నవ్వింది. ఆ నవ్వు ఎంతో భయంకరంగా కనబడ్డది రామప్రసాదుకు.

ఆమె నిద్రలోకి జారుకున్న తరువాత ఏమీ తోచక వీథివాకిట్లో కూర్చున్నాడు.

రామప్రసాదు బి. ఏ. ఆనర్సు. ఆంగ్లభాషలో అఖండమైన ప్రజ్ఞాపాటవాలు కలవాడు. ఆంధ్రాంగ్లభాషలలో చక్కటి శైలిలో వ్రాయగలడు. అతడి రాతలు చదవటానికి చాలామంది పత్రికలు కొంటారు. పాఠకులకు ఆయన రాసింది ప్రమాణము. ఉపన్యాసకులకూ విద్యార్థులకూ ఆయనరాతలు ఉదాహరణలు. రాజకీయాలు, విద్యావిషయాలు, సాంస్కృతికాలు. చారిత్రికాలు-ఒకటేమిటి సమస్త విషయాలలోనూ పుక్కిటబట్టినట్టు రాస్తాడని ప్రతీతి.

నిశితమైన మేధస్సు.

ఆలోచనలో స్పష్టత.

విషయవైశద్యము.

తులనాత్మకమైన తీర్పు.

సూటిగా తెలియచెప్పటం.

పదాలను సొగసుగా పొదుపుగా వాడటం.

మాటల్లో శక్తీ యుక్తీ.

ఇలా ఉంటుందని చెప్పలేనంత చక్కగా ఆకర్షణీయంగా ఉంటాయాయన రచనలు. పాఠకులు ఆయన రచనలకు ఎంత అలవాటుపడిపోయా రంటే- అవి చదివిన తర్వాతనే అన్నపానాదులు! లేకపోతే ప్రాణవాయువు లోపించినట్టుగా దిగాలుపడిపోతారు

ఆయన రచనలకు బలమిచ్చేది ఏమిటి?

ఏశక్తి ప్రేరణవల్ల అటువంటి రచనలు చేయగలుగుతున్నాడు?

ఇది పాఠకుల విస్మయము.

అవిచ్ఛిన్నంగా కొన్ని సంవత్సరాలపాటు పాఠకులను ఉర్రూతలూగించిన ఆ రచయిత రచనలు అకస్మాత్తుగా పత్రికలలో ప్రచురింపబడలేదు

పత్రికా కార్యాలయానికి అసంఖ్యాకంగా ఉత్తరాలు.

ఏడీ రామప్రసాదు? ఏమయ్యాడు? ఆయనకేమి ఇబ్బంది వచ్చింది? ఎందుకు వ్రాయటం లేదు?

పాఠకులు గగ్గోలెత్తిపోతున్నారు.

రామప్రసాదు వల్లనే తన పత్రిక నిలవద్రొక్కుకుంటోందని పాఠకులు అనుకోవటం పత్రికాధిపతులు సహించలేకపోయారు. దాని పర్యవసానంగా రామప్రసాదును అసిస్టెంటు ఎడిటర్‌గా ఉన్నవాడిని ఒక పత్రిక తొలగించింది. మరొక పత్రిక ఆయన రచనలు కలంపేరుతో రాసినవాటిని ప్రచురించటం మానేసింది.

రామప్రసాదు మనసంతగా బాధపడలేదు. ఇదొక్కటే కాదుగదా ఆతడి బాధ! ఇంటి వాతావరణం ఎటువైపు చూసినా గుండె పగిలేటట్టుగా ఉన్నది.

పారిజాతం ఇంటికివచ్చి నాలుగురోజు లయింది. దేనికని బాధపడతాడు!

విరామంగా పద్మాసని దగ్గర కూర్చుని కబుర్లు చెప్పి ఆమెను నవ్విస్తూ ఉత్సాహపరుస్తూ పాలు, పండ్లరసం తాగించేవాడు. పిల్లలను గురించి ఆశాజనకంగా మాట్లాడేవాడు. ఊహలతో మేడలుకట్టి ఆమెను ఎక్కించేవాడు.

అప్పుడప్పుడు పెట్టెలో ఉన్న పర్సుమీదికి దృష్టిపోయేది. అది త్వరలోనే ఖాళీ అయిపోతుంది.

తరువాతేం చెయ్యాలి?

దారీ తెన్నూ తోచదు.

క్రమంగా పద్మాసనిలో సత్తువ తగ్గిపోతూంది.

రామప్రసాదు డాక్టరు చెప్పిన గడువును లెక్కిస్తున్నాడు.

గుండె బరువెక్కుతూంది.

అతడి కంటి ఎదుట ఒకటే ఆశాజ్యోతి. తన రచనలు ఏనాటికయినా ఏ పత్రికయినా ప్రచురింపకపోతుందా? అందుకని తను రచనలు చెయ్యాలి.

రామప్రసాదు కిప్పుడు మనశ్శాంతి కోసం కాలవగట్టుమీద పెద్దచెట్టు కింద ఉన్న రాతిమీద కూర్చోటానికి వీలులేదు. పద్మాసనిలోని జ్యోతి ఏ క్షణాన్నయినా కొండెక్కవచ్చు. ఆమె ననునయించాలి. ఆశ్వాసించాలి. తన జీవితభాగస్వామిని.... ఆమె లేకపోతే తన బ్రతుకు ఒంటరి బ్రతుకు. మోడు లాంటి జీవితమయిపోతుంది. పద్మాసని నిద్రపోయిన సమయంలో పెరటిగుమ్మానికి ఆనుకుని బట్టలుదికే బండ మీద కూర్చుని రామప్రసాదు మళ్ళీ రచనలు చేయటం మొదలుపెట్టాడు.

అవి మండుటెండలో శీతలచందనం వంటి రచనలు

ఆకలితో నకనకలాడే కడుపుకు అమృతోపమానమైన రచనలు.

కారే ప్రతి కన్నీటిబొట్టును తుడిచివేయ కలిగిన రచనలు.

ఆక్రోశించే మనసును ఆశ్వాసించే రచనలు.

ఆక్రందనచేసే గుండెకు అభయమిచ్చే రచనలు___

జలప్రళయంలో జగత్తంతా మునిగిపోయిన తరువాత అలుముకునే ప్రశాంతత నిచ్చే రచనలు.

రమణీయమైన పదాలను ఏరికూర్చి చక్కటిశైలిలో రచనలు సాగిస్తున్నాడు రామప్రసాదు. ఆ మండే హృదయంనుంచి పొంగిపొరలుతున్న ఆవేదనను సిరాగా చేసుకుని దానిలో తన కలం ముంచి తేనెసోనలు కురిపిస్తూ రచనలు చేస్తున్నాడు అతడు చీకటి రాత్రిలో చివరి అంచుకు చేరుకుని.

(ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక)



# కడసారివాడు

రాజు గబగబా నడుస్తున్నాడు సిమెంటు రోడ్డుమీద. పన్నెండేళ్ళయినా నిండాలేని రాజు బుగ్గలమీద కన్నీరు చిందించుతోంది. మధ్యమధ్య చొక్కాతో తుడుచుకుంటున్నాడు. జారిపోతున్న చేతిసంచీని బుజమ్మీదికి లాక్కుంటున్నాడు. పొద్దుటినుంచీ అన్నంలేని కడుపు లోపలికి పోయింది. కళ్లు చీకట్లు కమ్ముతున్నాయి. అడుగులు తడబడటం మొదలు పెట్టాయి. ఒకచోట ఆగి పుట్‌పాత్ మీద సంచీ ఒళ్ళో పెట్టుకొని కూర్చున్నాడు.

ఆ ఉదయం జరిగిన సంఘటన జ్ఞాపకం వచ్చినప్పుడల్లా దుఃఖం పొంగుకుంటూ వస్తోంది. వెక్కిళ్ళు కూడా వస్తున్నాయి.

స్నేహితులు బలవంతం చేస్తే గతరాత్రి వాళ్ళతోకూడా సినిమాకు వెళ్లాడు. ఆఖరి తరగతి టిక్కెట్టు పదణాలు. ఆ పదణాలు మాత్రం తన కెక్కడివి ? మురళి. శ్రీనివాస్, కాంతం, రమణ - అంతా తలా ఒక రూపాయి తెచ్చుకున్నారు. వాళ్ళ లెఖ్ఖలో కూల్‌డ్రింక్సు కూడా ఉన్నాయి. వాళ్లు సినిమా ప్రోగ్రామ్ వేసినప్పుడు తను కూడా వాళ్ళతో సరదాగా సంతోషంగా వెళ్లాలనిపించింది. కాని డబ్బు ఎట్లా అన్న ప్రశ్న వచ్చినప్పుడు, తనదగ్గర లేదని వెళ్ళకపోతే ఏం బాగుంటుంది ? తనకెంతో చిన్నతనంగా ఉంటుంది. స్కూలు ఫీజుకోసం తప్ప తనకొక్క చిన్న పైసా అయినా ఎవరూ ఇవ్వరు. ఎట్లా ? సినిమా చూడాలనిపిస్తోంది. మార్గమేమిటి ?

"రాత్రి ఎక్కడికి వెళ్ళావురా ?" అన్నయ్య కేక సింహగర్జనలా వినిపించింది.

రాజుకు కాళ్లు గజగజ వణికాయి.

"నా ముందుకు వచ్చి జవాబు చెప్పు" ఇంటిపెంకులెగిరి పోయేటట్టు కేక పెట్టాడు.

"నాస్నేహితులు బలవంతంచేసి సినిమాకుతీసుకువెళ్ళారు."అన్నాడు రాజు.

"నీకు డబ్బెక్కడిదిరా ?"

రాజు కళ్ళునలుచుకుంటూ నిలబడిపోయాడు.

"చెప్పు ? డబ్బెక్కడిది ? చెప్పవేం ?" రాజు చెంప చెళ్లు మన్నది.

రాజు 'అమ్మా' అంటూ కేకెపెట్టి చెంప రుద్దుకోవడం మొదలుపెట్టాడు.

"నిన్న ఫీజు కట్టావా ?" గర్జించాడు అన్నయ్య.

"లేదు" బెదిరిపోతూ జవాబిచ్చాడు.

"ఫీజు కట్టమని డబ్బిస్తే సినిమాలకు తగలేస్తున్నావా ? నీ తిండి గుడ్డా కాకుండా సినిమాలకు కూడా ఎక్కడినుంచితేను" రేపటినుంచి చదువు మానేసి ఎవరి ఇంట్లోనయినా నౌకరుగా కుదురు" ఎడాపెడా చెంపలు వాయించి అన్నయ్య అవతలికి వెళ్ళిపోయాడు.

నాన్న వాకిటి అరుగుమీద కూర్చుని చూస్తున్నాడు. అమ్మ వంటింటి గుమ్మంలో నిలబడి కొంగుతో కళ్లు ఒత్తుకుంటోంది.

రాజుకు రోషం ఉవ్వెత్తున పైకి లేచింది.

వెధవ పదణాలకోసం అన్నయ్య అట్లా మాట్లాడతాడా ?

రాజు లేత హృదయంలో అనేక ఆలోచనలు తామర తంపరలా చుట్టుకు పోవటం మొదలు పెట్టాయి.

అన్నయ్యకు సినిమాలు చూడాలని ఉండదూ ? చిన్నప్పుడు అన్నయ్యను స్నేహితులు సినిమాకు రమ్మని పిలవలేదూ ? అమ్మ అప్పుడప్పుడు చెబుతూ ఉంటుంది. అన్నయ్య మొట్టమొదట పుట్టిన బిడ్డ అని తాతయ్యా బామ్మా అందరూ బాగా గారాబం చేసేవారట. వెండి గిన్నెలో అన్నం కలుపుకుని అన్నయ్యను ఎత్తుకుని దొడ్డి అంతా ఎత్తుకు తిప్పుతూ బామ్మ అన్నం పెట్టేదట. అన్నయ్య ఏది కావాలంటే అది అప్పటికప్పుడు ఇచ్చేవాడట తాతయ్య.

ఒకరోజు రాజు తల్లిని అడిగాడు. "అమ్మా. అన్నయ్యకు చిన్నప్పుడు చేతులకు మురుగులూ, మొలకు బంగారుతాడు, మెడలో పులిగోళ్ళ గొలుసూ ఉండేవన్నావు కదా ! మరి నాకు లేవా ?"

''పిచ్చినాయనా'' అంటూ తల్లి అతడి తలను గుండెకానించుకుంది. ''మొట్టమొదట పుట్టాడని అందరూ గారాబం చేశారు. తాతా బామ్మా చేయించార్రా వాడికి'' అంది.

''అయితే తరువాత పుట్టినవాళ్ళను గారాబం చెయ్యరా ?'' కళ్ళల్లో నీటి పొర తేలియాడింది రాజుకు.

''ఆ గారాబం అంతా వాడితోనే చెల్లు.''

''అయితే అక్కయ్యలనయినా గారాబం చెయ్యలేదా ?'' రోషంతో అడిగాడు రాజు.

''ఆ రోజులు వేరురా. నాన్న బాగా సంపాదించేవారు. వాళ్ళకేది కావాలంటే అది కొనిచ్చేవారు.''

''అడిగినప్పుడల్లా డబ్బు కూడా ఇస్తూ ఉండేవారా ?'' రాజు మనసులో అనేక ఆలోచనలు సుడిగుండాలయిపోతున్నాయి.

''ఆ రోజుల్లో డబ్బు చేతినిండా ఉండేది. చేతిలో డబ్బు ఉంటే పిల్లలడిగితే ఇవ్వరూ ?'' అన్నది అతడి తలవెంట్రుకలు నిమురుతూ.

''అయితే నాకేనన్నమాట మీరు ఇవ్వనిది ? అంతేనా అమ్మా?'' కన్నీళ్లు తుడుచుకుంటూ అన్నాడు.

''నా దురదృష్టంరా ఇదంతా.'' ఆమెకు కన్నీళ్ళు వచ్చాయి.

''పోనీ అమ్మా! చిన్నప్పుడు అన్నయ్యకు పెట్టినట్టుగా నాక్కూడా నగలు పెట్టారా? అవన్నీ ఏమయ్యాయి? అవయినా నా కివ్వరాదూ?'' అన్నాడు ఆశతో.

''పిచ్చితండ్రీ. నీవు పుట్టేటప్పటికి నలుగురక్కలకు పెళ్ళిళ్లుచేస్తే నీవరకూ నగలు వచ్చాయిట్రా?'' అన్నది భూమిలోకి చూస్తూ.

''అయితే అమ్మా. నాకొక్కడికే నీవు నగలు పెట్టలేదు. నన్నెవరూ గారాబం చెయ్యలేదు కదూ?'' రాజుకు దుఃఖం ముంచుకు వచ్చింది. బావురుమని ఏడ్చేశాడు.

''నాయనా రాజూ'' అంటూ అతడిని కౌగిలించుకొని తన చేతకావి తనానికి కుమిలి కుమిలి ఏడ్చింది కాంతమ్మ.

రాజు మనసులో మధన ప్రారంభమయింది. ఇంతగా తనను కౌగిలించుకుని ఏడుస్తున్న తల్లి కూడా చెయ్యిచాపి అడిగినప్పుడయినా ఒక అణా ఇవ్వలేదు. డబ్బివ్వకపోయిన తరువాత అది ప్రేమ అవుతుందా? నాయనా నాయనా అంటూ నాన్న నోటితో అనటమే కాని ఒక్కనాడయినా గారాబం చేశారా? ఛీఛీ. వీళ్ళెవరికి నేనంటే యిష్టంలేదు. వీళ్ళ దగ్గర ఎందుకు ఉండాలి? రాజుకు యింటి సంగతులు తలుచుకున్నకొద్దీ అసహ్యం కలగటం మొదలుపెట్టింది.

రాజు పుట్‌పాత్ మీదినుంచి మెల్లగాలేచి ఆ సమీపంలో ఉన్న పంపు దగ్గరి కెళ్ళి ముఖం కడుక్కొని కడుపునిండా నీళ్ళు తాగాడు. ఎంతో సత్తువ వచ్చినట్లు నిపించింది. లేచి నాలుగు బజార్లు తిరిగి ఒక హోటలు ముందు ఆగాడు. వచ్చే వారినీ పోయేవారినీ చూస్తూ నిలబడ్డాడు. కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ అందరూ లోపలికి వెళ్ళుతున్నారు.

మెల్లగా కౌంటర్ దగ్గరగా జరిగాడు రాజు. "ఏం కావాలి?" అన్నాడు మేనేజరు.

పెదవులు విప్పి మాట్లాడాలంటే కన్నీళ్ళు వస్తాయి రాజుకు. బలవంతంగా దుఃఖాన్ని అణుచుకొని, ''మీతో మాట్లాడాలి'' అన్నాడు.

"నాతోనా?" ఆశ్చర్యంగా అతనిని పైనుంచి కిందికి అదొకమాదిరిగ చూశాడు మేనేజరు. రాజును చూడగానే అతడిని పలకరించాలనీ ఆ పసిబుగ్గలు ఒకసారి నిమిరాలనీ మనసు ఉరుకులు పెట్టింది.

"నాకు మీదగ్గర పని చెయ్యాలని ఉంది. అన్నం పెడతారా?" ఆపుకోలేక బిగ్గరగా ఏడ్చాడు.

మేనేజరు సహజంగా కఠినుడు. ఎవరిదగ్గర్నించీ పని తీసుకోనిది ఏమీ ఇవ్వడు. కాని రాజును చూడగానే ఆతడి మనస్సు అదొక విధంగా మారటం మొదలుపెట్టింది. పైకి మాట కఠినంగా ఉన్నా మనసు మైనం-రవంత వేడికి కరిగి పోతుంది.

"కప్పుల్లు పళ్లేలు కడుగుతావా? పగలగొడితే నీవీపు చిట్లుతుంది జాగ్రత్త" అన్నాడు గంభీరంగా.

"పరేనండి. జాగ్రత్తగా ఉంటానండీ" రాజు ఎర్రబడ్డ కళ్లతో మేనేజరు వంకే చూస్తున్నాడు.

"రేపు చూద్దాంలే" తన పనిలో మునిగిపోయాడు మేనేజరు.

రాజు యింకా అలాగే నిలబడ్డాడు తలవంచుకుని.

"చెప్పానుగా రేపు చూద్దామని?" కొంచెం కఠినంగా అన్నాడు మేనేజరు చీటీలు లెక్కచూసుకుంటూ.

"కాదండీ ఆకలి మండిపోతోంది. ఇప్పుడే ఏదన్నా పనిచెప్పి నాకు తిన టానికి ఇంత పెట్టండి" చేత్తో కళ్ళు రుద్దుకున్నాడు రాజు.

ఓహో అన్నట్టు చూసి తమ్ముడిని పిలిచి రాజును లోపలకు తీసుకువెళ్ళ మన్నాడు. రాజు బల్లముందు కూర్చుని సందేహిస్తూ సందేహిస్తూ కడుపునిండా తిని నౌకర్లు పడుకునే వరండాలో పడుకున్నాడు. తిరిగి తిరిగి ఉన్న రాజు దేహం అలిసిపోయింది. ఏడ్చి ఏడ్చి ఉన్న రాజు కళ్ళు మూతలుపడ్డాయి.

* * * *

రాజు తల్లి కాంతమ్మ ఆదుర్దాతో ఇంట్లోకి వాకిట్లోకి తిరుగుతున్నది. ఆమెకు ఆరోజు అన్నం తినబుద్ది కాలేదు. పెద్దకొడుకు రాజును చెంపమీద కొట్టినప్పుడే ఆమె గుండె మీద సుత్తిదెబ్బలు పడినట్లుగా బాధతో మెలికలు తిరిగిపోయింది. కళ్ళనుంచి పటపట కాన్నీళ్ళు కారాయి. ఆమెకు హృదయం ఉన్నది. కాని నోరు లేదు. తన కడుపులో ఉన్న బాధను వ్యక్తంచెయ్యటానికి భయం, బాధకొద్దీ కుమిలి పోతున్నది

వెంకట్రామయ్య పైకి ఎంత గంభీరంగా కనబడ్డా పితృహృదయం రాజు కోసం అలమటించిపోవటం మొదలుపెట్టింది. రాజును పెద్దకొడుకు దండిస్తున్న ప్పుడు చూడలేక వాకిట్లోకి వెళ్ళి ముఖం పక్కకు తిప్పుకున్నాడు. ఆయన నోరు తెరచి ఏదన్నా అంటే పెద్దకొడుకు సహించడు. "ఇంత మందిని భరిస్తున్నది చాలక పైగా మాటలుకూడానా?" అని అంటాడని భయం. నిజానికి అతడు వెళ్ళి పొమ్మంటే ఎక్కడికి వెళ్ళగలడు. తావేది? ఆడపిల్లలు వాళ్ళ కాపరాలు వాళ్ల చేసు

కుంటున్నారు. కాని ఇంతమందిని భరించలేరు. కష్టం సుఖం మనసార చెప్పుకుందా మంటే కాంతమ్మ ముందే బెంబేలు పడిపోయింది. అయన తన బాధలు ఎవరితోనూ చెప్పుకోలేక కడుపులో ఉంచుకోలేక వాకిటి అరుగుమీద దిగాలుపడి కూర్చుని పోయాడు.

మధ్యాహ్నం పన్నెండు గంటలు దాటింది. రెండు-మూడు-నాలుగు గంటలు అవిరామంగా గడియారం ముళ్లు తిరుగుతున్నాయి.

సాయంత్ర మయింది.

రాజు జాడ లేదు.

ఏడు గంటలవేళ పెద్దకొడుకు వచ్చాడు.

''ఏం? ఇలా అరుగుమీద కూర్చున్నావు ఎన్నడు లేనిది?'' అన్నాడుతండ్రిని చూస్తూ.

తండ్రి మాట్లాడకపోవటం చూసి ''ఎవరికయినా పెడితే బాగానే ఉంటుంది. ఒక్కమాటంటే తప్పు. ప్రొద్దున రాజును బెదిరించినందుకే ఇంట్లో అమ్మా వాకిట్లో నీవు సత్యాగ్రహం చేస్తున్నారు. లోకం ఇట్లాగే ఉంటుంది'' విసురుగా లోపలికి వెళ్ళాడు.

ఆరాత్రికీ——మరునాడూ కూడా రాజు జాడలేదు.

వెంక్రటామయ్య కాళ్ళీడ్చుకుంటూ దినపత్రిక కార్యాలయానికి వెళ్ళి ఒక ప్రకటన చేశాడు.

''నాయనా రాజా, కోపం వచ్చి ఇంట్లోనుంచి వెళ్ళిపోయావా? నీవు వెళ్ళి నప్పటి నుంచి మాకు అన్నం నీళ్లూ లేవు. రాజా! నీవు మాకళ్ళ వెలుగువి. నిన్ను చూడకపోతే మాప్రాణాలు నిలిచేటట్టులేదు. ఇంటికిరా బాబూ కన్నీళ్ళు కారుస్తూ వాకిట్లో నిలబడి నీకోసం ఎదురుచూస్తున్నాం.

నిన్ను కన్న తల్లి దండ్రులు

వెంకట్రామయ్య,

కాంతమ్మ''

రాజు ఫోటోతో కూడా ప్రకటన మేనేజరు చూశాడు. ఫోటోలో బాగాచూసి రాజును పిలిచి "ఇలాంటి దేదో ఉందని అనుమానపడుతూనే ఉన్నా. వెళ్లు. తల్లి దండ్రులకు చెప్పకుండా వచ్చావా? పాపం బాధపడుతున్నారు" అన్నాడు.

ప్రకటన చూసి పత్రికను మడతచేసి మేనేజరు చేతికిచ్చేశాడు రాజు.

"చూసి కూడా అలా నిలబడిపోయావేం? వెళ్ళు. చేసినంతవరకు డబ్బి స్తాగా" అన్నాడు.

రాజు మాట్లాడకుండా నిలబడిపోయాడు.

"నీ కిష్టం లేదా ఇంటికి వెళ్ళటం? పోన్లే. తరువాత ఆలోచిద్దాం. వెళ్ళి పని చూసుకో"

రాజు మాట్లాడకుండా లోపలికి వెళ్ళి కాఫీ టిఫిన్లు వచ్చినవాళ్ళకు అందిస్తూ ఆలోచించుకుంటున్నాడు. ఇంటికి వెళ్ళాలని మనసులో ఉంది. వెళ్ళి తల్లి గుండెలో తలదాచుకోవాలని తపనగా ఉంది. కాని-అన్న యింటికి వెళ్ళాలంటే ఒక విధ మయిన విరక్తి ఆ పసిహృదయంలో చోటు చేసుకొని వెనక్కులాగటం మొదలు పెట్టింది. ఇంటికి వెళ్ళటానికి బుద్ధి మొరాయించింది.

కాఫీ టిఫిన్ తెచ్చి బల్లమీద పెట్టి తలఎత్తి చూశాడు. మేనేజరు తనవంకే చూస్తున్నాడు.

"రాజూ. ఇట్రా" చేత్తో దగ్గరికి రమ్మని సైగ చేశాడు.

ఎందుకు పిలిచారు అని అడిగినట్టుగా రాజు వెళ్ళి నిలబడ్డాడు.

"ఇంటికి వెళ్ళవూ? మీ నాన్నా అమ్మా దిగులుపడి ఉంటారు. వెళ్ళు. కావా లంటే మళ్ళీ రావచ్చు" అతడి కళ్ళలోకి చూస్తూ అన్నాడు.

"వద్దు లెండి. నాకిదే బాగుంది" అక్కడే నిలబడ్డాడు.

"సరేలే. వెళ్ళి పనిచూసుకో. ఇంటికి వెళ్ళటం సంగతి బాగా ఆలోచించు కోమని చెప్పానుగా?" అన్నాడు.

"అది కాదండి. నాకు చదువుకోవాలని ఉందండి" తడబడుతూ అన్నాడు రాజు.

"అయితే పని ఎలా చేస్తావు?" అర్థం కానట్టు చూశాడు.

"పగలంతా పనిచేస్తానండి నైట్ స్కూల్లో చదువుకుంటూను. ఫీజు పుస్తకాలు... ...." నసిగాడు రాజు.

"అంతగా చదువుకోవాలనుకుంటే ఏర్పాటు చేస్తాలే. ఫీజు సంగతేగా— చూద్దాంలే". బీద విద్యార్థికి విద్యాదానం చేసినట్టవుతుందన్నట్టుగా తల ఆడించాడు మేనేజరు.

మరునాడు రాజు అరమైలు దూరంలో ఉన్న స్కూల్లో చేరటానికి వెళ్ళి చూసివచ్చాడు. అంతకుముందు చదువుకుంటున్న స్కూలునుంచి టి. సి. తీసుకు వెళ్ళాడు. కొత్తస్కూలు-కొత్త స్నేహితులు కొత్త వాతావరణం. పాత సంగతులు మనసులోనుంచి తరిమివేయాలని ప్రయత్నాలు చెయ్యటం మొదలుపెట్టాడు.

ప్రకటనకు జవాబు లేకపోవటంచేత రాజు తండ్రి మరొక ప్రకటన చేయిం చాడు పత్రికలో.

"నాయనా రాజూ, ఇంటికి రావూ? ఇంట్లో ఉండటం ఇష్టంలేకపోతే ఒక్క సారి వచ్చి కనపడి వెళ్లు. అమ్మ మంచం పట్టింది. కడసారిగా ఈ ముసలివాళ్లకు ఒక్కసారి కనుపించు.మమ్మల్ని శిక్షించకు బాబూ, ఒక్కసారి కంటికికనుపించు

నీకోసం రాత్రింబగళ్లు
అలమటించే తల్లిదండ్రులు"

ప్రకటన చేశాడు గాని వెంకట్రామయ్యకు ఆశలేదు. రాజు అభి మానంకొద్దీ ఆత్మహత్య చేసుకున్నాడేమో? తను తండ్రి అయి ఉండి ఏమీ చెయ్య లేక పోయాడు. నలభయి రూపాయల పెన్షన్‌తో కడసారివాడిని తీసుకుని భార్యతో వచ్చి పెద్దకొడుకు దగ్గర ఉంటున్నాడు. కూతుళ్ళ పెళ్ళిళ్ళకు ఉన్న నాలుగెకరాలు అమ్మాడు. పెద్దకొడుకు జబ్బుపడితే ఊళ్ళో ఉన్న చిన్న పెంకుటింటిని వెయ్యి రూపాయలకు తాకట్టుపెట్టి నాలుగేళ్ళయింది. వడ్డీ అయినా చెల్లించలేదు కొడుకును అడగటానికి నోరురాక మౌనం వహించాడు. రెండో కొడుకు మెట్రిక్ ప్యాసు కావటంతో మిలిట్రీలో చేరిపోయాడు. అతడు పంపే పాతిక రూపాయలు త

పెన్షను రాగానే కొడుకు తీసుకుంటాడు. తన చేతిలో పదిరూపాయలు ఉంచుకోవాలని ఎప్పుడూ అనుకోలేదు. ఆయన అనుకోకముందే కొడుకు ''నాన్నా అన్నిటికీ ధరలు మండిపోతున్నాయి. ఇంటి ఖర్చును తట్టుకోలేకుండా ఉన్నాను'' అంటూ ఓ మాట విసురుతాడు. పోనీ ఏ కూతురు దగ్గరికయినా వెళ్దామా అనుకుంటే ముగ్గురిని ఏ కూతురు భరించగలుగుతుంది? ఏ అల్లుడు ఆమోదిస్తాడు.

ఆలోచించినకొద్దీ నీరసం వచ్చేస్తోంది. కాంతమ్మ ముఖం చూడలేకుండా ఉన్నాడు. వారం రోజులకే ఎంతో బరువు తీసినట్లయిపోయాడు. వంటయింట్లో కొంగుపరచుకొని కన్నీళ్లు కారుస్తున్న కాంతమ్మను చూస్తున్నకొద్దీ మతిపోతుంది.

రాజు రెండవ ప్రకటన చూసిన తరువాత కొద్దిగా చలించాడు. తల్లిదండ్రులను తలుచుకుని వెక్కి వెక్కి ఏడ్చాడు. మరునాడు మేనేజరు రాజును పిలిచి "నిన్ననే ఒక కార్డు మీనాన్నగారి ఎడ్రసుకు రాశాను. మీనాన్నగారినీ అమ్మగారినీ. ఇక్కడికి వచ్చిచూడమని. రేపు సాయంకాలము నాలుగు గంటలకు వస్తారు. కాఫీ టిఫిన్ పెట్టు'' అన్నాడు సాదరంగా.

ఆ మాట వినగానే రాజుకు కళ్ళు నీళ్ళుకారాయి. మేనేజరుకు చేతులెత్తి దణ్ణం పెట్టాలనిపించింది. సార్, సార్ అంటూ కౌంటరు దగ్గర నిలబడ్డాడు.

''కళ్లు తుడుచుకో వెళ్లు. నేనంతా గ్రహించాలే'' అన్నట్టు కళ్ళతో సైగ చేశాడు మేనేజరు.

రాజుకు ఆనాడు రాత్రి ఎంతకూ నిద్రపట్టలేదు. తండ్రి యింటికి రమ్మంటాడేమో ? ఇంతవరకూ ఆయనకు ఎదురు చెప్పి ఎరగడు. తల్లి రాజా అంటూ ఏడుస్తూ పోదాం రమ్మంటే ? తల్లి ఏడిస్తే తనకూ ఏడుపు వస్తుంది. ఆమె కన్నీళ్లు కారుస్తూ అడిగితే తను కాదనగలడా ? ఇంత గొడవ జరిగిన తరువాత ఇంటికి వెళ్ళితే అన్నకు ఎంత అలుసు ? అసలు తను వెళ్ళగలడా ?

తెల్లవారి నలుగురితోపాటు లేచిన రాజు యాంత్రికంగా పనిచేస్తూ ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. బాధతో గిలగిల కొట్టుకొన్న ఆ లేత హృదయంలో ధైర్యం కలిగింది తల్లిదండ్రులు వచ్చినా ఇంటికి రమ్మని అడిగినా తన నిర్ణయాన్ని ధైర్యంతో వెలిబుచ్చగలిగిన బలం వచ్చింది.

మరునాడు సాయంకాలం రాజూ అని మేనేజరు కేకపెట్టగానే తడబడుతూ వచ్చాడు రాజు. హాల్లో బల్లముందు కూర్చుని ఉన్న తల్లిదండ్రులను చూడగానే తప్పుచేసినవాడిలా వెళ్ళి ఎదురుగా నిలబడ్డాడు.

'రాజూ' అంటూ కాంతమ్మ అతడిని దగ్గరికి తీసుకొని కన్నీళ్ళు కార్చింది గద్గదమైన కంఠస్వరాన్ని సవరించుకుంటూ అతడినే చూస్తున్నాడు వెంకట్రామయ్య.

ఆ మూడు హృదయాలు ఇన్నాళ్ళ తపనను వెళ్ళబోసుకున్నాయి. ఆ మూడు జతల కళ్ళూ కన్నీళ్ళతో ఓదార్చుకున్నాయి.

"రాజా. ఇంటికిరావా నాయనా!" వెంకట్రామయ్య పైకి అనగలిగాడు.

"ఇక్కడ బాగుంది నాన్నా. వారానికొకసారి వచ్చి చూసి వెళ్ళండి." తలవంచుకొని ఒక్కొక్కమాటే జారవిడిచాడు రాజు.

రాజు బుగ్గలు నిమిరి కన్నీరొత్తుకుంది తల్లి. అతడి తల నిమిరి ఒక నిట్టూర్పు విడిచాడు వెంకట్రామయ్య.

తల్లిదండ్రులు బలవంతంగా బయలుదేరి - తమభౌతిక కాయాలను ఈడుస్తూ వెనక్కు తిరిగి చూస్తూ - ముందుకు సాగిపోతుంటే రాజు కడుపులో ఆవేదన ఉవ్వెత్తున లేవటం మొదలు పెట్టింది కన్నీళ్లు జలజలా రాలాయి.

నాన్న దగ్గర డబ్బున్న రోజుల్లో రాజభోగాల ననుభవించారు, అక్కయ్యా అన్నయ్యా. నాన్న ముసలితనంలో దగ్గర కానీ డబ్బులేక అన్నయ్య పంచన చేరాడు. ప్రొద్దున్న లేచినప్పటినుంచీ అన్నయ్య నాన్నకు నీతులు చెబుతాడు- డబ్బును గురించీ - పిల్లల క్రమశిక్షణను గురించీ. చిన్నప్పుడు తను చేసిన అల్లరి జ్ఞాపకం తెచ్చుకోడు. తన తప్పా తల్లిదండ్రులకు కడసారిగా పుట్టటం? అందుకేనా తనకీ దుర్గతి? రోషంతో అతడి ముఖం ఎర్రబడ్డది.

సంధ్య చీకట్లలో వెలుగుతున్న దీపాల కాంతిలో తల్లిదండ్రులు కనుమరుగయ్యేవరకూ వాకిట్లో నిలబడి చూసి బరువుగా నిట్టూర్చి వెనక్కు తిరిగాడు రాజు.

(ఆంధ్రప్రదేశ్- ప్రభుత్వ సంచిక)



# బంధవిముక్తి

హాలులో పెద్దబల్బు వెలుగుతూంది. డాక్టరు నిలబడి చేతిలోఉన్న కాగితాన్ని పైనించి కిందివరకూ తిప్పితిప్పి చూస్తున్నాడు. అలా చూస్తున్నప్పుడు అతడి ముఖకవళికలు ఎలా ఉంటాయోనని పరీక్షగా అతని ముఖంలోకి చూస్తున్నాడు సారధి.

డాక్టరు తల పంకిస్తూ "అంతా నేను ఊహించినట్టే జరుగుతూంది. ఉష్ణోగ్రత దాని పరిణామమూ అంతా నే ననుకున్నట్లే ఉన్నది. చాలా టిపికల్‌గా ఉంది" అన్నాడు దిక్కులు చూస్తూ.

ఊపిరి బిగబట్టి వింటున్నాడు సారధి.

"క్రమంగా కళ్ళుపోవటం, మెదడు పనిచెయ్యక పోవటం, మూర్ఛలు రావటం, ఇవన్నీ వస్తాయి."

అదిరిపడ్డాడు సారధి. "చూడటానికి కళ్లులేక, ఆలోచించటానికి మెదడులేక పైగా మూర్ఛలుకూడా వస్తే మనిషి జీవించటమెట్లా? జీవించినా ఏం లాభం? భగవంతుడు మా అన్నయ్యకు ఇటువంటి శిక్ష వేస్తాడా డాక్టర్?' అయోమయంగా డాక్టరు ముఖంలోకి చూశాడు.

"ఆ జబ్బునడక దాని తీరు తెన్నులు చెప్పాను. ఇంతవరకూ దాని వడక నేను అనుకున్నట్లుగానే ఉన్నది. ఇకముందు ఏలా ఉంటుందో? ఇంతవరకూ వచ్చి వెనక్కి తిరగటం జరిగితే జరుగుతుందేమో కాని డాక్టర్ల అనుభవంలో ఇంత వరకూ అలా జరగలేదు" ముందడుగు వేశాడు డాక్టరు.

సారధి లేచాడు. ఆయనను అనుసరిస్తూ "డాక్టర్, మా అన్నయ్య దైవ స్వరూపుడు, ఆయనవల్ల ఉపకారం పొందినవాళ్ళే కాని అపకారం పొందినవాళ్లు

లేరు. ఎంత కాలానికో వరప్రసాదంలా వీడు పుట్టుకువచ్చాడు. నిమిషాలు లెక్కపెట్టినట్టుగా చకచకా పైకి వచ్చాడు. ఆలిండియా సర్వీస్‌లో ప్రథముడుగావచ్చాడు. మా అన్నయ్యకు నిజంగా శిక్షకాదా డాక్టర్? అట్లా అభివృద్ధిలోకి వచ్చిన కొడుకు కళ్లులేక, మెదడులేక మూర్ఛలతో జీవచ్ఛవంలా పడి ఉంటే చూసి ఆయన భరించగలడా?''

బరువుగా ఊపిరి తీసుకున్నాడు డాక్టరు. ''కాలచక్రానికి ఎదురు నడవడం మానవుడు ఇంకా నేర్చుకోలేదు. మనమీద ఏది విరుచుకుపడ్డా ఇంతే.''

డాక్టర్ని వెంబడిస్తూ ''అంతేనా డాక్టర్? అంతేనా?'' క్రాపులోకి చేతివేళ్లు పోనిచ్చి తలంతా తడుముకున్నాడు సారథి.

''రేపు ఇదేవేళకు వస్తాను. ఒకవేళ నేను రాకపోయినా ఆ మందులే వాడండి'' కారు తలుపులు వేసుకుని మేడపైకి చూస్తూ స్టార్టు చేశాడు.

సారథి వెనక్కిమళ్ళి గేటువంక చూశాడు. విశ్వనాథం ఎడ్వకేటుబోర్డు ఆ గేటుస్తంభం ఎక్కి నలభై ఏళ్లు కావస్తూంది. మళ్ళీ పెయింట్ చెయ్యకపోయినా అక్షరాలు బాగా కనబడుతున్నాయి. తల వంకిస్తూ సారధి తిన్నగా లోపలికి వెళ్ళాడు. అనసూయమ్మ తలవంచుకొని వంటమనిషితో మాట్లాడుతూంది. సారథిని చూసి తటాలున లేచినిలబడ్డది కొంగు సవరించుకుంటూ.

తనకంటే ఆమె పెద్దది. అయినా మరిది కనబడగానే లేచి నిలబడుతుంది. తల్లిలా కడుపు తడిమి తడిమి దగ్గరగా కూర్చుని అన్నం పెడుతుంది. కాని భర్తకు తమ్ముడన్న గౌరవభావాన్ని మరిచిపోలేదు. ఏలాటి మనిషి ఈవిడ? ఏమి సంప్రదాయం? ఇటువంటి మనిషికా ఈ కష్టం?''

''వదినా, ఇంకా నన్ను చూడగానే లేచి నిలబడటం మానలేదు కదా? ఏం చేస్తున్నారిక్కడ? శాంతిబాబు దగ్గిర ఎవరు ఉన్నారు?'' ఆమె పక్కనే పీట వాల్చుకుని కూర్చున్నాడు.

''అన్నయ్యా, మన గుమాస్తా రమణయ్యా ఇద్దరూ శాంతిబాబు దగ్గిరే ఉన్నారు. డాక్టరుగారు వెళ్ళిపోయారు కదూ?''

''అవునమ్మా. ఆయన్ని పంపే నేను లోపలికి వస్తున్నాను.''

''ఏమంటాడు ?''

''ఆయన ధైర్యంగా ఉన్నాడు. మనకూ ధైర్యం చెబుతున్నాడు.''

''చూడు సారధి, నాకు దేవుడిమీద అపారమయిన విశ్వాసం. నేను తెలిసి ఏ పాపమూ చెయ్యలేదు. బుద్ధి తెలిసినప్పటి నుండీ ఎదటి మేలు చూసి ఓర్వటం నేర్చుకున్నాను. కాని అసహనం ఎరగను. శాంతి మాకు వరప్రసాదం, నా పూజా ఫలము. వరమిచ్చిన దేవుడు తిరిగి తీసుకుంటాడా ? మళ్ళీ వారానికల్లా శాంతి లేచి తిరుగుతాడు. వాడు పడకపెట్టినప్పటి నుండి నేను చేస్తున్న జపతపాలు ఉరికే పోవని నా నమ్మకం. ఏమంటావు ?''

''ఎంత పిచ్చిదానవు వదినా, ఎంత పిచ్చిదానవు'' సారధి వందసార్లు అనుకున్నాడు ఈ మాట మనసులో. తల వంచుకుని ఆమె మాటలు వింటున్నాడు. ముఖంలో అనేకరంగులు ప్రస్ఫుటమవుతూ మాయ మవుతున్నాయి.

''సారధీ, నీవు పైకి వెళ్ళి అన్నయ్యను కిందికి పంపించు. ఆయన స్నానం చేసేసరికి ఈ కొబ్బరి కాయలు కొట్టి రమ్మని కేక పెడతాను. చూడు మన గుమాస్తా రమణయ్యకూడా ఈపూట ఇక్కడే భోజనం చేస్తాడని చెప్పు.'

ఆమె లేచి లోపలికి వెళ్లతూండగా ఆ పదహారు కొబ్బరి కాయలవంకా చూసి ఉలిక్కిపడ్డాడు. ఈనాటికి నాలుగు వారాలయింది శాంతిబాబు మంచమెక్కి..

మేడమీదికి వెళ్ళేసరికి రమణయ్యతో విశ్వనాథం ఒక విచిత్రమయిన కేసును గురించి చర్చిస్తున్నాడు. శాంతిబాబు కళ్ళు తెరుచుకుని చూస్తూ వింటున్నాడు. వాళ్ళిద్దరిని కిందికి పంపి మంచానికి దగ్గరగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు సారధి. ఆ మంచం గదికి మధ్యగా ఉంది. పైన ఫాను మందంగా తిరుగుతున్నది. గాజుతలుపులలో నుంచి కర్టెనుగుండా వెలుతురు లోపలికి ప్రసరిస్తున్నది. గోడలకు రమణీయమయిన ప్రకృతి చిత్రాలు వేలాడుతున్నాయి దర్వాజాకు ఎదురుగా శాంతిబాబు తాతగారి ఫోటో పెద్ద సైజులో వేలాడుతున్నది. ఆ ఫోటోకి వేసిన చెమ్కీహారాలు గాలికి ఊగుతున్నాయి. ఒక మూలనించి ఊదుకడ్డీలపొగ చిత్ర విచిత్రమయిన గతులలో ఆ గది అంతా పీరవిహారం చేస్తున్నది.

''ఇంకో పదిహేను రోజుల తరవాత ఈ గది ఎట్లా ఉంటుంది ?''

తనకు అటువంటి ఊహ కలిగినందుకు సారధి తనను తాను తిట్టుకున్నాడు. "భగవంతుడా, నీ వెక్కడ ఉన్నావు? నీవు ఉన్నావని ఋషులూ, జ్ఞానులూ పండితులూ, పామరులూ అంతా గ్రహించారు. సైంటిస్టులుకూడా ఒప్పుకున్నారు. మా అన్నయ్యనూ వదిననూ ఈ ఆపదనుంచి కాపాడు తండ్రీ కాపాడు."

"బాబాయ్, క్రికెట్‌స్కోరు ఎంత చెప్పవూ? రేడియోలో ఎనౌన్సుమెంటు వచ్చినప్పుడు నేను పడుకున్నాను."

సారధికి అనుకోకుండా నవ్వు వచ్చింది. "ఒరే శాంతీ, నీకు క్రికెట్‌లో ఇంట్రెస్టు ఉన్నదని నాకూ ఉన్నదనుకుంటున్నావా? ఆ సమయంలో నేను అమ్మతో గవ్వలాడుతున్నాను. మీ అమ్మ సంగతి తెలుసుగా? గవ్వలు చేతబట్టిందంటే ఎటు వంటి వాళ్ళనూ ఓడించిగాని వదిలిపెట్టదు. నేనాసందడిలో ఉండిపోయానురా. ఈ సారి చెబుతాలే."

"అయితే బాబాయ్, అమ్మ గవ్వలాడుతూందా నీతో మధ్యాహ్నంవేళ. ఈ మధ్య పాపం ఆమెకు ఏ కాలక్షేపమూ లేక బాధపడిపోయిందనుకో. నీవు వచ్చావు. ఇంక అమ్మకు బాగా కాలక్షేప మవుతుంది".

"అవును మరీ నాన్నకు కేసుల గొడవతప్ప మరొకటి లేదు. ఆమె సంగతి ఆలోచించేవాళ్లు కావాలిరా." కిందినించి పిలుపు వచ్చింది. అన్నగారు పైకివస్తే తను కిందికి వస్తానని సారధి మెట్లమీద నిలబడి అన్నాడు.

"బాబాయ్, నేనొకవేళ ఫారెస్ట్ సర్వీసులోకి పోతే ఎట్లా ఉంటుంది?"

"ఎట్లా ఉండటమేమిట్రా? నీవు సంతోషంతో గంతులువేస్తూ వెళ్ళిపోతావు అమ్మా నాన్నా నీకోసం దిగులుపడుతూ ఒంటరిగా ఉంటారు అంతే కదూ?"

"అవును బాబాయ్, వాళ్ళ సంగతే ఆలోచిస్తున్నా. లేకపోతే నాకా సర్వీసు కావాలని ఉంది."

విశ్వనాథం వచ్చాడు వక్కపొడి నములుతూ "నాన్నా, బాబాయి మంచి చ్చాడా?"

శాంతిబాబు తల ఆడించాడు.

సారధి కిందికి వెళ్ళి భోజనానికి కూర్చున్నాడు. వదినగారు అతడికి కొబ్బరి ముక్క పెట్టి తనుకూడా భోజనానికి కూర్చున్నది. ముడి వీడిపోయి తల వెంట్రుకలు నేలమీద జీరాడుతున్నాయి చుట్టలు చుట్టలుగా. తడి ఆరలేదుకాబోలు అడపలు అడపలుగా వీపంతా ఆవరించుకున్నాయి. ఆమె ముఖం పీక్కుపోయింది కళ్ళు గుంతలు పడ్డాయి. కళ్ళచుట్టూ నల్లటికప్పు వేసింది. ఒంటిపూట భోజనం, రాత్రి పూట గ్లాసెడు పాలు. ఆమె తలవంచుకుని భోజనం చేస్తున్నది.

"వదినా ఈ భోజనంతో రేపు మధ్యాహ్నం వరకూ ఎలా వుంటావమ్మా? నీవు ఈ ఒంటిపూట భోజనంతో నీరసించిపోతే శాంతబాబు దగ్గిర రాత్రిళ్లు ఎలా కూర్చోగలుగుతావు?"

"నాకు ఉపవాసాలు కొత్తటయ్యా సారధి? చెప్పు అన్నయ్య బి.ఎల్. పరీక్ష అయ్యేవరకూ ఒంటిపూట భోజనమే చేశానా? శాంతిబాబుకు టైఫాయిడ్ వచ్చినప్పుడు ఇరవై రోజులు ఒంటిపూట భోజనమేనా? ఏమిటయ్యా నేను ఉపవాసాలకు భయపడతానా ఏమిటి? నా సంగతి ఎరగవూ?"

ఆమె కళ్ళల్లోకి చూసి విషాదంగా నవ్వాడు. ఆహాలులో ఒక మూల పోసిన కొబ్బరిచిప్పల వైపు చూస్తూ.

"ఇవాల్టితో నవగ్రహపూజ అయింది. గ్రహాలు బాగాలేవంటే ఆ కొరత ఎందుకు ఉండాలని నవగ్రహజపం చేయించాను. చూడు సారధి. ఇవన్నీ సర్దుకొని కాఫీలు తీసుకొని పైకి వస్తాను. అంతవరకూ నీవు కూర్చుంటావా శాంతి దగ్గర? లేక అన్నయ్యను కూర్చోమంటావా?"

"అన్నయ్య వద్దులే. నేనే కూర్చుంటా" వెంబడి తెచ్చుకున్న నవలలన్నీ చదివేశాడు సారధి. శాంతబాబు అలమారలోనించి ఓ నాలుగు తెచ్చుకుని పడక కుర్చీలో వాలాడు.

ఆ మరునాటినించీ డాక్టరు రోజు విడిచి రోజు వస్తున్నాడు.

సారధి ఎదురుగుండా వెళ్ళి "డాక్టర్ మీరు ఒక్కరోజు రాకపోతే ఎంత గాబరాగా ఉంటుందో చెప్పలేను" ఆయనతో కూడా వచ్చి మంచం దగ్గిరగా నిలబడ్డాడు. డాక్టరు శాంతబాబును పరీక్ష చేశాడు. అడిగిన ప్రశ్నలకు అన్నిటికీ రోగి

సమాధానాలు చెప్పాడు. డాక్టర్ని సాగనంపి వెనక్కి వచ్చిన సారధి తల పంకిస్తూ శాంతిబాబును చూసి ముఖం పక్కకి తిప్పుకున్నాడు.

ఆదివారం నాడు సూర్యోదయాత్పూర్వమే లేచి స్నానంచేసి డాబా మీదికి వచ్చింది అనసూయమ్మ. తలవెంట్రుకలు ముడిపెట్టింది. పిట్టగోడకు ఆనుకుని ఎర్రబారిన తూర్పుదెస చూస్తూ ఆదిత్యహృదయాన్ని పఠిస్తూంది సన్నగా

సారధి ఆమెను వెనకవించే చూసి 'గడియారానికైనా పాస్టు స్లో అనేరెండు జబ్బులున్నాయి. ఈ వదిన వాటిని ఎరుగదు!' అనుకున్నాడు. అతడిని గడచిన రాత్రినుంచి చంద్రికను గురించిన ఆలోచనలు ముంచివేస్తున్నాయి. చంద్రిక ఎదురు మేనరికం. వద్దురా అంటే వినక ఆ పిల్లనే పెళ్ళి చేసుకుంటానని పట్టు బట్టాడు. నిశ్చితార్థము ఉంగరాల మార్పిడి పూలహారాలతో ఫోటో తీయించుకోవటమూ అయింది. ఇంటర్వ్యూకు వెళ్ళివచ్చిన తర్వాత పెళ్ళి జరిగేటట్టుగా ముహూర్తం పెట్టారు. ఆ పిల్ల గతి ఏమిటి?

"బాబాయ్"

దిగ్గునలేచి "ఏం కావాలి శాంతీ?" అడిగాడు కంగారుపడుతూ.

"బాబాయ్, చీకటిగా ఉంది దీపం పెట్టు."

"ఇప్పుడు దీపం ఎందుకు శాంతి తెల్లవారిందిగా?" శాంతిబాబు చెయ్యి పట్టుకున్నాడు గాబరాగా.

"స్విచ్ ఆన్‌చెయ్యి బాబాయ్. ఇంత చీకటిగా ఉంటే తెల్లవారిందంటావేం?"

దుఃఖాన్ని అణచుకొని గొంతు సర్దుకుంటూ "శాంతీ దీపం వెలగటం లేదురా. ఇంకో బల్బు తెచ్చిపెడతాను. కొంచెంసేపు ఉంటావు కదూ?" శాంతిబాబు చెయ్యి వదలిపెట్టాడు. గబగబా మెట్లు దిగి వాకిట్లో ఉన్న స్కూటరు ఎక్కి డాక్టరు ఇంటికి వెళ్ళాడు. ఆయన స్నానంచేసివచ్చేవరకూ కుర్చీమీద కూర్చోలేకపోయాడు. అటూ ఆటూ కాలుకాలిన పిల్లిలా తిరిగాడు. ఆందోళనా భయం అతడిని నిలువెల్లా వణికించేస్తున్నాయి.

డాక్టరు బయటికి రాగానే సారధిని చూసి "ఏమిటి ఇలావచ్చారు పొద్దున్నే శాంతిబాబు ఎలా ఉన్నాడు?"

"ఇంకెలా ఉంటాడు? ముందే జోస్యం చెప్పారుగా?" విసురుగా అన్నాడు

సారధి భుజం మీద చెయ్యివేస్తూ "ఆ జబ్బు లక్షణాలు మాకు తెలుసు కనుక ముందే చెప్పాను. అది ట్యూబర్‌క్యులస్ మెనిక్‌జైటిస్. దాని నడకనుబట్టి ఏ లక్షణం ఎప్పుడు వస్తుందో చెప్పగలుగుతాము. అంతేగాని దురుద్దేశ్యంతో కాదుసుమా. చదువుకున్నవారు మీరుకూడా డాక్టర్ల మాటలను అపార్థం చేసుకుంటే ఎలా? అసలు జబ్బులపేర్లూ లక్షణాలూ మేమందరితోనూ చెప్పము. మీరు అన్నీ తెలిసినవారని చెప్పాను. అంతేకాని శాంతిబాబు అలా అయిపోవాలని కోరికా నాకు?"

"క్షమించండి నా మానసిక సంక్షోభం కొద్ది ఏదో అనేశాను. ఇంటికి వెళదాము రండి. మీరు వచ్చి చూస్తూంటే మా వాళ్ళకు కాస్త ధైర్యంగా ఉంటుంది." ఇద్దరూ కలిసి బయటికి వచ్చారు. మెట్ల దగ్గిరే విశ్వనాథం ఎదురయ్యాడు. కళ్ళు ఒళ్ళు కాలిపోతున్నాయి. సారధి చేతులందుకుని లోపలికి తీసుకువెళ్ళి బావురు మన్నాడు. అనసూయమ్మ తలమీద రెండు చేతులు పెట్టుకుని ముఖం దించుకుని కుమిలి కుమిలి ఏడుస్తున్నది.

"ఇదేమిటి? ఇద్దరూ ఇక్కడే ఉన్నారేం? శాంతి దగ్గిర ఒక్కరయినా లేకుండా వచ్చేశారా? పదండి పైకి వెళ్దాము."

"శాంతి.........శాంతి........." అనసూయమ్మ గుండెలమీద చేతులు ఆనించుకుని దుఃఖిస్తున్నది

"ఏమిటి వదినా ఈ భయం? ఏమయినదని?" వాళ్ళిద్దరినీ తీసుకుని మెట్లు ఎక్కుతున్నాడు.

"బాబాయ్! బాబాయ్! ఏమిటీ ఒక్కరూ పలకరేం? నాన్నా.........అమ్మా ఎవరూ ఇంట్లో లేరా" మంచంమీద లేచి కూర్చున్నాడు శాంతిబాబు.

"వస్తున్నారా శాంతీ. నేను డాక్టరుగారిని తీసుకు రావటానికి వెళ్ళాను." అందరికంటే ముందుగా రెండేసి మెట్లు వంతున ఎక్కి వెళ్లాడు.

"నేను ఇప్పుడే వస్తున్నా శాంతీ. అమ్మ లోపల పనిలో ఉన్నట్టుంది నాన్నకు నీ మాట వినబడినట్టులేదు. నీకేం కావాలి చెప్పు? కాఫీ కావాలా? బోర్న్ విటా కావాలా చెప్పు" మంచంమీద కూర్చుని శాంతిబాబు భుజంమీద చేతులు వేసి రాశాడు.

నిశ్శబ్దంగా ఉన్న ఆ గదిలోకి బూట్లతో నడిచిన సవ్వడి వినవచ్చింది.

"హల్లో శాంతివర్ధన్ ఎలా ఉన్నారు?" డాక్టర్ లోపలికి వచ్చాడు. కుర్చీలో కూర్చుని మామూలు పరీక్షలు టెంపరేచరు చూసి గుండె పరీక్ష చేశాడు.

"డాక్టర్. ఇవాళ ఏమిటోగా ఉంది. అంతా చీకటి చీకటిగా ఉంది. మీ రంతా కూడా కటిక చీకటిలోనే ఉన్నారా? దీపాలు లేవా? తెల్లవారలేదా? బాబాయి చీకట్లో మీ దగ్గిరి కెందుకు వచ్చాడు?"

డాక్టరు శాంతిబాబు భుజంతడుతూ "శాంతివర్ధన్, మీ కేమిటి అందరికీ చీకటిగానే ఉన్నది. నల్లటి మేఘాలు దట్టంగా ఆకాశమంతా ఆవరించేశాయి. దీపాలు ఎక్కడా లేవు. జగమంతా చిమ్మచీకటిలో ఉన్నారు. తిరిగి వెలుతురు వచ్చే వరకూ ధైర్యంగా ఉండాలి." డాక్టరు మెట్లు దిగి కిందికి వచ్చాడు. అనసూయమ్మా, విశ్వనాథం వాకిటివరకూ వెళ్ళారు. తలవంచి నమస్కారం చేసి కారులో కూర్చున్నాడు. "నేను మీ తమ్ముడితో చెప్పాను అన్ని సంగతులూ. ఏం భయం లేదు ధైర్యంగా ఉండండి. అవే మందులు వాడండి."

"డాక్టరుగారూ, డాక్టరుగారూ, మా నాయనకు కళ్లు, చీకట్లు కమ్మాయి. వైద్యం వైద్యం" అనసూయమ్మ కళ్ళు కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. కారు మెల్లిగా జరుగుతూ పోయింది.

ఉదయం ఎనిమిది గంటల రైలుదిగి సూటుకేసు చేతబట్టుకుని ఊగుతూ లోపలికి వచ్చింది చంద్రిక. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. చదువుతున్న పేపరు పక్కకు తొలగించి చూశాడు విశ్వనాథం. "హల్లో మామయ్యా, మా కాలేజీ వాళ్ళంతా యూనివర్సిటీ హాస్టల్లో దిగారు. నేను స్నానంచేసి భోజనంచేసి వెళ్ళిపోతాను."

తల ఆడించి మళ్ళీ పేపర్లో తల దూర్చుకున్నాడు విశ్వనాథం.

"అత్తయ్యా" అంటూ చంద్రిక లోపలికి వెళ్ళింది. అనసూయమ్మ చేతిలో ఉన్న చెంబు అక్కడ పడేసి 'అమ్మా'అంటూ అమాంతం కౌగిలించుకొనిఏడ్చింది. "ఏమిటత్తయ్యా ? ఏం జరిగింది ? ఎందుకు ఏడవటం ?" గాభరాపడిపోయింది.

"తల్లీ, బావను దేవుడు చిన్నచూపు చూశాడు. నాయన మంచమెక్కి ఆరు వారాలు కావస్తూంది. వెళ్ళిచూడు"

హఠాత్తుగా ఒక మెత్తటి చెయ్యి, స్పర్శచేతనే విద్యుత్తును పుట్టించగల చెయ్యి, నన్నటి పొడుగాటి వేళ్ళ చివర కెంపులు కట్టినట్టుగా రంగద్దుకున్న చెయ్యి శాంతిబాబు చేతిమీద పడ్డది. ఈ చేతులను చూడగానే శాంతి ఎలా వర్ణించేవాడో తలుచుకుంటూ ముఖంలో ఆనందం, ఆందోళన భయం మిళితం కాగా చంద్రిక "బావా !" అంటూ అతడి చేతులు కదిపింది.

"ఎవరు ? చంద్రికా ? ఎప్పుడు వచ్చావు ?" ఆ మెత్తటి చేతులను తన చేతిలోకి తీసుకుని గాజులు సవరిస్తూ "ఎక్కడినించి వస్తున్నావు ?" కళ్ళు తెరిచి కనుగుడ్డు తిప్పుతూ పలకరించాడు.

అరగంటసేపు సంభాషణలో చంద్రిక అతనికి దృష్టి పోయిందని గ్రహించింది. కిందికి వచ్చి వెక్కి వెక్కి ఏడ్చి సొమ్మసిల్లి పోయింది.

శాంతిబాబుకి బాగా అనుమానం కలిగింది తన దృష్టి పోయిందని. నుత అడిగిన దానికి ఎవరూ సమాధానం చెప్పరు 'మాకు తెలియ' దంటూ తప్పుకుంటున్నారు. తన చేత్తో పాలుఇచ్చి, అన్నం తినిపించే అమ్మ, ఆప్యాయంగా అమృతం చిలికిస్తూ మాట్లాడే అమ్మ పైకి వస్తున్నట్లే లేదు. చంద్రిక వచ్చిననాడే పలకరించింది. తనతో మాట్లాడేది ఆ బాబాయీ, ఆ ఒక్క నౌకరు వెంకన్నానా ? అందరూ తనను గురించి ఏమనుకుంటున్నారు ? అమ్మ, నాన్న, చంద్రిక వీళ్లందరికీ ఈ గ్రుడ్డివాడు భారమయ్యాడా ? ఏమిటి జీవితం ? ఏమి ఆశించాను ? ఎన్ని పథకాలు వేశాను ? నా జీవితం పెద్దపాము నోట్లోపడి మళ్లీ మొదటిగడికి వచ్చిన పావులా అయిందా ? ఇలా ఎన్నాళ్లు బ్రతకను ?' అతడికి గుండె బరువెక్కిపోయింది

రాత్రి పది గంటలు దాటింది పవనుడు అందరినీ పరామర్శ చేస్తున్నాడు. ప్రకృతి చల్లగా తెల్లగా జీవులను పరవశింపచేస్తున్నది. మనసు ఉప్పొంగేటట్టుగా

పున్నమినాటి ప్రకృతిని వర్ణించిన గేయాన్ని ఆలపిస్తున్నాడు శాంతిబాబు. తన బాధలన్నీ మరచిపోయేటట్టుగా ఆవేదనతో పాడుతున్నాడు. ఆ కంఠం కాలేజీలో చదివే రోజుల్లో ప్రతిఏటా లలితసంగీతంలో ప్రథమ బహుమానాన్ని సంపాదించింది. కాని ఈనాడు ఇంటిల్లిపాదినీ దుఃఖంలో ముంచెత్తింది. అతడి కిన్నెరకంఠం తీగెలు సాగుతున్నకొద్దీ కొన్ని జతల కళ్ల కన్నీరు కార్చటం మొదలుపెట్టాయి.

మధ్యాహ్నం పన్నెండు గంటలకు సారథికి మెలకువ వచ్చింది. తటాలున లేచి "బాబాయ్, నా సూటుకేసు తెరచి నా కరెస్పాండెన్స్ చదివి వినిపించు" అన్నాడు

సారథి పెట్టెలోఉన్న ఫైలుతీసి చదివి వినిపించి మళ్లీ యథాస్థానంలో ఉంచాడు. అంతలో పోస్టు వచ్చింది. చంద్రిక హాస్టలుకు వెళ్లకుండా ఇంటికి తిరిగి వెళ్లిపోయిందని కబురువచ్చింది. వణుకుతున్న చేతులతో కవరు చింపి చదివాడు.

"ఏమిటి బాబాయ్? పోస్టా? ఎక్కడినుంచి ఉత్తరాలు?"

నొసలూ గడ్డమూ పెదవులూ వణుకుతున్నాయి సారథికి. చేతులు పట్టుకొని ఊపేస్తున్నాడు శాంతిబాబు.

"శాంతీ, నాన్న క్లయింట్సు రాసిన ఉత్తరం. వెంకన్నకు తెలియక పైకి తీసుకువచ్చాడు." ఆ ఉత్తరం పైకి కనబడకుండా జేబులో దాచేశాడు సారథి.

మధ్యాహ్నం కాఫీలవేళ, అందరూ చేతిలో గ్లాసులు పట్టుకుని కూర్చున్నారు. టెలిగ్రాం వచ్చింది చంద్రిక ఇంటికి వెళ్లి ఆత్మహత్య చేసుకున్నట్టుగా. కాఫీ గ్లాసులు చేతుల్లోంచి జారిపోయాయి. సారథిగుండె బయటికి వచ్చేస్తుందా అన్నట్టు కొట్టుకోవటం మొదలుపెట్టింది. ఆనాడు జరిగిన రెండు సంఘటనలూ మనసులో ఇమిడేటట్టు లేవు. కళ్లుపోయిన శాంతిబాబుకు ఇంటర్వ్యూకు రమ్మని ఆహ్వానం వచ్చింది. ఆ వార్త గుండెను ఎంత కదిలించి వేస్తున్నదో, చంద్రిక చావు అంత కదిలించి వేస్తున్నది. ఈ రెండు వార్తలూ శాంతిబాబు చెవిన పడకూడదు.

"ఏమిటి బాబాయ్, మాటే మాట్లాడడంలేదు ఈ పూట" శాంతిబాబు పదే పదే అడుగుతున్నాడు.

"శాంతీ, నే నెందుకు బ్రతుకి ఉన్నానురా. నే నేంచెప్పను? అటు అమ్మ నాన్నల బాధలు చూడలేను. ఇటు నీ బాధ చూడలేకుండా ఉన్నాను. గుండె కొట్టు

కుంటూ మూలుగుతూంది.'' సారధి శాంతిబాబు వెన్నుమీద చేత్తో రాస్తూ మూగ పోయిన కంఠాన్ని సవరించుకున్నాడు. అతడు చెప్పదలచుకున్న మాటలు పైకి రావటం లేదు.

ప్రతి రోజూ డాక్టరు వస్తున్నాడు, రోగిని పరీక్ష చేస్తున్నాడు. అవే మందులు వాడండి అంటాడు. అదే ఆహారం ఇవ్వమంటాడు. ఆయన రాగానే ఒక్క సారధి వెంబడి ఉంటాడు. కొత్త ప్రశ్నలేమీ వెయ్యడు. పాతవాటికి సంజాయిషీ అడగడు రోజులు వారాలుగా మారుతున్నాయి. వారాలు నెలలుగా మారుతున్నాయి.

శాంతిబాబులో ఉన్నట్టుండి ఏదో మార్పు వచ్చింది. మాటలేదు. కదిపితే కదలడు. అపస్మారకంలో ఉన్నట్టుగా ఉన్నాడు. అప్పుడప్పుడు సన్నగా మూలిగినట్టు వినబడుతున్నది ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తప్పవిడిచి అతడు జీవించిఉన్నట్టే లేదు. ఎవరు పలకరించినా కదలడు. మెదలడు. వారం రోజులు బరువుగా గడిచాయి. ఎవరికీ భోజనాలు లేవు. బలవంతంమీద పాలుతాగి కళ్లు మూసుకుంటున్నారు.

''డాక్టర్'' సారధి డాక్టరు ఇంటి వరండాలో నిలబడి పిలిచారు. ముఖం పీక్కుపోయింది. కళ్లు గుంటలు పడ్డాయి.

''నేనే మీ ఇంటికి రావాలని బయలుదేరాను. ఎలా ఉన్నారు శాంతిబాబు?''

వారం రోజుల సంగతులన్నీ వివరించి చెప్పాడు సారధి. ''డాక్టర్, మీరు వైద్యులు. కష్టపడి మానవసేవ చేయటానికే ఈ విద్య అభ్యసించారు. ఏ విధంగా నయినా బాధను నివారణ చెయ్యటానికి మీరు పూనుకోవాలి. అదేకదా డాక్టర్ల ఆశ యమూ ఆదేశమూను?''

''అవును. అయితే''

''ఈ వ్యాధి కుదరదని మీకూ తెలుసు. మాకూ తెలిసిపోయింది. ఆ జీవుడు పడేబాధను మేము చూడలేకపోతున్నాము. ఈ భౌతికకాయం నుంచి ఆ జీవుణ్ణి విముక్తుని చేయండి''.

''అన్యాయం. ఘోరం. అది హత్య. అది నా చేత కాదు. నేను చెయ్యను. చెయ్యలేను.''

"డాక్టర్, అది అన్యాయమా? ఘోరమా? ఇందులో న్యాయమెక్కడున్నది డాక్టర్. ఎంతకాలానికో ఒక్కగా నొక్క కొడుకుపుట్టాడు. వాడు ఎటువంటి వాడు? వజ్రపు తునక, అఖండమయిన తెలివికలవాడు. ఆలిండియాలో సర్వీసులో ప్రథముడుగా వచ్చినవాడు. పది రోజులలో ఇంటర్వ్యూకి వెళ్ళాలని వచ్చినవాడికి ఈవ్యాధి రావటం అన్యాయం కాదూ? ఈ బిడ్డను ఆరోప్రాణంగా చూసుకుంటూ జీవించే ఆ తల్లిదండ్రులకు ఈ వచ్చిన కష్టము ఘోరమైంది కదూ? ఇంటర్వ్యూ అయిన తరవాత పెళ్ళి చేసుకోవాలని ఉవ్విళ్ళూరే చంద్రిక ఆత్మహత్య చేసుకోవటం ఘోరం కాదూ? అన్యాయం కాదూ?"

"మిస్టర్. మీరు దుఃఖంలో అన్నీ మరిచిపోతున్నారు. వైద్యవిద్య వైద్యోపచారాల చేత రోగుల బాధను ఉపశమింపచేసే కళ. కాని ప్రాణాలుతీసే కళ కాదు. ఎంత కుదరని వ్యాధి అయినా రోగికి అది లాభించకపోయినా వైద్యుడు వైద్యం చేసి తీరవలసిందే. కాని ప్రాణాలు తీసే హంతకుడు మాత్రం కారాదు."

"డాక్టర్ మీరు హృదయముతో మాట్లాడండీ. ఆ రోగిస్థానంలో మిమ్మలను పెట్టుకుని మాట్లాడండి. ఆ పరిస్థితిలో మీరు ఉంటే ఎటువంటి చికిత్స జరిగితే మీకు బాగుంటుంది? చెప్పండి? ఇటువంటి రోగినిచూస్తూ ఉండటం న్యాయమా చెప్పండి"

డాక్టరు నీరవుడైపోయాడు.

"మానవప్రగతిలో పొరబాట్లూ దోషాలూ ఉండకపోవు. న్యాయస్థానాలలో అన్యాయాలు జరగటం లేదూ? నిరపరాధులు శిక్షింపబడటం, మరణశిక్షకు పాల్పడటం జరగటం లేదూ? మీ డాక్టర్ల చేతుల్లో రోగ నిర్ణయం పొరబాటైనందువల్ల ఎంతమంది రోగులు మరణించటం లేదు? బాగా ఆలోచించండి. పందెపుగుర్రం పరుగులో కిందపడి కాలు విరగగొట్టుకుని కుంటిదయితే దాన్ని తుపాకీతో కాల్చి పారవేయటం లేదూ? ఆపద్ధతిని తిరుగులేని వ్యాధితో అమితంగా బాధపడే రోగుల పట్ల కూడా ఎందుకు అమలు చెయ్యకూడదూ?"

"మనం సృష్టించలేని దానిని నాశనము చెయ్యకూడదు. శాస్త్రం ఒప్పదు. చట్టం సమ్మతించదు. ప్రాణం తియ్యటానికి ఏ మతమూ అంగీకరించదు."

సారధి గిర్రున వెనక్కి తిరిగాడు. అతడి మెదడులో అనేక భావాలు అల్లి బిల్లిగా అల్లుకుని ఊపిరాడకుండా చేస్తున్నాయి. "నా బిడ్డ అలా మంచంలోనయినా ఉంటే చూసుకుని బ్రతుకుతాను." అంటూ చిన్న పిల్లవాడిలా వెక్కి వెక్కి ఏడ్చే విశ్వనాథం అతడి కళ్ళల్లో మెదిలాడు. "సారధీ, నా తండ్రిని ఆ స్థితిలో చూడలేనయ్యా. నా ప్రాణాలు ఆ డాక్టరుతో చెప్పి తీయించవయ్యా. జీవచ్ఛవంలా పడి ఉన్న బాబును చూసి నా కడుపు పగిలిపోతున్నది. సారధీ, ఒక్క మాత్ర ఇప్పించవయ్యా" కన్నీళ్ళు కారుస్తూ కుంగి కృశించి పోయిన వదిన ముఖం ప్రత్యక్షమయింది. గబగబా అడుగులు వేస్తూ ఇల్లు చేరుకున్నాడు సారధి. లోపలికి పోలేక గేటు స్తంభానికి తల ఆనించి విలబడ్డాడు.

"ఓ భగవంతుడా, ఏది న్యాయం ? ఏది కరుణ ? కారుణ్యంవల్ల ధర్మచ్యుతి కలుగుతుందా ? కలిగితే ఈ దంపతులను త్వరగా తీసుకుపో." కన్నీళ్లు చెంపలగుండా జారి షర్టుమీద పడుతున్నాయి.

అలా ఎంతసేపు ఉన్నాడో ! నౌకరు వెంకన్న వచ్చి "అమ్మగారు నోట మాట లేకుండా పడిపోయారండి" అంటూ లోపలికి తీసుకు వెళ్ళాడు.

భగవంతుడా, నా మొర నిజంగా ఆలకించవా ? అయితే అన్నయ్యగతి ఏమిటి ? అడుగులో అడుగువేస్తూ లోపలికి వెళ్లాడు. అనసూయమ్మకు వంటమనిషి విసురుతున్నది. విశ్వనాథం దగ్గిర కూర్చున్నాడు. ముఖంమీద నీళ్ళు చల్లగానే ఆమె కళ్లు తెరిచింది. సారధిని చూడగానే దిక్కులు పిక్కటిల్లేలా ఒక్క అరుపు అరిచింది. "సారధి, నా శాంతి, నా శాంతి."

సారధికి మతి పోయినట్లయింది. శాంతి ఎలా ఉన్నాడూ ? అతడికి మాట కూడా నిలిచిపోయింది! మూర్ఛలు వస్తున్నాయి. ఈ పిచ్చితల్లి అవి రోగలక్షణాలని తెలుసుకోలేక భయపడిపోతున్నదా ? అతడు రెండేసి మెట్లు చొప్పున ఎక్కి శాంతిబాబు గదిలోకి వెళ్లాడు.

ఆ గదిలో ఒక్క గడియారం తప్ప మిగతావన్నీ నిర్జీవంగా ఉన్నాయి. శాంతిబాబు ప్రశాంతంగా పడుకున్నాడు. అతడి చెయ్యి పట్టుకు చూసి ఒక దీర్ఘ విశ్వాసంతో కిందికి వచ్చిపడ్డాడు సారధి. అన్నా వదినల ప్రశ్నలకు జవాబు ఇవ్వలేని స్థితిలో వాళ్ళ పక్కన చతికిలబడ్డాడు.

('ఆంధ్రప్రభ' సచిత్ర వారపత్రిక)

# విచ్చిన మబ్బులు

విశ్వనాథం కాలుతున్న ఇంట్లోకి వెళ్ళి మంటల్లోనుండి శాంతను రెండు చేతులా పట్టి లాక్కొచ్చి మంచమ్మీద పడుకోబెట్టాడు.

"శాంతా! ఏమిటీ అఘాయిత్యం! ఎందుకు వెళ్ళావు మండుతున్న ఇంట్లోకి?"

శాంతకు అప్పటికే కట్టుకున్న చీరె చాలావరకు కాలింది. తల వెంట్రుకలు కూడా అంటుకున్నాయి. చేతులూ, ముఖమూ కమిలి నలుపుకు తిరిగాయి.

"మన ప్రాణాలు దక్కితే చాలు. ముఖ్యమైన సామాన్లు వెంకన్న తెచ్చి బయట పడేస్తున్నాడు. నీవెందుకు వెళ్ళావు చెప్పు యింట్లోకి? అయినా ఈ స్థితిలో నీవు వెళ్ళవచ్చా? ఏమిటీ గూళ్ళన్నీ అలా వెదుకుతున్నావు?"

శాంత నుదురు కొబ్బరి నూనెలో తడిపిన దూదితో అద్దుతూ దగ్గరగా మంచమ్మీద కూర్చున్నాడు విశ్వనాథం.

శాంత భయంతో గజగజ వణకిపోతున్నది. కన్నీటి తడికి తల వెంట్రుకలు చెంపలకు అతుక్కున్నాయి. కళ్ళు మూసుకుని మూలుగుతున్నది.

చటుక్కున విశ్వనాథానికి ఏదో జ్ఞాపకానికి వచ్చింది. వెంకన్నా అంటూ పరుగెత్తాడు. అప్పటికి వెంకన్న చేతికందిన సామానంతా చేరవేశాడు. దణ్నెంమీద బట్టలన్నీ లుంగచుట్టి పరుపుచుట్టలమీద పడేశాడు. విశ్వనాథం తన లా పుస్తకాలు, ఆఫీసు కాగితాలు వచ్చినవి లెక్క చూసుకుని పెట్టెలన్నీ ఒకదానిమీద ఒకటి పేర్చాడు.

సంధ్య చీకట్లలో విశ్వనాథం రాజవీధిలో క్రొత్తగా కట్టిస్తున్న ఇంటిని చూసి వస్తున్నాడు. వీధిమలుపు తిరగకముందే "ఇల్లంటుకుంది బాబూ" అంటూ

కేకలు పెడుతూ వెంకన్న ఎదురుగా వచ్చాడు. వెంకన్నతోపాటు ఉరుకుపరుగుల మీద ఇల్లు చేరుకుని ఆఫీసు గది తాళంతీసి చేతనయినన్ని లా పుస్తకాలు బయట వేయించాడు. ఇరుగుపొరుగుల సహాయంతో ఇంచుమించుగా సామానంతా బయటికి వచ్చింది.

వస్తువులు కంటికి సరిగా కనబడకుండా పొగ చుట్టేసింది. ఒక్కొక్క దిశనుంచి మంటలు నాలుకలు చాపుతూ పైకెగసి ఆకాశాన్నంటుతున్నాయి. మంటల విజృంభణకు జనం వెనక్కు తగ్గారు.

"అయ్యో! బాబూ! అమ్మగారేరీ!"

విశ్వనాథానికి మతిపోయినట్లయింది. శాంత మంచమ్మీదలేదు. విశ్వనాథం వెంకన్నను తోసుకుంటూ లోపలికి ఉరికాడు. నాలుగుమూలలా అలుముకుపోయిన పొగలో కంటికేమీ కనబడటం లేదు. పొగ గొంతులోకి పోయి దగ్గు వస్తున్నది. శాంతకోసం చేతులతో తడుముకుంటూ ముందుకు వెళ్ళాడు.

శాంతగదిలో గూళ్ళన్నీ చేత్తో తడిమి చూస్తున్నది. చేతికందినవన్నీ క్రింద పారేసి దేనికోసమో వెదుకుతున్నది. ఆమె చీరె కుచ్చిళ్ళు అతడి చేతి కందాయి. బయటికి లాక్కొచ్చాడు రెండు చేతులూ పట్టుకుని.

రాత్రి పదకొండుగంటలకు మంటల విజృంభణ కొంతవరకూ తగ్గింది. ఇంటి కలప చాలావరకూ కాలిపోయింది. వీధి వారంతాచేరి గాలికి ఆ నిప్పు మరో యింటిమీదికి ఎగరకుండా మళ్ళీనీళ్ళు పొయ్యటం మొదలు పెట్టారు.

ఇంటి ముందున్న చెట్టు ఆకులన్నీ మంటల వేడికి మాడిపోయాయి. కాలి మోడులా ఉన్న చెట్టుక్రింద శూన్యమనస్కుడిలా నిలబడిపోయాడు విశ్వనాథం. అతడికి ఉండి ఉండి దుఃఖము ఉబుకుకుంటూ పైకి పొంగులా వస్తున్నది. అతడి తాతగారు మగ్గురు కూతుళ్ళూ, నలుగురు కొడుకులతో సిరిసంపదలను అభివృద్ధి చేసుకుంటూ నలభయి సంవత్సరాలు ఆ యింట్లో సుఖసంతోషాలతో కాలం గడిపాడు. అతడి తండ్రి అచ్చివచ్చిన ఆ యింట్లో తన ఒక్క కొడుకును పెంచి పెద్దవాడిని చేసి మదరాసుపంపి లాయర్ని చేశాడు. ఇంటిచుట్టూ తోటవేశాడు. విశ్వనాథం ఆ ఊరిమీద అభిమానము ఆ యింటిమీద మమతను చంపుకోలేక అక్కడే ప్రాక్టీసు పెట్టాడు. ఇల్లు కొంతభాగం పడగొట్టి ఆధునిక పద్ధతులతో కట్టించి

కొత్త ఫర్నీచరుతో నూతనాలంకారములు చేశాడు. ఇదంతా జరిగి ఎనిమిది సంవత్సరాలు కాలేదు.

విశ్వనాథం మనోవీధిలో తప్పటడుగులు వేస్తూ వేస్తూ ఉన్న అతడి పిల్లలు ముగ్గురు వచ్చీరాని మాటల మాధుర్యాన్ని చవి చూపిస్తూ చూపిస్తూ చెయ్యిజారిపోయిన దృశ్యాలు గోచరమయ్యాయి. అతడి గుండె దిగజారినట్లయింది. దీర్ఘంగా నిట్టూర్చాడు.

ఇంటిముందు పోగయిన జనం ఒక్కొక్కరే వెళ్ళి పోయారు. ఆవేదన అణచుకుంటూ విశ్వనాథం శాంత మంచంముందుకు కుర్చీ జరుపుకున్నాడు. శాంత బాధతో మూలుగుతున్నది. తెరచిన కళ్ళు వాటంతట అవే మూతలు పడుతున్నాయి. పలకరిస్తే ఒక దాని కొకటి సంబంధంలేని మాటలు మాట్లాడుతున్నది. విసనకర్రతో మందంగా వీస్తూ ఆమెముఖంలోకి చూశాడు విశ్వనాథం. రెండవసారి ఇంట్లోకి వెళ్ళినప్పుడు నడుముభాగం కాలి బొబ్బలెక్కింది.

ఆ వరసలో నాలుగు యిళ్ళు కాలి పోయాయి. జననష్టంకాలేదు. కాని వస్తునష్టం చాలా అయింది. పొగంతా మేఘాలరూపంలో ఆకాశమంతటా అలుముకు పోయింది. వీధి దీపాలయినాలేని ఆ రాత్రివేళ మసకమసకగా ఉన్న చంద్రకాంతిలో ఆ యిళ్లల్లోనివాళ్ళు సామాన్లమీదే ఒక్కొక్కరే ఒరిగారు.

వెంకన్న డాక్టర్ని వెంటబెట్టుకుని వచ్చేసరికి చర్చిలో రెండుగంటలు కొట్టారు. డాక్టరు గాయాలను పరీక్షచేసి ఇంజక్షను ఇచ్చినందువల్ల శాంతకు నిద్ర పట్టింది. కాని ఉదయం లేచేవేళకు జ్వరం నూటమూడు దాటింది.

కాలిన యింట్లోనుంచి వెచ్చటిపొగలు ఇంకా వస్తున్నాయి. వాకిటి వైపు గ్రామాలనుంచి వచ్చే పార్టీలకొరకు కట్టించిన పెద్ద చావడివంటిది చెక్కు చెదరలేదు. వెంకన్న ఉదయమేలేచి ముఖ్యమైన సామాను దానిలోకి చేరవేశాడు. మెల్లగా శాంత మంచము లోపలికి పట్టారు ఇద్దరూ కలిపి.

"వెంకన్నా!" శాంత మెల్లగా పిలిచింది. "సామానంతా వచ్చిందా?"

"సామాను గదిలో బియ్యం మూటలూ అవీ ఉండిపోయాయండీ".

"నా గదిలో గూళ్ళన్నీ ఖాళీచేశావా?"

"వాటిలో ఉన్నవన్నీ నా పెట్టెలో పడేశానండీ" శాంతకు అప్పుడప్పుడే మైకం కమ్మినట్టుగా ఉంటున్నది. వెంకన్న చేతులు నులుముకుంటూ మంచం దగ్గర నిలబడిపోయాడు

పదిగంటలు దాటినప్పటినుండీ శాంతకు పలవరింతలు ప్రారంభమయ్యాయి. డాక్టరు వచ్చి గాయాలను పరీక్షచేశాడు జ్వరం నూటనాలుగు సమీపించింది. మరొక ఇంజక్షన్ యిచ్చాడు.

"ఆ పచ్చడబ్బా కాలిపోకూడదు"

రెండుగజాల దూరంలో కాఫీ తాగుతున్న డాక్టరు, విశ్వనాథము త్రుళ్ళి పడ్డారు

"1953 నుంచి ప్రాణాధికంగా దాచుకుంటున్న నా ఉత్తరాలు కాలిపో గూడదు."

"శాంతా! ఏమిటీ నీవనేది? మెలకువతోనే ఉన్నావా?" దగ్గరగా వచ్చి కదిలించి పలకరించాడు విశ్వనాథం

శాంత కళ్ళు తెరిచి విశ్వనాథం ముఖంలోకి సూటిగానే చూసింది

"నా ఉత్తరాలు! నా పెట్టె! వాటిని చూసుకుని కష్టాలన్నీ మరచి బ్రతుకు తున్నాను" చేతుల్తో కళ్ళు మూసుకుని ఏడవటం మొదలు పెట్టింది

డాక్టరు విశ్వనాథం ముఖంలోకి చూశాడు విశ్వనాథం తలవంచుకున్నాడు.

"జ్వరం నూటనాలుగు దాటుతున్నది జ్వరం తగ్గితేగాని పలవరింతలు తగ్గవు ఐస్‌నీళ్ళలో ముంచిన బట్ట నుదిటిమీద వెయ్యండి."

డాక్టరు వెళ్ళిపోయిన తరువాత విశ్వనాథం శాంత మంచందగ్గరనే కుర్చీ వేసుకుని కూర్చున్నాడు ఆమె కళ్ళు మూసుకుని పడుకుంది కాని అప్పుడప్పుడు పలవరిస్తూనే ఉంది విశ్వనాథం ఆదుర్దా పడుతున్నాడు

"1953 లో క్వీన్‌మేరీస్ కాలేజీ హాస్టల్లో ఉండగా నీ ఉహాత్తరాలకోసం ప్రతిరోజూ సాయంత్రం కాగానే వరండాలోకి వచ్చి నిలబడి పోయేదాన్ని నిరీక్ష

జాలో పడ్డ బాధంతా నీ ఉత్తరం గ్రీష్మంలో శీతల వాయువులా సేదతీర్చేది. ప్రభూ ! నీ ఉత్తరాలన్నీ భద్రం చేసుకుని ప్రతినిత్యం కళ్ళలో చూసుకుని తలుచుకుంటే నా హృదయం పురివిప్పిన మయూరిలా నాట్యం చేస్తుంది. నన్ను మర్చిపోయావా ప్రభూ !''

విశ్వనాథం దిగ్భ్రాంతుడయిపోయాడు. తన వివాహం 1955 లో జరిగింది. దేహము కంపించిపోయినది. ఐస్‌నీళ్ళలో బట్ట మరొకసారి తడిపి ఆమె నుదుటి మీద వేశాడు.

ఆనాడు శాంత బలవంతంమీద ఒకకప్పు పాలుతాగింది. రాత్రంతా మగతగా పడుకునే ఉన్నది. మధ్య మధ్య మూలుగుతున్నది.

ఉదయం విశ్వనాథం లేచి జ్వరం చూశాడు. నూరుకి మించలేదు. ముఖం పీక్కుపోయింది శాంతకు. కళ్ళు గుంటలు పడ్డాయి. మాట బావిలోంచి వచ్చినట్టుగా ఉన్నది. డాక్టర్ని చూసి లేచి కూర్చోబోయింది.

''నిన్నటికంటే తేలిగ్గా ఉందికదండీ'' శాంత నాడిచూస్తూ పలకరించాడు డాక్టరు.

అవునన్నట్లు తల ఆడించింది.

విశ్వనాథం చెప్పాడు రాత్రంతా పలవరించిందని.

''జ్వరతీవ్రతండీ. జ్వరం తగ్గగానే ఆ లక్షణాలన్నీ వాటంతట అవే తగ్గిపోతాయి. రేపటికింకా నయమయిపోతుంది. ఆ మంటలు చూస్తుంటే ఎవరికయినా గాభరా ఎత్తుతుంది. అందులో ఒళ్లు కాలిందాయెను.''

సా యం కా లా ని కి కూడా శాంతకు జ్వరం హెచ్చలేదు. బాగా నిద్రపోయింది.

మరునాడు ఉదయం కాఫీ తాగుతూ ''మన యిల్లు పూర్తిగా భస్మమయిపోయింది శాంతా !'' అన్నాడు విశ్వనాథం ఆమె ముఖంలోకి చూస్తూ.

ఆమె ముఖం దిగాలుపడిపోయింది.

"నీవు మండుతున్న ఇంట్లోకి ఎందుకు వెళ్ళావు? ఒళ్లు పైపైన కాలింది కనుక సరిపోయింది కాని లేకపోతే ఎంత ప్రమాదమయేదో" ఆతడి దృష్టి ఆమె గర్భంమీద పడ్డది.

శాంత కళ్లు దించుకుని కాఫీగ్లాసు క్రింద పెట్టింది.

"నీవు మొన్న ఎలా కలవరించావో తెలుసా 1853లో ఉత్తరాలంటూ కలవరించావు చాలాసేపు."

శాంత గతుక్కుమన్నది పైకి కనబడనీయకుండా సర్దుకుని విషాదంగా నవ్వింది.

ఆమెలో జరిగిన సంచలనాన్ని వోకంటకనిపెడుతూ విశ్వనాథం ఆలోచనల వలయంలో చిక్కుకుపోయాడు. 1953 లో శాంత ఎక్కడుంది?

ఆ రాత్రి విశ్వనాథం సామాన్లకి కాపలాకాసినట్టుగా మేలుకునే ఉన్నాడు. నిద్రపోతున్న శాంత ముఖంచూస్తూ భావతంగాలు ముసురుకోగా ఆచావడి చుట్టూ తిరుగుతున్నాడు.

శాంత హాస్టల్లో ఉండగా ఎవరో ప్రేమలేఖలు వ్రాసిఉండాలి. పావలా డబ్బులకు కాపలావాళ్ళు లొంగిపోతారు. హాస్టల్లో ఉంచే ఏం- ఒంటిస్తంభం మేడమీద ఉంచేనేం-ఆడది ఆడదే మర్మంముందుపుట్టి ఆడది తరువాత పుట్టింది కలవరింతలు నిజాన్ని బయటపడేస్తూ ఉంటాయి. సముద్రం హోరుపెట్టినట్టుగా హృదయం హోరుపెడుతోంది. గాలివానకు వూగిపోయే వృక్షంలా ఉంది అతడి మనసు.

విశ్వనాథం తలుపూ ద్వారబంధమూలేని చావడిలో పదిహేనురోజులు ఉండిపోవలసి వచ్చింది అంతలో క్రొత్తయిల్లు తయారయింది ఒకగది పూర్తికాగానే. గృహప్రవేశమయ్యారు క్రొత్త యింట్లో ప్రవేశించారు వెంటనే

శాంతలేచి మామూలుగా తిరుగుతున్నది. సామాన్లు ఒక్కొక్కటే తీసి వర్దించుకున్నది డ్రస్సింగ్ టేబుల్ అద్దంతుడిచింది సొరుగులు సర్దుతూ ఉండగా లేతపసుపురంగు పచ్చడబ్బా బయటపడ్డది. ఆమెముఖం ఒక్కసారి ప్రకాశించి ప్రఫల్లమయింది. ఈ డబ్బా! దీనికోసమే కాలుతున్న యింట్లోకి వెళ్ళి వెదికింది విశ్వానాథం చూడకుండా రెండుసార్లు వెళ్ళి గాలించింది. ఆ పెట్టె తన ప్రాణంలో

ప్రాణం. దాన్ని గుండెకానించుకుని కళ్లుమూసింది. ఆనందంతో మూతతెరచి చూసుకుంది. గులాబీరేకులు తొలగించి పూలద్దిన జేబురుమాలుపైకెత్తి చూసింది. ఉన్నాయి, తన ప్రాణ సమానమయినవీ అమృత సమానమయినవీ ఉన్నాయి. భద్రంగా పెట్టిన మడతలు పెట్టినట్లే ఉన్నాయి. ఆ పెట్టె ఒకసారి కళ్ళకద్దుకుని అటికిడికి వెనక్కు తిరిగి చూసింది విశ్వనాథం తల దువ్వుకుంటూ నిలబడి ఉన్నాడు.

పట్టుబడిన అపరాధిలా శాంత గతుక్కుమన్నది. తలదించుకుని ఆ రోజల్లా తప్పించుకు తిరిగింది.

కొత్త ఇంట్లోకి వచ్చి నెలరోజులన్నా గడవక ముందే విశ్వనాథాన్ని పెంచిన పెత్తల్లికి సుస్తీగా ఉందని టెలిగ్రాము వచ్చింది స్థలం మార్పు కోరుకుంటున్న విశ్వనాథానికి అదొకమంచి సాగుగా కనబడ్డది.

''ఎన్నాళ్ళు మీ ప్రయాణం ? ఉండమంటే ఉంటకుండా గృహప్రవేశానికి వచ్చిన మరునాడే అత్తయ్యగారు వెళ్ళిపోయారు. మీరు వెళ్ళి వెంటనే తీసుకు వచ్చేయండి ' ఆదుర్దా పడుతూ అన్నది శాంత.

''నేను దగ్గర ఉండి మందుయిస్తుంటే అదే తగ్గి పోతుంది'' ముభావంగా ముందడుగు వేశాడు. చీరె మార్చుకుని వాకిటి గడపదగ్గిర నిలబడ్డ శాంత స్టేషనుకు విశ్వనాథం రమ్మంటే వెడ్డామనిచూసింది.

అతడు సూట్ కేస్ తీసుకుని బండీ ఎక్కాడు.

విశ్వనాథం పెత్తల్లి శాంతను గురించి గుచ్చిగుచ్చి ప్రశ్నించింది. సుస్తీ తగ్గిపోయి నాలుగోనాటికల్లా తిని తిరగటం మొదలు పెట్టింది. విశ్వనాథం బట్టలు సర్దుకున్నాడు.

"ఇంతదూరం వచ్చావు. వారమన్నా కాకముందే బయలుదేరుతున్నావు. శాంత ఉత్తరం చూశాక నాకు ఉండబుద్ధికావటంలేదు. రేపు ఒక్కరోజూ ఉండు. నేనూ వస్తాను."

''నేను ఇంటికి వెళ్ళటంలేదు అమ్మా. మదరాసు వెళ్ళాల్సినపని ఉంది. మెయిలులో నన్ను వెళ్ళనీ.''

"లేనిలేనిదాన్ని ఒక్కతెనూ ఇంట్లో వదలిపెట్టి ఊళ్ళు పట్టుకుతిరుగుతావా? నామాటవిని ఇప్పటికి నీ ప్రయాణం వాయిదా వేసుకో"

"లెదు లే"దంటూ విశ్వనాథం తల తిప్పాడు

ఏమయినా వద్దువద్దంటే పంతంకొద్దీ చేసితీరే విశ్వనాథం స్వభావం ఆమెకు గుర్తుకువచ్చి నవ్వుకుంది. "నీసంతమే పంతం. సమయాసమయాలు చూసుకో కుండా ఏమిటాతిరగటం ? ఈ విషయంలో కూడా నీకొకరు చెప్పాలా ?" మంద లించింది తులశమ్మ.

విశ్వనాథం శాంతను గురించి ఆలోచనలన్నీ మెదడులోనుంచి బయటికి నెట్టివెయ్యాలని అనేక విధాలుగా ప్రయత్నిస్తున్నాడు ఆమెకు దూరంగా ఉండా లనుకున్నాడు ఈ పది సంవత్సరాలనుండి ఆమె జీవితంతో అతడి ఆలోచనలూ అలవాట్లూ పెనవేసుకు పోయాయి వాటినన్నిటినీ ఛేదించివేయాలి పది సంవత్స రాల జీవితాన్ని ఒక సుస్వప్న మనుకోవాలి. ఇదంతా మర్చి పోవటానికి దూరంగా పోవాలి ఆమెమాట, ఆమెగాలి—ఆమెను గురించిన భావన ఏదీ తన దరికి రాకూడదు

రైలు పెట్టెలో కూర్చుని చదవటానికి పత్రిక విప్పేడు శాంత భద్రంగా దాచుకుని కళ్ళ కద్దుకున్న ఉత్తరాల పెట్టె కంటిముందర ప్రత్యక్షమయింది పది సంవత్సరాల దాంపత్య జీవితం తరువాత తన పూర్వప్రణయ చిహ్నాలను భద్రంగా దాచుకుని చూసి మురిసిపోయే శాంతపట్ల కసి పెరుగుతోంది ఆమెకు దూరంగా ఉండాలని మనసు పరుగెత్తటం మొదలు పెట్టింది పరుగెత్తే మనసును ఉత్తరాల పెట్టె వెంబడిస్తోంది. విశ్వనాథం ముఖంలో కోపం అసహ్యం రోషం బుస్సున పైకి పొంగాయి.

తులశమ్మ యింట్లో అడుగు పెడుతుండగానే వెంకన్న ఎదురువచ్చి "అమ్మ గారికి పురుడువచ్చి ఇవాల్టికి నాలుగు" అన్నాడు

"నాలుగు సామాన్లూ సర్దుకుని వద్దామనుకున్నా. ఇంతలోకే సుస్తీ చేసింది విశ్వం నిన్ను వదలిపెట్టి మదరాసు ఎందుకు వెళ్ళినట్టు ?" తులశమ్మ కొడుకును కసురుకుంటూ పురిటి గదిలో అడుగు పెట్టింది

శాంత కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తులశమ్మ చూడకుండా ముఖం తిప్పు కుంది.

విశ్వనాధం కోర్టు తెరిచిన నాడే ప్రొద్దటిపూట రైలులో దిగాడు. అతడు గడపలో కాలు పెట్టగానే తులశమ్మ చివాట్లుపెట్టింది. నిర్లిప్తతగా నవ్వి లోపలికి వెళ్లాడు.

తులశమ్మ పాపాయికి పేరు పెట్టించాలని ఎంతో ఆశపడ్డది.

"నీ కిష్టమయిన పేరుతో పిలుస్తూ ఉండు." విశ్వనాథం అన్నమాటలో తులశమ్మ కెంతో వైరాగ్యము నిర్లిప్తత గోచరించాయి. పోయిన బిడ్డలను జ్ఞప్తికి తెచ్చుకుని ఆమె మరిమాట్లాడలేదు.

విశ్వనాథం ఇంట్లో మామూలుగా ఏమీ జరగనట్లే మామూలుగా తన పని చూసుకుంటూ కోర్టుకు వెళ్ళుతున్నాడు అతడి మనసులో పీఠం వేసుకునికూర్చున్న అనుమానం ఇంటికి రాగానే తలఎత్తి బుస్సు మంటున్నది. అతడి అరికాళ్ళ క్రింద నిప్పులు పోస్తున్నది. అతడు లాపుస్తకాల నన్నిటినీ ప్రక్కకు పెట్టి ఇతర గ్రంథాలను తిరగవెయ్యటం మొదలుపెట్టాడు.

శాంతకు అతడి నిదిలింపులూ ముభావమూ దూరదూరంగా తిరగటమూ మరొక విధంగా అర్థమవుతున్నాయి. ముగ్గురు బిడ్డలు పోయిన విచారంతో ఈబిడ్డ మీద మమతలు పెంచుకోదలచలేదనుకుంది. కాని తనుమాత్రం పసి బిడ్డ పనులలో మునిగిపోయి క్రొత్త ప్రపంచాన్ని సృష్టించుకున్నది

ఉదయం ఎనిమిది గంటలవేళ. విశ్వనాథం కట్టించిన క్రొత్త యింటిచుట్టూ పూలచెట్లు రంగురంగుల పూవులు విచ్చి ఆయింటి అందాన్ని ఇనుమడింపచేస్తున్నాయి. వాటి ముందు ఎర్ర మొక్కల బార్డరు మరింత అందాన్నిస్తున్నది. పారిజాతాలు భూమి కనబటకుండా రాలాయి. పెరటి వైపు మందారాలూ మల్లెలూ విచ్చుకుని చిరుగాలికి తలలూపుతూ రండి రండి అని అందరినీ పిలుస్తున్నాయి. చెట్టు చెట్టునూ ముట్టుకుని చూసి క్షేమ మడిగి ముందుకు పోతున్నాడు విశ్వనాథం. బోగన్ విలా అన్ని రంగులలో ఇంటిప్రహరి గోడపైకెక్కి ముట్టుకున్నవాళ్ళను ముళ్ళతో గుచ్చుతున్నది నాలుగు ప్రక్కలా కలియజూసి విశ్వనాధం వెనక్కి తిరిగాడు. సాంబశివరావు నవ్వుతూ నిలబడ్డాడు ఎదురుగా.

"హఠాత్తుగా ఇలా వూడి పడ్డావేం? ఉత్తరమ్ముక్క వ్రాస్తే స్టేషనుకువచ్చే వాడినిగా!" చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకు వెళ్ళాడు.

కాఫీ ఉప్మా తీసుకుంటూ "ఒరేయ్! నీచేత్తో నీవొక కార్డుముక్క వ్రాయలేక పోయావుని యింట్లో లక్ష్మి పుట్టిందంటూ, పైగా ఇంటికి వచ్చిన వాడిని పట్టుకుని ఉత్తరం వ్రాసి రాలేదంటున్నావు ఏమిట్రా నీ జబర్దస్తీ?"

"నిజం నిజం అలా అడుగు నాయనా వాడిని" అంటూ తులశమ్మ ఉప్మా మారు వడ్డించింది

తల వూపుతూ లేచి వచ్చి సాంబశివరావు బుజం తట్టాడు విశ్వనాథం.

ఖాళీ కప్పు క్రింద పెడుతూ "మా ఆవిడ తన ప్రియస్నేహితురాలి బిడ్డను చూసిరండని పోరుపెడితే పడలేక వచ్చాననుకో!"

"చెప్పావు అసలు సంగతి! నీవు పెళ్ళయిన తరువాత మరి నాకు కనబడ్డావా చెప్పు? నీవు ఎక్కడుంటున్నదీ ఏం చేస్తున్నదీ ఒక్కమాటయినా నాకు వ్రాశావా చెప్పు?"

"ఇప్పుడు చెప్ప కుంటానా? పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా ఉద్యోగం వెలగ బెడుతున్నా అదీ పురుష లక్షణం కోసమే."

తులశమ్మ బిడ్డను తీసుకువచ్చి సాంబశివరావు చేతి కిచ్చింది. అతడు ఆబిడ్డ ముఖంలో కనబడుతున్న పోలికలను వర్ణిస్తున్నాడు

ఏడుస్తున్న బిడ్డను తీసుకుపోవటానికి వచ్చిన శాంత సాంబశివరావును చూసి నివ్వెర పోయింది తడబడుతున్న కాళ్ళతో బిడ్డను లోపలికి తీసుకువెళ్ళింది అతడిని చూసినప్పటినుండీ ఆమెకు కాళ్ళూ చేతులూ వణకటం మొదలు పెట్టాయి. బిడ్డ ప్రక్కనే ఒరిగి నీరసంగా కళ్ళు మూసుకుంది గతచరిత్ర ఫిల్మురీలులా గిరగిర తిరుగుతున్నది ఆమె మనసులో దాని నుండి తప్పించుకోవటమెట్లా? తలఎత్తి ఒక్క సారి విదిలించి మళ్ళీ దిండుమీదికి వాల్చింది

పదకొండేళ్ళ పిల్ల పుట్టక పూర్వమే తండ్రిని పోగొట్టుకున్నది ఏడవ ఏట తల్లి చనిపోతూ మేనమామ చేతిలో పెట్టింది. మామయ్య లేనప్పుడు అత్తయ్యే

ఇంటెడుచాకిరీ చేయిస్తూ నెత్తిమీద మొట్టుతూ ఉండేది. సాయంత్రము వేళల్లో మామయ్య ఆ పిల్లను ఒంటరిగా దగ్గరికి తీసుకుని వోదారుస్తూ కన్నీళ్ళు తుడుస్తూ ఉండేవాడు. ఆ మాటల్లో ప్రొద్దటినుండీ పడ్డ బాధలన్నీ మర్చిపోగలిగేది. ఒకనాడు అత్తయ్య పొరుగింటికి వెళ్ళుతూ కాఫీ డికాక్షన్ వెయ్యమని చెప్పింది. కుంపటి మీద ఉన్న గిన్నెను గుడ్డతో పట్టుకుని ఫిల్టరులో పోస్తున్న పిల్లకు చేతికి ఆవిరి కొట్టింది. ఆమె చేతిలో ఉన్న గిన్నెజారి ఫిల్టరుమీద పడటము, ఇది దొర్లిపోవ టమూ అనుకోకుండా ఒక్క క్షణంలో జరిగిపోయాయి. మళ్ళీ నీళ్లుపెట్టటానికి కాఫీపోడిలేదు. భయంతో గజగజ వణకుతూ కుంపటికి ఎదురుగా కూర్చుంది తల వంచుకుని. మూడుగంటల వేళకు అత్తయ్య వచ్చింది కాఫీ కలపమంటూ అరగంట యినా కదలకపోతే జుట్టు పట్టుకుని హాల్లోకి లాక్కొచ్చి ఈ చెంప ఆ చెంపా వాయించింది.

ఆపిల్లకానాడు ఆ దెబ్బలకు ఏడుపురాలేదు. ముఖం కందగడ్డలా అయింది. తల వంచుకొని గోడవారగా నిలబడి ఒక నిశ్చయానికి వచ్చింది. తనకెవరు లేరు ఉన్న మామయ్య వోదార్చటమే కాని తననేమీ కష్టాలనుంచి రక్షించలేడు. అత్త య్య లోపలికి వెళ్ళినప్పుడు పెరటి తలుపుతెరుచుకొని అలసిపోయేవరకూ పరుగె త్తింది. ఆ పరుగుచూసి పోలీసులుపట్టుకున్నారు. కోర్టులో విచారణ జరిగింది. తన కెవరూ లేరన్నది. ఏ తప్పుపని చెయ్యలేదన్నది. అయినా వాళ్ళు తీసుకునిపోయి బాలనేరస్థుల పాఠశాలలో చేర్పించారు.

ఆడుకోవటానికి, సహవాసము చెయ్యటానికీ పాఠశాలలో అరవై మంది వున్నారు. మెట్రిక్‌వరకూ చదువుకోవచ్చు. కాని ఆ పిల్లలంతా దొంగతనం చేసి ఈ పాఠశాలకు వచ్చారు. టీచర్లు వాళ్ళను నీచంగా చూస్తున్నారు. ఆ పిల్లల పాఠ శాలలో కూడా బట్టలూ, రిబ్బన్లూ, తలపిన్నులూ పువ్వులూ ఒకరిని ఒకరు దొంగి లించుకుని నీచాతినీచంగా తిట్టుకుని కొట్టుకుంటారు. ఈ పదకొండేళ్ళ పిల్ల ఎవరి తోను ఆడుకోదు. ఎవరితోనూ మాట్లాడదు. తనలోతాను ఏవో పాటలు పాడు కుంటూ ఉంటుంది. ముంగి అంటూ. తోటిపిల్లలు పిలిచినా తలఎత్తదు. ఆమె మెట్రిక్ ప్యాసయ్యేవరకూ పద్దెనిమిది సంవత్సరాలు వచ్చాయి.

ఆ పాఠశాల సలహాసంఘ సభ్యురాలు లక్ష్మీదేవమ్మను ఆపిల్ల ఆకర్షించింది. ఆమెకు చనిపోయిన తన రెండవ కుమార్తె శాంత ఆ పిల్లలో కనిపించింది. ఆ పిల్ల

సంరక్షణభారం తాను వహిస్తానని చెప్పి తీసుకువచ్చి తన పిల్లలతోపాటు మదరాసు పంపి క్వీన్ మేరీస్ కాలేజీలో చేర్పించి హాస్టల్లో ఉంచింది ఆపిల్లను శాంత అని పిలుస్తూ మనసును శాంతింప చేసుకుంటున్నది

శైశవంలో మేనత్త మేనమామలవద్ద, కౌమారంలో బాలనేరస్థుల పాఠశాలలో పెరిగిన శాంతలో ముఖమాటం మూటకట్టినట్టుగా ఉంటుంది చూపులో బెరుకుతనం మనసులో జంకు బాగా పాతుకుపోయాయి ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉంటుంది ఉత్సాహాన్ని సంతోషాన్ని పైకి పొంగనీయదు

లక్ష్మీదేవమ్మ పెద్దకూతురు ప్రభావతి అందరితోనూ కలుపుగోరుగా మాట్లాడుతూ వుండేది. ఆమె తాను ఉత్సాహంగా ఉల్లాసంగా వుంటుంది ఎదుటి వారిలో కూడా వాటిని ఉద్భవింపచేస్తుంది శాంత తలఎత్తి నలుగురితోనూ మాట్లాడే టట్టు ఆమె చేసింది జమీందార్ కుటుంబంలో మంచి సంబంధం చూసి ప్రభావతికి వివాహం చేశారు ఆమె వెళ్లినప్పటినుండీ శాంత మళ్లీ ఒంటరిదయింది | ప్రభావతి అత్తవారింటినుంచి శాంతతో బెరుకుతనం, నిరుత్సాహము, మందకొడితనం పోగొట్టాలని ఉత్తరాలు వ్రాస్తూ వుండేది. ముఖ్యంగా వాటిలో ఒక ఉత్తరం జీవం లేని శాంతకు జీవం పోసింది. ఆ ఉత్తరం ఎప్పుడు చదువుకున్నా శాంతలో నూతనోత్సాహము కలుగుతుంది. హృదయం ఆనందంతోనిండి, పొంగులువారి ఒడ్డు లొరుసుకుంటూ ఉరవడితో ప్రవహించే జీవనదిలా ఉంటుంది

మరుసటి సంవత్సరం శాంత బి ఎ ప్యాసు కాగానే లక్ష్మీదేవమ్మ తన భర్తకు జూనియరుగా ఉన్న విశ్వనాథానికి ఇచ్చి వివాహం చేసింది.

అత్తవారింటికి వెళ్లేనాడు శాంత ఆమె కాళ్లకు నమస్కరిస్తూ "అనాథగా వీధిలో తిరిగే చింపిరి బట్టల పిల్లను తీసుకువచ్చి కడుపులో పెట్టుకొని పెంచారు. పెళ్లి చేశారు. నేను మీ ఋణం ఎలా తీర్చుకోను?" కన్నీళ్లు రాల్చింది

శాంత కన్నీళ్లు ఒత్తుతూ "నీవు మా శాంతవు" అంటూ గుండెకు హత్తుకుంది లక్ష్మీదేవమ్మ.

శాంత అలా గాలివాటుగావచ్చి సంపన్నుడయిన విశ్వనాథం యింట్లో పడ్డది. విశ్వనాథం ఆమె సౌందర్యాన్నీ విజ్ఞానాన్నీ అన్నిటినీ మించి ఆమెలో

పాతుకుపోయిన వినమ్రతనూ రెప్పవాల్చకుండా తనివితీరా చూస్తాడు. శాంత తనకు ప్రభావతి వ్రాసిన ఉత్తరాలను తలుచుకుంటూ పులకలుదేరుతూ వుంటుంది. లక్ష్మీ దేవమ్మ అవుదార్యాన్ని దేనితో కొనాలా అని ఆలోచిస్తూ వుంటుంది.

పొద్దుపోయి భోజనం చేసిన విశ్వనాథం సాంబశివరావులు కాఫీ తాగేవరకూ శాంత నిద్రపోయింది. ఆ పగటినిద్రలో పీడకల. సాంబశివరావు పెద్ద దయ్యంలా కనబడుతున్నాడు. బాలనేరస్థుల పాఠశాల నుంచి వచ్చిన దొంగపిల్ల అని వేలెత్తి తనను పదిమందిలో చూపుతున్నాడు. విశ్వనాథానికి ఆమెమీద జుగుప్స కలిగిస్తున్నాడు. శాంత కెవ్వున కేకవేసింది.

"నిద్రలో జడుసుకున్నావా శాంతా?" తులశమ్మ పరుగు పరుగున భోజనాల యింట్లోనుంచి వచ్చింది. మంచంమీదినుంచి క్రింద పడిన శాంతను లేవనెత్తింది. తాగుతున్న కాఫీ వదలిపెట్టి సాంబశివరావు వచ్చాడు. విశ్వనాథం అతడి వెనకాలే వచ్చాడు.

అందరినీచూసి శాంత సిగ్గుపడ్డది. నిద్రలో వెనక్కు జరిగానంది, తలవంచుకుంటూ.

ఆ రాత్రి మిత్రు లిద్దరూ వరండాలో మంచాలు వేయించుకుని చిన్ననాటి కబుర్లు చెప్పుకుంటున్నారు.

"నేను యింటికి వెళ్ళగానే ఇక్కడికి మా ప్రభ ప్రయాణం. వాళ్ళిద్దరూ ఒకరి నొకరు చూచుకుని చాలాకాలమయింది."

విశ్వనాథం దేహమంతా ముళ్ళ ముళ్ళుగా తేలింది. పడుకున్న వాడల్లా లేచి కూర్చున్నాడు. సాంబశివరావుతో అప్పటినుంచీ ఉత్సాహంతో మాట్లాడుతున్న విశ్వనాథంలో ఆ ఉత్సాహమంతా మాయమయి పోయింది. కనుబొమలు ముడి పడ్డాయి. అణగిఉన్న రోషము, కోపం, కసిబుస్సున పైకి పొంగాయి.

"నీవు అన్నీ తెలిసిన పెద్దమనిషి వనుకున్నాను. నీచ సంబంధాలను ప్రోత్సహించే అప్రాచ్యుడ వనుకోలేదు." మంచంమీద నుండి ఉద్రేకంతో లేచాడు విశ్వనాథం.

రెండు చేతులూ అడ్డంపెట్టుకుంటూ లేచాడు సాంబశివరావు.

ఉద్రేకంతో లేచిన విశ్వనాథం తన గదిలోకి వెళ్లి తలమీద రెండు చేతులూ పెట్టుకొని కళ్లు మూసుకున్నాడు. ఇంటికి వచ్చిన అతిథి తనకి సహాధ్యాయి. ప్రాణస్నేహితుడు. చిరకాలానికి కలుసుకున్నారు కాని తన ఉద్రేకాన్ని ఆదుపులో పెట్టుకోలేక పోతున్నాడు. సిగ్గుతో కుంచించుకుపోయి జుట్టు పీక్కున్నాడు విశ్వనాథం

సాంబశివరావు మెల్లగా లేచి గదిలోకి వెళ్లి విశ్వనాథం భుజమ్మీద చెయ్యి వేశాడు

"విశ్వం ! ఉద్రేకంలో నీ వేమన్నావో నాకేమీ అర్థం కాలేదు. శాంతను చూడటానికి మా ప్రభు వస్తానంటే పంపుదామనుకున్నాను. నీ కిష్టం లేకపోతే మానేస్తుంది ఏమయినా నేను మాత్రం ఈ పన్నెండు గంటల రైలులో వెళ్ళితీరాలి. టిక్కెట్టుకూడా వచ్చిననాడే కొని రిజర్వు చేసుకున్నాను. నా మాటలవల్ల నీకేమయినా కష్టం కలిగితే క్షమించు వస్తా " వెనక్కు తిరిగాడు.

చడీ చప్పుడూ లేకుండా వాళ్ళిద్దరి మధ్య వచ్చి నిలబడ్డది శాంత "ప్రభు నాకు దైవ సమానురాలు మీరు వెళ్ళి సంపటం కాదు. ఇక్కడవుండే టెలిగ్రాము యివ్వండి వెంటనే బయలుదేరమని. స్వయంగా వచ్చి పాపను దీవించమనండి" సాంబశివరావు కదలకుండా శాంత ద్వారబంధానికి అడ్డముగా నిలబడ్డది

"అవునురా సాంబూ ! నాకూ ఆ దేవతాదర్శనం యిప్పించరా నాఅపోహలన్నీ తొలగి పోయాయి. నన్ను క్షమించు సాంబూ. ఇందాకటి నా మాటలకు కోసము తెచ్చుకోలేదు కదూ. నా స్వభావం నీవు ఎరుగనిదిట్రా'' సాంబశివరావు చేతులు పట్టుకుని గుండె కానించుకున్నాడు.

పిల్ల ఏడుపు విని శాంత వాళ్ళిద్దరి మధ్యనుండి దూరి లోపలికి వెళ్ళింది తృప్తిగా

సుడిగాలికి కళ్ళలో దుమ్ము పడ్డది కాని త్వరలోనే కళ్ళు తెరిపిడికి వచ్చాయి. ఏదీ సుడిగాలి ? ఎటునుంచి వచ్చింది. ఎటు వెళ్ళింది ? ఎన్నడు మాయమయింది ? అర్థంకాక సాంబశివరావు విశ్వం ముఖంలోకి చూశాడు.

(ఆంధ్ర సచిత్ర వారపత్రిక)

# నీ రూపం - నా తెలివి

"సుకుమాంజలీ! ఎక్కడున్నావు?" బరువుగా నిట్టూర్చాడు భవానీప్రసాద్ ఎదురుగా టీపాయిమీద ఉన్న ఏష్ట్రేలో సిగార్ బూడిద దులిపాడు చల్లారిపోయిన కాఫీ కప్పును చేత్తో పక్కకునెట్టాడు కిటికీలోనుంచి బైటికి దృష్టిపోనిచ్చాడు. శూన్యంలో చూపులు దేనినో వెదుక్కోవటం మొదలుపెట్టాయి.

సాయంకాలము అయిదు గంటలు దాటింది. ప్రొద్దువాలుతున్న లక్షణాలను ప్రకృతి పొదివిపట్టుకుంది.

కాంతి రహితమయిన చూపులతో భవానీప్రసాద్ నిశ్చలంగా కూచ్చున్నాడు ఆ ఉదయం కారులో బయలుదేరి కటకటాల వెనుక చిలిపిచూపులతో నవాలు చేస్తున్నట్లు నిలబడ్డ రాణిని చూసినతరువాత అతడికి మతిపోయినంత పనైంది.

"నేను విన్నది నిజమేనా!" ఆమె దృష్టినుండి మళ్ళించుకుంటూ అడిగాడు.

"అక్షరాల, కాకపోతే ఇక్కడికెందుకు వస్తాను?" పెదవులలోనుంచి కొంటెతనం తొంగిచూస్తున్నది. జరిగినదానికి పశ్చాత్తాపము ఎక్కడా కనబడలేదు.

అతడికి దుఃఖము అలలు అలలుగా పొంగి ఉవ్వెత్తున పైకిలేచింది. ఆమె కెదురుగా నిలబడ్డాడు కాని చూపులు ఎటో తిరుగుతున్నాయి. గతం చెదురుమదురుగా కళ్ళముందర తిరుగుతోంది

తలఆడిస్తూ బరువుగా నిట్టూర్చి 'వస్తా'నంటూ వినీ వినబడనట్టుగా గొణుక్కుంటూ బైటికినడిచాడు. కారులో కూర్చుని విసురుగా తలుపువేసుకుంటూ "వకీలు మురహరిరావుగారింటికి పోనీ" అన్నాడు.

కారుడ్రైవరు తెల్లబోయి "ఎక్కడికి బాబూ?" అడిగాడు. భయపడుతూ.

"హోటల్ మిధిల సందులోకి" జేబులన్నీ తడుముకుని సిగార్ వెలిగించాడు

వకీలుతో ఏ విషయమూ దాచకుండా చెప్పి "ఏమయినా ఆశ ఉన్నదా ?" అడిగాడు తలవంచుకుని.

"ఇద్దరు స్నేహితులఎదుట సవాల్‌చేస్తూ అంతపని చేసిందంటున్నారు. పైగా పోలీసు స్టేషన్‌కు స్వయంగా వెళ్ళి చెప్పివచ్చిందంటున్నారు బాగా ఆలోచించి గాని చెప్పలేను. రేపు ఈ వేళకి రండి" లేచినిలబడ్డాడు వకీలు

భవానీప్రసాదు ఇంటికి వచ్చాడు-భోజనం సహించలేదు పడుకుని లేచేటప్పటికి సుమాంజలి ఎదురుగా నిలబడ్డట్టయింది

భవానీప్రసాద్ పెద్దఎత్తున వ్యాపారంచేస్తూ ఆ పనులమీద బొంబాయి కలకత్తా మద్రాసు నగరాలు నెలకొకసారి తిరుగుతూ ఉండేవాడు ఒకసారి కలకత్తాలో అతడు ఒకపెద్ద హోటల్లో దిగినప్పుడు అర్ధరాత్రివేళ ప్రక్కగదిలో నుండి ఏడుపు వినబడ్డది భవానీప్రసాద్ గదిలోనుంచి బైటికివచ్చి చూశాడు ప్రక్కగది తలుపులు ఓరగావేసి ఉన్నాయి తలుపులు నెట్టుకుంటూ లోపలికి వెళ్ళటాని కతడికి ధైర్యము చాలలేదు కొంతసేపు అచే చూస్తూ నిలబడి లోపలికి వెళ్ళిపోయాడు.

మరునాడు ఉదయం ఎనిమిది గంటలకు భవానీప్రసాద్ తన గదిలోనుంచి బైటికి రాగానే మినమినలాడే యవ్వనంలో ఉన్న ఇరవైఏళ్ళ పడుచు కనబడ్డది చూడగానే తలవంచుకుని లోపలికి వెళ్ళిపోయింది భవానీప్రసాద్ కాఫీ టిఫిన్ తెచ్చిన బాయ్‌నడిగి ఆమెను గురించిన సమాచారమంతా సేకరించాడు? ఆమె పేరు సుమాంజలి ఆమెను తండ్రి తీసుకువచ్చి వదిలిపెట్టి చెప్పకుండా వెళ్ళిపోయాడు మధ్యాహ్నానికి భవానీప్రసాద్ ధైర్యంచేసి ఆమె గదిలోకివెళ్ళి కాఫీ టిఫిన్ ఆర్డరు చేసి సంభాషణలోకి దిగాడు. ఆ సాయంత్రానికల్లా ఒకయిల్లు అద్దెకు తీసుకుని హోటలు వదిలిపెట్టారు ఇద్దరూ

సుమాంజలిని చూసినక్షణంలో భవానీప్రసాద్‌కళ్ళు జిగేలుమన్నాయి. ముత్యపురంగు దేహచ్ఛాయ ఒక మహాశిల్పి చెక్కిన శిల్పంలా ఉన్నది ఆమె భవానీప్రసాదు మొదటచూడగానే ఆమె ఏపారశీకదేశపు చిన్నదో అనుకున్నాడు

అతడు అవివాహితుడే కాని బ్రహ్మచారిమాత్రం కాడు. అటువంటి అసమాన సౌందర్యాన్ని అతడంతకు పూర్వము చూసి ఎరగడు. రోజులు నిమిషాల మాదిరి అతడికి తెలియకుండా గడిచిపోయాయి.

భవానీప్రసాద్ కలకత్తాలో చూసుకోవలసినపని వారం రోజుల్లోనే ముగిసి పోయింది. కాని అతడు రెండునెలలయినా అక్కడినుంచి కదలలేక పోయాడు. అప్పటికి పదిపన్నెండు ఉత్తరాలు బొంబాయినుంచీ మద్రాసునుంచీ వచ్చాయి. అతడికి కలకత్తావదిలిపెట్టి వెళ్ళక తప్పలేదు, సుమాంజలిని వదిలిపెట్టి వెళ్ళాలని లేదు. కాని వెంట తీసుకువెళ్ళటానికి వీలులేని పరిస్థితి. అతడి విలాస జీవితానికి ఎక్కడికక్కడ అందగత్తెలైన నవయువతులున్నారు. కాని భవానీప్రసాద్ సుమాంజలిని వదిలిపెట్టి వెళ్ళటానికి సంశయించటం మొదలుపెట్టాడు. అతడికి తనతో గడిపిన స్త్రీలను గురించి యోచించే అలవాటులేదు. కాని సుమాంజలిని మరిచిపోకుండా ఉన్నాడు.

భవానీప్రసాద్ ఎంత స్త్రీలోలుడయినా వాళ్ళకోసం తన వ్యాపారాన్ని దెబ్బ తిననిచ్చే స్వభావం కలవాడు కాడు : మనసు వెనుకకు లాగుతున్నా నమ్మకమయిన నౌకరిని ఉంచి, సుమాంజలికి తగిన ఏర్పాటుచేసి బొంబాయి ప్రయాణమయ్యాడు.

రెండు నెలలపాటు మద్రాసు బొంబాయి తిరిగి వ్యాపారం చూసుకుని కల కత్తా వచ్చేటప్పటికి నిండుగర్భంతో సుమాంజలి ఎదురుగా వచ్చినది. అతడు కల కత్తాలో ఉండగానే రాణి పుట్టింది. అతడు మదరాసు వెళ్ళినా బొంబాయి వెళ్ళినా పదిరోజులకే పనులన్నీ ముగించుకుని తిరిగివస్తున్నాడు. రాణినిచూడగానే అతడి హృదయం పొంగటం మొదలు పెట్టింది.

రాణి మూడుమూర్తులా తల్లినిపోలింది. తండ్రిని వదిలిపెట్టకుండా కూడా తిరిగేది. భవానీప్రసాద్ సుమాంజలుల మధ్యకూర్చుని నవ్విస్తూ, మురిపిస్తూఉండేది.

"సుమా, రాణీదంతా నీ రూపమే" తనివితీరా ముద్దాడేవాడు భవానీప్రసాద్.

"రాణీదంతా మీతెలివే" అనేది సుమాంజలి రాణీబుగ్గలు పుణుకుతూ.

"నీరూపము-నాతెలివీ" గలగల నవ్వేవాడు భవానీప్రసాద్.

అనుకోకుండా పదేళ్ళరాణి ఒకనాటి పేకువజామున తల్లిలేనిదయిపోయింది మానసికంగా క్రుంగిపోయిన భవానీప్రసాదు రాణిని తనకంటిలో పాపలా కాపాడుతూ పెంచాడు తల్లీతండ్రీ తనే అయి తనవెంట తిప్పుతూ ఉండేవాడు

ప్రాణంలో ప్రాణంలా చూసుకున్న రాణి తనకన్నుకప్పి ఎంతపనిచేసింది !

భవానీప్రసాద్‌కు తల గిర్రున తిరగటం మొదలు పెట్టింది డబ్బును మంచి నీళ్ళలా ఖర్చుచెయ్యటం-విలాసంగా తిరగటం అలవాటు చేసుకున్నది రాణీతండ్రి చేసిన పెళ్ళి ప్రయత్నాలన్నీ విఫలం చేసింది ప్రతిరోజూ సాయంత్రం కారు తీసుకుని వెళ్ళిపోతుంది ఏ అర్ధరాత్రికో ఊగుతూ వస్తుంది

రాణి పిటపిటలాడే యవ్వనంలోఉంది చేతినిండా డబ్బుంది. స్వేచ్ఛగాతిరగటానికి అలవాటుపడ్డది భవానీప్రసాదు ఆమెనుఅలా వదిలిపెట్టలేదు వదలక ఏమీ చెయ్యలేదు

జీవితంలో జరిగిన సంఘటనలు ఒకదాని తరువాత ఒకటి ఫిల్మురీలులా అతడి కళ్ళఎదుట తిరగటం మొదలు పెట్టాయి ఎన్నడూ ఎరుగని అధైర్యం అతని విచలితుణ్ణి చేస్తున్నది భయంతో గజగజ వణకటం మొదలుపెట్టాడు

రైలుస్టేషన్లలో బస్సుస్టాండులో నేర్పుగా జేబులుకొట్టి పట్టుబడకుండా తిరుగుతున్న భవానీప్రసాద్ పాతికేళ్ళ వయసులో చందూలాల్ కంపెనీలో నౌకరుగా కుదిరాడు కలకత్తానగరంలో ఒంటరిగా ఉంటూ చేస్తున్న వ్యాపారం అభివృద్ధి చెందటం మొదలుపెట్టింది అతడు ఏడాది కొకసారి ఉత్తర హిందూస్థాన్ వెళ్ళి ఒక నెలరోజులు తన భార్యా పిల్లలతో గడిపి వచ్చేవాడు తన కాపరం అక్కడినుంచి తరలించితే తనవాటా అన్నలు మాయం చేస్తారని అతడి భయం చందూలాల్ ఊళ్ళోలేనప్పుడు భవానీప్రసాద్ వ్యవహారమంతా చక్కబెట్టేవాడు ఒకసారి చందూలాల్ కలకత్తా చుట్టుప్రక్కల పడవమీద ప్రయాణం చేస్తున్నప్పుడు అతడికి తెలియకుండా భవానీప్రసాదు వెనకగుండా వెళ్ళి నిద్రలో ఉన్న చందూలాల్‌ను నీళ్ళలోకి తోసివేశాడు. అతడు చనిపోయినట్టు నిర్ధారణ చేసుకుని వ్యాపారమంతా చేత చిక్కించుకున్నాడు. సంవత్సరం తిరక్కుండా మదరాసు బొంబాయి నగరాలలో కూడా వ్యాపారం సాగించటం మొదలు పెట్టాడు-

భవానీప్రసాద్ దేహం జలదరించింది. వందరూపాయల నోట్లు కట్టలకు కట్టలు అతడి కళ్ళ ఎదుట నాట్యం చెయ్యటం మొదలు పెట్టాయి.

మూడు మహానగరాలలో వ్యాపారం చేస్తున్నా అతనికి తృప్తి కలగలేదు. కొంతమందిని కూడగట్టుకుని దొంగనోట్లను ముద్రించటం మొదలు పెట్టాడు. జయమని సాగుతోంది ప్రభ అంతవరకూ అతడు అనుకున్నది సాధించటమేగాని అపజయమన్నది ఎరుగడు. క్రౌర్యమూ, కాఠిన్యమూ ముఖంలో కొట్టవచ్చినట్టున్నా విజయలక్ష్మి అతడినే వరించి వదలకుండా వెన్నాడుతూ ఉండేది.

సుమాంజలిని చూపిన క్షణంలో అతడిలో మార్పుగలగటం మొదలు పెట్టింది. ఆమె సౌందర్యమూ, లాలిత్యమూ అతడిని మనిషినిచేశాయి. ప్రేమ అంటే ఏమిటో తెలిసింది. రాణిపుట్టగానే అతనిలోని మమకారం వాత్సల్యం పెల్లుబుక నారంభించింది. ఒక దశాబ్దంలో క్రూరుడూ కఠినుడూ అయిన భవానీ ప్రసాద్‌లో కూడా ఇంత మమకారం ఉన్నదా అనిపించేటట్టుగా మారిపోయాడు. సుమాంజలి చనిపోయిన తరువాత అతడు నిస్తేజుడై పోయాడు. ఆమెమీద ప్రేమ కూడా రాణివైపుకు మరల్చాడు. అతడు పగలంతా ఎక్కడ తిరిగినా పడుకోబోయే ముందర సంతోషముతో గంతులువేసే రాణిని ఒక్కసారి అలాచూసి పక్కమీది కొరిగేపోయేవాడు.

అతడికి జీవితంలో మిగిలింది ఒక్క రాణియే. కోరినంత ధనం సంపాదించాడు చేతనైనంతవరకూ అమాయకులను మోసగించాడు. ప్రభుత్వం కళ్లు కప్పాడు. ధనకాంక్షతో చేయరానిపనులు చేశాడు.

ఇప్పుడు రాణి అతడిని మోసగించింది. అతది పరువు తీసింది. బజార్లో నిలబెట్టింది.

ఆనాడు తెల్లవారకముందే మిత్రుడు ముకుందరావు వచ్చాడు. రాణి సంగతంతా చెప్పాడు.

రాణి హోటల్ కశోజ్‌లో మణిలాల్‌తో ఉండగా శ్రీమన్నారాయణ్ చూశాడట. మరునాడు రాణి కనబడ్డప్పుడు ఆమెతో తగాదాపడి జాగ్రత్తగా మసలుకోకపోతే ఫలితం అనుభవించాల్సి వస్తుందని బెదిరించాడట. రాణి నవ్వుతూ, అత

డితో స్నేహంగా మళ్ళీ తిరగటం మొదలు పెట్టిందట దానితో అతడికి కోపం పోయి మామూలుగా రాణీతో తిరుగుతున్నాడట ఒకనాడు రాణి అతడికి కాఫిలో విషం కలిపియిచ్చి అతడి స్నేహితుల ఎదుట 'నాతో ఆనాడు తగాదా పెట్టుకున్న ఫలితం అనుభవించు, అని కసిగా అరిచిందట మామూలుగా కాఫీ తాగిన శ్రీమన్నారాయణ్ స్నేహితుల కులాసా కబుర్లలో మునిగి ఉన్నాడట. 'కాసేపటిలో చస్తావు' అని అరిచిందట రాణి ఆమె మాటలు వాళ్ళు లెక్క చెయ్యలేదు కాని ఆ మధ్యాహ్నానికి నిజమయ్యాయి కసితీరిన రాణి తానే పోలీసులకు వెళ్ళి చెప్పి-పట్టుపడిపోయింది

భవానీప్రసాద్ పెదవుల మధ్య సిగార్ కాలి మసి అయిపోయింది

"సుమాంజలీ నీ రూపం - నా తెలివీ రాణిలో ఉన్నాయని ఆనాడిద్దరమూ మురిసిపోయాము దాని పర్యవసానము చూడటానికి ఈనాడు నీవు లేవు. నేనొక్కడినీ మిగిలాను "

ఎర్రబడ్డ అతడి కళ్ళనుండి అశ్రువులు ధారలు కట్టాయి

ఆ రాత్రి భోజనం లేకుండా రెండు బీర్‌సీసాలు ఖాళీచేసి ఆ పడకకుర్చీలో అట్లాగే మాగన్నులో గడిపాడు.

మరునాడు ఉదయం ఎనిమిది గంటలవుతూనే వకీలు మురహరిరావు భవానీప్రసాద్‌కు ఫోను చేశాడు

"మీరు ఇక్కడికి వస్తానన్న వేళదాటింది బయలుదేరుతున్నారా ?"

"లాభం ఏమయినా ఉంటుందా ?" తడి ఆరిన గొంతుతో ప్రశ్నించాడు భవానీప్రసాద్

"రాత్రంతా ఆలోచించి ఆలోచించి ఉపాయాలు వెదికాను త్వరగా రండి. కేనికి మీరెంత ఫీజు ఇచ్చినా తక్కువే" ఖంగున మ్రోగింది కంఠం

"అలాగే-అలాగే" అన్నాడు భవానీప్రసాద్ కాని అతడు కుర్చీలోనుంచి కేకలేకపోయాడు.

లోకాన్ని భ్రమింపచేసే అందం !

లోకాన్ని మాయచేసే తెలివి !

రెండూ ఒక వ్యక్తిలో మూర్తీభవించి ఘోరమయిన పాపాలకు మూలకారణాలయ్యాయి.

సుమాంజలిలో లేని దుర్మార్గం ఆమెను పోలి పుట్టిన రాణిలో ఎందుకు ఉండాలి !

సుమాంజలిని చూపినప్పటినుండీ తనలోని దానవుడు నశించి మానవుడు మేల్కొన్నాడు.

తిరిగి దానవుణ్ణి మేల్కొలిపి పోషించటమా ?

అతడి ఆలోచనలు తెగలేదు. గంటలు నిమిషాల మాదిరిగా గడిచిపోతున్నాయి.

జగచ్చక్షువు చరచర పైకి ఎక్కుతున్నాడు.

(జయశ్రీ ప్రత్యేక సంచిక)



# ఆమె తల వంచింది

"ఏమండోయ్. ఇవాళ మా అమ్మ జీడిపలుకులు వేసిన ఉప్మాచేసి మా టిఫిన్ డబ్బాలలో పెట్టింది. అన్నంలోకి కొబ్బరి పచ్చడి చేసింది." ఒక చిన్న స్టూలు గోడదగ్గరగా వేసుకుని దానిమీద నిలబడి అవతలభాగంలో పంపు దగ్గర ముఖం కడుక్కుంటున్న ఆయనతో అంటున్నాడు శ్రీరామ్.

"ఆఁ హాఁ! ఎంత అదృష్టం ఎంత అదృష్టం! అప్పుడే నీకు స్కూలుకు వేళయిందేమిటి?" అంటున్నాడు శ్యామలరావు నోట్లో బ్రష్ పెట్టుకుని

"అప్పుడే ఏమిటండోయ్? తొమ్మిది కావచ్చింది. మా తమ్ముడూ నేనూ భోజనంచేశాం. స్కూలుకు వెళ్ళుతున్నాం. టా టా."

నవ్వుకున్నాడు శ్యామలరావు.

రామవిలాస్‌లో మూడు అంతస్తులలోనూ కలిపి పన్నెండు భాగాలున్నాయి అవి రెండేసి గదులూ ఒక చిన్న వరెండాగల క్వార్టర్సు. ఒక క్వార్టర్‌కు మరొక దానికి మధ్యగా మనిషిఎత్తు గోడలు ఉన్నాయి ఒకరికొకరు కనబడకుండా. అవి కడుతూ ఉండగానే ఏభయి రూపాయల అడ్వాన్సు ఇచ్చింది వైదేహి. ఆమెది ఎనిమిదవ నెంబరు క్వార్టర్సు. ఆ రెండు నెలలలోనే తయారయిన తన భాగంలోకి ఐదేళ్ళ కొడుకు ఆరు నెలల కడుపుతో వచ్చి చేరింది. ఆమె అక్కడ చేరేటప్పటికి బి. ఇడి ట్రైనింగ్‌లో ఉంది. ఆ సమీపంలో ఉన్న చిన్న స్కూల్లో ఐదేళ్ళ శ్రీరామ్ చదువుకుంటున్నాడు.

ట్రైనింగ్ కాగానే ఆమె శ్రీరామ్‌కు ఇంట్లోనే చదువు చెప్పటం మొదలు పెట్టింది. ఆమె లెక్కలు కట్టింది. తన రిజల్టు వచ్చేసరికి పురుడు వచ్చేస్తుంది తను గవర్నమెంటు స్కూల్లోకే దరఖాస్తు పెడుతుంది. తనకు ఉద్యోగం వచ్చే లోగా శ్రీరామ్‌ను పై క్లాసులో వేసేటందుకు వీలుగా తయారు చేస్తోంది.

ఇవన్నీ తననుకున్నట్లు జరిగితే ఎంత బాగుంటుంది ?

తనకు ఏ అర్ధరాత్రో నొప్పులు వస్తే హాస్పిటల్‌కు ఎవరు తీసుకు వెళ్తారు ?

అయ్యో ! తన శ్రీరామ్‌ను ఎవరు చూస్తారు తను హాస్పిటల్ నుంచి ఇంటికి వచ్చేవరకు ?

రెండు రోజులపాటు దీర్ఘంగా ఆలోచిస్తూనే ఉంది.

తన చిన్ననాటి స్నేహితురాలే గవర్నమెంటు పురుళ్ళ ఆస్పత్రిలో పనిచేసే డాక్టరు. ఎందుకో ఆమె దగ్గరికి వెళ్ళబుద్ధి కాలేదు వైదేహికి. కొత్తచోట తనకు తెలియని కొత్త డాక్టరికి చూపించుకుంది మందులు రాయించి తెచ్చుకుంది. పురుడు వచ్చే తేదికూడా రాయించి తెచ్చుకుంది.

అప్పటికి పదిరోజులుందని రాసింది డాక్టరు ఈ లోపల వచ్చినా రావచ్చు పురుడు. రెండు రోజులు దాటినా దాటవచ్చు.

శ్రీరామ్ చిన్నప్పుడు ఎవరు పిలిచినా వెళ్ళేవాడు. జనముద్దుబిడ్డ కావటం వల్ల ట్రైనింగ్ కాలేజిలో ఉన్న టీచరు శ్రీరామ్‌ను తన ఇంటికి తరచుగా తీసుకు వెళ్లుతూ ఉండేది. వైదేహి సంయుక్త మంచి స్నేహితులు. వైదేహిని ట్రైనింగ్ కాలేజిలో చేరమని సలహా ఇచ్చింది కూడా సంయుక్తే. సంయుక్తను వైదేహి మరిచిపోవటం అంటూ ఉండదు. ఈ సమయంలో కూడా ఆదుకోవలసినది, సంయుక్తేనని మనసు శాంతపరచుకుంది వైదేహి.

వేళగానివేళ ఆయాసపడుతూ పిల్లవాడిని చెయ్యిపట్టుకుని తీసుకు వచ్చిన వైదేహిని ఆశ్చర్యంతో చూపింది సంయుక్త.

''ఏమిటిలా వచ్చావు ఈ వేళప్పుడు?'' శ్రీరామ్‌ను అందుకుంది సంయుక్త.

''వీడు నీదగ్గర బాగా అలవాటు కదా. నీదగ్గర నీ పిల్లలతోపాటుగా ఉంచుకుంటావా సంయుక్తా?'' తల వంచుకుని అడిగింది వైదేహి

ఆమె నిండు గర్భాన్ని చూస్తూ తల పంకించింది సంయుక్త. ''డాక్టరు దగ్గరికి వెళ్ళి చూపించుకున్నావా ? ఎప్పుడట ?''

"ఇంకో పదిరోజులు సుమారు లెక్క."

"నేనే ఆమాట అందామనుకున్నాను శ్రీరామ్‌ను నా దగ్గర ఉంచేసి వెళ్ళు వాడి బట్టలు పక్కచుట్ట నేను తెప్పించుకుంటాను ఎవరిచేతనైనా. మరి నీ వొక్క దానవు. అయిపోతావు ఇల్లుకూడా చాలా దూరంగా తీసుకున్నావు" అంది సంయుక్త శ్రీరామ్‌ని ఒళ్లో కూర్చోబెట్టుకుంటూ

"ఏం చెయ్యను? ఆ ఫ్లాట్సు విడిగా ఎవరి భాగాలు వాళ్ళకు ప్రత్యేకంగా ఉన్నాయి మన ఇంట్లో మనము తలుపులు వేసుకున్నప్పటికీ సందడిగా ఉంటుంది భయమనిపించదు అవసరమై వచ్చి పిలిస్తే ఎవరయినా పలుకుతారు ఒంటరి వాళ్ళకు అటువంటివే మంచివనిపించింది"

"అయితే నీవు హాస్పిటల్లో చేరినట్టు ఎట్లా తెలుస్తుంది నాకు?"

"ఉత్తరం రాస్తాను మా రామవిలాస్‌లో క్రిందిభాగంలో ఒక గృహిణితో పరిచయమయింది ఆమె సహాయంతో హాస్పిటల్‌కు వెళ్తాను. ఇప్పుడు హాస్పిటల్సులో వారం లోపలే ఇంటికి పంపేస్తున్నారు. తరువాత కొన్నాళ్లు వండి పెట్టటానికి ఒక మనిషిని ఆమె మాట్లాడి పెడతానన్నది." వైదేహి తను చేసుకున్న ఏర్పాట్లు చెప్పింది

శ్రీరామ్ అప్పుడే సంయుక్త పిల్లలిద్దరితో కలిసి ఆడుకుంటున్నాడు పక్క గదిలో వాళ్ళను చూడగానే అమ్మను మరిచిపోతాడు. వైదేహి శ్రీరామ్‌ను పిలిచి "బాబూ! ఈ ఆంటీ దగ్గర ఉంటావా? ఈ ఆంటీ చాలా మంచిది వీళ్ళిద్దరూ నీ ఫ్రెండ్స్ వీళ్ళతో ఆడుకో" వైదేహికి కన్నీళ్లు వస్తున్నాయిగాని శ్రీరామ్ చప్పట్లు కొడుతూ "ఉంటాను ఉంటాను నీవు వెళ్ళిపో" అంటూ ఎగిరి గంతులు వేశాడు.

"సంయుక్తా" కడుపులో ఏదోబాధ దానిని పైకి వ్యక్తం చేయలేక పోతోంది కొంగుతో కళ్ల రెండూ గట్టిగా నొక్కుకుంది పైపొంగు తగ్గేవరకు. "నేను వెళ్తున్నాన" వెనక్కు తిరిగి చూడకుండా వెళ్లిపోయింది వైదేహి

వారం తిరక్కుండానే గాంధీ హాస్పిటల్లో మగపిల్లవాడిని కన్నది హాస్పిటల్లో ఉన్న వారంరోజులు రామవిలాస్ కిందిభాగంలో ఉన్న గృహిణి చాలా సహాయం చేసింది భోజనంకూడా పంపించింది.

వైదేహి ఇంటికివచ్చిన మరునాడు సంయుక్త శ్రీరామ్‌ను తీసుకువచ్చి అప్పగించింది.

"వైదేహీ! ఇంతవరకూ బాగానే గడిచింది. రేపు ఉద్యోగ వస్తే ఈ పిల్ల వాడిని ఎక్కడ ఉంచుతావు?"

"ముందు ప్యాస్‌కానీ తరువాతకదా ఉద్యోగం?"

"నీవు ప్యాసయ్యావు. నేను తెలుసుకున్నాను. నీకు గవర్నమెంటు ఉద్యోగం కావాలా? ప్రయివేటు స్కూల్లో కావాలా?"

"గవర్నమెంటయితే ట్రాన్స్‌ఫర్లు వస్తూఉంటాయి."

"ప్రైవేటు అయితే ట్రాన్స్‌ఫర్లు రావు. ప్రైవేటుదని చులకనగా చూడకు. నీ అర్హతకు తగిన ఉద్యోగమే. జీతంకూడా గవర్నమెంటు స్కూళ్లల్లో ఇచ్చినన్నే ఇస్తారు. ఇప్పుడు ఒకస్కూల్లో ఖాళీ ఉంది. దరఖాస్తు పెడతావా?" సంయుక్త అడిగింది వైదేహి రెండవ కొడుకును ఎత్తుకుంటూ.

"పెడతానుగాని ఆర్డరు ఇప్పించే నాధుడు ఉండద్దూ?"

"ఆ నాధుడూ ఉన్నాడు దరఖాస్తు పెట్టు నాకాస్కూలు ప్రిన్సిపల్ బాగా తెలుసు. నేను చెప్పింది కాదనదు. అసలు నన్ను అడిగింది ఎవరయినా బాగా పని చేయ గలిగినవాళ్లు ఉంటే పంపమని"

"అంతకంటేనా? అయితే నీ చేత్తోనే ఇప్పించు ఉద్యోగం" వైదేహి కళ్లలో తడి-చూపుల్లో కృతజ్ఞత మెరుస్తున్నాయి.

"మరి పిల్లవాడు?"

"ఆయాను పెట్టుకుంటాను. వెంట తీసుకు వెళ్తాను. శ్రీరామ్‌ను ఆదగ్గర స్కూల్లో చేర్పిస్తాను" కొంచెము ధైర్యాన్ని పుంజుకుంది వైదేహి.

"ఆ స్కూలుకు అనుబంధంగా ఒక ప్రైమరీ స్కూలు ఉంది. ఆ బిల్డింగ్ వెనక్కు ఉంది ప్రైమరీ సెక్షన్. కనుక ఆ ఇబ్బందికూడా లేదు. నీకు అన్ని విధాలా సౌకర్యంగా ఉంటుంది."

"సరే. నీ సలహా నీ చేయూత నా జీవితాన్ని నడిపించాలి. దరఖాస్తు చేత్తో రాయనా? లేక టైపు చేయించి ఇవ్వనా?"

"పచ్చి బాలెంత బజార్ల వెంట పరుగెత్తి టైపు ఎట్లా చేయిస్తుంది గాని. ఈ కాగితమ్మీద సంతకంపెట్టి సర్టిఫికెట్స్ ఇవ్వు. ఆర్డర్సు పోస్టులో వస్తాయి. లేక పోతే నేనే తెస్తాను."

పసివాణ్ణి మంచమ్మీద పడుకోబెట్టి సంయుక్త రెండు చేతులూ పట్టుకుని కళ్ళకద్దుకుంది వైదేహి.

అలా ట్రైనింగయి, ఆ ప్రైవేటు స్కూల్లో టీచరుగా పదేళ్ళు పనిచేసి తరువాత ప్రిన్సిపాలయింది వైదేహి. పిల్లలలో పెద్దవాడు ఇంజనీరింగ్ కాలేజీకి వెళ్ళాలన్న ఊహతో మాట్లాడుతూ ఉంటాడు. వైదేహిని శ్రీరామ్ ఎందులో నయినా ప్రయోజకుడయితే చాలునను కుంటుంది. చిన్న కొడుకు శ్రీరామ్ మాదిరిగా మాట్లాడడు, చాలా గంభీరంగా ఉంటాడు.

ఉదయపువేళ పని ఊపిరాడనంతగా ఉంటుంది. గతరాత్రి ఇస్త్రీచేసిన బట్టలు స్నానాలు చెయ్యగానే పిల్లలు వేసుకుంటారు. తల్లి భోజనానకి పిలిచేవరకూ చదువుకుంటారు.

శ్రీరామ్ పన్నెండేళ్ల పిల్లవాడయి ఉండగా పక్కవాటా ఖాళీ అయింది. దాన్లోకి ఎవరో ఒకాయన ఒంటరి మనిషి అద్దెకు వచ్చాడు. ఆయన తొమ్మిది న్నరకు. ఆఫీసుకు వెళ్లేవాడు. ఈలోపల వంటచేసుకుని తిని కాఫీ ఫ్లాస్కులో పోసుకుని ఉంచుకునేవాడు.

రామవిలాస్ ముందర చాలా ఖాళీస్థలం ఉంది. ఆ స్థలానికి నాలుగు ప్రక్కలా ఇటువంటి క్వార్టర్స్ ఉన్నాయి పిల్లలు ఆ స్థలంలో సాయింత్ర కాగానే ఆడుకుంటూ ఉంటారు పిల్లలు ఆడుకుంటే పెద్దవాళ్లుకూడా ఒక ప్రక్కనుండి చూస్తూ ఉంటారు.

"నీవు చాలా బాగా ఆడేవోయ్" బుజమ్మీద చెయ్యేసి తల నిమిరాడు. శ్రీరామ్‌ను-చాలాసేపటినుంచీ అతడిని గమనిస్తున్న ఆయన.

గర్వంగా నవ్వాడు శ్రీరామ్.

“నీకో మంచి ఆట నేర్పిస్తాను వస్తావా ?” అన్నాడాయన అతడి బుగ్గలు నిమురుతూ.

“మీ రెక్కడుంటారు ? చాలా దూరమయితే నేను రాలేనుమరి” అన్నాడు శ్రీరామ్ ఆలోచనగా.

“నీవెక్కడుంటావు ?”

“మేమా అదిగో ఆ రామవిలాస్‌లో ఎనిమిదవ నెంబరు ఇల్లు మాది” శ్రీరామ్.

“అల్లాగా ! మాది ఏడవ నెంబరు. అయితే పక్కపక్కనే ఉన్నా మన్న మాట !” ఆశ్చర్యంగా అన్నాడాయన.

“సరేలెండి సాయంకాలం ఆరూ ఏడూ గంటలమధ్య వస్తాను. నేర్పించండి” అన్నాడు ఆశతో శ్రీరామ్.

ప్రతిరోజూ శ్రీరామ్ సాయంత్రం వెళ్లి బాగా చీకటిపడ్డ తరువాత ఇంటికి వస్తుంటే వైదేహి అడిగింది “శ్రీరామ్. ఆడుకోటానికి వెళ్లిన తమ్ముడు అప్పుడే వస్తున్నాడు. నీవు ఇంత ఆలస్యంగా వస్తే ఎప్పుడు చదువుకుంటావు ? ఏమిటా తిరగటం ?” అన్నది మందలింపు ధోరణిలో.

“అమ్మా. నేను ఎంతోదూరం వెళ్ళటంలేదు. మన పక్కింటాయిన నాకు చదరంగం నేర్పుతున్నారు. నాకా ఆటమీద చాలా ఆసక్తిగా ఉంది. ఎత్తు-దానికి పై ఎత్తు-చాలా ఆలోచించి నేర్పుగా ఆడే ఆట అది. ఒక గంటే గదమ్మా! వచ్చిన తరువాత నేను చదువుకుంటున్నాను కదా” అన్నాడు.

“ఏమి ఆటలురా పెద్దవాళ్ళతో ? అయినా ఆయన ఎవరు ? మన పక్కింటికి కొత్తగా వచ్చాడా ? ఎప్పుడట ?”

“ఏమో ? ఈ మధ్యనే చూశాను. ఆయనే చెప్పాడు కొత్తగా వచ్చానని ఆయన చాలా మంచివాడిలా ఉన్నాడమ్మా. నాతో ఎంతో బాగా మాట్లాడుతాడు.”

“నాయనా ! మనకు ఆటలూ మాటలూ కంటె చదువు ముఖ్యం. అది ముందు చూసుకో” ఆమె ముఖం గంభీరంగా ఉంది.

శ్రీరామ్ ఆలోచించాడు. అమ్మ ఎప్పుడూ ఇట్లా మాట్లాడదే? అనవసరంగా మందలించదే?

"అమ్మా. నేను పరీక్షలు తప్పకుండా ప్యాసయితేచాలు కదమ్మా నీకు? నేనెక్కడయినా తప్పితే చెప్పు?" అన్నాడు హామీ ఇస్తున్నట్టుగా.

శ్రీరామ్‌కు ఆయనమీద రోజుకు రోజుకు అభిమానం హెచ్చుతోంది. ఇంట్లో మంచికూర చేసుకుంటే "ఇది రుచిచూడండి" అంటూ పళ్ళెంలో పెట్టుకుని ఇచ్చి వస్తాడు. ఆయన కేదయినా కావాలంటే ఇంట్లో ఉంటే ఇస్తాడు. లేకపోతే "బజారునుంచి తెచ్చి ఇవ్వనా అండి" అని అడుగుతాడు.

వైదేహికి చుట్టుపక్కల వాళ్ళను పట్టించుకునే స్వభావంలేదు. అవసరం ఉంటేనే తల ఎత్తిచూస్తుంది. లేకపోతేలేదు. ఆ పక్కింటాయనను గురించి శ్రీరామ్ ప్రతిరోజూ ఏదో చెబుతూ ఉంటాడు. పరధ్యానంగా ఊఁ కొడుతూ ఉంటుంది.

ఒకనాడు పొద్దటివేళ మంచి హడావుడిలోఉంది వైదేహి. పిల్లలకు అన్నాలు పెట్టింది. వాళ్లకు టిఫిన్ డబ్బాలు సర్దిపెట్టిగానీ తాను భోజనానికి కూర్చోదు. పళ్లెంముందు కూర్చుని మొదటి ముద్ద నోట్లో పెట్టుకుందో లేదో ఎవరో తలుపు కొట్టారు. దిగ్గున లేచి తలుపుతీసి చెంబుతో గడపలో నిలబడిన వ్యక్తిని చూసి దయ్యాన్ని చూసి జడుసుకున్నట్టుగా జడుసుకుంది.

"పంపు కట్టేశారు. ఆ వేళకు పట్టుకోలేకపోయాను. చెంబెడు మంచినీళ్లిస్తారా?" అంటూ నిలబడ్డాడు చెంబు చూపిస్తూ.

తటాలున వెనక్కు తిరిగింది. శ్రీరామ్ ఆయనకు మంచినీళ్లిచ్చి పంపాడు.

"ఏమిటిది? అనుకోని సంఘటన?" మనసులో గొణుక్కుంటూ మరింత గంభీరంగా మసలుకుంటోంది వైదేహి.

ఋతువులు సంవత్సరాలుగా మారి దొర్లిపోతుంటే శ్రీరామ్ ఇంజనీయర్‌గా డిగ్రీ పుచ్చుకుని పైచదువులకు బ్యాంకులో అప్పు తీసుకుని అమెరికా వెళ్లుతున్నాడు. మనసులో శ్రీరామ్ దూరదేశం వెళ్లుతున్నాడని ఎంతోబాధ-దానిని అణచి

పెట్టుకోవటానికి మరొకబాధ-తను పడుతున్న బాధ పిల్లలు చూడకూడదని ఇంకొక బాధ పదిరోజులకు శ్రీరామ్ వెళ్లిపోతాడనగా మనసునొక శిలగా మార్చుకోటానికి ప్రయత్నించటం మొదలుపెట్టింది వైదేహి. ఆ ప్రయత్నంలో అన్నీ పరాకు-పనులు-పరాకు మాటలు. కొంత సేపటికి తిప్పుకుని "ఏమిటీ నేనిట్లా పిచ్చిదాన్నయిపోతున్నాను?" అనుకుంటూ సర్దుకోవటం ఆమెకే ఆశ్చర్యంగా ఉంది. కన్నీళ్లు బిగబట్టుకుని, శ్రీరామ్‌కు అన్ని జాగ్రత్తలూ చెప్పి, ఉత్తరాలు తప్పకుండా వారానికొకటయినా రాయమని బ్రతిమిలాడి అతడిని విమానం ఎక్కించి వెనక్కు తిరిగి రాబోతూ ఉండగా ఆయన ఎవరిని సాగనంపటానికి వచ్చాడో మరి తమ వెనక నడుస్తున్నాడు.

వైదేహికి దేహము జలదరించింది. గబగబా అడుగులువేస్తూ ఇంటికి బయలుదేరింది కొడుకుతో. దారిపొడుగునా శ్రీరామ్‌నే తలుచుకుంటోంది. అతడి-మాటలూ చేష్టలూ జ్ఞాపకానికి వస్తున్నాయి.

ఇంటికి వచ్చి నిరుత్సాహంగా ఉన్న చిన్న కొడుకు కోసమే భోజనానికి కూర్చుంది.

ముద్ద నోట్లో పెట్టుకోగానే శ్రీరామ్ జ్ఞాపకము మళ్ళీ తగిలింది. కళ్ళల్లో నీటిపొర తేలి యాడింది.

ఒకసారి చిన్న కొడుక్కు జ్వరం పేలిపోతోంది ఇంటికి వచ్చేసరికి. తను డాక్టరు దగ్గరికి తీసుకు వెళ్ళాలంటే జ్వరము వచ్చిన పిల్లవాడు కిందివరకూ నడవలేడు. తను ఎత్తుకుని తీసుకుపోలేదు. అందుకని శ్రీరామ్‌ను డాక్టర్ని పిలుచుకు రమ్మంది. డాక్టరు వేనక సందులో ఉంటాడు.

శ్రీరామ్ వెళ్ళనని మొండికి వేశాడు.

చివాట్లు పెట్టింది. చివరకు రెండు దెబ్బలు వేసింది.

"చీకట్లో నేను వెళ్ళలేనమ్మా. నాకు భయం." కళ్లు తుడుచుకున్నాడు.

"ఎలాగయినా వెళ్ళరా" అంటూ బలవంతంగా నెట్టింది. అరగంటలో డాక్టరు వచ్చాడు. జ్వరం తగ్గటానికి మాత్రలిచ్చాడు. డాక్టర్ని సాగనంపటానికి

తను మెట్లువరకు వెళ్లితే అతడు అక్కడ తారసిల్లాడు. చప్పున తను వెనక్కి తిరిగింది.

"మొదలు వెళ్లనని మొరాయించావు కదరా. చూడు, డాక్టరుగారు ఇంజక్షనువల్ల వాడికి జ్వరం తగ్గిపోతుంది. హాయిగా నిద్రపోతాడు." అంది శ్రీరామ్‌తో.

"చీకటి కదమ్మా. భయంకదూ?" అన్నాడు.

"ఎట్లాగో వెళ్లి తీసుకువచ్చావుకదా!" అంది పక్క పరుచుకుంటూ.

"ఎట్లా వెళ్లానో తెలుసా? నేను గదిలోనుంచి బైటికి రాగానే 'నేను తోడుగా వస్తాను రా బాబు!, అంటూ మన పక్కింటాయన వచ్చాడు కనుక ధైర్యంగా వెళ్లాను" అన్నాడు.

ఉలికిపడింది వైదేహి.

ఆ రాత్రి శ్రీరామ్‌మీద ఆలోచనలతో అన్నం సహించలేదు. కంటిమీదికి నిద్ర రాలేదు.

మరునాడు ఉదయమే మళ్లీ మామూలు దినచర్య- కడుపులో బెంగ.

చిన్నవాణ్ణి డాక్టరును చేద్దామనుకుంది. కాని అతడేమిటో సరిగా చదవడు. పట్టుమని చదివితే మార్కులొస్తాయి గానీ చదవడు. శ్రీరామ్ ఉండగా తను చదువుతున్నంతసేపూ తమ్ముడుకూడా బలవంతంగా చదవమనేవాడు తను మేలుకున్నంతసేపూ తమ్ముడుకూడా మేలుకుని ఉండాలని శాసించేవాడు.

శ్రీరామ్ వెళ్లిన సంవత్సరమే వైదేహి చిన్న కొడుకు వేణు పరీక్ష తప్పాడు. తల్లి కన్నీళ్లతో తను పిల్లలకోసం ఎంత కష్టపడుతున్నదీ చెప్పి "వేణూ! నీవు గ్రహించాలి. నీ జీవితంలో ఒక సంవత్సరం వ్యర్థమయిపోయిందని నా బాధ. కాని డబ్బుకు నేను వెనకాడను!" ఇదివరకెప్పుడూ లేనిది, బాధ కొద్దీ కొంచెం కఠినంగానే అంది.

తెల్లవారి లేచేసరికి అతడు లేడు అతడికి మారుగా ఒక చిన్న ఉత్తరం బల్లమీద ఉంది. 'శ్రీరామ్ అంత ప్రయోజకుడైన తరువాత గాని తల్లి ముఖం

చూడననీ - తన కొరకు వ్యర్థప్రయత్నము చేయవద్దనీ' రాశాడు.

వైదేహి కుమిలి కుమిలి ఏడ్చింది వీడు కూడా పైకి రావాలన్న ఉద్దేశ్యంతో కోపము నటించింది తనకు నిజమైన కోపం వస్తుందా వాళ్ళమీద ? తను కోపగిస్తే వాళ్ళనెవరు దగ్గరికి పిలిచి ఆదరంగా మాట్లాడుతారు ?

కొడుకులిద్దరూ ఎవరి దారులు వాళ్లు చూసుకున్నారు

తను ఇంకా ఉద్యోగం చెయ్యాలా ? ఇంకా సంపాదించి ఎవరికి పెట్టాలి ?

తను ఒక్కతే ఇంట్లో కూర్చున్నా గడిచిపోతుంది.

కాలి కూర్చుని ఏం చెయ్యాలి ?

గతాన్ని తవ్వుకుంటూ కుమిలిపోవటమా ?

తను ధైర్యం తెచ్చుకుని ప్రయోజకురాలై సంపాదించి ఇద్దరు కొడుకులను పెద్దవాళ్ళను చేసింది ఇంకా కుమిలి పోవటం ఎందుకు? ఏమిటీ ఈ మనసు ? ఇదివరకు లేనిది ఇప్పుడు నిబ్బరాన్ని కోల్పోతోంది ఏమిటి ? శ్రీరామ్ ఏ వారానికా వారం ఉత్తరాలు రాస్తున్నాడు. వేణు వెళ్ళిన వారానికి ఓ ఉత్తరం వ్రాశాడు. తను ఆర్మీలో చేరిపోయాడట - తనకు ఆ జీవితం చాలా నచ్చిందంటూ.

పిల్లలకు రెక్కలు వచ్చాయి. ఎగిరి పోయారు.

అంతే.

వైదేహి ఉత్సాహాన్ని కోల్పోయినప్పుడల్లా సంయుక్త దగ్గరికి వెళ్ళి బ్యాటరీ చార్జి చేయించుకుంటుంది. ఆమె మాటల్లో చెప్పాలంటే ఉత్సాహాన్ని పుంజుకుంటుంది మళ్ళీ మామూలు జీవితాన్ని నిబ్బరంగా సాగిస్తుంది

నిర్మలంగా నిశ్చలంగా ఉన్న కాసారంలో ఒక రాయి విసురుగా వచ్చి పడ్డది. కాసారంలో అలలు లేచాయి అకస్మాత్తుగా.

ఆరోజు సెలవురోజు. భోజనంచేసి సంయుక్త ఇంటికి వెళ్లాలనుకుంది వైదేహి. పిల్లల కేదయినా స్వీట్స్ చెయ్యాలని స్టౌ దగ్గర కూర్చొని కేక్ తయారుచేస్తోంది. వెంటనే శ్రీరామ్ వేణు జ్ఞాపకం వచ్చారు. తను చేసిన స్వీట్స్

తింటున్నట్టుగా కంటికి కనబడ్డారు. సజల నయనాలతో వాళ్ల ఫోటోలనుచూసుకుని బాగా తుడిచి మళ్లీ బల్లమీద పెట్టుకుంది.

"పిచ్చి బాబులు. మీరు అక్కడ స్వీట్స్ తిన్నా నేను చేసినంత తీపిగా ఉంటుందా?"

గబగబ ఉడికిన కేక్‌సు ఒక డబ్బాలో పెట్టుకుంది. వంటయిల్లంతా సర్దింది ముందుగదిలోకి వచ్చి బట్టలు మార్చుకుంటుండగా ఏవో మాటలు పెద్దగా వినిపిస్తున్నాయి. అవి పక్కింట్లోంచే వస్తున్న ట్లనిపించింది. ఎందుకంటే ఆ లైనులో తమదే చివరిభాగం. వినిపిస్తే పక్కింట్లోనుంచే వినపడాలి.

"నాదగ్గర ఒక్క దమ్మిడీ లేదయ్యా బాబూ!"

"అట్లాఅంటే ఊరుకోను. నాకు చాలా అవసరంగా ఉంది. ఒక్క ఐదు వందలు ఎట్లా గయినా సర్దుబాటుచెయ్యి."

"ఐదు వందలుకాదు. ఐదు పదులుకూడా లేవు. నాకేం వేల జీత మనుకున్నావా? వచ్చినదాంట్లో ఏదో సర్దుకుని బ్రతుకుతున్నా."

"ఏం నిజాయితీపరుడవయ్యా? సరేగాని ఎల్లుండి మళ్లీ వస్తా. తప్పకుండా తయారుగా ఉంచు."

దభాలున తలుపులు తెరుచుకుంటూ విసురుగా వెళ్లిపోయాడు.

వైదేహి తన గదిలో ఉండే ఆ మాటలన్నీ విన్నది. అవి ఏవో సంచలనాన్ని కలిగిస్తున్నాయి. వాటిని విస్తరించాలను కుంటూ తలుపు తాళమువేసి బయలుదేరింది.

అన్నట్లుగానే పక్కింట్లో ఆమూడోవాడు మళ్ళీ గలభా ప్రారంభమయింది.

"నీవు ఇవ్వకపోతివా చూడు ఏం చేస్తానో?"

"ఏమిటీ నీవు చేసేది? ఏం చెయ్యగలవు?"

"ఏం చెయ్యగలనా?" వికృతమైన నవ్వు రామ విలాసంతా ఊపేసినట్లు వినబడ్డది. "ఏం చెయ్యలేను? నీవు స్త్రీలోలుడవనీ, పక్కింట్లో ఉన్న ప్రిన్సిపల్‌తో అధర్మంగా జీవిస్తున్నాననీ నీ ఆఫీసులో చాటుతాను. నీపై ఆఫీసరుతో

చెప్పేస్తాను. మీ ఇద్దరి పేర్లు గోడలమీద రాయిస్తాను. దానితో నీ ఉద్యోగం ఊడి పోతుంది. నీకు పెంక్షనురాకుండా చేస్తాను.''

''చూడు సుబ్బారావ్. నీ సంగతంతా నా తోటి ఉద్యోగి చేస్తాడు. నీ వెందుకు శ్రమపడుతావుగాని వెళ్ళిరా''

''అట్లాగా ! అట్లాగా ! చూస్తూ ఉండు'' చ్రరున దూసుకుంటూ తలుపులు దగ్గరగా వేసి ఉన్న వైదేహి భాగంలోకి వచ్చాడు.

ఆమె దిగ్గున లేచి నిలబడి ''ఏం కావాలి ? ఎవరు మీరు ?'' అంది.

''నాకు రేపటివరకూ వెయ్యి రూపాయలు కావాలి. మీ పక్కింటాయన మీరూ కలిపి ఆ పైకం సర్దండి. లేకపోతే.........'' ఇంకా ఏమో అనబో తున్నాడు.

''వెయ్యి రూపాయలా ? మేమిద్దరం కలిసి సర్దాలా ? ఎందుకు ?'' వైదేహి చాలా గంభీరంగా ప్రశ్నించింది.

''ఎందుకా ? నాకవసరం కనుక.''

''ఇదేమిటి ఈ జులుము ? నేనెవరిననుకుంటున్నారో ? పొరబడలేదు కద ?''

''ఏం పొరబడలేదు. ఆ ప్రైవేటుస్కూల్లో ప్రిన్సిపల్ కదూ? ఆ మాత్రం కనుక్కోకుండానే ఇంతదూరం వచ్చానా ?'' వికటంగా నవ్వాడు.

''అయితే ఇవ్వాలా ? ఇవ్వకపోతే ?'' రెట్టించింది.

''ఇవ్వకపోతేనా ? మీరో కులట అనీ పక్కింటి ఉద్యోగితో అధర్మ జీవితం గడుపుతున్నారని మీ స్కూలు గోడలనిండా రాయిస్తాను. మీ స్కూలు మేనేజి మెంటుతో చెప్పి ఉద్యోగం ఊడపీకిస్తాను.''

''ఇంతకూ మీరెవరు ?'' తడి ఆరిపోయిన గొంతుతో వినిపించబడకుండా ప్రశ్నించింది.

"నేనా? నేనెవరినో చెబుతాగాని- రేపు ఉదయం ఎనిమిది గంటలకల్లా ఇద్దరూ చెరి ఐదువందలూ సిద్ధంగా ఉంచండి వస్తా" విసురుగా వెళ్ళిపోయాడు.

ఆమె నిర్ఘాంతపోయింది. చప్పున ఏదో జ్ఞాపకం వచ్చి తలుపు గడియ పెట్టుకుంది. దడ దడ కొట్టుకుంటున్న గుండెను చేత్తో అదుముకుంటూ మంచమ్మీద వాలిపోయింది.

ఈగలభా అంతా శ్యామలరావు-అదే ఆ పక్కింటాయన చేయించటం లేదు కదా?

ఐదేళ్ల పిల్లవాడితో నెలతప్పి వాంతులతో బాధ పడుతున్న తనను వర్షంలో ఇంటినుంచి గెంటివేసిన శ్యామలరావు ఎంతకయినా తెగించగలడు? పుట్టింటి నుంచి డబ్బు తీసుకురమ్మని వేధించటం, కట్టుకున్న భార్యను చీటికీ మాటికీ అనుమానించి చెయ్యిచేసుకున్న శ్యామలరావేకదా ఇతడు? ఇన్నాళ్లకు మళ్లీ తగుదునమ్మా అంటూ తనెక్కడున్నదీ ఆరాలు తీసి తన పక్కవాటాలో చేరాడు. పెద్ద పిల్లవాడిని దగ్గరికి తీసి మాయమాటలు చెప్పి మళ్లీ ఇంట్లో అడుగు పెట్టాలనుకున్న ప్లానుతో పక్కన చేరినట్టున్నాడు.

ఇంకానయం! జరిగినదంతా పిల్లలకు తెలియలేదు. దగ్గర కూర్చోబెట్టుకుని చెప్పాడుకాదు.

ఎట్లా తెలుస్తుంది? ఆ ఉద్రేకంలో- ఆ కోపంలో తన ముఖానఉన్న బొట్టు చెరిపేసి జోరున కురుస్తున్న వర్షంలో బైటికి నెట్టి తలుపులు వేసుకున్నాడే? పిల్లలింతవరకూ తమకు తండ్రి లేడనే అనుకుంటున్నారు.

ఇదంతా తెలిస్తే తనపైన నిందనెయ్యరూ? తను కన్న కొడుకుల ఎదుట సమాధాన మివ్వలేని అపరాధిలా నిలబడటమా?

తన కెవ్వరూ లేరని ఆనాడు బిడ్డను చంకన తీసుకుని జోరున కురిసే వానలో ఇల్లుదాటి బైటికి వచ్చింది. ఒంటరి జీవికి అవసరమైన ధైర్యాన్ని తెచ్చుకుంది. ఇద్దరి బిడ్డలను పెంచి పెద్దవాళ్ళను చెయ్యగల శక్తి సామర్థ్యాలను సంపాదించుకుంది. బిడ్డలకు రెక్కలు వచ్చాయి. జీవితంలో తను నిర్వహించదలచిన బాధ్యతను తలఎత్తుకుని ధైర్యంగా నిర్వహించింది.

ఇంకా తనకేమవసరం ?

ఏం భయం ?

అయినా మనసెందుకో గుంఝాటనలో పడ్డది. ఆమె రాత్రి నిద్రపోక పోయినా భళ్ళున తెల్లవారింది.

వైదేహి స్నానం చేసింది. మామూలుగా వంట చేసుకుంది. స్కూలుకు వెళ్ళటానికి బ్యాగ్ సర్దుకుంటుండగా సుబ్బారావు దబదబా తలుపులు బాదాడు.

వైదేహి ధైర్యంతో తలుపులు తీసింది.

చొరవగా లోపలికి వచ్చాడు సుబ్బారావు.

ఏమిటన్నట్టు చూసింది వైదేహి.

"ఏమయ్యోయ్ నేను అన్నంతపనీ చేసేవాడినని నీకింకా తెలియనట్లుంది"

అతడి ఏకవచన ప్రయోగం చూస్తే వైదేహికి అసహ్యం వేసింది.

"మీరడిగినంతా ఇవ్వకపోతే ఏం చేస్తారండీ? మాకిద్దరికీ సంబంధం ఉందని గోడలమీద రాయించి ఉద్యోగాలు ఊడపీకిస్తారా? మీకు అసలు సంగతి తెలియదేమో! ఈ శ్యామల రావుగారు నాకు పదిమందిలో తాళికట్టి తలంబ్రాలు పోసిన పెద్దమనిషి. ఆయనతో సంబంధం పెట్టుకోడం ధర్మబద్ధమే కదా! ఇదిగో ఆయన కట్టిన మంగళసూత్రాలు. ఇవి పాతికేళ్ళకిందట కట్టినవి. మా యిద్దరి తల్లి దండ్రుల ఎదుట-బంధుమిత్రుల సమక్షంలో మంగళవాయిద్యాలు మ్రోగుతుండగా తాళికట్టారు. అంటూ గిరుక్కున తిరిగి వంటయింట్లోకి వెళ్ళి బొట్టుపెట్టుకుని వచ్చింది.

సుబ్బారావు కిది ఎదురుచూడని సంఘటన. ఇంతవరకూ ఈబ్లాక్ మెయిలు వ్యవహారం బెడిసికొట్టలేదు. పది సంవత్సరాలనుంచీ జయించుకొస్తున్నాడు.

శ్యామలరావు కిటికీలోనుంచి లోపలికి తొంగిచూస్తున్నాడు.

వైదేకిహికి అభిమానం రోషం ముంచుకు వచ్చాయి.

"ఏమండీ? మీరు పదిమందిలో తాళికట్టి ఇప్పుడీ పెద్దమనిషి ఇట్లాఅంటుంటే వింటూ ఊరుకుంటారేం? ఇదిగో పెళ్ళిలో పసుపుబట్టలతో తీయించుకున్న ఫొటో.

ఈసాక్ష్యాన్నయినా సుబ్బారావుగారు నమ్ముతారా?" వైదేహికి చిరుచెమటలుపట్టాయి. దేహం కంపిస్తోంది. ఇది ఎవరు వేసినఎత్తో తెలియకుండా ఉందామెకు.

"ఇదంతానమ్మి-నేను ఇంతటితో ఊరుకుంటాననుకోకండి. మళ్ళీవస్తాను" సుబ్బారావు విసురుగా వెళ్ళాడు.

విడిపోయిన తమ దాంపత్యానికి తిరిగి ఈ సందర్భంలో ఒకగుర్తింపునిచ్చిన వైదేహిని వింతగా చూస్తూ లోపలికి వెళ్లాలా వద్దా అనుకుంటూ గడపకు అటో కాలు ఇటోకాలూపెట్టి ఆలోచనలోపడ్డాడు శ్యామలరావు

('ఆంధ్రభూమి' సచిత్రవారపత్రిక)



# వికసించిన మానవత్వము - ఉద్రేకించిన మనసు

సాయంకాలం ఆరుగంటలయ్యేసరికి ఆ ఎత్తయిన భవనంలో నాలుగు పక్కలా పెద్ద పెద్ద దీపాలు వెలుగుతూ ఉంటాయి. ఆ దీపాల వెలుగు ఒక అర మైలు దూరంవరకు చీకట్లను తరుముతూ ఉంటుంది.

సాయంకాలం నాలుగు గంటలనుండే ఆటలలో మునిగి తేలిన ఆ సైనికోద్యోగులు పాతికమంది ఆ భవనప్రాంగణంలో కుర్చీలు వేసుకుని బీర్ సీసాలు ముందర పెట్టుకుని కూర్చుంటారు. గ్లాసులు నింపుకునేవారు. నింపుకుంటూ ఖాళీ చేసేవారు ఖాళీచేస్తూ ఉంటారు. పాటలూ, పద్యాలూ, నవ్వులూ త్రుళ్ళింతలూ - ఆ ప్రదేశం కోలాహలంగా ఉంటుంది. వాళ్ళు పెట్టే కేకలు ఊళ్లోకి వినబడుతూ ఉంటాయి.

ఉదయం వ్యాయామం చేసుకుని కాఫీ టిఫిన్‌లు ముగించుకుని ఆ దళం కొండదిగి ఊరంతా ఒకసారి చుట్టిరావడం మామూలు. సైనికులు దుకాణాల ముందు ఆగి వస్తువులకు బేరంచేసి కొనకుండా నవ్వుతూ వెళ్ళిపోవటము. వర్తకులు వోళ్లు తెరచుకుని చూడటము కూడా అలవాటు. వీధినిపోయే చిన్నపిల్లలూ స్త్రీలూ అంతదూరంనుంచి వాళ్ళను చూడగానే గబగబా ఇళ్ళల్లో దూరి కిటికీలలో నుంచి చూడటం కద్దు. చేతికర్రలను విలాసంగా ఆడించుకుంటూ ఆ సైనికదళం మధ్యాహ్నం పన్నెండు గంటలకు తిరిగి ఆ గుట్టమీదకి చేరుకుంటుంది.

అసాధారణ పరిస్థితులలో ఉపయోగపడవచ్చునన్న ఉద్దేశ్యంతో ప్రభుత్వము అక్కడక్కడ ఉంచిన సైనిక దళాలలో ఇది ఒకటి. ఈ దళానికి కమాండరుగా భీమ్‌సింగు నియమితుడయినాడు. తెలుగు కన్నడ తమిళ భాషలవారు అన్ని హోదాలలోను కలిసి ఏభయిమంది ఉన్నారు.

వ్యాయామము చేయడం, గాలిలో తుపాకులు పేల్చటం, సైనిక విన్యాసము మొదలైనవి మామూలుగా ఏకొత్తదనమూలేకుండా సాగిపోతున్నాయి. పైనుంచి ఏ కొత్త ఆర్డరూ రాదు. ఆదళము అక్కడినుంచి కదలదు. వాళ్ళకు కావలసిన వస్తుసామగ్రి కొరతలేకుండా సరఫరా అవుతుంది.

భీమ్‌సింగ్ నలభై ఏళ్లు దాటినవాడు. చిన్నచిన్న కళ్ళతో ఎంతదూరమయినా చూడగలిగినవాడు. ఎంత దూరాలోచనైనా చేయగలిగినవాడు. అతడు కొండ దిగి మధ్యాహ్నం మూడు గంటల ప్రాంతంలో వెళ్ళి చీకటిపడ్డ తరవాత గాని తిరిగిరాడు.

సాయంకాలం యథాప్రకారంగా ఆ సైనికులు వాకిటి ముందర కుర్చీలు వేసుకున్నారు. పాటలు పాడుతూ బీర్ సీసాలు మూతలు తెరిచారు.

కమలాకర్ చెట్ల మధ్యనుంచి పరుగెత్తుకుంటూ వచ్చాడు. అతడి దేహం చెమట కక్కుతూంది. ఆయాసపడుతూ చేతిరుమాలుతో ముఖం తుడుచుకుంటూ 'భాయీ భాయీ' అంటూ ప్రకాష్‌భుజం పట్టుకుని కుదిపాడు.

ఉలికిపాటుతో లేచి నిలబడ్డాడు ప్రకాష్.

"భాయీ ఆ చెట్టుకింద ఏమిటో చప్పుడవుతూంది."

కమాండర్ లేని నిర్భీతితో కులాసాగా సీసామీద సీసా ఖాళీచేసిన ప్రకాష్ నిషాలోనుంచి తేరుకోటానికి కొంతసేపు పట్టింది.

"ఏమిటీ నీవనేది?"

"ఆ చెట్టుకింద ఏదో చప్పుడవుతూంది."

ఇద్దరు టార్చిదీపం పట్టుకుని బయలుదేరారు.

ఇరవై అడుగులు ఎత్తుగా ఉన్న ఆగుట్ట మొదట్లో పెద్దపెద్ద వృక్షాల సమూహము బాటసారులకు నీడలు కల్పిస్తూ, వారు కథలు వింటూ, ఆ గ్రామంలో కలుగుతున్న మార్పులను చూస్తూ పరిభ్రమిస్తూన్న కాలచక్రాన్ని తేరిపారచూస్తూ ఉంటుంది గుట్టపైకి పోతున్నకొద్దీ చెట్లు పలచబడి నిటాఘాటమైన బాటకు ఎడమిస్తాయి. కాని ఆ గుట్టమొదట్లోఉన్న వృక్షాల నీడలు ఎటువంటివారికయినా దేహమును జలదరింపజేస్తాయి.

ప్రకాష్‌ను టార్చి సహాయంతో ఆ చెట్లనీడలోకి తీసుకువచ్చాడు కమలాకర్.

ఆ సమీపంలో ఎక్కడో కీచుకీచుమన్న ధ్వని.

వృక్షాల చుట్టూ తిరుగుతూ నీడలలోకి టార్చి తిప్పితిప్పి చూశాడు ప్రకాష్.

రెండు పెద్ద వృక్షాలమధ్య గజం దూరం ఖాళీగా ఉంది ఆ వృక్షాలు పైకి ఎదుగుతూ కలుసుకుని పెనవేసుకుని విస్తరించాయి. చెట్లమొదట్లో ఒక బట్టలకుప్ప. ఆ కుప్పలోనుంచి కీచుకీచుమనే ధ్వని.

చేతికర్రతో బట్టను తొలగించటానికి ప్రయత్నించాడు ప్రకాష్. కాని అంత సులభంగా అతడి ప్రయత్నం సాగలేదు. వంగి చేత్తో తియ్యబోయాడు. చేతికి తడితడిగా తగిలింది పై పొర తొలగించాడు. పసిబిడ్డ, నల్లటి ముంగురులు అంటుకుపోయిన ఫాలభాగమంతా జిగురుజిగురుగా ఉంది. గట్టిగా బిగించినట్టున్న బట్టను తొలగించగానే కేర్ కేర్ మన్న ఏడుపు స్పష్టంగా వినబడ్డది.

"పసిబిడ్డ ఎవరో పారేశారు" ప్రకాష్ వెనక్కి తిరిగాడు.

బరువుగా ఊపిరి తీసుకుంటూ కమలాకర్ కూడా కదిలాడు అక్కడినుంచి కాని అతడికి అడుగు ముందుకు సాగలేదు. కాళ్ళీడ్చుకుంటూ అడుగులు వెయ్యటానికి ప్రయత్నించాడు అంతలోకే ప్రకాష్ ఎత్తుగా పైకి సాగిపోతున్న బాటలో పెద్దపెద్ద అంగలువేస్తూ మొదటి మలుపు తిరిగాడు.

కమలాకర్ వెనక్కి తిరిగాడు. చెట్ల మధ్యగాఉన్న బట్టల మూటను రెండు చేతులతోను గుండెకు చేర్చుకుని బయలుదేరాడు ఆ మూటలోనుంచి ధ్వని వచ్చినప్పుడల్లా అతడి రోమాలు నిక్కబొడుచుకుంటున్నాయి. దశమి చంద్రుడు తన ఉజ్జ్వల భవిష్యత్తు తలుచుకుంటూ వెనక్కి తిరిగిచూడకుండా ముందుకు పరుగులు తీస్తున్నాడు. చెట్లనీడల మధ్యగా వెన్నెల నేలమీద అద్దకం బట్ట పరిచినట్లుగా ఉంది. కమలాకర్ మిలిటరీ నడక సాగించాడు. దొరికిన బిడ్డను గుండెకు చేర్చుకుని ముందూ వెనకా ఆలోచించకుండా, ఎదురుగా ఉన్న భోజనపదార్థాలను గబగబా నోటబెట్టుకున్నట్టుగా, చేతిలో ఉన్న కాఫీకప్పు ఖాళీ చేసినట్టుగా అతిసహజంగా ఏ ఆలోచనా లేకుండా నడుస్తున్నాడు.

మెల్లిగా వాకిటి మెట్లెక్కి గదిలో తన నులక మంచంమీద ఆ మూట పెట్టాడు.

"భాయీ. ఇదేంపని? ఇది అడదిక్కులేని సైనికదళ నివాసం. ఇక్కడ పసిబిడ్డ ఎట్లా పెరుగుతుంది?" అన్నాడు ప్రకాష్.

"మన దళానికి ఎప్పుడు అర్డర్సు వస్తాయో తెలియదు. రాగానే మనం ఈ ప్రదేశాన్ని వదిలి వెళ్ళిపోవాలి. మన సైనికుల మన్న మాట మరిచిపోయినట్లు న్నావు?"

"అది సరే, పాలెట్లా? నీళ్లెట్లా?"

ఆ ప్రశ్నల వర్షానికి కమలాకర్ తట్టుకోలేకపోయాడు. మెదడు పనిచేయ లేకపోయింది. కొంతసేపటికి తెప్పరిల్లుకుని "దిక్కూ, దివాణంలేక చెట్టుకింద ఏడుస్తుంటే చూడలేక తీసుకువచ్చాను. ఇప్పుడు బయటపారేయటం మానవత్వం కాదు. మీకు తోస్తే ఇప్పుడేం చెయ్యాలో చెప్పండి" అన్నాడు తలపట్టుకుని.

"ముందు ఒక మంత్రసానిని పిలిపించి బొడ్డు కోయించి నీళ్ళు పోయించు దాము. ఆ తరవాత దానినే తీసుకువెళ్ళమంటే సరిపోతుంది" ఒకరననే అంతా తలలూపారు.

"అవును అట్లా ఎవరికయినా ఇచ్చేస్తే సరి. లేకపోతే మనం పిల్లలను, మేకలనూ పెంచటానికా ఇక్కడికి వచ్చింది? మన ఆఫీసర్లు ఏమంటారు?" అన్నాడు ప్రకాష్ తల అడ్డంగా తిప్పుతూ అందరినీ చూసి.

ఈ ఆలోచన అందరికీ వచ్చింది. వెంటనే వాచ్‌మన్‌ని పిలిచి ఒక మంత్ర సానిని పిలుచుకురమ్మన్నారు. అతడు తిరిగి వచ్చేవరకూ భోజనాలు చెయ్యకుండా అంతా మంచంచుట్టూ మూగారు.

వాచ్‌మన్ పదిగంటల రాత్రికి ఒక మంత్రసానిని తీసుకువచ్చాడు.

దారిలో మంత్రసాని ప్రశ్నలతో వాచ్‌మన్‌ని వేధించింది.

"మీ చీకట్లో సిపాయిలుండేచోటికి నన్ను రమ్మంటావా? అయినా సిపాయి లకు మంత్రసానితో ఏంపని? తెల్లవారిన తరవాత రావచ్చా?" అంటూ వాచ్‌మన్‌కి ఊపిరాడనివ్వలేదు.

"ఏంది బాబులూ? ఈరాత్రి వేళ నన్ను పిలిచారు?" నల్లగా గారపట్టిన పళ్లు పైకి కనబరచి నవ్వుతూ గాజులులేని చేతులు తిప్పుతూ తలమీద ముసుగుతో లోపల అడుగుపెట్టింది రజియా.

"ఈ బిడ్డకు బొడ్డుకోసి నీళ్లు పొయ్యాలి" కమలాకర్ మంత్రసానికి ఎదురుగా నిలబడ్డాడు బిడ్డను చూపిస్తూ.

"సిపాయి బాబుల దగ్గిరికి బిడ్డ ఎట్లా వచ్చింది? ఇక్కడెవరు పారేశారు?" అని గొణుగుతూ "మరి వేడి నీళ్లూ చాకూ కావాలి" అన్నది కొంగు దోపుకుంటూ ముందుకువచ్చి.

"బొడ్డుకోసి నీళ్ళుపోస్తే పదిరూపాయలు ఇస్తారా?

"పదిరూపాయలే? ఎప్పుడయినా తీసుకున్నావా?" నాలుగు రూపాయలు ఇస్తాం" కొట్టవచ్చినట్టు మాట్లాడాడు ప్రకాష్.

దూదేకుల రజియా అతడి మాటలకు బెదిరి ఒక అడుగు వెనక్కివేసింది. "సిపాయిబాబూ. ఇంతదూరం చీకటిపడ్డ తరువాత వచ్చాను. ఈగుట్టమీదికి ఎవరు రారు. నేను ధైర్యముచేసి వచ్చాను. ఎనిమిది రూపాయలు ఇచ్చెయ్యండి.' చెప్పిన పని చేసి వెళ్ళిపోతాను."

"వెళ్ళు వెళ్లు. దారినపోయే పీడను ఇంటికితెచ్చాడు మావాడు. అందుకు ఎనిమిది రూపాయల ఖర్చా! అయిదు రూపాయలకంటె ఒక పైసా ఇవ్వము. ఎవరూలేని ఈ అనాథకు అన్ని రూపాయలఖర్చా?"

పదినిమిషాలకు పైగా సాగిన బేరం చివరకు అయిదు రూపాయలకు ముడిపడ్డది. ఆ అయిదు రూపాయలు ముందుగానే చేతిలో వేయించుకుని కొంగుకు కట్టుకుని, చాకుతో బొడ్డుకోసింది. రజియా. చౌకీదారు తీసుకువచ్చిన వేడినీళ్ళతో స్నానం చేయించింది.

ఈ లోపున కమలాకర్ తన మంచంమీద దుప్పటీ నాలుగు మడతలుచేసి పరిచాడు. బిడ్డను పడుకోబెట్టి దుప్పటికొన కప్పింది రజియా. తన పని అయిందన్నట్టుగా కాళ్లూ చేతులూ శుభ్రంగా తుడుచుకుని "బాబులూ. పాలు?' అన్నది

''అవును పాలెట్లా?'' అందరూ ముఖాముఖాలు చూసుకున్నారు.

''టీ కోసం పాలు ఉంచుకోలేదూ?'' అన్నది.

ఆక్లర్లీ తెచ్చిన పాలు నాలుగు చంచాలు దూదితో తడిసి ఒక్కొక్క బొట్టే బిడ్డనోట్లో విడిచింది'' నాలుగుబొట్లూ చప్పరించిన బిడ్డ కళ్ళుమూసుకున్నాడు అలసిపోయి

''ఈ రజియానే తీసుకుపొమ్మనండి. ఈ బిడ్డను మనమేం చేసుకుంటాము ఎట్లా పెంచుతాము'' అన్నాడు ప్రకాష్ చేతికర్ర ఆడిస్తూ.

కమలాకర్‌కు సూదితో పొడిచినట్లనిపించింది. బిడ్డ దొరికాడు. పారేసుకుంటామా? గుండె వేయి గొంతులతో ఘోషించినట్లయింది. తలవంచుకున్నాడు మౌనంతో.

కాలిబూట్లు చప్పుడుచేస్తూ భీమ్‌సింగ్ వచ్చాడు. ''ఏమిటి అందరూ ఇట్లా నిలబడ్డారు. ఈ మనిషి ఎవరు? లోపలికి ఎందుకు వచ్చింది?'' అన్నట్లు కళ్ళతో అడిగాడు అందరి ముఖాల్లో చూస్తూ.

ప్రకాష్ చెప్పాడు బిడ్డను చూపిస్తూ.

భీమ్‌సింగ్ ముఖంలో రంగులుమారుతున్నాయి.

కమలాకర్ భీమ్‌సింగు దగ్గరికి వచ్చి రెండుచేతులూ పట్టుకున్నాడు ''ఈబిడ్డ నాకు దొరికింది'' అంటూ.

''ఇదేమన్నా వస్తువా దొరికితే జేబులో వేసుకోవటానికి? బిడ్డను పెంచాలి. నీవు చేసేది మిలిటరీ ఉద్యోగం. ఈబిడ్డను ఎక్కడ ఉంచుతావు? ఎవరు పెంచుతారు? నీవు ఉద్యోగ ధర్మాలను అతిక్రమించి ఇటువంటి పనులుచేస్తే నీ మీద చర్యతీసుకోవలసి వస్తుంది: అయిందేదో అయిపోయింది. ఈ మనిషికి ఇచ్చెయ్యి'' అన్నాడు భీమ్‌సింగ్ పెద్ద గొంతుతో.

''నా కెందుకు బాబూ ఈ బిడ్డ? ఏడుగురిని పెంచలేక చస్తున్నా'' అన్నది రజియా.

''పోనీ తీసుకువెళ్ళి ఎవరికయినా ఇచ్చెయ్యి బిడ్డలు కావాలనేవారు చాలా మంది ఉంటారు నీకేమయినా బహుమానం ఇస్తాంగాని ముందు ఇక్కడినించి బిడ్డను తీసుకువెళ్ళు.''

''బాగుంది. ఈ బిడ్డను ఒడిగట్టుకుని 'మీరు తీసుకుంటారా?' 'మీరు తీసుకుంటారా?' అంటూ ఊరంతా తిరగనా?'' మూతి మూడు వంకరలుగా తిప్పింది రజియా.

కమలాకర్ జాలిగొలిపేటట్లు అందరి ముఖాలూ చూస్తున్నాడు.

''నన్నెవరయినా అడిగితే ఇక్కడికి పంపిస్తా'' అన్నది ఆఖరిమాటగా రజియా

''అంతవరకూ పాలూ నీళ్ళూ ఎట్లా? ఇక్కడ ఎట్లా కుదురుతాయి?'' అందరూ ఒక్కసారే అన్నారు.

కమలాకర్ పడుతున్న బాధంతా గమనించిచూస్తున్న భూమయ్య ''ఇంత మందిమి ఉన్నాము దూదితో పాలు నోట్లో పిండలేమా?'' అన్నాడు ధైర్యంగా.

కమలాకర్ భీమ్‌సింగ్ చేతులు మళ్ళీ పట్టుకున్నాడు ''నాది పొరపాటే. కాని పది రోజులు టైము ఇవ్వండి ఈ లోపల ఏదయినా ఏర్పాటు కావచ్చు. అంత వరకూ ఈ బిడ్డను ఇక్కడ ఉండనివ్వండి.''

''ఇక్కడ ఉంచటానికి వీలులేదు. అంతగా కావాలంటే వాచ్‌మన్ గదిలో ఉంచుకో!'' అన్నాడు భీమ్‌సింగ్ కొంచెం మెత్తపడి.

''బాబూలూ. మీరు తాగే పాలుపోస్తే బిడ్డ బతకదు'' అంటూంది రజియా భూమయ్యతో

''అన్ని మాటలు నీవే అంటున్నావు. ఈ పాలు పనికి రాకపోతే ఏంచెయ్యమంటావు?'' అన్నాడు భూమయ్య.

''పాలు యిచ్చే దాయని పిలుచుకువస్తా. రోజుకు నాలుగుసార్లు ఇప్పించండి. మధ్యలో ఏడిస్తే చక్కెర నీళ్లు తాగించండి.''

''మా పనులన్నీ వదులుకుని వీడిని పెంచుతూ కూర్చోమంటావా? బాగానే ఉంది. తీసుకువెళ్లు. ఎవరికయినా ఇచ్చెయ్యి'' అన్నారు మళ్ళీ అంతా కలిపి.

''బొడ్డు కొయ్యమని పిలిచి ఈ రాలేమిటయ్యా?'' వెనక్కి తిరిగి గడప దాటింది రజియా.

ఈలోపం భీమ్‌సింగ్ మరికొందరు పిల్లవాడిమంచం చుట్టూ చేరారు కళ్ళు మూసుకుని ఊపిరి తీసుకుంటూ పడుకున్న బిడ్డను చూస్తున్నారు.

భీమ్‌సింగ్ మాట్లాడకుండా బయటకు వచ్చాడు.

''మాలో ఎవరికి దొరికితే ఏం? ఈ బిడ్డ మాకు దొరికాడు. ఎవరయినాసరే బాగా పెంచేవాళ్లు కనబడే వరకూ మా దగ్గరే ఉంటాడు. ఈబిడ్డకోసం కావలసిన ఏర్పాట్లుచెయ్యి. నీవుకూడా వచ్చి చూచిపోతూ ఉండు. డబ్బుకు వెనుదీయకు'' అంటున్న భూమయ్య వైపు ఎర్రగా చూశాడు.

బిక్కచచ్చిన ముఖంతో కమలాకర్ భీమ్‌సింగ్‌ను వెన్నంటి బైటికివచ్చాడు. ''బిడ్డమీద మీకుకూడా దయకలిగినట్లున్నది. ఈ బిడ్డను మన కాంపులో బ్రతకనీయండి. మీనోటితో మీరొక్క మాట అనండి'' బతిమిలాడుకున్నాడు.

''ఇక్కడకాదు, వాచ్‌మన్ గదిలో'' తన గదిలోకి దూసుకుపోయాడు భీమ్‌సింగ్.

తెల్లవారకముందే రజియా ఒక మనిషిని తీసుకుని వాచ్‌మన్‌తో లోపలికి ప్రవేశించింది. ''ఈ మనిషి నాలుగుపూటలూ వచ్చి పాలిస్తుంది. పొద్దుటిపూట వచ్చి నప్పుడు పాలిచ్చి నీళ్లు కూడా పోస్తుంది. ఎంత జీతమిస్తారో మాట్లాడుకోండి.''

బిలబిల్లాడుతూ సైనికోద్యోగులంతా రజియా ఉన్న చోటికి వచ్చారు.

''బాబులూ చూడండి. ఈ లక్ష్మి బిడ్డకు కడుపునిండా పాలిచ్చి నీళ్లు పోస్తుంది'' అందరివైపూ చూస్తూ చెప్పింది రజియా.

ఒక్కొక్కరే వచ్చి లక్ష్మి ముఖం చూసి వెళ్లారు. ప్రకాశ్ కమలాకర్ రజియాను పక్కకు పిలిచి ''ఎంత ఇవ్వమంటావు?'' అన్నారు.

"నాలుగుసార్లు ఈ గుట్ట ఎక్కిరావాలి. ముప్పై రూపాయలు చేసుకోండి" అదే తక్కువన్నట్టుగా రజియా మాట్లాడింది.

గంటసేపు బేరమాడి పాతిక రూపాయలకు ఒప్పుకున్నారు ఇద్దరూ.

"ఇవాల్టినుంచే మొదలు. పాలిచ్చిపోవాలి" అన్నాడు కమలాకర్.

"నీళ్లు కూడా పొయ్యాలి" అన్నాడు ప్రకాష్.

ఆ తెల్లవారుఝామున భీమ్‌సింగ్ నిద్రలేవకముందు బిడ్డను వాచ్‌మన్ గదిలోకి మార్చారు. దూలానికి తాడుకట్టి వల ఉయ్యాల ఏర్పరిచారు. ఆ ఉయ్యాలకు ఎదురుగా కమలాకర్ తన మంచం తెచ్చి వేసుకున్నాడు. రాత్రిళ్లు ఉయ్యాల ఊపటానికి వీలుగా దానికి ఒకతాడు కట్టాడు.

నాలుగు రోజులు వేళ చొప్పున వచ్చింది లక్ష్మి . ఐదవనాడు పొద్దుటిపూట కాగా పిల్లవాడు నాలుగు గంటలకే లేస్తాడు. అప్పటినుంచీ ఎత్తుకుతిప్పాలి. అయిదింటికే వచ్చే లక్ష్మి ఏడు గంట లయినా రాలేదు. కమలాకర్‌కు బిడ్డ ఏడుస్తూంటే పిచ్చెత్తినట్టుగా ఉన్నది. అలమార్‌లో ఉన్న తేనె సీసా తీసుకువచ్చి వేడి నీళ్ళల్లో కలిపి చంచాతో పోశాడు. కొంత కిందపోయినా కొంత నోట్లో పడ్డది.

పిల్లవాడిని పడుకోబెట్టి కమలాకర్ వాచ్‌మన్ దగ్గరికి వెళ్ళి "పాలదాయి ఎందుకు రాలేదు? నీకేమయినా తెలుసా?" అడిగాడు.

చెప్పటం ఇష్టంలేనట్లు ముఖంపెట్టి "నాకేం తెలుసు దొరా? అన్నాడు.

"వెళ్ళి అడిగి వస్తావా?" బ్రతిమిలాడుతున్నట్టుగా అడిగాడు.

"ఇల్లు తెలియదు కదా?"

కమలాకర్‌కు అతడు అబద్ధమాడుతున్నాడని తెలుసు. మొదటిరోజు తనకు తెలుసునన్నట్లుగా చెప్పాడు. కొంతసేపటికి వాచ్‌మన్ ముక్కుతూ మూలుగుతూ లేచివెళ్ళాడు కమలాకర్ గడపలో నిలబడి 'లక్ష్మి ఎందుకు రాలేదా?' అని ఆలోచిస్తున్నాడు.

ఈ దళంలో ఉన్నవాళ్ళంతా పాతికనుంచి నలభై ఏళ్ళ వయసులోఉన్నారు. ఆడది కనబడితే ఆకలితో చూసే వయసు కలవాళ్లు. అంతలోకే అతడు 'ఛీఛీ నేను

ఏమనుకుంటున్నాను? పిచ్చి ఆలోచనలు వస్తున్న వేమిటి?' అంటూ తన్ను తనే కసురుకున్నాడు. అయినా మనసులో ఒకనాటి సంఘటన సుడిగాలిలా గుండ్రంగా తిరిగి తిరిగి పైకి లేచింది.

ఒకనాడు తను ఊళ్ళో తిరిగివద్దామని బయలుదేరాడు. గుట్టదాటిన తరవాత మూడు గజాల దూరంలో అంగడి ఉన్నది. తమలపాకు కిల్లీ కొంటున్నాడు. రెండుముంతలు చేతబట్టుకొని ఒయ్యారంగా నడుస్తున్న పిల్లమీద తన చూపు పడ్డది. గబగబా కారాకిల్లీ నోట్లో కుక్కుకుని సిగరెట్టు వెలిగించి పదిమంది నడిచే రోడ్డున ఆ పిల్లను వెంబడించాడు. బిత్తరిచూపులతో పరుగులాంటి నడకతో ఆ పిల్ల గుడిసెలోకి దారితీసింది. ఆ పిల్ల చూపులలో నున్న భయం తను పసికట్టాడు. తనలో తాను నవ్వుకుంటూ మిలిటరీ నడకసాగిస్తూ వెంబడించాడు. గుడిసెముందర మంచాలు వాల్చుకుని కూర్చున్నారు పదిమంది మగవాళ్లు.

కమలాకర్‌ను చూడగానే "ఏంకావాలి దొరా?" అంతా లేచి నిలబడ్డారు. తనవేషం చూసి అందరూ భయపడ్డట్టు కనబడ్డారు. వాళ్లగుంపును చూసి తనూ జంకాడు.

కాని స్త్రీ కోసం వేట అంతటితో ముగియలేదు. మరొకసారి వెంబడించి వెంబడించి ఒక స్త్రీని చేజిక్కించుకున్నాడు. తమ సైనికదళాలలో అది కొత్త సంగతా? చాలా సామాన్యమైన విషయం. తనతోటి సైనికులంతా సాయంకాలపు వేళల్లో పిట్టలను గురించి మాట్లాడుతుంటారు. వాళ్ళకు తమ నాయకుడు భీమ్‌సింగ్ పైకి కనబడడు. కాని ఊరంతా తిరుగుతూ ఉంటాడు.

తొమ్మిదిగంటలకు వాచ్ మన్ వచ్చాడు. లక్ష్మి ఇంట్లో లేదట. మధ్యాహ్నానికికి రజియా వచ్చింది. కమలాకర్ ఈలోపున ఫీడింగ్ బాటిల్ కొనుక్కుని వచ్చాడు. రజియాచేత పాలుపట్టించి మరొకదాయిని తీసుకురమ్మన్నాడు.

మరునాడు ఎండ ఎక్కకముందే రజియా పాలదాయి నొకదాన్ని తీసుకు వచ్చింది.

"నీ కెంత కావాలి చెప్పు?" ఎంతయినా సరే ఇస్తా నన్నట్టు అడిగాడు కమలాకర్. అప్పటికే ఆమెను చూడటానికి సైనికులంతా తమ గదుల్లోంచి బయటికి వచ్చారు. వాళ్ళను చూడగానే ఆమె భయపడి వెనుకడుగు వేసింది.

"నేను ఉండను బాబూ" అన్నది ముసుగు సవరించుకుంటూ.

"ఏమీ? ఎందుకురావూ? రాదలచుకోనిదానవు ఇంతదూరం ఎందుకు వచ్చావు? గద్దించినట్టు మాట్లాడాడు.

రజియా ఆమె ముఖంలోకి చూసింది.

"అబ్బో. సిపాయి బాబులు! నాకు భయం." అన్నది రహస్యంగా. ఇద్దరి మధ్య కొంతసేపు మాటలు రహస్యంగా సాగాయి.

"ఉండదట బాబూ ఇంకెవరినైనా తీసుకువస్తాను" ఇద్దరూ వెళ్ళిపోయారు. కమలాకర్ ఆలోచనలో పడ్డాడు.

రెండు రోజులపాటు కమలాకర్‌కు నానా అవస్థ అయింది. పాలదాయి కుదరలేదు. సీసాలో పాలుతాగినా పిల్లవాడు ఏడుపు మానలేదు. లేనిపోని బాధ తెచ్చుకున్నాడని తోటివాళ్ళంతా అంటుంటే కమలాకర్‌కు దిక్కుతోచలేదు. ఆ సాయంకాలం రజియాదగ్గరికి పిల్లవాడిని పంపెయ్యమని సలహా ఇచ్చారు మళ్ళీమళ్ళీ

మౌనంతో తల వంచుకున్నాడు కమలాకర్.

మూడవనాడు రజియా దగ్గరికి రెండుసార్లు మనిషిని పంపగా ఒక దాయిని తీసుకువచ్చింది. నల్లగా పొట్టిగా ఉంది. యౌవనం పొంగులువారే వయస్సు. మిస మిసలాడే దేహాన్ని నల్లగా మాసి చిరిగిపోయిన చీరతో కప్పుకుంటూ లోపలికి అడుగుపెట్టింది. కమలాకర్ పెట్టిన షరతు లన్నిటికీ ఒప్పుకొని జీతం మాట్లాడు కున్నది.

వాళ్ళను వాకిటి మెట్లవరకూ పంపుతూ "చూడు, మా క్యాంపులో నీ కెటు వంటి ఆపదా రాకుండా నేను కాపాడుతాను—సరేనా?" అన్నాడు మెల్లిగా.

వాచ్‌మన్ గదిలోకి పిల్లవాడిని మార్చిన తరవాత ఆ గది చాలా శుభ్ర పడ్డది. అనవసరమయిన సామానుతీసి బయట సందులో పడేశాడు కమలాకర్. వాచ్‌మన్‌ని రేకులషెడ్డులోకి పంపాడు. పిల్లవాడి గది గడపకు ఒక గోనెపట్టా పరదా మాదిరిగా కట్టాడు. పాలదాయి రాగానే పిల్లవాడి గదిలోకి పంపి తాను హాలులో కూర్చుంటాడు. అక్కడికి పిల్లవాడి గది బాగా కనబడుతూ ఉంటుంది. ఈ ఏర్పాటు ప్రకారం రెండురోజులు గడిచాయి.

పాలవాయి వచ్చి తిరిగివెళ్లేవరకూ కమలాకర్ తనదృష్టి అంతా దరవాజాకు కట్టిన పరదామీదనే ఉంచుతాడు. అది కాస్త కదిలితే ఉలిక్కిపడుతూ ఉంటాడు.

ఉదయం పదకొండు గంటలవేళ. పిల్లవాడిని దాయిచేతి కిచ్చి హాలులో కిటికీకి దగ్గరగా నిలబడ్డాడు కమలాకర్. అతడి మనసు ఎటోవిహరించడం మొదలు పెట్టింది.

ఆ గది ముందునుంచి ఎవరు వెళ్ళిందీ అతడు చూడలేదు. కాని ఎవరో వెళ్లటం మాత్రము నిజం. సహించరానిదేదో విద్యుచ్ఛక్తిలా అతడి దేహమంతటా ప్రవహించింది. ముక్కుపుటా లదిరాయి. అతడి వెడద కన్నులు అరుణిమను దాల్చాయి.

"ఎవరు ఆ గది ముందర తారట్లాడేది?" అతడు తన దృష్టి నంతా అటే నిగిడ్చి చూడటం మొదలుపెట్టాడు.

పాలదాయి రంగమ్మను చూడగానే ఎటువంటి వాడికైనా మతిపోయే మాట నిజము. తను ఎంతగా నిగ్రహించుకుంటున్నాడు? ఆమెను ఆ తలంపుతో చూడటం లేదు. అటువంటి భావాలు ఉత్పన్నం కాకుండా ఉండాలని ఆమెవైపు సరిగాచూడ నైనా చూడటం లేదు.

ఆమె యౌవనంలో ఉన్న స్త్రీ అన్నమాట నిజమే. కాని ఆమె ఆ క్యాంపులోకి ఒక పసిబిడ్డకు ఆకలితీర్చే పవిత్రవంతమయిన కార్యము కొరకు వినియోగించబడ్డది. ఆమె నెవరూ ఈ ఆవరణలోనే కాదు. మరెక్కడా మలినపరచరాదు. అతడి భావాలు పొంగుతూ పరుగులు తీస్తున్నాయి.

రంగమ్మ ఒక గోనెపట్టామీద కూర్చొని కాళ్లు చాపుకుని బిడ్డను ఒడిలో వేసుకొని పాలిస్తున్నది. ఆమెకు బిడ్డ వయసు పిల్ల ఉన్నది. ఆ పిల్లకు గంజి నీళ్లు ఒకపూట పోసి డబ్బుకోసం అమృతం వంటి తన పాలను అమ్ముకుంటున్నది. ఆ బిడ్డడు పాలు తాగుతుంటే ఆమె ప్రాణం ఉసూరుమంటున్నది. తనబిడ్డ ప్రాణం కొట్టుకుపోతున్నది.

బిడ్డ ఆవురావురు మంటూ పాలు తాగుతున్నాడు.

ఆమె బిడ్డను ఎడమవైపునుంచి కుడివైపుకు మార్చింది.

ఆ గదికి వెనకపక్కగా ఒక కిటికీ కొంచెము ఎత్తుగా ఉన్నది. అది ఒక సందులోకి ఉన్నది. ఆ సందులోకి ఒక మనిషి నిరాఘాటంగా వెళ్ళిరావచ్చు కాని కమలాకర్ చెత్తసామాను కుప్పలు కుప్పలుగా పడేశాడు.

కాకీ డ్రెస్సులో ఆ సందులో ఎవరో నడుస్తున్నట్టు కమలాకర్ కనిపెట్టాడు.

ఎవరో దుర్మార్గుడు—తన కత్యంత ప్రియతముడైన బిడ్డకు పాలు ఇచ్చే స్త్రీని చాటుగా చూస్తున్న నీచుడు! ఆబిడ్డకు పాలు అందనివ్వకుండా ఆస్త్రీని లాక్కుపోవాలని చూస్తున్న పరమదుర్మార్గుడు! తటాలున తన తుపాకి తెచ్చి కిటికీగుండా తొంగిచూస్తున్న మనిషిమీద కాల్చాడు.

పెద్ద పొలికేకపెట్టి ఆ మనిషి పడిపోయాడు.

కమలాకర్‌తోపాటు ఆ దళములోని సైనికులంతా సందులోకి పరిగెత్తారు. భీమ్‌సింగ్ రక్తపు మడుగులో పడి ఉన్నాడు.

"ఏ కసాయివాడు తండ్రివంటి మన కమాండరును కాల్చింది! ఎవరు తుపాకీ పేల్చింది?"

అందరితోపాటు నిలబడిపోయిన కమలాకర్ రంగమ్మ బయటికి రాగానే పిల్లవాడు పడుకున్న గదిలోకివెళ్ళాడు. ఉద్రేకపడిన అతడి గుండెలో రక్తము కళపెళ్ళాడుతూ మరుగుతున్నది.

('ఆంధ్రప్రభ'-సచిత్ర వారపత్రిక)



# సాంధ్య కిరణాలు

రామనాధం వెనక్కు తిరిగాడు. గదిలోకివెళ్ళి మంచంమీద మేను వాల్చగానే ఆలోచనలు ముసురుకున్నాయి.

అతడిచెయ్యి అనుకోకుండా క్షణానికొకసారి నిద్రమాత్రలు పెట్టిన అల మారివైపు పోతున్నది. ఈ సంఘటన తనను సవాలు చేస్తున్నది. తను నలుగురిలో నిలబడలేక పోతున్నాడు, అందరిలో తనిక తలెత్తుకుని తిరగలేడు. పరాభవాగ్నితో దహించుకుపోయే ఈ జీవితాన్ని అంతమొందిస్తేనే మంచిది. జబ్బుగాఉన్న తండ్రి కోసం తెచ్చిన మాత్రలలో కొన్నితెచ్చి సీసాలోవేసి దగ్గర పెట్టుకున్నాడు. వారం రోజులుగా చేస్తున్న ఈ ప్రయత్నం క్రియారూపం దాల్చలేదింకా.

చెయ్యి మళ్ళీ గూటివరకూ వెళ్ళింది.

“అందుకొని నోట్లో వేసుకో. సిగ్గుమాలిన బ్రతుకును అంతం చేసుకో.” మనసు ముందుకు నెట్టుతోంది.

“నీవెందుకు ప్రాణం తీసుకుంటావు. నీవేం తప్పుచేశావు. ఆత్మహత్య చేసుకోవలసింది నీవుకాదు” బుద్ధి వెనక్కు లాగుతున్నది.

మనసు ముందుకూ వెనక్కూ ఉయ్యేలలా ఊగిపోతున్నది. పడకలో తొట్రుపాటు-ఆలోచనలో అస్థిరత్వము-ఏ దృశ్యముచూసినా నేత్రపీడాకరము-ఆప్తులే హంతకుల్లా కనబడటం; భగవంతుడా! ఏమిటీ ఈ నరకయాతన?

అతడి జీవితము సంతానము కలగనంతవరకూ ఏ ఒడిదుడుకులూ లేకుండా సాగింది. స్వచ్ఛమూ మధురమూ పవిత్రమూ అయిన గంగా స్రవంతిలా ప్రవహించింది. బాల్యమూ విద్యార్థిజీవితమూ చాల ఆదర్శప్రాయంగా గడిచిపోయాయి. దాంపత్య జీవితం నిత్యవసంతం.

"ఇప్పుడు మాత్రం ఏమయింది? వెర్రి మొర్రి ఆలోచనలు అంతమొందించుకో. అంతా స్వర్గంలా కనబడుతుంది" ఎవరో గదమాయించినట్టు బాధ.

వెల్లిపాయలు వొలుస్తున్న కనకమ్మ తలవొంచుకొని గబగబా గదిలోకి వెళ్లతున్న రామనాథాన్ని చూసి తెల్లబోయింది.

"రామనాథం చూసివచ్చావా పిల్లవాడిని?" కూర్చున్నచోటునుంచే అడిగింది.

"ఏమిటోయ్? కొడుకు పుట్టేసరికి చెవులు వినిపించకుండా పోయినట్లున్నాయే." జవాబు లేకపోయేసరికి వొలిచిన వెల్లిపాయలు గుప్పెట్లో పెట్టుకుని గుమ్మంలోనుంచే గదిలోకి తొంగి చూసినది గోడవైపుకు ముఖంపెట్టి మంచమ్మీద పడుకున్న రామనాథాన్ని చూసి గతుక్కుమన్నది-ఆమె గుండె.

కనకమ్మ మనసప్పుడే శంకించటం మొదలుపెట్టింది. నలుగురు ఆడపిల్లల తరువాత ముద్దులొలుకుతూ ముచ్చటగా తన కూతురికి మగబిడ్డ పుట్టాడు. చూసి వచ్చిన అల్లుడి ముఖాన కత్తివేటుకే నెత్తురుచుక్క లేకుండాపోయిందేం?

"రామనాథం? జ్వరంగాని తగల్లేదు కదా? అట్లా ఉన్నావేం? తల్లీ పిల్లవాడు కులాసాయేకదూ? మీకు భోజనాలుపెట్టి అమ్మాయికి కాఫీ తీసుకుపోవాలి" మంచానికి దగ్గరగా నిలబడ్డది కనకమ్మ.

"తలనొప్పిగా ఉందత్తయ్యా. కణతలు పగిలిపోతున్నాయి. ఓ గంటసేపు నన్ను ఒంటరిగా ఉండనియ్యి" రామనాథం ఒంటినిండా దుప్పటి కప్పుకున్నాడు.

అప్పటికప్పుడే కనకమ్మ మనసు పిల్లవాడి నక్షత్రంవైపు పరుగులుతీసింది పుట్టగానే పంచాగం చూపించింది. మాతా పితరులకు గండాలు లేవన్నాడు సిద్ధాంతిగారు తాత ముత్తవలకు కూడా ఏ విధమయిన బాధలూ లేవన్నారు. రామనాథం తలనొప్పికి ఉదయం పది గంటలకే మండిపోతున్న యెండతప్ప మరొక కారణం ఆమెకు గోచరించలేదు. బాలెంతకు వేళకు కాఫీ రొట్టె అందిస్తూ ఇంటి పనులన్నీ పిల్లల సహాయంతో నెట్టుకువస్తున్న కనకమ్మ మనసు ఉరుకులు పరుగులుగా ఉన్నది.

నరసింహం గేటుదగ్గర ఉండగానే "అన్నయ్యా తల్లినీ పిల్లవాడినీ చూసే వస్తున్నావుకదూ? ఇంటినుంచి ఏమయినా తీసుకురమ్మని చెప్పిందా అమ్మాయి?

నీవు చూసినప్పుడు పిల్లవాడు నిద్రపోతున్నాడనుకుంటూ'' ఆయన బదులు చెప్పక ముందే వంటయింట్లోకి వెళ్ళి కుంపటి రాజేసింది.

నరసింహం తలవంచుకొని లోపలికి వెళ్ళి చెప్పులు విడుస్తూ ''రామనాథం వచ్చాడా?'' ఆమె జవాబు చెప్పకముందే గదిలోకి తొంగిచూశారు. రామనాథం తల మీద కూడా దుప్పటి కప్పుకున్నాడు.

మధ్యాహ్నం భోజనంకాగానే వాకిట్లో పడక్కుర్చీలో కూర్చుని పేపరు చదువుతూ ఉండగా నరసింహానికి కళ్ళు మూతలుపడ్డాయి. తిరిగి ఆయన కళ్ళు తెరిచేసరికి కనకమ్మగానీ పిల్లలుగానీ ఇంట్లో లేరు ఆయనలేచి గ్లాసెడు మంచి నీళ్ళు తాగి రామనాథం గదిలో అడుగు పెట్టాడు.

అడుగుల చప్పుడుకు రామనాథం కళ్ళు తెరిచి మళ్ళీమూశాడు. నరసింహా నికి సంతోషం పొంగులా పైకి లేచేసరికి కళ్ళల్లోనీళ్ళు నిలిచాయి. ఆప్యాయంగా రామనాథం ఒంటిమీద చెయ్యివేసి మంచంమీద కూర్చున్నాడు.

''అబ్బాయీ రామనాథం మనకు మంచిరోజులు వచ్చాయి చూశావా? వాడు ఆ పుట్టినబిడ్డ ఎంత ముచ్చటగా ఉన్నాడురా? నీవు బాగా చూసే ఉంటావు సిద్ధాంతి గారింటినుంచి వస్తున్నా శాంతి నక్షత్రం కాదన్నాడు. నీకు యోగకాలం ఆరంభ మయిందని చెప్పాడు. సంసారికంగాను ఉద్యోగపరంగానూ కూడా నీ జీవితం ఇప్పటినుండే బాగుపడుతుందన్నాడు. కోడలు కూడా తేలిగ్గానే ఉంది.''

నామనాథం ఇంటికప్పుకేసి చూస్తున్నాడు. తండ్రిమాటలు విన్నట్టుగా ఊఁగాని ఆఁగాని అనలేదు.

నరసింహం రెండు నిమిషాలపాటు ఆసుపత్రిలో ఉన్న పసిబిడ్డ రూపాన్ని స్మృతికి తెచ్చుకున్నాడు. నాలుగేళ్ళ క్రిందట కోడలికి పురుడు వచ్చిననాటి సంగతి నరసింహానికి ఉదయంనుంచీ మనసులో మెదులుతున్నది.

నరసింహం చేతికర్ర గోడకానించి కాళ్ళు కడుక్కోవడానికి బయలుదేరాడు. ఆయన పెరటిద్వారం చేరకముందే కనకమ్మ'' ఆ గదిలోకి వెళ్ళి నీ కొడుకు కన్న సంతానాన్ని చూడు'' అంటూ దూకుడుగా లేచి వంట యింట్లోకి వెళ్ళింది. ఆ తోపిడికి తలుపులు గోడకు కొట్టుకుని పెద్దచప్పుడు అయింది.

నరసింహం ఆమె మాటలు వింటూ పెరటి తలుపు దగ్గర నిలిచిపోయాడు. "'తన కొడుకుకన్న సంతానం" తల వంచుకుని కాళ్ళయినా కడుక్కోకుండా పురిటిగదిలోకి వెళ్ళిచూశాడు. మెత్తటి పొత్తిళ్ళల్లో తల పక్కకు పెట్టుకుని హాయిగా నిద్రపోతున్నది పసిబిడ్డ. ఒంగి బిడ్డముఖంలోకి చూశాడు. గుండె గతుక్కుమన్నది. చప్పున ఒక అడుగు వెనక్కువేసి తలవంచుకుని గిరుక్కున వెనక్కు మళ్ళాడు. "ఓ భగవంతుడా మేమేం పాపం చేశాము? నా ఒక్కగానొక్క కొడుకునూ కమ్మకమ్మటి కలలుకనే ఈ వయసులో ఇటువంటి సంతానంతో శిక్షిస్తున్నావా!" రెండు చేతులతో గుండెబాదుకున్నాడు. "ఇదెక్కడి పాపం? ఎప్పటి పాపం? దీనికి నిష్కృతిలేదా? నా కొడుక్కుకాదు. ఈ శిక్ష వాడు - నాకు" గుండెమీద చేతులతో కొట్టుకున్నాడు. రెండుచేతులతో తలపట్టుకొని కుర్చీలో కూలబడ్డాడు.

"ఇటువంటి బంగారు పాపాయిలను ఇచ్చిన దేవుడు వాళ్ళకు ముక్కూనోరూ విడివిడిగా ప్రసాదించకూడదూ?" గుండె సహస్రశకలాలయిన బాధ అనుభవించాడు.

మూడవరోజు పథ్యం పెట్టేటప్పుడు తల్లి కూతుర్ని బ్రతిమిలాడుతున్నది. "అన్నం తినవమ్మా ముందు. ఏడ్చిఏడ్చి తలనొప్పి తెచ్చుకుంటావు. నీగొంతు నారెండు చేతులతో కాశాను. ఆలోకంలో ఉన్న మినాన్నకూడా నీ కార్యానికి దుఃఖిస్తూ ఉంటారు" కూతురుకి ధైర్యం చెప్పబోయి తల్లి గుండె పగిలేటట్టు ఏడ్చింది.

పసారాలో పడకకుర్చీలో పడుకుని చుట్ట కాలుస్తున్న నరసింహం కుంచించుకు పోతున్నారు. అరుస్తూ ఇంటిని నరకప్రాయంగాచేస్తూ తననూ తనకొడుకునూ తిట్టిపోస్తున్న చెల్లెలు కనకమ్మ ఇటీవల తమఇద్దరిమధ్య రక్తస్పర్శ ఏ మాత్రం లేనట్టు మాట్లాడుతున్నది. పాతిక సంవత్సరాలనాడు మూడేళ్ళ శారదను ఒడిలో కూర్చోబెట్టుకుని పెనిమిటి పోయిన దుఃఖముతో కుమిలిపోయే కనకమ్మను ఓదార్చి తనయింటికి తీసుకువచ్చాడు. చిన్నప్పటినుంచీ కనకమ్మది పరమశాంత స్వభావము. అత్తవారింట్లో ఆకర్కోటకుల దగ్గరకూడా మంచిపేరు తెచ్చుకున్నది రూపాయలను గవ్వలుగా ఖర్చుచేసిన పెనిమిటిదగ్గర అతిఓరిమితో మెలగింది. ఆకనకమ్మకూ ఈ కనకమ్మకూ ఎంతభేదం?

భార్య చనిపోయిన తరువాత ప్రపంచమంతా తనకు చీకటిచీకటిగా ఉన్నప్పుడు కనకమ్మ ప్రవేశంతో తన యింటికి కళాకాంతులు వచ్చాయి. మేనల్లుడిని తన కూతురినీ ప్రేమతో, మంచి శిక్షణఇస్తూ ఆమె పెంచింది. వెదకుదామన్నా ఏలోపమూ లేకుండా క్రమశిక్షణతో పెరిగారు రామనాధం శారద.

అటువంటి కనకమ్మ ఇప్పుడు ఇలా మారిపోయిందేమిటి? ఎందుకు?

శారదా రామనాధంల పెళ్ళి ఆపు చెయ్యాలని నరసింహం ఎంతో ప్రయత్నించాడు. "వాళ్ళిదరూ అన్నా చెల్లెళ్ళలా పెరిగారు. పోనిద్దూ వేరే సంబంధాలు చూద్దాం ఏమంటావు కనకమ్మా?" ఈమాట నరసింహం పెదవిదాటి దాటకముందే కనకమ్మ కొంగుతో కళ్ళు ఒత్తుకుంటూ "నీకు ఉన్నది ఆ కొడుకు ఒక్కడు నాకూ ఒకపిల్ల. వాళ్ళపేరికే మూడుముళ్ళూవేసి మనం కృష్ణా రామా అంటూ కూర్చుందాము. ఇప్పుడా బయట సంబంధాలకు పోయి ఏమగచాట్లు పడతాం అన్నయ్యా" అన్నది పాలోచనగా.

నరసింహం చాలారోజులు ఆలోచించాడు. "కనకమ్మా, నీవన్నమాట నిజమే. గ్రహచారం చాలక వీళ్ళకేదైనా లోపం జరిగితే మనం భరించలేము. ఇద్దరికీ పరాయి సంబంధాలు చేస్తే ముద్దూ ముచ్చటలు బాగా జరుగుతాయి. ఆయిన వాళ్ళలో బాధ ఎందుకమ్మా?" అంటే ఆమె ఎంతకూ వినలేదు.

"అన్నయ్యా నన్ను వేరుచేస్తావా? నా కాపురం చెడి నీయింటికి వచ్చాను ఒక్కగానొక్క తోడబుట్టినవాడివి. కడుపులో పెట్టుకుంటావని నమ్మాను."కన్నీరు కారుస్తూ ఆయనముందు కూలబడిపోయింది.

నరసింహం ఆఖరిప్రయత్నంగా రామనాధం చేత కూడ చెప్పించాడు.

నరసింహానికి ఆ పెళ్ళి అసమ్మతమని చెప్పటానికి అంతరాత్మ ఒప్పుకోదు. ఒకరిలో ఉన్న లోపాలను మరొకరిలో భర్తీచేసి పరిపూర్ణంగా జీవించటానికి అనువుగా వాళ్ళిద్దరినీ తీర్చి దిద్దాడు దైవము. వాళ్ళిద్దరూ చిలుకాగోరింకలుగా ఉంటే తనూ సంతోషించినవాడే. ఆ జంట గదిలో కిచకిచలాడుతూఉంటే తన చెల్లెలితో పాటు తాను కూడా పెరట్లో జేమచెట్టు కింద కూర్చుని ఎంతో మురిపెంగా వాళ్ళ భవిష్యానికి నిచ్చెనలువేశాడు.

శారదను తన కోడలిగా చేసుకున్నప్పటినుండీ ఆమెకు ఏలోపమూ జరగ కూడదని ఎంతో జాగ్రత్తపడుతున్న నరసింహం ప్రకృతిచేసిన లోపానికీ వంచనకూ మోసానికీ పళ్ళు పటపట కొరికాడు. గుండె నెవరో పిండి వట్లయి అబ్బా అంటూ చేత్తో సర్దుకుంటూ కుర్చీలో కూర్చుని వెనక్కువాలాడు.

తనకు ఒక్కగానొక్క కొడుకు. అల్లారుముద్దుగా పెరిగాడు. దేవుడు ఎందుకు శిక్షిస్తున్నాడు ఇలా? ముద్దుగా కన్న సంతానాన్ని దగ్గరికి పిలిచి అక్కున చేర్చుకోలేక కొడుకు బాధపడిపోతున్నాడు. నిజంగా దేవుడు రామనాధానికి చేసిన శిక్షకాదు. తనకు చేసిన శిక్ష. రోజుకు రోజు కృశించిపోతున్న రామనాధాన్ని చూడవలసి రావటమే తనకు శిక్ష. కసాయివాడి కత్తికింది పశువులా బోయవాడి చేతిలోని పక్షిలా నరసింహం గుండె గిలగిల కొట్టుకుపోయింది.

అమ్మయ్య! ఇంతకాలానికి ఇప్పుడు కృష్ణపక్షమిదాటిపోయింది. శుక్లపక్షమువచ్చింది. విశాఖపట్నంలో కాపురం పెట్టి నలుగురాడపిల్లలకూ ముక్కూ, పైపెదవి సర్దించి ప్లాస్టిక్ సర్జరీ చేయించాడు. అందుకు రెండెకరాలు సంతోషంగా అమ్మాడు. మాట స్పష్టంగా లేకపోయినా నలుగురు పిల్లలూ స్కూలుకు వెళ్ళుతున్నారు తమ కుటుంబాన్ని అలుముకుపోయిన కారుమేఘాలు విచ్చిపోయాయి. చంద్రబింబం తేజస్సులో ప్రకాశించే రోజులు వచ్చాయి. కొడుక్కు పుత్రోదయమయింది. తీర్చి దిద్దినట్లున్న అవయవాలతో శారద కొడుకును కన్నదని విన్న క్షణాన నరసింహం మనసు స్వర్గపుటంచుల వరకూ పయనించి వచ్చింది.

''రామనాధం! ఏమిటిలా పడుకున్నావు? లేచి కాఫీ త్రాగు. అలా నర్సింగ్ హోముకు వెళ్ళివద్దాము లే''.

''తల నొప్పిగా ఉంది నాన్నా నీవు వెళ్ళిరా''

''అసలు ఒక్కసారయినా పిల్లవాడిని చూశావుట్రా?''

చూశానన్నట్లు తలఊపాడు రామనాథం.

నరసింహానికి కొడుకు జవాబు ఏమాత్రం నచ్చలేదు. కోడలికి పురుడు వచ్చిన తర్వాత నరసింహానికి ఉన్న అనారోగ్యమంతా ఈ వారం లోపల మటుమాయమయింది. మానవుడు కష్టసమయంలో విచారపడాలి. సంతోష సమయంలో

అనందించాలి. అందుకు భిన్నంగా ఉంటె మానసికారోగ్యరీత్యా అనారోగ్యమన్న మాటే. ఉపాధ్యాయుడిగా ఆయన ఎంతో మంది పిల్లలను చూశాడు రామనాథం మనసు బాధపడి బండబారిపోయింది. ఇప్పుడు సంతోషాన్ని కలిగించే పరిస్థితులు ఏర్పడినా సంతోషం కలక్కుండా పోతున్నది. వెన్నెల్లో నిలిచి చీకట్లను పిలిచే వెర్రివాడిలా ఉన్నాడు రామనాథం.

స్వతః రామనాథం చురుకైనవాడు, ఉత్సాహవంతుడు. ఈ అంగవిహీన మయిన సంతానంతో ఆతడిని స్తబ్ధత ఆవరించి జడుణ్ణి చేసివేసింది.

నరసింహం మూలనున్న చేతికర్ర తీసుకుని నర్సింగ్‌హోముకు దారితీశాడు.

రామనాథం మళ్ళా నిద్రమాత్రల సీసా చేతిలోకి తీసుకున్నాడు. అంతలో కనకమ్మ హడావిడిగా గదిలోకి వచ్చింది. రామనాథం తటాలున సీసా దాచ బోయాడు. మూత వదులుగా ఉండటంచేత మాత్రలు అతడిచేతిలో పడి పక్కనిండా చొర్లిపోయాయి. లేచి అవన్నీ ఏరి మళ్ళీ సీసాలో పోశాడు. కనకమ్మ పెట్టెలన్నీ పెద్దచప్పుడుచేస్తూ తెరిచి బట్టలేవో తీసుకుని మూటకట్టుకు వెళ్ళింది.

రామనాథం గదిలోనుంచి బయటికి వచ్చాడు. ఇంట్లో ఎక్కడచూసినా సంతడి సందడిగా ఉన్నది. ఎవరిని చూసినా హడావిడిగా తిరుగుతున్నారు. తనకిప్పుడు ఏకాంతం కావాలి. మనస్థిమితాన్ని వెదుక్కోవాలి. ఊరి బయటనున్న కాలువ గట్టుకు దారితీశాడు. ఎత్తుగా ఒక రాతిమీద కూర్చున్నాడు. అతడిని తరిమి తరిమి కొడుతున్న ఆలోచనలు కూరొచ్చగానే చుట్టుముట్టాయి. ''ప్రపంచంలో మానవుడు జీవితాంతం ఉత్తముడుగా ఉంటాడా? ఉండగలడా? లోకంలో ఎవరినీ నమ్మటానికి ఆస్కారము లేదా?——శారద తనను ఎంత నమ్మించింది? నమ్మించి ద్రోహం చేసింది-విశ్వాసఘాతకి.''

ఆవేశంతో చివాలున లేచాడు. రామనాథం శారదను ఈ ఒక్కమాట ముఖాన అడిగివెయ్యాలి. శాశ్వతంగా అందరినీ వదలి దూరంగా పోవాలి.

తెల్లవారితే పదకొండు. శారద మంచంమీద పడి పసిబిడ్డను పెట్టుకుని కూర్చుంది. ఆమె కెదురుగా కుర్చీలో కూర్చుని ఆమె వంకే చూస్తున్నాడు రామనాథం. వారిద్దరి మధ్య మౌనం గంటకుపైగా సంచరించింది.

"శారదా!"

పసిబిడ్డ చేతులు సర్దుతున్న శారద ఉలికిపడి తలెత్తింది.

"కష్టపడి మొత్తానికి కార్యం సాధించావు."

ఏమిటన్నట్లు కనుబొమలు పైకెత్తి చూసింది.

"అదే బిడ్డకు వికృతమయిన ముఖం రాకుండా ఉండాలని నీవుచేసిన కృషి సఫలీకృతమైనది కదూ?"

శారద అయోమయంగా అతడి ముఖంలోకి చూసింది.

"నేనూ గ్రహించానని తెలుసుకో" చివాలున లేచి బయలుదేరాడు. అతడి చూపులోని పద్మరాగపు జీరలు గ్రీష్మంలో మండుటెండలు కాశాయి.

శారదకు పరిస్థితి ఏమాత్రం అర్థం కాలేదు. ఏ వంకా లేకుండా నలుగురు ఆడపిల్లల తరవాత మగబిడ్డ పుట్టితే రామనాధానికి సంతోషంగా లేదా? ఈ చిటపటలు ఏమిటి? ఎవరిమీద కోపం? ఎందుకు? పచ్చిబాలెంత తలనొప్పి వచ్చేవరకూ ఆలోచించి ఆలోచించి అలసిపోయింది

తెల్లవారితే పురిటిస్నానం. ఆరోజే బిడ్డకు నామకరణం చేయాలని నరసింహం కనకమ్మ హడావడి పడుతున్నారు. తమ్ముడు యింటికి వస్తాడని పిల్లలు సంబరపడుతున్నారు.

రామనాథం భోజనానికి లేవలేదు. కనకమ్మ రెండుసార్లు వచ్చింది.

"నన్నిలా వదలిపెట్టు అత్తయ్యా. భోజనం చెయ్యకుండాఉంటే బాధలన్నీ సర్దుకుంటాయి" గోడవైపుకు తిరిగి పడుకున్నాడు.

"పోనీ కాఫీ తీసుకో రామనాధం ఆ తలనొప్పి సర్దుకుంటుంది"

"నాకేమీ వద్దు"

ఆమె వెళ్ళిన కాసేపటికి నరసింహం వచ్చాడు.

"ఏమిట్రా రామనాధం! తలనొప్పి అయితే ఏస్ప్రో వేసుకోకూడదూ?" ఒంటిమీద చెయ్యివేశాడు చల్లగావుంది.

"కాఫీ తాగి పడుకో పోనీ"

"వద్దు నాన్నా నన్ను పడుకోనీయండి"

"సరేలే. రేపు పొద్దునలేచి తలంటిపోసుకోవాలి సరిగ్గా పదకొండు గంటలకు పీటలమీద కూర్చోవాలి."

రేపు సెలవు పెట్టటానికి వీల్లేదు నాన్నా. ఎవరో పైనుంచి వస్తున్నారని మా ఆఫీసరు చెప్పాడు."

"పన్నెండు గంటలకు వెళ్ళవోయ్ వద్దన్నదెవరు ?"

నామకరణానికి కొత్తబట్టలు కట్టుకుని ముఖం ముడుచుకుని కూర్చున్నాడు రామనాథం. శారద పిల్లవాడిని ఒళ్ళో పడుకోబెట్టుకుని కూర్చుంది. ఆమె ముఖం బాగా వికసించిన తెల్లతామర పూరేకులా ఉన్నది. ఆమె విశాల నయనాలు మరింత విశాలమయినాయి. సౌష్ఠవ పూర్ణాంగాలలో నవచైతన్యం తొణికిసలాడుతున్నది. వదులుగా జారుముడి వేసుకున్నది. ముంగురులు ముఖంమీద లాస్యం చేస్తున్నాయి. చిరునవ్వు పెదవులమీద చిందులాడుతున్నది.

క్రీగంట ఆమెనుచూస్తూ తల పంకించాడు రామనాథం.

పురోహితుడు పిల్లవాడికి పెట్టబోయే పేరు బియ్యంలో వ్రాయమన్నాడు.

"నీకేదయినా కొత్తపేరు పెట్టాలని ఉన్నదా చెప్పు ? ఏ పేరయినా వెంకటేశ్వరుడి పేరు తరువాతనే." నరసింహం ఉత్సాహంతో చెప్పుకుపోతున్నాడు.

రామనాథం బియ్యంలో ఉంగరంతో పిచ్చిగీతలు గీస్తున్నాడు.

"అబ్బాయీ పెద్దవాళ్ళం చెపుతున్నాం విను. మా నాయనగారి పేరు పార్వతీశం గారు. వెంకట పార్వతీశం అని వ్రాయి. నీ కిష్టంలేకపోతే మరో పేరు పెట్టి పిలుచుకో."

రామనాథం ముఖంలో నిర్లిప్త భావము లాస్యం చేసింది. తలవంచుకుని తండ్రి చెప్పినట్లు చేశాడు.

శారద గదిలో చిన్నదీపం మిణుకు మిణుకుమంటున్నది. పిల్లవాడిని పక్కలో పడుకోబెట్టుకుని నిశ్చింతతో నిద్రపోతున్నది శారద. తండ్రిగదిలో అరి-

కిడిలేదని గ్రహించిన రామనాథం మెల్లిగా శారద గదిలోకి వెళ్ళాడు. టార్చి దీపంవేసి పిల్లవాడి ముఖం పరిశీలనగా చూశాడు. పసిపిల్లలను ఇదివరలో ఎప్పుడూ అంతదగ్గరగా అతడు చూడలేదు. ఆ ముఖం ఎక్కడో చూసినట్టు అని పించింది. చప్పున వెనక్కు తిరిగాడు.

''ఆ పోలిక ఎక్కడో బాగా చూసినట్టుందేం ?''

''ఎక్కడ ?''

''ఎప్పుడు ?''

''ఎవరిది ?''

గదిలో పడక్కుర్చీలో మేనువాల్చాడు. ఒక ప్యాకెట్టు సిగరెట్లు మసి అయి పోయాయి. అతడి మనస్సులో సప్తసముద్రాలు ఘోషిల్లుతున్నాయి. ఆలోచనలు అలల్లా పైకెగిసిపడుతూ ఒడ్డుకు చేరకముందే విరిగిపడుతున్నాయి. గతస్మృతులు మతనత్వాన్ని పుంజుకుని తరంగాలవలె వచ్చి అతని హృదయాన్ని కలచి వేస్తు న్నాయి.

ఆఫీసు పనిమీద రామనాథం విశాఖపట్నం వెళ్ళి తిరిగివస్తూ రాజమండ్రిలో ఒకపూట ఆగాడు. స్నేహితుడు ఆ పూట తన పినతండ్రి ఇంటికి వెళ్ళుతూ రామ నాథాన్ని కూడా భోజనానికి తీసుకువెళ్ళాడు. తీరా భోజనానికి కూర్చున్న తరువాత వడ్డించిన మనిషి శారద. రామనాథాన్ని అక్కడచూసి ఆమెకు కలిగిన విస్మయమూ-తొట్రుపాటూ వడ్డనలో తెలుస్తూనే ఉన్నది. చేతులు ఒణుకుతున్నాయి. నెయ్యి ఒక చోట వెయ్యాలనుకుంటే మరోచోట పడుతున్నది.

రామనాథం తెలియనట్టే భోజనంచేసి బయటపడ్డాడు.

శారదకు నడుమునొప్పి వస్తున్నదనీ ఒకచిన్న ఆపరేషను కావలసి ఉన్న దనీ కనకమ్మ అప్పుడప్పుడు అంటూ వుండేది. ఒకసారి మరీ ఎక్కువగా నొప్పి వచ్చి నాలుగురోజులు లేవలేదు. విశాఖపట్నంలో ఆపరేషనుకు ఏర్పాటు చేశాడు నరసింహం. ఆపరేషను తర్వాత డాక్టర్లు రెస్టు కావాలన్నారని విజయనగరంలో ఉన్న తన పినతల్లి కొడుకు ఇంట్లో దిగవిడిచి వచ్చాడు. ''డాక్టర్లు ఆరునెలల్లు

చాలన్నారు కాని అబ్బాయీ! మరో రెండు నెలలు ఉండనీయరా. మరీ బలహీనంగా ఉంది. ఇక్కడ పిల్లలతో చాకిరి చెయ్యలేకుండా ఉన్నది'' అన్నాడు.

పదినెలల తరువాత శారద వచ్చింది. మనిషి బాగా ఆరోగ్యంగా ఉన్నట్టు కనబడ్డది పారి పోయినట్టుండే ఆమె ముఖంలోకి కొత్తరక్తము వచ్చింది. నూత్న యౌవనంతో మిసమిసలాడే నవోఢలా తయారయింది.

విజయనగరంలో వున్నదనుకుని తను ఎన్నో ఉత్తరాలు వ్రాశాడు! ఒక్కదానికయినా జవాబులేదు. కుటుంబ వాసనలనుండి దూరంగా కొంతకాలమయినా ఉండాలను కుందేమో-రాజమండ్రి ఎప్పుడు వచ్చింది? తన ఉత్తరాలే మయినట్టు?

రామనాథం ప్రశ్నలకు జవాబు దొరకటంలేదు. తలంతా వేడెక్కింది.

పిల్లవాడు లేచాడు. ఆ ఏడుపుకు శారదకూడా లేచింది పిల్లవాడికి పాలిచ్చి పడుకోబెట్టినట్టుంది. ఓరవాకిలిగా ఉన్న తలుపు సందుల్లోనుంచి దీపము కనపడు తోంది. శారద లేచి తలుపు తెరిచింది. రామనాథం మెలకువతోనే ఉన్నాడని తెలుసు కుంది. సిగరెట్లమసి చూసి రెండు పాకెట్లయినా కాల్చి ఉంటాడనుకుంది.

''ఇవాళ ఇంత తొందరగా లేచి కుర్చీ మీదికి వచ్చారేం? కొత్త నవలలే మయినా తెచ్చారేమిటి?''

ఆమెను చూడగానే ఘోరవిషాలు గ్రక్కే కుపిత భుజంగాలవలె ఉద్రిక్త భావాలు బుస్సున పైకి లేచాయి. అతడి మస్తిష్కంలో ఆమె అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పటానికి అసహ్యము వేసింది ముక్కు ముడతలు పడ్డది.

''లేవట మేమిటి? అసలు నిద్రపోనిదే?'' అన్నాడు ముఖం ముడుచుకొని.

''ఎందుకని? అమ్మ అన్నది మీరు సుస్తీగా ఉంటున్నారని. ఏమిటి సంగతి?'' వెల్లిపాయల ఘుమాయింపులో ఆమె ఒక్కొక్క అడుగు ముందుకు వేస్తున్నది.

''నా సుస్తీకేం లే. నేను రేపు ఊరికి వెళ్ళుతున్నాను'' తన మనసులోఉన్న అసహ్యాన్ని వెళ్ళగక్కాడు.

"ఒంట్లో బాగాలేదంటూ ఈ ప్రయాణమేమిటి?" ఆమె విలబడివ విధానమూ. అతడిని ప్రశ్నించే పద్ధతీ ఆమె ముఖపై ఖరీ చూసి "ఓ-ఏమిటా ఫోజు" అనుకున్నాడు. ఇదివరలో అయితే ఆ ఫోజుకు మురిసి ఆతడంత దూరంలో ఉండగలిగేవాడు కాదు. ఇప్పుడు ఎంత నంగనాచిలే అనుకున్నాడు మనసులో.

"ఇంట్లో నుంచి బయటపడితే గాని మనసుకూ దేహానికీ స్వస్థత చిక్కదు"

"అనుకున్నపని జరిగితేనే గాని కొందరికి మనసు తేలికగా ఉండదు. మీకు వెళ్ళాలని అంతగా ఉంటే వెళ్ళిరండి".

తను వెళ్ళిపోతే శారదకు హాయిగా ఉండేటట్టున్నది. రామనాధం చేతిలో వున్న సిగరెట్టు ముక్క కసికొద్దీ కిటికీగుండా బయటికి విసిరాడు.

"అబ్బాయిని చూశారా? ఎప్పుడయినా అంతపసిబిడ్డను మీరు ఎత్తుకున్నారా తీసుకురానా? అబ్బాయికి తల వెంట్రుకలు ఒత్తుగా ఉన్నాయని ఎనిమిది పౌండ్ల బరువు ఉన్నాడనీ, అన్నిటికంటె ముఖ్యమయినది ముక్కునోరు విలక్షణంగా ఉన్నాయనీ చెప్పి తన సంతోషాన్ని అతడితో పంచుకోవాలని ఆమెకు గడిచిన పదిరోజులనుండీ ఆత్రంగా ఉంది. ఆ పదిరోజులలో ఒక్కటంటే ఒక్కసారి పెదవి కదల్పకుండా అరనిమిషం ఉయ్యాలలోకి తొంగిచూశాడు రామనాథం.

ఉప్పొంగిన ఆనందోత్సాహాలతో శారద తన గదివైపుకు అడుగులు వేస్తున్నది. పిల్లవాడిని తీసుకురావటానికి.

"వద్దు"

శారద ఉలిక్కిపడి వెనక్కు తిరిగి చూసింది. రామనాథం చివాలున కుర్చీలో నుంచి లేచి బయటకు వెళ్ళాడు.

మధ్యాహ్నం నరసింహం తాపీగా కాఫీ తాగుతున్నాడు గడపమీద కూర్చుని, కనకమ్మ నవ్వుముఖంతో గోడకానుకుని కూర్చున్నది. పిల్లలు నలుగురూ పసిబిడ్డ మంచందగ్గర చేరారు.

ఉదయంనుంచీ ఇంటికిరాని రామనాథాన్ని గురించి ఆలోచిస్తున్నది శారద. ఈ బిడ్డనుచూసి నరసింహం సంబర పడిపోతున్నాడు. కనకమ్మ సరేసరి ఆమెకు

కాలు నేలమీద ఆనటంలేదు. అన్నగారిమీద గౌరవం హెచ్చింది.అల్లుడిమీదప్రేమాభిమానాలు ఇనుమడించాయి. పిల్లలమీద ఆపేక్ష పొంగిపోతున్నది. శారద అదృష్టాన్ని వేనోళ్ళ పొగుడుతున్నది. ఈమార్పు శారద కెంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది.

మధ్యాహ్నం మూడుగంటలవేళ తలుపులు తోసుకుంటూ రామనాథం గదిలోకి వచ్చాడు. శారద పిల్లవాడిని పడుకోబెట్టి గదిలోకి వెళ్ళేసరికే పెట్టె సర్దుకుని పక్క చుట్టచుట్టుకున్నాడు. బండిలో సామాను పెట్టించుకుంటూఉండగా నరసింహం బయటికివచ్చి "ఎన్నాళ్లురా నీ ప్రయాణం?" అడిగాడు.

"వచ్చేఏడు నాకు ప్రమోషను వస్తుందిట. అందుకని ఇప్పుడు మద్రాసు ట్రైనింగుకు పంపుతున్నారు. ఒక ఏడాది పట్టవచ్చు" సమయానికి తనకామాట తోచినందుకు రామనాథం మనుసులో సంతోషపడుతూ ముందడుగువేశాడు.

"ఇన్నాళ్ళనుంచీ ఆమాట చెప్పవేం" నరసింహం వాకిట్లోకి వచ్చాడు.

"నా కివాళే తెలిసింది" రామనాథం అందరివైపూ ఒక్కసారిగాచూసి బండి యెక్కాడు.

కాలినడకన పక్కదారిగుండా నరసింహం స్టేషనుకు చేరుకునే టప్పటికి రైలు గంట లేటని తెలిసింది. ప్లాటుఫారం టికెట్టు కొనుక్కుని లోపలికి వెళ్ళి వెయిటింగు రూముముందర నిలబడి ఉన్న రామనాథం భుజమ్మీద చెయ్యివేశారు.

రామనాథం గతుక్కుమన్నాడు.

"మీరు ఎందుకు వచ్చారు నాన్నా యిప్పుడు?" అయిష్టంతో కుర్చీ చూపించాడు కూర్చోమని.

"రామనాథం నావంకచూడు నీవు నిజంగా మద్రాసు వెళ్ళాలనే బయలుదేరావా? ఎందుకీ అబద్ధం? నీ సంగతంతా ఈ పదిరోజులనుంచీ నేను కనిపెడుతూనే ఉన్న. నాకోసం తెచ్చిన నిద్రమాత్రలు కొన్ని సీసాలో తీసుకుని తిరుగుతున్నావు. నీ ఆఫీసుకు నిన్న వెళ్ళి కనుక్కున్నా." గబగబా నడిచిరావటం వల్ల నరసింహానికి ఆయాసం వచ్చింది రామనాథాన్నిచూడగానే ఉద్రేకం వచ్చింది. ఆపరేషను చేయించుకుని బాధపడుతున్న కాలిమీద లేచిన నారిపుండు పలపటం మొదలు

పెట్టింది. ఉత్తరీయంతో ముఖమంతా ఒక్కసారి తుడుచుకుని రెప్పలార్పుకుంటూ కళ్ళల్లో ఊరుతున్న చేమ్మని పైకి పొంగనీయకుండా అదిమిపెడుతున్నాడు.

"నీవు రాజీనామాయిచ్చి వెళ్ళిపోతున్నట్టు ఆఫీసులో చెప్పారు. అసలు విషయానికి వద్దాం, నీ సంతానాన్ని దుర్దశనుండి తప్పించాలని ఒక జ్యోతిష్కుడిని సలహా అడిగాను. మామూలుగా కాన్పువచ్చేటైము తప్పించి చూడమన్నాడు. ఆటైము తప్పితే అలోపము పోవచ్చు నన్నాడు కేవలం ఇది ప్రయోగముమాత్రమే. అందుచేత శారదకూ నీకూ చెప్పకుండా అలా చెయ్యవలసి వచ్చింది. ఫలితం చూశావుగా."

రామనాథం ఈమాటలు విననట్టూ తనకేమీ పట్టనట్టూ అంతదూరాన ఉన్న రైలుపట్టాలవైపు చూస్తున్నాడు

"శారదకు ఏదో జబ్బుఉందని చెప్పి అంతదూరాన ఉంచి టానిక్కులు ఇప్పించాను. రాజమండ్రిలో శారద ఉన్నదంటే నీవు వెళ్తావని విజయనగరంలో ఉన్నదని చెప్పాను. మనమందరమూ పడిన కష్టాలకు దేవుడు సత్ఫలితాన్ని యిచ్చాడు."

తండ్రివైపు అనుమానంగా చూశాడు రామనాథం.

"అసలు నీకీ విషయమంతా ముందే చెప్పవలసింది. పిల్లలకు నమ్మకాలు ఉండవని చెప్పలేదు. శారద మొండి కేసింది. దాన్ని ఒప్పించేసరికి పెద్దలు దిగివచ్చారు. అయినా అసలుసంగతి మీ యిద్దరితో చెప్పకపోవటం నాతప్పే, చెపామనుగా-ఇదంతా ప్రయోగమేనని. నామటుకు నాకే నమ్మకం లేకపోయింది.

"మమ్మల్ని నమ్మించటానికి పెట్టెలో పాతబట్టలు పెట్టుకున్నావు. నీవు బయలుదేరింది మదరాసుకుకాదు. ఆరైలుకని మమ్మల్ని నమ్మించి చీకటిపడగానే రైలుకింద పడాలని వచ్చావు. నీకు అందరూ అటువంటి పిల్లలే పుడతారన్న నైరాశ్యానికి వచ్చావు చక్కగాపుట్టిన పిల్లవాడిని చూడగానే శారదను అనుమానించావు".

నరసింహానికి ఎలా తెలిసిందన్నట్టుగా ముఖం పైకెత్తి ఆతడి కళ్ళలోకి సూటిగా చూశాడు రామనాథం.

"ఇదిగో ఉత్తరం. విషం కక్కుతూ శారదకు నీవు రాసిన ఉత్తరం. అది చూసుకోవాలనీ కుళ్ళి కుళ్ళి ఏడవాలనే రాసి దిండుకింద పెట్టావు. శారద చూడకుండా నేను జాగ్రత్తపడ్డాను. మేమందరమూ ఎంత సంతోషపడుతున్నామో నీవంత అనుమానానికి లోనవుతున్నావు"

తల వంచుకుని పాంటుజేబులోకి చెయ్యి పోనిచ్చాడు రామనాథం.

"రాధా"

నరసింహానికి కొడుకును ఆప్యాయంగా పిలవాలంటే రాధా అనటము అలవాటు. రామనాథం తల్లి ఆతడిని అలా పిలిచి చిన్నప్పుడు ఆడపిల్లల బట్టలువేసి అలంకారము చేసి ఆనందించేది.

రామనాథం ఆ పిలుపుకు కరిగిపోయాడు. తల్లి కళ్ళల్లో మెదిలింది. "నాన్నా" అంటూ తండ్రిని కౌగిలించుకున్నాడు. తండ్రి తన బలమైన చేతులతో కొడుకును గుండెకు హత్తుకుంటూ "వసంతాన్ని శిశిరం చేసుకోకు. ఇంటికిపోదాం పద" వీపు మీద చెయ్యివేసి నిమిరాడు. కుమారుడి వేడివేడి కన్నీళ్ళతో అతడి కండువా తడిసి ముద్దయింది.

సాంధ్య కిరణ సమేతుడైన రవి తండ్రి కొడుకులను ఇంటివరకూ సాగనంపాడు. ఆప్యాయంగా కబుర్లు చెప్పుకుంటూ ఇంటికివచ్చిన వాళ్ళను చూసి "రైలు తప్పిందా ఏమిటి?" అన్నది కనకమ్మ.

('జయశ్రీ'-సంక్రాంతి సంచిక)



# స్తుతి - మతి

పెళ్ళి పందిట్లో కార్యక్రమమంతా నిలిచిపోయింది. పురోహితుడు పెళ్ళికొడుకును సదస్యపు పీటలమీదికి రమ్మని కేకలు పెడుతున్నాడు. పందిట్లో అక్కడక్కడ ఇద్దరుముగ్గురు గుంపులు గుంపులుగా చేరి మాట్లాడుకుంటున్నారు.

పెళ్ళికూతురు తలెత్తి పందిరి నాలుగుపక్కలా కలయజూస్తోంది. అరగంటకు పైగా పెళ్ళికొడుకుకోసం అంతా ఎదురుచూస్తుంటే ఇంకా రాడేం లోపల్నించి? ఆతురతతో ఆమె తలెత్తి అక్కడినుంచే సూటిగా వీధి అరుగుమీద నిలబడి ఉన్న తండ్రివైపు చూసింది. ఇప్పటికే ఆయన జీవితంలో మూడుసార్లు నరకయాతన అనుభవించి నడుం వొంగిపోయి ఉన్నాడు. ఈసారి ఆయనకు ఓపికంతా నశించిపోయినట్టుంది. దిగాలుపడి స్తంభానికి ఆనుకుని నిలబడిపోయాడు. నాలుగుసార్లు తల్లి ఆయన దగ్గరికివచ్చి చెయ్యి పట్టుకుని బ్రతిమిలాడింది.

"మనిద్దరం విడిదిలోకి వెళ్ళి పెళ్ళికొడుకు తల్లిని పిలుచుకువద్దాము రండి."

"ఏం లాభం? ఆమె కోరికలను నీవు తీర్చగలవా?"

"అయినా మనం వెళ్ళి అడిగితే ఏమంటుందో! రండి పెళ్దాము."

వసుంధర తల్లిదండ్రుల మాటలు ఆలకిస్తున్నది. ఏం జరిగింది అసలు? పెళ్ళికొడుకు ఎందుకు రాడు? కొంపతీసి అలిగి కూర్చోలేదు కదా? అంతకుముందు అతడు కట్టిన మంగళసూత్రాలను తడిమి చూసుకుంది.

పాపాయమ్మ బలవంతంచేసి ఆయనను కదిలించింది.

తల్లి వెంట ఉత్తరీయం సవరించుకుంటూ తండ్రి వెళ్ళుతుంటే వసుంధరకు జాలేసింది. జడ ముందుకి వేసుకుని చేమంతి పూరేకులు ఒక్కొక్కటే ఊడదీస్తూ పెళ్ళికొడుకు నరసింహాన్ని గురించి ఆలోచిస్తోంది.

తలవంచుకుని కొంగు వేలికిచుట్టుకుంటున్న తనను ఆనాడు ఎంత నిర్మలంగా ప్రేమతో, ఆసక్తితో చూశాడు, ఆ చూపులో ఎంత స్వాతంత్ర్యము ఎంత, ఠీవి కనబడ్డాయి? పెళ్ళి జరుగుతుంటే మధ్యలో ఎవరయినా పీటలమీదనుంచి లేచి రమ్మంటే లేచివెళ్ళే పెళ్ళికొడుకేనా? అయితే ఇటువంటి వ్యక్తితో తన భావిజీవితం ఎట్లా గడుస్తుంది ?

రాణి గబగబా పరుగెత్తుకుంటూ వచ్చింది, "అక్కయ్యా నిన్ను అమ్మ పిలుస్తోంది."

"అమ్మా నాన్నా ఎక్కడికో వెళ్ళారు. అప్పుడే వచ్చారా?

"అప్పుడే వచ్చేశారు."

"నే నెందుకే ఇప్పుడు లోపలికి? అందరూ ఏంచేస్తున్నారు?"

"ఇంకా ఎవరూ కాఫీ తాగలేదు. టిఫిన్ తీసుకోలేదు."

"నే నిప్పుడు ఇక్కడినుంచిలేస్తే బాగుండదు. అందరూ ఇటే చూస్తు న్నారు. కొంచెంసేపయిన తరువాత వస్తాను. నీవు వెళ్ళు"

పిల్లను ఒళ్ళో కూర్చోబెట్టుకుని తీరిగ్గా కబుర్లు చెబుతున్న హరిశంకరం ఒకకంట పరిస్థితులను గమనిస్తూనే ఉన్నాడు. పందిట్లోనుంచి ఒక్కొక్కరే లేచి పోతున్నారు. హరిశంకరం పందిరంతా కలయజూస్తూ వసుంధర ముఖం చూశాడు. పాలిపోయిన ముఖంతో పెళ్ళికొడుకు వచ్చేదారి వంక చూస్తోంది.

హరిశంకరం ఒక్క ఉదుటునలేచి సరాసరి విడిదిలోకి వెళ్ళాడు. పెళ్ళి వారు తాగిపడేసిన కాఫీ గ్లాసులు నేలమీద దొర్లుతున్నాయి. ఉప్మా తిని పడేసిన ఆకుముక్కలు ఒకమూల కుప్పగాపడి ఉన్నాయి. ఆడవాళ్ళంతా ఒకమూలకు చేరారు. మధ్యలో వియ్యపురాలు రాజేశ్వరమ్మ కూర్చుంది. కనుబొమలు ముడుచు కుంటూ మగవాళ్ళంతా వాకిట వరండాలోకి చేరుకుని అగ్గిపుల్లలు గీశారు.

"అయితే ఏం జరుగుతుందంటారు ఇంతకీ?"

"ఏం జరుగుతుందా? ఆ ముసలాయన అల్లుడికి నాసిరకం బట్టలు తక్కువ రకం గడియారం గట్టిగా పట్టుకుంటే సొట్టలుపడే ఆ పళ్ళెం చెంబు యిచ్చినందుకు

పెగ్గుపడి ఓ వెయ్యిరూపాయలు అదనంగా యివ్వవలసిందే" చేతిలోనుంచి సిగరెట్టు ముక్క విసిరి పారేశాడు వియ్యపురాలి తమ్ముడు.

పిల్కులాల్చి సవరించుకుంటూ వచ్చాడు హరిశంకరం. "ఏమిటోయ్ నరసింహం? ఏమిటీ ఆలస్యం? కాఫీ టిఫిన్ అయిందా?" బుజమ్మీద చెయ్యివేసి తన వైపుకు తిప్పుకున్నాడు.

"నాదేముంది? నేను రెడీ" అన్నాడు తల వంచుకుని.

హరిశంకరం బయట వరండాలోపలహాలు దాటుకుని పెరటివైపు వరండాలో చూశాడు. రాజేశ్వరమ్మ స్తంభానికి ఆనుకుని నూర్జహాన్‌లా ఆలోచిస్తూ గంభీరముద్రలో ఉన్నది. అందరూ ఆమె చుట్టూచేరి కబుర్లలోపడ్డారు. పెళ్లిలో ఆడపెళ్ళివారు మగపెళ్ళివారిని ఎలా టోపీలో వేసుకుందీ వర్ణించి చెబుతున్నది విశాలాక్షమ్మ పండిన కేశరాసిని ఒక చేత్తో తడుముకుంటూ.

"మగ పెళ్ళివారిని మరీ అంత తక్కువగా అంచనావేస్తే ఎట్లా? వీళ్ళేనా అంత తెలివి తక్కువవాళ్లు?" ఆమెకు ఎదురుగా కూర్చున్న ఆవిడ ఆశ్చర్యాన్ని ప్రకటిస్తోంది.

హరిశంకరం వచ్చి వరండా చివరగా ఉన్న మెట్లు దగ్గర నిలబడ్డాడు.

"హరిశంకరం" కనుబొమలు పైకెత్తి నోరు తెరిచింది రాజేశ్వరమ్మ. ఆశ్చర్యం, సంతోషం ముఖమంతా ఆవరించుకున్నాయి.

"ఏ ఊళ్ళో ఉంటున్నావు?" అన్నది లేవబోతూ. కొంచెం ఇతనికి కాఫీ ఫలహారం తెచ్చి పెట్టండర్రా" అంటూ అక్కడ వున్న వాళ్ళకు పురమాయించింది.

"ఇప్పుడేం వద్దండి. అక్కడే ఉంటారని సరాసరి పెళ్ళివారింటికే వెళ్లాను. నాకిప్పుడు మా స్వగ్రామం దగ్గరికి ట్రాన్స్ఫరు అయింది. మీరు పంపిన ఆహ్వానము తిరిగి తిరిగి నాకు నిన్ననే చేరింది." నిలబడే మాట్లాడుతున్నాడు కండువా సరిచేసుకుంటూ.

ఒక్కొక్కళ్ళే అక్కడ కూర్చున్నవాళ్ళంతా లేచి పక్కకు తప్పుకున్నారు. అంతలో కాఫీ గ్లాసు వచ్చింది. "కాఫీ అయినా తీసుకోవోయ్" రాజేశ్వరమ్మ బలవంతం చేసింది.

హరిశంకరం స్తంభానికి ఆనుకుని కూర్చుంటూ గ్లాసు చేతిలోకి తీసుకున్నాడు.

"మీ ఆవిడా పిల్లలు క్షేమంగా ఉన్నారా!"

హరిశంకరానికి ఆమె అడిగిన ప్రశ్నలో తన భార్యకు ఆమె పోయించిన పురుడు జ్ఞాపకము వచ్చినది.

"అంతా బాగున్నారు అబ్బాయి రాజేశ్వరరావుకు మూడో ఏడు వచ్చింది."

అదేమిటా పేరు! రాజేశ్వరమ్మ ఆ మాట నోటితో అడగలేదుగాని అడుగుతున్నట్లే ఉంది ఆ ముఖం. ఆశ్చర్యం ఆనందం దోబూచులాడుతూ ముఖం మీద మెరిశాయి.

"నడకా ఆదీ...." వాక్యం పూర్తి చేయలేకపోయింది.

"నడకేమిటి మాటలేమిటి దంచిపారేస్తున్నాడు. వాడి తెలివితేటలు, ఆ చురుకుదనం అబ్బబ్బ చెప్పలేను. వాడు వేసే ప్రశ్నలకు ఇంట్లో అందరం చిత్తై పోతున్నాం. అది పేరు మహిమ అంటుంది మా ఆవిడ." కాఫీగ్లాసు కిందపెట్టాడు.

"ఆఁహాఁ" అన్నది. తనపేరు పెట్టినందుకు లోలోపల సంతోషపడుతూ.

హరిశంకరం భార్య శకుంతల రాజేశ్వరమ్మ యింటికి పేరంటానికి వెళ్ళింది. వాళ్ళమ్మాయి పుట్టిన రోజుకు ఊళ్ళోఉన్న ఆడవాళ్ళంతా పేరంటానికి వచ్చారు. శకుంతల అందరికీ పసుపు కుంకుమ యిచ్చింది. గంధం పూసి తాంబూలాలు పంచింది. ఇంకా అందరూ వెళ్ళకముందే నడుమునొప్పి అంటూ వంటింట్లోకి వెళ్ళి కూర్చుంది. ముత్తయిదువులతో కబుర్లుచెప్పి వాళ్ళను పాగనంపి రాజేశ్వరమ్మ శకుంతలకోసం ఇల్లంతా వెతికి వంటింట్లోకివచ్చి చూసింది. శకుంతల బాధతో మెలికలు తిరుగుతోంది. ఎనిమిది గంటల రాత్రి సన్నగా వాన కురుస్తోంది. రాజేశ్వరమ్మ బంట్రోతును పంపి కారు డ్రైవరును పిలిపించింది. శకుంతలచేత వేడి పాలు ఒక కప్పు తాగించి హాస్పిటల్‌కు తీసుకు వెళ్ళింది.

దారిలో అడిగింది రాజేశ్వరమ్మ, "ఇటువంటి మనిషిని ఒంటరిగా వదిలి పెట్టి ఎలా వెళ్ళాడమ్మా మీ ఆయన?"

నడుంమీద చెయ్యివేసి రాసుకుంటూ బాధతో ముఖం చిట్లించుకుని "మొన్ననే తొమ్మిదవనెల వచ్చిందండీ ఇంకా టైముందికదా అనుకున్నారు. వచ్చేటప్పుడు మా అమ్మను తీసుకు వస్తారు.'' వినీ వినబడకుండా అన్నది.

హాస్పిటల్లో డాక్టరులేదు. సినిమాకు వెళ్ళింది. నర్సు డాక్టరుకు కబురు చేసింది. ఆ కాంపౌండులోనే ఉన్న మగడాక్టరు కలెక్టరుగారి కారు చూడగానే పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వచ్చాడు, రాజేశ్వరమ్మ ఆయనతో మాట్లాడుతూ ఉండగా నర్సువచ్చి చెప్పింది మగపిల్లవాడు పుట్టాడని.

రాజేశ్వరమ్మ వెళ్ళి శకుంతలను పలకరించి కావలసిన వస్తువులు పంపుతా నని యింటికి వెళ్ళింది. ఎడపిల్ల లిద్దరిని ఇంట్లో అట్టిపెట్టుకుంది హరిశంకరం ఊరినుంచి వస్తూనే ఆమె దగ్గరికి పరుగెత్తుకుంటూ వెళ్ళాడు.

"సమయానికి మీరు ఆదుకోకపోతే శకుంతల ఏమయిపోయేది!'' ఆ మాట పదిసార్లు అన్నాడు హరిశంకరం.

"నేను ఉండగానే అంతమాట! అయినా నేను మాత్రం ఎక్కువ ఏం చేశానని!'' అన్నదే కాని తాను చేసినదంతా హరిశంకరం మరో మారు చెబితే వినాలని ఉన్నట్టుగా అతడికి కనబడ్డది ఆమె ముఖంలో.

"అందరికీ మనసు స్వచ్ఛంగా మీ మనసులాంటిది ఉంటుందా! అందరికీ దయా దాక్షిణ్యాలు మీలా ఉంటాయా!'' అన్నాడు. మీరెంత అందంగా ఉంటారో మీ మనసు అంత అందమయిందని చెప్పాలని హృదయం తొందరపెట్టింది. మాట నాలుక చివరదాకా వచ్చింది. కాని పైకి అనటానికి సాహసం చాలలేదు.

"పేరుకు తగిన మనసు ఇచ్చాడు దేవుడు" అన్నాడు.

రాజేశ్వరమ్మకు హరిశంకరాన్ని చూడగానే ఉత్సాహము పదింతలయింది. ఈ మాటతో పైకి ఎక్కడికో ఎగిరిపోతున్నట్టనిపించింది.

శకుంతలను హాస్పిటల్‌నుంచి తమ కారులోనే ఇంటికి పంపించింది. దగ్గరవుండి నీళ్లుపోయించింది. ఇరవై ఒకటోనాడు జరగవలసిన తతంగమంతా తన చేతిమీదుగా జరిపించింది.

అప్పటికి పదిరోజులకిందట చైల్డు వెల్‌ఫేర్ సెంటర్‌లో రాజేశ్వరమ్మే తన హోదానంతా ఉపయోగిస్తూ పెట్టిన చివాట్లు హరిశంకరానికి జ్ఞాపకం వచ్చాయి. అప్పటికి ఊరుకొని ఆ మరునాడు అక్కడ జరిగిన బహుమాన ప్రదానంలో తీసిన ఫోటోలు ఆమె చేతికిచ్చాడు. తిప్పి తిప్పి చూసుకుంది అరగంటసేపు. మబ్బులు కమ్ముకున్న ఆకాశంలో మెరుపులా మెరుస్తోంది రాజేశ్వరమ్మ. ఆమె కట్టుకున్న జరీపూల నల్లపట్టుచీరె, తలలో పెట్టుకున్న మల్లెదండలు, చిరునవ్వు చిందిస్తూన్న ఆ ముఖం అద్భుతంగా ఉంది ఫోటోలో.

ఎంత అందంగా ఉన్నా అందరి ఫొటోలు ఇంత బాగారావు అందామను కున్నాడు. కాని "మీరు ఫొటో తీసుకుంటే చాలాబాగా వస్తుంది." అన్నాడు పైకి.

రాజేశ్వరమ్మ ముఖంలో సంతృప్తితోపాటు కించిత్ గర్వంకూడా తొంగి చూసింది. ముఖం పొంగినట్లయింది. అమ్మయ్య-నిన్నటి ఆమెకోపమంతా పోయిం దన్నమాట.

హరిశంకరం చూశాడు. విడిదిలో ఇంకా ఎక్కడి వాళ్ళక్కడే కూర్చుని ఆవలిస్తున్నారు.

హరిశంకరం కండువా సవరించుకుంటూ రాజేశ్వరరావు పుట్టినప్పటి సంగ తులన్నీ మళ్ళీ ఏకరువు పెట్టాడు. "మీ మాట రోజుకు ఒక్కసారయినా జ్ఞాపకం చేసుకుంటాము. అన్నట్టు మరిచిపోయానండి చెప్పటం. ఆ ఊరునుంచి బదలీ అయి నప్పుడు తీసిన ఫొటో పెద్దదిచేయించి మా గదిలో పెట్టుకున్నాము. మా శకుంతల ఏం చేస్తుందంటే పొద్దున్నే లేచి తాజా మల్లెపూలతో కట్టిన మాలతో ఆ ఫొటోను అలంకరిస్తుంది" అన్నాడు జేబులోంచి రుమాలుతీసి తుడుచుకుంటూ.

"ఆ ఊళ్ళో పనిచేసినట్టు మరెక్కడా పని చెయ్యలేకపోయాము- నేనయినా ఆయనయినా. ఎక్కడా మనుష్యులకు సంస్కారం లేదు" అంది.

"అదేమిటి అలా అంటున్నారు? మరీ బొత్తిగా అనాగరికంగా ఉన్నాయా ఊళ్లు?"

"మరీ అంత అధ్వాన్నంగా లేవు. ఆ మాటకొస్తే మనమున్న ఊరికంటె బస్తీలే అనుకో. అయితే అక్కడ ఒకరి సంగతి ఒకరికి అక్కర్లేదు. పెద్దా చిన్నా భేదం అంటూ లేదు" అంటూ మూతి విరిచింది.

"ఆ ఊళ్ళో మాత్రం మీ తరువాత వచ్చిన కలెక్టరుగారి భార్య ఊరి సంగతి పట్టించుకున్నదా! ఊళ్లో ఏముంది మనిషిలో ఉంది. కాని, మీ మాదిరిగా మనిషి మనిషినీ పలకరించి యోగక్షేమా లడిగేవారు ఎవరు? ఆ ఊరి వైభవమంతా మీతోనేపోయింది. చెప్పటం మరిచిపోయాను. మీరు ప్రారంభించిన పాఠశాలకు కోదండరామయ్యగారు పెద్ద బిల్డింగు కట్టించారు. ఆపాఠశాలకు మీ పేరే పెట్టారు.",

రాజేశ్వరమ్మ హృదయం ఉప్పొంగింది. కళ్లు పెద్దవి చేసుకుంటూ "ఆ పాఠశాలా?" అన్నది.

పెళ్ళివారింటినుంచి ఇద్దరు మగవాళ్లు వచ్చి గడపలో నిలబడ్డారు. హరి శంకరం ద్వారంవైపు చూడటంతో రాజేశ్వరమ్మ కూడా అటు చూసింది.

ఏమిటిసంగతి అన్నట్టు చూశాడు హరిశంకరం వాళ్ళవైపు.

"అందరూ ఎదురుచూస్తున్నారు. ఇప్పటికే చాలా ఆలస్యమయిపోయింది."

రాజేశ్వరమ్మ ధ్యానంతా ఆ పాఠశాలమీద ఉన్నది. హరిశంకరం అది కని పెట్టి వాళ్ళవంకచూస్తూ తన సంభాషణ సాగించాడు.

"ఆ స్కూలు భవనంలో ఒకపెద్ద ఎసెంబ్లీహాలు కట్టారు. ఆ హాలులో మీ ఫొటో లైఫ్ సైజుది పెట్టారు. దానికి జరీ జల్తారుహారం వేశారు. అంతే పెద్దహాలుకు ఆ ఫొటో పెట్టడంతో ఎంతో అందం వచ్చింది."

హరిశంకరం మళ్ళీ చూశాడు వాళ్ళవైపు.

"ఎందుకువచ్చారు? ఏం పని? ఎవరయినా కావాలా?" అడిగాడు తమ సంభాషణకు అంతరాయం వచ్చిందన్నట్టుగా ముఖంపెట్టి.

"పెళ్ళికొడుకుకోసం అంతా ఎదురుచూస్తున్నారు. ఇప్పటికే చాలా ఆలస్య మయిపోయింది"

"పెళ్ళికొడుకా? అదేమిటి పెళ్ళిపందిట్లోలేడూ!" ఆమె వంక చూశాడు హరిశంకరం

"ఎక్కడున్నాడో చూసి తీసుకువెళ్ళండి" అన్నది అంతకుపూర్వం జరిగిన దంతా విస్మరించి.

"అదేమిటి మీరు రారూ ? అంతా యిక్కడే ఉన్నారు."

"మేమేదో మాట్లాడుతున్నాంగా. అందర్నీ తీసుకువెళ్ళండి" తరువాత సంగతి చెప్పు అన్నట్టుగా రాజేశ్వరమ్మ హరిశంకరంవైపు చూసింది.

అందరూ వెళ్ళగా చూసి హరిశంకరం మళ్ళీ మొదలుపెట్టాడు.

"మీరంత పెద్ద ఫొటో ఎప్పుడు తీసుకున్నారసలు ?"

"పెద్దఫొటో కావాలంటూ ఆ పాఠశాల సెక్రటరీ దగ్గరనుండి ఉత్తరం వచ్చింది. పోనీ తీసుకుని పంపుదామా అంటే మా వారు వద్దని మా గదిలో పెట్టి వున్న ఫొటో పంపారు. నేను వద్దంటూనే ఉన్నా సుమా. ఆదన్నమాట ఆ హాలులో తగిలించింది."

"చాలా హుందాగా వుందిలెండి. ఆ హాలులో అక్కడ అప్పుడే ఆడపిల్లల సంఖ్య ఐదువందలు దాటింది. పల్లెటూళ్ళనుంచి కూడా వస్తున్నారు.

ఆ పిల్లలంతా ఆ హాలులో సమావేశమయి ప్రతిరోజూ ప్రార్థన చేస్తారు. ఏ మీటింగయినా ఆ హాలులోనే అవుతుంది; అక్కడున్న పిల్లలకేకాదు. అధికారులకూ, వచ్చీపోయే నాయకులకూ మీపేరు, మీఫొటో బాగా పరిచయమయిపోయింది."

హరిశంకరానికి ఆయన అత్తగారన్నమాట చట్టున స్ఫురించింది రాజేశ్వరమ్మగారి అందాన్ని ఆమె తెలివిని సంఘసేవనూ వితరణను ఎత్తి మాట్లాడాలి ఆమెతో" అతడి కళ్ళల్లో ఒక వెలుగు వెలిగింది.

రాజేశ్వరమ్మ నవ్వుముఖంతో ఆతడు చెప్పే కబుర్లు ఆసక్తితో వింటోంది. యాభయ్యో పడిలో ఉన్న రాజేశ్వరమ్మ పొడుగు-పొడుక్కి తగ్గ లావు మనిషి హుందాగా ఉంటుంది, అన్నిటికంటె ఆకర్షణీయంగా ఉంటుంది కను ముక్కు తీరు. ఆమె దేహచ్ఛాయ పసుపుకలిపిన తెలుపు. పదిమందిలో ఉన్నా పట్టివ్వగల సౌందర్య మామెది.

"ఆ; యింకా ఏమిటి హరిశంకరం, కబుర్లు; చాలా రోజులయింది మనం కలుసుకుని." ఇంకా చెప్పు అన్నట్టున్నాయి. ఆమె కళ్ళు, నోరు-ముఖం.

''ఒకరోజు ఆ పాఠశాలకు స్వామిజీ వచ్చాడు. అంటే చిన్మయానంద మఠంనుంచి. ఆయన ఉపన్యాసం యిస్తున్నంతసేపూ ఆ ఫొటో వంక చూడటం మొదలుపెట్టాడు. చివరికి వెళ్ళేటప్పుడు అడిగాడు ''ఏ సంస్థానం రాణి ఈమె'' అని అక్కడ ఉన్న సెక్రటరీ చెప్పాడు. ''ఇటువంటి సౌందర్యం చాలా అపు రూపం. రూపానికి తగిన దొడ్డగుణం ఇంకా అపురూపం'' అన్నాడు.

పైకి కనబడకుండా నవ్వును అదిమిపెట్టింది రాజేశ్వరమ్మ. ఆ ప్రశంసకు ఎంత విలువ ఉన్నదో హరిశంకరం బాగా కనిపెట్టి చూస్తున్నాడు

''మీరు హాస్పిటల్లో కుటుంబనియంత్రణ శాఖను ప్రారంభించారట కదూ?'' అన్నాడు పెరటివైపు చూస్తూ.

''ట- ఏమిటి-మీరులేరూ?''

''నన్ను అప్పుడు ఆరునెలలు ట్రైనింగుకు పంపారు.''

''ఆ హాఁ అప్పుడేనా మీరు వెళ్ళింది?''

''అప్పుడేగా మీరు మా శకుంతలను వెంబడి పెట్టుకుని వెళ్ళి పెంటర్లన్నీ చూపింది?''

''అవునవును. ఇంకా మీకు అవన్నీ జ్ఞాపకం ఉన్నాయా?''

''అయ్యో ఎంతమాటన్నారు? మాకే కాదు - ఆ జిల్లా వాళ్ళంతా మిమ్మల్ని పొద్దునలేచి తలుచుకుంటారు. చేయెత్తి మొక్కుతారు.''

రాజేశ్వరమ్మకు ముడుచుకు పోయిన నరాలన్నింటిలో రక్తము స్వేచ్ఛగా ప్రవహించినట్లయింది. దేహము బరువుతీసినట్లుగా తేలిగ్గా, ఉత్సాహంగా ఉంది. చాలా రోజులకు హరిశంకరం కినబడ్డాడు. ఆ కబుర్లతో ఈ మధ్యలో ఎదురయిన చికాకులన్నీ పటాపంచలైన ట్లనిపిస్తోంది. ఆమెకు. ఆమె మనసు ఎంతో చురుగ్గా 'పోటెత్తిన సముద్రం'లా ఉంది.

పెళ్ళివారింటినుంచి మళ్ళీ ఎవరో వచ్చారు. ఆమె కెదురుగా వచ్చి నిలబ డ్డారు జంకుతూ.

"ఏమిటీ మళ్ళీ వచ్చారేం"

"భోజనాలకు రమ్మంటున్నారు, ఇప్పటికే ఆలస్యమయింది."

"ఈ ఎండలో అక్కడికి రాలేను. మా హరిశంకరం కూడా యిక్కడే ఉంటాడు. రాత్రి నిద్ర లేనట్టుంది. ఎండతో అంతదూరం రాలేడు. మా యిద్దరికీ భోజనం ఇక్కడికే పంపించమని చెప్పండి హరిశంకరం వైపు తిరిగింది. రాజేశ్వరమ్మ, ఆమెకు అతడంటే పుత్రవాత్సల్యము. ఆ ఊళ్ళో ఉన్నప్పుడు కూడా రోజుకొకసారయినా అతడు వచ్చి ఏవో కబుర్లుచెప్పి ఒక అరగంట కూర్చుని పోవాల్సిందే. అతడు రాకపోతే ఆమె మనిషిని పంపేది.

ఇద్దరూ ఎప్పటెప్పటివో కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేశారు. పెళ్ళి హడావిడి అయిపోయి పెళ్ళివారు వెళ్ళే అంతవరకూ హరిశంకరం విడిదిలోనే ఉన్నాడు.

పెళ్ళికూతురు వసుంధర హరిశంకరం అన్నయ్యకు కోటి నమస్కారాలు చేసింది మనసులో.

('ఆంధ్రజ్యోతి' సచిత్ర వారపత్రిక)



# అంతర్గతం

సాయంత్రము ఆరుగంటలవేళ విశ్వనాథం పార్కులో పచ్చగడ్డిమీద కాసేపు ఒరుగుదామని వెళ్ళాడు. గుంపులు గుంపులుగా అక్కడా అక్కడా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్న జనము ఒక్కొక్కరే లేచి వెళ్ళుతున్నారు. జొన్న పేలాల పొట్లాలు అమ్మే ముసలితాత గంప దులుపుకొని వెళ్ళిపోయాడు. అప్పటికే శరత్‌రాత్రి చిరుచలితోపాటు శరచ్చంద్రికలను కూడా విరజిమ్మటము మొదలుపెట్టింది. విశ్వనాథం ముడుచుకుపోయిన దేహానికి ఉత్తరీయము కప్పి ఆనుకుని కూర్చుందామని గంటస్తంభము దగ్గరికి చేరుకున్నాడు. ఆ స్తంభానికి చుట్టూ, కూర్చోవటానికి వీలుగా రెండడుగులు వెడల్పువ అరుగుకట్టారు. చేత్తో తుడిచి, విశ్వనాథం దానిమీద కూర్చోబోయాడు. గాజుముక్కలు గల్లుమంటూ కిందపడ్డాయి. వెన్నెల కాంతుల్లో మిలమిల మెరిసిపోతున్న ఆ గాజుముక్కల నన్నిటినీ కనబడినంతవరకూ ఏరాడు. ఆ పచ్చరంగు గాజుముక్కలను అరచేతిలో పోసుకునివచ్చి అరుగుమీద కూర్చున్నాడు. వాటిని చూస్తున్నకొద్దీ అతడి ఆలోచనలు ధూమపానం చేసి వదలిన పొగమాదిరిగా రింగురింగులుగా తిరిగిపోతున్నాయి. ఇవి ఏ జవరాలి గుండ్రటి చేతులకు బిగువుగా తొడిగిన మెరుపుగాజులో! అయితే- ఈ గాజులన్నీ ఒక్కసారి ఇక్కడ పగిలి ముక్కలుముక్కలు అయి ఉంటాయా? సుమంగళి చేతి గాజులంటే మాంగల్యముతో సమానము కదా. పొరబాటున ఏదో తగిలి పగిలా యనుకోవటానికి ఇక్కడేం తగిలి ఉంటుంది?

అతడు ఆ గాజు ముక్కలను చేతిలో పోసుకొని పచ్చగడ్డిమీద ఒరిగి పడుకున్నాడు. పుచ్చపువ్వులా వెన్నెల విరియ కాస్తున్నది. ఈ చుట్టు ప్రక్కల భవనాలమీద చంద్రకాంతి పడి వాటికి తెల్లదనాన్ని తెచ్చిపెట్టింది. చెట్ల ఆకులమీద వెండి కరగించి పోసి నట్టుంది. ఆ చల్లదనములో అతడు కళ్ళు మూసుకుని ఆ గాజు ముక్కలను గురించే ఆలోచిస్తున్నాడు. ఈ పచ్చగాజులు ఏ వధువయినా తొడిగించుకున్న పెళ్ళి పచ్చలేమో! శివ శివా! ఏ నవవధువుకూ ఇంత అమంగ

శము జరగకూడదు. అయినా కొత్త పెళ్ళికూతురు పెళ్ళిపచ్చలు తొడిగించుకుని ఈ గంట స్తంభము దగ్గరికి వస్తుందా ? ఒకవేళ వచ్చినా ఇంత ప్రమాదానికి లోన వుతుందా ? వద్దు వద్దు. పగవాడికి కూడా ఈ అనుభవము వద్దు.

అతడు చివాలున లేచాడు. పచ్చగడ్డిమీద పచారు చేయటము మొదలు పెట్టాడు. మధ్యాహ్నము పదకొండు గంటలకు హోటల్లో భోజనం చేశాడు. కడుపులో ఆకలి చురచురమంటున్నది. నాలుగు గంటలవేళ రెస్టారెంటుమీదుగా వచ్చాడు. లోపలికి వెళ్ళాలని అందరినీ దాటుకుంటూ కుర్చీమీద కూర్చుని కాఫీతో మసాలదోసె తెమ్మన్నాడు. జేబులో చెయ్యిపెట్టి చూసుకున్నాడు. చేతికి డబ్బులు తగల్లేదు. అప్పటికప్పుడు ముఖం దించుకుపోయింది. సర్వరు కాఫీ దోసె తెచ్చేలోపల గబగబా బయటికి నడిచాడు.

తన జేబులో డబ్బు ఆనాటితో ఆఖరు. తను అక్కడికి చేరుకునేటప్పుడు జేబులో ఉన్న అయిదు వందలూ ఆనాటితో చెల్లు. అవి ఎందుకు జేబులో పెట్టు కున్నాడో, ఎప్పుడు పెట్టుకున్నాడో తనిప్పుడు చెప్పలేడు. కిందపడి ఉన్న కోటు భుజంమీద వేసుకున్నాడు. జుట్టు చేతులతో పీక్కుంటూ కాళ్ళకు బూట్లు వేసుకో కుండా వాటిని చేతపట్టుకుని-తలుపులు ఓరగావేసి బయటికి నడిచాడు.

ఎక్కడికి ? ఎవరో గదమాయించినట్లయింది. బయలుదేరేటప్పుడు అతడికి గమ్యస్థానమంటూ ఏదీలేదు. రాత్రి ఒంటిగంటవేళ, మదించిన ఏనుగులు పరుగెత్తి నట్టుగా కారుమేఘాలు పరుగెత్తుతున్నాయి. బ్రహ్మాండం బ్రద్దలయినంత చప్పుడు చేస్తూ ఆకాశము ఉరుముతున్నది. కన్ను పొడుచుకున్నా కనబడని కాళరాత్రి. మధ్య మధ్య మెరుపులు తళుక్కుమంటున్నాయి. బరువుగా అడుగులు వేస్తూ విశ్వనాథం నడుస్తున్నాడు.

అతడు ఊరిబయటికి రాకముందే జోరున వర్షము ప్రారంభమయింది. ఓవరుకోటు తలమీదికి లాక్కుని చంకలో ఉన్న బూట్లను కాళ్ళకు తగిలించుకుని పరుగెత్తినట్లుగా నడుస్తున్నాడు. మనసంతా చిందరవందరగా ఉన్నది. గాలివానకు నేలకూలిన ఇల్లులా భయంకరంగా ఉన్నది. విమానం మోతకు అదురుతున్న గుండెలా అతడిగుండె అదిరిపోతున్నది. బురదనేలలో బూట్లు కూరుకుపోతు న్నాయి. వాటిలో భద్రంగా ఉన్న అతడి పాదాలు కణకణలాడే నిప్పుమీద ఉన్న ట్టు గా మండిపోతున్నాయి. అతడి కళ్ళు చీలికలుగా చేసుకొని దారి వెతుక్కుంటూ

పోతున్నాడు పైనుంచి వానపడి చల్లవరుస్తున్నా మాడు చీల్చుకొని మంటలు పైకి వస్తున్నట్టుగా తలలో బాధ. దాని కాగలేక తలంతా చేత్తో తడిమి చూసుకుంటున్నాడు.

పెళ పెళా ఉరిమింది. తళుక్కున మెరుపు మెరిసింది చౌరస్తామీద, ఊళ్ళ పేర్లూ, మైళ్ళసంఖ్యా కనబడ్డది. అక్కడికి మైలవరం రెండుమైళ్లు, ఆ దిక్కుగా అతడి కాళ్ళు గబగబా నడిచాయి. ఎంతసేపు నడిచాడో-ఎంత వేగంతో నడిచాడో అతడిప్పుడు అంచనా వెయ్యలేడు.

ఊరిబయట పోలేరమ్మ గుడి ఉండాలి. కాని అతడికి అది కనబడలేదు అప్పుడప్పుడు మెరుస్తున్న మెరుపులో మర్రిచెట్టు మాత్రము కనబడ్డది. అక్కడికి సరిగా పదిగజాల దూరములో పీసపాటివారి ఇల్లు, వాకిటి పంచలో నులకమంచము మీద ఎవరో ముసుగు పెట్టుకుని గురకపెట్టి నిద్రపోతున్నారు. విశ్వనాథం గడపలో నిలబడి తలుపుకొట్టాడు. సత్యవతమ్మ లేచి దీపం పెద్దదిచేసి అతడి బూట్ల వంకా, కోటువంకా చూసింది. దీపం పైకెత్తి అతడి ముఖంలోకి చూసింది.

''నేనే విశ్వనాథాన్ని'' ముఖంమీది వానచినుకులు చేతి గుడ్డతో తుడుచుకున్నాడు.

“ఇంత వర్షంలో కాలినడకన బయలుదేరారేం? పిల్లలు కులాసాయేనా!” లోపలినుంచి స్టూలు తెచ్చివేస్తూ అడిగింది.

“పిల్లవాడు బాగానే ఉన్నాడు. పిల్లకు జ్వరం ఒళ్ళు పేలిపోతున్నది. దానికి జావ కాచి పోసే దిక్కులేదు. మీరు బయలుదేరండి, నేను మందుకోసం వెళ్లుతున్నా.” ఈ మాటలు మాట్లాడేటప్పుడు అతడిలో ఆదుర్దాలేనట్లు కంఠధ్వని గంభీరంగా ఉన్నది. నిర్లిప్తత మాత్రమే తొంగిచూసినట్టు కనబడుతున్నది. కాని నిజానికి అతడి కాళ్లు గజగజ వణికిపోతున్నాయి. మోకాళ్ళు కొట్టుకుంటున్నాయి,

''నేను వచ్చి నాలుగురోజులు కాలేదు. ఇంతలోనే అంతజ్వరమా?'' సత్యవతమ్మ అప్పుడే ఏడుపుముఖం పడ్డది. పైటకొంగు తిప్పి దోపుకుంటూ ''ఏం చేద్దాము నాయనా!'' అంటూ రెండు చేతులూ గుండెకు చేర్చుకున్నది.

అప్పటివరకూ సన్నగా చేసుకుని చూస్తున్న కళ్ళను పెద్దవిచేస్తూ “తెల్లవారగానే బండిమీద బయలుదేరండి. వాళ్ళిద్దరూ మీ చేతిమీదుగా పెరగాలి. నాచేత

కాదు, నేను పెంచలేను” విశ్వనాథం వెనక్కు తిరిగాడు. సత్యవతమ్మ ఏదో అనబోయింది. అతడు ముందుకు నడవటంతో ఆమె నోరు తెరచుకుని అలా మండిగం పట్టుకుని నిలబడిపోయింది.

“నా తల్లి వెళ్ళిపోయిన తరువాత నిజంగా ఇతడు పిచ్చివాడయినాడు. అది లేని యిల్లు అతడికి శూన్యము. మళ్ళీ ఎప్పటికి మనిషవుతాడో!” గొణుక్కుంటూ ఆమె దీపం తీసుకుని లోపలికి వెళ్ళింది. దండెంమీద చీరెలుతీసి మడతచేసింది. గూట్లో రూపాయలు తీసి చీరెకొంగుకు ముడి వేసింది. జంపఖానాలో దిండువేసి చుట్టచుట్టింది. తల గోడకానించి మోకాళ్ళు ముడుచుకొని కూర్చుంది.

విశ్వనాథం పరుగెత్తలేదు. ఆ వర్షములో పెద్దపెద్ద అంగలుమాత్రం వేస్తు న్నాడు. ఓవరుకోటు తలమీదనుంచి తీసివేశాడు. తలమీద ధారాపాతంగా పడు తున్న నీరు తలవెంట్రుకలగుండా కారిపోతున్నది.

రెండుమైళ్ళకో ఊరు—మూడుమైళ్ళకో ఊరు—వెనకబడిపోతున్నాయి. అతడు దారి తప్పటంలేదు. దారికొరకు ఎవరినీ అడగటములేదు. అవన్నీ అతడికి తెలిసి నట్లే నడిచిపోతున్నాడు. ఒక ఊరు దాటుతూ ఉండగా సూర్యోదయమైంది. అత డెక్కడా ఆగదలచుకోలేదు. దాహము పుచ్చుకోదలచుకోలేదు. కాలకృత్యాలు మాత్రము తీర్చుకుంటున్నాడు. చేతి గుడ్డతో ముఖము తుడుచుకుంటున్నాడు, తిరిగి బయలుదేరుతున్నాడు. మరునాడు గ్రామం దాటకముందే సూర్యాస్తమయ మయింది. ఆరాత్రి గాఢాంధకారము-మిణుకుమిణుకుమంటూ అక్కడా అక్కడా చుక్కలు మెరుస్తున్నాయి ఇతడు తలపైకెత్తి చూడకుండా పయనిస్తున్నాడు.

చౌరాస్తామీద చెక్కను అతడు తల ఎత్తి చూశాడు. అబ్బా! రెండువందల పదిమైళ్ళ కాలినడక! తల పంకిస్తూ అతడు అడుగులు వేస్తున్నాడు. కృష్ణానది ఎదురయింది. ధన ధన శబ్దముచేస్తూ రైలు బ్రిడ్జిమీదినుంచి పరుగెత్తుతున్నది. వర్షము వెలిసే సూచనలు కనిపిస్తున్నాయి. బెస్తవాళ్లు విసురుతూ లాగుతూ చేప లను బుట్టలకెత్తి మూతలు బిగిస్తున్నారు. ఆకాశములో నీలిరంగు నుండి తెలుపు విడిపోతున్నది. మేఘాలు ముద్దలు ముద్దలుగా ఆకాశపుటంచులకు పరుగెత్తుతు న్నాయి. తూరుపుదిశ అంతా ఎఱ్ఱబారింది. జేవురు రంగుముద్ద నీలికొండల మీది నుంచి కొద్దికొద్దిగా పైకి పొడుచుకుని వస్తున్నది. రేవుల్లో అప్పుడే జనం చేరారు. “పొడుస్తు బాలుడూ పొన్నపూఛాయ” స్త్రీలు ఒకరికొకరు చూపించుకుంటున్నారు.

రేవులో స్నానంచేసే బ్రాహ్మలు "రష్మిమంతం సముద్యంతం దేవాసురసమస్కృతం"పూజయస్వ వివస్వంతం భాస్కరమ్ భువనేశ్వరమ్" గొణుక్కుంటూ సూర్యుడికి అర్ఘ్యం విడుస్తున్నారు.

విశ్వనాథం ఒక్కక్షణం ఆగి చూశాడు. అతడికి కూడా స్నానము చేయాలనిపించింది. తన పాపాలను కడిగివేసుకోవాలనిపించింది. ఓవరుకోటూ, బూట్లూ ఒడ్డున పెట్టాడు. బురద అంటిన పంట్లాము విప్పి పక్కగా పెట్టాడు. షర్టు బనీనూ విడిచాడు. చిన్న లాగుతో నీళ్ళలోపడి ఈదుకుంటూ వెళ్ళిపోయాడు. అందినంతమటుకూ నాలుగుమూలలూ బారలు చాపుతూ చేపలా ఈదుకుంటూ పోయాడు. అలుపు లేకుండా అవతలి ఒడ్డు తాకి వచ్చాడు. ఎంతసేపు నీటిలో వున్నా అతడి మస్తిష్కంలో బయలుదేరిన అగ్నిజ్వాలలు, ఆరికాళ్ళక్రింద ఉన్నటువంటి చంద్రనిప్పులు ఏ మాత్రమూ చల్లారలేదు.

తొమ్మిది గంటలు దాటింది. సూర్యుడు పైకెక్కుతున్నాడు. నాలుగు రోజుల తరువాత కనబడ్డ సూర్యుడు ఎండ చుర్రుమంటున్నా ప్రజలు అమితసంతోషపడుతున్నారు. ఒక్కొక్కరే తడిబట్టలు బుజాన వేసుకుని ఇళ్ళకు వెళ్ళుతున్నారు. విశ్వనాథం మెల్లగా ఒడ్డుకు చేరుకున్నాడు. తన వస్తువులు పెట్టినవి పెట్టినట్లే ఉన్నాయి. ఎవరూ అందుకోలేదు. అతడు తడి లాగు మీదనే పంట్లాము వేసుకున్నాడు. షర్టు ఒంటికి తగిలించుకుని ఓవరుకోటు చేతిమీద వేసుకుని ఇసుకలో కూరుకుపోతున్న కాళ్ళను బలవంతంగా ఈడుస్తూ బూట్లు దులుపుకుంటూ తిరిగి నడక సాగించాడు

విశ్వనాథం మరొకసారి గుప్పిట తెరచి వెన్నెల వెలుగులో ఆ గాజు ముక్కలను అరచేతిలో కదిలిస్తూ వాటివంక చూస్తున్నాడు. అతడి కడుపులో దుఃఖము అలల మాదిరిగా ఉవ్వెత్తున పైకి లేచింది. "రమణీ రమణీ" అంటూ వాటిని గుండె కానించుకున్నాడు.

"రమణీ! నా తల్లీ!" ఏడుపు దిగమ్రింగి గొంతు సరిచేసుకున్నాడు. ఆ చేసుకోవటములో ఊపిరాడని దగ్గు వచ్చింది.

విశ్వనాథము మిలిటరీలో ఉద్యోగము చాలించుకొని తన యింటికి తిరిగి వస్తున్నాడు. ఆరు నెలలయింది ఇంటి కబురు తెలిసి. తను వస్తున్నానని వ్రాసిన ఉత్తరానికి ఇంటి దగ్గర్నుంచి జవాబు రాలేదు. ఎట్లా వస్తుంది? ఆరు నెలల క్రింద

చేగా తన క్యాంపు మారింది. ఈ పాటికి రమణీ, రంగడూ పెద్దవాళ్ళయి ఉండాలి. అతడు ఇంటినుంచి వెళ్ళిన రెండేళ్ళకు ఉత్తర ప్రత్యుత్తరాలు జరగని పరిస్థితులు ఏర్పడ్డాయి. అప్పుడు ఆమె రేడియో సందేశమిచ్చింది. అతడికి ఆ సందేశము ప్రతి అక్షరమూ యిప్పటికీ జ్ఞాపకమున్నది. దానిలో ఆమె "రమణి మీరు వెళ్ళేటప్పుడు ఎట్లా ఉన్నది? అప్పుడు సన్నగా ఉన్న తొమ్మిదేళ్ళ పిల్ల కదూ! ఇప్పుడు చూస్తే గుర్తు పట్టలేరు." ఇప్పుడెన్నేళ్లుంటాయి రమణికి? పదిహేడేళ్ళ పిల్లా తన చిన్న చిలిపిరమణి? ఉంగరాలు చుట్టుకుపోయిన వెంట్రుకలు కుచ్చులు కుచ్చులుగా ముఖముమీద పడుతూఉంటే ఎడమచేత్తో సర్దుకుంటూ పళ్ళన్నీ బయటపెట్టి చిలిపిగా నవ్వే రమణి! ముఖముమీద పడిన వెంట్రుకల సందులలోనుండి తొంగిచూస్తే ఆ చిలిపికళ్ళ రమణి?

గేటుదాటి బయట వరండాలో ఉన్న కుర్చీలో కూర్చుని గంట నొక్కాడు. వెంటనే పన్నెండేళ్ళ పిల్లవాడు లోపలినుంచి వచ్చాడు అతడి ముఖం చూస్తూనే 'అక్కా' అంటూ లోపలికి పరుగెత్తాడు.

అయిదు నిమిషాల తరువాత జాబిల్లిలాంటి ముఖము కలువరేకుల్లాంటి కళ్లు బంగారు కడ్డీలాంటి దేహము ఒక్క పరుగున వరండాలోకి వచ్చి "నాన్నా. నాన్నా" అంటూ అతడిని చుట్టివేసింది.

"శకుంతలా, శకుంతలా" అన్నాడు. "నాన్నా, నేను నాన్నా!"-అంటూ తండ్రి చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకువెళ్ళి వేడి వేడి కాఫీ యిచ్చింది. ముసలమ్మ వంక చూస్తూ "అమ్మ ఏది తల్లీ!" అన్నాడు.

సత్యవతమ్మ అప్పటికప్పుడు శోకాలు పెట్టింది. ఈ బిడ్డలనిద్దరినీ తన కొప్పచెప్పి శకుంతల మూడునాళ్ళ జ్వరంతో దాటిపోయింది. విశ్వనాథం వచ్చి శకుంతల ఏదంటే ఏమని చెప్తుంది?

విశ్వనాథం ఇల్లంతా తిరిగాడు. ఒక గదిలో రెండు మంచాలు - గోడల నిండా ఫోటోలు. ఆర్మీలో చేరబోయేనాడు తనూ, శకుంతలా తీయించుకున్న ఫోటోకు ఎవరో బొట్టుపెట్టి పూలహారం వేశారు. తను వెళ్ళేవాడు స్టేషను వరకూ వచ్చి కన్నీళ్ళతో సాగనంపింది. స్టేషనులో నలుగురి మధ్యలో తనను "ఇట్లా రండి" అని ప్లాట్‌ఫారం చివరివరకూ తీసుకువెళ్ళింది. అంతా జనం నిండి.

ఉన్నారు. ఏం చెప్పదలుచుకున్నదో వీలుకాలేదు కాబోలు, "త్వరగా వస్తారుకదూ" అన్నది కళ్ళల్లోకి చూస్తూ. తను వెళ్లే ఉబలాటములో నవ్వుతూ తల ఆడించాడు.

'నాన్నరా' అని ముసలమ్మ చెప్పిన తరువాత రంగడు విశ్వనాథం దగ్గరికి వెళ్ళాడు. తండ్రి పెట్టంతా తెరచి తనకు బాగున్న ఆల్బములూ, బొమ్మలూ తీసుకున్నాడు. రమణివి రమణికి యిచ్చాడు. కాని చనువుగా తండ్రి దగ్గరికి వెళ్ళి కూర్చోలేదు.

తను వెళ్ళేటప్పుడు కలకలలాడుతూ సాగనంపిన శకుంతల చనిపోయిందని విశ్వనాథం మనసుకు ఇంకా రూఢికాలేదు. నమ్మలేకుండా ఉన్నాడు. అత్తగారు చెప్పినదంతా కలలో జరిగిన సంగతిలా తోచింది.

రమణి, సత్యవతమ్మ దగ్గర చేరి తండ్రికి కావలసిన వంటకాలు తయారు చేస్తున్నది. సత్యవతమ్మ మధ్య మధ్య రాగాలు తీస్తున్నది.

సాయంసంధ్యవేళ విశ్వనాథానికి మరో కప్పు కాఫీ తాగే అలవాటు అదివరకూ ఉండేది. అతడు ఇటూ అటూ గదిలో తిరుగుతూ ఉంటే రమణి బల్లమీద కాఫీ గ్లాసు పెట్టి వెనక్కు తిరిగింది.

ఆ చీర కట్టుకోవటమూ, ఆ తలదువ్వుకోవటమూ ఆ కొంగువేసుకోవటమూ అంతా శకుంతలే. శకుంతల నడక ఎన్నాళ్లకు చూశాడు! ఆమె వెళ్ళిపోతూఉంటే కొంగు విచిత్రంగా కదిలింది. అలా కదిలినప్పుడు శకుంతల కొంగుపట్టుకుని తను లాగేవాడు. శకుంతల గిరున వెనక్కు తిరిగి అతడికి గిలిగింతలు పెట్టినట్టు వెక్కిరించి నవ్వి కొంగువిడిపించుకునిపోయేది.

విశ్వనాథానికి ఆర్మీలో చేరినప్పటినుంచీ బీరు తాగటము అలవాటయింది. అక్కడ స్టోర్సులో రకరకాల విదేశీ సరకు దొరుకుతూ ఉండేది కొంత సరుకు విశ్వనాథం వెంట తెచ్చుకున్నాడు. గదిలోకి వెళ్ళి సీసాల మూతలు తెరిచాడు. ఖాళీచేశాడు. బజార్లన్నీ నాలుగుసార్లు చుట్టబెట్టాడు. ఇంటికి తిరిగి వచ్చేసరికి తొమ్మిది కావచ్చింది. రంగడు పడుకుని నిద్రపోయాడు. రమణి ఊలుతో తమ్ముడికి స్వెట్టరు అల్లుతూ కూర్చుంది. సత్యవతమ్మ కునికిపాట్లు పడుతున్నది.

విశ్వనాథాన్ని చూడగానే సత్యవతమ్మ లేచి వడ్డించింది. భోజనాలయిన తరువాత వంటయింటికి పక్కగా ఉన్న గదిలో మంచము వేసుకుంది.

విశ్వనాథం వచ్చి వారము రోజులయింది. సత్యవతమ్మ యింటి సంగతు లన్నీ వివరాలతో సహా చెప్పింది. పొలాలమీద వచ్చేడబ్బుకు లెక్కలు చెప్పింది. ఇంట్లో ఉన్న సామాను. శకుంతల నగలూ, అవి పెట్టిన స్థలాలూ చెప్పింది. "ముసలాయన కొడుకు దగ్గరకి వెళ్ళి రెండు నెలలయింది. నేనూ వెళ్తాను" అన్నది.

సత్యవతమ్మ త్వరగా రమణికి పెళ్ళి చెయ్యమని చెప్పింది. ఉన్న సంబంధా లలో మంచి చెడ్డలు చూడమన్నది. అన్నిటికీ తల ఊపాడు విశ్వనాథం. ఆ సాయం కాలము సత్యవతమ్మ వెళ్ళిపోయింది.

ముత్తవతల్లి దగ్గర రమణి చక్కగా వంట నేర్చుకున్నది. కుట్టుపనులన్నీ స్కూలులో నేర్చుకున్నది. కాలేజీకి వచ్చిన తరువాత నవలలు చదవటము బాగా అలవర్చుకున్నది. ఇంటరు రెండవ సంవత్సరము చదువుతూ ఉండగా తల్లి కరవయిపోయింది. తన దుఃఖము దిగమ్రింగి రంగడు తల్లికొరకు దిగులుపడకుండా చూడటము రమణికి పెద్దపని అయిపోయింది. తల్లి చనిపోయిన తరువాత ఇంటి బాధ్యత కూడా పైన బడ్డది. వీటన్నిటిలో ఆమె వయసెంతో పెరిగినట్లయింది.

మధ్యాహ్నము పన్నెండు గంటలయింది. రంగడు భోజనముచేసి బొమ్మల ఆల్బము చూసుకుంటున్నాడు. రమణి తండ్రికొరకు భోజనము సిద్ధము చేసింది. వాకిలికి ఎదురుగా కుర్చీ వేసుకుని ఊలు అల్లుకుంటూ కూర్చుంది. విశ్వనాథం ఒంటిగంట తరువాత తలుపులు నెట్టుకుంటూ లోపలికి వచ్చాడు. ఈలవేస్తూ లోపలికి వెళ్ళి బూట్లు విడిచాడు. కుర్చీ లాక్కుని బల్లమీద చెయ్యి ఆనించి భోజనం చెయ్యటము మొదలుపెట్టాడు. రమణి కూరవడ్డిస్తూ "కొంచెము వెయ్యనా?" అన్నది.

ఏదో ఆలోచిస్తున్న విశ్వనాథం తలఎత్తాడు. తల ఒరగపెట్టి ఓరగా చూస్తూ వడ్డిస్తున్న రమణిని చూడగానే అతడికి శకుంతల జ్ఞాపకము వచ్చింది. అదే కంఠ ధ్వని; ఆ చేతులూ—ఆ కదలికా అంతా శకుంతలే. రమణిని బాగా పరకాయించి

చూశాడు. కనుబొమలు దట్టంగా, నల్లగా ఉండి మధ్యలో కలుసుకున్నాయి. విశాలమయిన నుదురు మధ్యపాపిట, చెవులకు బరువైన కమ్మలు ముందుకు వంగిన ముక్కు, చిన్న నోరు శకుంతల కిది రెండవమూర్తా, లేక శకుంతలేనా!

వడ్డించబోతున్న రమణి చెయ్యి ఎడమచేత్తో పట్టుకున్నాడు.

"కొంచెము వెయ్యనీ నాన్నా!"

"నాన్నా! నాన్నా!" మైకము వదిలినట్లయింది. ఇది రమణి. తను భోజనము చేస్తున్నాడు. రమణి వడ్డిస్తున్నది. మరెవరూ కాదు.

"వద్దమ్మా, వేసింది చాలు" కళ్లు పెద్దవిచేస్తూ తల ఆడిస్తూ అన్నాడు. ఎంతో ప్రయత్నము చేసి

"ఇంత పొద్దుపోయింది ఎక్కడికి వెళ్ళావు నాన్నా!"

"ఇంట్లో ఏమీ తోచటములేదు. బజారుకి వెళ్ళి దుకాణాలన్నీ చూసి వచ్చాను."

భోజనము కాగానే రెండు గంటలు నిద్రతీశాడు. టీ తాగుతూనే బయటికి వెళ్ళాడు.

రాత్రి పదకొండు దాటింది. కాని పన్నెండు కాలేదు. రంగడు పడుకుని నిద్రపోతున్నాడు. రమణి పదిగంటల వరకూ తండ్రికొరకు ఎదురుచూసింది. వాకిటి తలుపు దగ్గరగా వేసింది. మధ్య హాలులో తన మంచము మీద పడుకున్నది. అట్లాగే నిద్రపట్టిపోయింది. విశ్వనాథం తూలుతూ వచ్చాడు. తలుపులు నెట్టగానే తెరుచుకున్నాయి. గదిలో రంగడు ఆల్బము దగ్గర పెట్టుకుని పడుకుని ఉన్నాడు. హాలులోకి వచ్చాడు. బెడ్‌లైటు సన్నగా వెలుగుతున్నది. రమణి సన్నటి దుప్పటి కప్పుకున్నది. తెల్లటి నుదురుమీద ఎర్రటి కుంకుమ పెట్టుకున్నది. తలలో పెట్టుకున్న ఎర్రగులాబీలు నలిగి దిండుమీద రేకులు రేకులుగా పడిపోయాయి. అమాయక ముగా పడుకుని నిద్రపోతున్నది. అతడలా చూస్తూ ఉండగానే ఆమె పక్కకు ఒత్తిగిల్లింది.

విశ్వనాథం కాళ్ళకు ఉన్న బూట్లు విడిచాడు. ఓవర్‌కోటు కింద పడేశాడు. రమణిని చూస్తూ గడపలో నిలబడి పోయాడు.

శకుంతల ఎంత విశృంఖలంగా పడుకుని ఉన్నది! తలలో పూలు లేనిదీ ఒక్క-నాడు ఊరుకునేదా? తను ఆలస్యంగా యింటికి వస్తే మాత్రం ఇలా ఎందుకు నిద్రపోవాలి? "అప్పుడే నిద్రా శకుంతలా!" కప్పుకున్న దుప్పటి లాగి చేత్తో పట్టుకున్నాడు.

రమణి కెవ్వున కేక పెట్టింది. దిగ్గున లేచింది. ఆ లేవటంలో గోడకు చెయ్యి తగిలి గాజులు ముక్కలు ముక్కలయ్యాయి. గదినిండా చిందాయి. రమణి పెట్టిన కేకకు రంగడు లేచాడు "నాన్నా! నాన్నా!" అని అరవటము మొదలు పెట్టాడు. రమణి కూడా "నాన్నా! నాన్నా!" అని కేకలు పెట్టుతూ అవతల గదిలోకి పరుగెత్తింది.

విశ్వనాథానికి మైకము దిగిపోయింది. ఎవరో చెళ్ళున వీపుమీద చరచినట్లయింది. బూట్లు చంక బెట్టుకుని ఓవర్‌కోటు బుజమ్మీద వేసుకుని వాకిటితలుపు దగ్గరగా వేసి బయలుదేరాడు.

దొంగ పరుగెత్తినట్టు ఊరిబయటికి పరుగెత్తాడు. గుండె గబగబ కొట్టుకుంటున్నది. చర్మాన్ని భేదించుకుని బయటికి వస్తుందా అన్నట్లు ఎగిరిపడుతున్నది. కోటి నాగులు కాటువేసిన బాధ, ఆ బాధకు కలెక్టరాఫీసు ప్రహరీ గోడకు తలవేసి కొట్టుకున్నాడు. రెండు చేతులతో తల మోదుకున్నాడు. పిడికిళ్ళతో గుద్దుకున్నాడు. ఆవేదన కొద్దీ నేలమీదపడి పొర్లాడాడు మనసుకు శాంతి కలుగలేదు. "నాన్నా! నాన్నా!" అన్న కేకలు ఇంకా చెవులలో మారుమ్రోగుతున్నాయి. వాటిని తప్పించుకుని పారిపోవాలని పరుగుతీశాడు. ఎక్కడికి? ఎంత దూరము? గమ్యస్థానము లేదు. కాని కాలికొద్దీ పరుగుతీశాడు.

పచ్చగడ్డిమీద మేను వాల్చినా అతడికి పొగలూ సెగలూ కొట్టింది. మంచుకు బదులు నిప్పు తాకుతున్నట్లనిపించింది. లేచి గాజు పెంకులన్నీ అరుగుమీదపోసి దూరంగా నిలబడి దణ్ణంపెట్టి కళ్ళకు అద్దుకుని వెనక్కు తిరిగాడు.

విశ్వనాథం మెదడులో రమణి ముఖం పాతిన స్తంభంలా నిలిచిపోయింది. అతడి కన్నులకు ఆమె ముఖము ఎత్తని అవనిక.

అతడా కోటు విసిరిపారేశాడు. బూట్లు రిరవాచేశాడు. ఉలెన్ పాంటు విప్పేశాడు. నడచి నడచి ఊరు బయటికి వచ్చాడు. ఊడలు ఎదిగిన మర్రిచెట్టు గుబురులో పద్మాసనం వేసుక్కూర్చున్నాడు. కళ్ళుమూసుకున్నాడు. "ఓం నమశ్శివాయ-ఓం నమశ్శివాయ-ఓం నమశ్శివాయ" మనసులో మరొక భావము జొరబడకుండా వారాలూ, నెలలూ, సంవత్సరాలూ జరిగిపోతున్నాయి. చుట్టూ జనం మూగి 'స్వామీః స్వామీ' అంటూ దణ్ణాలు పెడుతున్నారు. పళ్ళూ ఫలాలు సమర్పిస్తున్నారు. కాని స్వామి కన్ను తెరవకుండా నిశ్చల సమాధిలో ఉన్నాడు.

(పుస్తక ప్రపంచం-మార్చి. 1964)



# దగాపడ్డ డాక్టరమ్మ

డాక్టర్ రాజేశ్వరి హాస్పిటల్ డ్యూటీచేసి క్వార్టర్సు చేరుకుని అయిదు నిమిషాలసేపు మంచం మీద అడ్డంగా పడుకుని లేచింది. చాలా అలిసిపోయానను కుంటూ లేచి భోజనం చేసింది. కడుపులో బరువు పడగానే నిద్ర ముంచుకు వచ్చింది. నిద్ర లేచేటప్పటికి మూడు గంటలు కొట్టారు. 'అయ్యయ్యో' అను కుంటూ కప్పు కాఫీ తాగి మళ్లీ హాస్పిటల్‌కు వెళ్లింది.

ఊపిరాడకుండా వస్తున్నారు పేషెంట్లు. ఉదయమనీలేదు—సాయంత్రమనీ లేదు. గుంపులు గుంపులుగా వస్తున్నారు.

"ఈవేళ టైమయిపోయింది. రేపు రండి" అంటూ ఆయా అందరినీ పంపించేస్తున్నది.

"వీళ్లంతా ఈ ఊరి వాళ్లేనా? లేక పక్క ఊళ్లోనుంచి కూడా వస్తూ ఉంటారా?" ఆయా నడిగింది రాజేశ్వరి.

"చుట్టు పక్కల చిన్న చిన్న గ్రామాలున్నాయి. అక్కడినుంచి కూడా వస్తారు. ఈ ఊరి వాళ్లు కూడా చాలా మంది ఉన్నారు. ఈ వేళ వచ్చిన వాళ్లలో" అన్నది ఆయా.

"అయితే, ఇది పెద్ద ఊరే!" రాజేశ్వరి ఆశ్చర్యపడ్డది.

ఆయా ఏదో చెప్పాలనుకుని రాజేశ్వరి ముఖంలోకి చూసింది.

ఏమిటన్నట్టు చూసింది రాజేశ్వరి.

"ఊరికి వెళ్లిన డాక్టరమ్మగారు పేషెంట్లను చూసి రుసరుసలాడిపోయే వారు. హాస్పిటల్‌కు వచ్చినప్పటినుంచీ ఎప్పుడింటికి వెళతానా అని చూసేవారు.

ఎప్పుడూ గడియారం చూసుకునేవారు. పేషెంట్ల మీద కోపం తెచ్చుకుని అరిచే వారు. అందుకని చాలా మంది ఇంకో ఊరికి వెళ్లేవారు."

'అట్లాగా' అన్నట్లు చూసింది రాజేశ్వరి. క్వార్టర్సు చేరుకుని చల్లగాలికి ఆరుబయట కుర్చీ వేయించుకుని కూర్చుంది.

'అయితే, ఈ ఊరు మరీ చిన్నది కాదు. బాగా జనాభా ఉన్న ఊరే నన్న మాట' అనుకుంది. ఏదో పల్లెటూరికి తనను బదిలీ చేశారనగానే తన చీఫ్‌నూ, మిగతా డాక్టర్లనూ సలహా అడిగింది. ఎమ్ బి బి.ఎస్. పూర్తి చెయ్యగానే డి.జి.ఓ చేసింది. ఎమ్.డి. కూడా వెంటనే చేసి డిగ్రీ తీసుకుంది గుంటూరులో. ఆ హాస్పిటల్‌లో అదృష్టంకొద్దీ ఉద్యోగం కూడా దొరికింది. ఇంక తను ఎక్కడికీ వెళ్లక్కర్లేదు అక్కడే స్థిరపడిపోవచ్చనుకుంది. కాని, ఒక సుప్రభాతాన ఒక మన్య ప్రదేశంలోని పల్లెటూరికి బదిలీ చేస్తున్నట్టుగా తాఖీదు వచ్చింది. హాస్పిటల్లో అంతా ఇచ్చిన సలహా ననుసరించి మెడికల్ డైరెక్టర్‌ను కలుసుకుంది. తనను ఉన్న చోటనే ఉంచమని అర్థించింది. తానా పల్లెటూరికి వెళ్లననీ మరీ మరీ చెప్పింది. ఆయన 'సరే, చూస్తా'నని చెప్పి ఆమె వెళ్లిన మరునాడు మరో పల్లెటూరికి బదిలీచేస్తూ 'తప్పకుండా వెళ్లి డ్యూటీలో జాయిన్ కావాలి ఒక వారంలోపల' అంటూ ఆర్డర్స్ పంపాడు.

రాజేశ్వరి కళ్లనీళ్ల పర్యంతం అయింది. కాని, చేయగలిగిందేమీ కనపడ లేదు. ఆత్మబంధువులా తనను కనిపెట్టుకుని ఉన్న గోవిందమ్మతో బయలుదేరి వెళ్లింది.

అక్కడ తనకంటె పెద్ద డాక్టర్ రమణారావు. ఆయనను దర్శించి డ్యూటీలో జాయినయింది. స్టాఫంతా ఒక్కొక్కరే వచ్చి దణ్ణంపెట్టి వెళ్లారు. వచ్చిన వారం రోజులవరకూ పని ఎక్కువనిపించింది. గుంటూరు హాస్పిటల్లో పదిమందిలో తానొకతెగా పనిచేసింది. ఇక్కడ తనొక్కతే కనక భారమనిపిస్తూంది. పదిహేను రోజులయ్యేసరికి పనికి బాగా అలవాటుపడిపోయింది.

అప్పుడప్పుడు ఆయా రాజేశ్వరి కంటె ముందర ఉన్న డాక్టర్ని గురించి కబుర్లు చెబుతూ ఉండేది. డాక్టర్ సునందకు ఒక కొడుకూ, కూతురూ నట. ఆమె భర్త డాక్టర్ అజీజ్ ఎఫ్ ఆర్.సి.ఎస్. డిగ్రీ కోసం విదేశాలకు వెళ్లాడట. హాస్పి

టల్ డ్యూటీమీద ఉన్నప్పుడు కూడా తన పిల్లలను గురించే మాట్లాడేదట. వాళ్లను గురించే ఆలోచిస్తూ ఉండేదట.

ఎంత పిల్లల మీద ప్రేమగల డాక్టరయినా ఉద్యోగమూ, దాని ధర్మమూ సక్రమంగా నిర్వర్తించవద్దూ అనుకుంది రాజేశ్వరి. మగవాళ్లమాదిరిగా ఉద్యోగాలు చేయదలచుకున్నప్పుడు ఆ బాధ్యతలు కూడా వాళ్లలాగే నిర్వర్తించాలి. అన్నిటిలో సమానంగా ఉండాలని రాజేశ్వరి ఉద్దేశం.

ఈ మాట అనుకున్నప్పుడల్లా రాజేశ్వరికి కాలేజీ లెక్చరర్ మిస్ జోషి జ్ఞాపకం వస్తుంది. ఆమె ఉద్యోగానికి దరఖాస్తు పెట్టేటప్పుడు నలుగురు పిల్లల తల్లి అయిన రేవతి కూడా పెట్టింది. అది ప్రైవేటు కాలేజీ. క్రైస్తవ మిషనరీలు నడిపేది. చివరకు సెలెక్షన్ కమిటీ మిస్ జోషిని సెలెక్ట్ చేసింది. వివాహితలూ, పిల్లల తల్లులూ సరిగా ఉద్యోగ ధర్మాలను నిర్వహించరనీ, వాళ్ల ధ్యాసంతా ఎప్పుడూ పిల్లలమీద, ఇంటి మీద ఉంటుందనీ, భర్త ప్రభుత్వోద్యోగి అయితే ఉద్యోగాలు వదిలిపెట్టి వెళ్లిపోతారనీ సెలెక్షన్ కమిటీ అభిప్రాయపడి, క్లాసు రాక పోయినా సరేనని మిస్ జోషినే సెలెక్ట్ చేసుకున్నదట.

రాజేశ్వరి మెడికల్ కాలేజీకి వచ్చేటప్పటికి ఆడపిల్లలు చదువులు ఎంత ముఖ్య మనుకుంటారో కొందరు విద్యార్థినులు ఋజువు చేశారు. ఆమెతో కూడా మల్టీపర్పస్ హైస్కూల్లో చదివి పాసయిన ఆరుగురు విద్యార్థినులు మెడికల్ కాలేజీకి దరఖాస్తు పెట్టి సీట్లు తెచ్చుకున్నారు. కాని. సుందరికి మొదటి సంవత్సరం పరీక్షల ముందర పెళ్లయిపోయింది. భర్తతో జబల్‌పూర్ వెళ్లిపోయింది. కావేరి, మణి, పుష్ప రెండో సంవత్సరం పరీక్ష వ్రాసి పెళ్లిళ్లు చేసుకున్నారు మెడికల్ కోర్సు పూర్తిగా చదివి డాక్టర్లయింది రాజేశ్వరీ, రాధాను, వీళ్లిద్దరూ పాసయిన నాడు ప్రిన్సిపల్ "ఆడపిల్లలు మాకూ హక్కుందంటూ మెడికల్ కాలేజీలో సీట్లు తెచ్చుకుంటారు కాని, చదువు కొనసాగించే వరకూ నమ్మకంలేదు. చదువు పూర్తి చేసుకుని డాక్టర్లయినందుకు మిమ్మల్నిద్దరినీ అభినందిస్తున్నాను" అంటూ ఛలోక్తి విసిరారు.

ఆయన ఆ మాట అంటూంటే కాలేజీ చదువు వదిలిపెట్టిన వాళ్లమీద ఎంతో కోపం వచ్చింది రాజేశ్వరికి. సిగ్గుతో తల వంచుకుంది.

మెడికల్ కోర్సు చదివేటప్పుడు రాజేశ్వరికి కూడా ఎన్నో ఆటంకాలు ఎదురవుతూ ఉండేవి. కాని, అవి గాలికి చెదిరిపోయే మేఘాల మాదిరిగా చెదిరి పోతూ ఉండేవి. తల్లి హేమలతమ్మ పోయేటప్పటికి రాజేశ్వరి మూడో సంవత్సరం చదువుతూంది మొదటినుంచీ రాజేశ్వరి బంగారు పతకాలు బహుమతి పొందిన విద్యార్థిని. ఆమె అంటే ప్రొఫెసర్ల కెంతో సంతోషం, గౌరవం, గర్వం కూడాను. ఒక నాడు ఆమె కాలేజీ నుంచి ఇంటికి వచ్చేసరికి తల్లీ, తండ్రి మాట్లాడు కుంటున్నారు.

"రాజీ కోర్సు పూర్తిచేసేటప్పటికి దానికి ఎన్నేళ్లు వస్తాయి?" తల్లి అడుగుతూంది.

"తప్పకుండా పాసయితే ఇరవై మూడేళ్లు దాటుతాయి. ఆపైన హౌస్ సర్జన్‌గా ఒక ఏడాది. ఇంకా పైన ఎమ్. డి. చెయ్యాలంటే మరో మూడేళ్లు. ఎంత లేదన్నా రెండు మూడు ఏళ్లు తక్కువగా ముప్పై వేసుకో" అంటున్నాడు తండ్రి

"అయితే, దానికి పెళ్లెప్పుడు? మూడు పదులు మీదికి వచ్చినప్పుడా?" తల్లి కంఠంలో ఆందోళన వినిపించింది.

"అన్న మాటే."

"అప్పుడేం పెళ్లి? అప్పుడైనా దానికి ఈడైనవాడూ, జోడయినవాడూ దొరకవద్దూ? సంబంధం దొరకటం చాలా కష్టం కదూ?"

"ఏం చేస్తాం మరి? ఈ దీర్ఘమయిన కోర్సులో చేరిన పిల్లల కింతే" అన్నాడు తండ్రి.

"అందుకే కాబోలు చాలా మంది ఆడ డాక్టర్లకు సరయిన సంబంధాలు దొరక్కపోవటం. పెళ్లికాని వాళ్లు చాలా మంది ఉన్నారు. మన రాజీ అట్లా పెళ్లి కాకుండా ఉండిపోతుందనుకుంటే నాకు చాలా బాధగా ఉంది. ఒక్కగా నొక్క పిల్ల. దాని మీదనే నా ప్రాణాలన్నీ పెట్టుకున్నాను." ఆమె కన్నీరు కార్చింది.

"అంత బెంబేలు పడద్దు. సాధారణంగా డాక్టర్లకు డాక్టర్లే దొరుకుతారు. చదువుకునే రోజుల్లోనే చదువుకునే వాళ్లలో ఎవర్నో ఒకరిని ఎన్నుకోకుండా ఉంటుందా? చదువు పూర్తయిన తరవాత పెళ్లిళ్లు చేసుకుంటారు చాలామంది."

"అయితే, అప్పుడు మనం చేసినట్టుంటుందా? మనం చూసినట్టుంటుందా? కులగోత్రాలు కలవవు. డిగ్రీ ఉంటే చాలనుకోవాలి." అంతేనా అన్నట్లు చూసింది తల్లి.

"మన రాజీవి ఇంత పెద్ద చదువు చదివించినప్పుడు ఆ మాత్రపు సంస్కారానికి ఒప్పుకోవాలి. నీవు కాస్త మనసు మార్చుకోకపోతే ఎలా?" నవ్వుతూనే సమాధాన పెట్టాడు."

వాళ్ల సంభాషణలోని సారాంశ మేమిటో పక్క గదిలో ఉన్న రాజేశ్వరికి అర్థమయింది. అమ్మ ఎప్పుడూ దిగులుగా ఉండటం ఇందుకా అనుకున్నది. తనకు మాత్రం దృష్టంతా చదువుమీదనే ఉన్నది. తనతో ముఖాముఖి పెళ్లి మాట ఎత్తకుండానే హేమలతమ్మ నాలుగు నెలల తరవాత చనిపోయింది. మెడికల్ కోర్సు పూర్తి అయేవరకూ తనను ఏ విషయంలోనూ నిర్బంధించకుండా తల్లి ఉన్నప్పటి కంటె గారాబంగా చూశాడు తండ్రి. కోర్సు పూర్తి కాగానే ఒకనాడు అతి సున్నితంగా పెళ్లి ప్రశంస ఎత్తాడు.

"వైద్య వృత్తికి నా జీవితాన్ని అంకితం చెయ్యాలని నిశ్చయించుకున్నాను, నాన్నా!" అన్నది. ఆ మాట లనేటప్పుడు తన కాలేజీ ప్రిన్సిపల్ అన్న మాటలు మనసులో మెదులుతూనే ఉన్నాయి.

"నీ జీవితం దానికి అంకితం చెయ్యటానికి నేను అభ్యంతరం చెప్పటం లేదమ్మా. నీవు తోడబుట్టిన వాళ్లెవరూ లేని ఒంటరిదానివి. నీకు జీవితంలో ఒక తోడు కావాలి. ఒక డాక్టర్నే ఎన్నుకో. ఇద్దరూ కలిసి పని చేసుకోండి. నేను చనిపోయే లోపల నీవు గృహిణివి కావాలి. అదే నా కోరిక" అన్నాడు. ఆయన కంఠంలోని బరువును చూసి ఆమె అదిరిపోయింది.

"ఇటువంటి మాటలని నా ధైర్యం చెడగొట్టకు, నాన్నా. పెళ్ళి కాకపోతే ఏం? మనిద్దరం హాయిగా ఇలాగే ఉందాం. అనవసరంగా బాధ పడకండి ఈ వయసులో. మంచి సినిమా వచ్చిందట, రండి, చూద్దాం." ఆయన ఆ ప్రశంస ఎత్తినప్పుడల్లా ఏదో ప్రసంగంలోకి లాగి మరిపిస్తూ ఉండేది. హాస్పిటల్ నుంచి రాగానే రోగుల కబుర్లు, పత్రికలు, రాజకీయాలు ఎన్నెన్నో చెప్పి మనసు మళ్లించే ప్రయత్నాలు చేస్తూ ఉండేది.

రాజేశ్వరి ఎమ్. డి. చేస్తూండగా ఆయన కిడ్నీ జబ్బు వల్ల పది రోజులు బాధపడి చనిపోయాడు. ఆ దుఃఖంలో కూడా రాజేశ్వరి మనసంతా పరీక్ష మీద కేంద్రీకరించి పాసయింది.

రాజేశ్వరికి ఏ పని చేసినా ప్రథమ శ్రేణికి చెందేటట్లు చేయాలని కాంక్ష. ఆమెకు ద్వితీయ శ్రేణి నచ్చదు. చదువులోనూ, డాక్టరయిన తరువాత డ్యూటీ చెయ్యటంలోనూ తన పంతం సాగించుకుంటూ వస్తూంది.

రాజేశ్వరి హాస్పిటల్‌కు వచ్చిన నెలకే పెద్ద డాక్టర్ రమణారావు ఈ విషయం గ్రహించాడు. తను కూడా ఆమెను చూసి రోగులతో నిదానంగా మాట్లాడటమూ, ఓపికతో వాళ్లు చెప్పినది వినటమూ ప్రారంభించాడు.

"డాక్టర్, మీరు నాకు పాఠాలు నేర్పుతున్నారు" అనేవాడు నవ్వుతూ.

"నేను నేర్పటం ఏమిటి? డిగ్రీ తీసుకున్నప్పుడే మనం నేర్చుకున్నా" మనేది రాజేశ్వరి నవ్వుతూ.

రాజేశ్వరి అక్కడికి వచ్చిన తరవాత ఆ ఊరి మర్యాదలను కొన్ని పాటించ వలసి వస్తూంది. కొందరు ధనికులు ఉన్నారు. వాళ్ల కుటుంబాలు హాస్పిటల్‌కు రావు. ఏ చిన్న జబ్బుకయినా డాక్టర్ని ఇంటికి పిలుస్తారు. కొందరు హోదాతో పిలుస్తారు. కొందరు డబ్బిస్తాము రమ్మంటారు. అది పల్లెటూరు. తను తప్ప మరో అడ డాక్టర్ లేదు పిలిచినప్పుడు వెళ్లక తప్పటం లేదు రాజేశ్వరికి. పంచాయితీ సమితి ప్రెసిడెంట్ గారి అమ్మాయి గర్భిణి. ఆమెను చూడటానికి తరుచుగా రాజేశ్వరి అక్కడికి వెళ్లవలసి వస్తూంది.

సాయంకాలం అయిదు గంటల తరవాత ఇంటి ముందర కుర్చీ వేసుకుని పత్రిక తిరగవేస్తున్నది రాజేశ్వరి ఒకనాడు. ఆనాడు ఆదివారం. చాలా తీరిక.

"డాక్టర్ గారు పత్రికలో ముఖం దూరిస్తే అందరినీ మరిచిపోతారు కాబోలు."

తలఎత్తి చూసింది. పంచాయతీ సమితి చైర్మన్‌గారూ, ఆయన వెంట మరొక యువకుడూ ఎదురుగా నిలబడ్డారు.

"ఈవేళ ఆదివారం కదా. అందుకని తీరిగ్గా పేపరు చూస్తున్నా. ఇలా వచ్చి కూర్చోండి." రెండు కుర్చీలు చూపించింది.

'ఈవేళ మీరు రాత్రికి మా ఇంటికి రావాలి. మా సుమన నొప్పులు పడుతున్నది. మీరు పంపిన వర్పు వచ్చింది. కాని—మీరు కూడా రావాలి సుమండి" చైర్మన్ గారు కుర్చీలో సర్దుకుని కూర్చుంటూ అన్నారు. ఆయన పక్కనే ఆ యువకుడూ కూర్చున్నాడు.

వీళ్ళను చూసి నౌకరు గోవిందమ్మ కాఫీ కప్పులు తీసుకువచ్చింది.

"డాక్టర్‌గారూ, వీరిని నేను పరిచయం చేయకుండానే కాఫీ కప్పు అందుకుంటున్నాను. వీరు ఇంజనీరు రామమోహనరావుగారు. నాగార్జునసాగర్ ప్రాజెక్టులో కూడా కొంతకాలం పనిచేశారట. నెల రోజులు సెలవు తీసుకుని పల్లెటూరి గాలి మంచిదని ఇక్కడికి వచ్చారు. వారం రోజులయింది." రాజేశ్వరికి ఆయనను పరిచయం చేశారు చైర్మన్‌గారు.

"ఈ డాక్టర్‌గారు ఈ ఊరు వచ్చిన తరవాత ఈ ఊరి వాళ్ళేకాక, చుట్టు పక్కల ఆడవాళ్ళంతా ఈ హాస్పిటల్‌కే వస్తున్నారు." ఎంతో సంతోషంతో ఆమెను ఆ యువకుడికి పరిచయం చేశారాయన.

"అందులో చెప్పుకోదగిన గొప్పతన మేమున్నది? మా వృత్తి అదే కదా?" తృప్తిగా జవాబిచ్చింది రాజేశ్వరి.

"వృత్తి ధర్మాన్ని చక్కగా నెరవేరుస్తున్నారన్న మాట" అన్నాడు రామమోహనరావు ఆమెను వింతగా చూస్తూ.

ఆమెకు ఇటువంటి ప్రశంసలు కొత్తవి కావు. అటువంటి మాటలు ఆమె చెవివరకూ వెళ్ళనే వెళ్ళవు. మాటలకోసం కాదు కాని....ఎందుకో కళ్ళెత్తి అతడి ముఖంలోకి చూసింది.

అతడికళ్ళు కొంటెగా నవ్వుతున్నాయి.

ఆ తరవాత ప్రసంగం వాళ్ళ మధ్య చాలా విషయాల మీదికి వెళ్ళింది. కొన్నిటి మీద దీర్ఘ చర్చ జరిగింది. కొన్ని నామమాత్రంగా స్పృశించి వదిలారు.

వాళ్ళు వెళ్ళేటప్పుడు చైర్మన్‌గారు మరొకసారి ఆమెకు ఆ రాత్రి తన కూతురిని చూసి వెళ్ళమని చెప్పారు.

రాజేశ్వరి హుషారుగా లేచి ఎనిమిది గంటలకు భోజనం చేసి గోవిందమ్మను వెంట తీసుకుని చైర్మన్ గారి ఇంటికి వెళ్ళింది. రాత్రి పన్నెండు గంటలకు పురుడు వచ్చింది. మగపిల్లవాడు పుట్టాడు. చైర్మన్‌గారూ, ఆయన భార్యా కూడా చాలా సంతోషపడ్డారు. రాజేశ్వరి ఒక దేవత అయిపోయింది వాళ్ళ దృష్టిలో. చైర్మన్‌గారు స్వయంగా ఆమెను ఇంటివరకూ సాగనంపారు. ఆ దంపతుల దృష్టిలో రాజేశ్వరి ఆ ఇంటి పెద్దాడపడుచు. మంచి కూర, మంచి టిఫిన్-ఏదయినా సరే ముందు పెద్దాడపడుచుకు పంపకుండా వాళ్ళు అనుభవించలేకపోయేవారు.

ఆ ఆదివారం సాయంత్రం వేళ రామమోహనరావు చైర్మన్‌గారి పదేళ్ళ కుమారుడితో కూడా వచ్చాడు.

"నాన్న మీకు చక్రకేళి పళ్ళు ఇమ్మన్నారు" అంటూ డజను అరటిపళ్ళు బల్లమీద పెట్టాడు చైర్మన్‌గారి కొడుకు మురహరి.

"రోజూ ఏదో ఒకటి మీ ఇంటినుంచి రావలసిందేనా?" అంటూ వాళ్ళిద్దరికి చెరొక పండు ఇచ్చి తినమన్నది రాజేశ్వరి.

బెరుకు లేకుండా రాజేశ్వరీ, రామమోహనరావూ మాట్లాడుకున్నారు చాలాసేపు. అతడి సంభాషణ అంతా ఇంగ్లీషులోనే ఉంది. చక్కని ఉచ్చారణ. ఎన్నెన్నో ఇతర దేశాల కబుర్లూ, వింతలూ, విశేషాలూ. సైన్సూ, నాగరికత— అనర్గళంగా మాట్లాడేస్తున్నాడు. వెళ్ళేటప్పుడు మళ్ళీ కలుద్దామని వాగ్దానాలు కూడా చేసుకున్నారు.

అలా మూడు ఆదివారాలు గడిచాయి. క్రమంగా చనువూ, స్నేహమూ పెంపొందటం మొదలయింది. ఆమె హృదయంలో అకడొక గొప్ప మేధావిగా, గొప్ప స్కాలర్‌గా ముద్రపడిపోయాడు

నాలుగో ఆదివారం వచ్చింది. ఆ రోజు సాయంత్రం ఎప్పటి మాదిరిగా రామమోహనరావు వస్తాడని కుర్చీలు వేయించి ఎదురుచూసింది రాజేశ్వరి. 'ఇలస్ట్రేటెడ్ వీక్లీ', 'ఫిల్మ్‌ఫేర్', 'ఫెమీనా' పత్రికలన్నీ తిరగవేస్తూ కూర్చుంది.

మధ్య మధ్య ఎవరయినా వచ్చారేమోనని గేటువైపు తలఎత్తి చూస్తున్నది. ఎవరూ రాలేదు.

రాజేశ్వరి ఉంటున్న క్వార్టర్సు అందంగా లేకపోయినా చాలా వీలుగా ఉన్నది. పెరటివైపు కూరగాయల మడులు, పొట్ల, బీర, దొండ పాదులకు పందిళ్ళూ ఇంటి ముందర పూలచెట్లూ, గజమున్నర ఎత్తు ప్రహరీ గోడల, చిన్న గేటు లోపల రెండు గదులు, హాలు, వంట ఇల్లు చిన్నవరండా బాత్‌రూమ్-వగైరా ఒక చిన్న కుటుంబం ఉండటానికెంతో వసతిగా ఉంది. రాజేశ్వరి ఇల్లంతా ఒక సారి కలయతిరిగి వచ్చింది. పెరటి తోటంతా చూసి వాకిలి వైపుకు తిరిగింది. ఏదో అనుకున్న పని కాకపోతే కలిగే చిరాకు ముఖంమీద స్పష్టంగా కనపడు తున్నది.

చివాలున తలుపు తీసి బయటికి వెళ్ళేటప్పుడు వేసుకునే చెప్పులు వేసుకుని హెడ్‌మాస్టరుగారింటికి వెళ్ళుతున్నానని గోవిందమ్మకు చెప్పి బయలుదేరింది. ఆ ఊళ్ళో విద్యుద్దీపాలు ఉండవనీ, ఊరంతా బురదగా ఉంటుందనీ, సిమెంటు రోడ్లు ఉండవనీ—ఏమిటేమిటో ఊహించుకుని భయపడిపోయింది. రాజేశ్వరి అక్కడికి వచ్చేముందు. కాని, ఆ ఊళ్ళో కూడా విద్యుద్దీపాలు, తారు రోడ్లు, ఒక సినిమా హాలు ఉన్నాయి. పెద్ద వీథి నిండా మేడలూ, సిమెంటుతో కట్టిన అమెరికన్ డిజైను గల ఇళ్లూ ఉన్నాయి. పెద్ద వీథి చౌరస్తా మీద నేలమీద వ్యాపారం నడుస్తూ ఉంటుంది. అక్కడికి వచ్చిన తరవాత రాజేశ్వరి అభిప్రాయాలన్నీ మారి పోయాయి.

రాజేశ్వరికి హెడ్‌మాస్టర్ గారి భార్య ఉమాసుందరమ్మ వాకిట్లోనే ఎదురయింది. మల్లెపూలు కోసుకుంటూ. రాజేశ్వరిని చూడగానే భుజంమీద చెయ్యేసి లోపలికి తీసుకువెళ్ళి హాల్లో ఉయ్యాల బల్లమీద కూర్చోబెట్టి, తను కూడా పక్కన కూర్చుని—"ఏం కబుర్లు?" అంటూ ముఖంలోకి చూసింది.

"ఏముంది? ఈ మధ్య మీరు మా ఇంటికి రావటం మానేశారు. ఆదివారం వస్తే నాకేమీ తోచదు. అందుకని నేనే వచ్చాను" అన్నది బుంగమూతితో.

"చూశావా, చూశావా ఎంత అబద్ధమో! డాక్టరమ్మకు అబద్ధాలు కూడా ఆడటం వచ్చునన్నమాట!" అన్నది ఉమాసుందరమ్మ కోపాన్ని అభినయిస్తూ.

"అబద్ధమా! చాలా అన్యాయంగా మాట్లాడుతున్నారు!" తెల్లబోయి చూపింది రాజేశ్వరి

ఉమాసుందరమ్మది పెద్ద వయస్సు కనక 'నీవు' అనే సంబోధిస్తుంది రాజేశ్వరిని. చనువుగా మాట్లాడుతుంది ఆమె కొడుకులు ఇద్దరు పై చదువులకని నగరంలోనే ఉంటున్నారు. రాజేశ్వరి వచ్చినప్పటినుంచీ ఆడపిల్ల లేని కొరత తీరినట్లుగా ఉన్న దామెకు.

"నేను మొన్నటి ఆదివారం మీ ఇంటి గేటు వరకూ వచ్చాను. అప్పుడు డాక్టరమ్మ ఎవరితోనో మాట్లాడుతున్నది. పానకంలో పుడకలాగా నే నెందుకని వెనక్కు తిరిగాను" ఉమాసుందరమ్మ కొంటెగా రాజేశ్వరి ముఖంలోకి చూపింది.

"ఓహో అదా సంగతి! ఆయనెవరో ఇంజినీరట. సెలవు తీసుకుని ఈ ఊరు వచ్చారట. చైర్మన్‌గారు తీసుకువచ్చారు. తరవాత రెండుసార్లు—ఒకసారి ఆయన కొడుకుతోనూ, ఒకసారి ఒంటరిగానూ—వచ్చాడు. ఏదో పిచ్చాపాటీ మాట్లాడుకున్నాం." మామూలు ధోరణిలో చెప్పింది రాజేశ్వరి.

"నా మనసులో ఉన్నమాట చెప్పద్దూ మరి! నే నేమనుకున్నానంటే, ఆయన ఎవరో గాని, మా డాక్టరమ్మకు ఈడూజోడూ కలిసినట్టుగా ఉన్నాడు. ఆమె త్వరగా మేలుకుంటే బాగుంటుం దనుకున్నా. ఏదో సరదాగా కబుర్లు చెప్పుకుంటూ సంతోషంగా ఉన్నారు. నా కోరిక తీర్చకపోతుందా అని ఆశపడుతూ తిరిగి వెళ్ళిపోయాను."

ఉమాసుందరమ్మగా రింటి చక్కిలాలంటే రాజేశ్వరికి ఎంతో ఇష్టం. వెళ్లినప్పుడల్లా అడిగి పెట్టించుకుంటుంది. రాజేశ్వరిని చూడగానే లోపలికి వెళ్ళి చక్కిలాల పళ్లెం తీసుకు వచ్చింది ఉమాసుందరమ్మ.

"నాకు మిమ్మల్ని 'అక్కా' అని పిలవాలనుంది. నాకు అక్కలు లేరు గనక ఆ కోరిక అలాగే నిలిచిపోయింది." చక్కిలాలు తుంచి పళ్ళెం నిండా పోసుకుని తినటం మొదలు పెట్టింది.

"పిలు. నేను వద్దన్నానా? అప్పు దేం చేస్తానో తెలుసా? అక్కా అనగానే నాకు అధికారం వస్తుంది. ఒక మరిదిగారిని తీసుకువచ్చి మూడు ముళ్లూ వేయిస్తాను." ఏమనుకుంటున్నావో అన్నట్టు చూపింది ఉమాసుందరమ్మ.

రాజేశ్వరి విరగబడి నవ్వింది. ఆ నవ్వు 'మా అమ్మా, నాన్నా ఏం చెయ్యా లేక పోయారుగానీ నీవేం చేస్తా'వన్నట్టుంది.

"నీ నవ్వు నా కర్థమయింది. నే నలా ఊరికే చెప్పేదాన్ని కాదు. నాకు క్రియ కావాలి. ఈ వేళే మా మరిది-అంటే మా వారి తమ్ముడు-ఉత్తరం వ్రాశాడు. ఆయన ఒక కంపెనీకి మేనేజరుగా ఉన్నాడు. ప్రమోషను కూడా వచ్చిందట. ఇన్నాళ్లూ దానికోసమే ఆగాడట. ఇప్పుడు మీరు చెప్పినట్టు వింటాను. పిల్లని చూడమని వ్రాశాడు. ఇదిగో ఫోటో చూడు." చేతి కిచ్చింది.

"నాకు పెళ్ళికావలసినప్పుడు మీ దగ్గరికి వస్తాను." నవ్వుతూ ఫోటో తిరిగి ఇచ్చేసింది రాజేశ్వరి.

"ఒక నెల టైమిస్తా. బాగా ఆలోచించుకో."

ఇద్దరూ కులాసాగా ఎక్కడెక్కడివో కబుర్లు చెప్పుకున్నారు. జీవితంలో తను పోగొట్టుకున్న తల్లితండ్రుల ప్రేమా ఆప్యాయతా, వాత్సల్యమూ రాజేశ్వరికి ఉమాసుందరమ్మ దగ్గర పుష్కలంగా లభిస్తున్నాయి.

ఎనిమిది గంటలవేళ రాజేశ్వరి ఇంటికి వచ్చి భోజనం చెయ్యాలని బల్ల ముందర కూర్చుంది. గోవిందమ్మ భోజన పదార్థాలన్నీ తీసుకువచ్చి బల్లమీద పెట్టింది. అన్నీ వడ్డించుకుని కలుపుకోబోతూ తల ఎత్తి చూసింది. ఏదో అలికిడి అయినట్టుగా తోచి.

బల్లదగ్గరగా నిలబడ్డాడు రామమోహనరావు. దిగ్గున లేచింది రాజేశ్వరి సంభ్రమంతో. "భోజనం చేద్దురుగాని, కూర్చోండి" అన్నది.

కుర్చీ ఒగ్గరకు లాక్కుని కూర్చుంటూ "నా సెలవు అయిపోతున్నది. డ్యూటీలో జాయిన్ కావాలి. అదే ఆలోచిస్తూ ఊరి బయట పొలాలకేసి వెళ్ళి కాలు సాగేవరకూ తిరిగి వస్తున్నా" అన్నాడు.

"అందుకే భోజనంచేసి విశ్రాంతి తీసుకోండి" అన్నది.

"అహఁ వద్దు, వద్దు, ఈ వేళ నేను భోజనం చెయ్యదలుచుకోలేదు."

"ఎందుకని ?"

"నన్నో పాడు ఊరికి బదిలీ చేశారు. అక్కడి నీళ్లు నాకసలే పడవు. అక్కడ రాజకీయాలంటేనే నాకు తలనొప్పి."

"అయ్యో, ఆ దిగులుతో భోజనం చెయ్యరా ఏమిటీ?" ఆదుర్దా పడ్డది రాజేశ్వరి.

"ఆ బదిలీ ఆర్డరు చూడగానే ఆకలి చచ్చిపోయింది"

"అయితే, ఒక పని చెయ్యండి. సెలవు పొడిగించండి. ప్రాణం కొన్నాళ్లు పాటు నిశ్చింగా ఉంటుంది. ఏదో కాస్త మీకు ఇష్టమున్నంతవరకూ భోజనం చెయ్యండి. నా కంపెనీ కోసమయినా చెయ్యాలి." గునిసింది రాజేశ్వరి.

ఎట్లాగో అతడిని ఒప్పించి పళ్లెంలో వడ్డించింది. భోజనాలయిన తరవాత ఏవేవో కబుర్లు చెప్పుకున్నారు.

"వస్తాను మరి" అంటూ అతడు వెళ్లిపోయాడు.

రాజేశ్వరి పక్కమీద పడుకుంది కాని, ఉమాసుందరమ్మ మాటలే చెవిలో మారుమ్రోగటం మొదలుపెట్టాయి. మధ్య మధ్య రామమోహనరావు ముఖం నిండుగా నవ్వుతూ కళ్లకు కట్టినట్టుగా ఉంది. అతడిది ఎంత మెత్తటి హృదయం! ఎంత స్నేహ శీలి! భుజం తట్టి మనసులో జొరబడుతున్నాడు. తియ్యటి మాటలు....గిలిగింతలు పెట్టే కంఠస్వరం. ఇదేమిటి? గది తలుపులు వేసుకున్నా మనసంతా ఆక్రమించుకుని కూర్చున్నాడు! ఆమె మనసంతా అలలతో పొంగులెత్తే మహాసముద్రంలా ఉంది. నిద్రపట్టదు. పట్టినా అది కలతనిద్ర.

ఎప్పుడో ఆమెకు నిద్ర పట్టింది. ప్రొద్దుటే లేచి హాస్పిటల్ డ్యూటీ చేసి వచ్చింది. ఇంటికి వచ్చేటప్పుడే ఛైర్మన్‌గారి అమ్మాయిని చూసి ఒక ఇంజక్షన్ ఇచ్చి వచ్చింది. ఆ మరునాడే ఛైర్మన్‌గారి ఇంట్లో నామకరణ మహోత్సవం. బాలెంత డాక్టరమ్మకు ఒక పట్టు చీరె, బుట్టనిండా పళ్లు ఇచ్చి నమస్కారం చేసింది. ఆ రాత్రికి ఛైర్మన్ గారింట్లో విందు భోజనాలు. రామమోహనరావు వడ్డన. అబ్బ, కొసరి కొసరి వడ్డించటం! చూపులతోనే తినేయటం రాజేశ్వరి తప్పించుకోలేకపోయింది.

తరవాత రెండు రోజుల వరకూ పని తీరిక లేకపోయింది. హాస్పిటల్ నుంచి ఇంటికి రాగానే అలసినట్లయి పడుకునేది. అలా పడుకున్న సమయాలలో రామమోహనరావు చిలిపి నవ్వులు నవ్వుతూ ఎదురుగా నిలబడినట్లనిపించేది. ఉమా సుందరమ్మ అన్న మాట ఈడు జోడూ చెవులలో గింగురు లెత్తించేది.

ఈడూ జోడుగా కనపడినంత మాత్రాన అలా అనుకోవటమేః ఏం సబబుః

ఒళ్లు జలదరించినట్లవుతూంది. ఆమె అదుపులో పెట్టినా వినిపించుకోకుండా మనసు గంతులు వేస్తున్నది.

సాయంత్రం రాజేశ్వరి హాస్పిటల్ నుంచి వచ్చేసరికి లానులో కూర్చుని ఉన్నాడు రామమోహనరావు. ఆమె చిరునవ్వుతోనే పలకరించి, లోపలికి వెళ్లి ముఖం కడుక్కొని బట్టలు మార్చుకుని వచ్చింది. గోవిందమ్మ కాఫీతీసుకువచ్చింది.

మామూలు కుశల ప్రశ్నలు అయిన తరవాత రామమోహనరావు తన కుర్చీ రాజేశ్వరికి దగ్గరగా లాక్కుంటూ "నేను మొన్న అడిగినదానికి సమాధానం కావాలి. నేను ఇక్కడ ఉండటమనేది కూడా మీ సమాధానం మీద ఆధారపడి ఉంది." చేతి రుమాలు వేలికి చుట్టుకుని గిరగిరా తిప్పటం మొదలు పెట్టాడు.

లజ్జాభారంతో దించిన తలపైకి ఎత్తి అతడి కళ్లలోకి చూసింది రాజేశ్వరి.

"ఆ పద్ధతులేం పనికిరావు. నోటితో చెప్పాలి." చూపులతోనే ఆమెను తలక్రిందులు చేస్తున్నాడు. తనకా పారవశ్యం దేనికిః అతడి చూపులకు అంత ప్రభావం ఉన్నదాః ఆమెకు అంతా అగమ్యగోచరంగా ఉంది.

"నన్ను....నన్ను కొంచెం ఆలోచించుకోనివ్వండి." తడబడుతున్నది ఆమె నాలుక.

"ఇంకా ఆలోచనాః అంత చిన్న ప్రశ్నకు సమాధానం చెప్పటానికి మూడు రోజుల కంటె ఎక్కువ కావాలాః అయితే, అది కాని మాటే, స్పష్టంగా కనపడు తూనే ఉంది. సరే, మంచిదండీ, డాక్టర్‌గారూ, స్నేహితులుగా విడిపోదాం. సెలవు. వస్తాను మరి"లేచి నిలబడ్డాడు చేతులు జోడించి.

రాజేశ్వరికి ప్రాణాలు ఎవరో లాగేస్తున్నట్లనిపించింది. ధైర్యం తెచ్చు

కుంటూ "మీ రడిగిన ప్రశ్న చిన్నది కాదు. చాలా పెద్దది. జీవిత సమస్య. నా కొకవారం టైమివ్వండి." అర్థించినట్లుగా ముఖం పెట్టింది.

"మంచిది. మీ ఇష్టం వచ్చినట్లే కానివ్వండి. అప్పుడయినా నాకు కావల సింది పట్టి సమాధానం కాదు. గట్టిది కావాలి. ఆఁ వింటున్నారా?" ఖండించి నట్లు మాట్లాడాడు.

"మీరు ఎదుటి వాళ్లను శాసించగలరు. మీరన్నట్టు వినకపోతే శిక్షించగలరు."

అతడొక కొంటె చూపు విసిరాడు ఆమె ముఖం లోకి. ఆమె తబ్బిబ్బయి పోయింది.

ఎనిమిది గంటలకు ఇద్దరూ లేచారు. అతడు గేటు దాటే వరకూ చూసి ఆమె లోపలికి వెళ్లి భోజనం చేసి పడక చేరింది.

ఆ మరునాడు లేదు—మూడవ నాడు రాజేశ్వరి డాక్టర్ రమణరావు ఆఫీసు రూములోకి వెళ్లినప్పుడు ఆయన అన్నారు:

"డాక్టర్ రాజేశ్వరీ! ఈ ఉదయం ఒక కేసు వచ్చింది. ఎపెండిసైటిస్ ఏమోనని అనుమానంగా ఉంది. ఇప్పుడు మందిచ్చాను. నొప్పి తగ్గుతున్నది. ఆ నొప్పే మళ్లీ వచ్చేటట్లయితే రేపు ఆపరేషన్ తప్పదు. నాకు మీరు ఎసిస్టు చేయవలసివస్తుంది. సాయంత్రం డ్యూటీకి వచ్చినప్పుడు ఆ కేసు చూడాలి మీరు. పేషెంటు ఎట్లా ఉన్నదీ నాకు రిపోర్టు పంపాలి."

సరేనని తల ఊపింది. సాయంత్రం డ్యూటీలోకి వస్తూనే ఆ పేషెంటు ఎక్కడ అని వెతుక్కుంటూ వెళ్లింది. మంచం దగ్గరికి వెళ్లి చూసి గతుక్కు మన్నది. భయం, ఆదుర్దా పొగలూ సెగలుగా ఆమెను ఆవరించాయి. నిద్ర పోతుంటే లేపటమెందుకని తన వార్డులో పని చూసుకుని మళ్లీ వచ్చింది. డాక్టర్ని చూడగానే రామమోహనరావు పక్కకు తిరుగుతూ నవ్వాడు.

"మీ రిక్కడికి ఎప్పుడొచ్చారు? నొప్పి ఎప్పటినుండి?" ఆదుర్దాగా అడిగింది రాజేశ్వరి.

ఆమె ముఖం వంకే చూస్తూ చెప్పాడు:

"ఇప్పుడు ఎట్లా ఉంది? పగలు నిద్ర పట్టిందా?"

"మందుతోటి నిద్రపట్టింది. నిద్రలోనే నొప్పికూడా తగ్గుతోంది."

డాక్టర్‌గా ఆమె అతడిని పరీక్ష చేసింది. వార్డు బాయ్ చేత మందు తెప్పించి ఇచ్చింది.

"డాక్టర్, నన్ను మందులతో నిద్రపుచ్చకండి. ఆ నొప్పేదో బాగా రానీయండి. ఆపరేషన్ చేసెయ్యండి. బల్లమీదనే చచ్చిపోతాను."

"ఆప్లానంతా మా కొదిలిపెట్టాలి. మీరు నిశ్చింతగా ఉండి మేమేది ఇస్తే అది తీసుకోవాలి. మా చేతుల్లోకి వచ్చిన తరవాత మా ఇష్టమే" అంది తెచ్చిపెట్టుకున్న గాంభీర్యంతో.

"ఎందుకు? నాకు బ్రతుకుమీద తీపి చచ్చిపోయింది. బ్రతికినా చచ్చినట్టే లెక్క." ముఖంమీద నైరాశ్యం పులుముకుంటూ కనుబొమలు చిట్లించాడు.

డాక్టర్‌గా ఆమె అతడికి ధైర్యం చెప్పటానికి ఎన్నెన్నో కబుర్లు చెప్పటం మొదలుపెట్టింది, మంచం దగ్గరగా స్టూలు లాక్కుని. ఆమె ప్రయత్నమంతా అతడికి బ్రతుకులో నైరాశ్యం పోగొట్టాలని. పొద్దుపోయేవరకూ కూర్చుని అతడికి కావలసినవన్నీ తెప్పించి ఇస్తూ కబుర్లతో అతడికి ఉత్సాహం కల్పించటానికి ప్రయత్నించింది.

ఆ మరునాడూ, తరువాత రెండు రోజులూ అతడికి ఆపరేషన్ చేయతగినంత నొప్పి రాలేదు. కాని, డాక్టరు అతడిని హాస్పిటల్‌లోనే ఉంచాడు.

రాజేశ్వరి ఇంటికి వచ్చి భోజనం చేసి పగలంతా హాస్పిటల్‌లోనే ఉండేది. అతడికి ఏదోరకంగా కాలక్షేపం కలిగించేది. అతడు చిన్నపిల్లవాడిలా మందు తీసుకోవటానికీ, పాలు తాగటానికీ మారాము చేసేవాడు. ఆమె పిల్లలను మాటలతో మరిపించినట్టు మరిపించి బ్రతిమిలాడేది.

అయిదు రోజులు హాస్పిటల్‌లో ఉన్న తరవాత డాక్టర్ రమణారావు రామమోహనరావును ఇంటికి వెళ్లవచ్చన్నాడు. ఎప్పుడయినా నొప్పి వస్తే తీసుకోవలసిన మందులు రాసి ఇచ్చాడు.

రాజేశ్వరి చూడటానికి వచ్చేటప్పటికి రామమోహనరావు మంచం మీద కూర్చున్నాడు.

''తల దువ్వుకున్నారు.ఇస్త్రీ బట్టలు వేసుకున్నారు.చాలా హుషారుగా ఉన్నట్టున్నారు ఏమిటి సంగతి?'' నవ్వుతూ మంచం దగ్గరగా నిలబడ్డది,

''డాక్టరుగారు ఇంటికి వెళ్లచ్చు అన్నారు. మీకోసమే ఎదురుచూస్తున్నాను. మీరు రాగానే చెప్పి వెళ్లిపోదామని'' అన్నాడు.

''డాక్టరుగారు ఇంటికి వెళ్లమంటే సంతోషంగా ఉంటారు పేషెంట్లు. మీరిలా చిన్నబుచ్చుకుని కూర్చున్నారేం?'' పెద్ద పెద్ద పూల నైలాను చీరె కట్టుకుని, దాని మీద తెల్ల కోటు వేసుకుంది. కోటు జేబుల్లో చేతులు పెట్టుకుంటూ ఇటూ, అటూ చూస్తున్నది.

''నామటుకు నాకు ఇక్కడ ఉంటేనే సంతోషంగా ఉంది. ఇంటికి వెళ్లటమంటే ఏడుపుగాక ఇంకేముంటుంది?'' ఆమె వైపు వింతగా చూశాడు.

రాజేశ్వరి అదేమీ పట్టించుకోనట్టుగా కాసేపు నిలబడి ''మంచిదండి. నమస్కారం. వస్తాను'' అని రోగుల మంచాలమధ్యగా నడుస్తూవెళ్లిపోయింది, ఇంక ఒక్క నిమిషం ఎక్కువ నిలబడితే అతడి మాటలు శ్రుతి మించుతాయని.

మూడు నాలుగు రోజుల వరకూ రాజేశ్వరికి సాయంత్రం వేళ విజిటర్సు ఎవరూ లేరు. ఆమె ఒక రోజు ఉమాసుందరమ్మను చూసి ఒక గంటకాలం గడిపి వచ్చింది.

కుటుంబ నియంత్రణకు సంబంధించిన నాలుగు ఆపరేషన్లుచేసి, రెండు కష్టమయిన కాన్పులుచేసి ఇంటికి వచ్చింది రాజేశ్వరి. ఆ నాడు శనివారం. ఆనాడు వెంకటేశ్వర స్వామిని తలుచుకుంటూ గడపటం చిన్నప్పటినుంచీ అలవాటు. డాక్టరయిన తరవాత తీరుబడిలేక సాయంత్రంవేళ ఒక అయిదు నిమిషాలు స్వామి స్తోత్రాలు మననం చేసుకుంటుంది ఆమె స్తోత్రం పఠించి, పత్రిక చూసుకుని ఇక లోపలికి వెళ్ళాలనుకుని లేవబోతుండగా రామమోహనరావు వచ్చాడు,

''ఎలా ఉంది మీ ఒంట్లో?'' అంటూ కూర్చోవడానికి కుర్చీ చూపించింది.

"హాస్పిటల్‌లో ఉన్నన్నాళ్లూ బాగా చూశారు, జీవితం మీద ఆశలు కల్పించారు కోరికలు రేకెత్తించారు. కొండమీద నుంచి ఒక్కసారి తోసినట్టుగా ఇంటికి తోలేశారు. ఇంక ఆ పేషెంట్లు ఎట్లా ఉంటే మీకేం?" మందహాసం చేశాడు.

"డాక్టర్లు హాస్పిటల్లో బాగా చూస్తారు ఇంటికి రమ్మని పిలిస్తే కూడా వస్తారు. ఇందులో మా తప్పేమిటో చూపించండి" నవ్వుతూ సమాధానమిచ్చింది.

"అలాగా!" దీర్ఘం తీసి ఆమె ముఖంలోకి చూస్తూ. "నా విజ్ఞప్తి ఏమయింది?" అన్నాడు, ఆచూపులో ఆమెను పరవశింప జేయాలన్న భావం స్పష్టంగా కనపడేటట్లుగా ముఖం పెట్టి.

"నేను వారమన్నాను కదా. అందులో అయిదు రోజులు నేను ఆ విషయాన్ని గురించి ఆలోచించనే లేదు. ఆ అయిదు రోజులూ పగలంతా మీ సమక్షంలోనే ఉన్నాను కదా. రాత్రిళ్ళు అలిసిపోయినట్లయి నిద్రపోయేదాన్ని." చేతివేళ్ళను సవరించుకుంటూ అన్నది.

"అయితే, మరెప్పుడు నాకు జవాబు?"

"రేపు."

"అంటే, గోడమీద రాసిపెట్టిన రేపు వంటిది కాదుకదా?"

"అబ్బెబ్బె. నిజంగా రేపు నా జవాబు విందురు గాని."

'ఓ కే' అంటూ పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయాడు. రామమోహనరావు, వెనక్కు తిరిగి చూస్తూ.

రామమోహనరావుతో అతడు హాస్పిటల్లో ఉన్న అయిదు రోజులూ పెళ్ళి విషయం ఆలోచించలేదన్నది కాని, నిజానికి ఆమెకు ఆ అయిదు రోజులూ నిద్ర పట్టలేదు. ఆమె మనసుకు వెన్నెలలేదు, వెలుగులేదు. చిమ్మ చీకట్లు ఆవరించుకున్నట్లు బాధపడ్డది. అతడు తేరుకుని నవ్వుముఖం పెట్టినప్పుడు ఆమె ముఖం సంతోషంతో వెలిగిపోయింది. మనసెంతో తేలిక అయింది. తీగెలు సాగే తీయటి భావాలతో ఆ రాత్రి హాయిగా నిద్రపోయింది.

మరునాడు సాయంత్రం అయిదు గంటల తరవాత రామమోహన్‌రావు వస్తాడని మంచి టిఫిన్ చేయించింది. చిక్కటి కాఫీ తయారు చేయించింది. లాన్‌లో కుర్చీలు వేయించుకుని పత్రికలు చేత పట్టుకుని కూర్చుంది.

ఆరు ఏడు గంటలయే సరికి ఆమెకు ఒక విధమయిన అనుమానం కలిగింది. తను అన్న 'రేపు' మీద అతడికి నమ్మకం కలగలేదేమో? అయినా, రేపు అని ఎందుకనాలి తను? మనసులో ఉన్న మాట చెప్పలేకపోయిందా? తనెంత తెలివితక్కువది?

అవును, చెప్పలేకపోయింది. మనసు నిండా ఆవరించుకుపోయిన తియ్యటి భావాలే తనను నోరు మెదపనివ్వలేదు. వాటితోనే తను ఉక్కిరిబిక్కిరి అయిపోయింది. కళ్ళనిండా అతడిని చూడలేకపోయింది. అది తన బలహీనతా? ఏమో మరి?

ఈవేళ నిన్నటి వలె కాదు. నవ్వుతూ అతడికి సమాధానమిచ్చి సంతోష పెట్టాలి. తనలో ఉన్న జంకుమ తోసిపుచ్చాలి. తనకే నవ్వు వస్తూంది. ఇంత చదువూ చదివి, ఇన్నాళ్ళనుంచీ ఉద్యోగం చేస్తూ ఆ జంకేమిటి తనకు? తను పిరికిదా? కాదు కాని, ఏమిటో మరి!

"ఏదో దీర్ఘాలోచనలో ఉన్నారే డాక్టర్‌గారు? నేమ వచ్చి అయిదు నిమిషాలయినా ముఖమెత్తి చూడలేదు." కుర్చీ లాక్కుని కూర్చున్నాడు.

రెండు నిమిషాల మౌనం ఇద్దరి మధ్యా సంచరించింది.

"మీరు ఈవేళ కూర్చోమని కుర్చీ కూడా చూపించరని నాకు నేనే ఆహ్వానించుకుని కూర్చున్నాను." నవ్వాడు.

ఆమె ఒకసారి అతడి కళ్ళలోకి చూసి నవ్వింది. ఆ నవ్వుతో అతడికి కొంచెం ధైర్యం వచ్చింది. కొంతసేపు ఏదో కబుర్లలోకి దింపాడు ఆమెను. తను హాకీ, క్రికెట్ ఆటగాడట. ఇతర ఊళ్ళకు కూడా వెళ్ళి మాచెస్ గెలిచివస్తూ ఉండేవాడట. తనకు ఇంజనీరింగ్ కాలేజీలో సీటు మంచి ఆటగాడనే ఇచ్చారట. ఉద్యోగభారంవల్ల ఆటలన్నీ అడుగున పడిపోతున్నాయట. అలా చెప్పుకుంటూ పోతున్నాడు.

"ఆఁ డాక్టర్‌గారూ! నన్ను సెలవు తీసుకోమన్నారా?" గాంభీర్యాన్ని వటిస్తూ, నవ్వును అణిచిపెట్టుకుంటూ అడిగాడు.

ఉలిక్కిపడ్డది రాజేశ్వరి ఆ మాటతో.

"ఉండండి, అప్పుడే వెళతారా? మీ కోసం స్పెషల్‌గా చేయించిన కాఫీ టిఫిన్ తీసుకుని వెళ్లుదురుగాని. లోపలికి వెళదాం, రండి." లోపలికి తీసుకు వెళ్లింది.

డైనింగ్ టేబుల్ మీద సర్వమూ సిద్ధం చేయబడి ఉన్నాయి. సమోసాలు, బాసందీ, పెరుగు వడ—ప్లేట్లో అన్నీ సర్ది అతడి ముందు పెట్టింది.

"తీసుకోండి." అతడు కూర్చున్న తరవాత తను కూడా కూర్చుని ప్లేటు ముందుకు లాక్కుంది.

"అబ్బబ్బ! ఇన్ని డిషెస్పే! ఇవన్నీ నా కోసమే! ఇవన్నీ పెట్టి సాగనంపు తారు కాబోలు. ఎల్లకాలం ఇదంతా జ్ఞాపకముంచుకొమ్మనా? డాక్టర్‌గారు ఎట్లా వయినా గట్టివారే?"

రాజేశ్వరి రాత్రినుంచీ తను చెప్పదలుచుకున్న మాటలు మననం చేసు కుంటున్నది. ఐంతు పోగొట్టుకుని ధైర్యం తెచ్చుకుంటున్నది. కాని, అతడినీ, అతడి మాటలనూ చూడగానే మళ్లీ అరికాళ్లు చెమటపడుతున్నాయి. నోట్లో నుంచి మాట పైకి రావడంలేదు.

అతడు ఆమె మనసులోని భావాలను ఒక కంట కనిపెడుతూ ఉపాహారా లన్నీ పూర్తి చేశాడు.

కప్పులో కాఫీ నింపి రాజేశ్వరి అతడి ముందు పెట్టింది.

"తీసుకోండి. ఆలోచిస్తున్నారేం? చల్లగా ఉందేమిటి? వేడిది తెప్పించ మంటారా?" అడిగింది రాజేశ్వరి.

"ఈ వేడి చాలు. ఈ కాఫీ కూడా తాగేసిన తరవాత ఇక వెళ్లవలసిందే గదా? అందుకని నిదానంగా ఒక్కొక్క చుక్క తాగుదా మనుకుంటున్నాను."

ఆమె ఆ మాటకు నవ్వింది ఫక్కున. తాను తాగుతున్న కాఫీ కొంత చీరె మీద ఒలికింది. అతడిని క్రీగంట చూస్తూ తువాలుతో తుడుచుకుంది. అతడు తననే చూస్తున్నాడని గ్రహించి తల వంచుకుంది.

"ఆ. నేను వద్దనుకుంటూనే గటగట కాఫీ తాగేశాను." అతడొక కొంటె చూపు విసిరాడు ఆమె మీదికి.

ఆమె చలించిపోయింది. "అబ్బబ్బ! అలా చూడకండి నా వైపు. నేను భరించలేను" మాట పైకి పెగల్లేదు. ఆమె తన్మయత్వంలో మెలికలు తిరిగి పోయింది.

"చెప్పండి, నాకు ఆలస్యమయిపోతున్నది." గుసగుసలాడినట్టు ఆమె చెవి దగ్గరగా ఊదాడు.

"మీకు వచ్చే జవాబే గట్టి జవాబు. ఇప్పుడు తృప్తి అయిందా?" ఒకసారి ముఖమెత్తి అతడి కళ్లల్లోకి చూసింది.

అతడు ఎగిరి గంతు వేశాడు. "థాంక్యూ, థాంక్యూ, ఇంత తియ్యటి సమాధానానికి నేనేం బహుమతి ఇవ్వాలి?" దగ్గరగా వచ్చాడు, రెండు చేతులూ చాపుతూ.

ఆమె వెనక్కు అడుగువేసి అతడి చెయ్యి అందుకుని ఊపింది. వ్యక్తపరచ లేని ఆనందంతో ఇద్దరూ లానులో ఉన్న కుర్చీల దగ్గరికి వచ్చారు రాత్రి ఎనిమిది గంటల వరకూ ఇద్దరి మధ్యా ఎన్నో కబుర్లు దొర్లిపోయాయి. చివరకు అతడు మరో రెండు నెలలు సెలవు పెట్టటానికీ, రాజేశ్వరి నాలుగు రోజులు సెలవు పెట్టటానికీ నిశ్చయం చేసుకున్నారు. ఆ మరునాడు తిరుపతి కొండమీద వేంకటేశ్వరస్వామి సాక్షిగా మంత్రయుక్తంగా వివాహం చేసుకోవటానికి రాజేశ్వరి అతడిని ఒప్పించింది.

"ఒక చిన్న సలహా. పెళ్లి కాగానే ఇక్కడికే వచ్చేయాలి. హనీమూన్ అనీ, అదనీ ఇదనీ అటూ. ఇటూ వెళ్లటం నాకు నచ్చదు" అన్నాడు. బుంగ మూతి పెట్టిన చిన్న పిల్లవాడిలా.

అతడలా మూతి పెట్టి గునుస్తూంటే ఆమె కెంతో ముచ్చటయింది. "అలాగే నాకు మాత్రం అనవసరంగా సెలవు పెట్టడం ఇష్టమా?" అన్నది మురిపెంగా

ఆ రాత్రికి అతడు అక్కడే భోజనం చేశాడు. రేపటి రోజును గురించి ఎన్నెన్నో పథకాలు వేశారు. ఉబికి ఉబికి పైకి వస్తున్న భావాల నెన్నిటినో మనసు లోనే అణుచుకుని అయిష్టంతో అతడికి వీడ్కోలిచ్చిం దామె.

తిరుపతి కొండమీద ఇద్దరికి శాస్త్రయుక్తంగా వివాహం జరిగిపోయింది. స్వామి దర్శనం చేసుకున్నారు. కానుకలు చెల్లించుకున్నారు. తీపి పదార్థాలతో భోజనంచేసి తిరుగు ప్రయాణమయ్యారు.

రాజేశ్వరి పెళ్లి నిశ్చయమైనప్పటి నుంచీ తల్లి తండ్రులను తలుచుకుంటూనే ఉంది. తన ఎన్నిక చూసి వాళ్లెంత సంతోషపడేవాళ్లో? ఆలస్యంగా పెళ్లిళ్లు చేసు కునే వారికి అన్నీ కలిసిరావని తల్లి అన్న దొకసారి. తండ్రి చనిపోయే ముందర తన కిష్టమయితే చదువు తక్కువగా ఉన్నా సరే చేసుకోమన్నాడు. అలా కాకుండా చదువూ. సంస్కారమూ. నాగరికతా, వాటికి తగ్గట్టుగా అందమూ, హోదా కలవాడు దొరికాడా లేదా? వాళ్లే ఇప్పుడు బ్రతికి ఉంటే తన నెంత మెచ్చుకునే వాళ్లో? వాళ్లు ఉంటే సంతోషించే వాళ్లు కదా అన్న తృప్తే ఇప్పుడు తనకు మిగిలింది.

తిరిగి రాగానే పెద్ద డాక్టరన్నాడు-"ఎవరికీ తెలియకుండా పెళ్లి చేసుకుంటే సరిపోయిందనుకున్నారా? మాకు పార్టీ కావాలి" అంటూ.

ఇంటికి వచ్చి రామమోహనరావును——"పార్టీ అంటున్నారు డాక్టర్. ఇద్దామా?" అని అడిగింది.

"ఈ ఆడంబరాలు ఏమిటి?" ముఖం తిప్పుకున్నాడు.

"అందరూ సంతోషంతో అడుగుతున్నప్పుడు మనం వాళ్లను చిన్న బుచ్చ కూడదు." బ్రతిమిలాడి ఒప్పించింది.

పార్టీకి హాస్పిటల్ స్టాఫంతా వచ్చింది. ఛైర్మన్‌గారితో పాటు ఒకరిద్దరు ఊరి పెద్దలు వచ్చారు.

డాక్టర్ రాజేశ్వర్, రామమోహనరావుల జంటను చూసి అందరూ ముచ్చట పడ్డారు. సుఖ సంతోషాలతో దీర్ఘ వైవాహిక జీవితాన్ని అంతా ఆకాంక్షించారు. ఆ మరునాడు ప్రత్యేకంగా ఉమాసుందరమ్మను ఆహ్వానించింది రాజేశ్వరి. ఆమె రాజేశ్వరికి కొత్త చీరె కట్టబెట్టి దణ్ణం పెట్టించుకున్నది.

డాక్టరుగా రాజేశ్వరి హాస్పిటల్ డ్యూటీ ఎప్పటి మాదిరిగా చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నది. అప్పుడప్పుడు అతడు ఇంట్లో ఒంటరిగా ఉంటున్నాడే అన్న తలంపు వచ్చి బాధిస్తూ ఉంటుంది. మధుర స్మృతులేవో ముసురుకుంటూఉంటాయి. వెంటనే ఉలికిపాటుతో ప్రస్తుత కర్తవ్యనిర్వహణకు పూనుకుంటుంది.

ఆమె కొక నూతన జవమూ, జీవమూ కలిగినట్లనిపిస్తూంది.

డ్యూటీ నుంచి ఇంటికి రాగానే నవ్వుతూ. తుళ్లుతూ భోజనాలు ముగిస్తారు. ఒక గంట మధ్య విశ్రాంతి. తరవాత ఒక కప్పు వేడి వేడి టీ తాగి వెళ్లలేక వెళ్లలేక హాస్పిటల్‌కు వెళ్లి ఇంటికి వస్తుంది. కొత్త జంట లానులో కూర్చుని కబుర్లాడుకుంటారు.

"మిమ్మల్ని చూసినప్పటి నుంచీ నేనో మాట అడగాలనుకుంటున్నాను. మీ కేమయినా మొక్కా? పెళ్లయినతరవాతనయినా మొక్కు చెల్లించుకోకూడదా?"

"మొక్కేమిటి?" అడిగా డతను అర్థంకాక.

"అదే — అదే— ఆ గడ్డం మాట! చూస్తే అన్యమతస్థుడనిపించేటట్టు." నవ్వింది.

"ఓ అదా?" పగలబడి నవ్వాడతడు. "గడ్డానికీ, మతానికీ ఈ రోజుల్లో సంబంధంలేదు. ఇది ఈ నాటి ఫాషన్. నీ కేమయినా అభ్యంతరమా? 'చెప్పు'" అన్నాడు కొంటెగా నవ్వుతూ.

తలవంచుకుంటూ "నాకే మభ్యంతరం?" అన్నది.

అతడు గర్వంగా గడ్డం సవరించుకుంటూ నవ్వాడు.

"సరే.... అది పోనీయండి. మనం ఫోటో తీయించుకోవాలి తిరుపతిలో వీలయింది కాదు. ఈ వేళ మా హాస్పిటల్‌కు ఒక మంచి ఫోటోగ్రాఫర్ వచ్చాడు. రేపు మనింటికి రమ్మన్నాను" అన్నది సంబరపడుతూ.

హేళనగా నవ్వారు. "ఫొటో ఎందుకూ? ఎదురుగా మొద్దంత మనిషిని నే నుండగా?"

"అదొక సరదా. మన ఇద్దరి ఫోటోలు ఫ్రేములో పెట్టి బల్లమీద పెట్టుకో వాలి. ఇది నా కోరిక. ఇదయినా మీరు మన్నించకూడదా?" గునిసింది.

"పోనీలే, నీ సరదా నే నెందుకు పాడుచెయ్యాలి. నీ మాట కాదని విన్నెందుకు చిన్నబుచ్చాలి", ఒప్పుకున్నాడు.

ఫోటో తయారయిన తరవాత ఫ్రేములో బిగించి ఆమె తన బల్ల మీద పెట్టటమూ. ఆమె లేనప్పుడు ఆతడు దానిని తీసి పుస్తకాల చాటున పెట్టటమూ రోజూ జరుగుతూంది

"అయ్యో. మన ఫోటో! మన ఫోటో!" అంటూ రాజేశ్వరి హాస్పిటల్ నుంచి వచ్చిన తరవాత ఆదుర్దాతో వెతికి బయటికి తీసి కొంగుతో తుడిచి,ఒకసారి కళ్లారా చూసుకుని బల్లమీద పెట్టుకుంటుంది.

ఆతడు మనసులో నవ్వుకుంటాడు.

"అబ్బ, మీలో ఎంత చిలిపితనం ఉంది?" అంటుంది అప్పుడప్పుడు రాజేశ్వరి.

"నే నో మాట చెప్పనా? పెళ్లయేవరకూ భర్తకు భార్య మీద మోజూ, ప్రేమా నట. పెళ్లయిన తరవాత భార్యకు భర్త మీద మోజు, ప్రేమా నట! ఎంత నిజం చెప్పండి?" అన్నది గడియారమున్న అతడి చేతిని ఆడిస్తూ.

"నేనూ ఓ మాట చెప్పనా? ఈ కవులకూ, రచయితలకూ జీవితాలు సరిగా సాగక అక్షరాలతోనూ, సూక్తులతోనూ సంతోషిద్దామని ఏమిటేమిటో అంటారు. వాటిని పట్టుకుని తమ నిజ జీవితాలు అట్లా లేవని నీవంటి వాళ్లు బాధ పడతారు." ప్రొఫెసర్ ఫోజు పెట్టాడు.

"అసలు మీ కెవరిమీదనయినా గౌరవమూ, భక్తీ ఉన్నాయా?" నవ్వు తుంది రాజేశ్వరి.

సమాధానంగా ఆతడొక చిలిపి నవ్వు నవ్వుతాడు.

"అన్నట్టు, మీ సెలవు అయిపోతున్నట్టుంది." బరువుగా నిట్టూర్చింది.

"ఇప్పుడా జ్ఞాపకం చెయ్యటం? మన పెళ్ళయి నాలుగు నెలలయింది. రెండు నెలల సెలవుకాగానే ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాను. మనఛైర్మన్‌గారిని సంప్రతించి గవర్నమెంటు కాంట్రాక్టులు సంపాదిస్తున్నాను." తన ఘనకార్యాన్ని గురించి గర్వంగా చెప్పాడు.

"అయితే. ఇంత మంచి కబురు నాకు చెప్పకుండా దాచారు కదూ? సెల వయిందంటూ ఎక్కడ ప్రయాణ మవుతారోనని ఏ రోజు కారోజు హడిలిపోతు న్నాను." నిష్ఠూరమాడింది.

"ప్రతి విషయానికీ సమయమూ సందర్భమూ రావాలి, రాజీ! నేను పెట్ట వలసింది పోయి నీవు తెచ్చి పెడుతుంటే తినటానికి నే నెంత బాధపడుతున్నానో గమనించావా?" ఆమె కొంగు పట్టుకొని లాగుతూ, "ముందే చెబితే అందులో విశేషం ఏముంటుంది?" అన్నాడు.

ఆమె మనసులో సంతోషం గంతులు వేసింది. గుండె పల్టీలు కొట్టింది.

"మరి మీ సామాను? ఆ ఊరి నుంచి తెచ్చుకోవద్దూ? అద్దెకున్న ఇల్లు ఖాళీచేసి ఆ సామానేదో తీసుకురండి." ఇల్లాలుగా బాధ్యతలు గుర్తు చేసింది. రాజేశ్వరి.

"మొన్నటివరకూ బ్రహ్మచారిగాణ్ణి. నాకేం సామానుంటుంది? అక్కడి నుంచి వచ్చేటప్పుడే నాకు ఉన్న కాంప్ కాట్, ఒక స్టౌ నౌకరు కిచ్చేసి ఇల్లు ఖాళీ చేశాను. సరేనా? అప్పుడు ఇల్లాలుంటే ఇంటెడు సామానుండేది, కాని, లేదుగా?" నవ్వాడు.

ఆ నాడు హాస్పిటల్‌లో రాజేశ్వరికి పని ఎక్కువగా ఉంది. రెండుసార్లు కాఫీ తెప్పించుకుని తాగింది. ఏమిటో ఈ మధ్య నీరసంగా ఉంటూంది. కళ్లు తిరిగి నట్లవుతున్నది. ఇంటికి వెళ్లి ఫాన్ వేసుకుని మంచం మీద ఎప్పుడుపడుకుందామా అనిపిస్తూంది. కాని, డ్యూటీ అంటే డ్యూటీయే. ఈ పేళ అంతా ఇట్లాగే ఉంటే ఓ పది రోజులు సెలవు పెట్టాలి. రామమోహనరావు ఎందుకని అడుగుతాడేమో?

అడిగిన వెంటనే కాకుండా కాస్త ఊరించి, పస్పెన్సులో పెట్టి, నాలుగుసార్లు 'ప్లీజ్, చెప్పవూ?' అని అడిగించుకుని మరీ చెప్పాలి శుభవార్త.

ఆఫీసు గదిలో కుర్చీ మీద కూర్చుని బల్లమీద తల వాల్చి ఆయాకోసం గంట కొట్టింది. అయిదు నిమిషాల సేపు ఆగి మళ్లీ గంట కొట్టింది. కాని, ఆయా రాలేదు.

విసుగుతో కనుబొమలు ముడుచుకున్నది. తొందరగా ఇంటికి వెళ్లాలి. కప్పు కాఫీ మరొకటి తెప్పించుకుని తాగకపోతే ఇక్కడినుంచి అక్కడికి కూడా నడవలేదు.

మరొకసారి గంట కొట్టింది. ఆయాకోసం దర్వాజా వైపే చూస్తున్నది. వరాండాలో బూట్ల చప్పుడు వినిపించింది. ఆతృతగా తల ఎత్తి కిటికీగుండా చూసింది. ఇద్దరు పోలీసు ఆఫీసర్లు చేతికర్ర లూపుకుంటూ లోపలికి వస్తున్నారు.

వాళ్లను చూడగానే రాజేశ్వరికి మరింత నీరసం వచ్చింది. ఏదో పోలీసు కేసు ఉంది. కాబోలు వీళ్లడిగే ప్రశ్నలన్నింటికి జవాబు లిచ్చేటప్పటికి తలప్రాణం తోకకు వస్తుంది. ఎంత ఆలస్యం చేస్తారో? తన ప్రాణం అప్పటివరకు ఉంటుందా?

కూర్చోమని రెండు కుర్చీలు చూపించింది మర్యాదగా. సంగతేమిటో వాళ్లే బయట పెట్టాలని ఎదురుచూస్తున్నది.

"డాక్టర్! మమ్మల్ని క్షమించాలి. మేము పోలీసువాళ్లం. మే మెప్పుడూ అందరినీ బాధించటానికే వస్తాం. మా ఉద్యోగాలే అటువంటివి" అన్నాడొక ఆఫీసరు క్షమాపణ నర్థిస్తూ.

"ఉద్యోగ ధర్మం మరి. మేమూ అంతే. అందరినీ సూదులతో గుచ్చు తాము. చేదుమందు లిస్తాము. కత్తిపెట్టి కోస్తాము. మేమయినా, మీరయినా—అందరి మంచికోసమే కదా చేసేది?" వాళ్లు వచ్చిన పనేమిటో త్వరగా చెప్ప మన్నట్లు చూసింది.

"సారీ, డాక్టర్! మేము ఒక అపరాధికోసం రెండేళ్ల నుంచీ తిరుగు తున్నాం. అతడు ఒకచోట ఒక అమ్మాయిని పెళ్లి చేసుకుని నెలరోజుల తరువాత

ఆమె నగలన్నీ తీసుకుని పారిపోయాడు. ఇంకొకచోట ఒక ప్రైవేస్టును పెళ్లి చేసుకుని ఆరు నెలలు కాపరంచేసి, ఆమె దాచుకున్న వెయ్యి రూపాయలు తీసుకుని పరారీ అయ్యాడు. ఒక పల్లెటూళ్లో సర్పంచ్ ఇంట్లో అతిథిగా ఉండి, చాలా మర్యాదగా మెలుగుతూ పదిహేను వందల రూపాయలతో రాత్రికి రాత్రి పారి పోయాడు. ఏడాది క్రిందట నాగార్జున సాగర్ ప్రాజెక్టులో పనిచేస్తున్న ఇంజనీరు ఇంట్లో ఏడువేల రూపాయలు....పిల్ల పెళ్లికి కట్న మివ్వాలని....దాచుకున్నారట. ఆయన భార్యను మంచానికి కట్టేసి సొమ్ము తీసుకుని పారిపోయాడు. అతడు ఇప్పుడీ ఊళ్లో ఉన్నాడని తెలిసి పట్టుకోవటానికి వచ్చాం" అన్నాడు.

"దొంగ ఒక మనిషే కదండీ....ఈ రోజుల్లో ప్రతి మనిషీ టెరిలీన్‌బట్టలు వేసుకుంటున్నారు. అందులో దొంగలెవరో, పెద్ద మనుష లెవరో ఎలా తెలుసు కోవటం?'' అన్నది. ఆయన చెప్పిన కథ ఎంత పెద్దదో అనుకుంటూ.

''ఆఁ అదే నేను చెప్పవచ్చింది కూడా. చూడండి అతడి ఫోటో." జేబులో నుంచి తీసి ఆమె చేతి కిచ్చాడు.

పోలీసు ఆఫీసరు ఆ ఫోటో తీసుకుని కలంతో గడ్డమూ, సైడ్ లాక్స్ దిద్ది, "ఇప్పుడు గుర్తు పడతారా?" అంటూ ఆమె ముందుకు నెట్టాడు ఫోటోను.

దాన్ని చూస్తూనే కెవ్వున కేకపెట్టబోయి పెదవుల మీద చెయ్యి పెట్టి నొక్కుకుంది.

"సారీ, డాక్టర్! మా బాధ్యతేమిటో ముందే చెప్పాముగా. అతడిని మీ ఇంట్లో ఉండగా బంధించాం. నమస్తే" అంటూ లేచి రెండడుగులు వేసి. అంతలోనే వెనక్కు తిరిగి....''మీరు అతడితో ఏమయినా మాట్లాడాలంటే మాట్లాడవచ్చు. గేటు దగ్గర పోలీసు కస్టడీలో ఉన్నాడు'' అన్నాడు.

కళ్లు మూసుకుని తల అడ్డంగా తిప్పింది. వాళ్లిద్దరూ వెళ్లిపోతున్నట్టుగా బూట్ల శబ్దము వినబడుతున్నది.

రాజేశ్వరికి భూమి గిర్రున తిరుగుతున్నట్టుగా ఉంది. గుండె గబగబ కొట్టు కుంటున్నది. తనెంత మోసపోయింది? ఇంతకాలమూ పెళ్లి చేసుకోకుండా ఉండి

ఉండి ఎటువంటి వాడి సాహచర్యాన్ని అనుభవించింది? ఎన్నో చోట్ల స్త్రీలశీలాన్ని ధనాన్ని అపహరించిన తుచ్ఛుడా అతడు?

కళ్లు గట్టిగా మూసుకుంది. కన్నీరు జలాజలా చెంపల మీదుగా రాలింది.

బాగ్ తెరచి దానిలో భద్రపరుచుకున్న రామమోహనరావు ఫోటో చేతిలోకి తీసుకుంది. నవ్వులొలికిస్తూ చిలిపిగా చూసే కళ్లు ఆమెను కవ్విస్తున్నాయి. ఆ కళ్లే అతడు పరిచయమైనప్పటి నుండి రాత్రింబవళ్లు ఆమెను వెంటాడాయి. ఆ కళ్లే ఆమెలోని స్త్రీత్వాన్ని మేలుకొలిపాయి. ఆ కళ్లే ఆమె హృదయ కవాటాన్ని తెరిపించాయి. ఆ కళ్లే ఆమెలో నవ చైతన్యాన్ని నింపాయి. అవే ఆమెను వివాహానికి ఒప్పించాయి.

''రామ్, నీ వపరాధివా? కాదు....నా జీవన సహచరుడివి కదూ? పోలీసులు పొరబడుతున్నారని చెప్పు, రామ్. నన్నొక్కదాన్ని వదిలిపెట్టి వెళ్లిపోతావా వాళ్లతో?'' ఆమె గుండె ఎగిసెగిసి పడుతున్నది. ఫోటోను పెదవుల కానించు కుంటూ బరువుగా నిట్టూర్చింది.

''రామ్ నీ వెక్కడికి వెళతావు? ఎక్కడికి వెళ్లగలవు? నీవు నా బందీవి. నా మనసులోనుంచి పోలేవు.''

ఆదుర్దా ఆమెను కూర్చోనివ్వటంలేదు. నిలబడనివ్వటంలేదు. తనకిప్పుడు మూడవ నెల. రామ్ ప్రతిరూపం తన కడుపులో పెరుగుతూంది. తన బిడ్డ....తన ప్రియతముడయిన రామ్ ప్రతి రూపం....అపరాధి బిడ్డ అని అనిపించుకుంటుందా? కాదు, కాదు. పొరపాటు ఎక్కడో జరిగింది. బిడ్డ మాత్రం తన ప్రాణాధికుడయిన రామ్ బిడ్డ. హృదయం ఘోష పెడుతున్నది

చటుక్కున లేచి వెంటనే కుర్చీలో చతికిలబడిపోయింది. తనింక ఆ ఊళ్లో తల ఎత్తుకు తిరగగలదా? ఆ ఊరివాళ్లకు తన ముఖం చూపించగలదా? నలుగురూ నాలుగు మాటలు మాట్లాడితే తాను భరించగలదా?

దీర్ఘంగా ఆలోచించి పెద్ద డాక్టర్‌కి ఉత్తరం రాసి బల్లమీదే పెట్టింది. తనకొక నెల రోజులు సెలవు కావాలంటూ. సామాను సర్దుకుని గుంటూరు వెళ్లమని గోవిందమ్మకు కబురు పంపించింది. తను గబగబా నడిచి బస్సు స్టాండుకు వెళ్లింది. రెండు బస్సులు మారితేగాని, తను తిరుపతి చేరలేదు.

కొండమీదికి వెళ్లి, 'స్వామీ! నీ సమక్షంలో నీవు సాక్షిగా జరిగిన పెళ్లి పవిత్రమయిందనుకుంటే మోసపుచ్చుతావా?' అని అడగాలని డాక్టర్ రాజేశ్వరి ఆత్రపడిపోయింది.

దారి పొడుగునా రామమోహనరావు నవ్వు ముఖం. చిలిపికళ్లు ఆమెను వెంటాడుతూనే ఉన్నాయి.

'రామ్! నిన్ను మరిచిపోలేను. నీ కొరకు ఎంతకాలమయినా నిరీక్షిస్తాను.' రామమోహనరావు ఫోటో ఉన్న బాగ్‌ను గుండెకు బలంగా హత్తుకుంది.

ఆమె వెంకటేశ్వరస్వామితో తన గోడు అంతా వెళ్లబోసుకుంది. తన కర్తవ్యమేమిటో చెప్పమని ప్రతిరోజూ స్వామిని దర్శించుకుంటున్నది.

ఒకనాటి ఉదయం స్వామి తన నాదేశించినట్టుగా విదేశాలకు వెళ్లటానికి ఏర్పాట్లకుగాను తిరపతినుంచి బయలుదేరింది డాక్టర్ రాజేశ్వరి.

(ఆంధ్రప్రభ)



# ఊహకందని నిజాలు

శివకామమ్మ ఆఫీసునుంచి వచ్చిన కొడుకును చూసి "ఏరా! ఎక్కడినుండి వస్తున్నావు?" అంటూ కాఫీ గ్లాసు చేతికిచ్చింది.

"ఎక్కడినుంచేమిటి? ఆఫీసునుంచి" తన గదిలోకి విసురుగా వెళ్ళాడు.

శివకామమ్మ అతడిని వెన్నంటి గదిలోకి వెళ్తూ "అయితే హాస్పిటల్‌కు ఇప్పుడు వెళ్తావా?" అడిగింది

"ఇప్పుడెందుకమ్మా? రేపు వెళ్ళచ్చులే" కొద్దిగా విసుగు ధ్వనించింది. అతడి కంఠంలో.

"అదేమిటి? నిన్ననగా సరళనక్కడ చేర్పిస్తిమి. మనం వెళ్ళి కనుక్కోవద్దూ ఏం జరిగిందో? ఎట్లా ఉందో?" ఆదుర్దాతో ఆమె కళ్లు పెద్దవి చేసింది.

"ఆఫీసునుంచి టెలిఫోను చేశాను. పురుడు ఇంకా రాలేదని డాక్టరు చెప్పింది అందుకని........"

"పసిపిల్లకు తల్లిని చూపించకపోతే బెంగ పెట్టుకుంటుంది. పురుడు రాకపోతే వెళ్లి చూసి రాకూడదా? పిల్లను చూడకపోతే సరళ కూడా బాధపడుతుంది. నీవు వెళ్ళకపోతే శాంతిని పంపిస్తాను"

"శాంతి ఎందుకులే నేనే వెళ్తాను. పాపకు బట్టలు వేసి తయారుచెయ్యి. నేను కాళ్ళూచేతులు కడుక్కొని వస్తాను" రంగారావు అయిదు నిమిషాల్లో బట్టలు మార్చుకుని పాపను తీసుకుని బయలుదేరాడు.

పాపను చూడగానే సరళ దిగ్గునలేచి కూర్చుంది. రెండు చేతులతో అందుకుని గుండెకు హత్తుకుంది. పిల్లను తొడమీద కూర్చోబెట్టుకుని ఇంటి కబుర్లన్నీ అడిగింది.

"ఇవాళ ఇక్కడ ఓ తమాషా జరిగింది." అన్నది సరళ నవ్వుతూ.

"నీవు తమాషాలు చూడటానికే వచ్చావా చాలా తీరికగా?" నవ్వాడు రంగారావు.

"రెస్టుకోసం వచ్చినట్టే ఉంది. ఆ మూల బెడ్‌మీద ఉన్న ఆవిడకు ఇదివరకే ఇద్దరు ఆడపిల్లలు ఉన్నారట. ఈసారి మొగపిల్లవాడు పుడతాడని క్రిందటిసారి ఆపరేషన్ చేయించుకోలేదట. ఈసారి కూడా ఆడపిల్లే పుట్టింది. ఆపరేషన్ చేయించుకొమ్మని ఆయన-వద్దని ఆవిడ ఇద్దరూ ఘర్షణపడ్డారు. 'ఇంక నాకు జీతం చాలదో' అని ఆయన బాధ. 'నాకు కొడుకు కావా'లని ఆమె గొడవ. ఇద్దరి మధ్య డాక్టరు వచ్చి తీర్పు చెప్పింది. బాలెంత ముఖం ముడిచింది. డాక్టరు ఆమెకు ఆపరేషన్ చేసింది."

"మరి నీవేం చేస్తావు?" రంగారావు ఆ హాల్లో ఉన్న తొట్టెలవంక చూస్తున్నాడు.

"నా సంగతి మొన్ననే చెప్పారుగా; మనకు ఇద్దరు చాలన్నారు కదా?"

"మగ పిల్లవాడు కాకపోతే మరో ఛాన్సు ఇస్తాను"

"మరొక ఛాన్సా?" నవ్వింది సరళ.

"అవును. మగపిల్లవాడంటే తండ్రికి ఇన్సూరెన్సు చేసినట్లనుకో."

"ఆ మాట ఈ రోజుల్లోనే చెల్లటంలేదు. రాబోయే తరానికి అసలే చెల్లకపోవచ్చు."

"కావచ్చు కాని – నాకు మాత్రం కొడుకనేవాడు ఎటువంటివాడు కానీ ఒకడు ఉండి తీరాలనిపిస్తుంది.'

"మీరేమంటారో అని చూశాను గాని నేనూ అదేమాట అనుకుంటా నెప్పుడూ" అంది సరళ తన మనసులో ఉన్నది చెప్పి తలవంచుకుంది.

"అందుకని - ఒకవేళ ఈసారి కనక ఆడపిల్ల పుట్టినా ఆపరేషన్ చేయించుకోవద్దు. నీకు మరో ఛాన్సు ఇస్తాను. తొందరపడి డాక్టరు అడిగింది కదా అని

ఒప్పుకోకు. వాళ్ళకు నెలకు ఇన్ని ఆపరేషన్లు చేయాలన్న లెక్క ఉంది. కనక బలవంత పెడతారు."

సరే అన్నట్టు తల తిప్పింది సరళ. ఈ లోపల పాప మంచం దిగుతూ ఎక్కుతూ కాలక్షేపం చేసింది.

మరునాడు ఉదయం కారియరు తీసుకుని శాంతి వచ్చేసరికి ఆ తెల్లవారు ఝామున పురుడు వచ్చిందనీ ఆడపిల్ల పుట్టిందనీ సరళ తొట్టె వైపు చెయ్యి చూపించింది.

నవ్వుతూ శాంతి తొట్టెలో బట్టలు తొలగించి పాపను ఎత్తుకుని "ఒదినా? ఒదినా! ఈ పాప అంతా అన్నయ్య లాగలేదూ? మణి నీ పోలిక మణికంటె ఈ పాపే బాగుంది నాకు" తొట్టెలో పాపను పడుకోబెడుతూ "ఒదినా! అయితే నీవు అన్నం తినవుకదూ ఇవాళ! పాలూ బ్రెడ్ ఇక్కడ కొనుక్కురానా?"

"తీసుకొచ్చి నా కిచ్చి తొందరగా ఇంటికి వెళ్ళమ్మా. ఇంట్లో ఏమయినా పనులుంటాయి. పాపను చూసుకోవాలి" తొందరపెట్టింది సరళ.

"తెస్తాలే - ఇక్కడేగా? ఇంట్లో ఏమయినా చెప్పమంటావా? అన్నయ్యకు ఏం చెప్పను?"

"అన్నయ్యకా? ఇంటికి వచ్చి కాఫీ తాగంగానే ఇక్కడికి రమ్మను పాపను తీసుకుని."

పాలు బ్రెడ్ తెచ్చి సరళ కిచ్చింది శాంతి మళ్ళీ ఒకసారి పాపను పొత్తిళ్ళలోనుంచి తీసి ఎత్తుకుంది. టిఫిన్ కారియరు ఊపుకుంటూ ఇంటికి బయలు దేరింది.

తల్లిదండ్రులకి కబురు చెప్పి కొత్త పాపకు గౌనులు కుట్టటానికి ప్రయత్నాలు చేయటం మొదలుపెట్టింది.

సాయంత్రం రంగారావు కాఫీ తాగకముందే కొత్త పాప పుట్టినట్టు తెలిసింది.

"అమ్మా, పాపను తీసుకెళ్ళి చూపించు తల్లికి. నేను బజారు వెళ్ళుతున్నా. అటునుంచి అటే వస్తానని చెప్పు" అంటూ బైటికి వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రము సరళ చాలా సేపు ఎదురు చూసింది రంగారావు కోసం. అచ్చం రంగారావు మాదిరిగా ఉన్న పాపను చూపించి అతడి మురిపెమ్ని కళ్లతో చూద్దామనుకుంది.

ఆ సాయంత్రము కాదు కదా మరునాటి సాయంత్రానికి కూడా అతడు హాస్పిటల్‌కు రాలేదు శాంతి మాత్రం వచ్చి కావలసినదేదో తెచ్చియిస్తోంది. ఇంటి నుంచే పాలు బ్రెడ్ తీసుకుకెళ్లుతోంది.

సరళకు మనసు పరిపరివిధాలుగా పోతోంది. రంగారావు ఎందుకు తనను చూడటానికి రాడు? తన మీద కోపమా? తను ఏం చేసింది? అతడికి కూడా సామాన్యులందరి మాదిరిగా ఆడపిల్ల పుట్టిందని చిన్న చూపు కలగలేదు కదా? మొన్న జరిగిన సంభాషణలో అటువంటి మాటలేమీ దొర్లలేదే? ఆడపిల్లయితే మరొక ఛాన్సు ఇస్తానని నవ్వుతూ చెప్పిన మనిషే కదా? అయినా ఏమో? మనసు ఎంతలోకి మారాలి? సరళకు ఆపుకోలేనంత దుఃఖం వస్తోంది.

"ఒదినా! నీ ముఖం అట్లా ఉబ్బిపోయిందేం? అన్నయ్య వచ్చాడా? పాపను మళ్లీ తీసుకురాలేదని బాధగా ఉందా? ఇక్కడి నుంచి ఇంటికి వచ్చిన తరువాత నీ కోసం ఏడుస్తుంది. అందుకని తీసుకురాలేదు సాయంత్రం అన్నయ్యతో చెప్తాలే".

శాంతి మాటలకు కళ్లలోనుంచి నీళ్లు కారుతుండగా నవ్వింది సరళ.

"దీని పేరే ఎండా—వానా అంటారు" అంది శాంతి.

ఆ సాయంకాలము ఆఫీసునుంచి హాస్పిటల్‌కు బయలుదేరి వస్తున్న రంగారావుకు ఉదయం జరిగిన సంఘటనే మనసును తొలవటం మొదలుపెట్టింది ఆ రోజు ఆఫీసులో కూడా సరిగా పనిచేయలేకపోయాడు.

ఆ ఉదయం తను ముఖం కడుక్కుని కాఫీకోసం ఎదురుచూస్తూ కిటికీ దగ్గర నిలబడ్డాడు. అంతలో శాంతి ఆయాసపడుతూ వచ్చింది

"అన్నయ్యా, అమ్మ కాఫీ గ్లాసులు కడగటానికని వెళ్లి నూతి పళ్లెం దగ్గర పడిపోయింది"

తను గబగబా పరుగెత్తికెళ్లారు. కాలు జారింది కాబోలు అమ్మకు. సరళ కూడా లేదు. అమ్మకు పని ఎక్కువయిందనుకుంటూ శాంతి సహాయంతో తల్లిని చెరొక రెక్క పట్టుకుని తీసుకువచ్చారు లోపలికి. కాఫీ కలిపి ఆమె గొంతులో పోశారు.

బాదంచెట్టు క్రింద కూర్చున్న తండ్రి దిగాలుపడ్డ ముఖంతో "అంతా ఆ శ్రీరామచంద్రుడి దయ" అంటూ చేతులు జోడించాడు. కాని లోపలికి రాలేదు.

శాంతి అందరికీ కాఫీలు యిచ్చి గబగబా వంట చేసిపెట్టి తల్లిని ఆ సమీపంలో ఉన్న డాక్టరు దగ్గరికి తీసుకువెళ్లి చూపించింది. మందులు రాసిచ్చిన చీటీని ఇంటికి రాగానే అన్నగారికి చూపించింది.

ఆ చీటీ చూడగానే రంగారావు స్తంభించిపోయాడు. వాకిటి తలుపు తెరుచుకుని లోపలికి వచ్చిన తండ్రితో ఏమీ చెప్పలేకపోయాడు. పెరట్లో కాళ్లు కడుక్కుని వస్తున్న తల్లిని ఆపాదమస్తకం పరికించి చూశాడు. ఆ రోజేకాదు. ఎందుకో రెండు రోజులనాడు కూడా తల్లిని చూసి గతుక్కుమన్నాడు. తల్లి ముఖంలోకి చూడలేకపోతున్నాడు. 'నాయనా రంగా' అంటూ ఆప్యాయంగా పిలిచే తల్లి ముఖం చూడలేక తలదించుకుంటున్నాడు.

ప్రతిరోజూ రాత్రి పడుకోబోయేటప్పుడు తండ్రితో ఎంతో ప్రేమతో గౌరవంతో పదినిమిషాలు కబుర్లు చెప్పే రంగారావు తండ్రి మంచం వైపు చూడటానికే విముఖుడుగా ఉన్నాడు.

హాస్పిటల్ ఆవరణలో అడుగుపెడుతూనే ఒకింతసేపు ఆగి లాన్స్ వైపు నడిచాడు సరళ కేమని జవాబు చెప్పాలి?

పాపం సరళ! మొదటిరోజు అన్న మాటలనే నమ్మి తనకింకో ఛాన్సు ఇస్తాడనుకుంటోంది కాబోలు! ఆపరేషన్ అక్కర్లేదని నిశ్చింతగా పాప నెత్తుకుని ఏవేవో ఊహలు కల్పించుకుని తనలోతానే మురిసిపోతేందేమో! అవేవీ కాకుండా తను ఆపరేషను చేయించుకునే తీరాలంటే ఏమనుకుంటుంది? ఎంత నిరాశ పడుతుంది?

హాస్పిటల్‌కు వచ్చే విజిటర్సు వస్తున్నారు. వెళ్లే వాళ్లు వెళ్లుతున్నారు.

కొందరు నవ్వుతూ తుళ్లుతూ వెళ్లుతుంటే కొందరు చిన్నబోయిన ముఖాలతో వెళ్లుతున్నారు

గంట గణగణ మోగుతోంది.

మాయదారి వాచ్‌మన్ గడియారం ఒక్క క్షణమయినా వెనకా ముందుగా పడవదు. పొద్దును ఉన్నదున్నట్టుగా చూపించేస్తుంది.

విజిటర్లు గబగబా నడుస్తున్నారు.

అప్పుడు బద్ధకంతో ఒళ్లు విరుచుకుంటూలేచి మందంగా అడుగులువేస్తూ రంగారావు సరళ ఉన్న వార్డులోకి వెళ్లాడు అప్పటికి సరళ ఇంక రంగారావు రాడని నిశ్చయం చేసుకుని అరచేతిలో ముఖం పెట్టుకుని ఆలోచిస్తున్నది మంచం మ్మీద కూర్చుని.

"సరళా!"

తలఎత్తి చూసింది పదిలంఖణాలు చేసినట్టుగా ఉన్న రంగారావు ముఖం చూసి గతుక్కుమన్నది.

"ఒంట్లో బాగా లేదా అలా ఉన్నారు? ఈ పాప పుట్టిన నక్షత్రం ఏమిటో మామగారిని అడిగారా?"

మెల్లిగా పక్కనున్న స్టూలుమీద కూర్చున్నాడు రంగారావు.

"ఏ నక్షత్రాన పుట్టినా ఇప్పుడేం చేస్తావు?" నవ్వబోయాడు కాని విఫల ప్రయత్నమైంది.

"నేనేమిటో అనుకున్నానుగాని మీకూ ఆడపిల్లంటే విరసనే" అంది అతడి వైపు నిశితంగా చూస్తూ.

ఆ మాటకు అతడి కనుబొమలు పైకి లేచాయి.

"కాకపోతే ఇప్పుడా పాపను చూడటానికి రావటం?" బుంగమూతి పెట్టింది.

"కొంచె మాలస్యమైందనుకో. ఇంతలోనే అంత రిమార్కా"? నవ్వు తెచ్చిపెట్టుకున్నాడు.

"ఇదిగో పాపను చూడండి. మీరివాళ రాకపోతే రేపు మధ్యాహ్నం పాపే ఇంటికి వచ్చి మిమ్మల్నందరినీ చూసేది."

"రేపే డిస్చార్జిచేస్తారా?" మాటలో జంకు తెలుస్తూనే ఉంది.

"అవును ఇక్కడ బెడ్సు చాలాలేవట అందుకని మూడోరోజున కొందరినీ–నాలుగో రోజున కొందరిని పంపేస్తున్నారు."

"అందరినీ పంపేస్తున్నారా ?"

"అందరినీ అంటే ఆపరేషను చేయించుకోని వాళ్లను. చేయించుకునే వాళ్లను మరికొన్ని రోజులు ఉంచుకోవాలి కదా!"

"సరళా!" మరిమాట పెకల్లేదు.

"ఏమిటి? మీరు ఇలా ఉన్నారు? మాట మంచీ లేకుండా ఎప్పుడయినా ఇట్లా ఉన్నారా? ఏమిటీ మార్పు? పాపనూ నన్నూ చూడటానికి రావటమే కష్టమైపోయింది. వచ్చిన తరువాత మాట్లాడటమే కష్టమైపోతోంది. మీ మనసులో ఏదో ఉంది. చెప్పలేక బాధపడుతున్నట్టుగా ఉంది."

సరళ నిష్ఠూరాన్ని భరించలేకపోతున్నాడు రంగారావు.

"సరళా! మొదట మనము అనుకున్నట్టుగా నీ కింకో ఛాన్సు ఇవ్వలేక పోతున్నాను నీవు ఆపరేషను చేయించుకో." తలపక్కకు తిప్పుకున్నాడు ఆమె చూపులను ఎదుర్కోలేక.

"ఏం? కొత్త ఆలోచన ఏదయినా వస్తూందా? ఆలోచనలోపడేనా ఇన్నాళ్లూ రానిది?"

"కాదు నీవు నన్ను మరోలా అపార్థం చేసుకోకు. నాకు నీవనుమానిస్తున్నట్టుగా ఆడపిల్లంటే నిరసన లేదు."

"అయితే మరి పాపను చూడలేదేం ? ఎవరిలా ఉందో చెప్పలేదేం?" మూతి సున్నాలా చుట్టింది.

నవ్వాడు రంగారావు. "నీవు పాపను ఎత్తుకోమని ఇచ్చావా? ఎవరి పోలిక అని అడిగావా? ముందుగానే నా మీద నిందవేస్తివి."

"ముందరి కాళ్లకు బంధం అంటారు దీవినే. మరి-నాకెందుకివ్వరు మరో ఛాన్సు?" తల ఒరగబెట్టి కంటి కొసలతో చూసింది.

"సరళా! నీకు ఆశాభంగం కలిగిస్తున్నాను. నీవు చేయించుకోక తప్పదు"

"అదే ఎందుకని?"

"ప్లీజ్ సరళా! కారణం అడక్కు- కాని ఆపరేషన్ చేయించుకో."

"అదే నేనడిగేది? మీ నిర్ణయంలో మార్పు ఎందుకు కలిగిందో చెప్పాలి. చెబితేగాని నేను ఒప్పుకోను."

"నీకు నిదానంగా చెబుతాగా, ఇంటికి వచ్చిన తరువాత వివరాలతోసహా చెబుతానుగా."

"ఆపరేషను అయిపోయి ఇంటికి వచ్చిన తరువాత చెబుతారా? అప్పుడు చెప్పి లాభం?"

"సరళా! నేను ఇంటికి పెద్దకొడుకును. నాన్న రెండునెలల క్రింద రిటైరయ్యారు. సుందరానికి కాలేజి చదువు పూర్తి చేయించి ఒక ఉద్యోగస్థుణ్ణి చేయాలి. పదో క్లాసు చదువుతున్న రామాన్ని పట్టభద్రుణ్ణి చేయాలి. శాంతి పెళ్ళిచెయ్యాలి. ఎన్ని బాధ్యతలు నాపైన ఉన్నాయో చూశావా?"

"తెలుసు ఈ బాధ్యతలు కొత్తవి కావుగా-మొన్న నిన్న పుట్టుకొచ్చినవి కావుగా?"

"కావు. కాని-నా ఊహకందని నిజాన్ని మొన్ననే తెలుసుకున్నాను. నాకు మరొక బాధ్యత పైనపడ్డదని ఈ పాప పుట్టకముందే గ్రహించాను మొదట అనుమానించాను. తరువాత నిజమని డాక్టరు చీటీ వ్రాసింది నాకు తమ్ముడో చెల్లెలో ఆరేడు నెలల్లో పుట్టబోతున్నారు. నా పరిస్థితులు నాకే అర్థం కావటం లేదు. ఇన్ని బాధ్యతలతో నేను నీకు ఇంకో ఛాన్సు ఇవ్వనా? ఈ ఆలోచనల

తోనే నేను ఇక్కడికి వచ్చి నీకు నా ముఖం చూపించలేకపోయాను. ప్లీజ్ సరళా! నన్నర్థం చేసుకుంటావు కదూ?" కిటికీ గుండా చెట్లలోకి చూస్తున్నాడు తన చూపుల్లో ఆమె చూపులు కలుపుతుందేమోనని.

"ఆఁ!" నోరు తెరిచింది సరళ.

నాకే సోదరీ సోదరుల సంఖ్య పెరుగుతుంటే నీకు మరో ఛాన్సుకావాలా!" వేదాంతిలా నవ్వాడు.

అతడు కనుమరుగై పోయేవరకూ చూసి బరువుగా నిట్టూర్చింది సరళ.



# రక్తపు చుక్కకు నీటి చుక్క

తన పెళ్ళి అయిన వారానికే ఆడబడుచు పెళ్ళంటే నడుం కట్టుకుని పెళ్ళి పనులలో జొరబడ్డది సుమతి. అత్తగారికి కాళ్ళు పట్టుకున్నాయి సమయానికి. పెద్ద కోడలు-ఇంట్లోనూ, వంట పందిట్లోనూ అన్నిటికీ తానే అయి తిరుగుతోంది. తలంబ్రాల సమయములో రెండు నిమిషాలు తీరిక చేసుకుని బలవంతంగా నిలబడి చూసింది. ఆ మేళాల చప్పుళ్ళలో ఆ జనసందడిలో ఆమె కళ్ళు రాఘవరావు కోసం వెతికాయి. అతడు ఉంటాడనుకున్నచోట లేడు; అన్నదమ్ముల మధ్యా లేడు; మిత్రబృందములోనూ లేడు; అప్పుడప్పుడు పిలిచి కేకలు పెట్టే తండ్రికి అందుబాటులో అంతకంటెలేడు.

చేతిలో అక్షంతలు అలానే పట్టుకుని పెళ్ళి పందిట్లో నుంచి హాల్లోకి వచ్చింది. తన గదిలో తొంగిచూసింది.

"ఇది పేపరు చదువుకునే సమయమా ? అందరూ పెళ్ళిపందిట్లో ఉంటే ఒక్కరికీ ఇక్కడ ఎట్లా కూర్చో బుద్ధిఅయింది? మీ నాన్నగారు కేకలుపెడు తున్నారు." అతడి చేతిలో పేపరు లాక్కోబోయింది.

"పదిరోజులపాటు ఇల్లు ఇలాగే సందడిగా ఉంటుంది. అయితే అంత కాలమూ నేను పేపరుకూడా చదవకూడదనా నీ ఆజ్ఞ?"

సుమతి రాఘవరావు ముఖంలోకి చూసింది. చాలా చిరాగ్గా ఉంది. కాని పైకి చిటపటలేదు. ఏదో ఆలోచనలో ఉన్నట్టున్నాడు.

"ఓ కప్పు కాఫీ తెచ్చియివ్వనా ?"

"ఎన్నిసార్లు యిస్తావు? అలా అంటూ రెండుసార్లు యిచ్చావు - బలవంతంగా. ఆ చేదుకాఫీ కళ్ళు మూసుకు తాగాను."

"ఆఁ అది చేదా? స్ట్రాంగుకాఫీ అంటూ అంతా అడిగిపోయించుకున్నారు?"

"కాబోలు! నాకది చేదే."

"పోనీ, పాలల్లో బోర్నవిటా కలుపుకురానా?"

"ఎందుకు? అంత అవసరమా యిప్పుడు?"

సుమతి చూస్తూ నిలబడిపోయింది. 'ఇదేం మనిషి? ఎప్పుడూ ఇలా ఉంటాడేం? తన పెళ్ళిలోనూ ఇంతే. ఆ యీడు వాళ్ళు అందరూ ఉన్నట్టు సరదాగా ఉండడు. పెళ్ళిలో జరిగిన సరస వినోద కార్యక్రమాలలో ఏ ఒక్కటీ అతడిని ఆనందపరచలేదు. అతడి వాలకమంతా సుమతి కనిపెడుతూనే ఉన్నది. అతడి ముఖము ఎప్పుడూ తల్లిని పోగొట్టుకున్న పిల్లవాడిలా ఆత్మేశ్వరిని పోగొట్టుకున్న ప్రియుడిలా ఉంటుంది. ఏమిటీ ఈయన బాధ? మనిషి స్వభావమే యిలా అయి ఉంటుందా?'

మామగారి కేకలకు సుమతి పెళ్ళి పందిట్లోకి వెళ్ళింది. సూత్రధారణ తలంబ్రాలూ అయ్యాయి. వచ్చినవారంతా ఒక్కొక్కరే లేస్తున్నారు. సుమతి అందరికీ తాంబూలాలూ, పళ్ళూ యివ్వటంలో మునిగిపోయింది ఉదయము ఎనిమిది గంటలకు లగ్నం. భోజనాలయేసరికి రెండు గంటలయింది. పదకొండు దాటిన దగ్గర నుండీ పెళ్ళివారు భోజనాలకు వస్తూనే ఉన్నారు. పిల్లలూ ఆడవాళ్ళూ విడివిడిగా పంక్తులు తీర్చారు. వాళ్ళది అయిన తరువాత యువకులు వచ్చారు. పెద్దవాళ్లూ వియ్యంకుడూ ఇంకా రావాలి.

యువకుల పంక్తిలో గలభా జరిగింది. నేల ఎగుడు దిగుళ్ళవల్ల ఒక విస్తట్లో నుంచి లడ్డు జారి పక్క విస్తట్లోకి చేరుకుంది. విస్తరంతా ఎంగిలయిందంటూ అతడు లేచి నిలబడ్డాడు. అది తీసేస్తామని వడ్డించేవాళ్ళు బ్రతిమిలాడుతున్నారు. అతడు వద్దంటున్నాడు. అంతా చుట్టూ మూగారు. అది చూసి తింటూ తింటూ ఉన్నవాళ్ళు చప్పున లేచారు.

సుమతి మామగారికోసం చూసింది. ఆయన కనబడలేదు. కనబడ్డా ఆయన ఈ సమస్యను పరిష్కారం చెయ్యలేడు. అందరినీ తలానాలుగు తిట్టి, ఆవేశం తగ్గక వాకిట్లోకి వెళ్ళి చుట్ట కాల్చుకుంటూ కూర్చుంటాడు ఇంటికి పెద్దకొడుకు ఏడీ? వచ్చి ఆ యువకుల్ని కాస్త సర్దికూర్చోపెడితే ఎంత బాగుంటుంది?

సుమతి వాళ్ళను తప్పుకుంటూ వెళ్ళింది. బ్రతిమిలాడిన కొద్దీ ఆయువకుడు బిగుసుకుపోతున్నాడు.

"చూడండి, మీ రిలా రండి ఆ చివరకు విస్తరి వేయించాను. వడ్డనకూడా అయింది. నాతో రండి."

అతడు కదల్లేదు. "పోనీ మీరు కూడా రండి;" సుమతి పిలవగానే నలుగురయిదుగురు యువకులు తింటూ తింటూ ఉన్న విస్తళ్ళు వదలిపెట్టి లేచి వచ్చారు. అతడు వాళ్ళ వెనకాలే వచ్చాడు. 'అమ్మయ్య' అనుకుంటూ సుమతి నేతి జారీ పట్టుకుని వాళ్ళ భోజనాలయేవరకూ అక్కడే నిలబడ్డది. అప్పుడప్పుడు వెనక్కు తిరిగి చూస్తూనే ఉంది ఇటువంటి సమయాలలో రాఘవరావు తన వెంట ఉంటే-ఎంత హుందాగా ఉంటుంది.

పెళ్ళి సందడి అయిన తరువాత సెలవులయిపోయాయని బయలుదేరాడు. రాఘవరావు సుమతితో, కొత్తకాపురం-కొత్తజంట-అయినా అతడు అలా లేక పోవటం వల్ల సుమతికి ఏకపాత్రాభినయ మయిపోతున్నది. ఏ విషయంలోనూ పట్టుదల అన్నమాట పెట్టుకోకుండా అన్ని పనులూ తానే చేసుకుపోతూ సంసార మంతా నెత్తినవేసుకుంది. అతడలా ముభావంగా ఉండటానికి కారణం తెలియక పోయినా మనసులో బాగా బాధపడుతున్నాడని తమకు సంబంధించని చల్లటికబుర్లు చెప్పి, ఉపశమనము చేయాలని ప్రయత్నిస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ అవతరణ జరిగిన తరువాత రాఘవరావుకు రాజధాని బదిలీ అయింది. ఆంధ్రకాలనీలో ఇల్లు ఎలాట్ అయింది. అక్కడికి కొత్తగా వచ్చి చేరిన ఉద్యోగులంతా ఒక క్లబ్బు స్థాపించుకున్నారు వాళ్ళ భార్యలు కూడా ఒక క్లబ్బు పెట్టుకున్నారు. అడపా దడపా సాంస్కృతిక కార్యకలాపాలు జరుగుతూ ఉండేవి ఆ సందర్భాలలో ఆడవాళ్ళూ మగవాళ్ళూ కలిసి సమావేశమయేవారు. కొత్త మిత్రులు, కొత్త వాతావరణము అతడిలోని స్తబ్ధతను కొంతవరకూ చెదరగొట్టాయి.

రాత్రి పదిగంటలకు సుమతి రాఘవరావు క్లబ్బులో జరిగిన డ్యాన్సు చూసి యింటికి తిరిగివచ్చారు. ఆమె వడ్డిస్తోంది. జడ ముందుకు పడ్డది. ఆమె జడచివర నున్న జడ గంటలు చూసి త్రుళ్ళిపడ్డాడు. ముఖమంతా అప్పటికప్పుడు మారిపోయింది

"అలా ఉన్నారేం? పెరుగువేయించుకోండి."

"నే నింక అన్నం తినలేను. బలవంతం చెయ్యకు." అతడు లేచి వెళ్ళి మంచం మీద పడుకున్నాడు. సుమతి వంటయిల్లంతా సర్ది అతడి గదిలోకి వెళ్ళింది. ఆ పూటకు మరి భోజనాలు లేవు.

సుమతి అతడి దగ్గరగా కూర్చుని కబుర్లలోకి దింపాలని ఎంతో ప్రయత్నించింది. అతడి వంటిమీద ఆమె చెయ్యిపడితే త్రుళ్ళిపడుతున్నాడు.

ఆ రాత్రి ఆమె కూర్చునే కునికిపాట్లు పడ్డది. అతడుమంచంమీద దొర్లుతూ తెల్లవారనిచ్చాడు.

ఆమె కది ఒక సమస్య. ఆమె జీవితం యింతవరకు అతడిని గురించిన ఆలోచనలతో సతమతమయిపోతున్నది. తరుణజన సహజమయిన కోర్కెలతో జీవితాన్ని మాధుర్యంతో నింపుకుందామనుకున్నది. అతడి ముఖము చూడగానే ఉత్సాహమంతా నీరుగారిపోతున్నది. ఆనాడు ఆమె ఉదయము లేచి కాఫీగ్లాసు అతడికి అందిస్తూ "నేను ఒక వారం రోజులు మావాళ్ళింటికి వెళ్ళిరానా?" అడిగింది కళ్ళు తుడుచుకుంటూ.

అతడు కళ్ళెత్తి ఆమె ముఖం బాగా పరికించి చూశాడు. రాత్రి నిద్రలేక పోవటంవల్ల కళ్ళూ ముఖం బరువుగా ఉన్నాయి. అతడి మనసులో ఆమెగురించిన ఆలోచన ప్రప్రథమంగా అప్పుడు బయలుదేరింది. రాత్రి భోజనం చెయ్యలేదు. పాపం! అతడు నోరు తెరవబోతున్నాడు. ఆమె కొంగు సవరించుకోవటంలో జడ మళ్ళీ ముందుకు పడి జడగంటలు గలగలమన్నాయి.

"సుమతీ! నీవా జడగంటలు తీసి వెయ్యి." ఎంతో బాధపడుతూ అన్నాడు. రాఘవరావు ముఖం తిప్పుకుని.

"ఏం, మీ కిష్టం లేదా?" మాట పొంత మవకుండానే విగ్రహించుకుని "అయితే సరే" జడ విప్పి వాటిని దూరంగా పెట్టివచ్చింది.

"మీ కిష్టంలేదా అవి? మరి అట్లా అయితే నాకు చెప్పలేదేం?" దగ్గరగా కూర్చుని అనునయంగా అడిగింది.

అతడు తల అడ్డంగా తిప్పాడు. బుజమ్మీద తువాల వేసుకుంటూ అక్కడి నుంచి లేచి గదిలోకి వెళ్ళాడు. సుమతి వెంట వెళ్ళింది. "మీ రివాళ మీమనసులో ఉన్న బాధ నాతో చెప్పాలి. మీ బాధలు నేనూ పంచుకుంటాను. మీ మనసులో ఉన్నదేమిటో చెప్పేయండి. మనసు తేలికపడుతుంది. నన్ను నమ్మండి. నేను మిమ్మల్ని అపార్థం చేసుకోను." ఆమె చూపులు దీనంగా ఉన్నాయి. వాటిలో ఇండుపగింజలంత బాష్పాలు నిలిచాయి ఆమె ముఖం చూడలేక అతడు తలవంచుకుని ఏదో గొణుక్కోవటం మొదలుపెట్టాడు. ఆమె వాటిని కూర్చుకుని ఇలా అర్థం చేసుకుంది:

*　　　*　　　*　　　*

రాఘవరావు ఆఫీసులో పనిచేస్తున్న సీతాపతి తన పెళ్ళికి తోటి ఉద్యోగులందరికీ శుభలేఖలిచ్చి ఆహ్వానించాడు. అందరూ సెలవుపెట్టి పెళ్ళికి బయలుదేరారు. రాత్రి పన్నెండు గంటలయినా లగ్నానికి నిద్రపోకుండా మేలుకుని ఆ మూడుముళ్ళూ పడగానే అంతా మళ్ళీ పడుకున్నారు. ఉదయం లేవగానే పెళ్ళికొడుకు స్నేహితులు కాఫీ ఫలహారాలు చేసి పెళ్ళివారు పంపిన సిగరెట్లు కాలుస్తూ పేకాటవేశారు. అప్పటికి ఎనిమిది గంటలు దాటింది. పేకాట జోరుగా సాగుతున్నది. అలా సాయంత్రం వెళ్ళి ఊరు నాలుగు మూలలా చూసిరావాలని కొందరు ప్రతిపాదించారు. విశాలమయిన వీధులూ, పెద్దపెద్ద మేడలూ, షాపులూ, ఊరిచివర కృష్ణానదీ అన్నీ చూసిరావచ్చని నాయకుడిలా వ్యవహరించే శేషగిరి అన్నాడు. ఆ మాటలు క్రమంగా పెరిగి ఎవరెంతవేగంగా నడుస్తారో చూడాలన్న కుతూహలం క్రిందికి మారి పందెం వేసుకునేంతవరకూ వచ్చింది.

"నేను చిన్నప్పుడు నాలుగుమైళ్లు నడిచి స్కూలుకు వెళ్ళేవాడిని" అన్నాడు రాఘవరావు.

ఆట ఆడేవాళ్ళల్లో ఆ ఊరి ఆయన కూడా ఉన్నాడు. "ఊరి చివర ఉన్న ఆ నది ఇక్కడికి మూడుమైళ్ళ దూరమయినా ఉంటుంది." అన్నాడు.

"అయితే రాఘవరావు, ఆ వాగు దగ్గరికి వెళ్ళి నీవు తిరిగివస్తే చాలోయ్. నీకు నడక వచ్చినట్టుగా సర్టిఫికెట్టు యిస్తాము." అన్నాడు శేషగిరి.

రోషం కొద్దీ రాఘవరావు అన్నాడు: "ఓ నడుస్తాను; నడిస్తే ఏమిస్తావు?"

''పది రూపాయలు ఇస్తానురా ''

''ఇంతేనా? వెధవ పదికి నేను మొగ్గుతా ననుకున్నావా? కనీసం పాతిక యినా ఉండాలి అందుకు నీవు యిష్టపడితే నేను నడిచి చూపిస్తాను:'' రాఘవ రావు కనుబొమ్మలు పైకెత్తుతూ అన్నాడు.

అంతవరకూ సాగిన సంభాషణ ఉత్తుత్తదిగానే ఉంది కాని రాఘవరావు ముఖం చూసిన తరువాత శేషగిరి తెల్లబోయాడు.

''పట్టుబడ్డావురా భాయీ! ఏడు నడవవచ్చాడా అనుకున్నావు కదూ? నేను నడిచి చూపిస్తా; నీ జేబులో రూపాయలు లేకపోతే చెప్పు.'' అన్నాడు లేచివచ్చి అతడి చెయ్యిపట్టుకుంటూ. శేషగిరిజేబులు తడుముకుని తల ఊపాడు 'ఓ' అంటూ.

''మీ పందేలు సాయంత్రం వేసుకోండి బాబూ! ఇది ఎండాకాలం.'' అన్నారు మిత్రులు.

''నాకేం ఫరవాలేదండీ. నే నిలాంటి వేసవులు ఇరవయినాలుగుచూశాను.'' అంటూ రాఘవరావు లాల్చీమీద జరీఖండువా వేసుకుని, ఆకుచెప్పులు తొడుక్కొని అప్పటికప్పుడు బయలుదేరాడు అతడు వాకిట్లోకి వస్తూ ఉండగా పెళ్ళివారింటి నుంచి బిందెడు కాఫీ తీసుకుని ఒక వంటమనిషి ఎదురయ్యాడు. అతడి వెనకాల తలనిండా మల్లెపూలు పెట్టుకుని పదహారు పదిహేడేళ్ళ అమ్మాయి వస్తున్నది. రాఘవరావు వాళ్ళను తప్పుకుని ముందుకు నడిచాడు రెండడుగులు వేసి వెనక్కు వచ్చి ''శేషగిరీ! చేతకాక వచ్చాననుకునేవు సుమా. ఇవాళ నీ దగ్గర్నుంచి ఆ పాతిక రూపాయలూ చెవులు మెలేసి తీసుకుంటాను. ఒక గ్లాసు కాఫీ తాగుదా మని వెనక్కు వచ్చాను.'' అన్నాడు.

ఆ వచ్చిన అమ్మాయి కాఫీ గ్లాసులు అందిస్తోంది. శేషగిరి ఒక గ్లాసు అందుకుని రాఘవరావుకు ఇచ్చాడు.

వేడివేడి కాఫీ తాగి చెమట తుడుచుకుంటూ ఆ అమ్మాయిని చూసీ చూడ నట్టు చూశాడు రాఘవరావు. ఆమె మాటలో ఏదో సంగీతం. ఎంతో హాయి ఉన్నట్టు ఆ నిమిషంలోనే రాఘవరావు కనిపెట్టాడు. ఆమె అందరికీ కొసరి కొసరి గ్లాసుల్లో కాఫీ పోస్తున్నది. జడ గంటలతో బరువుగా ఊగే ఆ జడా-తల కదిపి

నప్పుడల్లా అదిరిపడే ఆ పూల చెండూ, వెలుతురులో తళతళ మెరిసే ఆ జరీచీరే ఆమెకు మరింత చురుకుదనాన్ని కల్పిస్తున్నాయి. ఆమెను చూడగానే 'కనూ ముక్కూతీరు ఉండాలి గాని రంగులో ఏముంది' అనిపించింది అతడికి.

కాఫీ గ్లాసుల సందడికి గదుల్లోంచి ఆడవాళ్ళంతా పిల్లలతో బిలబిల్లాడుతూ బయటికి వచ్చారు. ఆ అమ్మాయి వాళ్ళందరినీ అడుగుతోంది "మీకు కావాలా? మీకు కావాలా?" అంటూ. కాఫీ గ్లాసు చూపిస్తోంది.

రాఘవరావు యింకా అక్కడే ఉంటే పందెం పోయిందని నలుగురూ నవ్వుతారని మందంగా అడుగులు వేస్తూ బయలుదేరాడు. కాని అతడి మనసులో ఉన్నది ఆమె నడిగి మరోగ్లాసు కాఫీ తాగాలని. అయినా నిగ్రహించుకుని సాగి పోయాడు. గడప దిగుతూ గంట చూసుకున్నాడు. పావుతక్కువ పది.

రాఘవరావు వాకిట్లోకి రాగానే శేషగిరి పరిగెత్తుకుంటూ వచ్చి "ఏరా, నిజంగా వెళ్తున్నావా ఏమిటి?" అన్నాడు

"నీవు నిజంగా పందెం వేసినప్పుడు నేను నిజంగా ఎందుకు వెళ్ళకూడదు?"

"అయితే రాఘవరావు! ఒక మాట: మన పందేనికి కాలపరిమితి కూడా ఉండాలి. నీవు నిజంగా వెళ్లుతున్నట్లున్నావు కనుక చెబుతున్నా; గంటన్నరలో నీవు ఇక్కడ ఉండాలి పది గంటలకు సరిగ్గా బయరుదేరు- లెక్క సరిగ్గా ఉంటుంది-" అన్నాడు శేషగిరి కనుబొమ్మలు పైకెత్తి.

"ఓ దానికేం? నీ షరతులన్నీ అంగీకరించాను అయితే కాసేపు కూర్చో మంటావు. ఇంతకూ నీ జేబులో డబ్బుందా? ముందీ మాట చెప్పు?"

"ఉందిరా నాయినా? లేకపోతే పెళ్ళి కొడుకు దగ్గర అప్పు చేస్తాను. భయ పడకు." అంటూ శేషగిరి అతడి వీపు తట్టాడు. ధైర్యంతో రాఘవరావు బయలు దేరాడు.

గంట చూసుకుంటూ ఆ ఊరు తెలిసినట్లే నడుస్తున్నాడు రాఘవరావు విశాల మయిన వీధిలో నడుస్తూ, దుకాణాలనూ ఇళ్ళనూ చూస్తూ సాగిపోతున్నాడు. అంత త్వరితంగా కాకుండా మరీ మందంగానూ కాకుండా మధ్యస్థాయిలో నడుస్తూ నల

ళయి నిమిషాలకు వాగు దగ్గరికి వచ్చాడు. ఆ వాగు అరమైలు వెడల్పున ఉన్న ఇసుక ప్రదేశంలో మూడడుగులు వెడల్పున మెలికలు తిరిగి తాచుపాములా పరుగులు తీస్తున్నది. అంతవరకూ వెళ్ళిన రాఘవరావు వాగులో కాళ్ళూ చేతులూ ముఖమూ కడుక్కొని దోసిళ్ళతో నీళ్ళు తాగి తిరుగుముఖము పట్టాడు.

అది మే నెల రెండవ వారం. ఊరిబయట చెట్టూ చేమా లేకపోవటం వల్ల కాబోలు గాలి నిప్పులు చెరుగుతున్నది. వాగుదగ్గరికి వెళ్ళేప్పుడు నడక సులభంగానే సాగింది రాఘవరావుకు. కాని తిరిగి వచ్చేటప్పుడు ఎత్తు ఎక్కవలసి రావటం వల్ల నడక మందగించింది. ఇసుకలో కాళ్ళు కూరుకుపోతున్నాయి. గట్టు పది అడుగు లుందనగా చెప్పు తెగిపోయింది. రాఘవరావు గుండె గతుక్కుమన్నది. 'కొని రెండేళ్ళయింది అనుకుందాము. ఇప్పుడే తెగాలా? ఆ తెగేది విడిదిలో తెగితే ఆ శేషగిరే తనజోడు యిచ్చునుగా? ఇప్పు డిది చేతబట్టుకుని ఒక చెంప కాళ్ళు కాలుతుంటే ఎట్లా ఎక్కటమూ' అనుకుంటూ జరీకండువాతో చెమట తుడుచుకుంటూ అడుగులు వేస్తున్నాడు రాఘవరావు - రెండు చెప్పులూ ఎడమచేత బట్టి.

రోడ్డు దగ్గరికి రాగానే గండం గడిచిందనిపించింది. వట్టి కాళ్ళతో నడవబోయేసరికి కాళ్లు చుర్రుమని అంటుకుపోతున్నాయి. వడగాలి ఈ చెవి నుంచి ఆ చెవికి దూసుకుపోతున్నది. ముఖం మాడిపోయేటంతగా ఎండ కాస్తున్నది.

ఉస్సురుస్సురంటూనే నడుస్తున్నాడు రాఘవరావు. ఎండవేడికి తపన ఎక్కువయి పోయింది. చెప్పులు చేత బట్టుకుని గబగబా అడుగులేస్తున్నాడు. టైముకు చేరుకోవాలన్న ఆదుర్దా పరుగులాంటి నడకను నడిపిస్తున్నది. టైము చూసుకుంటే పదకొండూ ఇరవై అయింది. మిగిలిన ఈ అయిదు నిమిషాలలో సుమారు పావు మైలు నడవాలి. రెండు వీధులు తిరగాలి. రాఘవరావు ముందూ వెనుకా చూసుకోవటంలేదు. అతడి కేమీ తెలియటంలేదు. కళ్లు చీకట్లు కమ్మినట్లవుతోంది. ఆ స్థితిలో అతడు ఎట్లా వచ్చి చేరుకున్నాడో విడిదియింటికి చేరుకున్నాడు. ఆ తరువాత అతడి ఒళ్ళు అతడికి తెలియదు.

సరిగ్గా పదకొండున్నరకు శేషగిరి వీధివాకిట్లోకి వచ్చి చూశాడు. ఒంటిమీద స్పృహలేకుండా పడిఉన్న రాఘవరావు కనిపించాడు. లోపలికి వెళ్ళి నలుగుర్నీ కేక

లేసి పిలుచుకువచ్చాడు. అతడు పందెం గెలిచాడుకాని ఒంటిమీద స్పృహలేదు- నలుగురూ చేరి అతడిని లోపలికి తీసుకువెళ్ళి పడుకోబెట్టారు.

"పందెం కాదుగాని జ్వరం వచ్చింది." అన్నా రంతా. ఈ సంగతి పెళ్ళి వారికి తెలియగానే ఒక డాక్టరుతో పెళ్ళికూతురి తల్లీ తండ్రీ, కాఫీలందించిన జడ గంటల అమ్మాయి, ఇద్దరు ముసలమ్మలూ పరుగులెత్తుకుంటూ వచ్చారు. ఆ ముసలమ్మ లిద్దరిలో ఒకరు జడగంటల అమ్మాయికి ముత్తవతల్లి. ఆమెకు కాస్త వైద్యము తెలుసు. డాక్టరు చూసిన తరువాత ఆమె అతడి చెయ్యి పట్టుకుని నాడి చూసింది. "ఏం భయంలేదు. ఎండగొట్టింది." అంటూ ఇన్ని చిట్టుడుకునీళ్ళు తెప్పించి గొంతులో పోసింది. తడిగుడ్డ పెట్టి ముఖం తుడిచి మెల్లగా విసన కర్రతో విసురుతూ దగ్గరగా కూర్చుంది. ఒక అరగంట అయిన తరువాత మందుల సంచీలోనుంచి ఒక ఉప్పె తీసి తేనెలో అరగదీసి నాలుకకు రాచింది. ఒకగంట తరువాత ఒక గ్లాసెడు మజ్జిగతేట గొంతులో పోసింది. రాఘవరావు నోట్లో పోసిం దల్లా తాగుతున్నాడు కాని కళ్ళు తెరవలేకపోతున్నాడు.

శేషగిరి ప్రాణం హడిలిపోయింది. తను చేతులారా అతడికి ఈ అవస్థ కల్పించినట్టుగా బాధపడ్డాడు. రాఘవరావును ముసలమ్మకు అప్పగించి అంత దూరాన గోడకు ఆనుకుని దేవుడికి దణ్ణాలుపెడుతూ కూర్చున్నాడు. జడగంటల అమ్మాయి ముఖంలో చిలిపితనమూ, నవ్వూ మాయమయ్యాయి ఆందోళనతో ముఖం వెలవెలబోతున్నది. ముసలమ్మ చేతిలో విసనకర్ర తీసుకుని విసరటం మొదలుపెట్టింది.

ముసలమ్మ అందరికీ ధైర్యం చెబుతూ కబుర్లలోకి దింపింది. రాఘవరావు పుట్టుపూర్వోత్తరాలూ, ఉద్యోగమూ అడిగి తెలుసుకున్నది. శేషగిరిలో భయపడ్డ చిహ్నాలు తగ్గలేదు. అమ్మాయి ముఖంలో కూడా ఆదుర్దా అట్లాగే ఉన్నది.

కొంతసేపటికి రాఘవరావు కళ్ళు తెరిపిడి పడ్డాయి. కన్ను తెరవగానే గల గల నవ్విన అమ్మాయి తనకు విసరటం కనబడ్డది. లీలగా అతడికి జ్ఞాపకం వస్తు న్నది- 'ఎవరో తనను లోపలికి తీసుకువచ్చారు. ముఖం తడిబట్టతో తుడిచారు అప్పటినుండీ ఏదో నోట్లో పోసి మింగిస్తున్నారు' అనుకున్నాడు. ఆ అమ్మాయిచేత విసిరించుకోవటానికి అతడికి కాస్త బిడియంగా ఉంది. 'అప్పటి నుంచీ విసురుతూ

కూర్చుంది కాబోలు- పైకి చిలిపిగా కనబడ్డా పిల్ల మంచి జాలిగుండె కలదే' అనుకుంటూ పక్కకు ఒత్తిగిలాడు.

అతడు కదులుతూ ఉండగా శేషగిరీ, ముసలమ్మా దగ్గిరికి వచ్చారు. "నాయనా! ఎట్లా ఉంది? కళ్ళు తెరిచి చూడు" అన్నది.

"రాఘవరావు! పందెం గెలిచావురా. నావైపు చూడు." అన్నాడు శేషగిరి కాస్త ధైర్యం తెచ్చుకుని.

రాఘవరావు మెల్లగా కళ్ళు తెరిచాడు. చాలా నీరసించిపోయాడు. మాట్లాడాలని ఉందిగాని మాట్లాడలేకపోయాడు. శేషగిరి పాతికరూపాయలు చూపించి జేబులో పెడుతుంటే కళ్ళతో నవ్వాడు నీరసంగా.

ఆనాడూ, మరునాడూ రాఘవరావుకు జ్వరం కాసింది. సెలవు పొడిగించాడు. 'వడదెబ్బ కాకుండా జ్వరం కూడాను' అంటూ అతడిని ఎవరూ కదలనీయలేదు. పెళ్ళికొడుకూ శేషగిరీకూడా వారం సెలవు పెట్టారు. పెళ్ళికి వచ్చినవారంతా వెళ్ళిపోయారు. ముసలమ్మ ఆమె మనమరాలూ నిలిచిపోయారు

రాఘవరావు పరిస్థితికి స్నేహితులు హాస్పిటల్లో చేర్చారు. అక్కడ వాంతులూ, భేదులూ విపరీతమయ్యాయి. అతడి స్నేహితులూ ముసలమ్మా రోజుకు రెండుమూడు పర్యాయాలు వెళ్ళి చూస్తున్నారు. ఆ మరునాడు తండ్రికి టెలిగ్రాం యిచ్చారు.

హాస్పిటల్లో మంచంమీద పడుకుని రోజూ ముసలమ్మ వచ్చేవేళకు రాఘవరావు కళ్ళు తెరిచి చూసేవాడు. రెండు రోజులనుండీ ఆమె కంటికి కనబడటం లేదు. మూడోనాడు మధ్యాహ్నంవేళ ఆ అమ్మాయి ఒంటరిగా వచ్చింది.

"బామ్మగారు ఊళ్ళో లేరా?" అని నీరసంతో పడుకునే పలకరించాడు

ఆమె కొంతసేపు జవాబు చెప్పటానికి జంకింది. బిడియంతో తల వంచుకున్నది. ఆ రెండు రోజులలో ఒక పెళ్ళికొడుకు వచ్చి ఆమెను చూశాడు. కాని పెద్ద కోరికలు కోరాడు. అది ముసలమ్మ మనసును బాగా బాధించింది. అమ్మాయికి బుద్ధి తెలిసినప్పటినుంచీ యిటువంటివి చాలా జరిగాయి. కనుక ఆమె అంతగా బాధపడలేదు. కాని ఆ మాట కొత్త మనిషితో ఎలా చెబుతుంది?

"మా నాన్న దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది బయలుదేరమని." పైటకొంగు చూపుడువేలికి చుట్టుకుంటూ 'రేపు వెళ్ళిపోతాము' అన్నది.

ఇద్దరు డాక్టర్లు మెల్లగా తెర తొలగించుకుని గదిలోకి వచ్చారు "మిస్టర్, బ్యాంకిలో రక్తము మీకు సరిపడినది లేదు మీ వాళ్ళెవరైనా ఉన్నారా ఇవ్వటానికి ?"

"మావాళ్ళు వచ్చినప్పుడు అడుగుతాను."

"ఎంత త్వరగా యిస్తే అంత మంచిది."

వాళ్ళ వెనుకనే లేచి వెళ్ళింది ఆ అమ్మాయి. ఆ సాయంత్రమే రాఘవరావు తన దగ్గరికి వచ్చిన వాళ్ళందరినీ అడిగాడు. రాఘవరావుకు సరిపడిన గ్రూపు దొరకలేదు. అవడి ముఖము వేళ్ళాడిపోయింది.

మరునాడు ఊరికి వెళుతూ వెళుతూ బామ్మగారు మనమరాలితో వచ్చింది హాస్పిటల్‌కు. బామ్మగారు మాట్లాడుతున్నంతసేపూ ఆ అమ్మాయి బయటనే ఉంది.

వారం రోజుల తరువాత రాఘవరావును హాస్పిటల్ నుండి పంపుతూ "రక్తము ఎక్కించిన తరువాత మీరు తొందరగా కోలుకున్నారు. ఆరోగ్యం బాగా కాపాడుకోండి" అన్నారు.

ఆ ఊరి నుంచి బయలుదేరేటప్పుడు సీతాపతి మామగారు అన్నారు "మొన్ననే, మా రమణీ, పిన్నిగారూ వెళ్ళిపోయారు. ఎవరికీ చెప్పకుండా మీకు రక్తం యిచ్చింది మా రమణిట."

'రమణి ? రమణి అంటే ఆ జడగంటల అమ్మాయా ?' ఏదో ఆవేశం హృదయంలోనుంచి పొంగుతూ పైకి లేచింది. 'ఆ చిలిపి పిల్లది ఇంత మంచి హృదయమా ? ఆమెలో ఇంత త్యాగం ఉన్నదా ? అందులోనూ పెళ్ళికి వచ్చిన వరాయి మగవాడికోసం ?'

ఊరు చేరకముందే ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోవటానికి తాను సిద్ధంగా ఉన్నాననీ, తన తండ్రితో సంప్రతించమనీ ఒక కవరు సీతాపతి మామగారికి వ్రాశాడు.

రాత్రి కన్ను మూయగానే కాఫీ గ్లాసుతో జడగంటలు ఆడించుకుంటూ రమణి చిలిపిగా నవ్వుతూ కనబడేది.

ఆశాసౌధాల రంగులు పులుపుకుని అలంకారాలు చేసుకుంటుండగా తండ్రి దగ్గర నుండి జాబు వచ్చింది. సీతాపతి మామగారు ఎవరో ఒక పేదపిల్ల సంబంధం చేసుకోవలసిందని వ్రాశాడనీ, అప్పటికే తాను అయిదెకరాల మాగాణీ ఆరువేల కట్నంతో వచ్చే పిల్లను చూసి అంతా నిశ్చయం చేశాననీ వివరాలతో సహా వ్రాశాడు.

'నాది పిరికి గుండె - నాది పిరికి గుండె' గుండెమీద కొట్టుకున్నాడు రాఘవరావు ఉద్రేకంతో.

"అదా సంగతి!" అర్థమయింది అన్నట్టు చూసింది సుమతి.

అతడి చూపులలో ఇప్పుడు ధైర్యం లేదు. ఆ కళ్ళు అప్పటికప్పుడే కోపావేశంతో అరుణిమ దాల్చాయి.

"మీకు చాలా అన్యాయం జరిగింది. సంబంధం నిశ్చయమైనా మీ నాన్నగారితో ఈమాట గట్టిగా చెప్పి ఉండవలసింది." అన్నది పరమశాంతంగా సుమతి.

"చెప్పవలసిందే కాని చెప్పలేదు. చెప్పలేని పిరికివాడిని." తలపట్టుకున్నాడు కళ్ళు మూసుకుని. వారం రోజులపాటు సుమతి నానాతిప్పలూ పడ్డది. కాఫీ చల్లారిపోయినా తీసుకోడు. పళ్లెం ముందు కూర్చుని ఎటో చూస్తూ ఆలోచిస్తాడు కాని భోజనం చేయడు. తలవెంట్రుకలలోకి వేళ్ళు పోనిచ్చి క్రాపంతా చెరుపుకుంటాడు. శూన్యంలోకి చూస్తాడు.

ఆనాడు బలవంతంగా సుమతి నెట్టితే ఆఫీసుకు వెళ్ళాడు. చికాకు పడుతూ పని చేశాడు. అయిదు గంటలు కాగానే సెక్రెటేరియట్ బయటికి వచ్చాడు.

"అలా వున్నావేం? ముఖం వాడిపోయింది. కాఫీ తాగుదాం రా." సీతాపతి భుజంమీద చెయ్యి వేశాడు.

ఎక్కడినుంచి వస్తున్నావు?" సీతాపతి వెంట వెళ్ళి కాఫీ టిఫిన్ తీసుకుని బస్‌స్టాండు దగ్గర నిలబడ్డారు ఇద్దరూ.

"నా బస్సు వచ్చింది నీవు యింటికేనా?" అడిగాడు సీతాపతి.

"నేనూ - స్తాను పద." రాఘవరావూ, సీతాపతీ ఎర్రగడ్డ హాస్పిటల్ దగ్గర దిగారు. "మా బావమరిది ఉన్నాడోయి ఇక్కడ. పాపం చిన్నతనంలోనే క్షయ వచ్చింది ఇప్పుడు నయమవుతోంది ఇంకా రెండు నెలలయినా ఉండాలి." అంటూ లోపలికి దారితీశాడు.

"నీతో మాట్లాడుతూ నేను మర్చిపోయాను రాఘవరావు. బత్తాయిపళ్ళు తీసుకువస్తావా?" రెండు రూపాయలు చేతిలో పెట్టాడు.

బత్తాయిపళ్ళు తీసుకుని మెట్లు ఎక్కుతూ ఉంటే తన ముందు అడుగులు వేస్తున్న ముసలమ్మను చూసి ఆలోచనలు ఎటో పరుగులు తీయటం మొదలు పెట్టాయి. ఆమె ముసుగు సవరించుకుంటూ వెనక్కు తిరిగి చూసింది. అరే! బామ్మగారు!

గబగబా అడుగులు వేస్తూ, "ఏం ఇలా వచ్చారు బామ్మగారూ?" ఆయాస పడుతూ అడిగాడు. ముఖం చిన్నబుచ్చుకుని బామ్మగా రిచ్చిన జవాబు అతడిని మరీ చిన్నపరచింది.

"నాయనా మా రమణి ఇక్కడ ఉన్నది. నీవేమి ఎరుగుదువులే? ఏడాది కావచ్చింది."

"నా కెందుకు చెప్పలేదు? నే నిక్కడే ఉన్నానుగా?" ఆమె పక్కనే నడుస్తూ అయోమయ మయిపోయాడు. ఆమె ఒక గదిలోకి దారి తీసింది. రాఘవ రావు మంచంమీద ఉన్న ఆ అస్తిపంజరాన్ని చూసి ఒక అడుగు వెనక్కు వేశాడు. ఆమెలో అతడు పోల్చగలిగినవి ఆ రెండు కళ్ళు మాత్రమే. దగ్గరగా వెళ్ళి, "నే నెవరిని?" అన్నాడు.

ఎండిపోయిన ఆమె ముఖంలో ఒక చిరునవ్వు మెరుపులా మెరిసింది. ఆ నవ్వు కామె ముఖం ఒక జ్యోతిలా వెలిగింది. అతడు అడిగిన ప్రశ్నకు ఆమె జవా బివ్వలేదు. అంతా ముసలమ్మే చెప్పింది. అత డా గదిలో ఉన్నంతసేపూ రమణి కళ్ళల్లోకే చూస్తూ ఉండిపోయాడు అరగంట తరువాత ఆ గది దాటి బయటికి వచ్చి సీతాపతిని కలుసుకుని బస్సు ఎక్కాడు.

రాఘవరావు ఆఫీసు నుంచి రోజూ ఆస్పత్రికి వెళ్ళి బామ్మగారికి కావలసిన వస్తీ కనుక్కొని, ఒక గంటసేపు ఆ గదిలో ఉండి వచ్చేవాడు. బజారు పనులు ఏవైనా ఉంటే చేసిపెట్టేవాడు.

ఇంతవరకూ అతడికి రమణితో ఒంటరిగా మాట్లాడే అవకాశం దొరక లేదు ఆనాడు అతడు వచ్చేవరికి రమణి ఒక్కతే ఉన్నది

"బామ్మగారు లేరా?" చేతిగుడ్డతో ముఖము తుడుచుకుని దగ్గరగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

"నా దగ్గర కూర్చుని ఎప్పుడూ కన్నీళ్ళు కారుస్తూ ఉంటుంది. అందుకని నేనే కాస్త అటు తిరిగిరమ్మని పంపాను. నావంటి రోగులను పదిమందిని చూస్తే తన విచారాన్ని కాస్త మరుస్తుంది"

"అసలు ఎన్నాళ్ళనుంచీ ఈ జబ్బు? ఇక్కడెవరున్నారు? హఠాత్తుగా కలుసుకున్నాం సుమా?"

రమణి నవ్వుతుంటే రాఘవరావుకు ఒళ్ళు జలదరించింది. ఆ నవ్వు చాలా వికృతంగా ఉంది. ఎండిపోయిన ఆ ముఖంలో పైకి కనబడుతున్న పళ్ళు భయ పెడుతున్నాయి.

ఇప్పుడు సిగ్గుపడవలసిన అవసరం ఇద్దరికీ లేదు. అందుకని మాట్లాడటంలో కొంత సౌలభ్యం ఏర్పడ్డది.

"అయితే రమణీ! నీకు పెళ్ళయింది కదా. మీ ఆయన ఎక్కడున్నాడు? పిల్లలా?" ఈ ప్రశ్న ఆమెనే అడగాలని బామ్మగారిని అడిగి తెలుసుకోలేదు.

ఈ మాటకు రమణి కళ్ళు మూసుకుని ఓ నిట్టూర్పు విడిచింది. కొంతసేప టికి "పెళ్ళి జ్ఞాపకాలు ఏమీ మిగలలేదు." అంటూ చెయ్యి తిప్పింది అంతలో బామ్మగారు వచ్చింది

"నాయనా! ఇప్పుడే అలా వెళ్ళాను. మా రమణి జీవితం చూశావా? కాస్త పెద్ద వాడయినాసరే అని యిస్తే వస్తేట ముంచాడు. పోనీ అదయినా

ఎట్లాగో బతుకుతుం దనుకుంటే ఈ జబ్బొకటి వెంటపడ్డది." కాసేపు కన్నీళ్ళు కార్చింది.

తప్పు చేసినవాడిలా రాఘవరావు తల వంచుకున్నాడు. ఇంటి కెళ్ళేసరికి తండ్రీ తల్లీ ఎదురుగా వచ్చారు. చెల్లెలి పెళ్ళి నిశ్చయమైనదట. వస్తువులు బట్టలు కొనుక్కుపోవటానికి వచ్చారట. తండ్రి తనపెళ్ళికి తీసుకున్న కట్నం ఇద్దరు ఆడ పిల్లలకు ఇస్తున్నాడు లౌకిక మెరిగినవాడు. తండ్రితో మనసిచ్చి మాట్లాడలేక పోయాడు సుమతిని తీసుకుని పెళ్ళికి నాలుగురోజులు ముందుగా రమ్మని తండ్రి మరీమరీ చెప్పి వెళ్ళాడు.

రాఘవరావు ఎనిమిది రోజుల తరువాత ఆఫీసునుంచి హాస్పిటల్‌కు సరా సరి వెళ్ళాడు. అతడు వెళ్ళేసరికి ఆ గదిలో వాతావరణం ఎప్పటిలాలేదు. బామ్మ గారు రెండుచేతులూ తలమీద పెట్టుకుని గడపలో కూర్చుంది. మంచం మీద అయోమయావస్థలో రమణి వెర్రిచూపుల్తో మెలికలు తిరుగుతున్నది.

"బాధ ఎక్కువయిందా బామ్మగారూ?" అన్నాడు గదిగుమ్మం దాటుతూ.

"ఇంకేం బాధలు నాయనా? నా తల్లికి ఇంక బాధలు ఉండవని డాక్టరు చెప్పాడు. చమురు అయిపోయింది; దీప మారిపోతుంది. తండ్రికి కబురు చేశాను. వచ్చే వ్యవధి ఉన్నదో లేదో?" ముసలమ్మ ముఖం చేతులతో కప్పుకుని ఏడ్చింది.

రాఘవరావు మంచం దగ్గరగా కుర్చీ లాక్కుని రమణి నోట్లో ఒక్కొక్క చుక్క మంచినీళ్ళు చంచాతో పొయ్యటం మొదలుపెట్టాడు.

ఏడుగంటలు కావచ్చింది ఏడ్చిఏడ్చి బామ్మగారు సొమ్మసిల్లిపోయింది. ఉన్నట్టుండి రమణి బళుక్కున వాంతి చేసుకుంది ఆమె కళ్లుతెరిచి చూసినట్టే చూసి మూసుకున్నది.

ఒక్కొక్క అడుగే వెనక్కు వేస్తూ రాఘవరావు గుమ్మందాటి బయటికి నడిచాడు. బస్సు అందలేదు. రిక్షా ఎక్కి కొంతదూరం వెళ్ళి అక్కడ బస్సు ఎక్కాడు.

తొమ్మిది గంటలయినా ఇల్లు చేరుకోని భర్తకోసము సుమతి గుమ్మంలో నిలబడి ఎదురుతెన్నులు చూస్తున్నది. రాఘవరావును చూడగానే ఏమీ ప్రశ్నించ కుండా వెనకాలే లోపలికి వెళ్ళింది.

భోజన మయిందనిపించి పడక చేరిన రాఘవరావు తన ప్రక్కనే కూర్చున్న సుమతిని కన్నార్పకుండా చూస్తూ "రక్తమిచ్చిన ప్రాణదాత ఋణాన్ని నీటిచుక్కలతో తీర్చుకోజూచిన వ్యర్థుణ్ణి? పిరికివాణ్ణి!!" నుదురు కొట్టుకున్నాడు. "సుమతీ! జడగంటల రమణి వెళ్ళిపోయింది. నేను చూస్తూ ఉండగానే వెళ్ళిపోయింది-" గొణుక్కున్నాడు.

'నా బొమ్మ కిందపడి ఎందుకు పగిలిపోవాలి' అని మారాముచేసే పిల్లవాడిని తీసుకుని బుజ్జగించే తల్లిలా సుమతి అతడిని ఒళ్ళోకి తీసుకుంది.

(యువ).



# మంగువ పొలుపు

చల్లటిగాలి మందంగా వీచటం మొదలుపెట్టింది. తడకల ఆవరణంలో నులకమంచాల మీద పడుకున్న రోగులకు అప్పుడప్పుడే కన్ను మలగుతున్నది. శారీరకమైన బాధలు ఒక్కొక్కటే చేత్తో తీసేసినట్టుగా నిద్రలోకి జారుకుంటున్నారు.

తెల్లవార్లూ "అమ్మా, అబ్బా" అంటూ మూలుగుతూ ఉంటారు రోగులు వాళ్ళ మూలుగులు ఆ తోటలో చెట్లకొమ్మలలోనుంచి అరమైలు దూరాన ఉన్న ఊళ్లోకి వినబడుతూ ఉంటాయి.

ఉదయం ఆరుగంటలకు ఎర్రంచు తెల్లచీరె కట్టుకుని - దానిమీద తెల్లటి రవిక తొడుక్కుని - తలవెంట్రుకలు జారకుండా గట్టిగా ముడివేసుకుని - దాని మీద తెల్లటిబట్ట కట్టుకుని - చందమామలాంటి ముఖానికి దృష్టి తగలకుండా పెద్ద బొట్టు పెట్టుకుని - ఆకు చెప్పులు వేసుకుని శీల ఆవరణంలో అడుగుపెడుతుంది.

అది పది ఎకరాల తోటలో తడకల ఆవరణంలో పెద్ద పెద్ద పాకలతో వేసిన నర్సింగ్‌హోం. ఏభయి మంచాలు వేసి ఉంటాయి. కాని - మూడూ, నాలుగూ మంచాలు ఖాళీగానే ఉంటాయి. శీల అడుగుపెడుతూనే రోగులు పడుకున్న మంచాలను లెక్కబెట్టుకుంటుంది. గబగబా నాలుగు బకెట్ల నీళ్ళు తెచ్చిపెట్టుకుని ఒక్కొక్కరికే చెంబుల్లో నీళ్ళు పోస్తూ "అయ్యగార్లూ! లేవండి! ముఖాలు కడగండి" అంటూ కేకలు పెడుతుంది. రెండవ మలుపులో మంచాల దగ్గర అందరికీ బేసిన్లు పెట్టుకుంటూ పోతుంది. మూడవ మలుపులో కూర్చుని కళ్ళు నలుపుకుంటున్న వాళ్ళ చేతుల్లో పళ్ళపొడి రాల్చుతుంది.

"వచ్చావు అప్పుడే మమ్మల్ని లేపటానికి?"

"ఇప్పుడిప్పుడే కళ్ళు మూతలు పడుతున్నాయి. ఇంతలోకి రానేవచ్చావు!"

"నిద్ర పట్టనే పట్టదు. పట్టగానే తరుముకుంటూ వస్తావు."

ఇలా ఒక్కొక్కరే నవ్వుతూ, నవ్వుతూనే విస్ఫూరాలాడుతూ ఉంటారు శీల ముఖంలోకి చూస్తూ.

"నవ్వుంటారేం? గడియారాన్నడగండి. ఏడు గంటలకు డాక్టరుగారు వచ్చేటప్పటికి ముఖాలు కడుక్కొని రొట్టె తిని, వేడి వేడి కాఫీ త్రాగి, బట్టలు మార్చుకుని శుభ్రంగా కనబడండి" విస్ఫూరమైన నిజాల్ని నవ్వుతూ చెప్పి శీల తన పనిలో నిమగ్నమయిపోతుంది.

డాక్టరు కృష్ణమ్మ ఖద్దరు పైజామా-లాల్చీ-నల్లటి ఫ్రేముగల కళ్ళద్దాలు-నెరిసీ నెరవని ఒత్తయిన క్రాపు-నల్లటి దేహచ్ఛాయ అయినా కళగల ముఖమూ-తేజస్సు లొలికే పెద్ద కళ్ళూ-పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ తన భారీ దేహాన్ని చురుకుగా నడిపిస్తూ ఆవరణంలో ప్రవేశించిన గుర్తుగా చిన్న ఈలవేస్తాడు.

రోగులందరికీ ఉదికిన దుప్పట్లు కప్పి-మెడల దగ్గర మడిచి-రెండు చేతులు ఛాతీమీద పెట్టి-తన పని అయిందన్నట్టుగా సుగ్రీవులు పొట్టిలాగు-పొట్టి చేతుల షర్టూ తొడుక్కొని క్రాపు రెండు చేతులతో సవరించుకొంటూ ఆవరణం ముందర నిలబడతాడు. డాక్టరు కృష్ణమ్మ ఈలపాట వినగానే వెన్నువిరుచుకొని - చురుకుదనం తెచ్చుకుని ఎదురుగా వెళ్ళి "దణ్ణం బాబూ!" అంటాడు సుగ్రీవులు.

సుగ్రీవులు ముఖం చూడగానే తెలిసిపోతుంది. డాక్టరుకు - రోగులందరూ క్షేమంగా ఉన్నారని. హుంషారుగా లోపలికి వచ్చి, అందరినీ పరిహాసం చేస్తూ పలకరించి ఒక్కొక్కరినే పరామర్శ చేస్తాడు.

ఆ పలకరింపు అమృతప్రాయంగా ఉంటుంది రోగులకు. తమ బాధలన్నీ వెళ్ళబోసుకుంటూ -మందుమార్చమని డాక్టరుకు సలహాలిస్తూ - తమ దగ్గర మరో పది నిమిషాలు నిలబడి తమ గోడు వినమని వేడుకుంటారు రోగులు.

"నేను చెప్పింది మీరు వింటున్నారా? ఈ తల నిన్న సాయంత్రం నుంచి సహస్ర శకలాలయిపోతున్నది. మీరు రాత్రి పంపిన మందుతో ఏమీ తగ్గలేదు" అంటా డొక రోగి.

"మీ చెయ్యి మంచిదని చెప్పగా విని ఇంతదూరం వచ్చాను డాక్టరుగారూ! నా కడుపునొప్పి తగ్గటంలేదు" అంటాడు పదవనెంబరు రోగి.

అందరూ అన్ని రకాల బాధలూ వర్ణించి చెబుతుంటే డాక్టరు కృష్ణమ్మ ముఖం యధాప్రకారంగా ఉంటుంది మందహాసంతో.

సుగ్రీవులకు ఒళ్లు మండిపోతుంది.

"డాక్టరుగారిని చూడగానే ఎక్కడలేని రోగాలు పుట్టుకొస్తాయి వీళ్ళకు" పళ్లు కొరుకుతాడు.

శీల పదకొండు గంటలకు రోగుల కందరికీ డాక్టరు చెప్పిన విధంగా దూరంగా ఉన్న పాకలో వంటచేసి తీసుకువచ్చి పెడుతుంది.

రోగులందరూ నిద్రకొరిగి ఉండగా చూసి మధ్యాహ్నం పన్నెండు గంటలకు ఆ సమీపంలో ఉన్న ఇంటికి వెళ్ళి సాయంత్రము నాలుగు గంటలకు తిరిగి అక్కడికి వస్తాడు డాక్టరు. ఈ లోపల రోగుల భారమంతా సుగ్రీవులు, శీల వహిస్తారు.

రాత్రి పన్నెండు గంటల సమయం. రోగులందరూ హాయిగా, గాఢంగా నిద్రపోతున్నారు గదా అని సుగ్రీవులు ఆదమరచి నిద్రకు లోనైనాడు.

"బాబూ! బాబూ!" గట్టిగా అరుస్తున్నారు నలుగురు మనుష్యులు తడక దగ్గరగా నిలబడి.

సుగ్రీవులకు పిలుపందలేదు

రెండు, మూడుసార్లు పిలిచిన తరువాత వాళ్ళల్లో సహనం తగ్గింది. కొండ కేకలు పెట్టారు.

ఉలిక్కిపడి దిగ్గున లేచాడు సుగ్రీవులు కప్పుకున్న దుప్పటిని కాళ్ళతో తన్నుకుంటూ. కళ్ళు నులుముకుంటూ తడక దగ్గరికి వెళ్ళాడు.

అంతలో మరో కేక.

పరుగుతీశాడు సుగ్రీవులు. ఆయాస పడుతూ తడకకు కట్టిన తాడు తీశాడు.

తిరగవేసిన నులకమంచంలో పడుకుని మూలుగుతున్నాడొకరోగి, మంచంలోనుంచి రక్తం బొట్లుబొట్లుగా కారుతున్నది.

సుగ్రీవులు ఆ మంచాన్ని తాను కూడా పట్టి లోపలికి చేర్చాడు. ఒక్క పరుగున డాక్టరింటికి వెళ్ళి తలుపుకొట్టాడు.

"బాబూ! బాబూ! ఘోరం బాబూ! ఒక కేసు వచ్చింది. రక్తం కారుతూ మడుగులు కడుతున్నది" ఆయాసపడుతూ చెప్పి, వాకిట్లోకి వచ్చిన డాక్టరును అనుసరిస్తూ అలుపు తీర్చుకుంటున్నాడు.

"ఏం కేసు? ఆడా, మగా?" టార్చిలైటు చూపిన మార్గాన నడుస్తూ ఒక చేత్తో తల నవరించుకుంటున్నాడు, డాక్టరు కృష్ణమ్మ. ఇద్దరూ నడిచారు. అది మామూలు నడకకాదు. పరుగు లాంటి నడక. పది నిమిషాలలో తడక దగ్గరికి చేరుకుని హుందాగా లోపలికి అడుగుపెట్టాడు.

రోగి వంటిమీద కప్పిన బట్టతీసిన డాక్టరు కళ్లు పెద్దవయ్యాయి. సుగ్రీవులు కెవ్వున అరవబోయి పెదవులకు రెండు చేతులు అడ్డంపెట్టుకుని ముఖం పక్కకు తిప్పుకున్నాడు.

"ఏం జరిగిం దసలు?" డాక్టరు కృష్ణమ్మ చేతులకు కట్టిన గుడ్డలు ఊడదీస్తూ అడిగాడు.

రెండు చేతులకు బొటనవ్రేళ్ళు లేవు. రక్తముతో గుడ్డలు తడిసి ముద్దయ్యాయి. అతడిని లోపలికి తీసుకు వెళ్ళి ఇంజక్షను ఇచ్చి, మందువేసి రెండు చేతులకు కట్లు కట్టాడు. కళ్ళు తుడిచి పెదవి విరుస్తూ మందువేసి పైన దూది పెట్టాడు. సుగ్రీవులు సహాయంతో అతడిని ఒక మంచమ్మీదికి చేర్చారు, రోగికి బాధతెలియకుండా నిద్రకొక ఇంజక్షను ఇచ్చి మంచాల మధ్యగా కుర్చీవేసుకుని కూర్చున్నాడు.

అప్పటికి రోగి అరుపులకు మిగతా రోగులంతా పడకలమీద లేచి కూర్చున్నారు. రోగితో వచ్చిన నలుగురూ తడకదాటి ఖాళీ మంచం దగ్గిరగా కూర్చుని కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నారు. అప్పటికి నాలుగైదుసార్లు సుగ్రీవులు ఏడవవద్దని బెదిరించి వచ్చాడు.

ఏడుస్తున్న వాళ్ళల్లో ఒకడు తండ్రి-ఒకడు తమ్ముడు-ఒకడు బావమరిది-రోగికి ఒకడు ఎరకయినవాడు.

ఈ రోజుల్లో కూడా ఇటువంటి ఘోరకృత్యాలు జరుగుతున్నాయా? పట్టణాలలోకంటె పల్లెసీమలలో ఇటువంటివి ఎక్కువగా జరుగుతాయి. ఇంత ఘోరమైన శిక్షకు ఇతడేమి చేసి ఉంటాడు? డాక్టరు కృష్ణమ్మ మనసులో రేగిన భావసంచలనము అతడి నక్కడ ఎక్కువసేపు కూర్చుండనీయలేదు.

రోగికి మత్తు ఆవరిస్తోంది. అరపులు క్రమంగా తగ్గి సన్నటి మూలుగుగా మారాయి. రోగి ముఖంలో అలసట బాగా కనిపిస్తోంది. అతడు పడిన బాధంతా ముఖంలో ద్యోతకమవుతోంది. నిద్రలో కూడా అప్పుడప్పుడు కనుబొమలు చిట్లించి ముక్కు ముడుస్తున్నాడు.

డాక్టరు కృష్ణమ్మ రోగులందరినీ ఒకసారి కంటితో చూసి "ఉఁ" అంటూ దీర్ఘంగా నిట్టూర్చి లేచాడు.

గాయపడిన రోగి వెంట వచ్చినవాళ్లు డాక్టరు వెంట కర్రగేటువరకూ వచ్చి "బాబయ్యా! వెళ్ళిపోతున్నారా?" కాళ్ళకు దణ్ణాలు పెట్టారు.

"ఏం భయంలేదు, బాగా నిద్ర పోతాడు. ఉదయం కాఫీ, రొట్టె ఇవ్వండి. నేను మళ్ళీ వచ్చి చూస్తాను."

"బాబయ్యా! వాడు బతుకుతా డంటారా?" వాళ్ళల్లో ఒకడు డాక్టరు కాళ్ళను వదిలిపెట్టలేదు.

"నిక్షేపంగా ఉంటాడు. మానటానికి కొంతకాలం పడుతుంది. మందులతో కొంత బాధ తగ్గుతుంది గాని సొంతం తగ్గదు. అతడికి ప్రాణభయంలేదు." డాక్టరు ముందుకు అడుగువేశాడు.

"అరే! డాక్టరు బాబుకు ఈ ఘోరం ఎట్లా జరిగిందో చెప్పలేదు" అన్నాడు బావమరిది.

"ఎట్లా జరిగిందో తెలిస్తే మందులు మారుస్తాడా? చెప్పినా చెప్పకపోయినా ఒకటే వైద్యము. దానిలో మార్పు ఏముంటుంది?"

మెల్లగా నడుస్తున్న డాక్టరు కృష్ణమ్మ కీమాటలు వినబడుతున్నాయి.

చిన్నగా నవ్వుకుంటూ - తల వెంట్రుకలు వెనక్కుతోసుకుంటూ ముందుకు నడక సాగించాడు. డాక్టరు కృష్ణమ్మ ఇంటికీ, రోగులు ఉండే ఆవరణానికీ మధ్యగా ఎన్నో పెద్ద పెద్ద చెట్లు-వాటి మధ్య బండి సాగిపోగలిగి నంత బాట. దానిమీద మనుష్యులు తామే నడుస్తున్నా మనుకుంటారు గాని-నిజానికి గాలి వాళ్ళను నడిపిస్తూ ఉంటుంది. చెట్లక్రింద రాలిన పూల రాసులు గాలికి ఇటూ అటూ ఊగుతూ ఒక చోటినుండి మరొక చోటికి తోసుకుపోతూ ఉంటాయి. దారి మధ్యలో రెండు చెట్లు ఒకదానితో ఒకటి గాలి తాకిడికి పెనవేసుకుంటూ విడిపోతూ ఒక విధ మైన ఉద్వేగాన్ని సృష్టిస్తాయి. ప్రళయము వచ్చినట్టుగా ఊగిపోతాయి. వాటిక్రింద నడిచినవాళ్ళు చావు తప్ప దనుకుంటారు. డాక్టరు కృష్ణమ్మ ఆ చెట్ల దగ్గరికి రాగానే తల పైకెత్తి చూస్తాడు. ఆ చెట్లు సృష్టించే శబ్దానికి అతడి దేహము జలదరిస్తుంది. మనను ఆదొకమాదిరిగా అయిపోతుంది.

మరునాడు ఉదయము ఎప్పటి మాదిరిగా కాకుండా చాలా తొందరగా వచ్చాడు డాక్టరు కృష్ణమ్మ. మామూలుగా వినబడే ఈలపాట వినబడలేదు సుగ్రీ వులకు. రోగులతో పరాచికా లాడుతూ అందరినీ నవ్విస్తూ తాను నవ్వుతూ పనిచేస్తున్నాడు.

వేళ్లు తెగిన రోగి "బాబూ, బాబూ" అంటూ రెండుసార్లు పిలిచాడు సుగ్రీవుల్ని.

కొంతసేపటికి "నన్నేనా ? నొప్పి తగ్గిందా ?" దగ్గరికి వచ్చి ఏంకావా లన్నట్టు చూశాడు సుగ్రీవులు.

"బాబూ ! ఒక్కమాట. పొద్దుటి నుంచీ అందరికీ నీళ్లు అందిస్తూ ముఖాలు కడుక్కోమని కేకలు పెట్టిందెవరు ?" మెల్లగా అడిగాడు.

సుగ్రీవులు ఆశ్చర్యంతో తల గోక్కుంటూ "ఏం ? నీకు నీళ్లు పొయ్య లేదా ? పళ్ళపొడి చేతిలో వెయ్యలేదా ? ఏమిటి సంగతి ?" అన్నాడు.

"మా నాయన ముఖం కడిగించాడు. అసలు ఎవరు ఆ మనిషి ?" కళ్ళ మీద ఉంచిన దూదిని కట్టుకట్టిన చేత్తో తడుముకుంటూ - వంకర నవ్వులు నవ్వుతూ అడిగాడు.

"నెప్పి పోయిందా? లేక కాస్త తగ్గిందా?" అడిగాడు సుగ్రీవులు

"డాక్టరుగారి చేతిలో పడ్డాను కదా! అదే తగ్గుతుంది. నే నడిగిన సంగతి?"

"ఇక్కడ పనిచేసే శీలమ్మ. నేను చెబుతాలే కాస్త జాగ్రత్తగా కనుక్కోమని." దాటుకుంటూ మరో మంచం దగ్గరికి వెళ్ళాడు సుగ్రీవులు.

మొదటి మంచం దగ్గర ఉండి వింటున్నాడు డాక్టరు ఈ సంభాషణ.

పన్నెండు గంటల లోపల శీల రోగు లందరికీ భోజనాలు తెచ్చింది. వేళ్ళు తెగిన రోగి దగ్గరకొచ్చి "అన్నంలోకి పులుసుపొయ్యనా - కూరవెయ్యనా?" అడిగింది.

"మన దేవూరు? ఈ ఊరు కానట్టుందే?" లేచి కూర్చోబోయాడు.

"మన దేవూరయితేనేం? కూరా? పులుసా? చెప్పు? ఎంతమంది ఉన్నారో చూడు. వాళ్ళందరికీ భోజనాలు వేళకు అందాలి. చెప్పు ఏంకావాలో?" తొందర పెట్టింది శీల

"అయ్యో! ఊరి పేరడిగితేనే తప్పా? విచిత్రంగా ఉందే?"

డాక్టరు వింటున్నవాడల్లా అతడి మంచం దగ్గరికి వచ్చాడు.

"అయితే మన దేవూరు? కులం? గోత్రం?"

నడుముమీద చెయ్యిపెట్టుకుని ప్రశ్నించాడు డాక్టరు.

"ఆఁ....తమరు....తమరు...." నసిగాడు. "నేను నేనే .... ఇక్కడి డాక్టర్ని."

ఆ సమీపంలో పిడుగుపడినట్లు అదిరిపడ్డాడు అతడు.

"డాక్టరుగారూ! తమరి గొంతు ఎక్కడో విన్నట్లే ఉంది బాబూ! చప్పున జ్ఞాపకం రావటంలేదు."

"దానికోసం బాధపడకు. నీ నొప్పిత్వరగా పోవాలని దైవప్రార్థన చేసుకో." గబగబా అడుగులువేసుకుంటూ పోయి తన కుర్చీలో కూర్చున్నాడు డాక్టరు.

రోగి మనసు అంతటితో ఆగలేదు. ఆ కంఠధ్వనిని గుర్తుపట్టి దాని తాలూకు చరిత్రకోసం పెంపరలాడటం మొదలుపెట్టింది. సివిల్ సర్జన్ గ్రేడులో ఉద్యోగం చేస్తూ జిల్లాకు అధికారిగా ఉన్న డాక్టరు ఈ మారుమూల తోటలో పాకలువేసి ఆసుపత్రి నడుపుతున్నాడే! ఉద్యోగం వదులుకుని-తన పరువు ప్రతిష్ఠలను వదలుకుని - ఈ గుడిసెల్లో పనిచేస్తూ దాక్కోవటం ఎందుకు?

అతడి జ్ఞాపకాలలోనుంచి - ఆలోచనలలోనుంచి - బాధలలోనుంచి డాక్టరు చరిత్రకు రూపురేఖలు అమరాయి. డాక్టరు ప్రాణదాత. తన సర్వశక్తులూ ఉపయోగించి ప్రాణం నిలపటానికే ప్రయత్నం చేసేవాడు. కాని....ఇతడు - ఈ డాక్టరు ఎక్కడ పనిచేస్తే అక్కడ నోరులేని దిగువ తరగతి స్త్రీలను మలినపరచటంలో ఆరితేరినవాడు. తియ్యని మాటలతో ఆపద్బాంధవుడిలా కనబడి సర్వం దోచుకునే దోపిడీదారు. పనిచేసిన ప్రతిచోట పదిమందిచేత ఛీ అనిపించుకుని బదిలీ చేయించుకునేవాడు.

రోగి ముఖం ఎర్రబడ్డది. నరాలన్నీ బిగుసుకున్నాయి. ఉద్రేకంతో గుండె ఎగిసెగిసిపడుతోంది. పసిబిడ్డ ప్రాణాలు కాపాడమని కాళ్ళమీదపడి తన దగ్గర ఉన్న ఐదురూపాయలు సమర్పించిన బిడ్డ తల్లిని "నాకు రూపాయలెందుకే?" అంటూ చెయ్యపట్టుకు లాగి నిలువుదోపిడీ చేసిన వైద్యుడు. ఆ ఆడది - అతడి కళ్ళకు మత్తు గొలిపిన ఆడది తన చెల్లెలు. బిడ్డ ఏడుస్తుండగా తల్లికి మానభంగం చేసిన అధము డీ డాక్టరు....

తన జ్ఞాపకాలన్నీ నిజమైతే ఇతడు-వైద్యుడి రూపంలో ఉన్న పరమ నీచుడు- దుర్మార్గుడు.

డాక్టరు ఇచ్చిన మందు తెచ్చి గొంతులో పోశాడు సుగ్రీవులు. నిద్రకు మందు-దాని ప్రభావంవల్ల అతడికి ఆవలింతలు రావటం మొదలుపెట్టాయి. అతడి మనోఫలకంపైన నిలిచి ఉద్రేకపరచిన బొమ్మలు మరుగైపొయ్యాయి....నిద్రలోకి జారుకొన్నాడు.

వేళ్లు తెగిన రోగికి క్రమంగా గాయం నయమయిపోయింది. కన్నుమాత్రం పోయింది. కట్టువిప్పితే కంటికి దృష్టి వస్తుందని అతడు ఆశపడుతున్నాడు.

రోగులలో నయమయినవారు ఇళ్లకు వెళ్లుతున్నారు. కొత్తవాళ్లు వస్తున్నారు. డాక్టరుగారు వాళ్ళను ఇంత ఇవ్వమని కచ్చితంగా అడగరు. వాళ్ళకు చేతనైనంత సంతోషంతో ఇస్తున్నారు.

వాళ్ళు "చిత్తం బాబయ్యా, మా ప్రాణాలు కాపాడారు. మీ ఋణం తీర్చుకోలేము" అంటూ దణ్ణాలు పెడతారు వెళ్ళేటప్పుడు.

"దానికేముంది? నా వృత్తే అది. మంచిది వెళ్ళండి. వెళ్ళి మళ్ళీరాకండి" అంటూ సాగనంపుతాడు డాక్టర్ స్వయంగా.

వాళ్ళ దృష్టిలో ఆయన దేవుడి తరువాత దేవుడంతటివాడు.

వారంరోజుల తరువాత రోగి ఒక చేతి వేలు లోపలినుంచి కుళ్లుకురావటం మొదలుపెట్టింది. అతడి వెంటఉన్న వాళ్ళతో చెప్పాడు, డాక్టరు-"నేనుప్రయత్నము చేస్తున్నాను గాని - లాభం కనబడటంలేదు చెయ్యి మణికట్టు వరకూ తీసివెయ్యాలి."

"బాబూ! కనికరించండి. చెయ్యిపోతే వాడు బ్రతికేదెట్లా? బ్రతుకుతెరువు కాస్తా పోతే పోయింది. అన్న మయినా తినేటట్లు చెయ్యండి" దణ్ణాలు పెడుతూ తడక గేటువరకూ వచ్చాడు.

"నేనేం చెయ్యను! నా చేతుల్లో ఏమీలేదు. పరిస్థితి అలా ఉన్నది."

మరునాడు మణికట్టువరకూ ఒక చెయ్యి తీసేశారు. నిద్రకు మందిచ్చినా పనిచేయటంలేదు. రోగి కేకలు పెడుతున్నాడు.

"లేవండి, లేవండి. ముఖాలు కడగండి. డాక్టరుగారు వస్తారు."

మార్దవమైన సన్నటి కంఠధ్వనికోసం ఎదురుచూసిన రోగికి కర్ణకఠోరమైన ధ్వని వినబడ్డది. తన మనసును రంజింపచేసిన కాలిపట్టాల చిరుగజ్జెల సవ్వడి ఆనాడు వినరాలేదు. మనసులో గిలిగింతలు పెట్టిన గాజుల గలగల కర్ణపుటాలకు తాకలేదు. శీల ఎందుకు రాలేదు?

మరునాడు-ఆ మరునాడు-తరువాత వారంరోజులవరకు శీల పదధ్వని అతడికి వినరాలేదు.

"సుగ్రీవులూ!"

"ఏం బాబూ! నిద్రరాలేదా? డాక్టరుగారికి చెప్పి మరోడోసు ఇప్పించనా!"

"వద్దు. వద్దు. నా కటువంటిదేమీ వద్దు. సుగ్రీవులూ! అట్లా పరుగులు తీస్తావేం? మాట, ఇలా రా."

"నాకు వెయ్యి పనులు బాబూ! ఒక్కళ్ళ దగ్గరే నేను ఇంతసేపు నిలబడితే ఎట్లా?"

"బాబ్బాబు. అసలే ఈ చేతి బాధతో నిద్రాహారాలు లేక ఏడుస్తున్నా. కాస్త మంచీ చెడ్డా మాట్లాడేవాళ్ల కావాలి."

"అయితే చెప్పు. కాని-త్వరగా చెప్పు.

"చూడు బాబూ! అయితే ఆమె ఎందుకు రాలేదు?"

సుగ్రీవులు నవ్వాడు బిగ్గరగా. "మానవ దేహం. జ్వరమో, కడుపు నొప్పో-ఏదో వచ్చి ఉంటుంది. తగ్గితే వస్తుంది" అన్నాడు మామూలుగా.

మరొక వారం అయినా శీల రాలేదు.

"సుగ్రీవులూ, అయితే శీల ఇంక రాదా?"

"నీకేం లోపం జరగటం లేదుకదా. ఇంకేం? ఎప్పుడో వస్తుంది." సమాధానం చెప్పి సాగిపోయాడు సుగ్రీవులు.

"హుఁ శీల—ఆ శీలే ఇదయితే మరి రాదు. నేనుండగా రాదు" పళ్ళు కొరికాడు రోగి.

అతడు గ్రామ మునసబుకు సలహాదారు. మునసబుకంటె ఆ గ్రామం సంగతీ-గ్రామస్థుల సంగతి-ఆస్తి పాస్తుల వివరాలు - జనన మరణాలు - అన్నీ అతడికి తెలుసు. అతడికి ఎదురు చెప్పి-ఎవరూ బాగుపడలేదు అందరి ధన మాన ప్రాణాలు అతడి చేతిలో ఉండేవి. ఒక్క కరణం ఇంటి జోలికి మాత్రంపోలేదు. మిగతా గ్రామమంతా తన చేతిలోనే ఉంది అటువంటి గ్రామంలోకి ఈ శీల గామ సేవికగా వచ్చింది....అతడి చేతి కందలేదు. అందకపోగా-అతడిప్రయత్నా

-బిలో బూడిదపోసి పైవాళ్ళకు చెప్పి అతడిని అరెస్టు చేయించి - తాను బదిలీ చేయించుకుంది, "అప్పుడు తప్పించుకున్నది ఇప్పుడు ? ఎట్లా తప్పించుకుంటుందో చూడాలి. నేనింతటితో దాన్ని విడిచిపెడతానా?"

ఆలోచనలు టక్కున ఆగిపోయాయి. నిద్రలోకి జారుకున్నాడు.

"సుగ్రీవులూ ! నా చెయ్యి నయమవుతుందా?" దీనంగా అడిగాడు.

"ఎందుకు కాదు ? కుళ్ళిపోయిన భాగం తీసేశారుకదా. ఇంక బాగవుతుందిలే" గొంతులో మందు పోసి దుప్పటి సరిగా కప్పి వెళ్ళబోయాడు సుగ్రీవులు.

"చూడు సుగ్రీవులూ ! ముఖాలు కడిగించటం- అన్నం పెట్టటం ఈ పనులు ఎట్లాగయినా ఆడపనులు. అవి ఆడవాళ్లు చేస్తేనే అందం. రోగుల కయినా వాళ్ళ మాట వినబడగానే అమృతం చిలికినట్లవుతుంది. ప్రాణం లేచివస్తుంది. బాధలన్నీ మరచిపోతారు. మీ డాక్టరుగారు శీలలాంటి ఆడమనిషిని తీసి ఈ మోటు మగవాణ్ణి పెట్టారెందుకయ్యా?"

"కాదు బాబూ ! ఆడవాళ్ళను పెడితేనే రోగాలూ, బాధలూ ఎక్కువవుతున్నాయి ఇక్కడ, మీరేమో ఇంకోలా మాట్లాడుతున్నారు."

నెలరోజుల తరువాత రోగికి మల్లెల వాసన ముక్కుపుటాలకు తాకింది. కాలి పట్టాల చిరుగజ్జెల సవ్వడి గాజుల గలగల కర్ణపుటాలకు తాకింది తీయటి కంఠం ఒళ్లు పులకరింపచేసింది. రోగి ముఖం వికసించింది. కంటిరెప్పలు కదలాడాయి. మొలకనవ్వులు పెదవుల నలంకరించాయి. అతడు కంటితో ఆమెను చూడలేడు ఒక చెయ్యి మొండిది. మరొకచెయ్యి, కాలు చచ్చుపడ్డాయి. చేతితో ఆమెను తాకలేడు. కాని - కాని - మగువ పొలుపు-ఒకప్పుడు తన చెయ్యి జారిపోయిన మగువ ఉనికి -అతడిని పరవశిం, చేస్తున్నాయి.

"శీలా ! వీళ్ళంతా నీ బిడ్డలు. నీవు లేని నెల్లాళ్లూ నీకోసం అందరూ కలవరించారు" అంటున్నాడు సుగ్రీవులు.

"వీళ్ళంతా నా బిడ్డలా ! నా కోసం కలవరించారా !" పకపక నవ్వింది శీల.

"వాడు కూడా కలవరించాడా ? వాడు ఆ చెయ్యీ-కన్నూ లేనివాడు కూడా?"

"ఆఁ. వాడే ఎక్కువగా కలవరించాడు," అంటున్నాడు సుగ్రీవులు నవ్వుతూ.

"వాడా? వాడికి ఆ వేళ్ళు ఎందుకు పోయాయో తెలుసా? ఆ కన్ను ఎందుకు పోయిందో ఎరుగుదువా? అందరిమీదా కన్నువెయ్యకుండా ఎవరో కన్ను పొడిచారు. అందరినీ నాశనం చెయ్యకుండా ఎవరో వేళ్లు కోసేశారు. నన్నడిగితే కాళ్లు కొట్టెయ్యమనేదాన్ని." ఆవేశంతో అంటోంది శీల.

రోగి అంత బాధలోనూ నవ్వుతున్నాడు. తను ఎన్నిసార్లు ఎంతకాలం నుంచి వింటున్నాడీ మాటలు. మాటలు గాలికి పోతాయి. కాని మగువ పొలుపు? అది ఎటువంటి పరిస్థితులలో కూడా తన మనసును అలరిస్తూనే ఉంటుంది.

అతడి పెదవుల మీద ఆ నవ్వు చాలాసేపు నాట్యం చేసింది.

డాక్టరు కృష్ణమ్మ తల ఆడిస్తున్నాడు కుర్చీలో కూర్చుని.

(యువ — మాస పత్రిక)



# ట్రూత్ సీరమ్ చెప్పిన కథ

మధ్యాహ్నం మూడుగంటలవేళ — ఆఫీసులో భోజనంచేసి రిటైరింగ్ రూములో సోఫామీద నడుం వాల్చాడు ఈశ్వర్. ఉదయం పదిగంటలనుంచీ ఒంటిగంటన్నరవరకూ కదలకుండా కుర్చీలో కూర్చుని ఫైల్సుచూసిన ఈశ్వర్. భోజనంచేసిన తరువాత ఒక అరగంటసేపు పేపరు చూస్తాడు. ఒక పదినిమిషాల సేపయినా కన్ను మూస్తాడు. కమిటీలు లేనినాడు అతడు తీరిగ్గా పేపరు చదవగలుగుతాడు ఆనాడు కొంచెం తీరిక చిక్కింది. పేపరు పూర్తిగా చదివిన తరువాత అతడి ధ్యాస పేరు మీదికి మళ్ళింది.

అతడి పూర్తి పేరు ఈశ్వరచంద్ర విద్యాసాగర్. మెట్రిక్ ప్యాసయిన తరువాత తన పేరులోని చంద్ర విద్యాసాగర్‌ను ఇంటిపేరుతోపాటు వెనక్కు నెట్టి, 'ఈశ్వర్'ను ముందుకు పెట్టుకున్నాడు. పేరు మార్చుకున్న తరువాత అతడికి పై చదువుల్లో అంతా క్లాసే. డిస్టింక్షనే. అప్పటినుంచీ అతడికి తనపేరు మార్పిడివల్లనే అదృష్టం కలిసివచ్చిందనే నమ్మకం ఏర్పడ్డది. ఎం.ఏ పరీక్షకాగానే పోటీ పరీక్షలో నెగ్గి ఉన్నతోద్యోగి కూడా అయ్యాడు. దీనితో అతడి నమ్మకం మరింత దృఢమైంది. రోజుకొకసారయినా అతడికా విషయం జ్ఞాపకం వస్తుంది. మనసు ఉప్పొంగుతూ ఉంటుంది

ఈశ్వర్ పేపరు చూస్తున్నాడు. సిగరెట్ పొగ వదుల్తున్నాడు. తన పేరును గురించి సంభ్రమపడుతున్నాడు ఆ క్షణంలో అతడి మనసు గతరాత్రి డాబామీద— వెన్నెల వెలుగులో తనూ మల్లికా కూర్చుని మాట్లాడుకున్న సరదా కబుర్లమీదికి పోయింది. ఆ సంభాషణ గుర్తుకు తెచ్చుకుంటున్నాడు.

తనప్పుడు బి. ఏ. చదువుతున్నాడు. కొత్తగా కాలేజీలో చేరిన విద్యార్థులను సీనియర్లు 'రాగ్' చేస్తున్నారు తన స్నేహితులకు అందరికంటె పదిపాళ్ళు చిలిపి తన మెక్కువ. కొత్త విద్యార్థులు రాగానే వాళ్ళను నానా ఇబ్బందులు పెట్టి వాళ్ళను

తమ కాళ్ళమీద పడేయించుకుని వాళ్ళచేత పెద్ద హోటల్లో పార్టీ ఇప్పించుకొని మరీ వదిలేవారు.

అ పరిస్థితులలో కొత్త విద్యార్థులను చూస్తే ఎవరికయినా జాలి కలుగు తుంది. సీనియర్లు కొత్తవాళ్ళ షర్టు పీలికలై పోయేటట్టు లాగుతారు. ప్యాంట్లుకుట్లన్నీ పటపట తెగిపోయేటట్టు గుంజుతారు చక్కగా దువ్వుకున్న క్రాపంతా చెరిగిపోయి ఈకలు పీకిన కోడిలా కనపడేవరకూ జుట్టు పీకుతారు కాలేజీ ఆవరణలో అక్కడక్కడ ఉన్న బురదగుంటల్లో పొర్లించి బురదస్నానం చేయిస్తారు. ఆ బురదతో వాళ్ళను కాలేజీ ఆవరణంతా తిప్పిస్తారు. కొత్తవాళ్ళు యమయాతన ననుభవిస్తారు. వచ్చే సంవత్సరానికి వీళ్ళు పాత సీనియర్లతో కలిసి కొత్తవాళ్ళను ఆటలు పట్టిస్తారు.

ఈశ్వర్‌కు పెదవులమీద చిలిపి నవ్వొకటి మెరిసింది. తను మాత్రం బుద్ధిమంతుడా? తనెంత బాధపడ్డాడో-అంతకంటె పదిరెట్లు అల్లరిచేసినవాడే.

బి.ఏ. రెండవ సంవత్సరంలోకి వచ్చేసరికి ఆడపిల్లలు ఎక్కువ మంది చేరారు. అంతకు పూర్వం చేరిన విద్యార్థినులు కొత్త వాళ్ళను బాగా రాగ్ చేశారు. బురద నీటిలో జలకాలాడించి-కొంగులు పట్టుకులాగి-జడలు విప్పి - ముఖంనిండా వల్లటిబొట్టు పెట్టి ఆవరణంతా తిప్పించారు

ఒక వైపు మగపిల్లలు-మరొక వైపు ఆడపిల్లలు.

"అబ్బ! ఎంత సరదాగా గడిచాయారోజులు? ఇప్పుడు అటువంటి ఛాన్సు వస్తే?" అనుకున్నాడు ఈశ్వర్. వస్తే? నిజంగా వస్తే.... అంతసరదా ఉంటుందా?

రాత్రి వెన్నెల్లో డాబామీద కుర్చీలు వేసుకుని పచ్చ కర్పూరం వేసిన తమల పాకుల బీడా నములుతూ సిగరెట్ పొగపీలుస్తూ, విడుస్తూ విద్యార్థి జీవితంలో రాగింగ్ తమాషాలను గురించి సరదాగా మల్లికతో చెబుతున్నాడు ఈశ్వర్ గర్వంతో.

"ఆ రోజున ఏమయిందనుకున్నావు మల్లికా! మగపిల్లలంతా కలిసి జూనియర్లను షర్టుపట్టుకుని లాక్కుపోతున్నారు. ఆ గుంపులో పాతిక మంది వరకూ ఉన్నారు. నేనూ మా సీనూ అంటే నా ప్రాణ స్నేహితుడు-ఆ గుంపులో

చివర్న ఉన్నాం. ఆ సమీపంలో ఒక చెట్టు క్రింద బురద గుంటలో ఒకఅమ్మాయి పడి ఉన్నది. ఆమెను చూసి-అందరినీ వెళ్ళనిచ్చి మే మిద్దరమూ దిగబడి పోయాము." ఆకాశంవైపు చూస్తూ గర్వంగా సిగరెట్ పొగ ముక్కులోంచి విడుస్తున్నాడు ఈశ్వర్.

కెవ్వున కేకపెట్టింది మల్లిక.

ఈశ్వర్ గాభరాపడిపోయాడు. ఇంతలోకే ఏమయింది? అప్పటినుంచీ కిలకిలనవ్వుతూ కబుర్లు చెప్పిందే మల్లిక?

దిగ్గునలేచి "ఏమిటేమిటి? ఏదయినా కుట్టిందా?" ఆ చుట్టు పక్కలంతా వెదికాడు. ఆమె కూర్చున్న కుర్చీని జరిపిచూశాడు

"ఏమయింది మల్లికా! భయపడ్డావా? దేనికి?" ఆమె వీపుమీద తట్టి ముఖంలోకి చూశాడు.

అంత చల్లటి వాతావరణంలోనూ ఆమె ఒళ్ళంతా చెమటతోతడిసిపోయింది. అరగంటవరకూ నోట్లోంచి మాటపెగల్లేదు.

"ఏమిటి మల్లికా! ఒంట్లో బాగా లేదా!" ఆమెను మెల్లగా నడిపించు కుంటూ వెళ్ళి మంచమ్మీద పడుకోబెట్టి ఫాన్ స్విచ్ వేశాడు.

మల్లిక కళ్ళార్పటం మర్చిపోయి వెర్రిచూపులు చూడటం మొదలు పెట్టింది.

"ఏమిటి కళ్ళు తిరిగాయా? కొందరికి మసాలా బీడాతింటే ఒళ్లంతా చెమటపడుతుంది. అలాంటిదేదయినా జరిగిందా?" ఆమె చేతి వేళ్ళు సవరిస్తూ తలవెంట్రుకలు సర్దుతున్నాడు పక్కన కూర్చుని.

ఆమె అయోమయంగా చూసింది.

గ్లాసెడు చల్లటి మంచినీళ్ళు తెచ్చి ఆమె నోటి కందించాడు.

మంచి నీళ్ళు తాగి పక్కకు తిరిగి కళ్ళు మూసుకుని పడుకుంది.

రాత్రంతా కలతనిద్ర-ఏవేవో కలవరింతలు.

తెల్లవారి లేచేటప్పటికి మల్లిక పది లంఖణాలు చేసిన దానిలా ఒడిలిపోయింది.

ఈశ్వర్ లేచి స్నానంచేసి డ్రెస్సు వేసుకునే అంతలో మెల్లగా లేచింది మల్లిక, ఆతడికి కావలసినవన్నీ అందించింది. కాఫీ టిఫిన్ తీసుకునేటప్పుడు సరదాగా మాట్లాడింది-తెచ్చిపెట్టుకున్నట్టు పైకే కనబడుతున్న ఉత్సాహంతో.

"రాత్రి ఎందుకండీ అలా కెవ్వున కేకవేశారు?" అన్నాడు వెక్కిరిస్తూ.

కళ్ళు దించుకుంది మల్లిక.

"కాలేజిలో రాగింగ్ సంగతి చెప్తుతుంటే భయపడ్డట్టున్నావు-అంతేనా?" నవ్వాడు.

"నా కెందుకు భయం?" పైకి అన్నదే కాని మళ్ళీ ముఖమ్మీద చెమట బిందువులు కుప్పపోసిన ముత్యాల్లా పొటమరించాయి.

"ఒద్దులే. మళ్ళీ ఆ సంగతెత్తితే పడిపోయేటట్టుగా ఉన్నావు" అన్నాడు భుజమ్మీద తట్టి.

తడి ఆరిపోయిన గొంతుతో "ఛీఛీ-నాకేం భయం ? నేనెందుకు భయపడి. పోతాను?" అన్నది.

"మరి....రాత్రి ఎవరండీ పడిపోయింది?"

ఆమె ముఖమ్మీద నెత్తురుచుక్క లేదు.

"అదిగో........అదిగో........ఇంతలోనే........"

సోఫామీద పడుకుని రాత్రి జరిగిన సంగతి తలుచుకొని నవ్వుకున్నాడు ఈశ్వర్. ఎట్లాగయినా ఆడవాళ్ళు అక్షరాలా ఆడవాళ్ళే ననిపిస్తారనుకుంటూ పెదవులు విచిత్రంగా ముడిచి సాగదీసుకున్నాడు.

గదిలోకి ఎవరో వచ్చిన అలికిడయింది. తలఎత్తిచూశాడు.

"ఏమిటి?"

''పనిమనిషి వెంకటి ఇంటినుంచి ఫోనుచేసిందయ్యగారు'' జవాను చెప్ప గానే చివాలున లేచి ఫోను అందుకున్నాడు

''అయ్యగారూ బేగి రండి. అమ్మగారు పడిపోయారు'' భయపడుతూ చెప్పింది పనిమనిషి.

గాభరాపడుతూ ముందు వెనుకలు చూసుకోకుండా కారు నడిపాడు ఇంటికి.

పడక కుర్చీలో మెడపేలాడేసుకుని పడుకున్నది మల్లిక.

''మల్లికా! మల్లికా!'' కుదిపాడు. ఆమె కళ్ళు తెరిచి చూడలేదు. లేవదీసి నిలబెట్టటానికి ప్రయత్నించాడు. కాళ్ళు నేలమీద ఆనలేదు.

ఈశ్వర్‌కు మనసులో ఆందోళన. గుండె దడదడ కొట్టుకుంటోంది. వెంకటి సహాయంతో ఆమెను కార్లో పడుకోబెట్టుకుని దగ్గర్లో ఉన్న నర్సింగ్ హోముకు తీసుకువెళ్ళాడు.

డాక్టర్ విజయకుమార్ ఆమె చెయ్యి పట్టుకుని నాడిచూశాడు గుండె పరీక్ష చేశాడు. ఆ ఉదయంనుంచీ ఏం జరిగిందో మళ్ళీ మళ్ళీ అడిగి తెలుసుకున్నాడు.

ఈశ్వర్ గజగజ వణికిపోతున్నాడు.

''మీరేం భయపడకండి సార్. ఈమె తిన్న పదార్థమేదో సరిపడనట్లున్నది. స్టమక్ వాష్ చేస్తాను. తేలికయిపోతుంది'' అన్నాడు.

అయిదు నిమిషాలలో స్టమక్ వాష్ చేయటానికి తగిన పరికరాలు తీసుకు వచ్చింది నర్సు. రబ్బరు గొట్టం మల్లిక నోట్లోకి నర్సు ఎక్కిస్తుంటే ఈశ్వర్ చూడలేక గదిలోనుంచి బైటికి వచ్చేశాడు గదిలో ఏం జరుగుతున్నదోనన్న ఆందోళనతో ఊగిపోతున్నాడు. మల్లికకు ఎట్లా ఉంటుందోనన్న భయంతో గజగజ లాడిపోతున్నాడు. చేతి రుమాలుతో ముఖానికి పట్టిన చెమటను అద్దుకుంటూ గుమ్మం దగ్గరగా ఉన్న కుర్చీలో కూలబడ్డాడు.

గంట తరువాతగాని లోపలికి వెళ్ళలేదు ఈశ్వర్. అలసిపోయి పడుకుంది మల్లిక. డాక్టరు చిరునవ్వుతో నిలబడ్డాడు మంచం దగ్గరగా మల్లికను చూస్తూ.

"ఇంక భయం లేదండి. కాసేపటికి బాగా నిద్రపడుతుంది" అన్నాడు డాక్టరు.

"ఇంతకూ ఇదేమిటంటారు డాక్టర్?" ఆదుర్దాను అణచుకోలేక అడిగాడు ఈశ్వర్

"ఆహారంలో కల్తీ అనుకుంటాను. మీరింక నిశ్చింతగా ఉండండి. ఆఫీసు పనులేవయినా ఉంటే చూసుకోండి ఆమెను ఒంటరిగా వదిలిపెట్టండి హాయిగా నిద్రపోతారు."

మల్లికను వదలివెళ్ళటానికి ఈశ్వర్ వెనకముందు ఆడటం చూసి "ఆమెకు బాగా విశ్రాంతి కావాలి. బాగా నిద్రపోనివ్వండి" డాక్టరు నచ్చచెప్పాడు.

"రేపు ఉదయం ఎనిమిది గంటలకు రండి. ఆమె దగ్గర మీ పనిమనిషిని ఉంచండి" ఈశ్వర్‌కు మళ్ళీ ఒకసారి చెప్పాడు డాక్టరు.

"భయం ఏమాత్రం లేదంటున్నారుగా. రేపు మీరు చెప్పినట్టు వస్తాను" వెనక్కి తిరిగి చూస్తూ ముందుకు అడుగువేశాడు ఈశ్వర్.

రాత్రి ఎనిమిది గంటలయింది

కళ్ళు మూసుకుని పడుకున్న మల్లిక హఠాత్తుగా వెక్కి వెక్కి ఏడవటం మొదలుపెట్టింది, వెంకటి భయపడుతూ వెళ్ళి డాక్టర్ని పిలుచుకువచ్చింది.

డాక్టరు విజయకుమార్ చెయ్యి పట్టుకుని నాడి చూశాడు. తృప్తికరంగా ఉంది.

"మీకు ఎలా ఉందిప్పుడు? ఏమైనా బాధగా ఉందా? ఇటు చూడండి"

ఎర్రబడి వాచిన కళ్ళతో ఎందుకని అడిగింది మల్లిక పక్కకు తిరుగుతూ.

"మీకు ఒంట్లో ఎట్లా ఉంది?"

"బాగానే ఉంది" మళ్ళీ పక్కకు తిరగబోయింది.

"ఒక్కమాట! మీరు ఆ నిద్రమాత్రలు గుప్పెడు వేసుకున్నారెందుకు?" ఆమె ముఖంలోకి చూస్తూ అడిగాడు.

ఆమెకు కన్నీళ్ళు ఉబికి ఉబికి వస్తున్నాయి.

"మీరలా చేసినట్టు ఈశ్వర్‌గారికి తెలుసా?"

ఆమె ముఖమ్మీద భయం స్పష్టంగా కనబడ్డది. కెవ్వున అరచి ముఖం చేతులతో కప్పుకుంది మళ్ళీ

"ఇట్లా ఆత్మహత్యా ప్రయత్నంచేస్తే పోలీసు కేసవుతుంది తెలుసామీకు?"

మల్లికకు ఏడుపు ఆగటంలేదు.

"పోలీసులకు ఈ సంగతి రిపోర్టు చేయకపోతే నేను నేరస్థుడినవుతాను. మీరు ఆ మాత్రలు ఎందుకు తీసుకున్నారు? ఏంకష్టమొచ్చింది?"

మల్లిక బిగ్గరగా ఏడ్చి తననేమీ అడగవద్దని డాక్టరుకు దణ్ణాలు పెట్టింది

"మీ కేదయినా ప్రమాదం జరిగితే ఈ నేరమంతా ఈశ్వర్‌గారి మీదికి వస్తుంది. ఆత్మహత్యా ప్రయత్నం చేసినందుకు మీకు శిక్షపడుతుంది" కొంచెం కఠినంగా అన్నాడు డాక్టరు.

"అయ్యో!" అనుకుంటూ నిస్సహాయంగా మంచమ్మీద వాలిపోయింది మల్లిక

"ఒక ఇంజక్షను ఇస్తాను. పడుకోండి. హాయిగా నిద్రపడుతుంది. తెల్లవారేసరికి మనసూ, దేహమూ తేలికపడతాయి."

ఐదు నిమిషాల తరువాత డాక్టరు వచ్చి ట్రూత్ సీరమ్ ఇంజక్షను ఇచ్చి వెళ్ళాడు.

నర్సింగ్ హోమంతా నిశ్శబ్దంగా ఉంది.

గది గదికీ నీలిరంగు బల్బులు వెలుగుతున్నాయి. నర్సు ప్రతి గదిలోకి వెళ్ళి రోగులు పడుకున్నారో లేదో చూసివెళ్ళింది.

మల్లిక తలక్రింద చెయ్యిపెట్టుకుని పక్కకు తిరిగి పడుకున్నది. వెంకటి మంచానికి దగ్గరగా కొంగు పరచుకుని పడుకున్నది.

డాక్టరు విజయకుమార్ ఆమె మంచానికి సమీపంగా ఒకకుర్చీమీద కూర్చుని మల్లిక ముఖం వంక కన్నార్పకుండా చూస్తున్నాడు.

రెండుసార్లు అటునుంచి ఇటు-ఇటు నుంచి అటు చికాకుగా పొర్లింది మల్లిక. ఉన్నట్టుండి దీర్ఘంగా మూలిగింది.

''నాన్నకు చెప్పకమ్మా, నాన్న కీసంగతి తెలిస్తే చంపేస్తాడమ్మా. అమ్మా. చెప్పకమ్మా'' కళ్ళు చేతులతో మూసుకుంది మల్లిక.

''ఏం జరిగింది మల్లికగారూ? నాన్నగారికి చెప్పకూడదా?'' కుర్చీలో నుంచి లేవబోతున్నట్టుగా కూర్చుని అడిగాడు డాక్టరు.

కళ్ళు తెరిచింది మల్లిక. గోడకేసి అదేపనిగా చూడటం మొదలుపెట్టింది.

''చెప్పండి-ఏమయింది?''

గోడవైపు తదేకదీక్షతో చూస్తోంది. మల్లిక ఆ చూపు భయంకరంగా ఉంది. ముఖమంతా ఎర్రబడ్డది.

''ఆ రోజు కొత్తగా కాలేజీలో చేరిన పిల్లలను సీనియర్లు బాగా ఏడిపిస్తున్నారు. బెదురుచూపులతో ఏడుపుముఖాలతో కొత్త పిల్లలు ఆవరణలో అడుగు పెడుతున్నారు. ఆడపిల్లలయినా ఎంత మోటుగా హాస్యం చేస్తున్నారు? కొంగులు పట్టుకుని గుంజుకుపోతున్నారు! జడలుపట్టి లాగుతున్నారు. నేలమీద పడేసి ఈడుస్తున్నారు. బురదలో పొర్లిస్తున్నారు. పరుగెత్తుకుపోతున్న నన్ను ఇద్దరమ్మాయిలు ఉరుకుతూ వచ్చి బురదగుంటలోకి తోసేశారు. ఒళ్లంతా బురద. తలంతా బురద, పంపు దగ్గరికి వెళ్ళి బురదంతా కడుక్కుని బట్టలు పిండుకుని ఇంటిదారి పడదామని గేటు వైపు నడుస్తున్నాను. ఎవరో ఇద్దరు బలవంతంగా లాక్కుపోతున్నారు. భయంతో కళ్ళు గట్టిగా మూసుకుని కెవ్వున అరిచాను, గుంజుకున్నాను. ఇద్దరూ చెరో చెయ్యీ బలంగా పట్టుకుని లాక్కునిపోయారు. కళ్ళు తెరిచినా కనబడని కటికచీకటి గదిలోకి తోసివేశారు. నన్నక్కడ....నన్నక్కడ.... బిగ్గరగా ఏడ్చింది మల్లిక.''

డాక్టరు వింటూ తల ఆడిస్తున్నాడు.

మరి కొంతసేపటికి—

“నేను ఇంటికి ఎలా చేరాను? ఏడుస్తుంటే వాచ్‌మన్ భార్య ఆటువైపుకు తొంగిచూపింది, ఒంటి నిండా బట్టసర్ది రిక్షా తెచ్చి దానిలో కూర్చోబెట్టింది. మళ్ళీ కాలేజిలో అడుగుపెట్టలేదు. రెండు నెలల తరువాత ఒంట్లో బాగా లేదంటే అమ్మ లేడీ డాక్టరుచేత మందిప్పించింది. అమ్మ బలవంతంచేసి పెళ్ళికి ఒప్పించింది....” సన్నగా ఏవేవో సంగతులు అస్పష్టంగా గొణుగుతూ నిద్రలోకిజారుకున్నది మల్లిక.

డాక్టరు విజయకుమార్ బరువుగా అడుగులు వేసుకుంటూ గది గుమ్మం దాటాడు.

ఉదయం ఏడు గంటలు అవుతూనే వచ్చాడు డాక్టరు మళ్ళీ. “హలో! మల్లికగారూ! ఎలా ఉంది ఒంట్లో? రాత్రి బాగా నిద్రపోయారా!”

మల్లిక గోడవైపుకు తిరిగి పడుకున్నది.

“ఒంట్లో తేలికగా ఉందా? ఇంటికి వెళ్ళాలని ఉందా? ఈశ్వర్‌గారికి ఫోను చెయ్యనా?” కిటికీకి దగ్గరగా కుర్చీ లాక్కుని కూర్చున్నాడు.

మల్లిక లేచి కూర్చున్నది. ఐదు గంటలకే నర్సు తెచ్చియిచ్చిన కప్పు కాఫీ తాగింది. ఓపిక వచ్చినట్లనిపించింది. ఈశ్వర్‌ను రమ్మని వెంకటితో కబురు పంపించింది.

“ఏమంటారు? ఇంటికి వెళ్ళాలని ఉందా?” అన్నాడు డాక్టరు.

వెళ్తానన్నట్టుగా తల ఊపింది.

“మీరు ఇంకెప్పుడూ ఇలా చెయ్యనని మాట ఇవ్వాలి. మీరు చేసిన పనికి ఎంతమంది బాధపడవలసి వచ్చేదో? పోలీసులు రావటం–గొడవ చెయ్యటం–పెద్ద రభస జరిగేది. కాస్తలో మీరు భయంవల్ల ఆత్మహత్య చేసుకోవటానికి ప్రయత్నించారు. జరిగినదంతా మరిచిపోయి హాయిగా ఉండండి.”

అభిమానం–కోపం–రోషం మల్లికను పెనవేసుకుపోయాయి. ఆమె ముఖం ఎర్రబడ్డది, పెదవులు అదరటం మొదలుపెట్టాయి.

అంతలో నర్సు గబగబా వచ్చింది గదిలోకి.

"డాక్టర్. ఒక బాలింతకు ఫిట్సు వస్తున్నాయి. త్వరగా రండి."

డాక్టరు లేచి మల్లికవైపొకసారి చూసి చేత్తో ఉండమని సైగచేసి వెళ్ళాడు.

మరి కొంతసేపటికి ఈశ్వర్ వచ్చాడు.

"నాకు రాత్రి బాగా నిద్రపట్టింది. ఇప్పుడు హాయిగా ఉంది. డాక్టరుగారు ఇంటికి వెళ్ళమని చెప్పారు. వెళ్దాం రండి," చెప్పులు వేసుకుని రెండడుగులు వేసింది.

ఉత్సాహంగా ఉన్న మల్లికను చూడగానే ఈశ్వర్‌కు ప్రాణం లేచి వచ్చినట్లయింది.

"డాక్టరుగారికి చెప్పి బిల్లు చెల్లించి వస్తా ఉండు."

అతడిని చటుక్కున కోటు పట్టుకుని ఆపివేసింది మల్లిక.

"డాక్టరుగారికి ఏదో గడ్డు కేసు వచ్చింది వెళ్తామని నేను చెప్పాను. ఆయన సరేనన్నారు." తొందర పెట్టింది మల్లిక.

బిల్లు చెల్లించి రసీదు తీసుకొని బయలుదేరారు. ఆవరణలో కారు స్టార్టు చేసిన చప్పుడు విని కిటికీలో నుంచి చూసి డాక్టరు విజయకుమార్ నవ్వుకున్నాడు.

వారంరోజుల తరువాత దేవదాసు చిత్రం చూడటానికి వెళ్ళిన విజయకుమార్‌కు థియేటర్ ముందర మల్లిక, ఈశ్వర్ కనబడ్డారు.

ఈశ్వర్ డాక్టర్ ఒకరినొకరు చూసుకుని పలకరించుకున్నారు. తాము నర్సింగ్ హోమునుంచి వెళ్ళేటప్పుడు డాక్టర్ని కలుసుకోలేకపోయినందుకు తన విచారాన్ని తెలిపాడు ఈశ్వర్.

"హలో! మల్లికగారూ! ఎలా ఉంది ఆరోగ్యం? రాత్రిళ్ళు నిద్రపడుతున్నదా? మళ్ళీ ఒకసారి వచ్చి చెకప్ చేయించుకుంటారా?" అన్నాడు డాక్టరు మల్లికకు నమస్కారం చేస్తూ.

పక్కన నవ్వింది మల్లిక. "మీరు పొరబడుతున్నారు. మీకు తెలిసిన వాళ్ళెవరో నా మాదిరిగా ఉన్నట్టున్నారు" ముఖం పక్కకు తిప్పుకుంటూ అన్నది.

ఆ మాటలకు దిగ్భ్రాంతుడయ్యాడు డాక్టరు విజయకుమార్. ట్రూత్‌సీరమ్ ఆమె చేత నిజాన్ని వెళ్ళ గ్రక్కించింది కనుక తనకు తెలిసింది. లేకపోతే తనకెలా తెలుస్తుంది? ఆమె గుప్పెడు గార్డినాల్ మాత్రలు ఎందుకు తిన్నదో? అయినా ఈశ్వర్‌కు చెప్పకూడదు అది ఆత్మహత్యా ప్రయత్నమని.

టికెట్లకోసం ఈశ్వర్ వెళ్ళినవైపే చూస్తోంది మల్లిక.

"మల్లికగారూ! నేను ప్రతిరోజూ అనేకమంది రోగులను చూస్తుంటాను. అప్పుడప్పుడు ఒకరిని మరొకరనుకుని పలకరించే అవకాశం ఉంది. కాని-ఈ చెయ్యి ఉంది చూశారూ? దీని అనుభవం చాలా గొప్పది. అది మాత్రం ఎప్పుడూ పొరబడదు" అంటూ మరొక కౌంటర్ దగ్గరికి వెళ్ళాడు టికెట్టు కొనటానికి.

(యువ - దీపావళి సంచిక)



# తీ పి లో చే దు

గ్రిల్సు తలుపులు పట్టుకుని చక్రాలలాంటి కళ్ళు యిటూ అటూ తిప్పుతూ రాధిక వీధిలోకి చూస్తున్నది. దిల్‌షుక్‌నగరు కాలనీ పగలు పది గంటలనుంచి సాయంకాలము నాలుగు గంటల వరకూ ఎటువంటి అలజడి లేకుండా ఉంటుంది మగవాళ్ళు ఆఫీసులకూ పిల్లలు స్కూళ్ళకూ వెళ్ళిన తరువాత ఆడవాళ్ళు చిన్న పిల్లలూ తలుపులు వేసుకుని ఇళ్ళల్లో ఉంటారు. పగలు రేడియో కార్యక్రమాలతో పాటు చిన్నపిల్లల ఏడుపులూ, అల్లరీ వినబడుతూ ఉంటుంది. ఒక్కతే బొమ్మలతో ఆడుకుని పుస్తకాలలో బొమ్మలు చూసుకుని విసుగు పుట్టినప్పుడల్లా గ్రిల్సు తలుపులు పట్టుకుని వీధిలోకి చూస్తూ ఉంటుంది రాధిక.

రాధిక తల్లికి మధ్యాహ్నం పడుకునే అలవాటు. తను పడుకోబోయేటప్పుడు వీధి వాకిలి దొడ్డి తలుపూ తాళము వేసుకుని రాధికముందు ఇన్ని పుస్తకాలు బొమ్మలు పడేస్తుంది. రాధిక నిర్జీవమైన వాటితో ఆడుకుని విసుగు పుట్టినప్పుడల్లా వీధిలోకి తొంగిచూస్తుంది.

"ఏం చిన్నదొరసాని, బాగున్నావా? పండ్లు తీసుకోవూ!" అరటిపళ్ళు అమ్మే మనిషి తలుపు దగ్గరికి వచ్చి పలకరించింది.

తల అడ్డంగా వూపింది రాధిక. క్రిందటి రోజున తండ్రి తెచ్చిన పళ్ళు అలమారలో ఉన్నాయి. లావు లావు ఎర్రటి అరటి పళ్ళను చూసిన కళ్ళతో రాధిక ఈ పళ్ళను చూసి ముక్కు విరిచింది.

"రేపు మంచి జామపళ్ళు తెస్తా. తీసుకుంటవా?" పళ్ళ మనిషి ముందుకు సాగిపోయింది. మళ్ళీ రాధిక చక్రాలవంటి కళ్ళను తిప్పుకూ వీధిలోకి చూస్తున్నది ఆరేడు ఏళ్ళపిల్ల పేడగంప నెత్తిన పెట్టుకుని బతకమ్మ పాట పాడుతూ వస్తున్నది.

రాధిక ముఖంలో ఆనందమూ, ఉత్సాహమూ పొంగులు వారాయి "ఇంత ఆలస్యంగా వచ్చావేం?" ఆ పిల్లను దగ్గరకు పిలిచి అడిగింది.

"అమ్మకు పై ఉడుకు చేసింది. నాయనకు రొట్టె చేసిపెట్టి నేను తిని వచ్చిన."

పనిమనిషి తలుపుకొట్టగానే రాధికతల్లి రామలక్ష్మి తలుపుతీసి మళ్ళీ వెళ్ళి పడుకున్నది. రాధిక దొడ్డి దరవాజాలో నుంచి వీధి వాకిట్లోకి వచ్చింది.

ఆ పిల్ల రాధిక కంటే పీలగా ఉన్నది. తొడుక్కున్న గౌను నల్లగా మాసి పోయింది. చినిగిన పేలికలు, అక్కడక్కడ వేలాడుతున్నాయి. ఒంటినిండా బురద మరకలు. తల వెంట్రుకలు జడలు కట్టాయి. అయినా ఆ పిల్లను చూడ గానే రాధికకు ప్రాణము లేచివచ్చినట్లవుతుంది.

"ఆడుకుందాము వస్తావా!" ఆ పిల్ల భుజంమీద చెయ్యివేసి అడిగింది రాధిక. ఆ పిల్లను ప్రతిరోజూ రాధిక చూస్తూ ఉంటుంది ఆ వేళకు. మాట్లాడిం చక పోయినా చూసి ఉత్సాహాన్ని తెచ్చుకుంటుంది.

ఆ పిల్ల రాధికను కిందనుంచి పై వరకూ చూసింది. తెల్లగా బొద్దుగా వున్న రాధిక లేత గులాబీరంగు నైలాను గౌను తొడుక్కున్నది. తలవెంట్రు కలు చెవులకు పైగా నీలిరంగు రిబ్బనులతో ముడివేయబడ్డాయి. కాళ్ళకు నల్ల రంగు బూట్లు మెరుస్తున్నాయి. ఆ పిల్ల తన కాళ్ళనూ ఒంటిని చూసుకుని మళ్ళీ మళ్ళీ రాధికను చూస్తూ ముఖము తిప్పుకుంటూ ముందుకు అడుగు వేసింది.

రాధిక ఆ పిల్ల చెయ్యి పట్టుకుని ఆపుతూ "నీ పేరేమిటి? నాతో ఆడుకో టానికి రావూ? ఈ చాక్‌లెట్ తినిచూడు" తన చేతిలో ఉన్నవాటిలో ఒకటి ఆ పిల్ల చేతిలో పెట్టింది.

"ఆడుకుందాము రా మరి" రాధిక మళ్ళీ అడిగింది.

ఆ పిల్ల మెల్లగా "ఇదంతా పోగుచేసి తెమ్మన్నది అమ్మ లేకపోతే కొడు తుంది." అక్కడున్న పేడకుప్పల వైపు చెయ్యి చూపించింది. అప్పుడే ఆ కుప్ప లను పోగుచేసుకోవాలని తట్టలు తీసుకుని పిల్లలగుంపు బయలుదేరి వస్తున్నది. వాళ్ళ తగవులూ అరుపులూ అంతదూరం నుంచే విని పిల్ల గబగబా తట్టలోకి పేడ ఎత్తుకుంటున్నది. రెండు చేతులతో గంప నెత్తిన పెట్టుకుంటూ "ఈ గంప మా అమ్మకిచ్చి వస్తా" పిల్ల ముందుకు నడిచింది. రాధిక తల ఆడిస్తూ ఆ పిల్ల వెంట నడిచింది.

పందు చివరగా ఉన్న గుడిసె ముందరగా గంపదించి ''అమ్మా, గంప తీసుకోయే. నేను జరసేపు ఈడ ఆడుకొనివస్తా'' పిల్ల గునుస్తూ తల్లిని అడిగింది.

"చెల్లికి జొరము వేగిరం రా". తల్లి కేకలకు తల అడిస్తూ చేతులు కుండలో ముంచి గౌనుతో తుడుచుకుంటూ రాధిక చెయ్యి పట్టుకుని వేపచెట్టు క్రిందికి తీసుకువచ్చింది.

''నీ పేరు చెప్పవూ.'' ఆప్యాయంగా కళ్ళల్లోకి చూపింది రాధిక.

''ఈరమ్మ''

''నాతో రోజూ ఆడుకోవూ!'' ఆ పిల్ల రెండు చేతులు పట్టుకుని పైకె త్తింది రాధిక. ఇద్దరూ కలసి పావుగంట గంతులు వేశారు. పరుగులు తీశారు.

''ఏందండీ! మీ కోసం ఈదులన్నీ యెతుకుతున్న. ఇంటికి పదండి. అమ్మ గారు కోపము చేస్తున్నారు.''

ఈరమ్మ చేతుల్లోంచి రాధిక చేతులు విడిపించి ''ఎవరు పిల్లా నువ్వు ! ఇంటికి పో'' కసిరాడు. వాళ్ళు ముందు నడుస్తూంటే ఈరమ్మ వెనక్కు తిరిగింది.

''చెప్పకుండా ఇంట్లోనుంచి వెళ్ళటం నేర్చుకున్నావా ! ఎక్కడికి వెళ్లద్దని చెప్పలేదూ!'' రామలక్ష్మి గట్టిగా మందలించింది.

''నే నెవరితో ఆడుకోను!'' కళ్ళు నులుపుకుంటూ వణుకుతున్న పెదవులతో అన్నది రాధిక.

''ఆట సామాను నాన్నగారు కొత్తగా తెచ్చినవని ఎన్నో ఉన్నాయి బొమ్మలు పుస్తకాలు ఉన్నాయి. చూసుకో ఇంకా ఏంకావాలి నీకు!'

''నీల''

నీల మాట ఎత్తగానే రామలక్ష్మి ముఖం ఎర్రబడ్డది నీలతల్లితో ఆమె ఘర్షణపడి పదిహేను రోజులయింది. అప్పటి సంఘటన ఆమెకు ఇప్పటికీ కళ్లకు కట్టినట్టవుతుంది.

భారతికి స్నేహితులు లేనిదే ఒక గంటయినా పొద్దుగడవదు. ఆమె ఒక రింటికయినా వెళ్ళాలి. లేక ఎవరయినా ఆమె యింటికి రావాలి. ఆమె మాటలో చేష్టలో ఒక్కటేచూపు

"మావారు ఇల్లు ఇలా ఉంటే ఊరుకుంటారా" అంటూ రామలక్ష్మి ఇంటికి వచ్చి నేల చూపించింది. నేల శుభ్రంగానే ఉంది కాని వట్టినేల. తివాచీగాని జంపఖానాగాని పరచిలేదు. రామలక్ష్మి ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నది.

భారతి లేచి ఇల్లంతా చూస్తూ "మామంచాలు చూశారా. రోజ్‌వుడ్ అడుగున స్ప్రింగులు. నేను ఏడాదికి ఒక్కసారి ఫర్నిచరంతా పాలిష్ చేయిస్తా సుమా! పాలు పెరుగూ పెట్టుకోవడానికీ, పళ్ళకూ, కూరగాయలకూ ఫ్రిజ్ ఉండా లండీ" మళ్లీ వచ్చి కుర్చీలో కూర్చుంది.

ఇందిరా గాంధీ పార్లమెంటులో యిచ్చిన స్పీచ్‌ని గురించి రామలక్ష్మి రెండుసార్లు ఎత్తినా భారతి వినిపించుకోలేదు.

"కంచి కాటన్‌చీరెలు నీలకంఠం దుకాణంలో క్రొత్తగా సరుకు వచ్చిందని ఫోన్ వచ్చింది కారు రాగానే ఇవ్వాళయినా వెళ్ళాలి" ఒళ్ళు విరుచుకుంది భారతి.

"మీరెట్లా ఉండగలుగుతున్నారో! యింట్లో ఒక్కటే గది. డ్రాయింగు రూము లేదు. అయినా మీ కెందుకు డ్రాయింగు రూమ్? సోఫాసెట్ లేదు కదా-రామలక్ష్మిగారూ? నలుగురు పెద్ద మనుష్యులువస్తే ఎక్కడ కూర్చో బెడతారండీ" విరగబడి నవ్వింది.

రామలక్ష్మి ముఖం చిన్నబోయింది భారతి తన పట్టు చీరవంకా,రామలక్ష్మి గుంటూరు చీరవంకా మార్చి మార్చి చూచింది. రామలక్ష్మి ముఖం రోషంతో ఎర్రబడింది. క్షణక్షణానికి తన అధికృతను ప్రదర్శిస్తూ ఎదటివారిని దిగదుడుపుగా చూసే భారతి మాటంటే రామలక్ష్మికి అరికాలి మంట నెత్తికి ఎక్కుతున్నది. ఆనాటి నుంచీ రాధిక నీలలు కూడా తల్లుల అడుగుజాడల్లో నడవవలసి వచ్చింది. ఒకరి ఇంటికి ఒకరు వెళ్ళటానికి వీలులేదు. సాయంత్రము ప్లేగ్రౌండులో కలిసినా మాటలులేవు. తల్లుల ఆజ్ఞ ఇద్దరూ మీరలేకుండా ఉన్నారు.

"నీల మనఇంటికి వస్తున్నదా? నీవు ఊరికే నీల కోసం ఆరాటపడతావు."

"నీల ఆడుకోటానికి వాళ్ళయింట్లో చిన్న పాపాయి ఉంది. నే నెవరితో ఆడుకోను మరి?" ముఖానికి అడ్డంగా చెయ్యిపెట్టుకుని వాదించింది రాధిక.

రామలక్ష్మి రాధికను దగ్గరికి తీసుకుని తనలో తాను నవ్వుకుంది. రాధికకు బొమ్మలు చూపిస్తూ, కథలు చెబుతూ ఆనాటికి మనసు మళ్ళించింది. ఆ లేత మనసు అన్నిటికి సమ స్థానపడిపోయింది. మరునాడు పగటిపూట తల్లి పడుకున్నప్పుడు రాధిక మనసులో ఈరమ్మ ఒకటి రెండు సార్లు మెదిలింది. రాధిక రెండు మూడు సార్లు బయటికి వెళ్లటానికి ప్రయత్నం చేసింది. తీరా తలుపు దగ్గరికి వెళ్ళేసరికి ముందు వరండా వెనక వరండాల గ్రిల్సుకు తాళమువేసి ఉంది. కళ్లలో నీళ్ళు సుళ్లు తిరుగుతుండగా గ్రిల్సు పట్టుకుని వాటికి తల ఆనించి జాలిగొలిపే చూపులతో రాధిక గంటలకొద్దీ నిలబడిపోయింది.

రాధిక ఆలోచనలు ఈరమ్మ యింటిమీదకి వెళ్ళాయి. రాధిక ఈరమ్మ ఇంటికి వెళ్ళినప్పుడు లోపలికి తొంగిచూసింది. ఆ నులకమంచం గుడ్డలమధ్య పడుకున్న పాపాయి ఎట్లా ఉన్నదో? ఈరమ్మ వీల వాళ్ళ ఇంట్లో ఉన్న పాపాయిలతో ఆడు కుంటారు. తనకొక చెల్లెలుంటే ఎంత బాగుండును? చక్కగా చిన్న చేతులను ముద్దు పెట్టుకుని ఎత్తుకోవచ్చు. తన బొమ్మలు. పుస్తకాలు పాపాయి కివ్వవచ్చు. ఊహాలు సాగిపోతూ ఉండేవి రాధికకు.

పదిరోజుల కంటె ఇంట్లోవాళ్ళు తలుపులకు తాళాలు వెయ్యలేక పోయి నారు. రామలక్ష్మి బద్ధకించింది. నౌకర్లు ఏమరిపోయారు. ఆ మధ్యాహ్నం రాధిక ఈరమ్మ గుడిసెకు దారితీసింది. ఈరమ్మ తల్లి ఎక్కడా కనబడలేదు. ఈరమ్మ మాత్రం గిన్నెలో అన్నం కలుపుకుని తింటున్నది. రాధిక మెల్లగా అడుగులు వేస్తూ వచ్చి మంచం దగ్గరగా నిలబడ్డది. చిన్నపిల్ల మంచంమీద నిద్రపోతున్నది.

"మీ పాపాయిని నాకు చూపించవు ఈరమ్మా" ఈరమ్మ తినే గిన్నెవైపు చూస్తూ అడిగింది రాధిక.

"నిద్రలో వుంది. చూడు ఆడుకోటానికి మళ్ళీ రాలేదేం?" ఈరమ్మ లోటాతో నీళ్ళుతాగి గిన్నె తొలిచి లోపలపెట్టింది.

రాధిక ఆ చిన్నపిల్లకు కప్పిన మురికి గుడ్డను చేత్తో తొలగించింది. ఆ పిల్లను చూడగానే రాధికకు కలిగిన ఆశ్చర్యానికీ, సంతోషానికీ మేరలు లేకుండా పోయాయి.

"ఈరమ్మా! నీ పాపాయి ఎంత బాగున్నదో. చేతులు కాళ్లూ ముక్కూ అన్నీ ఉన్నాయి. పాపాయి మెత్తగా ఉంది. కదూ?" ముద్దుకొద్దీ పిల్ల చేతి వేళ్ళను రాధిక పెదవులకు ఆనించుకున్నది.

"మరి ఆడుకుందామా?" ఈరమ్మ అడిగింది.

రాధిక ఆ మాట వినిపించుకోకుండా ఆ చిన్న పిల్లవైపే చూస్తూ "ఈ పాపాయి ఇంతసేపు నిద్రపోతుందేమిటి ఈరమ్మా! రోజూ అన్నం పెడతారా? నోట్లో పళ్లు ఉన్నాయోమో చూడనీ" పిల్లనోట్లో వేలుపెట్టి చూచి "పాపాయిలకు పళ్ళు ఉండవా ఈరమ్మా?" చేతికి అంటిన తడిని గౌనుకు తుడుచుకున్నది.

"అమ్మాయిగారూ"

రాధిక అదిరి పడింది. తనంతట తానే గుడిసెలోనుంచి బయటికి వచ్చింది. మాట్లాడకుండా నౌకరువెంట నడచి యింటికి వెళ్ళింది. తల్లి రాధికను మందలించి ఆటసామాన్లు ముందర పదేసింది. ఈరమ్మ పాపాయిని కంటితో చూచిన తరువాత రాధిక దృష్టి బొమ్మలవైపు మళ్ళడం లేదు. బయటికి వెళ్ళటానికి వీలు లేకుండా ఇంట్లో కట్టుదిట్టాలు ఎక్కువయినాయి.

వారంరోజుల తరువాత అంటే ఉగాది వెళ్ళిన మరునాడు ఉదయం ఏడు గంటలకు రాధికను తండ్రి నిద్రలేపాడు. పాలు రొట్టె తీసుకున్న తరువాత రాధికను రిక్షాలో కూర్చోబెట్టుకుని బయలుదేరాడు.

"ఎక్కడికి నాన్నా?" రాధిక రెండుసార్లు అడిగింది.

"చూద్దువుగాని ఉండు" అన్నాడు తండ్రి ఎటో ఆలోచిస్తూ.

రాధిక ఆత్రము అధికమయింది. "నాన్నా యింకెంత దూరం? మనతో అమ్మ రాలేదేం?"

"మనం వెళ్ళేది అమ్మ దగ్గరకేనమ్మా. అదిగో వచ్చేశాము చూశావా."

మాట పూర్తికాకమునుపే రిక్షా ఆగింది. ఇద్దరూ దిగారు. తండ్రితో నడుస్తూ రాధిక ఆలోచనలో పడ్డది." అమ్మ ఎక్కడికి వెళ్ళింది. తనతో ఎందుకు చెప్పలేదూ?"

పెద్ద ఆవరణందాటి పాతిక మెట్లు ఎక్కి వరండాలో ప్రవేశించారు ఇద్దరూ అక్కడినుంచి హాలులో ఉన్న మంచాలన్నీ దాటుకుని చివరి మంచం దగ్గరకి వెళ్ళి మలుపు తిరిగి గదిలో ఉన్న క్యూబికల్స్ పరదా తొలగించాడు తండ్రి. రాధిక చూపులు మంచంమీద పడుకున్న తల్లిమీదికి మళ్ళాయి. ఆమెను చూడగానే దుఃఖం ముంచుకు వచ్చింది రాధికకు. ఓ గజం దూరాన నిలబడిపోయింది. తండ్రి రాధికను ఎత్తుకుని మంచం పక్కకు తీసుకువెళ్ళి ఉయ్యాలమీద ఉన్న దోమతెరను తొలగించి చూపించాడు.

"అరే! పాపాయి పాపాయి నాన్నా ఈ పాపాయి ఎవరిపాపాయి నాన్నా? చెప్పు నాన్నా?" తండ్రిముఖం తనవైపుకు త్రిప్పుకుంటూ కేకలు పెట్టింది రాధిక. సంతోషం కొద్దీ రాధిక చప్పట్లు కొట్టింది. ముఖం చేటంతయింది. మునివేళ్ళ మీద నిలబడి ఉయ్యాలమీదకి వంగి పసిపిల్ల కాళ్లూ చేతులూ తాకి చూచింది. విస్మయాన్ని పట్టలేక "నాన్నా పాపాయి కాళ్ళు ఎంత బాగున్నాయో చూడు" రాధిక సంతోషాతిరేకంతో గంతులువేస్తూ గది అంతా తిరిగింది.

తండ్రి తల్లితో మాట్లాడేంతలో రాధిక ఆ గది దాటి హాలులో ఉన్న మంచాలన్నీ తిరిగి చూసింది ఉయ్యాలలన్నీ తొంగి చూసింది. పాపాయిలు-హాలునిండా పాపాయిలు ఎంతమందో!

పది గంటలు కొట్టారు. తండ్రి రాధికను ఇంటికి రమ్మని పిలిచాడు. పాపాయిని వదలిపెట్టి ఇంటికి వెళ్ళటం రాధికకు చాలా కష్టమనిపించింది. ఇంటికి వచ్చిన తరువాత కూడా రాధిక మనసు పాపాయి మీదనే ఉన్నది. ఇంట్లో పని చేసే మనిషిని పిలిచి పాపాయిని వర్ణించి చెప్పింది ఎవరికంటా పడకుండా ఈరమ్మ దగ్గరకువెళ్ళి పాపాయి సంగతి చెప్పి వచ్చింది. ఆ తన్మయత్వంలో ఆ రాత్రి రాధికకు నిద్రపట్టలేదు.

ఆ తరువాత అయిదారు రోజులపాటు రాధిక దినచర్య చాలా క్రమంగా గడిచిపోయింది. వేళకు నిద్రపోవటానికిగాని స్నానము చేయటానికిగాని, భోజనం చెయ్యటానికిగాని రాధికకు ఏ నౌకరు బ్రతిమిలాడవలసిన అవసరంరాలేదు. ఇదే అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది

ఏడవరోజు రాధిక హాస్పటల్‌నుంచి చిన్నబోయిన ముఖంతో ఇంటికి

వచ్చింది. తండ్రి పత్రిక చదువుతూ ఉండగా నౌకర్లను తప్పించుకుని రాధిక ఈరమ్మ దగ్గరికి వెళ్ళింది.

"ఈరమ్మా! మా పాపాయికి జ్వరము వచ్చిందని నాన్న చెప్పాడు. తాకి చూస్తే వేడిగా ఉంది" చెబుతూ ఉండగానే రాధిక కళ్ళనిండా నీళ్ళు వచ్చాయి

మా చెల్లికి కూడా జ్వరమొచ్చిది. తెల్లారి తగ్గిపోయింది." అన్నది ఈరమ్మ పిడకలుచేస్తూ అరిందాలా.

"మీ పాపాయికి ఏం మందు పోశారు ఈరమ్మా?" దిగులుపడ్డ ముఖంతో ప్రశ్నించింది రాధిక.

"మా అయ్య పిల్లనోట్లో పసరు పిండాడు మా యమ్మ పోచమ్మకు మొక్కింది "

"ఎట్లా మొక్కుతారు ఈరమ్మా?" రాధిక అమితమయిన అసక్తి శ్రద్ధా ముఖంలో పొంగులు వారుతుండగా ఈరమ్మ భుజమ్మీద చెయ్యివేసి అడిగింది ఈరమ్మ చెప్పినట్టుగా "పోచమ్మతల్లీ! మా పాపాయికి త్వరగా జ్వరం తగ్గించు తల్లీ" కళ్లు మూసుకుని చేతులు జోడిస్తూ అన్నది. ఒంటరిగా సందులుగుండా ఇంటికి వస్తూ అనేక పర్యాయాలు అదే వల్లించింది. ఆ నిద్రలో కూడా పాపాయి జ్వరాన్ని గురించే కలవరించింది. తెల్లవారేసరికి ఆమె ముఖం వాడి వత్తిఅయింది.

"ఎందుకు రాధికా అలా వున్నావు?" తల్లి రాధికను దగ్గరికి తీసుకుంటూ అడిగి బుగ్గలు నిమిరింది

తల్లి అడగగానే రాధికకు ఎక్కడలేని దుఃఖమూ ముంచుకువచ్చింది. "పాపాయికి జ్వరంగా, నాకు ఏడుపు వస్తోంది " వెక్కి వెక్కి ఏడ్చింది.

"అయ్యో పిచ్చిపిల్లా పాపాయికి జ్వరం వచ్చిందనా నీ ఏడుపు. అప్పుడే తగ్గి పోయింది చూడు. దగ్గరికి రా" తల్లి రాధిక ఒడిలో పాపాయిని పడుకోబెట్టింది. నీళ్ళు నిండిన కళ్ళతో పాపాయిని చేతుల్లో పట్టుకుని నవ్వుతూ చూసింది రాధిక పావుగంటసేపు. బరువెక్కిన ఆ కళ్లు క్షణంలో మిలమిల మెరిశాయి.

పాపాయి యింటికి వస్తున్నదనగానే రాధిక మురిసిపోయింది. ఇంట్లో సామానులన్నీ తానే సర్దటం మొదలుపెట్టింది.

తన బొమ్మల బుట్టలోవున్న బొమ్మలలో కొన్నిటిని ఏరి బల్లమీద పెట్టింది. తన గౌన్లలో మంచి వనుకున్న వాటిని ఒక బీరువాలో పెట్టింది ఒకజత బూట్లు ఒక చిన్న గొడుగు ఆ గదిలో ఒక మూల భద్రపరిచింది పాలు తాగటానికి రెండు గ్లాసులు, ఒక పళ్ళెమూ బల్లమీద బోర్లించింది. ఇవికాక ఎన్ని దినాల నుండో తాను జాగ్రత్తగా దాచుకున్న నెమలి ఈక, కాకి బంగారము ఒక చిన్న అట్టడబ్బాలోపెట్టి బల్లమీద పెట్టింది. ఈ ఏర్పాటులన్నీ తాను ఒక్కతే చేయటంలో రాధికకు తృప్తి కలగలేదు. పని మనిషిని పిలిచింది

ఆ ఇంట్లో ఎందరో నౌకర్లు ఇంతవరకూ పనిచేశారు. కాని ఎవరితోనూ రాధికకు సరిపడలేదు. రాజమ్మ రెండు సంవత్సరాల నుంచీ యింట్లో పనిచేస్తున్నది. వయసుమళ్ళిన మనిషి ఇంతవరకూ రాధికకు రాజమ్మతో ఏ విషయంలోనూ తగాదా రాలేదు రాధిక చేసిన పనులలో ఉన్న పొందికను. మాటల్లోని మాధుర్యాన్ని గ్రహించగల శక్తి ఒక్క రాజమ్మలోనే కనబడ్డది, రాధిక పిలవగానే "ఏం తల్లీ?" అంటూ వచ్చింది రాజమ్మ.

"ఇవన్నీ ఎందుకో తెలుసా నీకు?" రాధిక రాజమ్మను అడిగింది.

"ఊహూఁ! తెలియదమ్మా? ఎందుకో చెప్పరూ" రాజమ్మ చేతులు నలుపుకుంటూ ప్రశ్నించింది.

"రాజమ్మా! ఇటుచూడు నేనూ నాన్నా వెళ్లి పాపాయినీ, అమ్మనూ యింటికి తీసుకుని వస్తున్నాము" అన్నది రాజమ్మకు ఎదురుగా నిలబడి.

"ఇప్పుడు వెళ్ళుతారా అమ్మా! నేను కూడా రానా?"

"వద్దు. నీవు యింట్లోనే ఉండాలి. పాపాయి వచ్చినప్పటి నుండి పాపాయి పనులన్నీ నీవే చేయాలి ఇవన్నీ పాపాయి కోసం తయారు చేశాను. చూడు!"

"ఈ పళ్ళెం గ్లాసులూ పాపాయికేనా అమ్మా!"

"అవును. పాపాయి భోజనం చెయ్యటానికి పళ్లెం, పాలు తాగడానికి గ్లాసులు కావాలా వద్దా?" రాధిక నడుంమీద చేతులు పెట్టుకుని అధికారంతో ప్రశ్నించింది.

రాజమ్మ పక్కకు తిరిగి నవ్వుతుని "పాపాయికి అన్నీ కావాలి" అన్నది.

పాపాయి ఇంటికి వచ్చిన తరువాత రాధికకు దినాలు నిమిషాలవలె గడిచి పోయాయి. పాలు తాగేటప్పుడు దగ్గర కూర్చునేది.

నిద్రపోగానే శ్రద్ధగా దోమతెరవేసేది. ప్రతి సాయంకాలం తండ్రి ఇంటికి రాగానే తన ఆధ్వర్యంకింద ఉదయంనుండి సాయంత్రం వరకూ జరిగిన పాపాయి దినచర్య వివరించేది. పాపాయి కదలికలను గురించి తండ్రితో చిత్ర విచిత్రంగా వర్ణించి చెప్పేది.

"అమ్మా పాపాయి నాతో ఎప్పుడు ఆడుకుంటుంది?" ప్రతిరోజు ఉదయం పాపాయి పాలు తాగేటప్పుడు ఎదురుగా కూర్చుని రాధిక అడిగే ప్రశ్న ఇది :

"ఇంకా ఏడాది కావాలి పాపాయి కొన్నాళ్ళయిన తరువాత నడుస్తుంది. అప్పుడు కాని నీతో ఆడుకోదు "

"పాపాయి నాతో ఎప్పుడు మాట్లాడుతుంది?"

"మాటలు వచ్చింతరువాత "

"పాపాయికి త్వరగా నడక రావాలి. పోచమ్మ తల్లీ! మా పాపాయి నాతో మాట్లాడాలి. ఆడుకోవాలి " అనుకుంటూ రాత్రిళ్లు నిద్రపోయేది రాధిక.

ఉదయము లేవగానే "అమ్మా! పాపాయికి ఎన్నేళ్లు?"

"ఇంకా మూడవ నెల రాలేదుగా?" తల్లి నవ్వుకుంటూ చెప్పే జవాబుకు రాధిక ముఖము విసుగుతో ముడతలు పడ్డది.

ఉదయము పది గంటల వేళ రాధిక భోజనము చేసే సమయము. తల్లి దగ్గర కూర్చుని రైలు కథ చెప్పుతున్నది. కథ మధ్యలో "అమ్మా. పాపాయి ఎప్పుడు అన్నం తింటుంది?" రాధిక తల్లి గడ్డము పట్టుకుని ముఖాన్ని తనవైపు తిప్పుకుంటూ అడిగింది.

"ఇప్పుడు కాదమ్మా. పదినెలలు వస్తే అన్నం ముట్టిస్తాము. అప్పటినుంచీ తింటుంది. ఈలోగా పళ్లు కూడా వస్తాయి" చెప్పింది తల్లి.

"పళ్లు....పాపాయికి పళ్ళు" అంట్లచేత్తో చప్పట్లుకొట్టి పళ్ళు బయటకు పెట్టింది రాధిక.

రైలు కథ మరికొంతదూరం సాగింది. పళ్ళెంలో అన్నం కొంత తరిగి ది.

"పాపాయీ, నేనూ పలక తీసుకుని బడికి పోతామే అమ్మా!" కథను మధ్యలో ఆపి రాధిక తల్లి ముఖం తనవైపు తిప్పుకుంటూ గునిసింది.

"ఇంకా పాకటం రాదు-కూర్చోటం రాదు. నీతో బడికి ఎలా వస్తుంది?"

"అయితే నేనూ బడికిపోను" రాధిక ఈ మాట అంటూఉండగా పాపాయి ఏడుపు వినబడ్డది. తల్లి వెంటనే లేచి వెళ్లింది

తల్లి పాపాయిని తీసుకువస్తుందని రాధిక వేళ్ళు నోట్లో పెట్టుకుని ఎదురు చూస్తూ కూర్చుంది. అయిదు నిమిషాలు ఓపిక పట్టింది. ఆమె రాలేదు. పాపాయి ఏడుపు మాత్రం కొంతసేపటికి సర్దుకున్నది ఆ వెంటనే తల్లిదండ్రుల మాటలూ, నవ్వులూ రాధికకు వినిపించాయి. రాక వెంటనే పళ్ళాన్ని కాలితో తన్ని ఏడుస్తూ లేచిపోయింది.

ఆ నాడంతా రాధికకు ఏమీ తోచలేదు. అలవాటు చొప్పున పాపాయి ఉయ్యాలదగ్గరికి వెళ్ళింది. అక్కను చూసి పాపాయి నవ్విన బోసినవ్వులు రాధికకు ఆనందాన్ని కలిగించలేకపోయాయి.

ఉదయం లేస్తూనే రాధిక రాజమ్మను పిలిచింది రాజమ్మ రాలేదు తల్లిని పిలిచింది. తల్లి పలకలేదు. ప్రతిదినమూ ఉదయము ఏడు గంటలకు రాధిక నిద్ర నుండి లేస్తుంది. పావుగంట ముందుగా రాజమ్మ వచ్చి మంచందగ్గర కూర్చుని ఉండేది. రాధిక నిద్రలేచిన వెంటనే ముఖం కడిగి పాలూ రొట్టె తినిపించేది. కాని ఆనాడు ముందుగా వచ్చి కాచుకొని ఉండకపోగా రాధిక పిలిచినప్పుడయినా రాజమ్మ రాలేకపోయింది.

రాధిక మరికొంత సేపాగి మళ్ళీ పిలిచింది. ఎంతోసేపటికి రాజమ్మ వచ్చింది. రాధిక కోపాన్ని ఆపుకోలేక రాజమ్మమీద నిప్పులు కురిపించింది అలవాటు ప్రకారం రాజమ్మ "నీబాంచను కాల్మొక్కుతా" అని ఆరోజు అనలేద మాట్లాడకుండా వెళ్ళిపోయింది. పాపాయి పనులతో తీరుబడిలేని రాజమ్మ గబగబా అడుగులు వేసింది.

ఈమధ్య రాజమ్మలో కలిగిన మార్పు రాధిక గ్రహించింది రాజమ్మలో తనపట్ల అవిధేయత పొడచూపుతున్నట్టుగా రాధిక కనిపెట్టింది. ఇదివరలో రాధిక ఆట లాడేటప్పుడు రాజమ్మ ఎదురుగా కూర్చునేది. రాధిక వెంబడి తిరుగుతూ ఉండేది. ఇప్పుడు రాజమ్మ మాటలలో రాధికను గురించిన కుతూహలమూ, ఆసక్తీ కనబడడంలేదు రాజమ్మ ఇల్లా ఎందుకు చేస్తున్నది.?

ప్రతి దినమూ రాత్రి పడుకోబోయేముందు తల్లి దగ్గర కూర్చుని రాధికకు కాకి - నక్క కథ చెప్పే అలవాటు "కాకిబావా! నీ కంఠం ఎంత మధురం!" అని నక్క అనే పట్టులో కళ్ళుమూతలు పడుతున్నా రాధిక ఒక్కసారి నవ్వి నిద్రపో తుంది. ఈ మధ్య సరిగ్గా ఆ సమయానికి పాపాయి ఏడుస్తున్నదంటూ తల్లి ఉయ్యాల దగ్గరే ఉంటున్నది. తల్లికి బదులుగా రాజమ్మ కాకికథా పిల్లికథా చెప్పినా రాధికకు నిద్రరావటంలేదు

రాధికకు వారంరోజుల నుండీ అన్నం హితవు తప్పినట్టుంది. భోజనము చేయాలని లేదు. రాత్రిపూటా భోజనం దగ్గర ఏదో లోపము కనబడుతున్నది. తల్లితో ఘర్షణపడుతున్నది. ఎప్పుడూ ఏడుపు రాత్రివేళ కలతనిద్ర, మధ్యమధ్య ఏడుపు రాధికకు ఇప్పుడు పాపాయిమీద గాని ఆటలమీదగాని ఆసక్తిలేదు. ప్రతి రోజు సాయంకాలపు వేళ తండ్రితో కబుర్లు చెబుతూ ఆయనవెంట తిరిగేది- ఇప్పుడు తండ్రి ఆ సమయంలో పత్రిక చదువుతూ పాపాయి దగ్గర కూర్చుని పాపాయి బోసినవ్వులు చూసి ఆనందిస్తున్నాడు. ఆ సమయములో రాధికకు చెప్ప లేనంత దుఃఖము పొంగి పొంగి వస్తున్నది. చికాకుగా జుట్టుపీక్కుంటూ తిరుగుతూ రాధిక ఇప్పుడు అందరిచేత చివాట్లు తింటున్నది.

నెల రోజులలో రాధిక నల్లబడి చిక్కిపోయి సగమయింది తల్లీ తండ్రి డాక్టరు దగ్గరికి తీసుకువెళ్లి చూపించారు. మందు తీసుకోడానికి రాధిక పేచీ పెట్టడమూ తల్లిచేత దెబ్బలు తినటమూ దినచర్యగా మారింది. రాధిక నౌకర్ల మీద తల్లిదండ్రులమీద తిరుగుబాటు చెయ్యటం మొదలుపెట్టింది.

ఉదయం ఎనిమిది గంటలవేళ రాధిక రాజమ్మను పిలిచింది. రాజమ్మ అరగంట క్రితమే మరొక పనిమీద అక్కడినుంచి వెళ్లింది. హాలులోనూ, వరండాలోనూ రాజమ్మ కనబడలేదు. ఎదురుగా ఉన్న గదిలో దోమతెర కప్పిన

ఉయ్యాల. రాధికముఖం జేవురించింది. కోపముతో దేహము వణికిపోయింది.తలుపులు కదలకుండా పెట్టిన ఇసుక సంచులు రాధిక చక్రాలవంటి కళ్లను ఆకర్షించాయి. వాటిని చూడగానే రాధికకు తటాలున ఒక ఊహ మెరపులా మెరిసింది. వెంటనే ఇసుక సంచి అందుకుని బలము కొద్ది ఉయ్యాల మీదికి విసరబోయింది. కాని కాలుజారి బోర్లపడ్డది. ఇసుక సంచి ఉయ్యాల కోడుకు కొట్టుకుని పెద్ద చప్పుడు చేసింది.

రాధిక ఏడుపు స్నానాల గదిలో ఉన్న తల్లికి వినిపించింది. అప్పుడే స్నానము చేయించిన పాపాయిని తువ్వాలతో తుడుస్తూ ఒక్క అంగలో వచ్చి చూసింది. ఆమె వెనుక పాపాయిని పట్టుకుని రాజమ్మ వచ్చింది.

పాపాయిని చూడగానే దెబ్బ తగిలినప్పటి కంటె బాధతో రాధిక ఏడుస్తూ కాళ్ళు నేలకు రాయడం మొదలు పెట్టింది. రాధిక ఎదలో ఏదో బాధ చెప్పలేనిదీ తీరనిదీ స్థావరమేర్పరచుకున్నది. ఇప్పుడు రాధికను నవ్వించగలిగినదేదీ లేదు. ఆ తరువాత ఆమెను నవ్వగా చూచినవారూ లేరు. పాపాయిని ఎత్తుకున్న తల్లిని చూసినప్పుడు మాత్రం రాధిక ఎవరో కొట్టినట్టుగా గీపెట్టి ఏడుస్తుంది. రాత్రిళ్లు పడుకోబోయేటప్పుడు ''పోచమ్మ తల్లీ! ఈ పాపాయిని తీసుకుపో'' అంటూ గొణుక్కుంటూ ఉంటుంది బక్క చిక్కిన రాధిక.

(ఆంధ్రజ్యోతి-సచిత్ర వార పత్రిక)



# అడ్డు తెరలు

‘‘మీరు ఈ ఊళ్లో ఉండబట్టి నాలుగేళ్లయిందా?’’ ఎన్నేళ్లయితేనేం? ఐనా ఈ ప్రశ్న డాక్టరు కెందుకు? ఏదో తోచిన మందు ఇచ్చి అవతలికిపోక! నీరసంగా మంచముమీద పడుకొని ఉన్న కాత్యాయని కనుబొమలు ముడివేసుకొని పక్కకు ఒత్తిగిల్లింది.

‘‘మూడేళ్లు కావచ్చింది. అసలు నేను ఉద్యోగానికి వచ్చే మూడేళ్ళయింది. ఈ ఊరే మొదలు—’’

అడిగిన దొకటే ప్రశ్నకాని మూడు ప్రశ్నలకు పనికి వచ్చే జవాబు ఇచ్చాడని కాబోలు కాత్యాయని వెనక్కు మళ్ళి భర్తను అదొక మాదిరిగా చూసింది. కొంతమంది ప్రశ్నలు ఎట్లా ఉంటాయంటే జవాబు చెప్పే వాడికి ‘ఇందులో ఏమున్న’ దనిపించినా వినేవాళ్ళకు ‘చొప్పదంటు ప్రశ్న’ అనిపించినా ప్రశ్నించిన వాళ్ళ మనసులో రాబట్టుకొన్న విషయమంతా రికార్డు చేయబడి, సందర్భము వచ్చినప్పుడు ఋజువుకు ఎనికి వచ్చేటట్టుగా ఉంటుంది.

‘‘నాకు మాత్రము ఈ విశాఖపట్నంలో అక్షరాభ్యాసమయింది. మెడికల్ డిగ్రీ తీసుకోగానే యిక్కడ ఉద్యోగం దొరికింది.’’

‘‘నేను మద్రాసు, పూనా, ఢిల్లీ నగరాలలో చదువు వెలిగించాను. ఢిల్లీలో ఉండగానే సెలెక్షను వచ్చింది. అది కాగానే వెళ్ళి సెలెక్టు అయాను.’’

‘‘అందరితో తూచి తూచి మాట్లాడే ఆయనలో ఇవాళ ఇదో కొత్త మార్పు కాబోలు!’’ ఆమె ఆశ్చర్యపడ్డది. తనకు కలిగిన ఆశ్చర్యాన్ని పైకి కనబడనీయకుండా ఎంత కప్పిపుచ్చినా డాక్టరు ఓరకంటితో కనిపిస్తూనే ఉన్నాడు. అతడిచేత వాగించి ఆమెను గమనిస్తున్నాడు.

"భార్యాభర్తలిద్దరూ ఒక సబ్జక్టు వాళ్ళయితే దాన్ని గురించే వాళ్ళు ఎప్పుడూ చర్చించుకుంటూ ఉంటారని మా అన్నయ్య అంటూ ఉంటాడు. మీరు అలాగే అనుకుంటూ ఉంటారా?"

ఈ ప్రశ్నకు ఉమాశంకరం ఏమని జవాబు చెప్తాడో కాత్యాయని ఊహించు కుంది. కాని అతడు ఆమె ఊహను ఖండించినట్టుగా "చర్చించటానికి మనిషి ప్రధానమా-విషయం ప్రధానమా?" అన్నాడు.

"కావలసిన వ్యక్తులతో చర్చించటానికి అభిమానమైన అంశమేమిటని నేనడిగే ప్రశ్న:" డాక్టరు ఈ మాటలంటూనే ఉమాశంకరము మొదట వెలిబుచ్చిన అభిప్రాయాన్ని రికార్డు చేసుకొన్నాడు

"భార్యది కూడ తన సబ్జక్టేనని తెలిసిన తరువాత దానిమీద అభిమానం పోయినా అసహజము కాదు:" కాత్యాయని నోరుజారింది. తరువాత నాలుక కరచుకొన్నది.

డాక్టరు ముఖము ఒక్కసారి తళుక్కున మెరిసింది.

"నా భార్య కూడ డాక్టరయితే బాగుండునని నేను మనసుపడే అవకాశం లేదు సుమా. కాని ఒక్క సంగతి. వైద్యాన్నిగురించి తెలియకపోయినా నాతో అవిడ ఎప్పుడూ మందులను గురించి జబ్బులను గురించి తప్ప మరొకటి మాట్లాడదు." డాక్టరు మాట్లాడుతూ వాళ్ళ ముఖాలను చూడటం మొదలుపెట్టాడు.

"ఆమె ఏ యూనివర్సిటీలో ప్యాసయింది?" కాత్యాయని కుతూహలంతో ప్రశ్నించింది.

దానికి జవాబుగా డాక్టరు ఇల్లెగిరి పోయేటట్టు నవ్వాడు. "ఆమెకు డిగ్రీలు ఉన్నాయనా మీరనుకోవటం?"

"అందుకే.... అందుకే...." కాత్యాయని మాటపూర్తిచేయకముందే నౌకరు పిల్లవాడిని తీసుకువచ్చాడు. ఉమాశంకరం నాలుగడుగులు ముందుకు వేసి ఆప్యాయంగా పిల్లవాడి నందుకున్నాడు.

కాత్యాయని ముఖం ఎర్రబడ్డది. గోడవైపు తిరిగి దీర్ఘంగా ఊపిరివిడిచింది.

ఆరునెలలనుండీ డాక్టరు కాత్యాయనికి మందు వాడుతున్నాడు. దేహములో అశక్తత తప్ప మరేమీ కనబడదు. ఎన్నిరకాల మందులూ టానిక్కులూ వాడినా అశక్తత తగ్గటం లేదు. ఆరోగ్యస్థితి ఆరు నెలలనాడు ఎట్లా ఉన్నదో అంతే. మంచం మీదనుంచి దిగి తనకై తాను పది అడుగులు వెయ్యలేదు. లేస్తే గుండె దడదడలాడిపోతున్నది. కాళ్లూ చేతులూ వణికిపోతున్నాయి.

ఒక వారంరోజులనుండీ డాక్టరు ఆమెను మందులతో బాధించటం లేదు. రోజూ సాయంకాలం ఒక అరగంటసేపు కులాసాగా కబుర్లు చెప్పి ఇంటికి వెళ్లు తున్నాడు.

ఫిబ్రవరినెల మూడవవారము - రాత్రిళ్లు చలి-పగటిపూట ఎండ. ఒకనాడు డాక్టరు కాత్యాయని యింటికి రాలేకపోయాడు. ఆనాడంతా కాత్యాయని గోడవైపు తిరిగి మంచముమీద పడుకునే ఉంది. ఉమాశంకరం వాకిటి వరెండాలో సాయం త్రంకాగానే పుస్తకం చేతపట్టాడు.

మరునాడు మామూలువేళకే డాక్టరు వచ్చాడు. ఉమాశంకరం ఆయనను చూడగానే వాకిటిముందుర నైట్‌క్వీను చెట్లదగ్గర నీళ్లుచల్లించి కుర్చీలు వేయిం చాడు. ఓపిక చేసుకుని కాత్యాయని కూడా లేచి కుర్చీలో కూర్చుంది.

క్రిందటిదినము ఆయన ఎందుకు రాలేదో అడగాలని కాత్యాయనిమనసు ఉబలాటపడింది. కాని అభిమానం అడ్డుపడ్డది. 'ఇద్దరూ డాక్టరు చెప్తాడేమో అన్నట్టు చూస్తున్నారు.

రోటరీక్లబ్బులో సంయుక్తరాష్ట్ర సమాచారశాఖవారి చిత్రప్రదర్శనం చూసి వచ్చానని డాక్టరు చెప్పాడు. కోటు విప్పి చేతిమీద వేసుకుని, చూసి వచ్చిన సూర్యాస్తమయశోభను వర్ణించటం మొదలుపెట్టాడు.

ఉమాశంకరానికి చప్పున ఏదో జ్ఞాపకం వచ్చినట్లయి ''మేమూ చూశాము. ఒకసారి'' అన్నాడు.

కాత్యాయని పెదవులు వాటంతట అవే విరుచు కున్నాయి. మూడేళ్లనాడు చూసిన చిత్రప్రదర్శన విశేషాలు నిన్నా మొన్నా చూసివచ్చినట్టు ఉమాశంకరం వర్ణిస్తుంటే డాక్టరు వింటూ వింటూ మధ్య కాత్యాయని ముఖాన్ని క్రీగంట చూస్తు

న్నాడు. కాత్యాయనికి ఆనాడు చిత్రప్రదర్శనానికి వెళ్లిన వైనం స్మృతి పథాన మెరుపులా మెరిసింది.

కాత్యాయని తలనిండా విరజాజులు పెట్టుకుని కనకాంబరం చుక్కల నల్లచీరె కట్టుకొని డాబామీద నిలబడ్డది. పశ్చిమదిశకు చేరుకున్న సూర్యుడు చుట్టూ అలుముకున్న అరుణరాగాలనూ, ఆ వింతసోయగాన్నీ చూస్తూ నిలబడిపోయినది. సూర్యోదయమూ సూర్యాస్తమయమూ ప్రకృతి సిద్ధమయిన దినచర్యలే. కాని- ఏరోజు కారోజు నూత్నశోభలతో కనబడుతూ ఉంటాయి. నిత్యమూ భానుడు బంగారు ఛాయలలోనే మాటు మణిగిపోతాడు. కాని ఆ రంగుల కలయిక, ఆ లేత కిరణాలు, మబ్బులు కమ్మిన ఆ జేవురుకాంతి నిత్యనూతనము. ఆమె అక్కడ నిలబడి ఉండగనే నాలుగిళ్ల అవతల సింగుదంపతులు కిలకిలలాడుతూ సినిమాకు కాబోలు బయలుదేరారు. వాళ్ళు రోడ్డు మలుపు తిరిగేవరకూ చూసి వెనక్కు తిరిగింది. మనస్సు కలతబారినట్లయింది. మెట్లు దిగబోయి తూలిపడ్డది

మూడవనాడు ఉమాశంకరంతో వెళ్ళి ఆ చిత్రప్రదర్శనాన్ని చూసి వచ్చింది. దార్శనికతలో వారు చూపిన పరిపూర్ణత ఆమె కెంతో విస్మయాన్ని కలిగించింది. ఆమె కెంతో ఆత్మానందం కలిగింది. అయినా ఎంత వరవడితో ప్రవహించినా నదీగర్భంలోని ఒక చిన్నగుట్టను కమ్ముకోలేకపోతున్న దా ప్రవాహము. ఆమె మనసు పొంగులువారుతూ ఒడ్డు లొరుసుకుంటూ ప్రవహించే నదిమీదికి పోయేది కాదు. కాని గుట్టశిఖరాన్ని అందుకోలేని ఆ నది పొంగూ దాని ఉత్తుంగతరంగాల మధ్య చంద్రుడిలో మచ్చలా ఆ నల్లటి గుట్టా ఆమెకు మరువని స్మృతులు.

కాత్యాయని వెచ్చటి నిట్టూర్పు విడిచి ముఖాన్ని దించుకుంది.

'నేను చెప్పేది మీకు నచ్చినట్టు లేదు' తల పంకిస్తూ కాలూపుతూ అన్నాడు డాక్టరు.

కాత్యాయని ఒకసారి కళ్లెత్తి కిందికి వాల్చింది. డాక్టరుతో పరిచయమయి నప్పటి నుండీ కాత్యాయని హృదయం మరింత దిగజారిపోతున్నది. ఉమాశంక రానికి అతడిని చూడగానే పంచప్రాణాలూ లేచి వచ్చేవి. ఆమె ముందరే ఇద్దరూ కబుర్లలో పడి గడియారాన్ని చూసేవారుకారు. కాత్యాయనికూడా ఆ కబుర్లు

వినాలనే కుతూహలంగా ఉండేది. తాను కూడా మాట కలపాలనుకునేది. తాను అరమర లేకుండా అమితోత్సాహంతో కబుర్లు చెబుతున్న ఉమాశంకరాన్ని చూడ గానే ఆమె మనసు కుంచించుకుపోతున్నది. ఏమా ప్రసంగ కౌశలము! తియ్యగా హాయిగా ఇంత బాగా మాట్లాడుతున్నాడు! స్నేహితులు ఒకరిద్దరు ఆయనను పొగడటం ఇదివరలో ఒకసారి విన్నది. ఇందుకే కాబోలు!

మరునాడు మధ్యాహ్నం రెండుగంటలకు డాక్టరుకు కబురువచ్చింది. కాత్యా యనికి తలనొప్పి ఎక్కువగా ఉన్నదని, అప్పటి కేదో మందు పంపి సాయంత్రం వచ్చాడు చూడటానికి.

"మీ తలనొప్పి ఎలా ఉంది?" కుర్చీ దగ్గరగా లాక్కున్నాడు.

"కళ్ళు తెరవలేకుండా ఉన్నాను" బాధతో మూలుగుతూ అన్నది కాత్యాయని.

"తలనొప్పేగా - అదే తగ్గిపోతుంది. ఇవాళ మా స్నేహితు డొకడు ఉత్తరం వ్రాశాడు. బ్రహ్మచారిగా ఉండి ఉండి మొన్ననే పెళ్ళి చేసుకున్నాడట. పద్మా పాపయ్య అని మదరాసులో క్వీన్ మేరీస్ కాలేజీలో చదివిందట. ఆనర్సు. ఫస్టుక్లాస్"

"ఆఁ హాఁ! అయితే ఎప్పుడు చదివి ఉంటుంది?" మెల్లిగా పడక మీది నుంచి లేచి కూర్చుంది కాత్యాయని.

ఆరేళ్ళక్రింద ప్యాసయిందట. ఇప్పుడు నెల్లూరు కాలేజీలో లెక్చరరుట."

"నేను చదివేటప్పుడు ఒక్క పద్మాపాపయ్య ఉండేది. నా క్లాస్ మే టన్న మాట."

"అయితే ఆవిడే అయి ఉంటుంది. 'మా ఆవిడ ఫోటో చూడ'మని పంపాడు. ఆ గ్రూపుఫోటోలో మీరు ఉన్నారు."

"నిజంగానా? పరీక్షలముందర తీయించుకున్నాము. అద్భుతమైన తెలివి గలది. అసలు పెళ్ళే చేసుకోనంటూ ఉండేది. అయితే ఆయ నేం చదివారు?"

"చదువులో మావాడు ఆమెముందు తీసికట్టే. టీ కంపెనీలో పనిచేస్తు న్నాడు. జీతం భత్యం కలిపి అయిదు వందలు వస్తాయి. ఆమెకు రెండువందలు.

ఏభై. కలిసి ఖులాసాగా జీవిస్తున్నారు. ఇక్కడికి సెలవుల్లో వస్తామని వ్రాశాడు. వస్తే మీ యింటికి తీసుకువస్తాలెండి.''

ఉమాశంకరం పిల్లవాడిని ఎత్తుకుని వచ్చాడు. ఆమె ఎదుటనే ఇద్దరూ కబుర్లలో పడ్డారు.

కాత్యాయని మనసు తాను కాపరం పెట్టిన తొలి రోజులమీద వాలింది. ఆమె ఆ ఉదయము కావాలని ఎనిమిది గంటలకు నిద్రలేచింది. ఇల్లంతా ఒక్కసారి కలయదిరిగి ఉమాశంకరం ఆఫీసుగదిలోకి తొంగి చూసింది. కుర్చీలో కూర్చుని ఫైల్సు తిరగవేస్తున్నాడు. దీర్ఘంగా నిట్టూర్పు విడిచి, కళ్లు మూసుకుని వెనక్కు తిరిగింది. అరగంట సేపటిలో వేడివేడి కాఫీ రెండు గ్లాసులు తెచ్చి బల్లమీద పెట్టింది

పావుగంట తరువాత ఉమాశంకరం లోపలికి వచ్చాడు. మాట్లాడకుండా తన గ్లాసందుకుని తాగి వెనక్కు తిరిగాడు. కాత్యాయనికి కణతలు పగిలిపోతున్నాయి ఉత్సాహమంతా నీరసంగా మారిపోతున్నది. కాళ్ళు ఈడిస్తేనేగాని నడక కుదరటంలేదు. చప్పగా చల్లారిన కాఫీ గుటుక్కున తాగి వంట యింట్లోకి అడుగు పెట్టింది. ఉత్సాహంతో ఉరుకులు పెడుతూ పొంగులువారుతున్న హృదయం ఆరు నెలలకే ఎండి మోడయిపోయింది. దిగులుగా భారంగా క్రుంగిపోయి కుర్చీలో కూర్చుని పోయేది. ఎంతసేపటికీ లేవాలనిపించేది కాదు. పరధ్యానంతో రుచీ పచీ తెలుసుకోకుండా నాలుగు మెతుకులు కడుపులో వేసుకుని, మనసు మళ్ళించుకోవటానికి ఎన్ని పుస్తకాలు పుటలు తిరగవేసినా అ చెమట బిందువులు అట్లా అవతరిస్తునే ఉండేవి. డ్రాయింగురూములో కూర్చుని ఉబుసుపోక ఊలో దారమో అల్లుతూ ఉంటే పని తీర్చుకున్న అమ్మలక్కలు ఆమె అదృష్టాన్ని పదేపదే పొగుడుతూ ఉంటే కలువరేకుల్లాంటి కళ్లు మరింత విచ్చుకునేవి ఆశ్చర్యంతో.

అన్నయ్య కొంటె కోణంగి. మనస్సులో ఉన్నమాట పుస్తకం చదివినట్లు చదువుతాడు, సంక్రాంతికి వెళ్ళినప్పుడు ఉమాశంకరం మూడోనాడే ప్రయాణమయ్యాడు. ''మనం వెళ్దాము, బయలుదేరు'' అని ఉమాశంకరం అంటే సంతోషంతో తను కూడా బట్టలు సర్దుకొని బయలుదేరి ఉండేది. మాటవరసకు, నాన్నగారు ''కాత్యాయని కూడా ఇప్పుడే రావాలా?'' అనగానే ఒక్కడే బయలుదేరాడు.

పదిరోజులు ఉన్నదన్న మాటేగాని దిగజారిన మనసుతోనే ఉన్నది. అన్నయ్య చిటికెలో సంగతి గ్రహించాడు. ఆ మరునాడు "మాటా మంచీ లేకుండా ఏమి టాకాఫీ యివ్వటం!" వదినను కేకలేస్తున్నాడు. భోజనాల దగ్గర "ఈ మూగవడ్డన ఏమిటి?" కసురుకుంటున్నాడు రెండు రోజులు అన్నయ్య ధోరణి చూచేసరికి తనకు హృదయం బరువెక్కినట్లయింది. మాట్లాడితే కళ్ళ నీళ్ళు కారే పరిస్థితికి వచ్చింది.

"ఇది యంత్రం కాదు కమలా? మానవ జీవితం. ఒకమాటతో ఎదటివాడి మనసు పొంగాలి. నీరు కారిపోకూడదు. కలిసి బతకాలంటే మాట కలుపుకోవాలి" వదినెకు రోషం వచ్చి మూతి మూడువంకర్లు తిప్పుకుంటూ లోపలికి వెళ్ళింది. తన వ్యధకొక రూపమిచ్చి వ్యక్తం చేశాడు అన్నయ్య. తన సంగతి గ్రహించి తన నేడిపించటానికి పూనుకున్నాడు.

ఉదయం లేవగానే అన్నయ్య గదిలోంచి "కమలా! ఇన్నాళ్ళయింది కదా నీవు వచ్చి! యాంత్రిక జీవితమే కాని సరదాగా ఇది కావాలని అడగవు. ఎక్కడి కయినా వెళ్దాము రమ్మనవు, ఏమిటి నీ మనస్సులో ఏముంది చెప్పు?" నొక్కి నొక్కి అడుగుతున్నాడు.

"నే నడక్కపోతే ఏమండీ. మీరు రమ్మనగానే వస్తున్నాగా" సన్నగా వదిన మాటలు.

"అదా! అయినా నీవు అడగటము. నేను తీసుకు వెళ్ళటము దానిలో ఎంత సంతోషం ఉంటుందో ఊహించవేం? గంగిరెద్దులా అన్నిటికీ తల ఊపుతావా?"

వదిన మాట్లాడలేదు. కొందరికి అడగటం ఇష్టం. కొందరికి అడిగించు కోవటం ఇష్టం. కొందరికి ఎదటి వారు తమదగ్గర చనువుగా, కులాసాగా ఉండటం ఇష్టం. కొందరికి తమతో ఎవరూ చనువుగా ఉండటం ఇష్టంలేదు. అన్నయ్య మాటలు పరిహాసానికి కాక నిజమయితే........ఆయన కెంత బాధో? మరి తనకు? అన్నయ్య ఎత్తి పొడవటం లేదుకదా!

ఈ పదిరోజులలో కాత్యాయనిలో మార్పు అంతగా కనబడలేదు. బలకర మయిన ఆహారం బలవంతంగా డాక్టరు దగ్గర ఉండి పెట్టిస్తున్నాడు.

సాయంత్రం అయిదుగంటలకు టెలిగ్రాము వచ్చింది ఆయన స్నేహితుడు భార్యతోసహా అక్కడికి వస్తున్నట్లుగా డాక్టరు స్టేషనుకు వెళ్ళి ఇద్దరినీ కారులో తీసుకువచ్చాడు.

పద్మా పాపయ్య మనిషి ఒడ్డూ పొడుగు-తీవిగా ఉంటుంది. అతడు ఆమె ముందర చాలా పీలగా కనబడతాడు. పద్మను చూడగానే లేచి కౌగలించుకుంది కాత్యాయని

"కానీ! ఏమి టిలా ఉన్నావు? ఏం జబ్బు చేసింది? నీ ఉత్సాహమంతా ఏమయింది? డాక్టరుగారు చెప్పేవరకూ నీ విక్కడ ఉన్నట్టు తెలియదు సుమా!" పద్మ కాత్యాయిని మంచమ్మీద కూర్చుని ఆవేదనతో పలకరించేసరికి కాత్యాయనికి దుఃఖం పొంగుకుంటూ వచ్చింది.

డాక్టరు, పద్మభర్త వసంతరావు ఆ గదిలోకి వచ్చారు. మరొక కుర్చీ తీసుకుని వాళ్ళవెనక ఉమాశంకరం వచ్చాడు. పరస్పరాభివాదాలు అయిన తరువాత "ఈమేకదూ నీవు పంపిన ఫొటోలో ఉన్నది?" వసంతరావు మెల్లగా పద్మ చెవి దగ్గరగా ముఖంపెట్టి అడిగాడు.

అవును. అప్పుడు ఎలా ఉండేదనుకున్నారు? మనిషి బంతిలా ఉండేది ఎంతో ఉత్సాహంగా ఎగురుతూ ఉండేది హాస్టల్లోకల్లా సరదా గల పిల్ల కాత్యాయనే. ఏమిటో ఇప్పు డిలా అయిపోయింది"

పిల్లవాడు తప్పటడుగులు వేస్తూ, తల్లిదగ్గరికి వచ్చాడు. అందరూ తలా కొంచెముసేపు ఎత్తుకొని, ముద్దుపెట్టుకున్నారు వసంతరావు ప్యాంటు జేబులోంచి బిస్కట్లు పొట్లము తీసి పిల్లవాడి చేతిలో పెట్టాడు. పొట్లం చింపి ఒకటి తాను తిని రెండవది తల్లి నోట్లో పెట్టపోయాడు.

"నాకు వద్దమ్మా, ఈ ఆంటీకి పెట్టు." కాత్యాయని పిల్లవాడిని బలవంతం చేసి పద్మకు ఒక బిస్కట్టు యిప్పించింది. పద్మ పిల్లవాడిని ఎత్తుకుని ముద్దుపెట్టుకుంది. మగవాళ్లు ఏవో కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటున్నారు. అందరిలో ఉమాశంకరం గొంతే బాగా వినబడుతుంది.

నౌకరు కాఫీ తెచ్చి అందరికీ యిచ్చాడు. ఉమాశంకరం వక్కపొడి డబ్బా అందించాడు.

మా చెల్లెలు నాకంటే ముందు పెళ్ళి చేసుకుంది కాచీ దానికొక కొడుకు పుట్టాడు చూడటానికి రమ్మని వ్రాసింది. తెల్లవారుఝామున బయలుదేరే బండిలో వెళ్ళిపోతాము. అప్పుడుగాని కాచీ నీవు మా ఇంటికి వచ్చి రెండురోజులు ఉండవూ ?'' కాత్యాయని చేతిని తన చేతుల్లోకి తీసుకుంటూ అడిగింది పద్మ.

"చూద్దాంలే" అంది నీరసంగా కాత్యాయని.

"ఏమండీ మా కాచిని మా యింటికి ఒక్కసారి పంపండి. రెండురోజులు ఉండివస్తుంది'' ఉమాశంకరాన్ని అడిగింది పద్మ.

మౌనంగా తల ఊపాడు ఉమాశంకరం పద్మా వసంతరావులు లేచారు. వాళ్ళ వెంబడి డాక్టరు కూడా లేచాడు.

ఒక నిట్టూర్పు విడిచి గోడవైపుకు తిరిగి పడుకుంది కాత్యాయని.

మరునాడు లానులో కూర్చుని కబుర్లలోపడ్డారు ఉమాశంకరం - డాక్టరు.

''నాకు ఆనర్సులో సీటు రాలేదండీ, అందుకే అటు తిరిగి యిటు తిరిగి ఎలాగో బి ఎ ముగించి 'లా' చదివాను. ఈ యల్.బి.సి. లో ఉద్యోగం దొరికితే చేస్తున్నా గాని ఆనర్సులో సీటు రాలేదన్న కించ ఇంకా పోలేదు'' ఉమాశంకరం చెప్పుకుంటూ పోతున్నాడు.

కబుర్లు వింటూ డాక్టరు నాలుగు సిగరెట్లు కాలుస్తూ తల ఊపుతున్నాడు.

''అంతే కాదు, ఆనర్సులో సీటు వచ్చిన వాళ్ళను చూస్తే నాకెట్లాగో ఉంటుంది. సరిగ్గా మాట్లాడలేను ''

డాక్టరు చివాలునలేచాడు. మంచినీళ్లు తెప్పించుకుని తాగాడు. ''ఇవాళ ఏం తోచటంలేదు. మా ఆవిడ సినిమాకు వెళ్దామని టికెట్లు తెప్పించింది. మీరు కూడా రావాలి.''

''అబ్బే, మీరు వెళ్ళండి, నేను యింకోసారి వస్తాను'' ఉమాశంకరం ఎంత తప్పించుకోజూచినా డాక్టరు విడిచిపెట్టలేదు.

తనకంటె అన్ని విషయాలలోనూ పై స్థాయిలో ఉండేనే పురుషుడిని స్త్రీ ప్రేమించ గలుగుతుంది. లేకపోతే లోకువగా చూస్తుంది. అని కథా నాయ

కుడు స్త్రీలకు దూరంగా ఉంటాడు. ధైర్యంగా ఎవరితోనూ మాట్లాడలేడు. కొద్దిగా చదువుకున్న అతడు పల్లెటూరి వాతావరణంలో ధైర్యంగా మెలగగలుగుతాడు. ఆ పల్లెటూరు చూడటానికి వచ్చిన ఒక చదువుకున్న అమ్మాయి అతడు వెనుకడుగు వేస్తున్నా వెంటపడి అతనిలో ఉన్న భయాలన్నిటిని వదలగొట్టి,గాఢంగా ప్రేమించి పెళ్లి చేసుకోమంటుంది. చదువుకున్న ఆడపిల్లలను చూస్తే తలుపులు బంధించుకొని గదిలో కూర్చునే కథానాయకుడు తన సందేహాలు తీర్చుకొని ఆమెను వివాహమాడతాడు. ఇద్దరూ చాలా సుఖంగా జీవిస్తారు.

డాక్టరుకుగాని ఉమాశంకరానికి గాని ప్రతి మాటా అర్థమయేటంత హిందీ రాదు. సినిమా కథ పుస్తకం చదివి తెలుసుకున్నారు. కథంతా స్థూలంగా అర్థమయింది

డాక్టరు తన డిస్పెన్సరీలో శస్త్ర చికిత్స శాఖను పెట్టటానికి సామగ్రి అంతా కొన్నాడు. ఆ శాఖకు ప్రారంభోత్సవం చేయటానికి ఆరోగ్యమంత్రిని ఆహ్వానించాడు. ఈ పది రోజులలో ఏర్పాట్లు చేసుకుంటూ కాత్యాయనిని చూడటానికి రాలేకపోయాడు. ఉత్సవం రేపనగా ప్రోగ్రాం చెప్పటానికి ఆహ్వానపత్రం పట్టుకుని వచ్చాడు.

ఉమాశంకరం ఫైల్సు చూసుకుంటున్నాడు. కాత్యాయని డాక్టరును చూడగానే చదువుతున్న పుస్తకం అక్కడ పెట్టి రండి అంటూ కుర్చీ చూపించింది.

''సాయంకాలపువేళ ఆయన ఫైల్సు చూడటం, మీరు పుస్తకం చదవటం. ఈ ప్రోగ్రాము కేమీ భంగం కలగలేదన్నమాట.''

డాక్టరు రుమాలుతో ముఖం తుడుచుకుంటూ ఉంటే కాత్యాయని ఫాను స్విచ్చి నొక్కింది.

"ఈ వేళప్పుడు ఇక్కడ కూర్చుంటే బాగుండదు. లానులో కూర్చుందాం రండి.'' ఎవరి కుర్చీ వారు తెచ్చుకుని లానులో వేసుకుని కూర్చున్నారు. డాక్టరు గొంతు విని ఉమాశంకరం వచ్చాడు ఒక కుర్చీతో. ఇద్దరికీ చెరొక ఆహ్వాన పత్రం ఇచ్చి ''నాదొక చిన్న కోరిక, రేపటి ప్రోగ్రాములో కాత్యాయని ఫ్లూటు వాయించాలి. ఆరోగ్యమంత్రి వస్తున్నారు. ఈ ఫ్లూటు వాయించటానికి నా కెవరూ దొరకలేదు.''

కాత్యాయని ఉమాశంకరం వంక చూచింది. అతడు తలవంచుకొని డాక్టరు మాటలు వింటున్నాడు. "డాక్టరుగారూ! నా ఆరోగ్యం సంగతి తెలిసుండీ కూడా అడిగితే నే నేం చెప్పను? ఈ సంగీతం వదిలిపెట్టి ఎన్నాళ్లయిందో! అందులో ఫ్లూటు వాయించటానికి దమ్ములేదు.'' తల వంచుకొని చేతిగోళ్ళు చూసుకుంటూ ఒక్కొక్క మాట మెల్లగా అన్నది.

"మీరున్నారన్న ధైర్యంకొద్దీ నేను ఈ ప్రోగ్రాము పెట్టాను. మంత్రిగారి ముందర నా పరువు నిలపండి. మీ ఆరోగ్యానికి ఏమాత్రం భంగం కలగదు. అన్నిటికీ నేనున్నాను. దీని తరువాతనే మీలో ధైర్యం, ఉత్సాహం కలుగుతాయి. అవి లేకనే మీకింత నీరసం వచ్చింది'' డాక్టరు వేడికోలు విని ఉమాశంకరం తలెత్తి కాత్యాయని ముఖం చూశాడు. ఆమె తలవంచుకునే ఉన్నది.

"ఆమెచేత పాట పాడించే బాధ్యత మీదండీ ఉమాశంకరంగారూ! నా మర్యాద దక్కించాలి మీరిద్దరూ.'' డాక్టరు లేచాడు వెళ్ళటానికి.

ఉమాశంకరం ఆ రోజు ఎక్కువ మాట్లాడలేకపోయినా డాక్టరును కూర్చోబెట్టాడు.

"చెప్పటం మరిచిపోయాను. రేపు ఉదయం పద్మతోసహా నా స్నేహితుడు వస్తున్నాడు. మీచేత పాడించే భారమంతా ఆమె తీసుకుంటుంది. ఈ ఉత్సవంకోసం ప్రత్యేకంగా వాళ్ళిద్దరూ వస్తున్నారు" డాక్టరును గేటువరకూ సాగనంపి ఇద్దరూ వెనక్కు తిరిగారు.

పద్మ సామాను తీసుకుని కాత్యాయని యింట్లో దిగింది. పెరట్లో సపోటా చెట్టు నీడలో కుర్చీలు వేసుకుని కూర్చున్నారు యిద్దరూ. కబుర్లయిన తరువాత గంటసేపు ఘర్షణపడి, బలవంతంచేసి ఫ్లూటు ప్రాక్టీసు చేయించింది పద్మ కాత్యాయనిచేత. ఆ సాయంత్రం ప్రోగ్రాం అయేవరకూ కాత్యాయని వెంటవుండి ధైర్యం చెబుతూనే ఉన్నది.

మూడు శ్లోకాలతో ముచ్చటగా ప్రార్థనచేసింది కాత్యాయని సభారంభంలో. సదా రోగిలా మంచం మీద పడుకుని నిట్టూర్పులు విడిచే కాత్యాయని ఇంత ధైర్యంగా ఇలా పాడుతుందని ఉమాశంకరం అనుకోలేదు. తల వంచుకుని ఆనందిస్తున్నాడు.

స్వాగతోపన్యాసము, ఆరోగ్యమంత్రి ప్రారంభోపన్యాసము, వైద్యశాఖ డైరక్టరు ఉపన్యాసము అయినతరువాత గంటకుపైగా కాత్యాయని ఫ్లూటు వాద్యము. రెండు త్యాగరాజు కృతులు పాడి నవరస కన్నడ రాగములో "నిను వినా నామన సెందు నిలువదే శ్రీహరీ" అందుకున్నది. నిశ్శబ్దవాతావరణంలో ఆ ఫ్లూటువాద్యము దూర తీరాల వరకూ వ్యాపించి జీవరాశినంతనూ మేల్కొలిపింది సభికుల హృద యాలలో రసవాహినులు పొంగులెత్తాయి. కాత్యాయని తన్మయతతో కళ్ళు మూసుకుని వాయించుతున్నది. ఆ పాట ఎప్పుడు ముగిసిందో సభ్యులు తెలుసుకునే స్థితిలో లేరు. "పవమానాసుతుడు పట్టి" పాట మొదలు కాగానే బాహ్యస్మృతి కలిగిన డాక్టరు కృతజ్ఞతలు చెప్పటానికి లేచాడు.

ఆరోగ్యమంత్రికి డాక్టరు ఏర్పాటు చేసిన విందులో పాల్గొనక తప్పలేదు కాత్యాయనికి. ఉమా శంకరం ఉత్సాహంతో డాక్టరుతోపాటు తిరుగుతున్నాడు. అతడిలో కలిగిన నవచైతన్యము అతడిని బొంగరంలా తిప్పుతున్నది.

అబ్బాయి పేపరుమీద కాత్యాయని డిన్నరు కాగానే యింటికి చేరుకున్నది. అబ్బాయిని జోకొట్టుతూ ఆలోచనలో పడ్డది. భువన మోహనమయిన ఫ్లూటు వాద్యము తరువాత నిదురించిన ఆమె ఉత్సాహము మేల్కొన్నది. చెంగుచెంగున దూకటం మొదలు పెట్టింది. పద్మతో గడిపిన ఆ ఒక్కరోజునే సంసారంలోని నీరసమంతా అడుగున పడినట్లయింది. విద్యార్థినిగా హాస్టల్లో గడిపిన కాలములో మాదిరిగా నూతనోత్సాహంతో కదిలిపోయింది ధ్వని తగ్గించి మీరాబాయి భజన ఒకటి అందుకున్నది.

రాత్రి పదికొండుగంటలు కావచ్చింది. ఆలస్యం కావటంచేత ఉమాశంకరం డాక్టరు కారులో గేటు దగ్గర దిగి గబగబా అడుగులు వేస్తూ వాకిటి మెట్లు ఎక్కు తున్నాడు. ఆ యిల్లంతా మీరాబాయి భజన పాటకు స్తంభించిపోయినట్లయింది. సమ్మోహనాస్త్రతుల్యమయిన ఆ భజన గీతం ఉమాశంకరాన్ని మైమరపించింది. గది ముందర నిలబడి భక్తిపారవశ్యంలో మునిగిపోయాడు.

అడుగుల సవ్వడి కామె తల ఎత్తి చూసింది—పాట ఠక్కున ఆపివేసింది.

"భజన గీతాన్ని ఆపివెయ్యకు కాచీ. ఈ గానంతోనే నాలో వెలుగును ప్రకాశింప చెయ్యి కాచీ—" అమె భుజాలను కుదుపుతూ ఆవేశంతోఅంటున్నాడు.

కాత్యాయని నివ్వెరబోయింది. నోట్లోంచి మాట పెగల్లేదు.

కొంతసేపటికి ఉమాశంకరం కాత్యాయని రెండు చేతులు పట్టుకుని "కాచీ! మన హృదయాలను కలవనీయని అడ్డు తెరలు ఏమయినా ఉంటే చెప్పు తొలగిస్తాను" అన్నాడు ఆమె కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

"అడ్డు తెరలా! నా దృష్టి కవి లేనేలేవు" కాత్యాయని అతని ఎదలో తలదాచుకుంటూ నొసటి కుంకుమను అతడి షర్టుకు పులిమి దాన్ని అదేపనిగా చూడటం మొదలుపెట్టింది.

(పుస్తక ప్రపంచం).



# ఊహల తీగెలు - సిగ్గు దొంతరలు

సంక్రాంతికి రంగవల్లుల మధ్య పెట్టి పూజచేసిన గొబ్బెమ్మలను ఏ రోజు కారోజు గోడకు చరిచి, అవి ఎండగానే ఊడదీసి ఓ దారుకు గుచ్చి మేకుకు తగిలిస్తూ ఉంటుంది పద్మ. ప్రతిరోజూ పెరటిగోడకు కొట్టిన ఆ పిడకలు ఎండాయో లేదోనవి వేలితో నొక్కిచూసి మళ్ళీ మళ్ళీ లెక్క పెట్టుకుంటూ ఉంటుంది.

"పద్మా" తల్లి కేకమీద కేక పెట్టింది.

ఆయాసపడుతూ లోపలికి పరుగెత్తుకుంటూ వచ్చిన పద్మను "ఏం చేస్తున్నావు దొడ్లో?" తల నిమురుతూ లోపలికి తీసుకు వెళ్ళింది అన్నపూర్ణ.

పద్మకు తలదువ్వి బొట్టుపెడుతూ చెమ్మగిల్లిన కళ్లు కూతురి కంటపడకుండా ముఖం పక్కకు తిప్పుకుంది అన్నపూర్ణ.

"ఏమిటమ్మా ముఖం అలా తిప్పుకున్నావు?" తల్లి భుజాలను చేతులతో చుట్టివేసింది, పద్మ.

కడుపులో మసులుతున్న బాధంతా అణచుకోటానికి ప్రయత్నిస్తూ "ఏం లేదమ్మా. నీవింకా ఇలా ఎన్నాళ్ళు గొబ్బెమ్మలు పెడతావు? నీకు పెట్టించే ఈడు వచ్చిందనుకుంటాను" కూతురు ముంగురులు సవరిస్తూ అన్నది అన్నపూర్ణ.

"అబ్బ ఎప్పుడూ పెళ్ళిమాటేనా? నన్ను చదువుకో నీయవా? నాకు అందరిలా ఒక డిగ్రీ రావద్దా?" అని బుంగమూతితో లోపలికి పరుగెత్తింది పద్మ.

"నా తల్లికి అందంలేదా? చదువు లేదా? ఎందుకు పెళ్ళికాదు? కళ్ళకద్దుకుని చేసుకుంటారు ..." అనుకుని ధైర్యం తెచ్చుకుంటుంది అన్నపూర్ణ. అన్నను పిలిపించి సంబంధాల కోసం దేశమంతటా తిప్పిస్తుంది. కొండంత ఆశతో ఎక్కిన గడపను రెట్టించిన భారంతో దిగి వస్తున్నాడు. "అమ్మాయికేం? కడిగిన

ముత్యంలా ఉంటుంది. కాని—తల్లిని ఎందుకో మొగుడు వదిలేశాడటగా?" అని అనుమానిస్తున్నట్టుగా ఉంటున్నాయి వాళ్ళ సమాధానాలు. మేము ఆలోచించుకుని ఉత్తరం రాస్తామంటారు ప్రతివాళ్ళు. అంతే— ఆ తరువాత ఉత్తరం మాట అడుగున పడిపోతుంది.

ఆ సంగతి తలుచుకున్నప్పుడు అన్నపూర్ణ మనసు బాధతో మెలికలు తిరిగి పోతుంది

అన్నపూర్ణ చూపులు కిటికీలోనుంచి పచ్చికబయళ్ళ మీదికి పోయాయి అక్కడ నుంచి గోడకు తగిలించిన గొబ్బెదండ మీదికి ప్రసరించాయి. ఆ గొబ్బి పిడకలు రథ సప్తమినాడు సూర్యభగవానుడికి ఆరగింపుచేసే పొంగలికోసం ఆహుతి అయిపోతాయి. ప్రతి సంవత్సరమూ ఆ గొబ్బెమ్మల జీవితమంతే. కాని ఆ గొబ్బెమ్మ మోసుకువచ్చే మధుర వ్యథలు ఆమె జీవితంలో మరుపురానివి.

పేడనీళ్ల చల్లిన వాకిలిని సంక్రాంతి రంగవల్లులతో అలంకరించటమూ ఆవుపేడతో చేసిన గొబ్బెమ్మలకు పసుపు కుంకుమలతో బొట్టుపెట్టి బంతిపూలతో పూజలు చేయటమూ, స్నేహితురాళ్ళతో కలిపి గొబ్బి తడుతూ పాటలు పాడడమూ అన్నపూర్ణ జీవితంలో ఘట్టం.

గొబ్బెమ్మలకు పూజచేస్తున్న అన్నపూర్ణను చూపి తండ్రి మనసులో "నా తల్లికి మంచి వరుడు.... తగినవాడు రావాలి" అనుకునేవాడు ఆయన ఊహలను కళ్ళతో చదివే అన్నపూర్ణ "పో—నాన్నా. నీకెప్పుడూ పెళ్లిమాటలే." అంటూ జడగంటలు ఊపుకుంటూ లోపలికి పరుగెత్తేది ఆమె వెళ్ళినవైపు అదోక మాదిరిగా చూస్తున్న తండ్రికి బుగ్గన చుక్క కళ్ళకు కాటుక, కాళ్ళకు పారాణి, ముఖాన కళ్యాణం బొట్టు, తలనిండా మల్లెలు, జరీ అంచుల పసుపు చీరె, చేతులనిండా పచ్చ గాజులతో అన్నపూర్ణ తలమీద అక్షతలు దులుపుకుంటూ "దీవించండి నాన్నా" అంటూ ఎదురుగా నిలబడిన దృశ్యము కళ్ళకు కనబడేది. అటువంటి సమయాలలో ఆయనకు కలిగిన ఆనందం మాటలలో వ్యక్తం చేయలేనిది.

చలితో ముడుచుకుపోతూ ఒంటినిండా కొంగు కప్పుకుని చిరుచీకట్లలో లేచి ఆ వీధిలో అందరికంటే ముందుగా పేడ నీళ్ళు చల్లిన వాకిట్లో సంక్రాంతి ముగ్గులు తీర్చి స్వర్గద్వారాలను తెరిచి ఉంచేది అన్నపూర్ణ. ఈ పండుగకు ఆ వీధిలో అందరి ఇళ్ళకూ కొత్త అల్లుళ్ల వస్తుంటే ఆమె తండ్రికెంతో వెలితిగా ఉండేది. బల

మయిన కోరికలతో గుండెను ఊపివేసే సంక్రాంతి నూతన శోభతో వస్తోంది కదా? వస్తూవస్తూ తన కొంక అల్లుడిని తీసుకు రాకూడదా? తండ్రి హృదయం తల్లడిల్లేది.

పధ్నాలుగేళ్ళ అన్నపూర్ణకు ఏ దేవతో వరము ప్రసాదించినట్టుగా సుబ్బారావు వరుడై ఇంటికి చక్కా వచ్చాడు. పెళ్ళి తరువాత కూడా చదువు సాగించవలసిన సుబ్బారావు ఆమెను పుట్టింటనే ఉంచి వెళ్ళాడు. ఏ పండుగ వచ్చినా అత్తవారింటి పిలుపుకోసం ఎదురుచూస్తూ ఉండేవాడు. మామగారి ఆహ్వానం అందుకొని సంక్రాంతి సెలవులు వారం రోజులూ అతి మధురంగా గడిపి తిరిగి తన ఊరికి చేరుకునేవాడు. ఆ కలయిక ఆ ఎడబాటు తలుచుకుంటే యిప్పటికీ ఆమెకు ఒళ్లు జలదరిస్తుంది.

ఆ ప్రేమ—ఆ ఆప్యాయత నవనవలాడుతూ సుగంధ కుసుమాలు పుష్పించిన ఉద్యానవనంలా అతడిలో నవచైతన్యం మోసులెత్తించింది. అలా ఎన్ని సంక్రాంతులు ఎన్ని ఉగాదులు మధురాతిమధురంగా గడిచిపోయాయో లెక్కలేదు.

ఉల్లాసంతో సంతోషంతో గడిపిన కాలం సంవత్సరాలయినా క్షణాలవలె తోస్తుంది సుగంధ కుసుమాలను వెదజల్లిన తమ మధురానుభవాలు కాలగర్భంలో కలిసిపోయాయి. అన్నపూర్ణ నిండు గర్భిణి. కళ్ళనీళ్ళతో సుబ్బారావును సాగనంపుతూ "త్వరలో వచ్చి పాపాయిని చూసుకుంటారు కదూ?" అన్నది అతడి కళ్ళల్లోకి చూస్తూ. కాని అతడు రాలేదు. అతడు ఏదో సందర్భంలో తన సహాధ్యాయిని కమల చాలా చురుకైనదనీ, ఎంతో అందమైనదే కాకుండా నవనాగరికత కలదని చెప్పాడు. బహుశః ఆ పడుచుపిల్ల అతడి నాకర్షించి ఉంటుంది. ఆ పిల్ల మోజులో పడిపోయాడు. తండ్రి ఉత్తరంమీద ఉత్తరం నిష్ఠూరంగా వ్రాయగా వచ్చి పిల్లను సరిగా చూడనైనా చూడకుండా మళ్ళీ వెళ్ళిపోయాడు.

కాలచక్రం ఇటువంటివాటి నెన్ని చూసిందో? ఇంకెన్ని చూడనున్నదో? తన సంగతి ఆ మహా వెల్లువలో ఒక గడ్డిపోచ అంతైనా లేదు అయినా తన బాధ తనది. తను పరిత్యక్త. తన కూతురికి పెళ్ళి ఈడు వచ్చింది. కాని— చూస్తూ చూస్తూ పరిత్యక్త కూతురి నెవరు చేసుకుంటారు? తను చెయ్యని పాపం తన బిడ్డను కూడా బాధిస్తుంది కాబోలు? అయితే పాపపుణ్యాలెరుగని తన బిడ్డ గతేమిటి?

ఆమె కన్నీటిబొట్టొక అక్షరంగా ఎన్నో ఉత్తరాలు ఎదుగుతూ ఉన్న బిడ్డ ఫోటోలతో కూడా అతనికి వారానికి రెండు వంతున చేరుతున్నాయి. కాని ఒక్కదానికీ జవాబులేదు. బహుశః ఆ సహాధ్యాయిని— ఆ పడుచుపిల్ల కమల— దాని వలలోనే చిక్కుకుపోయి ఉంటాడు. భార్య దగ్గరనుంచి వచ్చిన ఉత్తరాలు విప్పి చదువుతున్నాడో లేదో? ఆ ఉత్తరాలన్నీ ఒక మూల గుట్టగా పడి వాటిమీద అర చేతి మందం దుమ్ముపడి ఉంటుంది.

అన్నపూర్ణ హృదయం బీటలు వారింది. ప్రాణాలు కళ్ళల్లో ఉన్నాయి. దేహం వాడి పత్తి అయింది

రోషం అభిమానం చంపుకుని పదహారేళ్ళ పద్మ ఫొటో కవరులో పెట్టి పంపుతూ సుబ్బారావుకొక ఉత్తరం వ్రాసింది.

"నా జీవనలత ఎండిమోడయిపోయింది. నేనెవరినో మీకు జ్ఞప్తికి వచ్చి ఉండదు. మీకది పూర్వజన్మలా ఉంటుందేమో నేను జ్ఞాపకం చేస్తే? ఆనాటి మన బిడ్డ పెరిగి పదహారేళ్ళ పడుచయింది. తల్లిగా నా బాధ్యత ఏమిటి? నా కర్తవ్యాన్ని నాకు తెలియబరచండి. మీ జాబుకోసం చకోరంలా ఎదురుచూస్తూ ఉంటాను...." ఈ ఉత్తరం పోస్టులో వేసి జవాబుకోసం నిరీక్షిస్తూ బ్రతుకుతోంది అన్నపూర్ణ.

రాలేదు—అతడి దగ్గరనుండి ఒక్క జాబైనా రాలేదు. "ఏమో సంక్రాంతికి వస్తాడేమో?" ఆశ చిగురించింది. చదువుకునే రోజుల్లో ఒకసారి ఉత్తరం రాయకుండా హఠాత్తుగా వచ్చాడు.

తను పక్కయింటి నీలవేణితో ఆ కిందటి రోజు పందెం వేసుకుంది. నీలవేణి కంటె ముందుగా లేచి, పదహారు వాకిళ్ళలో పెద్ద ముగ్గువేసి గొబ్బెమ్మలు పెడతానని అన్నపూర్ణ పందెం వేసింది ఓడిపోతే అన్నపూర్ణ ఐదు రూపాయలు నీలవేణికి ఇచ్చుకోవాలి. అన్నపూర్ణ తెల్లవారుఝామున చలికి బిగదీసుకుపోతున్న దేహాన్ని స్వాధీనం చేసుకుని ఊడ్చి పేడనీళ్లు చల్లిన వాకిట్లో వొంగి ముగ్గులు వెయ్యటం మొదలు పెట్టింది. ముగ్గు పూర్తిచేసి గొబ్బెమ్మలు పెట్టి గెలిచినట్టుగా నీలవేణీ అంటూ కేక వెయ్యాలని తొందరపడుతూ చుక్కలు పెట్టింది. తప్పు వచ్చినచోట కాలితో చెరిపి మళ్ళీ చుక్కలు పెడుతోంది. ఒంగి ఎప్పుడువచ్చాడో సుబ్బారావు—వెనక నుంచి వచ్చి జడపట్టుకున్నాడు. భయంతో కెవ్వున కేక

వెయ్యబోయి అతడిని చూసి ముగ్గు డబ్బా అక్కడ పడేసి లోపలికి పరుగెత్తింది జడలాక్కుంటూ. కబుర్లూ మధ్య మధ్య నిష్ఠూరాలూ, నిందలూ, అలకలూ. నవ్వులూ బ్రతిమిలాటలతో వాకిట్లో ముగ్గూ పందెం మాట మరిచిపోయింది అన్నపూర్ణ.

నీలవేణి లేచి అసంపూర్తిగా ఉన్న అన్నపూర్ణ వాకిలిని చూసి నవ్వుకుంది. అయిదు నిమిషాలలో తన పని పూర్తి చేసుకుని "అన్నపూర్ణా" అంటూ కేక పెట్టింది.

"అయ్యో నేను ఓడిపోయాను. నీలవేణి పందెం గెలిచింది. ఐదు రూపాయలివ్వాలి." గదిలో నుంచి బయటికి రావటానికి ప్రయత్నించి విఫలురాలయింది అన్నపూర్ణ. ఆమె ఓడిపోయిన ఐదు రూపాయలు సుబ్బారావు తన జేబులో నుంచి తీసిచ్చాడు.

అప్పటి మాదిరిగా చెప్పా పెట్టాకుండా వస్తాడేమో ఇప్పుడు కూడా ;

అప్పటి సంగతి జ్ఞాపకంరాగానే అన్నపూర్ణ హృదయం పిల్లిగంతులు వేసింది. చెంపలు ఎరుపుకు తిరిగాయి. ఏమో అప్పటి మాదిరిగా ఇప్పుడు రాకూడదూ? తెల్లవారు ఝామున మెలకువతోనే ఉండి తలుపు దగ్గరగా మంచం లాక్కుని పడుకోవటం మొదలుపెట్టింది. అలా బరువుగా ఒకవారం గడిచింది.

సాయంకాలము నాలుగు గంటలయింది మధ్యాహ్నం కాఫీ తాగిఅరమోడ్పు కళ్ళతో గోడకానుకుని కూర్చున్నది అన్నపూర్ణ. ఆమె మనసు ఎక్కడెక్కడో విహరిస్తోంది. ఓరవాకిలిగా వేసి ఉన్న తలుపు నెట్టుకుని—నల్లసూటు నల్ల కళ్ళద్దాలతో సుబ్బారావు సూట్‌కేసు చేత బట్టుని లొపలికి వచ్చాడు.

దిగ్భ్రాంతురాలయి కళ్లు పెద్దవి చేసుకుని చూస్తోంది అన్నపూర్ణ దిగ్గునలేచి నిలబడి.

"అదేమిటి? అలా చూస్తున్నావు? ఒంట్లో బాగుందా?" సూట్‌కేసు కింద పెట్టి ఆమె బుజాలు పట్టుకుని ఊపాడు సుబ్బారావు.

"అబ్బ ఎన్నాళ్ళకు వచ్చారు: ఎంత కాలానికి మిమ్మల్ని చూడగలిగాను?" ఈ-మాటలనాలని ఆమె ఎంతో ప్రయత్నించింది. కాని—నాలుకమడతబడిపోయింది.

"ఏమిటి పూర్ణా ఇలా ఉన్నావు....? పద్మ ఏదీ?" అంటూ అతడు పెట్టె తీసి అన్నపూర్ణకోసం తెచ్చిన బట్టలూ పద్మకోసం తెచ్చిన బొమ్మలూ బయట పెట్టాడు.

ఆరేళ్ళ పద్మ ఎగురుతూ గంతులువేస్తూ వచ్చి "నాన్నా నాకేం తెచ్చావు....?" అని కాళ్ళకు చుట్టుకుంది

"ఏమిటి పూర్ణా, పిచ్చిదానిలా అలా చూస్తావేం? లేచి కాఫీ టిఫిన్ తీసుకు రావేం? నేను వెళ్ళి రెండు నెలలు కాలేదు, వెళ్ళేటప్పుడు ఇన్నాళ్ళవుతుందని చెప్పేనుగా, లేవే నాకు ముందు అర్జంటుగా కాఫీ కావాలి...." అతడు బట్టలు మార్చుకుని కాళ్లు కడుక్కోవటానికి బాత్‌రూంలోకి వెళ్ళాడు.

అన్నపూర్ణ యాంత్రికంగా లేచి వెళ్లి కాఫీ చేసుకు వచ్చింది. తలవంచుకుని కాఫీ కప్పు బల్లమీద పెట్టి గోడ కానుకుని నిలబడ్డది.

ఆమెకు మెల్ల మెల్లగా కళ్లు విప్పుకుంటున్నాయి.

ఇదేమిటి? పద్మ ఆరేళ్ళ పిల్లేనా? ఏమిటి మనోవేదన? తన గుండెను కరకర నమిలి మింగేస్తున్న వేదన కర్థమేమిటి? నిజంగా అతడు వెళ్లి రెండు నెలలు ఇంకా కాలేదా? దీర్ఘకాలమనిపించి తన గుండె బీటలు వారిందే? ఎదిగిన బిడ్డను చూపి అంత బాధపడిందే తన మనసు?

అన్నపూర్ణ గుండెమీద చెయ్యి వేసుకుని కళ్లు మూసుకుని బరువుగా నిట్టూర్చింది.

"నీ బాధ ఏమిటో నాకు చెప్పు?" అతడు ఆమె గడ్డం పట్టుకుని ముఖం పైకెత్తి కళ్ళలోకి చూశాడు.

అతడి గుండెమీద తలవాల్చి ఆమె తన కడుపులో మసలుతున్న సోదంతా వెళ్లబోసుకున్నది.

అతడు పకపక నవ్వాడు....ఆ నవ్వులో 'మొత్తానికి ఆడదానివనిపించావు' అన్న హేళన తోచిందామెకు. సిగ్గూ, రోషం ఆమెను పెనవేసుకుపోయాయి. ఊఁ అంటూ బుంగమూతితో ముఖం అదోలా పెట్టింది.

అతడు నవ్వుతూ "పూర్ణా నీ ఊహలు తీగెల్లా ఎంత దూరం సాగాయి! ఇంకా నాలుగు రోజులు ఆలస్యము జరిగి ఉంటే నీవు నాకు దక్కి ఉండవు...." ఆమెను గాఢంగా గుండె కదుముకున్నాడు.

అతడి షర్టుకు అంటిన కుంకుమ దులుపుతూ "రెండు నెలల్లో పదహారేళ్ళ బాధ అనుభవించాను. మనసు పాదరసంలా పరుగులెత్తింది. ఏమేమో ఊహించు కున్న నా మనసు బాధతో మెలికలు తిరిగిపోయింది." ఆమె సన్నగా గొణిగిన మాటలతో ఒక్కటయినా స్పష్టంగా అతడికి వినబడలేదు.

"నీ ఊహల కెంతశక్తి ఉన్నదో గ్రహించగలిగాను" సుబ్బారావు చెదరిన ఆమె ముంగురులు సవరించాడు. ఆమె ఆనంద బాష్పా లని చెప్పిన కన్నీటిని తుడిచి చెంపకు పెదవు లానించాడు.

ఆరేళ్ళ పద్మ మళ్ళా వచ్చింది ఎదురుగా అన్నపూర్ణ ఊహలను చెదర గొడుతూ "అమ్మా నా బొమ్మలేవీ....?" అంటూ.

పద్మ వేసుకున్న గౌనువంకా చెదరిన రెండు జడల వంకా వెర్రిచూపులు చూసింది అన్నపూర్ణ. పద్మకు ఆరేళ్లు. అతడు వెళ్లి రెండు నెలలు కాలేదు!

చటుక్కున తలదించుకుంది అన్నపూర్ణ.

(పంచాయతీ ప్రభుత్వ మాస పత్రిక)



# ఎదిగిన కొడుకు

రైలు బండిలో కిటికీకి దగ్గరగా కూర్చున్న రమణకు ఆలోచనలు అతి వేగంగా పరుగులు తీస్తున్నాయి. భయమూ, ఆందోళనా పడుగు పేకల్లా అల్లుకుపోతున్నాయి.

అమ్మకు పిచ్చి ఎక్కిందా? పది హేను-పదమూడు సంవత్సరాలు గల తన చెల్లెళ్ళు ఆమెను కనిపెట్టుకుని ఉంటున్నారా? పదేళ్ళ తమ్ముడు వసంతు అమ్మను వదిలి ఉండలేక ఆమె దగ్గరే ఉన్నాడా?

అమ్మకు పిచ్చెక్కిందంటే అందరినీ కొడుతూ తిడుతూ ఉంటుందికాబోలు! అటువంటి స్థితిలో ఉన్న అమ్మను చిన్న పిల్లలు ఎట్లా కనిపెట్టుకుని ఉంటున్నారు?

ఈ సంగతి నమ్మటానికి మనసు మొరాయిస్తున్నది. అతడు ఇంటికి వెళ్ళి తల్లిదండ్రులను చూసి దాదాపు మూడు సంవత్సరాలు కావచ్చింది. శ్రద్ధగాచదివి పరీక్షలు ప్యాసవ్వాలని ప్రతివారం తండ్రి ఉత్తరం వ్రాస్తాడు సెలవుల్లో ఏవైనా కొత్త కొత్త ఊళ్ళు తిరిగి రమ్మని డబ్బు పంపుతాడు. అంతా క్షేమంగా ఉన్నారు, నీవు బెంగ పెట్టుకోవద్దని ధైర్యం చెబుతూ ఉత్తరాలు వస్తున్నాయి.

కాని—రమణకు చెల్లెళ్ళనూ తమ్ముడినీ చూడాలని ఉంది. తల్లి దగ్గిర రెండు రోజులయినా ఉండి ఆమె చేతి భోజనం చేయాలని ప్రాణం కొట్టుకుపోతున్నది. కాని అదెలా సాధ్యమో అతడికి అర్థం కాలేదు. తండ్రి చండశాసనుడు. ఆయన కెదురు పలకటం ఆ యింట్లో ఎవరికీ అలవాటు లేదు.

శూన్యంలోకి చూస్తున్నాడు రమణ. కళ్ల నీళ్ళు ఉబికి ఉబికి వస్తున్నాయి. తనకీ సంగతి తండ్రి ఎందుకు వ్రాయలేదు? తనను ఇంటికి దూరం చేస్తున్నాడెందుకు తన తండ్రి? తన తల్లి సంగతి తనకు తెలియకుండా ఎందుకు దాస్తున్నాడు? తనకు ఇంటి కష్టసుఖాలు తెలుసుకో

వలసినంత వయసుంది. బాధ్యత వహించవలసిన హోదా ఉంది. తండ్రి తర్వాత ఆ కుటుంబపు మంచి చెడ్డలు చూడవలసినవాడు తనే.

పరమేశంగారు చెప్పినప్పుడు తను నమ్మలేకపోయాడు. తండ్రి మీద తన కెంత ప్రేమో ఆయనమీద అంత భక్తి గౌరవాలున్నాయి. ఆయనను గురించి ఎవరేమి చెడుగా చెప్పినా వినలేడు—నమ్మలేడు.

"రమణా! నీవు ఇంటికి వెళ్ళి ఎన్నాళ్ళయింది?" అని పరమేశంగారు అడిగినప్పుడు అలా ప్రశ్నిస్తాడేమిటనిపించింది.

"ఈ మధ్య వెళ్ళలేదండీ" అన్నాడు.

"ఈ మధ్య అంటే కొన్నేళ్ళనుంచీ వెళ్ళ లేదా?" ఆశ్చర్యపోయా డాయన.

"అవునండీ" అన్నాడు సామాన్యంగా.

"బాబూ! ఒక మాట. ఇంటికి వెళ్ళి నీ వాళ్ళందరినీ ఒక మాటు చూసిరా. నీవు నీ వాళ్ళకు దూరం కాకూడదు." అన్నాడు.

"పరీక్షలండీ పరీక్షలు. సరిగ్గా చదవకపోతే మా నాన్న సంగతి తెలుసుగా? తాట ఒలిచేస్తాడు"

"పరీక్షలేం కొడతాయా? ఇంటికి వెళ్లి అందరినీ చూసి వచ్చి రాత్రింబగళ్లూ చదువుకో."

ఎంతో బలవంతం చెయ్యగా చెప్పాడు తల్లిని గురించి.

అతడికి షాకు తగిలినట్లయింది. తనకా సంగతే తెలియదే? ఎందుకిలా జరిగింది? కారణం?

రైలు దిగి తోలుపెట్టె చేతబట్టుకుని ఆ ఊరు చిన్నదే కనుక కాలినడకన బయలుదేరాడు పరమేశంగారు చెప్పిన ఆనవాళ్ళుగల ఇంటిముందు ఆగి అడుగుతున్నాడు

వీధిలోకి తలుపు ఉన్న చిన్నగది. ఓరవాకిలిగా తలుపులు వేసి వున్నాయి. వాటి మధ్య ఒక అమ్మాయి తల బైటికిపెట్టి చూస్తోంది ఒక్క అంగలో సమీపించి "చంద్రా!" అన్నాడు రమణ.

"అన్నయ్యా ఇప్పుడే వస్తున్నావా?" చంద్ర అన్నను సంభ్రమంతో చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకువెళ్ళింది. తల్లి అప్పుడే కుంపటి మీద వంట చేసినట్టుంది. పిల్లలకు పళ్ళేలలో వడ్డించింది. గోడవారగా చాపమీద పడుకున్న వసంతును జ్వరం తగ్గిన తరువాత అన్నం పెడతానని బ్రతిమిలాడుతున్నది.

రమణను చూడగానే "ఎట్లా వచ్చావురా? ఎప్పుడు వచ్చావురా? నాయనా! నిన్ను చూసి ఎన్నాళ్ళయిందిరా?" చేతులతో అతడిని చుట్టివేసింది.

ఆమెను చూడగానే రమణకు పుట్టెడు దుఃఖం వచ్చింది. కష్టం మీద అణచుకున్నాడు.

"వసంతుకు జ్వరంరా. ఇవాల్టికి నాలుగు రోజులయింది డాక్టరు మంచి వాడు. ధైర్యం చెబుతూ జాగ్రత్తగా మందిస్తున్నాడు. నాయనా! ఎప్పుడుబయలు దేరావో? స్నానం చెయ్యి భోజనం చేద్దువు గాని" కుంపటిలో బూడిద దులిపి మళ్ళీ బొగ్గులు వేసి బియ్యం కడిగి పెట్టింది.

"వసంతుకంత జ్వరంగా ఉంటే నాన్నగారి కెందుకు ఉత్తరం వ్రాయలేదు? అయినా మీరీ ఊళ్ళో కాపరం ఏమిటి? ఈ చిన్న పిల్లలను పెట్టుకుని నీవు ఒక్క దానవు ఈ ఊళ్ళో ఎందుకున్నట్లు?" ఎంతో బాధపడుతూ — చాప మీద చతికిల పడ్డాడు రమణ.

"బాబూ! నాన్నగారికి ఊళ్ళు తిరిగే ఉద్యోగమయిపోయింది. ఈ పిల్లల చదువులకు ఇబ్బందవుతుందని ఇక్కడ ఉంచారు?" అన్నది తల వంచుకుని.

పాత పెంకుటింట్లో ముందరి గది — వర్షాకాలంలో వర్షమంతా ఆగదిలోనే ఉండేటట్టుంది. గోడలు మాసి నల్లగా బొగ్గు మరకలతో అసహ్యంగా ఉన్నాయి. రెండు పాత ట్రంకు పెట్టెలు-రెండు జంపఖానాలు-ఒక చాప కనబడుతున్నాయి వంట సామాను చాలా స్వల్పంగా ఉంది. తల్లి చెప్పే కబుర్లు చూస్తే అతడికి అయోమయంగా ఉంది. ఇద్దరు ఆడపిల్లలను చదివిస్తున్నది. మరి మతిభ్రమణ మేమిటి? అతడికి అంతుబట్టలేదు.

స్నానంచేసి భోజనానికి కూర్చున్నాడు. తల్లి చేతి వంట ఎంత రుచిగా ఉంది? ఇదివరకటికంటె ఆమె చేతి భోజనము మరింత కమ్మగా ఉంది. ప్రేమతో

కొసరి కొసరి వడ్డించింది. అతడు ప్రసంగ ధోరణిలో తల్లిని ఎప్పటెప్పటి సంగతులో అడిగి పరీక్ష చేశాడు. ఆమె చెప్పిన జవాబులు అతడిని చకితుణ్ణి చేస్తున్నాయి. ఎంతసేపు మాట్లాడించినా ఒక పొల్లు మాటయినా దొర్లటం లేదు.

ఆ సాయంత్రం చెల్లెళ్ళనిద్దరినీ తీసుకుని బజారుకు వెళ్ళాడు, దారిలో "చంద్రా! నాన్నగా రెప్పుడయినా వచ్చారా? ఉత్తరాలు వస్తాయా!" అని అడిగాడు.

"ఉత్తరాలు రావుగాని నెలనెలకూ నాలుగు వందల రూపాయలు వస్తాయి. అమ్మ కూడా రాయదు. మమ్మల్ని రాయనివ్వదు. అన్నయ్యా, అమ్మ చాలా మారిపోయింది. ఉన్నదాంట్లో మాకు కావలసినవి కొనిపెడుతుంది. తాను చిరిగి పేలికలై పోయిన చీరెలు కట్టుకుంటుంది. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉంటుంది. మేమడిగితే "మీరు చిన్న పిల్లలు–మీకెందుకంటుంది" చంద్ర కళ్ళు తుడుచుకుంది.

"అన్నయ్యా, నాన్నగారెందుకని ఇక్కడికి వచ్చి ఒక్కసారయినా చూసి పోరు?" అడిగింది తడికళ్ళతో.

"నాకేం తెలియదమ్మా, మీ సంగతులేమీ తెలియకనే నేను ఉత్తరమయినా రాయకుండా వచ్చేశాను" నొచ్చుకున్నాడు రమణ.

"అయితే అన్నయ్యా, నువ్వు నాన్నగారి దగ్గర్నుంచి రావటం లేదూ?"

"లేదమ్మా—లేదు. మిమ్మల్నందరినీ చూసి చాలా రోజులయిపోయిందని ముందుగా ఇక్కడికి వచ్చాను."

"అన్నయ్యా, ఇంకా పది రోజులుండవూ? ఈ ఊళ్ళో మాకేం తోచటం లేదు. పిచ్చెక్కినట్టుగా ఉంది" దీనంగా అతడి కళ్ళల్లోకి చూసింది.

"చంద్రా ! నాకూ పరీక్షలు దగ్గరికి వస్తున్నాయి. సరిగ్గా చదవకపోతే నాన్నగారూరుకో రని తెలుసుగా ! పరీక్షలవగానే వస్తాను. సరేనా ! ఈలోపల మీరు కూడా బాగా చదువుకోండి,"

"చదవకపోతే అమ్మ మాత్రం ఊరుకుంటుం దనుకున్నావా ? నేనూ— పుష్ప పరీక్షలు ప్యాసయ్యాం కనుక సరిపోయింది. లేకపోతేనా ? వసంతు ఫస్టును వచ్చాడు తెలుసా?" కళ్ళు తిప్పుతూ అన్నది.

అయితే అమ్మ వెనకటి మాదిరిగానే పిల్లలను క్రమశిక్షణలో ఉంచుతున్నదన్న మాట!

ఆ రాత్రి పిల్లలు పడుకున్న తరువాత తల్లి 'రమణా!' అని పిలిచింది. చేతిలో ఉన్న పేపరక్కడ పడేసి తల్లికి దగ్గరగా వచ్చి కూర్చున్నాడు.

''రమణా! నీ కాలేజీలో ఎవరయినా బుద్ధిమంతులయిన పిల్లలు ఉంటే చూడు మనవాళ్ళల్లో'' అన్నది.

''ఎందుకమ్మా?'' ఆశ్చర్యంతో కనుబొమలు పైకెత్తి చూశాడు తల్లి ముఖంలోకి.

''ఈ రోజుల్లో తొందరే అయినా పుష్పకూ చంద్రకూ పెళ్ళిళ్ళు చేయాలని ఉందిరా.'' ఆవేదనతో అన్నది.

''వాళ్ళు ఇంకా చిన్నవాళ్ళు కదమ్మా. కనీసం బి. ఎ అయినా ప్యాసవనీ. అంత తొందరెందుకు?'' అన్నాడు.

''తొందరెందు కంటావా? వాళ్ళు ఆడపిల్లలు కనుక తొందరపడుతున్నాన'' వేదాంతిలా నవ్వింది.

రమణకు బుద్ధి తెలిసినప్పటినుంచీ బాగా గుర్తు – తల్లి ముఖం ఎప్పుడూ నవ్వుతూ ఉంటుంది. కోపాన్ని కూడా నవ్వుతూనే వ్యక్తం చేస్తుంది. ఇప్పుడామె ముఖంలో ఆ ఛాయలు కనబడక వెతుక్కున్నాడు. ఆమె ఇంట్లో ఉన్నా చీరె రవిక నలక్కుండా చూసుకునేది. ఆమె తను నిద్రలేచేటప్పటికే తలదువ్వుకుని స్నానం చేసి శుభ్రమయిన చీరె కట్టుకుని ఉండేది. ఇప్పుడామె తలలో దువ్వెనపెట్టి ఎన్నాళ్ళయిందో నన్నట్లున్నది. ఆ చీరె కట్టులో దిద్దుబాటులో ఎంతో నిర్లక్ష్యం కనబడుతోంది కొట్టవచ్చినట్టుగా. ఆ వెలవెలబోయిన చీరెలు అమ్మ ఇదివరలో నౌకర్లకిచ్చేది.

రమణ దృష్టి చప్పున తండ్రి మీదికి మళ్ళింది. తనను మూడేళ్ళనుంచీ ఇంటికి రాకుండా కట్టడి చేస్తున్నాడేం తన తండ్రి-ఎందుకు? తల్లికి పిచ్చి అంటే అసహ్యించుకుంటాడనా? లేక భయపడతాడనా? పిచ్చిదని విరక్తి తెచ్చుకుంటాడనా? అదీ కాకపోతే-మందిప్పించి నయం చేయిస్తాడనా? ఎందుకు? మరెందుకు?

రమణ కాలుగాలిన పిల్లిలా ఆ రాత్రంతా అటూ ఇటూ తిరిగాడు. ఎంతసేపా లోచించినా ఆతడికి అంతు చిక్కటం లేదు.

అతడుండగానే వసంతుకు జ్వరం తగ్గింది. అదీ ఇదీ కావాలని మారాం చేస్తున్నాడు. వాడు కావాలని కోరినవన్నీ తల్లి కొని తెస్తానని వాగ్దానాలు చేసి కాలం గడుపుతున్నది.

రమణ మనసు కొట్టుకుపోతున్నది. వసంతు అడిగిన వస్తువులు తల్లి కొని ఇవ్వవచ్చు. ఆమె తనకు వచ్చే ఆ నాలుగువందలలో చాలా పొదుపుగా వాడుకుని నెలకు పాతిక ఆదా చేస్తున్నట్టు బ్యాంకు పుస్తకం వల్ల తెలిపింది. మొదటి నుంచీ నౌకర్లతో చేయించుకున్న ఆమె – అంట్లు తోముకుని బట్టలుతుకుకొంటూ ఇంటి పని అంతా తనే చేసుకుంటున్నది. ఆమె ఇప్పుడిటువంటి చిల్లర ఖర్చు పెట్టదలచుకోనట్టు కనబడుతున్నది. తన బాల్యం ఆతడికి స్మృతిపథాన మెరిసింది. ఎన్ని ఆట వస్తువులు! చూసినదల్లా పాతికా ఏభయి పెట్టి కొనిఇచ్చాడు తండ్రి. తను నిర్లక్ష్యంగా పారేసుకునేవాడు. ఇప్పుడు వసంతు కోరిన చిన్న వస్తువు కూడా అమ్మ కొనిఇచ్చే స్థితిలో లేదు. తానిప్పుడు తండ్రి పంపించిన డబ్బు ధారాళంగా వాడుకుంటున్నాడు. బట్టలు కూడా ఖరీదయినవి వేసుకుంటున్నాడు. తన తమ్ముడి క్రాడ మాపికలు వేసినవి తొడుక్కుంటున్నాడు. తోటి వాళ్ళంతా బెర్లిన్ చీరెలతో తిరుగుతుంటే తన చెల్లెళ్ళు పాపం—పేదవాళ్ళలా ఆ వెలిసిన గుడ్డలు కట్టుకోగా చూసిన రమణకు గుండెకోతగా వుంది.

వెళ్ళేనాడు తల్లి కాళ్ళకు దణ్ణం పెడుతూ "అమ్మా, నేను చదువు చాలించి ఉద్యోగం చూసుకుంటాను. అప్పుడు మనమంతా ఒకచోట ఉండవచ్చు. నీవు దిగులు పడకమ్మా నీ ముఖంలో నవ్వు చూసి ఎన్నాళ్ళయిందో? నీ నవ్వు ముఖం చూడటానికే నాన్నగారికి తెలియకుండా వచ్చానమ్మా" అన్నాడు తల దించుకుని.

"పిచ్చినాయనా! ఏళ్ళు మీద పడుతుంటే ముఖంలో వెనుకటి నవ్వులుం టాయా? నాకు దిగులేమిటి? మిమ్మల్నందరినీ చూసేవాడు పైన ఉన్నాడు. నా మాటకేం గాని బాగా చదువుకో నాన్నగారు ఆశించినట్టు పెద్ద ఉద్యోగం వస్తుంది. ఆరోగ్యం బాగా కాపాడుకో" దగ్గరికి తీసుకుని వీపు నిమిరింది. తల పక్కకు తిప్పుకుని కన్నీరు కొడుకు చూడకుండా రాల్చింది.

బరువెక్కిన గుండెతో రమణ బండెక్కాడు. తల్లి మాట్లాడిన ప్రతి మాట—ఆమె చూసిన చూపులు, ఆ వేషధారణ గుండెను పిండేస్తున్నాయి.

తండ్రిని ముఖాముఖి ఎదుర్కొని కుటుంబ సమస్యలను చర్చించబోతున్నాడు. ఆయనతో ఎట్లా మాట్లాడాలి? ప్రసంగధోరణి ఎట్లా ఉండాలి? ఇంతకాలం తండ్రి ఎదుటబడి ఒక్క మాట మాట్లాడి ఎరగడు. ఇప్పుడు తాను వెను కటి బాధ్యతలెరుగని రమణకాడు. తల్లి-ఇద్దరు చెల్లెళ్ళు-ఒక తమ్ముడు-కలిపి నలుగురి బాధ్యత వహించబోయే మనిషి.

ఉదయం తొమ్మిదిగంటల వేళ. రైలు దిగగానే హోటల్లో సామాను పెట్టుకుని స్నానం టిఫిన్ వగైరా పూర్తి చేసుకుని తండ్రి అడ్రసు చూసుకుని బయలుదేరాడు. ఇంటి ముందు తోట-గరాజిలో కారు-వరండాలో కుర్చీలు వాటి దగ్గర ఒక అల్సేషియన్ కుక్క, గేటు తెరచి లోపలికి వెళ్ళగానే నౌకరు ఎదురుగా వచ్చాడు రమణ కాగితం మీద తన పేరు వ్రాసి ఇచ్చాడు. ఆ చీటిని నౌకరు వరండాలో బల్ల మీద పెట్టి ఎగిరి పోకుండా బరువు పెట్టాడు.

రమణ కుక్కను బెదురు చూపులు చూస్తూ కుర్చీమీద కూర్చున్నాడు. పరదాలు ఎగిరినప్పుడల్లా డ్రాయింగు రూము అలంకరణంతా కనబడుతోంది. వరండాకు అటు పక్క గది - భోజనాల గది కాబోలు - కాఫీ టిఫిన్ తీసుకుంటున్నట్టు కప్పులలో - సాసర్లలో చప్పుళ్ళు వినిపిస్తున్నాయి. రేడియో పాటలు నవ్వులు మాటలతో అరగంటకు పైగా గడిచింది.

నౌకర్ని పిలిచి చీటీ సంగతి జ్ఞాపకం చేశాడు.

"అయ్యగార్ని ఇప్పుడు మాట్లాడించటానికి వీలులేదు. బైటికి వచ్చినప్పుడు ఇస్తాను" అన్నాడు

రమణ గడియారం చూసుకున్నాడు. పది కావస్తోంది ఆఫీసుకు వెళ్ళేటప్పుడు చీటీ చూపిస్తాడు కదా అనుకున్నాడు

రమణ తల వంచుకుని వీధి తలుపువైపు చూస్తున్నాడు. మధ్య మధ్య తల్లిని తలుచుకుని బాధ పడుతున్నాడు. వసంతుని గురించి ఆలోచిస్తున్నాడు.

ఏదో చప్పుడు కాగా తలెత్తి చూశాడు. ఫుల్‌సూటులో తండ్రి బైటికి వచ్చి కారులో కూర్చుని తలుపు వేసుకున్నాడు. నైలాన్ చీరె - చేతులు లేని రవిక -

భుజాలు దాటని తలవెంట్రుకలూ సన్నగా పొడుగ్గా దంతపు బొమ్మలాంటి యువతి కారు దగ్గర నిలబడి లోపలికి తల పెట్టి "సాయంత్రం మాట మరచిపోవద్దు పార్టీ తరువాత పిక్చరు." గుర్తుచేసింది.

"నేనెట్లా మరిచిపోతాను? మన ప్రోగ్రాం సంగతి మరచిపోవటమే! నీవు ఈ లోపల పాటలు ప్రాక్టీసు చెయ్యి" చేతిని ఆమె బుగ్గలకు తాకించాడు.

రమణ విస్తుపోయి చూస్తున్నాడు అటువైపే-

కారు గేటు దాటి వెళ్ళగానే ఆమె వెనక్కు తిరిగి లోపలికి వెళ్తూ వరండా లోకి వచ్చి "ఎవరికోసం" అని అడిగింది.

చెప్పాడు రమణ తన పేరూ—ఎవరికోసం వచ్చిందీ!

ఆమె కనుబొమలు ముడుస్తూ "ప్రసాదరావుగారు సాధారణంగా ఇంట్లో ఎవరినీ కలవరు. అందరూ ఆఫీసుకే వెళ్ళి కలుస్తారు. ఇవాళ-రేపు అక్కడ కూడా కలవరు. ఏవో ఇంటర్వ్యూలు ఉన్నాయి" గిరుక్కున వెనక్కు మళ్ళి నౌకరుతో ఏదో చెప్పి లోపలికి వెళ్ళింది.

రమణ మెల్లగా లేచాడు. అటూ ఇటూ తిరిగి లంచ్ టైములో ఆఫీసుకు వెళ్ళాడు. ఆనాడు చాలా మందిని ఇంటర్వ్యూ చేసినట్టున్నారు. బారులు తీర్చి కూర్చున్నారు అందరూ. లంచ్ టైమయింది. ఆ తరువాత మరో పాతిక మందికి ఇంటర్వ్యూ.

లోపలికి తీసుకు వెళ్ళమని చీటీ ఇచ్చాడు రమణ జవాను చేతికి.

"ఇప్పుడు అయ్యగారు భోజనం చేసే వేళ. లోపలికి ఎవరూ పోకూడదు" అన్నాడు.

ఈవేళ తప్పితే తండ్రిని కలవటానికి మరి ఆ రోజు వీల్లేదు. ఏదయితే అదవుతుందనుకుంటూ సాహసించి తండ్రి ఆఫీసు గది దాటి ప్రైవేటు రూము లోకి వెళ్ళాడు.

తండ్రి బల్లముందు కూర్చుని భోజనం చేస్తున్నాడు. మనిషి అలికిడి కాగానే తలెత్తి చూశాడు. ఆయనకు ఆశ్చర్యమూ, కోపమూ కలిగే లోపలే రమణ "నాన్నగారూ!" అన్నాడు.

"రమణా——నువ్వా? ఇదేమిట్రా ఈవేళప్పుడు ఇక్కడికి వచ్చావు? పరీక్షల ముందర ఈ ప్రయాణమేమిటి?" కాఠిన్యం కరడుకట్టిందా మాటల్లో.

రమణ ముఖం దించుకుని మాట్లాడలేకపోయాడు.

"మాట్లాడవేం? డబ్బు ప్రతి నెలా పంపుతూనే ఉన్నాగా! చాలటం లేదా? చాలకపోతే ఆ మాట రాయచ్చుగా. సిగరెట్లు-ఇంకా అటువంటి దురభ్యాసాలేమయినా చేసుకున్నావా? అయినా పరీక్షల ముందర ఈ తిరగటమేమిటి?" కళ్ళజోడు తీసి చేత్తో పట్టుకున్నాడు.

"నాకు అందరినీ చూడాలనిపించింది. అమ్మను చూసి మూడేళ్ళకు పైగా అయింది. అందుకని బయలుదేరాను."

"చిన్న పిల్లవాడివా-అమ్మమీద బెంగపెట్టుకోవటానికి? నీకు పరీక్షలు ముఖ్యం." అరిచినట్లుగా మాట్లాడాడు.

"పరీక్షలా? ఇక నేను చదవనూలేను——పరీక్షలు వ్రాయనూలేను."

"చదువుకోక ఏం చేస్తావురా చవటా. అడుక్కుతింటావా?"

"ఎందుకు అడుక్కుతింటాను? బి.ఏ ప్యాసయ్యాను. దానికి తగ్గట్టుగాచిన్న ఉద్యోగమేదయినా చూసుకుంటాను" పెడముఖం పెట్టాడు రమణ.

"ఉద్యోగం ఎవరిస్తారు ఈ రోజుల్లో? చూశావా వాకిట్లో ఎందరు ఉద్యోగం కోసం పడిగాపులు పడ్డారో?"

"పది మందికి ఉద్యోగాలివ్వగలిగిన మీరు నా ఒకడికి ఇవ్వలేకపోవచ్చు. కాని ప్రపంచం చాలా విశాలమైనది."

"అసలు కారణమేమిటి? ఈ బుద్ధి నీకే పుట్టిందా?"

"నాకే పుట్టింది. మనిషికి పుట్టాల్సిన బుద్ధే పుట్టిందిగాని మరేం కాదు. నవ మాసాలూ మోసి కని-నన్ను కష్టపడి పెంచిన తల్లి బాధ్యత వహించాలి. ధనమూ హోదా ఉండి కూడా నా చెల్లెళ్ళూ తమ్ముడూ పేదరికం అనుభవిస్తున్నారు. వాళ్ళకు చదువులు చెప్పించి పెళ్లిళ్ళు చేయాల్సిన బాధ్యత పెద్ద కొడుకుగా నాకున్నది.

మంచిది. వెళ్తాను. ఈ సంగతి చెప్పటానికే వచ్చాను." పళ్ళు కొరుకుతూ వెనక్కు మళ్ళాడు.

"వెళ్ళు. నీ కనవసరమైన వాటిల్లో జోక్యం కలిగించుకోకు. పెద్దమ్మవారు నెత్తిన కూర్చుంటే ఇలాంటి బుద్ధులే పుడతాయి. నిన్ను బాగు చెయ్యటం ఎవరి తరం?" గొణిగాడు తండ్రి.

వెనక్కు తిరిగాడు రమణ మళ్లీ. "నా తల్లికి పిచ్చిదన్న పేరు పడేస్తేగాని మీకు ముందడుగు పడలేదు కదూ? ఆ పల్లెటూళ్ళో మీరిచ్చే భరణం తింటూ నా తల్లి ఒంటరిగా నానా తంటాలు పడుతున్నది. ఇవాళ్టినుంచీ నాకుతల్లి ఒక్కతే ఉందనుకుంటాను" గబగబా అడుగులు వేసుకుంటూ గది దాటాడు.

హోటలుకు వెళ్లి భోజనం చేస్తుండగా, వాళ్ళ కుటుంబమిత్రుడు రంగారావు కనబడ్డాడు

"ఏమిటి రమణా—ఇక్కడ భోజనం చేస్తున్నావు?" నోరు తెరుచుకుని చూశాడు.

"ఏం లేదు ఊరికినే వచ్చాను" అన్నాడు ముభావంగా. అతడి మనసు వికలంగా ఉంది. ఎవరితో మాట్లాడటానికీ అంతగా మనసర్కించటంలేదు. మాటల మధ్యలో కుటుంబ విషయాలు కదుపుతారని భయం.

కాని—రంగారావు తనకు తెలిసినదంతా చెప్పే వరకూ ఆగలేదు.

"నీకు తెలిసిందా రమణా! మీ నాన్న మీ అమ్మను ఓ పల్లెటూళ్ళో ఉంచి భరణం పంపిస్తున్నాడు. చదువు చదువంటూ నిన్ను ఇక్కడికి రానివ్వటం లేదు. కూతుళ్ళకు సంబంధాలు చూసి పెళ్లి చేయవలసిన వయసులో తానొక పాతికేళ్ళ పడుచును పెళ్ళిచేసుకున్నాడు ఆమె ఒక గాయకురాలు—ఆధునికచిలక. ఆమెతో పాట కచేరీలు—విందులు—పార్టీలు. అందరితో మీ అమ్మకు పిచ్చెక్కిందనీ హాస్పిటల్లో ఉంచానని చెబుతున్నాడు. పిల్లలను మేనమామల దగ్గిరికి పంపానంటున్నాడు. తనిటువంటి వేషాలు వేస్తుంటే ఆడపిల్లలకు సంబంధాలెట్లావస్తాయి? మీ గతి ఇట్లా పడుతుందనుకోలేదు రమణా! మీ తండ్రి ఎంత పెద్ద ఉద్యోగం చేస్తేనేం? బుద్ధులు చాలా చిన్నవి" దులిపినట్టు మాట్లాడాడు.

రమణకు తల నరాలు చిట్లిపోతున్నంత బాధ కలిగింది. తన తండ్రిని ఆశ్రయించుకుని ఆయన ఇచ్చే రూపాయి అర్ధకూ చెయ్యి చాపే రంగారావుకు తండ్రి ఎంత లోకువయిపోయాడు? అతడి నోటివెంట తనతండ్రి అల్పగుణాలను వినలేకపోయాడు.

అతడిని తప్పించుకుని రైలు స్టేషనుకు చేరుకున్నాడు.

ఇందుకా అమ్మను పిచ్చిదన్నారు? ఈ స్థితిలో కూడా నేర్పుగా ఓర్పుతో సంసారాన్ని చక్కబెడుతున్న తన తల్లి పిచ్చిదా? తన కిప్పటినుంచీ కనిపెంచిన తల్లి ఒక్కతే ఉన్నది. కడుపు తడిమి చూపి తన అమృతహస్తంతో అన్నంపెట్టే తల్లి మాత్రమే ఉన్నది. తన జీవితమంతా బిడ్డలకోసం-భర్తకోసం ఎన్నోత్యాగాలు చేసిన అనురాగమయిని వదిలిపెట్టి పిచ్చిదని ప్రవాదం లేపి, మరొక ఆధునిక యువతిని వివాహం చేసుకున్నవాడు ఇక నుంచీ తండ్రి కాడు అంతే అంతే. ఇదే తన నిర్ణయం-తుది నిర్ణయం అనుకుంటూ పిడికిళ్ళు బిగిస్తూ, పళ్ళు కొరుకుతూ టిక్కెట్టు తీసుకుని రైలెక్కాడు.

పెట్టె అంతా ఖాళీగా ఉంది. రమణ కాళ్ళు చాపుకుని పడుకున్నాడు. కాని కన్ను మూతపడలేదు. ఎప్పుడూ సంతోషంతో నవ్వుతూ తిరిగే తల్లి ఈనాడు ఒక శోకమూర్తి. పెనిమిటి ఉండే అనాథ. నలుగురు పిల్లలుగల తండ్రి-తన బాధ్యతనంతా విస్మరించి-భార్యను పిచ్చిదని అందరిచేతా నమ్మించి తిరిగి పెళ్లి కొడుకై సరససల్లాపాలలో మునిగి తేలుతున్నాడు. ఆయనలో మానవత్వము నశించింది. కాని——నవీన నాగరికత పెరుగుతున్నది రమణ ఆలోచనలకు దరీ దాపూ లేకుండా పోయింది.

తన తండ్రి తన దగ్గరనుండి ఏదో రహస్యం దాస్తున్నాడు అందుకే తననింటికి రానివ్వటంలేదు. ఏమిటా రహస్యం? రమణలో పెద్ద ఘర్షణ ప్రారంభ మయింది అది రహస్యాన్ని దాచటం కాదు-సిగ్గు పడటం. తన బలహీనత తన కొడుక్కు తెలిసిపోతుందేమోనన్న భయం. ఆ భయమే కోపం కిందికి మారుతున్నది.

పెద్ద ఉద్యోగము-హోదా-సంఘంలో గౌరవము సంపాదించాడు. తండ్రికి తనంటే భయమా? ఎందుకు? సంఘంలో తల ఎత్తుకుని తిరిగే తండ్రికి ఎదిగిన కొడుకంటే భయమా? తన ముందు తల ఎత్తుకుని తిరగలేడా?

రైలు దిగిన రమణ తన రూముకు గబగబా చేరుకున్నాడు. గది ఖాళీచేసి తిరుగు ప్రయాణానికి సంసిద్ధుడవుతున్నాడు.

(వనిత-స్త్రీల మాసపత్రిక)



# క ం టి మె రు పు

మధ్యాహ్నం ఒంటిగంటయింది. రిక్షావాళ్ళు పదిమంది రిక్షాలల్లోనే కాళ్లు ముడుచుకుని పడుకుని బాలమ్మకోసం ఎదురుచూస్తున్నారు. ఒకళ్ళిద్దరులేచి ఆకలికి ఆగలేక సోడాకొట్టువాడి నడిగి నీళ్లు తాగి వచ్చారు. మిగతావాళ్ళు ఉస్సూరంటూనే ఆమెకోసం ఎదురుచూస్తున్నారు. నెత్తిమీద గంపపెట్టుకొని వచ్చింది బాలమ్మ. ఒక్కొక్కళ్ళే రిక్షాలలోనుంచి లేచి "ఇంత ఆలస్యం చేసావేం ఇవాళ" అని ప్రశ్నిస్తూ గంప దించి ఎవరి పొట్లం వాళ్ళు అందుకోవటం మొదలుపెట్టారు. రంగడు మాత్రం ఆమె ముఖంలోకి చూస్తూ "ఏంది? ఏడ్చినట్టున్నవు. కళ్ళు ముఖం వాచినాయి" అంటూ ఆమె ముఖంలోకి చూశాడు.

బాలమ్మ కొంగు ముఖాని కడ్డం పెట్టుకుని మళ్ళీ వెక్కి వెక్కి ఏడ్చింది.

"ఏంది? మామూలు సంగతేనా?" అడిగారు తింటూతింటూ ఉన్న రిక్షావాళ్ల నలుగురు.

వాళ్ళందరికీ బాలమ్మ యింటి సంగతులు తెలుసు. బాలమ్మమగడు మంచంలోనుంచి లేవలేడు. రెండిళ్ళల్లో పాచిపని చేసి ఇంటికి వచ్చి పిల్లలకు, తండ్రికి వండిపెడుతుంది బాలమ్మ. కాని - ఆమె తెచ్చే జీతం, ఆ యింటి ఆ యింట మిగిలిన అన్నం కూరలు ఒక్కరి కయినా చాలవు. ఒకనాడు బజారులో తారసపడ్డ ఆమె ఊరివాడు గంగయ్య రిక్షావాళ్ళకు అన్నం వండి తీసుకువస్తే మనిషికి రూపాయి యిప్పిస్తా నన్నాడు. ఆమె పన్నెండుగంటలకు బయలుదేరి వాళ్ళకు అన్నపుపొట్లాలు యిచ్చి రెండు గంటలకు ఇంటికి వస్తుంది. తిరిగి నాలుగు గంటలకు పాచి పని చేసుకోవటానికి వెళ్ళి ఆరున్నర ఏడు గంటలకు ఇల్లు చేరుకుంటుంది.

బాలమ్మ పెనిమిటి వెంకటేశు ఆరోగ్యం బాగున్న రోజుల్లో బట్టలమిల్లులో పనిచేసేవాడు. తెచ్చిన జీతంతో కుటుంబాన్ని పోషించుకునేవాడు. అకస్మాత్తుగా వచ్చిన జబ్బుతో మంచానపడ్డాడు. మిల్లు వారిచ్చిన డబ్బుతో కాలువ దగ్గర కొద్ది

స్థలం కొనుక్కొని చిన్న పాక వేసుకున్నాడు. వెంకటేశుకు మొదట మొదట బాలమ్మ పాచిపని చేయటం ఇష్టం లేకపోయినా గత్యంతరంలేక ఒప్పుకున్నాడు. అతడికి బాలమ్మ ఏ ఇంట ఎంతసేపు పనిచేస్తుందో అంచనావేసే శక్తి ఉన్నది. పదినిమిషాలు ఆలస్యమయితే నిలబెట్టి కారణమడుగుతాడు. రిక్షావాళ్ళకు పొట్లాలందించితే ఆదాయం బాగా ఉంటుందని బాలమ్మ చెప్పినప్పుడు వెంకటేశు మంచంలో ఉండే మర్దనచేశాడు.

"ఎందుకు చెయ్యి చేసుకుంటావు? పైస లొస్తుంటే చేదా? మనకు రెండు పూటలా తిండిగడవాలా వద్దా?" దెబ్బలు తగిలినచోట చేత్తో తడుముకుంటూ అరిచింది బాలమ్మ.

"అవునే - తెలుసు. రెండుపూటలా తిండి కడుపులో పడితే వెర్రి వెర్రి ఊహలు పోతాయి మనసులో. నీవింక పని కాగానే ఇంటికి వస్తావా?" కసిగా పళ్ళు కొరికాడు వెంకటేశు.

"ఎందుకు రాను?" ముఖం తుడుచుకొని శాంతించింది బాలమ్మ.

రెండు నెలలు రిక్షా వాళ్ళకు అన్నపు పొట్లాలు అందించిన తరువాత వెంకటేశు ముఖంలో జీవకళ కనబడటం మొదలుపెట్టింది. పిల్ల లిద్దరూ కాస్త నున్నపడ్డారు. పెద్దవాడికి ఒక పని కల్పించింది బాలమ్మ. సాయంత్రం ఆరుగంటలు కాగానే ఒక లీటరు కిరసనాయిలు తీసుకుని పేవ్‌మెంటుమీద ఒక దీపం పెట్టుకుని కూర్చుంటే రిక్షావాళ్ళందరూ అక్కడికి వచ్చి చమురు పోయించుకుని వెళ్ళేవారు. ఒకలీటరు కిరసనాయిలుకు పెట్టిన ఖర్చుతో ఒకటిన్నర లీటరు కొనటానికి తగిన ఆదాయము వచ్చేది.

బాలమ్మ పాచిపని చేసే ఇళ్లల్లో ఇచ్చిన చీరెలు కట్టుకునేది - కాని రిక్షావాళ్ళకు అన్నపు పొట్లాలు ఇవ్వటం మొదలుపెట్టిన తరువాత ఆ చీరెలు ఇంట్లో కట్టుకోవటానికి ఉంచుకున్నది. పాతచీరెలు అమ్మే అంగడిలో రెండు ప్రింటు చీరెలు కొనుక్కొని వాటిని జాగ్రత్తగా ఇంటికి రాగానే మడతవేసి పెట్టుకునేది. వెళ్ళేటప్పుడు ముఖం కడుక్కొని బొట్టు దిద్దుకుని వెళ్ళేది. ఒక్కొక్కనాడు బాలమ్మ తిరిగి వచ్చేటప్పటికి నోటినిండా తమలపాకూ తలనిండా పూలు ఉండేవి. ముఖం కళకళ లాడుతూ ఉండేది.

వెంకటేశు ముఖం ఆమెను చూడగానే నిప్పులు చెరిగేది. అతడికి బాలమ్మ తనకు పరిచయమైననాటి పరిస్థితులు పదే పదే జ్ఞాపకానికి వచ్చేవి

ఇరవై సంవత్సరాలు నిండీ నిండని బాలమ్మ పూచిన తంగేడులా మిల్లు గేటు దగ్గర తట్ట నెత్తిన పెట్టుకుని నిలబడి ఉండేది గేటు కాపలాదారు ఆమెను చూసి కళ్ళు చికిలిస్తూ పైకి కోపంగా "నీ అటువంటి వాళ్ళను గేటు దగ్గరికి రానీయ వద్దని దొర చెప్పాడు. వెళ్లువెళ్ళు రేపటినుంచీ రాకు" అంటూ ఓలవేసి మాట్లా డిస్తూ పరాచికాలు ఆడేవాడు టైము కాగానే కార్మికులు కొందరు ఆమె దగ్గరికొచ్చి పొట్లాలు తీసుకునేవారు. సింగన్న బాలమ్మను చూసినప్పటినుంచీ ఇంటినుంచి అన్నం తెచ్చుకోవటం మానేశాడు

బాలమ్మ అందరితోనూ కలవిడిగా మాట్లాడుతుంది. ప్రాణం యిస్తున్నట్టు కనబడుతుంది: కళ్ళతో కవ్విస్తూన్నట్టు ఉంటుంది. గలగల నవ్వుతుంది. కాసేపటిలో ఎదక మనిషితో కలిసిపోతున్నట్టు ఉంటుంది. కార్మికులు ఆమె సంతోషమంతా తనను చూసేనని ఎవరికివారు అనుకునేవారు. పోటీపడి ముందుకు వచ్చేవారు. ఆ పోటీలలో తగువులు కూడా వచ్చేవి వెంకటేశు మిల్లులో పనిచేస్తుండగా వచ్చింది వాతరోగం. కాళ్ళు పడిపోయాయి. మరి పని చేయలేదు.

మిల్లుకు పొట్లాల గంప తీసుకుపోయినప్పుడు "ఇవాళ వెంకటేశు రాలే దేం?" అని అడిగిం దొకనాడు బాలమ్మ.

అతడి సంగతి తోటి కార్మికులు చెప్పారు. "పాపం! వెంకటేశుకు భార్య లేదు. ఇద్దరు పిల్లలు వండిపెట్టే దిక్కు లేదు" అంటూ జాలి కలిగేటట్టు చెప్పారు. బాలమ్మ అతడి యింటి గుర్తు తెలుసుకుని వెళ్ళింది. సంగతులన్నీ అడిగి తెలుసు కుంది.

"నేనూ ఒంటరిదాననే నేను వచ్చి వండిపెడతాను. నీ పిల్లలనూ నిన్నూ బాగా చూసుకుంటాను" అన్నది.

సంతోషం పట్టలేక వెంకటేశుకు కళ్ళనీళ్లు వచ్చాయి "నిజంగానా! నిజం గానా! ఎంత మంచిదానవు బాలమ్మ? తాళి కట్టించేసుకో బాలమ్మా" అన్నాడు కళ్లు తుడుచుకుంటూ.

బాలమ్మ సంకోచించింది తనకీ పెళ్ళి వ్యవహారం బొత్తిగా నచ్చదు. ఎందరో ఎన్నిసార్లో వెంటబడ్డారు పెళ్ళిచేసుకోవలసిందని. తను ఒకరి మనిషిగా మిలిచిపోవటం ఇష్టంలేదు

"అయితే నువ్వు ఊరికే నా యింట్లో ఉండి వండిపెడుతుంటే అందరూ ఏదో ఏదో అనుకుంటారు. నా కది ఇష్టం లేదు." అన్నాడు వెంకటేశు.

"చెప్పుకో. అందరికీ తాళి కట్టానని. కాని నాకు మాత్రం ఏ తాళి వద్దు" ఖచ్చితంగా చెప్పింది బాలమ్మ.

"నీకో ఇల్లూ నీడ కావలసి వచ్చి ఇక్కడ ఉంటావా? నీ తిరుగుళ్ళంతా బయటనా?" మొదటినాడే కటువుగా మాట్లాడాడు వెంకటేశు

"నీ పిల్లలకూ నీకు కష్టం లేకుండా చూసుకుంటా చాలదా?" అన్నది బాలమ్మ.

వెంటేశు మంచంలో నుంచి లేవలేడు. మనిషి సహాయంతో మంచం దిగి జరుగుతూ తన పనులు తాను చేసుకుంటాడు. అటువంటి వెంకటేశుకు కూడా ఒక ఆడదాని మెడలో తాళికట్టి తన ఇంట్లో కట్టేసుకోవాలని ఉండటం చూసి నవ్వుకున్నది బాలమ్మ.

ఆ రోజు నుంచీ బాలమ్మ మెడలో తాళి లేకపోయినా ఆ ఇరుగుపొరుగంతా "చీరె రవిక" పెట్టిన భార్యగా జమకట్టారు. బాలమ్మ ఇరుగు పొరుగులతో అక్కచెల్లెలిగా మెలగుతూ అందరికీ సహకరిస్తూ తన పని తాను చేసుకుంటూ-వెంకటేశు అర్థంలేని కోపాలకు నవ్వే కళ్ళతో జవాబిస్తూ కాలం గడుపుతోంది.

రిక్షావాళ్ళలో నారాయణ కాస్త అందరి కంటె నవ్వుతూ, తుళ్ళుతూ మాట్లాడుతాడు. అప్పుడప్పుడు పైకే అనేస్తాడు "ఆ యెంకటేశును పట్టుకుని యేళ్ళాడుతావేం? మంచోడు దొరకలా?" అంటూ ఎగతాళి చేస్తాడు.

బాలమ్మ ఆ మాటలకు పొంగినట్లే జవాబిస్తుంది. "కనబడ కేం? కావలసినంతమంది! కావాలంటే నువ్వు లేవా?" అంటుంది. ఆకాశమంత ఎత్తు పొంగిపోతా డతడు.

"నిజమేనా? నిజమేనా? అయితే నన్ను మనువాడరాదూ?"

"అడతా! అడతా! రేపో ఎల్లుండో! ఆగుకాస్త" అంటూ కొంగు విడిపించుకుంటుంది.

"వెధవ నారాయణ నీ కళ్ళకు నచ్చాడా? చింపిరి జుట్టూ చింతాకంత కళ్ళు వాడూను. నా ముఖంలోకి చూసి చెప్పు" అంటాడు రంగన్న తానే అందగాడన్నట్టు. అప్పటికప్పుడు ఆ మాటమీద నారాయణకూ, రంగన్నకు తగాదా వచ్చింది. నారాయణను రంగన్న వెనక్కు తోశాడు. తలకు బాగా దెబ్బ తగిలి రక్తం కారింది. అక్కడవున్న వాళ్ళు ఇద్దరినీ విడిపించారు. నారాయణను హాస్పిటల్‌కు తీసుకువెళ్ళి కట్టుకట్టించారు. ఆ వ్యవహారం అంతటితో ముగియకుండా నరసింహ రంగంమీదికి వచ్చాడు.

"నర్శిమ్మా. నా మెడలో తాళికట్టి నన్ను నీఇంట్లో కట్టేసుకోవాలనుందా?" నవ్వింది బాలమ్మ.

నరసింహకు తాళికట్టటం మీద అంతగా నమ్మకంలేదు. మనిషి తన వశమైతేచాలు. "పోనీ—తాళి కట్టనులే" అన్నాడు "వస్తావా?" అని కళ్ళతో అడుగుతూ.

"రావాలా?" కవ్వించింది బాలమ్మ.

కొంగు ఒడిసి పట్టాడు నరసింహ.

కొంగు లాక్కుని కిలకిల నవ్వుతూ పారిపోయింది.

నగరంలో ఆ బజారు చాలా రద్దీగా ఉంటుంది ఎప్పుడూ ప్రజానీకం నడపటానికి ఫుట్‌పాత్‌లు ఈ మధ్యనే రోడ్డు కంటె జానెడు ఎత్తుచేసి నాపరాళ్ళు పరచారు. వీధులలో అక్కడక్కడ నాటిన నీడ ఇచ్చే పెద్ద చెట్లవల్ల ఆ వీధిలో ఫుట్‌పాత్ ఎప్పుడూ అరమైలు దూరం వరకూ చల్లగా ఉంటుంది. ఆ ఫుట్‌పాత్ మీద చిన్న తమలపాకు బీడీల దుకాణం పెట్టాడు యాదగిరి. అతడికి మునిసిపల్ కౌన్సిలర్ రెడ్డి మద్దతు బాగా ఉంది. అతడే ఆ కొట్టు పెట్టించాడు. రెడ్డిని గెలిపించింది నిజంగా యాదగిరే అందుకే యాదగిరి ఏ పని చేసినా పోలీసు వారికి ఆక్షేపణలేదు. పైగా దణ్ణాలు పెడుతూ ఉంటారు. ఆ దారిన వచ్చినప్పుడల్లా

యాదగిరి బాలమ్మకు తమలపాకు బీడా మసాలా వేసి ఇస్తాడు. ప్రక్క కొట్లో మల్లెపూల దండ ఇప్పిస్తాడు. కాఫీ పిల్లవాడు వస్తే కాఫీ ఇప్పిస్తాడు. కడుపు నిండేటట్టు కబుర్లు చెబుతాడు. ఆశతో కళ్ళల్లోకి చూస్తాడు.

విరగబడి నవ్వుతుంది బాలమ్మ.

"మా కవున్సిలర్ రెడ్డిగారు మామంచివోరు ఎప్పుడయినా వొస్తారు చూస్తావా?" అన్నాడు.

"చూడకేం? మంచి వాళ్ళంటే నా కిష్టం. ఆయన గారొచ్చినప్పుడు నన్ను పిలు. అటువంటి వాళ్లంటే నాకిష్టం" ఉత్సాహం కనబరచింది బాలమ్మ.

యాదగిరి పిలపనంపగానే రెడ్డి పుక్కిటి మసాలా బీడా - పెదవుల మధ్య చార్మినారు సిగరెట్టు- తెల్లటి ఖద్దరు బట్టలు- వచ్చాడు. ఎక్కడినుంచో యాదగిరి ఒక కుర్చీ తెప్పించి నీళ్ళు చల్లించి వేయించాడు.

ఆరుగంటలవేళ- పెద్ద పువ్వుల నైలాను చీర కట్టుకుని మంచి రైక తొడుక్కుని తలనిండా పూలతో నొక్కుల జుట్టు సింగారింపులో ఒయ్యారంగా నడుస్తూ వచ్చింది. బాలమ్మలోని చలాకీతనం రెడ్డిని తబ్బిబ్బు చేసింది

చూడగానే సరుకు బాగానే ఉందని తృప్తిపడ్డాడు. రెడ్డి యాదగిరి వాళ్ళిద్దరికి గోల్డుస్పాట్ తెప్పించి యిచ్చాడు. స్టూలుమీద కూర్చున్న బాలమ్మ సంబర పడుతూ తాగింది. రెడ్డి తాంబూలం ఆమె చేతికిస్తూ చెయ్యిగిల్లాడు. యాదగిరి మల్లెపూల దండలు రెండు తెప్పించి రెడ్డికొకటి బాలమ్మకొకటి ఇచ్చాడు.

బాలమ్మ ఎప్పుడూ పూలు చూడని దానికి మల్లే ఆ మల్లెదండ అందుకుని ఆత్రంగా తలలో తురుముకుంది.

"రేపు గండిపేట పోదామనుకుంటున్నా. ఒక జీపుకూడా వస్తుంది." అన్నాడు రెడ్డి. బాలమ్మను రమ్మని యాదగిరితో చెప్పించాలని.

"నేనెప్పుడూ అటువంటివి చూడలేదు. రేపే వేళకు రానా?" అన్నది మురిపెంగా బాలమ్మ.

"అయ్యో! నీ కోసమే ఇదంతా మా రెడ్డిగారంత ఉత్సాహం కలవారు లేరనుకో" అన్నాడు యాదగిరి.

బాలమ్మ చూస్తూ ఉండగానే రెడ్డి సైకిలు ఎక్కి వెళ్ళిపోయాడు.

ఇంకా అట్లాగే నిలబడిఉన్న బాలమ్మను యాదగిరి "ఏమన్నా రూపాయలు కావాలా? సందేహించకు" అన్నాడు.

"సగం చచ్చి అడుగుతున్నాననుకో యాదగిరి. గుడిసె తాకట్టు విడిపించు కోవాలి. రెండు మంచి కోకలు కొనుక్కోవాలి. గుడిసెకు రేపటితో వాయిదా చెల్లవుతుంది. ఆ అరబ్బువాడు ఆగేటట్టులేడు. పైగా రెండుసార్లు చెయ్యి గుంజాడు. రేపు బయలుదేరాలంటే మంచి కోకలేదు. ఇది అద్దె దనుకో" ఏడుపు గొంతుతో అన్నది

యాదగిరి గుండె కదిలిపోయింది సొరుగులోనుంచి ఏభయి రూపాయలు తీసియిచ్చాడు. రెడ్డి వాడిన సరుకును తాను కూడా వాడుతూ ఉంటాడు యాదగిరి. నష్టమేముంది అన్నట్టుగా ముందుగా డబ్బిచ్చాడు బాలమ్మకు. అతడికి గట్టి ధైర్య ముంది రెడ్డి దగ్గరినుంచి ఇబ్బడి గుంజవచ్చని.

యాదగిరి ఇచ్చిన యాభై రూపాయలు సంచిలో పెట్టుకుని రొంటిన దోపు కున్నది బాలమ్మ. తిరుగుముఖమవుతూ ఆలోచిస్తూ నవ్వుకుంటూ అడుగులు వేస్తు న్నది. "రాజాంతఃపురాలు ఇప్పుడు లేవు. అతివలు అంతఃపురాలలోఉండటం మానే శారు. పరదాలు చిరిగిపోయాయి. అప్పుడు వారి కాపలాకు తయారుచేసిన ఈ కొజ్జా సమూహమంతా ఏం కావాలి? పురిటింటికి వెళ్ళితే ఇదివరకు నాలుగేసి రూపాయలు ఇచ్చేవారు ఇప్పు డా ఆదాయం కూడా తగ్గింది. ఈ సమూహానికి బ్రతుకు తెరవేమిటి? మగవాళ్ళను మురిపించటమే ఆటగా నలుగురయిదుగురు మాత్రం హాయిగా బ్రతుకుతున్నారు. మిగతా వారికి తిండికి కూడా కరువుగా ఉంది. వాళ్ళకీ ఏభయి రూపాయిలిస్తా—రేపటి కింకొకడు దొరకడా నా బుట్టలో పడటానికి?" చరచర అడుగులు వేసింది బాలమ్మ—అదే ఒకప్పటి హుసేను.

(అనామిక-మాస పత్రిక)



# మెహ్రాని

శాంతి వేదికమీద కెక్కి ఉపన్యాసమిస్తున్నది. ముగ్ధమోహన రూపం - ఔత్తరాహుల సౌందర్యం-ఆమె విగ్రహము పొడవైనది. అందానికి మెరుగులు దిద్దే అలంకరణ చేసుకున్నది. ప్రింటెట్ నైలక్సు చీరె ధరించింది. ఆ చీరె కట్టూ భుజాలు దాటీ దాటని ఒత్తైన నల్లటి తలవెంట్రుకలూ, వాటిని రెండు భాగములుగా చేసి రిబ్బన్లతో సంబంధించబడిన చిన్నచిన్న జడలు, ఎడమచేతి కొక ప్లాస్టిక్‌గాజూ కుడిచేతికొక రేడియమ్ డయల్‌వాచీ, కనబొమ్మలమధ్య తిలకంబొట్టు - ప్రేక్షకుల దృష్టిలో ఒక చిత్తరువులా నిలిచింది.

చక్కటి శైలి. అంతకంటె చక్కని ఉచ్చారణ - శ్రావ్యమైన కంఠం ప్రేక్షకులను ముగ్ధులను చేసింది.

"వివాహాల విషయం-యువకుని మనసుమీద విశ్వాసాల (సెంటిమెంట్సు) ప్రభావ మెక్కువా? సంస్కారం భావాల ప్రభావా మెక్కువా? ఏవి ఎక్కువ పని చేస్తాయి? చేస్తే ఎంతకాలం?'' ఈవిషయం పైన చర్చ. చర్చలో పాల్గొన్నవారు ఆరుగురు - వారిలో ఇద్దరు విద్యార్థినులు. ఆంగ్గభాషలో రసవంతంగా సాగుతున్నది చర్చ.

శాంతి చర్చా వేదిక పైకి రాగానే అందరూ చకితులై ఆమెను చూస్తున్నారు. ఆమె చెప్పేదే వింటున్నారు.

"గుండె బలంగల యువకుడు చిత్తశుద్ధితో దృఢ నిశ్చయం చేసుకుంటే సంస్కారం నిలబడుతుంది; మనోబలం లేకపోతే దృఢ నిశ్చయం కూడ కొంత కాలానికి సడలిపోతుంది. విశ్వాసాలు దానిచోట స్థావర మేర్పరచుకుంటాయి" ఇది ఆ చర్చలోని సారాంశము. దీన్నే సోదాహరణంగా చర్చించింది. ఎందరో యువకులు మొదట సంస్కారమనే బులుపుతో కులాంతర మతాంతర వితంతు వివాహాలు చేసుకుంటారనీ ఆ బులుపు తీరగానే వారిలో విశ్వాసాలు చోటు చేసు

కోగా చాలామంది తమ వైవాహిక జీవితాలను నరకప్రాయంగా చేసుకుంటున్నా రని_మానవ జీవితంలో విశ్వాసాలకున్న బలం దేనికీ లేదని - యువకులకు ఆత్మ స్థైర్యము కావాలని అది ఉంటే విశ్వాసాలను జయించ వచ్చునని శాంతి కంఠం మారుమ్రోగినది _ కళాశాల ఆవరణ మంతా.

ప్రేక్షకలోకంలో విద్యార్థులు, ఉపాధ్యాయ వర్గము, పురజనులు. ఉన్నారు. అందరికి ఆనందానికి మరోమెట్టు పైన ఉన్న అనుభూతి కలిగినది. అంతా తన్మ యులై పోతున్నారు. ఆమె విగ్రహం చాలామంది హృదయాలలో ముద్రపడి పోయింది.

విద్యార్థిలోకంలో వాళ్ళకు కలిగిన అనుభూతి _ ఉపాధ్యాయ వర్గంలో కొందరికి కలిగిన అనుభూతి అంతలో క్షణికమయిపోయినది. వాళ్ళ అనుభూతిలో ఏదో వెలితి. ఏదో అసంతృప్తి.

ఆమెకు అందం ఉండచ్చు _ ఆధునిక విద్యానాగరికత ఉండచ్చుగాని ఆ పిల్ల మెహ్తాల పిల్ల ?

ఆ సంగతి మనసులోకి రాగానే దుర్వాసన! వాళ్ళ ముఖాలలో అప్పటి కప్పుడు రంగులు మారుతున్నాయి.

సభ ముగిసే వరకూ మురళీమోహను కళ్ళ కొక అనుభూతి, నాసిక కొక అనుభూతి రెండూ పరస్పర విరుద్ధంగా ఉండి ఘర్షణ పడుతూనే ఉన్నాయి. ఈ విభిన్న దృక్పథాల మధ్య అర్భకుడైన మురళీమోహన్ నలిగిపోతున్నాడు

ఈ చర్చంతా కృతకమే. ఇవన్నీ చిలక పలుకలే కాని యువకుల హృద యాలమీద వాటి ప్రభావ మెంత? వాటి బలమెంత?

మామూలే. రోజూ ఎన్ని నీతులు వినటంలేదు? కూటికోసం కొందరు _ గౌరవ మర్యాదల కోసం కొందరు ఉన్నతికి కొందరు - ఇదిగో ఈ విద్యార్థినీ విద్యార్థులు బహుమతుల కోసం? అంతేగా? ఇలా సాగుతున్నాయి. అతడి మనసులో ఊహాలు.

ఆ సంవత్సరం ప్రారంభంలో మొట్టమొదటిసారిగా తను బాటనీ క్లాసు రూంలో అడుగు పెట్టాడు. పాఠం చెబుతూ మధ్యలో బోర్డుమీద ఏదో వ్రాయా

లని లేచి చూసేసరికి క్రిందుగా ఒక బొమ్మ వేసి ఉంది ఆపరేషన్ చేసేటప్పుడు డాక్టర్లు నోటికి ముక్కుకు కలిపి కట్టుకునే మాస్కుతో ఒక ఆడపిల్ల బొమ్మ. దాన్ని చూడనట్టే పాఠం చెబుతూ క్లాసు నాలుగు మూలలా చూశాడు. ముందు సీట్లో ఇద్దరు చేతి గుడ్డలను అలా కట్టుకొని కూర్చున్నారు మురళీమోహన్ అదంతా గమనించనట్టే పాఠం పూర్తిచేసి "మీలో చాలామంది మెడిసిన్‌లో సీటు దొరక్క ఇక్కడికి వచ్చారని నాకు తెలుసు. థియేటర్‌లోనికి వెళ్ళి ఆపరేషన్ చేయాలని ఎంతో సరదా పడుతున్నట్టు కూడా నాకు తెలుసు" అంటూ బోర్డు తుడిచి అంద రిని ఒకసారి అనుమానంగా చూసి నవ్వుతూ వెళ్ళాడు క్లాసు రూంలోనుంచి

అతడా కార్టూను చూడగానే గ్రహించాడు. ఎవరిని చూసి వేసిందీను. అది మూడు మూర్తులా శాంతిబొమ్మ శాంతి అందానికి అతడి హృదయం తబ్బిబ్బవు తుంది. ఆమెకు సన్నిహితం కావాలనీ. పాఠం చెప్పే నెపంతో పలకరించాలని ఇంకా ఏమేమిటో కలలుకంటుంది కాని మన్మధకృష్ణ శాంతిని గురించి చెప్పిన తరువాత మనసంతా అదోలా అయిపోతున్నది. ఆమె మీద అభిమానమంతా వెగ టుగా మారిపోతున్నది. బుద్ధికీ హృదయానికి మధ్య సంఘర్షణ భరించరానిదిగా ఉన్నది

మన్మధకృష్ణ క్లాసులో శాంతిని చూపిన తరువాత ఈ పిల్లను ఎక్కడ చూశానా అని మథన పడిపోయాడు. గోవిందరాజన్ సరోజనీదేవీ నగర్ కాలనీ నుంచి వస్తాడు. అది కొత్త కాలనీ. అలవాటు చొప్పున మరుగుదొడ్లు కడిగే మెహ్తర్ల కోసం ఎదురు చూశారు ఆ కాలనీ వాళ్ళు. పదిరోజుల వరకూ ఏవరి దొడ్లు వాళ్ళే కడుక్కోవలసి వచ్చింది. గాంధీ సూత్రాలను గట్టిగా నమ్మిన వాళ్ళు "మనపని మనం చేసుకుంటే ఏం?" అనుకున్నారు. కనబడిన వాళ్ళకు చెప్పారు. కాని కొందరు ఇంట్లో పనిచేసుకొని కూడా అది గౌరవ భంగమనుకుని చెప్పలేక పోయారు, అలా అందరు మెహ్తర్‌కోసం అలమటించి పోతున్న సమయంలో ఇరవై ఏళ్ళ అబ్బాయి. పదిహేనేళ్ళ అమ్మాయి పాయిజామ కుడతా ధరించి సైకిల్ మీద వచ్చేరు. అమ్మాయి తలమీదుగా ఓణీ కప్పుకుంది ముఖం పూర్తిగా కనబడ లేదు.

ఆ కాలనీ వాళ్ళంతా "ఇంటికి రెండేసి రూపాయలిస్తాం పాకీవాళ్ళను పంపిం చ"మని చెప్పారు. ఆ మరునాటినుంచీ ఆ అన్నాచెల్లెళ్ళు ఉదయం ఐదు గంటల

నుంచి ఎనిమిది గంటలవరకూ దొడ్లు తుడిచేవారు. కొన్ని ఇళ్లు మిగిలిపోతే సాయంత్రంపూట వచ్చి తుడిచేవారు అవి డైగ్రినేజిదొడ్లు. నీళ్లు పోసి చీపురుతో గబగబా కడిగేసి వెళ్ళేవారు. ఆడపిల్ల కొంగుచాటున చీపురు పుట్టుకుని నీళ్లు నీళ్ళు అంటూ ఉండేది. ఇంట్లో ఎవరో పోసేవారు. ఒకనాడు మన్మథకృష్ణ పోశాడు ఆమె ముఖం సరిగా కనబడలేదు. మూడోనాడూ నాలుగోనాడూ తానే నీళ్ళుపోస్తూ ముఖం బాగా తేరిపార జూశాడు.

ఆ కార్టూను చూసేంతవరకూ విద్యార్థులు ఆమెతో మాట్లాడాలనీ ఆమె మాట్లాడుతుంటే వినాలనీ ఉవ్విళ్ళూరే వారు. విద్యార్థినులు ఆమెను మధ్యగా కూర్చోబెట్టుకుని కబుర్లు చెప్పుకునేవారు. అప్పుడప్పుడు ఆమె టిఫిన్ డబ్బా తెరచి ఆమె తెచ్చుకున్న పూరీకూరా తీసుకు తిని ఆమెకు అన్నం పేట్టేవారు.

కార్టూను చూసి శాంతి భయపడిపోలేదు. తన తల్లి డైగ్రినేజి లేనిచోట దొడ్లు తుడిచేటప్పుడు అలా ముక్కుకు గుడ్డ కట్టుకుంటుంది. అదొక వృత్తి, ఆ వృత్తికి మాత్రం గౌరవంలేదా?

కాని-కార్టూను తరువాత శాంతి ఒంటరిదయిపోయింది. ఇప్పుడామెకు సమీపంగా ఎవరూ రారు దూర దూరంగా పోతున్నారు. శాంతి ఇంటికి వచ్చి అన్నకు చెప్పుకుని భోరున ఏడ్చింది.

లక్ష్మణ్‌ను చూసిన వాళ్ళు అతడు ఏ తెల్లదొర సంతానమో అనుకుంటారు. అతడు శాంతి చదువుకునే కాలేజి ప్రిన్సిపల్ గదిలోకి వచ్చి "సర్. నేను మీతో కొంచెం మాట్లాడాలి" అన్నాడు.

ప్రిన్సిపల్‌కు రెండు అంగుళాల పొడుగున డిగ్రీలు ఉన్నాయి. కాని కాలాన్ననుసరించి విద్యార్థులంటే మనసులో భయంభయంగా ఉంటుం దాయనకు.

లక్ష్మణ్ తన చెల్లెలికి జరిగిన అవమానాన్ని గురించి చెప్పి "అందరి హక్కులూ కాపాడవలసినవారు మీరు. నాచెల్లెలి కిక్కడ అవమానం జరిగితే ఫలితాలు బాగుండవు" అన్నాడు.

లక్ష్మణ్ టెరిలిన్ షర్టు టెరికాట్ పాంటూ-ఖరీదైన బూట్లూ జేబులో ఖరీదయినకలమూ-హుందాగా ఉన్నాడు.

తను చూస్తున్న దానికీ విన్నదానికీ పొత్తుకుదరక తెల్లబోతూ "నీవేం చేస్తున్నా''వని తను కాస్త ధైర్యాన్ని పుంజుకోడానికి ప్రయత్నించాడు పిన్సిపల్.

''మెడికల్ కాలేజిలో మూడవ సంవత్సరము'' అన్నాడు లక్ష్మణ్.

"చాలా సంతోషం. నేను ఇక్కడి విషయాలను అదుపులో పెడతాను" అంటూ లేచి లక్ష్మణ్‌తో కరచాలనం చేసి—అతడు వెళ్ళిన తరువాత అమ్మయ్య అనుకుంటూ కుర్చీలో కూర్చున్నాడు ప్రిన్సిపల్.

నలుగురు ఆడపిల్లల మధ్యన అపురూపంగా పుట్టిన లక్ష్మణ్‌ను చూసి తండ్రి మురిసిపోతూ వీడిచేత చీపురు పట్టించకూడదనుకున్నాడు. ముద్దుగా పెంచి చదువు చెప్పించాడు. కాని కొడుకు కాలేజిలో ప్రవేశించగానే కాలూ చెయ్యి పడిపోయి మంచానపడ్డాడు. తల్లి ఒకతె పనిచేయగా వచ్చేరాబడి చాలటంలేదు లక్ష్మణ్ తరువాత పుట్టిన శాంతి అన్నతో కూడా చదువులో ప్రవేశించింది.

కాలేజీలో అభ్యుదయ ఉత్సవాలు జరిగి వారం రోజులయినా అందరి కళ్ళల్లో ఆదృశ్యాలే ఇంకా మెదులుతున్నాయి. అందరి చెవుల్లో అ ఉపన్యాసాలూ ఆ నాటకాలలో పాటలూ పద్యాలూ ఇంకా మారుమ్రోగుతూనే ఉన్నాయి.

ఆ కాలేజిలో తెలుగు లెక్చెరరు ముకుందం ఆనాటి నుంచి ఏమిటోగా ఉంటున్నాడు. సాధారణంగా తెలుగు లెక్చెరర్లమీద విద్యార్థులకుండే గౌరవముకంటె ఆ కాలేజిలో అతడికెక్కువే గౌరవముంది. అతడెప్పుడూ తెలుగులో మాట్లాడడు. ఎప్పుడూ ఫుల్ సూటులో ఉంటాడు. ఈ రెండు కారణాలతో గౌరవాన్ని సంపాదించాడు. అభ్యుదయ ఉత్సవాలలో విద్యార్థులకు ఉపన్యాసాలను తయారుచేసి ఇచ్చాడు, వాళ్ళల్లో ఒక్కరికయినా ప్రైజు వస్తుందని నమ్మాడు. కాని వాళ్ళకు రాలేదు. ఆ ఓటమి తనదిగా భావించాడు. మనసు చిన్నబోయినట్లయింది.

కాని అది క్షణికమే. వేదిక మీదికెక్కి ఉపన్యాసం ఇచ్చిన శాంతి రూపం-ఆమె వచో మాధుర్యం-దాని సారాంశం అతడి బాధను మరిపింప చేస్తున్నాయి. ఆ అజంతా సుందరి తనను ఓడించేసింది. కాని ఆ ఓటమి కూడా ఎంతఆనందాన్ని ఇస్తున్నది! ఆమెకు ఎవరో కాచివడబోసిన అనుభవాన్ని చక్కగా బోధించారు. ఆమె తీయటి కంఠంతో వెలిబుచ్చటమే అతడికెంతో ముచ్చటగా ఉంది.

ఋతువులు మారుతున్నాయి. ముకుందం ఆలోచనలు ఒక రూపానికి వచ్చాయి. అతడీమధ్య నరేంద్ర పండిట్ దగ్గరకెళ్ళి తనకు ఆరు నెలల్లో హిందీ భాష నేర్పమని కోరాడు. "నేను సంస్కృతం వచ్చినవాడిని. ఆ లిపి కూడా వచ్చు. భాష రావాలి" అన్నాడు. నరేంద్ర పండిట్ ప్రయోజన విద్యా ప్రణాళికా రచనలో సిద్ధహస్తుడు. రెండు మూడు నెలలలోనే సంభాషణా కౌశలాన్నీ-ఉపన్యాసాలయినా అర్థం చేసుకునే శక్తినీ ప్రసాదించాడు

ముకుందం ఆత్మస్థైర్యాన్ని కలిగించుకుంటున్నాడు. అతడి కళ్ళ ఎదుట అనేక దృశ్యాలు కదలిపోతున్నాయి. అమెరికా దేశం నుంచి రీసర్చి స్కాలరుగా మదరాసు వచ్చి మూడు సంవత్సరాలు గానకళ నభ్యసించిన జాన్ హిగ్గిన్స్ చక్కని ఉచ్చారణతో భావయుక్తముగా కీర్తనలు పాడి గురువులనే గాక భారతీయుల నందరినీ మెప్పించిన అతడి మూర్తి-జరీ అంచుల దోవతి అడ్డకట్టు-సరిగంచుల ఉత్తరీయము ముఖానబొట్టు తమిళ గాయకుడిలా మెదిలాడు. ఆ చిత్రం మారి మరొక దృశ్యం. అమెరికా దేశస్తురాలు కుమారి రాక్వెల్ ఆలయ నృత్యాలు. ఆమె భారత దేశానికి వచ్చి అనుకరించిన భారత స్త్రీల కట్టూబొట్టూ ఆ అలంకరణ కళ్ల చెదరి పోతున్నాయి. పాశ్చాత్యులే మన దేశానికి వచ్చి మన పద్ధతుల నవలంబించి మనలో కలిసిపోయి మన ఔన్నత్యాన్ని విదేశాలలో చాటుతుంటే మనదేశం మన జాతి-వర్గ భేదమున్నంత మాత్రాన మెహ్తరా పిల్ల తనకు అర్ధాంగి కాలేదా? శాంతి రూపము అనేక భంగిమలలో అతడిని గిలిగింతలు పెట్టడం మొదలు పెట్టింది.

ముకుందం అభిలాష వినగానే లక్ష్మణ్ ఎగతాళి క్రింద జమకట్టాడు. వారం రోజుల పాటు ప్రతి సాయంకాలం దానిలోని కష్టనిష్ఠూరాలను వర్ణించి చెబుతూ వచ్చాడు. ఆఖరి రోజున "మీ మన స్థైర్యాన్ని అభినందించకుండా ఉండలేక పోతున్నా" నన్నాడు.

ముకుందం మూడు పూటలా గాయత్రిని జపిస్తాడు. ఆ దేవతే తనకా మన స్థైర్యాన్నిస్తోందని అతడి నమ్మకము.

తరువాత పది రోజులకు ప్రిన్సిపల్ దంపతులనూ లక్ష్మణ్‌ను కూడా రిజిస్ట్రార్ ఆఫీసుకు తీసుకువెళ్లి శాంతిని పెళ్లి చేసుకున్నాడు. ఆ సాయంకాలము

ప్రిన్సిపల్ క్వార్టర్సు ముందర పెద్ద షామియానాలో విద్యార్థులకూ స్టాఫుకు పెద్ద విందు జరిగినది. ప్రిన్సిపల్ భార్య అనితాసింగ్ అన్ని ఏర్పాట్లు చేసింది. వధూవరులు టెర్రిలిన్ నైలక్సు దుస్తులలో గులాబీ దండలతో మెరిసి పోతున్నారు. మెర్క్యురీ లైట్ల కాంతిలో ఆహూతులందరికీ ఈ పెళ్లిని గురించి ఏమనటానికి నోరు రావటంలేదు. పచ్చి వెలక్కాయ గొంతున పడినట్టున్నది. అయినా నవ్వుతూ వధూవరులకు కరచాలనం చేశారు.

అందరి పరిస్థితిలాంటిది కాదు మురళీమోహన్‌ది. అతడి ముక్కు ముడతలు పడిపోతున్నది. కనుబొమలు ఆత్మీయంగా కలుసుకుంటున్నాయి. ఆవేదనకు అంతులేదు కాని-ఈనాడు ముక్కు ముడతలు పడటం అసహ్యం కొద్ది కాదు. తనకు ఆత్మస్థైర్యం లేనందుకు - గుండె బలం లేనందుకు-పరిస్థితులు చెయ్యి జారిపోయినందుకు.

"తీపి తిని నవ దంపతులను దీవించండి" అంటూ అనితాసింగు ఇచ్చిన ఐస్క్రీం అతడికి వేడివేడిగా చేదుచేదుగా ఉంది. నవ్వుతూ అందరితో కరచాలనం చేస్తూ కృతజ్ఞతలు తెలుపుతున్న వధూవరులవైపు కళ్ళెత్తి చూడలేకపోయాడు.

[1978 లో ఆంధ్రప్రదేశ్ (స్వాతి) సాహిత్య అకాడమీవారి కథా సంకలనంలో చేర్చబడినది.]



# మనసులోని ఇజం

ఉదయం మహేంద్ర లేచేటప్పటికి ఇద్దరు అపరిచితులు ముందుగదిలో కూర్చున్నారు. మహేంద్రకు నౌకరు చెప్పగానే లేచి ముఖం కడుక్కొని, కాఫీతాగి బయటికి వచ్చాడు

"మీ నిద్రను మేము పాడుచేయలేదు కదా?" అన్నారు చేతులు జోడిస్తూ.

"అబ్బే నేను సాధారణంగా లేచేవేళే ఇది. ఏమిటిలా వచ్చారు?" అన్నాడు వాళ్ళెవరో చెప్పమన్నట్లుగా.

"మా ఊళ్ళో ఒక సారస్వత సంఘం పెట్టుకున్నాము. దాని ద్వితీయ వార్షికోత్సవానికి అధ్యక్షులుగా మిమ్ములను ఆహ్వానించవలసిందని మా ఆహ్వాన సంఘం నిర్ణయించింది. అందుకొరకు మేము వచ్చాము" అన్నారు.

"నా పేరు ఎవరు చెప్పారు మీకు?" అన్నాడు మహేంద్ర వాళ్ళ ముఖాలు చూస్తూ - తనపేరు ఎంతదూరం పాకిందో అన్న సంభ్రమంతో.

"మీ వంటి ప్రముఖ రచయితలపేర్లు అందరికీ పరిచయమే. వాళ్ళ అభిమాన రచయితలను చూడాలని మా ఊరంతా ఉత్రూత లూగుతున్నది. ఈ వార్షికోత్సవాలకు మీరు తప్పక దయచేయాలని మా ప్రార్థన" వినమ్రత ఉట్టిపడేలా అర్థించారు.

మహేంద్ర తన డైరీ తీసుకువచ్చి తన ప్రోగ్రాములు ఆ నెలలో ఎన్ని ఉన్నాయో చూసుకున్నాడు. క్రాపులోకి వేళ్ళు పోనిస్తూ "ఏప్రిల్ మొదటి వారం కదూ?" అన్నాడు.

"అవునండి" అన్నారు చేతులు నలుపుకుంటూ.

"సరే." మీరింత దూరం ఆహ్వానించటానికి వస్తే రాకపోవడమా? నేను ప్రజల మనిషిని. ఎవరు ఆహ్వానించినా వెళ్ళటమే నాపద్ధతి. నిన్న మరెవరో కూడా-

వచ్చి ఆహ్వానించారు. ఫస్టుక్లాసు రానుపోను ఖర్చులిస్తామన్నారు కూడా. అయితే అది మార్చి నెలాఖరికి. నేను రెండు ప్రోగ్రాములు ఒక్కసారి వచ్చాయి ఎలాగా అని మొదట సందేహించాను. కాని మీది ఏప్రిల్ మొదటివారంలో కదూ?"

"అవునండి" అనుకుంటూ వారిద్దరూ కాసేపు ధైర్యం తెచ్చికొని గొంతు సవరించుకొని "మహేంద్రగారూ! మేము సారస్వతాభిలాషకొద్దీ సంఘము పెట్టుకున్నాము గాని మా దగ్గర ధనములేదు. మేము రెండవ తరగతి రైలు చార్జీలు మాత్రమే ఇచ్చుకోగలము. మా యందు అభిమానము చూపాలి" చేతులు నులుపుకున్నారు.

మహేంద్ర ముఖంలో రంగులు మరాయి. "దానిదేమిటిలెండి నా ప్రోగ్రాములు నాకే జ్ఞాపకం రావటంలేదు. ఎవరికయినా టైమ్ మిస్ ఏమో! ఖాళీగా వుంటే తప్పకుండా వస్తాను" వాళ్లు అక్కడ వుండగానే లేచాడు.

"ఇతడేనా అట్టడుగు మానవుడిని గురించి నవల వ్రాసి అవార్డు పొందింది?" అనుకుంటూ వాళ్ళు లేచారు.

తరువాత నాలుగురోజులకే సన్మాన సభ జరిగింది.

మహేంద్ర ఇంటికి వచ్చేసరికి రాత్రి పదిగంటలు దాటింది. నౌకరు "భోజనం వడ్డించమంటారా?" అని అడిగాడు.

అతడికి కడుపు నిండిపోయింది. ఆ సన్మాన సభలో ఎన్నిపొగడ్తలు! ఎన్ని పొగడ్తలు! ప్రముఖులు ఇరవై మందికి పైగా పద్యంలోనూ గద్యంలోను అభినందించారు. చెప్పినమాట చెప్పకుండా ఒకరితో ఒకరు పోటీపడి ప్రసంగించారు. నగరంలోని సంస్థలన్నీ పేరుపేరునా రెండు బండ్ల పూలహారాలతో అతని మెడ వంగి పోయేట్లు వేశాయి. చివరకు ఇద్దరు పండితులు అభినందన శ్లోకాలు చదివి దీవించారు. మరో ఇద్దరు వచన కవిత్వంలో కృతజ్ఞతలు తెలిపారు.

స్తోత్రసుధతో అతడి కడుపు నిండుగా ఉంది. మనసంతా ఏమిటో అయిపోతున్నది. అతడు గాలిలో తేలిపోతున్నట్లున్నాడు.

మహేంద్ర ఒక నవల వ్రాశాడు. అది సగంలో ఉండగానే ఒక పత్రికాధిపతి వచ్చి కూర్చున్నాడు.

"మీరు వ్రాసినంతవరకూ మా పత్రికకు ఇవ్వండి. దానిని మేము పది వారాల వరకు సర్దుకుంటాము. ఈ లోపల మీరు నవల పూర్తిచేసి పంపండి. మొత్తం ఇరవై వారాలు వేస్తాము మా పత్రికలో" అన్నాడు పత్రికాధిపతి కాఫీ కప్పు బల్లమీద పెడుతూ.

మహేంద్ర పరవశించిపోయాడు. తనింత వరకూ పూర్తిచేసి అలమరిలో పెట్టిన నవలలకే గతిలేకపోయింది. నాలుగేళ్ళ తరువాత - వాటిని చూసి భరించ లేక సంచిలో పెట్టుకుని పబ్లిషర్స్ అందరి దగ్గరకి కాళ్ళు అరిగిపోయేటట్లు తిరిగాడు. వారంరోజులు తిరిగిన తరువాత ఒక పబ్లిషరు మహేంద్రమీద జాలిపడి "ఈనాలుగూ ఇచ్చి వెళ్ళండి. అచ్చయిన తరువాత వెయ్యి రూపాయలు ఇస్తాను" అన్నాడు.

మహేంద్ర మనసు క్రుంగిపోయింది.

నాలుగింటికి వెయ్యిరూపాయలా ?

అదీ అచ్చయిన తరువాతనా ?

కనీసం ఒకొక్కదానికి వెయ్యి రూపాయ లయినా రాకపోతాయా అనుకున్నాడు.

ఆ ఆశతో బయలుదేరాడు రైలు ఖర్చులు పెట్టుకుని. అతడి స్నేహితులు ఒకొక్కదానికి రెండేసివేలు వస్తాయని ఆశలుపెట్టారు. అదీ కాలేదు-తననుకున్నదీ కాలేదు. ఎంత అన్యాయం ? ఈ లోకంలో అన్నింటికంటే కారు చౌకగా ఉన్నది రచనలూ రచయితనా ? ఎంత ఘోరం ? గత్యంతరంలేక_కళ్ళు మూసుకుని-ఆనాలుగింటినీ పెదవి విరుస్తున్న ఆ పబ్లిషర్ చేతిలో పెట్టి, తన ఎడ్రసు ఇచ్చి సంచి దులుపుకుని_"నాకు పన్నెండు కాపీలు ఇస్తారా?" ఎండిపోయిన పెదవులు తడుపుకుంటూ అడిగాడు.

"లేదండీ ఆరు కాపీలు ఇస్తున్నాం" హుందాగా అన్నాడు పబ్లిషరు.

దీనికి కూడా బేరమేమిటని మహేంద్ర కనిపించింది. అయినా అన్నికాపీలు తనకెందుకు స్నేహితులకు ఇవ్వటానికేగా! ఊరకే ఇస్తే అందరూ తీసుకుంటారు.

ఒక ఏడాది తరువాత నవలలు అచ్చయినట్టు వ్రాస్తూ పబ్లిషరు ఆరేసిప్రతులు

డబ్బు పంపించాడు. ఆ ఏడాది అతడి కెట్లా గడిచిందో తలచుకుంటే అతడికే భయంకరంగా ఉంటుంది ఇప్పటికీ.

తను ఒక్కొక్క కాపీ ఉంచుకొని తనకు సన్నిహితులైన స్నేహితులకు మిగతా కాపీలు ఇచ్చాడు. ఇచ్చిన తరువాత అతడి మనసు అంతటితో ఊరుకో లేదు. మరుసటి వారంలో ఒక మీటింగులో కలుసుకున్నాడు వాళ్ళందరిని.

''ఎలా ఉన్నాయి నవలలు? బాగున్నాయా? మీకు నచ్చాయా'' అంటూ అడిగాడు వాళ్ళను ఎదుటపడి.

''ఎలా ఉండటమేమిటి? అద్భుతంగా ఉన్నాయి. మన స్నేహితుల్లో ఇంతటి మేధావి ఉన్నట్లు ఈ నవలలు చదివేవరకూ నేను ఊహించలేదు. ఉన్నట్టుండి ఎంత మంచి నవలలు వ్రాశావు? పైకి ఏమీ తెలియనట్టే వుండి గొప్ప రచయిత వై పోయావు. నా కెంతో గర్వంగా ఉంది సుమా'' అన్నా డొక స్నేహితుడు.

''నేను నవలలు మీద ఒక రీసర్చి వ్యాసం వ్రాసి పత్రికకు పంపుదామను కుంటున్నాను. నోటితో 'బాగుంది బాగుంది' అంటే ఏం లాభం? నీ ప్రతిభ అందరికీ తెలియాలా వద్దా?'' అన్నాడు మరో స్నేహితుడు.

''ఈ నవలలు ఎకాడమీ అవార్డు పొందతగినవి అయినా మనకెక్కడా న్యాయం జరగటం లేదనుకో. నేను ఒకటి ఆలోచిస్తున్నాను. రీడర్స్ ఫోరమ్ పక్షాన ఈ నవలలమీద చర్చ పెట్టించమని కార్యదర్శికి వ్రాస్తాను ఆఫీసునుంచి ఫోను చేసి ఏర్పాటు చేస్తాను. వాటిని గురించి బాగా మాట్లాడేవాళ్ళను కూడా ఏర్పాటు చెయ్యమంటాను. ఈ మీటింగయిన తరువాత బ్రహ్మాండంగా పత్రికలో నేను వేస్తాలే'' అంటూ భుజం తట్టాడు మరో స్నేహితుడు.

మరొక స్నేహితుడు వచ్చి మహేంద్రను అమాంతంగా కౌగిలించుకున్నాడు ''ఆదిలోనే బ్రహ్మాండమైన నవలలు వ్రాశావోయ్. మొదటినుంచీ నేననుకుంటూనే ఉన్నా. నీలో ఏదో అసాధారణ శక్తులున్నాయని అందుకే విన్నెప్పుడూ పరిశీలనగా చూస్తూ ఉండేవాడివి. నా ఊహాలకు చక్కనిరూపం దిద్దావన్నమాట.'' అన్నాడు ముఖం ఇంత వెడల్పు చేసుకుని.

ఆ రోజు ఇంటికి వస్తూ హోటల్లో నాలుగు మెతుకులు కొరికాడు మహేంద్ర. ఆకలిగాలేదు. పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం చేసినట్టుగా వుంది. ఎన్నాళ్ళ

కొన్నాళ్ళకు తనను గురించి తన రచనలను గురించి మంచి మాటలు విన్నాడు.
ఇప్పుడు తనొకరచయితనన్న ఆత్మవిశ్వాసము కుదిరింది. తానొక గొప్ప రచయిత
కాగలడన్న ఆశలు చిగురించ నారంభించాయి.

మహేంద్ర ఒక పత్రికలో కంపోజిటర్. అతడి సంపాదన అతడికి భోజనా-
నికి గది అద్దెకు సామాన్యమైన రెండు జతల బట్టలకు చాలీచాలకుండా ఉంటుంది.
ఈ నాలుగు నవలలవల్ల వచ్చిన డబ్బుతో ముందు మంచి ప్యాంట్లు రెండు-మంచి
బుష్షర్ట్సు రెండు ఒక బూట్ల జత కొన్నాడు. మురికి కాలవలమధ్య ఉన్న ఇరుకు
గదిని ఖాళీచేసి నాళ్ళ నడుమ మేడమీద గది అద్దెకు తీసుకున్నాడు. మిగతా డబ్బు
బ్యాంకులో వేసుకున్నాడు.

మహేంద్ర పనిచేసే పత్రిక ఆఫీసులో అతనొక నవలా రచయిత అని
తెలిపోయింది. ఎడిటరు అతడిని తన ఆఫీసు గదిలోకి పిలిచి నవలలను గురించి
అడిగి ప్రత్యేకంగా అభినందించాడు తన పత్రికాఫీసులో ఒక ప్రఖ్యాత నవలా
రచయిత పనిచేస్తున్నందుకు తనకెంతో గర్వంగా ఉందన్నాడు.

మహేంద్ర పొంగిపోయాడు. తన యజమాని తన రచనలను అభినందిం-
చాడు. సగౌరవంగా మాట్లాడాడు. అంతకంటె కావలసిందేముంది?

మహేంద్ర కాలరెత్తుకుని తిరగటంచూసి స్నేహితులంతా 'రచయిత కళ
ముఖమ్మీద కొట్టవచ్చినట్టు కనబడుతుంది'' అని చాటున అనడమేకాదు-అతడు
ఎదురుగా రాగానే ''రావోయ్! మహారచయితా!'' అని పిలవటం మొదలుపెట్టారు.

అతడు పైకి ముఖమాటపడుతున్నట్టు కనబడినా ఆత్మవిశ్వాసము వంటిది
గుర్తింపజకంటే కాస్త అధికంగా ఆతడిలో ప్రవేశించింది.

మహేంద్ర పదిమందీ తనను గుర్తిస్తున్నారనుకోగానే ఆ నాలుగు నవలల
కంటే గొప్పది వ్రాయాలని నిశ్చయించుకున్నాడు.

దేని మీద వ్రాయాలి?

ప్లాట్ సరికొత్తగా ఉండాలి

అయితే నేటి సమాజం పోకడ ఏమిటి?

సమాజాన్ని కొరుక్కుతింటున్న సమస్యలేమిటి?

మహేంద్ర పుస్తకాలు చదవటం మొదలుపెట్టాడు.

ఎందరెందరో గొప్ప రచయితలు వ్రాసిన రాజకీయ సిద్ధాంతాలను గురించి చదివాడు. ఉన్న వాడికీ లేనివాడికీ మధ్య ఉన్న సమస్యలను పరిష్కరించే మార్గాలను ఇంతవరకూ తలకొక విధంగా కనిపెట్టారు. ఈ ఉన్న వాళ్ళకూ లేని వాళ్ళకూ మధ్య (Haves and have-nots) ఉన్న సమస్యలను తీర్చే విధానాలు ఎక్కడో ఒక దేశంలో పుట్టి దేశ దేశాలు వ్యాపించాయి. "బూర్జువాలకూ పోలెటేరియన్లకూ మధ్య ఘర్షణవల్ల పెట్టుబడిదారీ విధానం నశింపవచ్చని కొందరు విశ్వసించారు. క్లాస్ లెస్ సొసైటీ రావాలి- అందుకు అభివృద్ధి చెందిన దేశాలు ముందుకు రావాలి, భూమిని స్వంతం చేసుకోవటమన్నది పోవాలి" ఈ సిద్ధాంతాలను గురించి కారల్ మార్క్స్ రాసినవి. ఏంజిల్సు ప్రొఫెసర్ లాస్కీ-యం.యన్. రాయ్ మొదలైనవాళ్ళు రాసినవన్నీ కంఠస్థం చేశాడు. పెట్టుబడిదారీ విధానం గురించి అనేక పుస్తకాలు చదివాడు. యజమానులకు కార్మికులకు మధ్య లాభాలు పంచకపోవటము-కార్మికులు సమ్మెలు చేయటం మిల్లు మూతలుపడటం -ఇవి ప్రధానమైన సమస్యలు. కొన్నిచోట్ల మిల్లు యజమానులు కార్మికులు చేసేపని కూడా మెషిన్లు తెప్పించి, వాటిచేత పని చేయించుకుని, కార్మికుల సంఖ్యను తగ్గించటము—అందువల్ల కార్మికులలో అశాంతి ప్రబలటం కార్మికుల తిరుగుబాటులను గురించి క్లుప్తంగా చదివాడు. "మొత్తంమీద కష్టపడి పనిచేసే వారికి న్యాయం జరగటంలేదు" అన్న అంశంపైన నిశ్చితమైన అభిప్రాయాలను ఏర్పరుచుకున్నాడు.

గాంధిఇజమ్ చదివాడు. ఆయన మతాన్ని రాజకీయాలలో ప్రవేశపెట్టారు. మానవులందరూ ఒకటే నన్నారు. శ్రీమంతుడికి పేదవాడికి - అగ్రకులజుడికి అస్పృశ్యుడికి తేడాలేదన్నాడు. అన్నికులాలు ఒకటేనన్నాడు. తెల్లవాడికి నల్లవాడికి తేడా ఏమిటని ప్రశ్నించాడు సర్వమానవ సౌభ్రాత్రము దేశ శ్రేయస్సును పెంపొందిస్తుందన్నాడు. ఎవరి మతాన్ని అనుసరించి వారు స్వేచ్ఛగా సుఖంగా బ్రతకగలగాలి అన్నాడు. ఆయన చెప్పినదానిలో ఇంతకూ ముఖ్యమైనది: "చెడును ద్వేషించాలి కాని చెడ్డ పనిని చేసిన వాడిని కాదు" అన్నాడు. ఆయన

ఆయుధాలు అహింస-సత్యము, ఆ సిద్ధాంతాలలోనే జీవన సరళి సాగితే సుఖ శాంతులు ఉండగలవన్న విశ్వాసము ఆయనది. ప్రజలహృదయాలనూ మనసులనూ మార్చాలిగాని విప్లవాలతో శాంతి నెలకొనదని ఆయన సిద్ధాంతము. ఇదంతా మననం చేసుకున్నాడు మహేంద్ర.

సోషలిజం, ఫాసిజం, కమ్యూనిజం, నక్సలిజంలను గురించి బాగా చదివిన తరువాత అనేకంగా నవలికలు, నవలలు. కథలు వ్రాశాడు. ప్రతి పబ్లిషరూ మహేంద్ర ఇంటి చుట్టూ తిరిగి ఆయన రాయబోయే రచనలను ముందుగానే బుక్ చేసుకోవటం-ఎడ్వాన్సులు ఇవ్వటము సాగించారు. పాఠకుల అభిరుచే పబ్లిషర్ల అభిరుచి, ఒకరితో ఒకరు పోటీలు పడుతూ ముందుకు ముందుగా ఎడ్వాన్సు ఇస్తుంటే మహేంద్ర మనసు సమ్రాట్ హృదయంలా పొంగసాగింది.

అసలు మహేంద్ర ఎవరు? ఎక్కడ పుట్టాడు? ఎక్కడ చదివాడు: ఎలా పెరిగాడు? ఈ ప్రశ్నలకు సమాధానాలు పాఠకులు వాళ్ళలో వాళ్లే చాలా గొప్పగా ఊహించుకున్నారు. మహేంద్రకు ఇప్పుడు ఆ విషయాలను తలుచుకోవటానికే అసహ్యం.

మహేంద్ర బస్సు రూటులేని పల్లెటూరులో పుట్టాడు. పదిమంది పిల్లలలో నాలుగవ వాడిగా జన్మించాడు. తండ్రి ఆ ఊరి చెట్టు క్రింద నడిచే పాఠశాలకు ఉపాధ్యాయుడు. విద్యార్థులు ఇచ్చే జీతం, వాళ్ళ తల్లిదండ్రులు ఇచ్చే కూరగాయలు ఆ యింటి వంటకాలు, పండుగలకు విద్యార్థులు ఇచ్చే గురుదక్షిణే ఆ యింటి వారికి బట్టలు.

ఏదో కేసులో సాక్ష్యంకోసం ఒక పోలీసు ఇన్స్పెక్టరు ఆ ఊరికి వచ్చాడు. ఆయనతో ఇద్దరు పోలీసు జమానులు ఉన్నారు. మహేంద్ర కప్పుడు ఏడవ ఏడు, పిల్లలకుండే సహజ కుతూహలం కొద్దీ వాళ్ళు వచ్చినప్పటి నుంచి వాళ్ళతోనే తిరిగాడు.

మహేంద్ర రంగు తక్కువైనప్పటికి అతని కళ్ళల్లో ఒక వింత ఆకర్షణ-ఒక వెలుగు ప్రత్యేకంగా కనిపిస్తాయి. అతడి చురుకైన కళ్ళలో అతడి మేధస్సు ప్రజ్వలిస్తూ ఉంటుంది. నాలుగు వందల గడపగల ఆ ఊళ్ళో పోలీసులకు అతడే గైడుగా వ్యవహరించాడు. వాళ్ళ కెంతో సహకరించాడు.

ఇన్స్పెక్టరు వెళ్ళేటప్పుడు భుజం తట్టి ''మంచి పిల్లవాడవు. తెలివైనవాడివి. బాగా చదువుకో'' అన్నాడు.

మహేంద్ర ఒక మాదిరిగా నవ్వాడు.

''నవ్వుతావేం?'' అన్నాడు ఇన్స్పెక్టరు.

''మా ఊళ్ళో చదువులేదు. మా యింట్లో డబ్బులేదు'' అన్నాడు తలవంచుకొని.

ఇన్స్పెక్టరు కెందుతో అతడి మాటలు వినగానే జాలి కలిగింది.

''నాతో వస్తావా?''

''చదువు చెప్పించుతారా?'' ఆశగా అడిగాడు.

''ముందు మా యింటికిరా ఆలోచిద్దాము''

మహేంద్ర తల్లిదండ్రులతో ఒక్క మాటయినా చెప్పలేదు. వాళ్ళు అతడికి కడుపునిండా అన్నం పెట్టలేరు. ఒంటి నిండా బట్ట ఇవ్వలేరు కాని-ఇంటి నుంచి బైటకి వెళ్ళనివ్వరు. తండ్రి చెప్పగలిగినంత చదువు తను నేర్చుకున్నాడు. ఆ తరువాత ఏమిటన్నది జవాబు లేని ప్రశ్న.

అక్కలిద్దరికి ఆ ఊరి దయాధర్మం భిక్షం మీద పెళ్ళిళ్ళయ్యాయి. ఆ పూరు గూళ్ళలో వాళ్ళ భర్తలతో దారిద్ర్యాన్ని వాళ్ళు పంచుకుని బ్రతుకుతున్నారు. అన్న గారు అవిటివాడు. పుట్టుకతోనే కాళ్ళు కదిలించలేనివాడు. తన తరవాత పిల్లలు తల్లికి యింట్లో సహాయం చేయటం ఊరి వెంట తిరగటమూ వాళ్ళ దినచర్య.

మాసికలు వేసిన నిక్కరు తొడుక్కుని, తండ్రి పాత ధోవతిలోని ఒక ముక్కను ఒంటి మీద కప్పుకుని మహేంద్ర ఆయనతో బయలుదేరాడు. కొంచెం దూరం నడచి పోలీసు జీపులోకి ఎక్కి వాళ్ళతో వెళ్ళిపోయాడు.

ఇన్స్పెక్టర్ సీతలసింగు తన భార్య లేవలేని స్థితిలో ఉంది. కనుక తన రెండేళ్ళ పిల్లవాడిని ఎత్తుకుంటాడని కొండంత ఆశతో వెంట తీసుకువచ్చాడు. జీతం లేకుండా భోజనం పెట్టాడు మహేంద్ర ఓపికతో నాలుగు నెలలు ఆ బిడ్డకు అన్ని పనులు చేశాడు. ఎత్తుకున్నాడు. ఆడించాడు. రాత్రిళ్ళు నిద్ర కాశాడు.

''ఇన్స్పెక్టర్‌గారూ! నేను ఎప్పటి నుంచి చదువుకోను?'' మధ్య మధ్య అడుగుతూ ఉండే వాడు. 'చూద్దాంలే' అన్న జవాబు తప్ప ఆ పసిహృదయానికి ఊరట కలిగించే జవాబు రాలేదు. విసుగుపుట్టినా కడుపులోనే దాచుకున్నాడు.

ఒకనాడు తెల్లవారు ఝామున లేచి పెరటి తలుపు తెరచుకొని ఆయాసం వచ్చేవరకూ పరుగెత్తి పరుగెత్తి రైల్వే స్టేషనుకు చేరుకున్నాడు. వెంటనే బయలు దెరే రైలు ఎక్కాడు పెద్ద పెద్ద స్టేషన్లు వచ్చినప్పుడు బాత్ రూములో దూరేవాడు ప్రయాణికులను డబ్బులూ ఆహార పదార్థాలు అడిగి కడుపు నింపుకున్నాడు. బెంచీల క్రింద ఒదిగి ఒదిగి పడుకున్నాడు.

రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో కిటికీలో నుంచి తొంగి చూశాడు. పెద్ద వెలుగు ప్ల్యాట్ లైట్లు - గూడ్సు బండ్లు ఐదారు వరసల రైలు పట్టాలు కనబడ్డాయి. ప్రయాణికులందరూ తమ తమ సామాన్లు సర్దుకుంటున్నారు. రైలు పెద్ద కూతపెట్టి వేగం తగ్గించి నడుస్తోంది.

మహేంద్ర రైలు ఆగగానే దిగాడు. ఆ గుంపులో ఎటు పోవలసిందీ అతడికి తెలియలేదు చలిచలిగా ఉంది. స్టేషను దాటాలంటే టిక్కెట్టు కావాలి. అతడు గబగబా రైలు పట్టాల వెంబడి కొంత దూరం నడిచిన తరువాత కంటికి కనబడిన రోడ్డు ఎక్కాడు. బజార్లన్నీ చూసుకుంటూ నడవటం మొదలు పెట్టాడు.

హోటల్ జయరాజ్‌లో ఇంకా భోజనాలు కాఫీ టిఫెన్లు సాగుతూనే ఉన్నాయి. సర్వర్లు అడావిడిగా ఇటూ అటూ తిరుగుతూనేవున్నారు చిరుతిండ్లతో ఆ రోజంతా గడచిన మహేంద్రకు కడుపులో ఆకలి కరకరలాడుతూంది. ఒక బల్ల దగ్గర నిలబడ్డాడు.

''ఏం కావాలి నీకు'' మహేంద్ర వేషం చూడగానే గద్దించి అడిగాడు ఒక సర్వరు

కడుపు వైపు చూపించి ఏదయినా పెట్టమన్నాడు మహేంద్ర దణ్ణంపెడుతూ.

''పోయి యజమాని నడుగు'' చీదరిస్తూ చేత్తో నెట్టాడు సర్వరు.

యజమాని ఎక్కడుంటాడు? అతడిని అడిగితే పెట్టిస్తాడా! ఆకలితో కళ్ళు తిరిగి నట్లవుతోంది మహేంద్రకు వాకిటి ముందు నిలబడి వచ్చేపోయ్యేవాళ్ళకు

దణ్ణాలు పెట్టటం మొదలుపెట్టాడు. కొందరు చీదరించుకున్నా ఒకరిద్దరు చిల్లర డబ్బులు అతడి చేతిలో పడేశారు.

మహేంద్ర అన్నం తినాలంటే ఇంకో రూపాయి అయినా చేతిలోకిరావాలి. చేతులు చాపుకుని "బాబయ్య" అంటున్నాడు అందరి ముందర నిలబడి.

అంతలో అత్యంతాధునిక వస్త్రాలంకరణలో వున్న ఒక యువతి చెయ్యి పట్టుకొని ఒక నడీడుగల ఖద్దరు వస్త్రధారి గాంధీ టోపీ సవరించుకుంటూ హోటల్ జయరాజ్ మెట్లెక్కుతున్నాడు. అతడికి వారానికి రెండు సార్లయినా హోటల్ జయరాజ్‌కు వచ్చి, గది తీసుకుని, ఆ రోజంతా గడపడం అలవాటు.

"బాబయ్యా! ఏమయినా ఇప్పించండి" చేతులు చాపాడు మహేంద్ర.

"అబ్బాయి ఇంతచిన్నవాడివి ఈ అడుక్కు తినడమేమిటి?" అన్నాడాయన హుందాగా, ఆయన ఒక శాసనసభ్యుడు.

"రెండు రోజులనుండి తిండిలేదు బాబయ్యా ఏంచెయ్యను అడుక్కోక ?" ఏడుపు ముఖం పెట్టాడు.

"చదువుకుంటావా? నేను ఏర్పాటు చేస్తాను" చాలా హుందాగా కళ్ళజోడు సవరించుకుంటూ అన్నాడు.

"ముందు కడుపులోకి ఇంత తిండి కావాలి సార్!"

"నాతో లోపలికిరా. అన్నం పెట్టిస్తాను." లోపలికి తీసుకువెళ్ళి అన్నం పెట్టించాడు.

"చూడు అబ్బాయీ, రేపు నేను పదిగంటలకు ఇంటికి వెళ్తాను.మాకారులో కూర్చో ఇంటికి వెళ్ళిన తరువాత ఆలోచిస్తాను." అతడామెను పై అంతస్తులో తను బుక్ చేసుకున్న గదిలోకి తీసుకువెళ్ళాడు.

ఉదయం లేవగానే మహేంద్రను పిలిచి టిఫిన్ పెట్టించి సరిగ్గా పదిగంటలకు కారులో మహేంద్రతో కూడా బయలుదేరాడు శాసనసభ్యుడు.

"నీ పేరేమిటి?"

"అసలు పేరు ముసలయ్యగానండి—మా ఊరికి ఒకాయన వచ్చి, 'మహేంద్ర' అని పేరు మార్చేశాడండీ."

"వయస్సెంత?"

"పదకొండో పన్నెండో ఉంటాయండీ"

"ఎంతవరకూ చదివావు?"

"నాలుగో తరగతి ప్యాసయ్యానండి. మా నాన్నే చెప్పాడండి"

"చూడు మహేంద్రా! నిన్ను హరిజన హాస్టల్లో చేర్పిస్తా. అక్కడే అన్నం పెడతారు డ్రెసు కూడా ఇస్తారు. స్కూలుకు పంపిస్తారు. సాలూరులో మేమంతా కలిపి హరిజన హాస్టల్ పెట్టాము. దానిలో ఇంకా ఇద్దరు తక్కువగా ఉన్నారు. నేను ఉత్తరం రాసి యిస్తాను. అది తీసుకుని వెళ్ళి చేరు. బాగా చదువుకో."

మహేంద్ర సంతోషంలో ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. ఆయన చెప్పినట్లుగా అక్కడికి వెళ్ళి చేరిపోయాడు.

అతడికి మొదట కడుపునిండా తిండి దొరికితే చాలనిపించింది. బాగా చదువుకొని తెల్లబట్టలు వేసుకుని ఉద్యోగంచేసి డబ్బు సంపాదించాలనిపించింది. తన జీవితంలో ఇవి లభిస్తే సంతృప్తికాక ఇంకేమిటనిపించింది

హాస్టల్లో చేరాడు. ఒకటి రెండు రోజులలోనే తెలిసిపోయింది అక్కడ కడుపునిండా తిండి దొరకదని అక్కడ చేరినవారంతా శుచి శుభ్రాలకు చాలా దూరంగా ఉండటం కళ్ళతో చూశాడు. అక్కడ విద్యార్థులను బిచ్చగాళ్ళ మాదిరిగా చూడటం గమనించాడు. అక్కడి వాతావరణం పరమ నికృష్టంగా ఉంది. కాని మహేంద్రకు అది తప్ప మరో మార్గం కనబడలేదు. తిండికోసం అడుక్కోవచ్చు గాని చదువు! కళ్ళు మూసుకుని-అసహ్యాన్ని చంపుకుని రోజులు గడుపుతున్నాడు.

మహేంద్ర తనను చేర్పించిన శాసన సభ్యుడు వచ్చినప్పుడు తన కష్టాలను చెప్పుకున్నాడు.

ఆయన చిరునవ్వులు కురిపించాడు.

"అబ్బాయీ! నీ వాక్కుడివేనా ఇక్కడున్నది: ఎంతమంది ఉన్నారో చూడు. ఇది దాన ధర్మాలపైన నడిచే హరిజన హాస్టలు. ఇంట్లో అమిరినట్టు అన్నీ చక్కగా ఇక్కడ అమరుతాయా? నీకు మొదలే చెప్పానా? హరిజన హాస్టలు. ఎల్లా ఉంటాయో నీకు తెలియదు గవర్నమెంటు ఇచ్చేగ్రాంట్లు సగమైన ఇక్కడ ఖర్చు పెట్టరు. మరి-అంతా ఏమయిపోతుందో తెలియదు. పిల్లలను లెక్కబెట్టటమే గాని వాళ్ళ కడుపులు నింపాలని చూడరు. లెక్కకు బియ్యం బస్తాలు వస్తాయి. పిల్లలకు ఇచ్చేది నూకలగంజి. ఇవన్నీ నాకూ తెలుసు. అయినా ఇది నిన్నటి కంటే నయమనుకో. నేను పెద్దపులి మాదిరిగా మెరుపు దాడిచేస్తూ వుంటాను అందుకని ఇంతమాత్రమయినా ఉందనుకో" భుజం తట్టాడు.

మహేంద్ర నోరు మెదపలేక పోయాడు ఈ సదుపాయాన్ని కూడా చేతులారా వదులుకుంటే తనకు మిగిలేది అధోగతేననుకున్నాడు.

మహేంద్ర కష్టపడి - చదువే ముఖ్యమనుకొని - కళ్ళు మూసుకుని - ఆవాతావరణాన్ని తలుచుకోకుండా కాలం గడిపి మెట్రిక్ పరీక్ష ప్యాసయ్యాడు. హాస్టల్ యజమానులకూ కార్యవర్గానికి నమస్కరించి బైటపడ్డాడు

మరి తరువాత సంగతి? అదే అతడికి అర్థంకాలేదు కడుపు నాయ కట్టుకుని, చెప్పులరిగేటట్టు తిరిగి - తిరిగి-ఎంతమంది చేతనో 'ఈ మెట్రిక్‌కి ఉద్యోగ మొస్తుందయ్యా?' అనిపించుకుని - చివరకు ఒక ప్రెస్సులో ఉద్యోగం సంపాదించాడు. కొన్నాళ్లు అక్కడే రాత్రిళ్ళు అరుగుమీద పడుకునేవాడు.

నాలుగు నెలలు నిండకుండానే ప్రెస్సులో అందరిచేత చాకులాంటి పిల్లవాడని పేరు తెచ్చుకున్నాడు. అక్కడితో తిండికి బట్టకూ కష్టపడకుండా ఇన్నాళ్ళకు తన బ్రతుకు తను బ్రతుకుతున్నానన్న సంతృప్తి కలిగింది మహేంద్రకు

పత్రికాధిపతి ప్రోత్సాహంతో సాయంకాలపు ట్యుటోరియల్ కాలేజిలో చేరి ఇంటర్, బి.ఏ. ముగించాడు ఈ చదువుకు సంపాదకుడు ఆర్థికంగా కొంత సహాయపడటమే కాకుండా సాయంకాలము ఐదుగంటలకే ప్రెస్సునుండి విడుదల చేసేవాడు

పట్టభద్రుడైన మహేంద్రకు జీతం కూడా హెచ్చుచేశాడు.

ఇప్పుడు మహేంద్ర వేరేగది అద్దెకు తీసుకుని ఉండటము మొదలుపెట్టాడు. పత్రికాఫీసులో పెద్ద లైబ్రరీ ఉంది. ఆ గ్రంథాలను ఇంటికి తీసుకువచ్చి చద వటం మొదలుపెట్టాడు. దాని తరువాతనే నాలుగు నవలలు వ్రాశాడు. ఆలస్యంగా నైనా అతడి రచనలకు ఖ్యాతి వచ్చింది. స్వల్పమయిన ఆర్థికలాభం కలుగుతూ వచ్చింది.

రచయితలను చూడాలనీ వాళ్ళతో మాట్లాడాలనీ చాలామందికి అభిలాష. వాళ్ళతో చాలా గంభీరంగా ఆదర్శవంతంగా మాట్లాడాలని రచయితలకు అభిలాష. ఏ ఒక్క రోజయినా ఏ పాఠకుడూ వచ్చి పలకరించి అభినందించి పోకపోతే ఆనా డంతా నిరుత్సాహంగా ఉంటుంది కొందరు రచయితలకు. గుంపులుగుంపులుగా వచ్చి తన తీరుబడి కాలాన్ని వృథాచేసినా మహేంద్రకు వాళ్ళ అభినందనలే ప్రోత్సా హమివ్వడం మొదలుపెట్టాయి.

పాఠకులకు తమ అభిమాన రచయిత ఇరుకు సందుల్లో-మురుగు కాలవల ప్రక్కన గాలి వెలుతురు సరిగా ప్రసరించని గదిలో ఉంటే వాళ్ళకంత ఆహ్లాద కరంగా ఉండదు. తమ అభిమానంలో కొన్ని మార్పులు కోరుకుంటారు. కళ్ళు మిరుమిట్లు కొలిపే వాతావరణమంటే తమ అభిమానాన్ని మరింత పెంచుకుంటారు మహేంద్ర మంచి లౌకికుడు. ఇప్పుడాతడు అదివరకు ఉన్న గదిని ఖాళీచేసి మంచి పరిసరాలలో ఆధునిక వసతులు గల ఒక చిన్న ఇల్లు తీసుకున్నాడు. ఆ యింటిని అత్యంతాధునికంగా అలంకరించాడు. ఖరీదైన తైలవర్ణ చిత్రాలతో గోడలు అలంకరించాడు. రేడియోగ్రాం కొన్నాడు ఎప్పుడూ నలగని డ్రస్సులో వుంటాడు.

కాళ్ళకు మంచి ఖరీదయిన షూసు వేస్తున్నాడు. మనిషి చాలా హుందాగా ఉన్నాడు.

ఎక్కడ ఏ మూల ఏ సాహిత్య సంఘము ఆహ్వానించినా తప్పకుండా వెళ్ళతాడు. ఇప్పుడాతనికి అభిమానులు స్నేహితుల సంఖ్య బాగా పెరిగిపోయింది.

సామాజిక స్పృహగల రచనలు కోకొల్లలుగా రచించే ఆ రచయిత కలం పేరు తెలిసిన వాళ్ళు చాలా మంది కాని అసలు పేరు కొందరికే తెలుసు. పత్రికలు అతడి సీరియల్స్ కోరినప్పుడు అతడు ఒకటే షరతు పెడతాడు ''నాకు తీరుపాటు తక్కువ. నేను ఐదు పత్రికలకు సీరియల్స్ వ్రాయాలి. అడిగిన వారిని చిన్న

బుచ్చటం నాకు ఇష్టంలేదు. వాళ్ళు నన్ను వదిలిపెట్టరు ఏ వారానికి ఆ వారం రాసి యిస్తాను. మీ కిష్టమయితే చెప్పండి ”

ఆ ప్రఖ్యాత రచయిత-పాఠకులను ఉత్కంఠ లూగించే రచయిత కండిషన్లు ఎన్ని పెట్టినా ఒప్పుకునే స్థితిలో ఉన్నారు పత్రికాధిపతులు. పైకి ఒప్పుకున్నప్పటికి వాళ్ళ గుండెల్లో దడ. ఒకవేళ – ఏ కారణముచేతనయినా – ఒక వారం మహేంద్ర రాయలేకపోతే పాఠకుల ప్రశ్న పరంపరను ఎదుర్కొనటము చాలా కష్టమే. షరతులు పెడితే అసలే రాయనంటాడేమో. కాని– ఈ మథన అంతా మనస్సులోనే పైకి ఆయన ఒప్పుకున్నందుకే సంతోషపడేవారు. అతడి అమూల్యమైన రచనలు వారం వారం అందిస్తామని అభిమాన పాఠకులకందరికి పత్రికలో ప్రకటన చేసేవారు. కొన్నివారాలు క్రమంగా వచ్చేవి. అప్పుడప్పుడు ఆ రచయిత రచనను అనివార్యకారణాలవల్ల ప్రకటించలేకపోయామని సంపాదకులు క్షమాపణ కోరు కొనటం కూడా అలవాటయిపోయింది. పాఠకుల ఆశాభంగాన్ని భరించలేక పోమన్నారు. ఉత్తరాలు గుప్పిస్తున్నారు. తన రచనల అంతస్తునూ అవి పాఠకులను రంజింపచేసే విధానాన్నీ రచయిత అంచనా వేసుకుని సంపాదకులను ఒడుపుగా ఒక ఊపు ఊపుతూ ఉంటాడు మధ్య మధ్య.

మహేంద్ర తన ఊరినుండి వచ్చిన తరువాత ఒక్కసారయినా తనవాళ్ళను గురించి తలుచుకోలేదు. ఒక కార్డు ముక్క వ్రాసి పది రూపాయలయినా పంపలేదు. అతడికి గత స్మృతులు జ్ఞాపకానికి వచ్చినప్పుడు పళ్ళుకొరుకుతాడు. దరిద్రపు కుటుంబం. తనకు కడుపునిండా అన్నం పెట్టిందా ఒంటి నిండా బట్ట– చిరుగుతూ! అతడికి తన వాళ్ళను తలుచుకుంటే ఒంటికి కారం రాచినట్టుంటుంది. తనెంత దురదృష్టవంతుడు కాకపోతే ఆ నికృష్టపు సంసారంలో పుడతాడు ? ఆ ఆలోచనలు రాగానే అతడి ముఖమంతా కాలిన వంకాయలా అయిపోతుంది. కాలగమనంలో గతమంతా విస్మరించాడు.

ఒక ఆదివారంనాడు మహేంద్ర ఇంట్లో పెద్ద ఎత్తున తేనీటి విందు జరుగు తోంది. అభిమానులు స్నేహితులు చాలామంది ఆహ్వానింపబడ్డారు. ఇద్దరు నౌకర్లు టిఫిన్ ప్లేట్లు నింపుతున్నారు ఖాళీ ప్లేట్లను తీసివేస్తున్నారు. గ్లాసులలో పానీయా లను నింపుతున్నారు. ఖాళీ కాగానే తిరిగి తిరిగి నింపుతున్నారు. ఎవరికేరకం

కావాలో మరీ మరీ అడుగుతున్నారు. టీ, కోకో కోలా, బీరు ఇష్టం వచ్చినట్టుగా అందించబడుతున్నాయి.

బుట్టనిండా గ్లాసులు పెట్టుకుని కడగటానికి తీసుకువెళ్ళాడు నౌకరు. వయసులో చిన్న, కాని పని చాలా నేర్పుతో చేస్తాడు. మహేంద్ర మనసెరిగిన ఆ నౌకరికి పద్నాలుగేళ్ళు నిండా ఉంటాయో లేదో! ఏ వస్తువు ఏ వేళప్పుడు తెమ్మన్నప్పటికి "మహాజవం మారుతతుల్య వేగం"లా వెళ్ళి యజమానికి తెచ్చి యిచ్చే చాకులాంటి అప్పన్న అతడు.

ఆహూతులందరూ కబుర్లలో పడ్డారు. కొందరికి మాట ముద్దముద్దగా వస్తున్నా దాహం తీరటంలేదు సభ్యతా సభ్యతలకు దూరంగా మాట్లాడుతున్నారు. గొల్లున నవ్వుతున్నారు.

పంపుదగ్గర భళ్ళున చప్పుడైంది. చివ్వునలేచి మహేంద్ర లోపలికి వెళ్ళాడు. బుట్టెడు గ్లాసులు ముక్కలు ముక్కలై ఆ ప్రదేశమంతా చిందిపడ్డాయి.

మహేంద్ర కోపం పట్టలేకపోయాడు. ఒక చేత్తో నౌకరు జుట్టుపట్టుకున్నాడు. ఒక చేత్తో చెంపపొంగేటట్లు వాయించాడు "వెధవా! ఈ బుట్టెడు గ్లాసులు ధర వలభై రూపాయలు. నీ జీతంలో నుంచి విరగ్గోస్తాను నీవు నాలుగు రోజులు నాగా కూడా పెట్టావు నీవు నా దగ్గర దాచుకున్న ఏభయి రూపాయలు దీని కింద చెల్లు. ఒక్క పది పైసలు కూడా నీకు రావు."

అక్కడితో కోపం చల్లారక అప్పన్నను కాలితో బలంగా తన్నాడు.

అప్పన్న మెట్లమీద నుంచి క్రిందికి దొర్లిపోయాడు. నోటికి దెబ్బతగిలి నోటినిండా రక్తం-మోకాళ్ళు మోచేతులు కొట్టుకుపోయి రక్తం కారుతోంది. ముద్దుగా మెట్ల చివరనపడి ఉన్నాడు.

మహేంద్ర తిరిగి స్నేహితుల మధ్యకు వచ్చేటప్పటికి హాలంతా కోలాహలంగా ఉంది. ఇంకా గ్లాసులు పట్టుకుకూర్చున్నారు కొందరు 'ఏమిటాలస్యం' అంటున్నారు.

మహేంద్ర హాలంతా కలయ జూశాడు. ఏదో లోపించినట్టుగా ఉంది. అందరూ ఉన్నారా లేరా అని చూసుకుంటున్న మహేంద్ర లెక్కకు ఒకరు తక్కువయినారు.

"అట్టడుగున ఉన్నవాళ్ళ అభివృద్ధిని గురించిన నీ అవగాహన నాకు నచ్చింది. దీనులను, కష్ట జీవులను, గురించి నీవు కన్నీరు తెప్పించేటట్లుగా రాస్తావోయ్ నీ రాజకీయ అవగాహన సామాజికస్పృహ చాలా గొప్పది. రాజకీయ పండితులు నీకు సాటిరారు. నీ హృదయం చాలా మెత్తనిది. నీవు వయసులో చిన్న వాడివి గాని ఆలోచనలో చాలా పెద్దవాడివి" అని తనను పదేపదే అభినందించే సీతాపతి అక్కడ లేదు.

మహేంద్ర వరండాలోకి వచ్చి మెట్లమీదుగా క్రిందికి చూశాడు.

సీతాపతి చెప్పులు అస్తవ్యస్తంగా ఒకమూలకు పడిఉన్నాయి. మహేంద్రను చూస్తూ.

(జయశ్రీ - సంక్రాంతి సంచిక)



# అమ్మ ఎట్లా ఉంటుంది?

"నాన్నా! అమ్మ ఎట్లా ఉంటుంది?"

ఈ ప్రశ్న ప్రతిరోజూ రాత్రి పడుకోబోయేటప్పుడు తండ్రి పక్కన మంచం మీద పడుకునే శీనుకు ఎదురయ్యేది.

'తల్లిని గురించి తండ్రి చెప్పిన దానితో ఆమె ఆకారం సరిపోయింది. మాటల్లో ప్రేమలేదు. పలకరింపులో ఆప్యాయత లేదు. మొదటిమారు భావరహితంగా రెండోమారు పుల్ల విరిచినట్లుగా వుంటుంది. ఎంత తేడా మాటకు మనిషికీ!'

పగలంతా మథన - అందులోంచి ఉద్భవించేదీ ప్రశ్న! ఆ లేత హృదయం కంపించి గాలిదుమారంలోని ఆకులా ఊగిపోయేది

స్నేహితుల ఇళ్ళకు వెళ్ళినప్పుడు శీను వాళ్ళ తల్లులను చూసేవాడు. పొట్టీ పొడుగూ నలుపూ తెలుపుల భేదం, నల్లటి తల వెంట్రుకలూ నెరిసిన తలలూ - సిరిగల ఇళ్ళూ-సిరిలేని ఇళ్ళూ కనబడుతూ వుండేవి. వాళ్ళెట్లా వున్నా పిల్లలను చూడగానే వికసించిన ముఖాలతో "నాయనా, రా. కాళ్ళు చేతులు కడుక్కొని రా. టిఫిన్ తిందువుగాని. పగలంతా స్కూల్లో చదువుకున్నావు, ఆడుకున్నావు" అని గుండెకు హత్తుకుని, తల మీద ముద్దు పెట్టుకున్న దృశ్యాలు - చూసిన శీను హృదయంలో నిలచిపోయాయి. మనసులో ఏదో వెలితి. తీరని ఆకలి - తీరని దాహం - ఆవేదనగా ఉండేది.

"నాయనా!" ఆ పిలుపు ఎంత తియ్యగా ఉంది? అలా ఎవరయినా తనను పిలిస్తే? అబ్బ! మనసు పొంగిపోదూ? పోనీ 'శీనూ' అని మనసారా పిలిచినా తన మనసు ఆనందంతో గంతులు వెయ్యదూ?

అమ్మ 'బాబూ!, బాబూ' అంటూ ముద్దు చేస్తుంటే, నాన్న వచ్చి 'వాడికేం కావాలో ఇవ్వు. ఏడిపించకు' అని గారాబంతో తన బుగ్గలు పుణికి ముద్దు పెట్టుకుంటుంటే ఎంత బాగుంటుంది? ఎంత గమ్మత్తుగా ఉంటుంది?

అట్లా వాళ్ళ అమ్మా నాన్నా చేస్తారనేగా 'నందు' అంత పొగరుగా మాట్లాడుతాడు ?

అబ్బ, అమ్మను గురించి ఎవరూ చెప్పరేం ? అమ్మ ఎలా వుంటుందంటే ఒక్కరయినా జవాబు చెప్పరేం ?

అందరిలాగే తనకూ ఒక అమ్మ వుండాలి కదా ?

అమ్మ - అమ్మ - అయితే ఆమె ఎలా వుంటుంది ?

రాత్రి పది గంటలవరకూ శీనుకు నిద్ర పట్టలేదు. అతడి పక్క మంచం మీద పడుకున్న తండ్రి శీను పడుకున్నాడనుకొని ఏదో పుస్తకం తెరిచాడు. రచయిత పేరు- రాసిన విషయం- అచ్చయిన సంవత్సరం - ధర - ఎన్నో ఎడిషను మొదలైన విషయాలు చూసి మొదటి పేజి తెరిచాడు.

"నాన్నా !"

"ఊఁ. ఇంకా మేలుకునే ఉన్నావా ? నీవు నిద్రపోయావనుకున్నాను !"

"లేదు నాన్నా. నిద్ర రావటం లేదు"

"ఒక మంచి కథ చెప్పనా ?"

"వద్దు నాన్నా"

"మరేం కావాలి ? కళ్ళు మూసుకో. నిద్రవస్తుంది"

"ఊహూఁ, అమ్మ ఎట్లా వుంటుందో చెప్పాలి" తండ్రి గుండెమీద చెయ్యి వేశాడు.

"అమ్మ ఎట్లా ఉంటుందంటే—అఁ—అఁ—తెల్లగా వుంటుంది. నల్లగా మెలికలు తిరిగిన మూరెడు వెంట్రుకలు. ముక్కు చక్కగా నీ ముక్కులాగే ఉంటుంది. దట్టమైన కనుబొమ్మలు. చిన్నగా గుండ్రంగా ఉండే మూతి. నాకంటే పొట్టి. గలగలా నవ్వేది. నవ్వినప్పుడు కళ్ళు మూసుకుపోయేవి. బాగా చదువుకుంది. ఫేషన్‌బుల్‌గా ఉండేది. ఎప్పుడూ అలంకరించుకుని ఉండేది. రవిశంకర్ దగ్గర నేర్చుకున్న హిందూస్తానీ సంగీతం అత్యద్భుతంగా సితార్‌మీద వాయించేది.

మెత్తటి తివాచీ పరచిన బల్లమీద కూర్చుని, ఆమె సితార్ వాయిస్తుంటే చూచిన వాళ్ళు తన్మయులై పోయేవారు.''

''నాన్నా అమ్మ ఎట్లా మాట్లాడేది?''

''మెల్లగా ఎంతో ఆదరంతో-ప్రేమతో మాట్లాడేది. ఆమె మాట్లాడిందంటే ఆకలి దప్పులు ఉండవు. ఎండలోవచ్చినవాడికి చల్లటిసీడలో సేదదీరినట్టుంటుంది.''

''అయితే నాన్నా, - అమ్మదగ్గరికెళ్దాం. ఆమె దగ్గరే మనమూ ఉందాం. ఏం నాన్నా?''

''అలాగే నీ యిష్టప్రకారమే చేద్దాం. ఇప్పుడు పడుకో, తెల్లవారిన తరువాత ఏర్పాట్లు చేద్దాం''

''మరి నీవు మర్చిపోయి ఆఫీసుకు వెళ్ళిపోవద్దు''

''ఎందుకు వెళ్తాను? వెళ్ళను, పడుకో''

కళ్లు మూసుకుంటూ తెరచుకుంటూ కొంతసేపటికి నిద్రలోకి జారుకుంటాడు శీను.

ఇలా మూడు నాలుగేళ్ళు వచ్చినప్పటి నుంచీ తల్లికోసం శీను అడుగుతూనే ఉన్నాడు అతడి ఈడుకు తగినట్టుగా నచ్చ చెప్పుతూ కాలక్షేపం చేస్తున్నాడు శివరామ్.

పదమూడు సంవత్సరాలు వచ్చిన శీనుకు ఇప్పుడిప్పుడే తండ్రి మీద అనుమానం వస్తోంది. ఎందుకంటే ప్రతిరోజూ ఇవే మాటలు చెబుతాడు. తను స్కూలుకు వెళ్ళి పదిమంది పిల్లలతో మెదిలే పదమూడేళ్ళ పిల్లవాడనుకోవడం లేదు. ఏవేవో మాటలు చెప్పి మాయచుచ్చుతున్నాడు. తనకు ఆ మాటలపట్ల నమ్మకం కుదరటంలేదని నాన్నకు తెలియదా? అనుకుంటాడు శీను.

శీను ముఖం కొంచెం విచారంగా కనబడగానే శివరామ్ అతడికి ఇష్టము వచ్చిన వస్తువులు తెచ్చియిస్తాడు. ఎంత ఖరీదయినదయినా లెక్కచేయడు. పదిమంది పిల్లలను పిలుస్తాడు. వాళ్ళతోపాటు శీను ఆనందంగా ఉండాలని ఆయన ఆశ శీను. తల్లిని మరచిపోవాలని ఆయన ఆకాంక్ష.

కాని, శీను అంత తొందరగా మరిచిపోయేవాడు కాదు. ఊరికే జ్ఞాపకం చేసుకుని బాధపడతాడు.

శివరామ్ ఒక్కసారయినా విసుక్కోకుండా శీను అడిగిన ప్రశ్నలకు పరమ శాంతంగా జవాబులిస్తూ వుంటాడు. ఆ చిన్న పిల్లవాడికి తల్లి ఎందుకుదూరమైందో చెప్పలేక మనసులో కుళ్ళిపోతాడు.

కోర్టులో డైవోర్సు కేసు నడుస్తుండగా కూడా తన అహం చంపుకుని సునీత దగ్గరికి వెళ్ళి "ఈ ఏణ్ణర్థం పిల్లవాడి ముఖం చూసి అయినా-నీ కడుపులో వున్న ఆరునెలల బిడ్డను తలుచుకొని అయినా కేసు ఉపసంహరించుకో" మని బ్రతిమిలాడాడు. ఎందరిచేతనో చెప్పించాడు. ఆమె తల్లిదండ్రులను కూడా అర్థించాడు. ఆమె ఎవరి మాటా వినలేదు. తలవంచుకున్నదిగాని జవాబివ్వలేదు.

శివరామ్‌కు సునీత మనసులోని మర్మం ఏం తెలుసు? కాలేజీలో చదువుతుండగా చంద్రన్-ఆమె ప్రేమించుకున్నారని, తల్లిదండ్రులు అభ్యంతరం పెట్టారని, అతడు ఆ వైరాగ్యంతో విదేశాలకు వెళ్ళి, నాలుగేళ్ళ తరువాత వచ్చి, ఆమెకోసం వెదకి వెదకి తెలుసుకుని, వుత్తరం రాసి కలుసుకున్నాడనీ తెలియదు. అప్పుడప్పుడు కలుసుకుని వాళ్ళిద్దరూ కలిసి ఈ నిర్ణయం తీసుకున్నారు కాబోలు. ఉత్తరం రాసిపెట్టి ఇంట్లోంచి వెళ్ళిపోయింది. కోర్టువారు తీర్పు ఇచ్చే నాటికి 'ఆశ' అనే ఆడపిల్ల పుట్టింది. సునీత ఇష్టం మీదనే శీను తన దగ్గరుంటున్నాడు.

ఆమె-సునీత-బొంబాయిలో హాయిగా చంద్రన్ దగ్గర ఉంది. ఆశ అతడిని 'నాన్నా' అని పిలుస్తుంది. అందరూ సంతోషంగా వున్నారు.

ఇక్కడ శీనుకు ఒకటే దిగులు. అందరికీ ఉండగా లేనిది తనకు ఎందుకు లేకపోవాలి అమ్మ?

శీను స్కూలుకు వెళుతున్నాడుగాని చదువుమీద శ్రద్ధ తగ్గడం మొదలు పెట్టింది. స్కూల్లో టీచరు చెప్పినపాఠాలను అతడుఅర్థం చేసుకోలేకపోతున్నాడు. తలకెక్కటంలేదు. ఇంట్లో ట్యూషన్ చెప్పితే లాభం కలుగుతుందేమోనని శివరామ్ సమర్థుడైన టీచర్‌ను పెట్టాడు.

కాని-శివరామ్ ప్రయత్నం ఫలించలేదు. చదువు లేకపోయినా పిల్లవాడు నానాటికి మందకొడిగా తయారయ్యాడు. వరసగా పరీక్షతప్పటం మొదలుపెట్టాడు.

శివరామ్‌కు ఎటూ తోచటంలేదు. ఒక ఏడాది సెలవుపెట్టి అతడికి చూడ వలసిన ప్రదేశాలన్నీ చూపించటానికి బయలుదేరాడు.

ఏదయినా కన్నుల పండువుగా ఉన్న దృశ్యం చూసినప్పుడు "నాన్నా. అమ్మ ఉంటే బాగుంటుంది కదూ ? ఇవన్నీ చూసేది కదూ ?" అనేవాడు.

శివరామ్ హృదయం ఆ మాటలకు క్రుంగిపోయేది. మళ్ళీ తనకు తానే ఊరడించుకుని తెచ్చిపెట్టుకున్న గాంభీర్యంతో "అవున్రా, నేనూ ఆ మాటే అను కుంటున్నాను. అమ్మవస్తే చాలా బాగుండేది. సరేలే మనం చూసి ఇంటికి వెళ్ళిన తరువాత ఉత్తరం రాద్దాం" అనేవాడు.

"ఇంటికి వెళ్ళాక ఉత్తరం వ్రాయడమేమిటి నాన్నా! ఎక్కడుందో చెప్పు. నేను పిలుచుకుని వస్తా. ఎంతో అందంగా ఉంటుందన్నావు. తియ్యగా చల్లగా మాట్లాడుతుందని అన్నావు. సంగీతంలో నిధి అన్నావు. గ్రాడ్యుయేటన్నావు అటువంటి ఆవిడ నాకు తల్లంటే నాకెంతో సంబరంగా ఉంది. ఎక్కడున్నదో ఇన్నాళ్ళనుంచీ చెప్పలేదు. ఇప్పుడయినా చెప్పు! నేను వెళ్ళి మా అమ్మను చూసి పిలుచుకుని వస్తాను. అంతటి మెత్తటి హృదయమన్నావు. మరి-మనం.... అందులో నేను 'అమ్మా' అని పిలిస్తే రాదా ? తప్పకుండా వస్తుంది నాన్నా."

శివరామ్ అతడికి దక్షిణ దేశంలోని చూడదగిన ప్రదేశాలన్నీ చూపించాడు. వివేకానందరాక్ చూపించాడు. మూడు సముద్రాలు ఒక్కచోట కలిసిపొంగే చోటు చూపించాడు. ఎన్నో వస్తువులు కొనిఇచ్చాడు.

కాని శీను ముఖంలో ఇవన్నీ చూసిన సంతోషంలేదు. వింత వింత వస్తువు లను కొనుక్కున్న ఆనందంలేదు. ప్రయాణం బులుపులేదు.

నిరాశతో ఇంటికి వచ్చిన శివరామ్ వైద్యులను సంప్రతించాడు. పిల్లవాడు అన్ని విధాలా ఆరోగ్యవంతంగా వున్నాడు. కాని అతడి మనసు అతడి స్వాధీనంలో లేదు.

శీనును అనేక రకాల ప్రశ్నలు వేశారు డాక్టర్లు. అన్నిటికి సరిగ్గా సమా ధానాలు ఇచ్చాడు. తనకే బాధ లేదంటాడు.

డాక్టర్లు పది రోజులపాటు ప్రతిరోజు వచ్చి కులాసాగా కబుర్లు చెబుతూండేవారు.

"ఇంత తెలివైన వాడవు-ఇంత విచారంగా ఉంటావెందుకు? పరీక్షలు బాగా రాయలేదెందుకు? మీ నాన్న నీ కోసం ఎంత కష్టపడుతున్నాడో చూడు. నీవు పదిహేనేళ్ళ పిల్లవాడివయ్యావు. నీ బాధ్యత నీకు తెలియవద్దా శీనూ?" అంటూ అతడి భుజంమీద చెయ్యేసి చనువుగా అడగటం మొదలుపెట్టారు.

కొంచెం పెద్దవాడయిన తరువాత శీనుకు మనసులో ఉన్నమాట మనసులోనే వుండిపోతున్నదిగాని వెనకటివలె త్వరగా బైటికి రావటంలేదు. అందరి ముందర అతడు మనసు విప్పటంలేదు. తనలో తనే కుమిలిపోతున్నాడు.

"అమ్మ ఎట్లా ఉంటుంది? నేను మా అమ్మను చూడాలి." ఒకనాడు తలవంచుకొని చెప్పేశాడు శీను.

డాక్టర్లు తుళ్ళిపడ్డారు. శివరామ్‌గారు అన్ని విషయాలు చెప్పారు. కాని-ఈ మాట మాత్రం చెప్పలేదు. ఇదే ఈ పిల్లవాడికి బెంగఅయి ఉంటుంది అనుకున్నారు.

"ఈ పిల్లవాడికి మీరు తల్లిని చూపించకపోతే లాభంలేదండీ. అతడికి ఆరోగ్యం బాగుంది. తెలివితేటలున్నాయి. అతడికి తల్లి బెంగతప్ప మరేంలేదు" డాక్టర్లీ విషయం తేల్చి చెప్పారు.

శివరామ్ పిల్లవాడి కొరకు డబ్బు ఖర్చుచేయగలడు. ప్రేమగా చూడగలడు కావి, తల్లి విషయంలో ఏం చేయగలడు? ఆమె నెట్లా తీసుకురాగలడు?

"ఈ బెంగ ఏ జబ్బు క్రిందికైనా మారవచ్చు" నని డాక్టర్లు హెచ్చరించారు. తనిప్పుడేం చేయాలి?

వారం రోజు లాలోచించాడు. కడుపుతీపికంటే అభిమానం గొప్పదా? చూస్తూ చూస్తూ కన్నబిడ్డను మాటపట్టింపులకూ, పంతాలకూ ఎర చేయగలడా?

వెంటనే రాగద్వేషాలకతీతమైన శక్తిని తెచ్చుకుని-"పిల్లవాడు నీ కోసం చాలా దిగులుపడ్డాడు. సరిగా చదువుకోవటంలేదు. ఆరోగ్యం చెడిపోతుందని

డాక్టర్లు హెచ్చరిస్తున్నారు. వీడిని నీ దగ్గర అట్టిపెట్టుకో. ఖర్చులు నేను భరిస్తాను. నీవు సరేనంటే ఎవరిచేతికయినా ఇచ్చి పంపుతాను" అని రాశాడు. ఈ ఉత్తరం రాయటానికి రెండు రోజులు పట్టింది శివరామ్‌కు. రాయటం-చింపటం-రాయటం-చింపటం-చిత్తు కాగితాల బుట్ట నిండింది.

"పిల్లవాడిని పంపించండి" అన్న ఉత్తరం. శివరామ్ రాసిన జాబు చేరిన నాలుగో నాటికే వచ్చింది.

శీను స్కూలు నుంచి రాగానే శివరామ్ సంతోషకరమైన వార్త చెప్పాడు. శీను ముఖం వికసించింది.

"నాన్నా! నీవు కూడా రాకూడదూ? ఇద్దరం చూసి తీసుకువద్దాం" ఉత్సాహం పట్టలేని శీను వెర్రిగంతులేస్తున్నాడు.

"నాకు సెలవు దొరకదురా శీనూ. నువ్వెళ్ళి చూడు. రమ్మని అడుగు. వస్తే తీసుకురా. నీకు కావలసినంత డబ్బు తీసుకెళ్ళు" శివరామ్ కూడా చాలా వుత్సాహం కనబరచి శీనును ప్రోత్సహించాడు.

శీను ప్రయాణానికి తగిన ఏర్పాట్లు అన్నీ జరిగాయి. బయలుదేరేనాడు శివరామ్ శీనును గుండెలకు హత్తుకుని "శీనూ, వెళ్ళగానే ఉత్తరం రాయి. ఈ నాన్నను మరచిపోకు" అన్నాడు చెమ్మగిల్లిన కళ్ళతో.

"నాన్నా, నేను అమ్మను తీసుకువస్తాను చూడు" అంటూ ధీమాగా-తల్లిని గురించి తీయ తీయటి కలలు కంటూ-ఒక రోజంతా ప్రయాణం చేసి తండ్రి ఇచ్చిన అడ్రసు ప్రకారం ఇంటికి వెళ్ళాడు.

ఒకామె ఎదురుగుండా వచ్చి లోపలికి తీసుకు వెళ్ళింది. కుశల ప్రశ్నలు అడిగింది. కాఫీ టిఫిన్ పెట్టింది. కాని ఆమె ముఖంలో అతడు వెదకిన ప్రసన్నత కనబడలేదు

లోపల నలుగురు పిల్లలున్నారు. అందరూ అతడిని వింతగా చూడటం మొదలుపెట్టారు.

వాళ్ళను శీను చూడనట్లే ఉన్నాడు.

ఆమె తల్లి అయిఉంటుందని ఊహించుకున్నాడు. ఆమె ప్రేమతో పలకరిస్తే 'అమ్మా' అంటూ ఆమెను కౌగిలించుకోవాలనీ-ఆమె ముద్దులు అందుకోవాలనీ-ఆమె గారాబంగా 'నాయనా' అంటూ తనను దగ్గరికి తీసుకుంటుందనీ ఎదురు చూస్తున్నాడు.

ఆమె మామూలుగా "ఇక్కడ స్కూల్లో చదువుకుంటావా? ఇవాళ కను క్కొని రేపు చేరుస్తాను" అంది. అతడికి వేళకు భోజనం పెట్టింది. పడుకోటానికి ఒక మంచం తెచ్చి వేసింది. ఆమె ముఖంలో ఏదో చికాకు-ఏదో అలజడి కనిపించిం దతడికి.

అనాడంతా ప్రయాణం బడలికవల్ల శీను బాగా నిద్రపోయాడు.

అతడు నిద్రలేవగానే చంద్రన్ ఎదురుగా కనుపించాడు. శీను మంచం మీద లేచి కూర్చున్నాడు.

ఇద్దరూ ఒకరి ముఖంలోకి ఒకరు చూసుకున్నారు.

"నీకు చదువు సరిగా సాగటం లేదట గదూ? ఇక్కడ చదువుకుంటావా?" అడిగాడు చంద్రన్.

శీను మాట్లాడలేదు. అతడికి తల్లి ప్రేమతో పలకరించాలని వుంది. తల్లిని తనతో తీసుకుపోవాలని వుంది. దానికోసమే ఎదురు చూస్తున్నాడు.

సునీత ఆ నలుగురి పిల్లలతో కూడా అతడికి భోజనం పెట్టేది. ఏదయినా కావాలంటే ఇచ్చేది. మళ్ళీ అతడితో మాట్లాడటానికే ఆమెకు అవకాశం దొరికేది కాదు. సాయంకాలం కాగానే చంద్రన్‌తో బైటకి వెళ్ళిపోయేది. ఏ రాత్రికో తిరిగి వచ్చేవారు. ఈ లోపు నౌకర్లు పిల్లలకు భోజనాలు పెట్టేవారు.

స్కూళ్ళు తెరిచారు. సునీత అతడిని ఒక స్కూల్లో చేర్పించింది.

కాని-శీను మనసు యథాప్రకారం దేనికోసమో ఆరాటపడుతున్నది. ఇన్ని రోజులయింది తాను వచ్చి. తల్లి ఒక్క పావుగంటయినా తన దగ్గర కూర్చోటం లేదు. ఒక్క మాటయినా ప్రేమతో పలకరించలేదు. తన తండ్రిని గురించి ఒక్క సారయినా అడగలేదు.

తల్లిని గురించి తండ్రి చెప్పినదానిలో ఆమె ఆకారం సరిపోయింది. కాని-ఆయన చెప్పిన ప్రేమపూరితమైన మాటలు లేవు. తీయ తీయటి పలకరింపులు లేవు. మొదటి మాట భావరహితంగా ఉంటుంది. రెండవ మాట పుల్లవిరిచినట్లుగా ఉంటుంది. ఎంత తేడా మాటకూ మనిషికీ ?

ఈ మానసిక కల్లోలంలో శీను పరీక్ష తప్పాడు అతడికి ఇక్కడికి వచ్చిన తరువాత తానూహించిన మాతృ హృదయం కనబడలేదు. దానికోసం తల్లడిల్లి పోతున్నాడు.

తనెంతగా వూహించాడు ? ఎన్ని కలలు కన్నాడు? తల్లికోసం ఎంత బెంగ పెట్టుకున్నాడు ? ఎంత తహతహలాడి పోయాడు ?

మళ్ళీ అతడిలో నిర్లిప్తత ప్రవేశించింది. టీచరు చెప్పింది మనసులో కెక్కదు. చదువు మీద ధ్యాస నిలవదు.

ఆమె విసుక్కున్నది. "ఇంత మాత్రానికి ఇక్కడికెందుకు వచ్చావు ? నువ్వే వచ్చావా లేకపోతే నా మీదకి నెట్టాలని ఆయనే పంపారా ? మనిషికి తెలివి వుండాలిగాని ఎక్కడుంటే ఏం చదువుకోటానికి?" మొఖం చిట్లించి మందలింపుగా అన్నది.

"తిండి దండుగ. తిప్పి పంపించు" అప్పుడే వచ్చిన చంద్రన్ అన్నాడు.

శీనుకు మతిపోయినట్లుగా ఉంది అన్నం తినబుద్ధి కాలేదు. తను అనుకున్నదొకటీ. జరిగిందొకటీ. తనెంతటి ఉత్సాహంతో వచ్చాడిక్కడికి ?

తాను కోరింది ఒకటి_లభించింది ఒకటి

ఆ రాత్రి అతడికి తెలియకుండానే తండ్రి మీదికి మనసుపోయింది. నాన్న చెప్పిన తీయటి మనసు ఇక్కడలేదు. అంటే అమ్మ ఇక్కడ లేదన్నమాటే.

తెల్లవారకముందే తన బట్టలు సర్దుకున్నాడు. పిల్లలకోసం తండ్రి యిచ్చిన వస్తువులు ఇవ్వబుద్ధికాలేదు. ముక్కు విరుచుకుంటూ పెట్టె చేతబట్టుకుని_స్టేషన్ చేరాడు.

ఉరుకు పరుగులతో ఇంటికి వచ్చి తండ్రి కోసం ఇల్లంతా వెతికాడు. శివరామ్ డాబామీద పడక్కుర్చీలో పడుకుని వెర్రిచూపులు చూస్తున్నాడు.

సాయంకాలం ఆరుగంటల సమయమది. ఆయిన ఆఫీసు నుంచి వచ్చి అక్కడ కూర్చున్నట్టుగా ఉన్నాడు. ఎదురుగా బల్లమీద కాఫీ, టిఫిన్, మంచినీళ్ళు వున్నాయి.

"నాన్నా. నాన్నా. నువ్వింకా కాఫీ తాగలేదూ? చల్లారిపోతోంది" అంటూ కుదిపాడు శీను. "ఎప్పుడు వచ్చావురా? ఒక్కడివే వచ్చావా?" ఆయన మాట చాలా నీరసంగా వినబడ్డది శీనుకు.

"ముందు కాఫీ, టిఫిన్ తీసుకో. అబ్బ, ఎంతో చిక్కిపోయినట్టు కనిపిస్తు న్నావు. సరిగా భోజనం చేస్తున్నావా అసలు?" తన కుర్చీ ఆయన కుర్చీకి దగ్గరగా తీసుకున్నాడు.

"నా తిండిదేమిటిగాని-నీవు కులాసాగా ఉన్నావా? పరీక్ష ప్యాసయ్యావా? మరి నీవు రావేమోననుకుంటున్నాను" అన్నాడు శివరామ్ దీనంగా ముఖంపెట్టి.

శీనుకు కళ్ళలో నీళ్ళు నిండాయి.

"నాన్నా. నేను నీ దగ్గరే ఉంటాను. ఇక్కడే బాగా చదువుకుంటాను. అక్కడ ఉన్నప్పుడు నాకు నీ మీద బెంగగా ఉండేది. అందుకే పరీక్షపోయింది" అన్నాడు.

"ఇన్నేళ్ళు అమ్మకోసం బెంగపెట్టుకుని వెళ్ళిన వాడివి-నా కోసం అక్కడికి వెళ్ళి బెంగపెట్టుకున్నావా?" ఆయన నీరసంగా నవ్వారు అతడిలోకలిగిన మార్పుకు.

"అవును. నువ్వు అమ్మను గురించి అన్నీ అబద్ధాలు చెప్పావు నీవు చెప్పింది ఒక్కటీ కనబడలేదామెలో. ఇవాళ్టి నుంచీ అమ్మా నాన్నా నువ్వే"

కొడుకుతల తండ్రిభుజమ్మీదికీ-తండ్రితల కొడుకుభుజమ్మీదికీ వాలాయి కళ్ళనీళ్ళతోపాటు.

(ఆనందజ్యోతి-సచిత్ర వార పత్రిక)



# కిస్ మీ క్విక్

సోఫీ! సోఫీ!

బిగ్గరగా పిలుస్తోంది పావుగంటనుండీ మోతీ.

అవి ఎదురెదురుగా ఉన్న మేడలు. మలక్‌పేటలో గవర్నమెంటు కట్టి ప్రభుత్వోద్యోగులకు అద్దెకిచ్చిన ఇళ్లు. ఒక బ్లాకులో కిందా పైనా కలిపి నాలుగు భాగాలుగా ఉంటాయి. ఈ మేడమీద బాల్కనీలో నిలబడి పిలిస్తే ఆ మేడమీదికి సాధారణంగా వినబడుతుంది. ఆనాడు గాలి ఎక్కువగా ఉండడంచేత మోతీ మరీ మరీ పిలవవలసి వచ్చింది బిగ్గరగా.

మోతీకి కోపం వచ్చింది. మూతి మూడు వంకరలు తిప్పింది. అన్నిసార్లు పిలవవలసి వచ్చినందుకు కోపము కూడా వచ్చింది. కాని - లోపలికి వెళ్ళటానికి ఇష్టంలేదు.

సోఫీ! సోఫీ!

సోఫీ షెల్వారు కుడతా వేసుకుని - ఓణీ సర్దుకుంటూ వచ్చి నిలబడ్డది- బాల్కనీలో - ఏమిటని కనుబొమలు పైకెత్తి కళ్ళతో ప్రశ్నిస్తూ.

"కాలేజీకి వెళ్తావా?" జడ విప్పుకుంటోంది సుతారంగా మోతీ.

"ఏం? నీవు రావా?"

"ఏమో! ఇవాళింకా పనికాలేదు. చేమగడ్డలు ఎంతకూ ఉడకలేదు. కూరా చేసి మిగతాపని చూసుకొని నేను బయలుదేరే సరికి ఆలస్యం కావచ్చు. అమ్మకు మళ్ళీ జ్వరం వచ్చింది రాత్రి."

"నేనయితే వెళ్తున్నా. ఏదయినా పనుంటే చెప్పు" సోఫీ లోపలికి వెళ్ళింది.

మోతీ ఒక్కసారి తమ తొట్లల్లో పెట్టిన చెట్లు బాగా పెరుగుతున్నాయో లేదో చూసింది. ఆమె పదిరోజులనాడు పెట్టిన కొమ్మలన్నింటికీ కొత్త చిగుళ్ళు వచ్చాయి. "అమ్మయ్య అన్నీ బతికాయి" అనుకుంది. ఒక్కొక్కదాన్నీ చేత్తో ముట్టుకుని ప్రేమతో నిమిరింది. మాలి మంచివాడే. ముదురు కొమ్మలు చక్కగా చాకుతో కలంలా చెక్కి మట్టి అంటించి తడిబట్టలో చుట్టి ఇచ్చాడు. వాడికిచ్చింది ఒక్క రూపాయేగాని - పది రకాల కొమ్మలు ఇచ్చాడు. తన గది ముందర చిన్న బాల్కనీ. దానిలో పది రకాల పూలచెట్లు ఆ పది కుండీలు జాజు రంగుపూసి అందంగా అమర్చుకుంది ప్రతిరోజూ కాలేజీనుంచి రాగానే వాటిని పలకరించి పట్టుగా ప్రేమతో ఆకు ఆకునూ నిమురుతుంది.

మోతీకి చెట్ల తరువాత సోనీతో కబుర్లు చెప్పకపోతే తోచదు. ఒకరింటికి ఒకరు వెళ్ళక్కర లేకుండా బాల్కనీలో నిలబడి గంటలకొద్దీ గలగలా కబుర్లు చెప్పుకుంటారు. ఇద్దరి మధ్య నలభై అడుగుల దూరము ఉన్నదనైనా అనుకోకుండా పకపక నవ్వుతుంటారు ఇద్దరూ సైన్సు విద్యార్థినులే కాని కాలేజీలు వేరు వేరు. అందుకనే ఎడతెగని కబుర్లు. సాయంత్రము అయిదు గంటలకు మొదలు పెడతారు - కాలేజి కబుర్లు. పరీక్షల రోజుల్లో అయితే మరీ - పాఠాలు-ప్రశ్నలు - ఎవరెవరు బాగా రాసిందీ - ఎవరెవరు తెల్లముఖం వేసిందీ - ఎవరెవరు కాపీలు చేసిందీ - అనుమానాలు - లెక్చరర్ల కళ్ళు కప్పటాలూ - ఇలా రాత్రి ఎనిమిదయే వరకూ సాగుతుంది సంభాషణ.

"ఏం కబుర్లే ఇంతసేపు? రోజూ చూసుకునే వాళ్ళకు అన్ని కబుర్లు ఎక్కణ్ణుంచి వస్తాయే?" విసుక్కుంటాడు మోతీ అన్న దిలీప్.

"మీరు చెప్పుకోరేమిటి? బజార్లవెంట నడుస్తూ కూడా చెప్పుకుంటారే! ఎదురుగుండా ఏదొచ్చేదీ చూడకుండా కబుర్లు చెప్పుకోరూ? మొన్న మా కాలేజిగేటు ముందర ఒక అబ్బాయి నీలాంటివాడే - ముఖం కనబడకుండా జుట్టు పెంచుకొని బెల్ బాటమ్ ఊగించుకుంటూ గేటు లోపల అడుగుపెడుతున్న అమ్మాయిని చూస్తూ నడుస్తున్నాడు. ఎదురుగా స్కూటర్ వచ్చింది డబుల్ సవారీతో. ఢామ్మనిపడ్డాడు. కాలికి ఫ్రాక్చరయింది పది రోజులనాడు ఇద్దరు హిప్పీస్టైల్లో ఉన్న అబ్బాయిలు కబుర్లు చెప్పుకుంటూ గలగల నవ్వుతూ నడుస్తున్నారు. బాగా ట్రాఫిక్ ఉన్న రోడ్డుమీద, ఒక ఆఫీసరుగారు సిగరెట్టు నోట్లో పెట్టుకుని అర్జంటుగా ఆఫీసుకు

వెళ్లతూ వీళ్ళిద్దరినీ పదిగజాల వెనక్కు తోసి తన జీపుకు స్పీడు ఎక్కువ చేశారు. వాళ్ళిద్దరినీ ఉస్మానియా హాస్పిటల్లో చేర్చారు పోలీసులు. అందులో ఒకడికి ప్రమాదంగా ఉందట కనుక అబ్బాయిగారూ! కబుర్లకు ఆడా మగా వ్యత్యాసం లేదండీ. విన్నారా ?"

దుమ్ము దులిపేసింది మోతీ.

"అమ్మా! మోతీ లౌడ్‌స్పీకర్లో సంభాషణలు నేను వినలేకుండా వున్నాను. నాకు అటువైపు గది ఇవ్వు" దిలీప్ రుస రుస లాడాడు.

మన ఇల్లు దేవిడీ అనుకుంటున్నావా దిలీప్! రెండు గదులూ, వంటయిల్లు, హాలులో మనము ఇరుక్కుని వుంటుంటే మీ కిద్దరికి చెరొక గదీ ఎక్కడ నుంచి వస్తుందిరా! నాన్నగారికి పడుకోటానికీ, రాసుకోవటానికీ ఒకగది కావాలి కదా? ఇంక వున్నదొక్కటే! ఆడపిల్ల కనుక దానికి ఇచ్చాను. నీవందులో చదువుకో లేకపోతే వరండాలోకి వెళ్ళు" తల్లి వసుంధర మళ్ళా వంట యింట్లోకి వెళ్ళింది.

"నేను బాగా చదువుకోవాలి పరీక్షల్లో ఫస్టున ప్యాసవ్వాలి? పెద్ద ఉద్యోగం చేసి దోసిళ్ళతో సంపాదించి మీకివ్వాలి? కాని నాకు గది ఇవ్వమంటే యివ్వవా? దాని చదువు పెళ్ళి చదువు. అలంకారార్థం చదివే చదువు. ఆ చదువు కన్ని సౌకర్యాలా? అమ్మా నీకు ఎంత పక్షపాత బుద్ధో తెలిసి పోయిందమ్మా" కయ్యానికి కాలు దువ్వుతున్నాడు దిలీప్.

''ఏయ్ దిలీప్. నా చదువును అట్లా తీసి పారేశావంటే ఊరుకోను. నీ చదువయిన తరువాత ఉద్యోగానికని నీవు రోడ్లన్నీ కొలవాలి. కాని - నా చదువు కాగానే మా ప్రిన్సిపలే లాబ్‌లో పని యిస్తానంది తెలుసా? నా చదువు పెళ్ళి చదువనీ - అలంకారార్థం చదువుతున్నాననీ అంటున్నావు కదూ? నీ కళ్ళతో నీవే చూస్తావు'' యీుడించింది మోతీ.

"అమ్మా తల్లీ, నీతో మాట్లాడేవాళ్ళకు బుద్ధిలేదు. ఇంతే సంగతులు" చివాలున రెండడుగులు ముందుకువేసి కాళ్ళకు చెప్పులు తగిలించుకుని పెద్ద చప్పుడు చేస్తూ బైటికి వెళ్ళిపోయాడు.

వసుమతి పదిగంటలు కాగానే ప్రకాశరావుకు వడ్డిస్తూ ''వెండి సామాను రెడీ అయిందని మగన్‌లాల్ చెప్పి పంపాడు. సాయంత్రము మీరు వచ్చిన తరు

వాత తీసుకువద్దాము. శుభలేఖలు పంపటానికి లిస్టు తయారు చేశాను. ఇక్కడి నుంచి కొని తీసుకువెళ్లే వస్తువుల లిస్టు కూడా తయారయింది టైలరు దగ్గర్నించి నిన్ననే బట్టలు వచ్చేశాయి. అంతవరకూ చేసిన పనుల జాబితా వినిపిస్తోంది

"తిరుపతిలో అన్ని వస్తువులూ దొరుకుతాయి. ఇక్కడినుంచి మూటగట్టి తీసుకు వెళ్ళక్కర్లేదు. తిరుపతిలో పెళ్ళి అంటే క్లుప్తంగా జరుగుతుందనుకో. అమ్మా నాన్నా అక్కడినుంచే తిరుపతి వస్తా మన్నారు. ఇక్కడినుంచి వచ్చేది. మనం నలుగురం అంతే" అన్నాడు ప్రకాశరావు.

"నలుగురమా? సోసీ మోతీతో ఉండనే ఉంటుంది. దిలీపున్న చోట అశోక్ ఉండనే ఉంటాడు. వాళ్ళను తీసుకు వెళ్ళకపోతే పిల్లలు చిన్నబుచ్చుకుంటారు. వాళ్ళిద్దరూ ఉండాల్సిందే" లేచి పెరుగుగిన్నె తీసుకుని వచ్చింది.

"చిన్న చిన్న ఖర్చులే అనుకుంటే అవే తడిపి మోపెడవుతాయి. అది గుర్తుంచుకో. సరే వాళ్ళిద్దనీ కూడా తీసుకువెళ్దాం" ఆయన భోజనం ముగించి డ్రెస్సు వేసుకుని ఆఫీసుపైళ్ళు చంకబెట్టుకుని బస్సుకోసం చెట్టు కింద నిలబడటానికి పరుగులు తీశాడు.

వసుంధర భోజనం చేసి వంట యిల్లు సర్దుకొని చాపపరచుకొని నడుము వాల్చింది. ఆమె కళ్ళల్లో పెళ్ళిపందిరి – దాని మధ్య కొబ్బరాకుల కళ్యాణ మండపము - పూల తెరలు దీపమాలికలు – మంటపంలో తన గారాబు కూతురు ముక్త - పదిహేను వేలు పెట్టి కొనుక్కున్న చైతన్య - తలంబ్రాలు పోసుకుని – పసుపు అలుముకున్న తల వెంట్రుకలను దులుపుకుంటూ పూలహారాలతో మెడలు వంగిపోతుండగా చిరునవ్వులు చిందిస్తూ ఓరచూపులు చూసుకుంటున్నారు. వచ్చిన జనమంతా బహుమతులు రాసులు పోస్తున్నారు. ఆహా! ఏం పెళ్ళి? ఏం వైభవము! వధూవరు లెంత చక్కని వాళ్లు? ఎంత అదృష్టవంతులు? ఈ దృశ్యం గిరగిరా తిరుగుతోంది.

టికెట్లు రిజర్వు చేయించుకొని వచ్చాడు ప్రకాశరావు. కాఫీ, టిఫిన్ కాగానే ఆహ్వాన పత్రికలు ముందేసుకుని కూర్చున్నాడు. లిస్టు ప్రకారం అందరి అడ్ర

సులు కవర్ల మీద రాశాడు. వసుంధర కవర్ల మీద స్టాంపు లంటించి ఒక దానిపైన ఒకటిపేర్చి పెడుతోంది.

"ఏం పిల్లలండీ - కాస్త చిన్న చిన్న పనులకయినా చేతికింద సహాయంగా ఉంటారేమోనంటే ఇద్దరూ ఇద్దరుగానే ఉన్నారు" నడిగింది వసుంధర

"పోనీలే. మనకు మాత్రం పెద్దపెద్ద పనులేం ఉన్నాయి? ఇవి పోస్టుచేస్తే ఈ ఊళ్ళో పనులయిపోయినట్టే. మళ్లీ వచ్చిన తరువాత పదిమందికి పార్టీ" తేల్చేశాడు కలంమూస్తూ ప్రకాశరావు.

ఆ రాత్రి సామాన్లు సర్దింది వసుంధర. తెల్లవారగానే కాఫీ చేసి వంట చేసింది. ప్రకాశరావు ఆఫీసుకు వెళ్ళి వచ్చేస్తానంటూ వెళ్ళాడు. దిలీప్ స్నేహితుడితో చెప్పటానికి వెళ్ళాడు

"పోస్టు!"

వంటయిల్లు కడుగుతున్న వసుంధర చీపురు అక్కడ పడేసి తడిచేతులు కొంగుతో తుడుచుకుంటూ తలుపు తీసి ఉత్తరం అందుకుంది.

ప్రకాశరావు పేరున వచ్చిన ఇన్‌లాండ్ కవరు, వెనక్కు తిప్పి చూసింది. కాబోయే వియ్యంకుడు దగ్గర్నించి వచ్చిన ఉత్తరం. అందరికంటే ముందరే వెళ్ళి కూర్చున్నాడేమో తిరుపతిలో? తండ్రీ కొడుకుల కింత ఆత్రమేమిటి? నవ్వుకుంటూ కవరు విప్పి గబ గబా చదివింది వసుంధర.

ఆమె కళ్లు చీకట్లు కమ్మాయి. ఆ మేడంతా గిర్రు గిర్రున తిరుగుతున్నట్లనిపిస్తోంది గడప కవతల ఒకకాలు - ఇవతల ఒకకాలు పెట్టింది. పెట్టినట్లే కూలబడిపోయింది.

అంతా రెడీ అంతా రెడీ అనుకుంటూ ప్రకాశరావు గబగబా మెట్లెక్కి పైకి వచ్చాడు. వసుంధరను చూడగానే నిర్విణ్ణుడయిపోయాడు. ఫిట్‌గాని వచ్చిందా? అదుర్దాతో ఆమెను లేవనెత్తుతుంటే ఒడిలోనుంచి ఉత్తరం జారిపడ్డది.

విప్పి చదువుకున్నాడు. కళ్ళు మూసుకుని గోడకు తల ఆనించాడు. అంతా వ్యర్థమైపోయింది. పరువూ - ప్రతిష్ఠా - డబ్బూ - శ్రమా అంతా బూడిదలోపోసిన పన్నీరయి పోయింది. రేపు అందరి ముందరా తల ఎత్తుకుని తిరగట మెట్లా?

మళ్ళా మోతీకి ఇంకో సంబంధం కుదురుతుందా? ఎవరు పుట్టించారీ వా ర్త? వాళ్ళకు ఎవరు చేరవేశారు?

ఆయనకు తలంతా దిమ్మెక్కిపోతోంది.

ఏదో పాట పాడుతూ ఒక్కొక్క మెట్టే ఎక్కి వచ్చాడు దిలీప్. తల్లీ తండ్రీ తననీపాటికి ఎంతో తిట్టుకుని ఉంటారు. నిజంగానే తను ఏ మాత్రం వాళ్ళకు పెళ్ళి పనులలో సహాయం చెయ్యలేదు డాక్టరు చైతన్య అంటే మొదటి చూపులోనే తన కెంతో గౌరవం కలిగింది. ఈ అల్లరిమోతీయే. అతడికి తగిన పిల్ల కాదనుకున్నాడు. పెళ్ళి కాగానే అల్లరంతా పోతుందని అమ్మ చెప్పింది. పెళ్ళంటే తనక్కూడా చాలా సరదాగా సంతోషంగా ఉంది. కాలు నేల మీద ఆనటం లేదు. తను ఫైనలియరు ఎం. ఇ. పరీక్ష రాయకుండానే తుంబాలో ఉద్యోగం వచ్చింది. పరీక్ష రాసి రమ్మన్నారు. ఓహ్ గాలిలో ఎగిరి పోతోంది మనసు.

పై మెట్టెక్కి ఇంత నిశ్శబ్దంగా ఉందేమిటి ఇల్లు? నాన్నగారింకా రాలేదా? అమ్మయినా చప్పుడు చేయకుండా ఉందే? లోపలికి వచ్చి తల్లీదండ్రిని చూసి విభ్రాంతపోయాడు. 'నాన్నగారూ! నాన్నగారూ!' అంటూ ఆయన చేతిలో ఉన్న ఉత్తరం తీసుకొని చదివాడు దిలీప్.

ఒళ్ళంతా చమట పట్టింది. కోపంతో ముఖమంతా ఎర్రబడ్డది. పిడికిళ్లు బిగుసుకున్నాయి.

తన కాలేజీలో శుభలేఖలు పంచాడు. స్నేహితులు పార్టీకి తప్పకుండా వస్తానన్నారు. అప్పుడే తన కాబోయే వధువు సోనీని అందరికీ పరిచయం చేద్దామనుకున్నాడు.

ఎంతటి అవమానం! తను తలెత్తుకుని తిరగగలడా ఇంక?

''ఈ రాక్షసిని – ఈ కులటను వాకిట్లోనే గొంతు నులిమేస్తాను. ఇంటికి రానివ్వను. కళంకిని ఈ యింట్లో అడుగుపెట్టటానికి వీలులేదు.''

గబగబా మెట్లుదిగి గడపలో నిలబడి మోతీ వస్తుందేమోనని ఎదురు చూ స్తున్నాడు దిలీప్.

సాయంకాలము ఆరున్నర అయ్యేసరికి సన్నటి ఆకారం సందు మొదట్లో నుంచి నడుస్తూ వస్తున్నట్లు కనబడ్డది. దిలీపుకు రాగానే గొంతు పిసకటానికి సిద్ధంగా ఉన్నాడు.

ఒయ్యారంగా నడుస్తూ - చేతి బ్యాగ్ ఊపుకుంటూ చిరునవ్వులు చిందిస్తూ మధ్య మధ్య కూనిరాగాలు తీస్తూ గడపలో అడుగు పెట్టబోయిన మోతీ కెవ్వున అరిచింది.

జుట్టు పట్టుకుని పైకి లాక్కుపోయి తల్లీ దండ్రీ ముందరికి ఒక్క తోపు తోశాడు మోతీని దిలీప్.

''అమ్మా నాన్నగారికి జవాబు చెప్పు'' హుంకరించాడు.

మోతీ దిగ్భ్రాంతురాలయింది. దిలీప్ వంక జూచింది. నిప్పులు గ్రక్కుతున్నాడు. తల్లిదండ్రులు నీరు కారిపోతున్నారు.

ఏమయింది ? ఎవరి నడగాలి ? ఎవరు జవాబు చెప్తారు ?

ఆ రాత్రి ఎవరూ పెదవులు కదలించలేదు.

భోజనాలకు లేవలేదు.

ఈ భయంకరమైన నిశ్శబ్దాన్ని భరించలేక పోతోంది మోతీ. కదిలితే ప్రాణం తీసేటట్టున్నాడు దిలీప్.

మెల్లగా లేచింది. కాళ్ళీడ్చుకుంటూ గదిలోకి తెల్ల బ్యాగ్ ఒక మూలకు విసిరేసింది. బాల్కనీలోకి వచ్చి ఇటూ అటూ చూసింది. సోనీ యింట్లో ఎవరూ లేనట్టున్నారు దీపం వెలగటం లేదు.

అన్నట్లు దిలీప్ తన వెనకే రాలేదేం గొంతు పిసకటానికి ?

మనసు బితుకు బితుకు మంటోంది.

ఒక పక్క ఆకలేస్తోంది. ఎప్పుడో భోజనం చేసింది. కాఫీ టిఫిన్ లేదు. రాగానే అమ్మ పిలిచి పెడుతుందనుకుంది. తనకు అర్థంకాని భయంకర నిశ్శబ్దము. అన్న దిలీప్ భీకర స్వరూపము. ఒళ్ళు జలదరిస్తోంది.

అమ్మ లేచి వంట చెయ్యదా ?

ఈ రాత్రికి భోజనాలు ఉండవా ?

తానాగలేదు. కనీసం ఒక కప్పు కాఫీ అయినా తాగాలి.

గబగబా టెరీన్‌చీరె మార్చి నూలు చీరె కట్టుకుని నాలుగు కప్పుల కాఫీ చేసింది. కప్పుల్లో పోసి ట్రేలో పెట్టుకుని హాల్లోకి వచ్చి "నా ప్రాణం పోతోంది ముందు కాఫీ తాగుదాం రండి. కాఫీలయిన తరువాత ఈ భయంకర నిశ్శబ్దానికి కారణం చెప్పండి. దిలీప్‌కు ఎందుకింత కోపం నా మీద? ఆ సంగతి నాకు చెప్పాలి? ఊc తీసుకోండి."

తల్లీ తండ్రీ మాట్లాడలేదు. తండ్రి ఆమె ముఖంలోకి చూశాడు. తల్లి తల వంచుకుని కన్నీళ్ళు కారుస్తోంది.

"నీ చేతి కాఫీ ఎవడిక్కావాలే పాతకీ !" గర్జించాడు దిలీప్.

కాళ్ళు వణకుతున్నాయి మోతీకి. ఎక్కడలేని ధైర్యం తెచ్చుకుంది. దగ్గరలో ఉన్న కుర్చీ లాక్కుని కూర్చుంది. ఒక కప్పు చేతిలోకి తీసుకుని ట్రే బల్ల మీద పెట్టింది. తను కాఫీ తాగింది. కాస్త ఓపిక వచ్చినట్లయింది.

"దిలీప్ ఇప్పుడు చెప్పు. ఏమిటి నేను చేసిన పాతకం? నేను చిన్నపిల్లను కాను-నీవు నోటికి వచ్చినట్లుగా మాట్లాడితే పడటానికి. పద్దెనిమిదేళ్ళ చదువుకున్న అమ్మాయితో మాట్లాడుతున్నావని గ్రహించుకుని మాట్లాడు. చెప్పు" కోపావేశంతో మాట్లాడుతోంది మోతీ.

"నీ చేతలకు జవాబులు కోరుతున్నావా? అయితే విను చెబుతా.చెమటోడ్చి సంపాదించిన డబ్బంతా ఖర్చుపెట్టి నీకు పెళ్ళి చేద్దామని అన్ని ఏర్పాట్లు చేశారు నాన్నగారూ అమ్మా. శుభలేఖలు అచ్చయ్యాయి ఇవాళ్టికి సరిగ్గా నాలుగు రోజు లుంది పెళ్ళి. నీ కాబోయే మామగారు నీ ప్రవర్తన మంచిదికాదని తెలిసిందంటూ ఉత్తరం రాశారు. వీళ్ళిద్దరికీ ప్రేతముఖాలు పడ్డాయి. ఈ అనర్థాని కంతకూ నీవే కారణం. ఈ కొంప ఆర్పేశావు. ఈ జన్మకు వాళ్ళ సంతోషాన్ని చంపేశావు. ఇంక తలెత్తుకుని తిరగలేరు" ప్రళయకాల రుద్రరూపం దాల్చాడు దిలీప్.

"వాళ్ళకెవరు చెప్పారట?" బావిలోనుంచి వచ్చినట్టుం దామాట మోతీకి.

"ఎవరయినా చెప్తారు. నీవు బాల్కనీలో నిలబడి దారినపోయేవాళ్ళను కూడా పిలుస్తూ ఉంటావట! బజారు మనిషికంటే అన్యాయంగా ఉందన్న కబురు వాళ్ళకు చేరింది."

మేడకూలి తను కుర్చీతో కూడా పాతాళానికి వెళ్ళుతున్నట్టుగా ఉంది మోతీకి.

దీనికి జవాబేం ఉంది తన దగ్గర? అసలు రంగులేని వస్తువును పట్టుకుని ఇది తెలుపు కాదు నలుపని నిర్ధారణ చేస్తుంటే తనేమని చెప్పగలుగుతుంది?

అయినా ఆఖరి ప్రయత్నంగా గబగబా క్రిందికి వెళ్ళి డాక్టరు చైతన్య ఉంటున్న పోస్టు గ్రాడ్యుయేటు క్వార్టర్సుకు టెలిఫోను చేసింది.

"హలో....డాక్టర్ చైతన్యా!"

"అవును. ఎవరు మోతీ?"

"అర్జంటుగా నీ వొకసారి ఇంటికి రావాలి"

"ఎందుకు?"

"అర్జంటు. వస్తే చెబుతా"

"ఇప్పుడు తీరికలేదు"

"నీకెందుకు తీరికలేదో నాకు తెలుసు. పెళ్ళి చేసుకోమని ప్రాధేయపడ టానికి పిలవడంలేదు. నీతో ఒక్కమాట చెప్పాలి. అందుకని అర్జంటుగా బయలు దేరిరా. వీలయితే నీ ఫ్రెండు స్కూటరు మీద బయలుదేరు. నీవు వచ్చే వరకూ ఇంట్లో ఎవరూ పచ్చి మంచినీళ్ళయినా తాగరట."

"సరేలే"

పైకి వచ్చింది. బాల్కనీలో ఒక చాప వేసుకొని గోడ కానుకుని కూర్చుంది. సప్తమి చంద్రుడు తెలిమబ్బుల చాటుకు వస్తూ పోతూ దాగుడుమూత లాట ఆడుతున్నాడు. మోతీ మెటానికల్ గార్డెను నుంచి తెచ్చిన చెట్లు-వాటి పూలూ-కుండీలు మార్చి మార్చి చూసుకుంటోంది.

చైనా రోజ్-రెండు మొగ్గలూ ఒక పూవు

నందివర్ధని - చెట్టునిండా మొగ్గలూ రెండంటే రెండే పువ్వులు-బాగా వికసించి ఉన్నాయి.

తంగేడు చెట్టు-చెట్టంతా పూచిన తంగేడు

మందార-ముద్ద మందారపూలు ఎర్రటి గోళంలా ఉన్నాయి నాలుగు మొగ్గలు.

జూకా మందార-పువ్వులో నుంచి జూకా బయటికి వచ్చి గాలికి ఊగు తున్నది అతిశయంతో.

బోగన్‌విల్లా డబుల్ కలర్ తెలుపు-ఎరుపూ. కాగితం పూలలా ఉన్నా ఎంత అందంగా ఉన్నాయి? కాని ముళ్ళు గుచ్చుకుంటాయి ముట్టుకోగానే.

చేతులు చాచి పిలుస్తోంది 'కిస్ మీ క్విక్' మొక్క. కొమ్మనిండా ముళ్ళు. చిన్న చిన్న ఆకులు నాలుగు రేకుల ఎర్రటి పూలు. కిస్ మీ క్విక్ అందరినీ రమ్మని చేతులు చాచి పిలిచినట్లుగా కొమ్మలు విడివిడిగా నిటారుగా నిలబడి ఉంటాయి. దగ్గరికిపోతే ముళ్ళు కసుక్కున గుచ్చుకుంటాయి.

ఈ చెట్టు మీద ఆమె దృష్టి నిలిచిపోయింది. ఈ చెట్టూ ఈ చేతులు చాచి నట్టుగా ఉన్న కొమ్మలూ-చిన్న చిన్న ఎర్రటి పూలూ - కసుక్కున గుచ్చుకునే ముళ్ళూ అంటే మోతీ కెంతో ఇష్టము

"ఓ కిస్ మీ క్విక్-హౌ బ్యూటిఫుల్ యూ ఆర్? ఓ కిస్ మీ క్విక్!" దానితో రాగం కట్టి సన్నగా పాడుకుంటోంది మోతీ సంభ్రమంగా.

స్కూటర్ నాలుగిళ్ళ అవతల ఆపి-మెల్లగా అడుగులు వేసుకుంటూ వస్తున్నాడు చైతన్య. గేటు ముందరికి వచ్చేటప్పటికి సన్నటిరాగం వినిపించింది కుతూహలం కొద్ది ఆలకించసాగాడు.

"హౌ బ్యూటిఫుల్ యూ ఆర్? కిస్ మీ క్విక్?" తన స్నేహితుడు చెప్పినదానిని తను ప్రత్యక్షంగా వింటున్నాడు ఇప్పుడు డాక్టరు చైతన్య. నయం. అతడి మాటలు అబద్ధాలని కొట్టి పారెయ్యలేదు!

అడుగు ముందుకు పడటంలేదు. ఒక నిమిషంసేపు ఆలోచన తెగక నిలబడిపోయాడు. మళ్ళీ అంతలోనే తెగింపు. చేసిన పనిని తను సమర్థించుకో లేడా? తన నిర్ణయం సహేతుకమయినది కాదా? నాలుగు మాటలూ ముఖాన అడిగితే? గబగబా మెట్లెక్కి పైకి వచ్చి బజర్ నొక్కాడు. తలుపు తీసిన దిలీప్ లోపలికి రండి' అన్నాడు పది లంఖణాలు చేసిన వాడిలాగ.

సావడిలోకి అడుగుపెట్టగానే ప్రకాశరావు వసుంధర దీనంగా ముఖాలు పెట్టుకుని గోడకు చేరగిలబడి ఉండటం చూశాడు.

'ఇదంతా నాన్నగారి ఉత్తరం యొక్క పరిణామము కాబోలు!''

సావడిదాటి గదిలోకి రాగానే పాట స్పష్టంగా వినిపిస్తోంది.

''హౌ బ్యూటీఫుల్ యూ ఆర్ కిస్ మీ క్విక్ ?''

''నన్ను రమ్మని పిలిచి కూడా ఇలా అందరినీ పిలుస్తోందే? ఎంత సిగ్గుమాలి నది?'' కనుబొమలు ముడుచుకుని అసహ్యకరమైనదేదో చూసినట్లుగా ముఖం పెట్టి బాల్కానీలో అడుగుపెట్టాడు డాక్టరు చైతన్య.

వరసగా చెట్ల కుండీలు పెట్టి ఉన్నాయి. అతడు బియస్సీలో బాటనీలోనే బాగా మార్కులు తెచ్చుకున్నాడు. చెట్లను చూసి గుర్తుపట్టగలడు. ఒక్కొక్క దానిమీద దృష్టి నిలిపి చూస్తున్నాడు.

చివరగా ఉన్న కిస్ మీ క్విక్ చెట్టు ఉన్న కుండీ చుట్టూ చేతులువేసి తల వంచుకుని రాగం తీస్తోంది మోతీ.

చూసీ చూడగానే డాక్టర్ చైతన్యకంతా అర్థమైపోయింది. మోతీ! మోతీ! అంటూ ఆమెను లేవనెత్తి గుండెకు హత్తుకున్నాడు ఎదురుగా దిలీప్ ఉన్నాడనైనా బిడియపడకుండా.

(అనామిక ప్రత్యేక సంచిక)



# ప్రణయ లేఖలు

హుసేన్‌సాగర్‌లో చొచ్చుకుపోయిన బోట్ క్లబ్బు వరండాలో పండు వెన్నెలలో కూర్చుని నీటి అలలపైన సుధాకరుడు ఒయ్యారంగా ప్రతిబింబిస్తూ పయనిస్తుండగా చూస్తుంటే ఎటువంటి వాళ్ళకయినా కవిత్వం పుట్టుకొస్తుంది. అలా కవిత్వం చెప్పలేని ముగ్గురు మిత్రులకు భావోద్వేగం బుస్సున పొంగుకుంటూ పైకి లేచింది వెన్నెలరేడును చూడగానే.

రాత్రి ఏడు గంటల సమయం చల్లగా-మెల్లగా నీటిమీది నుంచి గాలి వీస్తోంది. రేరాజు తన నిండు బింబాన్ని మహా ఠీవిగా పోనిస్తున్నాడు - తెలి మబ్బులలో నుంచి హుసేన్‌సాగర్ రైలు కట్టదగ్గర బారులు తీర్చిన విద్యుద్దీపాలు మణిహారంలా మెరిసిపోతూ తమ నీడలను నీటిలో చూచుకుంటూ మురిసిపోతున్నాయి. ఆ రసమయ ప్రకృతికి ముగ్ధులైన ఆ ముగ్గురు మిత్రులూ పరవశించిన హృదయాలతో ఒకరి కొకరు ఏదో చెప్పుకుని తమ విస్మయానందాలతో భాగం పంచుకోవాలని ఉబలాటపడిపోతున్నారు

ఆ ముగ్గురిలో ప్రిన్సిపాల్ నరహరి పారవశ్యంతో కళ్ళు మూసుకుని "జీవితంలో అత్యంత మధురమైన కాలాన్ని తలుచుకుంటే ఆకలిదప్పులు ఉండవు సుమా!" అన్నాడు.

"ఆ కాలాన్ని తలుచుకుంటూ దారిద్ర్యాన్నిబాధలనూ దాటుకుంటూపోవచ్చు" అన్నాడు డాక్టర్ పరమేశం.

"పీక్కుతీనే రోగాలతో తీసుకుంటున్నా ఆ మధుర క్షణాలను తలుచుకుంటూ హాయిగా కాలం గడపవచ్చు" అన్నాడు జడ్జీ శివరావ్.

ముగ్గురూ ఎవరికివారే పరవశించి పోతున్నారు. వాళ్ళ మధ్య అరగంటసేపు నిశ్శబ్దము తారట్లాడింది.

"మీ జీవితంలో అత్యంత మధురమైన కాలం చాలా ఉజ్వలంగా ఉండే దేమో కదూ నరహరీ" అన్నాడు డాక్టరు పరమేశం కళ్ళు సన్నగా చీలికలు చేసుకుని చూస్తూ.

ముగ్గురూ ఉద్యోగ విరమణ చేసిన ఉన్నతోద్యోగులు. సాయంకాలపు వేళల్లో చేతిలో కర్రలు పట్టుకుని హుస్సేన్‌సాగర్ దగ్గిరికి వస్తారు. బోట్ క్లబ్బు సభ్యులు కనుక క్లబ్బు వరండాలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటారు. మొదట "ఏమండీ"తో ప్రారంభమయిన స్నేహము "నీవు" క్రిందికి దిగింది. రెండు వారాలకే.

"నా జీవితంలోనా? అయ్యోపరమేశం? అంతటి అదృష్టం లేదయ్యా బాబూ నాకు!" బీద అరుపు అరిచాడు నరహరి.

"అదేమిటి? జీవితంలో లేకపోతే తలుచుకోవటం ఎలా సంభవం? దాన్ని తలుచుకుంటూ ఆకలిదప్పులు మరవటం ఎలా?" అంటూ నోరు తెరిచాడు పరమేశం.

"ఎలాగా? మొదట నౌకరుచేత ఒక సిగరెట్ ప్యాకెట్ తెప్పించు" అన్నాడు నరహరి ఆజ్ఞాపిస్తున్నట్లుగా బోట్ క్లబ్బులో మెంబర్లవాలని సరదాపడ్డారు గాని ఆ ముగ్గురికీ పాపం సారా నిషేధం ముట్టుకోవడానికి డాక్టరు పర్మిషన్‌లేదు. అందుకని కోకాకోలా తెప్పించుకుని సరదా తీర్చుకుంటారు. ఒక్కొక్కసారి సిగరెట్లతోనే సంతృప్తిపడుతూ కబుర్లు చెప్పుకుంటారు.

డాక్టరు పరమేశం కేకవెయ్యగానే ముగ్గురికీ మూడు ప్యాకెట్లు తెచ్చి యిచ్చాడు నౌకరు

నరహరి ఏం చెబుతాడో ననుకుంటూ ఆయన ముఖంలోకి చూస్తున్నారు పరమేశం శివరావులు.

నరహరి ప్రిన్సిపల్‌గా హైదరాబాదుకు బదిలీ అవగానే హోటల్ ప్రకాశ్‌లో దిగి చార్జి తీసుకున్నాడు. తనకొక మంచి ఇల్లు చూచి పెట్టమని అసిస్టెంట్లకు ఆనాడే చెప్పాడు. ఆ యిల్లు విడిగా స్వతంత్రంగా ఉండాలిగాని ఓభాగంగా ఉండకూడదని షరతుపెట్టాడు. ఆది కూడా కాలేజికి దగ్గరగా వుంటే బాగుంటుందన్న సూచన చేశాడు.

వారం-పదిరోజులు గడుస్తున్నాయికాని నరహరి కోరిన విధంగా-ఇస్తానన్న అద్దెలో ఇల్లు కుదరలేదు. ప్రతిరోజూ అసిస్టెంట్లతో ఒక గంటసేపు ఇంటిని గురించి చర్చలు చేసేవాడు. ఇల్లు కుదరలేదు. హోటల్లో రోజుకు పదిహేను రూపాయలు-ఇవికాక భోజనాదులకు ప్రత్యేకంగా ఛార్జీలు.

పదిహేను రోజులు చూసిన తరువాత ఒకనాడు "ఏదో ఒక ఇల్లు కుదర్చండి త్వరగా. నాకు మా ఆవిడ రోజు కొక ఉత్తరం వ్రాస్తూంది. ఇంకో నాలుగు రోజులు చూసి హోటల్ గదికే వచ్చేస్తుంది" అంటూ తన పట్టును కాస్త సడలించు కున్నాడు నరహరి. వెంటనే కాలేజీకి దగ్గరగా ఒక భాగం-మూడు గదులూ బాత్ రూం గల ఇంటిని ఇంగ్లీషు లెక్చరరూ కెమిస్ట్రి లెక్చరరూ కుదిర్చి నూట డెభ్భై ఐదు రూపాయలు ఎడ్వాన్సు ఇచ్చి తాళం వేసుకు వచ్చారు.

విధిలేక ఒప్పుకున్నట్టు తల ఆడిస్తూ ప్రిన్సిపల్ నరహరి ఆ యింట్లో సాయంకాలము ఆరుగంటలకు ప్రవేశించాడు. ముందు గది విశాలంగానే ఉంది దానికి పెద్ద పెద్ద కిటికీలు రెండున్నాయి. ఒక గోడ అల్మెరా ఉంది. గదిశుభ్రంగా రంగువేసి ఉన్నది. రెండు వైపులా దీపాలు మధ్య ఫాను పెట్టుకోవడానికి ఏర్పాట్లూ ఉన్నాయి. రెండవ గదిలో ఒక్కటే కిటికీ ఉన్నది. దాని పక్కగా బట్టలు పెట్టుకోవటానికీ కోట్లూ ప్యాంట్లూ తగిలించుకోవటానికి తగిన ఏర్పాట్లు వున్నాయి. చెప్పులూ బూట్లూ క్రిందపెట్టుకోవచ్చు. ఆ అల్మెరాకు తలుపులున్నాయి తాళం వేసుకోవచ్చు.

మూడవగది అంటే వంటకూ సామానుకూ కలిసి ఒకటే గది. వంట యింటి ఏర్పాట్లు అన్నీ చూసి నీళ్ళ గదిలోకి తొంగిచూసి మళ్ళా రెండవ గదిలోకి వచ్చి నిలబడ్డాడు నరహరి.

ఇల్లు చిన్నదయినా-ఒక భాగమయినా-అందంగా ఉంది. తన భార్యకు నచ్చి తీరుతుందనుకున్నాడు నరహరి. అసిస్టెంట్లు ఇల్లంతా శుభ్రం చేయించారు. ఇంక సామాను సర్దుకోవటమే ననుకుంటూ ఆ సమీపంలోఉన్న హోటల్‌నుంచి భోజనం తెప్పించుకున్నాడు. పక్క పరచుకొని భోజనానంతరం ఒక సిగరెట్టు వెలిగించి పెట్టెలో ఉన్న బట్టలు అల్మెరాలో పెట్టాలని తలుపుతెరచి కొన్నిబట్టలుతగిలించాడు- షర్టు ధోవతులూ మడతలుచేసి పెడుతుండగా వేలికి చురుక్కుమన్నట్లయింది. అసలే

నరహరికి డయబిటిస్. ఏ మాత్రం దెబ్బ తగిలినా సెప్టిక్ అయిపోతుంది. చెయ్యి మరుక్కుమనగానే టార్చివేసి చూశాడు. అదొక చిన్న అర. దానికొక గొళ్లెం ఎంతో పరీక్షగా ఒంగి చూస్తేగాని కనబడదు.

అది డబ్బుగాని నగలుగాని దాచుకునే అరకాబోలనుకున్నాడు. అంతటితో కుతూహలం ఆగక లోపలికి చెయ్యిపెట్టి చూశాడు. చేతికేమయినా తగులుతాయేమోనని. ఒక కవరు చేతికి తగిలింది. అయ్యో! పాపం! ఎవరో-అదివరకూ ఉన్నవాళ్ళు మరచిపోయి ఉంటారు. డబ్బుగాని-డిపాజిట్లుగాని ఏదయినా సరే ఎడ్రసు కనుక్కుని వాళ్ళకందజేయాలని నిశ్చయించుకున్నాడు.

ఆ కవరులో తప్పకుండా ఎడ్రసు ఉండే ఉంటుందనుకుని తెరిచిచూశాడు. చిన్నవీ పెద్దవి కాగితపు మడతలు. అవన్నీ తీసి చూస్తే తప్పకుండా ఎడ్రసు దొరుకుతుంది. పంపితే వాళ్ళెంతో సంతోషిస్తారు అనుకుని కాగితాలు పైకి తీశాడు.

అక్షరాల వెంట కళ్లు పరుగెత్తుతుంటే అతడి కళ్ళు చేరెడయ్యాయి. కనుబొమలు పైకి లేచాయి. ఒంటినిండా విద్యుత్తు ప్రవహించినట్లయింది.

ఓ! ఇవి ప్రణయలేఖలు. పాపం! ఎవరికి ఎవరు రాశారో!

ప్రణయ లేఖలను కోగానే అతడి ఒళ్ళు జలదరించింది. అవును, అతడికి అవి కొత్త. కాలేజిలో చదువుకునే రోజుల్లో ఆడపిల్లలెవరికీ రాయలేదు. ఇతరత్రా అమ్మాయి లెవరూ లేరు. అలాంటి ఉత్తరాలు రాయటానికి. ఇంకపోతే భార్యామణి, ఆమే మేనమామ కూతురు. ఉత్తరాలు రాయవలసిన అవసరం రాలేదు. ఇల్లరికపుటల్లుడు అదీగాక నరహరి భార్య విశాలాక్షమ్మకు మనసులో ఉన్నది బైటపడితే విలువ తగ్గిపోతుందనే రకం మనిషి. ఆమెకు ప్రణయమన్నా ప్రేమన్నా అట్టే నమ్మకంలేదు.

మళ్ళా ఉత్తరం తెరచి చూశాడు. ఆ సంబోధనే హృదయాన్ని గిలిగింతలు పెడుతోంది.

ఇట్లా రాసుకుంటారా ప్రణయ లేఖలు!

"మనకు రెండు సంవత్సరాలూ రెండు నిమిషాలలా గడిచిపోయాయి. అవి ఈ లోకపు రోజులుకావు సురేష్! ఇవి దేవేంద్ర లోకంలో గడిచిన రోజులు.

నీకూ నాకూ రాత్రికీ పగటికీ భేదం తెలియని రోజులు. నిజంగా మన్ని చూసి ఎవరికో కన్ను కుట్టింది. అందుకే నిన్ను కదిలించలేక—నన్ను ట్రాన్స్ఫరు చేశారు. అంతటితో మన ప్రేమను నశింపచేయగలిగామనుకున్నారు. ఇక్కడ నా ఉద్యోగం బాగా జరిగిపోతోంది. నీవు ఏదో ఒక వంక పెట్టుకుని వస్తూ ఉండు సురేష్. అన్నట్టు చెప్పటం మరిచిపోయాను. నీవు దూరంగా ఉన్నాననుకుంటు న్నావుగాని నా దగ్గరే ఉన్నావు. నాలో ఉన్నావు. నా గర్భంలో పెరుగుతున్నావు. నిజంగా నీవు ఇవాళ నా ఎదురుగుండా ఉంటే ఈ శుభవార్తను నీ కెట్లా అందించే దాన్నో! నీవు విని ఎట్లా సంతోషపడేవాడివో? ఊహామాత్రాన నా మనసు ఏదో ఏదో అయిపోతున్నది. ఏం చేస్తాం? తప్పదు. నీవొకచోట నేనొకచోట."

కళ్ళు విప్పుకుని చివర నున్న సంతకం చదివాడు. సరళ!

బరువుగా నిట్టూర్చాడు.

రెండో ఉత్తరం విప్పాడు.

"అబ్బబ్బ! సురేష్, ఉత్తరాలెందుకు ఇలా ఆలస్యంగా రాస్తున్నావు? మొన్నటి నా ఉత్తరానికి ఏదీ జవాబు? నే నెంతో సంతోషిస్తావని శుభవార్త రాస్తే నీ దగ్గర నుంచి ఉత్తరమే లేదే! బహుశః పనిలో మునిగిపోయి ఉన్నా వేమో! పాపం, నిన్ను అన్యాయంగా మాటలనటం నాకో అలవాటు. ఆ అల వాటును మానేయాలనుకుంటాను. కాని చేతకావటంలేదు. మొదట ఏదో పది మాట లంటాను. తరువాత పశ్చాత్తాపంతో నన్ను నేనే తిట్టుకుంటాను."

మరొక ఉత్తరం తీశాడు నరహరి.

"అబ్బబ్బ! సురేష్. ఎప్పుడు చూసినా పని-పని-అంటావు. నీవు సెలవు పెట్టి రావటం ఏమయింది? ఇప్పుడు ఒక్కసారి నన్ను చూడాలనిపించటం లేదా? ఏమిటో నీవు వస్తే ఎన్నో సంగతులు చెప్పాలనీ ముందు సంగతులెన్నో మాట్లా డాలనీ నా మనసు గంతులు వేస్తున్నది. ఒక్కసారి రా సురేష్. సెలవుపెట్టు. ఏదో వంకపెట్టి వచ్చెయ్యి."

నరహరి మనసు కరిగిపోయింది. పాపం! ఆవిడి తన తొలి గర్భాన్ని గురించి అతడికి ఎంత ప్రేమతో చెప్పాలనుకుందో? దానికి అతడెంద మురిపెంగా

జవాబిచ్చాడో? నరహరి ఒళ్లు గగుర్పొడిచింది తనకే మరిపాలూలేవు. ఉత్తరాలూ లేవు ఏదో గుడ్డెద్దు చేలో పడ్డట్టు జీవితం సాగిపోతోంది.

"సురేష్! ఈ సెలవుల్లో కూడా రాలేదు కదూ? నీవు మనసు మార్చుకుంటావేమోనని భయంగా వుంది. నీవు మారిపోతున్నట్లు నాకనుమానంగా ఉంది. ఇదంతా ఎందుకు? రిజిస్టర్ మ్యారేజి ఇప్పుడయినా చేసుకుందాము పద. ఏమిటో—ఇంతకాలం అనిపించలేదు కాని-ఇప్పుడేమనిపిస్తోందంటే మన ఇద్దరి కలయికా చట్టబద్ధంగా ఉండాలని. అంతకు ముందు ఎవరేమనుకుంటే మనకేమనుకున్నాను. కాని-నీ రూపం నాలో పెరుగుతున్న కొద్దీ అందరూ మన కలయికను గుర్తించాలనిపిస్తోంది. మనంపడ్డ సంతోషం అందరూ పడితేగాని మనసుకు సంతోషం ఉండదేమోననిపిస్తోంది. అన్నట్టు సురేష్! నీకు వస్తుందనుకున్న ప్రమోషన్ వచ్చిందా? నాకొచ్చింది. నీవడిగితేగాని చెప్పకూడదనుకుంటాను కాని నీలాగు నిబ్బరం లేదు నాకు. నీకు చెప్పేవరకూ నా మనసాగదు.

ఓహో! ఇది ప్రణయమే - పెళ్ళికాని ప్రణయం! అయితే, పెళ్ళి అయితే ప్రణయముండదా? ప్రేమగా మారుతుందా? ప్రణయానికి, ప్రేమకూ ఏమైనా తేడా ఉన్నదా? తల చేత్తో తడిమి చూసుకున్నాడు నరహరి

"సురేష్! నీవు నా మనసుకు మకుటంలేని రాజువు. ఎంత చదువుకున్నా-ఉద్యోగం చేస్తున్నా నిన్నుచూడగానే నీలో ఇమిడిపోయే మనస్తత్వమేమిటి నాకు? అంత ఒళ్ళు తెలియకపోవట మేమిటి? నీతో ఏదో ఏదో లోకాలకు రెక్కలు కట్టుకుని ఎగిరిపోవాలనుంటుంది ఎప్పుడూ! మొట్టమొదట మనిద్దరికీ పరిచయమైన ఆ మామిడిచెట్టు నీడను చూస్తే ఇప్పటికీ నామనసెంతో పొంగులువారుతూ ఉంటుంది. జీవితంలో ఎవరైనా చీకట్లు ఉన్నాయని తలుచుకుంటూ దుఃఖిస్తుంటే నాకు నవ్వు వస్తుంది. ప్రేమ అనే వెలుగుచూడని అంధులన్నమాట వాళ్ళు. సురేష్! ఈ ప్రేమ జలధికి అంచులున్న యంటావా? లోతు నెవరయినా కొలవగలరంటావా? అసలు కొలత బద్దనేది ఉంటుందంటావా? ఈ జలధిని చూస్తూ విస్మయ పడటం తప్ప నాకు మరొకటి తోచటం లేదు సుమా!"

నరహరి అన్ని ఉత్తరాలూ ఒక్కరోజే చదివి హరించుకోలేననుకున్నాడు. యధా ప్రకారం ఉత్తరాలన్నీ మడచి ఆ కవరులో పెట్టేసి అల్మేరా రహస్య స్థలంలో వాటిని భద్రపరచి తాళం వేశాడు.

పక్కమీదికి ఒరిగాడన్నమాటేగాని కంటిమీదికి నిద్రరాలేదు. ఒక రాత్రి లేచి హీటర్‌మీద నీళ్ళు కాగపెట్టుకుని హార్లిక్సు కలుపుకుని తాగాడు. రెండు సిగ రెట్లు పీల్చేడు. లేచి మిగిలిన బట్టలన్నీ చక్కగా సర్దుకుని మళ్ళీ ఉత్తరాలకట్ట చేతిలోకి తీసుకున్నాడు.

సురేష్! రాత్రి నిద్రపట్టక ఒక నవల చేతిలోకి తీసుకున్నాడు కథానాయ కుడు పదకొండు మంది పిల్లల తండ్రి. ఉద్యోగరీత్యా ఒక డాక్ బంగళాలో క్యాంపు వేసుకి దిగాడు. పక్కగదిలో ఒక గాయని దిగింది. ఇద్దరూ మెట్లమీద కలుసు కుంటారు ఒక సాయంత్రం ఆ చూపులలోనే ప్రణయం ప్రారంభమయింది. పదిహేను రోజు లయినా కథానాయకుడు ఆ ఊరు వచ్చిన పని కాలేదు. ఆమె పాట కచ్చేరీలయిపోయినా అక్కడే ఉండిపోయింది" అంతమంది పిల్లల తండ్రికి ఆ పరాయి పిల్లతో ప్రణయం సాధ్యమా అనుకుంటూ- సాధ్యమే నేమో! ఇద్దరూ కలిసి క్యాంపులు వేసుకుంటూ కాలం గడుపుతున్నారు. చివరకు ఆ కథానాయకుడు ఆపదకొండు మంది పిల్లల తల్లినీ వదిలిపెట్టి ఆ గాయనిని రిజిష్టర్ మేరేజి చేసు కున్నాడు. ఎన్నేళ్ళున్నా మగవాడికి ప్రణయమనగానే చిన్నపిల్లవాడయిపోతాడు కాబోలు. ఎట్లాగయినా ప్రణయం అనేది తెలుసుకుని అనుభవిస్తూ బ్రతకటంలోనూ ఏమీ తెలియకుండా మోడు బ్రతుకుబ్రతకటంలోనూ చాలా తేడా ఉంటుందను కుంటాను. ఏమంటావ్ సురేష్!'' ఎప్పుడూ నీకోసం కలలుకనే

సీ

పరశ

ఎందుకో నరహరికి చురుక్కుమన్నట్లయింది. బరువుగా నిట్టూర్చి ఆ ఉత్తరం మడతవేసి కవరులో పెట్టాడు. అంతలో తెల్లవారింది. కాలేజిప్యూను తలుపుకొట్టాడు. ఇల్లంతా శుభ్రంచేసి కాఫీ టిఫిన్‌కోసం ఫ్లాస్కు టిఫిన్‌కారియరూ తీసుకువెళ్ళాడు.

కాలేజిలో లెక్చెరర్లంతా ఒక మాదిరి మనుష్యులులా ఉన్నారు. పని చెప్పి చెప్పకముందే ఊరికే పొగడ్తలు ప్రారంభిస్తారు. పొగడ్తలతో మెప్పించాలని చూస్తారుగాని-పని చేసి మెప్పించరు. వాళ్ళ విద్యుక్త ధర్మాలను జ్ఞాపకం చేయ టానికి సందు ఇవ్వరు స్టాఫ్ మీటింగుల్లో కూడా ఇంతే. తను ఏదో చెప్పబోయే

అంతలో వాళ్ళు ముందుగానే గ్రహించి అదే సంగతి గురుతర బాధ్యతగా భావించి చెప్పేస్తారు. కళాశాల పరిపాలన అంతా తామే-చూస్తామంటారు "మీకెందుకూ శ్రమ? అంతా మేము చూసుకుంటాం కదా!" అంటారు. వీళ్ళందరినీ ఒక దారికి తీసుకువచ్చి—ఎవరి బాధ్యతలను వాళ్ళకు గుర్తుచేసి కళాశాల వ్యవహారాలను చక్కదిద్దటానికి రెండు నెలలు పట్టింది. అలసిపోయి ఇంటికి వచ్చి భోజనంచేసి పడుకునేవాడు.

అతడు వచ్చిన ఇరవై రోజులకు పిల్లలు వచ్చి స్కూళ్ళల్లో చేరారు. భార్య మాత్రం రాలేదు. అన్నగారింటికి వెళ్ళింది. నిదానంగా వస్తానంటూ ఉత్తరం వ్రాసింది.

ఆనాడు రాత్రి నరహరికి తీరిక చిక్కింది. కళాశాలకు పెద్దలెవరో వచ్చారు. కళాశాలనూ ప్రిన్సిపల్ నరహరినీ స్టాఫ్‌నూ చాలా ప్రశంసించారు. ఉపాహార విందు జరిగింది. చివరకు ఒక గ్రూప్ ఫోటో తీసుకున్నారు. భోజనం చెయ్యగానే తాంబూలంతో పాటు సిగరెట్టు వెలిగించాడు. మళ్ళీ మనసు ప్రణయలేఖల మీదికి వెళ్ళింది. పిల్లలు పడుకునేవరకూ పేపరు చదివి, పక్కమీద నడుంవాల్చి ఉత్తరాల కట్ట అల్మైరాలో నుంచి తీసుకున్నాడు చేతిలోకి.

"సురేష్, నీ రాక మాదిరిగానే నీ ఉత్తరాలు కూడా రాస్తా రాస్తా అంటావు రాయవు వస్తా వస్తా అంటావుగాని రావు. చాలా బిజీగా ఉన్నట్టు పోజులు కొడతావు. ఈ మధ్య ఎవరో అన్నారు. నీవు బదిలీకి ప్రయత్నము చేస్తున్నట్టుగా విన్నాను నిజమేనా? ఆ మాట విన్న తరువాత నా నిరుత్సాహమంతా మటుమాయమయిపోయింది. చురుకుదనం మళ్ళీ తలఎత్తింది. నీవు రాగానే మంచి ఇల్లు తీసుకుందాం ఊరికి దూరంగా, హాయిగా ప్రపంచమంతా మనకోసమే-ఈ ప్రకృతి-లోకంలోని సుఖాలూ, ఆనందాలూ, వినోదాలూ, అన్నీ మనకోసమే అన్నట్టు గడిపేద్దాం. అన్నట్టు సురేష్! నీ కారు బాగా పని చేస్తోందా? వచ్చేటప్పుడు సర్వీస్ చేయించి తీసుకురా. నా మనసుకు నీవు వచ్చినట్టుగానే ఉంది ఇప్పుడే."

నరహరి ఆ ఉత్తరం మడిచి యథా స్థానంలో పెట్టేశాడు. ఎట్లాగయినా ఆడదానికి ఆవేదన ఎక్కువ. ఆడవాళ్ళకు ప్రేమేప్రాణం. కాని మగవాడికి ఎంత

ప్రేమ ఉన్నా ప్రాణం మాత్రం కాదు ఇది పురుషుడిలో ఉన్న లోపం కాదు, ప్రకృతి సిద్ధం అనుకుంటూ మరో ఉత్తరం తీశాడు.

"సురేష్! నీకు ఉత్తరాలు రాసి రాసి చేతులు నొప్పులు పుడుతున్నాయి. నీవు రావటం కాని—నీ ట్రాన్స్ఫరుగాని గగనకుసుమమయిపోయాయి. మొన్ననే డాక్టరు చెప్పింది వచ్చే వారంలో పురుడు రావచ్చునని. ఈ వయసులో కాన్పంటే నాకు పునర్జన్మ అన్నమాట. కాన్పు వచ్చే లోపల నిన్ను చూడాలనీ హాయిగా కులాసాగా కొన్ని రోజులయినా గడపాలనీ, కలలు కన్నాను. ఏం లాభం? నీవు రాకపోయినా ఇదివరకు ఎదురుగా ఉండి మాట్లాడినట్లే ఉత్తరాలు వ్రాసేవాడివి. వాటిని చదువుకుని-నీ సమక్షంలో సంతోషపడినట్లుగా ఆనందించేదాన్ని. నీ ఉత్త రాలు—ఆర్నెల్లకొకటి—అదయినా రెండే మాటలు. ఇప్పుడా ఉత్తరాలూ లేవు. ఈ ఉత్తరం చూసిన తరువాతయినా నీ చేత్తో రెండు ముక్కలు రాస్తావని ఆశిస్తున్నా"

నరహరికి ఈ ఉత్తరం ఆశాజనకంగా లేదు కేవలం నిరాశాపూరితంగా ఉంది. అతడి ఉత్సాహమంతా కృంగిపోయింది. యాంత్రికంగా మరొకటి తీశాడు.

"బిడ్డ పుట్టాడు వచ్చి చూడమని డాక్టరు చేత రెండు టెలిగ్రాము లిప్పించాను. నీవు రాలేదు పోనీ సంతోషమన్న టెలిగ్రామయినా నీ దగ్గరి నుంచి రాలేదు సమక్షంలో ఎన్నో కబుర్లు చెబుతావు. ఎంతో ప్రేమ కనబరుస్తావు. పరోక్షంలో ఏం పట్టనట్టు ఉంటావు. బిడ్డను చూడటానికి రమ్మంటే రాని తండ్రి ఉంటాడా? చూడటానికి రాలేని కారణం ఏమిటి? అంత బలమైన కారణాలా? నీకు తోచకపోయినా నీకు తెలియ జెప్పటం నా ధర్మం. వెంటనే బయలుదేరిరా. నీ ప్రతిబింబాన్ని ఒకసారి చూసి వెళ్ళు. ఆ ఉన్న రోజున మన పెళ్ళిని చట్టబద్ధం చేసుకుందాము. వస్తావు కదూ! నీ కోసం ఎదురు తెన్నులు చూసేది ఇంతవరకూ నే నొక్కదాన్నే ఇప్పుడు ఇద్దరం. మా ఆశలు వమ్ముచేయకు"

రాత్రిళ్ళు పడుకోబోయేటప్పుడు ఒక కప్పు వేడి వేడి పాలు తాగటం నరహరికి అలవాటు. పెద్ద కూతురు ఎప్పుడో ఒక కప్పు పాలు బల్లమీద పెట్టేసి వెళ్ళింది. వేడి పాలు తాగి ఒక సిగరెట్టు వెలిగించి గంట చూశాడు నరహరి. పన్నెండు గంటలు దాటుతున్నాయి. తెల్లవారి లేచి మళ్ళా యథాప్రకారంగా

కాలేజికి వెళ్ళి పనిచూసుకోవాలి. పరీక్షలు దగ్గరికి వస్తున్నాయి. విద్యార్థులు కూడా రాజకీయవేత్తలై పోతున్నారు. పరీక్షలు నడపటమంటే మాటలుకాదు. భయంపట్టుకొస్తోంది. ఆ గండం గడిచేవరకూ ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని ఉండాలి.

ఈసారి నరహరి చేతికి వచ్చిన ఉత్తరం బయటికి లాగాడు.

''సురేష్‌! మనం ఆనందంగా గడిపిన రోజులయినా జ్ఞాపకం రావటంలేదా? ఎట్లా మరచిపోగలిగావు సురేష్? మన బోట్ షికార్లు—సినిమాలు—పిక్‌నిక్‌లూ అన్నీ మరిచిపోయావా? మనం ఈత కొట్టటంలో పోటీలుపడి తగాదాలు పడేవాళ్ళం. వీటిలో ఏ ఒక్కటి నీకు జ్ఞాపకం రావటంలేదా? నా కవన్నీ ఇప్పటికి కళ్ళకు కట్టినట్టున్నాయి. ఆ మధుర ఘట్టాలన్నీ కళ్ళముందరే ఉన్నాయి. తలుచుకున్నప్పుడల్లా నిత్యనూతనంగా ఉంటాయి. వాటిని తలుచుకుంటూ ఉత్సాహాన్ని పుంజుకుంటూ రోజులు గడుపుతున్నాను. సురేష్! మళ్ళీ అటువంటి రోజులు నా జీవితంలో తిరిగి రావా? ఏమోలే!''

మరొక్కటి చదివి ఆ రాత్రికి లేఖాపఠనం ఆపివేద్దామనుకున్నాడు నరహరి.

''సురేష్! నీ బిడ్డ మనుష్యుల్ని చూసి నవ్వటం నేర్చుకుంటున్నాడు. ఆ బోసి నవ్వులు చూసినప్పుడల్లా నీవే జ్ఞాపకానికి వస్తున్నావు. బిడ్డ నవ్వినప్పుడు నాకు కలిగే సంతోషాన్ని పంచుకోవటానికి నీవు దగ్గరలేవు కదా అనిపిస్తుంది. చూడ్డానికి ఎప్పుడు వస్తావు? బిడ్డ పాకేటప్పుడా? నడక వచ్చినప్పుడా? నాన్నా అని పిలిచేటప్పుడా? ఎప్పుడు వస్తావు?''

నరహరికి నిద్రవేళ తప్పిపోయింది. పక్కమీద మసలుతూ తెల్లవార్చటం ఎందుకు? మరో లేఖ తీసాడు.

''సురేష్! ఒక్కరోజు జ్వరంతో బిడ్డ నీవు చూడలేని లోకాలకు వెళ్ళిపోయాడు. ఎన్ని ఉత్తరాలు రాసాను నీకు వచ్చి చూడమని? తండ్రిలా ఒక్కసారి వచ్చి చూసి ఎత్తుకోలేకపోయావు. ఇది నీ ఉదాసీనమనుకోనా? నిర్లక్ష్యమనుకోనా? ఏమనుకోమంటావు? బిడ్డపట్ల ప్రేమలేని తండ్రి ఉంటాడా లోకంలో? ఉంటే నీవు ప్రథముడవు. కడుపుతీపి అంటే ఏమిటనుకున్నావు! అయినా నీకేంతెలుసులే- ఆ తీపిని రుచి చూచినదాన్ని నేను. ఇప్పుడాచిచ్చును భరించలేక అల్లాడిపోతున్నదాన్ని నేను. నీవు కఠినాత్మ కఠినాత్ముడవు.''

ఓ: కోపమొచ్చేసింది సరళమ్మకు కడుపు మండినవాళ్ళకు మర్యాదలేమిటి? చదివిన నరహరికి గుండెలో సన్నగా మంటలాంటిది బయలుదేరింది.

"సురేష్! తెలిసిపోయింది. నీ సంగతంతా తెలిసిపోయింది. నీవు ముఖం చాటు చేసుకునే మనిషివి. వంచకుడవు. నీకు హృదయం లేదు. ఉంటే నీది శిలాహృదయమన్న మాట. ఇటువంటి మనిషిని నాతో ఎందుకు చెలగాటలాడావు? తల్లీదండ్రీ లేకపోయినా ఇంత చదువుకుని ఉద్యోగం చేసుకుంటూ మర్యాదగా గుట్టుగా రోజులు గడుపుకుంటున్న నాకెందుకు తారసిల్లావు? తారసిల్లి నాలో ఎందుకు మధురభావాలను రేపావు? నాలో నిద్రించిన స్త్రీత్వాన్ని ఎందుకు మేలు కొలిపావు? ఆశలు ఎందుకు రేకెత్తించావు? చెప్పు? నా మానసిక సంక్షోభాని కంతకూ నీవే కారణమని ఒప్పుకుంటూ ఒక ఉత్తరం రాస్తావా?"

అయ్యో! సరళమ్మా! నీవూ మాయమాటలకు లొంగిపోయిన వంచితవేనా? నీ చదువులన్నీ ఏమయిపోయాయమ్మా? నరహరి మనసు కొద్దిగా కలవరపడ్డది.

"సురేష్! నీవు చేసిన మోసాన్ని మీ బాస్‌కంతా వివరంగా రాసేస్తాను. నీ ఉద్యోగం ఊడిపోతుంది. మంచి వాళ్ళకు మంచి చేయాలనిపిస్తుంది. ద్రోహికి ద్రోహమే చేయాలని పిస్తుంది ఎదురు చూస్తూ ఉండు- మీ బాస్ నిన్ను డిస్‌మిస్ చేస్తాడు."

అమ్మా! ఆడది తాచులాంటిది. పగపట్టిందంటే విడువదు. ఆ సురేష్ గాడికి మూడింది పాపం! నరహరి హృదయంలో చిన్నసానుభూతి రేఖ పొడ చూపింది.

"సురేష్! నీ పనులకు ఏడవాలో నవ్వాలో తెలియకుండా ఉన్నది. నీవు పంపిన నీ స్నేహితుడు వచ్చాడు. నీవు నాకు రాసిన ఉత్తరాలన్నీ ఇచ్చెయ్య మన్నాడు" పిల్లలు కలవాడు. "అతడి ఉద్యోగం ఊడతీసే పని చెయ్యొద్దని" కాళ్ళమీద పడ్డాడు. నీ భార్య కంటిరీ మంటికీ ఏకధారగా ఏడుస్తున్నదని ప్రాధేయ పడ్డాడు బాగానే నటించాడు ఎంత యిచ్చావేమిటి?"

"నీచుడా! ఆ ఉత్తరాలన్నీ కట్ట కట్టి వాడి ముఖాన పారేశాను. ఎందుకో తెలుసా? నీ వడిగినందుకూ కాదు. అతడు ప్రాధేయపడినందుకూ కాదు. వంచ

కుడూ మోసగాడూ రాసిన ఉత్తరాలలో ప్రేమ ఏముంటుంది? నిజమైన ప్రేమ లేఖలయితే వాటిని భద్రపరచుకుంటూ ఉండవచ్చు. నీ ఉత్తరాలలో మోసమూ దగా అంతా!

"ద్రోహీ! నీ పాదాలు పలిగి రక్తము కారుతుంచే వేడినీళ్ళతో తుడిచి వ్యాజులైను రుద్ది బాగుచేశా నొకసారి. ఆ పాదాలతోనే నీ దేహాన్ని మోస్తూ తిరుగుతున్నావా? హీనుడా!"

తననే ఆ మాటలన్నట్టుగా భావించాడు కొంతసేపటివరకూ నరహరి, క్రమంగా సర్దుకున్నాడు!

ఉత్తరాలయిపోయాయి. వాటిని యథాప్రకారంగా మడతలు సరిగాపెట్టి కవరులో పెట్టాడు అరలో పెట్టి మూసేశాడు.

అయితే ఈ లేఖలన్నీ అతడికి వచ్చినవి, అతడు రాసినవన్నీ తెప్పించుకుని తగలపెట్టి ఉంటాడు. మరి – ఈ ఉత్తరాలు ఎందుకు భద్రపరచుకున్నారు. ఈ రహస్యపు సొరుగులో? మరచిపోయి ఉంటారా? లేక తను రాసినది తెప్పించు కున్నట్లే ఆమె రాసినవి ఆమెకు పంపేశాడా?

నరహరి కేమీ అర్థము కాలేదు. ఈ దిక్కుమాలిన ఉత్తరాలు చదవటంతో బుర్రంతా పాడయిపోయింది.

తెల్లవారటానికి ఇంకా ఒక గంట ఉంది. బద్ధకంగా మంచంమీద పడుకుని అటూ ఇటూ దొర్లాడు నరహరి.

కాఫీ తాగుతూ నరహరి ఆలోచిస్తున్నాడు. ఈ ఉత్తరాలను మరచిపోయిన వాళ్ళకు పంపాలని తను ఆరాట పడనక్కరలేదు. అలాగే ఆ సొరుగులో ఉండనీ అనుకున్నాడు.

ఉదయం తొమ్మిది గంటలకు కాలేజికి వెళ్ళాలని బైటికి వస్తుండగా "నాన్నా? నీ కోసం ఎవరో వచ్చారంటూ ఎదురుగా వచ్చింది కూతురు.

లోపలికి తీసుకురా అంటూ వెనక్కు మళ్లి కుర్చీలోకూర్చున్నాడు నరహరి.

వెలిసిపోయిన వాయిల్ చీరె కట్టుకుని కుంచించుకుపోయిన ముఖంతో ఉన్న తలనెరిసిపోయిన ఆమె లోపలికి వచ్చి కూర్చుంది.

ముఖం వాడిపోయినట్లుంది. సౌందర్యం చెక్కు చెదరకుండా ఉన్నది. ఆమెకు తనతో ఏం పనో నరహరి ఊహించలేకపోయాడు.

"ఏం కావాలమ్మా ? మీకు?" అడిగాడు-ఇంకా ఆలోచిస్తూ కూర్చుంటే కాలేజికి టైమయిపోతుందన్న తొందరలో.

"నేను ఈ ఇల్లు ఖాళీచేసి ఒక చిన్న యింట్లోకి మారాను. ఒంట్లో బాగుండక సామాన్లు సరిగా సర్దుకోలేకపోయాను. నిన్ననే అంతా సర్దుకున్నాను. నాది ఒక వస్తువు ఉండిపోయింది ఈ యింట్లో. మిమ్మల్ని అడిగి తీసుకువెళ్దామని వచ్చాను" అన్నది తల వంచుకొని:

అదేమిటో నరహరికి అర్థమయింది.

"ఏం వస్తువమ్మా మా కాలేజీ లెక్చరర్లు ఈ ఇల్లు కుదిర్చి కడిగించి నా కొప్పగించారు. నాకేం కనబడలేదు మరి" అన్నాడు.

"అది అందరికీ కనబడేచోటు కాదులెండి" అన్నది తలవంచుకుని.

"అట్లాగా! అయితే మీరే స్వయంగా తీసుకోండి" అన్నాడు.

ఆమె చివ్వున లేచి అల్మేరా తెరచి ఆ రహస్యపు సొరుగులో నుంచి ఆ కవరు తీసుకుని "నమస్కారమండీ!" అంటూ వెళ్ళిపోయింది.

ఆమెను కూర్చోబెట్టి మాట్లాడాలనీ-ఇప్పుడామె ఏం చేస్తోందో తెలుసుకోవాలనీ-కష్టసుఖాలు అడగాలనీ అనుకున్నాడు నరహరి కాని - ఆమె అతడికి ఆ అవకాశము ఇవ్వకుండా వడివడిగా అడుగులు వేస్తూ వెనక్కు తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది.

ఈ సంఘటన తర్వాత నరహరి మనసు అదోలా అయిపోయింది. ప్రతి రోజూ ఆ ఉత్తరాలు జ్ఞాపకం వచ్చేవి.

అంతా విని డాక్టరు పరమేశం "నరహరీ ! నీ ప్రణయ లేఖలలో ప్రణయం కంటే బాధలే ఎక్కువగా ఉన్నాయి. అవి తలుచుకుంటే ఆకలి దప్పులు ఉండవు సుమా అవి అన్నావు. వీటిని తలుచుకునేనా?" గొల్లున నవ్వాడు.

''అలా నవ్వకు. ఆ ప్రణయిని చాలా వరకూ లేఖలు లేకుండానే ప్రేమ నంతా ఒలకపోసింది. లేఖల దశలోకి వచ్చేసరికి అది పలచబడి మరో మలుపు తిరిగింది. ప్రేమ ఎంత ఉజ్వలంగా ఉంటుందో. అది భగ్నమయినప్పుడు అంత పెళుసుగానూ కరుకుగానూ ఉంటుంది. బొమ్మ బొరుసూ కూడా చూపించాను మరి'' అన్నాడు నరహరి.

''అవునవును!'' అన్నాడు జడ్జీ శివరావు.

# 2

''జీవితంలో అత్యంత మధురమైన ఘట్టాలను తలుచుకుంటూ ఎంత దారిద్ర్యాన్నయినా ఎన్ని బాధలయినా దాటుకుంటూ పోవచ్చు''నన్నావుజ్ఞాపకముందా పరమేశం?'' అన్నాడు జడ్జీ శివరావు-పరమేశం ఛాన్సు వచ్చిందని సూచిస్తూ.

పరమేశం హైదరాబాదు వచ్చిన తరువాత జరదా వేసిన బీడాలు తినడం అలవాటు చేసుకున్నాడు. అది పుక్కిట బెట్టుకుని ఎంతసేపయినా మాట్లాడతాడు ఆ బీడా వేసుకుంటే అతడికి ఎక్కడలేని ఉత్సాహం పుట్టుకువస్తుంది. జేబులోంచి తళ తళ మెరసే దబ్బా ఒకటి బయటకి తీశాడు దానిలో నుంచి నాజూకుగా రెండు వేళ్ళతో వండు తమలపాకులతో మడిచిపెట్టిన జోడు బీడాలను సున్నితంగా తీసి నోట్లో పెట్టుకుని, ఒక చిన్న సీసాలో నుంచి జరదాను ఎడమచేతిలో రాల్చుకుని నాలుకమీద వేసుకుని నమిలాడు. ఆ ఘాటుకు ముఖమంతా ఎర్రబడ్డది. కొంత సేపటికి తేరుకుని ఊఁ అన్నాడు

''అయితే మొదలు పెడుతున్నావన్న మాట'' అన్నారు శివరావూ నరహరీ.

అది రెండవ ప్రపంచ మహాయుద్ధము జరుగుతున్న రోజులు.

భారతీయులు చాలా మంది సైనికులుగా డాక్టర్లుగా-ఇంజనీర్లుగా యుద్ధంలో చేరిపోయారు రెండు సంవత్సరాలపాటు వాళ్ళు ఎక్కడఉన్నా ఇళ్ళకు క్షేమ వార్తాలు చేరుతూ ఉండేవి. ఆ తరువాత వాళ్ళను ఇటూ అటూ యుద్ధ స్థావరాలకు పంపటంవల్ల ఉత్తరాల సౌకర్యాలు అంతగా లేకపోయ్యాయి.

శేఖర్ డాక్టరుగా యుద్ధంలో చేరిపొయ్యాడు. అతడు అంతకు పూర్వము మిలటరీ డాక్టరు. సమయం రాగానే చేరిన వాళ్ళల్లో అతడు ప్రథముడు. లలితకూ అతడికీ పెళ్ళయి ఐదు సంవత్సారాలే అయింది. ఒక ఆడపిల్ల ఒక మగవాడు. వాళ్ళను విజయవాడలో తన తల్లి దగ్గర విడిచిపెట్టి వెళ్లాడు.

ఒక ఏడాది రెండేళ్లు లలిత వ్రాసిన జాబులకు జవాబు లొచ్చాయి. పిల్లలు పడుకున్న తరువాత దీపం వెలిగించుకొని ఆ ఉత్తరాలు చదువుకుంటూ ఉండేది. చదువుతూ చదువుతూ గుండెమీద వాటిని పెట్టుకుని కళ్ళు మూసేది. ఆ రోజు వచ్చిన ఉత్తరమే కాకుండా అంతకు పూర్వము వచ్చినవి కూడా మళ్ళీ మళ్ళీ చదువుకుని ఆ మధురస్మృతులతో కాలం గడిపేది. శేఖర్ డాక్టరే కాదు, మంచి సాహిత్యప్రియుడు. ఉపమాలంకారాలు లేకుండా మాట్లాడేవాడు కాడు అతడికి నోటికే ఎన్నో పద్యాలు వచ్చు. సోదాహరణంగా నవరసాలూ ఒలికిస్తూ ఎదటి మనిషిని ఉత్తేజపరుస్తూ ఉంటాడు.

''రోగులతో కూడా ఇలాగే మాట్లాడతారా ? పాపం వాళ్ళు బాధపడుతూ మందులకోసం వస్తే మీరు సాహిత్యం హాస్యం మాట్లాడితే ఎట్లా?'' అంటుంది లలిత.

''నీవు దీనికే ఇట్లా అంటున్నావు. నేను ఆపరేషన్లు చేసేటప్పుడు థియేటర్లో కూడా పద్యాలూ పాటలూ పాడుతూంటే హుషారు వస్తుంది. అప్పుడు చురుకుగా పని చేస్తుంది నా మెదడు. రసం లేనిదే సాహిత్యంలేదు. సాహిత్యం లేనిదే మనిషి లేడు'' నవ్వేసాడు శేఖర్.

''వీటితోనే రోగాలను నయం చేయరాదూ ? మళ్ళీ ఆ మందులూ కత్తులూ కోతలూ ఎందుకు ?'' అంటుంది లలిత.

''నామ మాత్రంగా అయినా ఉండాలి'' అంటాడు అతడు.

అటువంటి రసజ్ఞుడు రాసే ప్రణయలేఖలు ఎలా ఉంటాయో ఎంత ఉత్తేజంగా ఉండేవో ఆ లలితకే తెలుసు.

కొంతకాలం ఆ ఉత్తరాలను అటునుంచి వచ్చినవయినా ఇటునుంచి వెళ్ళిన వయినా సెన్సార్ చేస్తూ ఉండేది ప్రభుత్వము. ఆలస్యంగా చేరుతూ ఉండేవి. తన

దగ్గరున్న ఉత్తరాలను మననం చేసుకుంటూ రాత్రిళ్ళు నిద్రపట్టక ఇల్లంతా తిరుగుతూ వుండేది లలిత

అప్పటికి ఉత్తరం వచ్చి నెలరోజులయింది లలితకు. ఎందుకు ఆలస్య మైందో ఊహించలేకుండా ఉన్నది. యుద్ధములో చేరిపోయినవాళ్ళకు ఎన్ని రకాల ఏక్సిడెంట్లు కాగలవో అన్నిటినీ ఊహించుకొని గజగజ వణికిపోతున్నది లలిత.

"శేఖర్ ! ఈ వేళప్పుడు నీవు ఏం చేస్తుంటావో నేను ఊహించలేకుండా ఉన్నాను. నీవు వెళ్ళేటప్పుడు నా కళ్ళ వెలుగునూ ఒంట్లో ఉన్న ఉత్సాహాన్నీ మనసులో ఉన్న వికాసాన్నీ తీసుకుపోయావు. నేను యంత్రాలతో తయారుచేసిన బొమ్మలా తిని తిరుగుతున్నాను. ఇదంతా ఎందుకో తెలుసు ? నీ పిల్లలుకోసం - నీ ప్రతిబింబాలకోసం. వాళ్ళల్లో నిన్ను చూసుకుంటూ-నీ ఛాయా చిత్రంతో మాట్లాడుతూ-తన ఏకైక పుత్రుడికోసం అహర్నిశలూ కన్నీరు కార్చే నీ తల్లికి నీవు తిరిగి వచ్చేవరకూ ధైర్యం చెప్పటంకోసం బ్రతుకుతున్నా,

నీ ప్రియమైన లల్లీ !"

వచ్చిన ఉత్తరాలన్నీ ఆ స్థావరంలో ఉన్నవాళ్ళు విప్పి చూశారు. వాటిలో మనసును కదిలించివేసే ఉత్తరాలను నోటీసు బోర్డుమీద పెట్టారు ఒక్కొక్కరు వస్తున్నారు - చదువుకుంటున్నారు-వెళ్ళుతున్నారు.

ఈ శేఖర్ ఎవరు ? అతడెక్కడున్నాడు ఇప్పుడు? అతని భార్య కాబోలు- ఎటువంటి ఉత్తరం వ్రాసింది ? ఎంత అదృష్టవంతుడా శేఖర్ !

"అయ్యో! నాకటువంటి అదృష్టం ఎక్కడది? ఎదురుగా ఉంటే మాట్లాడి. స్తారు. డబ్బు సంపాదించి ఇస్తే బాగా ఖర్చుచేసి జల్సాగా బ్రతుకుతారు" బరువుగా నిట్టూర్చి ఆ ఉత్తరం మరొకసారి చదువుకొని వెళ్ళిపోతున్నాడొక ఆంధ్ర వీరుడు.

ఎంత తెచ్చినా చాలదు చాలదు అనే కుటుంబాన్ని తలుచుకొని-పిల్ల పెళ్ళి నిశ్చయమైంది. కట్నం డబ్బులు సర్దు అంటూ పీడించే తల్లిదండ్రులను జ్ఞప్తికి తెచ్చుకొని అన్న పంపే డబ్బుతో రకరకాల డ్రెస్సులు కుట్టించుకుని జల్సాగా

చదువులు లేకుండా తిరిగే తమ్ముళ్ళనూ తలుచుకొని నిరాశా నిస్పృహలతో సైన్యంలో చేరిపోయిన రాఘవులు ఆ ఉత్తరం చూసి "ఒక్క రోజు బ్రతికినా చాలు అటువంటి భార్య ఉంటే" అనుకుని బరువుగా అడుగులు వేసుకుంటూ వెళ్ళాడు.

"నాకు ఆ భాషరాదు ఏమిటది ఉత్తరమా?" ఆపి పక్కనున్న వాడిని అడిగాడు ప్రతాప్‌సింగ్.

"అవును భాయి. అది ఉత్తరం. ఎవరో శేఖర్ అనేవాడికి వచ్చింది. భార్యో - లేక ప్రియురాలో ఉత్తరం వ్రాసింది" అన్నాడు తెలుగు భాష వచ్చిన సైనికుడు.

"అయితే భార్య ప్రియురాలు కాకుండదా?" అన్నాడు సింగు.

"కావచ్చు అయితే అదృష్టమే!"

"అయితే భాయీ! ఏమని రాసింది?" కుతూహలాన్ని పైకి కనబడకుండా అణచుకోలేక పోయాడు.

ఆ ఉత్తరాన్ని హిందీలోకి అనువాదం చేసి వినిపించాడు తెలుగు సైనికుడు.

ఆఁ! ఆఁ! అంటూ పరవశించిపోయాడు ప్రతాప్‌సింగ్. పాపమతడు అదివరకూ విననైనాలేదు ప్రేమ లేఖలను గురించి.

ప్రతిరోజూ అక్కడ వుండే సైనికులందరూ ఉత్తరాలకోసం ఆ నోటీసు బోర్డు దగ్గరికి చేరుకునేవారు. బోర్డుమీద కొత్త ఉత్తరం లేకపోయేసరికి నిరాశతో మరలిపోయేవారు. కొత్త ఉత్తరంకోసం ఎదురుచూసేవారు.

వారానికల్లా కొత్త ఉత్తరం బోర్డుమీద పిన్నుచేసి ఉంచేశారు.

అందరూ గుంపులు గుంపులుగా మూగారు. అందరికంటేముందుచదవాలని ప్రతి ఒక్కరి ఆరాటం! ఈ గొడవంతా ఎందుకని ఒక సైనికుడు బిగ్గరగా చదివాడు

"శేఖర్! ఏ రోజు కారోజు యుద్ధ విరమణ అవుతుందేమో నీవు వస్తున్నానంటూ ఉత్తరం రాస్తావేమో ననుకుంటా. కాని అటువంటి శుభవార్తనా

కందటంలేదు. నా ఉత్తరాలు అందుతున్నాయా? మరి ఒక్కదానికయినా జవాబు రాయవేం? నీ కెప్పుడూ నీ రోగుల గొడవ తప్పితే మా సంగతి ఆలోచించవా? నీ కంటే- యుద్ధ వార్తలో- ముందుకో వెనక్కో ప్రయాణాలు కట్టే సందడి- తోటి సైనికాధికారులతో జల్సా కులాసా కబుర్లు- అవీ యివీ నాకేముంది శేఖర్! కడుపులో గంపెడు దిగులు-పిల్లల కోసం- మీ అమ్మకోసం పైకి సంతోషంగా ఉన్నట్టు నటించటం-నీవు ఎప్పుడో రాసిన ఉత్తరాలు చదువుకొని అవిచ్చే ఆనందంతో బ్రతుకు వెళ్ళదీయటం- ఇంకెన్నాళ్ళు శేఖర్? నీవు వచ్చేవరకూ ఈ బ్రతుకును ఈడవగలనా?

నీ లల్లి"

విన్నవాళ్ళంతా అయ్యో! పాపం! ఇలా ఎంతమంది ఏడుస్తున్నారో, అందరికీ ఇలా ఉత్తరాలు రాయటంచేత కావద్దూ? ఇంతకూ, ఆ శేఖర్‌కు ఈ ఉత్తరాలు పంపుతున్నారా? వాళ్ళకు ఒకరి సంగతి ఒకరికి తెలియక ఎంత అలమటించి పోతున్నారో?

ఉన్నవాళ్ళు గుంపులు గుంపులుగా చేరుతున్నారు చెదిరి పోతున్నారు.

ఆకాశం దట్టంగా మబ్బు పట్టింది. గాలి దుమారం డేరాలను ఊపివేస్తున్నది. మేఘ గర్జనలకు గుండెలవిసి పోతున్నాయి.

ఉన్నట్టుండి అధికారులు గుసగుసలాడుకుంటున్నారు. స్టీమరులో సింగపూరుకు వెళ్ళిన దళాన్ని జపాను ప్రభుత్వం ఖైదీలుగా తమ దేశానికి తీసుకువెళ్ళినట్టు వార్త వచ్చిందని. ఈ వార్త ఎంతవరకూ నిజం? ఆ ప్రభుత్వం చేసే విష ప్రచారమా? లేక అంతటి దురవస్థ నిజంగా కలిగిందా? ఆ దళంలో డాక్టర్లూ, ఇంజనీయర్లూ ఇంకా అనేక మంది సైనికోద్యోగులు ఉన్నారు.

రేడియోలో ప్రసారమయిన వార్తలు ఆనోట ఆనోట అక్కడ అందరికీ తెలిసిపోయాయి.

ఆ రోజు ఒక నీలి కవరు వచ్చింది. దాని రంగు దానిపైన ఉన్న దస్తూరి చూసి చదువురాని సైనికుడు కూడా అది శేఖర్‌కు వచ్చిన ఉత్తరమేనని గ్రహించాడు. సైనికాధికారి ఆ కవరుపైన రాసిన పేరు చూసుకుని పెదవులు చప్పరించి——

తాను చదువుకున్నాడు. గుండె బరువెక్కినట్టుగా చేత్తో రాసుకుని ఆ కవరు నోటీసు బోర్డుకు పిన్ను చేసాడు.

"శేఖర్, నీ పేరు రాయాలన్నా నోటితో ఉచ్చరించాలన్నా గుండె కోతగా ఉంది. నీ కబుర్లేమీ తెలియటంలేదు. పిల్లలను చూసినా నీ తల్లిని చూసినా గుండె చెక్కలయిపోతున్నది. ఈ యంత్ర మొక్కటే మొండిగా తిరుగుతున్నది.

నీ పిలుపులతో మారుమ్రోగే మన గది మూగపోయింది. నీ వస్తువులు నన్ను వెక్కిరిస్తూ గుండెలు బ్రద్దలు చేస్తున్నాయి. నీ మంచం మీద నీ ఫోటో పెట్టాను. పూలహారాలు వేసుకుంటుంది గాని ఒక్కమాటయినా మాట్లాడదు. నాకు ధైర్యం చెప్పదు. కాని—ఆ చిరు మందహాసం చూస్తే నేనేమయిపోతున్నానో నీ కెట్లా చెప్పను? ఏమని రాయను? నేను గడుపుతున్న రోజు లెలా ఉన్నాయంటే నల్లరాతికి ఇనప గొలుసులతో కట్టేసిన మనిషి ఎట్లా నడుస్తుందో అట్లా ఉన్నాయి. రమణీయంగా- రసమయంగా- నన్ను ఉత్తేజపరచి రెక్కలు కట్టి నన్ను తనతో ఏదో లోకాలకు తీసుకువెళ్ళే నీవు లేవు

పదహారు కళలతో వెన్నెలలు విరిసేరోజు ఎప్పుడు వస్తుంది? నీ వెప్పుడు వస్తున్నావు? ఇవాళా? రేపా?—నీ లల్లి"

"అయ్యో! ఆమెకు ఈ సంగతి తెలియదేమో? ఎవరు తెలుపుతారు?

సైనికాధికారులు ఒకరి నొకరు కళ్ళతో ప్రశ్నించుకున్నారు.

అక్కడ ఉన్నవారెవరికీ ఆమెకు శేఖర్ సంగతి తెలిపే అధికారం లేదు.

అందరూ ఖిన్నులై తలలు వంచుకున్నారు.

ఆమెను ఉత్తరాలు రాసుకొనే భావోద్రేకమయినా ఇలా వెళ్ళబోసుకొనీ, త్వరలో అతడు తిరిగి వస్తాడనే ఆశతో ఆమెను జీవించనీ.

తలలు పంకిస్తూ బరువుగా నిట్టూర్చారు సైనికాధికారులు.

నాలుగు రోజులయినా గడవకముందే మరో ఉత్తరం వచ్చింది.

"శేఖర్ చూశావా? మనను చూసి లోకం ఓర్వలేకపోతున్నది కళ్ళల్లో నిప్పులు పోసుకుంటున్నది. నీవుట-ఖైదీగా పట్టుబడ్డావట! మీ చిన్నాయనగారి

అల్లుడు పనికట్టుకుని వచ్చి చెప్పివెళ్లాడు. వట్టి కళ్ళు మనిషి "మీ ఆయన ఎంత డబ్బు పంపించాడు?" అని అడిగాడు.

నా బ్రతుకు ఎట్లా ఉందనుకున్నావు శేఖర్! అందరూ నన్ను చూసి "పాపం" అనుకుంటున్నారు. ఏమిటో గుసగుసలాడుకుంటున్నారు. పిల్లలకు ఒక్కొక్కళ్ళే వచ్చి పళ్లూ, మిఠాయిలూ యిచ్చి జాలిపడుతున్నారు. శేఖర్! నా గుండె పగిలిపోతున్నది. నీవు వచ్చి ఈ పరిస్థితులను చక్కదిద్దవా?

ఎదురు చూసి చూసి అలసిపోతున్నా శేఖర్.

నీ లల్లీ!

ఇలాగే ధైర్యంతో రాసిన ఉత్తరాలెన్నో నోటీసుబోర్డు కెక్కుతున్నాయి. పాతవి తీసేసి కొత్తవి పెడుతున్నారు సైనికాధికారులు.

కొన్ని నెలలయిన తరువాత ప్రభుత్వం రేడియోలో కుటుంబాలవద్ద నుండి వచ్చిన క్షేమసమాచారాలు సైనికులకు ప్రసారము చేయటం మొదలుపెట్టింది.

"రామన్! నీ భార్య ఇందిర, కొడుకు వెంకట్, కూతురు మంజరి అంతా క్షేమంగా ఉన్నారు."

"సూర్యప్రకాష్! నీ కుటుంబమంతా క్షేమంగా ఉన్నారు."

"అంతయ్యా! నీ ముసలి తల్లిదండ్రులు క్షేమంగా ఉన్నారు."

ఈ రేడియో వార్తలు వినటానికి లలిత రాత్రింబగళ్ళు దాని ముందర కూర్చునేది. తాను రేడియో ముందునుంచి కదిలితే శేఖరు దగ్గర్నుండి వచ్చే వార్తలు తను వినలేకపోతానేమో నని భయపడుతూ అక్కడే కూర్చునేది.

వారంరోజులు విన్న తరువాత ఆమె అర్థం చేసుకున్నది ఇవన్నీ ఇళ్ళ దగ్గర్నుండి వెళ్ళే వార్తలేగాని అక్కడి నుంచి రావటం లేదని.

"శేఖర్! ఏమిటీ దారుణం? నా వార్తలు నీకు తెలుస్తున్నాయా? ఎటువంటి పరిస్థితుల్లోనూ నీవు నాకు రాయకుండా ఉండవని తెలుసు. నీకేదో ఆపద వచ్చిందని నా మనసు గట్టిగా చెబుతోంది. చాలా ఆందోళనగా ఉంది. మన ఇద్దరి

మధ్య ఇదివరకూ నీవు కట్టిన తాళి మాత్రమే అడ్డుగా ఉండేది. ఇప్పుడో? దాటరాని నదులూ, దూరరాని అడవులూ ఉన్నాయి. నేనేం చెయ్యను? నాకేది దారి?

అసలు సైన్యంలో ఎందుకు చేరావు శేఖర్? డబ్బు కోసం చేరావా? ఉన్నదానితో తృప్తిపడే నన్ను అపార్థం చేసుకున్నావా? నేనటువంటి దాన్ని కానని నీకెట్లా చెప్పను? నా మనసంతా ముక్కచెక్కలయిపోతోంది శేఖర్! నీవు నన్ను పరీక్ష చేయటం లేదు కదా!——నీ లల్లీ".

పదిహేను రోజుల తరువాత ఊళ్ళో పుకారు బయలుదేరింది. సైనికులెవరో పారిపోయి వచ్చారనీ- వాళ్ళను పట్టుకోవటానికి కొందరు అధికారులు ఇల్లిల్లూ సోదా చేస్తున్నారనీను.

గజగజలాడిపోయింది లలిత. ఆ జీవితం విసుగొచ్చి పారిపోయి వచ్చాడేమో! తనను చూడాలని కొండంత ఆశతో వస్తే——ఇల్లు చేరకముందే సైనికాధికారులకు పట్టుబడతాడేమో? ఇంకేముంది? తన శేఖర్‌ను కాల్చివేస్తారు.

కాని- మళ్ళీ అనుకుంది- తన శేఖర్‌కు ఏ కర్మం పట్టింది చెప్పకుండా పారిపోవటానికి? ఇదంతా తన శేఖర్‌ను గురించి కానేకాదని గట్టి ధైర్యం తెచ్చుకుంది.

"అబ్బబ్బ! శేఖర్! చేత్తో ఒక్క ఉత్తరం ముక్క రాయవుగాని ప్రతి రోజూ కలలోకి వచ్చి నన్ను ప్రలోభ పెడతావా? ఏమిటా చిలిపితనం? నీకొంటె చేష్టలు అక్కడున్నా మానలేదన్న మాట. సరేలే. నీ చిలిపి తనం మాని వారం రోజులు సెలవు తీసుకుని రా, నీ పిల్లలను కళ్ళతో చూద్దువుగాని-ఎంత ఎదిగారో! మీ అమ్మను పలకరించి గుండెచల్లపరచు. వస్తావుగా. నీ కోసం ఎదురుచూసేలల్లీ."

డాక్టరు పరమేశం ఆ ఉత్తరాలన్నీ చదువుకొని నోటీసు బోర్డు మీది నుంచి తీసి కిందపడేసిన వాటిని ఏరుకుని జేబులో కుక్కుకునేవాడు. ఎవరూ చూడకుండా కళ్ళు తడుచుకునే వాడు.

డాక్టరు పరమేశం చెప్పటం అయిందన్నట్లు మరో జరదా బీడాను నోట్లో పెట్టుకుని సిగరెట్టు ముట్టించాడు.

"అయితే పరమేశం! ఆ శేఖర్‌వి నీవు కాదు గదా?" అన్నారు నరహరేశ్వరావూ ఒక్కసారే.

"అయితే ఎంత బాగుండేది? కాదు కనుకనే నా కింతబాధ" కణతలు రుద్దుకున్నాడు పరమేశం.

"అది కూడా చెప్పు? ఇవాళ ఎవరికీ రహస్యాలుండకూడదని ప్రమాణాలు తీసుకున్నాంగా మొదట్లో."

ఆ లలితా నేను మొదట్లో ప్రేమించుకున్నాం. లలిత కాస్త నలుపు అయినా కళగల ముఖం. విశాల నేత్రాలు, కోమలమయిన తనువల్లరి. కాని మా అమ్మ కోడలు నలుపయితే కులమంతా నలుపవుతుందనిపట్టుపట్టింది. బావిలో దూకుతానని బెదిరించింది. ఏం చెయ్యను? ఏక పుత్రుణ్ణి మనసు తిప్పుకుని ఆమె చూపించిన పిల్లను పెళ్ళి చేసుకున్నాను. వచ్చిన ఆమె డబ్బుమనిషి డబ్బూ కాదు హోదా కావాలి కాని నేను పనికిరాను.

లలిత హృదయం నాకు తెలుసు. ప్రేమమయి. నాకు కాకుండాపోయింది నా హృదయంలో పీఠం వేసుకుని కూర్చున్న లలిత నన్ను అప్పుడప్పుడు కలలలో పలకరించేది. ఆ ఉత్తరాలలో శేఖర్ పేరు తీసేసి నా పేరు రాసుకుని తన్మయుడ నయ్యేవాడిని."

"శేఖర్ తిరిగి వచ్చాడా?" జడ్జి శివరావు గొణిగాడు.

"వచ్చాడు. యుద్ధానంతరం ప్రభుత్వాల మధ్య ఖైదీల మార్పిడి జరిగింది గుర్తుపట్టలేని స్థితిలో వచ్చాడు. లలిత కంటిపాపలా కాపాడి ఆరోగ్యవంతుడిని చేసుకుని ఇంటికి తీసుకు వెళ్ళింది.

"మంచి పనేగా! అందుకు మనమంతా సంతోషించాలి. అంతేనా?"

శివరావూ నరహరీ నవ్వారు. కళ్ళల్లో నీటిపొర తేలి ఆడుతుండగా పర మేశం కూడా నవ్వాడు.

పన్నెండు గంటలు కావచ్చింది. ముగ్గురూ వెన్నెల స్నానాలు చేసినట్టు న్నారు.

"నరహరీ. ఇంక ఇవాల్టికి ఇళ్ళకు వెళ్దాం లేవండి. ఇంత పొద్దుపోయే వరకూ మేలుకుంటే మన ఆరోగ్యాలు చెడిపోతాయి" అంటూ లేచాడు శివరావు.

"ఓహో! మేము చెప్పినవి విని- నీవు చెప్పకుండా ఇంటికి వెళ్ళాలనా నీ ఉద్దేశ్యం? అదంతా కుదరదు. చెప్పి తీరాల్సిందే ఎంత పొద్దుపోయినా" బల వంతంగా శివరావును కూర్చోబెట్టాడు పరమేశం.

అది మదరాసులోని తాంబ్రం టి. బి. శానిటోరియం. వేణు సంవత్సరాల నుండీ అక్కడ ఉంటున్నాడు. ఆ శానిటోరియమ్‌లో చేర్పించిన నాడు అతడికి ఊపిరి తిత్తులనిండా చిల్లులు. ఎముకల గూడులా నోటమాట రాకుండ ఉన్నాడు.

లేతనీలం రంగు బల్బు వెలుగులో మంచంమీద కిటికీకి దగ్గరగా పడుకు న్నాడు.

''వేణూ! పడుకోలేదూ! గంట పన్నెండు. అన్నాడు తండ్రి రంగారావు.

''నిద్ర పట్టడం లేదు నాన్నా!''

మనసులో దిగులు పెట్టుకోకురా. ఇంకా నాలుగయిదు నెలల్లో ఇంటికి వెళ్ళిపోతాము. హాయిగా నీ ఉద్యోగం నీవు చేసుకుందువు గాని. దీపిక పిల్లలతో వస్తుంది. అమ్మను కూడ నీ దగ్గర కొంతకాలం అట్టిపెట్టుకో, మనం అందరి కంటే అదృష్ట వంతులమని డాక్టరుగారు చెబుతున్నారు. ఆ నరసయ్యను చూశావా? ఐదేళ్ళనుంచీ ఉన్నాడట. తగ్గుతున్నట్టే తగ్గి మళ్ళీ హెచ్చుతోందట, జబ్బు. ఆ హాల్లో అన్ని మంచాలమధ్య తీసుకుంటున్నాడు. నీకేం? హాయిగా స్పెషల్ రూము తీసుకున్నాము. డాక్టరు మనవాడే కనుక కొత్తగా వచ్చిన మందులు వాడుతున్నాడు. ఇప్పుడు నీ బరువు ఎక్కింది. ముఖం మిసమిస లాడుతున్నది. దిగులు పెట్టుకో కుండా దేవుణ్ణి తలుచుకో. రంగారావు పక్కమీద లేచి కూర్చున్నాడు.

"నాకేం దిగులు నాన్నా? నేను హాయిగా ఇక్కడున్నాను. మీరే నా కోసం అష్టకష్టాలూ పడుతున్నారు. అమ్మా పిల్లలూ ఒకచోట - దీపా పిల్లలు ఒకచోట. డాక్టరుగారు ఇంతకాలం ఉండాలని మొదట చెప్పలేదా నాన్నా?'' అదొక మాదిరిగా ఒణుకుతున్న కంఠంతో అడిగాడు వేణు.

''అబ్బే, ఆయన మొదటే చెబితే అమ్మను కాకపోయినా దీపా పిల్లనయినా తీసుకువచ్చి ఇక్కడ కాపరం పెట్టనూ? ఎప్పుడడిగినా నేనే చెబుతాను. ఆగండి'' అంటారు ఇంక మొక్క విడమరచి చెప్పారు - ఇంకా నాలుగైదు నెలల్లో పంపిం చేస్తామని.

"అమ్మ ఉత్తరాలు రాస్తున్నదా నాన్నా?"

"రాస్తునే ఉన్నదిరా. పిల్లలూ వాళ్ళ చదువులూ - ఇంటి వార్తలూ ఏదో రాస్తూ ఉంటుంది వారానికోసారి." రంగారావు వేణు ముఖంలోకి చూశాడు, దీపిక సంగతి అడుగు తాడేమోనని.

వేణు మాట్లాడలేదు. దిండు క్రింది ఉన్న సిల్కు రుమాలును తడిమి చూసుకున్నాడు. సిల్కు రుమాలులో బంధింపబడిన కాగితాల మడతాల చేతికి తగలగానే అతడి ముఖం వికసించినట్టుగా కనబడింది రంగారావుకు. ఆయనకు ఆశ్చర్యం కలిగింది. ఈ రెండేళ్ళ నుంచి వేణు దీప ముఖం చూడలేదు ఒక్క నాడయినా ఆమె సంగతి అడగలేదు. కనీసం యెక్కడున్నదనయినా ప్రశ్నించలేదు.

బరువుగా నిట్టూర్చి రంగారావు పక్క మీద ఒరిగాడు. అవలింతలు వచ్చాయి. కళ్లు మూసుకున్నాడు.

ఉదయం లేవగానే రంగారావు తను ముఖం కడుక్కొని వేణుకోసం వేడి నీళ్ళు తెచ్చి బల్లమీద పెట్టాడు. బ్రెష్ పేస్టు ఎదురుగా పెట్టి పాలు టిఫిన్ కోసం వెళ్లాడు.

రంగారావు హాస్పిటల్‌కు రెండు వందల గజాల దూరంలో ఒక చిన్న ఇల్లు తీసుకున్నాడు. వెళ్ళిన అరగంటలోనే ఉడకబెట్టిన కోడి గుడ్లు రెండు పెద్ద గ్లాసెడు కాచిన పాలు కాల్చిన బ్రెడ్ స్లైస్‌ని తీసుకువచ్చాడు. వచ్చేటప్పుడు తను గ్లాసెడు కాఫీ తాగి వచ్చాడు.

తండ్రిని చూడగానే వేణు లేచి కూర్చుని పాలు గుడ్లు తీసుకున్నాడు. బ్రెడ్ స్లైస్‌ని చేతిలోకి తీసుకుని చాకుతో వెన్న రాస్తూ "వేణూ పేపర్ కొనుక్కొస్తాను. కొంచెం దూరంగా వెళ్ళాలిరా" అంటూ ఉత్తరీయం భుజాన వేసుకుని బయలు దేరాడు రంగారావు.

"తొందరేమున్నది నాన్నా? పేపరు తీసుకుని ఏకంగా నీవు భోజనం చేసి నాకూడా తీసుకురా. ఆత్రపడకు. ఎన్నిసార్లని తిరుగుతావు?" అన్నాడు వేణు.

రంగారావు గది దాటగానే వేణు "అమ్మయ్య" అంటూ ఊపిరి పీల్చుకున్నాడు. తండ్రి మరో మూడు గంటలకుగాని రాడు దిగ్గునలేచి కూర్చుని దిండు

కిందవున్న సిల్కు రుమాలుతీసి విప్పాడు. లేత నీలంరంగు కాగితపు మడతలు కొన్ని మొగలిపూవు వాసనలు వెదజల్లుతూ ప్రాణం వచ్చినట్టు కదిలాయి.

వాటిని చూసి వేణు తన్మయుడై పోయాడు. కాగితపు మడతను వాసన చూసి సుతారంగా మడత విప్పాడు.

“వేణూ! మీరేమో “నాకంటి దీపానివి దీపా!” అంటారు. కాని-నేను మీ అంతాన్ని చూసే రాక్షసిని. ప్రబల శత్రువును. కాక పోతే-మిమ్మల్ని ఇంత దూరాన హాస్పిటల్లో చేర్పించి వైద్యం చేయించే మీ తల్లిదండ్రులు నాతో ఒక్క మాటయినా చెప్పకుండా ఈ ఊరు తీసుకువస్తారా? నేను మిమ్మల్ని కర కర నమిలి తినే కామినీ పిశాచిని కాబోలు? నా మనసు - నా ప్రవర్తన - మీ పట్ల నా ఆరాధన ఇటువంటి అపార్థాన్ని ఎలా కల్పించాయి?

నాకు తెలుసు వేణూ-జరిగిన దానిలో మీ ప్రసక్తిలేదు. మీ కళ్ళు కప్పారు. నన్ను నా వేణుకు దూరంచేశారు.

మీకు వచ్చినది తీవ్రమైన వ్యాధని నాకూ తెలుసు. మంచి వైద్యోపచారాలు అవసరమని నాకూ తెలుసు? అంత గ్రహింపు శక్తి నాలో లేదా?

నాలో ఎంత ప్రేమ ఉందో అంతటి త్యాగమున్నది, అంతటి సేవా భావమున్నది.

నేనెంత దురదృష్టవంతురాలిని? మీ తల్లిదండ్రులు నా మనసు తెలుసు కోకుండా ప్రవర్తిస్తున్నారే!

పోనీ లెండి, మీకు నా మనసు తెలిస్తే చాలు. నాకదే పదివేలు.

కాని-ఈ కష్ట సమయములో నేను మీ దగ్గర ఉండి మీకు బాధోపశమనం అయేటట్టు—మనసుకు ఊరట కలిగేటట్లు కబుర్లు చెబుతూ నా చేత్తో మందులిస్తూ-మీ సమక్షంలో నేను ధైర్యం తెచ్చుకోవాలనుకుంటే—నాకా భాగ్యము కలిగేటట్టు లేదు.

మీరు మీ తండ్రిని ఒప్పించరూ? పిల్లలను మా అమ్మదగ్గర వదలిపెట్టి-ఒక్క దాన్నీ వచ్చేస్తాను. జబ్బులో ఉన్నా మీ చిరునవ్వు చూస్తూ నే నెంతపనయినా చెయ్యగలను. మీ శుశ్రూష కోసం రాత్రింబగళ్లు మేలుకొని ఉంటాను.

మీ నాన్నగారికీ మీ అమ్మగారికీ ఒక్కమాట చెప్పండి. నన్ను కూడా తీసుకురమ్మని.

మీ దీప."

వేణు ఆ ఉత్తరాన్ని మడతచేస్తూ వేడి కన్నీటిబొట్లు రాల్చాడు. బాధకొద్దీ తల పట్టుకున్నాడు.

అమ్మ! నాన్న! వాళ్ళకు వాళ్ళ కొడుకును గురించిన విచారమేగాని-కొడుకు మనసులో ఏముందో గ్రహించరు దీపా! నేను నిస్సహాయుడను.. కేవలము నిస్సహాయుడను. నీ సంగతి వాళ్ళతో చెప్పలేని పిరికివాడిని. పది నిమిషాల సేపు దిండ్లకు ఒరిగి కళ్ళు మూసుకున్నాడు వేణు.

అంతలో దిగ్గున లేచి కళ్ళు తెరిచాడు. నాన్న వచ్చేస్తాడు. దీప వ్రాసిన ఉత్తరాలయినా చదువుకుంటేగాని మనశ్శాంతి రాదు అనుకుంటూ మరొక ఉత్తరం తీశాడు.

"నా ప్రాణంలో ప్రాణమయిన వేణూ! మనం ప్రేమించి పెళ్ళి చేసుకున్నామా? లేదా? పెద్దలు చేసిన పెళ్ళే. మన కలయికవారామోదించినదే! కాని, మనం అందరిలాగ లేకుండా అపురూపానురాగంతో దాంపత్య జీవితమారంభించాం. రాగ మెరుగని లాలనతో జీవితమారంభించాం. వాడని పుష్పంలా దాన్ని పోషణ చేస్తున్నాం. వయసుతో నిమిత్తం లేకుండా పెంచుతున్నాం. వేణూ! సామాన్యుల దృష్టికి ఇది సాధారణమైనదే. అపూర్వమూ అసాధారణమూ అయిన మన అనురాగాన్ని అందరూ గుర్తించలేరు. నా నుండి నిన్ను దూరం చేస్తే మన అనురాగ లత వాడుతుందా? భ్రమగాని!

"దీపను ఇక్కడికి తీసుకువస్తే వచ్చే నష్టమేమిటి? ఖర్చుకోసమా? కాదు నాన్నకూ అమ్మకూ డబ్బు ఖర్చవుతుందన్న భయంలేదు. ఎలాగయినా తమ కుమారుడు ఆరోగ్యం బాగుపడటమే వారికి కావలసింది. ఎందుకు? ఎందుకు దీపను నా నుండి దూరం చేస్తున్నారు? ఆ పసి వాళ్ళకు తండ్రిని చూడాలని ఉండదా? వాళ్ళని చూడాలని నాకు ఉండదా? అమ్మా! నీ వయినానన్నర్థం చేసుకోవమా. దీపను మీ కుమార్తెను చూసినట్టు చూసుకొండమ్మా" సగం పైకి సగం లోపలా గొణుక్కున్నాడు వేణు.

యాంత్రికంగా మరొకటి తీసి మడత విప్పాడు.

"స్వామీ! నా కర్థమయింది. మీ నాన్నగారి మనసులో ఉన్నమాట. నన్ను తీసుకు వెళ్ళమని నేను ప్రాధేయపడితే ఛీత్కారం చేస్తూ మనసులో ఉన్నదాన్ని వెళ్ళగ్రక్కారు. రెండేళ్ళ క్రిందటే ఈ వ్యాధి పొడచూపిందట. వైద్యంచేయించి జాగ్రత్తగా ఉండరా అబ్బాయి, అని చెప్పారటమీతో. కాని ఏడాది లోపలే ఉమ పుట్టింది. ఆ కారణంచేతనే ఈ వ్యాధి తిరగబెట్టిందనీ ఇప్పుడు ప్రాణం మీదికి వచ్చిందని దీనికంతకు నేనే కారణమని నన్ను తిట్టిపోశారు. మీరు తిరిగి ఆరోగ్యంగా ఇంటికి వచ్చేవరకూ మీరు నా కంటపడకూడదని శాసించారు. మీమీద ఒట్టు వేయించుకున్నారు. నాకెంత కఠినమయిన శిక్ష పడ్డదో చూశారా? నేనెట్లా భరించను! మీ కోసం పిల్లలు అలమటించిపోతున్నారు. ఒక్కసారి దూరాన్నించి మిమ్మల్ని చూపించేవరకూ ఊరుకునేటట్టులేరు. కాని-వాళ్ళ మొర నా మొర ఎవరు అలకిస్తారు?

వేణూ! నా బాధలో నేను ఒక పెద్ద పొరబాటు చేస్తున్నాను. నా సొదంతా వ్రాసి మీ మనసును కలవరపెడుతున్నానేమో! మీ మనసు ఇప్పుడు ప్రశాంతంగా ఉండాలి. అలా ఉంటే త్వరగా కోలుకుంటారు. నా అదృష్టం బాగుంటే మీ నాన్న నన్ను చూడనిస్తారు. సరే, ఆ రోజుకొరకే ఎదురు చూస్తూ ఉంటా.

"మీ దీప"

వేణు ఉత్తరమంతా మరొకసారి చదివాడు. అక్కడక్కడ కళ్ళనీళ్ళు పడి కాటోలు-అక్షరాలు అలుక్కుపోయాయి. అతడి గుండె ఒకసారి గుబగుబలాడి నట్లయింది.

తన తల్లిదండ్రులు తనను అనవలసిన మాటలు దీపను అంటున్నారు. తనకు విధించవలసిన శిక్షను దీపకు విధిస్తున్నారు తప్పుచేసిన కుమారుడు వారి దృష్టిలో మంచివాడే. ఎటొచ్చీ-కోడలే అలుసు. బాధతో మనసు మూలిగింది.

అనుకోకుండా ఆనాడు గడియారం చూసుకున్నాడు. తండ్రి వచ్చే వేళ సమీపించింది. తనెంత అవివేకి? దీప వ్రాసిన ఉత్తరాలు చదువుకొని మనసుకు ఊరట కల్గించుకోదలచుకుని-ఆలోచనలో పడ్డాడు. తనకే ఇట్లా ఉంటే దీపకు ఎట్లా ఉంటుంది?

గ్లాసులో ఉన్న నీళ్ళలో బట్ట తడిపి ముఖమంతా తుడుచుకున్నాడు. రెండు చేతులతో క్రాపు సవరించుకున్నాడు. యథాప్రకారంగా పక్కమీద పడుకుని ఉత్తరాలన్నీ మడిచి సిల్కు రుమాలులో కట్టి తలగడ క్రింద భద్రపరుచుకున్నాడు.

తనకు ఈ హాస్పిటల్ నుండి విడుదల ఎప్పుడో? తన ఉద్యోగానికి దీర్ఘ కాలం సెలవు పెట్టించాడు తండ్రి.

కళ్ళు మూసుకున్నాడు కాని ఆలోచనలు సాగిపోతూనే ఉన్నాయి.

అడుగుల చప్పుడు వినబడుతున్నది.

కళ్లు మూసుకునే ఉన్నాడు వేణు.

తండ్రి లోపలికి వచ్చాడు. టిఫిన్ కారియరు బల్లమీద పెట్టి పళ్ళెం తుడిచి తీసుకువచ్చాడు. గ్లాసుతో మంచినీళ్లు పెడుతూ వేణూ! లేచి భోజనం చెయ్యి. ఇవాళ వంకాయ కూర, అల్లం పచ్చడి మూలక్కాడ పులుసు. అంటూ పళ్ళెంలో పదార్థాలన్నీ వడ్డించాడు.

వేణు పరధ్యానంతో లేచి కూర్చుని అన్నం తినటం మొదలుపెట్టాడు.

"వేణూ! నేను వెళ్ళిన తరువాత నర్సు లెవరైనా వచ్చారా మళ్ళీ? టెంపరేచరు చూశారా?" అడిగాడు. ఎదురుగా కుర్చీలో కూర్చుని.

రాలేదని తలవంచుకుని చెప్పాడు.

"నీవు ఏదో ఆలోచిస్తూ ఉంటావెందుకురా ఎప్పుడూ? మరీ ఇవాళ నీ ముఖం అదోలా ఉంది" అన్నాడు రంగారావు.

వేణు వంకాయ కూర కలుపుకుని ఒకముద్ద నోట్లో పెట్టుకున్నాడు. ఆ కూర! ఆ రుచి! ఈ ఊళ్ళో వంకాయ కూర ఈ విధంగా ఎవరు చేశారు? ఈ రుచులను మరచి ఎంత కాలమయింది? దీప ఒక్కతే చేయగలదు ఇటువంటి కూర. ఏమేమివేసి వండుతుందో - ఆచేత్తో ఏమీచేసినా అమృతం - అమృతమే.

ఎంతో ఆప్యాయంగా ఏమేమిటో జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఆ వంటకాలు అయిపోతాయేమోనన్నట్లుగా కాస్త కాస్త కలుపుకుని - మధ్యమధ్య ఆలోచిస్తూ భోజనం చేస్తున్నాడు వేణు.

ఆలోచనలు ఇటూ అటూ పోతున్నట్టుగా కొడుకుముఖం చూసి కనిపెట్టాడు రంగారావు.

"మనం అద్దెకు తీసుకున్న ఇంటి పక్కవాటాలో తెలుగు వాళ్ళున్నారురా. నీవిట్లా హాస్పిటల్లో ఉన్నావనగానే బామ్మగారిలాంటి ఆవిడ "నేను రుచిగా చేసి పెడతాను. అబ్బాయికి తీసుకువెళ్ళండి" అన్నది. ఏమన్నా నీకు హితవుగా ఉన్నాయా?" ఆప్యాయంగా అడిగాడు రంగారావు.

తల ఊపాడు వేణు బాగున్నా యన్నట్టుగా.

మరునాడు రంగారావు ఇంటికి వెళ్ళగానే పోస్టులో వేణుకు ఉత్తరం వచ్చింది.

"వేణూ! నిన్న నేను బాధ భరించలేక మీఅమ్మ కాళ్ళమీద పడిపోయాను. ఎలాగయినా మీ దగ్గరికి పంపించమని. మొదటి కోప్పడ్డారు. తర్వాత నా నుంచే ఇదంతా వచ్చిందని నిందించారు. తిట్టారు! చివరకు నా కన్నీళ్ళు చూడలేక మీ తమ్ముడు సుందర్‌ను నన్ను మీరున్న ఊరు పంపటానికి నిశ్చయ చేసుకున్నారు. నా మనసు ఎంత గంతులువేసిందని! ఇంక మీ దగ్గర ఉండవచ్చు. రాత్రింబగళ్లూ కంటికి రెప్పలా కాపాడవచ్చు. మీ బాధలన్నీ పోయేటట్టు తీయతీయటి కబుర్లు చెప్పవచ్చు నా చేతులన్నీ అరిగేటట్టు శుశ్రూష చేయవచ్చు. ఎంతయినా కంటి కెదురుగా ఉంటాను గనుక నా కెన్నాళ్ళనుంచో ఉన్న బాధ, గుండెను తొలిచివేసే బాధ, ఇంక ఉండదనుకుంటే ఎంతో సంతోషంగా ఉంది.

కాని—ఇదేమిటి—ఎన్ని గంటలయినా రాత్రి గడవదు? ప్రయాణమయి మనం చేరువవుతామనుకున్న దగ్గర్నుంచీ మనసు ఊరికే పరుగులు తీస్తున్నది. వచ్చిన తరువాత అన్ని కబుర్లు సమక్షంలో చెప్తాగా.

—మీ దీప."

దీప వస్తుందనుకోగానే వేణుకు వేయి ఏనుగులబలము వచ్చినట్లనిపించింది. దీప వస్తే వంటచేసి తీసుకువస్తుంది. తన చేతి వంట! ఆ రుచులతో హాయిగా తను ఆప్యాయంగా కబుర్లు చెబుతూ ఉంటే ఎంత హాయిగా ఉంటుంది? పగలంతా ఇక్కడే ఆమెతో కులాసాగా కబుర్లు చెప్పుకోవచ్చు. ఏదయినా మంచి పుస్తకం-

వారపత్రిక ఆమెచేత చదివించుకోవచ్చు. అసలు దీప వచ్చేస్తే ఏ సమస్యా ఉండదు. అన్నీ ఆమె చూసుకుంటుంది. ఈ నావకు ఆమె చుక్కాని.

కళ్ళు మూసుకుని తీయటి ఆలోచనలు చేస్తూ మధ్య మధ్య చిరునవ్వులు చిందస్తూ-భ్రూకుటి ముడుస్తూ దీపరాగానే కాలం ఎట్లా గడపాలా అని పథకాలు వేస్తున్న వేణుకు "ఏం రా! నిద్రలో ఉన్నావా? మేలుకునే వున్నావా? లే. లే. టిఫిన్ కారియరు తెచ్చాను'' అంటూ తండ్రి లోపలికి వస్తూ అన్న మాటలూ నవ్వు వినబడ్డాది.

వేణు లేచి కూర్చున్నాడు. రంగారావు టిఫిన్ కారియరు బల్లమీదపెట్టి మంచినీళ్లు పోసిన గ్లాసు పళ్ళెం దగ్గరగా జరిపాడు. టిఫిన్ క్యారియరులో వున్న పదార్థాలు పళ్ళెంలో వడ్డించి అన్నం పెట్టాడు.

వేణు భోజనం చేస్తూ ఆలోచిస్తున్నాడు. ఇంత రుచిగా వంటచేసి పెట్టే బామ్మగారు నాన్నకు ఇరుగు పొరుగులా లభించటం ఎంతో అదృష్టం. పాపం, బామ్మగారి కాలంలో స్త్రీలకు తమ తెలివితేటలూ-ఆలోచనా శక్తి పరిశోధన అంతా వంటకాలలోనేగా! అదే ఆమె మంచి యిల్లాలని ముద్ర పడటానికి ఆధారము. వేణు ఒక నవ్వు- విషాదభరితమయిన నవ్వు నవ్వుకుని ఇప్పటికీ కొందరు అంతే కాని-దీప సంగీతం-నాట్యం చిత్రకళ-పాకకళ మొదలైన వాటిలో యోగ్యతా పత్రాలుగల ఉత్తమ ఇల్లాలు.

వేణు ముఖం ప్రఫుల్లమయింది.

వేణు భోజనం కాగానే రంగారావు బల్లమీద పడుకుని పేపరు చదువుతూ నిద్రపోయాడు. వేణు ఏలకపండు ఒకటి ఒలిచి నోట్లో వేసుకుంటూ దీప వస్తానని వ్రాసిన ఉత్తరం ఎప్పటిది అనుకుంటూ ఉత్తరం మడత విప్పాడు.

పదిరోజులనాడు వ్రాసిన ఉత్తరమది. ఎందుకింత ఆలస్యం?

ఉత్తరం పైన ఉన్న పోస్టల్ ముద్ర- పరిశీగా చూశాడు. ఉత్తరం రాసిన వారానికి పోస్టు చేసింది.

రాసిన తరువాత వెంటనే పోస్టు చెయ్యలేదా?

బయలు దేరుతున్నానని సంతోషంతో వ్రాసిన ఉత్తరం పోస్టు చేయటానికి ఆలస్యం జరిగిందంటే ప్రయాణం ఆగిపోయే సూచనలో - సంఘటనలో ఇంట్లో జరిగి ఉండాలి. అమ్మ ఒప్పుకున్నా నాన్న ఆమోద ముద్ర పడితేనే గదా దీప ప్రయాణం సాగేది?

విరాశా విస్పృహలు అతడిని చుట్టుముట్టాయి. ఉత్సాహం నీళ్లగారి పోగానే అతడి శక్తంతా ఉడిగినట్లయిపోయింది.

సాయంకాలం నాలుగు గంటలుకాగానే తండ్రి అందించిన బ్రెడ్ కాఫీ తీసుకున్నాడు. ముభావంగా పక్కకు తిరిగి పడుకున్నాడు.

రాత్రి ఏడున్నర గంటలకు తండ్రి మళ్ళీ టిఫిన్ కారియరు తీసుకువచ్చాడు. బంగాళా దుంప వేపుడు, నాలుగు అప్పడాలు.

"నాన్నా! నీవు భోజనం చేశావా?" అన్య మనస్కుడిలా ఎటో చూస్తూ అడిగాడు.

"ఆఁ నేను రోజూ నీకు తీసుకువచ్చేటప్పుడే భోజనంచేసి వస్తాను. ఇక్కడి నుంచి మళ్ళీ వెళ్ళటం రావటం వృథాశ్రమ" పక్క దులిపి వేసుకుంటూ "వేణూ! చెప్పం మరిచాను. ఇవాళ మెయిలులో సుందర్ వచ్చాడు. అమ్మ ఏదో బజారు పనులు చెప్పిందట. అందుకని అలా బజారుకేసి వెళ్ళాడు" అన్నాడు.

"అయితే అమ్మ కూడా వచ్చిందా?"

"అమ్మ రాలేదు"

"సుందర్ ఒక్కడే వచ్చాడా?"

"ఆఁ. ఆఁ. అంతే. ఒక్కడే వచ్చాడు."

దీర్ఘమైన నిట్టూర్పు ఒకటి అనుకోకుండా విడిచాడు వేణు.

యథాప్రకారం నాలుగు గంటలకు తండ్రి కాఫీ బ్రెడ్ ఇచ్చి ఇంటికి వెళ్ళాడు.

వేణు ఆలోచనలు మళ్ళీ ముసురుకుంటున్నాయి. ఉత్తరం రాసిన దీప ఇంకారాలేదు రాకపోయినా ఉత్తరం రాయ్యొచ్చుగా?

నర్సు మామూలు వేళకు వచ్చి జ్వరం కొలిచి రాసుకుని వెళ్లిపోయింది. మేల్‌నర్సు వచ్చి ఇంజక్షను ఇచ్చి వెళ్లాడు.

వేణు సామాన్యంగా వాళ్ళతో మాట్లాడడు. ప్రశ్నలు వేయడు. వస్తుంటే చూస్తాడు. మందుపోస్తే తాగుతాడు. ఇంజక్షను ఇస్తే తీసుకుంటాడు. అతడిని చూసి వాళ్ళనుకుంటారు పేషంటు చాలా దిగులుగా ఉన్నాడని.

ఆరున్నర కాగానే దీపాలన్నీ వెలిగిస్తారు.

వేణు గది ఎప్పుడూ ఓరవాకిలిగా వేసి ఉంటుంది. అతడు కళ్ళు తెరచు కున్నప్పుడు, ఆ వాకిలివైపు చూస్తాడు అప్పుడప్పుడు.

వేణు తలుపులవంక చూస్తున్నవాడల్లా ఉలికిపాటుగా లేచి కూర్చున్నాడు. లేత నీలంరంగు చీరె తలుపు సందులలో నుంచి కనబడ్డది. పొరబడ్డాడేమో అనుకోవటానికి వీలులేదు. ఐదునిమిషాలసేపు కనబడ్డది.

"ఎవరది? లోపలికి రావచ్చు" అన్నాడు సంభ్రమంతో.

మరో రెండు నిముషాల తర్వాత "ఎవరూ అక్కడ నిలబడ్డది? తలుపులు బాగా తెరవండి" అసహనంగా అడిగాడు.

చప్పున లేతనీలంరంగు చీర మాయమయింది. యథా ప్రకారం దీపపు కాంతులు తలుపు సందులుగుండా ప్రసరించాయి.

హతాశుడైనట్టుగా వేణు పక్కమీద వాలిపోయాడు. ఏదో పోగొట్టుకున్నట్టుగా ముఖం వేలాడిపోయింది.

తలుపులు దభాలున నెట్టుకుంటూ రంగారావు టిఫిన్ కారియరుతో లోపలికి వచ్చాడు.

ఆవేళప్పుడు సాధారణంగా కొడుకు ముఖం కడుగుకొని తలదువ్వుకుని ఏదో పత్రిక చేతపట్టుకుని కనబడతాడు. ముఖం పక్కకు తిప్పుకున్న వేణును చూడగానే ఒక అడుగు వెనక్కు వేశాడు రంగారావు.

రంగారావు వేణును పలకరించకుండా ఆ గదిలో వస్తువులన్నీ చక్కగా సర్దుతూ పావుగంట గడిపాడు. ముఖం తుడుచుకుంటూ మంచం దగ్గరగా కుర్చీ లాక్కుని స్థానిక వార్తలు - రాష్ట్ర రాజకీయాలు - కేంద్రంలో అలజడులూ మెల్లగా చెప్పటం మొదలు పెట్టాడు.

"వేణూ! అమ్మ నీకు ట్రాన్సిస్టరు పంపించిందిరా. నేను వచ్చేటప్పుడు తీసుకువద్దామనుకున్నాగాని - బ్యాటరీలు కొత్తవి వెయ్యాలన్నాడు సుందర్. అందుకని ఆగాను. రేపు వచ్చేటప్పుడు తీసుకువస్తాలే" అన్నాడు మామూలుగా.

వేణుకు ఒళ్ళు మండిపోతున్నది. తను యం. కాం. చదివాడు. టొబాకో కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు- ముప్పైఏళ్ళు దాటినవాడు, ఇద్దరు పిల్లల తండ్రి. తనతో తండ్రి చిన్నపిల్లవాడితో మాట్లాడినట్లు మాయమాయగా మాట్లాడుతున్నాడు. తండ్రిని ముఖమ్మీద నాలుగూ అడిగేయాలని ఉంటుంది. కాని - చిన్నప్పటినుంచీ తండ్రి దగ్గర చనువు తక్కువ. కావలసినవన్నీ తల్లి నడిగే తీసుకునేవాడు. తండ్రితో ఏదయినా చెప్పవలసి ఉంటే తల్లిచేత చెప్పించేవాడు. ఉద్యోగంలో ప్రవేశించిన తరువాత తండ్రితో మర్యాదగా - కొద్దిగా ముభావంగా మాట్లాడటం అలవరచుకున్నాడు.

ఆ మరునాడు వేణుకు పోస్టులో ఉత్తరం వచ్చింది.

దస్తూరి చూడగానే ముఖం కొంచెం విప్పారింది. "మనిషి రాకపోయినా ఉత్తరం రాసింది నయమే" అనుకుంటూ విప్పాడు.

"వేణూ! నేనొచ్చాను, ఇక్కడికి రావాలన్న నా మనోరథం ఈడేరింది, వచ్చాను. పిల్లలను అమ్మ దగ్గర ఉంచి-నేను ఉత్తరం రాయగానే తీసుకువచ్చే ఏర్పాటు చేసి వచ్చాను. మీకు చదివి వినిపించటానికి బుట్టనిండా పుస్తకాలు నింపుకుని తీసుకువచ్చాను. మీకు ఇష్టమయిన టిఫినులు తీసుకువచ్చాను. మిమ్మల్ని కంటితో చూడవచ్చుననే ఆశతో వాయువేగ మనోవేగాలతో వచ్చాను. మీకు ఇష్టమయిన వంటకాలుచేసి టిఫిన్ కారియరుతో పెట్టుకుని మీ పుట్టినరోజుకు మీరు నాకు కొని ఇచ్చినచీరె కట్టుకుని బయలుదేరాను.

కాని - గంపెడాశతో వచ్చిన నన్ను మీ నాన్నగారు తలుపు దగ్గరే ఆపేశారు. తలుపు సందులుగుండా చూడమన్నారు. దుఃఖం ముంచుకు వచ్చింది. "అయితే ఇంటికి వెళ్ళు"మన్నారు.

నా బాధనంతా దిగమింగి తలుపు సందులలో నుంచి చూశాను. తలుపు వైపే చూసే మీ కళ్ళను చూశాను. ఇంజక్షన్లతో - మందులతో కొంచెము ఒళ్ళు చేసి - తెల్లగా మిసమిసలాడే మీ ముఖం చూశాను. మాట్లాడాలన్న ఆవేశంతో తలుపులు నెట్టుకుని లోపలికి రాబోయాను. మీ నాన్న చెయ్యి పట్టుకుని లాక్కు వెళ్ళారు.

సినిమా చూసినట్టుగా మిమ్మల్ని చూడగలిగాను. అలా అయిదు నిమిషాలు తలుపు సందులగుండా నేను నిబ్బరంతో చూడగలిగితే ఇక్కడ ఉంచుతారట. లేకపోతే రేపే రైలెక్కిస్తారట.

నే నందుకు ఒప్పుకున్నాను. ఆడినమాట తప్పనని మీమీద ఒట్టేసుకున్నాను లోపలికి వచ్చి చూసి - మీతో మాట్లాడటానికి ప్రయత్నించను. మనోభావాలను అరికట్టాను. ఉద్రేకాలను అదుపులో పెట్టుకోవటానికి ప్రయత్నిస్తాను. నిబ్బరంగా ఉండటం అలవరచుకుంటాను.

నిర్లిప్తంగా పరోక్షంగా మీకు సేవచేయటానికి నిశ్చయించుకున్నాను పిల్లలను పిలిపించే మాట తలపెట్టను. రోజూ వస్తూ - వుంటా సరిగ్గా 6-30 లేక 7 గంటలకు, మీకనుచూపయినా లభిస్తుందనే ఆశతోను.

మీ దీప''

వేణు అదిరిపడి లేచి కూర్చుని మళ్ళీ చదివాడా ఉత్తరాన్ని,

దీప వచ్చేసిందన్న మాట. పాపం నన్ను చూడాలన్న గంపెడాసతో వచ్చింది. నాన్న ఇంత కఠినంగా ఎట్లా ఉండగలుగుతున్నాడు? నా కేమీ తెలియదని ఎంత తియ్యగా మాటలు చెప్పి మరపించాలని చూస్తున్నాడు?

అప్పుడతడికి వచ్చిన కోపం అంతకు ముందెప్పుడూ రాలేదు. ఆ రోజు టెంపరేచర్ చూడటానికి వచ్చిన నర్సును విదిలించికొట్టాడు. ఇంజక్షను తీసుకోనని మొండికెత్తాడు. అశాంతిగా ఇటూ అటూ తిరగటం మొదలుపెట్టాడు.

తండ్రి మామూలు వేళకు టిఫిన్ కారియరు తీసుకుని మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చాడు. తండ్రి ముఖం చూడగానే వేణు ముఖం జేవురించింది. పళ్ళు పటపట కొరుకుతూ ''నాన్నా! నన్ను మోసం చేయాలని ఎందుకు

చూస్తున్నారు? జరిగేది ఒకటీ-నాతో చెప్పేది ఒకటీనా? ఈ వయసులో కూడా ఎందుకు నాన్నా ఈకుట్రలు? ఈ మోసాలు ఎందుకు?" ఇంచుమించుగా అరిచాడు.

"ఏమిటి బాబూ, ఏమిటిది?" టిఫిన్ కారియర్ అక్కడపెట్టి కొడుకును రెండు చేతులతో పొదివి పట్టుకున్నాడు.

"దుర్మార్గుడా! దూరంగా ఉండు. నన్నింత మోసం చేస్తావా?" తండ్రిని నెట్టినంత పనిచేశాడు వేణు. ఆయాసం కొద్దీ రొప్పుతున్నాడు.

రంగారావు కాలింగ్‌బెల్ నొక్కాడు. వెంటనే నర్సులిద్దరు పరుగెత్తుకుంటూ వచ్చారు. వేణును అందరూ పట్టుకుని బలవంతంగా మంచంమీదకి చేర్చారు.

"నాన్నా! ఎందుకిట్లా చేశావు? పుట్టెడు రోగంతో తీసుకుంటున్నానే! నన్నిట్లా దుఃఖపెడతావా?" పట్టలేక బిగ్గరగా ఏడ్చాడు వేణు.

"నేనేం చేశానురా వేణూ! నీ జబ్బు తగ్గిపోతేచాలునని వేయి దేవుళ్ళకు మొక్కుకుంటున్నానురా తండ్రీ. మనసు కుదుటపరచుకో బాబూ!" మంచమ్మీద కూర్చుని వెన్నుమీద రాస్తున్నాడు రంగారావు

"ఇంత మోసంచేసి పైకి ఏమీ ఎరగనట్టు ప్రేమ ఒలకపోస్తావా? దీప విషయంలో నీవు అబద్ధమాడ లేదూ? నిజం చెప్పు!" లేచి కూర్చున్నాడు వేణు.

"నేనేం చేసాను? దీపను పిలిపించమన్నావు. ఉత్తరం రాశాను. పిల్లలను తీసుకుని వస్తానంది. బయలుదేరుతున్నట్టు ఉత్తరంవస్తే స్టేషనుకు వెళ్ళి తీసుకువస్తాను. సరేనా?" మెల్లగా సమాధానమిచ్చాడు రంగారావు

"కాదు అన్నీ అబద్ధాలు. దీప వచ్చింది. నన్ను చూడాలనివస్తే నీవు లోపలికి రానీయలేదు. అవునా-కాదా?" గద్దిస్తున్నాడు వేణు.

అంతలో డాక్టరు లోపలికి వచ్చాడు. రంగారావు తటాలునలేచి నిలబడ్డాడు.

ఏమిటన్నట్టు డాక్టరు రంగారావుకేసి చూశాడు. వేణు చెయ్యి పట్టుకుని నాడి చూస్తున్నాడు.

"ఏం లేదండీ! ఏదో మాటా మాటా వచ్చి ఉద్రేకపడుతున్నాడు. నేను వర్ది చెబుతున్నాను." అన్నాడు రంగారావు.

వేణు ముఖం కందగడ్డలా అయింది. తండ్రిని చెడా మడా తిట్టెయ్యాలని లేచి కూర్చోబోయాడు.

డాక్టరు రెండు చేతులలో వారించి "మిస్టర్ వేణు. శాంతంగా ఉండాలి మీరు. కాఫీ తీసుకున్నారా? వేళ దాటలేదూ? ఉద్రేకం పనికిరాదు" కుర్చీ మంచానికి దగ్గరగా లాక్కుని కూర్చున్నాడు.

"డాక్టర్! నేనేదయినా సహిస్తాను. కాని - మోసాన్ని సహించలేను. ఈ లోకంలో తండ్రులు కొడుకులను కూడా మోసం చేస్తారు. ఇంతకంటే నీచం ఎక్కడయినా ఉన్నదా? నాకు లోకమ్మీదే అసహ్యం పుడుతోంది. నిన్నటివరకూ నాకు జబ్బు నయం చేసుకుని తొందరగా ఇంటికి వెళ్లాలని ఉండేది. కాని నిన్న మధ్యాహ్నం నుంచీ ఇక్కడ ఈ హాస్పిటల్లో ఈ మంచం మీదనే ప్రాణం విడవాలనుంది. నాకు మీరు మందులూ ఇంజక్షన్లూ ఇవ్వకండి. ఇచ్చినా నా సహకారం లేనిదే అవి పని చేయవు " కళ్ళమీద చేతులు పెట్టుకుని పక్కకు తిరిగాడు.

డాక్టరు చేతిసైగ చేయగానే రంగారావు గదిలోనుంచి వెళ్ళిపోయాడు.

హాస్పిటల్ భవనం చుట్టూ వేపచెట్లు వేశారు. ఆ వేపచెట్లు ఆరోగ్యవంతమయిన గాలిని పెద్దపెద్ద కిటికీలగుండా రోగుల మనసులనూ, దేహాలనూ చల్లబరచటానికి పంపుతూ ఉంటాయి. మండువేసవిల్లో కూడా ఆ వేపచెట్లవల్లనే ఆ హాస్పిటలు చల్లగా మంచుకొండ మీద ఉన్నట్టుగా ఉంటుంది.

డాక్టరు చేతిలో వేణు చెయ్యి ఉన్నది. మాట్లాడటం ఇష్టంలేక వేణు కళ్ళు మూసుకున్నాడు. కొంతసేపటికి వేణు నిద్రలోకి జారుకోవటం చూసి డాక్టరు గది తలుపులు దగ్గరగావేసి వెళ్ళిపోయాడు.

మరునాడు ఉదయం గతదినం జరిగిన విషయాలను జ్ఞాపకం చేసుకోవడానికి వేణు ప్రయత్నిస్తున్నాడు. తండ్రితో మాటా పలుకూ లేకుండా పెట్టినదేదో తిన్నాడు. తండ్రి తలుపులు దగ్గరగావేసి ఇంటికి వెళ్ళాడు.

ఆ రోజు వేణు చాలా విరక్తుడుగా ఉన్నాడు. ఎవరికోసం ఎదురుచూడటం లేదు. గోడవైపు ముఖంచేసి పడుకున్నాడు.

పోస్టుమెన్ ఉత్తర మొకటి బల్లమీద పెట్టి వెళ్ళాడు. వేణు నిర్లక్ష్యంగా పడుకున్నాడు. కాని చాలాసేపు అలా నిర్లిప్తంగా పడుకోలేకపోయాడు. ఆ ఉత్తరం ఎక్కడినుంచో అతడికి బాగా తెలుసు ఆ ఉత్తరం రాసినవాళ్లు తన వెనక ఉన్నట్టే అనిపించటం మొదలుపెట్టింది.

దిగ్గున లేచి కూర్చుని ఆ ఉత్తరం అందుకుని చింపి చదివాడు

"వేణూ, మీ సంగతులు నాకు ఎప్పటికప్పుడు చేరే ఏర్పాటు చేసుకున్నాను. మీ దగ్గరుంటున్న నర్సు నాకు రోజుకు మూడుసార్లు టెలిఫోను చేసే ఏర్పాటు చేసుకున్నాను. మేము ఉంటున్న ఇంటికి రెండిళ్ళ అవతల బేకరీషాపు ఉంది. అక్కడికి వెళ్ళి నేను ఫోను చేయగానే ఆమె నాతో అన్ని సంగతులు చెబుతుంది. నేను పంపుతున్న కాఫీ నచ్చుతున్నదా? మీకు అలవాటని కొద్దిగా పంపుతున్నాను. అసలు మీరు పాలే ఎక్కువగా తాగాలి. వంట బాగుంటున్నదా? నేను ఇటీవల నేర్చుకున్న కొత్త వంటకాలు రోజుకొకటి వంతున చేసి పంపుతున్నాను. హాస్పిటల్లో మంచమ్మీద ఉంటే ఎవరికయినా భోజనం హితవనిపించదు. కాని- హితవు చేసుకోవాలి.

పాపం, మామగారు ఎందుకో చిన్నబుచ్చుకుని తిరుగుతున్నారు. ఆయన మనసు చాలా బాధపడుతున్నది. కన్నీరు గారుస్తూ భోజనం చేస్తున్నారు. ఆయనను చూస్తుంటే నా మనసంతా అల్లకల్లోలమయి పోతున్నది. ఆయన నా తండ్రివంటి వారు. ఆయన బాధను చూడలేకుండా ఉన్నాను. ఆయన నన్ను ఏ మాటన్నా నా మంచికేనని భావించుకుంటే నా కెంతో శాంతిగా ఉంది.

నా మనస్సిప్పుడు చాలా ప్రశాంతంగా ఉంది. నా ప్రేమ మూర్తిని పరోక్షంగా ఆరాధిస్తున్నాను. మీ దగ్గరనుంచి ఉత్తరం రాలేదని గాని- మిమ్మల్ని చూడాలనిగాని- మీతో మాట్లాడాలనిగాని నా మనసిప్పుడు ఆరాటపడటంలేదు. మీకు కావలసినది సమకూరుస్తూ- మీ క్షేమాన్ని కాంక్షిస్తూ మంచిరోజు కోసం ఎదురు చూడటంలోనే నాకానందం కలుగుతోంది. మీరు కూడా నాలా ఉండటానికి ప్రయత్నించండి.

మీ దీప"

ఉత్తరం చదువుతుంటే వేణు కళ్ళ వెంబడి నీరుగారి తలగడ అంతా తడిసింది.

ఇది జరిగిన వారం రోజులకు వేణుకు ముక్కులోనుంచి నోట్లోనించి రక్త స్రావమయింది. లాభంలేదని తెలిసికూడా సూపర్నెంటు ఆఖరి ప్రయత్నం వైద్యుడిగా చేయవలసి ఉన్నది కనుక తండ్రి సమ్మతితో ఆపరేషను చేశాడు.

ఆపరేషను జరిగింది. రోగిని తీసుకువచ్చి మంచమ్మీద పడుకోబెట్టారు. దీపవచ్చి అతడికి దగ్గరగా కూర్చుని అతడి చేతులను తన నుదుటికి ఆనించుకుని కళ్లు మూసుకుంది.

వేణు అరగంట తరువాత కళ్లు తెరిచాడు. తలుపు దగ్గరగా నిలబడ్డ తండ్రిని చూశాడు. తలదగ్గరగా నిలబడ్డ తల్లిని ఒక నిమిషంసేపు చూశాడు. భయంతో గోడ కానుకుని నిలబడ్డ పిల్లలను కళ్ళెత్తి చూశాడు. జ్యోతుల లాంటి కళ్ళతో తననే తదేకంగా చూస్తున్న దీపను కళ్లారా చూశాడు. అంతే- తలవాల్చేశాడు

మరునాడు ఉదయం తండ్రి రంగారావు కన్నీళ్ళు కారుస్తూ ఆ గది ఖాళీ చేయటానికి వచ్చాడు కొడుకు వస్తువులూ బట్టలూ అన్నీ కాల్చేశాడు. వేణు తల క్రింద భద్రంగా పిల్కు రుమాలులో ఉన్న ఉత్తరాల కట్టను చూసి బావురుమన్నాడు.

అతడు ఇంటికి తీసుకురావలసిన వస్తువులేవీ కనబడలేదు. చెంబు గ్లాసు ప్లాస్కు వంటివి కడిగి అక్కడ ఉన్న పేదరోగులకు ఇచ్చేశాడు. సిల్కురుమాలు మూటను కన్నీళ్ళతో ఇంటికి తీసుకు వచ్చాడు.

"అమ్మా దీపా! నా కొడుకునూ వాడి వస్తువులనూ కాల్చివేయగలిగాను. కాని- వాడు ప్రాణపదంగా చూసుకున్న ఈ ఉత్తరాల కట్టను కాల్చివేయలేక నీ కోసం తీసుకువచ్చానమ్మా. ఇవే నేను మిగల్చగలిగినవి" కోడలి రెండు చేతులలో ముఖం దాచుకుని ఏడ్చాడు.

శివరావుతోపాటు పరమేశం నరహరి కూడా కళ్ళు అద్దుకున్నారు

కొంతసేపటికి నరహరి ముందుగా తేరుకుని "ఏమిటయ్యా! ప్రేమలేఖలు. ప్రేమలేఖలని కంటతడి బెట్టించావు?" అన్నాడు.

"శివరావూ! నీకూ ఆ ఉత్తరాలకూ ఏం సంబంధం?" అడిగాడు పరమేశం.

"దీప నా పెద్ద కూతురయ్యా బాబూ!" కళ్లు ఒత్తుకున్నాడు శివరావు.

ఇంకా ముగ్గురూ అలా కూర్చునే ఉన్నారు. ప్రణయంలో నుంచి - దాని పరిణామాలలోనుంచి ఇంకా తేరుకోలేదు. ముగ్గురూ కొత్త సిగరెట్లు అందుకొని వెలిగించుకున్నారు.

ముగ్గురూ ఒక్కసారే అదిరిపడి వెనక్కు తిరిగి చూశారు. లోపలినుంచి ఎవరిదో నవ్వు వినబడుతోంది. రెండు నిమిషాలకు, చెదరిన క్రాపుతో - నలిగిన బట్టలతో తూలిపోతూ పాతికేళ్ళ మనిషి వచ్చి వాళ్ళ కెదురుగా పిట్టగోడమీద కూర్చున్నాడు.

"మీరు ముగ్గురూ క్లబ్బుకు క్రమంతప్పకుండా వస్తారు. బుద్ధి ముట్టుకోలేరు. అంతా వయసుమళ్ళిన వాళ్లు. ఎంతసేపటినుంచో ప్రణయాన్ని గురించి మాట్లాడు కుంటున్నారు" విరగబడి నవ్వాడు.

ముగ్గురూ దిగ్భ్రాంతులై చూస్తున్నారు.

"ఆ కబుర్ల వల్ల మీ హృదయాలేవన్నా పరవశించిపోయాయా? సాంసారిక మయిన కష్టసుఖాలు చెప్పుకుని ముగ్గురూ కన్నీరు కారుస్తున్నారు. అది కాదు ప్రణయ మంటే. ఇదిగో నా జేబులో ఉన్నాయి. ప్రణయలేఖలు- రెండు కట్టలు. ఒక కట్ట ఒక అమ్మాయి ఒక అబ్బాయికి రాసినవి. ఇంకో కట్ట అబ్బాయి అమ్మా యికి రాసినవి. ఇద్దరూ విద్యార్థి దశలో సరిహద్దులు లేని యౌవ్వనపు పొంగులో కలుసుకున్నారు. ఇప్పుడిద్దరికీ వివాహాలయ్యాయి. వేరువేరుగా ఈ ఉత్తరాలు వాళ్ళ జీవిత భాగస్వాములకు చూపిస్తానని బెదిరిస్తే నాకు వేలకు వేలు లాభము. అబ్బాయి రాసిన ఉత్తరాలు ఆమ్మాయి పెనిమిటికి చూపిస్తే పిడుగులు పడతాయి. ఇంట్లో చిచ్చు రేగుతుంది. ఆ సంసారం నాశనమయి పోతుంది. అమ్మాయి రాసినవి అబ్బాయి భార్యకు చూపిస్తే ఆ యింట్లో ప్రళయం తాండవిస్తుంది. ఇల్లరికపు టల్లుడు గజగజ లాడుతాడు. ఇంట్లోనుంచి ఉద్వాసన చెబుతారు అత్తమామలు.

ఈ ఉత్తరాల కట్టలు చదువుతారా? ఇప్పుడు వాళ్ళ జీవితాలను నాశనం చేసే ఈ ఉత్తరాలు ఇతరులు చదివితే మనసులు పరవళ్ళు తొక్కుతాయి ఆ ప్రణయం మనిషిని ఎట్లా కాల్చేస్తుందో; ఎటువంటి పనులు చేయిస్తుందో- ఎట్లా

రాయిస్తుందో ఆ దశలో ఉన్నవాళ్ళకు అర్థంకాదు. వాళ్లే తర్వాత వాటిని చదువుకోవటం తటస్థించితే ఎట్లా ఉంటుంది?" కడుపు పట్టుకుని నవ్వుతున్నాడు.

"ఎట్లా ఉంటుందా? అది పదికాలాలపాటు నిలిచిన ప్రణయమైతే- ఆ రాసినవారు తిరిగిచదువుకుంటే 'అబ్బా! ఇట్లారాసుకున్నామా!' అంటూ తన్మయులవుతారు. అది పొంగులాంటి ప్రణయమయితే 'ఏదో- అదోపిచ్చి ఆ పిచ్చిలో రాసుకున్న' అనుకుంటారు సాంఘికామోదం లేని ప్రణయమైతే ఆ లేఖలు తరువాత వాళ్ళెప్పుడయినా చదువుకోవటం తటస్థించితే సిగ్గుతో తలలు వంచుకుంటారు" అన్నాడు శివరావు.

మళ్ళీ పకృ్కన నవ్వాడు ఆ యువకుడు.

"అయ్యో! పెద్ద మనుషులూ! చాటుమాటు ప్రణయమే దినదిన ప్రవర్థమానవుతుంది. హద్దులులేని పరిస్థితులలోనే ప్రణయము పొంగుతుంది. ఆ ఉత్తరాలే మజాగా ఉంటాయి!"

ముగ్గురూ మాట్లాడకుండా అతడినే చూస్తున్నారు.

"మీ ముగ్గురిలో నరహరి ఎవరు? శివరావు ఎవరు?" అడిగాడు యువకుడు

ఉలిక్కిపడ్డారు నరహరీ, శివరావు.

"ఏం? ఎందుకు?" ఇద్దరూ ఒకసారే ప్రశ్నించారు

"ఎందుకా? మీ అడ్రసులు తెలుసుకుని మీ ఇళ్లకు రావాలి" అన్నాడు ధీమాగా.

"ఏం పని?" ఆశ్చర్యంతో తడి ఆరిపోయిన గొంతుతో అన్నారు.

"ఏం పనా? ఇప్పుడే చెప్పానా? నా జేబులో ఉన్న ఉత్తరాల కట్టలు తీసుకువస్తా, మీకు చూపించి వేలకువేలు సంపాదిస్తా. చెప్పండి మీరు ఏఏ వేళల్లో ఇంట్లో ఉంటారో? రెండు కాళ్ళూ దూరదూరంగా పెట్టి ఉత్తరాల కట్టలు చేతిలో పట్టుకుని చూపిస్తూ అడిగాడు.

గుండెలు ఝల్లుమన్నవి శివరావుకూ, నరహరికి.

"మీ ఇద్దరిలో ఎవరి అమ్మాయి అమృతవల్లి? ఎవరి అబ్బాయి మురళి?" గంభీరంగా ఉంది అతడి కంఠం.

"నా కూతురు అమృతవల్లి, అయితే ఏమంటావు?" దబాయించబోయాడు నరహరి.

"అయితే ఏమా? ఇవిగో ఆమె విద్యార్థినిగా ఉండగా సహాధ్యాయికి వ్రాసిన ఉత్తరాలు. అవి నా చేతిలో ఉన్నాయి. ఇవి అమ్మాయి భర్తకు చూపిస్తే నాకు కనీసం పదివేలు వస్తాయి. చూపించమంటారా?" చేతిలో ఉన్న కాగితాల కట్టను ఆడించి చూపించాడు.

"చూపించు! డబ్బు సంపాదించుకో!" బెదిరిస్తున్నట్టుగా అన్నాడు.

"అలాగా? మీ పరువు ప్రతిష్ఠల మాట?" గతుక్కుమన్నాడు నరహరి.

"ఏమండీ శివరావుగారూ? మీ మురళి మాట ఏమిటి?" శివరావు వైపు తిరిగాడు.

"ఏదో క్లబ్బులో కాలక్షేపం చేద్దామని వచ్చిన వాళ్ళము, మా దగ్గర డబ్బేముంటుంది? అయినా మా మురళే ఆ ఉత్తరాలు రాసినట్టు దాఖలా ఏమిటి?" దబాయించబోయాడు శివరావు.

"అలాగా? ఇవిగో ఫోటోలు మీ మురళి ఫోటో ఇదిగో బాగా చూడండి. ఇదిగో అమృతవల్లి ఫోటో చూసుకోండి" రెండు ఫొటోలూ చూపించాడు.

"సరే నీ ప్రజ్ఞ చూపించావు. రేపీ వేళకు ఇక్కడే కనబడు. మేమిద్దరం చెక్కులు రాసి పట్టుకొస్తాం. ఈ భాగ్యానికి ఇళ్ళకు కూడా ఎందుకు?" శివరావు కూర్చున్న చోటనుంచి లేచాడు స్నేహితులిద్దరికీ కంటితో సైగచేశాడు లేవమని.

ముగ్గురు లేచి వెళ్లుతుంటే అతడు వాకిలి వరకూ వచ్చి "ఏమండోయ్. నా చెక్కులు మాట మరచిపోకండి. రేపు తీసుకువచ్చి ఇవ్వకపోతే మీ ఇళ్ళకు రావటం తథ్యం."

తలలు వంచుకుని ముగ్గురూ గబగబా అడుగులు వేస్తూ సాగిపోయారు.

తూలుతూ నవ్వుకుంటూ లోపలికి వెళ్ళిపోయా డతడు.

('అనామిక' ప్రత్యేక సంచిక)

# కాల్పనిక జగత్తు

సాయంకాలపు నీరెండలో పెరట్లో చాపవేసుకుని ఆంగ్ల వారపత్రిక చూస్తూ కూర్చున్నది దుర్గ. పిల్లలు బాదంచెట్టు క్రింద ఆడుకుంటున్నారు. మధ్య మధ్య పిల్లలను చూస్తూ పత్రిక పేజీలు తిరగవేస్తున్నది. ఆమె మనసు మాత్రం అటువంటి తీరికవేళల్లో ఒళ్లు జలదరించే జీవిత ఘట్టాలమీదికి పరుగులు తీస్తూ ఉంటుంది. ఆ ఘట్టాలలో ఒకటి మరీ ఉజ్జ్వలమైనదీ- మదురాతిమధుర మయినది.

దుర్గ అనుకుంటుంది "మనుష్యుల కంటే వాళ్ళకు సంబంధించిన స్మృతులు - మధురమైనవా ?" అని.

"అవును. మధురమైనవే" అంటుంది మనసు.

అప్పుడు- అంటే తను చదువుకునే రోజుల్లో ఒక్కొక్కనాడు తను కాలేజీకి వెళ్ళటానికి బస్సు అందుకోలేకపోయేది. తమ యింటినుంచి రెండు ఫర్లాంగులు నడిస్తేనేగాని బస్స్టాండుకు చేరుకోలేకపోయేది. అప్పుడప్పుడు నడక వేగం తగ్గిపోయేది. అటువంటి సందర్భాలలో అక్కడ బస్సు దొరక్కపోతే మరొక బస్సు వచ్చేవరకూ ఆగవలసి వచ్చేది. అప్పుడప్పుడు మరొక స్టాపు దగ్గరకు నడుస్తూ వెళ్ళేది. ఆ దారిన నడుస్తుంటే ఆర్చీలు చెక్కిన వరండాలు గల ఇంటివైపు కళ్ళు వాటంతట అవి తిరిగేవి. సరిగ్గా ఆ సమయంలో ట్రిమ్గా డ్రస్సు వేసుకున్న యువకుడు చేతులు కట్టుకుని స్తంభాని కానుకుని నిలబడి ఉండేవాడు అతడి కళ్ళద్దాలు ఆతడు తల కదలించి నప్పుడల్లా వింతగా మెరుస్తూ ఉండేవి. అతడు తను నడచి వచ్చేవైపే చూస్తూ ఉండటం కనిపెట్టింది. ఆ యిల్లు దాటేవరకూ తను అతడిని చూడగలిగేది, అతడు ఆ వీధిమలుపు తిరిగేవరకూ తనను చూడగలిగేవాడు

ఇంచుమించుగా వారానికి రెండుసార్లు ఇలా జరిగేది.

మనసు కుతూహలం పట్టలేక ఎవరినయినా అతడిని గురించి అడిగి తెలుసుకుందామని ఉరకలు వేసేది. కాని అడగలేకపోయింది.

ఒకనాడు యిందుకు భిన్నంగా జరిగింది. తను ఆ వీధిగుండా వస్తుండగా అతడు చూశాడు. ఎప్పుడు చేరుకున్నాడో బస్‌స్టాండుకు చేరుకుని తనకంటె ముందుగా బస్సెక్కి కూర్చున్నాడు. తనకెక్కడా సీటులేకపోతే కండక్టరు అతడి పక్కనే తనను కూర్చోమన్నాడు అంతటితో ఆ ఘట్టము ఆగలేదు. తను దిగ వలసిన స్టాపులో తనకంటె ముందుగా దిగి తనకంటె ముందు నడవటం మొదలు పెట్టాడు. తనకు మొదట ఆశ్చర్యం-తరువాత కుతూహలం ఆ తరువాత కించిత్ కోపం - ఆపైన రోషం వచ్చేశాయి. మూతి మూడు వంకరలు తిప్పుకుంటూ కాలేజికి వెళ్ళిపోయింది. ఇలా జరగటం మరుసటి వారం నుంచి దినచర్య అయిపోయింది.

ఒకబాటన నడిచే బాటసారు లయిం తరువాత కూడా మాటలు కలపలేదు. కాని క్రమంగా ఆమెలో కోపం-రోషం మటు మాయమయ్యాయి. ఆశ్చర్యం అంతరించిపోయింది. కుతూహలం కనబడకుండా పోయింది వాటి స్థానంలో ఒక అలవాటైన పద్ధతి ఒకనాడు జరగకపోతే ఎలా ఉంటుందో అలా ఏదో వెలితిగా మనసుకు తోచేది. బస్సు ప్రయాణం తలచుకుంటే మనసును ఉల్లాసపరచే భావం మనసులో తీయగా మెదిలి రోజుకొక డిగ్రీ వంతున పెరుగుతూ వుండేది. క్రమంగా అది మధురాతిమధురమై హృదయంలో పీఠం వేసుకుని బరువెక్కటం మొదలు పెట్టింది.

"అయితే ఇలా తనకొక్క దానికేనా?' మనసులో సందేహాస్పదమైన ప్రశ్న ఒకటి బయలుదేరేది. ఏమో! తనకేం తెలుసు? అతడి మనసులో కూడా తన మనసులో బయలుదేరి నటువంటి గందరగోళం ఒకటి బయలుదేరిందేమో?

ఒకనాడు కాలేజికి వెళ్ళటానికి చెప్పులు వేసుకుని బయలుదేరి వాకిట్లోకి రాగానే అతడు వచ్చి - తనను తప్పుకుంటూ గబగబా ప్రక్క వాటాలోకి వెళ్ళాడు.

"ఇదేమిటి? ఇంటికికూడా వచ్చాడు?" అనుకుంది మొదట. "దానికోసం ఎన్నాళ్ళనుంచీ నీవు ఎదురు చూడటం లేదు." అని మనసు ప్రశ్నించింది. అయినా మనసులో ఎన్నో భావాలు - భూమికీ, ఆకాశానికీ అందనివీ - పైకి వ్యక్తం చేయలేనివీ ఎన్నో ఉంటాయి. అవి మధురమైనవే కావచ్చు. మధురాతిమధురమైనవి కావచ్చు. కాని-అవి తీరా ప్రత్యక్షంగా జరుగుతుంటే హృదయం కంపించిపోదూ? ఒళ్లు జలదరించదూ? అలాగే దుర్గ పరిస్థితిలో మార్పు.

"నేను ఆర్మీలో చేరిపోదాం అనుకుంటున్నా" ఒకనాడు తమ గదిలో చీరె కట్టుకుంటుంటే ప్రక్క వాటాలో నుంచి మాటలు వినబడుతున్నాయి.

"కావాలని ఎందుకు యుద్ధంలోకి వెళ్తావు?" ప్రశ్నిస్తున్నా రెవరో.

"నాకు ఇక్కడేముంది? నేను కావాలనుకునేవాళ్లూ లేరు. నన్ను అదుపులో పెట్టేవాళ్లూ లేరు. ఎక్కడుంటే ఏం? యుద్ధంలో చేరితే దేశసేవ చేసినవాణ్ణయినా అవుతాను" ఏదో వేదాంత ధోరణిలో జవాబు

తను ఆ మాటలు చెవులారా విన్నది. హృదయంలో భయం ఆందోళన చోటు చేసుకున్నాయి "నీ కోసం అలమటించి పోయేదాన్ని నేను లేనా? నేను లేనా?" హృదయం ఆక్రోశించింది.

నిజంగానే ఒకనాడు అతడు ఆర్మీలో మరునాడే చేరబోతున్నాడని ప్రక్క వాటాలోనుంచి విన్నది. ఫలానా రైలులో పయనించ బోతున్నాడని కూడా తెలిసింది.

"తను ఏం చెయ్యాలి?" గుండె గుబగుబ మన్నది. ఆ మరునాడు తనకు తెలియకుండానే స్టేషనుకు అతడికంటె అరగంట ముందుగా వెళ్ళి ప్లాట్‌ఫారం మీద ఉన్న సిమెంటు బెంచిమీద కూర్చుని ఎదురు చూస్తున్నది.

అతడు వచ్చాడు. సాగనంపటానికి వెంట స్నేహితులెవరూ లేరు. ఒంటరిగా నవ్వుతూ వచ్చాడు బెంచి దగ్గరికి.

చివాలున ఆమె లేచి నిలబడ్డది. "మీ సామానేది? మీ స్నేహితులేరీ?" తొట్రుపడ్డది మాట్లాడటానికి. దిగాలు పడినట్టుగా ఉన్న ముఖంలోకి కళ తెప్పించబోయింది.

అతడు మళ్లీ నవ్వాడు. "ఈ ప్రయాణం - ఈ ప్రయాణం...." నసుగుతున్నాడు.

"ఏమిటి....అట్లా నసుగుతున్నారు? మీ ప్రయాణం ఆగిపోయిందా? లేక మరొక రోజుకు వాయిదా పడ్డదా?" మాటల్లో ఆదుర్దా.

"వాయిదా పడ్డట్టే" గంభీరంగా అన్నాడు.

"అయితే ఎప్పటికి వాయిదావేశారు?" అప్పటికి ఆగిపోయిందన్న సంతోషం గొంతులో తొణికిసలాడింది.

"నేననుకున్నది కాకపోతే తప్పకుండా వెళ్తాను" నిర్లిప్తత ముఖం మీద లాస్యం చేసింది అతడికి.

"మీరనుకున్నదేమిటి?" అన్నది కనుబొమలు పైకెత్తి.

"కష్టపడి యింత దూరం వచ్చి నా కోసం ఇంతసేపు కాచుకుని ఉన్నారు. పాపం ఎందుకు వాయిదా వేశానో విని వెళ్ళండి" అన్నాడు మొలక నవ్వులతో. ఆ వాలకం-ఆ నవ్వు ఆ మాటలు చూడగానే ఆమె పసికట్టింది. బుగ్గలు ఎరుపెక్కే-లోపల తల వంచుకుంది.

పక్కింటి తాయారు తనతో ఒకనాడు పందెం వేసింది. "సంక్రాంతికి మంచి మంచి ముగ్గులు వాకిట్లో వెయ్యాలి. మీ చదువుకున్నవాళ్ళకు ముగ్గులు రావుగా?" అన్నది.

"నాకూ వచ్చు. మీరు వేసేవాటికంటె పెద్దపెద్దవి, గజిబిజివీ నాకూ వచ్చు" అన్నది పందెం కాచుకో అన్నట్టు.

అందుకని తెల్లవారుఝామున లేచి పేడనీళ్లు చల్లి, తాయారు వేసిందాని కంటె అద్భుతమైన ముగ్గులు కళాత్మకంగా వేయటం మొదలుపెట్టింది. ఒకనాడు పెద్ద ముగ్గు వెయ్యాలని చుక్కలు పెట్టింది. అవి కలిపి పెద్దపెద్ద పద్మాలు వెయ్యా లంటే కుదరలేదు. ఎక్కడో తప్పింది. అందుకే పద్మాలు రావటంలేదని గొణు క్కుంటూ వెనకడుగు వేసింది. కాలికేదో మెత్తగా తగలగానే "ఏమిటి వదినా! నీవుకనబడితే నాకు అపశకునం. అందుకే ముగ్గంతా తప్పిపోయింది" అని జడ విసురుకుంటూ ఒంగిన మనిషి లేవబోయింది.

గల గల నవ్వు వినబడ్డది. మసక చీకటిలో కళ్లు విప్పుకుని చూసింది. ఒదినకాదు-అతడు. పళ్ళన్నీ బయటపెట్టి నవ్వుతున్నాడు.

అతడే పదిరోజుల తరువాత తండ్రి దగ్గరికి వచ్చాడు. కులగోత్రాలు సరిపడ లేదని తండ్రి పెదవి విరిచాడు మొదట కాని కూతురి మనసు కనిపెట్టి కాసీ కట్నం

అరగని వజ్రాల కొండను సంతోషంతో అల్లుణ్ణి చేసుకున్నాడు. తమరిది ఎటు వంటి దాంపత్యము? లగ్నమునాటి వధూవరుల మాదిరిగా రజితోత్సవము చేసు కున్న నాడుకూడా అలాగే ఉండగలిగారే!

దుర్గకు నవ్వు-నవ్వుతో పాటు సిగ్గూ ముంచుకు వచ్చాయి.

అంతలో ఆమెకు మరొక ఉజ్వల ఘట్టము జ్ఞాపకానికి వచ్చింది.

తనకు నాలుగంటే నాలుగే రోజులు జ్వరం వచ్చింది. చెల్లెలు శాంత తోడుగా ఉంటుందని తల్లి పంపించింది. బావను పరీక్ష చెయ్యాలని తన చెల్లెలు "బావా! అక్కయ్యకు క్షయ అని డాక్టరన్నాడు. నీతో చెప్పొద్దన్నాడు" అన్నది.

అతడిగుండె లవిసిపోయాయి. సెలవు పెట్టి దుర్గ కెదురుగా కూర్చునేవాడు. ఆమె బలవంతమ్మీద తిరిగి ఉద్యోగంలో చేరాడు అతడు ఎంత మారిపోయాడని! దుర్గ కిష్టంలేదని అప్పుచేసి కొన్న స్కూటర్ అమ్మి బ్యాంకులో వేశాడు. పేకాట ఆడటం మానేశాడు. పొదుపుగా డబ్బు వాడుకోవటం మొదలు పెట్టాడు.

రెండు నెలల లోపుగా వచ్చిన ఈ మార్పుచూసి చెల్లెలు ఒకటే నవ్వు. కాని దుర్గకు గుండె కరిగిపోయింది.

రోజులు ఒక మాదిరిగా ఉండవన్నట్టుగానే కారుప్రమాదంలో ఒకనాడు అతడికి తొడఎముక విరిగిపోయింది. కాలు తీసేయాలన్నారు డాక్టర్లు. కాలు లేక పోయినంత మాత్రాన అతడి రాబడి ఏమీ తగ్గలేదు. అతడు డిజైను ఇంజనీయరు. కూర్చున్నచోటనే డిజైనులు వేసి డబ్బు సంపాదిస్తున్నాడు.

జీవితంలో ఎదురయిన ఒడుదుడుకులవల్ల తమ యిద్దరి మధ్య అనురాగము పల్లవించిందే కాని, వాడిపోలేదు. ముద్దుగా పిల్లలిద్దరూ చెరి ఒకరికి గారాబము.

ఇంకేం కావాలి తనకు? తృప్తిగా నిట్టూరుస్తుంది దుర్గ.

పెనిమిటి చక్రాల కుర్చీలో కూర్చుని వంట యిల్లూ పడకటిల్లూ ఆమెతో కూడా కూడా తిరుగుతూ ఉంటాడు.

అనుకుంటుంది దుర్గ "ఈయనకు కాలు ఇలా అవటంవల్ల మరీ సన్నిహితు లైనారు" అని. ఆ మాటే చెప్పి ఆయనను తన్మయుణ్ణి చేస్తుంది.

అరమోడ్పు కన్నులతో ఆనందాబ్ధిలో మునిగి తేలిన దుర్గ తండ్రి పిలుపుతో ఉలిక్కిపడి లేచింది.

"నీవు ఆఫీసునుంచి వచ్చిన తరువాత నాకు పండ్లరసము యివ్వలేదమ్మా" అన్నాడు తండ్రి.

దుర్గ స్వప్నజగత్తు విడలించుకుని లేచి నిలబడ్డది.

అవును. పక్షవాతంతో మంచం పట్టిన తండ్రిని అన్నలు పట్టించుకోమని తనమీద వదలిపెట్టటము నిజ పరిస్థితి. తన ఆధారమూ చెయ్యిజారి పోతుందన్న భయంతో తండ్రి వచ్చిన సంబంధాలను ఏదో పేరుపెట్టి తిప్పి పంపటము వాస్తవ మైన సంగతి.

ముప్పై అయిదు సంవత్సరాలు దాటిన తన కన్నెమనసు రోజుకొక స్వప్నముకంటూ దానిలోనే ఇహపర సుఖాలను పొందుతూ పది సంవత్సరాల నుంచీ గడపటము స్వాప్నిక జగత్తు.

ఇంతమాత్రపు స్వప్న సుఖమైనా లేకపోతే జీవించటం దుర్లభము అను కుంటుంది దుర్గ. ఆమె కనే మధురాతిమధురమైన కలల్లో ఇది మరీ సుందర మైనది.

(అనామిక - మాస పత్రిక)



# శాంతించిన సముద్రం

ఆఫీసునుంచి కాస్త ఆలస్యంగా బయలుదేరాల్సి వచ్చింది. వెంకటరమణ వస్తూనే గదిలో ఓ మూలన బూట్లు విడుస్తూ ఓరగంటితో నాలుగు మూలలా కలయ జూశాడు. కనుచూపుమేరవరకూ ఇంట్లో ఎవరూ కనబడలేదు. మనిషి అలికిడి కూడా లేనట్లే అనిపించింది. తల వంచుకొని గదిలో బట్టలు మార్చుకుని వంట యింట్లోకి తొంగిచూశాడు.

"మీకు గదిలోకి తీసుకురానా టిఫిన్!" సావిత్రి గ్లాసులో మంచినీళ్లుపోస్తూ తల ఎత్తి చూసింది.

"ఎందుకు? నేనే వస్తాగా అక్కడికి ఎప్పుడూ వచ్చినట్లు?" ఆశ్చర్యాన్ని తమాయించుకొని తువాలుతో ముఖం తుడుచుకున్నాడు

"గదిలోనే బాగుంటుంది లెండి. ఇక్కడంతా చికాకుగా ఉంది" సావిత్రి అప్పటికప్పుడే కుర్చీ దగ్గరగా ఒక స్టూలువేసి టిఫిన్ ప్లేటూ, మంచినీళ్ల గ్లాసూ పెట్టింది. కాఫీ కప్పు చేతిలో పట్టుకు నిల్చుంది.

దిక్కులు చూస్తూ అరటికాయ బోండా నములుతున్న వెంకటరమణ "నీవు కూడా తీసుకో" అనాలనుకున్నాడు. కొంతసేపటి వరకూ ప్రాణము కొట్టుకు పోయింది. కాని మాట్లాడకుండా పెట్టింది. తిని బయటపడ్డాడు.

అంతలో స్నేహితులు పిలిచారు. అటునుంచి అటే సినీమాకు తీసుకెళ్లారు. కబుర్లు చెప్పుకుంటూ బయలుదేరి ఇళ్లను చేరుకునేసరికి పదకొండు కావచ్చింది. ఆలస్యమయినా తలుపు తట్టీతట్టడముతోనే తెరుచుకుంది.

వెంకటరమణను చూడగానే సావిత్ర భోజనం పెట్టి ఎదురు చూడటము మొదలుపెట్టింది.

"నా కోసం ఎందుకు కూర్చున్నావు? భోజనం చెయ్యకపోయినావా?" అన్నట్టు ముఖంపెట్టి భోజనం చేశాడు. సావిత్రి అతడికి కావలసిన మంచినీళ్ళు మంచంకింద పెట్టింది. పలకరిస్తే కిలకిల్లాడుతూ కబుర్లు చెప్పేటట్లు ఉన్నది. వెంకటరమణ యధాప్రకారం పేపర్లు చదువుకొని ఫైల్సు చూసుకున్నాడు. ఏమీ గమనించనట్టుగా.

వెంకటరమణ ఉంటున్న ఇంటి ప్రక్కవాటాలోకి క్రొత్తగా ఎవరో వచ్చారు. ఆయన పదిగంటలకే ఆఫీసుకు వెళ్ళిపోతాడు. ఆవిడకు పిల్లనెత్తుకోవట మయినా చేతకానట్టుంది. ఇంట్లో పని ముట్టుకుంటున్నట్లు కూడా కనబడదు. ఆయన తల్లి మోకాళ్ళ నొప్పులతో సణుక్కుంటూ పనిచేసుకుంటూ ఉంటుంది. భోజనాలు కాగానే పిల్లను ఎత్తుకొని వాకిట్లో నిలబడేది. సంకోచం లేకుండా వంట యింట్లోకి వచ్చి సావిత్రిని పలకరిస్తూ ఉండేది.

కొత్తలో సావిత్రి బెట్టుగా ఉన్నా ఆవిడ చనువు తీసుకొని పలకరిస్తూంటే కలుపుకు మాట్లాడక తప్పలేదు. మాటల సందర్భంలో తన కొడుకు రంగథామ రావు విశాఖపట్నంలో ఆనర్సు చదువుకున్నాడని చెప్పింది

ఆంధ్రా యూనివర్సిటీలో ఆనర్సు చదివిన రంగధామం పేరు వింటూనే సావి.తి త్రుళ్ళిపడ్డది. ఆనాడంతా పని చెయ్యటంలో తడబడ్డట్టయింది. ఎన్నడూ లేనిది చేతిలోనుంచి వస్తువులు జారిపోతున్నాయి. ఫ్లాస్కులో కాఫీపోసి బల్లమీద పెట్టబోయింది. ధన్‌మంటూ కిందబడి ఫ్లాస్కు ముక్కలయింది. కాఫీ నేలపాల యింది. ఆనాడు వెంకటరమణకు మధ్యాహ్నం కాఫీ లేకుండా పోయింది.

సాయంత్రము వంటచేసి పెట్టుకొని వాకిటి తలుపు తెరుచుకొని సావిత్రి పత్రిక చదువుతున్నది. పక్కింటి ముసలమ్మగారు కూరగాయల బేరం చేస్తున్నది. ఆమె గలగల్లాడుతూ మాట్లాడుతూంటే చదువలేక పేపరక్కడ పడేసి తనూ కూరగాయల బేరానికి లేచింది. వంకాయలు మెత్తటివి ఏరుతుండగా బూట్లశబ్దము వినవచ్చింది. తల ఎత్తి చూస్తే ఫుల్‌సూట్‌లో ఠీవిగా నడుస్తూ పక్కవాటాలోకి పోతున్నాడు రంగధామం.

గమనించినట్టు పైకి కనబడకుండా తలవంచుకుంది. కూరలు పట్టి చూస్తున్నట్లు చూపి చప్పున లోపలికి వెళ్ళింది. వంటయింట్లో ఏదో పని చెయ్యబోయింది.

ధ్యాస నిలువలేదు. గదిలోకివెళ్ళి వేసిన పక్క దులిపి మళ్ళీ వేసింది. వెంకట రమణ బల్ల అంతా దులిపి కాగితాలూ, పుస్తకాలూ సర్ది పెట్టింది. అతడి బట్టలు తాడుమీద వేళ్ళాడుతున్నవన్నీ తీసి మడతలేసింది. మనసు శాంతపడాలనీ, తొట్రుపాటు సర్దుమణగాలనీ ఆమె చేసిన ప్రయత్నాలు అన్నీ వ్యర్థమయ్యాయి.

పక్కవాటా తలుపు సందుల్లోంచి దీపపు వెలుతురు నాలుగు గీతల్లా కనిపిస్తున్నది. మనుష్యుల రాకపోకల నీడలు ఇటూ అటూ ఆడుతున్నాయి.

'పిల్ల భుజంమీద నిద్రపోతున్నది. వాడికి వడ్డించకూడదూ తాయారూ ?'' ముసలమ్మ అటూ ఇటూ పచారు చేస్తున్నట్టు అడుగుల చప్పుడవుతున్నది.

''ఊ'' అని మూలిగిన శబ్దము.

'పిల్లను పడుకోబెట్టి నీవు వడ్డించవమ్మా ?

'నాయనా ! దాన్ని ఒక్కసారయినా బయటకు తీసుకువెళ్ళరా పాపం'

''అన్నం తినటానికి తీరికలేదు కాని సినిమాలట నా కాగితాల కట్టలు చూస్తూ కూడా అట్లా అంటావేం ?''

ఈ మాటలన్నీ ఎవరెవరి మధ్య జరుగుతున్నాయో కంఠధ్వనులనుబట్టి సావిత్రి గ్రహించింది. కూడదనుకున్నా మనస్సు అటే నిలిచింది. తలుపులు నెట్టుకుని వెంకటరమణ లోపలికి వచ్చాడు. అతడిని చూడగానే లేచి వంట యింట్లోకి వెళ్ళి ఇద్దరికీ భోజనము తయారుచేసింది. అతడు పీటమీద కూర్చోగానే తను కూడా భోజనము చేయటము మొదలుపెట్టింది. అతడు కావలసిన పదార్థాలు వడ్డించుకో బోయ్యాడు. అతడి చేతిలో గరిట సావిత్రి అందుకొని తానే వడ్డించింది.

భోజనము అయిన తరువాత అతడు ఫైల్సులో తల దూర్చాడు. సావిత్రి తలలో పూలు సర్దుకుంటూ అతడు విడిచిన చెప్పులను మట్టి దులిపి గోడవారగా పెట్టింది. ఎదురుగుండా కుర్చీవేసుకొని నవల చేత బట్టుకొని పేజీలు తిప్పటము మొదలుపెట్టింది.

ఉదయము తొమ్మిది గంటలకల్లా ఇటీవల లభ్యమవుతున్న తన కమ్మటి భోజనాన్ని గురించి ఏవేవో ఊహలు ఊహించుకుంటూ చిరునవ్వులతో వెంకట

రమణ ఆఫీసుకు వెళ్ళాడు. సావిత్రి తడి తువ్వాల ఎండవేయడానికి పెరట్లోకి వెళ్ళింది. రంగధామం విసురుగా అడుగులు వేసుకుంటూ లోపలికి వెళ్లాడు. తరువాత కొంచెము సేపటికి ఖణేలుమన్న శబ్దం వినవచ్చింది.

"ఎందుకురా అంతపని చేశావు ?' అన్నంపళ్ళెం తన్నుకుంటారా ఎవరయినా? ఇదేం కోపం రా ?''

సావిత్రి తలవంచుకొని లోపలికి వెళ్ళింది.

మధ్యాహ్నం పిల్లవాడిని పడుకోబెట్టి రంగథామంభార్య సావిత్రి గదిలోకి వచ్చింది. సావిత్రి కిటికీలో కూర్చుని వెంకటరమణ ప్యాంటుకు పగిలిన గుండీలు తీసి కొత్తవి కుట్టుతున్నది. ఆమెను చూడగానే చూపలేపి కూర్చోమన్నది

రంగథామం భార్య తాయారు చూడటానికి బాగానే ఉంటుంది. కాని దిద్దుబాటు తక్కువ. తల దువ్వుకొని బొట్టుపెట్టుకుంటేనే ఆకర్షణీయంగా ఉంటుంది. కాని ఆ పని శ్రద్ధగా ఉదయమూ చెయ్యదు; సాయంత్రమూ చెయ్యదు ఎగుడు దిగుడుగా చీరె కట్టుకుని కొంగు జార్చుకుని నేల ఊడుస్తూ తిరుగుతుంది

"అబ్బాయి పడుకున్నాడేమిటి ? చప్పుడులేదు ?'' అని అడిగింది సావిత్రి - కూరలు ఏం వండుకున్నారని అడగలేక.

''వాడు నా ప్రాణానికో యముడనుకోండి. రాత్రీ పగలూ కూడా నిద్ర పోనీయడు.''

"అయితే మీ కొక్కడేనా యముడు?'' అన్నది సావిత్రి నవ్వుతూ.

"నా జన్మకు నిద్రపోయినంత సేపే సుఖమనుకోండి. ఈ భాగ్యానికి మా నాన్న ఎనిమిదివేలు పోశాడు.''

"మనం కొన్నవన్నీ బాగా వుంటాయా చెప్పండి ? సరే కాని - మీరు ఈ ఊళ్ళో నాలుగు మూలలా వెళ్ళి చూశారా ? పార్కు, మ్యూజియమ్ కోట వెళ్ళారా ?''

''ఎక్కడండీ! ఇంట్లో ప్రశాంతంగా అన్నం తింటే చాలు'' తనను గురించిన ప్రశ్నలే సావిత్రి వెయ్యటము తాయారుకు విసుగనిపించింది. తన సంగతి

మర్చిపోవాలనీ, ఒక నిమిషమయినా మనసు ప్రశాంతంగా ఉంటుందేమోననీ వచ్చింది. ఇక్కడా ఆదే ప్రసక్తి.

మీరు కాని మీ వారు కాని ఇంట్లో ఉన్నట్లే కనబడదు. మీ యిద్దరి మాటా మేము యిక్కడికి వచ్చిన తరువాత వినలేదు. అబ్బ! ఎంత చక్కగా సర్దిపెట్టుకున్నారు. ఇల్లు? ఇంటిమీద మీ కెంత శ్రద్ధో?''

సావిత్రి నవ్వింది.

''మీ కెంత ఓపికమ్మా? ఎప్పుడూ ఇల్లు సర్దుతూనే ఉంటారు?'' అన్నది తాయారు.

మళ్ళీ నవ్వింది సావిత్రి.

వెంకటరమణ ఆనాడు ఆలస్యంగా యింటికి వచ్చాడు. ఆఫీసులో పని ఎక్కువయింది. ఉసూరుమంటూ గుండె చేతబట్టుకొని యింట్లో అడుగుపెట్టాడు బెరుకు బెరుకుగా.

''రాత్రిళ్ళు ఆలస్యంగా వస్తున్నారు. పని ఎక్కువయినట్టుంది. ఇలా ఉంటే ఆరోగ్యం చెడిపోతుంది. ముందు భోజనం చేద్దురుగాని రండి'' సావిత్రి అతడిని భోజనాల యింట్లోకి తీసుకువెళ్ళింది. ఇద్దరూ భోజనాలకు కూర్చున్నారు.

''పోనీ అక్కడ ఒక కప్పు పాలు తెప్పించుకోకూడదూ? ఇంతరాత్రి వేళ వస్తూకూడా మల్లెపూలూ, మరువమూ ఎట్లా జ్ఞాపకము పెట్టుకున్నారండీ?

ఆ మాట కతడు తుళ్ళిపడ్డాడు కొత్త వాతావరణము అతడిని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నది. తనెక్కడ? మల్లెపూలెక్కడ? అవి తనను చాలా దూరంలో ఉంచాయి. అతడు తలవంచుకుకుని అన్నం తింటున్నాడు. పక్కవాటాలో దీపపు కాంతి తళ్లుక్కుమంటున్నది. పేపరు తిప్పుతున్న చప్పుడు కాబోలు రెపరెపలాడుతున్నది

సావిత్రి ముఖం ఉండి ఉండి ప్రకాశిస్తోంది. ఏదో చెప్పబోతున్నట్టుగా పెదవులు విప్పుకుంటున్నాయి. అతడికేమీ అర్థము కావటము లేదు. కాకపోయినా మనస్సు నిప్పుకోబోయింది. తనకుకూడా మనిషికున్న గౌరవము వస్తోంది.

కొందరి జీవితాలలో ఈ గౌరవము ఎప్పుడు కలుగుతుందో ఎవరూ చెప్పలేరు. ఇన్నాళ్ళనుంచి రాయిగా ఉన్న మనసు ఇప్పుడంత మొండిగా లేదు.

సావిత్రి యీనాలుగు నెలలనుంచీ అతడిలో మార్పు తీసుకురావాలని ప్రయత్నిస్తోంది. కాని అది మార్పుగా కాక అతిసహజంగా చిరకాలంగా ఉంటున్నట్టుగా ఉండాలని శ్రమపడుతున్నది. అతడు వేళకు యింటికి రావాలి. ఇద్దరూ కలిసి సినిమాకు వెళ్లాలి. పార్కులలో తనను వెంట బెట్టుకొని తిరగాలి. ఇంట్లో కిలకిల్లాడుతూ ఉండాలి. తనను అన్నింటికి అతడు మెచ్చుకోవాలి. అన్నిటికంటె ముఖ్యంగా సాయంత్రము ఆరు ఏడు గంటలవేళ సావిత్రీ అని ప్రేమ ఉట్టిపడే టట్టు పిలవాలి. తమ యిద్దరి కలయిక ఎంతో ఆదర్శంగా ఉండాలి. వాగార్థాలవలె క్షీరనీరాలవలె ఒకరిలో ఒకరు ఐక్యమయిపోవాలి. అట్లా నడచుకోవాలిద్దరూ.

సాయంకాలము ఆరూ ఏడు గంటలవేళ పక్కవాటాలో ఉన్న రంగధామం ఆఫీసునుండి యింటిని వచ్చేవేళ, పిల్లవాడు ఆకలికి ఏడ్చేవేళ, ఆ తల్లి వాడిని నాలుగు తిట్టి నేలకేసి కొట్టేవేళ, అతడు వచ్చిన గంటకు తల్లిగాని భార్యగాని సణుక్కుంటూ కాఫీగ్లాసు అందిస్తారు. అందుకో ఎందుకో చిటపటలాడుతూ ఒక్కోరోజు కాఫీ గ్లాసులు విసురుతూ కేకలు పెడుతూంటాడు. అటువంటి వేళ ఆ యింటివాళ్లంతా వింటూ ఉండగా ముఖ్యంగా రంగధామం చెవిన బడేటట్టుగా ఆప్యాయంగా సావిత్రీ అని వెంకటరమణ పిలిస్తే వినేవాళ్లు అసూయపడేట్టుగా ఎంత మధురంగా ఉంటుంది?

వెంకటరమణకు ఇన్నేళ్లకు తన పుట్టినరోజన్నమాట చెవినబడ్డది. బాల్యంలో తల్లి ఏంచేసిందో అతనికి తెలియదు. గులాబీజాము వెజిటబుల్ కట్‌లెట్సు, అతడికి యిష్టమనుకుని చేసిన సేమ్యాపాయసమూ, జరీఅంచుల ధోవతీ, ఇంట్లో సరససంభాషణా....

సావిత్రి యీవంటకాలన్నీ పక్కవాటాలో యిచ్చి 'మా వారి పుట్టిన రోజ'ని చెప్పింది. ఆ సాయంత్రము తానే బలవంతము చేసి వెంకటరమణని సినీమాకు బయలుదేర తీసింది. రాత్రి యింటికి వచ్చిన తరువాత కిలకిల నవ్వుతూ ఎన్నో కబుర్లు చెప్పింది. అతడు అప్పుడప్పుడు 'ఊఁ ఆఁ' అంటూ ఊపిరాడని ఆశ్చర్యాన్ని అణచుకుంటున్నాడు. అప్పటికింకా పక్కవాటాలో దీపము వెలుగు

తున్నది. పడక కుర్చీలో పడుకొని రంగధామం పేపరు చదువుతున్నట్టు కనబడు తున్నది పక్కవాటా తలుపు సందుల్లోంచి వస్తున్న వెలుగువైపు చూస్తూ ఉంటే ఉత్సాహము పొందులువారి ఆమె కిచకిచలాడిపోతున్నది.

పొద్దున్నే పాలవాడి కోసం సావిత్రి కిటికీలోనుంచి తొంగిచూస్తున్నది. ఏడున్నరకు అమిత చికాకుతో కాఫీగ్లాసు అందుకునే రంగధామం చూస్తూండగా తాను ఆరింటికి నవ్వుతూ వెంకటరమణకు కాఫీగ్లాసు అందించాలి. గబగబా పాల చెంబు అందుకొని డికాక్షను దింపి పాలు పొయ్యిమీద పెట్టింది

* * *

ఆంధ్ర యూనివర్సిటీలో సావిత్రి ఇంటరు చదివేటప్పుడు రంగధామం ఆనర్సు చదువుతున్నాడు. కాలేజి విద్యార్థులలోకల్లా అతడు బ్రైట్ స్టూడెంటని పేరు. చదువులోనే కాక ఇతర ఆటల పోటీలలోను వక్తృత్వపోటీలలోనూ నాటకాలలో వేషాలు వెయ్యటంలోను అతడి పేరు ప్రథమశ్రేణికి చెందింది. విద్యార్థులకు అన్నింటిలోను అతడు నాయకుడు. అతడు ఎవరితోనయినా మాట్లాడా డంటేనే ఎంతో అదృష్టవంతులమనుకునేవారు. ఉపాధ్యాయులకు కూడా అతడంటే ఎంతో మన్నన.

ఆడపిల్లలకు మగపిల్లల్తో కలిసి నాటకాలలో వేషాలు వెయ్యటమంటే ఎంతో భయంగా ఉండేది. ఎవరూ తూగివచ్చేవారు కాదు. అందుకని ఉపాధ్యాయులు అభ్యుదయ ఉత్సవాలలో నాటకాలు వద్దన్నారు. రంగధామానికి నాటకాలంటే ఎంతో అభిమానము. నటించటమంటే ఎంతో యిష్టము కాని స్త్రీ పాత్రలేని నాటకము ఏం బాగుంటుంది? ఎవరు స్త్రీ పాత్ర అభినయించటానికి అంగీకరిస్తారు? ఉపాధ్యాయులెంత చెప్పినా వినక తాను ఒప్పించి తీసుకువస్తానని ఉపాధ్యాయులకు మాట యిచ్చాడు.

ఆ రోజు క్లాసులయిపోవటంతోటే ఆడపిల్లలు రూము దగ్గర నిలబడ్డాడు. ఎవరయినా బయటికి వస్తే పలకరిద్దామని, అందరూ లోపలచేరి కిచకిచలాడు తున్నారు కాని ఒక్కరూ బయటికి రాలేదు అతడు లోపలికి పోవటానికి వీలు లేదు. పావుగంటసేపు తలుపుమీద దృష్టిఉంచి నిలబడ్డాడు. అదృష్టం కొద్దీ ఆయా అటుపోతూ కనబడ్డది ఎవరినయినా బయటికి రమ్మని ఆయాచేత చెప్పి పంపాడు. వెంటనే సావిత్రీ, సుబ్బలక్ష్మి బయటికి వచ్చారు.

వాళ్ళిద్దరితోటీ అతడు అభ్యుదయ ఉత్సవాలను గురించి మాట్లాడాడు. కార్యక్రమమంతా చెప్పాడు. నాటకాల సంగతి చెప్పి స్త్రీపాత్రల సంగతి వివరించాడు.

"మీలో ఎవరయినా యువరాణి పాత్ర వెయ్యాలి."

"బాబో! యువరాణి పాత్రే! స్టేజి మీదికి వచ్చేసరికి కాళ్లు వణుకుతాయి" అన్నది సుబ్బలక్ష్మి కళ్లు గుండ్రంగా తిప్పుతూ.

"మరి స్త్రీ పాత్రలేని నాటకమే లేదు. స్త్రీ పాత్ర మీరు నటించకపోతే ఇంకెవరు నటిస్తారు? మగవాళ్లు నటిస్తే ఏం బాగుంటుంది?"

"ఆ వేషం ఎవరు వేస్తారండీ? వేసి మర్నాడు కాలేజీకి రావటమే? గోడ సాహిత్యంలోకి ఆ పిల్లపేరు ఎక్కిపోదూ? మాకు కాలేజీలో చదవటమూ నాటకాలు వేయటమూ కాక జీవితంలో ప్రధానమయిన ప్రయోజనాలు ఉన్నాయిగా మరి? వాటిని ఇవి కించపరచకూడదు" సావిత్రి ధైర్యము తెచ్చుకొని గట్టిగా మాట్లాడింది.

"మీరు చెప్పినదంతా నేను ఒప్పుకుంటాను. మన కందరికీ ప్రధానమయింది మీరు చెప్పిందే. కాలేజీల్లో చదవటమూ, అభ్యుదయ ఉత్సవాలలో పాల్గొనటమూ మన సాంఘిక జీవితాన్ని ఉన్నతస్థితికి తీసుకుపోతాయి కాని కించపరచవు. నా వుద్దేశంలో ఎవరికీ ఎటువంటి దురభిప్రాయం ఉండదని" రంగధామం వేడుకుంటున్నట్లుగా ముఖం దీనంగా పెట్టాడు.

"మీరు అనుకోరనుకోండి. లోకం మాటేమిటి?"

"ఇతరుల సంగతి మనకెందుకు? వ్యక్తియొక్క ఔన్నత్యాన్ని విలువ కట్టడము అందరికీ సాధ్యంకాదు సావిత్రిగారూ! నా కోరికమీద మీరు యువరాణి పాత్ర ధరించాలి. మీ ముఖంలో, మాటలో, నడకలో ఆ హుందాతనము ఉన్నది. ప్లీజ్, ప్లీజ్ నా అభ్యర్థనను త్రోసిపుచ్చవద్దు."

సావిత్రి క్రీగంట రంగధామాన్ని చూసింది. కాలేజీ విద్యార్థులకందరికీ అతడు నాయకుడు. వీరోచిత గాంభీర్యము ముఖముమీద తాండవిస్తున్నది. మాట్లాడితే రాజులు కత్తిమీద చెయ్యి వేసినట్టుగా ప్యాంటు జేబులోకి చెయ్యి పోనిస్తున్నాడు మధ్యమధ్య ఉత్తమాశయాలను గురించి ఉపన్యాసాలు దంచుతున్నాడు.

కొంతసేపటికి సావిత్రి మనసు మెత్తపడ్డది. సరేనని ఒప్పుకున్నది. ఆతడు కృతజ్ఞత తెలుపుతూంటే పున్నమినాడు చంద్రుడితో కరచాలనము చెయ్యాలని ఉవ్వెత్తుగా విగిసిపడే సముద్రము మాదిరిగా ఆమె హృదయం పొంగులు వారింది.

నాటకప్రదర్శనము అయిన తరువాత గ్రీన్‌రూములోకి వచ్చాడు రంగథామం. సావిత్రి యింకా యువరాణి వేషములోనే ఉన్నది.

"మీరు కాలేజీ విద్యార్థి సంఘానికి పేరు తెచ్చారు. ఇంత బాగా నటించగలరని నేను ఊహించలేకపోయాను. ఇవాళ అధ్వర్యము వహించిన ప్రభుత్వ ప్రధానకార్యదర్శి ప్రత్యేకంగా మిమ్మల్ని ప్రశంసించారు నూరురూపాయల విలువగల రవీంద్రకవీంద్రుల సాహిత్యము కొని మీకు బహూకరిస్తానన్నారు. నా కోరికమీద యువరాణి పాత్ర ధరించటానికి ఒప్పుకున్నందుకూ, అత్యుత్తమంగా నటించినందుకూ నా శుభాభివందనాలు" అతడట్లా ఆమెపైపు సూటిగా చూస్తూ ప్యాంటు జేబులో ఉన్న చేతిగుడ్డ తీసుకొని ముఖమంతా అద్దుకున్నాడు.

సావిత్రి కళ్లు కృతజ్ఞతతో మెరిసిపోయాయి. రెండు చేతులూ జోడించి తల వొంచింది.

అంతవరకూ సావిత్రికీ, రంగథామానికీ మధ్యఉన్న తెరలు ఈ నాటకంతో తొలగిపోయాయి. ఉత్సాహంతో, గౌరవంతో ఒకరినొకరు కలుసుకుంటూ ఉండేవారు. అమెలో ఉన్న ధైర్యస్థయిర్యాలను మెచ్చుకోకుండా ఉండలేకపోయేవాడు రంగథామం. అతడు యిస్తున్న ఉత్సాహము వల్లనే తనలో ఉన్న శక్తులు ఇనుమడిస్తున్నాయని ఆమె నమ్మకము. అతడు ఆమెను ప్రశంసిస్తున్నప్పుడల్లా ఆమె యీ మాట అనకమానదు. ఈ పరిచయాలతో రెండురోజుల కొకసారి అతడిని ఎక్కడైనా కలుసుకోలేకపోతే మనసంతా చీకటి చీకటిగా ఉన్నట్టుండేది సావిత్రికి. సావిత్రి ఆనర్సు ప్యాసు కాగానే కాలేజి మానేసింది రంగథామం లా కాలేజిలో చేరాడు. కాలేజి లైబ్రరీకి వెళ్లినప్పుడల్లా సావిత్రి రంగథామాన్ని కలుసుకునేది. ఇద్దరూ ఒకచోట కూర్చుని ఆప్యాయంగా కబుర్లు చెప్పుకునేవారు. సావిత్రి హృదయము అతడి మాటలలో ఉన్న తీపినంతా బోగు చేసుకునేది. మధుర మధురమయిన భావాలు మనసులో అల్లిబిల్లిగా అల్లుకునేవి. వాటిని తలుచుకొని విగ్గిలిపోయేది.

ఉత్సవాల తరువాత మిగతా విద్యార్థినీ గణమంతా ఆమెవైపు అదొకమాదిరిగా చూసేవారు. రంగథామం సంగతి అందరికీ తెలుసు. అంతంత మాత్రమైన వాళ్ళను అతడు కన్నెత్తి చూడడు ఆడపిల్లలందరూ "అతడికి గర్వము-అహంభావము." అనుకుని దూరదూరంగా తిరిగేవారు.

సావిత్రి తనలో ఏదో ప్రత్యేకత ఉన్నదనుకునేది. ఆ ప్రత్యేకతను అతడు గుర్తించినందువల్లనే తనతో చనువుగా ఉన్నాడనుకుంటూ ఉండేది. ఈ సంగతి కనిపెట్ట కలిగింది ఒక్క సుబ్బలక్ష్మి.

"సావిత్రీ! నీవు నిజంగా అదృష్టవంతురాలవు. అతడు ఫస్టుమార్కులు తెచ్చుకున్నవాళ్ళనయినా కన్నెత్తి చూశాడా చెప్పు?" జడ వీపుమీద కొడుతూ సావిత్రి చెవులు సాగదీస్తూ ఉండేది సుబ్బలక్ష్మి. అటువంటి సమయాలలో సబ్బలక్ష్మి పైటకొంగు సావిత్రి చేతిలో మెలికలు తిరుగుతూ ఉండేది.

సావిత్రి జేగురుమబ్బుల వింతవెలుగులో సముద్రపుటొడ్డున కూచుని ఇసుకలో వేలితో ఏదో రాస్తున్నది. జీడిపలుకుల సంచులు ఎగరవేసుకుంటూ రంగథామం తన భవిష్యత్తు అంతా ఊహించి ఆమెకు చెప్పుతున్నాడు. లా చదివిన తరువాత ప్రాక్టీసు కొరకు తొందరపడకుండా పైచదువులు చదువుతానన్నాడు. ఇంగ్లండువెళ్ళి బారట్లా అవాలని ఉన్నదన్నాడు. కళ్ళు తిప్పుతూ కుతూహలంతో, ఉత్సాహంతో జడలు విప్పుతూ అల్లుతూ అతడినే చూస్తున్నది సావిత్రి ఇసుకలో తలక్రింద చెయ్యిపెట్టుకొని నెలవంకకేసి చూస్తూ కూనిరాగాలు తీస్తున్నాడు రంగథామం. సావిత్రి ముసిముసి నవ్వులతో రంగథామాన్ని ఎన్నెన్నో ప్రశ్నలు వేయాలనుకున్నది. కాని ఆమె సిగ్గే ఆమెకు అవరోధమయింది. ఇటువంటి అవకాశాలు చేజిక్కి కూడా జారిపోయ్యాయి చాలాసార్లు.

సావిత్రి అనర్సు పూర్తిచేసింది. "ఇంకా పైన చదువుతావా అమ్మా" అని తండ్రి అడుగుతాడని అనుకుంది. కాని ఆయన సంబంధాలు చూడటము మొదలుపెట్టాడు. ఆయనకు అన్ని విధాల నచ్చిన రెండింటిని తిరగ్గొట్టింది.

"నీ విలా చేస్తావనుకోలేదమ్మా" చెమట పట్టిన ఫాలభాగాన్ని గోడవైపుకు తిరిగి తుడుచుకుంటూ అన్నాడు.

"నీకు నచ్చాడా అని అడిగావు కనుక చెప్పాను నాన్నా!" అన్నది సావిత్రి తలవంచుకొని.

"అవునమ్మా! నీకు చూపించకుండా నీ సమ్మతి లేకుండా చేస్తానా! అనర్వు ప్యానయిన పిల్లతో ఎలా వ్యవహరించాలో నాకు తెలీదనుకున్నావా?" అన్నాడు ఆమె ముఖంచూస్తూ.

"అందుకనే మనసులో ఉన్నమాట చెప్పాను."

"చూడు సావిత్రీ!" అంటూ ఆయన దగ్గరగా కూర్చుని ఆమె వీపుమీద రాస్తూ "డాక్టరు నాకు రక్తపుపోటు హెచ్చిందన్నాడు. అందుకనే త్వరలో పెళ్ళి చేయాలనుకుంటున్నాను. సెలవుపెట్టి అలహాబాదునుంచి రమ్మని అన్నయ్యకు వ్రాశాను. అన్నయ్య రెండు నెలలపాటు ఉంటాడు. ఈ రెండు నెలల్లో నీ పెళ్ళి అయిపోవాలి. ఆస్తి వివరాలన్నీ వాడికి చెప్పేస్తాను. పెళ్ళిచేసి నిన్ను అత్తవారింటికి వంపిస్తే ఒంటరిగాడిని నేనెక్కడయినా ఉండొచ్చు. నీ మనసులో ఉన్నది చెప్పు తల్లీ. పోనీ నీ దృష్టిలో ఎవరయినా ఉన్నారా చెప్పు?"

సావిత్రి నేలచూపులు చూడటము మొదలుపెట్టింది ముఖంమ్మీద చిరునవ్వు చిందులాడింది. అప్పటికప్పుడు నిండుగా ఉన్న బుగ్గలు గులాబీలయ్యాయి.

"నాకు చెప్పలేకపోతున్నావు పోనీలే అమ్మా! అన్నయ్య రాగానే మళ్ళీ మాట్లాడుకుందాము."

ఆ విషయము అప్పటికి వాయిదా పడినందుకు సావిత్రి మనసు తేలికపడ్డట్టయింది.

నిరంజను సంబంధాలను గురించి తండ్రి చెప్పగా విన్నాడు. తన పాత స్నేహితులను కూడా విచారించాడు. నాలుగురోజుల తరువాత సావిత్రిని సంభాషణల్లో ఇరికించాడు. కాని సావిత్రి బయపడలేదు.

నిరంజను వచ్చినప్పటినుండీ భారమంతా అతడి మీదపెట్టి తండ్రి నిశ్చింతగా ఉన్నాడు. సాయంత్రము కాగానే తండ్రీకూతుళ్ళు తోటల్లో కూర్చీలు వేసుకొని కూర్చునేవారు. తిరిగి తిరిగి వచ్చిన నిరంజను ఉస్సురంటూ వాళ్ళతో కబుర్లందుకునేవాడు.

ఆదివారంనాడు తీరికగా సుబ్బలక్ష్మి వచ్చింది సావిత్రిని చూడటానికి. "వారం రోజులనుండీ రావాలనుకుంటే ఒళ్ళు బడలిక చేసింది."

"ఏం పని చేశావు ఒళ్లు బడలిక చేయటానికి?"

"బస్సులో నూటయాభై మైళ్లదూరము వెళ్లాము పెళ్లికి. అది ఒక పల్లెటూరు. నడుస్తూఉంటే కాళ్లు దిగబడేటంత బురద. ఇంతకూ పెళ్లికొడుకు ఎవరో తెలుసా? రంగథామం. పెళ్లికూతురు వట్టి అమాయిక. పెద్దచదువు చదువు కాని బస్తీలో ఉన్న నాగరికుడు ఆ పిల్లను చేసుకున్నాడు."

సావిత్రి తల గిరగిర తిరిగినట్లయింది. కుర్చీకి దేహాన్ని అణుచుకొని కూర్చుంది. సుబ్బలక్ష్మి ఐస్క్రీము తిని కాస్త సావిత్రి బుగ్గకు రాచి కొంగుతో చెయ్యి తుడుచుకుంటూ వెళ్లిపోయింది

మధ్యాహ్నంవేళ తండ్రీ అన్నా గదిలో కాఫీ తాగుతున్నారు. పేపరు చేత బట్టుకొని గదిముందర నిలబడ్డది. ఏ పదిహేను రోజుల క్రిందటో చెప్పాలనుకున్న మాటను అన్న బయటపెట్టలేక దాచినట్టున్నాడు. మాటలు స్పష్టంగానే వినబడుతున్నాయి.

"కాలేజీలలో చదువుతూ నాటకాలలో వేషాలు వేస్తూ తిరిగే పిల్లలు తనకు వద్దన్నాడు నాన్నా! ఈ సావిత్రికి అతడిమీద మనసున్నట్టుగా చూచాయగా కని పెట్టాను. అతడన్న మాట దానితో ఎలా చెప్పను?"

తండ్రి బరువుగా నిట్టూర్చటము సావిత్రికి స్పష్టంగా వినబడ్డది. సావిత్రి వెనక్కు నడుస్తూ వెళ్లి డ్రాయింగురూములో సోఫామీద కూలబడ్డది. కాలేజీలో చదువుతున్న పిల్లలు పెళ్లికి పనికిరారా! చదువులమీద లెక్చర్లు యిచ్చిన రంగథామం! నాటకంలో పాత్ర వెయ్యమని తనను బలవంతం చేసిన పెద్దమనిషి! తన స్వంతానికొకమాటా, ఇతరులకొక మాటా? పెళ్లి చేసుకోకపోతే పోయాడు. కాని కాలేజీ విద్యార్థినులమీద ఎంతవిసురు విసిరాడు? తండ్రిగాని అన్నగానీ ఆ గదిలోకి వచ్చి తన పరిస్థితి చూస్తారేమోనని సావిత్రి భయపడ్డది తన తొట్రుపాటును అణగద్రొక్కటానికి ఎంతో ప్రయత్నించింది. ముఖానికి అడ్డంగా పత్రిక పెట్టుకొని గంటకుపైగా బాధపడుతూ కూర్చుంది.

తండ్రి తనతో ఏదో చెప్పాలనుకుని చెప్పలేకపోవటము సావిత్రి కని పెట్టింది. ఆ నాలుగు రోజులలో తండ్రి మరీ బలహీనుడయినట్టు కనబడ్డాడు. నిరంజను ముఖావంగా తప్పుకొని తిరుగుతున్నట్టుగా తిరిగాడు.

నాలుగురోజులు నిద్ర పట్టలేదు సావిత్రికి. ఆకలి లేనట్టే అనిపించింది. శరీరం గాలిలో తేలిపోతున్నట్టనిపించింది.

అయిదవనాడు ఆమె మనసులో ఏ వేదనాలేదు. మనసు నిర్వికారంగా ఉన్నది. అయిపోయిన పెళ్ళికి బాజాలెందుకని మనస్సును అదిమిపెట్టడములో నిమగ్నురాలయింది.

''ఏం నాన్నా! అన్నయ్యకు సెలవులు అయిపోలా?''

''నాన్నా! మనం కూడా అన్నయ్య దగ్గరికి వెళ్ళి ఉంటే బాగుండదా?''

''బాగుంటుందమ్మా-కాని ఇంకా ఆవేళ రాలేదు.'' తండ్రి అన్న ఆవేళ యేమిటో సావిత్రి గ్రహించింది. ఆయన మనసులో పడుతున్నబాధ ఏమిటో ఆమెకు తెలుసు. పైకి చెప్పలేక మదనపడిపోతున్నది.

వారంరోజుల వ్యవధిలో అన్న కుదిర్చిన సంబంధము సావిత్రి చూడకుండానే ఒప్పుకుంది. మహూర్తం కూడా వెంటనే కుదిరింది. పెళ్ళి సత్రంలో జరిగిపోయింది. నిరంజను తీసుకొని వచ్చిన పెళ్ళికొడుకుచేత సావిత్రి తాళి కట్టించుకుంది. తండ్రి కాళ్ళకు దణ్ణంపెట్టుతూ ఆయన పాదాలు కన్నీడితో తడిపివేసింది. ''నాన్నా! నీ మనసు యిప్పుడు సంతోషంగా ఉన్నదా?'' అంటూ తలెత్తి చూసింది ఒక పక్క కన్నీళ్లు కారుస్తున్నా తండ్రిముఖం ఆనందంతో వెరిగిపోవటము సావిత్రి గమనించింది.

వెంకటరమణ కష్టపడి బి. కామ్. యల్. యల్. బి ప్యాసయిన విద్యార్థి అతడు సిద్దంసెట్టి అరుగులమీద నివాసమేర్పరచుకున్నాడు. వీధిదీపాల వెలుగులో చదువుకొని పరీక్షలు ప్యాసయాడు. లేమిడి పెనవేసుకుపోయిన జీవితము. చదువుకోగానే ఉద్యోగములో చేరేడు. అతడిలో అందము ఉన్నది. తెలివీ మరుకుదనమూ ఉన్నాయి. చూడగానే నిరంజనుని ఆకర్షించాడు. ఇంటి అల్లుడిని చూసుకొని తండ్రీ కొడుకులెంత మురుస్తున్నారో సావిత్రి గ్రహించింది. పెళ్ళిఅయిన ఈ అయిదారు సంవత్సరాలలో ఒక్క స్నేహితురాలినయినా చూడటము సావిత్రికి తటస్థించలేదు. వాస్తవానికి తను ఎవరికంటా పడకుండా మరుగుపడిపోదామనుకుంది. ఒకనాటి మధ్యాహ్నం సుబ్బలక్ష్మి ఎక్కడినుంచో ఊడిపడ్డది. ఆమెను చూడగానే సావిత్రి గుండె గతుక్కుమన్నది.

"నన్నుచూసి భయపళ్ళేదు కదా?" సావిత్రి భుజమ్మీద చెయ్యివేస్తూ అడిగింది. సుబ్బలక్ష్మి అంటే సావిత్రికి మొదటినుంచీ భయమే. పైకి మాట్లాడుతూనే ఎదుటిమనిషి మనసంతా శోధిస్తూ ఉంటుంది. ఎవరి మనసులోనన్నా మాయామర్మం కననడితే బయటికి లాగేవరకూ నిద్రపోదు.

సుబ్బలక్ష్మిని వసారాలో కూర్చోబెట్టి కాఫీ యిచ్చింది సావిత్రి.

సుబ్బలక్ష్మిభర్త. డాక్టరు ఆయనకు ఆ ఊరు బదిలీ అయిందట. ఒక స్నేహితుడియింట్లో దిగి మూడునెలలనుంచీ ఆ ఊళ్ళోనే ఉంటున్నాడట. తాను ఆ ఉదయమే వచ్చిందట. సావిత్రి ఇక్కడున్నట్లు విశాఖపట్నంలోనే తనకు తెలిసిందట. ఈ సంగతులన్నీ గలగల్లాడుతూ చెప్పింది.

సుబ్బలక్ష్మి ఇల్లంతా ఒకసారి కలయ తిరిగింది. సావిత్రిగుండె పీచుపీచుమంటున్నది.

నీ వెప్పుడూ పుస్తకాలమధ్య కీలకంలా ఉండేదానివి. నీపుస్తకాలూ, షెల్ఫులూ ఎక్కడా కనబడవేం?" గూట్లో నిర్లక్ష్యంగా పడేసిన న్యూస్ పేపర్లన్నీ తిరిగేస్తూ అడిగింది సుబ్బలక్ష్మి.

"ఈ చిన్న యింట్లో ఆ పుస్తకాలన్నీ తెచ్చి ఎక్కడ పెట్టను? విశాఖపట్నంలో నాన్న పుస్తకాలకే ఒకగది ఏర్పాటు చేశారు."

"అబ్బబ్బ. పుస్తకాలు ఎక్కడపెట్టుకుంటావని కాదు నేనడిగింది. ఇక్కడ కూడా ఆ అలవాటు సాగించుకుంటున్నావా అని!"

"యథాప్రకారంగా"

సుబ్బలక్ష్మి ఊఁ అంటూ తలాడించింది. "నిన్ను చూసి ఆరేళ్ళయింది. బాగా చిక్కావు సావిత్రీ."

ఆరేళ్ళయింది కనుకనే చిక్కావనీ అలవాట్లు మారాయనీ ఊహిస్తున్నావు."

"అమ్మాయీ నీవు సుబ్బలక్ష్మితో మాట్లాడుతున్నావు తెలుసా? నీవు చిక్కకపోతే ఆ జాకెట్టుచేతులు అలా వేలాడిపోతాయా? నీ కుట్టుపని అంతా ఏమ

యింది? ఒక్క బిల్లమీదనయినా బట్టలేదు. ఇంత సోమరితనం ఎట్లా వచ్చిందంటావు?''

''అబ్బబ్బ సుబ్బలక్ష్మి! ఇన్ని ప్రశ్నలు ఒక్కసారి అడిగితే ఎట్లా జవాబివ్వను చెప్పు? ఇది సంసారం. పెళ్ళికానప్పుడు సూదీదారం పట్టుకునో-పుస్తకం పట్టుకునో కూర్చున్నట్టుగా ఇప్పుడు జరుగుతుందా చెప్పు?''

''పోనీ అదంతా వద్దులే. మా బావగారి సంగతి చెప్పు. నీవు అడగక పోయినా నా సంగతంతా చెప్పేశాను చూడు.''

సుబ్బలక్ష్మి రెండుగంటలసేపు ఈ మాటా ఆ మాటా అడుగుతూ వేధించి వేధించి వెళ్ళిపోయింది. సుబ్బలక్ష్మి సావిత్రినీ వెంకటరమణనూ తను యింటికి రమ్మని ఆహ్వానించింది.

సావిత్రి తలఊపింది. సుబ్బలక్ష్మి వెళ్ళిపోయిన తరువాత 'అమ్మయ్య' అనుకుంది. ఆమె ఉన్నంతసేపూ మనసులో భయమే. మాటల్లో చూపుల్లో ఏ సంగతి బయటికి లాగుతుందోనని ఎవరికీ కనబడకుండా మారుమూల పడుందామనుకుంటే ఈ సుబ్బలక్ష్మి ఎక్కడినుండో ఊడిపడ్డది.

వారం రోజులకొకసారయినా సావిత్రీ వెంకటరమణా తమ యింటికి రాకపోతే సుబ్బలక్ష్మి ఊరుకునేది కాదు. వెంకటరమణ ఎవరితో మాట్లాడినా సావిత్రి ముఖము చూసి మాట్లాడేవాడు. అతడు పడుతున్న బాధేమిటో సుబ్బలక్ష్మి కనిపెట్టటానికి ఎక్కువసేపు పట్టలేదు. ఆ మాటల్లో ఏదో వెలితి కనబడుతున్నట్లుండేది. అతడి బెరుకుచూపులు చూసి సుబ్బలక్ష్మి నవ్వుకుంది.

సుబ్బలక్ష్మి యింటికి వెళ్ళినన్నిసార్లు తమయింటికి వాళ్ళను పిలువలేక పోయింది సావిత్రి. సందర్భము కూడా కలిసిరాలేదు. అనుకోకుండానే సుబ్బలక్ష్మి భర్తకు అక్కడినుంచి బదిలీ అయింది. సుబ్బలక్ష్మి కుటుంబాన్ని సావిత్రి భోజనానికి పిలిచింది. వెళ్ళుతూ ''నీవు చదువుకున్న మొద్దువై పోయావు'' అంటూ వీపు మీద కొట్టి సుబ్బలక్ష్మి బండెక్కింది.

ఆ దెబ్బకు సావిత్రి త్రుళ్ళిపడ్డది. ముఖం పాలిపోయింది. ఎవరయినా చూశారేమోనని దిక్కులు చూసింది. దూరంగా మగవాళ్లు మాట్లాడుకుంటున్నారు. అమ్మయ్య అనుకుంది.

ఒక్క ఏడాదిపాటు తెలిసినవాళ్ళు ఎవరూ కనబడలేదు. సావిత్రి మనసు హాయిగా ఉన్నది. బయటిప్రపంచంతో ఏ ప్రసక్తీ లేకుండా ఉంది. పుస్తకాలు చదివే అలవాటు సంసారంలో పడగానే దానంతట అదే నశించిపోయింది. మిగతా అభిరుచులూ, అభిలాషలూ ఆలనా పాలనా లేక అణగారిపోయాయి. ఆయన ఆఫీసుకు వెళ్ళగానే వాకిట తలుపు గొళ్ళెము పెట్టుకొని ఏకాంతంగా కూర్చుని గాత్ర సంగీతం సాధన చేస్తు ఉండేది. రెండుమూడు గంటలు భజనకీర్తనలూ అవీ పాడుకున్న తరువాత ఆమెతో గూడుకట్టుకున్న ఆవేదనంతా చల్లారినట్లుండేది. వర్షించిన మేఘంలా మనసు తేలికపడేది.

మందకొడిగా, యాంత్రికంగా సావిత్రి రోజులు దొర్లిస్తున్నది. షెల్ఫుమీద చనిపోయిన తండ్రి ఫోటోకెదురుగా నిలబడి "నీ ఆత్మశాంతి కోసమే నేను బతుకుతున్నా నాన్నా!" అనుకునేది. ఎప్పుడుచూపినా ఆ ఫోటోలో తండ్రి ముఖము నవ్వుతున్నట్లుండేది.

*   *   *

ప్రక్కవాటాలోవున్న తయారు పురిటికి వెళ్ళింది. ముసలమ్మ చిన్నపిల్లలా ఉరుకుపరుగులతో కాఫీ చేసి యిస్తున్నది. వేళకు వంట ఐనా చిందులు గంతులు వినబడుతూనే ఉన్నాయి. కటికి ఉపవాసాలు చేస్తున్నట్టుగా నిట్టూర్పులూ మూలుగులూ పక్క యింట్లో తాండవమాడుతున్నాయి.

మధ్యాహ్నంవేళ ముసలమ్మ తీరికగా వచ్చి సావిత్రి దగ్గర కూర్చుంది. సావిత్రి వెంకటరమణ కొసం కుట్టుతున్న స్వెట్టరు పూర్తిజేస్తోంది. సూదులూ, ఊలూ గబగబ కదిలిపోతున్నాయి.

"నీవు ఒక్క నిమిషమయినా వృధాపోనీయవమ్మా. మీ ఆయన ఎంతో అదృష్టవంతుడు పెట్టిపుట్టాడు."

ఆ మాటకు సావిత్రి గలగలా నవ్వింది. కాని ఆ నవ్వు బలవంతంగా నవ్వినట్టుంది. ఇతరులను అసూయపరచాలనే బెణుకు లేకపోలేదు దానిలో.

ప్రొద్దున్నే వచ్చినవాన సన్నగా మొదలయి చూస్తూ ఉండగానే కుండపోత వర్షమయింది. సావిత్రి మసాలాదోసెవేసి వేడివేడిగా ఉండాలని పెట్టుకుని ఉంది

ఉంచింది. ముసలమ్మగారు ఇస్త్రీచేసిన గుంటూరుచీరె కట్టుకొని కొంగు దోపు కుంటూ "అమ్మాయీ! మా కోడలికి పురుడు వచ్చింది. మగపిల్లవాడు. పుట్టాడు. నేనూ అబ్బాయీ చూడటానికి వెళ్ళుతున్నాము ఈ నాలుగు గంటల బండీలో."

"ఎన్నాళ్ళ మకాం చెప్పరూ?"

"ఇక మళ్లీ యిక్కడికి రామమ్మా. అబ్బాయికి అనకాపల్లి బదిలీ అయింది. అటునుంచే వెళ్ళుతాము."

"రెండు శుభవార్తలూ ఒక్కసారే చెప్పారు." సావిత్రి ఆమెకు బొట్టు పెట్టి కొబ్బరికాయ చేతికి యిచ్చింది.

"చిన్నపిల్లవయినా ఎంతో తెలివిగా కాపురం చేస్తున్నావమ్మా. నిన్ను చూస్తూంటే నా కెంతో ఆనందంగా ఉంటుంది."

సావిత్రి పొడినవ్వు నవ్వుతూ ఆమెను సాగనంపింది. లోపలికి వచ్చి మెడా, చేతులూ పూర్తికాని స్వెట్టరు ఒక మూలకు విసిరేసింది.

సావిత్రి చేసిన మసాలాదోసెలు వెంకటరమణ వచ్చేసరికి చప్పగా చల్లారి పోయాయి ఆ రాత్రికి బద్ధకంగా ఉండి చారూ, అన్నమే చేసింది. సావిత్రి అంత ఉత్సాహంగా లేకపోయినా మామూలు ఇంటి పనులన్నీ చేసుకుంది. వెంకటరమణ ఫైల్సు చూసుకుంటూ ఉంటే తాను పక్కలూ దిండ్లూ సర్దింది. కిటికీ తలుపుతీస్తూ ఉంటే మల్లెలూ మరవమూ కలిపికట్టిన మూరెడు మూల కనబడ్డది

వెంకటరమణ వైపు తలెత్తి చూసింది. అమాయకంగా ఫైల్సు చూసుకుం టున్నాడు. ఆనాడు అతడు మల్లెపూలూ మరువమూ తెచ్చినట్టూ, తను సంతో షంతో పొంగిపోయినట్లూ ఏవో మాటలు ఆ రంగథామం వినేటట్లుగా అన్నది. అసూయతో దహించుకొనిపోయి ఉండాలి అతడు. కాని యిప్పుడు నిజంగా మల్లె దండ తెచ్చాడు వెంకటరమణ. పక్కవాటాలో ఉడుక్కునే రంగథామం లేడు. చీకటిచీకటిగా ఉంది పక్కవాటా. సావిత్రిలో ఉత్సాహపు పొంగు రాలేదు. నీరసంతో దేహము వేలాడిపోతున్నది

వారపత్రికలూ, దినపత్రికలూ చేతికందినవన్నీ పుటలు త్రిప్పి పడేసింది సావిత్రి. తనకు యిష్టమనుకున్న కవిత తీసి చదువబోయింది. ఇన్నాళ్ళనుంచీ మనసులో గూడుకట్టుకున్న అవమానము, ఆవేదన పొంగుతున్నాయి. కాని చల్లారటం లేదు. పెరట్లోకి వెళ్ళే గదితలుపులు తెరచి గడపలో కూర్చుంది. తెలియ మబ్బుల పరుగులలో నెలవంక తొంగిచూస్తున్నాడు. సావిత్రి కూనిరాగం తీస్తూ కళ్లు మూసుకొని మీరాబాయి భజనలు పాడుకుంది సన్నగా.

అలవాటు ప్రకారం వెంకటరమణ ఫైల్సు తిరగవేసుకుంటున్నాడు. సావిత్రి చివాలున లేచింది. స్నానాల గదిలోకి వెళ్ళి ఆ చన్నీళ్ళే నాలుగు చెంబులు పోసుకొని చందనంసబ్బు ఘుమఘుమలతో పాముకుబుసంలాంటి సన్నటి చీరె ధరించి బయటికి వచ్చింది. దోసగింజ బొట్టు పెట్టుకొని మల్లెదండ తలలో పెట్టుకొని ఓయ్యారంగా వెంకటరమణ కుర్చీ దగ్గరగా నిలబడి "ఇలా కూర్చుని రాత్రీ పగలూ పనిచేస్తే ఆరోగ్యం పాడవదూ? గంట చూశారా పన్నెండు కావచ్చింది."

వెంకటరమణ తలెత్తి చూశాడు సావిత్రిని. ఆమె ముఖములో ఒక వింత వెలుగు వెలుగుతున్నది. ఆమె కళ్లు చిలిపిగా నవ్వుతున్నాయి.

వెంకటరమణకు క్రమంగా ధైర్యము వచ్చింది. ఆ చీకట్లో కూడా సావిత్రి కళ్ళు పక్కవాటా వైపు తిరిగాయి మామూలుగా.

కిటికీ తలుపు సందుల్లోనుంచి నెలవంక కనబడీ కనబడకుండా దోబూచులాడుతున్నాడు. చెంపమీదుగా జాలువారిన కన్నీటిని సావిత్రి వెంకటరమణ చూడకుండా కొంగుతో తుడుచుకుని ఫ్లాస్కులో పోసి ఉంచిన వేడివేడి పాలు కప్పులో పోసి ఒయ్యారంగా అతడి చేతి కందించింది.

('యువ' మాస పత్రిక)

(1967 లో ఆంధ్ర రచయితల సహకార సంఘము వారు ముద్రించిన కథా సంకలనము "చేమాంతులు"లో చేర్చబడినది)



# పాంథుడు

గంట కొట్టాడు ఆఫీసరు.

జవాను పరదా తొలగించుకుని చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

"సెక్రెటరీని పిలు."

"తమకోసం ఒక అబ్బాయి నిలబడ్డాడండి." వెళ్లుతూ ఈమాట చెప్పి ఆగాడు జవాను.

"రమ్మను" అన్నాడు కళ్లద్దాలు తీసి తుడిచి మళ్లీ పెట్టుకుంటూ. తలుపు వైపు చూస్తున్నాడు ఎవరయిఉంటారా అనుకుంటూ బొమలు ముడిచి.

కాలేజి విద్యార్థి మాదిరిగా ఉన్నాడు. ఛామనఛాయ. కొంచెం పొడుగు. మెల్లగా అడుగులు వేసుకుంటూ లోపలికి వచ్చి నిలబడ్డాడు.

ఆఫీసరు ఏం పని అన్నట్టు చూపి కూర్చోమని చేతిసైగ చేశాడు.

"నా పేరు బాలకృష్ణ, బి.ఏ. ప్యాసయ్యాను. తమ దగ్గర అటెండర్ పోస్టు ఖాళీగా ఉందని తెలిసి వచ్చానండి" కూర్చోకుండానే చేతులు జోడించాడు.

కనుబొమలు ముడిచాడు ఆఫీసరు.

"అటువంటి పోస్టు ఈ ఆఫీసులో లేదే? ఎవరు చెప్పారు?"

ఏ పేరు చెబితే ఏం ప్రమాదమోనని సందేహించాడు ఆఫీసరువంక చూస్తూ బాలకృష్ణ.

"చూడు. ఉద్యోగాలున్నాయంటూ ఎవరో ఏదో చెప్పి మీవంటి విద్యార్థులను భ్రమలో పడేస్తారు. బి. ఏ. ప్యాసయినవాడివి ఎటెండరు ఉద్యోగానికి వచ్చావా? హాయిగా చదువుకోవలసిన ఈడు నీది. పోటీ పరీక్షలున్నాయి. వాటికి

ప్రయత్నం చెయ్యకూడదూ? పోనీ లా చదవకూడదూ? లేకపోతే ఏదయినా చిన్న వ్యాపారం చెయ్యకూడదూ?" సలహాలు ఇచ్చాడు శ్రేయోభిలాషిగా.

"ఇకముందు చదువుకు స్తోమతు లేదండీ. ప్రాణాలు బిగబట్టుకుని ఇంత వరకూ ఈడ్చుకొచ్చాను. కడుపుకు తిండిలేక, కట్టుగుడ్డలేక- వీధి దీపాల దగ్గర చదివిన చదువిది. తమరు నా పరిస్థితి చూసైనా...."

"అబ్బాయీ. అందరి పరిస్థితులూ ఇలాగే ఉన్నాయి. నీ ఎడ్రసు ఇచ్చివెళ్లు. ఏదయినా అవకాశముంటే చూస్తాను" ఫైలుకట్ట ముడివిప్పాడు.

తలవంచి మరొకసారి నమస్కారిస్తూ వెళ్లిపోయాడతడు. గదిలోకి వచ్చే టప్పుడు అతడి ముఖంలో ఆశ. ఆందోళన. తిరిగి వెళ్లేటప్పుడు నిరాశ- నిస్పృహ- దైన్యము- ఈడుపుకాళ్లు

ఇంటికి వెళ్లేసరికి తల్లి ఎదురుగా వచ్చింది. అతడు ముఖం పక్కకు తిప్పు కుని దుమ్ముకొట్టుకుపోయిన చెప్పులు ఒక మూలన విడిచేనెపమ్మీద తలుపుదగ్గ రగా వెళ్లాడు.

"బాలూ, కాళ్లు కడుక్కురా. ఈ రాగులగంజి తాగి కాసేపు మంచమ్మీద కూర్చో" కమలమ్మ గ్లాసు పట్టుకు నిలబడ్డది.

అతడు రాగానే గ్లాసు చేతికిచ్చి "వాసు నీకోసం వచ్చాడు. రమ్మన్నా వటగా?" అన్నది.

సాయంత్రము నాలుగు గంటలు దాటుతున్నది బాలు ఉదయం తల్లిపెట్టిన పట్టెడు చద్దన్నం అవకాయ ముక్కతో తినివెళ్లాడు. లాండ్రీ షాపునుంచి అద్దెకు తీసుకున్న బట్టలు వేసుకుని పాతచెప్పులు లిడ్ కాప్‌లో కొనుక్కుని ఫలానా ఆఫీ సులో అటెండర్ పోస్టు ఉన్నదని ఆ ఆఫీసు క్లార్కు రెండు రూపాయలు తీసు కుని చెబితే వెళ్లాడు. తీరా వెళ్లితే ఆఫీసరు లేదు పొమ్మన్నాడు.

గ్లాసు కిందబెట్టిన తరువాత "ఏమయింది బాబూ?" అడిగింది కమలమ్మ.

చెప్పాడు.

ఆమె కళ్లల్లో నీటిపొర కమ్ముకుంది. కళ్లు కొంగుతో అద్దుకుని కళ్లనిండా బాలూని చూసింది. అతడు బాలూ కాదు- బాలకృష్ణ. తన అమ్మమ్మ పెట్టిందా పేరు నిస్తేజంగా ఉన్న ఆ యింట్లో నడయాడే ఆ పాపడికి అంతవరకూ పేరే పెట్టలేదు. ఒకరోజున బాలకృష్ణుడిలా బోసినవ్వు లొలకబోస్తున్న వాడినిచూసి ఆమె బాలకృష్ణా అని పిలిచింది. అంతే. అప్పటినుంచీ ఆ పేరే ఖాయమైపోయింది.

పదహారేళ్ళ వయసు కమల మెట్రిక్ పరీక్ష ఇచ్చి అమ్మమ్మగారింటికి చూడటానికి వెళ్ళింది. అమ్మమ్మ తులశమ్మ వేకువజామున లేచి షావుకారుగారినించి తెచ్చిన పాలను ఆ ఊళ్ళో ఇంటింటికీ పోసి వచ్చేది. కొన్ని ఇళ్ళల్లో కూరగాయలు అమ్మి వచ్చేది. ఆ పూరి గుడిసెలో ఆమె జీవితం అట్లా గడించి పోతున్నది.

కమలకు నాలుగు రోజులు సెలవువచ్చినా తులశమ్మ దగ్గరికి వచ్చేది. ఎగురుతూ గంతులువేస్తూ ఆమెతోపాటు పాలుపోస్తూ - పొలంనుంచి తెచ్చిన కూరగాయలు అమ్ముతూ కూడా కూడా తిరిగేది.

ఈసారి కమల తులశమ్మ దగ్గరికి వచ్చేసరికి మలకమంచం వీధివరండాలో వేసి ఉంది. ఎవరో ఒకాయన తెల్లబట్టలు వేసుకున్నాడు. ఉద్యోగస్థుడేమో కూడా. మంచమ్మీద పడుకుని ఉన్నాడు. తులశమ్మ కాఫీచేసి తెచ్చి ఇస్తోంది ఆయనకు.

"బాబూగారూ. మీ జీపు వచ్చేవరకూ ఈ గ్లాసెడు కాఫీ పుచ్చుకోండి" వినయంతో మాటమాటకూ దణ్ణాలు పెడుతోంది.

"చూడు తులశమ్మా. ఇందాకా గ్లాసుతో మజ్జిగ ఇచ్చావు. ఇప్పుడు కాఫీ ఇస్తున్నావు. రాత్రికి కూడా మా జీపు రాకపోతే అన్నం కూడా పెడతావా?" గ్లాసందుకుంటూ అన్నాడు.

తులశమ్మ నవ్వింది. "నా పప్పుచారూ అన్నం మీరు తింటే ఎందుకు పెట్టను?"

సాయంత్రం ఆరు అయినా ఆఫీసరుగారి జీపు రాలేదు. అప్పుడడిగింది తులశమ్మ ఆయనను. "అయ్యా. మీది ఏ దేవూరు? ఏ పనిమీద ఎటుపోతున్నారు?" అని.

"నేను కొత్తగా ఈ ఉద్యోగంలోకి వచ్చాను. పల్లెసీమల్లో జనాభా తనిఖీ చేస్తున్నాను. ఒక సర్వేయరు గ్రామగ్రామం తిరిగి లెక్కలు తయారుచేస్తాడు. అతడి పైఅధికారిని నేను. ఆ పల్లె దాటుతుండగా జీపు చెడిపోయింది. నేను కొంతదూరం నడిచి వచ్చాను. జీపును బండికి కట్టి బాగుచేయించటానికి తీసుకు వెళ్లాడు డ్రైవరు. బాగు కాగానే తీసుకువస్తాడు" వాకిట్లో తులశమ్మ వేసిన స్టూలు మీద కూర్చుని చెబుతున్నాడు కబుర్లు.

లోపల గోగుకాయలు గిల్లుతున్న కమల అతడినీ అతడు చెప్పే కబుర్లనూ బాగా కనిపెట్టి చూస్తోంది. ఆ మనిషీ- ఆ వాలకం- ఆ కబుర్లు చెప్పటం పట్టణపు నాగరీకత ఆమెను సుడిగుండంలో తిప్పేస్తున్నాయి. అతడిని తినేయాలన్నట్టుగా మిరుమిట్లుగొలిపే కళ్లతో చూస్తోంది.

పల్లెటూరి వాతావరణంలో పెరుగుతూ బస్సులో పొరుగూరు వెళ్లి చదువు తున్న కమలకు ఆ యువకుడు ఏ కిన్నెర కింపురుషుడిలానో కనిపిస్తున్నాడు.

ఏడుగంటలు కాగానే ఉన్న ఒక్క లాంతరు బాగా తుడిచి వెలిగించింది తులశమ్మ. మధ్యసావడి ఊడ్చి పీట వేసింది.

"అమ్మమ్మా. దీపం మసకగా ఉంది. నేను బాగా తుడుస్తాను" అంటూ కమల లాంతరు మళ్లీ బాగా తుడిచి వెలిగించింది. సావడి మళ్లీ ఊడ్చింది. పీట విస్తరి మంచనీళ్లచెంబు తనకు నచ్చినట్టు పెట్టింది. తులశమ్మ వడ్డిస్తుంటే తను తలుపు దగ్గరే నిలబడ్డది.

అతడు- అంటే పద్మనాభం కమల వంక- ఎవరో కొత్త పిల్ల అన్నట్టు చూసి- తరువాత పక్క చూపులు చూసి- ఆ తరువాత దొంగచూపులు చూసి- తులశమ్మ పెట్టిన అన్నం కడుపునిండా తిని వీధి వసారాలో పడుకున్నాడు.

తెల్లవారుఝామున నాలుగు గంటలకు జీపు వచ్చేటప్పటికి పద్మనాభానికీ కమలకూ మధ్య ముసిముసి నవ్వులల్లా పకపక నవ్వులయ్యాయి. మళ్లీ ఎప్పుడు వస్తారన్న ప్రశ్నకు "మళ్లా నెలకు ఇదేరోజున వస్తాను. తులశమ్మతో చెప్పు." అంటూ జీపు ఎక్కాడు పద్మనాభం.

కమల మళ్లీనెల అదేరోజు వరకూ చూసింది. ఆరాటంతో ఎదురుచూసింది. కళ్లు కాయలు కాచేటట్టు చూసింది. అతడు వస్తాడు. వచ్చి తనను పెళ్లి చేసుకుంటా డని బంగారు కలలు కంటూ ఎదురుచూసింది.

అతడు రాలేదు. కాని రాడు అనటానికి మనసొప్పలేదు.

తండ్రిచేత దెబ్బలు తిన్నది. తల్లిచేత అమ్మమ్మచేత తిట్లు తిన్నది. ఏ సంబంధం తెచ్చినా మెచ్చదు. ఎవరినీ కన్నెత్తి చూడదు. అంతలోనే అందరికీ సందేహాలూ అనుమానాలూ వచ్చాయి. మళ్లీ కమలను కొట్టారు. తిట్టారు. చివరకు తల్లీ తండ్రీ ఉన్న ఊళ్లో తల ఎత్తుకోలేక అమ్మమ్మ ఉన్న ఊళ్లో కమలకు పురుడు పోశారు. కమలను అక్కడే ఉంచారు. కమల తనకు పుట్టిన పిల్లవాడిని ఎవరికీ ఇవ్వవివ్వలేదు. తనే పెంచుకుంటానని హఠం చేసింది. లేకపోతే చస్తానంది.

తులశమ్మ చాటున పిల్లవాడు పెరిగాడు. ఆ ఊళ్లో భోజనంచేసి పక్క ఊళ్లో చదువుకున్నాడు. మెట్రిక్ ప్యాసు కాగానే తల్లీకొడుకు నగరం ప్రయాణమయ్యారు. తులశమ్మ చనిపోయింది. ఆ పూరిగుడిసె ఆ స్థలం అమ్మారు. ఆ డబ్బు చేతపట్టుకుని బయలుదేరారు.

కలిగిన వారెవరో రేకులషెడ్డు నాలుగు రూపాయలకు అద్దెకిస్తే దానికే గోనెపట్టాలు అడ్డం కట్టుకుని తల్లీకొడుకులు ఉన్నారు. స్కాలరుషిప్పు తెచ్చుకుని బి.ఎ. అయినదనిపించాడు బాలకృష్ణ.

కమల మోసపోయిందిగాని తెలివిగల ఘటంకావటంచేత ఇంటి యజమానులు తయారుచేసిన తినుబండారాలను సమీపంలో ఉన్న ఆడపిల్లల స్కూలులోను కాలేజిలోను అమ్ముకుని వచ్చేది. అమ్మగా వచ్చినదానిలో తనకు రోజుకు నాలుగు రూపాయలు ఇస్తే జాగ్రత్తగా ఇల్లు గడుపుకుని కొడుక్కు కావలసిన బట్టలూ అవీ అమర్చేది.

గడచిన ఇరవై సంవత్సరాలలో పద్మనాభాన్ని గురించి ఆమె కలలు కంటూనే ఉన్నది. తనను పెళ్లి చేసుకున్నట్టూ, కలిసి కాపురం చేస్తున్నట్టూ, పిల్లవాడిని అపురూపంగా చూసుకుని చదువు చెప్పిస్తున్నట్టూ పెద్ద ఉద్యోగం వేయించినట్టూ- స్వప్నాలు మదురమైనవి- మధురాతి మధురమైనవి కంటూనే ఉన్నది. అవును. ఆమె నవమాసాలు మోసి కన్నతల్లిగా కొడుకు భవిష్యాన్ని గురించి కాంక్షలు పెంచుకుంది అది తన సంతానానికి తండ్రి అయిన వాడి బాధ్యతగా ఆశించింది. కాని- సాక్ష్యాలు లేని మాతృత్వము తనదని మనసంగీకరించదు.

కాని- ఏదీ? ఏ కల నిజమయిందని?

ఒంటరిగా ఉన్నప్పుడు ఆమె తనలోతనే తల పంకిస్తూ నవ్వుకుంటుంది.

ఇటీవల కమల కమలమ్మయి పదిమంది పిల్లలకు చదువు చెప్పటం మొదలు పెట్టింది. ధరలు మిన్నంటిపోతున్నాయి. కన్నబిడ్డకు కడుపునిండా అన్నమైనా పెట్టాలని ఆదుర్దా.

"అమ్మా. నాన్న ఇప్పటివరకూ ఉంటే నాకు వెంటనే ఉద్యోగం దొరికేది కదూ?" బాలకృష్ణ బాల్యము వీడనట్టే అడుగుతాడు తల్లిని.

"అవునురా. ఆయనే ఉంటే నీవిట్లా ఉంటావా బాలూ! ఎంత పెద్ద చదువు? ఎంత పెద్ద ఉద్యోగం? ఎంత అదృష్టం పట్టేదో? ఏదీ నీవు కళ్లు తెరిచే సరికి ఆయనకు చూసే యోగం లేకుండా పోయింది."

"దురదృష్టవంతుణ్ణి కదూ అమ్మా?" అంటాడు.

ఆమె అవునని బైటికి అనదు.

"అమ్మా. వాసు దగ్గరికి ఒకసారి వెళ్లివస్తాను" గుమ్మం దాటాడు బాలూ.

వీధి మొదట్లోనే వాసు కలిశాడు. ఇద్దరూ మాట్లాడుకుంటూ రామస్వామి దగ్గరికి వెళ్లారు. రామస్వామి వీళ్లతో చదివినవాడేగాని నాలుగేళ్ల సీనియరు.

అందరూ కలిసి మ్యునిసిపల్ పార్కులో కూర్చున్నారు.

రామస్వామి ముఖం చాలా దీనంగా ఉంది.

"ఏమిటి? నీ ముఖం చాలా విచారంగా కనబడుతోంది. అంత బాధపడి పోతున్నావేమిటి రామస్వామి?" వాసు బాలూ ఇద్దరూ ఒక్కసారే అడిగారు.

"నా దురదృష్టానికి నేను విచారపడుతున్నాను. పద్మనాభంగారనే ఆఫీసరు తన ఆఫీసులో అటెండరు ఉద్యోగం నాకిస్తానని మా నాన్నతో చెప్పి - ఆశపెట్టి పెట్టి ఇవాళ వెళ్లి అడిగితే ఎవరికో ఇచ్చేశానన్నాడు. తరువాత తెలిసింది రెండు వేలు తీసుకున్నాడట ఆ ఉద్యోగమిచ్చినందుకు. వాడెవడోకాదు - మన క్లాసుమేట్ శివప్రసాద్" ఆవేశపడిపోతున్నాడు రామస్వామి.

"ఇది ఒకటేనా? ఇంకెక్కడా ఉద్యోగాలు మనకు దొరకవా?" వాసూ బాలూ అతడిని శాంతపరచటానికి ప్రయత్నించారు.

"ఆయన కొడుకట పై చదువులకు ఎక్కడికో వెళ్తాడట అందుకని ఆఫీసులోఉన్న చిన్నచిన్న పోస్టులన్నీ ఇలా అమ్మేస్తున్నాడట" రామస్వామి కళ్లల్లో ఎర్ర జీరలు.

ముగ్గురూ చాలా సేపు ఆఫీసరును గురించి మాట్లాడుకుని ఇళ్లకు వెళ్లారు

ఆశాభంగంతో ముఖం చిన్నబుచ్చుకున్న కమలమ్మ కొడుకు రాగానే భోజనం పెట్టింది.

పడుకోబోయేటప్పుడు మాట్లాడుకోవటంలో మళ్లీ ఉద్యోగ ప్రసక్తివచ్చింది. తను విన్నాదంతా చెప్పాడు బాలు.

స్కూల్లోకి తినుబండారాలు తీసుకువెళ్లే కమలమ్మంటే శశికి ఎంతో ఇష్టం. కమలమ్మ మాట్లాడుతుంటే ఆ అమ్మాయికి గుండెలో సంతోషం పొంగుకుంటూ వస్తుంది. ఆ అమ్మాయిని చూస్తే కమలమ్మకు పద్మనాభాన్ని చూసినట్టుంటుంది. అందరికంటె ఆ అమ్మాయికి ప్రత్యేకంగా టిఫిన్ పళ్లెంలో నింపియిస్తుంది.

పండగనాడు కమలమ్మను ప్రత్యేకంగా ఇంటికి పిలిచింది శశి. తల్లిని పిలిచి కమలమ్మను చూపించింది.

"అక్కడి టిఫిన్లు అలవాటయి ఇంట్లో ఏది చేసినా శశి వాటి మాదిరిగా ఉండవని తినటం మానేసింది" తల్లి చెప్పింది.

"నేను కాదమ్మా చేసేది. నేను మధ్యవర్తిదే" అన్నది కమలమ్మ ముఖ మాటపడుతూ.

కమలమ్మ చాలా సేపు కూర్చుంది. శశి తన అక్కలిద్దరిని తీసుకువచ్చి చూపించింది. అన్నను కూడా పిలుచుకువచ్చింది.

"ఈ ఆంటీ మాకు మంచి మంచి టిఫిన్లు తెచ్చిపెడుతుంది మధ్యాహ్నం వేళ. ఎంత రుచిగా ఉంటాయో తెలుసా?" గొప్పగా చెబుతోంది శశి.

తన పెద్దపెద్ద కళ్లను మరింత విశాలం చేసుకుని చూసింది కమలమ్మ. చూపులు తిప్పుకోలేకపోయింది. రెప్పలు వాలలేదు.

అణువంతయినా భేదంలేకుండా ఇంతగా ఒకరినొకరు పోలి ఉంటారా మనుష్యులు? తాను ఆ యింట్లో - అతడిని చూసింది కనక సరిపోయింది- మరెక్కడయినా చూసినట్లయితే 'బాలూ' అని పిలిచి ఉండేది.

కొంత సేపటికిగాని ఆమెకు తనెక్కడున్నదీ తెలియలేదు. తెలిసిన తరువాత మరింక అక్కడ ఉండటం భావ్యం కాదనిపించి లేచింది.

"ఈ శశి అంటే నాకెంతో ప్రేమ. అందుకే పిలవగానే ఇంటికి వచ్చాను. వెళ్తాను" అంటూ లేచింది కమలమ్మ.

"మీ బాబుకియ్యండి" శశి తల్లి కొబ్బరిమిఠాయి పొట్లం కట్టి ఇచ్చింది.

చెయ్యెత్తి దణ్ణం పెట్టబోతున్న కమలమ్మ అక్కడికి వచ్చినాయనను చూసి ఒకడుగు వెనక్కువేసింది.

పద్మనాభం లావెక్కలేదు. తులశమ్మ యింటికి వచ్చినప్పుడు ఎట్లా ఉన్నాడో ఇప్పుడూ అట్లాగే ఉన్నాడు. పెద్ద ఉద్యోగమయిందేమో మరింత హుందాగా ఉన్నాడు. భార్యను పర్సు ఇవ్వమని అడుగుతూ కమలమ్మను తేరి పారజూస్తున్నాడు.

"ఈమే నాన్నా, మాకు టిఫిన్లు తెస్తుంది స్కూలుకు" అంటూ శశి కమలమ్మను పరిచయం చేసింది.

"మీరు చేసేపని చాలా బాగుందమ్మా. ఈ పిల్లలు ఈగలు ముసిరే సరకులు కొనుక్కుని తిన్నదానికంటె మీరు ఇంట్లో చేసినవి జాగ్రత్తగా కాగితాలలో చుట్టి ఇస్తున్నారట" ఇంకా ఆమె కళ్లల్లోకి చూస్తున్నాడు.

"స్కూలుకు దగ్గర్లోనే ఉంటారా?" మళ్లీ ప్రశ్నించాడు.

ఆమె కళ్లనిండా ఆయనను చూసింది. గుచ్చిగుచ్చి చూసింది. జ్ఞాపకం తెచ్చుకో అన్నట్టు చూసింది. మగవాడెంతలో మరిచిపోతాడో అన్న విరక్తిభావంతో చూసింది.

"కూర్చోండి. నిలబడే ఉన్నారు" భార్యకోసం ఎదురుచూస్తున్నాడు. ఆమె తాళపుచెవుల కోసం వెతుకుతోంది. అవి కనబడకపోతే పిల్లలను చివాట్లేస్తున్నది.

"నాన్నా మీకోసం ఎవరో అబ్బాయి వచ్చాడు" కొడుకు వచ్చి చెప్పాడు.

"ఈ ఉద్యోగాల కోసం వచ్చే అబ్బాయిలతో మతిపోతోంది" విసుక్కున్నాడు పద్మనాభం.

"ఇదిగో మీ పర్సు. మళ్లీ ఎవరో వచ్చారటగా మీ కోసం? వచ్చిన వాళ్లను ఏవో రెండు మాటలు చెప్పి పంపక- కన్నకొడుకును కూర్చోబెట్టుకున్నట్టు కూర్చోబెట్టుకుని కష్టసుఖాలడుగుతుంటే ఆఫీసుకూ వస్తారు ఇంటికీ వస్తారు."

తన ప్రజ్ఞకూ భార్య ఇచ్చిన కామెంట్ కూ ఉబ్బిపోయాడు పద్మనాభం.

"కబుర్లు చెప్పినంతమాత్రాన అందరూ కొడుకులవుతారా? కన్నకొడుకులయినా కొడుకులనిపించుకోరు. నేనెరిగిన ఒకాయన పాంథుడిగా ఒక ఊరికి వచ్చి బిడ్డ తండ్రి అయినాడు. ఆ బిడ్డ పెద్దవాడయి ఆ తండ్రి దగ్గరికే ఉద్యోగానికి వెళ్ల వలసి వచ్చింది. అప్లికేషన్‌లో పిల్లవాడి తండ్రిపేరు కూడా ఉంది. ఉంటేనేమి? ఆయనకెట్లా తెలుస్తుందీ సంగతి? ఏవో నాలుగు కబుర్లు చెప్పి పంపించాడు." కమలమ్మ జనసామాన్యం సంగతి చెప్పినట్టుగా చెప్పింది.

"అవున్లెండి. పాంథుడిగా ఒక పూటో అర పూటో ఉన్నవాడికి కొడుకు పుట్టాడని ఎట్లా తెలుస్తుంది? అయినా టూర్ ప్రోగ్రాం వేసుకుని బయలుదేరిన వాడికి ఎన్ని ఊళ్లో తగులాయి. ఎన్నని జ్ఞాపకం ఉంచుకోగలుగుతాడు?" పర్సు జేబులో పెట్టుకుంటూ గడ్డం తడుముకుంటూ "రాత్రికి కాకుండా సాయంత్రం ఆటకే పిల్లలను సినెమాకు పంపు" అన్నాడు భార్యతో.

"పాంథుడు.... ....పాంథుడికేం బాధ్యతలుంటాయి? ఏం జ్ఞాపకాలు ఉంటాయి?" గొణుక్కుంటూ అడుగులు వేసింది కమలమ్మ వీధిలోకి. "క్యాంపులు తిరిగే వాళ్లకు ఎన్నో ఊళ్లు తగులుతాయి. ఎన్నెన్ని జ్ఞాపకం ఉంచుకుంటాడు?" ఆ మాటలే తలలో తిరుగుతున్నాయి.

"తండ్రి ఒకటే అయినా హోదాలు వేరు కనుక ఒకడికి తండ్రి-ఒకడికి పాంథుడూ అవుతాడు". కమలమ్మకు అందరికీ తెలిసిన ఈ సత్యము ఆలస్యముగా తెలిసింది.

---

# బ్రతికి చచ్చిన వాళ్ళు

తమ్ముడిని రైలెక్కించి స్టేషను బైటికి వస్తూ అనుకోకుండా వెనక్కి తిరిగి చూసింది సిరి. అడవితీగెల డిజైను నైలెక్సు చీరె-కత్తిరించిన జుట్టుతో అల్లిన రెండు పొట్టి జడలు-చేతిలో వానిటీబ్యాగ్ నల్లటి కళ్ళద్దాలతో వస్తున్న ఆమెను చూసి చటుక్కున ఆగిపోయింది. ఎవరామె? సన్నగా పెదవులలోనే అణగిపోయింది మాట

అంతలో "ఏయ్ ఆటో! నీ మీటర్ బాగున్నదా? కొత్తదేనా? అందులో మాయ ఏం లేదు కదా?" అధికారస్వరంతో నిలవదీసి అడుగుతోంది ఆమె.

ఆ నడక-ఆ మాటతీరు చూస్తున్నకొద్దీ సిరికి తనకు పియూసిలో క్లాసు మేటయిన రంగేమోనన్న అనుమానం కలిగి ఆలాగే నిలబడి చూస్తున్నది. కాల ప్రభావంచేత మనుష్యులలో అనేక మార్పులు కలుగుతాయి. శరీరచ్ఛాయ మారవచ్చు. సన్నగా ఉన్నవాళ్లు లావుకావచ్చు. కాని అలవాట్లు మారవు.

తననే చూస్తున్న సిరివంక తినేసేటట్టుచూసి చివ్వున వెనక్కి తిరిగి మరొక ఆటోను కేకేసింది ఆమె.

"ఆమె నిస్సందేహంగా రంగే. మనిషి కొంచెం స్థూలమయింది కాని ఏం మారలేదు," అనుకుంటూ "మీరు రైలు దిగి వస్తున్నారా?" అన్నది అప్పుడే పరిచయం చేసుకోబోతున్నట్టుగా.

"నేను ఇక్కడ ఫామిలీప్లానింగ్ యూనిట్‌లో పనిచేస్తున్న డాక్టర్ని క్యాంపు నుంచి తిరిగి వస్తున్నా" అన్నది కాస్త పెడసరంగా రాగంతీస్తూ. ఇంక పట్టలేక "రంగా! నీ క్లాస్‌మెట్ సిరిని. గుర్తు పట్టలేదూ?" అంటూ దగ్గరగా వచ్చింది.

"నీవు సిరివా? సిరివని నీవు చెప్తే తప్ప నిన్ను ఆనాడు చూసినవారెవరూ గుర్తుపట్టలేరు. చేతికరపని బారెడు వెంట్రుకలు నీవి. ఆ తలకట్టంతా ఏమయింది,

కాలేజి విద్యార్థులను నీ చుట్టూ తిప్పించిన అందమంతా ఏమయింది ? మిలమిల మెరిసే నీ శరీరచ్ఛాయ ఏమయిపోయింది ? ఆనాటి అందాలసిరిని కురూపిగా చిత్రిస్తే ఎట్లా ఉంటుందో అట్లా ఉన్నావు నీ విప్పుడు ?'' ఆశ్చర్యపడుతూ భుజం మీద చెయ్యేసింది రంగ.

అదొక జన్మ. ఇదొక జన్మ అన్నట్టు చూసింది సిరి. ''అయితే నీవుండటం ఎక్కడ ?'' అన్నది మాట మారుస్తూ.

''మెడికలాఫీసరు క్వార్టర్సులో !''

అవతలి బేరం కుదరక మొదట రంగ పిలిచిన ఆటోవచ్చి ఆమె కెదురుగా నిలిచింది

''అయితే నీఉండే ఇల్లు నాకు తెలుసులే. సాయంత్రపు వేళల్లో నీకు పని ఉండదుగా. నేను వస్తూ ఉంటాలే'' అంటూ డాక్టరు ఎక్కిన ఆటో కదిలిపోయిన తరువాత రిక్షా ఎక్కింది సిరి.

సిరి ఇంటికి వచ్చేటప్పటికి పెద్ద కూతురు పన్నెండేళ్ళది ఎదురుగా వచ్చి ''అమ్మా, నాన్న నీ కిమ్మని పంపారు రెండువందల రూపాయలు'' తల్లి చేతిలో పెట్టింది.

వాటిని చూడగానే సిరికళ్లు అశ్రుపూరితమయ్యాయి. నెలనెలా చేతిలోకి వచ్చే ఈ రూపాయలనేనా తాను పెళ్ళి చేసుకున్నది ? ఇవేనా తనపిల్లలకు తండ్రి ? కొంతసేపటికి సిరి మనసు ఊరడిల్లింది, కురుకుదనం తలెత్తింది. అవును, ప్రస్తుతం అవే తన పిల్లలకు తండ్రి-తనకు భర్త. ఆ మాత్రమయిన జ్ఞాపకమూ ఆ పిల్లలకు తమ తండ్రినన్న స్మరణా ఉండబట్టే తన మెడలో తాళికట్టిన జ్ఞాపకాలుమెదలబట్టే ఐదువందల జీతంలో రెండు వందలైనా పంపుతున్నాడు. అవయినా పంపకపోతే తనేంచెయ్యగలదు ? ఐదుగురు పిల్లల తల్లి భరణంకోసం దావా వేస్తుందా ? సగం ఇప్పించమని ఆయన పైఆఫీసరుకు చెప్పుకుంటుందా ? మనసు మూలిగి మూలిగి సద్దుమణిగింది.

రూపాయలు బీరువాలోపెట్టి మంచంవైపు చూసింది. మోహలత పద్మలత-ఇద్దరూ కాళ్ళూ చేతులు జోడిస్తూ ఊఁ ఆఁ అనుకుంటూ బోసినవ్వులు ఒలక బోస్తున్నారు.

పెద్ద పిల్ల కృష్ణవేణికీ తరువాత పుట్టిన మగపిల్లలిద్దరికీ అన్నం పెట్టి, పొట్లం కట్టి చేతికిచ్చి స్కూళ్ళకు పంపింది. చిన్న పిల్లలు నిద్రపోతున్నారు. వంటయింటి గడపమీద కూర్చుని ఆలోచనలో పడ్డది.

తన క్లాసుమేటు రంగ స్టేనో కూతురు. పి.యు.సి.లో మార్కులు బాగా వచ్చాయని ఆమె తండ్రి స్నేహితులు పట్టుబట్టి మెడిసన్‌లో చేర్పించారు. ఫామిలీ ప్లానింగ్ స్కాలర్‌షిప్పుతో చదువు పూర్తిచేసింది.

మరి తను? తండ్రి ఇచ్చే పెద్ద కట్నమూ తన అందమూ చూసి ఎన్నో సంబంధాలు వచ్చాయి. వాటిలో ప్రకాశరావు సంబంధ మొకటి. పెళ్ళికాగానే ఆతడికి ఉద్యోగం దొరికింది. అత్తవారింట్లో ఆమె పాదం పెట్టినవేళ మంచి దన్నారు. తన పేరు సిరి. అదృష్టంకూడా కలిపి వచ్చిందనుకుని మురిసిపోయింది. ఎన్నో పసిడికలలు కన్నది.

పిల్లలు పుట్టారు. ఆడపిల్లల తరువాత ఇద్దరు మగపిల్లలు పుట్టగానే ప్రకాశరావు కూడా సంతోషించాడు. ఆ తరువాత ఇద్దరు పిల్లలు పుట్టిపోయిన తరువాత నాలుగు నెలల క్రిందట కవలపిల్లలు పుట్టారు. పిల్లలు పోయినప్పటినుంచీ తన ఆరోగ్యం దిగజారటం మొదలు పెట్టింది. శరీరచ్ఛాయ తగ్గింది. శరీరంలో బలం తగ్గింది. రక్తం పలచబడింది. అందమయినకళ్లు కాంతిహీనంగా మిణుకు మిణుకు మనే దీపాల్లా ఉన్నాయి. అనారోగ్యంవల్ల దేహం ఊరిపోయింది.

ప్రకాశరావేం చేశాడు? చిన్న ఇల్లు-ఆరోగ్యంలేని భార్య-ఎప్పుడూ దేనికో ఒకదానికి ఏడుస్తూ అల్లరిచేసే పిల్లలు - ఇంటికి రాగానే డబ్బులేదనో మందులు కావాలనో భార్య నణుగుతుందనే భయంతో సాధ్యమైనంత ఆలస్యంగా ఇంటికి వచ్చేవాడు. ఇల్లు నరకంలా కనబడేది. "ఇది ఇల్లా? నరకకూపం" అంటూ కేకలు పెట్టేవాడు అన్నిటికీ చివాట్లూ, చెంప దెబ్బలూ పెట్టేవాడు. అంటీ అంట నట్లుగా ఇంట్లో ఉన్న కాసేపూ మెదిలేవాడు. ఈ మధ్య ఇంటికి రావటం మానేశాడు. నెలనెలకూ ఖచ్చితంగా రెండువందల రూపాయలు పంపుతాడు. తను ఇంతవరకూ బ్రతికిన స్థాయిలో బ్రతకాలంటే ఆ డబ్బు చాలదు. ఇంతవరకూ ఏవో ఆశలతో రోజులు గడుపుకు వస్తుంటే తన తమ్ముడు వచ్చి ప్రకాశరావు ఒక చిత్రకారిణిని పెళ్ళి చేసుకున్నాడన్న వార్త వినిపించి వెళ్లాడు.

ఇది నిజమా ? అందరూ నిజమన్నా తన మనసెందుకు అంగీకరించదు! తను ప్రేమించి పెళ్ళిచేసుకోలేదు. పెద్దలు చేసిన పెళ్ళి. అప్పటి నుంచీ ప్రేమించ టం ఆరాధించటం మొదలుపెట్టింది. అతడి కొరకు ప్రాణాన్నయినా త్యజించే స్థాయికి వచ్చింది. తను ప్రకాశరావు మీద ఈగవాలనిస్తుందా ? అతడిటువంటి పనిచేశాడంటే ఒప్పుకుంటుందా? ఈ నాలుగు నెలల నుంచీ అనుకుంటోంది. "మనం కంటికి కనబడని దేవుడిని ఆరాధించటం లేదూ ! అట్లాగే ప్రకాశరావును కూడాను" పరిస్థితులతో రాజీపడటానికి ప్రయత్నిస్తోంది.

సిరిని చూడగానే రంగ ఎంతో సంతోషించింది. కాఫీ తాగిన తరువాత "సిరీ ! మా బావగారి సంగతి చెప్పు. ఏం పని చేస్తున్నారు ? నీ విట్లా అయి పోయావేం ? ఏమయినా బెంగా ? చెప్పు ? నేనాయనతో మాట్లాడాలి. నీ ఆరోగ్యాన్ని గురించి చెప్పాలి" అంది ఆవేశంతో.

విరక్తిగా నవ్వింది సిరి. "నీవు ఫామిలీప్లానింగు డాక్టరువి కదూ ! అదంతా చేస్తావు కాబోలు" అంది.

రంగ మందహాసం చేసింది. పిల్లలనుకని ఆరోగ్యం పాడుచేడుకున్న భార్యలను ఎందరో భర్తలు అలక్ష్యం చెయ్యటమూ. పెడదారులు తొక్కటమూ వంటి కేసులెన్నో రంగకు డాక్టరుగా అనుభవం ఉన్నది. సిరి జీవితంలో తెరచాటు భాగవతమేదో ఉన్నదని పసికట్టింది. కాని సిరి ఆభిమానవతి. కనుక అడిగినా చెప్పదు. రంగ నాగరిక. కనుక ఇటువంటి అంతరంగిక విషయాలను అడగలేదు.

వారం రోజులయినా తిరక్కముందే రాత్రి ఎనిమిది గంటలవేళ పిల్లవాడిని తీసుకువచ్చింది చూడమంటూ రంగ దగ్గరికి.

"న్యుమోనియా అన్న సందేహం సిరీ. హాస్పిటల్లో చేర్పించు. నేను జాగ్రత్తగా చూస్తాను" అంది పరీక్ష చేసి.

"హాస్పిటల్లో ఉంచితే వీడి దగ్గరెవరుంటారు రంగా? నేనుండటానికి చేతిలో ఇద్దరు చిన్న పిల్లలు" దిగులుగా చూపింది సిరి.

"ఎవరుంటారని అట్లా దీనంగా మాట్లాడతావేం సిరీ ? మా బావగారు లేరూ ? ఆయన ఉండ కూడదూ పిల్లవాడి దగ్గర ? ఎవరికయినా తల్లీ తండ్రీకంటె మూడవ మనిషి ఎవరుంటారు ?" మందలించినట్టుగా అన్నది.

"రంగా, కడుపులో దాచుకున్న దాన్ని వెళ్ళగ్రక్కించకు." తలవంచుకుంది.. కాని దుఃఖంతో మనిషి ఊగిపోతున్నది.

కుర్చీలో నుంచి లేచి సిరి భుజంమీద చెయ్యేస్తూ "మీ వారు ఏ ఆఫీసులో పని చేస్తారు చెప్పు ! నేను మనిషిని పంపించి పిలిపిస్తాను" అర్థిస్తున్నట్టుగా అన్నది రంగ.

సిరికి చెప్పక తప్పలేదు. ఆ రాత్రికి ఒక ఇంజక్షను మాత్రలు ఇచ్చి మరునాడు హాస్పిటల్‌కు తీసుకురమ్మని చెప్పి సిరిని పంపించింది రంగ. రంగకు ఆడవాళ్ళమీద కంటె మగవాళ్ళమీద జాలి ఎక్కువ. వాళ్ళను అర్థంచేసుకునేటంతగా ఆడవాళ్ళు ఎదగాలనీ, అందుకు బాగా లోకజ్ఞానం సంపాదించుకోవాలనీ నమ్ముతుంది. మగవాళ్ళ దుష్టచర్యల కన్నింటికీ ఆడవాళ్ళే కారకులంటుంది. కాని-స్త్రీ ఎంత డాక్టరయినా-ఒక పెళ్ళి కాని స్త్రీ ఇలా అంటుంటే తోటి ఆడవాళ్ళే నవ్వటం మొదలు పెట్టేవారు. చదువుకునే రోజుల్లో స్నేహితులు ఆటలు పట్టించేవారు. అలా ఆలోచిస్తున్న రంగకు ఒకసారి ప్రకాశరావును చూసి మాట్లాడాలన్న కోరిక బలంగా కలిగింది.

రంగ కోరికను గురించి విన్న సిరి పగలబడి నవ్వింది. "మగవాళ్ళ స్వభావాన్ని కనిపెట్టటం అంత తేలిక కాదు రంగా. ఆడవాళ్ళే మగవాళ్ళ చర్యలకు మూలం అంటావు. శాస్త్రానికి మానవస్వభావం కట్టుబడి ఉండదు రంగా. ఆడవాళ్ళందరూ ఇంతే- మగవాళ్ళందరూ అంతేనని కచ్చితంగా చెప్పలేము. మన అంచనాలన్నీ పగటువి. నీవు ఆయనను మార్చగలననీ సంస్కరించగలననీ ఏమిటేమిటో ఊహిస్తున్నావు. ప్రయత్నిస్తే నీకు ఆశాభంగం తప్ప లాభముండదు" అంటుంది సిరి.

రంగ కబురుచేసిన రెండు రోజుల తరువాత హాస్పిటల్‌కు వచ్చాడు ప్రకాశరావు. ఈ లోపల రంగ సిరిని పిల్లలతో తన ఇంటికి చేర్పించింది. కవల పిల్లలను ఆయాకు ఒప్పగించి సిరి హాస్పిటల్లో పిల్లవాడి దగ్గర ఉన్నది.

ఉదయపువేళ మరో అరగంటకు ఆఫీసుకు వెళ్లాలనగా ప్రకాశరావు హాస్పిటల్‌కు వచ్చి పిల్లవాడిని చూశాడు. పిల్లవాడి పరిస్థితి ప్రమాదకరంగా ఉందని రంగ చెప్పింది.

"డాక్టర్. నా అదృష్టం కొద్దీ మీరు దేవతలా ఆదుకుని ధన్వంతరిలా వైద్యం చేస్తున్నారు. వాడి భారమంతా మీదే. ఏ మందు కావలసినా సందేహించకుండా వ్రాసి యివ్వండి. తల్లి తెప్పిస్తుంది." పిల్లవాడిని క్రీగంట మరోసారి చూశాడు. నిద్రలేని కళ్ళతో-శోకభారంతో-నలిగిన బట్టలతో - చెదరిన తలవెంట్రుకలతో దిగులుగా మంచందగ్గర విలబడిన సిరిని కొసగంట చూశాడు. డాక్టరుకు నమస్కరించి వెళ్ళిపోయాడు. తరువాత రంగ ఎన్నిసార్లు చెప్పి పంపించినా రాలేదు.

"మొండి ఘటం" అనుకుంది రంగ మనసులో. అహర్నిశలూ కనిపెట్టుకుని మంచి మందులు వాడి పిల్లవాడి జబ్బు నయంచేసింది రంగ. తన యింటికి దగ్గరగా ఒక గది అద్దెకు తీసుకుని సిరిని దానిలో ఉంచింది. సిరి కవలపిల్లలు రంగ. ఆయా దగ్గర ఉంటారు. సిరి ఒక చిన్న స్కూల్లో ఉద్యోగం సంపాదించింది.

ఒకనాడు "సిరీ. నీవు పిల్లలు పుట్టకుండా ఆపరేషను చేయించుకో. ఎందుకయినా మంచిది" అన్నది రంగ.

"ఎందుకు మంచిదంటావు!" నవ్వింది రంగ. "మే మిద్దరం ఒక యింటిలో కాపురం చేయటం కల్ల. నీ కెందుకా భయం?" అన్నది.

"ఎందుకయినా మంచిది" రంగ బలవంతంమీద సిరికి అపరేషన్ జరిగింది. సిరికి బలం పట్టటానికి మందులు ఇచ్చి ఆమెను అన్ని విధాలా కనిపెట్టి చూస్తున్నది రంగ. సిరికి బలహీనత ఆరోగ్యం పట్ల అశ్రద్ధ-జీవితంలో నైరాశ్యము-పిల్లలను గురించిన బెంగ వీటన్నిటినీ మెల్లమెల్లగా పోగొట్టటానికి ప్రయత్నం చేస్తున్నది రంగ.

సిరికి అర్ధరాత్రివేళ మెలకువ వచ్చి లేచి కూర్చుంటుంది. ఎదుగుతున్న పిల్లలకు తండ్రిని గురించి ఎటువంటి ఆలోచనలు కలుగుతున్నాయోనని భయపడుతుంది. పిల్లలు పెద్దవాళ్ళయి తండ్రిని అసహ్యించుకుంటారేమోనని ఖిన్నురాలవుతుంది. ఈ సంసారాన్ని సృష్టించి దాన్ని అలవిగాకుండా పెంచి, నన్నీ ఊబిలో దించి మీరు ఆ చిత్రకారిణి కెదురుగా కూర్చుని కిలా కిలా నవ్వుతూ కాలం గడుపుతున్నారా!" అని మనసులోనే ప్రశ్నిస్తుంది. "చిత్రకారిణి చిన్న వయసు

-లోది. సంసార లంపటం పెరగనిది. తనతోపాటు తీరికగా కూర్చుని అహర్నిశలూ కబుర్లు చెప్పి ఆనంద వారాసిలో ముంచెత్తగలది. మరి తను ? ఎదిగిన పిల్లల ఎదుట అతడితో సరస సంభాషణలు చేయటానికిష్టపడని ఐదుగురు పిల్లల తల్లి. కాన్పులతో ఆరోగ్యం చెడిన ఇల్లాలు.

రంగకు హఠాత్తుగా బదిలీఅయింది. సిరిని అట్లా గాలికి వదిలేయటానికి బుద్ధి పుట్టక తనతోబాటు తీసుకువెళ్ళడానికి ప్రయత్నాలు చేస్తున్నది. సిరి ఇప్పుడు రంగ అండలేకపోతే పిల్లలతో ఒంటరిగా బ్రతకలేదు. గత్యంతరంలేక రంగతో వెళ్ళటానికి నిశ్చయించుకుంది. వెళ్ళే ముందర ప్రకాశరావుకీ సంగతి ఎలా తెలపాలా అని మార్గాలు వెతుకుతుండగా ఆ రాత్రికిరాత్రి నాలుగు వాంతులయి కవల పిల్లలలో ఒక పిల్ల చనిపోయింది.

సిరికి కన్నీళ్ళు రావటంలేదు మెదడు పనిచేయటంలేదు. ఒళ్ళంతా బిగుసుకు పోయినట్లయింది. నిశ్చలమయిన చూపులతో గోడకానుకుని కూర్చుంది ప్రకాశ రావుకు మళ్ళీ కబురు వెళ్ళింది. కాని అతడు తిరిగి చూడలేదు ఆ మరునాడు కవల పిల్లల్లో రెండో పిల్లకు కూడా వాంతులయ్యాయి. కళ్ళు తేలవేసింది.

సిరికి అయోమయంగా ఉంది భగవంతుడు తనను నిజంగా పరీక్ష చేస్తున్నాడా అనుకుంది. తనెంత ? తన బ్రతుకెంత ? పిచ్చుకవంటి తన మీద బ్రహ్మాస్త్రము విసురుతున్నాడు విధాత. అన్నం నీళ్ళు లేకుండా మంచాని కంటుకు పోయింది.

కాని రంగ అంతటితో ఊరుకోలేదు. పనికట్టుకుని ఆఫీసుకు వెళ్ళింది. అక్కడ పిడుగులాంటి కబురు చెవినపడ్డది. నెల క్రిందట ప్రకాశరావు సెలవు పెట్టి వెళ్లాడని తెలిసింది. ఎన్నాళ్ళు? ఎక్కడికి? ఈ ప్రశ్నలకు జవాబులు ఆమెకు అక్కడ లభించలేదు.

సిరిని ఓదార్చి, బుజ్జగించి తనతో తీసుకువెళ్ళిపోయింది రంగ సిరికి నెల నెలా వచ్చే రెండువందల రూపాయల రాబడి నిలిచిపోయింది. సిరి తమ్ముడువచ్చి బ్రతిమిలాడాడు తన వెంటరమ్మని. తల్లి కన్నీళ్లతో జాబులు వ్రాయించింది. కాని సిరి సర్వమూ రంగేనని నమ్ముకున్నానని చెప్పి తమ్ముడిని పంపించేసింది.

కాలప్రవాహం ఎనిమిదేళ్లు ముందుకు సాగేటప్పటికి సిరి బి.ఏ. ప్యాస యింది. సైపు పరీక్షలో ఉత్తీర్ణురాలయింది. పెద్ద కూతురు ఇరవై ఏళ్లదయింది. పట్టభద్ర అయింది. సంగీతజ్ఞానం సంపాదించి లలిత సంగీతంలో గానకోకిల యింది. మగ పిల్లలిద్దరూ కళాశాల చదువులలోకి వచ్చారు. రంగ తన జీతంలో నుంచి నూటఏభయి రూపాయలు సిరికిచ్చేస్తుంది. సిరి టీచర్‌గా సంపాదించేదీ - ఆడపిల్ల కృష్ణవేణి పాట కచేరీలుచేసి సంపాదించేదీ అంతా కలిపి తన సంసారాన్ని నెట్టుకు వస్తున్నది సిరి.

పిల్లలకిప్పుడు తండ్రి ప్రసక్తిలేదు. అతడిని పూర్తిగా మరచిపోయారు. కాని సిరి మనసులో నిలిచిన ప్రకాశరావు ఆమెను బాధ పెడుతూనే ఉన్నాడు: అతని జ్ఞాపకాలు ఆమెను రాత్రిళ్ళు నిద్రపోనివ్వవు. కన్నీళ్ళు కార్పిస్తాయి.

హఠాత్తుగా ఒకనాడు రంగ అన్నది ఇంటికి రాగానే "సిరీ. మీ ఆయన చనిపోయాడని తెలిసిన వాళ్ళెవరో చెప్పారు" అంటూ.

సిరికి మీద పిడుగు పడ్డట్టయింది. దగ్గర లేకపోయినా ఎక్కడో ఉన్నా డన్న తృప్తితో-ఎప్పటికయినా వస్తాడేమోనన్న ఆశతో బ్రతుకుతోంది చని పోయాడు! కడసారిగా ముఖం చూసే భాగ్యమయినా తనకు లేకపోయింది. కుమిలిపోయింది సిరి. కాని, రాల్చటానికి అశ్రువులు లేవు.

అక్కడక్కడ చేస్తున్న పాట కచేరీల ప్రఖ్యాతితో తన వరుణ్ణి తనే ఎన్నుకుని రిజిస్ట్రారు ఆఫీసులో పెళ్ళిచేసుకుని తల్లి పాదాలకు నమస్కరించింది కృష్ణవేణి.

సిరికి ధైర్యం చెబుతూ ఉంటుంది రంగ. "సిరీ. మీ ఆయన ఉంటే నీ పిల్లలు ఇట్లా అభివృద్ధిలోకి వచ్చేవారా? రారు. దుష్టాంగాన్ని ఛేదించాడు భగవంతుడు. అందుకే మిగతా దేహము ఆరోగ్యవంతంగా నిలిచింది" అంటుంది.

సిరి ఎంతో అయోమయంగా ఉంటుంది ఆ విషయాన్ని తలుచుకున్నప్పు డల్లా. తన జీవితం ఇట్లా ఎందుకు తెల్లవారాలి? భర్త కొన్నాళ్ళు పరిత్యజించటం- చివరకు చనిపోవటమూనా? అతడు చనిపోయినప్పటి కంటె వదిలిపెట్టిన కాలంలో అనుభవాలూ తన మనసులోని బాధలూ మరింతగా బాధపెట్టటం మొదలు పెట్టాయి.

"ఈ పాపు అప్పుడే చస్తే ఎంత బాగుండేది? పిల్లలకు రకరకాల అనుమానాలూ—అతడి మీద ఒక విధమయిన అసహ్యమూ కలగకుండా ఉండేవి!" అంటుంది రంగ.

చెవులు మూసుకుంటుంది సిరి "రంగా! అటువంటి మాటలనకే తల్లీ! నేను వినలేను!"

"పిచ్చి సిరీ! నీ వతడిని నీదగ్గర నిలుపుకోలేక పోయావు. భార్యలో ప్రియురాలిని చాలా మంది భర్తలు చూడలేరు. సంసారంలో బాధ్యతారహితంగా ఉండాలని కొందరు కోరుకుంటారు. నీవే కనుక సంసారబాధ్యత వహించినట్లయితే నీ దగ్గరే ఉండిపోయేవాడుగా" అంటుంది రంగ.

"ఆయన చనిపోయినా మన వాదోపవాదాలు అలాగే ఉన్నాయి. రంగా! దయచేసి అటువంటి మాటలని నన్ను ఇంకా చిత్రవధ చేయకు" చేతులు పట్టుకుంది సిరి.

చిలిపి నవ్వొకటి నవ్వి "పోనిలే. ఇవాల్టికి మరిక ఆయన ఊసెత్తను. సరేనా?" అంటుంది రంగ.

సిరి కూతురు కృష్ణవేణి భర్తతో కూడా వెళ్ళి పాటకచేరీలు చేస్తున్నది. మదరాసు నగరానికి అభిమానులెవరో ఆహ్వానించగా వెళ్ళింది. పాట కచేరీ అద్భుతంగా ఉన్నది. తమిళ ప్రేక్షకులెంతో ప్రశంసించారు. సంపన్నురాలొకామె బంగారు పైటపిన్ను బహూకరించింది. అందరూ లేచిన తరువాత ఆమెను కారు వరకూ సాగనంపి వెనుదిరగబోయిన కృష్ణవేణి డ్రెయివర్ సీట్లో ఉన్న ఆయనను చూసి ఉలిక్కిపడ్డది! ఆమె గొణిగిన మాటలు పెదవుల మధ్యనే నలిగిపోయాయి. మళ్ళీ మళ్ళీ తిరిగి చూసింది. ప్రక్కన పెనిమిటి ఉన్నాడు. తలవంచుకుని సాగిపోయింది. అనుమానం నిజమయితే తలఎత్తుకొని తిరగగలరా? తన కాపురం కూలిపోదూ?

దీపదీపాలవేళ రంగ యింటి ముందర క్రీనీడలాంటిది ముందుకు సాగింది. ధైర్యము తెచ్చుకొని అడుగులో అడుగులేసుకుంటూ వరండాలో నిలబడిన ఆ నీడను చూసి రంగ "ఎవరు? ఏం పని?" అంటూ గద్దించింది. మరికొంత

సేపటికి ముఖంలోకి తేరిపారచూసి "మీరు చనిపోలేదూ!" అన్నది కనుబొమలు పైకెత్తి.

"అంటే! ఎవరు చనిపోయారు?" సిరి కొడుకులు మురళీ వేణూ గదిలో నుంచి బైటికి వచ్చారు.

"ఇతడు చనిపోయి పదిసంవత్సరాలు కావచ్చింది." నిర్వికారంతో అన్నది రంగ.

ఆ నీడ బిక్కచచ్చిపోయింది.

మాటల సందడికి సిరి లోపలి నుంచి వచ్చింది.

క్రీనీడ సిరికి సమీపంగా వచ్చి "సిరీ నేను చనిపోయినమాట నిజమే. కాని-మళ్ళీ జన్మించాను." అన్నది ఆమె రెండు చేతులు పట్టుకుని.

"కాదు-మీరు చనిపోలేదు. అప్పటికీ ఇప్పటికీ ఎప్పటికీ బ్రతికే ఉంటారు. మనం చనిపోవద్దు. బ్రతుకుదాం రండి" పిల్లలవంక చూడకుండా రంగకు కళ్ళతోనే పిల్లల నప్పగించి అతడి చెయ్యి పట్టుకుని ముందుకు నడిచింది సిరి. ఆడదైన సిరి-భర్తను ఎటువంటి పరిస్థితులలోనూ మరిచిపోలేని సిరి. జరిగినదంతా తన పొరపాటు వల్లనే జరిగిందని తప్పులన్నీ తన మీదవేసుకున్న సిరి.

అతడి నీడకూడా పిల్లలమీద పడటం ఇష్టంలేన్ది రంగ, "బ్రతికి ఉండ్లే చచ్చిన వాళ్లసంగతి మీ కెందుకర్రా? మీ తరం చచ్చినా బ్రతికి ఉండాల్సింది! రండి లోపలికి" ఇద్దరి చేతులూ పట్టుకుని తీసుకువెళ్ళింది.

(యువ మాస పత్రిక)



# ఈ చీకటి విడదేమి?

"ఏమన్నాడండీ డాక్టరు ?" ఆటో చప్పుడు వినగానే ఎదురుగా వెళ్ళి గేటు తెరిచింది భ్రమర.

నారాయణ ఆటోను పంపి వీధి గుమ్మానికి ఎదురుగా వున్న హావుజు గోడ మీద కూర్చున్నాడు.

"మీరు బాగా అలసిపోయినట్టున్నారు. కాఫీ ఫ్లాస్కు తీసుకుని నేను గూడా వస్తానంటే వద్దన్నారు. ఇప్పుడయినా తెస్తానుండండి. ఓ కప్పు తాగితే కాస్త తేరుకుంటారు" భ్రమర లోపలికి వేగంగా పరుగెత్తింది.

ఇన్స్రమంటూ నిట్టూర్చాడతడు. డాక్టరిచ్చిన ప్రిస్కిప్షన్ జేబులో నుంచి తీసి మడత విప్పకుండానే మళ్ళీ జేబులోకి నెట్టాడు.

అంతలో కాఫీ కప్పు చేతబట్టుకొని భ్రమర వచ్చింది బన్తో చుట్టుకున్న ముడిమీద సన్నజాజులు దండ పెట్టింది పొడుగు బొట్టు నిండైన ముఖానికి వింత అందాన్నిచ్చింది. మనిషి చాలా ఆరోగ్యవంతంగా వుంది. ఆ ఉదయమే కొడుకు ఐదవ క్లాసు ప్యాసయ్యాడని తెలిసింది. ముఖంమీద ఆ సంతోషం చెప్పకుండానే తెలిసిపోతున్నది.

అతడి చేతిలో నుంచి కాఫీ కప్పునందుకుంటూ "డాక్టరేమన్నాడు ?" మళ్ళీ అడిగింది.

అతడికి తన అనారోగ్యాన్ని గురించి తలుచుకుంటేనే విసుగ్గా వుంది. డాక్టర్ల చుట్టూ తిరగడమంటేనే చికాకుగా వుంది. ఆమె రెండుసార్లు ప్రశ్నించగానే కస్సుమన్నాడు.

డాక్టర్లు రోగ నిర్ణయం చేయలేకపోతున్నారు. వెళ్ళి అడిగినందుకూ డబ్బు ఇచ్చినందుకూ ఏదో చెబుతున్నారు. అదీ నిశ్చితంగా కాదు. "ఈ మందులు తీసుకు చూడండి" అంటారు.

అది తనమీద చేసే ఒక ప్రయోగం.

"అన్ని పరీక్షలూ చేసి ఏమీ లేదన్నాడు" చేతనయినంత విసుగు-చూపించాడు.

"విటంగా ఏమీ లేదేమో!" డాక్టరన్నమాట వినగానే ఆమెకు కొంత ధైర్యం వచ్చినట్లయింది.

"కడుపులో మంట - కాళ్ళలో నిస్సత్తువ-నడుస్తూ తూలిపోవటం నిత్యమూ అనుభవించేవాణ్ని నేను. ఏమీ లేదని ఇంట్లో నీవూ-బయట డాక్టర్లూ అంటే సరిపోయిందా?" గట్టిగా మాట్లాడిన తరువాత అతనికి ఆయాసం వచ్చింది.

"అందరు డాక్టర్లూ ఒకే మాటంటున్నారు. ఏం చేద్దాం పోనీ రేపు న్యూరోసర్జన్ దగ్గరికి వెళదామా?" అతడిని శాంతింపచేయటానికని మెల్లగా మాట్లాడింది.

"ఏదో చూద్దాంలే" ఆవేశాన్ని తగ్గించుకుని సర్దుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు.

మరునాడు ఉదయం అతడు నిద్రలేవకముందే ఆమె లేచి న్యూరోసర్జన్‌కు ఫోనులో నారాయణ సంగతంతా చెప్పింది.

"తీసుకురండి చూస్తాను" అన్నాడు.

నారాయణ నిద్రలేవగానే కాఫీ టిఫిన్ తీసుకున్న తరువాత న్యూరోసర్జన్ సంగతి చెప్పింది.

అతడు విని ఊరుకున్నాడు.

"ఇది కూడా చూద్దాం. మీతో నేనూ వస్తాను. షాక్ ట్రీట్‌మెంటుతో నయినా తగ్గిస్తాడేమోనన్న ఆశ" మెల్లగా సర్దిచెప్పబోయింది;

అతడి ముఖం ఎర్రబడిపోయింది. "అయితే నాకు షాక్ ట్రీట్‌మెంటు ఇవ్వాలని ఉందా నీకు? నాకేమన్నా పిచ్చి ఎక్కిందనుకున్నావా?" కళ్ళు పెద్దవి చేశాడు.

"నేనలా అనుకోవటంలేదు. మీరు మీ రోగలక్షణాలను చెబుతున్నారు. డాక్టర్లు రోగమే లేదంటున్నారు. మీ మీ మధ్య నేను ఏం చెయ్యగలను ? ఏం చెప్పగలను ? న్యూరోసర్జన్‌తో కూడా ముఖాముఖీ మాట్లాడి తేల్చుకుందామను కుంటున్నాను."

కోపంతో అతడి ముఖమంతా ఎఱ్ఱబడి దేహం కంపించటం మొదలు పెట్టింది. ఆమె నేదో అనాలన్న ఉద్రేకంతో ఊగిపోతున్నాడు పెదవులు సన్నగా కంపిస్తున్నాయి. కాని మాట పైకి రాలేదు.

చూసి చూసి ఊఁ అన్నాడు.

ఆనాడతడి పరిస్థితి చాలా హీనంగా ఉంది. ఆరు నెలల సెలవు గడిచి పోయింది. డబ్బు చాలా ఖర్చుపెట్టి పెద్ద డాక్టర్లనుకున్న వాళ్ళచేత పరీక్ష చేయించు కున్నాడు. కాని రోగమేమిటో తేలలేదు.

ఏదో ఆలోచన-వెంటనే నిస్పృహ-అయోమయం. పర్యవసానం నిస్సత్తువ

అతడి ఆలోచనలకు మూలం ఇప్పుడిప్పుడే అతడికి గ్రాహ్యము కావటం మొదలుపెట్టింది.

ఎడెనిమిది నెలల క్రిందట అతడు ఆఫీసు పనిమీద బొంబాయి వెళ్ళాడు. ఆ పని రెండు రోజులు పట్టింది. సానుకూలం కావటానికి. తిరిగి రావటానికి అతడు ఎయిర్‌పోర్టుకు వచ్చాడు. ఆ సమయంలో ఏయిర్‌పోర్టు చాలా సందడిగా ఉంది. ఇరవై రెండూ ఇరవై మూడేళ్ళ అబ్బాయికి చాలామంది పూలహారాలు వేసి చేతులు కలుపుతున్నారు.

"వాళ్ళమ్మతో కూడా ఒక ఫొటో తియ్యండి. ఆమె చూసుకుంటూ ఉంటుంది" ఇద్దరు పాతికేళ్ళ యువతులు ఒక మధ్య వయసుగల ఆమెను తీసుకు వచ్చి అతడి ప్రక్కన నిలబెట్టారు.

నాలుగైదు కెమేరాలు ఒకసారే క్లిక్ మన్నాయి.

అతడు తన తల్లికి ప్రణామం చేశాడు. ఆమె కళ్లు తుడిచాడు "అమ్మా ఆరోగ్యం కాపాడుకో. నేను వారానికొక ఉత్తరం రాస్తాను. చదువు పూర్తి అయిన తరువాత ఒక్కరోజయినా అక్కడ ఉండను. సరేనా ?"

ఆమె అతడి తల నిమిరింది. 'నాయనా' అన్నది గద్గద స్వరంతో. "నీవే నా కంటివెలుగు'' మరి మాట్లాడలేకపోయింది. ఆ యిద్దరు యువతులూ ఆమెను ఓదార్చి సోఫాలో కూర్చోబెట్టారు.

విమానంలో కూర్చోమన్న ఎనౌన్సుమెంటు విని తల్లికి చేతిసైగ చేసి ప్రయాణీకుల క్యూలో చేరిపోయాడు. అతడు మైదానంలోకి రాగానే చూసి పలకరించాలని తల్లిని ఆమె సన్నిహితులు బాల్కనీ మీదికి తీసుకువెళ్ళారు.

ఐదు నిమిషాల లోపలే యువకుడు కనబడ్డాడు. "నళినీ నళినీ'' అంటూ ఆమె చెయ్యూపింది.

అతడు తల పైకెత్తి తల్లినిచూసి కళ్ళు తుడుచుకోమని చేతి సైగచేసి, ఆమె నవ్విన తరువాత తను కూడా నవ్వుతూ చెయ్యూపాడు.

అప్పుడు నారాయణ ఆ సమీపంలో బాల్కనీమీద ఉన్నాడు. నళినీ అన్న పేరు చెవిన పడగానే ఉలిక్కిపడ్డాడు. కళ్ళు బాగా విప్పుకుని అక్కడున్న వారి నందరినీ బాగా పరకాయించి చూశాడు.

వెక్కి వెక్కి ఏడుస్తున్న ఆమెను పట్టుకుని కిందికి తీసుకుపోదామని బంధుమిత్రులు ప్రయత్నిస్తున్నారు.

"విమానం వెళ్ళిన తరువాత వెళ్దాము" అంటోంది ఆమె.

"విమానంలో కూర్చున్న తరువాత మన కతడు కనబడడుకదా?''

"కనబడడు. నిజమే, వాడు ఎక్కిన విమానం కదిలిన తరువాత వెళ్దాము' ఆమె బాల్కనీని ఆనుకుని విమానంవైపే చూస్తోంది.

ఆమె కొంచెంగా కుంటటం చూశాడు నారాయణ. అతడికి అంతులేని ఆశ్చర్యం కలిగింది. తరువాత బాగా పరకాయించి చూశాడు. ఆమెకు నలభై అయిదు సంవత్సరాలుంటాయేమో. తల వెంట్రుకలు కొన్ని తెల్లబడ్డాయి. తను పాతికేళ్ళ క్రిందట ఎరిగిన మీనాక్షి పోలికలు కొన్ని ఉన్నాయి. అంతమాత్రం చేత బాగా నిర్ధారణ చేసుకోలేకపోతున్నాడు.

కాని - కావి ఆ కుంటటం మాత్రం పట్టిస్తున్నది.

మీనాక్షి కూడా సరిగ్గా ఇలాగే నడిచేది అనుకున్నాడు.

అందరూ దిగినప్పుడు అతడూ దిగాడు. అతడి విమానం మరో అర గంటలో వస్తుంది. అతడి వెంబడి సామానులేదు ఒక బ్రీఫ్ కేస్ తప్ప. అతడు మెట్లు దిగి ఒక ఒప్పు కాఫీ తాగాడు. అంతలో సుందరం ఎదురుగా వచ్చాడు.

"నీ కోసం నేను ఇదంతా వెతుకుతుంటే నీ వెక్కడికి వెళ్ళావు?" నారాయణ పక్కన కూర్చున్నాడు.

"బాల్కనీ మీదికి వెళ్ళాను."

"నీకు తెలిసినవాళ్ళు ఎవరయినా ఈ విమానంలో వెళ్ళారా?"

"అబ్బే. నాకెవరూ తెలియదు. ఒక యువకుడు వెళ్ళుతున్నాడు. ఆప్తులకి పైకి వెళ్ళింది చెయ్యూపటానికి. వాళ్ళతో నేను వెళ్లాను బాల్కనీ చూడ్డానికి."

"అవును. మరి నీ వెప్పుడు వస్తున్నావు?"

"నేనా? నేను నిదానంగా వస్తాను. మనం కలుసుకోవటానికి ఇరవై రోజు లయినా పడుతుంది.

అంతలో ప్రయాణీకులను రెడీగా ఉండమన్న హెచ్చరిక వినవచ్చింది.

నారాయణ క్యూలో నిలబడ్డాడు.

సుందరం వెళ్ళిపోయాడు. అతడన్నట్లు ఇరవై రోజుల వరకూ ఇద్దరూ తిరిగి కలుసుకోలేకపోయారు.

నారాయణ తిరిగి వచ్చినప్పటినుంచీ వెనకటంత చురుగ్గా పనిచెయ్యలేకపోతున్నాడు. ఏదో పరాకుగా ఉంటున్నాడు. బల్లమీదఉన్న టెలిఫోను మోగినా వెంటనే ఎత్తడానికి కూడా జాగు చేస్తున్నాడు. తన బల్లమీద కాగితాలు కట్టలకట్టలు సంతకం కోసం పడివున్నాయి. అవి కదలటంలేదు.

అది ఒక అయోమయ పరిస్థితి. మధన జరుగుతోంది. దానిలోనుంచి ఒక సమాధానం ఉద్భవించాలి.

"మీకు ఒంట్లో బాగా లేదా నారాయణగారూ ? సుస్తీచేసినట్టు కనబడుతు న్నారు" అన్నాడుమేనేజరు ఒకనాడు. వారంరోజుల కిందట పైకి వెళ్ళవలసిన కాగితాలు ఇంకా తమ ఆఫీసునుంచి బయలుదేరలేదు. చాలా అర్జంటు కాగితాలకు కూడా అదే గతి పట్టింది.

నారాయణ ముఖమెత్తి కళ్ళు బాగా విప్పి చూశాడు.

"నిజం. మీరు సుస్తీగా కనబడుతున్నారు పోనీ ఓ వారం సెలవుపెట్టి చూడండి" అన్నాడు మేనేజర్ మళ్ళీ.

ఏమీ తోచనివాడికి ఈ సలహా కొంత పనిచేసింది. వారమేమిటని ఒక నెల పెట్టేశాడు.

మరునాడు గంట ఆలస్యంగా నిద్రలేచాడు. కాఫీ టిఫిను తీసుకొని తాపీగా స్నానం చేసి దినపత్రిక చేతపట్టాడు. మెల్లగా బద్ధకంతో గంటకు పైగా చదివాడు. పత్రికను.

"పదిగంటలయింది భోజనం చేద్దామా" అన్నది భ్రమర.

"ఇప్పుడేం భోజనం?" అన్నాడు కనుబొమలు ముడిచి.

"ఏం ? ఆఫీసుకు వెళ్ళరా ఇవాళ?" ఆశ్చర్యపడ్డది. ఎందుకంటే అతడు జ్వరం వచ్చినా సెలవు పెట్టకుండా ఆఫీసుపనులు చేసే అలవాటు కలవాడు.

ముఖం చిట్లించి "ఒక నెల సెలవు పెట్టాను" అన్నాడు.

"కొంపలు మునుగుకుపోయినా సెలవు పెట్టరు కదా?"

"నీవు చెప్పేది నిజమే. కాని-ఇప్పుడు పెట్టాను" సంభాషణను అతడు తుంచేశాడు జవాబులు వెతకలేక.

అతడు అలా కూర్చుని వుండగా తను భోజనం చేయటం ఆమెకు అంతగా ఇష్టంలేదు. కాని ఏం చెయ్యటం ? తనకూ ఆఫీసుకు వెళ్ళే టైమవుతోంది. ఇది గ్రహించయినా అతడు భోజనానికి వస్తే బాగుండును. అన్నీ గబగబా సర్దుకొని వెళ్ళొచ్చు అనుకుంటోంది.

ఇటూ అట్టూ తచ్చాడింది కొంతసేపు. భోజనం చేసేది తనొక్కతే అయినా ఇద్దరికీ పళ్ళేలు పెట్టింది, అతడికి మధ్యాహ్నం కాఫీ వేడిచేసి ఫ్లాస్కులో పోసింది. మళ్ళీ ఒకసారి అతడిని అడిగినట్టుగా కాకుండా అని చూసింది. ''అయ్యో అప్పుడే పది దాటుతోందే?'' అనుకుంటూ.

పేపర్లోంచి ముఖం కనబడేలా తలపక్కకు తిప్పి "పది దాటనిచ్చావేం? భోజనంచేసి వెళ్ళు. బల్లమీది వస్తువులన్నీ అలాగే ఉండనియ్యి. నాకు కావలసినప్పుడు నేనే వడ్డించుకుని తింటాను'' మళ్లీ పేపర్లో తలదూర్చి కంపెనీ ప్రకటనలు చూడటం మొదలుపెట్టాడు.

సంగతి తేలిపోయినందుకు భ్రమరకు పని సులువైంది. తను భోజనం చేసి బల్ల తుడిచి అతడికి ఏర్పాట్లన్నీ చేసింది.

''మరి నేను వెళ్ళనా? మీరు వేళకు భోజనం చేయ్యాలి మరి'' గుసుస్తున్నట్టుగా ముఖం పెట్టింది పర్సు చేతితో పట్టుకుంటూ.

కళ్లు పైకెత్తి ఆమెను నిలువెల్లా చూశాడు.

''నేను బొంబాయినుంచి తెచ్చిన హ్యాండ్ బ్యాగ్‌ను వాడటంలేదా? నీకు ిచ్చలేదా ఏమిటి?'' అన్నాడు.

''నచ్చిందిగాని అంత మంచిదాన్ని రోజూ వాడేసి పాడుచేయటానికి మనసు ఒప్పటం లేదు'' అంటూ గడప దాటింది.

# 2

భ్రమర గడప దాటగానే సుందరం లోపలికి వచ్చాడు.

''ఎప్పుడొచ్చావు? రా, వచ్చి అలా కూర్చో'' అన్నాడు ఒంటరిగా ఉండాలేమోనన్న భయంలోనుంచి బయట పడుతూ.

సుందరం ఒకప్పుడు నారాయణకు అసిస్టెంటు. అది కాత కాలేజీలో జూనియరు.

''ఏమిటి ఇంకా భోజనం చెయ్యలేదా? ఇప్పుడెంతయిందో తెలుసా?'' నారాయణ చూపించిన కుర్చీలో కూర్చుని హాల్లో ఇటూ అటూ చూశాడు.

''నాకు పది గంటల భోజనమే అలవాటు కాని బొంబాయినుంచి వచ్చినప్పటి నుంచీ కొంచెం సుస్తీగా ఉంటోంది. సెలవు పెట్టాను. ఇప్పుడు నాభోజనపు వేళలు కూడా మారిపోయ్యాయి. చూడు, అట్లా నా కోసమని పదార్థాలన్నీ మూతలు పెట్టి ఉంచుతుంది. అన్నీ బల్లమీదే ఉంటాయి గాని తనబుద్ధి పుట్టడంలేదు. 'తిన వచ్చులే' అన్న తాత్పారం. ఏమిటో? ఆరోగ్యం కూడా అంత బాగుండటంలేదు.'' తువాలుతో ముఖం తుడుచుకుని ''అన్నట్టు నీవెప్పుడు వచ్చావు? ఆఫీసుకు వెళ్ళ లేదా?'' అన్నాడు

''అయితే నేను సెలవు పెట్టినట్టుగా నీకు తెలుసా?'' ఆశ్చర్యపడ్డాడు నారాయణ.

''నా కిప్పుడే భ్రమరగారు చెప్పారు.''

''ఓ అలాగా?''

''అసలు నేను ఈ కాలనీకి ఎందుకు వచ్చానంటే పెళ్ళయిన మా చెల్లెలు మీ ఇంటికి మూడో యింట్లో ఉంటోంది. దానికి మేనల్లుడి కబుర్లు చెబ్దామని ఇటు దారి తీశాను.''

''ఆఁ హాఁ.'' తలాడించాడు నారాయణ.

''మీనాక్షి నాకు బొంబాయిలో కలిసింది. అన్నట్టు నళినీ మోహన్ స్టేట్సుకు వెళ్ళాడు తెలుసా?''

''ఎప్పుడు వెళ్ళాడట? అసలు ఇంతకూ ఏం చదివాడట?'' పెదవులు సాగదీసుకుంటూ అన్నాడే గాని కడుపులో ఆవేదన.

నారాయణ అడగిన పద్ధతి చూసి సుందరం అతడి ముఖంలోకి పట్టుపడిన వాడి మాదిరిగా చూశాడు. అయినా సాధ్యమైనంత వరకూ పైకి కనబడనీయకుండా సర్దుకుని ''ఎంటెక్ చేశాడని విన్నాను'' అన్నాడు.

ఏదో ఆలోచిస్తున్నట్టుగా తల ఆడించాడు నారాయణ.

సుందరం అతడి ముఖమొకసారి దీర్ఘంగా నిట్టూర్చి చూశాడు.

"ముందు భోజనం చెయ్యి నారాయణా. కబుర్లు చెప్పుకుంటూ కూర్చుంటే ఎంత టైమయిందో కూడా తెలియదు."

"నాకసలు భోజనం మీద అసహ్యం పుట్టిందంటే నమ్ము. చూడు అగ్గిన్నెల్లో నాకిష్టమైన వంటకాలు చేసి పెట్టింది. కాని నాకు తిందామని లేదు."

"తిండి తినక కొందరు రోగాలు తెచ్చుకుంటారు. నీకూ అట్లాగే ఏ రోగమయినా రావచ్చు. చూడు. మొదలు కావాలని తినకపోతే తరువాత తినాలని ఉన్నా తినలేరు."

"ఏదో ఆలోచిస్తూ కూర్చున్నావు. నేను వెళ్ళిపోతాను. పనులు చాలా ఉన్నాయి. నేనసలు నిన్ను పలకరిద్దామని వచ్చాను. సరదాగా నాలుగు కబుర్లుచెప్పి నాలుగు విందామని వచ్చాను. నీవేమో దిగాలుపడి కూర్చున్నావు."

లేవబోతున్న సుందరాన్ని నారాయణ కుర్చీలోంచి దిగ్గునలేచి ఆపాడు.

"సుందరం వెళ్ళబోకు. నేను భోజనం చేస్తాను. అదీ నీవు దగ్గర కూర్చుంటేనే సుమా !"

"అయితే నేను వడ్డించనా ?" బోర్లా వేసిన పళ్ళెం తిప్పి అన్నం కూర పచ్చడి వడ్డించాడు.

మాట్లాడుతూ భోజనం చేస్తున్నాడు నారాయణ.

"ములక్కాడల పులుసు ఉంది. కొబ్బరి పచ్చడి కొంచెం వెయ్యనా ?" కొసరి కొసరి వడ్డిస్తున్నాడు సుందరం.

"సుందరం నీకు మా చెల్లెలు ఇట్లాగే తినిపిస్తుందా దగ్గర కూర్చుని."

పెదవులు విప్పకుండానే నవ్వాడు సుందరం.

"ఒక మాట నిజం సుందరం. పదార్థాలు రోజూ ఇవాళ్టి మాదిరిగానే ఇంత రుచిగానే ఉంటాయి. కాని రోజూ ఇలా తినబుద్ధికాదు. ఇవాళ కడుపునిండా తిన్నాను. ఎందుకంటావ్ ?"

అతడి భోజనం కాగానే వక్కపొడి డబ్బా మూత తెరచి చేతి కందిస్తూ నీ సంగతి తెలిసిపోయిందిలే అన్నట్టు చూశాడు సుందరం.

''కాఫీ కూడా ఫ్లాస్కులో ఉందా ?''

''ఆఁ. టిఫిన్ కూడా ఉంది చూడు.''

''నేను కాఫీ వేళ వరకూ ఉండలేను. బజారు పనులు కొన్ని అర్జంటుగా చేయాల్సి ఉంది.''

''అంత అర్జంటా ?''

''అవును.''

''అయితే ఒక పని చెయ్యి. అంతవరకూ ఉండద్దు గాని ఓ అరగంట కూర్చో.''

''అరగంట కూర్చుంటే గంట కూర్చోలేదనిపిస్తుంది. అసలు నీకు సెల వెందుకు ? మళ్ళీ ఒంటరిగా ఉన్నానని అనుకోటం ఎందుకు ? లేనిపోని గొడవ తెచ్చుకుంటావు. నీవు ఎప్పుడూ ఇంతే.''

''చూడు సుందరం. అప్పుడప్పుడు నీలా మందలించేవాళ్ళు కూడా జీవితంలో చాలా అవసరం.''

''ఆఁ ఇప్పుడలాగే అంటావుగాని తరువాత నీవే విసుక్కుంటావు.''

''అలా చెప్పకు సుందరం. ఎప్పుడయినా అలా జరిగినట్లనిపిస్తే నన్ను క్షమించెయ్యి.''

''అలా విసుక్కోటానికి ఇలా క్షమించమనటానికే నీకే సరిపోయింది.''

''ఆ సంగతి మర్చిపో బాబూ. నేనొకటి అడుగుతాను చెబుతావా ? ఈమధ్య ఎప్పుడయినా మీనాక్షిని కలుసుకున్నావా ? సరేలే. నాకు మరుపు కూడా వచ్చింది. ఇందాక చెప్పావు కదూ ?''

సుందరం నారాయణ ముఖంలోకి దీర్ఘంగా చూశాడు. ''ఇప్పుడు మీనాక్షి సంగతెందుకు కావల్సి వచ్చింది ?''

బరువుగా నిట్టూర్చాడు నారాయణ.

ఎందుకో చెప్పలేదు. చెబితే వినాలని ఉంది. సుందరం ముఖంలోకి ఆర్తిగా చూశాడు.

ఆగలేక పోయాడు సుందరం.

''నీ కెట్లా చెబితే సంతోషం చెప్పు ?''

శూలంతో పొడిచినట్లయింది నారాయణకు.

''సుందరం'' అన్నాడు కళ్ళు విప్పదీసుకుని. ఆ కళ్ళల్లో అభ్యర్థన-చచ్చిన వాడిమీద రాళ్ళు రువ్వుతావా అన్న ప్రశ్న-నన్నర్థం చేసుకోవూ అన్న వేడికోలు.

సుందరం చలించిపోయాడు కాని అది కొద్దిసేపే. అతడి కడుపులో కళ పెళ్ళాడే ఆవేదనకు శాంతి కావాలిగాని-కల్లబొల్లి మాటలకు కరిగిపోతాడా? అతడింక మాటల్లో చిక్కుపడదలచుకో లేదు.

''నారాయణా, వస్తాను. మళ్ళీ వచ్చినప్పుడు సావకాశంగా మాట్లాడు కుందాము. ఏమనుకోకు'' మెల్లగాలేచి రెండడుగులు వేశాడు సుందరం.

''ప్లీజ్, తరుచు వస్తూ ఉండు సుందరమ్. చూడు. అఫీసు నుంచి ఇక్కడికే రా. నీ కాఫీ టిఫిన్ ఇక్కడే. అప్పటికి భ్రమర కూడా ఆఫీసు నుంచి ఇంటికి వస్తుంది. సరదాగా కబుర్లు చెప్పుకుందాము. వస్తావు కదూ ?'' లేచి వాకిటివరకూ సాగనంపాడు నారాయణ.

గేటు దాటేవరకూ ఆగి పళ్ళు కొరికాడు సుందరం. ''సరదాగా కబుర్లట, సరదా ! అతడికి మాటలతో ఇతరులను హింసించటం వెన్నతో పెట్టిన విద్య. ఇతరులు మాత్రం తనతో తియ్య తియ్యగా స్తుతిస్తూ కబుర్లు చెప్పాలి. మళ్ళీ వస్తాననే కలలు కంటూ ఉంటాడు'' సుందరం గొణుక్కుంటూ విసవిస నడవడము మొదలుపెట్టాడు.

## 3

సుందరానికి మీనాక్షిని తలుచుకుంటేనే గుండె చెరువయి పోతున్నది. గోపాలంగారు తన కూతురి క్షోభను చూడలేక తన దగ్గరికి వచ్చి సంగతంతా-

చెప్పుకుని ఏడ్చాడు. మీనాక్షిని నారాయణ ప్రేమించి పెళ్ళిచెయ్యమని అడిగాడు. కట్నమిస్తేగాని పెళ్ళికి ఒప్పుకోనని తండ్రిచేత అనిపించాడు. భూమి పుట్రా అమ్మి, అడిగినంత కట్నమిచ్చి పెళ్ళి చేస్తే, సరిగ్గా ఏడాది మీనాక్షితో కాపరం చేశాడు. ఆ తరువాత ఆమె అతడి దగ్గర ఉన్న కాలము స్వల్పము, అనుభవాలు కంటకమయం అతడు సున్నితమైన ఆమె హృదయాన్ని గొడ్డలితో మీటాడు.

నిప్పులాంటి మనిషిని శంకిస్తే ఆత్మగౌరవంగల ఆడది ఎదురు తిరగదు. కళ్ళు మూసుకుని-తలవంచుకుని వెనక్కి తిరుగుతుంది. బురద! బురద మీద రాయి వేస్తే చింది మీదపడుతుందని ముక్కు చిట్లించుకుని పక్కకుతప్పుకుంటుంది. మీనాక్షి కూడా అంతే చేసింది.

పిల్లవాడిని ఎత్తుకుని సూట్ కేసుతో ఇంట్లో అడుగుపెట్టిన కూతురిని, ఏమనుకున్నా మనసులోనే అదుముకుని, పైకి బాగున్నావా తల్లీ అని ప్రశ్నించిన తండ్రితో "నాన్నా నాకు కాలేజి చదువు చెప్పించు" అని అడిగింది గాంభీర్యంతో మీనాక్షి.

కళ్ళు వర్షిస్తున్నా పెదవుల పైకి నవ్వు తెప్పించుకుని "తల్లీ, నేను నిజంగా మందబుద్ధిని, స్కూలుకు ఫస్టు వచ్చిన నిన్ను కాలేజీకి పంపాలని తోచలేదు. నీకు ఆ లోపం ఎందుకు ఉండాలి? నేను చేసిన పొరబాటును వెంటనే దిద్దుకుంటానమ్మా రేపే అప్లికేషన్ ఫారాలు తెస్తాను" అంటూ ఆమెను భుజాలు పట్టుకుని లోపలికి తీసుకువెళ్ళిన ఆ తండ్రి సుందరం కళ్ళ ఎదుట నిలబడినట్లయింది.

కూతురు వంటచేసి తనకూ మంచంలో ఉన్న తల్లికీ పదినెలల పిల్లవాడికీ పెట్టి, ఆమె తిని కాలేజికి వెళ్ళితే-ఆ చిన్న బిడ్డతో వాకిట పంచలో కూర్చుని ఘడియలు లెక్కబెట్టిన గోపాలంగారు ఎదురుగా సాక్షాత్కరించినట్లు ఉదిం సుందరానికి.

అతడికి ఒంట్లో రక్తము వేడెక్కినట్లవుతోంది. కండరాలు బిగిసినట్లవుతున్నాయి. కళ్ళల్లో ఎర్రటి జీరలు కొట్టవచ్చినట్టుగా కనబడుతున్నాయి.

తనదారి తానుచూసుకున్న మీనాక్షి, తలవంచుకుని, సంవత్సం మొకయుగంగా కాలేజీలో చదువుతుండగా ఈ నారాయణ ఆమె మీద సి.ఐ.డి.ని పెట్టాడు. కాని- తను మాత్రం మీనాక్షిమీద కక్షతో ప్రైవేటు కంపెనీలో పనిచేసుకుంటున్న

శైపిస్టు భ్రమరమ పెళ్ళి చేసుకున్నాడు, ఆమెను గురించి ఏమీ తెలుసుకోకుండానే. మీనాక్షికంటె ఆమెకు ఎక్కువగా స్వాతంత్ర్యమిచ్చాడు. మీనాక్షితోకంటె ఆమెతో ఎక్కువ ప్రేమతో కాపరం చేశాడు. సుందరం దురదృష్టమేమో నారాయణ ఉన్న ఊళ్ళో ఉద్యోగమైంది. అదీ ప్రైవేటు కంపెనీలో.

సుందరం మీనాక్షికి బంధువైనా కాడు. ఇద్దరి తండ్రులూ స్నేహితులు. సుందరానికి మీనాక్షినిగురించి బాగా తెలియదుగాని నారాయణనుగురించి విద్యార్థిగా ఉన్నప్పటినుంచీ తెలుసు. పతిదీ అనుమానం. ఎవరినీ నమ్మడు. నిత్యశంకితుడు. అతడి కేదీ ఉన్నదున్నట్లుగా కనబడదు. దృష్టి వక్రంగా ఉంటుంది.

తను తోసే కాలి మడమ దగ్గర ఫ్రాక్చరయిన మీనాక్షి కుంటుతూ నడిచిందని "ఇది కూడా నాట్యంలో ఒక భంగిమా" అని ప్రశ్నించే దురాలోచన కలవాడు ఫ్రాక్చరయిందని వైద్యం చేయించలేదు. పైగా ఆమె బాధపడుతుంటే వికటంగా నవ్వుకుని ఆనందించేవాడు నారాయణ.

అటువంటి నారాయణ దగ్గరికి మళ్ళీ తను వెళ్ళగలడా? మీనాక్షివిషయంలో తనకు గాఢమైన సానుభూతి ఉంది. దానిని చెదరగొట్టే మాటలేమయినా అతడు మాట్లాడితే తను సహించగలడా?

ఊహమాత్రానికే అతడి హృదయం కస్సుమన్నది.

ఇంట్లో ఉన్నా ఆఫీసులో ఉన్నా నారాయణ మాట మనసులోకి రాకుండా ఉండాలని మంచి నవలలు ఏకబిగిన చదివించేవాటిని నాలుగు తెచ్చి దగ్గర పెట్టుకున్నాడు సుందరం. పుస్తకం తెరిస్తే మళ్ళీ ముగిసే వరకూ తలఎత్తకుండా చదివేస్తున్నాడు. కొన్ని కొన్ని భాగాలు తిరిగి తిరిగి చదవటంలో మునిగిపోతున్నాడు. ఆ నాలుగు నవలలు పూర్తి కాగానే మళ్ళీ నాలుగు తీసుకువస్తున్నాడు అద్దెకు.

సుందరం నారాయణ తలపును ఎంతగా మరచిపోవటానికి ప్రయత్నిస్తున్నాడో నారాయణ సుందరంకోసం అంతగా పరితపించటం మొదలుపెట్టాడు.

# 4

భ్రమర ఆఫీసుకు వెళ్ళేటప్పుడుయథా ప్రకారంగా భోజనం - మధ్యాహ్నానికి కాఫీ ఫ్లాస్కూ-పక్కన బిస్కట్ల డబ్బా-మందు సీసాలూ అన్నీ బల్లమీద పెడుతుంది. బల్ల ప్రక్కనే మంచం పరుపూ మెత్తని దిండ్లూ ఉంటాయి. అతడికి విసుగు పుట్టినప్పుడు మంచంమీదినుంచి లేచి పడక్కుర్చీలో పడుకుంటాడు. అదీ వద్దనిపిస్తే మామూలు కుర్చీలో కూర్చుంటాడు.

ఒకడూ ఆ యింట్లో కూర్చుని తనే వడ్డించుకుని తినాలంటే అతడికి అన్నం సహించటం లేదు. విసుగుపుడుతున్నది. భోజనం చెయ్యని రోజున తగని నీరసం నోట్లోంచి మాట పైకి పెగలకుండా ఉన్నది.

సాయంత్రము ఐదు గంటల వేళ-కాళ్ళీడ్చుకుంటూ భ్రమర యింటికి వచ్చి చూస్తే అప్పటికి అతడు భోజనం చెయ్యలేదు. ఫ్లాస్కులో ఉన్న కాఫీ తాగాడు. డజను బిస్కట్లూ తిని మంచినీళ్ళు తాగి కాళ్ళ వైపు తల పెట్టుకుని నిద్రపోతున్నాడు. వీధి తలుపులు దగ్గరకి లాగి వున్నాయి. భ్రమర తలుపులు నెట్టగానే తెరుచుకున్నాయి. అయ్యో అనుకుంటూ లోపల అడుగుపెట్టిన భ్రమర అస్తవ్యస్తంగా బల్లమీద పడిఉన్న వస్తువులు చూసింది. నారాయణ పడుకున్న తీరు చూసింది.

ఆమెకు పరిపరి విధాల పోయింది మనసు. ఇల్లంతా తిరిగి చూసింది ఇంట్లో వస్తువులన్నీ లెక్క చూసుకుంది.

"ఇదేమిటి ఇలా పడుకున్నారు భోజనం చేయలేదా?" అతడిని నిద్రలేపి అడిగింది.

కళ్ళు నులుపుకుంటూ లేచి కూర్చున్నాడు.

ఆమె అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పలేక తలవెంట్రుకలు సవరించుకున్నాడు.

"భోజనం చేస్తారా?"

"వద్దు."

మరునాడు ఆమె ఆఫీసుకు వెళ్ళేటప్పుడు బైట తలుపు తాళం వేసుకుని వెళ్ళింది.

మధ్యాహ్నం పోస్టుమన్ వచ్చి కిటికీలో నుంచి చూసి పిలిచాడు.

"రిజిస్టరు ఉత్తరం వచ్చింది. సంతకంచేసి తీసుకుంటారా?" కిటికీలో నుంచి ఉత్తరం అందించాడు.

అతడు తలుపు లాగి చూశాడు. రాలేదు.

"తలుపు తాళము వేసి ఉంది. సంతకం చేసి కాగితం ఇలా ఇవ్వండి."

ఉత్తరం పట్టుకుని కుర్చీలో అలాగే కూర్చున్నాడు నారాయణ.

ఒంటి గంటయింది. అన్నం తినకుండానే పడుకుని నిద్రపోయినట్టున్నాడు. దిగ్గున లేచి అన్నం వడ్డించుకున్నాడు. వంకాయకూర వాసన చూసి మూతపెట్టేశాడు. ముక్కల పులుసు పక్కకు నెట్టేశాడు. పెరుగు ఏదో వాసన వస్తోంది. అయినా అదే వడ్డించుకుని తిన్నాడు. పేపరు చదువుకుని మళ్ళీ కాసేపు నిద్ర కొరిగాడు.

సాయంత్రం భ్రమర తాళం తీసుకొని లోపలికి వచ్చినప్పుడు "బయట తాళం వేస్తున్నావా భ్రమరా?" అడిగాడు.

"అవును ఏం చెయ్యను? తలుపులు తెరిచి ఉంటే ఎవరయినా దోచుకుపోతారు. అందుకని వేశాను." అన్నది.

"ఇంట్లో నేనుండగానే?"

"నిన్న నేనువచ్చేసరికి తలుపులన్నీ తెరిచి ఉన్నాయి. మీరు పడుకుని ఉన్నారు."

మరి మాట్లాడలేకపోయాడు.

కొడుకు భాస్కర్ తను క్లాసులో ఫస్టున వచ్చినట్లు చెప్పాడు. ప్రోగ్రెస్ రిపోర్టుమీద సంతకం పెట్టిన తరువాత కొడుకును దగ్గర కూర్చోబెట్టుకుని "నీవు బాగా చదవాలి, డాక్టరువు కావాలి" అంటూ సంబరపడే వాడు ఇదివరకు. ఆ రోజున రిపోర్టు చూచి తిరిగి ఇచ్చేశాడు.

"సంతకం పెట్టవూ నాన్నా?" భాస్కర్ మురిపెంగా అడుగుతున్నాడు.

"ఈసారి అమ్మచేత పెట్టించుకో."

అతడి కళ్ళల్లో నళినీమోహన్ కదిలాడు. హుందాగా సూట్ వేసుకొని చిరునవ్వుతో అందర్నీ పలకరిస్తూ నిలబడ్డాడు.

అతడి ఎత్తూ పోలికా తటాలున చూస్తే తన తండ్రిలా ఉన్నాడు.

వెంటనే ఆతడికి కడుపులో ఏదో మెలిక పెట్టినట్లయింది.

"నాయనా? ఎట్లా చదువుతున్నావు? ఎంతకష్టపడ్డావో? నిన్ను ఒక్కనాడయినా ఈ పాపిష్టి చేతులతో దగ్గరికి తియ్యలేదు" అతడి చూపులు దూరంగా వున్న చెట్లమీదికి పొయ్యాయి. ఏవో ఆలోచనలు - అవి ఎక్కడో చిక్కుపడి పొయ్యాయి.

భాస్కర్ పాలుతాగి టిఫిన్ తిని ఆడుకోవటానికి వెళ్ళాడు. భ్రమరఇంటికి రాగానే తన పనిలో మునిగిపోయింది. పగలంతా ఒంటరిగా ఏవేవో ఆలోచనలతో గడిపేవాడికి భ్రమరా, భాస్కర్ ఇంటికి రాగానే తనను ఆప్యాయంగా పలకరిస్తారని ఎదురుచూస్తాడు.

కాని అటువంటిదేదీ జరగదు.

వాళ్ళు వస్తారు. తమ పనులు తాము చేసుకుంటారు. తననొక రోగికింద జమకట్టేసి వేళకు ఆహారం మందులు బల్లమీద పెడతారు.

భ్రమరంటే తనకి ప్రాణం. భాస్కరంటే అంతకంటే ప్రాణం.

భాస్కర్ ముందు చదువులకు ఎటువంటి ఇబ్బందీ లేకుండా అతడి పేరున ముప్పైవేలు బ్యాంకులో పెట్టాడు. భ్రమర పేరున ఇన్సూరెన్సు పాలసీ రాశాడు. అపురూపంగా అనేక ఆధునిక సౌకర్యాలతో కట్టిన ఆఇల్లు భ్రమర పేరున పెట్టాడు.

ఇవన్నీ జ్ఞాపకం చేసుకుంటున్నప్పుడు ఇదివరలో చాలా గర్వంగా ఉండేది. ఇప్పుడు బుద్ధి వెక్కిరించింది.

"అదంతా ప్రేమేనా? ప్రేమచేతనే అంతా వాళ్ళ పేరున రాశావా?"

"వీళ్ళమీద ప్రేమగా కనపడుతున్నదంతా వాళ్ళమీద కక్ష-కసి. అందు చేతనే పెట్టావుకదూ?"

అతడు నుదురు పట్టుకున్నాడు. అబ్బబ్బ! ఎటువంటి భావాలు తనలో మెదులుతున్నాయి? పీడించేస్తున్నాయి?

"భాస్కర్! భాస్కర్! ఒకసారి ఇక్కడికి రా" కేక పెట్టాడు.

"వాడు ఆడుకోవటానికి వెళ్ళాడు. మీకేమయినా కావాలా?" భ్రమర వంటింట్లోనుంచి వచ్చి అడిగింది.

"నాకేమొద్దుగాని- కొంచెంసేపు ఇక్కడ కూర్చుని కబుర్లు చెప్పకూడదూ."

"మీతోపాటు నేనూ కూర్చుంటే ఎట్లా? పని చేసుకోవాలి."

"చేసుకోవచ్చులే. చూడు. మన భాస్కర్ స్కూలుకు నడిచి వెళ్ళుతున్నాడా?"

"లేదు బస్సులో వెళ్తాడు."

"అదే—జాగ్రత్తగా వెళ్ళమను, ఏక్సిడెంట్లు చాలా అవుతున్నాయి."

"అలాగే!"

"నీవయినా జాగ్రత్తగా చూసుకుంటూ వెళ్ళు. రోజులు బాగాలేవు."

"అలాగే"

"అదిగో అప్పుడే వెళ్ళిపోకు. ఇవాళ పొద్దున చేసిన కూర ఏం రుచిగాలేదు. అందుకే తినలేక వదిలిపెట్టా. ఈ పూట మంచి కూర చెయ్యి. ఏం కూరగాయలు ఉన్నాయి యింట్లో?"

"మీకేం కావాలి చెప్పండి" తడిచేతులతో వచ్చింది.

"నాకా? గోంగూర పచ్చడి చెయ్యి. బంగాళాదుంప మసాలాకూర చెయ్యి- రసం చెయ్యి."

"చెయ్యటానికేం చేస్తాను. చేసినందుకయినా మీరు తినాలి మరి."

"ఎందుకు తినను ? తింటాను. ఒక్కటే వచ్చింది చిక్కు. ఎవరయినా మాట్లాడుతూ పక్కన కూర్చుంటే ఎంతయినా తినగలను."

"నిజమేగాని- జరిగేమాట చూడండి. మీరు సెలవుపెట్టారని నేనూ సెలవు పెట్టలేనుకదా ? రాత్రిళ్ళు కలిసే భోజనం చేస్తున్నాం కనుక మీరు మాట మాటకు అలా అనకూడదు. ఈ మాటలెవరయినా వింటే ఏమనుకుంటారు ? నేను సరిగా చూడటం లేదనుకుంటారు" వంటయింట్లోకి వెళ్ళిపోయింది.

ఆమె లోపలికి వెళ్ళగానే నారాయణ పక్కకు తిరిగి పడుకున్నాడు. నళినీ మోహన్ ముఖం ఎత్తని తెరగా కళ్ళఎదుట నిలిచింది. "వీడిని గురించి నేను భ్రమపడ్డానా ? నాకేదో అనిపించటం మాత్రమే గాని - సాక్ష్యాలూ రుజువులూ ఏవీ ? లేకుండానే ముందడుగు వేశాను. తరువాత పరిస్థితి చేయిజారింది వెనక్కు తీసుకో లేనంతగా జారింది"

"అబ్బా భ్రమరా ! వేడివేడి కాఫీ ఒక కప్పు కావాలి. ఇస్తావా !" గట్టిగా పిలిచాడు.

''ఇప్పుడు కాఫీ తీసుకుంటారా ? ఒక అరగంటలో వంటయిపోతుంది'' వంట ఇంట్లోనుంచే సమాధాన మిచ్చింది.

''కాఫీ కాకపోతే నిమ్మపండు రసమివ్వు'' లేచి కూర్చున్నాడు. గోడకు తగిలించివున్న భాస్కర్ ఫోటోకు దుమ్ము పట్టిందని లేచి భుజంమీద వున్న తువాలుతో తుడిచి బాగా చూసి వెనక్కు తిరిగాడు నారాయణ.

నిమ్మపండు రసం తీసుకుని వచ్చిన భ్రమర "అది చిన్నప్పటి ఫోటో మళ్ళీ తీయించాలి పెద్దదిగా'' అన్నది

నారాయణ కళ్ళు వాల్చుకుని నిమ్మపండు రసం తాగి కుర్చీమీద కూర్చున్నాడు. "ఫోటో తుడిస్తే ఏం ? కడిగితే ఏం ? మనిషి పోలికలు మార్తాయా ?'' అంతలో అతడి కంటూ ప్రత్యేకంగా ఒక లోకం ఏర్పడ్డది. దానిలో ప్రవేశించాడు. నల్లగా ఎత్తైన ఆకారం. బండ ముఖంతో బయలుదేరి వచ్చివచ్చి చిన్న ఆకారంగా తన దగ్గరకొచ్చి నిలబడినట్లనిపించింది. ఒళ్ళు జలదరించింది.

''ఎవరు నీవు?'' కళ్లు తెరిచాడు నారాయణ.

''ఏమిటి నాన్నా? నావైపు అలా చూస్తావు? అమ్మా, చూడు నాన్న ఎట్లా చూస్తున్నాడో?'' అరుస్తూ వెళ్ళిపోయాడు భాస్కర్.

భ్రమర వేగంగా వంటయింట్లోనుంచి వచ్చింది. ''ఏమిటండీ వాణ్ని అలా భయపెట్టేస్తున్నారు? మీరు ఇదివరకు మాదిరిగా వాడిని దగ్గర కూర్చోబెట్టుకొని కబుర్లు చెప్పటం లేదనీ బజారుకు తీసుకు వెళ్ళటంలేదనీ వాడు బాధపడుతుంటే మీరు భయపెడుతున్నారా? వాడు మనసు చిన్నబుచ్చుకోడూ?'' వంట ఇంట్లోకి వెళ్ళి గిన్నెలు సర్దుకోవటం మొదలుపెట్టింది.

అతడి కామె మాటలు వినబడటంలేదు. ఆ నల్లటి ఎత్తైన ఆకారం ఎవరిది? వాడెవడు? ఎక్కడుంటాడు?

ఎనిమిది గంటలకు ముగ్గురికీ భోజనపళ్ళేలు బల్లమీద పెట్టింది భ్రమర. వంటకాలన్నీ తెచ్చి అమర్చింది. భాస్కర్ మంచినీళ్ళు పెట్టాడు.

''లేస్తారా భోజనానికి? అన్నీ పెట్టాను'' వడ్డిస్తోంది భ్రమర.

''మీరిద్దరూ మొదలు పెట్టండి. వచ్చేస్తున్నా'' మెల్లగా లేని బల్లదగ్గరికి వచ్చి కుర్చీమీద కూర్చున్నాడు.

''కూర మీకు నచ్చిందా? తిని చూడండి. కాస్త ఉప్పు వెయ్యనా?''

నారాయణ తల్లీ కొడుకుల ముఖాలను మార్చిమార్చి చూడటం మొదలు పెట్టాడు.

''నా ముఖం చూస్తారేమిటి కూర ఎట్లా ఉందో చెప్పమంటే?''

''ఓ కూర సంగతి కదూ నీవడిగేది? కూరకేం? నిక్షేపంలా ఉంది.''

''అయితే కలుపుకోండి. కూర నిక్షేపంగా కాదు ఉండవలసింది – రుచ్యంగా.''

''అదేలే బాగుంది.''

''మరయితే మరికొంచెం వేసుకోండి.''

"అమ్మమ్మ ! వద్దు. వెయ్యకు. ఇదే ఎట్లా తినాలా అని చూస్తున్నా "

"అయ్యయ్యో మీరు అడిగారు కనుక చేశాను. ఈ కాస్త భాగ్యానికి అడగటమెందుకు ?"

"ఏరా భాస్కర్ ? స్కూల్లో ఫుట్‌బాల్ ఆడుతున్నావా ?" అతడి కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు.

"అవును నాన్నా. క్రికెట్‌బాలూ, బ్యాట్ కావాలి."

"నన్నడగడట మెందుకురా ? అన్నీ అమ్మనడిగి తీసుకో. డబ్బు నీ కెంత కావాలన్నా అమ్మ యిస్తుంది."

"ఏమండోయ్. గోంగూర పచ్చడి ఇదిగో. ఇదీ మీరు కావాలంటేనే చేశాను. వేసుకోండి."

"అన్నీ నాకు వడ్డించావు కదా ? నా కిష్టమైనప్పుడు తింటాను. చూడు భ్రమరా చెయ్యమన్నాను. చేశావు. అంతే నీ డ్యూటీ అయిపోయింది. ఇంక ఊరుకో "

"అబ్బ ఎంత మారిపోయారండీ మీరు ? ఆరోగ్యంతో పాటు స్వభావం కూడా మారిపోతున్నట్టుగా ఉంది. అయినా అడిగినప్పుడు చేసిపెట్టాను కదా అని తృప్తిగా ఉంది. చేసింది తింటే యింకా తృప్తిగా ఉండేది." ఆమె కంఠధ్వని అంతలోకి గద్గదికమయింది.

కొంతసేపటికి తెప్పరిల్లిన నారాయణ "భ్రమరా నేనీమధ్య నిన్నుమాటలతో బాధ పెట్టటం లేదుకదా ? అలా అనుకుంటే మన్నించు" మౌనంగా భోజనం చేసి లేచాడు.

ఆమె మాట్లాడకుండా తల వంచుకుని తన పని చేసుకుని "రారా భాస్కర్. కొంచెం సేపు చదువుకో. నీ పక్క వేసి ఉంచుతాను" అంటూ వెళ్ళిపోయిందక్కడి నుంచి.

నారాయణ మనసు కించపడ్డది. వాళ్ళిద్దరూ ఒకటన్నట్టుగా మాట్లాడుతోంది. "అయితే తనేనా వేరు ?" వక్క పలుకు నోట్లో వేసుకుని వరండాలో పచార్లు చేశాడు అరగంట సేపు.

ఆ రాత్రి అతడికి ఎంతసేపటికీ నిద్రపట్టలేదు.

భ్రమరా భాస్కర్ నిద్రపోతున్నారు. వాళ్ళ ముఖాలలోకి పరకాయించి చూశాడు నిర్మలంగా ఉన్నాయి వాళ్ళ ముఖాలు.

తన కళ్ళ ఎదుట బొమ్మ కట్టిన ఆ వల్లటి ఉన్నతాకారం మళ్ళీ జ్ఞాపకానికి వచ్చింది.

భ్రమర మోసపోలేదు కదా?

ఏమో? ఎవరికి తెలుసు?

ఆనాటి ప్రభావం నారాయణ మీద నాలుగు రోజులపాటు తీవ్రంగా పని చేసింది. ఔను-కాదు అంటూ తల తిప్పటమే కాని నోటితో మాట్లాడటం మానేశాడు. కళ్ళు మూసుకుని ఏదో ఆలోచించటం పత్రిక చదవటం అంతే.

"భ్రమరా. ఈ ఉత్తరం కాస్త పోస్టులో వేస్తావా?" ఆమె ఆఫీసుకు వెళ్ళటానికి సిద్ధమవుతుండగా అడిగాడు.

"పని మనిషి కివ్వండి వేస్తుంది" అంటూ ఒక్కొక్క తలుపు వేసుకుంటూ వస్తోంది.

"అవసరమయిన ఉత్తరాలు స్వయంగా పోస్టు చేసుకుంటేనే గాని చేరవు. నీ దారి అటేగా? పోస్టుచేసి వెళ్ళకూడదూ?" ఆమె చేతికందించాడు.

ఆమె దానిని అటూ ఇటూ తిప్పి చూసి "అయితే ఇది అర్జంటా?" గుడ్లు తిప్పింది.

"అవును. నా స్నేహితుడికి రాశాను."

"ఈ ఊరేగా? కార్డెందుకు?"

"కార్డెందు కంటే? అతడికి నేను రమ్మన్నట్టు ఎట్లా తెలుస్తుంది?"

"అంత అర్జంటా?"

"అవును. అతడు నా స్నేహితుడు. నా మనసుకు ఉల్లాసం కలిగేటట్లుగా కాసేపు మాట్లాడి వెళ్తాడు. నాతో మాట్లాడే వాళ్ళు లేక నాకు పిచ్చెక్కినట్లుగా ఉంది. ఇప్పుడు చెప్పు అర్జంటవునా కాదా?"

ఆలోచిస్తున్నట్టుగా ఆమె దీర్ఘంగా అతడి కళ్ళల్లోకి చూసింది.

"పోనీ ఏదయినా పుస్తకం చదువుకోరాదూ ? మరీ పొద్దు పోకపోతే మనింట్లో బీరువాలో ఉన్న నవలలు చూడండి. కావాలంటే కొత్తవి తెస్తాను" అన్నది. అతడికి కాలక్షేపం తను పుట్టించలేకపోతానా అనుకుంటూ.

"అయితే కార్డు పోస్టులో వెయ్యవా ?" నొసలు చిట్లించాడు.

"ఎందుకు వెయ్యను ? వేస్తాను. ఈ లోపల కాలక్షేపానికి చెప్పానంతే" ఆమె కార్డు చేత పట్టుకుని గేటు దాటింది.

అతడు ఇంట్లో ఉండగానే ఇంటికి తాళం వేస్తున్నదని ఏమయినా బాధగా ఉందేమోనని భ్రమర మరొక మార్గం కనిపెట్టింది. పడకగది ముందరగా ఒక చిన్న వరండా ఉంది. అక్కడికి గాలీ వెలుతురు బాగా ప్రసరిస్తాయి. నారాయణ మంచం పడక కుర్చీ ఒక చిన్న బల్ల అక్కడికి మార్చింది. భోజనం కాఫీ మంచి నీళ్ళూ ఆ బల్ల మీద పెట్టి అతడికి కావలసినప్పుడు తీసుకునేటట్టుగా ఏర్పాటు చేసింది. కిటికీలో ఒక అలారం టైమ్ పీస్ పెట్టింది. ఇంక ఇంట్లో ఎవరు ఎప్పుడు వచ్చినా ఫరవాలేదు. నిశ్చింతగా ఆఫీసుకు వెళ్ళింది.

నారాయణ మంచమ్మీద కూర్చున్నాడు అప్పుడు గంట పదికీ ఐదునిమిషాలు తక్కువ. అది అతడి భోజనం వేళ కాదు. ఏం చెయ్యాలి ?

మంచమ్మీద ఒరిగి పడుకున్నాడు. అతడి దృష్టి భ్రమర మీదికి మళ్ళింది.

## 5

మీనాక్షి వెళ్ళిపోయిన తరువాత ఆమె తండ్రి కోపంతో ఉత్తరం రాస్తాడేమోనని చూస్తే రాయలేదు. మీనాక్షయినా రాయకపోతుందా అని చూస్తే ఆమె రాయలేదు. పిల్లవాడున్నాడు కదా. తల్లికీ కొడుక్కీ భరణానికి దావా వేస్తారేమోనని చూస్తే అదీలేదు. అంత రోషంలేని మనుష్యులేమిటి వాళ్ళు ? డబ్బు కూడా అక్కర్లేదా ? దిగువ మధ్య తరగతి మనుష్యులే కదా వాళ్ళు ? నారాయణకు కోపం

వచ్చింది. ఇంక వాళ్ళు ఉత్తరాలు రాసినా - వచ్చినా మాట్లాడదలచుకోలేదు. అక్కడితో ఆ సంబంధం తెగిపోయిందనుకున్నాడు.

తండ్రీ కూతుళ్ళ మీద కోపంతో తను పనిచేస్తున్న ఉద్యోగం మానేసి ఆ ఊరి నుంచి వెళ్ళిపోయాడు. కుటుంబం ఉద్యోగం రెండూ లేకపోతే చాలా స్వేచ్ఛగా ఉన్నట్టు ఆనందం కలిగింది. దేశమంతా గాలిపటంలా ఎగురుతూ తిరిగాడు. చూసిన ప్రకటనకల్లా దరఖాస్తు పెట్టాడు. ఈ కంపెనీలో ఉద్యోగం వచ్చింది. చాలా ప్రయత్నం చేశాడు అతడి పక్షాన కొందరు శ్రేయోభిలాషులు చేసిన శ్రమ ఫలించింది. ఉద్యోగం వచ్చింది.

అప్పటికీ అతడికి పెళ్ళి చేసుకోవాలనిపించలేదు. మీనాక్షి స్మృతులేవీ అతడిని బాధించలేదు. ఉద్యోగం చేసుకొంటూ బ్రహ్మచారిలా ఒక గది తీసుకుని ఉండటమే మేలనిపించింది.

భ్రమర ఆ కంపెనీ ఉద్యోగులలో ఒకరికి చెల్లెలు. ప్రతి రోజూ అతడు నారాయణను పెళ్ళి చేసుకొమ్మని అడుగుతూ ఉండేవాడు. ఒకనాడు పిల్లను తీసుకు వచ్చి చూపించాడు

అప్పుడుగాని నారాయణకు మళ్ళీ పెళ్ళి చేసుకోవాలనిపించలేదు పెళ్ళిమాట ఎత్తగానే అతడికి మీనాక్షి జ్ఞాపకం వచ్చింది. ఆమెతోపాటు ఆమె మీద కక్ష కూడా తలెత్తింది.

నారాయణ మీనాక్షిమీద కోపం కొద్దీ వెంటనే పెళ్ళికి అంగీకరించాడు. ఆమె వయసు అడగలేదు. చదువు అడగలేదు. వాళ్ళు చెప్పినప్పుడైనా వివరాలు వినలేదు. భ్రమర చూడటానికి బాగుంటుంది. అందగత్తెల జాబితాలో చేర్చతగినదే కాని - మీనాక్షికి సాటికాదు

మీనాక్షి కిదే తగిన శిక్ష అనుకున్నాడు. మీనాక్షిమీద కసికొద్దీ భ్రమరను అమితంగా ప్రేమించేశాడు. భ్రమర అడక్కుండానే అన్నీ సమకూర్చాడు. పెళ్ళయిన తరువాత ఆమెతో రమ్యమైన ప్రదేశాలన్నీ తిరిగాడు. ఆమె గర్భముతో ఉంటే సెలవు పెట్టి ఇంట్లోనే ఉండి తన చేతితో పళ్ళరసం అందించేవాడు. కరెంటుపోతే విసనకర్రతో విసిరేవాడు. నడిస్తే కాళ్ళు అరిగిపోతాయనుకునేవాడు.

భ్రమర ప్రసవించింది. పెద్ద పెద్ద డాక్టర్లు పనిచేసే నర్సింగ్ హోంలో పుట్టాడు భాస్కర్. డాక్టర్లంతా పిల్లవాడు చాలా ఆరోగ్యవంతంగా ఉన్నాడని చెప్పారు. కాని తను ఎప్పుడో విన్నట్లు జ్ఞాపకం - ఎనిమిదవ నెలలో పుట్టిన బిడ్డలు బ్రతకరని, ఆ బిడ్డను పెంచటానికి ఒకనర్సును పెట్టాడు.

డాక్టర్లు మళ్ళీ చెప్పారు - బిడ్డ నెలలు నిండిన తరువాతనే పుట్టాడు కనుక ఆహారం పూర్తిగా మామూలు బిడ్డల కిచ్చేటంత ఇస్తే హరించుకోగలడని.

అప్పుడు తను ఇదెట్లా సంభవమని అనుకోలేదు. అప్పటికి పెళ్ళయి సరిగ్గా ఏడు నెలలు నిండాయి. తనకేమీ అనుమానం కలగలేదు. భాస్కర్ తమిద్దరికంటె నల్లగా ఉంటాడు. అవును, తమరంగే రావాలని ఎక్కడుంది? అటూ ఇటూ వంశాలలో ఎవరయినా నలుపేమో?

అతడి ఆలోచనలు ఆగిపోయాయి. మెల్లగా నిద్రలోకి జారుకున్నాడు.

అతడు భోజనానికి కూర్చునేటప్పటికి మూడయింది. నూతన తేజాన్ని పుంజుకున్నట్లయింది. కిటికీలో ఉన్న నవల ఒకటి చేతబట్టాడు.

సాయంకాలము వస్తూనే భ్రమర అతడిని క్రీగంట చూసింది "ఇవాళ ఈయనగారి కళాకళలు ఎట్లా ఉన్నాయో? కాఫీ తాగాడో లేదో! అడిగితే ఒక తప్పు అడగకపోతే ఒక తప్పు" అనుకుంది.

తలుపు తాళంతీసి గబగబా ముఖం కాళ్ళూచేతులూ కడుక్కుని కాఫీ చేసింది జామ్ రాసిన బ్రెడ్ స్లైజులు పళ్ళెంలో పెట్టింది.

"కాఫీ తీసుకుందాము వస్తారా?"

"నా కిక్కడే ఫ్లాస్కులో పెట్టావుగా? కావలసినప్పుడు తీసుకుంటాను" పుస్తకం మూసేసి కళ్ళజోడు తీశాడు

"అది నేను లేనప్పుడు తీసుకునే కాఫీ, ఇది ఇప్పుడు తయారుచేశాను. రండి. అక్కడ కూర్చుని తీసుకుందురు గాని, జామ్‌సీసా తెచ్చాను, బ్రెడ్ ఉంది" తొందరపెట్టింది దగ్గరగా వచ్చి

ఆమెను చూడగానే చటుక్కున జ్ఞాపకం వచ్చింది. పెళ్ళయిన ఎనిమిది నెలలకే నిండు నెలల బిడ్డను కన్నదని ఆమె కళ్ళల్లోకి చూశాడు.

ఆ చూపుల కామె కంపించింది. ఆ దృక్కులను ఎదుర్కోలేక కను రెప్పలు వాల్చింది.

''అట్లా నిలబడిపోయావేం? కూర్చో, అబ్బాయిని రానివ్వు. ముగ్గురం కలిసి కూర్చుందాము.''

''ఆఁ. వాడు ఆడుతూ పాడుతూ వస్తాడు మెల్లగా. ముందు మనిద్దరం తీసుకుందాము రండి.''

''పద నీ వంతగా అడుగుతుంటే ఎందుకు కాదనాలి'' ఇద్దరూ బల్లదగ్గర కుర్చీలమీద కూర్చున్నారు

''ఇంకా కొంచెం కావాలంటే జామ్ రాసుకోండి. ఇది అనానపళ్ళ జామ్. ఇంట్లో చేసుకుంటే ఇంకా బాగుంటుంది.''

''చాలు. ఇది బాగానే ఉంది. ఈ కాఫీ నీది. 'నీవు తాగేసెయ్యి'' చివ్వున లేచి తన ఫ్లాస్కు తీసుకువచ్చి కప్పులోకి ఒంపుకుని తాగేశాడు.

చూసీ చూడనట్టు ఊరుకుంది. తను కూడా కాఫీ తాగి ''ఇవాళ ఎలా ఉంది? ఒంట్లో కాస్త హుంషారుగా ఉన్నట్టుంది కదూ?''

నవ్వాడు. దానిలో అర్థమూలేదు జీవమూలేదు. అదొక పొడి నవ్వు.

''చూడు భ్రమరా నా స్థితి ఎలా ఉందంటే ఆఫీసుకు వెళ్ళి పనిచేసేటంత ఓపికా చురుకుదనమూ లేవు. పోనీ ఇంట్లో ఉందామంటే అంత డబ్బూ లేదు.''

''పోనీ ఎక్కడికయినా వెళ్ళి రెండు నెలలు ఉంటే బాగుంటుందేమో! కాస్త గాలి మార్చినట్టు కూడా ఉంటుంది.

''వెళ్ళామే అనుకో. అక్కడా బాగుంటుందని నాకు నమ్మకంలేదు. ఈ మనసును కూడా వెంటబెట్టుకుని వెళ్తాం కనక అక్కడా ఈ రకమయిన బాధే. సుఖమెక్కడ దొరుకుతుంది నావంటి వాళ్ళకు?''

భ్రమర మౌనంగా ఉండిపోయింది.

''మాట్లాడవేం? అంతేనంటావా?''

అంతలో భాస్కర్ వచ్చాడు. ఆమె మెల్లగాలేచి అవతలికి వెళ్ళింది.

అయిదూ ఆరూ రోజులు గడిచాయి. నారాయణకు సుందరం రాలేదన్న ఆరాట మెక్కువయింది.

ఉత్తరం చేరిందా ?

భ్రమర పోస్టులో వేసిందా ?

నారాయణ అట్టే ఆలోచించకముందే ఆదివారం పొద్దున ఎనిమిది గంటలకు సుందరం వచ్చాడు.

అతడిని చూడగానే నారాయణకు కొండంత సంతోషం కలిగింది. ఆనందంతో కళ్ళు తడిశాయి.

"రావోయ్ సుందరం. నీకు నా కార్డందిందా ? అందీ ఎందుకు వెంటనే రాలేదు చెప్పు ? నీకు తెలుసుకదా నా పరిస్థితి? మనిషికి ముఖం వాచిపోయాననుకో!" తువాలుతో కళ్ళు తుడుచుకుని అతడికి కుర్చీ చూపించాడు.

"ఏమిటి నీవు నాకు ఉత్తరం రాశావా ? ఎప్పుడు ?"

అయితే అనుకున్నంతపనీ జరిగిందన్నమాట. నేను నిన్ను అర్జెంటుగా రమ్మని రాశాను. ఎంతో మాట్లాడవలసిన పని ఉందన్న వాక్యానికి కింద గీత కూడా గీశాను. ఎందుకంటే నా మనసు-నా మనసు మసిలి పోతోందోయ్. అదంతా నీతో చెప్పాలి. చెబితేగాని నాకు మనశ్శాంతి కలగదు" ఈ మాటలు ఉద్రేకంతో మాట్లాడటంచేత కొంచెం ఆయాసం వచ్చింది. ముఖమ్మీద చెమట బిందువులు పొటమరించాయి.

సుందరం లేచి ఫ్యాన్ ఆన్ చేశాడు.

"ఆఁ కార్డు రాశావా ? నేనీమధ్య పని తొందరలో వచ్చిన ఉత్తరాలను కూడా సరిగా చూసుకోవటంలేదు. నీవు రాస్తే వచ్చే ఉంటుంది."

"అయితే నీ అంతట నీవు వచ్చావా ? నీవు కూడా నన్ను అప్పుడప్పుడు తలుచుకుంటూ ఉంటావన్నమాట. చల్లటి మనసు. ఆఁ. ఏదో పని తొందరన్నావు. ఏమిటది ?" కుర్చీలో సర్దుకుని కూర్చున్నాడు నారాయణ.

"మా బంధువర్గంలో కాదుగాని అంతకంటే సన్నిహితులయిన ఒకావిడకు కడుపునొప్పి రెండేళ్ళనుంచీ బాధిస్తోంది. మందులతో తగ్గలేదు. ఆపరేషను చెయ్యాలని డాక్టర్లన్నారు. ఆమె ఒంటరిది. అందుకని ఆమెను ఇక్కడికి తీసుకు వచ్చాను నర్సింగ్ హోమ్‌లో వుంది. కోటాల్లు ఇస్తున్నారు. ఆమెను ప్రతిరోజూ వెళ్ళి చూసి వస్తున్నాను. రేపు యింటికి తీసుకువచ్చిన తరువాత తీరుబడి ఉండదని ఇవాళ వచ్చాను."

"పిల్లలూ భర్తా ఎవరూ లేరా? ఒంటరి వాళ్ళకు ఇటువంటివి వస్తే కష్టమే. సుందరం నీది మంచి మనసు. అందుకనే కష్టంలో ఉన్న వాళ్ళని ఆదుకుంటున్నావు"

"నారాయణా! అందరూ వున్నా కొందరు ఒంటరివాళ్ళయిపోతారు. ఆమెకు అందరూ వున్నారు కాని ఆమె మనసు చితికిపోయింది. అయినా పైకి అతి గంభీరంగా వుంటుంది. ఆమె జీవితంలో ప్రతి నిమిషమూ ఎట్లా గడిచిందో నాకు తెలుసు. ఇటువంటి కూతుర్ని చూస్తూ ఆమె తండ్రి ఎట్లా బ్రతికాడో నా వూహకందనిది" మాట ఆపి బరువుగా వూపిరి తీసుకున్నాడు.

"ఇప్పుడా తండ్రి లేడా?" నారాయణ ఆ రోగిని గురించి ఆలోచిస్తున్నాడు.

"తల్లులూ తండ్రులూ ఎంతకాలం బ్రతుకుతారు? అందులో చివరి దశకు ఇట్లాంటి మానసికమైన బాధలుకనుక వస్తే మృత్యువు వీళ్ళదగ్గిరికి రాకముందే వీళ్ళే మృత్యువును చేరుకుంటారు."

"అంతే అనుకో. ఇప్పు డామె బాధ్యతంతా నీదేనా?"

"నాదేనా అంటే నాదే. ఆమెకు సంతానం వుంది. కాని చాలా దూరాన ఉండటంచేత దగ్గరగా ఉన్న నేను చూసుకోవాలి. మూడు నాలుగేళ్ళలో నా బాధ్యత కొంత తీరిపోతుంది."

"ఉద్యోగంలో చేరావు కదూ? ఆ బాధ్యత కాకుండా నా గోడు ఒకటి. నీవు వచ్చినప్పుడల్లా నేనూ ఏదో వాగి వాగి నీ బుర్ర పాడుచేస్తూ వుంటాను."

"ఒకరు పాడుచేస్తే పాడవదు నా బుర్ర. నేను ఇదివరకే వీటన్నిటికీ అతీతుణ్ణి. సీజన్డు ఉడ్‌లా నా మనసు చిన్నప్పుడే తయారయింది. నాకు తల్లి

లేదు చీవాట్లు చెప్పుదెబ్బలతో పెరిగాను. చిన్నచిన్న వాటికి నా మనసు చలించదు.''

''అదే నీకు దేవుడిచ్చిన వరంలా జీవితమంతా కాపాడుతుంది. నీవు నీ జీవితాన్ని చక్కదిద్దుకుని ఇతరుల జీవితాలకు మార్గదర్శివవుతున్నావు. అందుకే నేను ఎప్పుడూ 'సుందరం సుందరం' అంటూ కలవరిస్తున్నాను.''

'అది కాదు నారాయణా. ఒక సంగతి నాకు విడదీసి చెప్పు? బాధపడుతున్నామో బాధపడుతున్నామో అంటారు ప్రతివాళ్ళు. ఏమిటి ఆ బాధ? శారీరకమా? అయితే డాక్టర్ దగ్గరికి వెళ్ళి మందు తీసుకోవాలి. మానసికమా? అయితే సృష్టి ధర్మానికి సంబంధించినదయినప్పుడు ఎవరూ ఏమీ చేయలేరు. కాలగర్భంలో ఆ బాధలు కలిసిపోతాయి. కాలమే వాటిని ఉపశమింప చేస్తుంది. ఇవేవీకాక అందనివీ తీరనివీ కోరికలూ, ఆశలూ ఎదగని మనసులవల్ల వచ్చే అనర్థాలూ, ఒకరిమీద ఒకరికి కలిగే అపనమ్మకాలూ, సర్దుబాటుతనం లేనందువల్ల కలిగే పరిణామాలు మొదలయినవి కొన్ని వున్నాయి. ఈ అహం - అసూయలతో మగ్గిపోతూ మానసికంగా తీసుకునే వాళ్ళను మనస్తత్వ శాస్త్రజ్ఞులు తప్ప మరొకరు బాగుచేయలేరు. ఈ రకం రోగులు వాళ్ళు బాగుపడరు – ఎదుటి వారినీ బాగుపడనివ్వరు ''

''సుందరం! తొందరపడకు, వాళ్ళు అట్లా ఎందుకు బాధపడతారంటావు? ఆ బాధ తక్కువదా?''

''కాదని నేననను, నిదానంగా ఆలోచించి ఏ పనయినా చెయ్యాలి. తొందరపడి కిందా మీదా చూడకుండా చెయ్యటం. ఆ తరువాత వచ్చేవాటిని ఎదుర్కోలేక బాధపడటం–ఇది లేనిపోని కష్టాలను కొనితెచ్చుకోవటం కాదూ?''

నారాయణ స్వరం తగ్గింది. ''ఏమిటో సుందరం నీవు వచ్చి కాస్తకులాసా కబుర్లు చెప్పి నాకు మనశ్శాంతి కలిగిస్తావేమో ననుకుంటే ఇవాళ నీ ధోరణంతా కొత్తగా వుంది. ఉమ్మడిగా అందరినీ చీవాట్లు పెడుతున్నావు. ఇంక నా మనసులో మాట నీతో ఎలా చెప్పుకోను?''

''చూడు. ఒక చిన్న సంగతి చెప్తా విను. మా కాలనీలో ఒకాయనకు మూడు పదులు దాటిన కూతురు వుంది. ఆయన పదేళ్ళ నుంచే తన కూతురికి

సంబంధాలు చూస్తున్నాడు ఇంతవరకూ దొరకలేదని బాధపడతాడేకాని పదేళ్ళ క్రింద ఎటువంటి వరుడు కావాలనుకున్నాడో అటువంటి వాడే ఇప్పుడూ కావాలంటాడు గాని తన కోరికలను తగ్గించుకోడు. వయసు మీరిన కొద్దీ అవకాశాలు జారిపోతాయనుకోడు. కూతురు పెళ్ళి కాకుండావుందే - చేయలేకపోయానే అన్న బాధతో తీసుకుంటున్నాడాయన ఇంక_పెళ్ళి అయినవాళ్ళకు_తమ స్థాయికి మించిన కోరికలు తీరలేవనీ కొందరు మగవాళ్ళకు అన్నీ బాగున్నాయనుకుంటే భార్యల మీద అనుమా న రోగం-ఇదిగో ఇలాంటి జబ్బులతో తీసుకునే వాళ్ళకు మందు లెవరివ్వాలి ?''

''అబ్బబ్బ ఇంక చాలు సుందరం చాలు. ఇంక రెండు నెలలకయినా తిప్పుకోకుండా ఉండేటట్టు షాక్ ట్రీట్‌మెంట్ ఇచ్చావు. ఇంక నా గోడు నీకెక్కడ చెప్పను ? నీ కోసం ఎంతగా ఎదురు చూశానో ?''

''దానికేంలే నారాయణా. నేను లోకంపోకడ చెప్పాను. నీ మనసు బాధ పడిందేమో ? ఏమనుకోకు. ఎందుకింత ఉద్రేకంతోచెప్పానంటే-ముందు చెప్పానే-నాకు ఆప్తురాలని_ఆ రోగి - ఆమె మనసు తీవ్రంగా గాయమైంది. అది మానని గాయమైంది దానితోనే ఆమెకు మరణం. ఆ గాయపరచిన వాడున్నాడే వాడు మానసిక వ్యాధితోనే తీసుకుంటున్నాడు. అది ఇంకో రకం. వాడికీ దానితోనే మరణం. ఇది నిజం. వాళ్ళిద్దరినీ ఎవరూ బాగు చెయ్యలేరు.''

''భ్రమరా ! భ్రమరా'' గట్టిగా పిలిచాడు నారాయణ, ఆమె రాగానే రెండు కప్పుల కాఫీ కావాలన్నాడు.

''ఏమండీ సుందరం గారూ క్షేమంగా ఉన్నారా'' అంటూ కాఫీ కప్పులు తెచ్చింది.

''తీసుకో సుందరం. నీవు ఉపదేశమే చేశావో చివాట్లే పెట్టావో-చాలా తీవ్రంగా మాట్లాడావు. కాఫీ తాగి వక్కపొడి వేసుకో'' అన్నాడు నారాయణ.

''మీరు సాయంత్రపు వేళ ఒక అరగంట సేపు ఇలా రాకూడదటండీ ? ఆయనకు కాస్త కాలక్షేపంగా ఉంటుంది. ఏమీ తోచక అలా కూర్చుంటారు''అంది భ్రమర చనువుగా సుందరంతో.

"ఇక్కడ ఈయనకు కాలక్షేపం కలిగించాలి. అక్కడ దైన్యావస్థలో ఉన్న నా ఆ పుత్రాలికీ కాలక్షేపం కలిగించాలి. ఒక విధంగా చూస్తే ఇద్దరిదీ నా బాధ్యతే. కాదనను. నేను ఇద్దరి దగ్గరా ఒకే సమయంలో ఉండటానికి భాగవత కృష్ణుణ్ణి కాదుగా ? ఏం చెయ్యను చెప్పండి భ్రమరగారూ ?" నవ్వాడు సుందరం.

'నీ పునర్దర్శనం ఎప్పుడు సుందరం ?" సుందరం లేచి వెళ్ళుతుంటే నారాయణ లేచి నిలబడ్డాడు.

"చూద్దాం. మళ్ళీ ఎప్పుడు బుద్ధి పుడుతుందో ?" నవ్వాడు సుందరం చిన్నగా.

అతడిని గేటు వరకూ సాగనంపింది భ్రమర.

"ఏమిటండీ ఆయన ? రోజు రోజుకు మారిపోతున్నారు? నేను ఆయనతో వేగ లేకపోతున్నాను." భ్రమర కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

"చూడండి భ్రమరగారూ ! నేను ఉద్యోగం మానేస్తాను. ఆ జీతం మీరంతా కలిసి ఇవ్వగూడదూ ; ఇటువంటి వాళ్ళతో కాలక్షేపం చేస్తూ వాళ్ళను నవ్విస్తాను" అన్నాడు ముందుకు అడుగువేస్తూ.

# 6

మీనాక్షికి పైపైన నీళ్ళు చల్లినట్లు కొంచెం ఉపశమనంగానే ఉంది. వారము రోజులయిన తరువాత ఊరికి వెళ్తానని బయలుదేరింది

"అక్కా. అక్కడ ఒక్కదానవూ ఏముంటావ్? ఇక్కడే ఉండిపో. వళినికి ఉత్తరం రాస్తాను" సుందరానికి ఆమెను మళ్ళీ ఆ ఊరు పంపటం ఇష్టం లేదు.

"నేను సెలవు పెట్టాను కదా. మళ్ళీ పొడిగించవలసి వస్తుంది. మనిషికి కాలక్షేపం లేకపోతే లేని జబ్బులు వస్తాయి. ఉన్నవి ఎక్కువవుతాయి. నీవే అన్నావు కదా ఈ మాట ?"

"సర్లే. ఆ మాట నాకే ఒప్పగిస్తున్నావా? ఇప్పుడు ఒకరు నిన్ను కనిపెట్టి ఉండాలి. అప్పటికప్పుడు మందులు బజారునుంచి తీసుకువచ్చే వాళ్లుండాలి. ఇక్కడ నీకిచ్చిన ట్రీట్‌మెంట్ ఉపశమనానికి మాత్రమే."

"అయితే నా ఉద్యోగ్యం? ఇంకా కొంత సర్వీసుంది కదా? అయినా నా భారమంతా తమ్ముడి వంటి నీమీద వెయ్యనా? నా కష్టం-నా దుఃఖాలతో నిన్ను బాధించనా! వద్దు తమ్ముడూ! వద్దు."

"అక్కా. నీ దుఃఖాన్ని నా ముందర ఎప్పుడూ నీవు వెళ్ళబొయ్యలేదు. నన్ను బాధించలేదు. మీ నాన్నకు నేను మాట ఇచ్చాను. అవసరమయినపుడు నేను సహాయం చేస్తానని వాగ్దానం చేశాను. నళిని ఇక్కడ లేనప్పుడు నీ బాధ్యత నాది. నీవు కాదనకు."

"ఇంకా చాలా సర్వీసుంది కదా? ఉద్యోగం మానెయ్యనా? ఉన్న ఉద్యోగం మానుకునేటంత ఆర్థికస్తోమత లేదు. ముందు నళిని వచ్చినా వెంటనే ఉద్యోగం దొరికినా దొరక్కపోయినా డబ్బు చేతిలో లేకపోతే ఎట్లా సుందరం?"

"ఆ సంగతి నాకు తెలుసు. అయినా నిన్ను ఒంటరిగా ఉంచటం నా కిష్టం లేదు. చూడు ఈ సమస్యను రెండురోజులకు వాయిదా వెయ్యగలవా? నీ మాట నెగ్గాలనుంటే నాకే ఆ బుద్ధి పుడుతుందేమో?"

చేసేదేమీ లేక మీనాక్షి వెనక్కి తగ్గింది.

సుందరం ఆశ్చర్యపోయాడు. మీనాక్షి ఎంత ఆత్మాభిమానం కలది? అనాడు ఆమె బిడ్డను తీసుకొని పుట్టింటికి తిరిగి వచ్చినప్పుడు తండ్రి ఆమెకు జీవనాధారం కల్పించాలనుకున్నాడు. కాని ఆర్థికంగా చితికిపోయిన ఆయన తన అసమర్థతకు క్రుంగిపోయాడు. ఏడాది రెండేళ్ళ తరువాత సుందరమే కల్పించుకుని ఆర్థిక సహాయం చేశాడు. అదీ ఎట్లా చేశాడు? ఆమెకు తెలియకుండా. నెలనెలకు డబ్బు పంపిస్తుంటే ఆమె కంటబడుతుందేమోనని ఆరునెలల కొకసారి పంపేవాడు. తన బిడ్డకేమి తక్కువవుతుందోనని మీనాక్షి కాలేజీకి వెళ్ళడానికి రెండేరెండు చీరెలు కొనుక్కుంది. ఇంట్లో అతుకులు వేసినవి కట్టుకునేది. ఒక సీసాలో నూకల గంజి పోసుకుని మధ్యాహ్నం కాలేజీకి తీసుకువెళ్ళి ఎవరూ చూడకుండా తాగేవి.

మీనాక్షి కష్టపడ్డది. తన శక్తికి మించి కష్టపడ్డది.

సుందరానికి ఆ విషయం జ్ఞాపకం వచ్చినప్పుడల్లా కళ్ళు చెమరుస్తాయి.

పిల్లవాడు స్కూలుకు వెళ్ళేనాటికి బి.ఏ. ప్యాసయింది. తండ్రి కాళ్ళరిగేటట్టుగా తిరిగి తిరిగి ఒక కంపెనీలో టైపిస్టు ఉద్యోగం ఇప్పించాడు. మీనాక్షి తన పిల్లవాడిని చూసుకుంటూ మగపిల్లలులేని తన తండ్రికి ఆసరాగా నిలబడ్డది. వృద్ధాప్యంలో జీవిత సహచరిని పోగొట్టుకుని ఒంటరితనంతో బాధపడే తండ్రిని చిన్న బిడ్డను ఓదార్చినట్టు ఓదార్చింది. తండ్రిని అహర్నిశలూ ఏలోపంజరక్కుండా కనిపెట్టి ఉంది.

మీనాక్షి తండ్రిపోయిన తరువాత ఆమె మానసికంగా డస్సిపోయింది. ఒక రెక్క తెగినట్లనిపించింది. ఆయన ఉన్నన్నాళ్లు ఆమెకు ధైర్యం నూరిపోస్తూ ఉండేవాడు. మానవుడికి పరమ శత్రువైన కార్పణ్యాన్ని ఎట్లా నశింపచేసి ముందడగు వేయాలో బోధించేవాడు. ఇప్పుడామె సమాధిలో మునిగిపోయిన తపస్విని. ఆమె ఎదుట నిలబడిన వాళ్ళకు కల్మషమైన భావాలు ఉదయించవు.

అట్లా అని మీనాక్షి తన బాధ్యతను ఏమారలేదు. కొడుకును తన ఆదర్శాలకూ అతడి ఆశయాలకూ అనుగుణంగా ఏ లోటూ లేకుండా తీర్చిదిద్దింది. ఒకరిని యాచించకుండా అతడికి ఉన్నత విద్య చెప్పించింది విదేశాలకూ పంపింది.

సుందరం మీనాక్షిని తలుచుకుని గర్వపడతాడు. నారాయణను ఆమె విమర్శించి తూలనాడనందుకు ఆశ్చర్యపడతాడు. ఆమె మనస్సు మూసిన పేటిక అనుకుంటాడు.

## 7

సుందరం వెళ్ళినప్పటినుంచీ నారాయణ ఆలోచనా ప్రవంతిలో దూకుడుతనం తగ్గింది. మందంమందంగా సాగుతున్నది.

సుందరం లోకసహజమైనదే అనుకుంటూ ఎట్లా మాట్లాడాడు? ఒక్కొక్క మాట ఒక్కొక్క ముల్లు. ఒంటినిండా దిగబడ్డాయి.

సాయంత్రము ఐదు గంటలకు మామూలుగా భ్రమర ఇంటికి వచ్చింది. అతడిని పలుకరించి లోపలికి వెళ్ళింది.

ఇద్దరూ కాఫీ. టిఫిన్ తీసుకుంటున్నారు. ఇంకా భాస్కర్ రాలేదు.

"భ్రమరా, ఇరవై ఐదువేల డిపాజిట్ నా పేరుమీద ఉన్నది. మెచ్యూరు అయిందా? నేను మన ఎకౌంట్సూ డిపాజిట్సు అన్నీ ఒకసారి చూడాలనుకుంటున్నాను. టిఫిన్ తీసుకున్న తరువాత ఒకసారి చూపిస్తావా?"

"ఏమిటి? ఇవాళ మీ మనసు డబ్బు సంగతిని ఆలోచిస్తోందా?" ఓరగా చూసింది.

"నాకు ఏదో మధ్నాహ్నం జ్ఞాపకం వచ్చింది. నేను అనుకున్నది కరెక్టవునో కాదో చూడాలి."

"ఏమిటది? చెప్పండి? నా కన్నీ జ్ఞాపకమే ఉన్నాయి. నేను చెప్పగలను."

"నీవు చెప్పగలవులే, కాని చూస్తేనే గాని నాకు అర్థం కాదు."

"అది కాదండీ, మన డిపాజిట్లన్నీ మెచ్యూర్ కాగానే మనిద్దరి పేరున జాయింటుగా పెట్టాంకదండీ. ఈ మధ్య రెండింటికి టైమయిపోయిందని మళ్ళీ అరవై మూడు నెలలకు పెట్టాను. మీ సంతకం కూడా తీసుకున్నాను."

"మళ్ళీ పెట్టావా? నాకీ సంగతి వివరంగా చెప్పకూడదూ? ఏవీ తీసుకురా?" అసహనంగా మాట్లాడాడు

"ఇవాళ ఈ బుద్ధి పుట్టిందేమిటి?" ముఖం మటమటలాడించుకుంటూ బీరువా తీసి కాగితాలన్నీ తెచ్చి అతడి ముందర పెట్టింది.

కళ్ళజోడు పెట్టుకుని కాగితాలన్నీ పరిశీలనగా చూశాడు.

"భ్రమరా" గట్టిగా కేకబెట్టాడు.

"భాస్కర్ వచ్చాడు. వాడికి టిఫిన్ ఇచ్చి వస్తాను ఆగండి" వంటఇంట్లో నుంచి జవాబిచ్చింది.

నారాయణ. భ్రమర భాస్కర్ల పేరున వేసిన డిపాజిట్లు దూరంగా పెట్టాడు. తన పేరున ఉన్న మొత్తం ప్రత్యేకంగా ఉంచాలని తన పేరు మీదనే డిపాజిట్ చేశాడు. నళినిని చూసిన తరువాత ఏదో తప్పు చేసిన వాడిలా ఉన్నది అతడి మనసు. అందుకే తన ఎకౌంటులో ఉన్న పాతికవేలు తీసి విడిగా డిపాజిట్ చేశాడు అది అప్పుడే మెచ్యూరవటం ఏమిటి? దాన్ని కావాలని మార్చింది భ్రమర. ఎందుకట్లా జరిగింది ?

భ్రమర వచ్చింది తడి చేతులు తుడుచుకుంటూ.

"మళ్ళీ ఏమయింది అలా గట్టిగా కేకేశారు ?"

"ఏమయిందా ? అలా కూర్చో చెబుతాను. ఈ డిపాజిట్లు రెండూ మీ ఇద్దరివీ ఇవి రెన్యూ చేశావు బాగుంది నాది ఎందుకు తీసి జాయింటుగా వేశావు ?" అతడి కంఠస్వరం కఠినంగా ఉంది.

"ఎందుకు చేశానంటే ? బాగుంది ఈ ప్రశ్న. మీరు చూడబోతే క్షణాని కొక మాట మాట్లాడుతున్నారు. మనసు సరిగా లేదంటారు. ఏదో అంటారు. ఆ మరునాడే ఇంకేదో అంటారు స్థిరం లేకుండా ఉంది అందుకని నేను కాగి తాలు తెచ్చి మీ సంతకం తీసుకునే వెళ్ళాను. జాయింటుగా మనిద్దరి పేరున మార్చేశాను. తప్పా అది ? తప్పయితే అప్పుడే చెప్పకపోయారు ?"

"సంతకం తీసుకున్నాప్పుగాని నాకా సంగతి చెప్పలేదు."

"ఇప్పుడేం నష్టమొచ్చింది ?"

"నష్టమా ? ఆ నష్టము ఒకరు తీర్చలేనిది. అయినా నా స్వంత డిపాజిట్ ఎందుకు ముట్టుకున్నావు ? నేను చెప్పలేదే నీకు ?"

"మీ స్వంతం అంటే ? మనం ముగ్గురం ఒకటే కదండీ! మీవన్నీ నేను. దాచి పెట్టటం లేదా? అడిగినప్పుడు తీసి ఇవ్వటం లేదా! అట్లా మాట్లాడతారేం ?" కనుబొమ్మలు చిట్లించింది.

"అసలు సంగతేమిటంటే భ్రమరా ఆ పాతిక వేలు నావికావు. ఒకరికి ఇవ్వాలని ఉంచాను అందుకోసమే నా పేరున ఉంచాను."

"ఒకరు అంటే ఎవరు? మీ రెవరికయినా బాకీ ఉన్నారా? మనకు బాకీలు ఎక్కడా లేవని మీరే చెప్పారు ఒకనాడు మరిచిపోయారా?"

"భ్రమరా! నీవట్లా నన్ను నిలదీసి అడగటం నాకు నచ్చదు. అయినా అన్నీ నీకు చెప్పాలా? చెప్పే చెయ్యాలా? అత డెవరని చెబితే నీకు అర్థమవుతుంది?"

"చూడండి మీకు మనసు సరిగాలేదు. దాంతో ఏదో అంటుంటారు - రోజుకొక మాట. ఏది సరి అయిందీ నాకు తెలియటంలేదు. ఆయన ఎవరో నాకు చెప్పినంత మాత్రాన మీకు వచ్చిన నష్టమేమిటి? నేను వెళ్ళి అడుగుతాను."

"అత డిక్కడ లేడు. విదేశాలలో ఉన్నాడు. అతడు రాగానే ఇవ్వాలి. అసలు నాకు ఈ లోపలే ఇవ్వాలని వుంది. అతడి తల్లి ఈ దేశములోనే వుంది ఆమెకే చెప్పి ఇవ్వాలనుకుంటున్నాను."

"పోనీ___అతడి తల్లెవరో నాకు చెప్పండి. నేను వెళ్ళి ఇస్తాను."

"నీ విస్తానంటావా? భ్రమరా. నాకేదో అనారోగ్యంగా ఉందనుకొని అన్ని వ్యవహారాలలో నీవు జోక్యము కలిగించుకుంటుంటే పోనీలే అని ఊరుకున్నాను. ఈ విషయంలో నీకు ప్రమేయంలేదు."

"ఎట్లాగండీ మీతో? నాకేం ప్రమేయం లేదంటారు? మీరు చెప్పేది సరియైంది అవునో కాదో నాకు తెలియాలా, వద్దా?"

"అయితే నాకు మతిభ్రమించిందంటావా? పిచ్చివాడి నంటావా నన్ను?" గుడ్లురిమి చూశాడు.

"ఆ మాట నేననలేదు. అన్నీ మీలో మీరే అనుకుంటారు. నా మీద అరుస్తారు. నా కవతల పనుంది. మళ్ళీ వస్తాలెండి" వచ్చినంత వేగంగా వెళ్ళిపోయింది.

నారాయణకు చాలా చికాకేసింది. ఏమిటీ అన్యాయం? ఏమిటి తన పరిస్థితి? తన మాట ఎవరూ నమ్మలేనంతగా తన పరిస్థితి దిగజారిపోయిందా? తను తెలియకుండానే భ్రమర చేతిలో చిక్కిపోయాడా? ఎట్లా దీన్ని చక్కదిద్దుకోవటం?

అతడికి తలలో సూదులుగుచ్చినట్లవుతోంది. బాధ—యమబాధ ఇది ఎట్లా తగ్గుతుంది?

కళ్ళు మూసుకుని, తల పట్టుకుని గంటకుపైగా అలా కుర్చీలోనే కూర్చుండి పోయాడు.

ఏడు గంటల సుమారుకు అతడు కళ్లు తెరిచాడు రేడియోలో పాటలూ. వార్తలూ, మాటలూ వరసగా వస్తున్నాయి గట్టిగా చెవులు మూసుకున్నాడు, రేడియో చాలా బిగ్గరగా వినబడుతోంది.

ఆ రాత్రి అతడు గ్లాసెడు పాలు తాగి పడుకున్నాడు. ఎవరితో మాట్లాడ కుండా ముఖం పక్కకు తిప్పుకునే ఉన్నాడు.

భ్రమర అతడిని ఎక్కువగా మాట్లాడించకుండానే పది రోజులు గడిపింది.

# 8

మామూలుగా వచ్చినట్టే వచ్చాడు సుందరం. అతడికి నారాయణను చూస్తే చాలా ఆశ్చర్యం కలిగింది. అదివరకుమాదిరిగా సుందరంతో కల్పించుకుని మాట మీద మాట ఏమీ సాగించలేదు. మౌనంగా కనబడ్డాడు. అడిగినదానికి అవును కాదూ అన్న జవాబు చెప్పి కళ్లు వాల్చుకున్నాడు.

సుందరం రాగానే భ్రమరకు ప్రాణం లేచివచ్చినట్లయింది. నారాయణను గురించి చెప్పేద్దామనుకుంది. నారాయణకు తెలిసిన ఆ ఒకతడు సుందరానికితెలుసు నేమోనని అడుగుదామనుకుంది.నారాయణ ఎదురుగా అడగటమా లేక రహస్యంగా అడగటమా అని ఆలోచిస్తోంది.

"ఏమిటి మీరిద్దరూ ఇవాళ ఇలా మౌనంగా ఉన్నారు? ఎక్కడికయినా వెళ్దామనుకుని ప్రోగ్రాం వేసుకున్నారా? నేను ఊరికే చూద్దామని వచ్చాను? నాకేం పనిలేదు వెళ్తాను" అంటూ లేచాడు సుందరం.

"అయ్యయ్యో! కూర్చోండి మాకేం ప్రోగ్రాంలున్నాయని ఇప్పుడు? ఆ రోజులు గడిచిపోయాయి. మీరు వచ్చి నాలుగు కబుర్లు చెబుతున్నంతసేపే మాకు సంతోషం మీరు వెళ్ళాక ఎడ ముఖం పెడ మొఖము. ఎవరి గదుల్లో వాళ్ళు ఉండటం తప్ప మంచీ చెడ్డా మాట్లాడుకుని కులాసాగా గడిపి ఎంత కాలమైందో?"

కళ్ళు బాగా పైకెత్తి ఆమె ముఖములోకి చూశాడు నారాయణ.

ఆమె ఆ చూపుల కాగలేక తల తిప్పుకుంది.

"నారాయణా. ఇప్పుడు కొంచెము బాగానే ఉన్నట్టు కనబడుతున్నావు. మెడికల్ రిపోర్టుతో డ్యూటీలో జాయిన్ అయిపోకూడదూ? ఇంట్లో ఏం తోస్తుంది నీకు. అలా కుర్చీలో కదలకుండా కూర్చుని పనిచేసే వాడికి? నీకెంత చేతనయితే అంతే చెయ్యి. మీ మేనేజరుతో చెప్పు."

సుందరం వంక ఒకసారి చూసి క్రాపు సవరించుకున్నాడు నారాయణ.

"నీకు సందేహంగా ఉంటే నేను వెళ్ళి చెప్తాను. ఏమంటావు?"

సరే అన్నట్టు చూశాడు నారాయణ.

భ్రమర సందేహించింది. "సుందరంగారూ తొందర పడకండి. డ్యూటీలో జాయినవటానికి ముందు ఏ డాక్టరుకయినా చూపించండి. ఆయన సర్టిఫై చేస్తే ఆఫీసుకు పంపండి. లేకపోతే కష్టం" అని తను చెప్పదలచుకున్నది చెప్పాలనే నిశ్చయించుకుంది.

"ఏం కష్టం! అయినా డాక్టర్‌కి చూపిద్దాం దాన్దేముంది? ఎప్పుడో చెప్పండి ఆనాటికి నేనూ వస్తాను."

"వస్తాను. నేను ఇంక ఇంట్లో ఉండలేను. డాక్టర్‌తో నాకే జబ్బూలేదని చెప్తాను. సుందరం నీవు ఏర్పాటుచెయ్యి మనిద్దరం వెళ్దాం" నారాయణ లేచి నిలబడ్డాడు

"ఆయనను కాసేపు ఉండనియ్యండి. ఆయన కిప్పుడు ఏమీ పనిలేదట'" భ్రమర నారాయణ ముఖం చూసి బంకింది.

"అతడిని పంపించెయ్యటానికి నేను లేవలేదు. చల్ల నీళ్ళతో ముఖం కడుక్కోవాలని లేచాను. సుందరం వెళ్ళకు" నారాయణ నీళ్ళగదిలోకి వెళ్ళి ముఖం, కాళ్లచేతులూ కడుక్కొని తుడుచుకుంటూ అక్కడకు వచ్చాడు.

ఈలోపల భ్రమర అవకాశాన్ని జారవిడుచుకోకుండా ఉపయోగించుకుంది.

"మీకేమయినా తెలుసా ? ఎవరండీ విదేశాలకు వెళ్ళిన మిత్రుడు ? అంత కావలసిన వాడా ?" ఆరాతియ్యటం మొదలు పెట్టింది భ్రమర

"నారాయణను గురించినదంతా నాకు తెలుసు ననుకున్నారా ? అయినా కొంచెం ఆలోచించాలి ఆలోచిస్తే ఏమయినా జ్ఞాపకం వస్తుందేమో. నాలుగు రోజులు టైమిస్తారా ?" అన్నాడు ఎటో చూస్తూ సుందరం.

"పాతికవేలు దాచి పెట్టాడని అంటున్నారు. ఆయన మాటలు నమ్మి పాతికవేలూ చేతికిమ్మంటారా ? కొడుకు ఇక్కడ లేడు. కనుక ఆయన తల్లికి ఇస్తానంటారు. ఎంత నిజమో తెలియదు. మీరు నమ్ముతారో నమ్మరో ? డబ్బు విషయంలో ఎప్పుడూ ఇంతఖచ్చితంగా మాట్లాడనిమనిషి మొన్ననిలదీసిఅడిగారు."

నారాయణ మనసులో ఏదో సంచలనం చెలరేగుతున్నట్టు సుందరం కని పెట్టాడు. దానికి ఆనాటి ప్రవర్తనే పట్టిస్తున్నది. సుందరం మాట్లాడక ముందే నారాయణ వచ్చాడు.

"నారాయణా ఇవాళ నీవు మామూలుగా మాట్లాడడం లేదు. నేను మొన్న వచ్చినప్పుడు ఏదో నా నోటికి వచ్చినట్టు మాట్లాడాను. అందుకని నీకు కోపంగాని రాలేదు కదా ? నీవు క్షమించాలి. సాధారణంగా నేను తూకం తప్పి మాట్లాడను కాని-ఏమిటో-ఆనాడు తాగినవాడు మాట్లాడినట్లు మాట్లాడాను. కాదు – కాదు వాగాను. నీ మనసు నొప్పించాను" సుందరం నారాయణ చేతులు రెండూ పట్టు కున్నాడు.

నారాయణ కళ్ళల్లో నీటి పొర తేలియాడింది. "ఉన్న మాటన్నావు. నా కళ్లు తెరిపించావు" అని అనాలని ఉంది. మనసు కూడా అనమని మారాం చేసింది. కాని – ఎంత ప్రయత్నించినా నోట్లోంచి మాట పెగల్లేదు.

కళ్లు ఒప్పగించినట్లుగా చూశాడు.

"నారాయణా. చూడు నీ ఆరోగ్యం ఎలా ఉందో పరీక్ష చేసుకో. నాతో ఈ రోడ్ మలుపు వరకూ నడవగలవా ? ప్రయత్నించి చూడు" ప్రోత్సహించాడు సుందరం.

"ఊఁ హూఁ. నడవలేను" తల తిప్పాడు నారాయణ.

"అది కాదయ్యా నడవలేను, నడవలేవని కూర్చుంటే కాళ్ళు మోర్లు కట్టుకుపోతాయి. ప్రయత్నించటంలో తప్పేముంది ? ఎక్కడ నడవలేకపోతే అక్కడ రిక్షా తీసుకుందాము. నీవు ఒక్కడివే ఈ ప్రయత్నం ఎలాగూ చెయ్యలేవు. నేను తోడున్నాగా రా."

"సుందరం. ఇవాళ్టికి నన్ను వదిలిపెట్టు."

"వదిలి పెట్టను. ఇవాళే నీవు కాస్తబాగున్నట్టు కనిపిస్తున్నావు. నా చెయ్యి పట్టుకు నడు."

నారాయణ కాళ్ళకు చెప్పులు వేసుకుని బయలుదేరాడు. గడప వరకూ వెళ్ళిన తరువాత "భ్రమరా! నా శక్తిని సుందరం పరీక్ష చేస్తున్నాడు. వెళ్తున్నాను" అంటూ సుందరం చెయ్యిపట్టుకున్నాడు. నాలుగడుగులు సుందరం మీద బరువంతా వేసి నడిచాడు, తరువాత మెల్లగా తనే అడుగులు వెయ్యడం మొదలుపెట్టాడు. వీధి మలుపు తిరిగిన తరువాత నూరు గజాల దూరంలో ఒక చిన్న పార్కు ఉంది. అక్కడివరకూ మెల్లగా తనంతట తానే నడిచాడు నారాయణ.

పార్కులో గాంధీ బొమ్మకు దగ్గరగా ఉన్న సిమెంటు బెంచీ మీద కూర్చున్నారు.

"నారాయణా ఎట్లా ఉంది ?" అతడి భుజం తట్టి అడిగాడు సుందరం.

"ఈ మధ్య నడక అలవాటు లేదు కదూ ? కాస్త అలసటగా ఉంది. అంతే" అన్నాడు ముఖాన్ని జేబురుమాలతో తుడుచుకుంటూ.

"కూర్చుని అలసట తీర్చుకో. నేనిప్పుడే వస్తా" అంటూ వెళ్ళిన సుందరం పది నిమిషాలలో రెండు కోకోకోలాలతో వేయించిన వేరుసెనగ కాయలతో తిరిగి వచ్చాడు.

"నారాయణా, ఈ డ్రింకుతీసుకో, నీకిష్టమైన వేరుసెనక్కాయలు ఒలుచుకు తిందాం రా" అతడి చేతికి ఒక కోకోకోలా ఇచ్చాడు.

కొంతసేపటికి నారాయణ తేరుకుని "ఇదంతా ఏమిటి సుందరం ? నాకు ఇక్కడ ఈ సత్కారాలేమిటి ?" అన్నాడు వేరుసెనక్కాయలు ఒలుస్తూ.

"ఇవి తింటూ నాకు జవాబు చెప్పు. నీ మిత్రులెవరో విదేశాలలో ఉన్నారన్నావట భ్రమరతో, ఎవరాయన ? నాకూ తెలుసా ఆయన ?"

నారాయణ శూన్యంలోకి చూడటం తప్ప నోరు విప్పలేదు.

మరో ఐదు నిముషాలకు సుందరం మళ్ళీ అడిగాడు. "ఆయన తల్లి ఇక్కడే ఉంది. పాతికవేలకు చెక్కు ఇస్తానన్నావట. ఇంతవరకూ నాకు చెప్పలేదేం. ఆ పాతికవేల సమాచారమేమిటో కాస్త చెప్పు" నారాయణ ముఖంలోకిచూశాడు.

"పప్పులిచ్చావు కదా ? తిననీ కాస్త."

"తింటే చెబుతావా ? ఇవి తింటుంటే నీకేమయినా జ్ఞాపకం వస్తోందా ? బాగా జ్ఞాపకం తెచ్చుకో." పప్పులు తిని చేతులు దులుపుకున్నాడు నారాయణ.

"నారాయణా డ్యూటీలో జాయినవుతావా ? మొదటిరోజు నేను వెంబడి ఉండి తీసుకువెళ్ళనా ? ఎప్పుడు రాను ?"

"సుందరం. మొన్న వచ్చినప్పుడు మీ బంధువులెవరో ఇంట్లో ఉన్నారన్నావు. కాస్త నయంగా ఉందా ఆమెకు ? నీవు అటూ ఇటూ ఆదుర్దాగా తిరుగుతున్నావు ? నిజంగా స్నేహితులే ఆప్తుల కంటె ఎక్కువగా తోడ్పడతారని అంటారు. నీవు నిజంచేసి చూపిస్తున్నావు."

"సర్లే నేనేం చేస్తున్నానని ? ఏం చేయగలనని ? ఏదో ఉబుసుపోక ఇటూ ఆటూ తిరగటం తప్ప ? అయితే నీవు పెట్టిన సెలవు ఎన్ని నెలలకు ? ఎంత అయింది ? వివరాలు చెప్పు ?"

"సెలవా ?" నవ్వాడు నారాయణ తేలిగ్గా. "మొదట నెల పెట్టాను. ఆ తరువాత ఆరునెలలు చేశాను. పదిహేను రోజులలో అదీ అయిపోతుంది.. ఇప్పుడు చేరిపోదామనే ఉంది. కాని...."

"కాని? ఏం? ధైర్యం లేదా? చూడు ఇవాళ నడవటానికి మొదట అధైర్యపడ్డావా? తరువాత నీవే నడవగలిగావా? అలాగే అడుగుపెట్టగానే ధైర్యం రాదు. క్రమంగా వస్తుంది."

"అయితే ఒక పని చేద్దాం. ఇలాగ నన్ను ఇక్కడికి వారం రోజులు తీసుకువస్తూ ఉండు, బాహ్య ప్రపంచంలో అడుగుపెట్టితే నాకు మనసు కొంచెం తేరుకున్నట్టుగా ఉంది సుందరం. నాకీ సహాయం చెయ్యలేవా?" అర్థించాడు నారాయణ.

"మా బాగుంది నీ సలహా. రోజూ పని చెడగొట్టుకుని నీ దగ్గరికి రానా? మీ మీ చుట్టూ తిరుగుతూ ఉంటే నా యిల్లూ వాకిలీ ఏంగాను?" తల పక్కకు తిప్పుకున్నాడు సుందరం.

తన స్వభావానికి విరుద్ధంగా బ్రతిమిలాడాడు నారాయణ. అంతకు మించి కాళ్ళా వేళ్ళా పడలేకపోయాడు. ఒకసారి వచ్చాడు కదా అని మళ్ళీ రమ్మన్నాడే గాని రాకపోతే ఏం చెయ్యగలడు?

అరగంట సేపు అలాగే కూర్చున్నారు.

సుందరం మీనాక్షిని గురించి ఆలోచిస్తున్నాడు. ఆ ఉదయమే ఊరికి వెళ్ళింది డ్యూటీలో జాయినవుతానని. పాపం ఆత్మబలమేగాని దేహంలో బలం లేదు. డాక్టరయితే వెంటనే ఆపరేషన్ చెయ్యాలన్నాడు కాని ధైర్యమివ్వలేనన్నాడు. నళిని మీద ప్రాణాలు పెట్టుకుని బ్రతుకుతోంది మీనాక్షి. ఆమె కొడుకు లేనప్పుడు ఆపరేషన్ చేయించేటంతటి ధైర్యము తనకు లేదు. అంత సాహసించ లేదు. వెళ్ళనైతే వెళ్ళింది కాని ఎన్నాళ్ళు పని చేయగలుగుతుందో ఎవరూ చెప్ప లేరు సుందరం ముఖం విచారంతో క్రుంగినట్లనిపిస్తోంది.

"నారాయణా ఏమిటి సంగతి? అలా మాట్లాడకుండా కూర్చున్నావేమయ్యా బెల్లంకొట్టిన రాయిలాగ?"

నారాయణ గొంతుసవరించుకున్నాడు ఏదోమాట్లాడాలని. పెదవులు కదిలించబోయాడు.

"సుందరం! కొందరు మనసులో ఉన్నదంతా సులభంగా చెప్పెయ్యగలరు. చెప్పటానికి మాటలు కరువుకావు. కాని నేను అట్లా చెప్పలేను. చెప్పాలంటే దొరకవు. అసలు ఎలా చెప్పాలో తెలియదు నా మనసులో ఉన్నదేమిటో నేను ఇది అని నిర్ధారణ చేసుకోలేకుండా ఉన్నాను. సుందరం నా బాధను అర్థం చేసుకుంటావు కదూ ?"

ఊఁ అని దీర్ఘంగా మూలిగాడు సుందరం.

ఆ పార్కులోకి జనం వస్తున్నారు-వెళ్లుతున్నారు. అప్పుడప్పుడే చీకట్లు అలుముకుంటున్నట్టుగా ఉన్నాయి.

ఒక్కసారి తళుక్కు మన్నట్లయి ఇద్దరు తలలెత్తి చూశారు పార్కులో ట్యూబులైట్లు రెండూ రెండు మూలలా వెలిగాయి అంతటా వెలుగు ఆవరించుకున్నది.

"నారాయణా లే పోదాం. నాకు మందుల షాపుకు వెళ్ళే పని ఉంది. చూసి పోదామని వచ్చాను. చాలా ఆలస్యమయిపోయింది."

మాట్లాడకుండా నారాయణ లేచాడు. సుందరం తలవంచుకుని నడుస్తుంటే అతనిని అనుసరించాడు.

"ఇంటికి వెళ్ళు. సందు మొదటికి వచ్చాం కదా ? జన సమర్దం తగ్గింది. వెళ్ళి చన్నీళ్ళతో ముఖం కడుక్కుని అన్నం తిని పడుకో. హాయిగా నిద్రపో. తెల్లవారి చాలా తేలిగ్గా ఉంటుంది. చురుకుగా ఉంటుంది" గబగబా అడుగులు వేసుకుంటూ రోడ్డుమీద నడక సాగించాడు సుందరం.

సుందరం వెళ్ళిపోగానే నారాయణకు కాళ్లల్లో సత్తువ తగ్గినట్లనిపించింది. కాళ్ళీడుస్తూ ఇంటివరకూ నడిచి గుమ్మంలో చతికిలపడ్డాడు నారాయణ.

క్రమర భాస్కర్ ఇంట్లో ఏదో వాదులాడుకుంటున్నారు.

"నాన్న వచ్చేవరకూ ఆగుతానమ్మా! నాకేం తొందరలేదు భోజనానికి" అంటున్నాడు భాస్కర్.

"ఆయనతో నీకేం వంతురా ? మతిలేని ఆయనతో వంతు పెట్టుకుంటివా రేపటికయినా తెమలవు నీవు అన్నం తిని బాగా చదువుకో. ఫస్టురాంకు రావాలి. ఏమనుకుంటున్నావో ?" బెదిరిస్తోంది భ్రమర.

"అమ్మా నాన్నను నీవేమయినా అంటే ఊరుకోను. నన్ను నాన్న దగ్గరకు వెళ్ళనీయవు. నాన్నతో అన్నం తిననీయవు. నాన్నతో మాట్లాడనీయవు. ఎందుకని ?" అరుస్తున్నాడు భాస్కర్.

"ఆయనతో ఏం మాట్లాడుతావురా ? నీ చదువూ, నీ స్కూలూ చూసుకోక?"

"నేను మాట్లాడుతా. ఇదివరకు మాదిరిగా నేను నాన్నతోనే పాఠాలు చెప్పించుకుంటా !"

"నేను చెబుతున్నానుగా ? ఇప్పుడు నాన్న పాఠాలు చెప్పలేరు."

"నీవు బాగా చెప్పలేవు. నాన్న చెప్పినట్టుగా ఉండదు నీవు చెబితే."

"ఈ మొండితనమే నేను వద్దనేది. వేలెడు లేవు. మాటలకు మాట బదులు చెబుతావా ?"

విసుగు పుట్టిన భ్రమర భాస్కర్ నెత్తిమీద రెండు దెబ్బలు వేసింది దాంతో భాస్కర్ కప్పు ఎగిరి పోయేటట్టు ఏడవటం మొదలుపెట్టాడు.

"ఏడువు బాగా. ఒక పిచ్చివాడికి తోడు మరొక పిచ్చివాడు. అబ్బబ్బ బుర్రంతా పాడయిపోతున్నది ఈ పిచ్చి మేళంతో" తలపట్టుకుని కుర్చీలో కూర్చుంది.

నారాయణ గుండె గతుక్కుమన్నది. తను అందరికీ పిచ్చివాడిగా కనబడు తున్నాడా ? పిచ్చివాడికింద జమకట్టింది కనుకనే భ్రమర డబ్బంతా చేత చిక్కించుకున్నది. ఇప్పుడామె పట్టెడన్నం పెడితే తినాలి. లేకపోతే అలా ఎదురు చూస్తూ కూర్చోవాలి.

అవును భ్రమరదేం తప్పు ?

తప్పంతా తనదే. ఇదంతా తను చేతులారా చేసుకున్నదే. ఒకరిని అని ఏం లాభం ?

మెల్లగా లేచి చెప్పులు చప్పుడు కాకుండా తన మంచం దగ్గరికి చేరుకున్నాడు అప్పటికి భ్రమర వంట యింట్లో ఏదో పని చేసుకుంటోంది భాస్కర్ తండ్రి లోపలికి రావటం చూశాడు.

రెండు పుస్తకాలూ పెన్సిల్ తీసికొని నారాయణ మంచం దగ్గర నిలబడి స్విచ్ నొక్కాడు.

"నాయనా, ఇక్కడ బల్బులేదు నీకేం కావాలి?" అన్నాడు నారాయణ మెల్లగా.

"అయ్యో నీ మంచం దగ్గర బల్బు లేదా? కాలిపోయిందా?"

"కాలి పోలేదు బాబూ. అసలు బల్బేలేదు."

"నేను తెచ్చి పెడతా ఉండు" అంటూ తల్లి దగ్గరికి పరుగెత్తాడు.

"అక్కడ బల్బ ఎందుకురా? లైటుంటే ఆయన తెల్లవార్లూ నిద్రపోరు. అయినా నీకెంటికాయన సంగతి?" కేకలు పెట్టింది భ్రమర.

"ఇవాళ నేను నాన్నచేత పాఠం చెప్పించుకోవాలి. మంచి మార్కులు రావాలంటే నాన్నే పాఠం చెప్పాలి. లేకపోతే నేను చదువుకోను."

"అయితే ఏమంటావురా ఇప్పుడు?"

"బాగా కనబడేటట్టుగా మంచి బల్బు పెట్టు. నేను చదువుకుంటాను."

విసుక్కుంటూ కసురుకుంటూ భ్రమర బల్బు తెచ్చి పెట్టింది.

దీపం వెలగగానే నారాయణ కళ్ళు నులుపుకుంటూ లేచి కూర్చున్నాడు.

"మీరెప్పుడొచ్చారు?" అన్నది భ్రమర జంకుతూ.

"నేను బాగా చీకటి పడకముందే వచ్చాను" అన్నాడు.

"ఇందాక నేను చూస్తే మంచంమీద లేరుగా?"

"మంచంమీద లేనుగాని గుమ్మంలో కూర్చున్నాను ఇప్పుడే లోపలికి వచ్చాను. ఏం? అట్లా అడుగుతున్నావు?"

"ఏంలేదు. చీకటి పడుతోంది ఇంకా రాలేదేమని నేను వాకిట్లో నిలబడే ఉన్నాను. ఇప్పుడే వీడు వస్తే చదువుకోమని చెప్పి వంట ఇంట్లోకి వెళ్ళాను."

"వచ్చానుగా, నీ పని చూసుకో."

పట్టుబడిన దానిలా చూసింది భ్రమర.

"నాన్నా. నాకీ పాఠంచెప్పు, పరీక్షలు దగ్గరికి వస్తున్నాయి. బాగా చదివితే గాని మార్కులు బాగారావు" అని తండ్రికెదురుగా కూర్చున్నాడు భాస్కర్.

గంటకు పైగా పాఠం చెప్పించుకున్నాడు.

ఆ రాత్రి చాలాసేపు నారాయణ కంటిమీదికి నిద్రరాలేదు. భ్రమర భాస్కర్ల సంభాషణ చాలా సేపు చెవిలో రొద చేస్తున్నట్లుగా ఉంది.

తక్షణ కర్తవ్యమేమిటి ?

ఇంకా నాలుగు రోజులు ఇలాగే ఉంటే ఇంట్లో నుంచి తరిమివేయనైనా వేస్తుంది. లేక పిచ్చి పట్టిందని హాస్పిటల్లోనైనా చేర్పిస్తుంది.

ఆలోచించి ఆలోచించి మెదడు వేడెక్కినట్లయింది. తెల్లవారుజాము నెప్పుడో కళ్ళు మూతపడ్డాయి.

మరునాడు సాయంత్రము ఐదు గంటలు కాగానే నారాయణ చెప్పులేసుకుని తనంతటతానే బయలుదేరి పార్కు చేరుకున్నాడు. పచ్చికమీద కూచుని అక్కడ చేరిన వారందరినీ చూస్తూ కాలక్షేపం చేశాడు.

ఆనాటికిక సుందరం రాడని నిశ్చయించుకున్నాడు. తానొక్కడూ కూర్చున్నా కాలక్షేపం బాగానే అయింది. పిల్లలు ఆడుకుంటూ కేరింతలు కొడుతున్నారు. పెద్దలు గుంపులు గుంపులుగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

చీకటి పడకముందే ఇల్లు చేరుకోవాలని నారాయణ లేవబోతుండగా సుందరం వచ్చి నాలుగు ప్రక్కలా నారాయణకోసం చూశాడు. ఒక్కడూ మోకాళ్ళ చుట్టూ చేతులు వేసుకుని తోట ఏంక చూస్తున్నాడు నారాయణ.

అతడిని చూసి తల పంకించాడు సుందరం. తన కోసం చూడకుండా ఒక్కడే వచ్చాడు. వరవాలేదు. దారిన పడుతున్నాడనుకుంటూ "నారాయణా ! ఎంత సేపయింది వచ్చి ?" అతడి ప్రక్కనే కూర్చున్నాడు.

"చాలా సేపయింది. ఇంక ఇంటికి వెళ్దామనుకుంటున్నాను."

"కొంచెం బయటి ప్రపంచం చూస్తే మనసుకు ఉల్లాసం కలగడంలేదూ?"

నారాయణ కళ్ళతోనే నవ్వాడు.

అతడినవ్వుతో కలిపి సుందరం కూడా నవ్వుతూ "నోటితో ఒప్పుకోకపోతే పోనీలే గాని-ఉన్నమాట ఒకటి చెబుతాను. కొన్ని కొన్ని జబ్బులు మనమే కుదుర్చుకోవచ్చు-డాక్టర్ల ప్రమేయం లేకుండా. ఏమంటావు?" నారాయణ కళ్ళ లోకి చూశాడు.

"కాదనను. కాని...."

"జబ్బుకు మూలమేదో తెలియాలంటావు. అంతేనా?" ఇద్దరూ ఇలా మాట్లాడుకుంటూ ఉండగా ఉన్నట్టుండి పెద్దపెద్ద చినుకులుపడ్డాయి. జనమంతా గుంపులుగా లేచి పరుగెత్తారు.

"మనం కూడా వెళ్దామా నారాయణా నీ తలంతా తడిసిపోతుంది. అసలే మూలుగుతున్నావు. రా. గేటు దగ్గర చెట్టు క్రింద నిలబడదాము, ఇంత పెద్దపెద్ద చినుకులు చాలా సేపు నిలవవు. రా" నారాయణ చెయ్యి పట్టుకుని చెట్టు కిందకి తీసుకువెళ్ళాడు. అక్కడ వీళ్ళతోపాటే వేరుసెనక్కాయలమ్మే అతడు గంపతో నిలబడి ఉన్నాడు.

"బాబూ, పప్పులు పొట్లాం కట్టి ఇమ్మన్నారా?" ముఖంమీద పడిన చినుకులు పంచెతో తుడుచుకుంటూ అడిగాడు.

"ఇవాళ కాయలు కాకుండా పప్పులు తెచ్చావా?" అడిగాడు సుందరం.

"అవును బాబూ. కాస్త ఉప్పు కూడా చిలకరించాను." రెండు పొట్లాలు తీసి సుందరం చేతి కిచ్చాడు.

నారాయణ మామూలుగా జేబు తడుముకున్నాడు. అవును తనీమధ్య పర్సు జేబులో పెట్టుకోవడంలేదు. అయినా పర్సులో ఏముంటోంది ఇప్పుడు ?

అతడికి ఆ పప్పులు నోట్లో వేసుకుని నమలాలని ఉంది. హుం. ఏం గతి పట్టింది తనకు ?

"నారాయణా. ఏమిటాలోచిస్తున్నావు ? చినుకులు తగ్గిపోతున్నాయి. ఇంటికి వెళ్దాం. ఈలోపల ఈపప్పులు నోట్లో వేసుకో. కమ్మగా ఉంటాయి" ఒకపొట్లాం చేతికిచ్చాడు

సుందరం వేరుసెనగపప్పు పొట్లాలు జేబులోంచి తీసి డబ్బివ్వటం ఓరకంట చూశాడు నారాయణ.

"నీకు ఎన్ని విధాలుగా ఋణపడి ఉన్నాను సుందరం ?" దైన్యంతో అన్నాడు నారాయణ.

"నీవు డ్యూటీలో జాయిన్ కావటం ఏమైంది నారాయణా ? ఏమాలోచించావు ?"

"సుందరం ఎంతో ప్రయత్నించి ఈ కాస్తయినా పాదం బైటపెట్ట గలిగాను కాని డ్యూటీలో జాయిన్ కావటం మాత్రం నా చేతనయేటట్టులేదు. సాహసించలేను "

ఐదు నిమిషాల తరువాత ఇద్దరు పార్కుగేటు దాటి బయటకు వచ్చారు. రోడ్డు సందు ముందర ఇద్దరూ బైబై అనుకుంటూ విడిపోయారు.

మరునాడు నారాయణ పార్కుకు వెళ్ళలేకపోయాడు ఆలోచనలలో మునిగి.

మూడోనాడు లోకల్ పోస్టులో నారాయణకొక ఉత్తరం వచ్చింది. తన కెవరు ఉత్తరం రాస్తారు అనుకుంటూ నారాయణ ఉత్తరం చింపాడు.

"నారాయణా.

నీవు నిన్న పార్కుకు రాలేదు. ఈ మధ్య నీ జబ్బు నయమవుతుందన్న ఆశ కలిగింది. నిన్ను కబుర్లలో యిరికించి నీది డాక్టర్లు కుదిర్చే జబ్బుకాదని స్పష్టం చేశాను. నీవు గ్రహించినట్టులేదు.

నీ జబ్బేమిటో నాకు తెలుసు. నీకు అనుమానం జబ్బు. కల్మషమెరుగని మీనాక్షిని అనుమానించి హింసించావు. ఆమెను పసివాడితో ఇల్లు వదిలేటట్లు చేశావు. కన్నబిడ్డను అగచాట్ల పాలుచేసి భ్రమరను పెళ్ళిచేసుకుని, పరాయి బిడ్డకు ఏలోటూ రాకుండా కాపాడుతున్నావు. మీనాక్షి మీద అనుమానం ఇప్పుడిప్పుడే నీలోనుంచి పోతోందనుకుంటే భ్రమర మీద అనుమానం నీలో పుట్టుకొస్తోంది.

నీవు మీనాక్షిని కేవలం అనుమానించావని తెలుసుకోగానే నీలో మందులకు లొంగని జబ్బు ప్రవేశించింది. నీవు మానసికంగా అర్భకుడివే కాదు-పిరికి వాడివి. అంత జబ్బుతో తీసుకుంటూ కూడా మీనాక్షి వెళ్ళి డ్యూటీలో జాయినయింది. కడుపులో అంత దిగులు ఉన్నా తన కర్తవ్యాన్ని ఏమారకుండా నిర్వహించు కుంటున్నది. ఆమెకు ధైర్యముంది.

నీవేం చేశావు ? ఎదిగిన కొడుకును విమానాశ్రయంలో చూసి ఉలిక్కి-పడ్డావు. అతడికేమీ చేయలేకపోయానని బాధపడుతున్నావు కాని-మీనాక్షికి నీలో కలిగిన పశ్చాత్తాపాన్ని తెలుపుతూ ఒక ఉత్తరం రాయలేకపోయావు. నీలో అహం ఇంకా చావలేదు అనుకోనా ? ఇంకా అసూయ రగులుతున్నదనే అనుకోనా? నీలో ఇంకా చావని అహం అసూయలు ఒక వైపు నుంచి మరొక వైపుకు మళ్ళా యనుకోనా పోనీ ?

ఏది ఏమయినా గతం మరిచిపోయి ఆఫీసుకు వెళ్ళి డ్యూటీలో జాయిన్ఆవు.
పోనీ నాతో రావద్దులే. వస్తే అది నీకు ఓటమి అనుకుంటావేమో.
నీ పాత్రను తోమి తోమి మెరుగుపెడదామని చూసి ఓడిపోయిన

సుందరం''

ఉత్తరం చదువుకుని డీలాపడిపోయాడు నారాయణ కొండంత నిస్సత్తువ ఒంట్లో ప్రవేశించినట్లయింది. కిందపడిన తువాల తీసి బుజమ్మీద వేసుకుని ఉత్తరం మడిచేసి పక్క-కింద పెట్టుకున్నాడు. ఆకలిగొన్న పులిలా జుట్టు పీక్కుంటూ ఆవరండాలో ఇటూ అటూ పచార్లు చేయటం మొదలుపెట్టాడు వెలుగు చూడలేని నారాయణ

(పుస్తక ప్రపంచం)



# సింగిల్స్ - మింగిల్స్ - మ్యారీడ్

ఆచతుష్పథం చాలా రద్దీగా ఉంటుంది.

ఆ నగరంలో నాలుగుమూలలా ఉన్న దుకాణాలన్నీ ఆ చతుష్పథంలో పెద్ద దుకాణాల బ్రాంచీలు, నగరంలోఉన్న ముఖ్యమైన ఆఫీసులన్నీ ఆ చతుష్పథానికి అరఫర్లాంగు దూరంలో ఉన్నాయి. అందుకని చాలామంది అద్దెలు ఎక్కువగా ఉన్నా ఆ సమీపంలో ఉండాలని ఆరాటపడతారు. ఈ కారణాలచేత ఆ చుట్టుపక్కల ఇళ్ళకు పగ్డీ ఎక్కువ. అందులోనూ చమన్‌లాల్ కట్టిన సుకన్యా బిల్డింగ్ నాలుగంతస్తులది. అత్యంతాధునికంగా ఉండటమే కాదు అతడికి దానివల్లనే ఎంతో ఆదాయం కూడా వస్తున్నది. ఇళ్ళు మారేవాళ్ళు పగ్డీలను విపరీతంగా సంపాదిస్తున్నారు.

చమన్‌లాల్ బిల్డింగ్స్ నాలుగు పక్కలా కట్టి మధ్య స్థలం వదిలిపెట్టి చిన్న తోటలా చేశాడు. నాలుగు పక్కలా కట్టిన భాగాలలో ఒక భాగం కేవలం సంసార తాపత్రయంలేని బ్రహ్మచారుల కొరకు. రెండవవైపు ఇద్దరికి సరిపోయేటట్లు కట్టాడు. మూడవ వైపు ఇద్దరు ముగ్గురు పిల్లలతో ఉండటానికి వీలుగా ఉంది. నాలుగవ వైపున పెద్ద కాంటీన్ ఉంది. దానిపక్కన బయటికిపోయేదారి, పెద్దగేటు.

నాలుగు అంతస్థుల ఆ బిల్డింగు అత్యంతాధునిక సౌకర్యాలతో ఎంతో అందంగా కళ్ళు జిగేల్‌మనేటట్టుగా ఉంటుంది లేత రంగుల కలగలుపుతో.

ప్రకాశం ఆ వూరికి వస్తున్నాననీ తనకొక గదిచూసి ఎడ్వాన్సు ఇవ్వమనీ తన స్నేహితుడు పాణికి ఉత్తరం రాశాడు.

ఆ నగరంలో అందరికీ తెలుసు చమన్‌లాల్ కట్టిన సుకన్యా బిల్డింగ్స్‌లో తప్పకుండా ఒక గది నాలుగు అంతస్తులలో ఏదో ఒక మూల దొరుకుతుందని.

పాణి ఆ బిల్డింగ్‌లో బ్రహ్మచారుల గదులన్నీ వెతుకున్నాడు. మూడో అంతస్థులో ఇరవైనాలుగో నెంబరు గది ఒకగంటలో ఖాళీ అవుతుందని తెలిసింది. చకచకా మెట్లు ఎక్కుతూ పైకి వెళ్ళాడు.

సామానన్నీ సర్దిపెట్టుకుని రాజారామ్ కుర్చీ మీద కూర్చుని తాపీగా సిగరెటు దమ్ము పీలుస్తున్నాడు.

తలుపు నెట్టుకుని లోపలికి వెళ్ళిన ప్రకాశాన్ని చూడగానే రాజారామ్ కళ్ళు విపరీతంగా మెరిశాయి.

అతడిని కూర్చోమని కుర్చీ చూపించాడు.

''మీరు ఈ గది ఖాళీ చేస్తారని తెలిసి వచ్చాను. మా స్నేహితుడికి గది కావాలి. మీరు దీనికెంత అద్దె ఇస్తున్నారు.'' అడిగాడు పాణి.

తను మర్యాదస్థుడని తెలియటానికి రాజారామ్ అతడికి సిగరెట్ ఆఫర్ చేశాడు.

పాణి చేతితో వద్దని సైగ చేశాడు.

రాజారామ్ ఒకవిధమైన నిర్లక్ష్య భావంతో దిక్కులు చూస్తూ "ఈ గదికి అద్దె నూటఇరవై. కాని పగ్డీ మాత్రం పదిహేను వందలు నే నిచ్చాను. రెండు వేలు నేను పుచ్చుకుంటాను''. నిర్లక్ష్యంగా చెత్త బకెట్‌లోకి సిగరెట్ ముక్క విసిరి వేశాడు.

రెండు వేలే? ప్రకాశం ఏమిచ్చుకో గలడు? ఆలోచనలో పడ్డాడు పాణి. అతడి ఉలికిపాటుతో రాజారామ్ కొంచెం కుంగినట్లనిపించాడు.

నాలుగు రోజులయింది సామాను సర్దుకుని. ఏ పూటకాపూట ఎవరయినా రాకపోతారా అని కాళ్ళు కాయలు కాచేలా చూస్తున్నాడు.

"మీరెన్నాళ్ళయింది ఈ వూర్లో ఉండబట్టి? పగ్డీ అంటే వినని వాళ్ళలా అలా చూస్తారేం? నేనింకా నాలుగు రోజులు ఆగితే మరో వెయ్యి వస్తాయి" అన్నాడు రాజారామ్.

ప్రకాశం పని మీద ఆవూరు వస్తున్నాడు. ఎంతయినాపెట్టి గది తీసుకోమన్నాడు. పర్గీ సంగతి కూడా కొద్దిగా సూచించాడు. పాణిగది కోసం తిరిగితిరిగి వేసారిపోయాడు. రెండు రోజుల సెలవుకూడా ఖర్చయింది. రాజురామ్ కోరిన పగ్గీ ఇచ్చి గది తాళం వేసుకుని కౌంటర్‌లో ఆగది ఎడ్వాన్సు అద్దె చెల్లించి ఉత్తరం రాశాడు ప్రకాశానికి.

ప్రకాశం వచ్చిననాడు పాణి ఇంట్లోనే దిగాడు. అతడి భార్య చాలా ఆదరంగా అడిగిఅడిగి భోజనం కాఫ్యాదులు అమర్చింది; ఆ సాయంత్రం ప్రకాశం తనకు ఇన్లు చూపించమన్నాడు.

"ఈ ఒక్క రోజూ మా ఇంట్లో ఉండరా: రేపు సెలవురోజు కనుక మా రాము కూడా వస్తుంది. ఆ బిల్డింగ్ చూడాలని నేను చెప్పినప్పటి నుంచీ ఆత్రపడుతోంది" అని ఆ నాటికి ఆపేశాడు.

మరునాడు ఉదయం ఉర్లగడ్డ కూరతో దోసెపెట్టి, రమామణి—స్ట్రాంగ్ కాఫీ ఇచ్చింది. ఘుమఘుమలాడే వక్కపొడి ఇచ్చింది. ముగ్గురూ బయలుదేరారు.

సుకన్యా బిల్డింగ్సూ, దాని మధ్యలానూ, అక్కడక్కడ పూల మొక్కలూ రమామణిని బాగా ఆకర్షించాయి. బారులు తీర్చిన గదులూ. వాటి ముందు వరండా ఎంతో వచ్చింది.

"అట్లా దిక్కులు చూస్తూ వెర్రిదానిలా నిలబడిపోతావేం? ఇలా అయితే పన్నెండు గంటలవుతుంది పూర్తిగా బిల్డింగ్ అంతా చూసేసరికి' పాణి రమామణిని ఎగతాళి చేశాడు.

"వస్తున్నా పదండి" అంటూ వాళ్ళ కంటె ముందడుగు వేసింది—ఏదీ సరిగా చూడనివ్వరనుకుంటూ.

సింగిల్ రూమ్సులో ఇరవైనాలుగో గది ఆఖరిది. దానిని అంటుకునే లైను పక్కకు తిరుగుతుంది. తరువాత నాలుగు అంతస్తులూ మింగిల్స్‌కోసం కట్టినవి. వాటి తరవాత మారీడ్‌కోసం కట్టిన లైను ప్రారంభమవుతుంది.

ఆ బిల్డింగ్స్ వివరాలన్నీ చెప్తూ రమామణికీ ప్రకాశానికీ చూపిస్తున్నాడు పాణి.

ఈ బిల్డింగ్స్‌లో తనకొక రూమ్ కుదిర్చినందుకు ప్రకాశం ఎంతో సంతోషించాడు అంత పగ్డీ ఇచ్చినా అతడికి "అయ్యో" అనిపించలేదు. గది ఒక్కటే అయినా దానిలో బట్టలు తగిలించుకోవటానికీ. పక్కలు పెట్టుకోవటానికీ ప్రత్యేకమయిన ఏర్పాట్లున్నాయి. ఇవి కాక పుస్తకాలు పెట్టుకునే బీరువాకు తలుపు వాల్చుకొని రాసుకోవచ్చు. పనిఅయిపోయిన తరువాత తలుపు వెయ్యవచ్చు. మొత్తం మీద గది ఖాళీగా కనబడుతుంది. ఒక పక్క తలుపు తెరిస్తే బాత్ రూమ్. దానిలో కూడా అన్నీ ఆధునిక సౌకర్యాలు. ఆ గదికి పెద్దపెద్ద కిటికీలు రెండు ఒకదానికెదురుగా ఒకటి ఉన్నాయి. రయ్యిమంటూ గాలి వస్తుంది లేకపోయినా ఒక సీలింగ్ ఫాన్ ఉండనే ఉంది. గది రంగు రంగుల మొజైక్ ఫ్లోరింగ్‌తో ఎంతో అందంగా ఉంది.

ఆ గదిలో ప్రతి అంగుళమూ పట్టిపట్టి చూసింది రమామణి

"ఈ బిల్డింగ్ మీకిదివరకే తెలుసా?" రమామణి ఒక మంచి సినిమా చూపినంత సంబరంతో అడిగింది పాణిని.

"ఏం అల్లా అడుగుతున్నావు?" అన్నాడు పాణి.

"ఎందుకడుగుతున్నావా? మీకీబిల్డింగ్ ఇంత అందమైనది తెలిసుండే మనకా దరిద్రపుకొంప తీసుకున్నారా? ఆ రెండు గదుల ఇంట్లో సామాను సర్దలేక చస్తున్నాను. నీళ్ళగది అంతదూరాన ఉంది. దానికి ప్రతిరాత్రీ తాళంవెయ్యాలి సరిగ్గా గాలి వెలుతురూ లేక ఒక మాదిరి వాసన" ముక్కు చిట్లిస్తూ అన్నది.

"ఏది చూస్తే అదే బాగుందనే రకం నీవు. నేను ఎంత తిరిగితే ఇది కనబడ్డది? ఎంత డబ్బు పగ్డీగా ఇస్తే దొరికింది? దీని ఒక్కగది అద్దె మన వీధిలో నాలుగు గదుల అద్దె అంత." అన్నాడు పాణి.

మనసు చిన్నబోయినా పైకి నవ్వేంది రమామణి

ప్రకాశరావును ఇక్కడ దిగవిడిచి పాణి. రమామణి ఇంటికి వచ్చారు.

రమామణికి సుకన్యాబిల్డింగ్స్ కళ్ళల్లో మెదులుతున్నాయి ప్రకాశాన్ని ప్రతి చిన్నదానికి విమర్శిస్తోంది. తామున్న ఇంటిని గురించి లోపాలను అతడు ఇంటికి రాగానే ఏకరువు పెడుతోంది ఆమె సంగతి రాజును చూసిన కళ్ళతో ... అన్నట్టుగా ఉంది.

పదిహేను రోజులకు పాణి ఒక్కడే వెళ్ళి ప్రకాశానికి కనబడి వచ్చాడు.

"ఎట్లా ఉంది వాతావరణం? నీకు నచ్చిందా?"

"వాతావరణంతో నాకేం పని? నా పని నేను తలుపు వేసుకుని చేసుకుంటాను" అన్నాడు ప్రకాశం.

అతక్కడ ఉన్నప్పుడే గొల్లున నవ్వులు వినిపించాయి. తలుపులు దబదబ చప్పుడైనట్లుగా శబ్దం, సీసాలు పగిలినట్లు చప్పుళ్ళు—వాగ్యుద్ధాలు భరించరానివిగా అనిపించాయి ప్రకాశానికి.

"అదేమిటి? అట్లా ముఖం పెట్టావేం?" పాణి అడిగాడు.

"అబ్బ. ఈ హోరు, ఈ గోల ఎట్లా భరిస్తున్నావు?"

ప్రకాశం గొల్లుననవ్వాడు. "ఇది బ్రహ్మచారులదని నీవే చెప్పావు. వాళ్ళకేమయినా అడ్డా ఆపా? రాత్రిళ్ళు చూడాలి. బాగా కేకలు పెడతారు. బుడ్లు తెప్పించుకుంటారు. బాగా అల్లరిచేస్తారు. కొందరు అమ్మాయిలను పిలిపించుకుంటారు. పెద్ద రభస చేస్తారు. అటువంటివన్నీ పట్టించుకోకుండానే ఉంటే బ్రహ్మాండంగా ఉంటుంది గది"

"నీకు నచ్చితే సరి. నాదేమిటి? నేను ఏ పది రోజులకో వచ్చి చూసేవాడిని."

"కాఫీ తెప్పించనా? అడిగాడు ప్రకాశం.

"వద్దు. భోజనం వేళయింది. రామూ ఎదురుచూస్తూ ఉంటుంది. ఇవాళ మ్యాటినీ ప్రోగ్రామ్ పెట్టింది." వెళ్ళిపోయాడు పాణి.

రోజులు గడుపుకుంటున్నాడు ప్రకాశం. అప్పుడప్పుడు చీకాకనిపించినా మనసుకు పట్టించుకోవటంలేదు. భరించలేనంతగా చికాకేస్తే బయటికి వచ్చి లాన్‌లో కూర్చుంటున్నాడు.

ఆ రోజు కొంచెం ఆలస్యంగా లేచాడు ప్రకాశం పక్క లైనులోనుంచి అరుపులు వినిపిస్తున్నాయి. ఆడ గొంతు ఒకటి. మగ గొంతు ఒకటి.

"నీవిట్లా చేస్తావనుకోలేదు. డబ్బంతా పదిరోజులకే అయిపోతే మిగతా ఇరవై రోజులు ఏం చేద్దాం ?"

"ఏం చేద్దామా ? సరదాపడి బట్టలు కొనుక్కున్నాను. సంతోషించక అలా చికాకు పడతావేం ?"

"సినిమాలకెంత ఖర్చు చేశావు ? నాతోనే కాకుండా విడిగా ఎన్నిసార్లు వెళ్లావు ? ఇంకా ఎవరెవరితో ?"

"ఓహోహో. అవన్నీ లెక్కలు చెప్పాలా నీకు ? నీవు మాత్రం నీ సిగరెట్టుకు నీ బుడ్లకూ నీ స్నేహితులకు ఎంత ఖర్చయిందో లెక్క చూసుకోవేం ?"

"చూసుకుంటున్నాను. చూసుకునే అడుగుతున్నాను ఈ ఖర్చు నేను భరించరానిది. వచ్చే నెలలో ఇలా జరక్కూడదు."

"అహహా" అని వెక్కిరింపుగా నవ్వు వినబడ్డది.

"చూడు వాళ్ళంతా ఎంత ఒద్దికతో కాపరాలు చేస్తున్నారో ? వాళ్ళ ఇళ్ళల్లో నుంచి ఏదైనా ఒక్కమాట వినబడ్డదా ? అంతమంది ఆడవాళ్ళున్నారు. పిల్లలున్నారు. మగవాళ్లున్నారు. ఎట్లా పద్ధతుని బతుతుకున్నారో చూసి నేర్చుకోవచ్చునే ?"

"శివరామ్ ! వాళ్ళను చూసి నేర్చుకొమ్మంటావా ?" పకాలున నవ్వింది.

"వాళ్ల జీవితాంతమూ కలిసి ఉంటామని పెళ్ళి చేసుకున్న దంపతులు. మగవాడు కొట్టినా తిట్టినా పడిఉంటారు. భయపడుతూ బతుకుతారు. నేను కాంట్రాక్టు మీద వచ్చాను. ఇది ట్రయల్. ఈ ట్రయల్ ఫలిస్తే గదా పెళ్ళయ్యేది? కొడితే తిడితే చీదరించుకుంటే బెదరిస్తే హద్దులు పెడితే నీ కాళ్ళదగ్గర బతికే అథమురాలివి కాను నేను ఆ పేర్రాజు గతి ఏమైంది ? మూడేళ్ళ కాంట్రాక్టు మూడు నెలలయినా సాగలేదు. రమేశ్‌ది పెళ్ళివరకూ వచ్చిందంటే అతడెంత మర్యాదగా నడుచుకున్నాడు ? ఒక్కమాట అని ఎరగడు. రంగ ఎన్ని ఖర్చులు పెట్టేది ? ఎంత మందితో స్నేహం ? ఎంత స్వేచ్ఛ ఇచ్చాడు? సరేలే. మన కింక పడదని తెలిసిపోయింది. ఈ కొద్ది కాలానికే ఇన్ని తగాదాలు నీవు నన్ను మనిషిగా కూడా చూడలేని వాడివి సమానంగా ఏం చూడగలవు ?"

మరికొంత సేపటికి సూట్‌కేసుతో నైలెక్సు చీరె కట్టుకుని రెండు జడల అమ్మాయి చెప్పులు చప్పుడు చేసుకుంటూ గబగబా మెట్లు దిగి వెళ్ళిపోవటం ప్రకాశం చూశాడు.

అతడికి ఆ గొడవేమిటో అర్థం కాలేదు. ఆ గొడవ జరుగుతున్నంత సేపూ మెదడు పని చెయ్యలేదు.

అలా రోజుకొకరూ ఇద్దరూ సూట్‌కేసులు పట్టుకుని వెళ్ళుతునే ఉన్నారు. గొడవలూ రభసలూ జరుగుతునే ఉన్నాయి. కొత్తసూట్ కేసులతో కొత్త అమ్మాయిలు వస్తూనే ఉన్నారు.

మూడో లైనునుంచి ఆడవాళ్ళ ఏడుపులు వినిపించేవి.... ఒకరోజున ఒకాయన పిల్లలను తీసుకుని భార్యను బయటికి వెళ్ళకొట్టాడు. బయట వర్షం రాత్రి కావస్తున్నది. ఆమెకు భయం. ఎవరింటికిపోతే ఆయన అనుమానపడతాడోనన్న భయంతో వణుకుతూంది. ఇదంతా చూస్తూనే ఉన్నాడు ప్రకాశం.

కాని ఏం చెయ్యగలడు?

ఆమెపట్ల జాలి దలిచి ఎటువంటి సహాయం చేసినా ఆయన తనను పట్టుకుని తంతాడు.

ప్రకాశం తనపని చూసుకోలేకపోయాడు. మనసూరుకోక పోయింది. కాళ్ళు చేతులు ఆడలేదు.

అలా కళ్లు ఒప్పగించి చూస్తున్నాడు.

ఒకనాడు ఒక ఇంట్లో తలుపు తాళంవేసి వెళ్ళిపోతున్నాడు ఒక గృహస్థు. అతడు అటు పోగానే ఆ గదిలో నుంచి కిరసనాయిలు వాసన వచ్చింది. అతడు తిరిగి వచ్చేసరికి ఆమె కాలిపోయి ఉన్నది.

ప్రకాశానికి అక్కడికి వచ్చినంత ఉత్సాహం ఇప్పుడు లేదు. ఎప్పుడు ఏ మూల ఏం అఘాయిత్యం జరుగుతుందోనని భయంగానే ఉంది.

ఒకనాడు కిందికి దిగి కాంటీన్‌కు వెళ్ళలేక బాయ్‌చేత కాఫీ టిఫిన్ తెప్పించుకున్నాడు.

"ఇక్కడ ఎప్పుడూ ఇట్లా గొడవలు జరుగుతునే ఉంటాయా?" అడిగాడు ప్రకాశం.

"మీరు కొత్తగా వచ్చారేంటి బాబూ?" నవ్వాడు బాయ్.

"అవునోయ్. రెండు నెలలయింది ఇక్కడికి వచ్చి."

"ఇక్కడ సింగిల్సులో ఎంత గొడవో మింగిల్సులో కూడా అంత గొడవే నండి. ఇంక అ మ్యారీడ్ ఫ్లాట్సులోనండీ-మనం బయటచూసే మామూలు గొడవలేనండి. ఇక్కడికి అప్పుడప్పుడు పోలీసులు కూడా వస్తారండి" అన్నాడు మామూలుగా.

ప్రకాశం ముఖం అదోలా అయిపోవటం బాయ్ గమనించాడు.

"అయితే ఖాళీ చేస్తారేంటండి రూమ్‌ను?"

"నా పని ఇక్కడ సాగటంలేదు. ఇంకెక్కడయినా చూసుకోవాలని ఉంది" అన్నాడు ప్రకాశం.

"చాలామంది తిరిగి పోతున్నారండి రూమ్‌కోసం, పిలుస్తానండి."

"పగ్డీ నేను రెండువే లిచ్చానోయ్. నా శక్తికి మించినది ఇచ్చి వచ్చాను. నాకంత వచ్చినా చాలు."

"మన మెట్టినంత రాదండి, అందులో సగంవస్తే గొప్పండి" తన కమిషన్ చూసుకున్నాడు బాయ్.

"పోనీలే. ఎంతవస్తే అంతేచాలు."

ఆ సాయంత్రమే వెయ్యి రూపాయలు తీసుకుని ఇల్లు ఖాళీచేసి పాణి ఇంటికి పెట్టెతోసహా వెళ్ళి తలుపుకొట్టాడు ప్రకాశం.

రమామణి "రండి రండి" అంటూ లోపలికి వచ్చి కూర్చోమంది. అతడి పెట్టె చూపి ఉలిక్కిపడి సర్దుకుంది.

"పాణిలేడా అండి?" నిలబడే అడిగాడు.

"ఇప్పుడే వస్తానని నన్ను తిట్టుకుంటూ వెళ్ళారు."

"ఎందుకు?"

"నాదే తప్పులెండి బజారునుంచి రాగానే మరిచిపోయిన వస్తువును మళ్ళీ తెమ్మని చెప్పాను. అందుకని వెళ్ళారు. కూర్చోండి."

ప్రకాశం ఒక కుర్చీలో పెట్టె దగ్గరగాపెట్టుకుని కూర్చున్నాడు. ఆమె మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది. ఆలోచిస్తూ మెల్లమెల్లగా తాగుతున్నాడు.

పాణి ఇంట్లో అడుగుపెడుతూనే అతడిని చూసి "ఇదేమిట్రా" అన్నాడు ఆశ్చర్యపడుతూ.

ఏం మాట్లాడలేదు ప్రకాశం.

"పని అయిపోయిందా? ఇంకా మూడు నాలుగు నెలలు పడుతుందని అన్నావుగా?"

"నేను ఇంటికి వెళ్తాను. అక్కడే తంటాలు పడతాను. ఇక్కడ ఏకాంతంలో పని నిర్విఘ్నంగా సాగుతుందని భ్రమించాను."

"ఏం జరిగింది ఇంతకూ?"

"ఆ వాతావరణం నాకు పోరెత్తిపోయింది. బుర్ర పాడయిపోయింది. కొంచెం కూడా పని సాగలేదు?"

"ప్రకాశం! నేనూ అలాగే నీపని నిశ్చింతగా సాగుతుందనుకున్నాను. ఆ గదులూ ఆ అందం చూసి రెండువేల రూపాయల పగ్డీ ఇచ్చి బుక్ చేశాను తరవాత నాకు క్రమంగా తెలిసింది - ఆ మింగిల్స్ ఉన్నారే? భార్యాభర్తలుగా కొన్నాళ్ళు మాత్రమే కలిసి ఉండేవాళ్ళు. ఈ లోపల ఒకరి కొకరికి సరిపడకపోతే వెళ్ళిపోవచ్చు. ఆ కొన్నాళ్ళలో వాళ్ళు ఒకరితో ఒకరు సర్దుకునే పరిస్థితులేర్పడితే పెళ్ళిళ్ళు చేసుకుంటారు. లేకపోతే గడువు తీరే వరకూ కళ్ళు మూసుకుని ఉంటారు" అన్నాడు పాణి.

"ఆ మింగిల్స్ కూడా ఆడా మగా గదులు మారుతూ ఉంటాడు. మాటి మాటికి తగవులాటలు, అరుపులూ, కేకలూ, ఇంక సింగిల్స్ మాట చెప్పనే

అక్కర్లేదు. పెళ్ళయిన వాళ్ళున్నారు. వాళ్ళకీ ప్రశాంత జీవితంలేదు ఒకరినొకరు నమ్మరు. ఒకాయన భార్యను ఇంట్లో పెట్టి తాళంవేసి బయటికి వెళ్ళేవాడు. ఆమె కిరసనాయిలు మీద పోసుకుని కాల్చుకుంది. పిల్లలు తల్లికోసం ఏడుపులు. ఒరే ప్రకాశం! నీవు ఏమీ అనుకోకు. నేనా నరకంలో ఉండేలేకపోయాను. వెయ్యి రూపాయలు నష్టం వచ్చినా సరేనని ఆ రూము ఎవరో అడిగితే ఇచ్చేసి రాత్రి బండికి టికెట్ కొనుక్కున్నాను'' ముఖం రుమాలుతో తుడుచుకున్నాడు.

''రామూ! విను. సుకన్యా బిల్డింగ్స్ గురించి, బిల్డింగ్‌లో ఫ్లాట్ తీసుకో లేదని నన్ను పిచ్చివాడి కింద కట్టేశావుగా? విను బాగా.''

''లోపలి సంగతి నాకేం తెలుసు? బిల్డింగ్స్ అందంగా ఉన్నాయి కదా అని మోజు పడ్డాను.''

''ఒరే ప్రకాశం! నన్ను క్షమించరా. నీ చేత బాగా డబ్బు ఖర్చుచేయించాను'' అన్నాడు దీనంగా పాణి.

''డబ్బు ఖర్చయినా అనుభవం గడించాను. ఏం విచారపడకు. విజ్ఞానమే కాదు—అజ్ఞానం కూడా డబ్బు ఖర్చు చేస్తేగాని రాదు'' అన్నాడు నవ్వుతూ ప్రకాశం.

(ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక)



# చేప కన్ను మిల మిలా –
# బాలయ్య కన్ను తెల తెలా

భుజమ్మీద వల వేసుకుని, తాటాకుల గుడిసెలోంచి వొంగి బయటకువచ్చి, అరుగు పక్కగా వున్న చెప్పులు కాళ్ళకు తగిలించుకుని బయలుదేరాడు బాలయ్య.

రెండడుగులు వేసి తలయెత్తి పైకి చూశాడు.

''అబ్బో! సూరీడు పైకి పైకి వస్తుండాడే?'' సన్నగా అనుకుంటూ గబగబా అడుగులు ముందుకు వేశాడు.

ప్రతిరోజూ జాలరులందరూ కలిపి ఏటి ఒడ్డుకు వెళ్లేవాళ్ళు. ఈరోజు అతడొక్కడే వెళ్లుతున్నాడు. పదిబారల దూరం నడిచి మళ్ళీ ఇంటివైపుకు తిరిగాడు. కంఠంమీద ఉన్న నరాలు పొంగినట్టుగా పైకి తేలాయి. పళ్లు కరుచుకున్నాయి. మీసం మెలివేశాడు. తలవంకిస్తూ ముందుకు సాగాడు.

కడుపు రుద్దుకున్నాడు. కడుపులో సొద

''లచ్చి కేమయిందియాల? చీకటితో లేచి గంజి కాయగూడదూ?''

''తనొకేళ రాత్రి పొద్దు పోయినంక వట్టి చేతులతో ఇంటికొచ్చాదే అనుకో. ఏం వస్తే? డబ్బులివ్వలేదని కడిగి బోర్లేసిన కుండలు చూపిస్తదా? ఏం పొగరు? అందుకే మనోళ్ళు మనువుకు మరో దిక్కుకు పోగూడదన్నారు.''

''రేత్రి కడుపులో ఏమీలేదు. మండిపోతావుంది? పెందలకడ పోదామంటే. కడుపులోనికి పోయింది. తెల్లారినంక కూడ లెగవక చాపమీద దొర్లుతావుంది. లచ్చి'' కోపం పట్టలేక మూలనున్న కర్ర తీసుకొని కొట్టడం మొదలుపెట్టాడు. ఒళ్లు తెలియకుండా.

లచ్చి ఒళ్లు పొంగిపోయింది. ఒళ్ళంతా వాతలు తేలింది. ఒక దెబ్బ కంటి మీదుగా తలమీద పడ్డం లచ్చి అరుపులు రంకెల్లా ఎంతో దూరం వరకు వినబడు తున్నాయి కసి పట్టలేక కాలితో ఒక్కతన్ను తన్ని కర్ర దూరంగా పారేశాడు. చెవిపోగు సవరించుకుంటూ తలకు పాగా చుట్టుకొని గడప దాటాడు. కోపంకొద్దీ అడుగులు గబగబ వేస్తున్నాడు.

"ఏం బాలిగా! పొద్దెక్కి వచ్చినవే?" సుబ్బడడిగాడు ఏటొడ్డున!

బాలయ్య వలకలేదు. చుట్టూ చూశాడు. జాలరులంతా వలలు దులిపి. కుప్పలు పోస్తున్నారు.

బాలయ్యకు పౌరుషం హెచ్చింది. తెప్పను ఏటి మధ్యకు తీసుకుపోయి బలంగా వల విసిరాడు. లాగుతుంటే వల బరువుగా అనిపించింది నిన్నటికీ ఇవాల్టికి కలిపి ఇవాళే లాగాలి అనుకున్నాడు. వల లాగి గంపలో దులిపాడు. ముఖం చేటంతయింది. 'నా సామిరంగ! పెద్ద చేపలు పడినయే" నవ్వుకుంటూ మరోసారి పళ్లు బిగించి వల విసిరాడు. ఈసారి వచ్చినవన్నీ చిన్న చేపలే. అన్నిటినీ వలలోకి వంపుకొని అవతలి గట్టుకు చేరాడు.

ఏటికి అవతలి గట్టున చిన్నపల్లె వుంది. ఆ పల్లె దాటితే చేపల అంగడి బాలయ్యకు కడుపులో ఏమీలేదు. పొద్దు తిరిగింది. కోపావేశంతో పల్లె దాటి. సంతకు వెళ్ళాడు. అక్కడ వల కుమ్మరించి కూర్చున్నాడు. కుప్పగా పోసిన చేపల వైపు చూసుకున్నాడు. ఇవాళ తనకు పది రూపాయలపైన రావాలని అంచనా వేసుకున్నాడు

కుప్పగా పోసిన చేపలమీద జానెడు పొడుగున ఒక చేప మిలమిల మెరుస్తూ తోక అటూ యిటూ ఆడిస్తున్నది. లేత నీలం తెలుపూ కలిపిన అలిచిప్పలరంగులో కొంత భాగం-పంచ రంగులు కలగలిపినట్టు కొంత భాగం-దాని శరీరం ఒక వింత అందంతో వెలిగిపోతున్నది. బాలయ్య దాన్ని చేతులోకి తీసుకొని ఇటు అటూ తిప్పి చూస్తున్నాడు. దాని కళ్లు వింతగా వున్నాయి! కళ్ళను తిప్పితిప్పి. చూస్తున్నది. ఒక్కొక్కసారి దృష్టి నిలిపి బాలయ్య తన కళ్ళల్లోకి చూస్తున్న దనుకున్నాడు.

ఇంత అందమైన చేపను తాను చూడలేదు. ''దీన్ని అమ్మను.'' మంగికివ్వా లనుకున్నాడు. దానిని వలలో వేసుకుని కుప్పలు బేరంపెట్టాడు. అతడు అనుకున్న దానికంటె మంచి బేరం తగిలింది. రూపాయలు తోలు సంచిలో సర్దుకొని వల భుజాన వేసుకొని యింటి వైపుకు మళ్ళాడు.

ఇల్లు సమీపిస్తున్నదనగానే అతడి మనసు కుతకుతలాడటం మొదలుపెట్టింది. బుర్ర వేడెక్కిపోతున్నది.

నడక వేగం తగ్గింది. ఆలోచనలు రేగుతున్నాయి. మూడు రోజులనాడు భూలచ్చిమి—అదే లచ్చి ఏం చేసింది? తనతో కూడా వచ్చింది. ఏటి ఒడ్డున కూచుంది. తను చేపలు కుప్ప పొయ్యటానికి తెప్ప దిగి వస్తుంటే నాగన్నతోపాటు నవ్వుతోంది—గవ్వలు గలబరించినట్టు నవ్వుతోంది. పడీ పడీ నవ్వుతోంది.

నాగన్న ఇరవై ఏళ్ళవాడు. ఎర్రటి జుట్టు. ఎత్తు పళ్లు. ఎడమకాలు సొట్ట.

''వీడిలో ఏం చూసి నవ్వుతోంది? ఆడికీ దానికీ నవ్వు ఏటి కొస్తుందాది?''

నవ్వులయ్యాయి. నాగన్న లచ్చిని ఒంగపెట్టి రెండు చేతులతో వీపుమీద తపతప కొడుతున్నాడు. పళ్లు బిగించి....లచ్చి ఇంకా నవ్వుతోంది.

ఇదేటి?

నవ్వులయినాయి. ఇక కొట్లాటలా?

ఇదేటి సరాగం?

ఆ రోజు ఒక కుప్ప గంపలో పోసుకొని తనే చేపల బజారులో పోశాడు. చేతికొచ్చిన డబ్బుతో మంగి యింటికెళ్ళి జల్సా చేసుకున్నాడు.

మరునాడు కూడా బాలయ్యతో లచ్చి వెళ్ళింది. బాలయ్య తెప్పనెక్కి చేపలు పట్టాడు. ఏటికావలి ఒడ్డుకు చేరుకున్నాడు.

లచ్చి బాలయ్యకోసం చూస్తోంది. జనం పలచబడ్డాయి.

''ఇయాళ ఎంతదూరం పోయిందు కంటికి కానరాకుండా?'' ఏటివైపు చూసుకుంటూ వేళ్ళతో ఇసుకలో గీతలు గీసుకుంటూ పదాలు పాడుకుంటూ కూర్చుంది లచ్చి.

వచ్చిన జనమంతా వెళ్ళిపోయారు. బాలయ్యకేమయింది? లచ్చికి తెలియు లేదు. బిక్క మొఖంతో తిరుగుముఖం పట్టింది. ఇలా ఇది రెండోరోజు.

గుడిసె గొళ్ళెం తీసింది. చాప పరుచుకుని పడుకుంది.

సంజ చీకట్లలో బాలయ్య తిరిగి వచ్చాడు. కొడుకు కనబడలేదు. వాడు అరటిపళ్ల కొట్టాయన చేతికింద పని చేస్తాడు. అక్కడే ఏదో తింటాడు. చీకటి పడ్డ తరువాత వచ్చి పడుకుంటాడు.

ఇంకా రాలేదు కాబోలు.

చాపమీద పడుకున్న లచ్చి లేవలేదు.

గంజి కాయలేదని కర్రతో తెగబాదేశాడు, కోపం చల్లారక తెల్లవారి మళ్ళీ కర్ర తీసుకున్నాడు.

దీపాలు పెట్టేవేళ. మిలమిల మెరిసే కళ్ళతో చూస్తూన్న చేపను అపురూపంగా వలలోనుంచి చూస్తూ ఇంట్లో అడుగుపెట్టాడు బాలయ్య. లచ్చి గొడ్డులా మూలుగుతున్నది కొడుకు ఉడుకు నీళ్ళల్లో గుడ్డముంచి తల్లి వీపూ కాళ్లూ కాపుతున్నాడు.

విసురుగా బాలయ్య పెరట్లోకి వెళ్ళి కాళ్ళూ చేతులూ కడుక్కుని బైట అరుగుమీద కూర్చున్నాడు. ఆలోచనలు నీళ్ళు పొంగినట్లు పైపైకి పొంగుకుంటూ వస్తున్నాయి.

సింగన్న కూతురు మంగిని చిన్నప్పటి నుంచీ బాలయ్యకిచ్చి పెళ్ళి చేయాలని మాటలు జరిగాయి. మధ్యలో సింగన్నకూ, బాలయ్య తండ్రికీ మాటలు చెడిపోయాయి.

నలుగురిలో "ఈడికేంటి పిల్లనిచ్చేది" అన్నాడు సింగన్న ఒకనాడు.

దాంతో ఈ పెళ్ళాగిపోయింది. ఆవేశాలతో ఇద్దరికీ విడివిడిగా పెళ్ళిళ్ళయ్యాయి. కానీ - బాలయ్యకు, మంగికి మధ్య ఉన్న స్నేహ సంబంధాలు చెడలేదు. అవి సాగుతూనే వున్నాయి.

ఒకనాడు మంగి ఏటి ఒడ్డుకు వస్తే బాలయ్య ఆమెతో సరాగాలాడి చేపలు పట్టలేదు. లచ్చి రానిరోజుల్లో బాలయ్య సాధారణంగా చేసె పనే యిది. అందుకే గుడిసెలో ఒకనాడు గంజి, ఒకనాడు కూడు.

ఆనాడు లచ్చి వెంట వచ్చింది. దూరాన తెప్పమీద ఉన్న బాలయ్యకు మంగితో తన సరాగాలు జ్ఞాపకం వచ్చాయి. మనసునిండా మంగి - కంటి ఎదుట లచ్చి. మంగితో తానాదే సరాగాలే లచ్చి నాగన్నతో ఆడుతున్నట్లనిపించింది.

ఎంత చిత్రం?

నిజంగా ఆనాడు లచ్చి రానూలేదు. లచ్చితో సరాగాలాడినట్లనిపించిన నాగన్న ఊళ్లోలేనూ లేడు.

"ఇదేటి? ఇట్ట జరిగింది?"

ఆ చేపతో నిజంగా మంగిచేత పులుసు చేయించుకుందామని ఏటికవతల సంతకు వెళ్లాడు.

వచ్చిన డబ్బులు సంచిలో వేసుకునేటప్పుడు ఎన్నో అనుకున్నాడు. "మంగికి మంచి చీరె కొంటే? మంచి రైకలు రెండు కొంటే? రెండు చేతుల నిండా గాజులేయిస్తే? అయ్యన్ని లేవుగాని - రెండు రైకలుకొని - చేతులనిండ గాజులేయించి - తల్లో పూలు కొనిపెట్టి చేరాక ముంతెడు కల్లు తాగితే? ఎంత మజా? ఎంత మజా?

అక్కడినుంచే మంగి యింటికి వెళ్ళాడు. మంగి తన మగడికి ఒళ్ళురుద్ది, నీళ్ళు పోస్తోంది.

ఆ దృశ్యం చూడటానికి అసహ్యమేసింది. కంటిలో నలుసు గుచ్చుకున్నట్ట యింది. "సీ సీ" అనుకున్నాడు. అంత సంబరం చప్పగా చల్లారింది.

ఇంటికి రాగానే తను కొట్టిన దెబ్బలు లచ్చి ఒంటినిండా వాతలు గుర్తొచ్చాయి. మనసు కంతబారింది.

చుట్టుపక్కల కలయజూశాడు. అన్ని గుడిసెలలో కిరసనాయిలు దీపాలు మిణుకుమిణుకు మంటూ వెలుగుతున్నాయి. తన గుడిసెల్లో మసకచీకటి.

అరుగుమీద కూర్చున్న బాలయ్య దిగ్గున లేచాడు. లోపలికి వెళ్ళి, లచ్చికి ఒళ్ళు కాపుతున్న బట్టను కొడుకు చేతిలోనుంచి తీసుకుని "అబ్బిగా. మీ యమ్మకు నేను కాపుతాగాని. దీపం వెలిగియ్" లచ్చి పక్కన కూర్చున్నాడు లచ్చి మొఖం చూడలేక పోతున్నాడు తల భూమిలోకి దిగిపోతున్నది.

దీపపు వెలుగులో వలలో నుంచి చేపకళ్ళు మెరుస్తున్నాయి.

"అయ్యా. దాంతో పులుసు కాయనా" అడిగాడు కొడుకు.

"ఒద్దురా. దాన్ని ఆ పక్కబాయిలో పారేయ్. నీకు చేతనయితే గంజి కాయి - నూకలు తెచ్చిన"

"మెల్లగ లేచి పులుసు కాత్తాలే ! మనసుపడి తెచ్చుకున్నావ్ ' మూలుగు తూనే లచ్చి లేవబోయింది.

"ఒద్దే. గంజి చాల్లేయే. నా కళ్ళు నిన్న గుడ్డిగయినయే. గుడ్డివాడికిదే శిచ్చ. నీ కన్నేదే ! తెరపిచ్చిందా ?" చేత్తో కన్ను తడిమాడు.

"లేదుమావా. గుడ్డులో నుంచి రగతం కారింది. తెరపిడిలేదు" బట్టతో ఒత్తుకుంది.

"అయ్యో. అయ్యో" తల బాదుకున్నాడు బాలయ్య. "నా చేతులు కాలి పోను. ఎంత పని చేసినావే లచ్చీ" చేతులు నేలకేసి కొట్టుకున్నాడు.

"నాకు మైకం కమ్మి కళ్లు గుడ్డిగయినయ్ నా కోపంతో నీ కన్ను పోగొట్టిన" లచ్చి ఒంటిమీద తేలిన వాతలను చేత్తో రాస్తూ కన్నీరు గార్చాడు బాలయ్య.

"నాయనా గంజి" కొడుకు రెండు ముంతలతో గంజి తెచ్చాడు.

"లచ్చీ ! గంజి తాగే" లచ్చిని మెల్లగా లేవదీసి తన గుండెకు ఆనించు కుని తాగించాడు బాలయ్య.

"మావా !"

"ఇయ్యాళ గంజి మా రుచిగా ఉంది మామా."

ఆమె రెండు చేతులతో అతడి చేతిని గట్టిగా పట్టుకుంది సంబరంతో.

"మావా! పొద్దుటేలనుంచీ ఏం తినలేదు కదా!" కడుపు తడిమింది తమితో.

ముఖం పక్కకు తిప్పుకుని కళ్లు ఒత్తుకున్నాడు బాలయ్య.

('సిరిమల్లె' పత్రిక.)



# బల్లకట్టు భద్రయ్య

అల్లంత దూరాన్నుంచే రంగుచీరె నల్ల ప్యాంటు కనబడ్డాయి నది ఒడ్డున కూర్చున్న భద్రయ్యకు. గుండెలోనుంచి సంతోషతరంగం ఉవ్వెత్తున లేచింది.

భద్రయ్య మధ్యాహ్నం నుంచీ ఎవరైనా ప్రయాణీకులు ఏరుదాటటానికి వస్తారేమోనని, ఎదురు చూసీచూసి కళ్ళు కాయలు కాసినట్టయ్యాయి. ఊఁహుఁ. ఒక్క ప్రయాణీకుడయినా రాలేదు. ఏ ఒక్కరు వచ్చినా మనిషికి పావలా.

అటువంటి పావలాలు ఓ పదైనా తెస్తేగాని 'నలుగురి పిల్లలకు గంజెట్లా పొయ్యను?' అంటూ నిలవేస్తుంది పొన్ని.

తను మటుకేం చేసుకుంటాడు? పది పావలాలు కాక మరి నాలుగు పైన దొరికిన్నాడే ఈత పుంతలోకి పోతాడు ఇప్పటికి వారమయింది— ఆ పది పావలాలే సరిగా దొరకటంలేదు ఈ మాటంటే పొన్ని నమ్మదే? అనుమానం మడిపి.

ఇంటికి పోగా 'సిన్నోడికి జొరం అంటుంది. పెద్దోడికి పంచె కావాలంటుంది సిట్టితల్లికి ఒళ్ళు కప్పను పైటగుడ్డ కావాలంటుంది ఏనాడయినా సంబరంగా ఓ కోక కొనిచ్చినవా? గువ్వకన్ను రైకంటె పానం, ఆ సంగతి గయించావా!' అంటుంది.

తనకీ తేవాలనే ఉంటుంది. కాని గవ్వలు కావే చేతిలో ఆడటానికి? డబ్బులాయెను- డబ్బులు.

ఈతపుంతకు పోనివాడు పొన్నితో 'సూత్తాలేవే' అనబుద్ధవుతుంది. పోయిన్నాడు తన్నబుద్ధయితుంది. ఉడుకు సల్లారినాక 'డబ్బులుంటే తేనుటే? నాకు మాత్రం సంబరం కాదూ?' ఈ మాట అనాలనుకుంటాడు. కాని అనబుద్ధికాదు.

మళ్ళీ తెల్లారి 'ఇయ్యాళయినా తెస్తావా?' అంటుంది ఆశతో. 'అట్టనే' అంటాడు నవ్వుతూ.

"ఇట్టనే బతుకులు గడిపి పోతుండాయి" అనుకుంటాడు భద్రయ్య బీడీ కాలుస్తూ.

రంగుచీరె నల్ల ప్యాంటు మరింత దగ్గరగా వచ్చారు.

సంబరంగా లేచి నిలబడ్డాడు భద్రయ్య.

"రండి, దొరా రండి జేగి రండి. అయ్యగారు ఈ మద్దెన రాకుండయినారు" తలపాగా సర్దుకుని "ఓ యబ్బ! దొరసాని కూడ అచ్చారు. ఈయాల నాకు పండగే," అన్నాడు ఆమెను కిందికీ పైకీ పరిశీలనగా చూస్తూ.

నవ్వాడు నల్లసూటాయన "భద్రయ్యా మరిచిపొయ్యావా? ఇన్నాళ్ళూ కాలేజికి సెలవులే కదా. ఇవాళే తెరిచారు. పొద్దున ఇటే వెళ్లానే?" అన్నాడు ప్యాంటు జేబులో చెయ్యి పెట్టుకుంటూ.

"ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. ఈ సెలవుల్లో ఏం జరిగిందనుకున్నారు? ఆ రామిగాడు నాతో పోటీకి నిలబడ్డడు. ఐద్దలతో నాను కట్టినట్టే బల్లకట్టు తయారు చేసిండు పొద్దుపేలకు ఏటిఒడ్డుకు సిద్ధమయినడు. అప్పుడు పెద్ద గొడవయిపోనా దనుకోండి. మనూరి పెద్దలంత కూడి ఇనుకోని తీర్పు సెప్పినారు గందా—ఆడు పొద్దుపేళనుంచి మధ్యాన్నం ఒంటిగంట వరకు—ఆ కాడినుంచి నాను రాత్రి ఎనిమిది కొట్టేవరకు నడుపుకోవాలని."

"మరింకేం? సరిగ్గానే పంచారు. ఇంకా నీవు పాతమనిషివి కదా అని నీకెక్కువే పైమిచ్చారు." నవ్వాడు ఆయన.

"అట్ట కాదండి, ఆడికి పిల్లాజెల్లా లేదు. మరి నాకో? తల్లితో కూడా ఐదుమంది కడుపులు నింపాలి అయ్యగోరూ."

"నీ అదృష్టం బాగుంటే ఓ పాతిక మంది ఎక్కితే లాభమేగా భద్రయ్యా?"

"అవునండి. కాని అట్ట జరుగుద్దా పెతిరోజూ?"

"ఇవాళ ఎంత సంపాదించావు ఇంతవరకు?"

"ఒక్క పావలా డబ్బులు చేతిలో పడలేదు బాలయ్యా. తమదే బోణీ."

"సరే ఇవాళే నాకు పాత లెక్కలేవో చూసి దబ్బిచ్చారు. బోణీ అంటున్నావు కనుక ఈ రూపాయి తీసుకో." పర్సులోనుంచి తీసి యిచ్చాడు.

ఆ రూపాయ కాగితాన్ని సంబరంగా అందుకొని బల్లకట్టు దగ్గరికి వెళ్ళి దానికి తాకించి దణ్ణం పెట్టాడు. గడ చేతిలోకి తీసుకుని "రండి బాబయ్యా రండె" అన్నాడు.

ఏటిఒడ్డున ఇసకలో కాళ్ళు కూరుకుపోతున్నాయి. ఆయన బూటు దులుపుకుంటూ అడుగులు వేస్తున్నాడు. ఆమె చీరె కుచ్చెళ్ళను ఒకచేత్తో పైకి పట్టుకుని చెప్పులు ఇంకో చేతికి తగిలించుకుని బల్లకట్టు దగ్గరికి వచ్చింది.

ఆయన ఒడ్డుమీది నుంచే రెండోకాలు బల్లకట్టుమీద పెట్టి ఎక్కాడు.

"బలరాం. నాకు చెయ్యి అందించవూ?"

ఏదో పిట్టకూత అన్నట్టు పక్కకు తిరిగి చూశాడు భద్రయ్య.

తన రెండుచేతులతో ఆమె చేతులు పట్టుకుని పళ్ళు బిగించి పైకి లాగాడాయన.

ఆ బల్లకట్టుకు నాలుగు మూలలో నాలుగు మొద్దులు ఎత్తుగా కుర్చీపీటల్లా ఉన్నాయి. జేబు రుమాలుతో దులిపి సుతారంగా వాటిమీద కూర్చున్నారు ఇద్దరూ. అతదేదో సన్నగా అంటున్నాడు. ఆమె కిసుక్కున నవ్వుతున్నది. ఇద్దరూ ఏవేవో కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆమె మధ్య మధ్య గునుస్తూ అలుగుతూ బెదిరిస్తూ మాట్లాడుతున్నది.

అత దన్నిటికీ చిరునవ్వుతోనే సమాధానమిస్తున్నాడు.

"నీకేం? నా సంగతి ఆలోచించు" అంతలోకి ఆమెకు కన్నీళ్ళు.

భద్రయ్య వెనక్కు తిరిగిచూశాడు 'ఎంత చక్కగ ఉందాయమ్మ? ఇద్దరూ సిలకా గోరింకల్లాగున్నారు. అదేం? అళ్లకూ తగవులేనా? ఈ అయ్య ఆ యమ్మ నేదో అనకపోతే కంట తడిపెడుతుందా? ఏందో పెపంచకం' భద్రయ్య తల గోక్కున్నాడు.

"మన మెక్కడున్నామో గ్రహించావా? ఇది బల్లకట్టు మనం నీళ్ళ మీద న్నాము. నీళ్ళమీద ప్రయాణం చేసేటప్పుడు మనసులు బరువుగా ఉండకూడదు. ఘర్షణలు పనికిరావు. అసలే నది వర్షాలకు పూటుగా ఉంది."

"అయితే?"

"అయితేనా? మాటలకూడా—అందులో కోపంవల్ల వచ్చే మాటలకు ఎంతయినా బరువుంటుంది. ఆ బరువుకు డబ్బున ఈ తెప్ప మునిగిపోవచ్చు."

"మునిగితేనా?" కన్నీరు కార్చినందువల్ల ఎర్రబడ్డ ముఖంతో—జ్యోతు ల్లాంటి కళ్ళతో ఉరిమిచూస్తూ "నేను ఒక్కదాన్ని మునిగినా ఫరవాలేదు. కాని నీవు మునిగితివా...." అతడిని తిరస్కారంగా చూసింది.

బలరామ్ భద్రయ్య వైపు వేలుపెట్టి చూపిస్తూ జాగ్రత్త అన్నట్టు ముక్కు మీద వేలేసుకున్నాడు.

ఆమె భద్రకాళిలా నేలమీద కాళ్ళు తాటించింది.

బోటు దరిజేరింది. ముందుగా బలరామ్ దూకాడు. ఆమెకు చేతులందించ బోయాడు.

ఆమె అతడి చేతులు తోసేసి ధైర్యంగా ఒడ్డుమీదికి దూకింది. ముఖమింకా రుసరుసలాడుతూనే ఉంది.

"అయ్యగారూ దణ్ణం. అమ్మగారూ దణ్ణం." భద్రయ్య ఒడ్డుమీద నిల బడ్డాడు.

వెనక్కు తిరిగి చూశారిద్దరూ. ఆయన నవ్వాడు. ఆమె ముఖం ముడుచు కుంటూ ముందుకు సాగింది.

ఎంత నక్కంగ ఉన్నారిద్దరు! చిదిపితే పాలుగారే బుగ్గలాయమ్మని. కళ్ళెంత బాగుండాయి? ఆ దొర ఆ యమ్మకు తగినట్టే ఉండడు. ఆ యమ్మకోసమే పుట్టాడు కావాల. ఆ అమ్మయితే ఆయన కంటే మిన్నగుంటది. భద్రయ్య వాళ్ల వెళ్లిన దారివంకే చూస్తూ అనుకుంటున్నాడు.

"అటు పోద్దా ఈ బల్లకట్టు!" పెళ్ళివారి గుంపులా ఉంది. పెట్టెలు తలా మీద పెట్టుకుని పిల్లలను చంకనెక్కించుకొని పాతిక మంది దాకా వచ్చారు.

''పోతది రండి రండి'' భద్రయ్యకు బలరాం-ఆమె కళ్ళల్లో మెదులుతుండగా కళ్లు నులుపుకుని-పిలిచాడు వాళ్లను.

వాళ్ళందరూ పెళ్లికబుర్లు చెప్పుకుంటుండగా భద్రయ్య మనసులోనే ఏవేవో పథకాలు వేసుకుంటూ వాళ్ల దగ్గర పాతిక పావలాలు వసూలుచేసి చిన్న జోలె సంచీలో వేసుకొని మొలలో దోపుకున్నాడు.

మళ్లీ అటునుంచి కొందరు విద్యార్థులు, గ్రామీణులు పదిమంది ఎక్కారు.

'ఇదేంది ఇయ్యాళ? భూమి ఈనినట్టుగా ఉండాదే?' అనుకున్నాడు భద్రయ్య.

ఇంకా సూద్దాం-ఇంకా సూద్దాం అనుకుంటూ రాత్రి ఎనిమిది గంటలవరకూ ఉన్నాడు భద్రయ్య నది ఒడ్డున చీకటి. పడినకొద్దీ జనం తగ్గారు.

బల్లకట్టును అక్కడే గుంజకు కట్టేసి పదకొండు రూపాయల పావలా లెక్కబెట్టుకొని తిరిగి జోలి సంచిలో వేసుకుని మొల్లో దోపుకునినడవటం మొదలు పెట్టాడు భద్రయ్య

అక్కడికి నాలుగు బారల దూరంలో ఒక మలుపు వచ్చింది. ఆ మలుపుకు బారెడు దూరం సాగిన తరువాత బాట రెండుగా చీలిపోతుంది. కుడిచేతివైపు బాట తిన్నగా భద్రయ్య ఇంటికి చేరుతుంది. ఎడమచేతి వైపుది ఈత పుంతకు దారితీస్తుంది.

మలుపులో నిలబడ్డాడు భద్రయ్య. ఇయ్యాళ డబ్బులు ఎప్పటికంటే కూసిని ఎక్కువే దొరికినయ్. ఓ రెండు ఖర్చువేసి ఈతకల్లు ఓ ముంతుచ్చుని-మిరపకాయ బజ్జీలు తిని-నరిపితో సరసమాడి ఇంటికెళ్తే?

ఇదొక ఆలోచన.

పొన్ని మనసుపడ్డ గువ్వకన్ను రెయికకొని. పిన్నోడికి సొక్కాకొని మిగిలిన పైకం పొన్నిచేతిలో పోస్తే?

ఇది రెండవ ఆలోచన.

ఈతకల్లు - మిరపకాయబజ్జీలు తలుచుకుంటేనే నోరూరింది. నరిసితో సరసమంటే ఒళ్ళు పులకరించింది

గువ్వకన్ను రెయిక తనకు - పిన్నోడికి సొక్కా-రేపటి తిండి గింజలకు డబ్బులిస్తే పొన్ని పడేసంతోషం కళ్ళల్లో మెరిసింది అంతలో.

కూసింతసేపీ ఆలోచన. కూసింత సేపా ఆలోచన. ఏందో పాడుమణుసు ? గొణుక్కున్నాడు భద్రయ్య.

కదిలాడు భద్రయ్య ఎడమచేతి వైపుకు. అడుగులు తొందర తొందరగా పడుతున్నాయి. కన్ను తెరచి కన్ను మూసేటంతలో వచ్చేసింది ఈతపుంత.

అక్కడ కోలాహలంగా ఉంది. ముంత ఒకచేత బట్టుకుని మిరపబజ్జీ మరొకచేత బట్టుకొని గంతులు వేస్తున్నారు జనం. మగ అయిందీ అడ అయిందీ తెలుసుకోలేకుండా సరసా లాడేస్తున్నారు.

భద్రయ్య కల్లుముంత చేతబట్టడం ఎగురుకుంటూ తాగుతూ బజ్జీలు నంజడం అయింది. ఇంక సరసమాడ్డానికి నరిసి ఎక్కడుందోనని చూస్తున్నాడు. నరిసి బజ్జీలమ్మే రాములమ్మ కూతురు. ఇరవై ఏళ్ళది. చింతాకంత కళ్ళు-పెద్దగా ముందుకు పొడుచుకుని వచ్చిన పళ్ళతో చింతపిక్కలా మెరిసిపోతూ ఉంటుంది.

ఒళ్ళు తెలియకుండా ఎగుర్తూ పడుతున్న భద్రయ్య చేతిని ఎవరో ఒడిసి పట్టారు.

నరిసి అనుకుని "రాయే పోదాం అటు." భద్రయ్య ఆ చేతిని రెండు చేతులతో బంధించాడు.

"ఆఁ హాఁ ? ఎటు ?"

చివ్వున తలెత్తి చూసిన భద్రయ్య తుళ్ళిపడ్డాడు.

"మామోయ్ మామా. ఇంటికి పోయి అడనే సరసమాడుకుందాం రా. ఏం కత ? ఇయ్యాళ శాన సంతోషంగా ఉండావు ?" అతడి నడుమంతా సర్ది జాకి

సంచీ అందుకొని తన రెయికలో దాచేసి లాక్కుపోతున్నది పొన్ని తన గుడిసె వైపుకు భద్రయ్యను.

ఆ కైపులో నోరెత్తకుండా ఆమె వెంట దిక్కులు చూస్తూ అడుగులు వేస్తున్నాడు భద్రయ్య వళ్ళు బైటపెట్టి.

ఇంటికి రాగానే పట్టెడన్నం తినిపించి భద్రయ్యను కుక్కిమంచం మీదికి తోసింది పొన్ని.

మరునటిరోజు బాగా పొద్దెక్కి లేచాడు భద్రయ్య. అప్పటికి పొన్ని అన్నం వొండి పిల్లలకు పెట్టింది.

''కూడెట్టలే. ఏమయింది'' అన్నాడు భద్రయ్య తలవంచుకొని.

''రా. ఎల్లిపాయేసి కారం నూరాను. పులుసొండాను.రా. కలిసి తిందాం.'' పొన్ని ఇంత సంతోషంగా ఉండగా భద్రయ్య చూడలేదు ఈ మధ్య.

భద్రయ్య మీసాలచాటు నవ్వు నవ్వు కున్నాడు. రాత్రి ఏం జరిగిందో తనకు కొంతే తెలుసు. దరవాతేం జరిగిందో పొన్నికి బాగా తెలుసు.

దొంగచూపులు చూశాడు పొన్ని వైపు. పొన్ని ఓరగంట కనిపెడుతూనే ఉంది భద్రయ్యను.

సరిగ్గా తన వేళకు భద్రయ్య బల్ల కట్టు దగ్గరికి చేరుకుని ఒడ్డున కూర్చున్నాడు. ఐదారుమంది పాటకజనం ఇటునుంచి అటు-అటు నుంచి ఇటు బల్లకట్టు మీదినుంచి దాటారు. ఒడ్డు మీద ఒక రాతిమీద కూర్చుని భద్రయ్య బీడీ కాల్చుకోవటం మొదలుపెట్టాడు.

ఐదుగంటల తరువాత నల్లప్యాంటు. రంగుచీర అంత దూరాన్నుంచి వస్తున్నట్టు చూశాడు. భద్రయ్యకు వాళ్ళను చూడగానే గతరాత్రి జరిగిన సంగతి చప్పున జ్ఞాపకం వచ్చింది మళ్ళీ మీసాల చాటు నవ్వు నవ్వుకున్నాడు.

''దణ్ణం దొరా. రండి రండి.'' అన్నాడు అల్లంత దూరాన వాళ్ళుండగానే.

''ఇవాళ కూడా మాదేనా బోణీ ?''

"బోణీ ఇదివరకే అయింది." నవ్వుతూ అతడు తెప్పమీద కాలుంచి ఎక్కాడు. మామూలుగా ఆమెకు చేతులందించాడు బలరామ్.

చేతులులేని బ్లవుజు-తెల్లటి జబ్బులు-మిసమిసలాడే వయసు-మైమరపించే కనుదోయి-కవ్వించే వంపులు-ముఖంలో క్షణం రుసరుస-క్షణం కిలకిల నవ్వులు చూసి బలరామ్ కళ్ళు కాంక్షతో తళతళలాడుతున్నాయి.

ఆమె రెండు చేతులూ చాపటం. అతడు వాటిని అందిపుచ్చుకుని సంబరంగా పైకి లాగటం చూస్తున్నాడు భద్రయ్య పక్కచూపులతో.

మామూలుగా ఇద్దరూ కూర్చున్నారు. నమ్‌కిన్ కాజూ పొట్లమొకటి ఆమె చేతికిచ్చి తానొకటి విప్పాడు. మళ్ళీ అంతలోనే దాన్ని మడిచి జేబులో కుక్కుకున్నాడు బలరామ్.

"ఏం? నీవు తినవా?" కళ్ళతో కవ్వించింది మీను

"ఏం? నీ దాట్లోంచి పెట్టావా?" అన్నాడు బలరామ్ చేతులు చాపుతూ.

"మరయితే రెండెందుకు కొన్నావ్? అది కూడా తే. విప్పుతాను. ఇద్దరం ఇక్కడే తిందాం." చెయ్యి చాపింది.

"వద్దులే అది ఉండనీ. దాని సంగతి తరువాత ఆలోచిద్దాం." అన్నాడు బలరామ్.

"ఊఁ హూఁ. అది కూడా విప్పాల్సిందే. ఇవాళ ఇంకేమయినా ఆలోచనలు వస్తున్నాయా?" ఆమె కినుక వహించినట్టు కనుబొమలు కలుసుకోవాలని చూస్తున్నాయి.

బలరామ్ అందుకు అవుననలేదు, కాదనలేదు. ఆమెవంకే చూస్తున్నాడు పిచ్చిపట్టినట్టుగా.

"నీవు ఇంట్లో నుంచి కదలనట్లే కనబడతావు. కాని ఎప్పుడో నన్ను ఏమార్చి వాళ్ళను కలుస్తూనే ఉన్నావు. ఇంకా నీకు పూర్వవాసనలు పోలేదు" మాతి సున్నాలా చుట్టింది.

బలరామ్ హృదయం కలుక్కుమంది.

"నీకు నా యింట ఎన్ని సుఖాలు ? ఎన్ని రకాలు ? ఆ మెత్తని ఫోమ్ బెడ్లు-స్ప్రింగ్ కాట్లు-హైక్లాసు ఫర్నిచరు-ఇంద్ర భవనంలాంటి ఇల్లు - నందనవనం లాంటి తోట-ఖరీదయిన భోజనం-పిలిస్తే పలికే నౌకర్లూ - రంభ మేనకలను మించిన మీను ఎక్కి తిరగటానికి పడవలాంటి కారు-ఎన్ని ఉన్నా-ఆ మురికోడే ఆ యిల్లాలినీ - కట్టు గుడ్డలయినా సరిగాలేని ఆ పిల్లలనూ జ్ఞాపకం తెచ్చుకుంటూ అంతలోకి కుంగిపోతావేం?" అన్నట్టు నిప్పుకణంలాంటి ఓ చూపు చూసిందిమీను.

"అబ్బెబ్బె. అదేంకాదు. మనం ఇంటి దగ్గర తినటానికి ఒకటి ఉండాలి కదా అని దాచాను." నసిగాడు బలరామ్.

భద్రయ్య వాళ్ళ మాటలు వింటూ ఆలోచనలో పడ్డాడు. వీళ్ళిద్దరిలో ఏదో తిరకాసు ఉన్నట్టుందన్న అనుమానం మెదిలింది మనసులో.

"బలరామ్ ! నేను చెప్పినట్టుగా సెలవు పెట్టావా ? అసలు నీకీ పాడు ఉద్యోగం ఎందుకు చెప్పు ? కొంతకాలం అట్లా బొంబాయి వైపులకు పోదాం పద. మనం కారులోనే పోవచ్చు. ఏమంటావు ?"

"ఆ ప్రోగ్రాం ఇప్పుడు కుదిరేటట్టు లేదు మీనూ. ప్రిన్సిపల్ సెలవు ఇవ్వ నన్నాడు. మరొకసారి అంటే దసరాలకు వెళ్దాం. ఏమంటావు ?"

"ఆఁ హాఁ ? అదేం కుదరదు. నీవసలు సెలవు అడిగావా ? నీమాట నమ్మమంటావా ?" నిలవదీసింది.

"ఎందుకా సందేహం ?"

"నమ్మలేనోయ్ నిన్ను. అందులో నీవంటి వాళ్ళను అసలే నమ్మలేను."

"ఏం చేస్తాం ? ఈ జీవుడు చేసుకున్న పుణ్యం."

అంతలో ఒడ్డుకు చేరింది బల్లకట్టు. ఇద్దరూ ఒడ్డు మీదికి దూకేశారు.

ఆనాడు భద్రయ్యకు సంచి నిండా డబ్బులు లేకపోయినా తాటిపుంతకు చేరాడు. ముంతెడు కల్లు తాగిన తరువాత బజ్జీలు చేతిలో ఉండగానే పొన్ని

వచ్చింది "మామోయ్ మామా" అంటూ భుజమ్మీద చెయ్యివేసి తీసుకు వెళ్లింది తన గుడిసెకు.

భద్రయ్య ఎటువంటి పరిస్థితిలో ఉన్నా పొన్ని తియ్యటి కంఠంతో 'మామోయ్ మామా' అన్న పిలుపు వినగానే ఈ లోకంలో మరేం కనిపించదు-వినిపించదు-అతడికి.

మామూలుగా చిలకాగోరింకలు ఊసులాడుకుంటూ నవ్వుతూ తెప్ప ఎక్కటానికి వస్తూనే ఉన్నారు. తెప్పమీద ఉన్నంతసేపూ వాళ్ళను చూసి మురిసిపోతాడు భద్రయ్య.

చట్టున పొన్ని పొద్దటిపూట చెప్పిన మాట జ్ఞాపకం వచ్చింది. "పిన్నోడికి జొరం. సిట్టి తల్లికి ఒళ్ళు కప్పను పైట గుడ్డ కావాలని" మరీ మరీ చెప్పింది. "ఏనాడయినా అడగకుండా కోక తెచ్చినవా ?" అంటూ దెప్పింది.

తనకీ తేవాలనే ఉంటుంది. కాని గవ్వలు కావే చేతిలో ఆడటానికి ? డబ్బులు, డబ్బులు. ఒక్కోరోజు ఎంత కష్టపడ్డా పది పావలాలు కూడిరావు.. ఆ ప్రశ్నకిదే ఎప్పటికీ జవాబు అయిపోతున్నది.

ఇది ఎప్పుడూ జరిగేదే. అయితే ఓకటి - ఒకరికి కోపం వచ్చినప్పుడు ఇంకొకరు కోపం తెచ్చుకోరు. నవ్వేస్తారు కోపాలేమిటి మనమధ్యఅనుకుంటారు

తెప్ప బయలుదేరింది. నాలుగు బారలు సాగింది.

"నాన్నా ! నాన్నా !" పరుగెత్తుకుంటూ వస్తున్నాడు పన్నెండేళ్ళ పిల్లవాడొకడు.

"అపు. ఆపు. నేనూ ఎక్కుతా" అంటున్నాడు రొప్పుతూ.

పూల తెప్పపైన తేలిపోతున్నట్టుగా ఉన్న బలరామ్‌కు ఆ కేకలు వినబడటం లేదు. పక్క నుంచి వచ్చే కోకిల కూజితాలే చెవులలో ప్రతిధ్వనిస్తున్నాయి

భద్రయ్య వెనక్కు తిరిగాడు. పిల్లవాడు రొప్పుతూ ఒడ్డున నిలిచాడు

రివ్వున బల్లకట్టు వెనక్కు తిరిగింది ఒడ్డుకు చేరిన భద్రయ్య "ఏం బాబూ ఎక్కుతావా ?" అడిగాడు

బలరామ్ ఆ తన్మయత్వంలో తెప్ప వెనక్కు తిరిగినట్టే చూడలేదు. పిల్ల వాడి కంఠధ్వనికి గతుక్కుమన్నాడు.

"నాన్నా! నీ కోసం కాలేజీ అంతా తిరిగాను. అందరినీ అడిగాను. మన లిల్లీకి జ్వరంలో ఫిట్లు వస్తున్నాయి. అమ్మ గాభరాపడిపోతోంది. చేతిలో డబ్బు లేదు మందిప్పించటానికి వీలుకాక ముఖమ్మీద చురకలేయించింది. నాన్నా నీవు రావాలి" ఆయాసపడుతూ ఆందోళన పడుతున్న ముఖాన్ని చేత్తో తుడుచుకుంటూ అన్నాడు.

బలరామ్ ముఖంలో నెత్తురుచుక్క లేదు. పిల్లవాడితో ఏం మాట్లాడాలో తెలియలేదు జేబులో తడుముకుంటే చేతికేం తాకలేదు. ఒక పక్క మీను ఏమనుకుంటున్నదోనని ఓరకంట కనిపెడుతున్నాడు. ముడిపడిన ఆమె కను బొమలు-కోపంతో ఎర్రబారిన ఆమె కళ్లూ-అదురుతున్న ముక్కుపుటాలు-చూస్తేనే అతడికి భయంగా ఉంది

"నాన్నా! ఇంటికి రావూ? చెల్లెలూ తమ్ముళ్లూ ఏడుస్తున్నారు నాన్నా! అమ్మ సరేసరి. అన్నం తిని ఎన్నాళ్ళయిందో?"

తల దించుకున్నాడు బలరామ్.

బల్లకట్టు కదిలింది.

అంతలో నీళ్ళల్లో ఏదో దబ్బుమని పడిన చప్పుడు. 'మీనూ మీనూ' అంటూ కాలి బూట్లూ, కోటూ విడిచి బలరామ్ నీళ్ళలోకి దూకి ముందుకు చేపలా ఈదు కుంటూపోతున్న మీనూను వెంబడించాడు.

"అయ్యో! నాన్నా నాన్నా!" పిల్లవాడి అరుపులు మిన్నుముట్టుతున్నాయి.

భద్రయ్య ఇదేదీ పట్టించుకోకుండా తెప్పను ఒడ్డుకు చేర్చాడు.

"రా బాబూ! రా." ఏడుస్తూ తండ్రి వెళ్ళినవైపుకు చేతులు చాపుతున్న పిల్లవాడిని దగ్గరికి తీసుకుని "మీ యింటికి నన్ను తీసుకెళ్ళు. నేనొస్తాను పద" అన్నాడు.

"నాన్న- నాన్న. నీళ్ళలో నుంచి ఎట్లా వస్తాడు? అమ్మతీసుకురమ్మన్నది" వెక్కి-వెక్కి- ఏడుస్తున్నాడు పిల్లవాడు.

భద్రయ్య పిల్లవాడి చెయ్యి పట్టుకుని తెప్పలోకి చేర్చాడు. తెప్పనునడుపుతూ "ఏటి బాబూ?" అడిగాడు.

పిల్లవాడికి తండ్రి నీటిలో కొట్టుకుపోతున్నాడన్న భయమింకా తగ్గలేదు. ఏడుస్తూ నీటికేసి చూస్తూ ఇంటి సంగతంతా చెప్పాడు.

భద్రయ్య వెర్రినవ్వొకటి నవ్వాడు.

"బాబూ! మీ నాన్నకేం. భయంలేదు. ఆళ్ళిద్దరూ గజ ఈతగాళ్ళు. ఈ మద్దెన ఆళ్ళు ఈతకొట్టటం బాగా సూశాను. ఆళ్ళిప్పుడు రారు."

"అయితే నాన్న ఇప్పుడు రాడా?" పిల్లవాడి ముఖంలో భయం కొట్టవచ్చినట్టుగా ఉంది.

భద్రయ్య తెప్పను ఒడ్డుకు చేర్చాడు. పిల్లవాడు గెంతాడు. తెప్పను కొయ్యకు కట్టేసి భద్రయ్య పిల్లవాడితో ఇంటికి వెళ్లాడు.

అది నాలుగు కుటుంబాలు అద్దెకున్న పెద్దయిల్లు. వెనకవైపు భాగానికి అద్దె చాలా తక్కువ. ఒకటే కిటికీ. అది పెంకుటిల్లు కావటాన ఆ వెనకభాగం అక్కడక్కడ కురుస్తుంది. ఇళ్ళల్లోనుంచి బయలుదేరే మురుగుకాలవలన్నీ పెరటివైపుకు చేరుకుంటాయి. పందులూ కుక్కలూ జలక్రీడలకు కూడా అక్కడే కలుసుకుంటాయి.

పిల్లవాడివెంట వెళ్ళిన భద్రయ్య ఆ వెనకభాగానికి చేరుకున్నాడు. తల్లి పిల్ల తలను ఒళ్ళో పెట్టుకుని కన్నీరు కారుస్తోంది. చుట్టూ జనం మూగారు.

"ఈ చుట్టతో కణతమీద చురుకు తగిలిస్తే స్పృహ వస్తుందమ్మా" అంటున్నాడొకాయన.

"వద్దు బాబూ వద్దు. ఇప్పటికే నాలుగు చురకలు తగిలించారు. వాటినే చూడలేకపోతున్నాను" అంటూ ఏడ్చి. "నాయనా! నాన్న రాలేదా!" అడిగింది కొడుకును- ఏడ్చి ఏడ్చి రాసుకుపోయిన గొంతులో.

"లేదమ్మా" అన్నాడు పిల్లవాడు. అక్కడి వాతావరణం చూడగానే భయం మరింత ఎక్కువైంది అతడికి. తండ్రి నీళ్ళలో పడిన సంగతి చెప్పలేకపోయాడు.

భద్రయ్య అప్పటికే కొంత గ్రహించాడు. అతడికి ఎన్నడూ కలగనంతగా చైతన్యం కలిగింది.

"రా బాబూ, నా యెంట రా. డాకటేరును నేను తీసుకొత్తా" పిల్లవాడి చెయ్యి పట్టుకుని గబగబా ముందుకు నడిచి రోడ్డు ఎక్కాడు. పరుగుతీసినట్టుగా పిల్లవాడితో బల్లకట్టు దగ్గరికి చేరుకుని గబగబా గడవేశాడు. మసక వెన్నెల వెలుగులో ఆ దరికి చేరుకుని ఊళ్ళోకి నడిచాడు.

చీకటి చీకటిగా ఉన్నాయి కొన్ని వీధులు. అవి దాటితే సిమెంటు రోడ్లు-వీధి దీపాలు. ఆ వెలుగులో పిల్లవాడిని నడిపించుకుపోయి ఒక డాక్టరింటి ముందర నిలబడి తలుపుకొట్టాడు.

"డాకటరు దొరా. పానంమీదికి వచ్చింది. తమ రొాకపాలి రావాల" అంటూ దణ్ణాలు పెట్టాడు.

"ఎవరింటికి?" అడిగాడు డాక్టరు.

తండ్రి పేరు, చేస్తున్న ఉద్యోగం చెప్పాడు పిల్లవాడు.

"అలాగా!" అంటూ డాక్టరు బయలుదేరాడు పెట్టె చేతబట్టుకుని.

తెప్ప నడుపుతూ 'డాకటరు బాబూ! ఇటుకేసి కూడా వత్తా ఉంటారా?" అడిగాడు భద్రయ్య.

"వస్తాను కాని- ఇటువైపు పని తక్కువ. అటువైపు ఆసుపత్రి, కాలేజీలు అన్నీ ఉండటంతో ఊరు బాగా పెరిగిపోయింది. మాకైనా అటే పనెక్కువ. డబ్బు కూడా అటే దొరుకుతుంది. కాని ఒకటి. ఇది పాత ఊరయినా డబ్బుకలవాళ్ళు చాలావరకు ఇటే ఉన్నారు. ఈ నదిమీద బ్రిడ్జికడితే బళ్ళ రాకపోకలు ఎక్కువవు తాయి. మాకు ప్రాక్టీసుకూడా బాగా వస్తుంది.

"ఈ ఊరికి ఇదే దురదృష్టం బాబూ" మాటల్లోనే ఏరుదాటి అడుగులమీద ఇల్లు చేరుకున్నారు.

ఇంటి వెనక జనం బాగా మూగారు.

తల్లి వెక్కి వెక్కి ఏడుస్తున్నది. డాక్టరు జనాన్ని నెట్టుకుంటూ మధ్యకు వెళ్ళాడు. పెట్టె తెరవకముందు పిల్ల చెయ్యిపట్టుకుని చూసి వదిలేశాడు.

పిల్లలంతా బిక్కముఖాలు పెట్టారు. ఆమె ముఖానికి పైటచెంగు అడ్డం పెట్టుకుని ఏడుస్తున్నది.

డాక్టరు గుంపులోనుంచి బయటికి రాగానే "ఏటయింది బాబూ?" ప్రశ్నించాడు భద్రయ్య.

"అయిపోయింది భద్రయ్యా. ఆలస్యంగా పిలిచావు." ఆయన కంఠధ్వనిలో ఇటువంటి కేసుకోసం ఇంతదూరం తీసుకువచ్చావన్న ధ్వని వినబడ్డది.

డాక్టరు పెట్టె బైటికి పట్టుకుని వస్తుండగా భద్రయ్య దీనంగా ముఖంపెట్టి "బాబూ, నాను ఏరు దాటిత్తాను పదండి. ఇంత మిగిలిపోయిందని తెలవదు నాకు." క్షమాపణ చెప్పుకున్నట్టుగా చేతులు జోడించి ఆయనవెంట బయలుదేరాడు.

మలుపు దగ్గర నిలబడ్డది పొన్ని. ఈతపుంతంతా వెతికి వెతికి అక్కడ నిలబడ్డది - ఇంకా ఏటి ఒడ్డునే ఉన్నాదేమోననుకుంటూ.

ఆమెను చూడగానే "పొన్నే. ఇయాళ అంతా నట్టమేనే" అన్నాడు తల వంచుకుని. ఆమెకూడా అతడితో తెప్పదగ్గరికి నడిచింది. తెప్పమీద ఉన్నంతసేపూ ఎవరూ నోరు విప్పలేదు.

డాక్టరు దిగిపోయేటప్పుడు భద్రయ్య, "దొరా! నా కాడ మిగిలింది ఇది. ఇదే ఇయ్యాల్టి సంపాదన. తమరికాడ ఉంచండి" అంటూ ఎనిమిది రూపాయలు చేతిలో పెట్టాడు.

"నాకెందుకోయ్. మందన్నా ఇవ్వలేదు. చచ్చినవాడికి ఫీజు ఎందుకు?" అంటూ తిరిగి ఇవ్వబోయాడు.

అట్టకాదు దొరా. తమరు అంత దూరం వచ్చినందుకు నాను ఇత్తుండాను. ఆరు పాపం ఇదీ ఇయ్యనేరు." డాక్టరు ముందుకు నడుస్తుంటే భద్రయ్య పొన్నితో తెప్పను కదిలించి మళ్ళించాడు.

''పొన్నే. మాటాడ వేందే?'' అన్నాడు.

''ఏటి మాటాడేది?'' అంది పొన్ని. భద్రయ్య ముఖం అంత విచారంగా ఉండటం చూడలేదు ఇంతవరకూ. ఏదో అతడి మనసులో బాధ ఉన్నట్టు గ్రహించింది.

''పొన్నే తిండి నేకపోవటంకట్టమా? ఇసుమంటివి కట్టమా! నీవే చెప్పు?'' బలరాం సంగతంతా చెప్పి ''సూడే. మడిసిని పాడుసేసినా ఆడదే, ముందుకు గుంజినా ఆడదే. మడిసిని మడిసిగా ఆడదే సెయ్యాల,'' ఆమె ముఖంలోకి చూశాడు.

''మంచి పని సేశాననుకుంటా బయలెళ్ళా. కాని నాభం లేకపోయింది'' అన్నాడు భద్రయ్య డబ్బు లివ్వకపోవటం, అప్పు తెచ్చుకోవటం, తరువాత తీర్చటం అలవాటే. ఆమెకిది కొత్తకాదు. డబ్బులివ్వకపోయినా పొన్ని మనసు ఇవాళ సంతోషంగా ఉంది. సంచిలో ఉన్న డబ్బుల్తో ఈతపుంతకు వెళ్ళకుండా ఒక ప్రాణిని రక్షించటానికి వెళ్ళటమూ డబ్బు ఖర్చు చెయ్యటమూ ఆమెకు విచారాన్ని కలిగించలేదు.

''మామోయ్, మామా! ఇయాళ నీవు నిజంగా మడిసి వనిపించావు మామా!'' భుజం మీద చెయ్యేసి విచారం పోగొట్టే మాటలు మాట్లాడుతూ ఇంటికి తీసుకు వెళ్ళి గిన్నెనిండా ఉప్పుగల్లు వేసిన గంజిపోసి చేతికిచ్చింది.

గంజి తాగి చేత్తో మీసాలు తుడుచుకుంటూ ''పొన్నే'' అన్నాడు. ఆ ధ్వని ఆమెకు వింతగా తోచింది. ఆనాడు భద్రయ్య మామ ఛాతీ చాలా విశాలంగా కనబడ్డది. ఆమెకు ఆమె మనసులోని నెరుసులన్నీ ఏరిపారేసింది.

(జయశ్రీ-ప్రత్యేక సంచిక)



# సూర్యమహల్ యజమానురాలు

పుష్పవల్లి కి శిక్షపడ్డది. పన్నెండు సంవత్సరాల చెరసాల శిక్ష విధించబడ్డది. కేసు వాయిదాలు పడి పడి ఆనాడే తీర్పు చెప్పబడ్డది.

ఇది ఎవరూ ఊహించని సంఘటన.

అందరికీ ఆశ్చర్యంగా ఉంది.

పుష్పవల్లిని చూసినవారు కొందరే. అయినా ఆమెను గురించి అందరికీ అంతా తెలుసు

పుష్పవల్లిని చూడాలని ఎంతకాలం నుంచో ఎందరో ఉవ్విళ్లూరుతున్నారు. కోర్టులో పుష్పవల్లిని చూడవచ్చని చాలామంది దేశం నాలుగు మూలల నుంచీ వచ్చారు.

పుష్పవల్లి నలభై ఏళ్ళు దాటిన మనిషి అంటారు తెలిసినవాళ్ళు. కాని చూసిన వాళ్లు ముప్పై ఏళ్ళ యువతి అంటారు. ఛాయ ఎక్కువ లేకపోయినా ఆకర్షణీయమయిన ముఖం. ఎన్ని గంటలయినా వాడినట్టు కనబడనీయని క్రీము ముఖానికి రాసుకుంటుంది. వయసు తక్కువగా కనిపించే వేషధారణ చేస్తుంది తన అందానికి మెరుగులు పెట్టేటట్టుగా కట్టుబొట్టు తీర్చి పెట్టేకుంటుంది. అందంగా, ఆకర్షణీయంగా నాగరికంగా కురులు పొట్టివైనా ముడుచుకుంటుంది. జంట గులాబీలను చెవికి పక్కగా కనబడేటట్టు ముడిమీద అమర్చుకుంటుంది.

పుష్పవల్లి మాట్లాడిందంటే ఎంత సిద్ధపడి వచ్చినా ఎదుటి వ్యక్తికి మాట్లాడటానికి పాయింట్లు దొరకవు వచ్చిన పని మరచిపోయే స్థితి ఎదురవుతుంది. ఇంగ్లీషులో హిందీలో తెలుగులో ఆమె మాట్లాడుతుంటే ఇంపుగా సొంపుగా ఉంటుందని తబ్బిబ్బయిపోతారు ఆఫీసర్లు కూడా.

పుష్పవల్లి నాలుగయిదు జిల్లాలకు ప్రాతినిధ్యము వహిస్తుంది. ప్రభుత్వ పరంగాగాని-ప్రైవేటుగాగాని ఎవరికి ఏపని కావాలన్నా వెంటనే ఆమె నగరానికి వెళ్ళి ఆ పని చేయించిపెట్టటం తన బాధ్యతగా ఆమె భావించుకుంటూ వచ్చింది

ఆమె నగరానికి కొత్త ఎంబాసిడర్ కారులో వస్తుంది రిట్జ్ హోటల్లో దిగుతుంది.

ఆమె ఏ పని చేతిలోకి తీసుకున్నా విజయవంతం కావలసిందే.

ఆమె కనీసం పది కేసులయినా చేతబట్టుకోనిదే ఇల్లు బయలుదేరదు.

వినటమే కాని ఆమె కేసుల వివరాలు అందరికీ తెలియవు. చిన్న ఇంజనీరు పెద్ద ఇంజనీరు కావాలి. చిన్న డాక్టరు బాగా ప్రాక్టీసు కలిసివచ్చే జిల్లాకు టాన్స్ఫరు కావాలి. శ్రీమంతుల అబ్బాయికి పబ్లిక్ సర్వీసు కమీషను సెలెక్షనులో ఉద్యోగం కావాలి. పల్లెటూళ్లో మారుమూలవుండే ఆఫీసురుకు నగరం ట్రాన్స్ఫర్ కావాలి. ఎవరికో హవుసింగ్ బోర్డువారు కట్టే ఇళ్ళల్లో మంచి ఇల్లొకటి ఎలాట్ కావాలి, మార్కులు రాని అబ్బాయిలకు మెడికల్ కాలేజిలో ఇంజినీరింగ్ కాలేజిలో సీటు రావాలి. ధనికుల పిల్లలూ, ఉద్యోగుల పిల్లలూ ఎక్కడా పరీక్షలు తప్పకూడదు, ఇంగ్లీషు మీడియమ్ స్కూళ్లల్లో సీట్లు రావాలి,

ఆఫీసర్ల కొడుకులు పెద్ద పెద్ద కంపెనీలల్లో డైరెక్టర్లయిపోవాలి. ఆఫీసర్లకు గబగబా ప్రమోషన్లురావాలి. వకీలు గవర్నమెంటు ప్లీడరయిపోవాలి; గవర్నమెంటు ప్లీడరు జడ్జీ అయిపోవాలి. ఇట్లాంటివే ఇంకా-ఇంకా-ఎన్నెన్నో ఆమె చిటికె వేసినంత సులభంగా నెరవేర్చ గలుగుతుంది.

ఏ ఆఫీసరు ఎప్పుడు చార్జి తీసుకున్నదీ ఎక్కడెక్కడికి బదిలీ అయిందీ ఆమెకు బాగా జ్ఞాపకం. వాళ్ళు నిర్వహించే శాఖలు ఆమెకు బాగా తెలుసు.

బోనులో నిలబడ్డ పుష్పవల్లి తీర్పు చెప్పిన జడ్జీవైపు ఒక సారి కన్నెత్తి చూసింది, అతడు మహీపతి. ప్రాక్టీసు లేక-పెళ్ళిలో భార్యకు పెట్టిన నగలు అమ్ముకుతినే పేద వకీలు పుష్పవల్లి తన శక్తినంతా ఉపయోగించి గవర్నమెంటు ప్లీడర్ను చేసింది. మయసభలాంటి ఇల్లు రెండేళ్ళల్లో కట్టేశాడు. ఆమె అతడిని జడ్జీని చేసింది.

''మరచిపోయావా ఎలా జడ్జీ వయ్యావో ?'' అన్నట్టు చూసింది జడ్జీ ముఖం లోకి పుష్పవల్లి. ఆ చూపులకు తట్టుకోలేక కళ్లు వాల్చేశాడు మహీపతి.

ప్రభుత్వం పక్షాన వాదించిన వకీలు ఇటువంటి చీడపురుగులకు యావజ్జీవ కారాగారవాసము విధించాలని బలంగా వాదించాడు. వాదించేటప్పుడు పుష్పవల్లి ముఖంలోకి చూస్తూ ఉచ్ఛైస్స్వరంతో గంభీరంగా వేలుపెట్టి చూపిస్తూ నిశితంగా విమర్శించాడు.

తటాలున పుష్పవల్లి తలఎత్తి అతడి ముఖంలోకి చూసి పక్కున నవ్వింది.

''హనుమంతరావూ ! నీకీ పబ్లిక్ ప్రాసిక్యూటర్ పదవి ఎలా వచ్చింది ? ఎప్పుడు వచ్చింది;" ఆ నవ్వులో హేళన అలలు అలలుగా బయలుదేరి అతడి ఎదలో సముద్ర ఘోషను సృష్టించింది.

కోర్టులో పోలీసు ఉన్నతాధికారులు కూర్చుని వున్నారు. వాళ్ళంతా ఆమెను కసిగా చూస్తున్నారు. ఇంతకాలానికి నిన్ను పట్టుకోగలిగామన్న గర్వము వాళ్ళ చూపుల్లో ఆమెకు స్ఫురించింది.

పుష్పవల్లి విచిత్రంగా పెదవులు ముడిచి సాగదీస్తున్నది.

డియస్పి సుందరానికి ప్రమోషన్ రావటానికి తను చాలా కష్టపడ్డది. నలుగురుని దాటించి అతనికి ప్రమోషన్ ఇప్పించిందంటే తన కష్టమెంతో అతడు అంచనా వేయగలిగాడా ?

అందరూ నీచులు ! తమ పబ్బం గడుపుకున్న తరవాత తిరిగైనా చూడరు

పుష్పవల్లి ముక్కు ముడతలు పడ్డది అసహ్యంతో.

ఆమె చూపులు మళ్ళీ జడ్జి మహీపతి మీదకి ప్రసరించాయి.

మహీపతికి జడ్జి పని కావాలంటే తను మంత్రి దగ్గరకి అనేకసార్లు వెళ్ళింది. అతడు హార్స్‌లీహిల్స్‌కు వెళ్ళాడనగానే తనూ వెళ్ళింది, అతడిని వశము చేసుకుంది, తనకోరికను పదే పదే అతని చెవిలో నూరిపోసింది.

"నీవు సిఫారసు చేసిన తరువాత కాదనలేను. కాని మరీ అంత జూనియర్ కిస్తే అంతా అనుమాన పడతారు" అంటూ నసిగాడు.

"అబ్బ! ఎప్పుడు ఏ దడిగినా వెంటనే చెయ్యరుకదా! ఎంతో బ్రతిమి లాడాలి. ఎన్నాళ్ళో వెంట బడాలి" అతడు చిత్తయిపోయేటట్లు గునిసింది పుష్పవల్లి. అతడు నిరాకరించటానికి వీలులేకపోయింది.

పబ్లిక్ ప్రాసిక్యూటరు హనుమంతరావు విషయంలో కూడ ఆరునెలలు పట్టింది పనిపూర్తికావటానికి. అధికారులు చేస్తామంటారు కాని చెయ్యరు, వాళ్ళ వెంటబడి ఆర్డరు చేతిలోనికి తీసుకొనేటప్పటికి తలప్రాణం తోకకు వచ్చింది.

డియస్పి సుందరం కేసు చాలా గడ్డు కేసు. సర్వీసు తక్కువ. పైగా నలుగురిని దాటవేసి ప్రమోషన్ ఇప్పించాలి. హోం మినిస్టరు భార్యతో స్నేహం చేసి-ఆమె ద్వారా అతడి పరిచయం సంపాదించింది. అతడు పర్యటించిన ఊళ్ళకు వెళ్ళి అక్కడ అతనిని అనేక పర్యాయాలు నైతికంగా దిగజార్చింది. అతడు గడసరి. ఆమెను అనుభవిస్తూనే 'ఇరవై ఏళ్ల పిల్లలు నీ చేతిలో చాలామంది ఉన్నారని తెలిసింది ఎప్పుడూ నువ్వేనా? వాళ్ళను పంపించు' అన్నాడు.

పుష్పవల్లి గుండె గతుక్కుమన్నది :

"మీకెట్లా తెలుసు?" అన్నది తెల్లబారిన ముఖంతో.

అతడు బిగ్గరగా నవ్వాడు. "నీవు ఎట్లా వలలు విసురుతావో, ఎటువంటి ఎరను చూపిస్తావో అంత మాత్రం తెలియకుండానే నాలుగేళ్ళ నుంచీ హోంమినిస్టరుగా ఉన్నానా?"

పుష్పవల్లి గజగజ వణికి పోయింది. "మీరు అంతగా కావాలంటే ఎట్లాగో తంటాలుపడి పంపిస్తాను. నన్ను కాదనకండి" అతడి కాళ్లు పట్టుకుంది. తప్పని సరిగా అప్పటి నుంచీ మిస మిసలాడే జవ్వనులను ఆయనకు ఒప్పగిస్తూ వచ్చింది. మంచి దారుఢ్యమూ అవయవ పొందికా గల పిల్లలను ఏరి ఏరి అతడి వశంచేసింది.

పుష్పవల్లి సంగతి అందరికీ తెలుసు కాని ఆమెను పట్టుకోవటం చాలా కష్టం. ఆమె ఎవరికీ అనుమానం కలగకుండా ఏర్పాటు చేయటంలో ఆరితేరింది.

పుష్పవల్లి నగరం వచ్చినప్పుడు రిట్జ్ హోటల్లో దిగటం మాట నిజమే కాని-ఊరి చివరగా ఉన్న ఆలీ మంజిల్‌లో జరిగే భజన మండలిలో సభ్యురాలు కావటంవల్ల అక్కడే ఎక్కువ కాలం గడుపుతుంది. ఆడపిల్లల హాస్టల్ వార్డెను

స్నేహితురాలు కావటంచేత తరచుగా అక్కడికి వెళ్ళి పిల్లలనుచూసి పార్టీలు ఇస్తుంది. ఒంటరిగా సినిమాలకు వెళ్ళలేనంటూ వార్డెను పర్మిషను తీసుకుని తను సెలక్టు చేసుకున్న పిల్లలను వెంట తీసుకు వెళ్ళుతూ ఉంటుంది. ఆమె తలపెట్టిన కార్యాలకు ఈ పిల్లలెంతో తోడ్పడుతూ వుంటారు. కొందరు పిల్లలు పిలవగానే ముసిముసి నవ్వులతో బయలుదేరుతారు. కొందరిని మచ్చిక చేసుకోవటానికి కొంత కాలం పట్టేది. వాళ్లందరికీ కోరిన బట్టలు బహూకరించేది.

ఒకసారి ఒక కలెక్టరుమీద మంత్రికి ఎంతో ఆగ్రహం కలిగింది.ఆకలెక్టరు జిల్లానంత చీపురుపెట్టి ఊడ్చినంత పని చేశాడు. మంత్రికి తెలిసి సస్పెండు చేయ బోయే సమయంలో ఆ కలెక్టరు పుష్పవల్లి కాళ్ళు పట్టుకున్నాడు. ఆమె కేమీ పాలు పోలేదు, అదేమైనా సామాన్యమయిన కేసా ? అయినా ధైర్యము చిక్కపట్టుకుని ఆ మంత్రిని తన ఊరు రప్పించి అతడు కనీవినీ ఎరుగని అందాల బాలను వెదికి ఒప్పగించింది. అతడికీ తెలుసు - పుష్పవల్లికి ఏదో పెద్ద కోరిక ఉందని. రెండు రోజుల తర్వాత లొంగిపోయాడు.

ఆనోట ఆనోట పుష్పవల్లి పేరు అందరిలో పాకిపోయింది ఎవరికే యిబ్బంది వచ్చినా పుష్పవల్లి వరాలు ఇచ్చే మహాలక్ష్మిగా భావిస్తూ వచ్చారు. ఎంత ఆమెను ఆడిపోసుకున్నా ఆమె సహాయాన్ని అపేక్షించక తప్పటంలేదు.

ప్రతిసారి జనరల్ ఎలక్షన్లు వచ్చినప్పుడూ పుష్పవల్లికి "రెడ్డి వచ్చే మొద లాడరా !" అన్నట్టుగా ఉంటుంది. ఎవరి స్వభావాలెలా ఉన్నాయో తెలుసుకోవాలి. ఎవరెట్లా లొంగుతారో కనిపెట్టాలి. అనుభవంమీద పుష్పవల్లి ఎటువంటి వారి నయినా క్షణాలమీద మచ్చిక చేసుకోగలదన్న పేరు సంపాదించింది.

ఈ పర్యాయం జరిగిన ఎన్నికలలో నరహరి మెజారిటీ ఓట్లతో ఎన్ని కయ్యాడు. అతడు ఎటువంటి సంఘ విద్రోహులను ఇట్టే పట్టేయగలడని క్రితం శాసన సభ్యుడైనప్పుడే ఋజువు చేసుకున్నాడు. ఆ కారణంచేతనే అతడీ పర్యా యం ఎన్నిక కాగానే హోంమినిస్టరయ్యాడు.

అతడు మంత్రిపదవి స్వీకారం చెయ్యగానే అభినందించటానికి పుష్పవల్లి గంపెడు యాపిల్‌పండ్లూ ఎర్ర గులాబీల దండా తీసుకువెళ్ళింది.

''తమరు శాసన సభ్యులా ?'' అన్నాడు నరహరి.

బంగారుపు పన్ను కనపడేలా నవ్వి ఒయ్యారాలు ఒలకబోస్తూ పుష్పవల్లి జవాబిచ్చింది. ''మంత్రిగారిని దర్శించుకోవటానికి శాసన సభ్యత్వము ఉండాలా?''

మొట్టమొదటిసారిగా నరహరి తబ్బిబ్బయ్యాడు.

''లేదులెండి. మీ అభిమానానికి కృతజ్ఞుణ్ని.'' ఆమె సమర్పించినవి అందు కొని కృతజ్ఞతలు తెలిపాడు కాని - అతడి మనస్సులో పాతగాయం రేగింది. తన స్నేహితుడూ అన్నివిధాలా తన ఎన్నికలలో సహాయం చేసినవాడూ డియస్పీ పదవికి తగిన యోగ్యత అర్హతలు కలవాడూ అయిన మనోహర్‌రావును కాకుండా చాలా జూనియర్ అయిన సుందరానికి ఆ ఉద్యోగం ఇప్పిస్తుందా? అది నిజానికి తనకూ పుష్పవల్లికీ మధ్య పోటీ. ఎవరికెంత బలముంటే వాళ్ళ అభ్యర్థికి గెలుపు ఆ సందర్భంలో ఓటమి మనోహర్‌రావుది కాదు - తనది. తను శాసనసభ్యుడై ఉండి కూడా పనిచేయించుకోవటం చేతకానివాడైనాడు.

పుష్పవల్లి ప్రయోగించే చతురోపాయాలన్నీ నరహరికి బాగా తెలుసు, కాని పట్టించేదెట్లా? అది పిల్లి మెడలో గంట కట్టడమే. ఎందుకంటే మంత్రిమండలిలో శాసన సభ్యులలో - ఉన్నతోద్యోగులలో పుష్పవల్లిపట్ల ఎనలేని గౌరవాభిమానాలు ఉన్నాయి. అతడెన్ని పర్యాయాలో ప్రత్యక్షంగా చూశాడు. ఏం చెయ్యగలడు? ఎవరితో చెప్పినా ఎవరూ అతడిమాట ఖాతరుచేసే స్థితిలోలేరు.

సర్జన్ నందగోపాల్ మీద కరప్షన్ చార్జెస్ ఎన్నో ఉన్నాయని పుకారు. అతడి చేతిలో ఒక రోగి బల్లమీదనే చనిపోయాడు. సర్జన్ అశ్రద్ధవల్ల రోగి చనిపోయాడని అతడి భార్య కేసు పెట్టింది. దానితో అతడిమీద అంతకుపూర్వం ఉన్న కరప్షను చార్జెస్ అన్నీ బయటికి వచ్చాయి. ఉద్యోగంపోయే పరిస్థితులుఏర్పడ్డాయి.

గుండె చిక్కబట్టుకుని సర్జన్ నందగోపాల్ పుష్పవల్లి నాశ్రయించాడు. పుష్పవల్లి ఎందుకయినా మంచిదని ముందుగా ముఖ్యమంత్రి దగ్గరికి వెళ్ళి అతడిని అన్ని విధాలుగా సంతుష్టి పరచి వైద్యశాఖామాత్యులకు ఫోన్ చెయ్యమని వేడుకున్నది.

''మీకేం భయంలేదు. మిమ్మల్ని చూడగానే చెప్పిన పనిచేస్తాడు'' అన్నాడు ముఖ్యమంత్రి.

వైద్యశాఖామాత్యుడు అరవై సంవత్సరాలు-కాదు - డెబ్బది సమీపిస్తున్న వాడు. చాలా నిబ్బరము కలవాడు. ఎటువంటి పరిస్థితులలోనూ మతి పోగొట్టు కోని వాడు. పుష్పవల్లి తెచ్చిన బుట్టెడు ద్రాక్షలు తన కవసరంలేదనితిరగ్గొట్టాడు. ఆమె వచ్చిన పని ఏమిటంటూ ప్రశ్నించాడు కాస్త కరుకుగా.

తన సోయగాలన్నీ ప్రదర్శిస్తూ పుష్పవల్లి తన ఎర్రటి పెదవులను మాటి మాటికి నాలుకతో తడిచేసుకుంటూ సర్జన్ నందగోపాల్‌కు జరిగిన అన్యాయాన్నంతా వర్ణించి వర్ణించి జాలి గొలిపేటట్టు చెప్పింది. అప్పటికి వాయిదా వేసి "చూద్దాంలే అంటూ పంపించేశాడు వైద్యశాఖామాత్యులు.

వారం రోజుల తరువాత కళ్ళకు మిరుమిట్లు గొలిపే అంప గస్తైతో వెళ్ళింది పుష్పవల్లి మంత్రి దగ్గరికి. అతడు మామూలు మాటలు చెప్పి పంపిం చేశాడు

ఆమెకు ఆశాభంగము కలిగినా నిరాశకలగలేదు. పుష్పవల్లి పదిరోజుల తరువాత రిట్జ్ హోటల్లో మంత్రికి విందు చేసింది. ఆ విందులో పాల్గొన్నవారు మంత్రికాక-నలుగురు రంభలాంటి పడుచులు, మత్తు గొలిపే రకరకాల పానీయా లతో ప్రత్యక్షమయ్యారు. "ఎంతవారయినా కాంతా దాసులే కదా!" అన్నసూక్తిని పుష్పవల్లి పక్కగదిలో కూర్చుని తలుచుకుంటోంది.

సరిగ్గా ఆ సమయంలో ఆ నలుగురినీ ఆరెస్టు చేయటానికి హోం మినిష్టరు నరహరి డియస్పీ సుందరాన్ని స్వయంగా పంపించాడు.

మినిష్టరు ఉన్న పక్క గదిలో మిగతా ముగ్గురితో కష్టసుఖాలు చర్చించే పుష్పవల్లి పట్టుపడిపోయింది సరిగ్గా ఆ సమయానికి మినిస్టరు తన చేతిలో ఉన్న నాలుగు కాగితాలు-ఆ అమ్మాయిల చరిత్రల్తో వాఙ్మూలాలతో సహా డియస్పీ చేతిలో పెట్టాడు.

ఆ నలుగురు పిల్లలూ విద్యార్థినులుట. పుష్పవల్లి అడగగానే వార్డెను వాళ్ళను పంపుతుందట.

వ్యతిరేకంగా ఒకటి బయటికి రాగానే పదీ వాటంతట అవే బయటికి వస్తాయి. తమ అవసరాలు తీర్చుకున్న వాళ్ళూ, పబ్బాలు గడుపుకున్న వాళ్లూ ఏ మాత్రం కృతజ్ఞత లేకుండా సాక్ష్యం చెప్పారు పుష్పవల్లి కేసులో.

పుష్పవల్లి బలవంతురాలే. అందరికీ పుష్పవల్లి బాగా తెలుసు. ఆమె భర్త, ఎవరో ఎవరికీ తెలియదు కాని-ఆమె ఇద్దరు కొడుకులూ అమెరికాలో వ్యాపారం చేస్తున్నారని అందరికీ తెలుసు.

ఇంతకాలం అవిచ్ఛిన్నంగా ఎదురు లేకుండా బ్రతికిన పుష్పవల్లిని ఎవరో వలవేసి పట్టారు. ఆమెకు తెలుసు ఇదంతా హోంమినిష్టరు నరహరి పనేనని.

"మీరంతా ఉద్యోగాలలో ఎదుగూ బొదుగూ లేకుండా చావండి" ధీమాగా నడుస్తూ పుష్పవల్లి పోలీసుల వెంట నడిచింది.

జడ్జి, పబ్లిక్ ప్రాసిక్యూటర్. డియస్పీ, ఇంకా ఇతర ఉద్యోగులూ, ప్రేక్షకులూ తలలు వంచుకున్నారు.

ఆమె కట్టిన దేవేంద్ర భవనంలాంటి రెండంతస్తుల సూర్యమహల్ మాత్రము తన యజమానురాలికి దురవస్థ పట్టిందని వన్నె తరిగింది.

(అనామిక-మాస పత్రిక)



# ఆదర్శాలూ - అనుభవాలూ

రామారావు, పుండరి, సువర్చల వెళ్ళేసరికి ఆఫీసరుకుటుంబమంతా నలుగురు కూతుళ్ళూ ఇద్దరు కొడుకులు, ఆయన శ్రీమతి హాల్లో కూర్చుని ఉన్నారు.

"రండి రండి మీకోసమే ఎదురు చూస్తున్నాం" ఆఫీసరు కేశవరావు ఎదురుగా వెళ్ళాడు ముగ్గురునీ ఒక సోఫాలో కూర్చోబెట్టారు.

రెండు నిముషాలసేపు ఎవరూ మాట్లాడలేదు. ఎయిర్ కూలర్ హాయిగొలుపుతుంటే అలుపు తీర్చుకుంటున్నట్టు కూర్చుండిపోయాడు.

అయిదు నిమిషాలలో నలుగురమ్మాయిలూ లేచి కాఫీ టిఫిన్లు అందించారు. మాట్లాడుతూ టిఫిన్ తింటూ కేశవరావు పుండరిని ఒక కంటితో పరీక్షగా చూస్తున్నాడు. ఆయన శ్రీమతి కూడా పుండరిని ఆపాదమస్తకం పరిశీలనగా చూస్తూనే వుంది.

"అయితే రామారావుగారూ! వీరిని సరిగా పరిచయం చేయండి." అంటూ సన్నగా నవ్వాడు కేశవరావు. అంతకుముందు రామారావు చెప్పిన క్లుప్త పరిచయము చాలదన్నట్టు.

"వీడు మీ అన్నగారి కుమారుడు. నిరుడు యమ్‌టెక్ ప్యాసయ్యాడు. బొంబాయిలో ఉద్యోగం వచ్చింది. వీడు కవల పిల్లలలో ఒకడు కావటాన మా ఆవిడ నెలపిల్లవాడప్పటి నుంచీ పెంచింది. మా దగ్గరే మెట్రిక్యులేషన్ వరకూ చదువుకున్నాడు. పై చదువులన్నీ మదరాసులో చదివాడు. ఉద్యోగంలో చేరబోతూ మా యిద్దరినీ చూడాలని వచ్చాడు." టిఫిన్ పూర్తిచేసి కాఫీ కప్పందుకున్నాడు రామారావు.

అంతలో నలుగురమ్మాయిలూ టిఫిన్ తీసుకుంటూ వాళ్ళలో వాళ్ళు మెల్లగా మాట్లాడుకోవడం మొదలు పెట్టారు. అబ్బాయిలు రవి, చంద్ర బెల్‌బాటమ్‌పాంట్లు

బుజాలు తాకే తల వెంట్రుకలు కూనిరాగాలు తీస్తూ పుండరిని బూట్లమీద దృష్టి కేంద్రీకరించి చూస్తున్నారు.

కేశవరావు శ్రీమతి కామాక్షమ్మ, పుండరి హాల్లోకి వచ్చి కూర్చున్న తరువాత సువర్చలతో తన కూతుళ్ళ చదువుల గురించి సంస్కారాన్ని గురించి అలవాటు చొప్పున గొప్పగా వర్ణించి చెప్పడం మొదలు పెట్టింది.

సువర్చల మరీ ఆధునికంగా కనబడక పోయినా ఆమె అలంకరణంలో దిద్దుబాటులో నూతనత్వము ప్రస్ఫుటమవుతూ ఉంటుంది. ఎదటివారి మాటల్లోని లోటుపాటులను క్షణాలమీద గ్రహించి అంచనా వేయగలదు. కాని తను మాత్రం పట్టుబడదు. ఆమె అక్కడ కూర్చున్న అమ్మాయిలను చూసినట్లు పైకి కనబడకుండా బాగా చూసింది

ఇద్దరమ్మాయిలు నైలెక్సు చీరలు కట్టారు. ఒకమ్మాయి పంజాబ్ డ్రెస్‌లో వుంది. ఒక అమ్మాయి లుంగీకట్టి వదులుగా జాకెట్టు ధరించింది. ఛాయ తక్కువయినా అందరికీ కను ముక్కు తీరు బాగున్నది.

కేశవరావు మధ్యలో భార్యవంక చూశాడు. ఆమె గ్రహించి "ప్రతిమా సితార్ తీసుకురా" అన్నది.

సువర్చలతోపాటు రామారావు కూడా నలుగురిలో ప్రతిమ ఎవరోనను కుంటూ చూశారు. ఎర్రటి ద్రాక్షగుత్తుల చీరె కట్టుకుని చేతులులేని బ్లౌజు ధరించిన అమ్మాయి మెల్లగాలేచి లోపలికి వెళ్ళి సితార్ తీసుకువచ్చి. ఒక ప్రత్యేకమయిన బల్లమీద కూర్చుని వాయించటం మొదలుపెట్టింది.

"మా ప్రతిమ రవిశంకర్ శిష్యుడికి శిష్యురాలండి. సంగీతంలో అమ్మాయికి డిగ్రీ కూడా ఉంది" తండ్రి ప్రతిమను అబ్బురంగా చూస్తూ చెప్పాడు రామారావుతో.

ప్రతిమ అరగంటసేపు భజనలు వాయించింది. తానం, పల్లవి వాయించింది రెండు సినిమా పాటలు మహమ్మద్ రఫీవి వాయించింది. ఆమె కళ్లు మూసుకుని వాయించుతుంటే ఆమె కురచవెంట్రుకలు ఇటూ అటూ తలతోపాటు ఊగటం మొదలుపెట్టాయి. ఆమె సితార్ వాయించుతున్నంతసేపూ కన్నార్పకుండా చూశారు.

ముగ్గురమ్మాయిలు కాలివేళ్ళతో తాళం వేస్తూచూస్తున్నారు. వాళ్ళల్లో మాలిని రెండవ అమ్మాయి. క్షణాలమీద మనిషిని చూసి తన దృష్టిలో ఏతరగతిలో చేర్చాలో నిశ్చయం చేసెయ్యగలదు. పుండరి హాల్లోకి నడచివచ్చిన తీరూ, కూర్చునేతీరూ, కాఫీతాగే పద్ధతీ, టిఫిన్ చేతివేళ్ళతో నోట్లోపెట్టుకునే విధమూ, నమిలే పద్ధతీ గమనించింది. నవ్వే తీరూ కూడా బాగా కనిపెట్టి చూసింది.

రామారావు, కేశవరావు లేచారు. వాళ్ళను చూసి సువర్చల లేచింది.

"రామారావుగారూ! మళ్ళీ కలుద్దాము. అయితే మీ అబ్బాయి ఉంటాడా నాలుగు రోజులు?" అన్నాడు క్రాపు సవరించుకుంటూ కేశవరావు.

"లేదండీ, రెండుమూడు రోజుల్లో వెళ్ళిపోతాడు. ఉద్యోగంలో చేరాలట. ఇక్కడినుంచి వెళ్ళి మాఅన్నగారి దగ్గర ఒకరోజు ఉండి అక్కడినుంచి బొంబాయి రైలెక్కుతాడు.

"అలాగా! అయితే నేను రేపే మిమ్మల్ని ఇంట్లో కలుసుకుంటాను. రాత్రి ఎనిమిదింటికి నేనూ మా శ్రీమతి వస్తాము" అన్నాడు.

వాళ్ళను వీధివాకిలివరకు సాగనంపి కేశవరావు రామారావుతో పుండరికి కాస్త ఇవతలిగా వచ్చి, నెమ్మదిగా అడిగాడు.

"కట్నకానుకలు పెద్దఎత్తులో ఉంటాయా?" అంటూ

"అబ్బెబ్బే! ఆ మాట మావాడి దగ్గర-మా అన్నయ్య దగ్గర అనకూడదు - వినకూడదు" అన్నాడు రామారావు.

ఆ రాత్రి భోజనాలయిన తరువాత బైట కుర్చీలు వేసుకుని కేశవరావు కుటుంబమంతా సమావేశమయ్యారు. కేశవరావు తమలపాకులు నములుతూ సిగరెట్టొకటి ముట్టించాడు.

"మీరంతా కడుపులో దాచుకుంటారు. ఏ సంగతీ పైకి చెప్పరు. ఎలా ఉన్నాడు అబ్బాయి?" అడిగింది కామాక్షమ్మ.

"మీరంతా ఒక్కొక్కళ్ళే చెప్పండి మీ మీ అభిప్రాయాలు" అన్నాడు పైకి పొగ వదుల్తూ కేశవరావు.

"నాన్నా! అదేమిటి క్రాపు అంతనున్నగా దువ్వుకున్నాడు కిందికి? ఆ సూటు - ఆ టై కట్టుకోవటమూ - ఆ మెరిసే బూట్లు - ఏదో కొత్త బిచ్చగాడు ప్రొద్దెరగడు అన్నట్టుగా ఉంది అతడి వేషము" అన్నది మాలిని.

ఆమె తరువాత లిల్లీ మరీ చురుకు. "అదేమిటి నాన్నా! నవ్వటం కూడా సహజంగాలేదు. సినిమాలో పోజు ఇచ్చినట్టుగా ఉంది" అన్నది.

"పళ్ళు చూశావా ఎలా పేర్చినట్టుగా ఉన్నాయో! అవి సహజమైనవేనా అని నా సందేహం" ప్రమ్మీ నిర్భయంగా తన అభిప్రాయం చెప్పేసింది.

అమ్మాయిలిద్దరూ ఒక్కసారే గొంతెత్తారు "మరీ పూర్వకాలం మనిషి నాన్నా! ప్రతిమ అంత చక్కగా వాయిస్తూ ఉంటే లేచి దగ్గరగా వెళ్ళి మెచ్చుకో వద్దూ? కూర్చున్న చోటనుంచే చూస్తున్నాడు కదలలేని వాడిలా. తను ఈడు వాళ్ళం ఎదురుగా ఉంటే ఒక్క మాటయినా మాట్లాడాడా! మన ప్రతిమనా అటు వంటివాడి కివ్వటం! మాకేం నచ్చలేదు" అంటూ.

కేశవరావు వాళ్ళ రిమార్కులన్నీ శ్రద్ధగా విన్నాడు. సిగరెట్టుముక్క దూరంగా విసిరేసి, ఆఫీసరుహోదా ఒళ్లువిరుపు అయిన తరువాత "కామూ! నీవు?" అన్నాడు.

"నా మనసులో ఏమున్నదో సరిగ్గా లల్లీ. ప్రమ్మీ మాలిని చెప్పేశారు. నేనూ మొదటి నుంచీ గమనిస్తూనే ఉన్నాను. పిల్లవాడు ఎర్రగా ఉండగానే సరా! ఉద్యోగం పెద్దదవగానే సరా! ఈకాలం పిల్లలకు నచ్చేటట్టు మాటా-పలుకూ-నడతా ఉండాలా? ముసలాడు కూర్చున్నట్టు మీ యిద్దరిమధ్యా ఇరికి కూర్చున్నాడు" కామాక్షమ్మ తన రిమార్కులన్నీ ఏకరువు పెట్టింది

"పిల్లవాడు బాగున్నాడు, మంచి ఉద్యోగం మొదట్లోనే వచ్చింది. ముందు ముందు ఇంకా పైకి పోతాడు. విదేశాలకు వెళ్ళే అవకాశాలు వస్తాయట. మన మ్మాయి కూడా వెళుతుంది అన్నిటికంటె అబ్బాయి చాలా మంచివాడు. ఎటు వంటి దురభ్యాసమూ లేదని పినతండ్రి చెప్పాడు" కేశవరావు విబ్బరంగా చెప్పు కుంటూ పోతున్నాడు.

కామాక్షమ్మ తలలోపూలు సవరించుకుంటూ ఆలోచిస్తున్నది. ఎందుకో ఆమె మనసు వెలితి వెలితిగా ఉంది.

''ప్రతిమను అడిగావా? అభిప్రాయం కూడా కనుక్కో—''

''ముందు మనందరికీ నచ్చితే దాన్ని అడగవచ్చుగాని మనకే సందేహాలు తీరకపోతే దాన్నేమని అడగటం?'' కామాక్షమ్మ ప్రతిమవంక చూసింది.

''అతడికి చాలా ఆస్తి ఉన్నదని కూడా రామారావు చెప్పాడు. తండ్రి మంచి స్థితిమంతుడు. ఇతడివాటాకే దాదాపు ఏభయివేల వరకూ ఉంటుందని అంచనా'' కేశవరావు ఉత్సాహంగా చెబుతున్నాడు.

''ఆఁ అసలు పాయింటు మీరే వింటారు. అంత ఆస్థిగల పిల్లవాడు బాగా చదివినవాడు మొదటే పెద్ద ఉద్యోగం వచ్చినవాడూ నేను కానీ కట్నం లేకుండా పెళ్ళి చేసుకుంటానంటుంటే మీకు అనుమానం కలగటం లేదండీ? కట్నం నగదుగా కాకపోయినా వస్తురూపేణా కూడా వద్దంటున్నా డంటున్నారు. ఇందులో ఏదో తిరకాసు ఉన్నది.'' తన తెలివికి తానే మురుస్తూ ముక్కుపుటాలెగుర వేసింది కామాక్షమ్మ.

''ఏముంటుంది?'' ఆమె ఆర్గ్యుమెంటును కొట్టివేస్తూ అన్నారు.

''ఏముంటుందీ! వంశము పరువు ప్రతిష్ఠలు గలది కాకపోవచ్చు. లేదా పిల్లవాడిలో ఏదో లోపం అయినా ఉండవచ్చు. మొత్తానికి ఏదోవుంది. ఏ లోపమూ లేకపోతే అలా ఎందుకంటారు?'' కామాక్షమ్మ చెప్పిందంతా పిల్లలు విన్నారు.

''అవున్నాన్నా!'' అన్నది మాలిని.

''సరిగ్గా అంతే'' అన్నది ప్రమీల.

''నేను మొదటే అనుకున్నాను'' అన్నది లిల్లీ.

లలిత, ప్రమీల, మాలిని ఒక్కసారే కళ్ళు మెరిసేటట్టు చూశారు తల్లి ముఖంలోకి. ఇంక ప్రతిమ నడగ నక్కర లేదన్నట్టుగా.

మగపిల్లలు దిలీపు, సురేందర్ హేళనగా నవ్వుకుంటూ లేచి వెళ్ళిపోయారు.

బరువుగా నిట్టూర్చి లేచాడు కేశవరావు.

మరునాడు సాయంత్రం మర్యాదకని ఒక్కడే రామారావింటికి వెళ్ళాడు కేశవరావు.

పుండరి ఇంట్లో లేడు. పినతల్లితో సినిమాకువెళ్ళాడు. అరగంటకు పైగా కేశవరావు ఈ మాట ఆ మాటా మాట్లాడాడు కాని పెళ్ళి మాటల ప్రసక్తిలేదు. ఎన్నాళ్ళ నుంచో సంబంధాలు చెప్పమని వేధిస్తున్న కేశవరావు మాట్లాడకపోవటంతో రామారావు ఆశ్చర్యంగా చూశాడు. కాని తనకు తాను ఆ ప్రసక్తి తేదలచలేదు.

పుండరి పినతండ్రికీ, పినతల్లికీ బట్టలు పెట్టాడు. వాళ్ళ ఆశీర్వచనంతో రైలెక్కాడు. పన్నెండు గంటలు ప్రయాణంచేసి ఇల్లు చేరుకున్న పుండరికి తల నొప్పితో పాటు నాలుగు వాంతులయ్యాయి. తల్లి గాభరా పడిపోయింది. తండ్రి గబగబా నాలుగిళ్ళ అవతలవున్న డాక్టరును రమ్మని ఫోను చేశాడు.

డాక్టర్ పి కె. రావు పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వచ్చాడు. సంగతంతా తెలుసుకుని "ఇతన్ని నా కారులో నా నర్సింగ్ హోముకు తీసుకువెళ్ళి పరీక్షచేసి మందిచ్చి పంపుతాను. నేనే స్వయంగా తీసుకువచ్చి దింపుతాను" అన్నాడు స్టెత్ ఊగించుతూ.

"పదండి నేనూ వస్తాను. సీరియస్ కాదు కదా ?" అంటూ చెప్పులేసుకుని బయలుదేరాడు శ్రీనివాసరావు.

నర్సింగ్‌హోమ్‌కు వెళ్ళగానే గబ గబా ఒక ఇంజక్షన్ ఇచ్చాడు డాక్టరు. ఎందుకయినా మంచిదని గ్లూకోస్ ఎక్కించాడు. రెండు మూడు గంటలకుపైగా రెస్టు తీసుకోమని చెప్పాడు. మత్తుగా పడుకున్నాడు పుండరి.

డాక్టర్ని ఏమీ అడగలేక-మనసు శాంతపరచుకోలేక గాభరా పడిపోతున్నాడు శ్రీనివాసరావు. ఆయనకు ఒళ్ళంతా కంపిస్తున్నది. చెమటతో షర్టంతా తడిసి పోయింది. మాటిమాటికీ ఉత్తరీయంతో ఫాలభాగమంతా ఒత్తుకుంటున్నాడు.

పన్నెండు గంటలకు సుమారు డాక్టరు రావు వచ్చాడు. వస్తూనే రెండు కప్పుల కాఫీ తెప్పించి ఒకటి శ్రీనివాసరావు కిచ్చి తానొకటి తీసుకుంటూ "ఏమోయ్

పుండరి! వికారం తగ్గిందా? ఇప్పుడేం లేదు కదూ?'' కప్పు కిందపెట్టి పుండరిని మరొక గదిలోకి తీసుకువెళ్ళి బ్లడ్ ప్రెషర్. మలమూత్రాల పరీక్ష. రక్తము నాలు గయిదు రకాల పరీక్ష, గుండె శ్వాసకోశాల పరీక్ష మొదలైనవన్నీ క్షుణ్ణంగా చేశాడు.

నాలుగు వాంతుల కింత పరీక్ష అనుకుంటూ ఆలోచనలో పడ్డాడు పుండరి.

''శ్రీనివాసరావుగారూ! మీ అబ్బాయికేం భయంలేదు. నా పని కూడా అయిపోయింది. పదండి మిమ్మలిద్దర్ని ఇంట్లో దింపుతాను. ఇప్పటికే మీ భోజనా లకు ఆలస్యమైంది,'' అంటూ కారు దగ్గరికి వచ్చాడు. ఆయన వెనకే పుండరి, శ్రీనివాసరావు చేరుకున్నారు కారు దగ్గరికి.

తలుపు తెరిచేసరికి ''ఇంత ఆలస్యమయిందేమిటి నాన్నా?'' అంటూ దిగి వచ్చింది ఒక ఇరవై ఏళ్ళ అమ్మాయి.

''కొంచెమున పని ఎక్కువగా వుందమ్మా ఇవ్వాళ. అన్నట్టు ఈయన శ్రీనివాసరావుగారు రిటైర్డు జడ్జి, ఇతడు పుంరి వాళ్ళ అబ్బాయి. బొంబాయిలో ఉద్యోగమయింది.'' అంటూ పుండరిని చూసి ''ఇది మా అమ్మాయి నిర్మల. హవుస్ సర్జన్‌గా వుంది గవర్నమెంటు హాస్పిటల్లో. ఒక్కతే అమ్మాయి కదూ అతి గారాబము.'' నవ్వాడు మురిపెంగా డాక్టరు రావు.

పుండరినీ శ్రీనివాసరావును దింపుతూ ''శ్రీనివాసరావుగారూ! రాత్రికి వచ్చి చెబుతాను రిజల్ట్సు. అన్ని టెస్టులూ చేశాను. భోజనంచేసి హాయిగా నిద్రపొండి.'' అంటూ వెళ్ళిపోయాడు

''ఏమిటినాన్నా ఇదంతా? ఈయన మీకు బాగా తెలుసా?'' అన్నాడు విసుగుదల చూపిస్తూ పుండరి భోజనం చేసేటప్పుడు.

''అదేమిట్రా? ఎరక్క పోవడమేమిటి? మనవాళ్ళే ఎక్కడో బంధుత్వము కలిసే వుంటుంది. ఒకటే శాఖ ముందు సంబంధం కలుపుకోవాలని ఉన్నట్టు. శకుంతలమ్మగారు డాక్టరు రావుగారు అంటున్నారు కూడాను'' అలసిపోయి వచ్చిన కొడుక్కు గ్లాసులో మంచినీళ్ళు పోసింది మాణిక్యమ్మ.

పైకి ఏమీ మాట్లాడలేదు పుండరి. శ్రీనివాసరావు భోజనం చెయ్యగానే నిద్రకొరిగాడు.

రాత్రి తొమ్మిది గంటల వేళ డాక్టరు రావు శకుంతలమ్మ వచ్చారు. మాణిక్యమ్మ తడబడుతూ వాళ్ళకు మర్యాదచేసి సోఫామీద కూర్చోబెట్టింది

"శ్రీనివాసరావుగారూ! మీవాడి ఆరోగ్యం పర్ ఫెక్టుగా ఉంది. అన్ని పరీక్షల ఫలితాలూ బాగున్నాయి. ఆఁ అయితే మీవాడి ప్రయాణమెప్పుడూ?" అన్నాడు వికసించిన ముఖంతో.

"టికెట్ కొన్నాడు. రేపురాత్రికే ప్రయాణం. మళ్ళీ మేమూ మా అమ్మాయి ఇంత పెద్ద ఇంట్లో. ఏమిటో అది ఎం.ఏ ప్యాసయితేగాని పెళ్ళి చేసుకోదట. మా ఆవిడ ఒకటే తొందర మనవలకోసం." అంటున్నాడు కాలుమీద కాలు వేసుకుని చిరునవ్వుతో.

"ఏదీ మీ అబ్బాయి?" ఆత్రంగా డాక్టరు రావు శకుంతలమ్మా అడుగుతున్నారు.

"వెళ్ళిపోతాను కదా అని స్నేహితులనందరినీ కలుసుకోవటానికి వెళ్ళాడు. వాడికి స్నేహితులుంటే అన్నం నీళ్ళూ అక్కర్లేదు" శ్రీనివాసరావు జవాబిచ్చాడు.

పుండరిని పంపటానికి శ్రీనివాసరావు, మాణిక్యమ్మ పద్మిని స్టేషనుకు వెళ్ళారు. కళ్ళ నీళ్ళతో మాణిక్యమ్మ మాట్లాడలేకపోతున్నది. పద్మిని అన్నతో లొడలొడ కబుర్లు చెప్పుతూ చెయ్యి పట్టుకుని లాక్కుపోతున్నట్టుగా నడుస్తున్నది.

కొడుక్కు అన్ని జాగ్రత్తలూ చెప్పి "పుండరీ! నాలుగునెల్ల తరువాత నీకు ఉత్తరం వ్రాస్తాను సెలవుపెట్టి వచ్చెయ్యి. నిన్నొక ఇంటివాణ్ణి చేసేవరకూ అమ్మ నిద్రపోయేటట్టులేదు." అంటూ కదుల్తున్న రైలుతోపాటు నాలుగడుగులు వేస్తూ "నాయనా! ఆరోగ్యం జాగ్రత్త ఉత్తరం వ్రాస్తూ ఉండు, తెలుసుగా మీ అమ్మ సంగతి?" వెనక్కు తిరిగాడు శ్రీనివాసరావు.

కళ్ళమీది నుంచి కొంగు తియ్యలేదు మాణిక్యమ్మ. అన్న కనబడేవరకు చెయ్యూపుతునే ఉంది పద్మిని.

కొత్త ఉద్యోగం - కొత్త ఊరు - కొత్త స్నేహితులు - ఇరవై నాలుగు గంటలూ చాలటంలేదు పుండరికి. నెలయ్యేసరికి పుండరి బొంబాయిని బాగా ఆకళింపు చేసుకున్నాడు. తను పనిచేస్తున్న కంపెనీలోనే తన మిత్రుడు మణికి కూడా ఉద్యోగం సంపాదించి పిలిపించాడు. ఇద్దరూ కలిసి ఒక ఫ్లాట్ తీసుకుని స్వయంపాకమారంభించారు.

"ఆశ్వయుజమాసం వచ్చింది. చూసిన రెండు సంబంధాలలో ఒకటి నిశ్చయం చేస్తాము. మంచి మహూర్తాలున్నాయి. రమ్మన"మని తండ్రి రెండు ఉత్తరాలు వ్రాశాడు. ఆ రెండు సంబంధాల వివరాలు వ్రాస్తూ "పుండరీ! ఇద్దరూ అందంగా వుంటారు. స్థితిమంతుల పిల్లలు. వచ్చి పెళ్ళి చేసుకుని వెళ్ళు. అన్నట్టు మన పద్మిని ఏమంటోందో తెలుసా? బాబాయి చెప్పిన సంబంధం కంటే మన డాక్టరుగారి నిర్మల బాగుందని అమ్మను కూడా ఒప్పించింది. నా కెవరయినా ఒకటే, నీ అభిప్రాయం వ్రాయి. ఏదయినా నీ మాటే ఆఖరుమాట. అంతా నీ ఇష్టం. ఎప్పుడు వస్తున్నావో వ్రాయి." అంటూ ముగించాడు.

వారం రోజులయింది. పుండరి మనసంతా కుతకుత ఉడికి పోతోంది. పెళ్ళి మాట తలచుకుంటే రోషము కొద్దీ ముఖం ఎర్రబడి పోతున్నది. ముక్కు పుటాలు అదురుతున్నాయి. తండ్రికేం జవాబు వ్రాయాలో తెలియకుండా ఉంది.

కాని అతడి మనసులో ఆవేదన. తల్లిదండ్రులపట్ల మమతానురాగాలు-భక్తి గౌరవాలు పెల్లుబుకుతూ ఉంటాయి. ఎటువంటి పరిస్థితులలోను తండ్రి వ్రాసిన జాబులకు జవాబివ్వకపోతే అవిధేయత అనిపించుకుంటుంది. తల్లి కన్నీరు తాను చూడలేడు. చిలిపి చిన్నారి చెల్లెలి మనసు నొప్పించలేడు.

దసరా పండుగలకు వస్తున్నానని వ్రాశాడు అప్పటికా పండుగ సరిగ్గా పది రోజులుంది.

లంచ్ టైములో సుమన "హలో పుండరి!" అంటూ హాండ్ బ్యాగ్ ఊపుకుంటూ వచ్చింది. ముట్టుకుంటే మాసిపోతుందేమో అన్నట్టుగా ఉంటుంది దేహచ్ఛాయ. ఎంతో వినయవిధేయతలతో పనిచేస్తుంది. నిరాడంబరంగా అలంకరించుకునే సహజసుందరి. వారం రోజుల క్రిందటే ఊరి నుంచి వచ్చింది. ఉన్న ఒక్కగానొక్క తల్లి చనిపోయిందట ఆరు నెలల క్రిందట. దుఃఖపు పొంగు తగ్గిన

తరువాత ఇల్లు, వాకిలి అమ్మి ఆ ఊరితో తెగతెంపులు చేసుకునివచ్చేసింది అప్పటి కప్పుడు పుండరికి తెలియలేదు. ఆమె కెదురుగా కూర్చుని ''ఎప్పుడొచ్చారు?'' అన్నాడు ఎటూ తోచక.

ఆ మాటకే సుమనకు దుఃఖము పొంగినది. ఐదు నిమిషాల వరకూ మాట్లాడ లేక పోయింది. తనకుతానే సర్దుకుంది. కొంతసేపటికి కళ్ళుతుడుచుకుని-ముంగు. రులు ప్రక్కకు తోసుకుంది. తలపైకెత్తి చల్లటి నవ్వు పెదవుల మీదికి తెచ్చు. కుంటూ ''పుండరీ నేను మా ఊరి నుంచి ధైర్యంగా వచ్చేశాను కాని ఇక్కడికి రాగానే ఆ ధైర్యం కాస్తా జారిపోయింది'' మళ్ళీ ఆమెకు దుఃఖము ముంచుకు వచ్చింది.

తండ్రి పెట్టిన గడుపు దగ్గరికి వచ్చింది వస్తానని వ్రాసినతేదీ మరునాటితో చెల్లు. దీనిని గురించి రాత్రింబవళ్ళు ఆలోచిస్తున్న పుండరి వెంటనే సుమన చెయ్యి పట్టుకున్నాడు సమ్మోహనంగా.

ఆమె నివ్వెరపోయింది.

''అట్లా నా ముఖంలోకి చూడకు. సరిగ్గా నీవంటి అమ్మాయికోసమే నేను గాలిస్తున్నా దేశమంతా. రేపు మినమిద్దరం సెలవుపెట్టి రిజిస్ట్రార్ ఆఫీసుకు వెళ్దాం పద'' లేవటానికి ఆమెకు తన చెయ్యి అందించాడు.

దశమి నాటి ఉదయం గడపలో నిలబడ్డ పుండరీ సుమనలను చూసి శ్రీనివాసరావు పలకరించటానికి తడబడ్డాడు. మాణిక్యమ్మ నోరు తెరిచింది. పద్మిని సుమననుచూస్తూ కన్నార్పటం మరచిపోయింది.

పుండరి సుమన చెయ్యిపట్టుకుని లోపలికి తీసుకువచ్చి హాల్లో నిలబడ్డాడు. మాణిక్యమ్మ శ్రీనివాసరావుగార్లు ఒకరి ముఖం ఒకరు చూసి కళ్ళతో ప్రశ్నించు కుంటున్నారు.

పుండరి గొంతు సవరించుకున్నాడు.

''అమ్మా! నాన్నా! ఇదిగో మీ కోడలు సుమన, మహారాష్ట్రుల యింటి పిల్ల, జాగీర్దారుల ఇంటి పడుచు, కట్నం తీసుకోనంటున్నానని నాకు మెడికల్ టెస్టులు చేయించకుండా నన్నూ నా వంశ గౌరవాన్ని శంకించకుండా-నా ఆదర్శాన్ని

మెచ్చి పెళ్ళి చేసుకుంది. మన వాళ్ళకు ఆదర్శాలు ఆచరించకుండా అట్లాగేఉండాలి. వినాదాలు చేయటానికి. అంతేగాని నాబోటివాడు ఆచరించ బూనుకుంటే సందే హించేవాడే కాని-సంతోషించేవాడు లేడు. ఈ సుమన నాతో కూడా పనిచేస్తోంది. నేను చదివినంతా చదివింది, నాకు వచ్చినంత జీతము ఆమెకూ వస్తుంది''

శ్రీనివాసరావుకూ మాణిక్యమ్మకూ నమస్కరించారు ఇద్దరు.

మాటా పలుకూ లేకుండా మౌనంగా భోజనాల వేళ-కాఫీల వేళ గడిచి పోయింది. ఆ రాత్రి పద్మినితో కూడా సినిమాకు వెళ్ళారు సుమన, పుండరి.

తెల్లవారి లేచి స్నానంచేసి వంటమనిషి కంటె ముందర కాఫీచేసి అత్త గారికీ, మామగారికీ అందించింది. సుమన. పెళ్ళి అయిన తరువాత ఇంగ్లీషులిపిలో తెలుగు కొద్దిగా నేర్చుకున్న సుమన "అత్తయ్యా, నా మీద కోపం లేదుకదూ, కట్నము ఇవ్వనంటే మా తండ్రిని అందరూ హీనంగా చూశారు. పుండరితో ఆ మాటే అంటే నన్నెంతో గౌరవించి పెళ్ళి చేసుకుంటానన్నాడు. మా అమ్మా నాన్న పోయినతరువాత నేను ఒంటరిగా ఎవరూ లేనిదానిగా బ్రతకలేకపోయాను. ఇప్పుడు నాకెంతో సంతోషంగా ఉంది. మామయ్యా. నామీద కోపం లేదుకదూ?'' చేతులు జోడించింది సుమన.

శ్రీనివాసరావు కండ్లలో ఇందుప గింజలంత బాష్పాలు నిలిచాయి.

మాణిక్యమ్మ "నా తల్లే! నేనుండగా నీకేం కష్టం?'' ఆమె తలను గుండె లకు హత్తుకుంది.

శ్రీనివాసరావు మెదడులో ఆ రెండు సంబంధాల వాళ్ళు అట్లా అనుకున్నా రవి పుండరికెట్లా తెలుసునా అన్నమాట తొలిచివేస్తున్నది. పుండరి స్నేహితుడు దినమణి కండ్లముందర నిలచాడు. కొడుకుమీద మమతతోపాటు గౌరవము కూడా పెరిగింది. మరుసటి రోజునుండీ చెప్పవలసిన సమాధానాలు ఆలోచించుకున్నాడు. ఇది సంఘము. చేస్తే ఎందుకుచేశావంటుంది – చేయకపోతే ఎందుకు చేయలేదం టుంది మరి!

(జయశ్రీ సంక్రాంతి సంచిక)



# పుంరుగుల జత

"అత్తమ్మా అత్తమ్మా నిన్ను అరిజెంటుగా రమ్మని నాయన పంపిండు" ఒగర్చుకుంటూ వచ్చింది శాయి

చుట్టు గుడిసెలో సీట్టింట కొంగు పరుచుకొని పడుకున్న రంగమ్మ కళ్ళు నలుపుకుంటూ లేచింది. తల వెంట్రుకలను దులిపి మళ్ళీ ముడివేసుకుని శాయి వంక ఒకసారి చూసింది. లేచి కుండలో నీళ్ళు ముంతెడు తాగి "ఏందే ఇప్పు డొచ్చినవ్ ?" అడిగింది.

"ఏందో నాకు తెలవదు నాయన నిన్ను తోలుకురమ్మన్నడు" తలుపుమీద గీతలు గోళ్ళతో గీస్తూ అన్నది శాయి.

రంగమ్మకు అప్పుడు జ్ఞాపకం వచ్చింది. శాయికి తండ్రి పెళ్ళి సంబం ధాలు చూస్తున్నాడు. మంచిరోజు చూసి పూలూపళ్ళూ పెట్టాలని చెప్పాడు. ఇప్పుడు పదకొండు గంటలయి ఉంటుంది. సాయంత్రం ఒకవేళ పెళ్ళివారు వస్తా రేమో !

రంగమ్మ ఈ ఊరికే కోడలిగా వచ్చింది. శివయ్యతో ఏ పదేళ్ళు కాపరం చేసిందో - అంతే కలరా జాడ్యం ఆ ఊరి జనంలో సగం మందిని తీసుకుపోయింది వాళ్ళల్లో శివయ్య ఒకడు. అతడికి ఆ గ్రామంలో ఒక ఎకరం జొన్న పొలం ఓ చుట్టు గుడిసె ఉన్నాయి. నల్లగా నిగనిగలాడే మూడు పదులు దాటని భార్య - ముసలి తల్లి ఉన్నారు.

శ్రామికులు, ఆత్మీయులు చనిపోయినప్పుడు గుండె పగిగేలా ఏడుస్తారు కొంతమంది తరువాత జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఏడుస్తారు. కాని తీరికగా ఏడుస్తూ ఉండటానికి పరిస్థితులు ఒప్పవు ఏడుస్తూనే పని చేసుకోవాలి. అంతటి ఆత్మీయుడు చనిపోయినా మరునాడే పనిలోకి వెళ్ళి బిడ్డల కడుపులు నింపాలి. రంగమ్మకు అటువంటి అనుభవమే కలిగింది. కాని ఇంకొక విధంగా తటస్థపడ్డది.

ఇంట్లో చారెడు గింజల్లేవు. పావుబస్తా గింజలమ్మి శివయ్యకు వైద్యం చేయించింది. కాని లాభంలేక పోయింది. ముసలమ్మ ఏడ్చి ఏడ్చి సొమ్మపిల్లి పోయింది గుక్కెడు గంజయినా కాచి నోట్లో పోస్తేగాని లేవలేదు. పిల్లలు లేక పోయినా తనను ప్రాణంగా చూసుకున్న శివయ్య శవం కాటికి చేరాలి.

ఎట్లా ?

ఏం చెయ్యాలి ?

రంగమ్మ ఏడ్చి ఏడ్చి కళ్ళు తుడుచుకుంటుండగా ఆమె కళ్ళు చేతులకున్న మురుగుల జత మీద పడ్డాయి. పది తులాల మురుగులు. శివయ్య పెళ్లినాడు మెడలో నాలుగు బంగారు గుండ్లూ, చేతులకు వెండి మురుగులు జత పెట్టాడు. తులం బంగారమయినా పెట్టవా అని రంగమ్మ తల్లి రాగాలు పెట్టింది.

"మెల్లగ చేయిస్త" అన్నాడు శివయ్య శివయ్యలాంటి బుద్ధిమంతుడు మరి దొరకడని అంతా చెప్పారు.

మూడు ముళ్లూ మెడలో పడ్డాయి తల మీద తలంబ్రాలు జారిపడ్డాయి రంగమ్మకు.

ఎన్నేళ్లయినా మాట నిలుపుకోలేదని రంగమ్మ తల్లి సాధింపులు ఆ యింటి నుంచి ఈ యింటికి చేరేవి.

శివయ్య ఉగ్రుడయ్యేవాడు.

ఆ మురుగుల జత మీద కళ్లు పడగానే కళ్లు తుడుచుని దిగ్గున లేచింది రంగమ్మ. మేనమామ చేతికిచ్చి కోమటి కొట్లో తాకట్టు పెట్టి డబ్బు తెమ్మని పంపింది మేనమామ పాపయ్య చుట్టలకు తను రెండు రూపాయలుంచుకుని మిగిలిన నలభై ఎనిమిది రూపాయలు రంగమ్మ చేతిలో పెట్టాడు.

ఆ రోజుల్లో అవి చూసి చూసి ఖర్చు చేసినా కుల పెద్దలను నలుగురినీ పిలిచిన నాటికి చాలనేలేదు.

పది రోజులు దాటగానే రంగమ్మ శరీరకష్టం చేసింది. ముసలమ్మకూ తనకూ గంజి కాచుకుని కాలం వెళ్లదీసింది. పంట రాగానే తన మురుగులు తాను ఇంటికి తెచ్చుకుంది.

ఆ మురుగులు అదునుకు ఆదుకున్నాయని చేతులకు వేసుకుని శివయ్యను తలుచుకుంటూ దేవుడికి దండం పెట్టింది.

ఎకరం భూమి సాగుచేసుకుంటూ ఆ గింజలే ఏడాది పొడుగునా వాడుకుంటూ నోరు మంచిది కనుక అందరిచేత ఔననిపించుకుంటోంది రంగమ్మ.

ఆమె వయసు ఏభయి దాటింది.

ముసలమ్మ ఈ లోకాన్ని దాటింది.

ఆ గ్రామంలో ఎవరికి కష్ట మొచ్చినా రంగమ్మ ఆదుకుంటుంది. ముందుగా ఆమెకు కబురు వస్తుంది. కబురు చెవిన వేసుకుని ఊరుకోదు. దిగ్గున లేచి తలుపుకు తాళం వేసి పరుగులు తీస్తుంది.

''ఏమిటర్రా ఏం సంగతి?'' అంటుంది ముఖం తుడుచుకుంటూ చెంగుతో.

''ఏముంది రంగమ్మా. పిల్లగాడిని చదువులో పెడితిమిగదా? నాలుగు జతల గుడ్డలు పుస్తకాలు కావాలంట ఇంట్లో దమ్మిడీ లేదు. వద్దురా అంటే వినకుండ బడి బడి అంటు తల్లి బళ్లో చేర్చింది. అయితే తప్పకుండ చదువుతున్నాడు'' అంటాడు రంగమ్మకు తెలిసినవాడు.

''మంచిదే గద. అందరు నాగలి బట్టిన ఏం పండుతుంది?'' అంటుంది రంగమ్మ

''అది బాగనే ఉంది. డబ్బు ఏణ్ణుంచి తేవాల?''

''దాందేముంది? నా మురుగులు తీసుకొని తాకట్టు పెట్టుకో. డబ్బు తెచ్చి వాడుకో. పంట మీద తీర్చుకో. డబ్బుకోసం పని ఆపుకుంటావుటయ్యా?'' అంటుంది.

ముఖం చేటంత చేసుకుని ఆమె మురుగులు తాకట్టు పెట్టుకుని పని గడుపుకుంటాడు

వాళ్ళు ఇచ్చిన వెంటనే శివయ్యను తలుచుకుని దేవుడికి దండం పెట్టి చేతులకు వేసుకుంటుంది.

వారమయినా తిరక్కముందే మరొకరు వస్తారు ఇదే వరస పడిపోయిందా ఊళ్లో-పురుళ్లు-చావులు-అత్తవారిళ్లకు వెళ్ళటం-పెళ్లిళ్లకు-చదువులకు-ఎరువులకు-ఇలా ఎన్నిటికో ఆసరాగా ఉన్నదా మురుగుల జత. మంచి వెండి కనుక జిగ జిగ మెరుస్తూ ఉంటాయి తెల్లగా

రంగమ్మ శాయితో ఆశయ్య గడపలో కాలు పెట్టేసరికి శాయి తల్లి ఎదురుగా వచ్చి రెండు చేతులూ పట్టుకుని లోపలికి తీసుకువెళ్లింది బల్లమీద కూర్చోబెట్టి చల్లటి మజ్జిగ ముంతెడు దాహం యిచ్చింది.

"ఏం కబురు పెట్టావు ఒదినా?" కొంగుతో పెదవులు తుడుచుకుంటూ అడిగింది.

"నీకు తెలియంది ఏముంది ఒదినా. పెళ్లి కొడుకును తీసుకుని వస్తున్నారు. నిశ్చితార్థం చెయ్యాలి. చీరె, ధోవతి కావాల మాటలయితే అయినయిగాని దప్పేది? వాళ్ల వస్తారన్నప్పటి నుంచీ నిన్నే జ్ఞాపకం చేసుకుంటున్నాడు. పిల్ల కనబడగానే దగ్గరికి పంపించాడు."

రంగమ్మ పెదవుల మీద మందహాసం మెరిసింది. తెల్లగా మెరుస్తున్న మురుగులు జతను ఒకసారి కళ్ల కద్దుకుంది. శివయ్యను తలుచుకుని చేతులు జోడించింది.

"ఒదినా, అన్నయ్యేడి? తొందరగా వెళ్లి బట్టలు కొని తెమ్మని చెప్పు?" ఆలస్యమయితే బాగుండదు." చేతులవి తీసి ఒదినమ్మ చేతిలో పెట్టింది.

శాయికి వచ్చిన మనువు మంచిదే. పెళ్లి కొడుకు పచ్చగా శాయికి ఈడుగా జోడుగా ఉన్నాడు. నలుగురిలో పెద్ద కొడుకు, నంసార భారము పైన ఉన్నది. తల వంచుకునే ఓరగంటితో శాయి పెళ్లి కొడుకును చూసింది. నచ్చినట్లుగా ముఖం వికసించింది. ప్రధానం చేసిన పదోనాడు పెళ్లి.

గ్రామం వృద్ధి అయింది ప్రభుత్వంవారు నీటి వనరులు హెచ్చుచేశారు. సాగుబడికి అప్పులు ఇస్తున్నారు. రైతులు ఎరువులకు ఎడ్లకు డబ్బుకోసం వెతుక్కోకుండా ప్రభుత్వం అప్పులిస్తున్నది. ఆ గ్రామంలో ఆసుపత్రి వెలిసింది. పిల్లలకు పాలు పంచుతున్నారు. డబ్బడగకుండా పిల్లలకు చదువులు చెప్పే

పాఠశాల తెరిచారు. రైతులకు సూచనలు ఉదయం లేవగానే రేడియోలో చెబు తున్నారు. ఆ గ్రామానికి ఒక టెలివిజన్ సెట్ కూడా అమర్చారు. గ్రామ సేవికలు ఇంటింటికీ వస్తున్నారు. వంటకాలూ, కుట్టు పనులు, శుచీ శుభ్రతా నేర్పిస్తున్నారు.

అదివరకటి గ్రామమా అనిపిస్తోంది.

రచ్చబండ దగ్గర కబుర్లు, రాజకీయాలలోకి దిగి రభస చేస్తున్నాయి.

కాని రంగమ్మ మురుగుల జతతో అవసరం ఆ గ్రామానికి తీరలేదు.

''ఇదిగో రంగమ్మా. వచ్చేవారం నాటికి ఇస్తా'' నంటాడొకడు.

''రంగమ్మక్కా, ఒక నెలవుద్ది నీకు తెచ్చి యిచ్చేవరకు, పిల్లకు శోభనం'' అంటా డొక రైతు.

పిల్లకు పురుడొచ్చిందంటా డొకడు.

పిల్లగాడిని పట్నం లోలాలంటా డొకడు.

ఎవరొచ్చినా రంగమ్మ దొకటే మాట. ''అయ్యో! దానికేమిటంత ఇదవుతావు? తీసుకెళ్లు'' అంటుంది.

రంగమ్మ మీద ఆ గ్రామంలో ఉన్న పరపతి ఏమీ చెడలేదు. గ్రామస్థులు ఇంకా రంగమ్మను ఆశ్రయించుతునే ఉన్నారు. ఆమె మనసు వెన్నగానే ఉంది. స్ఫటికమంత స్వచ్ఛంగానే ఉంది.

రంగమ్మ వయస్సు అరవై దాటింది. కంటి చూపు కొంచెం తగ్గినట్లుగా ఉంది. ఒక్కపూటే వండుకుంటుంది, వెలుగు ఉండగానే తింటుంది. ఇంటి ముందున్న అరుగుమీద చీకటి పడేవరకూ కూర్చుంటుండి. ఏడుగంటలకే ఇంట్లోకి వచ్చి తలుపు గొళ్లెం పెట్టుకుంటుంది.

రంగమ్మ ఇప్పుడు చేతికింద ఒక పిల్లవాణ్ణి పెట్టుకుంది. వాడు పొలం పను లలో సహాయం చేస్తాడు. పంటలో కొంత వాడికిచ్చి మిగిలిన గింజ ఇంటికి చేర్చు కుంటుంది రంగమ్మ. చాలకపోయినా సర్దుకుంటుంది.

ఒకనాడు రంగమ్మకు ఎన్నడు ఎరగనిది తటస్థపడింది.

ఆ రాత్రే సోమయ్య తీసుకుపోయిన మురుగుల జత తీసుకువచ్చి ఇవాల్సిన సమయం. కాని ఇంకా తీసుకురాలేదు. ఇంతలో కామయ్య వచ్చి "పెద్దమ్మా, ఇల్లు కప్పించుకోవాలి. నీవు సాయపడు" అన్నాడు.

"సరే రేపురా" అంది.

మరునాటి మధ్యాహ్నం వరకూ సోమయ్య రాలేదు.

కామయ్య వస్తే ఏం చెప్పాలి ?

రంగమ్మ వీధి వంక చూస్తున్నది.

ఇంతవరకూ తీసుకు వెళ్ళిన వాళ్లు ఇస్తానన్న వేళకే తెచ్చి యిచ్చేవారు. కాని-ఈసారి ఎందుకిలా జరిగింది ?

సోమయ్య నమ్మకస్తుడు. ఒక సోమయ్య కాదు-ఈ ఊళ్లో అంతా నమ్మకస్తులే. తనవల్ల సహాయం పొందేవారు. అక్కర తీర్చుకుని తిరిగి ఇచ్చేవారు. సోమయ్య కేదో కష్టం వచ్చి ఉంటుంది. పొరుగూరికి వెళ్లాడు. రాను వీలయిందో లేదో ?

రంగమ్మ భోజనంచేసి వాకిటి అరుగుమీద కూర్చుంది.

వెలుగు జారుకుంటోంది. చీకట్లు కమ్ముకుంటున్నాయి.

రంగమ్మ బాధతో కూర్చున్న చోటి నుంచి లేవబోతుండగా కామయ్య వచ్చాడు.

"ఏం పెద్దమ్మా ?"

"నాయనా, సోమయ్య తీసుకు వెళ్లాడు. నిన్న తిరిగి ఇవ్వాల్సిన రోజు. కాని ఎందుకో రాలేదు. పొరుగూరు వెళ్లాడు. అక్కడేదో అకాల వర్షంపడి ఏర్లు పొంగి వాగులు నిండినాయట. ఇందాక ఎవరో వచ్చి చెప్పారు" అంది.

"అది నిజమే కావచ్చు పెద్దమ్మా, నా సంగతి చూడు. నా భార్యకు పిల్లాడ పొద్దులు. ఇల్లు కురుస్తున్నది. ముందే కప్పుకోవాలి. ఆపైన కుదరదు."

"అవును బాటూ. అందరికీ అవసరమే. రాగానే నీకే ఇస్తాను. అతడు తప్పకుండా తెస్తాడు."

"అయితే రేపు రానా పెద్దమ్మా?"

"రా నాయనా!" ఆమె తలుపు గొళ్లెంపెట్టి లోపలికి వెళ్లి జొన్న గటక తాగి పడుకుంది.

కామయ్యా రంగమ్మకు భర్త వైపు దూరపు చుట్టం. రంగమ్మ అందరి తలలో నాలుకలా ఉండటం అతడికి ఇష్టంలేదు. ఆ చుట్టు గుడిసె అయినా అలా గట్టిగా ఉండటం అతడి కంటికి మెర మెరగా ఉంది. ఆ కొద్ది గింజలతో కడుపు నింపుకుని ఒక మహారాణిలా ఆ గ్రామంలో పరిపాలన చేస్తున్నదే రంగమ్మ అని మనసులో బాధ.

దిక్కులేని ఒక ఆడిదానికి ఇంత పరపతా?

అందరూ పొద్దున లేచి రంగమ్మను తలుచుకోవటమా?

కాని కామయ్యా కూడా అలా ఆమెవల్ల సహాయం పొందినవాడే. కాని మనసులో కంటగింపుగా ఉంటోంది.

రాత్రి పన్నెండు గంటల వేళ-ఒక నిప్పుపుల్ల చుట్టు గుడిసె మీద కాల్చి పడేశాడు.

తెల్లవారేసరికి ఊరంతా గుప్పుమంది. రంగమ్మ చుట్టుడిసెగుమీద ఎవరో నిప్పుపడేశారని. కప్పంతా కాలి కూలిపోయింది.

గ్రామస్తులంతా ఒక్కరొక్కరే పరుగు తీశారు. గుడిసె దగ్గరికి. కర్రలతో కాలిపోయిన చెత్తంతా తోస్తే దూలాల క్రింద రంగమ్మ కాలిన వంకాయలా ఉంది.

గ్రామస్తులంతా ఆమెను దేవతలా ఊరేగించి ఊరి బయట సమాధి చేశారు. వాళ్లు ఇళ్లకు తిరిగి రాలేక అక్కడే నాలుగు గంటల సేపు కూర్చుని ఆమె ఆదుకున్న కుటుంబాలను గురించి చెప్పుకున్నారు. ఎవరెవరిని ఎటువంటి కష్టాల నుంచి తప్పించిందో నెమరువేసుకున్నారు. కన్నీరు కార్చారు. దిక్కులేని వాళ్లనుమయ్యామని వాపోయారు.

ఎన్నాళ్లయినా ఎన్నేళ్లయినా ఆ గ్రామంలో సాయంత్రం కాగానే "నాయనా! నీ వింతగా అడగాలా? తీసుకువెళ్లు. నీ అక్కర తీర్చుకో. ఇబ్బంది పడకు. నా మురుగుల జత వుంది చూశావూ? దాన్ని మంచి మనసుతో శివయ్య పెళ్లినాడు పెట్టాడు. ఆ మురుగుల జతలో శివయ్య మనసుంది. ఎప్పుడూ వాటిలో మంచిపనులే జరుగుతాయి" అని గాలి ఈలలు వేసినట్టుగా-సాయంత్రపు వేళల్లో మల్లెలు విచ్చి సుగంధాన్ని ఊరిమీద వెదజల్లినట్టుగా-పాంథుడు చల్లటి పానీయం త్రాగిన తరువాత సేదదీరినట్టుగా రంగమ్మ మాటలు సమాధినుండి వెడలినట్టుగా అనిపిస్తుంది.

రంగమ్మ మురుగుల జత వాళ్ళ కళ్లకు ధవళకాంతులు వెదజల్లుతూ ఎవరినో ఆపదనుండి కాపాడుతున్నట్టుగా కనబడుతుంది.

(ఆంధ్ర సచిత్ర వార పత్రిక)



# దోస్త్ కటీఫ్

రమణమ్మ మధ్యాహ్నం రెండింటి వరకూ ఎదురుచూసింది రోహిణికోసం. ఆమె ముఖంలో విసుగుదల కొద్దిగా తొంగి చూసింది.

ఇంట్లో ఇంతసేపు ఏంచేస్తున్నది? తానిక్కడ మంచినీళ్ళయినా తీసుకోదని తెలిసి కూడా ఆలస్యం చేస్తే ఏమనుకోవాలి?

కాస్త వంటచేసి బల్లమీద పెట్టి, తావింత తిని, పసిపిల్లను ఆయా చేతి కిచ్చి రావటానికి ఇంతసేపు చేస్తోందేమిటి రోహిణి!

ఆమె కళ్ళమీద చేతులు పెట్టుకుని తల గోడకానిచ్చి కూర్చుని కన్నీరు కారుస్తున్నది.

హఠాత్తుగా మెత్తటి చేతులు రెండు ఆమె చేతులను ముఖం మీదినుండి తొలగించాయి.

"అత్తయ్యా! మీకు చాలా ఆలస్యమయింది ఇప్పటికే. లేవండి. నేనుదిగిన ఆటోలో ఇంటికి వెళ్ళి. స్నానంచేసి భోజనం చేయండి." తువ్వాలుతో ఆమె ముఖమంతా తుడ్చి, చెంపలకు అతుక్కు పోయిన తలవెంట్రుకలను సరిదిద్దింది. రోహిణి ఆమెను లేవదీసే ప్రయత్నం చేసింది కాని చేతకాలేదు.

"ఏమమ్మా! రోహిణీ నన్ను విధి శిక్షిస్తూనే ఉంది. కంటి తడి ఆరకుండా చేస్తోంది. నేను బతికుండగానే ఇంట్లో అందరూ నన్ను విస్మరించారా, గంటచూడు ఎంతైనా.

"అత్తయ్యా!" అంటూ రోహిణి ఆమె ఒళ్ళో వాలిపోయింది.

ఆమె రోహిణి వైపు పిచ్చి చూపులు చూసింది. ఆ ఎర్రటి ముఖం మీద కుంకుమ బొట్టు జ్వాలలా మండుతోంది.

ప్రాణం ఉండీ, జీవం లేనట్టుగా మంచంమీద పడిఉన్న సాంబుకు తను కన్న తల్లి. రోహిణి చేసుకున్న భార్య. తా నతడిని కనీ పెంచి పెద్దవాడిని చేసింది. అతడి చదువూ, ఉద్యోగం, చూసింది. బిడ్డ తండ్రిగా దీవించింది. కాని—రోహిణి ఏం చూసింది. ఏ మనుభవించింది. ఇంటి కోడలిగా గడపలో అడుగు పెడుతూనే తొమ్మిది నెలలుమోసి కనకపోయినా కన్నట్టుగానే మూడు నెలల పసిపాపను గుండెకు హత్తుకుని పెంచడం మొదలుపెట్టింది. ఇరవై ఏళ్ళ రోహిణి జీవితం ఎట్లా గడుస్తుంది

ఆమె కళ్ళు చెరువులయ్యాయి—కాని వెంటనే నిగ్రహించుకొని రోహిణి దీనవదనం చూసి. కళ్ళూ, ముఖం తుడుచుకొని "మామగారు భోజనం చేశారా రోహిణీ" ఆమె తల నిమురుతూ అడిగింది.

"లేదత్తయ్యా, ఇవాళ ఇంతవరకూ కాఫీ కూడా తీసుకోలేదు. పాచిముఖం కడగలేదు"

"అయ్యో" ఆమె త్రుళ్ళిపడి లేచింది. "మనం కళ్ళతో చూస్తున్నాం. కనుక కొంత తృప్తిగా ఉంది. సాంబు పరిస్థితిని కంటితో చూడలేరు. కనుక హాల్లో ఆ పడక కుర్చీలోనే కూర్చుని కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నారు. ఆయన పడుతున్న బాధ చూడలేకుండా ఉన్నాం. అందుకే ఇంత ఆలస్యమయిందా రోహిణీ ! నేను ఇంటికి వెళ్ళి సాయంత్రం వస్తాను జాగ్రత్త" జ్యోతుల్లా ఉన్న కళ్ళను కొంగుతో తుడుచుకుని గది తలుపు దాటి మెట్ల దగ్గరికి వచ్చింది.

డాక్టరు మారుతీ రావు మెట్లెక్కి పైకి వస్తూంటే పక్కకు జరిగింది.

ఆయన పైకి రాగానే "మెట్లెక్కి వస్తున్నారు లిఫ్టు పాడయిందా డాక్టరుగారూ! నేను పేయింగ్ రూము నెంబరు గదిలో ఉన్న పేషెంటు తల్లిని. ఎలా ఉంది బాబూ మా నాయన పరిస్థితి ?" అడిగింది.

ప్రతి రోజూ ఆమె మెట్లు దిగే వేళ డాక్టరు మారుతీ రావు మెట్లెక్కి పైకి వచ్చే వేళ అదే. ఆమె చేతులు జోడించి ఆయనను ప్రశ్నించే వేళకూడా అదే.

చిత్రంగా ఇద్దరికి ఈ వేళ ఆలస్యమే అయింది.

"ఇవేళ నేనింకా రిపోర్టు చూడలేదు. చూసి చెప్తాలెండి. ఇంటికి వెళుతున్నట్టున్నారుగా వెళ్ళరండి" గబగబా ఆమెను దాటుకుంటూ వెళ్లాడు.

నిలువుగా కూలిపోయినట్టు ఆమె దీర్ఘంగా నిట్టూర్చింది.

అది మూడవ అంతస్తు. మెట్లన్నీ దిగి చుట్టూ తిరిగిపోయి గేటుదాటి ఆటో ఎక్కి ఇల్లు చేరాలి.

ఇలా మిణుకుమిణుకు మనే ఆశను డాక్టర్ల వూరడింపుమాటలతో చిగురింప జేసుకుంటూ, రెండు సంవత్సరాలుగా ఉస్మానియా హాస్పిటల్‌కూ రామంతపురానికీ తిరుగుతున్నది రమణమ్మ. సాయంత్రం ఆరు గంటలకు ఉస్మానియా హాస్పిటల్‌కు ఆటోలో వెడుతుంది. తిరిగి మరునాడు కోడలు రోహిణి దిగిన ఆటో ఎక్కుతుంది.

ఒక్క పూటయినా నాగా లేకుండా ఆమె దిగటం, ఈమె ఎక్కటం జరుగుతోంది.

ఆ గదిలో గోడకు ఆవించి ఉన్న సోఫా మీద కూర్చుని, కిటికీ గుండా కిందికి చూస్తోంది రోహిణి. ఎటుచూచినా పూల తోట, పచ్చని లాను. దాని చుట్టూ రంగు రంగుల పూల చెట్లు. ఈ తోట అందాన్ని రోగులంతా చూడగలిగితే!

అది ఎంత పెద్ద హాస్పిటల్. ఎన్ని శాఖలు, ఎన్ని లిఫ్టులు! ఆపెద్ద హాల్లో అసఫ్ జాహి వంశీయుల ఫోటోలు ఎంతెంత పెద్దవి! హైదరాబాదు నగరంలో మీర్ ఉస్మానలీ ఖాను తన పేరు మీద యూనివర్శిటీ ఒకటి, హాస్పిటల్ ఒకటి నిర్మించి తమ పేరు నిత్యం అందరూ స్మరించుకునేటట్లు చేశాడు.

ఎప్పుడు చూసినా ఆ హాస్పిటల్లో దారి తప్పకుండా అనుకున్న చోటికి వెళ్ళే వాళ్ళు అరుదు.

రోహిణి గది దాటి బయటికి వచ్చి కారిడార్ పొడుగునా నడిచి మళ్ళీ గదికి చేరుకుంది.

ఒక్కొక్క గదిలో ఒక్కొక్క రకమైన బాధ. డాక్టరు తీర్చగలిగినవి కొన్ని—తీర్చలేనివి కొన్ని—మొండి పడినవి కొన్ని.

అప్పుడే చీకట్లు ఆవరించుకుంటున్నాయి. చెట్ల మీది పక్షులు రెక్కలు టప టప లాడించుకుంటూ విపరీతంగా అరుస్తున్నాయి. దీపాలు వెలిగాయి. రోగులను చూడటానికి వచ్చే విజిటరులు గుంపులు గుంపులుగా ఇళ్ళకు బయలుదేరుతున్నారు.

వాచ్‌మన్ గంట వాయించుతూ అందరినీ వెళ్ళమని హెచ్చరిస్తున్నాడు.

మరి కాసేపటికి రోగులు ఎవరి మంచం మీద వారు పడుకుంటారు, బిక్కు–బిక్కుమంటూ. తమ ఆత్మీయులు చెప్పిన ధైర్యం జారటం మొదలు పెడుతుంది. బ్రెడ్ తింటారు. పాలు తాగుతారు. నర్సులు గొంతులో పోసిన మందులు మింగుతారు

అయ్యో! అత్తగారింకా రాలేదు. పిల్ల ఏడ్చిందో? మామగారు దుఃఖపడుతున్నారో?

రోహిణి గదిలోకి వచ్చింది. స్విచ్ నొక్కింది. లైటు వెలిగింది. ఆమె ఆ గదిలోనే ఉంటుంది. ఆ మంచం వైపు చూడాలని ఉన్నా చూడదు. హటాత్తుగా ఎప్పుడైనా దృష్టి ఆ మంచం మీద ఉన్న రోగి మీదికి పోయినట్లయితే మరి—అక్కడి నుంచి కదలిరాదు.

కడుపులో దుఃఖం అలలు అలలుగా పైకి లేచి ముల్లోకాలనూ ముంచేటంత ఉధృతంగా పొంగుతుంది.

ఆ మంచం మీద తెల్లటి దుప్పటి కప్పుకొని పడుకున్నది సాంబు. మల్లెలతో పోటీపడే ధవళచ్ఛాయ, నల్లటి కురులు, కృష్ణ వేణమ్మ అలలు మాదిరిగా ఒంపులు దిరిగి మెడవరకూ దిగుతాయి. అతడు కళ్ళు తెరవడు తెరచి ఉంచే అవి నవ్వుతూ కవ్విస్తూ ఉండే విశాల నయనాలు. వంపులు తిరిగిన అతడి పెదవులు కదిలితే అరవిరి మొగ్గలా ఉంటాయి. ఆ గులాబీ రంగు పెదవులు విచ్చుకుంటే తెల్లటి పలువరుస తొంగి చూస్తూ ఉంటుంది.

కాని–కాని అతడు కళ్ళు తెరవడు. పెదవులు కదలించడు. పలువరుసను కనబడనీయడు.

అతడు జీవించే ఉన్నాడు. గుండె కొట్టుకుంటూనే ఉంది. శ్వాసకోశాలు పనిచేస్తున్నాయి. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు క్రమబద్ధంగా ఉన్నాయి.

కాని—అతడి మిగతా అవయవాలు వాటి వాటి ధర్మాలను సహజంగా వాటంతట అవి నిర్వర్తించలేవు. అవి ట్యూబుల సహాయంతో పనిచేస్తాయి.

ఆ అవయవాలకు ఆజ్ఞలు ఇచ్చే మెదడు పనిచేయటం లేదు. అది ఏక్సి డెంటులో పెద్ద దెబ్బతిన్నది.

రెండు సంవత్సరాలు కావచ్చింది. కాని రోహిణికి అప్పుడు జరిగినట్టుగా ఉంటుంది

* * * *

ఉగాది పండుగ వస్తూంది. రేపు లేదు ఎల్లుండే పండుగ. ఆఫీసునుంచి ఇంటికి వస్తూనే "రోహిణీ! జీతం వచ్చింది. నీకో మంచి చీరె చూసి వచ్చాను. నాకు త్వరగా కాఫీ ఇచ్చి తయారుగా. చీరె కొని, అలా అలా టాంక్‌బండ్ మీద చల్ల గాలికి కాసేపు కూర్చుని వద్దాం ఎన్నాళ్ళయిందో మనిద్దరం స్కూటరుమీద బయటికి వెళ్ళి?" అన్నాడు ఉత్సాహంతో.

నిజానికి ఎన్నాళ్ళో కాలేదు. అసలు ఆమెతో అతడికి వివాహమయి ఆరు నెలలే అయింది.

ఆమె గబగబా కాఫీ టిఫిన్ ఇచ్చింది. ఎవరూ లేరు కదా అని అతడు అటూ ఇటూ చూస్తూ ఆమె నోటి కందించిన పకోడీలను అమృతప్రాయంగా నమిలింది. అత్తగారి చేతికి పిల్ల నిచ్చి ఇద్దరూ స్వర్గంలో విహరించినట్టు విహ రిద్దామని బయలుదేరారు.

లిబర్టీ దగ్గిర దిగి అతడికి నచ్చిన చీరె, రవిక బట్ట కొని, నూటఏభై రూపాయల బిల్లు చెల్లించారు. ఇక లిబర్టీ మీదుగా టాంక్‌బండ్ మీద కాసేపు కూర్చుందామని బయల్దేరారు. స్కూటరు స్పీడుగా బయలుదేరింది. పక పక నవ్వుతూ ఆమె ఏదో అంటోంది. అతడు జవాబుగా నవ్వుతూ ఆమెకు సమాధాన మిస్తున్నాడు. ఏ వాహనమూ రోడ్డుమీద లేనట్టుగా అతడు వూహించుకుని తన ప్రజ్ఞనంతా భార్యకు చూపిస్తూ స్కూటరు నడుపుతున్నాడు.

నల్లటి ఎంబాసడర్ రయ్యిమంటూ వస్తూంది. సాంబు ఇంకా జోరుగా పోతున్నాడు. ఎంబాసిడరు స్పీడు హెచ్చించింది.

అంతే.

ఎంబాసిడర్ స్కూటర్ని నెట్టుకుంటూ దూసుకుపోయింది.

రోడ్డు మీద ఒక మూల రోహిణి, మరొక మూల సాంబు పడిపోయారు. రోడ్డుకు మధ్యగా స్కూటర్, నడిరోడ్డు మీద నెమరు వేస్తూ రాకపోకల రద్దీని గమనించకుండా హాయిగా పడుకునే పెయ్యదూడలా పడి ఉంది.

రోహిణి దొర్లి పోయిన చోట చీరె కొంగుతో తుడుచుకుంటూ సాంబు కోసం వెతుకుతోంది.

ఏదీ? ఎక్కడున్నాడు?

ఫుట్‌పాత్ దగ్గిర పడి ఉన్నాడు. ఎక్కడా దెబ్బ తగిలినట్టే లేదు. కాని ఒంటి మీద స్పృహలేదు. వెల్లకిలా పడున్నాడు.

రోహిణి సాంబు దగ్గిర కొచ్చేసరికే చుట్టూ జనం మూగారు, పోలీసు వాను వచ్చింది.

చుట్టూ చేరిన వాళ్ళలో ఒకరిని పిలిచి ఇంటికి కబురు చేసింది రోహిణి. సాంబుతో పోలీసు వానులో హాస్పిటల్‌కు వెళ్ళింది.

తల్లి తండ్రి వచ్చారు. తలలు బాదుకుని ఏడిచారు. పెద్ద డాక్టరు వచ్చారు. న్యూరో సర్జన్లు వచ్చారు. అన్ని పరీక్షలూ చేశారు. అతడిని మంచంమీద పడుకో పెట్టి ట్యూబులు తగిలించారు.

వైద్యం చక్కగా జరుగుతోంది. ఉపచారం క్రమబద్ధంగా జరుగుతూంది.

సాంబు కన్ను తెరిచి చూడడు.

నోరు తెరిచి 'అమ్మా' అనడు.

అందరికీ ఆశ. ఎప్పుడో అతడు కన్ను తెరుస్తాడనీ, పెదవి విప్పి అమ్మా అంటాడ నీను.

కాని అతనిలో చలనం లేదు.

"డాక్టరుగారూ! నా బిడ్డ బతుకుతాడా?" గుండెలను చీల్చుకుంటూ వస్తుందా స్వరం.

"అమ్మా! తొందర పడకండి. ప్రాణం ఉంది, ఎప్పుడో కదలికవస్తుంది."

ఆ క్షణం కోసం చకోరపక్షుల మాదిరిగా ఎదురు చూసి ప్రాణాలు కడబట్టి పోతున్నాయి.

డాక్టర్లు. స్పెషలిస్టులు చిన్నా పెద్దా వస్తున్నారు. చర్చించుకుంటున్నారు. ఆశాభావంతో వేళప్రకారం వచ్చి చూస్తున్నారు.

సాయంత్రపు వేళ నీరెండ చెట్లమీద పడి ప్రకృతికి వింతసోయగాన్నిస్తున్న వేళ హాస్పిటల్లో విజిటర్ల సందడి అధికంగా ఉన్న వేళ రమణమ్మ గదిలోకి వచ్చింది. రోహిణి ఇంటికి వెళ్ళటానికి సిద్ధమవుతున్నది.

ఇద్దరి ముఖాలూ ఉబ్బరించి ఉన్నాయి. ఒకరి నొకరు పలకరించుకోలేదు. కళ్ళెత్తి ముఖాలలోకి చూసుకున్నారు. వెంటనే దించుకున్నారు.

అదే సమయంలో సరదా పైకెత్తిపట్టుకుని హాస్పిటల్ సూపర్నెంటు గదిలో కాలు పెట్టాడు.

ఇద్దరూ ఆయనకు నమస్కరించారు.

"ఇంటికి వెళ్ళుతున్నారా?" పలకరించినట్టుగా అడిగాడు.

"కోడలు వెళుతుంది. నేనిక్కడ రాత్రిళ్ళు ఉంటాను. ఇంట్లో పని ఎక్కువగా ఉంటే ఆనాడు నేను ఇంట్లోనే ఉంటాను."

"అలాగా? అయ్యో నిలబడే ఉన్నారు. ఇలా కూర్చోండి."

వాళ్ళు చూస్తుండగా ఆయన ఆ గదిలోకి మూడు నాలుగు సార్లు వచ్చాడు. కాని ఇంత ఆప్యాయంగా పలకరించలేదు. విస్మయంతో ఇద్దరూ సోఫా మీద కూర్చున్నారు. ఇద్దరి హృదయాలలో ఆశలు రెకెత్తుతున్నాయి. రేపు ఎల్లుండిలో సొంబులో ఏమయినా మార్పు వస్తుందేమో? ఇతడు ఆ శుభ వర్తమానం చెప్పడానికి వచ్చాడేమో? అంతలో వారిద్దరి ముఖాలూ ప్రఫుల్లమయ్యాయి.

"అమ్మా! మీరిద్దరూ ఉండగా ఒక మాట చెప్పాలని నిన్నటి నుంచీ చూస్తున్నాను నేను చెప్పేది జాగ్రత్తగా వినండి. నన్ను అపార్థం చేసుకోకండి.

ఇతడికి స్పృహ వచ్చే ఆశలు కనపడటం లేదు. ఇలా ఎన్నాళ్ళుంటాడో చెప్ప లేము. ఇప్పటివరకూ ఇతడి అవయవాలు ఆరోగ్యంగా ఉన్నాయి. ముందు ముందు చెడిపోవచ్చు. అందువల్ల ఇతడి కళ్ళు, మూత్రపిండాలు. గుండె తీసి భద్రపరిచి అవసరమైన వాళ్ళకు ఉపయోగిస్తారు. ఇవి చెడిపోయిన వాళ్ళెందరో ప్రాణాన శిష్టంగా పడి ఉన్నారిక్కడ. ఇందుకు మీరు అనుమతివ్వాలి.'' మెల్లగా ఒక్కొక్క మాటే వాళ్ళ ముఖాలు చూస్తూ అన్నాడు సూపర్నెంటు.

ఆ మాటలకు ఇద్దరూ హతాశులయ్యారు పంచ ప్రాణాలూ పైకెగిసిపోయి నట్లయింది. రోహిణి మోకాళ్ళ మీద తల పెట్టుకుని వెక్కిళ్ళుపడేట్లు రోదించటం మొదలుపెట్టింది.

''డాక్టరుగారూ! నా నాయన ఇంక లేవడా? కళ్ళు తెరిచి చూడలేడా? అమ్మా అని నన్ను పిలవడా? ఈ జన్మ కింతేనా డాక్టరుగారూ?'' గండిపడిన చెరువులా అయ్యాయి ఆమె కళ్ళు.

''అమ్మా! ఇలా చూడండి. మనకు పనికిరాని వస్తువులతో ఇతరుల ప్రాణాలు నిలుస్తాయంటే సంతోషించదగిన విషయం కాదమ్మా? మీ బిడ్డనువాళ్ళల్లో చూసుకోవచ్చు. మీరు వాళ్ళకు ప్రాణదానం చేసిన వాళ్ళవుతారు కదా? బాగా ఆలోచించండి.''

''నా కడుపున చిచ్చుపెట్టుకుని ఎవరిలోనో నా కొడుకును చూసుకోగలనా, డాక్టరుగారూ?''

''మీరు చూసుకోగలరు. మాతృహృదయం విశ్వమంత విశాలమయింది. మీరు మీ కొడుకు దేహంలో ఉన్న కొన్ని అవయవాలతో కొందరు బతుకుతారను కోండి. వాళ్ళు మీ కుమారులు కారా? బాగా ఆలోచించుకోండి. విదానంగా నాకు చెప్పండి'' అతడు కుర్చీలోంచి లేవబోయాడు

దిగ్గున లేచింది రోహిణి.

ఆమె లేచే తీరూ, ఆమె కళ్ళూ, ముఖం ఉన్న విధం చూసి సూపర్నెంటు ఒకడుగు వెనక్కు వేశాడు జంకుతో.

"డాక్టరుగారూ! ఆయన దేహంలో నుంచి నేను గోరంత భాగమయినా ఇవ్వను. ఆయన దేహాన్ని తాకనివ్వను. ఆయనకు ప్రాణం ఉండగా, నేను చూస్తూ ఉండగా ఇంత ఘోరం జరగటానికి వీలులేదు. ఆయన దేహం మీద ఈగయినా వాలడానికి వీలులేదు" రోహిణి ఆవేశంతో అరిచింది,

"రోహిణిని" రమణమ్మ ఆమె చేతులూ రెండూ పట్టుకుంది "మన మేమి చేసుకుందామా ప్రాణిని? కదలడు మెదలడు కళ్ళు తెరవడు నోరు విప్పడు. సాంబును అట్లా ఏళ్ళ తరబడి చూస్తూ ఏడవటమే కాని మనకేమయినా సుఖమా తల్లీ? అల్లా జీవచ్ఛవంలా ఉంటే చూడ గలుగుతున్నావా? రోహిణీ! లాభం లేదమ్మా. డాక్టరుగారు చెప్పినట్లు మనకు పనికి రాకపోయినా మరొకరికి ఉపయోగ పడి ప్రాణం పోసుకుంటుందంటే ఆ దానంవల్ల ఎంతటి పుణ్యం వస్తుందో బాగా ఆలోచించి చూడు తల్లీ." కళ్ళ నీళ్ళు కారిపోతున్నా రమణమ్మ మాతృ హృదయం విలవిల్లాడి పోతున్నా డాక్టరుగారి మాటల్లోని అర్థాన్ని గ్రహించింది.

"లేదు. నాకీ పుణ్యకార్యాలపట్ల నమ్మకం లేదు. నన్ను ప్రేమించిన హృదయాన్ని, నన్ను లాలించి నవ్వించిన ఆ విశాల నయనాలను నే నీవిధంగా నయినా చూసుకుని బతుకుతున్నాను. నా ఆశలు చంపకండి. నన్నీవిధంగానయినా బతకనీయండి." అరిచి అరిచి పడిపోయింది రోహిణి.

రమణమ్మ కోడల్ని చూచి అదిరిపోయింది.

"అమ్మా. మీ అనుజ్ఞలేనిదే కాలి గోటినయినా మేము తియ్యం. ఆలో చించుకోండి. రేపు నేను మళ్ళీ వస్తాను" సూపర్నెంటు లేచి వెళ్ళాడు.

రోహిణి అపస్మారకంలో పడి ఉంది. ఏదేదో అవ్యక్తాలాపన చేస్తున్నది

ఆ తల్లికి కాళ్ళూ చేతులూ ఆడటంలేదు.

డాక్టరు రోహిణి ముందు ఈ ప్రస్తావన తీసుకురాకుండా ఉండవలసింది.

అవును. రోహిణి మాట నిజమే. తన కింకో కొడుకున్నాడు. మరి రోహిణికి?

ఈ రోహిణీ—సాంబులు చిన్ననాటి నేస్తాలు. చిన్నప్పటినుంచీ ఒకటిగా తిరిగేవారు ఆడుకునేవాళ్ళు. సాంబు రోహిణిని ఏడిపించాలని ఆమె వెంట

పరుగెత్తి. చెవులు మెలిపెట్టి "ఇప్పటి నుండీ నీ దోస్త్ కటీఫ్" అనేవాడు. కాని ఆమె కన్నీళ్ళుచూసి అయిదు నిమిషాలలోపలే వచ్చి, భుజమ్మీద చెయ్యేసి "దోస్త్" అంటూ తన కుడిచేతి బొటనవేలిని ఆమె బొటనవేలికి బలవంతంగా తాకించేవాడు. అటువంటి స్నేహం ప్రేమగా రూపొందింది. పెళ్ళి మాటల కొచ్చేసరికి సాంబు తండ్రి పది వేలడిగాడు.

రోహిణి తండ్రి వెయ్యి రూపాయల జీతగాడే. కాని నలుగురు ఆడపిల్లల తండ్రి. ఇంతగా ప్రేమించుకున్న పిల్లలను డబ్బు విడదీస్తుందా అనుకున్నాడు

కాని విడదీసింది.

డబ్బు సంచులతో వచ్చిన వనజ రెండు సంవత్సరాలే ఉంది. పది రోజుల బాలింత అనుకోకుండా బిడ్డను తల్లి లేని దాన్ని చేసి వెళ్ళిపోయింది.

రోహిణి ఇదంతా చూస్తూనే ఉంది. తనను చేసుకోలేదని ఆమె సాంబు మీద కోపగించలేదు. సాంబు పట్ల ఆమె ప్రేమ పున్నమి నాటి వెన్నెలలా ఇంకా విరియ కాస్తూనే ఉంది. అతడు మరొకరి వాడవుతేనేం తను ప్రేమించడానికి? ప్రేమించటానికి పెళ్ళే కావాలా? శారీరకమయిన ఆనందమే కావాలా? ఏ పని చేస్తే అతడి కిష్టమో ఏ పని చేస్తే అతడికి సహకరించినట్లవుతుందో ఆ పని చేసి తాను సంతోషించకూడదా? ఇది ఏకపక్షమే అయినా ఆమె ప్రేమకు ప్రతిబంధకం కాలేదు.

వనజ చనిపోయిననాడు అందరూ తలలు పట్టుకుని కూర్చుంటే, ఏడ్చి గుక్కలు పెట్టే పసిబిడ్డను మేడ దిగి వచ్చి అక్కున చేర్చుకున్నది రోహిణి.

సాంబు అన్నోదకాలు విసర్జించి దిగాలుపడి కూర్చున్నాడు. నెల గడిచినా అతడు పెరిగిన గడ్డాన్ని గియ్యలేదు.

సాంబు తిరిగి ప్రపంచంలో పడాలంటే అతడికి తిరిగి పెళ్ళి చెయ్యాలని తల్లి దండ్రులు ఆలోచిస్తున్నారు మూడో నెల వచ్చేసరికి ఈ వార్త పైకి బుస్సున పొంగింది.

రోహిణికి కూడా ఈ వార్త తెలిసింది.

చీకట్లో గదిలో మంచం మీద వెల్లకిలా పడుకుని కప్పుకేసి చూస్తున్న సాంబు గదిలోకి వెళ్ళింది రోహిణి

అడుగుల చప్పుడు విని లేచి లైట్లు వేశాడు.

ఆమెను చూడగానే బొమ్మలా నిలబడ్డాడు.

ఆమె తన పెళ్ళయిన తరువాత కంటబడలేదు. భార్యపోయిననాడు ఎక్కడి నుంచి వచ్చిందో వచ్చి, ఏడుస్తున్న పిల్లలను అక్కున చేర్చుకుంది. ఆమె మళ్ళీ కనపడలేదు. ఆమెతో మాట్లాడి ఎన్నాళ్ళయింది?

ఆమెను పలకరించడానికే అతడికి ముఖం చెల్లటంలేదు. ఏదో అపరాధం చేసినట్టుగా గుండె కొట్టుకుంటోంది. తల భూమిలోకి దిగిపోతోంది.

"సాంబూ."

"కూర్చో రోహిణి" దగ్గరగా ఉన్న కుర్చీ ఆమె నిలబడి ఉన్న వైపుకు జరిపాడు.

"నీవు మళ్ళీ పెళ్ళి చేసుకుంటావని తెలిసింది. నీ ప్రేమ చిహ్నంగా నీ వస్తు వేదయినా నా దగ్గిర ఉండాలి. ఆ పాపను నా కిస్తావా—పెంచుతాను.'' అడిగింది. గాఢంగా ప్రేమించుకున్నప్పటికీ డబ్బుకోసం వేరే పెళ్ళి చేసుకున్న సాంబు ఆప్యాయంగా "రోహిణి! ఈ గుండెబలం లేనివాడితో ఇంకా మాట్లాలని పిస్తోందా? నేను పిరికివాడిని, సిగ్గుతో తల వంచుకుంటున్నాను."

"సాంబూ! నీవు ధైర్యంతో నన్ను పెళ్ళి చేసుకోలేకపోయావు. కాని నీ మనసు నిండా నేనే ఉన్నాను. కాని చెప్పగలవా? చెప్పలేవు అందుకని నీ ప్రేమ చిహ్నంగా పాపను పెంచుతాను. పాపలో నిన్ను చూసుకుంటాను తల్లా పెద్దదయింది. రాబోయే నీ భార్య నీ పాపను ప్రేమతో పెంచలేదు."

"అందుకూడా నాకు ముఖం చెల్లటం లేదు రోహిణి."

ఆ గది పక్కగా వంట ఇంట్లోకి వెళ్ళుతున్న రమణమ్మ వాళ్ళ సంభాషణ పూర్తిగా విన్నది. ఆ మాటలు ఆమె గుండెలో గునపంలా గుచ్చుకున్నాయి. గది

లోకి నడిచింది వాళ్ళిద్దరి ముఖాలూ చూసింది. రోహిణికి జరిగిన అన్యాయాన్ని జ్ఞాపకం తెచ్చుకుంది. గుండె నీరయింది.

చప్పున రోహిణి రెండు చేతులూ పట్టుకుంది. గుండె కావించుకుంది

"అమ్మా! రోహిణీ! నీ కొకసారి అన్యాయం చేసి నష్టపోయాము. ఈసారి నీ కన్యాయం చేయలేనమ్మా, ఈ బిడ్డే కాదు. సాంబూ నీ వాడే. ఈ ఇల్లు నీది రేపటి నుంచీ నిర్వహించుకో తల్లీ" ఆమెను గుండెకు చేర్చుకుంది.

*　　　*　　　*　　　*

అచేతనంగా పడి ఉన్న రోహిణిని చూడగానే రోహిణీ-సాంబుల పెళ్ళి ప్రస్తావనలు మనసులో మెదిలాయి రమణమ్మకు. కన్నార్పకుండా వెర్రి ప్రేమతో బతుకుతున్న రోహిణి వంకే చూస్తోంది రమణమ్మ.

రాత్రి వేళ నిశ్శబ్దంగా ఉన్న ఆ హాస్పిటల్లో అక్కడక్కడ చప్పుళ్ళూ మాటలూ నెమ్మదిగా వినిపిస్తున్నాయి. వేకువ జామున నైట్ డ్యూటీ నర్సు అందరికీ టెంపరేచరు చూడటానికి నాలుగు గంటలకే బయలుదేరింది. తనవార్డులో కింద అంతస్తులో అందరికీ చూసి పైకి వచ్చింది.

రమణమ్మ, రోహిణులు సోఫా మీద కూర్చుని ఉన్నారు.

"ఏవమ్మా, నిద్రపోలేదా?" అంటూ వెళ్ళి సాంబు టెంపరేచరు చూచింది. వెంటనే కిందికి దిగి నైట్ డ్యూటీ డాక్టరుతో తిరిగి వచ్చింది,

"నిద్రపోకుండా ఇలాగే కూర్చున్నారా రాత్రంతా" అంటూ వాళ్ళను పలకరించి, రోగి చెయ్యి పట్టుకుని నాడి చూశాడు. స్టెతస్కోపుతో గుండె పరీక్ష చేశాడు.

అతడి ముఖం వాలిపోయినట్లయింది. గబగబా ట్యూబులన్నీ తీసివేశాడు. రోగికి ఆపాదమస్తకమూ దుప్పటి కప్పాడు

ఏమిటిది? పరీక్షచేసి ట్యూబులన్నీ తీసేశాడు. ఇంక వాటితో పని లేదా?

మెట్లవరకు వచ్చి రమణమ్మ డాక్టర్ని అడిగింది. "డాక్టరుగారూ ? బాబు రేపు కళ్ళు తెరుస్తాడా?" అని.

"అయిపోయిందమ్మా అంతా అయిపోయింది." గబగబా మెట్లు దిగాడు.

రమణమ్మ బొమ్మలా నిలబడిపోయింది. రోహిణి గోడకుముఖాన్నానించింది.

వార్డు బాయ్ టాక్సీ తెచ్చాడు. ఆ రెండేళ్ళూ సాంబుకు వైద్యం చేసిన డాక్టర్లిద్దరూ, నర్సులూ వార్డుబాయిస్ అంతా వాళ్ళను వోదార్చి టాక్సీ ఎక్కించారు.

కారులో కూర్చుని సాంబును తన ఒడిలో పడుకోబెట్టుకుని, అతడిదేహాన్ని చేత్తో నిమురుతూ "సాంబూ! నాతో కటీఫ్ చేసి వెళ్ళిపోతున్నావు. నీ కోపం తాటాకుల మంటని నాకు తెలుసులే. మళ్ళీ రావూ దోస్త్ ననుకుంటూ"

ఆమె కన్నీటితో అతడి పైన కప్పిన దుప్పటి తడిసిపోతూంది.

(ఆంధ్రప్రభ - సచిత్ర వార పత్రిక)



# తల్లి మనసు

రాత్రి పదకొండు గంటలు కావచ్చింది. పుచ్చపువ్వు లాంటి వెన్నెల విరియ గాస్తున్నది.

అప్పుడే మాణిక్యం తలనిండా దుప్పటి కప్పుకొని, విసవిసా నడుస్తూ, ఇల్లు చేరుకొని, తాళం తీసి గోడవారగా ఉన్న బల్లమీద కూర్చోవాలని, గడపలో అడుగు వెయ్యబోయింది.

"ఆగు!" అన్న శబ్దంతోపాటు ఇనపనాడాల బూట్ల టకటకలు వినిపించి వెనక్కు తిరిగింది.

ముగ్గురు పోలీసులు ఎర్ర టోపీలతో లాఠీలు తిప్పుకుంటూ అంగణంలోకి వచ్చారు.

"ఏమిటి బాబూ ఇలా వచ్చారు?" ఒణుకుతూ విలబడిపోయింది.

"ఇంత రాత్రివేళ ఎక్కణ్ణించి వస్తున్నావు?" గర్జించి అడిగాడు హెడ్ కానిస్టేబుల్

"పరాంకుశయ్యగారి కోడలికి పురిటినొప్పు లొస్తున్నాయని కబురంపితే వెళ్ళాను. రాత్రి తొమ్మిది గంటలకు పురుడు వచ్చింది. మగపిల్లవాడు. నేనే పిల్ల వాడికి నీళ్లుపోసి వచ్చాను. వెంట మనిషిని పంపిస్తానంటే వెన్నెలేకదా అని నేనే బయలుదేరి వచ్చాను. నాతో ఏమయినా పని ఉందా?"

"నీ యింట్లో ఎవరెవరు ఉంటారు!" లాఠీ ఆడిస్తూ ప్రశ్నిస్తున్నాడు హెడ్.

"నా యింట్లోనా?" ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. "రండి, చూద్దురు గాని లోపలికి." వెనక్కు తిరిగి గూట్లోఉన్న దీపం వెలిగించింది.

హెడ్ నట్టింట విలబడ్డాడు, నాలుగు వైపులా కలయజూస్తూ.

అదొక చుట్టిల్లు. నూరు గజాల స్థలంలో తాటి దూలాలతో మట్టితో కట్టిన తాటి ఆకుల చుట్టిల్లు. ఇంటి ముందర, వెనక కొబ్బరిచెట్లు తాటిచెట్లు ఏపుగా పెరిగాయి. గడపదగ్గర చెట్లపాదులు పూతా కాయా మీద ఉన్నాయి. ఒక మూలకు ఒక చిన్న వరలబావి. అవన్నీ చూస్తూ పెరడంతా తిరిగి వచ్చారు ఆ ఇద్దరు పోలీసులు.

పెరటి తలుపుకు దగ్గరగా పొయ్యి- ఆ పొయ్యి కనబడకుండా ఒక చిన్న అడ్డుగోడ చుట్టింటికి కుడిచేతి వైపుగా తాటిదూలాలతో ఒక చిన్న అటక- దాని మీద నాలుగైదు కుండలు. తల పైకెత్తి చూసి - తలుపుమీద కాలుపెట్టి పైకెక్కాడు ఒక పోలీసు. కుండల చాటున చూసి, క్రిందికి దూకి చేతులు దులుపుకున్నాడు. ముగ్గురూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

ఆమెకు వాళ్ళసంగతి అర్థంకాక వెర్రిచూపులు చూస్తున్నది. నిలబడలేక గోడవారగా ఉన్న మంచం వాల్చుకుని కూర్చుంది.

"మీ యింటి కెవరయినా వస్తూ ఉంటారా?" హెడ్ అడిగాడు టోపీ చేత బట్టుకుని.

"నా యింటికా?" విషాదంగా నవ్వింది. "నాకెవరున్నారని వస్తారు?"

"ఎవరూ లేరా? పోనీ తెలిసినవాళ్ళు వస్తారా? చీకటయింది - పడుకుని తెల్లవారి వెళ్ళిపోతామని పడుకోవటానికి ఎవరూ రారా?"

"నా యింటికి ఎవరూ రారు బాబూ. ఎందుకట్లా అడుగుతున్నారు?" ఆమెకు దేహము ఒణికిపోతున్నది.

"పక్క ఊర్లో ఖూనీ జరిగింది. భార్యాభర్తలను గొడ్డళ్ళతో నరికి చంపేశారు. ఇంట్లో ఉన్నదంతా దోచుకున్నారు. ఆ గుంపులో ఇద్దరు ఇటు పరుగెత్తుకు వచ్చారు. ఈ యింటి వైపుకే వచ్చారు." హెడ్ కర్రను అరచేతిమీద కొట్టుకుంటూ ఆమెను అనుమానంతో చూస్తున్నాడు.

"ఇదివరకూ ఒక కేసులో ఇద్దరు నేరస్తులు ఈ ఊళ్ళో ఒక యింట్లో రెండు రోజులు దాక్కున్నారు. అప్పుడు అంతా ఇట్లాగే అన్నారు 'మాకు తెలియదని' కాని - ఒకరింట్లో దొరికిపోయారు నేరస్తులు."

పోలీసు నెం. థర్టీవన్ చెప్పిన మాటలకు తల ఊపుతున్నాడు హెడ్.

"ఎక్కడ జరిగిందో ఎవరింట్లో జరిగిందో నాకు తెలియదు బాబూ," అంది చేతులు జోడించి, ఆమె ఆ మధ్యాహ్నం పగటి నిద్రకూడా వదులుకొని వెళ్ళింది. రాత్రి భోజనం లేదు. గ్లాసెడు మజ్జిగ తాగింది. కళ్ళు మూతలు పడుతున్నాయి. ప్రాణం చాలా అలసిపోయింది.

"చూడమ్మా. నీ పేరేమిటో? ఇప్పుడు ఎక్కడ చూసినా దొంగల ముఠాల దౌర్జన్యం ఎక్కువయిపోయింది. దోచుకోవటాలూ, ఖూనీ చేయటాలూ ఎక్కువయిపోయింది. దొంగతనం ఖూనీ చెయ్యకపోయినా నేరస్తులను దాచటం కూడా నేరమే, ఎక్కడున్నారో తెలిసి చెప్పకపోయినా నేరమే - తెలిసిందా?" గర్జించినట్లు అన్నాడు హెడ్.

"ఏమో నాకు తెలియదు బాబూ!"

"అసలు నీ సంగతి చెప్పు? అంత పెద్ద బొట్టు పెట్టుకున్నావు. నీ మొగుడేం చేస్తాడు? నీ పిల్లలు ఏం చేస్తారు?"

ఆ మాటలకు ఆమె కళ్ళు వర్షించాయి. 'అంత బొట్టు పెట్టుకున్నావు' ఈ మాట గుండెలో తూటా దూరినట్లు దూరింది. అవును. ఎక్కడో ఉన్నాడని పెట్టుకుంటున్నది. పదేళ్ళ క్రిందటి వరకు సైన్యంలో చేరి పనిచేస్తున్నట్టుగా నెలకు ఏభయి రూపాయలు పంపించేవాడు. ఆ తరువాత పంపటం లేదు. తనకు ఏ కబురూ చెప్పేవారు లేరు.

అసలు – ఆనాడు జగడం పెట్టుకొని తెల్లవారకముందే ఇంట్లోనుంచి వెళ్ళిపోయాడు.

ఇంతకూ అది జగడమా? కాదు. ఆలోచన. ఒక్కగానొక్క కొడుకైన రంగడి భవిష్యత్తును గురించి భార్యాభర్త లిద్దరూ కలిసి చేసిన ఆలోచన. కాస్త గొంతెత్తి గబగబ మాట్లాడినట్లనిపించింది మామూలుగా అతడు నెమ్మదిగా మాట్లాడేవాడే కాని – ఆ నాడు ఎందుకో శృతి మారింది. అందులో తన తప్పు కూడా కొంత ఉంది. అతడికి చురుక్కుమనేటట్టుగా "కనగానే సరికాదు. అబ్బాయిని బాగా చదువు చెప్పించాలి. మనం పడ్డ కష్టం వాడు పడకూడద"ని గట్టిగా అన్నది. తరువాత పశ్చాత్తాపపడినా లాభం లేకపోయింది. ముందు నోరు జారింది...

కాకిపిల్ల కాకికి ముద్దు. అలాగే తండ్రి రంగు వచ్చింది కొడుక్కి. అయితే నేమి? తన కొడుకు బాగా చదువుకుని పెద్ద ఉద్యోగం చేయగలిగితే ఈ నలుపు రంగూ, సగం కొరికినట్టుగా ఉన్న ఎడమచెవీ కమ్ముకుపోవూ? తల వెంట్రుకలు కాస్త పెద్దవిగా ఈ రోజుల్లో మగపిల్లలు పెంచినట్టుగా పెంచితే, ఆ లోపమూ కనబడదు. కొడుకు మంచి సమర్థుడై ఫలానా వారి అబ్బాయని పేరు తెచ్చుకుంటే ఎంత ఘనంగా ఉంటుంది?

అలా అనుకుని తండ్రి పంపించిన డబ్బుతో బట్టలు కుట్టించి బడికి పంపించింది. ఐదో క్లాసు వరకూ బుద్ధిమంతుడిలా చదివాడు. స్కూల్ డ్రెస్ వేసుకుని కాలి బూట్లతో నల్లగా ఉన్న దొరబాబులా తన కళ్ళకు కనబడేవాడు. తను తండ్రి దగ్గరలేని లోపం కనబడకుండా తల్లీ తండ్రీ తానే అయి అబ్బురంగా పెంచింది.

కాని - కాని వాడూ తండ్రి వంటివాడే ఏదో విషయంలో పిల్లవాడికి భయ భక్తులు చెప్పబోయింది.

అంతే.

తెల్లవారి లేచి చూస్తే పిల్లవాడు పక్కమీద లేడు.

అప్పుడు తన పరిస్థితి ఏమిటి? తను పడిన ఆవేదన? పరితాపం? గుండె కోత? మాటల్లో వ్యక్తం కాదు.

భరించ లేననుకుంటూనే భరించింది - భరిస్తోంది.

గుండె చీల్చి చూస్తే ఎక్కడా కోపం లేదు తనకు. ఇతరులను పీడించే మనిషి కాదు. కాని-కాని తనకు ఊరివాళ్ళంతా కలిసి 'తగని పోరుపెట్టి తండ్రీ కొడుకులను ఇంట్లోనుంచి వెళ్ళగొట్టిందని' పేరు పెట్టారు. తనకేం మిగిలింది జీవితంలో? ఆవేదన! ఆరని మంట!

ఆ పరితాపం భరించలేక-విలవిల్లాడే మనసును పదిమంది పిల్లలు చేరిన చోట కూర్చుని, వాళ్ళు ఆడుతూ కేరింతలు కొడుతుంటే చూసి సంతోషించేది. ఇరుగుపొరుగు ఇళ్ళకు వెళ్ళి పిల్లలను ఎత్తుకునేది. వాళ్ళకు నీళ్ళుపోసి బట్టలు వేసేది.

దానిలోనే తృప్తి - దానిలోనే ఉపశాంతి తనకు.

రెండు చేతులతో పట్టుకుని తల ఊపింది.

"నాయనా. ఈ ఊళ్ళో ఎవరినడిగినా నా సంగతి చెప్తారు, అడగండి."

"చెప్పు? నీ యింటికెవరూ రాలేదా? రారా? నీకు పిల్లలు లేరా?" మళ్ళీ ప్రశ్నలు మొదలుపెట్టారు పోలీసులు.

ఆమె రెండు చేతులతో తల పట్టుకుని కూలబడిపోయింది.

దేనికి జవాబు చెప్పాలి? తనకు తనవాళ్ళు ఉండీ లేనట్టే.

ఆమె మనసు తెగించింది.

"అయ్యా! నా పెనిమిటి ఉన్నాడు. నాకు ఒక కొడుకు ఉన్నాడు. కాని ఆ ఇద్దరూ నన్ను వదిలిపెట్టి వెళ్ళారు. నేను ఒంటరిదాన్ని. ఇప్పుడెవరూ నా యింటికి రారు."

"నీ జీవితం ఎట్లా గడుస్తున్నది? చాటుగా డబ్బు అందుతోందా?"

గుండెమీద చేతులు వేసుకొని బావురుమన్నది.

"ఈ ఏడుపులు ఇట్లాగే ఉంటాయి. ఎన్నివిన్నామో! ఇంకెన్ని వింటామో!" ముగ్గురూ వీధి వాకిలిముందర కాపలా కాసినట్టుగా కూర్చున్నారు.

ఆమె చాపగుడ్డ పరచుకొని మారుబట్ట తలకింద పెట్టుకుని పడుకుంది. తలుపులు దగ్గరగా వేసి ఉంచింది.

పోలీసులు ముగ్గురూ మూడు విధాలుగా ఆలోచిస్తున్నారు. మరునాడు ఉదయం ఎనిమిది గంటలకు పై అధికారి వస్తాడు. నేరస్తులను పట్టుకోలేని చవటలని తిడతాడు. ఈ కేసు ఎన్నాళ్ళకూ అంతుపట్టటంలేదు.

ఇద్దరూ అక్కడ కూర్చొని ఉండగా హెడ్ మళ్ళీ ఊళ్ళోకి వెళ్ళాడు — మళ్ళీ ఒకసారి అందరినీ అడగటానికి.

తైలసంస్కారంలేని తల వెంట్రుకలు దుబ్బులా పైకిలేచి ఉంటాయి. వాటినే పోదపెట్టి ముడిపెట్టుకుంటుంది. చేతులకు నాలుగేసి మట్టిగాజులు వేసుకుంటుంది. ఏనాటివో వెలిసిపోయిన గుడ్డలు కట్టుకుంటుంది. ముఖాన పెద్ద బొట్టు పెట్టు

కుంటుంది. మెడలో ఒక దారపు బొందు. దానిలో అరిగి విరిగిపోయిన రెండు పుస్తెలు. మెడకు అంటుకుపోయిన నల్లపూసల దండ, ఈ మాణిక్యానికి జీవిత మెట్లా గడుస్తోంది? హెడ్ అందరినీ అడిగాడు. అందరికీ సంగతి తెలుసు. కాని "మాకేం తెలుసు? ఏదో పిచ్చిదానిలా తిరుగుతూ ఉంటుంది." అన్నారు.

ఊరి చివరన గుడిసె వేసుకున్న దుర్గన్న దగ్గరికి వెళ్ళాడు.

"ఆయమ్మ దగ్గరి కెవరొ త్తారండి? ఆయమ్మతాన డబ్బెక్కడిది? పెరట్లో ఉన్న కొబ్బరిచెట్లు తాటిచెట్లు నేనే గుత్తకు తీసుకొని ఐదొందలిస్తా ఉండా సాలుకు. ఏం తింటుందో! ఆయమ్మ చెయ్యి మంచిదని ఊరందరు పురుట్లో పిల్లలికి సీళ్ళో యించుకుంటారు. సేతి సలవగల తల్లి గాదండీ!" అన్నాడు.

దీర్ఘంగా నిట్టూర్చాడు హెడ్. కాని ఎవరెంత చెప్పినా అనుమానాలు వదిలిపోవటం లేదు. ఆ చుట్టింటి మీద కాపలా ఉంచాడు.

మాణిక్యం వీధితలుపు తెరిస్తే ఒక పోలీసు, పెరటి తలుపు తెరిస్తే ఒక పోలీసు.

"నేనేం తప్పు చేశాను? నేనేం తప్పు చేశాను?" గొణుక్కుంటూ ఒక పూటే అన్నం వండుకుంటోంది మాణిక్యం.

మూడో నాటికల్లా మాణిక్యం జ్వరంతో డీలాపడిపోయింది. మూలుగుతు చాపమీద పడుకుని ఎవరయినావస్తే గంజి కాయించుకుందామని ఎదురు చూడ సాగింది.

ఎవరు వస్తారు? పోలీసు కాపలా ఉన్న ఇంటిని చూస్తేనే అందరికీ భయం భయంగా వుంది.

దుర్గన్న కొబ్బరికాయలు కోసుకుని తాటిచెట్టుకు ముంత తగిలిద్దామని వచ్చాడు.

చప్పుడు విని మాణిక్యం తలుపు తెరిచింది.

"దుర్గన్నా, జ్వరం వస్తున్నది. కాపిని పాలు తెచ్చి ఇస్తావా?" హీన స్వరంతో అడిగే మాణిక్యాన్ని చూసి అతడు ఉరుకుపరుగుల మీద కాచిన పాలు తెచ్చాడు.

"రేపుకూడా రా దుర్గన్నా. పాలు తెచ్చిపెట్టు. గంజి కాచుకోలేను" వెళ్ళి చాపమీద పడుకుంది

వారంరోజుల తరువాత సాయంత్రం వేళ ఒక జీపు వచ్చి మాణిక్యం ఇంటి ముందు ఆగింది. పోలీసు ఇన్‌స్పెక్టరు దిగి ప్రశ్నించాడు. కాపలాకాస్తున్న పోలీసును.

"ఏం చెప్పటం లేదు సార్, ఆమె చాలా గట్టిది. కాని—మేము వచ్చిన తరువాత ఈ యింటికి ఎవరూ రాలేదు."

"నేను చెప్పిస్తాను చూడు." చేతి కర్రతో తలుపునెట్టాడు లోపల గడియ పెట్టలేదు కనుక తలుపులు తెరచు కున్నాయి. ఆయనతో కూడా జీపు డ్రైవరు పోలీసులు లోపల అడుగుపెట్టారు.

"ఏయ్ మాణిక్యం!" కర్రతో కదిలించాడు ఇన్‌స్పెక్టరు.

డ్రైవరు ఆ యిల్లు చూడగానే కళ్ళు పెద్దవి చేసుకుని గుటకలు మింగుతున్నాడు. మాణిక్యం అని పిలవగానే మతిపోయినట్లయింది అతడికి.

మాణిక్యం కళ్ళు తెరిచింది. కాని—ఆ చూపులు ఇంటికప్పుకేసి ఉన్నాయి.

"నాయనా! రంగా, నే నేమన్నానురా నిన్ను? అంత కోపం ఎందుకురా నామీద? నీ చదువుకోసం మీ నాయన పంపించిన డబ్బు మూటగట్టి దాచానురా. వస్తావా ఎప్పుడైనా? నన్ను చూడాలని లేదురా నీకు? ఇంకా కోపం పోలేదురా మీ నాయనలాగ?" తనలో తాను గొణుక్కుంటోంది.

"ఏయ్ మాణిక్యం? ఎవరా రంగడు? నీ కేమవుతాడు?" ఆమెను లేపి కూర్చోపెట్టమన్నాడు ఇన్‌స్పెక్టర్ పోలీసును.

ఇద్దరు పోలీసులు ముందుకు వచ్చారు. అంతలో డ్రైవరు తటాలున వచ్చి ఆమెను లేపి గోడకానిచ్చి కూర్చోబెట్టాడు. ఆమె ఒళ్ళు కాలిపోతున్నది. పక్కనున్న గిన్నెలో ఉన్న పాలు నాలుగు చంచాలు గొంతులో పోశాడు.

ఆమె కొంచెం తెప్పరిల్లి "ఏమిటి బాబూ!" రెండు చేతులూ జోడించింది.

"నీ వెవరు? ఆ రంగడెవరు? చెప్పు?" గద్దించినట్టు అడిగాడు ఇన్‌స్పెక్టరు.

"రంగడెవరనుకుంటున్నారు? నేను కన్నకొడుకు బాబూ రంగడంటే. నా మీద అలిగి ఇంట్లోంచి వెళ్ళిపోయాడు."

"బాబూ! ఎప్పటికయినా రాడా? ముప్పైయైదేళ్ళనాడు వెళ్ళినవాడు అమ్మను చూడటానికి రాడా?"

"ఎట్లా ఉంటాడు?" కళ్ళు మెరిసి నట్లయింది ఇన్‌స్పెక్టరుకూ పోలీసులకూ.

"చెప్పు ఎట్లా ఉంటాడు? అతడి కోసం మేము వెతుకుతున్నాము. చెప్పు?" ఆమె ఒంటిమీద చేతి కర్ర రెండుసార్లు ఆడింది.

గుర్తుపట్టలేని మాణిక్యాన్ని చూసి డ్రైవరు బిత్తరపోయి చూస్తున్నాడు.

"గుర్తులు చెప్పు? నీ రంగడిని నేను వెతుక్కొస్తాను," హెడ్ ధైర్యంగా అంటున్నాడు.

"ఇప్పుడెట్లా ఉన్నాడో? తండ్రిలాగ భారీ మనిషి అయి ఉంటాడు. కాస్త నలుపు. ఎడమ చెవికి గ్రహణం సోకింది. పైన కాస్త చర్మం కొరికినట్టుంటుంది. వాడూ నా కొడుకు. మీరు వెతుక్కొస్తారా?"

చప్పున చెవి తడుముకున్నాడు డ్రైవరు. గుండె పొంగింది ఆపుకోలేక పోయాడు. రెండు చేతులతో ఆమెను చుట్టేశాడు.

"అమ్మా, నీవు బతికే ఉన్నావా? నే నేనమ్మా నీ రంగణ్ణి. అమ్మా, కళ్ళు తెరిచి బాగా చూడు. ఇదిగో నా చెవి పట్టుకుచూడు." ఆమె తలను రెండు చేతుల్లోకి తీసుకుని పిలుస్తున్నాడు ఆవేదనతో డ్రైవరు.

బలహీనంగా ఉన్న మాణిక్యం-కొన ఊపిరితో ఉన్న మాణిక్యం రంగడి స్పర్శకూ రంగడి మాటలకు తట్టుకోలేకపోయింది. ఆ సంభ్రమంలో వణుకు తున్న చేతులతో రంగడి తల నిమురుతూ "నా రంగడు నా రంగడు" కనురెప్పలు

అల్లల్లాడిస్తూ గుడ్లు తేలవేసింది. అంత సంతోషాన్ని ఆ గుండె భరించలేక మౌన ముద్ర దాల్చింది.

అంచెలంచెలుగా ఊరంతా పాకింది ఈ వార్త.

కరణం కొడుకూ మునసబు బావమరిదీ గుండె అరచేత బట్టుకుని చూడటానికి వచ్చారు. మూగిన గుంపులో నుంచి తొంగిచూస్తున్నారు-ఆ రంగడినయినా పోలీసులు అరెస్టు చేస్తే తమ ప్రాణాలు కుదుటపడతాయని.

"రంగా! ఇట్లా జరుగుతుందనుకోలేదు. ఈ ఏభయి రూపాయలు నీ దగ్గరుంచు. నేను వెళ్ళి నీ జీతం ఎడ్వాన్సుగా పంపుతాను కావాలంటే ఒక నెల సెలవు పెట్టు."

బరువెక్కిన హృదయంతో ఇన్‌స్పెక్టరు బయటికి వస్తుంటే పోలీసులకూ హెడ్‌కూ గుండెల్లో రాయిపడ్డది, ఇంకా ఆ కేసు తెమలనందుకు.

(యువ-మాస పత్రిక).



# పరకాంత

వరదరాజేశ్వరి ఆ క్రిందటిరోజే జూనియర్ కాలేజి లెక్చెరర్‌గా బదిలీ అయి వచ్చింది.

ఆమె రిజిస్టర్‌లో సంతకం పెట్టే ముందు మెడనొకసారి తడిమి చూసుకుంది. బంగారంలో చుట్టిన రెండు వరసల నల్లపూసల దండ ఒకపేట బంగారు గొలుసు చేతికి తగిలాయి. మెడ నిండుగా ఉంది. వాటి నొకసారి కంటితో చూసుకోగానే ధైర్యము వచ్చినట్లయింది. సంతకంపెట్టి హుందాగా స్టాఫ్‌రూమ్‌లో కెళ్లి కూర్చుంది టైంటేబుల్ చూసుకుంది. పది గంటల తరువాత తన క్లాసు.

ఈ లోపల ఒక్కొక్కరే ఆ రూమ్‌లోకి వస్తున్నారు. వచ్చి కుర్చీలో కూర్చున్న వరదరాజేశ్వరిని చూసి "కొత్తగా వచ్చారా?" అడుగుతున్నారు.

"అవును. నిన్ననే వచ్చాను" అని చెబుతోంది.

నాలుగైదు రోజులయేసరికల్లా ఆ కాలేజిలో పనిచేస్తున్న నలుగురు ఉపన్యాసకురాండ్రకూ ఆమె మెడలో ఉన్న ఆరెండు హారాల సంగతి తెలిసిపోయింది. పలకరింపులు సంభాషణలలోకి దిగాయి. క్రమంగా చనువు ఏర్పడ్డది.

మాలిక అర్చన ఇద్దరూ చాలా చురుకుగా ఉంటారు. వాళ్ల చురుకుదనం కళ్లల్లోనే కాదు మాటల్లో కూడా ప్రస్ఫుటమవుతుంది. హాస్యంగా వ్యంగ్యంగా మాట్లాడుతూ ఎదుటి మనిషిని తికమక పెట్టేస్తారు ఈ యిద్దరి కంటె కొంచెము వయసులో పెద్దవాళ్లు రమణీ శాంత. మితంగా ఆచి ఆచి మాట్లాడుతారు. వాళ్ల వాళ్ల సబ్జక్టులో నలుగురూ గట్టివాళ్లే. విద్యార్థులకు బాగా పాఠాలు చెప్పగలరు. డ్యూటీని చక్కగా నిర్వహించగలరు. ఈ నలుగురిపట్ల విద్యార్థులకు గౌరవాభిమానాలు అపరిమితము.

"రమణీ-రమణీ" దగ్గరగా వచ్చి కూర్చుంది మాలిక నోరు తెరిచి ఏదో చెప్పాలన్న ఆదుర్దాతో, "ఏమిటా హడావుడి అన్నింటికి? ఏం చెప్పదలచుకున్నావో తొందరగా చెప్పు" రమణి విసుక్కున్నట్టుగా అన్నది.

ఇటూ అటూ చూసి-ఎవరూ ఆ ప్రాంతంలో లేరని నిర్ధారణ చేసుకుని రమణికి దగ్గరగావచ్చి "ఆమె మనలాగ కాదు. ఆమెకు పెళ్లి అయినట్టుంది. నల్ల పూసల దండ________" అన్నది మాలిక.

"ఆం? అలాగా? ఎంత అదృష్టవంతురాలు? అయితే నీకెట్లా తెలుసు?" ఆశ్చర్యంతో నోరు తెరిచింది రమణి.

"ఎంత కొంగు కప్పుకున్నా మెడలో ఉండే వస్తువులు కనబడవా? మొన్న నేను పక్కనే కూర్చున్నాను. కొంగు కప్పుకుంటుంటే కనబడ్డాయి." చాలా గొప్ప పరిశోధన చేసినట్టు గర్వంగా చూసింది మాలిక.

ఉపన్యాసకురాండ్రంతా ఒకచోట కూర్చుని వరదరాజేశ్వరిపట్ల గౌరవ భావంతో మెలిగేవాళ్లు. తమ నలుగురినే ఒక గ్రూపు క్రింద పెంచుకుని మాట్లాడేవారు.

జయరామ్ నిరుడే ఆ కాలేజిలో ప్రవేశించాడు. అతడు వచ్చినప్పటినుంచీ ఆడవాళ్లకూ మగవాళ్లకూ మధ్య సేతువుగా మెలగుతున్నాడు. నవ్వుతూ చనువుగా చమత్కారంగా మాట్లాడుతూ ఉంటాడు.

"కొత్తగా వచ్చిన లెక్చెరరు బాగా మాట్లాడుతున్నారా? మీ అందరితో కలివిడిగా ఉంటున్నారా?" మాలికను అడిగాడు అతడు. వరదరాజేశ్వరి వచ్చి నప్పటి నుంచీ ఆమెను గురించి అడిగి తెలుసుకోవాలని ఉబలాటపడుతున్నాడు. ఆమెను చూడగానే అతడి ఆలోచనలు ఎటో పోతున్నాయి. ఆమె ఉండి ఉండి ఉలిక్కి పడుతుంది. ఎందుకు? ఏదో సందేహం.

"ఆమె చాలామంచివారు. గర్వం అసలేలేదు. మంచి మాటకారి" అన్నది కళ్లు గుండ్రంగా తిప్పుతూ.

సంతోషాన్ని ముఖమ్మీద కనబరచాడు జయరాం.

"అంతే కాదు. పెళ్లి కూడా అయిందండోయ్ జయరాం గారూ!" అన్నది గర్వంగా మాలిక.

పెళ్లి కావటమన్నది అపురూపమూ అరుదూ అన్నట్టు ముఖంపెట్టి "అలాగా! పెళ్లయిందా? అయితే వారు ఎక్కడున్నారు? ఏం చేస్తున్నారు?" నోరు తెరుచుకునే ఉన్నాడు ఆశ్చర్యంతో.

"ఇప్పటికి పెళ్లి అయిందనే తెలుసుకున్నాను ఇంకా వివరాలు సేకరించాలి"

వరదరాజేశ్వరి కాలేజికి దగ్గరగా ఒక పెద్ద ఇంట్లో ఒక గది అద్దెకు తీసుకుంది. స్వయంగా వంట చేసుకోవటం మొదలుపెట్టింది. కావలసిన వస్తువులు ఎక్కడ దొరుకుతాయో తెలుసుకుని కాలేజి నుంచి వచ్చేటప్పుడే కొనుక్కునేది. ఇంటికి రాగానే ఫ్లాస్కులో నుంచి ఒంపుకుని కాఫీ తాగేది. కాసేపు ఆ గదిలోనే ఇటూ అటూ తిరిగి వంట చేసుకునేది. తెల్లవారి కాలేజిలో చెప్పవలసిన పాఠాలు తయారుచేసుకుని అద్దెకు తెచ్చుకున్న పత్రికలు చదివేది.

"మా యింట్లో ఇవాళ మామిడికాయ పచ్చడి చేశాను. 'నీవు కూడాకాస్త రుచి చూడు'' అంటూ ఆ గదిలో అడుగుపెట్టింది ఇంటి యజమాని తల్లి-ఒక ఉదయాన.

పచ్చడి గిన్నె అందుకుని మూత తెరిచి వాసన చూసింది. ఇంగువ కర్వే పాకు వాసన ఘుమ ఘుమ లాడింది. తన తల్లి పెట్టిన పోపు జ్ఞాపకం వచ్చింది వరదరాజేశ్వరికి ఏనాటిదో ఆ రుచి ? అయినా మరిచిపోలేదు.

కంటిరెప్పలు టప టప లాడిస్తూ "మిమ్మల్ని చూస్తుంటే మా బొమ్మ జ్ఞాపకం వస్తోంది. అయినా ఇప్పుడు మామిడికాయ లెక్కడివండీ?" అంటూ ఆప్యాయంగా పీట వేసింది కూర్చోటానికి.

పీటవంక ఓరగంటితోనూ-వరదరాజేశ్వరి నో సా రి పరిశీలనగానూ చూసింది ఆమె.

"అమ్మా యీ నీపేరేదో వచ్చిన్నాడు చెప్పావు. ఈ రొట్టెల పీటేమిటి కూచోటానికి ? నేను మంచి పీట యిస్తాను వాడుకో. ఇంకేదయినా కావాలంటే చెప్పు-ఇస్తాను. చిన్న పిల్లవి ఒక్కదానవూ ఉంటున్నావు. ఇబ్బంది పడబోకు. ఆఁ. కాయలెక్కడివని అడిగావు కదూ ? అబ్బాయి ప్లీడరు కనుక పార్టీలెవరో తెచ్చారు పాతిక్కాయలూ-కిలో మంచి నెయ్యి, ఇంకా మామిడికాయలు వాళ్ల ఊళ్లో కాస్తున్నాయట" అని ఆ గదిని పరకాయించి చూసింది.

"ఆఁ. బాగానే సర్దుకున్నావు గదిని. ఈ పంపు కింద తోముకుంటున్నావా

గిన్నెలు? బాగా మెరుస్తున్నాయి. అన్నట్టు-రోజూ అన్నంలోకి ఏంచేసుకుంటు న్నావు?'' గూట్లో పెట్టిన సీసాలన్నీ చూస్తూ ప్రశ్నించింది.

''నేనాండీ మా వదినె అన్ని రకాల ఊరగాయలూ ఇచ్చింది. పొడులన్నీ తయారుచేసి సీసాలలో పోసి ఇచ్చింది. ఇవి అయిపోగానే వెళ్లినప్పుడు తెచ్చు కుంటానండి.''

ఆనాడు ఆదివారం కాఫీ తాగి తీరికగా కూర్చుంది వరదరాజేశ్వరి. ఆమె ఆప్యాయంగా మాట్లాడుతుంటే ప్రాణం లేచి వచ్చింది. తన బొమ్మ యిలాగే ఉండేది. తను పెద్ద మనమరాలు ఆమె కొడుక్కు చెప్పి తనపేరే పెట్టించుకున్నది. ఆపేక్షతో వరదా అని పిలిచేది. తన మీద ఈగ వాలనిచ్చేది కాదు.

''మిమ్మల్ని చూస్తుంటే మా బామ్మ జ్ఞాపకం వస్తోంది.' అన్నది పక్కగా కూర్చుని మళ్లీ.

''నీకు బామ్మ ఉందా? అయితే నన్నూ అలాగే పిలు ఇప్పుడు మీ బామ్మ బాగా తిరుగుతోందా? అసలు ఏ ఊరన్నావు మీది?'' కొంగు సవరించుకుంటూ అడుగుతోందామె.

''మా బామ్మ నాకు పదేళ్లప్పుడు పోయిందండి. మా వాళ్లది ఏలూరు.''

''అలాగా. అత్తవారిదే ఊరు?'' వరదరాజేశ్వరి మెడలో నల్లపూసలు చూస్తూ అడిగింది.

ఉలిక్కిపడ్డది. అవును. ఆవి షాపులో కొన్కుకుని మెడలో వేసుకుంది. గాని వాటి బాధ్యతలను తను అహర్నిశలూ జ్ఞాపకం ఉంచుకుని మెలగాలన్నమాట ఇంకా బాగా అలవాటు కాలేదు.

''అత్తవారిది కంకిపాడు'' అన్నది సర్దుకుంటూ.

''అతడేం పనిచేస్తాడు? ఎక్కడున్నాడు?''

''ఆయన నేను చేసే పనే చేస్తారు''

''మరి ఇద్దరూ ఒకచోట ఉండకుండా ఏమిటి? ఆయన ఉన్న చోటికి బదిలీ చేయించుకోలేకపోయ్యావా?''

"ఎంత ప్రయత్నం చేసినా కాలేదండి. సెలవుల్లో నేను వెళతాను"

"ఎందుకూ ఈ ఉద్యోగం? హాయిగా అతడి దగ్గరుండక?"

నవ్వింది వరదరాజేశ్వరి.

ఆ మరునాడు కాలేజిలో మాలిక పట్టుకుంది. అక్కా అంటూ వరస కలిపింది. ఊరూ పేరూ అన్నీ వివరంగా అడిగి తెలుసుకుంది.

తొణకకుండా అడిగినదానికి జవాబు చెప్పింది వరదరాజేశ్వరి.

"అక్కా నిన్ను ఇంత పెద్ద పేరుతోనూ పిలుస్తారా ఇంట్లో? మా బావగారు చిన్న పేరు ముద్దుగా పెట్టలేదూ?" మాలిక మరీ చనువై పోయి అన్నిటికీ ఎగతాళీ హేళనా చేస్తుంది.

"మా వాళ్లింట్లో నన్నందరూ వరదా అని పిలుస్తారు. అలాగే అందరూ పిలుస్తారు"

మాలికకు వరదా అని పిలవటంలో ఎంతో సంతోషం కలిగింది. అందరికీ చెప్పేసింది ఆ సంగతి.

ఒక్కొక్క రోజు వరదకు ప్రాణం గడగడలాడిపోతుంది. ఎక్కువ మాట్లాడకుండా ముభావంగా ఉండటానికి ప్రయత్నిస్తుంది. కాని ఆమె స్వభావానికే విరుద్ధమైనది.

దసరా సెలవులకు వరద ప్రయాణమైంది.

"అమ్మాయీ, మీ ఆయన దగ్గరికి వెళ్లుతున్నావా?"

"అవును బామ్మగారూ?" అంటూ నవ్వింది.

"వెళ్లిరా, ఈసారి ఆయనను ఈ ఊరు రమ్మను" అన్నది.

తల ఊపింది మాట్లాడకుండా.

వెళ్లగానే అన్నగారు విశ్వం ఆ ఊరి విశేషాలన్నీ అడిగి "ఎలా ఉందిప్పుడు?" అన్నాడు.

''బాగానే ఉంది ఇంకా బాగుండటానికి ప్రయత్నిస్తున్నాను''

''వరదా, అమ్మ కనక బతికి ఉంటే ఎంత బాధపడేదో ? పెళ్లి కాకుండానే ఈ నల్ల పూసలు మంగళ సూత్రాలు పెట్టుకుంటున్నావు మరి. నీ ఖర్చులు పోను ఇంకా మూడు వేలయితే సరిపోతుంది. మనమనుకున్న దానికి, మొన్న సురేష వచ్చినప్పుడు మాఘ మాసంలో లగ్నం పెట్టిస్తానన్నాను. నీకూ ఇష్టమే కదూ?'' ఆమె ముఖంలోకి చూశాడు.

నీళ్లు చెమ్మగిల్లటం అన్న చూడకుండా ఉండాలని తలదించుకుంది వరద.

వదిన నీలవేణి వరదను కూతురిలా చూసుకుంటుంది. ఆడబడుచు పెళ్లి చేయకుండా కాలం గడుపుతున్నాడని విశ్వాన్ని మందలిస్తూ ఉంటుంది.

సెలవల్లో ఆనందంగా గడిపి కాలేజికి వచ్చిన వరదను చూసి మాలిక ఆటలు పట్టించటం మొదలు పెట్టింది.

''అక్కా. నీవూ మా బావగారూ తీయించుకున్న ఫొటో నాకుచూపించవా?''

''వెంట తెచ్చుకోలేదు మాలికా. ఈసారి తీసుకువస్తాను.''

''అదేమిటి ? పోనీ నీ పర్సులో ఉన్నదయినా చూపించు మా బావగారిది?''

''నాకు పర్సులో పెట్టుకునే అలవాటు లేదు. ఈసారి వెళ్లినప్పుడు తెస్తానుగా''

''చూడు శాంతా. రమణీ నీవైనా చెప్పు. ఏమిటి అంతగా దాచుకుంటుంది ఎవరికీ చూపించకుండా? మనకు బావగారివేవయినా సంగతులు చెప్పి నవ్వించ కూడదూ?''

''అందరూ నీలాగ బడబడ వాగుతారేమిటి? అందులో బావగారి సంగతి అడిగితే చెబుతారా?'' మందలిస్తూ ప్రోత్సహించింది అర్చన.

సమయం దొరికినప్పుడల్లా వరదను పీడిస్తునే ఉంది మాలిక.

సాయంకాలము ఇంటికి వెళ్లేటప్పుడు జయరామ్ మెట్లమీద నిలబడ్డాడు. అతడు ప్రతిరోజూ ఇంటికి వెళ్లేటప్పుడు వేణుగోపాల్ కూడా వస్తాడు.

మాలికా అర్చనలకు మధ్య వరద గేటు వైపుకు నడుస్తున్నది. ఆమె ముఖం చూసిన వాళ్లకు ఎన్నో వ్యథలు ముఖమ్మీదనే కనుపిస్తాయి, పాపం అనుకుంటారు.

పెళ్లయిన తరువాత విడివిడిగా ఉద్యోగ రీత్యా ఉండవలసి వచ్చినందుకు వరద విచారంగా ఉంటుందని అందరూ అనుకుంటారు. అలా అనుకోవటానికి సగం కారణం మాలిక. కాని జయరాం మనసు ఏమీ అనుకోదు. ఆమెను చూసిన అతడికి ఎన్నో రకాల ఆలోచనలు పోతూ ఉంటాయి.

ఆయన దూరంగా ఉంటే ఇంత విచారపడాలా ? అంటుం దతడి మనసు.

''ఏమండీ మాలిక గారూ ? ఈసారి కాలేజి డేకు మంచి ప్రోగ్రాం ఏర్పాటు చెయ్యండి మీరంతా కలిసి'' అంటూ మాట కలిపి ఆమె వరదను గురించి ఏమయినా చెబుతుందేమోనని కదిలిస్తాడు. అనుకున్నట్టుగానే ఏవేవో చెబుతునే ఉంటుంది మాలిక.

ఫిబ్రవరి నెలలో తన దగ్గరున్న డబ్బంతా చేతబట్టుకుని వారం రోజులు సెలవుపెట్టి ఇంటికి బయలుదేరింది వరద. ఆమె వారం రోజులనుంచీ అన్నగారి దగ్గర్నుంచి ఉత్తరం వస్తుందేమోనని ఎదురు చూస్తోంది. సెలవు ముందుగానే ఏర్పాటు చేసుకున్నది కనుక ఉత్తరం రాకపోయినా బయలుదేరింది.

స్టేషనుకు వస్తాడనుకున్న అన్నగారు రాలేదు. పని సందడిలో ఉండి రాలేకపోయాడేమోననుకుంది. ఇంటికి వెళ్లగానే ఆమె ఊహించినట్టుగా వాతావరణం లేదు.

వదినా అన్నలు పెళ్లి పనులలో మునిగి తీరిక లేకుండా ఉంటారనుకుంది. కాని-ఇంట్లో ఏ సందడీ లేదు. విశ్వం ఇంట్లోనే లేడు. మామూలుగా ఆఫీసుకు వెళ్లిపోయినట్టున్నాడు. వదినగారు మామూలుగా భోజనంచేసి తీరిగ్గా కూర్చుంది.

ఆడబడుచును చూడగానే పలకరించకుండానే లేచి వంటయింట్లోకి వెళ్లింది. సూట్‌కేసు కిందపెట్టి లోపలికి నడుస్తూ ''అన్నయ్య లేడా వదినా'' అంటూ తనే పలకరించింది వరద.

''మామూలుగా ఆఫీసుకు వెళ్లాడు. కాళ్లు కడుక్కురా. భోజనం చేద్దుగాని.''

భోజనం చేస్తూ వదిన ముఖంలోకి చూసింది వరద.

వరద చూపులను తప్పించుకుంటూ లేచింది ఆమె.

"వదినా, నీకు ఒంట్లో బాగా లేదా? అట్లా ఉన్నావేం?" వరదను చూడగానే ఆప్యాయంగా పలకరించే వదినె ఇవాళ మూగనోము పట్టిందా? ఏమయిందివాళ్ళ? అంతా కొత్తగా ఉందేమిటనుకుంటోంది వరద. ఆమె అట్లా మాట్లాడకుండా ఉండేసరికి వరదకు కన్నీరు ముంచుకు వచ్చింది.

కడుపులో ఏదో సల సల మరిగి తెర్లుతున్నట్లయింది వదినెకు.

"అంతదూరం నుంచి పడుతూ పడుతూ బస్సులో వచ్చావు. కాసేపు విశ్రాంతి తీసుకో" అంటూ వదినె వరదకు మంచంవేసే నెపంతో అక్కడి నుంచి కదిలింది.

వరదకు అంతా అయోమయంగా ఉంది. మంచమ్మీద పడుకుందన్నమాటేగాని ఏవేవో ఆలోచనలు చుట్టుముట్టాయి. సురేష అన్నట్టుగా రాలేదా? అతడికేదయినా ఇబ్బంది వచ్చిందా, బస్సులో ప్రయాణంచేసి వచ్చిన వరదకు అలసటతో కళ్లు మూతలు పడ్డాయి.

తిరిగి ఆమెకు అన్నా వదినెల మాటలతో మెలకువ వచ్చింది.

"పాపం పడుతూ పడుతూ బస్సులో ఎండలో పడి వచ్చిందండీ. ఎంతో ఆదుర్దా పడుతూ 'అన్నయ్య లేడా వదినా' అంది. నేను కన్నీళ్లాపుకోలేకపోయాను. ముఖం పక్కకు తిప్పుకుని అన్నం పెట్టాను. పడుకుంది. ఏదో అర్థం చేసుకుంది. అంత తెలియనిదా? ఇల్లు చూసి వెళ్లాగిపోయినట్లు తెలుసుకునే ఉంటుంది" అంటోంది వదినె.

"ఆ దుర్మార్గుడు మూడువేలిస్తానన్నప్పుడు ఐదువేలిస్తే చేసుకుంటానన్నాడు, ఐదు ఇస్తామంటే ఏడు ఇవ్వమన్నాడు. అక్కడికీ నేను అతడన్న దానికల్లా సరేనని పాపం-దాన్నే కట్నం డబ్బు సంపాదించమని అడుగుతున్నాను. సరిపడిన డబ్బు తెచ్చే ఉంటుంది. దాని పెళ్లికి అదే డబ్బు సంపాదించటం నాకెంత బాధగా ఉందో తెలుసా?" విశ్వం కుర్చీలో కూలబడిపోయాడు.

సగం విన్నది వరద. దాన్నిబట్టి ఏం జరిగిందో తెలిసిపోయిందామెకు. సురేష్ చేసిందానికి వాళ్లు బాధపడటం సహించలేకపోయింది. కొంగుతో కళ్లు తుడుచుకుని లేచి కూచుని అన్నయ్యా అంటూ పిలిచింది.

''మధాహ్నం బస్సుకు వచ్చావామ్మా?'' విశ్వం లేచి వచ్చాడు.

''అవును భోజనం వేళకే వచ్చాను''

ఆ ప్రశ్నా ఈ జవాబు కాదు వాళ్లకు కావలసింది. వాళ్ల హృదయాలలో చెలరేగుతున్న దావానలం నిగ్రహంవల్ల పలకరింపుగా వెలువడిన మాటలవి: ఇద్దరికీ ఆ సంగతి తెలుసునని వాళ్ల ముఖాలే చెబుతున్నాయి.

''ఊరూ కాలేజి బాగుందా? నీకు ఇబ్బందిగా లేదు కదా?'' ఇంకా పై పై మాటలే సాగిస్తున్నాడు విశ్వం.

ఒక గంటసేపు ఇలా కాలక్షేపం చేసిన తరువాత ఇద్దరూ మామూలు మనుష్యులై ప్రస్తుతానికి వచ్చారు.

''అమ్మా వరదా'' భారంగా ఉన్న గొంతును సర్దుకుని ''మనం సురేషు వింక వదులుకుంటే మంచిదమ్మా'' అన్నాడు.

వరద అతడివంక చూడలేక తలవంచుకుంది.

''నాతో, ఎప్పుడు లగ్నంపెట్టినా సరేనన్నాడు కాని-వారం తిరక్కుండానే అతడి పెళ్లి పన్నెండు వేలతో పక్క ఊళ్లో అయింది. మాట తప్పే వాడిని నమ్మాము మనం ఇంత కాలం'' భార్య తీసుకు వచ్చిన కాఫీ గ్లాసు తనే చెల్లెలికి అందించాడు.

మెదడు మొద్దుబారినట్లయింది వరదకు. కొంతసేపటికి ఈ కట్నం డబ్బు కోసం తనెంత కష్టపడుతున్నది? నామ మాత్రం ఖర్చులు తను పెట్టుకుని పైన పైన లెక్కపెట్టుకుంటూ డబ్బు బ్యాంకులో వేస్తున్నది. పెళ్లిగాని ఆడపిల్లంటే లోకానికి తేలిక. ఆ బాధపడలేక నల్లపూసల దండ మంగళసూత్రాలు కొనుక్కుని మెడలో వేసుకుంది. ఇంకా ఏం చేయాలి తను?

''కాఫీ తీసుకో వరదా. చల్లారి పోతున్నది'' విశ్వం హెచ్చరించాడు.

ఆ రాత్రి ఎవరూ ఆమెను పలకరించలేదు మాట్లాడకుండా భోజనంచేసి పడుకుంది

మరునాడు విశ్వం ఆఫీసుకు వెళ్ళే సమయంలో ''అన్నయ్యా. ఇదిగో డబ్బు బ్యాంకిలో వెయ్యి. పదిగంటల బస్సులో వెళ్ళిపోతాను'' వంద రూపాయల నోట్లు అతడికి అందించింది.

''సరేనమ్మా'' అతడవి అందుకుని పక్కకు తిరిగి కన్నీళ్ళుతుడుచుకున్నాడు.

మళ్ళీ మామూలుగా కాలేజికి వెళ్ళటం-విద్యార్థులకు పాఠాలు చెప్పటంలో మనసు దూర్చి తిరుగుతోంది వరద.

''ఏమంటున్నారు ఉపన్యాసకురాండ్రు'' అంటూ పలకరించా డొకనాడు మాలికను జయరామ్.

చిన్నపిల్లలా కిలకిల్లాడుతూ అమాయకంగా కబుర్లు చెప్పే మాలిక అంటే అక్కడందరూ తమ చెల్లెలే అనుకుంటారు. పసిబిడ్డ హృదయం గల మాలిక అందరి కబుర్లూ చెబుతూ ఉంటుంది.

ఆనాటి కబుర్లలో ఊరినుంచి తిరిగివచ్చిన వరదను గురించి ''శ్రీవారు విదేశాలకు వెళ్ళారట. సాగనంపి వచ్చిందిట. అందుకని మా వరద మనసు ఆయన వెంట వెళ్ళిపోయింది. కళ్ళు మూసుకుని విద్యార్థులకు పాఠాలు చెప్పే వరదే తిరిగి వచ్చింది. అసలే ఎక్కువ మాట్లాడదు ఇప్పు డసలే మాట్లాడదు'' అంటూ చెప్పింది చేతులు తిప్పుకుంటూ.

''మీరంతా కబుర్లు చెప్పి ఆమెకు కాలక్షేపం కలిగించకూడదూ?'' అన్నాడు జయరాం.

ఆ మాట అప్పుడే మరిచిపోయి కబుర్లలోకి దిగింది మాలిక.

మాలికకోసం అటుగా వచ్చిన అర్చన ఈ కబుర్లన్నీ విన్నది ఆమె మాటల్లో మాలికకేమీ తీసిపోదు కాని వాగుడుకాయలా అందరి మాటలూ పట్టించు కొని ఎక్కడబడితే అక్కడ వాగదు. అందుకని మాలికా అని ఒక కేకపెడుతూ ఉంటుంది. అర్చనకు వరద ఎందుకట్లా ముఖం చిన్నబుచ్చుకొని తిరుగుతుందో ఇప్పుడర్థమయింది. 'పాపం వరద' అనుకుంది మనస్సులో.

వరద తన వెనకాలే వస్తున్న అర్చనను చూసి "మీ యింటికి దారి అటు అన్నారుగా?" అంది నవ్వుతూ.

"ఇవాళ మాయింటిదారి ఇటు వైపు"

"ఆఁహాఁ" అంటూ ఆమె తనను కలుసుకునే వరకూ ఆగి అడుగులు వేస్తూ "పిలవకుండానే నాకోసం మాయింటి వస్తున్న చెల్లెలికి కప్పు కాఫీ మాత్రమే దొరుకుతుంది" అంటూ బుజమ్మీద చెయ్యేసి తీసుకువెళ్ళింది.

అర్చన ఆమె గదిని ప్రతి అంగుళమూ పరీక్షచేసి వదిలిపెట్టింది. కాఫీ ఇచ్చే లోపుగా ప్రతి పుస్తకమూ తిరగవేసింది.

"మీకంత దిగులుగా ఉంటే మా యింటికి వచ్చి రెండు రోజులు ఉండకూడదూ?" కాఫీ కప్పుకింద బెట్టి వరద బుజమ్మీద చెయ్యేసింది అర్చన.

"మీరు రాకూడదూ? మనిద్దరం ఇక్కడ హాయిగా ఉండచ్చు. ఇద్దరం కలిసి కాలేజికి వెళ్ళచ్చు" అన్నది వరద.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేస్తుండగా ఊరగాయలూ పచ్చళ్లూ వడియాలను గురించి తన వదినా, ఇంటి యజమాని తల్లీ ఎప్పుడెప్పుడు ఇచ్చినదీ చెప్పి వాటి రుచులను వర్ణించటం మొదలుపెట్టింది.

"అయితే మాబావగారు తిరిగి ఎప్పుడు వస్తారు?" ఉన్నట్టుండి ప్రశ్నించింది అర్చన.

"వారికి ఇక్కడ రావలసిన ప్రమోషను రాలేదు. అందుకని వెళ్లారు. బహుశః నన్నే రమ్మంటారేమో ఒకటి రెండేళ్ళలో" అన్నది కళ్ళు దించుకుని.

"అయితే మా అక్కకు విదేశయానం ఉన్నదన్నమాటే" చప్పట్లు కొడుతూ గంతులేసింది అర్చన. మళ్లీ అంతలోనే అడిగింది–"మా బావగారు తరుచుగా ఉత్తరాలు రాస్తూ ఉంటారా వరదా? ఎన్నాళ్ళకోసారి రాస్తారు చెప్పవూ?"

వరదకు ఈ ప్రశ్నలన్నీ ఎంత ప్రాణాంతకంగా ఉన్నా నిబ్బరంగా జవాబు లిస్తోంది, సహజంగా నటిస్తోంది.

విశ్వం చెల్లెలికి రాసే ఉత్తరాలు జాగ్రత్తగా కాలేజి ఎడ్రసుకే రాస్తూ ఉంటాడు. వరద చదివిన వెంటనే చింపి బుట్టలో పడేస్తుంది.

విశ్వం చెల్లెలికి సంబంధాలు చూడటం మానలేదు. హరికృష్ణ సంబంధం ఇటీవల చూశాడు అతడు వరదను ఎప్పుడో చూశాడట. ఆమెకు సంపాదన ఎంత ఉన్నా కట్నం పదివేలు కావాలట. ఆమె ఎకౌంటులో ఉన్నది తొమ్మిదే. అన్నగారు ఖర్చులుపెట్టి పెళ్ళిచేసినా ఇంకొకవెయ్యి తక్కువవుతున్నది ఈ విషయాలు ఆమె నొచ్చుకోకుండా తేలికగా ఉత్తరం రాశాడు విశ్వం.

స్టాఫ్‌రూంలో కూర్చుని ఆ ఉత్తరం చదువుతున్న వరద ముఖం పాలిపోయింది. ఇట్లా ఇది ఎన్నవది? తక్కువబడ్డ వెయ్యి రూపాయలు సంపాదించే టప్పటికి ఆ సంబంధం తప్పిపోతుంది కట్నాల పరుగు పందెంలో తను ఓడిపోతున్నది. ఈ ఆలోచనలతో ఆమె దేహంలోని రక్తమంతా నీరయినట్లుగా ఉంది. నీరసం ఆవహించింది.

ఆమెకు క్లాసు ఉన్నట్లు తటాలున స్ఫురించింది నిద్రనుంచి లేచినట్టుగా లేచి పుస్తకాలు చేత బట్టుకుని క్లాసుకు వెళ్ళిపోయింది

పదిరోజుల తరువాత స్టాఫ్ మీటింగయింది. అందరితోపాటు తెచ్చి పెట్టుకున్న ఉత్సాహంతో మసలుకుంది వరద. అర్చన మాలిక జయరామ్‌లు ఆమెను ఆనాడే కొత్తగా చూస్తున్నట్టుగా చూశారు. ఆమెను కొత్త కోణంలో నుంచి చూస్తూ మాట్లాడటం మొదలుపెట్టారు ఎగతాళి హాస్యంపాలు అర్చన మాలికల మాటల్లో మామూలుగా కంటె ఎక్కువగా పొంగాయి వరదకు కళ్ళనీళ్ళ పర్యంతమయింది

ఆమరునాడే రమణి ఇంట్లో అల్పాహార విందు. అందరినీ ఆహ్వానించింది.

పావుగంట వేళ తప్పించి వెళ్ళిన వరదకు జయరాం ఒక్కడే కుర్చీలో పేపరు చదువుకుంటూ కనుపించాడు. రమణి తల్లితో వంటియింట్లో గారెలుచేస్తూ వరదను కూర్చోమని చెప్పి లోపలికి వెళ్ళింది.

"ఇదిగో-మీరు స్టాఫ్ రూములో పారేసుకున్న ఉత్తరం.'' వరద చేతిలో పెట్టాడు జయరాం.

వరదకు ఒళ్ళంతా కంపించింది. నోట మాటరాలేదు. పిచ్చి చూపులు చూడటం మొదలు పెట్టింది

"భయపడకండి వరదగారూ ఈ ఉత్తరం ఎవరూ చూడలేదు. నా కంట పడటానికి మీగది ఊడ్చే నౌకరు కారణం. దాన్ని బాగా చదివితే గాని ఈ ఉత్తరం మీదని నాకు తెలియలేదు. సామాన్యమైన దానికి మీరింత బాధపడటం దేనికి? మీ సమస్యను నేనర్థం చేసుకున్నాను. మీతో మాట్లాడాలంటే నాకు దారిదొరక్క ఈ ఉపాయం ఆలోచించాను. నేను మీకు నచ్చానా? ముందీమాట చెప్పండి?"

వరద పట్టుబడిన దొంగలా చూసింది. తను కల్పించిన వాతావరణం కాసేపటిలో మంచులా కరిగిపోయింది. తలెత్తలేక పోయింది. అందరూ ఏమను కుంటారన్న బాధ ఎక్కువైంది.

"సరె మీకిష్టమయితేనే సుమండి. ఒక్కమాట. ఇది మనిద్దరిలోనే ఉంచండి. అలా అపరాధినిలా చూడకండి. మామూలుగా ఉండండి."

రమణి మరో పావుగంటకు గాని కాఫీ టిఫిన్లు తీసుకు రాలేదు.

"అర్చనా మాలికా ఏరీ? ఏమిటీ ఆలస్యం?" రమణి జయరాంను నిలవ దీసింది.

"వాళ్ళకు సినిమా ప్రోగ్రాం ఉంది కదా?" అన్నాడు టిఫిన్ తింటూ మామూలు మాటగా.

"నాకా సంగతి తెలియదు. ఇంకా వస్తారనుకున్నాను" వచ్చిన ఇద్దరికీ కాఫీ టిఫిన్లు ఇచ్చి వక్కపొడి డబ్బా బల్లమీద పెట్టింది రమణి.

"అలా మాట్లాడకుండా కూర్చున్నావేమిటి వరదా? నిన్ను వాళ్ళ సినిమా ప్రోగ్రాంలో కలుపుకోలేదా?" వరదకు దగ్గరగా వచ్చి కూర్చుంది రమణి.

"సినిమా సంగతి నాకు తెలియదు. చాలామంది ఫ్రెండ్సు ఈహాలు నిండా వస్తారనుకున్నాను" ఎందుకో సరిగా వరద మాట్లాడలేక పోతోందని రమణి గ్రహించింది.

"ఇవాళ ఇలాగ ఉన్నారేం? ఒంట్లో బాగులేదా?"

''అబ్బే బాగానే ఉన్నాను'' సర్దుకోబోయింది వరద. ఆరుగంటల సుమారుకు జయరామ్ వెళ్ళిపోయాడు. ఆ తరువాత వరద బయలుదేరింది.

ఆ రాత్రి ఎంత అణచిపెట్టుకున్నా ఆందోళన తగ్గలేదు. ఏదో అపరాధం చేసినట్టు గుండె గబగబ కొట్టుకోవటం మొదలు పెట్టింది వరదకు.

తడబడుతూ కాలేజికి వెళ్ళింది. ఎవరిని చూడాలన్నా బిడియంగా ఉంది. తల ఎత్తలేకపోతున్నది.

తనెందుకట్లా తనచుట్టూ పరిధులను ఏర్పరచుకున్నది ? అటువంటి వాతావరణాన్ని ఎందుకు కల్పించుకున్నది ?

లోకం కోసం లోకం పెళ్ళికాని ఆడపిల్లను చూసి ఊరుకోదని భయపడ్డదా ? అవునౌనని గుండె కొట్టుకుంది.

అయితే పెళ్ళి అయిన గుర్తులు కొట్టవచ్చినట్టు మెడలో కనబడుతుంటే వచ్చే వరుడేమనుకుంటాడు ? తను రెండోవాడనుకుంటే ?

తను చేసిన పిచ్చిపనిని ఎగతాళి చేస్తూ కొట్టిపారేసిన జయరామ్ సహృదయుడనిపించాడు వరదకు. అతడిమీద ఎనలేని గౌరవం కలిగింది.

మరునాడు జయరాం కలిసినా మాట్లాడే అవకాశం కలగలేదు.

మూడోనాడు సెలవుపెట్టి మంగళగిరి రా. నీ కిష్టమయితే మనం దేవుడి గుళ్ళో పెళ్ళి చేసుకుని ఆ పైన రిజిస్టర్ చేయించుకుందాం. మరో మాట. మనం ఇంక ఈ ఊళ్ళో ఉండద్దు. ఇంకో ఊరికి బదిలీ చేయించుకుందాం. ఆ సంగతులన్నీ మంగళగిరిలో మాట్లాడుకుందాం'' అంటూ జయరాం దగ్గర్నుంచి వచ్చిన ఉత్తరం వరద కందింది.

ప్రాణం పోతుందనుకున్న బాధనుండి విముక్తి పొందినట్లనిపించింది. ఆనందపు టంచుల దగ్గర తాను ఉన్నట్లనిపించింది.

వెంటనే అన్నగారిని మంగళగిరికి రమ్మని టెలిగ్రాం ఇచ్చి బయలుదేరింది.

చెల్లెలిని ఎవరూ మోసం చేయటంలేదు. కట్నం తీసుకోని పెళ్ళికొడుకు మంచివాడేనని విశ్వం తెలుసుకోవటానికి ఓ గంటపట్టింది. ఆ తరువాత సంతోషం పట్టలేక జయరామ్‌ను కౌగలించుకున్నాడు విశ్వం.

"చూడండి జయరాంగారూ! నా చెల్లెలు అవివాహిత. సంగతంతా తెలుసుకున్నారు కదూ?" చేతులు పట్టుకున్నాడు అర్థింపుగా.

బిగ్గరగా నవ్వేశాడు జయరాం తల ఊపుతూ.

(యు వ)



# చిరునవ్వుల వెల ఎంత?

రాత్రి పన్నెండు గంటల సమయం. అలివేలు చాలా సేపటి నుంచీ పిల్లవాడిని కళ్లు మూసుకునే జోకొట్టుతున్నది. ఏడుపు తగ్గగానే పిల్లవాడు నిద్రపోతున్నాడనుకుని మంచి నీళ్లు తాగటానికి లేచింది. గదిలో బల్లదగ్గర దీపం ఇంకా వెలుగుతున్నది. శంకరం బల్లముందు కుర్చీలో కూర్చుని ఉన్నాడు.

"ఇంకా పడుకోలేదూ?" అంటూ మంచినీళ్లు తాగి మళ్లీ నిద్రలోకి జారింది. పగలంతా ఇంట్లో పనీ బైటి పనీ చేసిన ఆమె శరీరం. బాగా అలసిపోయి. రాత్రి భోజనం చెయ్యగానే నిద్ర కోరుతుంది.

పిల్లవాడు ఆమె నిండు గర్భమ్మీద వేసినకాలు ఆమెను మళ్లీ మేల్కొలిపింది. ఇంకా దీపం వెలుగుతూనే ఉంది. శంకరం అలాగే కూర్చున్నాడు.

మెల్లగా లేచి చీర సర్దుకుని అతడి కుర్చీ వెనక నిలబడ్డ అలివేలుకు బల్ల మీద పెద్ద అక్షరాలతో వ్రాసిన ఉత్తర మొకటి కనబడ్డది. దృష్టి సారించి గబగబా చదివింది.

"అలివేలూ!

నేను నిద్ర మాత్రలు తిని ఆత్మహత్య చేసుకుంటున్నాను. తెల్లవారిన తరువాత బ్రతకదలచలేదు. పేకాటలో బాకీలుపడి వాటిని తీర్చటానికి ఇక్కడా అక్కడా అప్పులు చేశాను. వాటన్నిటినీ తీర్చటానికి మార్వాడీ దగ్గర అప్పు చేశాను. దాన్ని తీర్చటానికి ఆఫీసు డబ్బు వాడుకున్నాను. డబ్బు జమకట్టమనీ లేకపోతే ఉద్యోగం పోతుందనీ వార్నింగ్ ఇచ్చారు. అటువంటి వార్నింగులు నాలుగు తప్పుకు తిరిగాను. కాని నిన్నటిది చాలా కఠినంగా ఉంది. ఎలాగూ నేనా మొత్తం డబ్బుకట్టలేను. అయినా నలుగురిలో పరువు పోగొట్టుకోలేను. ఈరాత్రితో ఈ జీవితం అంతం కావాలి. ఇక నీ సంగతి. పిల్లలనూ నిండు గర్భంతో ఉన్న నిన్నూ మీ కర్మానికి వదిలిపెట్టి ఈ లోకం నుంచి పరారవుతున్నాను. నీవునావంటి

దానవు కాదు. ధైర్యం కలదానవు. నీవు పిల్లలను పెంచి పెద్దవాళ్లను చేస్తావన్న నమ్మకం ఉంది. ఇకపోతే నేను మా తమ్ముడికి ఇంతవరకు పంపుతున్న ఏభయి రూపాయలూ నీవు పంపక్కర్లేదు. వాడు చదువుకున్నా మానేసినా మా నాన్న బాధ్యత అది.

నీకు నా లోపాలు తెలుసు నా మనసూ తెలుసు. కనక నన్ను అపార్థం చేసుకోకు.

శంకరం"

ముచ్చెమటలు పోశాయి అలివేలుకు ఆ ఉత్తరం చదువుతుంటే. చటుక్కున ఆ ఉత్తరం లాక్కుని ముక్కలు ముక్కలుగా చింపి, బల్లమీద ఉన్న నిద్రమాత్రల పొట్లం అందుకుంది

ఉలిక్కిపడ్డాడు శంకరం. "నా ఆఫీసు కాగితం అలా చింపేస్తావేం? రేపు నాకు మాట రాదూ?" కనుబొమలు ముడివేసుకుంటూ దిగ్గున కుర్చీలోంచి లేచాడు.

అప్పటికే ఆ మాత్రలన్నీ మంచం దగ్గరిగా ఉన్న ఎలుకల కన్నంలోపోసి చెంబెడు నీళ్లు కుమ్మరించింది అలివేలు

"మీరింకా నిద్రపోలేదేం? రేపు ఆఫీసుకు వెళ్లరా?" ఆమె మాట కొంచెం కటువుగా ధ్వనించింది.

"ముఖ్యమైన కాగితం చింపేశావు! ఆఫీసు లెక్కలు వ్రాసుకున్న కాగితమది" విసురుగా వెళ్లి గ్లాసెడు మంచినీళ్లు తాగాడు అక్కర్లేకపోయినా.

"ఆఫీసు కాగితమా?" వెటకారంగా నవ్వింది. "నేనూ నలుగురు పిల్లలూ ఏమయినా మీకక్కర్లేదు సరే-మిమ్మల్ని నమ్ముకుని ఇంజనీరింగు కాలేజీలో ఉన్న తమ్ముడి గతేమిటి? పెద్ద కొడుకు డబ్బు సహాయం చేస్తున్నాడు కదా అని మీ నాన్నగారు పల్లెటూళ్లో పొలాల దగ్గర వాననక ఎండనక కష్టపడి మిగతా డబ్బు సమకూర్చగలననే నమ్మకంతో నిశ్చింతగా ఉంటే-వాళ్లను కూడా మాతోపాటే నట్టేట ముంచాలనే కదూ మీ ఆలోచన - మీ నాన్నగారికి రెండు విధాలుగా మనస్తాపం కలిగించాలనా ఈ వయసులో? అసలు ఈ లోకం నుంచి పారిపోవాలనే ఆలోచన ఎందుకు వచ్చింది?"

వెర్రి చూపులు చూస్తూ నిలబడ్డ శంకరాన్ని నడిపించుకుంటూ మంచం దగ్గరికి తీసుకువెళ్లి బలవంతంగా కూర్చోబెట్టింది.

''ఇప్పుడు విప్పి చెప్పండి మీ కష్టాలేమిటో?'' అతడి కళ్లల్లోకి చూస్తూ నిలవదీసి అడిగింది

మరొకప్పుడయితే ఆమె అలా నిలవదీసి అడగటాన్ని అతడు సహించే వాడు కాదు. ఇప్పుడతనికంతా అయోమయంగా ఉంది.

ఆమె కూడా అతడి ప్రక్కన సర్దుకుని కూర్చుంది. అతడు చేత్తో తల వెంట్రుకలు సర్దుకుంటూ "అయితే ఆ ఉత్తరం చదివావన్న మాట!'' అన్నాడు తడబడుతూ.

"చదివాను కనకనే మీ ఆలోచనలు తెలిశాయి. అయితే ఆత్మహత్య ప్రయోజకత్వ మనిపించుకుంటుందా?'' ఆమె కంఠం రుద్ధమయింది.

"ఏం చెయ్యను? అది పాడుపని అని తెలుసు. పిరికితనమనీ తెలుసు. కాని రేపు పదకొండు గంటలకల్లా ఆఫీసులో డబ్బుకట్టాలి. ఎంతో తెలుసా? రెండువేల ఐదువందల రూపాయలు. కట్టకపోతే జవాన్లకు కూడా అలుసయి పోతాను. చావటాని కయినా ఒప్పుకుంటాను గానీ అవమానాన్ని సహించలేను" రెండు చేతులతో తలపట్టుకున్నాడు శంకరం.

సరిగ్గా ఇటువంటి పరిస్థితే నాలుగేళ్ల క్రిందట వచ్చింది. అప్పుడు అది ఐదువందల రూపాయల అప్పు. అధికవడ్డీతో వెయ్యి రూపాయలు దాటింది. అరవ్వీ వాడి చేతిలో శంకరం ప్రాణంపోయేటంతపని జరిగింది. అది కళ్లతోజూసిన అలి వేలు తన మెడలో ఉన్న గొలుసు ఇంటి యజమాని దగ్గర తాకట్టుపెట్టి కొంత సొమ్ము, చేతిగాజులు అమ్మి కొంతసొమ్ము జతచేసి బాకీతీర్చింది. తాకట్టు బాకీ తీర్చటం కోసం ఆ వాడలోఉన్న చిన్నస్కూల్లో హిందీ టీచర్‌గా పనిచేయటం మొదలుపెట్టింది. కళ్లతో చూశాడుగాని-శంకరం "ఆ బాకీ ఎట్లా తీర్చావు అలి వేలూ?'' అని నోటితో అడగలేదు.

అలివేలు ఆ స్కూల్లో టీచరుగా ఉండిపోయింది నూటపాతిక రూపాయ లకు రసీదు వ్రాయించుకుని ఎనభై రూపాయలు చేతిలో పెడతారు. అదే పెన్నిధి

దొరికినట్టుగా భావించుకుని పని చేస్తున్నది. ఏటా కాన్పు. పురుడు వచ్చిన నెల రోజులు ఇంట్లో ఉంటుంది. తరువాత ఎడపిల్లలతోపాటు పసిపిల్లను కూడా వెంట తీసుకు వెళ్లుతుంది. పై పిల్లలను చదవకపోయినా ఆ స్కూల్లో చేర్పించింది. ఇంటి పని, స్కూలు పనీ కాకుండా అలివేలు దారాలతో రకరకాల లేసులు, ఊలుతో క్రొత్త కొత్త నమూనా స్వెట్టర్లు అల్లుతుంది చాలా మంది ఆమె యింటికి వచ్చి కొనుక్కుంటారు ఆమె శంకరం ఆఫీసుకు వెళ్లేవరకూ ఇంట్లోనే ఉంటుంది. తిరిగి అతడు రాత్రి ఏ పన్నెండు గంటలకో వచ్చేసరికి పిల్లలతో ఇంట్లోనే కన బడుతుంది.

శంకరం ఇంట్లో చాలా తక్కువ మాట్లాడుతూ అంటీ అంటనట్టుగా ఉంటాడు. ఇంటి సంగతులు పట్టించుకోడు. తను ఇంట్లో ఇచ్చే డబ్బు చాలదని తెలుసు, పిల్లల ఖర్చులకూ, మందులకూ, చాలటంలేదని అలివేలు అంటుందేమో నని ఒక ప్రక్క సందేహిస్తూ జంకుతూ ఉంటాడు. పైపై పలకరింపులతో కాల క్షేపం చేస్తాడు. ఉదయం ఒక గంటసేపు అలివేలు వంటప్రయత్నంలో ఉన్నప్పుడు పిల్లలను పలకరిస్తాడు. చిన్నా, చిట్టి, నాన్నా, అమ్మా అంటూ భుజాల మీదికి ఎక్కించుకుంటాడు వీపుమీద ఎక్కించుకుంటాడు. వాళ్లను నవ్విస్తాడు కడుపు నొప్పి వచ్చేవరకు ముద్దులు పెట్టుకుంటాడు—పెట్టించుకొంటాడు.

అలివేలు ఆశావాది. ఎంత హీనస్థితిలో ఉన్నా ఆమె దైన్యంగా ఆలోచిం చదు. పిచ్చి పిచ్చి ఆలోచనలకు బదులుగా గట్టి ఆలోచనలు చేస్తుంది వాటిని ఆచరణలో పెట్టటానికి ఆలస్యం చెయ్యదు. శంకరానికి వచ్చే నాలుగువందల రూపాయల జీతంతో నికరంగా ఆమె చేతిలోకి వచ్చేవి రెండే వందలు. మిగతా వాటి సంగతి ఆమె ఎత్తదు. ఏవో పై బదుళ్ళు ఉన్నాయని పసికట్టింది. పిల్లలనూ సంసారాన్ని దృష్టిలో ఉంచుకొని ఎప్పుడయినా మాటవరసకు ఆ ప్రశంస తెస్తూ ఉంటుంది. అప్పుడప్పుడు నిప్పురవ్వల్లాంటి మాటలను నవ్వుతూ రువ్వుతుంది. అది ఒక్కొక్కసారి హాస్యంగా తేలిపోతుంది.

"ఈ నలుగురు పిల్లలు రేపు పుట్టబోయే బిడ్డతో ఐదు మంది వీళ్లంతా ఏం చదువుతారు? ఏం తింటారు?" ఒక రాత్రివేళ ఇంటికి వచ్చిన శంకరానికి వడ్డిస్తూ అంటుంది అలివేలు.

"అదే అలివేలూ నేనూ ఆలోచించేది, పిల్లల సంఖ్య పెరుగుతోంది. ఎక్కడ చూసినా ఇద్దరు లేక ముగ్గురు అన్న వినాదం వినబడుతూనే ఉంది. చెయ్యి దాటిపోయింది కావి ఇకనుంచి చూడు నేను కొత్త శంకరాన్నయిపోతున్నా" అంటాడు

ఆ మాటలకు ఆమెకు నవ్వురాదు, సంభాషణ మరి సాగదు.

అటువంటి పరిస్థితులకు అలవాటు పడిన అలివేలు తెగేవరకుతాడుబిగించదు. అతడు ఇంట్లో పోరు పడలేక అనలే ఇంటికి రాకపోతే? ఆ రెండు వందలు కూడా ఇవ్వకపోతే? మనసును మెళ్ళించుకుంటుంది.

అలివేలు కష్టజీవి. బాల్యం నుంచీ తండ్రి ఇంటికి ఇచ్చే డబ్బు చాలా స్వల్పంగా ఉండేది రకరకాల వ్యసనాలు ఉండేవి ఆయనకు. ఉః ఒక్కకూతుర్ని చాలా గొప్పగా పెంచాలని తల్లి ఆరాటపడేది. ఆమె చీకటితో లేచి ఇడ్లీలూ, పచ్చడీ చేసి అక్కడికి ఒక ఫర్లాంగు దూరంలో ఉన్న ఆఫీసర్ల కాలనీలో ఇచ్చి రమ్మని అలివేలను పంపేది.

"వచ్చావా అలివేలు! ఇవాళ ఆలస్యమయిందేం?"

"నీ కోసం కాఫీ అయినా తాగకుండా కిటికీ దగ్గర నిలబడ్డాను"

"అమ్మయ్య అలివేలు ఇడ్లీ తెచ్చిందర్రా—త్వరగా ప్లేట్లు తీసుకరండి."

ఇలా ఆమెకు స్వాగతం పలుకుతూ చేతిలో నుంచి పొట్లాలు లాక్కుపోతూ ఉండేవారు. రెండేసి ఇడ్లీలు ఒక పొట్లం కట్టి పంపేది తల్లి. అలివేలు ఆ పొట్లాలు ఇళ్ళల్లో ఇచ్చేది. ఖాతా పుస్తకంలో వ్రాయించుకుని పంపేవారు. కొందరు అలివేలుకు కాఫీ కూడా ఇచ్చేవారు. మొదట పదిహేను ఇళ్ళవరకూ ఉండేవి-క్రమంగా నూరు ఇళ్ళకు పైగా పెరిగాయి.

ఒకనాడు అలివేలు ఇడ్లీగిన్నె చంకబెట్టుకుని వెళ్తుంటే ఆ కాలనీలో ఒక గృహిణి పాలకోసం వాకిట్లో నిలబడి పిలిచింది. పిల్లలకు ఇడ్లీలయినా పెడదామని లోపలికి తీసుకెళ్ళి పది పొట్లాలు తీసుకుంది. అంతలో "అమ్మా నాకో ఇడ్లీ!" అన్నమాట వెనుక నుంచి వినబడ్డది. ఏ చిన్న పిల్లలో అడుగుతున్నారు ముద్దు ముద్దుగా అనుకొని వెనక్కు తిరిగి చూసింది.

ఆమెను చూడగానే ఒక నవ్వు నవ్వి బల్లమీద ఉన్న ఇడ్లీ పొట్లం అందు కున్నాడు ఆ ఇంటి పెద్ద కొడుకు. అలా ఆ రోజు మొదలుకొని ఆమె వచ్చే వేళకు స్నానం చేసి డ్రెస్సు వేసుకొని పుస్తకాలు చేతబట్టుకొని వాకిట్లో నిలబడేవాడతడు. ఆమెను చూడగానే తన మామూలు నవ్వు నవ్వి లోపలికి వెళ్ళేవాడు. అతడి పేరు శంకరమని తెలుసుకుంది అలివేలు.

అలివేలు పద్దెనిమిదేళ్ళు దాటిన పిల్ల, వాయిల్‌చీర కట్టుకుని పొట్టి జడలతో విపరీతంగా అలంకరించుకోకుండా సామాన్యంగా ఉన్నట్లు కనబడుతుంది కాని చూసిన కొద్దీ ఆమె ముఖం. కళ్ళు నోరు ఎదటివారిని ఆకర్షించటం మొదలు పెడతాయి. ఆమెతో మాట్లాడిన కొద్దీ ఇంకా మాట్లాడాలనే అనిపిస్తుంది పని ఉన్నా లేకపోయినా అలివేలును నిలబెట్టి ఈ మాట ఆ మాట అడుగుతూ ఉంటారు ఆయిళ్ళల్లోని గృహిణులు.

శంకరం నవ్వుకు మొదట తలవంచుకున్నా తరువాత తరువాత అతడి నవ్వు ఆమెను ఆకర్షించటం మొదలు పెట్టింది. ఆ నవ్వుతో ఆమెలోని ఉత్సాహం ఇనుమడించేది. ఆమె డొమెస్టిక్ సైన్సు కాలేజిలో డిగ్రీ తీసుకుని ఉద్యోగం చేయాలన్న ఆశలు పెంచుకోవటం మొదలు పెట్టింది. గాని ఆమె కోరిక తీరక ముందే తల్లి చనిపోయింది. తండ్రి ఇంటికి రావటమే మానుకున్నాడు. ఆమెకు ఆ వాడలోని ముసలమ్మలే పెద్దదిక్కు. ఒక ప్రైవేటు స్కూల్లో టీచరుగా చేరి పోయింది. కాలేజీలో చదువు సాగించలేక.

ఆఫీసర్ల కాలనీకి నాలుగేళ్ళుగా ఇడ్లీ సరఫరా నిలిచిపోయింది.

ఆ రోజు బస్సుకోసం గంటకు పైగా నిలబడ్డది అలివేలు. అక్కడనిలబడ్డ వాళ్ళంతా చెమటలు తుడుచుకుంటూ ఉస్సురంటూ చెట్టు కింద నిలబడ్డారు.

"బస్సు ఇవాళ రాదండీ" అంటున్నారెవరో అలివేలు వెనుకనుంచి.

టైమయిపోతున్నదన్న చికాకులో ముఖమంతా ఎర్రగా చేసుకొని వెనక్కు తిరిగి చూసింది అలివేలు.

అందమైన చిరునవ్వుతో, కళ్ళు చికిలిస్తూ ఓ యువకుడు చేతిగుడ్డతో మెడ తుడుచుకుంటున్నాడు.

"మీకెలా తెలుసు బస్సురాదని?" చెట్టు కింద నిలబడ్డ గుంపులో నుంచి ఒక్కొక్కరే అతడిని సమీపించారు.

"మీకింకా తెలియదా? మన సోదరులు ఇవాళ ఉదయమే పెట్రోలుపోసి రెండు బస్సులు తగలబెట్టేశారు. అందుకని ఇవాళ బస్సుల రాకపోకలునిలిపేశారు" అన్నాడు.

ఒక్కొక్కరే ఎవరిదారివారు వెళ్లిపోయారు. అలివేలు స్కూలుకు ఎలా వెళ్లాలని ఆలోచిస్తూ నిలబడిపోయింది. అయినా ఊళ్లో ఇంత అల్లరిగా ఉంటే స్కూలు తెరిచి ఉంటుందా? ఏమో? అనుకుంటోంది.

"ఇంకా ఎందుకు ఎండలో నిలబడటం? హాయిగా ఇంటికి వెళ్లక?"

ఆమె తల ఎత్తింది ఆలోచనలు తెగక మళ్లీ అదే నవ్వు.

"మీరు ఇడ్లీలు తీసుకురావటంలేదు. మా అమ్మ కూడా లేదు. నేను ఏం తిని ఆఫీసుకు వెళ్లాలి?"

ఈ నాలుగేళ్లల్లో వాళ్ల యింట్లో కూడా చాలా మార్పులు వచ్చాయన్నమాట కాలేజి చదువు అయిపోయి ఆఫీసుకు వెళ్లే వరకూ వచ్చిందన్నమాట అతడి పని. అలివేలు మాట్లాడకుండా తలవంచుకుని వెళ్ళిపోయింది. అలా రోజూ ఆ చెట్టు క్రింద బస్సుకోసం ఆమె, ఆదారిన ఆఫీసుకు వెళ్లుతూ అతను—ఇద్దరూ కలుసుకునే వారు. నవ్వుతూ పలకరించుకునేవారు.

అలివేలు టీచరుగా పనిచేస్తూ ప్రైవేటుగా చదివి బి. ఏ. ప్యాసయింది. హిందీ పరీక్షలు వ్రాసి డిగ్రీ తెచ్చుకుంది. ప్రతి రోజూ అతడిని కలుసుకొన్న తరువాత ఆ నవ్వుతో అతడిచ్చే ధైర్యమే ఆమెను ముందుకు నడపించుకొని పోవటం మొదలుపెట్టింది

తన ఒంటరితనానికి ఆ నవ్వును జోడించుకుందామని ఆమెలో కలుగుతూ వచ్చిన కోరికను ఆమె పెంపొందించలేకపోయింది. నక్క ఎక్కడ? నాగలోక మెక్కడ? కాని అతడు తండ్రిని ఒప్పించి ముందడుగువేసి తనను జోరుగా చేసుకున్నాడు.

పెళ్లి అయిన ఈ ఆరేళ్లల్లో ఆ నవ్వు మాసిపోలేదు. సాంసారికంగా ఎన్నో కష్టాలు వచ్చాయి. పిల్లలకు జబ్బు చేసింది. నాలుగేళ్ల ఎదిగిన పిల్ల చనిపోయింది. ఏడాది నిండకుండానే పిల్లవాడు రాలిపోయాడు. వచ్చే జీతం చాలటంలేదు, మిస మిస లాడుతూ ఉండే అలివేలు చిక్కి నల్లబడ్డది. ఎంత పెద్ద విషయాన్నైనా ప్రశాంతంగా ఆలోచించే ఓర్పు శంకరంలో తగ్గటం మొదలుపెట్టింది. అతడు పలాయన సూత్రాలను అన్వేషించటం మొదలుపెట్టాడు.

కాని అతడి పెదవుల మీద ఆ అందమైన నవ్వు మాసిపోలేదు. ఆ నవ్వును చూసి ప్రజ్వలించే ఆమె కళ్లల్లోని కాంతి తరిగిపోలేదు.

ఆలోచిస్తూ అతడి ప్రక్కన కూర్చుని అలివేలు ఆ నవ్వుకోసం అతడి ముఖంలోకి చూసింది.

"ఏమయిందానవ్వు? తనను ముందుకు నడిపించే నవ్వు-ఈ సంసార సాగరంలో భయం గొలుపుతూ తల ఎత్తి మొసళ్లవంటి కష్టాల నుండి కూడా తప్పించి ఇన్నాళ్లూ మనగలిగిన ఆ నవ్వు ఏమయింది ఇవాళ?'

ప్రక్క భాగంలో నుంచి మూడు గంటలు కొట్టిన చప్పుడు వినబడ్డది,

చూస్తూ ఉండగానే తెల్లవారిపోతుంది కాబోలు. ఈ చిక్కు ఇప్పుడు విడదీయకపోతే ముళ్లుపడినదారం తెగిపోతుంది. చివ్వున లేచింది అలివేలు. అతడికెదురుగా నిలబడి "శంకరం! ఇటు చూడు" అన్నది

పెళ్లికాక ముందు ఆమె అతడిని శంకరమనే పిలిచేది. ఏకవచనములో సంబోధించేది. ఆ పిలుపుకూ ఆ ఆప్యాయతకూ అతడిలో ఉత్సాహం పొంగులువారేది. కాని-పెళ్లి అయిన తరువాత అలా పిలవటం మానేసింది అలివేలు. ఇవాళ ఆ పిలుపుకు అతడు దిగాలుపడ్డ ముఖమెత్తి ఆమె కళ్ళల్లోకి చూశాడు.

పరవాలేదు, తన పిలుపుకున్న వేడి తగ్గలేదునుకుంది అలివేలు. "ఇవాళ మనకు తెల్లవారుతుందా?" అన్నది.

"ఏమో" అన్నాడు అయోమయంగా.

"తెల్లవారగానే నన్ను హాస్పిటల్‌కు తీసుకెళ్ళాలి శంకరం" ప్రాధేయపడుతూ అడిగింది.

"హాస్పిటల్‌కా! ఎందుకు?" అసందర్భంగా ఆమె మాట్లాడుతోందను కొని కనుబొమ్మలు ముడివేస్తూ తల పైకెత్తాడు.

"ఎందుకంటే ఏం చెప్పను శంకరం? మరో పాపాయిని ఎత్తుకోవటానికి నేనే నిన్ను నిద్రలేపి చెప్పాలనుకుంటున్నా, ఇంతలోకి ఆ మాయదారి ఉత్తరం గొడవొకటి వచ్చిపడ్డది"

"అలివేలూ హాస్యం చమత్కారం చాలుగాని వెళ్లిపడుకో"

"వాటికే ఆ నవ్వు విరిసేది. దానికోసమే ఇదంతా"

"నేనెంత బాధలో ఉన్నానో నీకు తెలుసు. హాస్యానికి వేళాపాళా ఉండాలా వద్దా?" కసురుకున్నాడు.

అరగంటసేపు అలా మౌనంగా కూర్చున్నారు ఇద్దరూ నేలచూపులుచూస్తూ.

అలివేలుకు ఆలోచనలు తెగటంలేదు తను వెళ్లి పడుకుంటే తలుపు గడియ తీసుకుని వెళ్లిపోతాడేమో! ఆమె మనసులో మెదిలిన భయానికి అతడి చేతిని తన రెండు చేతుల మధ్య బంధించింది.

"శంకరం"

ఆ పిలుపుకు అతడి ప్రాణం లేచివచ్చినా తల ఎత్తైనా చూడలేదీసారి.

"నేను ఆ బాకీ ఎలాగో తీరుస్తాను. పదకొండు గంటలకు డబ్బు తెచ్చి నీ చేతిలో పోస్తానుగాని—ఇంక ఎప్పటికీ ఇటువంటి పనిచేయనని మాట ఇవ్వు."

"ఎటువంటి పని?" తల వంచుకునే ప్రశ్నించాడు.

"అదే-నిద్రమాత్రలు తినటంవంటి పని"

"తిననునుకో, కాని-ఆ వెధవ చచ్చు బ్రతుకు బ్రతికేకంటే ప్రాణం తీసుకుంటేనే బాగుంటుందనిపిస్తోంది."

"ఇంక-వెధవ బ్రతుకు ఎందుకవుతుంది? బాకీ తీరిపోతుందిగా? ప్రాణం పోగొట్టుకోటం ఎందుకు?"

ఈ ప్రశ్నలకు జవాబు అతడి దగ్గర అప్పుడు లేదు. కాని మనసులో సముద్ర ఘోషలాంటిది బయలుదేరింది. ఈ అమాయకురాలికి ప్రపంచమంటే ఏమిటో తెలియదు. ఆడవాళ్ల ప్రేమతో త్యాగంతో ప్రపంచాన్నంతా కొనెయ్యాలను కుంటారు. అలవాట్ల యొక్క ప్రభావం మనిషి మీద ఎంత ఉంటుందో - వాటికి మనిషి ఎంతగా బానిస అయిపోతాడో తెలుసుకోలేరు. భార్యల ప్రపంచమంతా ఇంటి నాలుగు గోడల మధ్యగా ఉంటుంది. తనతో పని చేసే నారాయణ తనను చదరంగంలోని పావుగా వాడుకుని ఈ ఊబిలోకి దింపే వరకూ తనూ ఈ లోకం లోని మాయామర్మం తెలియని అలివేలు వంటివాడే. తాను ఊబిలోకి రోజు రోజుకూ ఇంకా ఇంకా దిగబడిపోతున్నాడు. తను ఇంక పైకి లేవలేడు, కాగా తనకు చెయ్యి అందించిన వాళ్లకు కూడా ఊబిలోకి లాగేస్తాడు.

పసిపాపలాంటి అలివేలుకు ఈ ఊబి సంగతి చెబితే మరి బ్రతకదు. పిల్లలకు ప్రకృతి సమకూర్చిన ఆసరా కాస్తా పోతుంది. పోకూడదు. అలివేలు తల్లీ తండ్రీ తానే అయి పిల్లల పోషణ భారం వహించాలి

ఏదో ఒక నిశ్చయానికి వచ్చినట్టు "నాలుగు కావచ్చింది ఇప్పుడయినా మనము పడుకోకపోతే తెల్లవారి లేవలేము. పడుకుందాం పద, అసలే లేవలేని దానవు" తను లేచి ఆమెకు తన చేయి అందించాడు.

"ఒక చేయి చాలదు. రెండు చేతుల ఆసరా కావాలి" అతడిని నవ్వించా లన్న ప్రయత్నం మానలేక అన్నది.

అతడు రెండు చేతులు అందించాడు. ఆమె లేచింది. ఇద్దరూ పడకలు చేరారు. అలివేలుకు కన్నుమూత పడలేదు. కళ్లు తెరచుకుని తలుపు వంక చూస్తూ ఆలోచిస్తున్నది. ఎనిమిది గంటలకల్లా బ్యాంకుకు వెళ్లి డబ్బు తీసుకుని ఆఫీసుకు ముందరే వెళ్లి శంకరం డబ్బు కట్టేటట్లు చెయ్యాలి. ఈ చిన్న లోపం తప్ప శంకరంలో ఏం లోటు ఉన్నది? దీనిని తాను సరిదిద్దగలిగితే తన సంసారానికేం లోపం? భార్యలు చాలామంది భర్తలను అర్థం చేసుకొని వాళ్లకు తమ సహాయ సహకారాలను అందజేయకుండా సంసారాలను పాడు చేసుకుంటారు. తమ పడుతున్న బాధను కళ్లారా చూస్తున్న శంకరం మళ్లీ ఇటువంటి పని చేయడు. తనూ శంకరం పెళ్లయిన కొత్తలో ఉన్నట్టు ఒకరికోసం ఒకరు ఎదురు చూస్తూ బ్రతక

వచ్చు. తన ప్రాణప్రదమయిన ఆతడి చిరునవ్వును ఎప్పుడూ చూస్తూ ఉండొచ్చు. అందరివలె పంతాలకుపోయి ఆ చిరునవ్వును పోగోట్టుకోను. దాన్ని జీవితాంతమూ నిలుపుకోవాలి. తనకా నవ్వు కావాలి. అది లేకపోతే బ్రతకలేదు. తన జీవమది.

ఆరు గంటలు కొట్టగానే లేచి ఇంటిపని చేసుకుని వంట చేసింది. ఎనిమిది గంటలకల్లా పిల్లల స్నానాలూ భోజనాలూ పూర్తిఅయ్యాయి. ప్రక్క యింటో పిల్లలను ఉంచి బయలుదేరింది.

''ఎక్కడికి బయలుదేరావు?'' స్నానం చేసి తల దువ్వుకుంటున్న శంకరం అడిగాడు.

''ఇప్పుడే వస్తాను''

''పిల్లలు ఏరి?''

''నేను వచ్చేవరకూ ప్రక్క యింట్లో ఉండమన్నాను''నర్ది చెప్పబోయింది.

''నేను రాత్రి ఆలస్యంగా వచ్చాను.వాళ్లతో మాటాడనేలేదు పిలుచుకురా'' చాలా మామూలుగా అన్నాడు.

''ఇదేమిటో క్రొత్త కోరిక'' అనుకుంటూ వాళ్లను తీసుకురావటానికి వెళ్తూ రాత్రి చెయ్యబోయిన పిచ్చి పనికి పశ్చాత్తాపపడుతున్నాడనుకొని తృప్తిగా నవ్వు కుంది అలివేలు.

శంకరం పిల్లలను ఎత్తుకున్నాడు. ముద్దులు పెట్టుకున్నాడు. వాళ్లచేత పెట్టించుకున్నాడు. మాటలు రాని పిల్లలచేత కూడా ముందు ముందు ఏం చేయ బోవాలో అడిగి తెలుసుకున్నాడు.

అలివేలుకు కళ్ల నీళ్లు వచ్చాయి. ఎంతగా మారిపోయాడు? పిల్లలఅదృష్టం బాగుంది కనుకనే తనకు వేళకు మెలకువ వచ్చింది. లేకపోతే ఇంకేమయినాఉందా? తనూ, పిల్లలూ-ఇంక ఆలోచన సాగక కళ్లు తుడుచుకుంది.

''అలివేలూ నేను ఆఫీసుకు వెళ్తాను. నేనేదో తంటాలుపడి జీతంలో నెల నెలకూ కొంత సొమ్ము పట్టుకునేటట్టుగా ఏర్పాటు చేస్తాను. నీవేం బాధపడకు'' అన్నాడు తలవంచుకుని.

గబగబా అడుగులు వేస్తూ వాకిటి వరకూ వెళ్ళి మళ్ళీ లోపలికి వచ్చాడు. గోడకానుకొని తననే చూస్తూ నిలబడి ఉన్న అలివేలును కళ్లు విప్పుకుని చూశాడు పిల్లల మీదికి దృష్టి సారించి 'టాటా' అంటూ గిరుక్కున వెనక్కు తిరిగాడు.

అలివేలు బరువుగా నిట్టూర్చి పిల్లలను మళ్లీ పక్కయింటికి చేర్చి బ్యాంకుకు వెళ్లి డబ్బు తీసుకుని ఆఫీసుకు బయలుదేరింది. అప్పటికి పదిగంటలు దాటాయి.

అలివేలును చూసి గతుక్కుమన్నాడు నారాయణ, శంకరం ఇంకా రాలేదని చెప్పాడు. అరగంట-గంట గడిచింది. అలివేలుకు శంకరం కోసం ఎదురుచూస్తూ గుండె దడదడ లాడటం మొదలుపెట్టింది ఆలోచనలు ఆమెను చుట్టుముట్టడం మొదలుపెట్టాయి. అంతవరకూ భోజనంలేదు, కడుపులో ఏదో ఆరాటంగా ఉంది. చివ్వునలేచి ఆఫీసరు దగ్గరికెళ్లి సంగతంతాచెప్పి డబ్బుకట్టి రసీదు తీసుకుంది. ఒక్కఅంగలో రిక్షా తీసుకుని హుసేనుసాగరు కట్టమీదికి తొందరగా పోనివ్వమన్నది.

పరీక్ష తప్పిన విద్యార్థినీ విద్యార్థులకూ భగ్నప్రేమికులకూ అభయ ప్రధానమిస్తుంది హైదరాబాదు సికిందరాబాదు జంటనగరాల మధ్యఉన్న హుసేనుసాగరు. సాయంత్రంకాగానే దీపతోరణాలు నదీజలాలలో ప్రతిఫలించి అందంగా కనబడుతూ ఉంటాయి. నదిలో సగం మునిగిన బోటులాంటి క్లబ్బు సాయంత్రం కాగానే సందడి చేస్తూ ఉంటుంది అర్ధరాత్రి వరకూ, ఆంధ్రప్రదేశ్ అవతరించిన తరువాత కట్టదగ్గరగా ఒక మంచి పార్కు ప్రజల నాకర్షిస్తున్నది. ఆత్మహత్యలు జరగకుండా పోలీసు పహరా దివారాత్రాలు సాగుతున్నది. అయినా వాళ్ళ కళ్ళు కప్పి ఎవరో ఒకరు ఏ మూలనుంచో నీళ్ళలోకి కట్టమీదనుంచి దూకి ఆత్మహత్య చేసుకుంటూనే ఉన్నారు

అలివేలు కట్టదగ్గరి కొచ్చేటప్పటికి ఒడ్డుమీద ఇద్దరు పోలీసుల కబంధహస్తాల మధ్య ఒకయువకుడు గుంజుకుంటున్నాడు ఆమె గుండెలవిసిపోయాయి. ఆ దృశ్యం చూడగానే అతడు శంకరమే అయిఉంటాడు. ఎంత ప్రయత్నము చేసినా అతడు తన బుద్ధిని మరల్చు కోలేదన్నమాట. రాత్రి ఆత్మహత్య చేసుకోబోయి తనకు పట్టుబడ్డాడు. ఇప్పుడు పోలీసులకు పట్టుబడిపోయాడు. ఇందుకే. కాబోలు తన కళ్ళల్లోకి చూడలేకపోయాడు తనూ పిల్లలూ అదృష్టవంతులే. ఇంక శంకరాన్ని ఒక్క నిమిషమయినా విడిచి ఉండకూడదు. తననూ పిల్లలనూ అన్యాయం చెయ్యటమంటే మాటలనుకుంటున్నాడేమో ?

కట్టమీద నుంచి ఒడ్డుకు పోవాలంటే చుట్టు తిరిగిపోవాలి. ఆ ప్రయత్నంలో కాళ్లు జారుతున్నా గబగబా అడుగులు వెయ్యటం మొదలుపెట్టింది. ఆమె ఒడ్డుకు చేరుకునేటప్పటికి పోలీసుల చేతులలోనుంచి ఆ యువకుడు తప్పించుకుని నీళ్ళల్లోకి జారుకున్నాడు. ''శంకరం శంకరం'' అంటూ కేకలు పెడుతూ అలివేలు కూడా వచ్చి ఆవేశంతో నీళ్ళలోపడి జారిపోయింది

''ఇదేమిటి? ఈ ఆడది ఎక్కణ్ణించి వచ్చింది?'' పోలీసులు అయోమయంగా చూసి ఇద్దరు గజ ఈతగాళ్ళను పంపించారు వాళ్ళను ఒడ్డుకు చేర్చమని.

ఇదంతా క్షణాలమీద జరిగిపోయింది: నీళ్ళలో పడటానికి పోలీసు పహారాతో పీలుపడక సమయంకోసం కట్టమీద నిలబడి ఎదురుచూస్తున్న శంకరం ఎవరో స్త్రీ నీళ్ళల్లోపడ్డదన్న కేకలకు అదిరిపడి కట్టదిగి గుంపులోకి దూరాడు.

పోలీసు చేతికర్రలు తిప్పుకుంటూ ఇటునుంచి అటూ అటునుంచి ఇటూ పచార్లు చేస్తున్నారు. జనాన్ని ఒక హద్దుదాటి రానివ్వటంలేదు గజ ఈతగాళ్ళు అప్పుడప్పుడు తలలు చేతులూ నీటిపైకి తేల్చి కనబడలేదని సైగలు చేస్తున్నారు

గుంపులోనుంచి కొందరు వెళ్ళిపోతున్నారు. కొందరు కొత్తగా వచ్చి చేరుతున్నారు. ఆందోళనతో బీటలువారిన గుండెతో శంకరం నిలబడి ఆ స్త్రీ ఎవరయి ఉంటుందా అని ఎదురు చూస్తున్నాడు. అతడి దేహం కంపించిపోతున్నది. పెదవులు ఎండిపోయాయి

సాయంకాలము ఆరుగంటలు కావచ్చింది. పోలీసులూ, గుంపులో ప్రజలూ అలిసిపోయారు. ప్రతిరోజూ ఎవరో ఒకరు ప్రాణాలు తీసుకుని తమ ప్రాణాల మీదికి తెస్తారని విసుక్కుంటున్నారు పోలీసులు

గజ ఈతగాళ్లు చీకట్లు నలుప్రక్కలా ఆవరించక ముందు దీపాల తోరణాలు తళతళా మెరవక ముందు ఆస్త్రీ దేహాన్ని ఒడ్డుకు చేర్చారు

''నిండు గర్భిణి'' పోలీసులు దగ్గరికి చేరారు

''అలివేలు! అలివేలు!'' పిచ్చివాడిలా పరుగెత్తుకుంటూ వచ్చాడు శంకరం. ఆమె తలను తొడమీద పెట్టుకున్నాడు. నన్ను ఆత్మహత్య చేసుకోవద్దని

వారించి నీవు ప్రాణాలు తీసుకున్నావా అలివేలూ! నేనిక్కడే ఉన్నాను. చూడు నా వంక! నేను లేకపోతే నీవు పిల్లలను పెంచగలవు. కాని నీవు లేకపోతే నేను పిల్లలనుపెంచలేను అలివేలూ! ఎందుకిలా చేశావు?'' తలబాదుకున్నాడు శంకరం.

అయ్యో! తను ఆమెమనసు నెందుకు కనిపెట్టలేకపోయాడు? తను వట్టి దురదృష్టవంతుడు. ఆమె చల్లటి చేతులను కళ్ళకద్దుకుంటున్నాడు. జుట్టు పీక్కొని ఏడుస్తున్నాడు.

''చిరునవ్వు వెల ఎంత?
సిరులేవీ కొనలేనంత!''

హుసేన్ సాగరం కట్ట మీద ఈ దృశ్యాన్ని చూస్తూ నిలబడ్డ యువకుడి చేతిలో ఉన్న ట్రాన్సిస్టరు యుగళ గీతాన్ని ప్రసారం చేస్తున్నది.

ఆదృశ్యం చూసి ఈపాట విన్న జగచ్చక్షువు అప్పుడు కనుమరుగయ్యాడు.

(ఆంధ్రప్రదేశ్-ప్రభుత్వ మాస పత్రిక)



# జమ్రుద్ మహల్

అతడు స్కూలు కెదురుగుండా ఉన్న షాపు అరుగుమీద కూర్చుంటాడు. నెరసిన తల దేహచ్ఛాయకు మాచింగ్‌గా ఉంది. తెల్లటి కమీజూ- గళ్ళలుంగీ- కాళ్ళకు పాదరక్షలు.

అతడు ఎవరితోనూ మాట్లాడడు. అతడికి ఎవరితోనూ పనిలేదు. ఉబుసు పోక కెవరయినా పలకరిస్తే ఓ చిరునవ్వు ఎరువు తెచ్చుకుని 'అంతా బాగు' అన్నట్టు తల తిప్పుతాడు.

ఉదయం ఎప్పుడు లేస్తాడో తెలియదు. బజారు పంపు దగ్గర ముఖం కడుక్కుని స్నానం చేస్తాడు. అక్కడే లుంగీ ఉతుక్కుని దుకాణాల గొళ్లేలకు తగిలించి ఆరవేసుకుంటాడు. కమీజు మాస్తే సబ్బుతో ఉతికి ఆరవేసుకుని, మడతచేసి, సంచీలో పెట్టుకుంటాడు. ఈ బట్టల సంచీయే రాత్రిపూట తలకింద చేరుతుంది.

సరిగ్గా ఏడుగంటలు కాగానే ఆ పక్కనున్న హోటల్లో టిఫిన్ తిని కప్పు టీ తీసుకుంటాడు. ఆ షాపు మెట్లదగ్గర అరుగుమీద స్తంభానికి తలానించి కూర్చుని వచ్చేపోయేవారిని చూస్తూ ఉంటాడు.

ఆ షాపు యజమానికి అతడంటే ఎంతో గౌరవము. "సాబ్, లోపలికి వచ్చి ఈ కుర్చీలో కూర్చోండి" అంటాడు ఉర్దూ భాషలో.

"ఇక్కడ బాగుంది" అంటూ కళ్ళు మూసుకుని నవ్వుతాడు.

"సాబ్. టీ తీసుకోండి."

"సాబ్. పాన్‌బీడా తీసుకోండి."

తను తీసుకునేటప్పుడు యజమాని అతడిని బలవంతం చేస్తాడు. ఎప్పుడూ వద్దంటే బాగుండదని తీసుకుని శుక్రియా (కృతజ్ఞత) అంటాడు అతను.

అతడి ముఖం సముద్రమంత గంభీరంగా ఉంటుంది. అతడి హృదయ సముద్రంలో తరంగాల ఘోష హోరెత్తినట్లుంటుంది. అప్పుడప్పుడు అతడు ఆ హోరును భరించలేక కళ్ళు గట్టిగా మూసుకుంటాడు- కంటితడి ఎవరూ చూడకుండా.

ఎండాకాలంలో కాస్తలోపలిగా కూర్చుంటాడు. వర్షాకాలంలో షాపు యజమాని పక్కగా దిండ్లకానుకుని పరుపుమీద కూర్చుంటాడు జరదాబీడా నములుతూ.

గత ఐదు సంవత్సరాలుగా అతడి కార్యక్రమంలో ఏ విధమయిన మార్పూ లేదు. హోటల్ భోజనం- షాపుముందర పడక.

అది పాత హైదరాబాదులో చార్మినార్ ప్రాంతం. మూసీనది కివతల ఎంత రద్దీ ఉంటుందో అవతలకూడా అంత రద్దీ ఉంటుంది. అక్కడకూడా స్కూళ్ళు, కాలేజీలు ఉన్నాయి. ఆధునిక వస్తుసామగ్రి లభించే పెద్దపెద్ద షాపులూ ఫుట్పాత్ అంగళ్లూ ఉన్నాయి. గుల్జార్హవుసు దగ్గర వెండి బంగారు బట్టల దుకాణాల రద్దీ మరీ ఎక్కువగా ఉంటుంది. ఆ ప్రాంతంలో బట్టలపైన చమ్కీ పని చేసే దుకాణాలు అధికంగా ఉన్నాయి. వీటన్నిటిపైనా దృష్టిసారించి చూస్తాడు అతడు.

నల్లటి ముసుగులు ధరించి ఏ స్త్రీలు వీథివెంట నడిచినా కొండంత ఆశతో కళ్లు మాత్రమే కనబడే ఆ ఆకారాలను చూస్తాడు. ఆ తరువాత విరాశా నిస్పృహలు ముఖమంతా అలుముకుంటాయి. పెద్ద నిట్టూర్పు విడుస్తాడు.

ప్రతినెలా పదో తారీఖున అతడి ముఖం అత్యంత విషాదమయంగా ఉంటుంది. బాధ భరించలేనట్టుగా కళ్లు మూసుకుని తల తిప్పుతాడు. ఆనా డతడేమీ తినలేదు.

అది పన్నెండవ తేదీ. అతడి ముఖమింకా తేరుకోలేదు. స్తంభానికి ఆనుకుని దీనంగా వీథిలోకి చూస్తున్నాడు వచ్చేపోయేవారిని.

అది పన్నెండు గంటల సమయం. భోజనానికి వెళ్లాలని లేవబోతున్నవాడల్లా హఠాత్తుగా ఆగిపోయాడు.

ఏ సందులోనుంచో పన్నెండేళ్ల పిల్లవాడు కళ్లు నలుపుకుంటూ వస్తున్నాడు రోడ్డు మీదికి.

అతడు గబగబా పరుగెత్తి ఆ పిల్లవాడిని పట్టుకున్నాడు. తలమీద చెయ్యి వేసి, మరోచేత్తో గడ్డం పైకెత్తి, అతడి కళ్లల్లోకి చూస్తూ "బేటా. ఎందుకేడుస్తున్నావు? ఏం జరిగింది? నీ పేరేమిటి?" పిల్లవాడిని గుండెకు హత్తుకున్నాడు.

పిల్లవాడు ఆశ్చర్యపడుతూ "నా పేరు అజీజ్" చొక్కాతో కళ్లు తుడుచుకున్నాడు.

"అజీజ్! అజీజ్!" ముఖంలోకి చూశాడు.

పిల్లవాడు నల్లగా ఉన్నాడు. తలవెంట్రుకలు చిందరవందరగా ఉన్నాయి.

అతడికి ఆశాభంగమయినట్లయింది.

మళ్లీ అంతలోనే అజీజ్ అజీజ్ అన్న మాట కడుపులోని పేగులను తోడేస్తున్నది.

అజీజ్! ఎంతటి ప్రేమాస్పదమయిన పేరు?

తన అజీజ్ ఎంత తెల్లగా ఉండేవాడు!

తెల్లటి బట్టలు వేసుకుంటే పిల్లవాడు కనబడేవాడుకాదు. ఆ బట్టల్లో కలిసిపోయేవాడు.

ఉంగరాల జుట్టు- తీరైన ముక్కు- చిన్నమూతి- ఎర్రటి పెదవులు- సన్నగా పేర్చినట్టున్న పలువరస. "ఒరే అజీజ్! నన్నొక్కడినీ చేసి వెళ్లిపోయారా మీరంతా? నేనేమయిపోతాననుకున్నార్రా?" నోట్లోనే గొణుక్కుంటూ కన్నీళ్లు కారుస్తున్నాడు అతడు.

పిల్లవాడు దిగ్భ్రాంతుడై పోయాడు.

"బాబూ. నీవెందు కేడుస్తున్నావు?"

"బేటా, నేను ఏడవటం లేదు. నీకేం కావాలి చెప్పు? ఎందుకు ఏడుస్తూ వస్తున్నావు?" అతడిని నడిపించుకుంటూ షాపు దగ్గరికి తీసుకువచ్చాడు.

"ఎనిమిదవ క్లాసు చదువుతున్నాను. రేపే పరీక్ష ఫీజు కట్టవలసిన తేదీ దాదమ్మ దగ్గర డబ్బులేదు." పిల్లవాడు మళ్లీ కళ్లు తుడుచుకున్నాడు.

అతడి కడుపులో పేగు మళ్లీ కదిలినట్లయింది.

"బేటా, ఏడవకు. డబ్బిస్తా పీజు కట్టరా. నీతో మాట్లాడాలి" అన్నాడు.

పిల్లవాడి ముఖం చేటంతయింది. అతడిచ్చిన డబ్బు తీసుకుని పరుగు తీశాడు

అతడికి మనసు కొంత తేలిక పడినట్లయింది. గబగబా రోడ్డు దాటి వెళ్లి భోజనం చేసి వచ్చాడు.

ఐదు గంటలకు ఆ పిల్లవాడు వచ్చాడు. అతడు పిల్లవాడిని దగ్గర కూర్చో బెట్టుకుని "బేటా, మీ ఇల్లెక్కడ? మీ బాబా ఏం పనిచేస్తాడు?" నీవు నిమురుతూ అడిగాడు.

పిల్లవాడికి బిక్క ముఖం పడ్డది. కళ్లు చెమ్మగిల్లాయి.

"అమ్మ బాబా లేరు. దాదమ్మ ఉంది." అన్నాడు.

"అమ్మ బాబా లేరా? దాదమ్మను నాకు చూపించు" అన్నాడు ఆత్రంగా కనుబొమలు ముడిచి.

"రాండి పోదాం" పిల్లవాడి చెయ్యి పట్టుకుని రోడ్డు దాటి నడవటం మొదలు పెట్టాడు.

ఇరుకు సందులగుండా మురుగు కాలవలు దాటి ఒక యింటికి తీసుకు వెళ్లాడు ఆ ఇల్లు పడిపోతూ ఉంది కొన్నిచోట్ల ద్వారబంధాలులేవు. కొన్నిచోట్ల గోడలు పడిపోయి ఇటుకలు కనబడుతున్నాయి. ఆ యింటికి అన్ని దరవాజాలకూ గోనె పట్టాలు కట్టి ఉన్నాయి. అజీజ్ ఆ శిథిల గృహంలో వెనక భాగానికి తీసుకు వెళ్లి "దాదీ" అని పిలిచాడు

దూలాలు వేలాడుతున్న వసారాలో నుంచి రొట్టికోసం పిండి కలుపుతున్న చేతులతో-ముగ్గుబుట్టలాంటి తలతో రంగుపోయి అక్కడక్కడ చిరిగిపోయిన చీరెతో వచ్చింది.

"ఈమె మా దాది" అన్నాడు పిల్లవాడు.

ఆమె అతడికి సలాంచేసి కోడు ఊగుతున్న కుర్చీ ఒకటి తెచ్చి వేసింది కూర్చోమంటూ.

"మీరు పరీక్ష ఫీజు ఇచ్చారని మధ్యాహ్నం రొట్టె తినటానికి వచ్చినప్పుడు అజీజ్ చెప్పాడు. మిమ్మల్ని అల్లా కాపాడతాడు" అన్నది ఆమె కొంగుతో కళ్లు తుడుచుకుంటూ "ఏం చెయ్యను ? పసిబిడ్డ ఫీజు కట్టలేదని ఏడుస్తుంటే చూడలేక పిలిచి ఇచ్చాను" తల వంచుకున్నాడు ఇంకేం మాట్లాడాలో తోచక.

కృతజ్ఞతా భావంతో ఆమె మనసంతా నిండి కళ్లు చెమర్చాయి. తనకడుపులో మసలుతున్న బాధను దాచుకోలేకపోయింది.

"నా కొడుకు నాలుగు వందలు తెచ్చుకునేవాడు. భార్యనూ పసిబిడ్డను తీసుకుని ఒకనాడు సినెమాకు తీసుకువెళ్లాడు. అది కాలి పోయింది ఆ మంటలో వాళ్లు మాడిపోయారు" చతికిలబడి వెక్కి వెక్కి ఏడ్చింది.

"ఈ అజీజ్ కోసం నేను ఈఇంట్లో వంటపని చేస్తున్నా కడుపులో మంట-తలుచుకున్న కొద్దీ భగ్గుమంటుంది"

కన్నీళ్లు కారిపోతున్నాయి అతడికి. శరీరం గజగజ వణికిపోతున్నది.

"ఏ థియేటర్‌కు వెళ్లారు" నోరు తడి ఆరిపోయింది అతడికి.

"జమ్రుద్ మహల్ బాబా-జమ్రుద్ మహల్. అదే నా కొడుకునూ కోడలినీ పొట్టన పెట్టుకుంది." ఆమెకు దుఃఖమాగటంలేదు.

"అరే అల్లా" అత డొకకేక పెట్టాడు. రెండు చేతులతో తల గట్టిగా పట్టుకుని కళ్లు మూసుకున్నాడు.

"బేటా-బేటా-ఏమయింది ?" ఆమెకు కాళ్లూ చేతులూ ఆడటంలేదు. లోపలికి వెళ్లి యజమానురాలి నడిగి ఒక కప్పు టీ చేసుకువచ్చింది. మెల్లగా అతడిచేత తాగించింది.

అతడికి తలంతా దిమ్మెక్కినట్టుగా ఉంది. టీతాగినందువల్ల కొంత తేరు కొని ఆమెకు సలాం చేసి మళ్లీ వస్తానని మెల్లగా అడుగులు వేసుకుంటూ వెళ్లిపోయాడు.

షాపు ముందర అతడు కూర్చుంటాడుగాని అతడు ఇదివరకువలె వేళకు స్నానం చేయటం, భోజనం చేయటం-టీ తాగటంలేదు. ఏదో ఆలోచిస్తూ కళ్లు తుడుచుకుంటూ ఉంటాడు. ఏవో జ్ఞాపకాలు-మనిషిని నిలువునా కాల్చివేసే జ్ఞాపకాలతో కుమిలిపోతాడు.

ఏదో ఆలోచన-రాత్రింబగళ్లు తెగని ఆలోచన

''శిరాజుద్దీన్ సాబ్, ఏమిటిలా భోజనమయినా చేయకుండా ఏమాలోచిస్తున్నారు?'' భుజం తట్టాడు షాపు యజమాని.

''భోజనం ఇక్కడికే తెప్పించనా?''

కళ్లు తెరిచాడు శిరాజుద్దీన్. కళ్లు ధారాపాతంగా వర్షిస్తున్నాయి.

యజమాని పదే పదే చెప్పిన మీదట అతడు లేచి హోటల్‌కు వెళ్లి భోజనంచేసి మెల్లగా అజీజ్ ఉన్న యింటికి వెళ్లాడు.

ఆమె బట్టలు ఆరవేసుకుంటున్నది.

''అమ్మా, మీరీ కొలువు మానేయండి. మోతీ గల్లీకి ఇవతలగా పెద్ద దేవిడీ ఉంది. ఇదిగో తాళపు చెవి. నేను చెప్పానని చౌకీదారుకు చెప్పి ఇల్లు శుభ్రపరచి అందులో ఉండండి. మీకు నెలకు కావలసిన డబ్బు-అజీజ్ పై చదువులకయ్యే ఖర్చు నేను భరిస్తాను'' అంటూ తాళపు చెవి ఆమె చేతబెట్టి వచ్చినంత తొందరగా వెళ్లిపోయాడు.

శిరాజుద్దీన్‌కు మనసు చాలా తేలికపడ్డది. యజమానితో ఎప్పుడూ లేనిది చాలాసేపు మాట్లాడాడు. కంటినిండా నిద్రపోయాడు.

అజీజ్‌ను స్కూలుకు పంపి ఆమె శిరాజుద్దీన్ చెప్పిన ఇంటికి వెళ్ళింది. ఎదురుగా చౌకీదారు వచ్చాడు. ఆమె తాళపుచెవి ఇచ్చి ఆయన చెప్పినదంతా చౌకీదారుకు వినిపించింది.

చౌకీదారు ఆశ్చర్యపడుకునే ఆమెకు సలామ్‌చేసి ఇల్లంతా చూపించాడు.

అది శ్రీమంతుల భవనం మూడు పడకగదులు నిండా ఆధునికమైన ఫర్నిచరు పెద్దహాలు, దానినిండా సోఫాలు గోడలనిండా ఆ వంశీయుల ఫోటోలు వాటి

కింద వాళ్ళపేర్లు ఉరుదూ భాషలో వ్రాయిబడి ఉన్నాయి. దూరంగా నౌకర్లకు ఇళ్ళూ మోటారు షెడ్లూ.

"ఈ ఫొటో శిరాజుద్దీన్‌సాబ్‌ది. ఇతడేకదా నాకీ తాళ్ళపుచెవి ఇచ్చింది? ఇది అజీజ్ ఫొటోనా? ఎంత అందంగా ఉన్నాడు పిల్లవాడు?"

వెంటనే ఆమె పడకగదిలోకి వెళ్ళింది. అక్కడ శిరాజుద్దీన్ అతడిప్రక్కగా కూర్చున్నది - కొంచెము వయసుమీరిన ఆమె. ఆమె బహుశః అతడి తల్లి అయి ఉంటుంది. మరొకప్రక్కన అజీజ్ - అందమైన అజీజ్-తల్లి ఒడిలో కూర్చు న్నాడు. ఆమె భూలోక సుందరిలా ఉన్నది.

ఆమె రివ్వురివ్వున వాకిట్లోకి వచ్చింది.

"ఈ ఇంటివారంతా ఏరీ? ఆ ఫోటోలలో ఉన్న వాళ్ళేరి? "ఆ తురతతో అడిగింది.

"హే భగవాన్" రెండు చేతులూ జోడించి కన్నీళ్ళు కార్చాడు చౌకీదారు.

"పెద్దమ్మగారు చిన్నమ్మగారినీ చిన్నబాబునూ వెంటబెట్టుకుని సినెమా కని జమ్రుద్‌మహల్ టాకీస్‌కు వెళ్ళారు. మధ్యలో మంటలు మండినాయట. అందరూ గాభరాపడి పరుగులు తీశారు. స్త్రీలు కూర్చున్న బాల్కానీలో నుంచి జనం బయ టికి రావటం కష్టమైంది. అందరికీ తొందరగా బయటికి పోవాలన్న ఆతురత ప్రాణభయం తొక్కిసలాట ఈ లోపల మంటలు బాగా విజృంభించాయి. స్త్రీలలో ఒకామె చీరెవిప్పి బాల్కానీ గుంజకు కట్టి చాలామందిని కిందికి జారనిచ్చిందట. అయినా అందరూ బయటికి రాలేకపోయారు ఈ అయ్యగారి కుటుంబమంతా నాశనమయిపోయింది. ఇంకా ఎందరివో కుటుంబాలు నామరూపాలు లేకుండా పోయాయి అప్పటినుంచీ అయ్యగారు ఈ ఇంట్లో అడుగుపెట్టలేదు. ఎక్కడో ఉంటారు. ఎక్కడో తింటారు. నాకు జీతం నెల నెలా పంపుతారు." అన్నాడు. కళ్ళు తుడుచుకుంటూ.

ఆమెకు గుండెనీరయిపోయింది. అతడు ఉండేచోటు చూపించమని చౌకీ దారుని అడిగింది.

అతడు షాపు గుర్తులు చెప్పాడు.

ఆమె ఉరుకు పరుగులమీద షాపుకువచ్చి పరధ్యానంగా ఉన్న శిరాజుద్దీన్ కాళ్ళమీద పడ్డది.

"మీయిల్లు చూశాను. అది ఇల్లుకాదు మహల్‌ల ఆఇంట్లో మీరు లేకుండా నేను ఉండగలనా ? మీరు కూడా రావాలి" అంటూ వేడుకున్నది.

"మీరు నా తల్లివంటివారు అజీజ్ నాకొడుకు వంటివాడు. మీరు అందులో ఉండండి. కాగితాలు డబ్బు ఈషాపు యజమాని అందజేస్తాడు. నేను రేపు వస్తా" ఆమెను లేవదీసి అమ్మా అంటూ కౌగిలించుకున్నాడు.

ఆమె కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయింది.

శిరాజుద్దీన్ తన ఆస్తికి సంబంధించిన కాగితాలు, డబ్బు షాపు యజమానికి ఇచ్చాడు. వాళ్ళ కందచేయమని మక్కామసీదు వైపు తిరిగి ప్రార్థన చేసుకున్నాడు. కమీజ్ సవరించుకుని పాదరక్షలు కాళ్ళకు తగిలించుకుని వెనక్కు తిరిగి చూడకుండా ముందుకు నడిచాడు.

జమ్రుద్‌మహల్ దగ్గరగా వచ్చాడు. క్రిందినుంచి పైవరకూ చూశాడు. ఎంతమందినో పొట్టన పెట్టుకుని - ఎన్ని కుటుంబాలనో కూల్చిన జమ్రుద్‌మహల్ మాడి బొగ్గయిపోలేదు. కొత్త అలంకారాలతో మరింత అందాన్ని సంతరించుకొని ఠీవిగా నిలబడ్డది. ఆ నాడు కొత్త చిత్రము వచ్చింది కాబోలు - విద్యుద్దీపాలంకరణతో జగజ్జేగీయమానంగా వెలిగిపోతున్నది.

శిరాజుద్దీన్ నీళ్ళు నిండిన కళ్ళతో గబగబా అడుగులు వేసుకుంటూ వెనక్కు తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు - అజీజ్ అజీజ్ అనుకుంటూ.

ప్రతిరోజూ అజీజ్ అడుగుతాడు - దాదమ్మను "దాదీ శిరాజుద్దీన్‌సాబ్ ఎప్పుడు వస్తారు" అని.

"బేటా, రేపు వస్తారు." అంటుంది.

ఆ రేపు మరి ఎన్నడూ రాని రేపయింది.

(ఆంధ్ర సచిత్ర వారపత్రిక)



# ఆచార్య నారాయణస్వామి

వేసవికాలపు సెలవులు ప్రారంభం కాగానే ఆచార్య నారాయణస్వామి స్వభావంలో గాంభీర్యం చోటుచేసుకోవడం మామూలు. మిత్రులను కలుసుకోవటానికి కూడా సందేహిస్తాడు చాలా తక్కువగా మాట్లాడుతూ ఉంటాడు. సాయంకాలపు వేళల్లో ఎక్కడికి వెళ్ళేది సామాన్యంగా ఇంట్లో కూడా చెప్పడు.

ప్రతి సంవత్సరమూ ఏదో ఒక యూనివర్సిటీ నుంచి దిద్దటానికని పరీక్షా పత్రాలు వస్తూనే ఉంటాయి. ఆయన పరీక్షా పత్రాలు దిద్దటంలో ఒక నిర్దిష్టమైన పద్ధతిని అవలంబిస్తాడు. రోజుకు నలభై పత్రాలకంటె ఆయన దిద్దడు అంతకంటె ఎక్కువ దిద్దినట్లయితే విద్యార్థులకు న్యాయం చేకూరదని ఆయన నమ్మకము. ఎంత అనుభవజ్ఞులయినా మొదటి పదిహేను ఇరవై పత్రాలు స్థిమితంగా చూడగలరు గాని - ఆ తరువాత ఏదో ఒక విధమైన తొందరపాటు తప్పకుండా కలిగి విద్యార్థులకు అపకారం జరుగుతుందని ఆయన విశ్వాసం.

ఆయన తన బాధ్యతను ఎంత కచ్చితంగా నెరవేరుస్తాడంటే ఆ పరీక్షా పత్రాలు దిద్దటం పూర్తయ్యే వరకూ మరోపని తలపెట్టడు. ఆ సమయాలలో ఇంటికి బంధుమిత్రు లెవరు వచ్చినా ఆయనకు చాలా చికాకుగా ఉంటుంది. ఎవరు వచ్చినా వాళ్ళు తనను మార్కులు వెయ్యమని అడగటానికి వచ్చినట్లే అనుమానం కలుగుతుంది. అందుకని ఆయన పరీక్షాపత్రాలు చేతికందిన రెండు మూడు రోజులకు దూరంగా ఉన్న ఊళ్ళకు వెళ్ళి అక్కడ మంచి హోటల్లో ఉండి పనిపూర్తి చెయ్యటం అలవాటు.

ఆయనకా సంవత్సరం ఊటీ వెళ్లాలని దృఢంగా సంకల్పం కలిగింది. కాని - ఎందువల్లనో కూనూరు కూడా చల్లగానే ఉంటుంది కదా అని అక్కడికి వెళ్ళి ఒక హోటలు దగ్గరగా గది తీసుకున్నాడు. ఉదయం కాఫ్యాదులు ముగించుకున్న తరువాత కొన్ని పత్రాలు, ఓకునుకు తీసిన తరువాత ఓ కప్పు కాఫీ తాగి మరికొన్ని పత్రాలూ దిద్దటం ప్రారంభించేవాడు.

కూమారు వచ్చిన తరువాత మొదట రెండు రోజులూ ఊళ్ళో ముఖ్య ప్రదేశాలు చూసి - ఏది ఎక్కడుందో గుర్తుపెట్టుకుని తనపని ప్రారంభించాలని అనుకున్నా మరో రెండు రోజులకు గాని మనసు అటువైపుకు మళ్ళలేదు.

తరువాత తీరికగా పెట్టె తెరచి పేపర్లన్నీ బయటికి తీసి లెక్కపెట్టుకున్నాడు. రోజుకు ఎన్నిదిద్దాలో విభజన చేసుకున్నాడు.

ఆ పేపర్లన్నీ అట్లా పేర్చి పెట్టుకొని అనాటి పత్రికను తిరగవేసి డాక్టరుస్వామి ఎర్రపెన్సిలు తీసుకుని పేపర్లు దిద్దటము మొదలు పెట్టాడు.

ఒక అరగంట అయిన తరువాత చూసిన పేపర్లను తిరిగి పెట్టెలో భద్రపరచి మళ్ళీ క్రొత్తవి అందుకున్నాడు.

మూడు గంటల సుమారుకు గది తలుపు చప్పుడయింది. ఆయన తత్తరపాటుతో లేచి దిద్దిన పేపర్లు పెట్టెలో పెట్టి ఇంకా చూడవలసిన వాటిమీద ఖద్దరు ఉందువా కప్పి ఎప్పటినుంచో తాను పత్రిక చదువుకుంటున్నట్టుగా చేతపట్టుకొని తలుపుతీశాడు. ఎవరు తలుపుకొట్టుతున్నారో - ఎందుకు కొట్టుతున్నారోనని సందేహిస్తున్న ఆయనకు కాఫీ టిఫిను తెచ్చిన సర్వరును చూడగానే మనసు కుదుటపడ్డది. తెచ్చిన వస్తువులందుకొని తలుపు మూసుకున్నాడు.

సాయంత్రము అయిదు గంటలవరకూ ఆ విధంగానే పేపర్లను దిద్దుతూ - లెక్కపెట్టుకునేసరికి ముప్పయ్యే అయినట్లు తేలింది. వాటిని విడివిడిగా పెట్టెలో సర్ది జాగ్రత్తగా పెట్టెకు తాళమువేసి తాళపుచేతులను కోటుజేబులో భద్రపరచుకున్నాడు.

ముఖం కడుక్కుని చలవ ధోవతీ సిల్కు కుడతా ధరించి కాళ్ళకు అకు చెప్పులతో బయలుదేరబోతూ తీరా మనసు కేమి తట్టిందో - ఆ కుడతావిప్పి - షర్టు తొడుక్కుని దానిపైన కోటు వేసుకున్నాడు. గదికి గట్టి తాళము వేసి చల్లగాలికి పార్కువరకూ వెళ్ళాలని కాలినడకనే బయలుదేరాడు.

పార్కులో పచ్చగడ్డిమీద ఒంటరిగా విశ్రాంతిగా అరగంట కూర్చునేసరికి విసుగుపుట్టింది. లేచి చెప్పులు వేసుకుని అటూఇటూ చూసేసరికి ఎదురుగా ఉన్న భవనంలోకి అందరూ గుంపులు గుంపులుగా పోతున్నారు. వాళ్ళతోపాటు ఆయనా

లోపలికి వెళ్ళి బల్లముందర కూర్చుని గోడలకు తగిలించబడిన నాయకుల చిత్రాలను చూస్తూ ఉండగా రెండుసార్లు సర్వరువచ్చి ''ఏం కావా''లని అడిగి వెళ్లాడు తీరా బల్లముందర కూర్చుని ఏమీ వద్దంటే తన మర్యాదకే భంగమనుకొని షర్బతు తీసుకురమ్మన్నాడు

అంతలో గుంపులు గుంపులుగా ఆడవాళ్ళూ మగవాళ్ళూ వచ్చి అక్కడ ఉన్న కుర్చీలు ఆక్రమించుకున్నారు. అందులో ఒకామె ధైర్యంగా వచ్చి డాక్టరు స్వామి బల్లదగ్గర కూర్చుని సర్వరును పిలిచి తనకు కావలసినదేదో ఆర్డరుచేసింది. ఇదంతా ఆయన షర్బతు త్రాగి గ్లాసు బల్లమీద పెట్టే అంతలో జరిగింది. ఆమె నిస్సంకోచంగా తొందర తొందరగా తినటము మొదలు పెట్టింది. ఆమె తన కెదురుగా కూర్చోటంవల్ల ఆయనకు మొగమాట మనిపించి తన దృష్టిని గోడల మీద ఉన్న చిత్రాలపైకి పోనిచ్చి చేతి కర్రను తిప్పుతూ కూర్చున్నాడు. అయిదు నిమిషాల తరువాత సర్వరు రాగానే బిల్లు చెల్లించి అక్కడి నుంచి కదిలి వెళ్లి పోయాడు. చల్లగాలికి లానులో విశ్రమించాలనిపించి చెప్పులు విడిచి కూర్చున్నాడు

డాక్టరు నారాయణస్వామి భార్య ఇప్పటి తరహా మనిషి కాదు కాపురానికి వచ్చినప్పుడు ఆ కాలానికి తగినట్టుగానే ఆమె వేషధారణ ఉండేది. తరువాత తరువాత సంసారములో కూరుకుపోయి-పిల్లలతో సతమతమవుతూ ఉండటంవల్ల ఆమెకు తన వేష భాషలను తిరిగి తిరిగి కాలానుగుణ్యంగా మార్చుకోవటానికి అవకాశం చిక్కనేలేదు. అదిగాక కాన్పుల సంఖ్య ఎక్కువైన కొద్దీ మనిషికాస్త స్థౌల్యానికి లోబడిపోయింది. డాక్టరు స్వామి ముగ్గురు పిల్లలు పుట్టిన తరువాతనే విదేశాలకు వెళ్లి పిహెచ్.డి. డిగ్రీ తెచ్చుకున్నాడు ఆయన విద్యా సంస్కారమూ నాగరికతా ఆయన వరకేగాని కుటుంబానికి చెందలేదు. కారణం ప్రత్యేకంగా ఎత్తి చూపటానికి ఏమీ కనబడదు. పిల్లలతో ఉదయాస్తమానమూ వేగిపోయే భార్యను ఆయన ఏ విషయానికీ తొందర పెట్టదలచడు. తన గదిసీ తన వస్తువులనూ తన పుస్తకాలనూ తానే స్వయంగా చూసుకుంటాడు. తన గదికి తాళము వేసుకుంటాడు. ఒక్కొక్కసారి ఆయన తన ప్రోగ్రాములను ఆమెకు తెలుపనైనా తెలుపడు.

డాక్టరు స్వామి అయినా మరీ ఆధునిక వేషంలో ఉన్న స్త్రీ లంటే ఏవగించుకుంటూనే ఉంటాడు. బుగ్గలకూ పెదవులకూ రంగులు పూసుకునే వాళ్లంటే ఆయన అదొక వింతగా చూస్తాడు. ఎర్రటి పొడుగుపాటి గోళ్లను

చూడగానే దూరంగా జరుగుతాడు. కాని ఆ టేబుల్ దగ్గర కూర్చున్న ఆమెకు మాత్రం రూపం తక్కువైనా చక్కని దిద్దుబాటున్నది అదిగాక - ఆయనను ఆకర్షించింది ఆమె చొరవతనము. ఆమె ఒంటరిగా బయటికి వచ్చి ధైర్యంగా తిరుగుతుంటే ఆయనకు చూడముచ్చటైనది.

ఆయన మనసు అకస్మాత్తుగా భార్యవైపుకు మళ్లింది ఆమెకు పాపం- ఆయన అభిరుచులను అడిగి తెలిసికోవటానికి కూడా తీరుబడిలేదు. ప్రపథమంలో ఆయనకు ఆమెను తనతో ఎక్కడికయినా తీసుకుని వెళ్లాలని ఉండేదిగాని-పిల్లలతో ఆమె పడే యమయాతనకు వెరచి తన కోరికను తనలోనే లయింప చేసుకునే వాడు. అలా కొంతకాలము అయేసరికి అసలు ఆ కోరిక కూడా నశించిపోయింది కాని-ఎప్పుడయినా ఆయనకు నచ్చిన వేషధారణ ఏ స్త్రీ దగ్గరనయినా కనబడితే- పాపము-ఆప్యాయంగా చూస్తాడు. కాస్త వాళ్లను పలుకరించాలని - అభినందించాలనీ ఆయన రహస్య కుతూహలము.

భావ పరంపర ఆయన మెదడులో అలా సాగిపోతూ ఉండగా ఆయన కెదురుగా టేబుల్ దగ్గర కూర్చున్న ఆమె ఒయ్యారంగా కొంగుచేత బట్టుకొని- మెట్లు దిగి-లాను మీదుగా గేటు వైపు దారితీసింది.

ఆమె అలా వెళ్లిన తరువాత-ఆయన ఎంతో సేపు అక్కడే కూర్చున్నాడు. ఎనిమిది గంటలయినట్లుగా గడియారము ఏ మూలనుంచో గంటలు కొట్టింది అక్కడినుంచి బయలుదేరి కాలినడకతో తిన్నగా గదికి చేరుకున్నాడు.

తన గది పరిసరాలను చూసిన తరువాత ఆయన దృష్టి అప్పటికి ఆమె వైపు నుంచి మళ్లి-పేపర్ల మీదికి ప్రసరించింది

అక్కడ ఉన్న మొదటివారంలో చాలా వరకు అయన అనుకున్నట్లు పేపర్లను దిద్దగలిగాడు. అయన దగ్గరికి పేపర్లు పోతాయంటేనే విద్యార్థులందరూ భయపడుతూ ఉంటారు. విద్యార్థులు వ్రాసిన జవాబులను తాను యివ్వదలచిన మార్కులతో సరిసమానముగా తూచి యివ్వటమేగాని అరమార్కయినా ఎక్కువ ఇవ్వటం ఆయన స్వభావంకాదు. ఎంత రహస్యంగా ఉంచినా పరీక్షకు లెవరో విద్యార్థులకు తెలిసిపోతూనే ఉంటుంది. పరీక్షలయిన దగ్గర్నుంచీ విద్యార్థులూ వారి పక్షాన పెద్దవాళ్లూ పరీక్షకుల ఇళ్ల చుట్టూ తిరగక మానరు. మామూలుగానే

డాక్టరు స్వామి విద్యార్థులతో చనువుగా మాట్లాడడు. అందులో పరీక్షకుడయితే చెప్పనే అక్కరలేదు ఆ సంవత్సరం విద్యార్థులందరూ ఆయన పేరు వినంగానే ముఖాలు దించుకున్నారు. అన్నీ తెలిసినవాళ్లు కూడా "నాలుగు మార్కులు వెయ్యటానికి వీలుందా" అని అడిగితే ఆయనకు చాలా అసహ్యమనిపిస్తుంది. "దొంగ తనం చెయ్యటానికి వీలుందా" అన్నట్టు వాళ్ల మాటలలో ధ్వనించేది.

ఆయన ఈ సంవత్సరము పరీక్ష పేపర్లు చేతికి వచ్చిన తరువాత అమ్మాయికి సంబంధం చూస్తానని ఇంట్లో చెప్పి వేసవి సెలవులలో కొంతకాలము కూనూరురో గడపదలచి ఎవరికీ తెలియకుండా వెళ్లాడు. వెళ్లినచోట కూడా తానెక్కడినుంచి వచ్చినదీ సాధ్యమైనంతవరకూ ఎవరికీ తెలియకుండా కాల క్షేపం చేస్తున్నాడు.

ఒకరోజు సాయంకాలము పార్కులో లానుమీద కూర్చున్నాడు. పేపర్ల బరువు తీరితేగాని-కాస్త నలుగురితో మాట్లాడి తన ఒంటరితనాన్ని పోగొట్టుకునేటట్టులేదు ఎక్కడ కూర్చున్నా ముళ్ల మీద కూర్చున్నట్టుగానే ఉంటున్నది.

ఆయన మనసులో ఆకస్మికంగా ఆమె మెదిలింది. ఆమె పార్కులో ఎక్కడా కనిపించటంలేదేమీ? ఎందువల్ల? రెండు రోజులయినట్లుంది. అప్పుడే అయన పార్కంతా కలయదిరుగుతూ ఏమీ తోచక తన గది చేరుకుంటున్నాడు.

ఆ రోజు మాత్రం ఆమె విషయము అయన మనసులోకి రాగానే తమాషాగా ఆమె ప్రత్యక్షమైనది. నల్లచుక్కల ఎర్రటి నైలాన్ చీరె కట్టుకున్నది. దానికిదైన రవిక తొడుక్కున్నది. జారు ముడిమీద నాలుగంటే నాలుగే పూలు పెట్టుకున్నది. కనబడి కనబడని బొట్టు అంజన రహితమైన కన్నులు-తీర్చిదిద్దిన అలంకరణ ఆయనకు చాలా ముచ్చట గొలిపింది. ఆమె ఒయ్యారంగా నడుస్తూ వచ్చి పచ్చి గడ్డిమీద కూర్చుని-అటూ ఇటూ చూసినట్లే చూసి చేతి సంచిలో ఉన్న ఊలు స్వెట్టరు బైటికి తీసి అల్లటం మొదలు పెట్టింది. అస్తమించబోతున్న సూర్యుడు తన పసిడి కిరణాలను విరజిమ్ముతూ ఉంటే ఆ కాంతిలో ఆమె ముఖం తళతళ మెరిసిపోయింది.

ఆయన కళ్లు జిగేలుమన్నాయి. నాలుగుసార్లు చూడటంవల్ల ఆయన కండ్లకు ఆమె బాగా పరిచయమయిపోయింది. ఆమె నాజూకైన వేషధారణా-ఆమె చొరవ

దనమూ ఆయన మనసును బాగా ఆకర్షించినందువల్ల ఆయన హృదయంలో ఆమె అంటే ఎంతో ఆప్యాయత ఏర్పడ్డది వాచికంగా పలకరించకపోవటమే బాహ్య పరిచయానికి ఆటంకంగా ఉన్నది. దానివల్లనే వారిద్దరిమధ్య పరిచయము ముందుకు సాగకుండా అక్కడికే నిలిచిపోయింది. డాక్టరు స్వామి మీనమేషాలు ఎంచుతూ ఉండగానే క్రమంగా చీకటి పడి ఎనిమిది గంటలు కావచ్చింది.

ఆమె చివాలున లేచి తన సామానులన్నీ సంచిలో పెట్టుకుని మెల్లగా నడవటం ప్రారంభించింది. ఆమె అలా నాలుగు బారల దూరము వెళ్లిన తరువాత ఆయన కూడా లేచి చెప్పులు వేసుకుని బయలుదేరాడు.

పార్కు నుంచి ఒక్కటే రోడ్డు-తిన్నగా బయలుదేరి సరిగ్గా డాక్టరు స్వామి గారి గదికి సమీపంగా రోడ్డు మలుపు తిరిగే వరకూ ఒకరి వెనుక ఒకరు ఇద్దరూ నడిచారు. ఆమె ఆ మలుపు దగ్గర సందులోకి వెళ్లబోతూ ఉండగా ఆయన నోటి వెంట అప్రయత్నంగా "మీ యిల్లు ఈ సందులోనేనా?" అన్నమాట వచ్చేసింది.

ఆమె వెనక్కు తిరిగి చూసి తెల్లటి పళ్లను పైకి కనబరుస్తూ "మీది కూడా ఇక్కడేనా?" అన్నది ఒయ్యారంగా తల ఆడిస్తూ. ఆమె ఆ మాట అంటుంటే ఆయన కెంతో ముచ్చటనిపించింది.

"ఆఁ! ఇక్కడే-ఈ గదే. మనము చాలా దగ్గరగానే ఉన్నాము. సులభంగా కలుసుకోవచ్చు" అని ఆయన అంటూ ఉండగానే ఆమె తలఆడిస్తూ వెళ్లిపోయింది.

పరీక్షలో గెలుపొందినంతటి ఆనందంతో డాక్టరు స్వామి మనసు గంతులు వేస్తూ ఉండగా ఆయన తన గదిని చేరుకొని ద్విగుణీకృతమైన ఉత్సాహంతో పేపర్లు దిద్దుకొని ఆ రాత్రి హాయిగా నిద్రపోయాడు.

మరునాడంతా ఆయన పేపర్లు దిద్దుతూనే గడిపాడు. సుమారు నాలుగు గంటల తరువాత లేచి బయటికి బయలుదేరాలని త్వర త్వరగా పనిచేసుకోవటం మొదలు పెట్టాడు.

అంతలో గది తలుపు చప్పుడయింది. ఆయన ఆదుర్దాతో లేచి ఇద్దరు ఖండువా పేపర్ల మీద కప్పేసి పైకి ఏమీ కనబడటం లేదన్న నమ్మకం చిక్కిన

తరువాత-తలుపు తీశాడు. సర్వరు కాఫీ తెచ్చాడేమో ననుకున్నా డాయన. కానీ తీరా తలుపు తెరచిన తరువాత ఆమె కంటపడగానే దిగ్భ్రాంతుడయిపోయాడు; ఆమె తన గదికి వస్తుందని ఆయన కలలోనయినా అనుకోలేదు. మొత్తంమీద సాహసమే చేసిందనుకొని "రండి రండి" అన్నాడు.

ఆమె గడపలో నిలువబడే "నేను బజారుకు పోతూ పోతూ మీ గది ఇక్కడనేమోనని-ఊరికేనే తలుపుతట్టాను. వెళ్లి వస్తాను. కొంచెము బజారుకు వెళ్లవలసిన పని ఉన్న"దంటూ ఒయ్యారంగా కులుకుతూ అన్నది.

"నేనూ వస్తాను. నా పనీ అయింది. బజారుకు వెళ్లాలని నేనూ అనుకుంటూనే ఉన్నాను. లోపలికి వచ్చి అట్లా కూర్చుంటే నేను సిద్ధమవుతాను"- అంటూ రెండు తలుపులూ తెరిచి ఆమె లోపలికి రాగానే ఒక తలుపు వేశాడు. ఆమెను అక్కడున్న కుర్చీలో కూర్చోమని చేతితో సైగచేసి-తానొక కుర్చీలో కూర్చున్నాడు.

"ఎండా కాలమని యిక్కడికి వచ్చారా? ఈ ఊరు చాలా బాగుంటుందని అందరూ అంటుంటే నేను కూడా చూద్దామని వచ్చాను. రోజూ కొంత దూరము నడిస్తేగాని నాకు అన్నం అరగటంలేదు ఈఊళ్లో" అన్న దామె నాలుగు మూలలూ చూస్తూ.

"నడవకపోయినా నాకు ఆ బాధేమీ కనబడలేదు. ఈ ఊరు ఎట్లాఉంటుందో చూద్దామని వచ్చినవాడినే నేనూను. పది రోజులలో వెళ్లిపోవాలి" అన్నాడు వేలి ఉంగరము చూసుకుంటూ.

"అయితే మీది ఏ ప్రాంతం?" నోరు పిప్పి విప్పకుండా ప్రశ్నించిందామె. ఆమె పెదవులు గులాబీ రేకులు కదిలినట్టు కదిలాయి.

ఆయన తాను చెప్పదలచుకోని దాన్ని బ్రహ్మకయినా చెప్పకుండా ఉండగలడు. "మాది ఉత్తర ప్రదేశము. ఎండలు యిక్కడ గడిచిపోతే విశ్రాంతిగా ఎక్కడికయినా వెళ్లవచ్చు" అన్నాడు ఎటోచూస్తూ.

"ఔత్తరాహులు సాధారణంగా డార్జిలింగు వెళ్లుతారేమోగా; మీరింత దూరం వచ్చారేమీ?" అన్నది మళ్లీ నవ్వుతూ.

అదివరలో ఆయన-ఆమె నాజూకుతనానికీ-చొరవదనానికీ మురిసిపోయాడు. దీనితో ఆమె తెలివిగలదని కూడా అర్థమైంది. దీని తరువాత ఆయనకు ఆమెమీద మురిపెము మరీ ఎక్కువయింది.

ఇద్దరి సంభాషణా హిందీలో నడుస్తున్నది. భాషలోని జాతీయత - స్ఫుటమైన ఉచ్చారణ-ఆమె మాటల్లో చక్కగా కనబడుతున్నది. దానికి ఆయన మరింత మురిసిపోయాడు.

అంతలో తలుపుచప్పుడయింది. డాక్టరు స్వామి లేచి నిలబడి-షర్టుసర్దుకొని తీరా తలుపు దగ్గరికి వెళ్లేసరికి తటాలున ఒక విషయం స్ఫురించింది. అక్కడే ఆగిపోయాడు. ఉన్నవాడు ఉన్నట్టుగా అవతలికి వెళ్లితే-తన గదిలో పరాయి స్త్రీని చూసిన ఆ వ్యక్తి తనను గురించి ఏమనుకుంటాడు ? తనను గురించి ఏమైనా అపోహలు పడితే ? పోనీ ఆమె కనబడకుండా తలుపు దగ్గరికి వేద్దామా అంటే మూర్తీభవించిన ఆయన నిజాయితీ అంతా ఆ పేపర్లను విలువ కట్టడంలోనే ఉన్నది. ఆ పేపర్లు పెట్టెలోనయినా కాకుండా విడివిడిగా ఖద్దరు శాలువ క్రిందపడి ఉన్నాయి. ఆయన పని ఇరుకున పడినట్లయింది. బాగా ఆలోచించే వ్యవధయినా లేదు. అంతలో బయట నిలువబడిన వారెవరో మళ్లీ తలుపు చప్పుడు చేశారు.

"ఆడది ఆ పేపర్లను ఒక వేళ చూసినా ఏం చెయ్యగలదు? ఆమెకేం తెలుస్తుంది? ఊరికే తన భయంగాని !" డాక్టరు స్వామి మనసును నెమ్మది పరచు కొని-మెల్లగా తలుపులు దగ్గరగా వేసి-బయటికి వెళ్లి చూశాడు. ఎవరో కొత్త వాడనుకొన్నాడు గాని, తీరాచూసేనరికి-ఆయన బాగా తెలిసినవాడే-సాటి పరీక్షకుడు.

"మీరు ఇక్కడికి వచ్చి ఎన్నాళ్లయింది?"-అడిగా డాయన.

"అబ్బే ! ఎన్నాళ్లో కాలేదు. నిన్ననే అనుకోండి" అన్నాడు తల తడుముకుంటూ.

"అయితే ఈ వేసవికాలమంతా ఇక్కడే గడుపుతారా?" అన్నాడాయన.

"ఊఁహూఁ ! నేను రెండు రోజులలో వెళ్లిపోవాలి" అన్నాడు డాక్టరు స్వామి.

ఆ తరువాత నిలువబడే మరోఅయిదు నిమిషాలపాటు ఇద్దరూ మాట్లాడారు. మరునాడో-మూడవనాడో తిరిగి కలుసుకుందామనుకున్నారు.

ఆయనను పంపించి లోపలికి వచ్చిన డాక్టరు స్వామి దృష్టి ముందు పేపర్లు పైన పడ్డది. అవి యధాపూర్వకంగా ఖద్దరు శాలువ క్రిందనే ఉన్నాయి ముడతలు లేకుండా ఆయన కప్పినట్టుగానే బట్టకప్పి ఉన్నది. తరువాత ఆయన దృష్టి ఆమె పైన ప్రసరించింది. ఆమె కూడా కాలైనా కదిలించినట్టులేదు. తాను వెళ్లేటప్పుడు ఎట్లా కూర్చున్నదో అట్లాగే కూర్చుని పత్రికలో ఉన్న బొమ్మలను చూస్తూ పుటలు తిరుగవేస్తున్నది.

ఆయన తన కుర్చీలో కూర్చుంటూ-"ఎవరో తెలిసిన ఆయనే వచ్చాడు. ఎవరూ తెలియని ఊళ్లో నాలుగు రోజులుండిపోదామని నేను ఇంతదూరం వచ్చాను. లేకపోతే మీరు చెప్పినట్టుగా ఏ డార్జిలింగో వెళ్లకపోయినానా?" అన్నాడు. తరువాత ఇద్దరూ లేచారు. తనకు కావలసిన బట్టలేవయినా పెట్టెలో నుంచి తీసుకుంటే పేపర్లు ఆమె కంటబడతాయేమోనని-అలాగే చెప్పులతో బయలుదేరి గది తాళం భద్రంగా వేశాడు.

ఆమె మొదట ఆయనతో అన్నట్లుగాను-ఆయన తనకు కూడా ఏదో పని ఉన్నదన్నట్లుగాను బజారువైపు వెళ్లటం ఇద్దరూ మరచినట్లున్నారు. తిన్నగా పార్కు వైపు నడచి-రెస్టారెంటులోకి వెళ్లి చెరి ఒక డ్రింకు తీసుకున్నారు.

లానులో కూర్చుని అయిదు నిమిషాలపాటు పిచ్చాపాటి మాట్లాడుకున్నారు. ఊలు స్వెట్టరు కుట్టటము దాని పొందిక-అందము-ఆమెకున్న శ్రద్ధను అభిరుచులను పొగడటము డాక్టరు స్వామి మరవలేదు. చీకటి పడేవరకూ ఉండి తరువాతఇద్దరూ లేచారు. దారి పొడుగునా సినిమాలను గురించీ డ్యాన్సులను గురించీ ఏవేవో మాట్లాడుకున్నారు, నవ్వుకున్నారు. చివరకు ఇద్దరూ చీలిపోయే సమయంవచ్చింది. "రేపు కలుసుకుందామని" ఇద్దరూ ఒక్కసారే బయటికి అనేశారు ఉత్సాహము కొద్దీ. ఆ మరునాడు డాక్టరు స్వామి మామూలుగా కాకుండా భోజనానికి ముందూ తరువాత కూడా ఇనుమడించిన ఉత్సాహముతో పేపర్లు దిద్దగలిగాడు.

ఆ సాయంకాలము ఆమె వచ్చేవరకూ తన పని చూసుకుని తరువాత బయటికి బయలుదేరి పోవాలని ఆయన సంకల్పించుకున్నాడు.

సాయంకాలము అయిదు....ఆరు గంటలు కూడా దాటిపోతున్నాయి. ఆమె జాడేలేదు. పాపం డాక్టరు స్వామికి చీమ చిటుక్కుమన్నా ఆమె వచ్చినట్లే లని పిస్తూ వచ్చింది.

చీకటి పడిన తరువాత ఆయన పేపర్లన్నిటినీ సర్దుకొని గది తలుపులు వేసి-పార్కు వైపు బయలుదేరి వెళ్లాడు ఆమె కోసం దారి పొడుగునా ఆయన కళ్లు వెదకుతూనే ఉన్నాయి. ఆమె రాని లోపము ఎంతైనా కనబడ్డదాయనకు, మనసంతా అదొక మాదిరిగా అయిపోయింది. అవ్యక్తమయిన బాధ ఏదో ఆయనను బాధించటము మొదలుపెట్టింది.

రాత్రి తొమ్మిది గంటలవరకూ లానులో తిరిగి-చివరకు గది చేరుకున్నాడు. ఆ రాత్రి ఆయనకు ఏ పనీ చేయబుద్ధి పుట్టలేదు.

ఆ మరునాడు మూడవనాడూ కూడా ఆమె కనబడలేదు. ఆయనకు మొదటి రోజున కలిగిన బాధ తరువాత కలుగలేదు. ఆమెను చూడగానే తనకు తెలిసిన వారెవరికంటా పడలేదు. ఇంకా నయము! కనుక దానిని అంతటితో విస్మరిద్దామనుకున్నాడు

డాక్టరు స్వామి స్వస్థానం చేరుకున్న తరువాత ఒకనాడు సినెమాకు వెళ్లాడు. విరామ సమయాన వెలిగిన దీపాల వెలుగులో కూనూరులో కనబడిన ఆయన-ఆమె ఒక్క వరుసలోనే ఇద్దరు మగపిల్లల మధ్య కనబడ్డారు. ఆయన తన కుటుంబాన్ని డాక్టరు స్వామికి పరిచయం చేశాడు. డాక్టరు స్వామి పూర్వాపరాలను జ్ఞప్తికి తెచ్చుకునే లోపల దీపాలు ఆరిపోయాయి.

ఆమె.... ఆయన భార్య?

ఆ పిల్లలు ఎప్పుడో ఒకసారి తన దగ్గరికి వస్తే బాగా చీవాట్లు వేసి పంపిన జ్ఞాపకమున్నది డాక్టరు స్వామికి. తాను నిర్మొగమాటస్తుడని తెలిసి ఆ దంపతులు చేసిన పనా ఇది! తాను పడిన జాగ్రత్త కొద్దీ సంశయము కలుగలేదు గాని-ఇప్పుడాలోచించి చూస్తే రెండు పేపర్లలో ప్రతి సమాధానానికీ + వేసి మార్కులు కలిపింది తాను కాదు! ఆ నాడు ఆ దంపతులిద్దరూ ఒకరు గదిలో-ఒకరు బయటా ఉండి ఎంత నాటకమాడారు

అదంతా తలచుకున్న తరువాత ఆయనకు ఒక్క నిమిషమయినా అక్కడ ఉండబుద్ధి పుట్టలేదు. చివాలున లేచి థియేటరు వదలి వెళ్లిపోయాడు-పెదవులు విరుచుకుంటూ.

(ఆంధ్ర దిన పత్రిక)



# పిలవని పేరంటం

నడిచి నడిచి అలసిపోయింది నీలవేణి. నడక తేలిపోతున్నది. దాహముతో నాలుక పిడచకట్టుకుపోతుంది. నీరసం కొద్దీ కళ్లు తిరిగుతున్నాయి. ఇంకొక మైలు నడిస్తే ఇల్లు వస్తుంది. పళ్లు బిగబట్టి అడుగులు వేస్తున్నది.

ఇదంతా శారీరకమైన బాధ-గాని ఆమె మనసు ఇప్పుడు సంతోషంగా ఉంది. ఇంతకు ముందు ఎప్పుడూ కలగని సంతోషం.

తనకొక కంపెనీలో చిన్న ఉద్యోగం దొరికింది. మొదట రెండు వందలు ఇస్తామన్నారు. క్రమేణా పెంచుతామన్నారు. గాలిలో ధూళితోపాటు ఎగురుతున్న కాగితమ్ముక్కలాంటి బ్రతుకు బ్రతకాలేమోనని పది రోజులనుండీ దిగులుపడిపోతున్నది.

దిగులు కాక మరేముంది? కన్యగా తండ్రి దగ్గర సవతి తల్లి కంటికి మెరమెరగా బ్రతికింది. భార్యగా మూర్తి దగ్గర కాలి క్రింద చెప్పుగా బ్రతికింది. ఐదు సంవత్సరాలనుంచీ ఒళ్లు తనది కాదనుకుంది. కండెలు కట్టిన దేహాన్ని చేత్తో రాసుకుంటూ గోడకు తలానించి పిచ్చి చూపులు చూస్తూ కూర్చునేది. తనది పెద్ద తలకట్టు - చేతికి అరపకుండా ఉండేది. అటువంటి జుట్టు నాలుగు పీచులయింది. జుట్టు పట్టుకుని లాగితే అతడి చేతికి గుప్పెడు వెంట్రుకలు వచ్చేవి.

తన తల్లి నగలూ చీరెలు ఇచ్చి ఐదు వేల రూపాయల కట్నమిప్పించి తమ్ముడితో ఈ పెళ్లి చేసి సవతి తల్లి వదలించుకుంది. చిన్న ఉద్యోగంలో ఉన్న తన తమ్ముడిని ఇలా ఒక ఇంటివాడిని చేసింది.

కాని-తరువాత నిత్యం జరిగే దినచర్య సంగతి ఎవరూ పట్టించుకోలేదు. తన తండ్రికే సంగతీ తెలియదు-కూతురికి పెళ్లయిందన్న తృప్తి తప్ప.

యాంత్రికమైన జీవితం-రసవిహీనమయిన దాంపత్యం-పశువులకు మాటలు రావు; తమకు వచ్చు- ఇదొక్కటే భేదం.

ఈ ఐదేళ్ల జీవితంలో అతడు నవ్వి ఎరుగడు. తనను నవ్వించి ఎరుగడు.

నవ్వటమే మర్చిపోయింది తను.

తన జీతం చిల్లర ఖర్చుగా వాడుకునేవాడు. భోజనంలోకి ఏదీ తక్కువ కాకూడదు. డబ్బులేకపోయినా అన్నీ ఆమె అమర్చాలి. అమర్చకపోతే అతడి చేతి ధాటీకి ఆగాలి.

ఇదేనా జీవితం?

అందరూ ఇట్లాగే ఉంటారా?

ఏం చెయ్యాలో తెలియదు. దారీ తెన్నూ తెలియని అయోమయ స్థితి.

అదొక హఠాత్‌సంఘటన. సవతితల్లి. చెప్పిందో లేక తన తండ్రి నెల నెలకు డబ్బు పంపుతున్నాడో తెలియదు. ఇంటికి సామాను తీసుకురావటం మొదలు పెట్టాడు మూర్తి.

ఇంట్లో మాటా పలుకూలేని పడక-భోజనం.

రోజులు గడుపుతున్నది. గుడ్డిలో మెల్ల అనుకునే జీవితము.

కాని-తరువాత అలాగూ జీవితం గడవలేదు. పది రోజులనాడు భోజనం చేస్తూ అన్నాడు "మనం విడిపోదాం. ఇంక నీ దారి నీది-నా దారి నాది. నీ ఇష్టం వచ్చిన చోటికి నీవు వెళ్లు నా అభ్యంతరం ఉండదు."

'విడిపోవటమా?'

'ఎందుకని?' ప్రశ్నించాలని కంఠం తాపత్రయపడ్డది. కాని పెదవులు సహకరించలేదు.

అతడి వంక దీర్ఘంగా చూసింది. ఇంకా ఏమయినా చెబుతాడేమోనని.

చెప్పలేదు. భోజనం కాగానే ఒక కాగితం మీద "ఇష్టపూర్వకంగా ఇద్దరం విడిపోతున్నాము" అని వ్రాసి అతడు సంతకంచేసి తననూ చెయ్యమన్నాడు.

చేసినంతమాత్రాన పెద్ద తేడా ఏముంటుంది? వెంటనే సంతకం చేసింది.

అంతే. ఆ కాగితము సూట్ కేసులో పెట్టుకొని వెళ్ళిపోయాడు.

తనకు తండ్రి యిచ్చిన నగలన్నీ హరించిపోయాయి. పెట్టె ఖాళీగా ఉంది. ఖాళీ పొట్టతో తను మిగిలింది.

"ఇప్పుడేం చెయ్యాలి?" ఈ ప్రశ్నను పదే పదే వేసుకుంది.

ఆమె ఉంటున్న ఇల్లు నాలుగవ తరగతి ఉద్యోగుల కొరకు ప్రభుత్వము నిర్మించిన బ్లాక్సులో ఒకటి. ఒకే ఒక గది–ముందూ వెనుక అన్ని గదుల ముందరగా కట్టిన పెద్ద వరండా. వాటిలో ఉన్న వాళ్ళంతా ప్రభుత్వోద్యోగులు తమ పేరు మీద తీసుకుని ఇతరులకు అద్దెలకిచ్చారు యజమానులు. దాని అద్దె కూడా తను చెల్లించుకోవాలి ఇప్పుడు.

ఆ బ్లాక్సులో ఉన్న వాళ్ళతో ఆమె కంతగా పరిచయం లేదు. వస్తూ పోతూ ఎప్పుడయినా పలకరింపులేగాని వాళ్ళ పేర్లయినా సరిగా తెలియవు. గది ముందర నిలబడ్డది ఎవరయినా వస్తారేమోనని.

ముత్తమ్మ శివమ్మ ఇద్దరూ తలలు దువ్వుకుని బొట్లు పెట్టుకుని టిఫిన్ కారియర్లతో బయలుదేరారు. వాళ్ళది ఆ లైనులో చివరి బ్లాకు. వాళ్ళ మాటల్లో ఒకరి పేరు ముత్తమ్మ అని గ్రహించి "మీకు వేళయిందా?" అంటూ నవ్వుతూ పలకరించింది నీలవేణి.

"ఈ పొద్దు కొంచెం తొందరగా వెళ్ళాలి. యూనియను మీటింగు" అన్నది ముత్తమ్మ అడుగులు వేస్తూ.

"మీ ఫాక్టరీలో నాకేదయినా పని ఇప్పించగలవా ముత్తమ్మా?"

చెంపలమీద ఎండిన కన్నీటి చారికలు–చెదరిన బొట్టు– రేగిన తలవెంట్రుకలు– దైర్యంతో అర్థించే కళ్లూ–నీలవేణిని చూసి "ఏమ్మా. ఒంట్లో బాగుందా? అలా ఉన్నావు?" అడిగింది ముత్తమ్మ.

శుష్కహాసమొకటి ఆమె పెదవులమీద నిలిచింది.

"ఏమయినా చదువుకున్నావా?" తను పెద్దది కనుక ఏకవచనంలో అడిగింది ముత్తమ్మ.

"మెట్రిక్ ప్యాసయినాను"

"ఇవాళ అడిగి చెబుతాను. పొద్దెక్కింది. కాఫీ తాగు. స్నానంచేసి తల దువ్వుకో."

ఆమె మాటల్లోని ఆప్యాయతకు కళ్లు చెమర్చాయి నీలవేణికి. అలాగే అన్నట్టు తల ఊపింది.

నీలవేణి పరిస్థితి ముత్తమ్మకు అర్థమయిందో-లేదో. కాని ఉద్యోగం ఇప్పించింది. ఉద్యోగంలో చేరిననాడు ముత్తమ్మ చేతులు రెండూ పట్టుకుని తలకానించుకుంటూ కృతజ్ఞతలు తెలిపింది.

రాత్రిళ్ళు పడుకోబోయేటప్పుడు నీలవేణికి తన గత జీవితం జ్ఞాపకం వచ్చేది. మూర్తి కొట్టటానికి చెయ్యెత్తుతున్నట్టు కనబడేవాడు. సవతితల్లి రంగమ్మ పెట్టిన బాధలు స్మృతి పథాన మెదిలేవి. అప్పుడు కళ్లు తెరిచి చుట్టూ చూసేది.

స్మృతులు- తనను నిలువునా చీల్చిన స్మృతు లవి.

మొదటినెల జీతం అందుకున్ననాడు ముత్తమ్మకొక కొత్తచీరె రెవికల బట్ట కొన్నది. చేతిలోపెట్టి దణ్ణం పెట్టింది

ముత్తమ్మకు గుండె పొంగింది. తను మాట సహాయమే చేసింది. కాని అదే నీలమణికి గొప్ప సహాయంగా పరిణమించింది. నీలవేణికి ముత్తమ్మే ఆనాటి నుంచీ పెద్ద దిక్కయింది. నెల కొకసారి తనతోపాటు సరుకులు కొనిపిస్తుంది. ఆ యిళ్లు ప్రభుత్వంవారు అమ్ముతామన్నప్పుడు వాయిదాల వంతున డబ్బు చెల్లించేటట్టుగా మాట్లాడింది. తనూ తన చెల్లెలూ ఏమేమి ఏర్పాట్లూ వసతులూ కల్పించుకున్నారో వాటిని నీలవేణికి కూడా కల్పిస్తున్నది.

నీలవేణి ఇప్పుడు మూర్తి పోషణలో ఉన్నట్టు లేదు. నూకలన్నము తిన్నప్పటికీ శుష్కించిన చెంపలలో రక్తమాంసాలు కనబడుతున్నాయి. నిస్పృహ తగ్గి కొద్దిగా ఉత్సాహం పుట్టుకొస్తోంది. పడుకోటానికి జంపఖానా-కప్పుకోటానికొక దుప్పటి-తలకిందకొక దిండూ కొనుక్కున్నది. ఫాక్టరీకి వెళ్ళటానికి నుమారైన రెండు చీరెలు కొనుక్కుని జాకెట్లు కుట్టించుకుంది.

ఆమె కిప్పుడు ఒంటినిండా బట్ట-కడుపునిండా ఆహారం- తలదాచుకోటానికింత నీడ- కంటినిండా నిద్ర-మనిషికి ముఖ్యంగా కావలసినవి అమరాయి- తన స్వశక్తితో అమర్చుకున్నది.

ఆ ముగ్గురు స్త్రీలకూ వయసులో తరతమ భేదాలున్నట్లే ఉద్యోగాలలో రాబడిలో కూడా ఉన్నాయి. అయినా వికసించిన ముఖాలతో ఫాక్టరీకి కలిసి వెళ్ళి మాట్లాడుకుంటూ తిరిగి వస్తారు.

ప్రాథమికావసరాలు తీరినా నీలవేణి ముఖాన్ని పది నిమిషాలపాటు ఎవరయినా చూడగలిగితే దిగులులాంటి భావమేదో గోచరించక మానదు.

రాత్రిళ్ళు తీరికగా ఆలోచనలు గుంపులు గుంపులుగా వచ్చి మీద పడతాయి.

తను మామూలు కాగితమ్మీద సంతకం పెట్టగానే విడాకులయిపోతాయా? దానికీ కొన్ని నిబంధనలు ఉన్నాయి కదా అనిపిస్తుంది.

ఆ విడాకులు చెల్లవని కోర్టుకుపోవచ్చు కాని దానివల్ల కలిగే ప్రయోజనం ఏమిటి? తనను మనిషిగా చూడని మూర్తిని ఏ ఆశతో ఇంకా పట్టుకుని వ్రేలాడుతుంది?

పిల్లలను చూసినా, నవ్వుతూ త్రుళ్ళుతూ తిరిగే దంపతులను చూసినా ఆమె మనసు క్రుంగిపోతుంది. తను జీవితంలో పోగొట్టుకున్నదేమిటో గుండెను మీటుతుంది.

కాని - తన మనసు ఆ విషయంలో జడప్రకృతి దాల్చటానికి ప్రయత్నిస్తుంది. ఆ గుండె బరువు ముఖమ్మీద విషాదరేఖలుగా మార్తాయి.

రోజులు దొర్లిపోతున్నాయి శిశిర వసంతాలు తిరిగి తిరిగి వస్తున్నాయి- పోతున్నాయి.

ఇల్లు నీలవేణి స్వంతమయింది. ముత్తమ్మ బలవంతమ్మీద ఒక మంచం ఒక కుర్చీ బల్ల కొన్నది. మెడలో నూలుతాడు తీసేసి సన్నటి బంగారు గొలుసు చేయించుకున్నది. అదేదో సినిమాలో లాగ పుస్తెలు తీయబుద్ధి కాలేదు. ఫ్యాక్టరీలో కొందరు ప్రోత్సహించారు. ప్రయివేటుగా ఏదయినా పరీక్షకు చదవమని.

అదీ మంచి సలహాయే అనుకుంది మనసులో.

పగలంతా ఫ్యాక్టరీలో గడిచినా రాత్రిళ్లు గడవటం కష్టంగా ఉన్న తనకు ఆలాగయినా పొద్దు పోతుందనిపించింది. వెంటనే పుస్తకాలుకొనుక్కుని చదవటం మొదలు పెట్టి తిరిగి విద్యార్థిని అయింది.

తీరా పరీక్షల ముందు ముత్తమ్మకు జబ్బు చేసింది. హాస్పిటల్లో చేరింది.

తల్లిలాంటి ముత్తమ్మకు తను సహాయంచేసి తీరాలనిపించింది. పదిహేను రోజులు ఆమె దగ్గరుండి రాత్రింబగళ్ళు కనిపెట్టుకుని సేవ చేసింది. ఆమె యింటికి వచ్చిన మరునాడే పరీక్షలు.

'ఈ పరీక్ష ముత్తమ్మ కంటె ఎక్కువా? పోతే పోయింది పరీక్ష' అనిపించింది. అందరూ "ఏదో ఒకటి వ్రాసెయ్యి ఇప్పుడు పరీక్షపోతే పోనీ–మళ్లీ వ్రాయవచ్చు" అన్నారు.

అందరూ తన శ్రేయోభిలాషులే. తన మంచినికోరి ఏవో సలహాలు ఇస్తూనే ఉంటారు. ఈ దారిన కూడా నడిచి చూద్దామనుకుంది నీలవేణి.

అలా అందరి మాటా విని పరీక్షలు వ్రాయటం మొదలుపెట్టింది. ఒక్కొక్క సంవత్సరం గడుస్తుంటే తనకు మనసులో భారం తగ్గటం మొదలుపెట్టింది.

అందరూ "ఓ! నీలవేణీ. బి ఏ. ప్యాసయ్యావు" అన్నారు.

ఫాక్టరీలో అందరి అభినందనలూ అందుకని ఇంటికి వస్తుంటే మనసు పొంగి పొరలి పోవటం మొదలు పెట్టింది. దారిలోనే మిఠాయి కొన్నది. రాగానే ముత్తమ్మ పాదాల దగ్గర పెట్టింది.

ముత్తమ్మకు ఒళ్లు పులకరించింది. "ఈ పిల్ల పిచ్చిగాని–పరీక్ష పాసవటానికి నేనేం సహాయం చేశాను? సహజంగా తెలివిగలది కావటంచేత చదివింది. అన్నిటికీ నీకు నేనున్నానని వీపు మీద చెయ్యివెయ్యటంవల్ల ధైర్యంగా చదివింది. పరీక్షలో నెగ్గింది. జరిగింది ఇంతే" అనుకుంటుంది.

కాని–నీలవేణి ఫస్టు క్లాసు తెచ్చుకుంది. అప్పుడనుకుంది–తనవంటి దాన్ని దీవించే దేవతలు కూడా ఉన్నారని.

ఓపిక లేకపోయినా ముత్తమ్మ వచ్చి నీలవేణి గదిలో మిఠాయి తిని మంచినీళ్లు తాగింది

ఆమె మనసు అంత సంతోషాన్ని పట్టలేకపోయింది.

ఆ రాత్రి నిద్రపట్టలేదు నీలవేణికి. అంతకు నాలుగు నెలల క్రిందట ఆమె జీతము ఇనుమడించింది. ఇవి రెండూ కలిసి ఊపిరాడకుండా ఆమెను ఊపేస్తున్నాయి.

కలత నిద్రలో రాత్రి ఒంటిగంటవేళ త్రుళ్లిపడి లేచింది.

ఎవరో తలుపులు తెగ బాదేస్తున్నారు. ఇటువంటిది అదివరకు ఎప్పుడూ జరగలేదు.

ఎవరయి ఉంటాడు? ముత్తమ్మయితే "అమ్మలూ!" అని పిలుస్తుంది.

ఏ తాగుబోతో అయితే?

మళ్లీ దబ దబ బాదిన చప్పుడు.

లేచి బట్టలు సవరించుకుని తటపటాయిస్తూ తలుపు తెరిచింది.

ఒక ఆకారం-ఎవరయినదీ ఆమె బాగా చూడకముందే దూసుకుంటూ లోపలికి వచ్చింది.

ఆమె వెనక్కు తిరిగి చూసి దిగ్భ్రాంతురాలయిపోయింది.

పదిహేనేళ్ల మాట. అయినా గుర్తు పట్టింది.

మూర్తి.

అతడి ముఖం కొంచెము డస్సినట్టుంది. అశాంతి ముఖమ్మీద కొట్టవచ్చినట్టుగా కనబడుతోంది.

ఆమె మాట్లాడటం మరిచిపోయి చూస్తోంది అతడినే.

వాన జల్లులో తడిసి వచ్చినట్టున్నాడు. జేబులో నుంచి రుమాలు తీసుకుని తల తుడుచుకుంటూ ఆమెను ఓరగా చూశాడు.

కొంతసేపటికి ఆమె తేరుకుని "ఆకలిగా ఉన్నట్టున్నారు. రెండు చపాతీలు తింటారా?" అడిగింది తన గొంతు కొత్తగా తనకే ధ్వనించింది.

"దాంట్లోకేముంది?" చటుక్కున అని నాలుక కరచుకున్నాడు.

"మీ కిష్టమేగా వేరుసెనగ పలుకుల పచ్చడి?" ఆమె అడిగిన తీరు అతడిని పులకరింప చేసింది.

అతడి ముఖం ప్రఫుల్లమయింది. ఆ పక్కగా ఉన్న చిన్న చాప ఒకటి పరచుకొని కూర్చున్నాడు. ఆమె చపాతీలమీద పచ్చడివేసి ప్లేటు అతడి ముందుంచింది.

అతడు తలవంచుకుని తింటూ మధ్యమధ్య ఆమె వైపు చూస్తున్నాడు.

అతడు తలదించుకున్నప్పుడు ఆమె అతడిని పరిశీలనగా చూస్తున్నది. కొంచెము చిక్కినట్టు కనబడ్డాడు. అతడి అలవాట్లను కనిపెట్టి ఆదరంగా ఎవర యినా చూశారో లేదో? ఆమె మనసు గిలగిల కొట్టుకుంది.

అతడు ఆ రెండు చపాతీలూ తిని సంతృప్తిగా లేచాడు ఆమె మంచినీళ్ళు ఇవ్వకముందే కూజాలోనుంచి రెండు గ్లాసులు పోసుకుని తాగాడు కిటికీ దగ్గరగా నిలబడి జేబులోనుంచి సిగరెట్ తీసి వెలిగించాడు.

కొంత ప్రశాంతత లభించిన తరువాత "నీలూ నీవింకా ఇట్లాగే ఉన్నావా?" అడిగాడు ఆమెకేసి తలతిప్పి.

ఏం చెయ్యాలో తోచక అలాగే నిలబడిపోయిన నీలవేణి పెదవులను తడుపుకుంటూ.

"ఇట్లాగే అంటే?" అన్నది.

"అదే-అదే-నేను వెళ్ళినప్పటిలా........"

నీలవేణి కేం మాట్లాడాలో తెలియటంలేదు. ఇంతకు ముందు అతడెప్పుడూ ఆమె ముఖంలోకి చూసి మాట్లాడేవాడు. ఇప్పుడు సూటిగా కళ్ళలోకి చూస్తు న్నాడు

ఆమె మంత్రముగ్ధలా నిలబడిపోయింది.

"నీలూ! నాకిష్టమైన వాటిని ఇంకా జ్ఞాపకం ఉంచుకున్నావా?" అతడి కళ్లు దేనికో ఆశిస్తున్నాయి. ఉండి ఉండి నవ్వుతున్నాయి.

ఆమె ఎంత నిగ్రహించుకున్నా ఆగక సిగ్గు దొంతరలు వచ్చి మీదపడ్డాయి. చిరునవ్వొకటి పెదవుల మీద లాస్యం చేసింది.

ఆ దృశ్యం మనోహరంగా అనిపించటము కూడా అతడికి ఇదే మొదటి సారి.

చేతులు చాచి ఆమెను ఎదకు చేర్చుకున్నాడు. "నీలూ! ఎన్ని దేశాలు తిరిగినా ఎన్ని ఉద్యోగాలు చేసినా నాకు శాంతి లభించలేదు. నాకు ఏదో పోగొట్టు కున్నట్టు బాధగా ఉండేది. రాత్రే నా మనసుకు తట్టింది-నన్ను పూర్తిగా తెలుసు కున్న ఈ నీలూ దగ్గరే శాంతి లభిస్తుందని. వెంటనే సరుగెత్తుకుంటూ వానలో వచ్చాను" ఆమె తలను చేత్తో నిమురుతూ మరీ మరీ గుండెకు హత్తుకుంటున్నాడు.

నీలవేణికి లోకంలో ఉన్న చీకటంతా విడిపోయి ప్రకాశవంతమయినట్టుగా అయినా స్త్రీజన సహజమైన కినుకతో "అప్పుడలా విడిచివెళ్ళారు. మరి ......" అంది బుంగమూతితో.

అతడామె నోటిని తన పెదవులతో మూసేశాడు, కొంతసేపటికి "అప్పు డలా వెళ్ళటంవల్లనే కదా ఇప్పుడిలా రావాలనిపించింది? చీకట్లో వెళ్ళాను-వెలు గులో వచ్చాను" ఆమెను మరింత గట్టిగా బంధించాడు చేతులలో.

ఆమె అతడిని విడిపించుకుని "ఇది వెలుగా!" అంది ఓరగా చూస్తూ.

"వెలుగు అంటే బయటే ఉండక్కర్లేదు. మనసునిండా ఉండాలి. ఆ వెలుగులోనే నిన్ను వెతుక్కుంటూ వచ్చానా లేదా?" ఆమె చుబుకం పైకెత్తి కళ్ళల్లోకి చూశాడు.

"నా గుండెలోకి పిలువని పేరంటంలా ఒక మహాశక్తి ప్రవేశించింది. అదే నీ దగ్గరికి చేర్పించింది. చివరకు నేనిన్ని మాటలు మాట్లాడుతుంటే నీ వొక్క మాటయినా మాట్లాడవేం? మౌనవ్రతమా?" ముక్కు పట్టుకుని ఊపాడు.

"కాదు కాదు. ఆ శక్తే నన్ను కూడా ఆవహిస్తున్నట్లుగా ఉంది. లేకపోతే మీ ఎదురుగా ఎప్పుడయినా ఇట్లా మాట్లాడేనా?" అతడి గుండెలో తలదాచుకుంది.

ఆ రాత్రంతా అతడు మాట్లాడుతూనే ఉన్నాడు-ఆమె దగ్గర్నుంచి వెళ్లిన తరువాత తనకు కలిగిన అశాంతిని గురించీ-తను పోగొట్టుకున్నదేమిటో అతడు తిరిగి పొందిన దానిని గురించీ.

ఆ సమయంలో ఎందుకో ఆమె కళ్ళలో తడి కనబడింది అతడికి.

''పిచ్చినీలా! ఇంకా నీవు గతం మర్చిపోలేదా!''

''నిజంగా మనిద్దరం ఇప్పుడే పెళ్లిచేసుకున్నట్టుగా ఉంది నాకు. పెళ్లి ఒకరు చేసేది కాదు. మన మనసులు చేసుకోవాలి. ఆలస్యంగా అయినా మనమిప్పుడు చేసుకుంటున్నాము. ముహూర్తం చూసుకునే వచ్చాను. ఏమిటీ నీ సందేహం? దానికీ ఒక వయసుందనా?'' ఆమెను రెండు చేతులతో పట్టి ఊపాడు.

''లేదు లేదు. బ్రతుకులో అది ఎప్పుడు వచ్చినా సుస్వాగతమే.''

అతడు తన పళ్లన్నీ బయటపడేటట్టుగా నవ్వుతూ ''ఈ నీలు నన్ను ఎన్ని జన్మలకయినా వదలిపెట్టదు'' అ సన్నటి ఆమె చేతి వేళ్లను పెదవుల కానించు కున్నాడు.

''పిలువని పేరంటంలా వచ్చిన అతిథిని అపురూపంగా చూసుకోవాలి. నిత్యనూతనంగా కొలవాలి. లేకపోతే ఉండదు.''

నీలు నిర్వచనంచూపి వెక్కిరిస్తూ తల ఊపాడు.

(ఆలిండియా రేడియో సౌజన్యంతో)



# వడగాడ్పు

అబ్దుల్ ఖాదర్ బుసలు కొడుతూ ఆ సందు మొదట్లో తన స్నేహితులతో నిలబడ్డాడు. అందరి చేతుల్లో బారెడు బారెడు కర్రలున్నాయి. మనిషి అలికిడయితే చాలు కర్రలు లేపుతూ తల పగిలేటట్టు కొట్టటానికి సిద్ధంగా ఉన్నారు.

రాత్రి పన్నెండు గంటలు దాటింది.

ఎవరూ సందులో అడుగుపెట్టలేదు.

అబ్దుల్ ఖాదర్ స్నేహితులు తమ ప్రయత్నమంతా వృథా అయిందని అసహనంతో కాలు కాలిన పిల్లుల మాదిరిగా అటూ ఇటూ తిరుగుతున్నారు.

ఒంటిగంట దాటిన తరువాత ఒక్కొక్కళ్లే కళ్లు నులుపుకుంటూ నిద్రలోకి జారుకున్నారు.

ఆ మరునాడూ మూడోనాడూ కూడా అలాగే జరిగింది.

''మన ముందర వాళ్లు ఆగలేరు.'' క్రాపు వెనక్కు తోసుకుంటూ అన్నాడు అబ్దుల్ ఖాదర్.

''వాళ్లను తుక్కు తుక్కు చేశాము ఆ రోజు. వాళ్లవైపు నిలబడిన వాళ్లంతా దవాఖానాలో ఉన్నారు'' బీడీ వెలిగించాడు వహీద్.

''ఒకరికి చెయ్యి మెలిక పెట్టేశాను. ఆ చెయ్యి ఇంక రాదు'' అన్నాడు ఖాదర్ మిత్రుడొకడు.

''ఇళ్లన్నీ కాలిపోయాయి. ఇప్పు డావాడలో ఎవరూ లేరు'' అన్నాడు మరొక మిత్రుడు.

''నిజమా ? అక్కడెవరూ లేరా ? అన్ని ఇళ్లు కాలిపోయాయా?'' అబ్దుల్ ఖాదర్ ఆశ్చర్యపడ్డాడు.

"మిగిలింది బూడిదా మొండిగోడలా" తన సాహస కృత్యాలను వర్ణించి వర్ణించి చెప్పాడు మిత్రుడు.

"గుడ్డ ఉయ్యాలలో పడుకున్న పిల్లలు ఆ వేడికి నోరు తెరిచారు. అంతే. బలే కసి తీర్చుకున్నాంలే హ్హా హ్హా హ్హా" పడిపడి నవ్వాడు రహీమ్.

ఆ మహానగరంలో మారుమూలల్లో సందులూ గొందులూ ఎక్కువ. కొన్ని సందుల్లోకి రిక్షాలు పోలేవు. కొన్ని సందుల్లోకి వెళ్లినమనిషి వెనక్కు తిరగాల్సిందే కాని ముందుకు పోలేడు. మనిషి వెళ్లేదారి-లోపల అంగణం-చుట్టూ ఇళ్లు అంతే. అందరూ ఇళ్ల ముందర పడుకునో-కూర్చునో ఉంటారు. కొందరు చీట్లాడుతూ ఉంటారు. ప్రతి యింటి గడప ముందూ గోనె పట్టా కట్టి ఉంటుంది. బజారు పంపు నుంచి మగవాళ్లు నీళ్లు తెచ్చి లోపల కుండల్లో పోస్తారు. కొన్ని ఇళ్లల్లో ఆడవాళ్లు ఏవో చేతిపనులు చేస్తారు. మగవాళ్లు కొందరు దుకాణాలల్లోను విడిగానూ పనులు చెయ్యటానికి బైటికి వెళ్తారు.

ఏదో ఒక కారణంచేత ఆ ఇరుగు పొరుగు సందుల్లో నివసించే రెండు తెగలవారికీ అప్పుడప్పుడు తగాదా వస్తుంది. వెంటనే లోపల ఉన్న బల్లేలు బాడిసలూ లారీలు చక్రాలూ బయటికి తీస్తారు. కొందరికి దెబ్బలు తగుల్తాయి. కొందరికి కాళ్లూ చేతులూ విరుగుతాయి. ఒకరిద్దరి ప్రాణాలుపోతాయి. ప్రభుత్వము వెంటనే కర్ఫ్యూ పెడుతుంది. ఇటువంటి సంఘటనలు వివిధ జాతులూ మతాలూ ఉన్న ఆ నగరంలో నిత్యకృత్యాలు.

ఆ మొహల్లాలో వీటికి నాయకుడు అబ్దుల్ ఖాదర్. అతడికి సైదోడుగా ఏభయిమంది వరకూ సైన్యము.

ఎదురు చూసినప్పుడు ఇటువంటి సంఘటనలు జరగవు అనుకోకుండానే మాట మీద మాట పెరిగి కక్షలూ కార్పణ్యాలూ బయలుదేరుతూ ఉంటాయి. అలాగే ఒకనాడు-ఏదో చిన్నమాట "దారి కడ్డం లే" అన్న మాటమీద "నేను జరగను. ఏం చేస్తావో చెయ్యి" అనటంతో అరంభమయి-ఇద్దరల్లా నలుగురయి పది మంది అయి-ఆ వాడంతా పోగయి కర్రలెత్తిన సంఘటనతో తగాదా వారంరోజులపాటు సాగింది. పర్యవసానంగా ఒక గుంపులో నలుగురికి దెబ్బలు తగిలాయి. ఒకరు మరణించారు. మరొక గుంపులో ఇళ్లు కాలాయి. పసిబిడ్డలిద్దరు మరణించారు.

సరిగ్గా ఈ సంఘటన జరిగిన తరువాత-మూడో నాడు-దీప దీపాలవేళ-పాతికేళ్ల యువకుడొకడు సందుముందరగా పోవటం తటస్థించింది. అతడికి అబ్దుల్ ఖాదర్‌తో పని ఉంది. అతడా రోజు పగటి వేళకే రావాలనుకున్నాడు. కాని చేతిలో ఉన్న పని తెమల్లేదు. ఇరవై మైళ్ల దూరంలోఉన్న గ్రామాన్నుంచి గంట క్రిందట తిరిగి వచ్చాడు. రాగానే అబ్దుల్ ఖాదర్ మాట జ్ఞాపకానికి వచ్చింది.

అబ్దుల్ ఖాదర్ ఆవేళప్పుడు ఇంట్లో ఉంటాడో లేదో తెలయదతనికి. అసలింతవరకూ అతడు అబ్దుల్ ఖాదర్ ఇంటికి వెళ్లలేదు. ఆ ప్రాంతంకూడా అతడికి సరిగా తెలియదు. అబ్దుల్ ఖాదరే ఎప్పుడో చెప్పాడు-తన యింటి గుర్తులు చెప్పి ఎన్నిసార్లో రమ్మని పిలిచాడు స్నేహితుడిని ఆప్యాయంగా.

''నేనెన్నిసార్లు వచ్చాను? నీవొక్కసారి రావటానికి బెట్టు చేస్తావేం?'' అంటూ తగవులాడుతూ పిలిచాడు.

''వస్తాలే'' అంటూ వాయిదాలు వేశాడతడు. అతడికి ఇప్పుడు రావటానికి వీలు చిక్కింది.

ఆ పిలుపయినా మామూలుగా పిలిస్తే మళ్ళీ వాయిదావేసే వాడేమో? కాని-చాలా రోజుల తరువాత అబ్దుల్ ఖాదర్‌కు ఒక పాప పుట్టింది. నలభై రోజులు దాటింది. ఆ బిడ్డను చూడటానికి రమ్మని పిలిచాడు. తానొక్కడయినా వెళ్లాలని అదీకాక అతడి భార్య రామ్మోహన్ తల్లిని ఇంటికి తీసుకురమ్మని బాధిస్తోంది. ఇక వాయిదా వెయ్యటానికి వీలుకాకపోయిందతడికి

ఆ మధ్య-ఇద్దరూ పదేళ్ళ తరువాత విచిత్రంగా ఒక హోటల్లో కలుసుకున్నారు ఒక టేబుల్ దగ్గర.

'అవునా కాదా' అనుకుంటూనే అబ్దుల్ ఖాదర్ పలకరించాడు. రామ్ మోహన్ను.

ఆశ్చర్యంతో గతాన్ని జ్ఞాపకం తెచ్చుకుని "అవును నేను నిన్ను గుర్తుపట్టటానికి వీల్లేకుండా మారిపోయావు.'' కళ్ళు పెద్దవి చేసుకుని అబ్దుల్ ఖాదర్‌ను చూస్తున్నాడు రామ్‌మోహన్.

"ఎట్లా? ఎట్లా?" కళ్లు మూసుకుపోయేటట్టు శరీరమంతా కదిలేటట్టు నవ్వేశాడు అబ్దుల్ ఖాదర్.

"ఎట్లాగా? నీ రంగు తగ్గింది. బాగా లావయ్యావు. కళ్లు పూడిపోయాయి" అన్నాడు. బుజమ్మీద చెయ్యేస్తూ.

"నిన్ను గుర్తుపట్టటానికేం కష్టంలేదు. అప్పటిలాగే ఉన్నావు. చూడగానే గుర్తుపట్టాను. ఉద్యోగం చేస్తున్నావా? ఎక్కడ?" కుర్చీ దగ్గరికి లాక్కున్నాడు. అబ్దుల్ఖాదర్.

"ఏదో చిన్న ఉద్యోగం దొరికింది. గ్రామాలు తిరిగాను. ఇంట్లో చదివి ఇక్కడికి వచ్చి పరీక్షలు రాశాను. బి.ఏ అనిపించుకున్నాను" తనకు తగిన ఉద్యోగం లేదని కాస్తయినా బైటపడలేదు రామ్మోహను. "మరి-నీవేం చేస్తున్నావు?" అడిగాడు.

"నేనా?" గడ్డం తడుముకున్నాడు అబ్దుల్ఖాదర్. "దుకాణం పెట్టాను" అన్నాడు.

"అప్పటి పరీక్ష మళ్ళీ రాశావా?"

"పరీక్షా? లేదు బాబా. మళ్ళీ దాని జోలికి పోలేదు. చూడు రామ్! చదివితే ఏదో ఒక ఉద్యోగం వస్తుందనుకో. కాని-హాయిగా దర్జాగా దుకాణంలో కూర్చున్నట్టుంటుందా! మనమీద ఒకడు అధికారం చేయటం నాకు నచ్చదు. మనకు మనమే యజమానులం అన్నట్టుగా మహారాజులా కాలిమీద కాలువేసుకుని కూర్చుంటే అదొక దర్జా. ఏమంటావు?"

అబ్దుల్ఖాదర్ తృప్తి కోసం నవ్వినట్టుగా నవ్వాడు రామ్మోహన్. అతడికి అబ్దుల్ఖాదర్ను ఒకమాట అడగాలనిపించింది. తను పెళ్ళిచేసుకున్నాడు. ఇద్దరు పుట్టారు. అతడూ తన ఈడువాడేం కాదు-ఏళ్ళకు పెద్దే. అడిగితే తప్పేముంది? కాని-అడగలేదు.

"చూడు రామ్ ఆ పల్లెటూళ్ళో ఏముంది? అక్కడెట్లా ఉండగలుగుతున్నావు? ఇక్కడికి బదిలీ చేయించుకో" భుజమ్మీద గట్టిగా చరిచాడు. అబ్దుల్ఖాదర్కు సంతోషం ఎక్కువయితే చురుక్కుమనేటట్టు వీపుమీద చరచటంఅలవాటు.

"చంపేశావు ఖాదర్. నీకింకా ఈ అలవాటు పోలేదుకదూ?" భుజం పట్టుకుని బాధపడుతూ నవ్వేశాడు రామ్‌మోహన్.

"నేను ఆ పల్లెటూళ్ళో సుఖంగా ఉన్నాను. ఆ జీతమక్కడ హాయిగా గడిచిపోతుంది. పిల్లలకు జబ్బుచేస్తే కొద్ది ఖర్చుతో వైద్యం జరిగిపోతోంది. అదే ఇక్కడయితే వందలు కావాలి."

"అరే పిల్లలా నీకు? చెప్పవేం అప్పటినుంచీ? ఎంతమంది? ఎన్నేళ్ళు?" కళ్లు గుండ్రంగా తిప్పుతూ ఆఁహాఁ అన్నట్టు చూశాడు.

"అదేమంత వింత సంగతనీ చెప్పటానికి? అతి సామాన్యమైన విషయం. ఒక ఆడ-ఒక మగ. నాలుగూ రెండేళ్ళు." చిన్నగా నవ్వాడు.

"అదే గొప్ప భాయీ. అదిలేకపోతే పెద్దలోపము. నాకోసారి చూపించవు?" ఆశతో అడిగాడు.

"ఎట్లా? నీవిక్కడ-నేనక్కడ"

"ఒక్కసారి తీసుకురావా?" అర్థించాడు అబ్దుల్‌ఖాదర్. వాళ్ళు కలుసుకోని ఈ పదేళ్ళలో జరిగిన సంగతులన్నీ ఇద్దరూ హోటల్ ముందున్న గట్టుమీద కూర్చుని చాలాసేపు చెప్పుకున్నారు. ఆత్మీయతను తిరగతోడుకున్నారు.

విద్యార్థి దశలో వాళ్ళిద్దరూ అనుకోకుండా మొదటిసారి కలుసుకున్నారు.

స్కూలు విడవగానే విద్యార్థులు గుంపులు గుంపులుగా బయటికి వచ్చి మాట్లాడుతున్నారు. రామ్‌మోహన్ చుట్టూ పిల్లలుచేరి అతడిని అభినందిస్తున్నారు.

"చాలా అదృష్టవంతుడివోయ్. నిరుడూ క్లాసుకు ఫస్టు వచ్చావు"

"ఈ సంవత్సరం నుంచీ నేను నీ దగ్గరికి వచ్చి చదువుకుంటాను"

రామ్‌మోహన్ భుజాలమీద చేతులువేసే వాళ్లూ, నడుమ్మీద చేతులువేసేవాళ్లూ, అతడికి ఎదురుగా వచ్చేవాళ్లూ, వెనకనుంచి మాట్లాడేవాళ్లూ గుంపుగా చేరారు.

కొంతసేపటికి అందరూ విడిపోయారు.

"నీ పేరేమిటి? ఏ క్లాసు చదువుతున్నావు?" ఈ మాటలు విన వచ్చిన వైపుకు తిరిగాడు రామ్మోహన్. ఆ స్కూలు కాంపౌండు చాలా పెద్దది. కాంపౌండులో పెద్దపెద్ద వేపచెట్లూ గానుగచెట్లూ ఉన్నాయి వేపచెట్టు నానుకుని నిలబడి చాలాసేపటినుంచీ రామ్‌మోహన్ను గమనిస్తున్న అతడు ముందుకు నడిచి వస్తున్నాడు ఠీవిగా.

"నా పేరు రామ్మోహన్. ఇక్కడే తొమ్మిదోక్లాసు చదువుతున్నాను. నీవు కూడా ఇక్కడేనా?" అతడికి ఆ స్కూలు విద్యార్థులంతా బాగా తెలుసు. ఇతడెవరో కొత్తగా వచ్చాడనుకున్నాడు.

హ్హా హ్హా హ్హా అంటూ బిగ్గరగా నవ్వుతూ రామ్‌మోహన్ భుజం చరిచాడు.

"నేను ఈ స్కూలు వాడిని కాను. సెంట్‌జాన్ హైస్కూల్లో తొమ్మిదో క్లాసు చదువుకుంటున్నాను-మూడేళ్ళనుంచీ. మా స్నేహితుడొకడు ఈ స్కూల్లో ఫస్టు వచ్చిన 'స్టూడెంట్ ఉన్నాడని చెబితే చూడాలని వచ్చా"

అతడు తెల్లగా బొద్దుగా ఉన్నాడు. ఇరవై ఏళ్లు ఉన్నట్టు కనబడతాడు. తెల్లటి పాయజామా దానిమీద తెల్లటి షర్టు మెడలో ఎర్రటి స్కార్ఫు ముడివేసుకున్నాడు. అతడు నవ్వుతున్నా ఒళ్లు జలదరిస్తుంది. కాని-కోరగా చూపినా అతడి కళ్లు నవ్వుతూ ఉంటాయి.

ఇద్దరూ బయటికి నడిచారు-భుజాలమీద చేతులు వేసుకుని. చెరొక సోడా తాగారు.

చప్పున జేబులో చెయ్యిపెట్టి పర్సు బైటికి తీశాడు అబ్దుల్ ఖాదరు.

తను ఇవ్వలేకపోయినానని మనసులో బాధ కలిగింది రామ్మోహనుకు "రేపు నేనిస్తాను లేవోయ్" అంటూ సోడా బండి రామయ్యకు చెప్పి ముందడుగు వేశాడు.

అబ్దుల్ ఖాదరు అందుకు ఒప్పుకోలేదు పర్సు తెరిచి డబ్బు ఇచ్చాడు. తరువాత చాలా సేపు రామ్మోహన్ అతడి స్కూలును గురించీ అతడిని గురించీ అడిగి తెలుసుకున్నాడు. ఆ క్షణం నుంచీ ఇద్దరి మధ్య స్నేహ భావం కలిగి దృఢంగా అల్లుకుపోయింది.

"అయితే నేను ఈ స్కూల్లో చేరిపోతాను. ఇద్దరంకలిసి చదువుకోవచ్చు" అన్నాడు అబ్దుల్ ఖాదర్.

"ఏం? ఆ స్కూలు బాగుండలేదా?"

"ఏం బాగుంది? మూడేళ్ల నుంచీ పై క్లాసులోకి రాలేకపోతున్నా."

"మీ యింటికి దూరమేమో కదూ? ఎట్లా వస్తావు?" మామూలుగా అడిగాడు రామ్మోహన్.

"నాకు సైకిలుందిగా?" ధీమాగా తలెగరవేస్తూ అన్నాడు.

అలా ఒకరికొకరు సన్నిహితులై తిరుగుతూ ఉండేవారు. అబ్దుల్ ఖాదర్ మాట్లాడితే రామ్మోహన్‌కు నవ్వు వచ్చేది. అతడికి తెలుగు భాష సరిగా రాదు. తోడి విద్యార్థుల దగ్గర కొంత-తమ వాడలో పాటక జనం దగ్గర నేర్చినది కొంత కలిపి మాట్లాడుతూ ఉంటాడు. ఆ మాటల్లో చాలా వరకూ ఉరుదూ భాష అతడికి తెలియకుండా దొర్లుతూ ఉంటుంది. ముందు మాట వెనకా-వెనక మాట ముందూ అంటాడు. తన భాషను తెలుగులోకి అనువదించి మాట్లాడేవాడు.

"విన్న ఇద్దువులే" అంటా డొకసారి.

"గేపు ఎందుకు రాలే?" అంటా డొకసారి.

ఈ మాటలు విని తోడి పిల్లలంతా పగలబడి నవ్వేవారు. కాని-రామ్మోహన్ వాళ్లను కళ్లతో వారించేవాడు.

"వాళ్ల భాష మనమింత సులభంగా మాట్లాడగలమా? అతదే నయం. ఎలాగో మాట్లాడగలుగుతున్నాడు" అని సమర్థించేవాడు.

రామ్మోహన్ మాటలకు అందరూ వెనక్కు తగ్గేవారు.

స్కూల్లో విద్యార్థులంతా అబ్దుల్ ఖాదరు ఒంటరిగా ఉన్నప్పుడు ఒకడుగు వెనక్కు వేసేవారు కొందరు అతడిని చూసి పక్కకు తొలగిపోయేవారు.

చదువు విషయంలో రామ్మోహన్ మిత్రుడికి చాలా సహాయం చేసేవాడు.. పుస్తకాలు చదువుకోనక్కరలేకుండా నోట్సు వ్రాసిచ్చేవాడు.

అబ్దుల్ ఖాదర్ మిత్రుడికి తనమీదగల అభిమానాన్ని గుర్తించి గౌరవమూ ఆదరమూ చూపేవాడు. కాని ఆ నోట్సు ఇంటికి తీసుకువెళ్లి పుస్తకాల అడుగున పడేసేవాడు. పరీక్షల ముందర ''బాగా చదివావా?'' అని అడిగితే చదివానన్నట్టు తల ఎగరవేసేవాడు. వాటిలో ఏదయినా ఒక ప్రశ్న అడిగితే ''రేపు చెబుతాలే'' అనేవాడు.

''సరేలే రేపడుగుతాను జవాబు చెబుతావా?'' అంటే సరేనని అప్పటికి తప్పించుకుని ఆ మరునాడు కనబడేవాడు కాదు

అనుకోకుండా రామ్మోహన్‌కు నగరానికి బదిలీఅయింది. తన ఆఫీసు పేరు వ్రాసి తనకు అక్కడికి బదిలీ అయిందని అబ్దుల్ ఖాదర్‌కు ఒక కార్డు రాశాడు రామ్మోహన్. తన ప్రాణం తిరిగి వచ్చినట్లనిపించింది అబ్దుల్ ఖాదర్‌కు. తీరిక చేసుకుని ఆఫీసుకు వెళ్లి కలుసుకున్నాడు ఒకటే కబుర్లు–కాసేపట్లో ఇద్దరుమిత్రులూ పదేళ్ల కబుర్లు మళ్లీ మళ్లీ చెప్పుకున్నారు.

ఆఫీసు టైమయింది ఇద్దరూ లేచారు.

రామ్మోహన్‌కు ఇంటికి పోవలసిన తొందర ఉన్నది. తనకు మూడో సంతానం కలిగి రెండు రోజులు తక్కువగా నెలయింది. ఆ రోజు తండ్రి తద్దినం. తను తద్దినం పెట్టగానే ఆఫీసుకు వచ్చాడు. ఇంటి పని తల్లి ఒక్కతే చెయ్యలేదు. తను వెళ్లి కొంతయినా ఆమెకు సహాయపడాలి.

కాని–అబ్దుల్ ఖాదర్ విడిచిపెట్టేటట్టులేడు.

''ఏం? అట్లా ఆలోచిస్తున్నావు?'' రోడ్డుమీదికి వచ్చిన తరువాత అడిగాడు అబ్దుల్ ఖాదర్.

ఇంటి సంగతులన్నీ విడమరిచి చెప్పాడు రామ్మోహన్.

''రామ్ నేను మీ యింటికి వచ్చి ఆ పాపను చూస్తా'' సరదా పడ్డాడు అబ్దుల్ ఖాదర్.

తనది చిన్న ఇల్లు. తను కొద్ది జీతగాడు. ఇంట్లో కూర్చోటానికయినా ఒక మంచి కుర్చీలేదు. కాస్త సంకోచించాడు రామ్మోహన్.

"అట్లా చూస్తున్నావు. నేను రావద్దా?" గునిసినట్టు ముఖం పెట్టాడు అబ్దుల్ ఖాదర్.

"ఏం లేదు. పోదాంపద" అబ్దుల్ ఖాదర్ సైకిల్ మీద ఇద్దరూ వెళ్లారు. ఒక చిన్న సందులో సైకిల్ ఆగింది. రామ్మోహన్ అతడికి దారి చూపిస్తూ ఒక చిన్న అరుగు ముందర నిలబెట్టి లోపలికి వెళ్లాడు. ఈతాకుల చాప తెచ్చి అరుగు మీద పరచాడు

"కూర్చో ఇప్పుడే వస్తా" నంటూ లోపలికి వెళ్లి ఒక విస్తరితో గారెలు పాయసం పెట్టి అతడి ముందుంచాడు.

"ఖాదర్ ఇవి నీకిష్టముంటాయోలేదో? మా యిళ్లల్లో తద్దినమంటే ఇవి ఉండాలి" మంచి నీళ్ల గ్లాసు చేతికిచ్చాడు రామ్మోహన్.

చెయ్యి తుడుచుకుని జేబులో ఉన్న పాన్ వేసుకుంటూ "మీ అమ్మగారిని నేను చూడాలి దణ్ణం పెట్టాలి. కొత్తగా పుట్టిన పాపను తీసుకురా" విస్తరాకు అవతల పడేసి సర్దుకుని కూర్చున్నాడు.

రామ్మోహన్ తల్లి పాపను తీసుకువచ్చింది.

"బాబూ నీకు తెలుగు మాట వచ్చునా?" అంటూ పలకరించింది ఆమె.

ఆమె పలకరింపులో అతడికెంతో అప్యాయత గోచరించింది. ఆమె రోజూ రామ్‌ను యిలాగే పలకరిస్తుందా? ఇంత తియ్యగా అతడితో మాట్లాడుతుందా? రామ్ రోజూ ఇంత తీపిని తింటాడా? అందుకే రామ్ అట్లా ఉన్నాడా?

అబ్దుల్ ఖాదర్ దిగ్గున లేచాడు. ఆమె కాళ్లమీద చేతు లావించి ముఖానికి అద్దుకున్నాడు. పాపను తన చేతుల్లోకి తీసుకున్నాడు. పసిపాప చేతులూ, కాళ్లూ ముఖం నిమురుతూ పదిరూపాయల కాగిత మొకటి చేతిలో పెట్టాడు.

అదిరిపడ్డట్టు చూసి "ఆదెందుకు?" అన్నాడు రామ్మోహన్.

"భాయీ నాదీవెన అది. మంచి డ్రెస్సు కుట్టించు" అన్నాడు.

రామ్మోహన్ అతడి అప్యాయతకు ఎంతో సంతోషించాడు తన కటువంటి మిత్రుడున్నందుకు ఎంతో గర్వంగా చూశాడు మిత్రుడా అతడు? కాదు-తన తోబుట్టువు

సరిగ్గా ఈ పాపను చూసిన ఏడాదికి అబ్దుల్‌ఖాదర్‌కు ఒక ఆడపిల్ల పుట్టింది. పేరుపెట్టి పెద్ద పండుగ చేసుకున్నాడు.

తన కత్యంత ఆప్తమిత్రుడు ఆహ్వానించినందుకు తను వెళ్ళి తీరాలన్న పట్టుదలతో అద్దెసైకిల్ తీసుకుని బయలుదేరాడు రామ్మోహను. నెలారంభములోనే కనుక ఇంటి ఖర్చులు పెట్టకముందు అబ్దుల్‌ఖాదరు పాపకు ఒక మంచి గౌను పది రూపాయలకంటె ఎక్కువ ధరదే కొని ఆ పొట్లం చేతిలో పట్టుకున్నాడు.

అప్పటికి ఏడున్నర దాటింది. వీధి దీపాలు కాంతివంతంగా లేవు. కర్ఫ్యూ పెట్టారు. కనుక పోలీసు చూడకుండా ఒకటీ రెండూ సైకిళ్లు రోడ్డుమీద నడుస్తునే ఉన్నాయి. అబ్దుల్‌ఖాదర్ దుకాణంతప్ప ఇంటి అడ్రసు బాగా తెలియదు రామ్మోహన్‌కు. ఒకటి రెండుచోట్ల సైకిల్ దిగి అడిగాడు. ఆ సందు మొదట్లో మనుష్యులు కనబడగానే మళ్ళీ సైకిల్‌దిగాడు ఇంటి అడ్రసుకోసం.

ఒకటి కాదు – పదిలాఠీలు ఒక్కసారి అతడి తలమీద పడ్డాయి.

అమ్మో అంటూ నేలకొరిగాడు. కాని అతడిచేతిలో ఉన్న పొట్లము కింద బడలేదు.

''చచ్చాడులే ఇంక కళ్లు తెరవడు'' అని నవ్వుకుంటున్నారు అబ్దుర్‌ఖాదర్ మిత్రులు.

కర్ఫ్యూ పెట్టాంకదా అని పోలీసు ఆ చౌరస్తామీద ఎక్కడో దూరంగా ఉన్నారు.

రోడ్డుమీద కాక-ఇళ్ళగోడల కానుకుని నీడలా నడుస్తూ వస్తున్నాడు అబ్దుల్ ఖాదర్. సందుమొదట పడిఉన్న మనిషిని చూశాడు. శబ్దం కాకుండా నవ్వుకున్నాడు. మళ్ళీ అంతలోనే టార్చివేసి చూశాడు, బతికి ఉన్నాడా లేదా అనుకుంటూ.

నేలమీదపడిన అతడికి తలలోనుంచి రక్తం కారుతున్నది. కళ్ళు సగం మూతలుపడ్డాయి. చేతిలో పొట్లం తీసిచూశాడు,

చిన్న పాప కౌక గౌను,

మళ్ళీ ముఖమ్మీద టార్చివేసి చూశాడు. గుండెలదిరిపోయాయి.

"రామ్ రామ్ నా పాపకు గౌను తెచ్చావా? నా మిత్రులే నిన్ను చంపేశారా? అమ్మకు నా ముఖ్యం ఎలా చూపించను?" రామ్మోహన్ గుండెకు తలానించి ఏడ్చాడు.

"ఖాదర్" అన్నట్టు రామ్మోహన్ లోగొంతుకలో నుంచి పిలుపు వినవచ్చింది.

"అమ్మ అమ్మ ఏడుస్తుంది. పిల్లలకు దిక్కులేదు. నీవే నీవే...." మాట స్పష్టంగా వినబడలేదు అబ్దుల్‌ఖాదర్‌కు.

"రామ్ నీవు నా ప్రాణం- వాళ్లు నా బిడ్డలు. ఆమె నా తల్లి." అతడి చేతిని కళ్ళకద్దుకున్నాడు.

అబ్దుల్‌ఖాదర్ తన మిత్రులను పేరుపేరునా పిలిచి నోటికి వచ్చినట్టు తిట్టి ఇంక తన కంటికి కనబడవద్దన్నాడు. ముఖం కళ్లూ వాచిపోయేటట్లు ఏడ్చాడు.

రామ్ ప్రాణాలతోపాటు తన ప్రాణాలు కూడా పోతున్నట్లనిపించి 'అల్లా అల్లా' అంటూ అతడిపక్కనే తలమీద చేతులుపెట్టుకుని చతికిలపడ్డాడు అబ్దుల్‌ఖాదర్.



# రజతోత్సవం

తెల్లవారుఝామున నాలుగవుతుందేమో—సాకేతరామ్‌కు మెలకువ వచ్చింది. కొంతసేపు పక్కమీద అటూ ఇటూ దొర్లాడు. మంచం చివరకు జరిగి దగ్గరగా టీపాయిమీద ఉన్న అగ్గిపెట్టె అందుకొని సిగరెట్ వెలిగించాడు. బెడ్‌రూమ్ లైటు వెలుగులో తను ఊదిన పొగ రింగురింగులుగ పైకి వెళ్ళి గాలిలో కలిసి పోతోంది. ఆ వెలుగులో అతడు తన చేతికున్న రేడియమ్ డయల్ వాచి చూసు కున్నాడు.

అరగంటే గడిచింది. అంటే నాలుగున్నరయిం దన్నమాట.

"ఇప్పుడేం తొందరొచ్చిందిలే—ఐదింటికి లేవచ్చు" అనుకుని మళ్లీ కన్ను మూయాలని ప్రయత్నించాడు. నిద్రపట్టలేదు. కాని—అతడు లేవదలచు కోలేదు.

బెడ్‌రూమ్ లైటు వెలుగులో పక్కకు తిరిగి చూశాడు. యశోద తలకింద చెయ్యిపెట్టుకుని అటుపక్కకు తిరిగి పడుకుని నిద్రపోతున్నది. "ఇవాళ ఇంకా ఇలా నిద్రపోతోందేం?" అనుకున్నాడు.

రెండురోజుల కిందట తన గదిలో లైబ్రరీ అంతా సర్దుకుని, అట్టలు చిరిగిన పుస్తకాలు తీసి విడిగా పెట్టుకున్నాడు—వాటిని మంచి బైండర్‌కిచ్చి బైండ్ చేయించి బీరువాలో పెట్టాలని. సాకేతరామ్ నెలనెలకు పప్పు ఉప్పు సామాను కొన్నట్టుగా ఎంత ఇబ్బంది వచ్చినా ఒక మంచి పుస్తకం కొని తన పేరు రాసుకుని బీరువాలో పెట్టుకుంటాడు. అలా ఎప్పుడుకొన్న పుస్తకమో అది—అట్టలు ఊడిపోయి కాగితాలు జారిపొయ్యాయి. పైల్సు బల్లమీద పడేసి, ఆ ఊడిపోయిన రెండు కాగితాలు కుతూహలంతో చదివాడు. ఆ రెండూ చదివిన తరువాత, వాటి తాలూకు మిగిలిన కాగితాలు వెతికి చివరకు చదివాడు.

అదొక చిన్న కథ. జర్మనీ దేశంలోని ఒక పల్లెటూరి రైతు కథ. 65-70 సంవత్సరాల దంపతులు. వాళ్ళిద్దరూ ఒకరినొకరు విడిచి ఉండలేరు. ఇద్దరూ ఒక్కసారే టీ తాగుతారు. ఒకసారే భోజనం చేస్తారు. ఎడతెగని కబుర్లు చెప్పుకుంటూ సాయంత్రపు వేళల్లో తోటల్లో తిరుగుతూ పనిచేస్తారు ఒకరికి తలనొప్పి వస్తే మరొకరు సహించలేరు. ఇంటిపనులు ఇద్దరూ కలిసి చేసుకుంటారు. ఒకరు పేపరు చదివితే ఇంకోరు వింటారు మాటవరసకయినా తగవులాడుకోరు.

ఇంకా కథ ఇలా సాగిపోతున్నది. సాకేతరామ్ అక్కడితో ఆ కాగితాలు బైండు చేయాల్సిన పుస్తకాలలో పెట్టి, కుర్చీకి తల ఆనించి ఆలోచనలో పడ్డాడు. 65-70 సంవత్సరాల దంపతులు ఇంకా అలా ఒకరికొకరు అంటి పెట్టుకుని ఉంటారా? దంపతులకు పరస్పరాకర్షణలోనుంచి పుట్టినదే కదా ప్రేమ? స్త్రీ పురుషుల పరస్పరాకర్షణ అంటే శారీరకమైన వాంఛాజనితమేకదా! ఇంకా వాళ్ళిద్దరి మధ్య ఇటువంటి ఆకర్షణ ఉందని కథకుడు చెప్పబోతున్నాడా?

ఆ కాగితాలు మళ్ళీ చదివాడు. మొదట పరస్పరాకర్షణ-దానిలోనుంచి ప్రేమ-ఈ రెండింటికి తోడు స్నేహం కూడా ఉండాలని నిరూపిస్తున్నాడు రచయిత. జీవితంలో ఆకర్షణ వయసుకు సంబంధించింది; దానివల్ల జనించిన ప్రేమ కూడా అంతే. వయసు పెరిగిన కొద్దీ ఆకర్షణ తగ్గవచ్చు. ప్రేమకూడా అంత గాఢంగా ఉండకపోవచ్చు. కాని స్నేహంకూడా వీటితోపాటు వృద్ధి అయితే ప్రేమ జీవితమంతా నిలుస్తుంది. ఇద్దరూ శారీరకమైన సంబంధం లేకపోయినా స్నేహంతో ప్రేమగా తోడూనీడగా బ్రతుకుతారు. అది విడదీయరాని బంధమవుతుంది. ఇదీ రచయిత ఆ కథలో చెప్పింది.

ఇది నిజమా? అందరిపట్ల ఇది సాధ్యమా!

మళ్ళీ అతడి దృష్టి యశోదమీదికి మళ్ళింది.

పదిహేనేళ్ళ పిల్లప్పుడు తను చదువుకుంటుండగా యశోద తమ ఇంట పాదంపెట్టింది. తన చదువు పూర్తి అయింది. ఉద్యోగంలో క్రమంగా డెప్యూటీ సెక్రటరీ రాంకుకు వచ్చాడు. సరిగ్గా పెళ్ళయి నిన్నటికి పాతిక సంవత్సరాలయింది. ఎందుకో అతడిని-నాలుగు రోజులనాడు ఒక పార్టీకి వెళ్ళినప్పుడు అక్కడ కనిపించిన చీరె ఆకర్షించింది. యశోదకు అలాంటి చీరె కొనాలనిపించింది.

ఇంతకాలమయింది-యశోదకు తన చేతిమీదుగా ఒక చీరయినా కొనలేదని- పించింది. ఎందుకో అతడికామాటే తోచలేదు. ఆఫీసునుంచి వస్తూ బనారస్‌చీరెల షాపుకు వెళ్ళాడు. చీరెలు తీయించాడు. అన్ని రంగుల్లో అన్నిధరల్లో చూపించిన- చీరెలు చూశాడు. ఇంకా తీయిస్తున్నాడు చూస్తున్నాడు.

ఏమి రంగు నప్పుతుంది యశోదకు ?

ఆలోచిస్తున్నాడు.

ఎ ,తకు తెగదు ఆలోచన.

సహనంతో అతడు అడిగినకొద్దీ చీరెలు తీసి చూపిస్తున్నాడు వర్తకుడు.

"అమ్మగారు ఏ రంగులో ఉంటారు ;" అడిగాడు తనేదయినా సలహా యిద్దామని.

"రంగా ? యశోద ఏ రంగులో ఉంటుంది ?" అతడి మనసులో ప్రశ్న బయలుదేరింది. ఇరవై ఏళ్ళకే నలుగురు బిడ్డల్నికన్న యశోద-పొయ్యి దగ్గర మగ్గిమగ్గి పదిమందిగల సమష్టి కుటుంబానికి వండి వడ్డించిన యశోద-ఎడనక వాననక వచ్చిపోయేవారికి నడుము వంగేటట్లు అతిథి మర్యాదలు చేసిన యశోద ఇప్పుడే- రంగులో ఉంది ?

అతడు మొదటి రాత్రే ఆమెను పరీక్షగా చూశాడు.

ఆ తరువాత ?

ఆమె ముఖం సరిగ్గా చూడటానికే తీరికలేకపోయింది.

"నిజంగా తీరికలేకనేనా ?" మనసు నిలదీసింది.

'ఆమె ముఖంలోకి చూసి ఎప్పుడయినా పలకరించావా ? ఆమె నవ్వుతున్నప్పుడు ఆ ముఖం ఎలా ఉంటుందో చూశావా ? ఆమెకు సన్నిహితుడిగా స్నేహితుడిగా ఎప్పుడయినా పలకరించావా ?'

అతడిలో ఒణుకు సన్నగా ప్రారంభమయింది.

"ఏం అయ్యగారూ ? ఏ రంగు ? ఏ రకపుటంచు ?" జ్ఞాపకం చేశాడు వర్తకుడు మళ్ళీ.

తల గోక్కున్నాడు సాకేతరామ్. ఇంత ఖర్చుపెట్టి, మోజుపడి, కొని యింటికిపోతే యశోద ఒంటి రంగు కది నప్పకపోతే? అంతా వృథా-వృథా.

కళ్ళజోడు తీసి తుడిచి మళ్ళీ పెట్టుకున్నాడు.

వర్తకుడికి సహనం చచ్చిపోతోంది. అయినా సాకేతరామ్ ముఖంలోకి నిదానంగా చూస్తున్నాడు.

"అయ్యగారూ! ఏ రంగు కలవాళ్ళకయినా ఈ లేత నీలం రంగు మీద మెజంతారంగు గళ్ళు-ఈ జరీ చక్రాల అంచు చాలా బాగుంటుంది. ఐదు వందల ఏభయి రూపాయలు. మీకో పాతిక తగ్గించి ఇస్తాను, తీసుకెళ్ళండి. ఈ చీరె అమ్మగారికి తప్పకుండా నచ్చుతుంది" బలవంతంచేసి ప్యాక్ చేసి చేతిలో పెట్టాడు. ఇంటికి రాగానే తన మంచమ్మీద తలవైపుగా పక్కకింద పెట్టాడు మళ్ళీ దాని ధ్యాసలేదు అతడికి.

"కాఫీ తీసుకోండి" పొగలు గక్కే కాఫీ కప్పుతో యశోద నిలబడ్డది ఎదురుగా.

ఎప్పుడు లేచి వెళ్ళిందో యశోద? ఆ రోజు శుక్రవారం కాబోలు. తలంటు కున్నట్టుంది. జారుముడి వేసుకుని నాగ మల్లెలు సుతారంగా ముడికి కుడివైపున రెండు పెట్టింది. దోసగింజ బొట్టు పెట్టుకుంది. ఐదున్నరకల్లా ముఖమ్మీద ముంగు రులు సవరించుకుంటూ తనకు బెడ్ కాఫీకి వేళయిందని మేడమీదికి తీసుకువచ్చింది. తను నిద్రపోతున్నాడనుకుంది కాబోలు లేపింది.

ఆ లేపటం ఎట్లా లేపిందని?

గడ్డం దగ్గర్నుంచి పెదవులూ ముక్కూ మీదుగా ఫాలభాగం వరకూ తర్జనితో తాకీతాకకుండా గీత గీసింది.

చటుక్కున కళ్ళు తెరిచాడు.

పాతికేళ్ళ సహధర్మచారిణి, నలుగురు పిల్లల తల్లి, సర్వకాల సర్వావస్థల లోనూ తన కళ్ళ ముందర మెదిలిన యశోదను 'దివి నుండి భువికి దిగి వచ్చిన దేవతవా నీవు? ఎవరు నీవు? ఇంత ప్రశాంతతను ఈ గదిలోకి తీసుకువచ్చావు. నీ సౌందర్యంతో ఈ గదంతా వెలుగులు జిమ్ముతున్నాయి'.

ఈ మాటలు అనాలని అతడి నోటి వరకూ వచ్చాయి. కాని అవి అతడి పెదవి దాటలేకపోయాయి.

అయినా వాటి ప్రభావం ఎక్కడికి పోతుంది.

ముఖం ప్రపుల్లమయింది.

పట్టలేని ఆవేశంతో పొగలుగక్కే కాఫీ కప్పు నందుకొని టీపాయి మీద పెట్టాడు.

అతడికి ఆమెతో ఏదేదో చెప్పాలని గుండెను విప్పి ఆమె ఎదుట పరచాలని ఆరాటంగా ఉంది.

'శుక్రవారం ఉషస్సులో తలలో పూలు ముడుచుకుని వచ్చావు. నీవు తెచ్చిన బెడ్ కాఫీ నేనొక్కడినే ఎట్లా తాగుతాను? ఫిఫ్టీ ఫిఫ్టీ' అని పక్కనున్న గ్లాసులోకి. ఆమెకు తన కప్పులో కాఫీ ఒంపాలన్న ఉబలాటం, అంతేకాదు తన చేతులతో తాగించాలని కూడా, కానీ అలాంటివేవీ జరగలేదు.

''నీవు కూడా తీసుకో.'' అన్నాడు బలవంతంగా వచ్చినట్టున్న దామాట.

''నా కాఫీ కింద ఉన్నది. కిందికి వెళ్తాలెండి.'' అంది యశోద-ఆ చిన్న ఆ ఒక్కమాటకే ఆశ్చర్యపోతూ.

''కాదు. నీవిక్కడే కాఫీ తాగాలి—నా ముందరే.'' ఈ మాట ఎట్లా అన్నాడో అతడికే తెలియదు.

''ఎట్లా మరి? అయితే కిందికి వెళ్ళి తెచ్చుకుంటానుండండి. ఈ లోపల మీరు తీసుకోండి. చల్లారిపోతుంది.''

''అలా కాదు. ఈ కాఫీ ఇద్దరం పంచుకుందాం.'' ఆమెకు చిన్న గ్లాసులో పోసి చేతికిచ్చాడు.

ఇటువంటి సరాగాలన్నీ యశోదకు తెలియవు అని అనుకోవటానికి వీలు లేదు. కాని-అనుభవంలో లేవు కనుక బిత్తరపోయి యిస్తోంది.

తరువాత బెట్టు కొంత తగ్గింది. ''నీకేం తెచ్చానో చెప్పుకో?'' అంటూ తల వైపున దిండు కింద ఉన్న ప్యాకెట్టు తీసి ఆమెచేతి కిచ్చాడు.

ఆమె నవ్వుతూ ప్యాకెట్ చేతిలోకి తీసుకుని విప్పి చూసి సంభ్రమంతో "ఎంత బాగుందీ చీరె ? నాకు ఇటువంటి చీరె కావాలని మీ కెట్లా తోచింది ?" వంటి మాటలు అని, చీరె మడత విప్పి కొంగు భుజమ్మీద వేసుకొని, రెండడుగులు నడిచి చూసి, పరుగెత్తుకొని వెళ్ళి, కట్టుకుని మురిపిస్తూ వస్తుందనుకున్నాడు.

కాని ఆ ప్యాకెట్టు చేతబట్టుకుని అతడి ముఖంలోకి చూస్తోంది యశోద.

"యశోదా ! ఇంతకాలానికి నీ కో చీరె కొన్నాను, కట్టుకుని చూపించవూ?" అతడి కళ్ళలో అభ్యర్థనలాంటి భావం మెరిసింది.

యశోద నిలబడిపోయింది. పొద్దున్నే బోలెడు పని తనకోసం ఎదురు చూస్తోంది. ఇప్పుడీ చీరె ఏమిటి ? కట్టుకుని వచ్చి తనకు చూపటమేమిటి ? చిన్న పిల్లల చేష్టలు. ఎవరు విన్నా నవ్వివోతారు.

"యశూ, ప్లీజ్ కట్టుకురా."

"యశూ ! ఆ పిలుపేమిటి ? తన గుండెలో అదింత సంచలనం కలిగించటమేమిటి ?"

ఆమె అతడిని కొత్త పెళ్ళి కొడుకును చూసినట్టు చూస్తోంది

అతడి కళ్ళు మామూలుగా లేవు. ఆ చూపులను తనెప్పుడయినా చూపిందా? సమ్మోహనాస్త్రితుల్యంగా ఉందే ? మంత్రముగ్ధను చేస్తున్నదేమిటి ? మొదటి రోజయినా అట్లా చూశాడా ?

ఆమెకూ అర్థంకావటం లేదీ కొత్త గొడవ.

అయినా ఆ చూపులను ఎదుర్కోలేక చీరె మడతలు విప్పి పక్క గదిలోకి వెళ్ళి, కట్టుకుని ఎదురుగా వచ్చి నిలబడ్డది బొమ్మలా.

ఆమె నతడు కళ్ళారా చూశాడు. అతడి చూపులు వింత వింతగా ఉన్నాయి. తన నెప్పుడూ చూడనట్టుగా సంభ్రమంతో అప్పుడే చూస్తున్నట్టుగా ఉన్నాయా చూపులు.

అతడి ఎదలో ఉత్తుంగతరంగాలు ఎగిసెగిసి పడుతూ నురుగులు గక్కుతూ ఒడ్డుకు పరుగులు తీస్తున్నాయి.

యశోద రంగు ఇదా ?

యశోద లావెక్కలేదా ?

సన్నగా రివటలా అట్లాగే ఉన్నదా ?

ఆమెకు చీరె కట్టుకోవటంలో ఇంత నేర్పు ఉందా? ఎట్లా కట్టింది!

"యశూ" మంచమ్మీది నుంచి లేచి వచ్చాడు. తమి పట్టలేక ఆమెను గుండెకు హత్తుకున్నాడు.

ఆమె ఉక్కిరిబిక్కిరి అయి, నవోఢలా గదిలో నుంచి కిందికి పరుగులు తీసింది.

అతడు స్నానంచేసి డ్రెస్ చేసుకుని కిందికి దిగి వచ్చేసరికి, బల్లమీద కాఫీ, టిఫిన్ రెడీగా ఉంది. ఈగలు వాలకుండా నెట్ వాటిమీద పెట్టింది. వంటింట్లో పనిచేసుకుంటూ అతడికోసం ఎదురుచూస్తోంది యశోద.

తిన్నగా వంటయింట్లోకి వచ్చాడు సాకేతరామ్.

రెండురోజుల క్రిందట వర్షం పడినట్టుంది. భూమిని పగలగొట్టుకుని పచ్చిక బయటికి తొంగిచూస్తోంది. యింటి కిటికీలోంచి ఆమె ఆ వింత శోభనే తిలకిస్తోంది. నలభై ఏళ్ళకీ పులకరింత ఏమిటి తనకూ? అతడు యశూ అనగానే నును సిగ్గుల పెళ్ళి కూతురైందేమిటి? తన బిడ్డలు పెద్దవాళ్లై దూరాన ఉన్నారుగాని ఇంట్లోనే ఉంటే వాళ్ళేమనుకుంటారు? ఈయన ఇలా చిన్నపిల్లవాడై పోతున్నాడేమిటి? నవ్వుకుంది.

అతడామె భుజాలు పట్టుకుని తన వైపుకు తిప్పుకుంటూ "రెండో ప్లేటేది" అన్నాడు.

ఆ స్వరంలో ఏదో మధురమైన భావన-దానికి జవాబుగా ఆమె హృదయం స్పందిస్తోంది.

పదహారేళ్ళ కన్యలా సిగ్గుతో కళ్ళు దించుకుంటూ రెండవపళ్ళెం బల్లమీద పెట్టింది. అతడు ఆమెకు కాఫీ కప్పూ మంచినీళ్ళూ అమర్చాడు.

ఆమెను రమ్మని కళ్ళతో పిలుస్తున్నాడు. ఆమెకు ఏమిటోగా ఉంది. అతడు చెయ్యిపట్టుకుని లాగుతుంటే తాను సిగ్గుల పెళ్ళికూతురులా అతడి వెంట వెళ్ళింది.

"మాట్లాడకుండా తింటావేం? నోరులేదూ?" అన్నాడు కళ్ళు మరింత మరింత మెరిసేటట్టుగా చూస్తూ.

"ఏం మాట్లాడను? మీరు మాట్లాడండి." తల వంచుకుంది.

"ఇప్పుడు తలవంచుకుంటావేం? ఆ కాలం గడిచిపోయింది." ఆమెను ఓరగంట చూశాడు.

ఆమె పెదవులమీదికొక వింత నవ్వు జారింది. "గడచిపోయిందని తెలుసు. ఇప్పుడేం చెయ్యాలో తెలియటంలేదు" కళ్ళల్లో కొంటెతనం.

ఆ మాటలకు అతడి గుండెలో సన్నటి మంట బయలుదేరింది. తనలో తాను ఛీ ఛీ అనుకున్నాడు. ఇన్నేళ్ళ తనెట్లా గడిపాడు? మనిషిగానేనా?

ఈ కొత్త ఉమ్మరంలోనుంచి బైటపడాలని ఆమె, "మీకు టైమవుతున్నది. కాఫీ చల్లారిపోతున్నది." తొందర చేసింది.

"యశూ, నేనివాళ సెలవుపెట్టాను. కిద్వాయ్ గార్డెన్సులో కాటేజి బుక్ చేశాను. దారిలో టిఫిన్ కారియరు నింపించుకుని పెద్ద ఫ్లాస్కులో కాఫీ పోయించుకుని వెళ్దాము. నీవు ఈ చీరెతోటే బయలుదేరాలి. తొమ్మిదింటికి ప్రయాణం," అన్నాడు ఆమె భుజం తడుతూ.

ఆమె శరీరం జలదరించింది. ఇప్పుడీ ప్రోగ్రాం ఏమిటి? తీర్థయాత్రలు చేసే వయసులో; కాని - ఈ మాట పైకనలేక "మీ తోటి ఉద్యోగులు వాళ్ళ భార్యలతో వస్తున్నారా?" అంది. అంతటితో ఆపక "నే నింట్లో పనులు చూసుకుంటాలెండి." అంది.

"సరి సరి. నీవు రాకపోతే ఇదంతా ఎందుకు? ఇందంతా మనకోసం.... మనిద్దరికోసం" ఆమె గడ్డం నిమిరాడు.

యశోద ఐదునిమిషాలలో ఇల్లంతా సర్దింది. అతడు తాళాలు వేశాడు. ఇద్దరూ మారిస్ మైనర్‌లో బయలుదేరారు. ఆ కారు ఎంత పాతదో కాని ఆ

రోజున ఎక్కువ పేచీ పెట్టకుండా స్టార్టయింది. హోటల్‌మీదుగా కిద్వాయ్ గార్డెన్సుకు పరుగుతీసింది

"మీలాగే ఈ కారుకు్కూడా కొత్త ఉత్సాహం పుట్టుకొచ్చింది. రోజులాగ లేదు" అంది యశోద

'ఏమిటనుకున్నావు మరి?' అన్నట్టు చూశాడు.

కారు ఆగగానే సామాను లోపలపెట్టి ఇద్దరూ తోట చూడటానికి బయలుదేరారు.

రంగు రంగుల పూలతోటలు, వాటిమధ్య గలగల పారే చిన్న పిల్లకాలవలూ. వాటి మధ్య సన్నటి సిమెంటు బ్రిడ్జిలాంటి కాలిబాటలూ - నీటిమీదినుంచి వీచే చల్లటి గాలి పలకరిస్తుంటే - ఆ చల్లటి వాతావరణంలో ఒళ్ళు పరవశిస్తుంటే- సిళ్ళల్లో ఇటూ అటూ చూస్తూ నడుస్తుంటే పడిపోతామేమోనన్న భయంతో ఒకరిచేతు లొకరు పట్టుకుంటూ హొయ్యారంగా తోటంతా నడిచారు ముసిముసి నవ్వులతో. గట్టుమీదికి వచ్చి చూస్తే కొండ కొనలలోనుండి ఉరవడితో వస్తున్నట్టుగా పైనుంచి నీటిధారలు హోరున చప్పుడుచేస్తూ కిందికి దూకి పిల్లకాలవలలోకి పరుగులు తీస్తున్నాయి.

చిన్నపిల్లల మాదిరిగా ఇద్దరికీ ఎంతో సంభ్రమం కలిగింది. ఎంతో ఆనందం. ....ఎంతో పరవశం.... పులకరింతలు- జలదరింపులు.

వాళ్ళిద్దరూ ఇంత సున్నితంగా ఈ పాతికేళ్ళ జీవితంలో మెలగలేదు. కొత్తదనం- బిడియం- జంకు మొదలైనవన్నీ ఒక్కొక్కటీ జారిపోతున్నాయి. తోటంతా నడిచారు.

తోటలో ఒకపక్క జనం గుమిగూడి ఉన్నారు. ఒకరినొకరు తోసుకుంటున్నారు. ఏదో పిక్చర్ షూటింగని చెప్పుకుంటున్నారు చూడాలని జనం ఆత్రపడుతున్నారు.

అంతలో అక్కడికి ప్రేమికుల జంట వచ్చింది.

అక్కడ మూడు మెట్లున్నాయి. నాయకుడు వెనకనుంచి వస్తుంటే నాయకి అతడికి అందకుండా గబగబా మూడు మెట్లెక్కి పూలచెట్ల పక్కగా పరుగెత్తి

డాన్సు చెయ్యాలి. నాయకుడు ఆమెను అందుకోలేనట్టుగా స్పీడు తగ్గించి పరుగెత్తాలి. కొంతసేపయిన తరువాత నాయకి దొరికిపోతుంది. వాళ్ళిద్దరి నటనా సంభాషణలూ వినడంకోసం, వాళ్ళ సాన్నిహిత్యం చూడటం కోసం ప్రజలు విరగబడిపోతున్నారు.

ప్రేమికుల జంట ప్రేమ అసహజంగా వికారంగా ఉంది. ఇద్దరూ వాళ్ళను చూసి నవ్వుకున్నారు. అప్పటికి ఒంటిగంటయింది. ఇద్దరూ కాటేజిలోకి వచ్చారు. ఆమె లోపలికి వెళ్ళి కాళ్ళూ చేతులూ కడుక్కుని వచ్చేటంతలో అతడు కూజాలో నుంచి నీళ్ళు తీసుకుని చేతులు కడుక్కుని భోజనసామగ్రి అంతా పళ్ళేలు పెట్టి వడ్డించాడు. ఆమెకోసం ఎదురుచూస్తున్నాడు.

'ఇదేమిటి? ఈ పని కూడా వచ్చా మీకు?' అనుకుంటూ వచ్చి కూర్చుంది యశోద.

సిగ్గుపడిపోయాడు సాకేతరామ్- ఇంతవరకూ తను చేయించుకున్నందుకు.

అలాగ అతడు ప్రతిరోజూ ఏదో ఒక విషయంలో సిగ్గుపడిపోతూనే ఉన్నాడు. తల క్రుంగిపోతూనే ఉంది.

ఒకసారి సెలవుపెట్టి నాలుగురోజులు తిరుపతి వెళ్ళారు. అది నవంబరు నెల. కొండమీద చలి బాగా ఉంది. తెల్లవారుఝామున చలి కొంచెమెక్కువకాగానే దుప్పట్లు కప్పుతున్నారు కాటేజీల్లో జనం.

అప్పుడే మెలకువ వచ్చిన యశోద పక్కమీదినుంచి లేచి, గ్లాసెడు మంచి నీళ్ళు త్రాగి, తిరిగి పడుకోబోతూ, ఆ సన్నటి దీపపు వెలుగులో సాకేతరామ్‌ను ఓరగంట చూసింది.

నలుపుకంటే తెలుపే ఎక్కువగా ఉన్న తలవెంట్రుకలు చెదరిపోయి ఉన్నాయి. బక్కపలచగా ఉంటాడు కనుక వయసు ముఖమ్మీద కొట్టవచ్చినట్టుగా లేదు. ఆరోగ్యం కాపాడుకోవాలని సాయంత్రపు వేళల్లో ఒక మైలు దూరం నడుస్తాడు. ఆహారంలో మార్పు చెయ్యాలని రాత్రిపూట చపాతీ తింటున్నాడు.

చల్లటిగాలి రివ్వున వచ్చి చెంపమీద కొట్టినట్లయింది. యశోద దిగ్గునలేచి కాళ్ళదగ్గరగా మడత చేసిన శాలువ తీసి అతడికి కప్పింది.

దూరాన ఐదుగంటలు కొట్టినట్లు అనిపించింది. అది గంటలు కొట్టడంకాదు. జనసందడి. కొందరు అప్పుడే సుప్రభాతం వినటానికి వెళ్ళారు. కొందరు వెళ్తున్నారు.

యశోద గబగబా లేచి పళ్ళు తోముకుని స్నానంచేసి ఆయనకు ఐదున్నరకే కాఫీ తాగే అలవాటు కదా అని ఊరినుంచి తెచ్చిన స్టౌమీద నీళ్ళు కాచి కాఫీ డికాషను చేసింది శాలువ కప్పుకుని వాకిటి ముందర పాలకోసం కూర్చుంది.

సాకేతరామ్ లేచాడు. స్నానం చేశాడు. ఇంత కాలంనుంచీ తనకు వేకువ జామున లేచి వేడి వేడి కాఫీ ఇచ్చిన యశోదకు తెల్లవారకుండానే కాఫీ తీసుకువద్దామని పెరటివారిన ఫ్లాస్కు తీసుకుని హోటల్లో చేస్తూ చేస్తున్న కాఫీని ఫ్లాస్కు నిండా నింపి తీసుకువచ్చాడు.

అప్పటికి యశోద వాకిట్లోకి వచ్చిన పాలు కొని కాఫీ కలిపి అతడి కోసం ఎదురుచూస్తోంది.

''మీకు బెడ్ కాఫీ తాగే అలవాటు కదా అని, పాలు కొని కాఫీ చేశాను. ఎక్కడికి వెళ్లారు?'' అడిగింది యశోద, అతడి చేతిలో ఉన్న ఫ్లాస్కు చూడకుండానే.

''నీకూ కాఫీ వేళేగా? అందుకని ఫ్లాస్కులో కాఫీ పోయించుకు వచ్చాను'' అన్నాడు ఫ్లాస్కు ఆమె చేతికిస్తూ.

కాఫీ తాగుతూ సాకేతరామ్ సింహావలోకనం చేసుకుంటున్నాడు 'ప్రేమలో స్నేహం ఎన్నిపాళ్ళు కలిసింది?'

మళ్ళీ అనుకుంటాడు సమాధానంగా ''65–70 సంవత్సరాలకు ఇంకా చాలా టైముందిగా? అంతవరకూ పరిస్థితి మెరుగవుతుంది. నేను ఇంప్రూవ్ అవుతాను'' అని.

'పిల్లలకు రెక్కలు వచ్చాయి. దూరాన ఉన్నారు. ఇప్పుడు తామిద్దరే మిగిలారు. రజతోత్సవం తరువాతనైనా నిజమైన జీవితంలో ప్రవేశించాలి. ఇద్దరూ మరింత సన్నిహితం కావాలి. ప్రేమలోనుంచి పుట్టే స్నేహాన్ని వృద్ధిచేయాలి.

ఎంతయినా యశోద ఆడది. బిడియపడుతుంది. తనే ముందడుగు వేయాలి. యశోద చెయ్యి పట్టుకుని జీవితంలో సాగిపోవాలి'' అనుకుంటాడు

సాకేతరామ్ సర్వీసు అయిపోవచ్చింది. తరువాత ఎక్కడ ఉండాలన్న ఆలోచన వస్తోందతనికి. ఇప్పుడు ఈ ఉన్న ఇంట్లో ఏవో మామూలు సౌకర్యాలే గాని ఆధునిక సౌకర్యాలేమీ లేవు. సమష్టి కుటుంబంలో ఉండగా యశోద బావిదగ్గర అంట్లన్నీ తోమేది. ఆ బావికీ ఇంటికీ మధ్య ఎంతో దూరం ఉండేది. అంట్లుతోమి పెద్ద బుట్టలో పెట్టుకుని రెండుసార్లు తిరిగేది. బట్టలూ అంతే. ఈ బట్టలన్నీ గంపలో పెట్టుకుని ఒక బకెటు ఒక సబ్బు బిళ్ళ తీసుకువెళ్ళేది. అన్నం తినగానే ఈ బట్ట లన్నీ ఉతికి ఎండపోకముందు ఆరవేసేది. ఇంటికి కావలసిన నీళ్ళన్నీ తోడిపోసేది.

ఒక్కతే ఇంత పని జేసేది.

అప్పుడు తనకేమనిపించలేదు. కాని ఇప్పుడు యశోదకు అటువంటి కష్టాలు కలిగించలేడు. సాధ్యమైనన్ని సౌకర్యాలు ఆమెకు అనుకూలమైనట్టుగా కలిగించ వలసిందే. ఎప్పుడో రామానాయుడు పేటలో అర ఎకరం స్థలంలో ఒక పెద్ద పెంకుటిల్లు-చుట్టూ సరకూచెట్లూ ఉన్నది వేలంలో చవుకగా కొన్నాడు. ఆ యిల్లు బాగుచేయించి అద్దెకిచ్చాడు. ఇప్పు డతడి కా ఊరు నచ్చలేదు. తన కొడుకులు పెద్దవాళ్ళయ్యారు. వాళ్ళకూ జీతాలూ బాగానే ఉన్నాయి. ఇప్పుడెవరూ తనమీద ఆధారపడినవారు లేరు. బాగా ఆలోచించి రెండురోజులు సెలవు తీసుకుని అక్కడికి వెళ్ళి ఆ యిల్లు అమ్ముతానని అందరికీ ధర కూడా చెప్పాడు. కొనదలచిన వాళ్ళను తన దగ్గరికి రమ్మన్నాడు.

ఆ యిల్లు ఆ ఊరికి ఘనమైనది. వెంటనే నలుగురు వచ్చారు. పోటీల మీద ఇల్లు మరో పదివేలకు అధికంగా అమ్ముడుపోయింది.

సాకేతరామ్ బంజారాహిల్సుకు దగ్గరగా ఒక చిన్న యింటికి సరిపడా స్థలం కొని చిన్న యిల్లు కట్టాడు. యశోదకూ తనకూ వృద్ధాప్యంలో ఏ విధమైన కష్టమూ కలగకుండా సకల సదుపాయాలూ చేశాడు. నీళ్ళగదీ వంట యిల్లూ అత్యంతాధు నికంగా కట్టాడు. వేడి నీళ్ళకు గీజరు పెట్టాడు. వంట యింట్లోకూడా ఒక చిన్నది పెట్టాడు. వంగక్కర లేకుండా అన్ని సదుపాయాలూ చేశాడు. ఇంటి వెనకాల చిన్న చిన్న చెట్లపాదులూ టాంకులో మంచి వాటికి కాలువలూ ఏర్పాటు చేశాడు.

ముందు ఇంటికి అందాన్నిచ్చే పూలచెట్లూ వాటికి నీటి వసతులూ చేశాడు. ఒక పక్కగా ఒక చిన్న పచ్చిక లానువేశాడు.

ఇల్లు చిన్నదయినా అలంకారాలు ఎక్కువగా చేశాడు పెద్దతనానికి పరిసరాలన్నీ కంటికింపుగా సంతోషం కలిగించాలని తపన

గృహప్రవేశానికి కొడుకులంతా వచ్చారు. కూతురు వచ్చింది. కొత్త యిల్లు చూసి కొడుకులకు మనసులో ముల్లు గుచ్చినట్లయింది.

నాలుగు రోజులయింది. తల్లీ తండ్రీ కలిసి ఇంటి పనులన్నీ చేస్తున్నారు. తల్లి చేసిన కాఫీ తండ్రి పిల్లలను పిలిచి ఇస్తున్నాడు. మధ్యాహ్నం వాళ్లు పడుకుని లేచేటప్పటికి బట్టలుతికి ఎండవేస్తున్నారు. రిటైరయిన తరువాత సాకేతరామ్ పెరట్లో కాసిన కూరలు కోసుకువచ్చి తరిగి పెడుతున్నాడు.

ఇద్దరూ ఏవేవో సంఘటనలు జ్ఞాపకానికి తెచ్చుకుంటూ మాట్లాడి నవ్వుకుంటారు. చిన్ననాటి సంగతులన్నీ నెమరుకు తెచ్చుకుంటారు మురిపెంగా.

ఆ నాటి నవ్వులలో ముఖ్యమైనది కూరలు తెచ్చేటప్పుడు కొత్తిమీరి కరేపాకు కడిగి తీసుకురాలేదని. నేను తెస్తానంటే నేను తెస్తానని పోటీలుపడి పరుగులు తీశారు పెరట్లోకి.

వాళ్ళిద్దరినీ చూసిన కొడుకులు "వాళ్ళ గోలే వాళ్ళదిగాని అంతంత దూరాల నుంచి వచ్చిన మన సంగతులేమీ అడగరేం అమ్మా! నాన్నా?" అనుకోవటం మొదలుపెట్టారు. వాళ్ళ నవ్వులు, కబుర్లూ కొంచెం వెగటుగా తోచాయి.

"నాన్నా! ఇల్లు ఇంత చిన్నది కట్టావేమిటి? మీ యిద్దరికి తప్ప మూడో మనిషి వస్తే ఇబ్బందే" అన్నాడు పెద్ద కొడుకు.

"అవునురా! మాకు పెద్దతనం వస్తోందా? ఎక్కువ కష్టపడకుండా ఇంటి పనులు జరిగేటట్లుగా ఆధునిక సౌకర్యాలన్నీ పెట్టించాను. వృద్ధాప్యంలో సుఖంగా హాయిగా బ్రతక్కుండా ఏం కర్మమొచ్చిందని. వీలైనన్ని వసుపాయాలు పెట్టించాను. చూడు అక్కడ రికార్డు ప్లేయరు, దాని పక్కన రేడియో - చిన్న టి. వి. అన్నీ గోడల్లోనే అమర్చాను. ఇద్దరం కబుర్లు చెప్పుకుంటూ చెరొక పని చేసుకుంటూ ఉంటే మాకు రోజులు ఆనందంగా ఇట్టే గడుస్తాయి," అన్నాడు.

గది గదికీ ఉన్న ఫాన్లనూ మొజైక్ ఫ్లోరింగునూ చూసి, "నాన్నా ఆ యిల్లమ్మిన డబ్బంతా ఈ చిన్న ఇంటిమీద ఖర్చుచేశావన్న మాట." అన్నాడు శాస్త్రి బాధగా

"అవునురా. సుఖపడాల్సింది ముసలితనంలో" అన్నాడు సాకేతరామ్ మామూలుగా

వచ్చినప్పటినుంచీ తన పురిటికి అత్తగారిని రమ్మనమని అడగాలని మూడో కోడలు ప్లాను వేస్తున్నది. భోజనాల వేళ అడగనే అడిగింది.

జవాబు చెప్పటానికి కొంతసేపు ఆలోచించింది యశోద. తన ప్రాణ స్నేహితుణ్ణి విడిచి ఇప్పుడు తానెక్కడికీ వెళ్ళలేదు. తోడూనీడగా బ్రతుకుతున్న ఇద్దరూ విడి విడిగా పదిరోజులయినా ఉండలేరు. కాని ఈ మాట అనలేకపోతోంది

"ఒరే అబ్బాయీ! యశోద ఇంతకాలం చాకిరీ చేసిచేసి అలసిపోయిందిరా. ఇంక ఆమెను కష్టపెట్టటం నా కిష్టంలేదు. ఎలాగో మీరే సర్దుకోండి," అన్నాడు సాకేతరామ్. అతడి ముఖంలో అప్పుడే ఆవేదన ప్రారంభమైంది యశోద ఎక్కడ ఒప్పుకుంటుందోనని.

"అయితే మాకు మీ ఆశ లేదన్నమాట. చూడండి ఎంతమంది అత్తగార్లు కోడళ్ళకు పురుళ్లు పోస్తున్నారో!" అన్నాడు కినుకతో.

"ఈ ఆశే కాదురా. ఎటువంటి ఆశా లేదు. ఆ పాత ఇల్లు ఉంటే నలుగురం ఇళ్ళు కట్టుకునేవాళ్ళం కదా. అలా కాకుండా అంత ఇల్లూ అంత దొడ్డీ అమ్మేసి ఈ చిన్న యిల్లు కట్టి ఆధునిక సౌకర్యాలంటూ బోలెడు డబ్బు తగలబెట్టాడు. పెన్షన్ డబ్బు నెల నెలా వాడుకుంటారు. గ్రాట్యుయిటీ విలాస యాత్రలకు ఖర్చు పెట్టుకుంటారు." అన్నాడు తండ్రి వంక చూడకుండా పెద్ద కొడుకు.

"నాన్నా ఇంకా కారు అమ్మలేదేం? అసలు నడుస్తోందా? ఎందుకదీ అమ్మి పారేయక?" అన్నాడు రెండోకొడుకు.

"మాకు తిరగటానికి అది చాల్లేరా! అమ్మకు కాళ్లు నొప్పులు. సాయంత్రం వేళల్లో అలా బైటికి కాస్త కులాసాగా వెళ్ళాలంటే కారు-ఏదో ఒకటి చేతిలో ఉండాలి" అన్నాడు సాకేతరామ్.

"నాన్నా-అమ్మా కొ త్త యువజంటగా తయారయ్యారు. ఇద్దరిలో స్వార్థం బాగా పేరుకుపోయింది. మన సంగతి పట్టించుకునేలా లేరు. మనమే వాళ్ళదగ్గర ముసలివాళ్ళంగా ఉన్నాము" అన్నది కూతురు కొంచెం వెక్కిరింపుగా.

"అసలు ఇద్దరూ ఇక్కడ వేరే కాపురం ఎందుకు ?"

"ఇది స్వార్థమూ కాదు. మేమిద్దరం తిరిగి చిన్నవాళ్ళమవటమూకాదు. యశోద మీకు తల్లేకాని-మీరు పెద్దవాళ్ళయిన తరువాత మీమీ సంసారాలు నిర్వహిం చుకుంటారు. యశోద కష్టసుఖాలు గమనించే వ్యవధానం ఉండదు. ఇక నాసంగతి యశోద నా జీవిత సహచరి. నాకు తోడు-నీడ, నా ప్రాణస్నేహితురాలు యౌవనం దిగజారినా గుండెలోని అనురాగం స్నేహం తగ్గనవసరంలేదు. ముసలివాళ్లు ఎక్కడో అక్కడ పడి ఉండాలనీ-ఏ మూలనో కాలక్షేపం చెయ్యాలనీ అనుకో వటం పొరపాటు. వయసు పెరిగి వంట్లో బలం తగ్గినకొద్దీ ఎక్కువ సంతోషం గానూ ఉల్లాసంగానూ ఉండటానికి తగిన పరిస్థితులు కల్పించుకుని ఉంటే జీవితం తిరిగి చిగురించినట్టుగా హాయిగా గడిచిపోతుంది. మనసును ఉల్లాసపరిచే పరిస్థి తులు లేకపోతే మృత్యువు మీది మీదికి వచ్చినట్టుంటుంది. ఏడుపు ముఖాలు పడ తాయి. అంతేగాని మీరు మరో విధంగా అనుకోకండి. ఇలాగే ప్రతియేడూ వచ్చి మమ్మల్ని చూసిపోతూ ఉండండి" గుండె పొంగుతుండగా యశోదను క్రీగంట చూస్తూ పిల్లలను చుట్టూ కూర్చోబెట్టుకుని చెప్పాడు సాకేతరామ్.

(యువ - దీపావళి సంచిక)



# తలపుల మలుపులు

''సుందరం, నీ వొచ్చావేమిట్రా ఇవాళ ?''

''అత్తయ్య సాయంత్రం టిఫిన్ తీసుకువస్తానంది. భోజనం కారియరు తీసుకు వెళ్ళమంది. మామయ్యా, కులాసా ?''

కనుబొమలు ముడిచాడు సదాశివం. ముఖం చిట్లించాడు.

''ఈ కారియరు తను తీసుకురాలేకపోయిందా ?'' సణుక్కుంటూ ఆవతలకి తిరిగి పడుకున్నాడు.

''అత్తయ్య తలంటి పోసుకోవాలట. మధ్యాహ్నం బజారుకు వెళ్ళి సరుకులు తెచ్చుకోవాలిట'' మంచం దగ్గరగా ఉన్న స్టూలుమీద కూర్చున్నాడు. సుందరం.

''ఊఁహూఁ.... ఇంకా ఏమేమి చెయ్యాలట'' సుందరం వైపు తలతిప్పి కళ్ళు చిట్లిస్తూ అడిగాడు.

''ఏమో ? నాతో చెప్పింది ఇంతే'' మామయ్యకు కోపం వచ్చిందంటే. పొట్టి వాదులు వస్తాయి.

''సుందరం.... ఇవాళ ఎన్నో తేదిరా ?'' టీచరు విద్యార్థిని నిలబెట్టి ప్రశ్నించినట్లు ప్రశ్నిస్తున్నాడు.

''పద్దెనిమిది మామయ్యా'' తల వంచుకునే జవాబిస్తున్నాడు సుందరం.

'అయితే- యివాళ సరుకులు కొనటమేమిట్రా ? చెప్పేవాడికి చెవుడయితే. వినేవాడికి వివేకం లేదా అన్నట్టుంది మీ ఇద్దరి సంగతి.''

"ఆదేమీ నాకు తెలియదు మామయ్యా. అత్తయ్య చెప్పమన్న మాట నీకు చెప్పాను. నీవు తొందరగా భోజనం చేస్తే కారియరు తీసుకు పోతాను."

చురుక్కున చూశాడు సదాశివం. "అలా చెయ్యమని అత్తయ్య చెప్పిందా?"

"అబ్బే! అత్తయ్య అలా చెప్పలేదు. నీవు భోజనం చేస్తే తీసుకు పోదా మనుకున్నానంతే. పరీక్షలు దగ్గరకి వస్తున్నాయి కదా? ఇంటికి వెళ్ళి చదువుకోవాలి" నీళ్ళు నమిలినట్లు నమిలాడు.

"అంతేనా?"

"అంతే మామయ్యా!"

"ఒరే సుందరం, అమ్మను ఒకసారి రమ్మని ఉత్తరం రాయి; చూడాలని వుంది" మంచమ్మీద లేచి కూర్చున్నాడు సదాశివం.

"మొన్ననే కదా మామయ్యా, అమ్మ వచ్చి వెళ్ళింది! ఇంతలోనే మళ్ళీ ఎందుకు?"

చికాకేసింది సదాశివానికి. భార్యగాని మేనల్లుడుగాని చెప్పినట్లు చెయ్య కూడదూ? సవాలక్ష ఎదురు ప్రశ్నలువేసి తనను విసిగించేస్తున్నారు.

"ఒరే సుందరం? నేను రాయమన్నానని రాయి నువ్వు?"

"తేవ తేపా అమ్మ ఇక్కడకి వస్తుంటే నాన్న ఒక్కరూ ఇంట్లోవుండద్దా మామయ్యా? ఆయనకు ఒంట్లో అంత బాగుడటం లేదు కదా?"

ఆ మాటకి తగ్గినట్లు కనబడ్డాడు సదాశివం. "అదీ నిజమే-కానీ-సుందరం? మళ్ళీ అందరిని చూస్తానో చూడనో ననిపిస్తోందిరా-నాకున్న రక్త సంబంధీకు రాలల్లా మా అక్కయ్య ఒకతే సుందరం? నేనింక ఎన్నాళ్ళో బ్రతకనురా ఇవాళే అమ్మకు ఒక కార్డు రాస్తావు కదూ!" దీనంగా ముఖం పెట్టాడు సదాశివం.

"నీ కంత అధైర్యం ఎందుకు కలుగుతోంది మామయ్యా? నీకు పూర్తిగా నయమైపోతోందని డాక్టరు చెప్పాడు అసలు మనం చాలా తొందరగా కనుక్కున్నాం. వెంటనే నీవు శానిటోరియంలో చేరావు. నాలుగు నెలలనుంచీ మందు

తీసుకుంటున్నావు. పుష్టికరమైన ఆహారం తింటున్నావు. ఖరీదయిన మందులే వాడుతున్నాము. వైద్యోపచారాలలో ఏమీ లోపంలేదు-డాక్టరు నీ అభివృద్ధి తృప్తి కరంగా ఉందని అంటున్నాడు ఇంకా నీ కెందుకూ అధైర్యం?'' సుందరం కొద్దిగా ధైర్యం తెచ్చుకుని మేనమామకు ధైర్యం చెప్పబోయాడు.

మళ్ళీ మంచమ్మీద లేచి కూర్చొని క్రాపు చేతి వేళ్ళతో వెనక్కు తోసు కుంటూ ''ఒరేయ్ సుందరం! అవన్నీ డాక్టర్లు రోగితోటి రోగి బంధువులతోటి చెప్పే మాటలురా. ఒకసారి క్షయ వచ్చిందంటే ఇంక ఆ మనిషి ఖర్చయిపోయా డన్న మాటే. ఇవాళ కాకపోతే రేపయినా'' ముఖమ్మీద స్వేదబిందువులు పొటమరిం చాయి, ఆ మాటలు అనేటప్పుడు సదాశివానికి.

సుందరం ఇరవయి ఏళ్లు నిండీ నిండనివాడు. చదువులో కొంచం ఆలస్య మైంది-సుందరం చదువు మాన్పించినందుకు అక్కను మందలించి సుందరాన్ని తన దగ్గరకు తీసుకువచ్చి చదువు కొనసాగింప చేశాడు. సదాశివం ఇప్పుడు బి. ఏ. రెండవ సంవత్సరంలో ఉన్నాడు. మేనమామ అంటే కాస్త భయం. అత్తయ్య దగ్గర కొద్దిగా చనువు.

'మామయ్యా. నీవనుకునేది వెనుకటిమాట, ఆ రోజుల్లో నీ వన్నట్లు ఈ జబ్బు వస్తే ఖర్చయిపోయినట్లే కాని. ఇప్పుడు? అన్ని జబ్బులకూ మంచి మంచి మందులు వచ్చాయి. జబ్బులు వచ్చిన తర్వాత మందులివ్వడమే కాదు-రాకుండా కూడా ఇచ్చే మందులు కనిపెట్టారు,'' కొద్దిగా ధైర్యం తెచ్చుకుని అన్నాడు సుందరం.

'ఆఁ....మందులు కనిపెట్టే వాళ్లు కనిపెడుతున్నారు, రోగాలతో చచ్చే వాళ్లు చస్తున్నారు, రెండింటికి సంబంధంలేకుండా'' పెదవులు విరిచాడు సదాశివం.

'మామయ్య-మనిద్దరం డాక్టర్లం కాము, మనకేం తెలుసు మందుల సంగతి; ఆ మాట ఒదిలెయ్యి. నీవు ముందు భోజనం చెయ్యి.''

''ఏమిటోరా ఇవాళ తినాలని లేదు.''

''ఏం-అన్నీ నీ కిష్టమైనవే చేసింది మామయ్యా''

"అది కాదురా....నా మంచానికి నాలుగో మంచం ఖాళీ అయింది చూశావా? అది ఇవాళ ప్రొద్దున్నే జరిగింది. డాక్టర్లు రావడం పోవటం నర్సులు వార్డుబాయిస్ హడావుడిగా ఇటుఅటు పరుగెత్తటం అంతా చూశానురా కళ్ళతో" అతడి ముఖంలో భయం కొట్టవచ్చినట్లు కనబడుతోంది.

గొల్లున నవ్వాడు సుందరం.

"అదా సంగతి–అట్లా చెప్పు అందుకా ఇలా మాట్లాడుతున్నావు. వాడికి ఆయువు మూడింది అయిపోయింది. అంతే! నీకెందు కంట అంత భయం? జబ్బు బాగా ముదిరితే మందులకు లొంగదు. అతడు బాగా ముదరబెట్టుకొని వచ్చాడేమో పాపం" విషయం మార్చాలని ప్రయత్నం చెయ్యబోయాడు.

"ఆ మాట నిజమే. ఒక ఊపిరితిత్తి పూర్తిగా పాడయిపోయిందట. రెండవదానికి కూడా వచ్చిన తరువాత ఇక్కడికి వచ్చాడు పుష్టికరమైన ఆహారం తినలేదని ఈ డాక్టర్లంతా అంటారు గానీ ఏం పెట్టి తింటాడురా పాపం వాడు?" అదే ధోరణిలో సదాశివం సాగిస్తున్నాడు.

"పోనీలే సూమయ్యా మనమేం చేస్తాం? ఎవరికర్మ వాళ్ళది. నీకేం–మహారాజులా జరిగిపోతున్నది. అన్ని విధాలా నీకు జరిపే అత్తయ్య ఉన్నది. అటువంటి ఇల్లాలు ఉంటే ఎంత జబ్బయినా ఇట్టే పోతుంది. నీకేమయిందని?" చనువుగా పుందలించాడు సుందరం.

"ఒరే సుందరం! నీవు ఎన్నిచెప్పినా నేను కొత్త సంవత్సరము చూడను" దిండు తీసి గుండెల కదుముకుంటూ నైరాశ్యాన్ని వెళ్ళగక్కాడు.

"అదేమిటి? డాక్టర్లు ఇంక ఇంటికి వెళ్ళవచ్చునంటుంటే కొత్త సంవత్సరం చూడకపోవట మేమిటి?" సదాశివం వింత ధోరణికి సుందరానికి ఎటూ తోచటం లేదు.

"కాదురా సుందరం! ఇది కామన్ సెన్స్‌కి సంబంధించింది డాక్టర్లు ఎప్పుడు ఇంటికి వెళ్ళమంటారో తెలుసా?"

"బాగా జబ్బు నయమయిపోయిన తరువాత."

''కాదు-కాదు మందులకు జబ్బు లొంగకపోతే-ఈ ప్రాణం ఎలాగయినా నిలచేది కాదనుకొని 'యింటికి వెళ్ళి టానిక్కులు తీసుకో. మళ్ళీ నెల కొనసారి కనబడుతూ ఉండు' అని నెట్టేస్తారు.''

''అబ్బ మామయ్యా ఇంక నీతో మాట్లాడలేను. అన్నిటికీ అన్ని అపార్థాలు తీస్తున్నావు ముందు భోజనం చెయ్యి. నేను త్వరగా ఇంటికి వెళ్లాలి'' లేచి నిలబడ్డాడుడు సుందరం.

''అంత తొందర కలవాడివి అత్తయ్యను పంపి నీవే ఇంట్లో ఉండలేక పోయావు ?''

''ఇందాక చెప్పానుగా ! అత్తయ్యకు పని ఉంది నన్ను పంపిందని ?'' కను బొమ్మలు కొద్దిగా ముడిచాడు సుందరం.

''అబ్బాయీ నీకంత తొందరయితే-అత్తయ్య కాఫీతీసుకు వస్తుందన్నావుగా టిఫిన్ కారియర్ ఇక్కడ పెట్టి వెళ్లు. ఇది కూడా అత్తయ్యే ఇంటికి తీసుకు వస్తుం దిలే. !'' నిష్ఠూరంగా మాట్లాడాడు సదాశివం

''అయితే నేను వెళ్తాను.'' దిగ్గున లేచి వెనక్కు తిరిగి చూడకుండా వెళ్ళి పోయాడు సుందరం. 'అత్తయ్యను తొందరగా పంపించరా' అని సదాశివం అన్న మాటలు అతడికి వినిపించలేదు.

సరిగ్గా మూడు గంటలకు కాఫీ ఫ్లాస్కు చపాతీల డబ్బా మంచినీళ్ళ సీసా పట్టుకుని పద్మ లోపలికి వచ్చింది. సదాశివం కళ్లుమూసి నట్టుంటే మంచానికి దగ్గరగా ఉన్న కుర్చీలో కూర్చుని తను తీసుకువచ్చిన బుట్ట స్టూలు మీద పెట్టింది.

ఆ చప్పుడికి సదాశివం కళ్ళు తెరచి చూశాడు. పద్మను చూడగానే అతని కళ్లు మిల మిల్లాడాయి. పొడి పొడిగా ఉన్న తల వెంట్రుకలు చెవుల మీదకు జారుతున్నాయి. కోపం కొద్ది కనుబొమలు కలుసుకుంటున్నాయి. కొసదేరిన ముక్కు ముడుచుకుపోయి వెక్కిరిస్తున్నట్టుంది. దొండపండు లాంటి పెదవుల అణచి పెడుతుంటే అన్నం నీళ్ళు లేకుండా ఆమె ముఖారవిందాన్ని అలా చూస్తూ ఉండి పోవాలనిపించింది.

ఆ మాటే పైకి అనేశాడు.

"అన్నం నీళ్ళు లేకుండా ఓ మనిషి ముఖాన్ని అదేపనిగా చూస్తూ ఉంటే అసహ్యం పుడుతుంది. కడుపునిండా తిని చూస్తుంటే సంతోషంగా వుంటుంది. ఇందాక సుందరం చెప్పాడు–మీరు మధ్యాహ్నం భోజనం చెయ్యలేదని, ఇప్పుడు వడ్డించనా?" అంది పద్మ. అతడి ముఖం వైపు చూడకుండా.

సదాశివం కడుపులో ఏదో కుత కుత ఉడుకుతున్నట్లుగా ఉంది. అది పొంగింది.

"ఎందుకూ ఇప్పుడా చల్లారిపోయిన అన్నం?" కనుబొమలు ముడిచాడు.

"ఎట్లా చల్లారిపోతుందండీ హాట్ టిఫిన్‌లో పెట్టిన అన్నం?"

"అది ఒకవేళ వేడిగా వున్నా నాకు వద్దు"

కారణం లేని కోపం–అలక-మొండితనం చూస్తే పద్మకు అయోమయంగా ఉంది. అతడికి వచ్చిన జబ్బును గురించి ఆమె పడే బాధ కాకుండా అతడు పడుతున్న చికాకు తోటి ఆమెకు ఏం చేయాలో తెలియక కన్నీళ్ళు వస్తున్నాయి. ఆ నిస్సహాయతతో అతడిని ఎదురు ప్రశ్నించుతోంది తెగించి.

"ఎందుకువద్దూ? అంతా నార్మల్‌గా ఉంటే భోజనం ఎందుకువద్దు? చెప్పండి ఎందుకని?"

"తినాలని లేదు అంతే." విరుపుగా అనేసి పక్కకు తిరిగి పడుకున్నాడు.

అతడిని తన వైపుకు మళ్ళించి "చూడండీ ముందు ఓవల్‌టిన్ తాగండి. ఒక గంట పేపయినా తరువాత భోజనం చేయండి. ఈ చిన్న ఫ్లాస్కులో వున్న కాఫీ రాత్రి చపాతీలతో తీసుకోవచ్చు. సరేనా?" గడ్డం పట్టుకుని బ్రతిమిలాడింది.

దిగ్గున లేచి కూర్చున్నాడు. "నాకీ వెధవ ఓవల్‌టిన్ ఎందుకు తెచ్చావు స్ట్రాంగ్ కాఫీ తీసుకురాక?"

పద్మకు నవ్వొచ్చింది. కాఫీకి బదులు తమ ఎప్పుడూ ఓవల్‌టిన్ పంపిస్తున్న మాట నిజమే. డాక్టర్లు పాలు ఎక్కువగా తాగమంటున్నారు. అతడు కాఫీ – అందులో స్ట్రాంగ్‌కాఫీ తాగుతా నంటాడు. చిన్న పిల్లవాడిలా మారాం చేస్తాడు.

కాని అతడిని తను చిన్న పిల్లవాడిలా చూడలేకుండా ఉంది. పసిపిల్లవాడిని సము దాయించినట్లు సముదాయించబోతే విదిలించి కొడతాడు. తను లోపల్లోపల కుళ్ళి, పోతూ పైకి శాంతం ఓపిక ప్రదర్శిస్తోంది.

"అదా గునుపు? మరి....డాక్టర్లు కాఫీ వద్దన్నారు కదా?"

"ఊఁ హుఁ, ఏమయినా సరే - నాకది వద్దు'

"అయితే ఒక పని చేయండి. ఇవాల్టికి ఈ ఓవల్‌టిన్ తాగేయండి. రేపటి నుంచి తీసుకురాను. మరి గ్లాసులో పోసి ఇవ్వనా?"

"ఊఁ హూ...."

"ఇంతలోకీ ఏమయిందండీ, ఇప్పుడేగా గ్లాసులో పొయ్యమన్నారు? పోసి నేను తాగించనా?"

నవ్వుతూ ఆమె ముఖంలోకి చూశాడు.

ఆమె తలమీద ఒక చెయ్యివేసి ఒక చేత్తో గ్లాసు పట్టుకుని తాగిస్తుంటే చిన్న పిల్లవాడిలా మారాం చేస్తూ తాగుతున్నాడు.

"చూశారా! ఓవల్‌టిన్ అలా కళ్లుమూసుకుని తాగితే ఎంత మంచిదను కున్నారు.?" అన్నది తాగించానన్న తృప్తితో.

"పద్మా?"

"ఎదురుగా ఉన్న మనిషిని అంత గట్టిగా పిలుస్తారేం?" కిల కిల నవ్వుతూ చూసింది అతని కళ్ళలోకి.

"ఏదీ నీ చెయ్యి! ఎంత ఆరోగ్యంగా వుందో చూదు? ఎలా నవ నవ లాడుతుందో చూడు?" ఆమె చెయ్యి పట్టుకుని గాజులు అటు ఇటు తిప్పుతూ చూస్తున్నాడు.

"నేనేం చెయ్యను? అలా వుంది మరి" అంది నవ్వుతూ.

"అది కాదు పద్మా? నీది మంచి బలమైన పుట్టుక. మంచి దృఢమైన ఆరోగ్యం. నీవు మా యింటికి వచ్చిన తరువాత ఒక్కసారయినా జబ్బు పడలేదు. కదూ?" ఇంకా అతడి చెయ్యి ఆమె చేతిని తాకుతూ నిమురుతూనే ఉంది.

"ఇంకా నయం? నేను జబ్బుపడితే నాకెవరు చేస్తారు? ఈడ్చి అవతల పారెయ్యమంటారు" అదొక మాదిరిగా నవ్వింది.

"ఆఁ? నేనుండగా అంతమాటే అనటం?" ఆమె వీపు మీద చరిచాడు మెల్లగా.

ఆమె పళ్లు కనబడకుండా నవ్వింది. "నన్ను మంచంమీద పడుకోబెట్టి మీరు ఆ చాకిరి అంతా చెయ్యగలరా? రోగికి ఉపచారం చెయ్యటమంటే మాటలను కున్నారా? అన్నట్టు మీకు వక్కపొడి తీసుకువచ్చానా మందమతిని!" బుట్టలో చెయ్యి పెట్టి వెతుకుతోంది.

"అయితే నాకు చెయ్యటం చాలా కష్టంగా ఉందన్నమాట నీకు? అంత కష్టపడిపోతున్నావా?" అంతలో ముఖంలో రంగులు మారాయి.

"ఛా ఛా ఆ మాటక్కాదండీ నేనన్నది? అయినా మీ కోసం నేనేం కష్టపడి పోతున్నానని? అంతా ఇక్కడే జరిగి పోతున్నది. అయినా ఇంతమాత్రం కష్ట పడటం-అందులో మీ కోసం కష్టపడటం ఒక గొప్ప విషయమా? ఘనకార్యమా?" అతడు ఆ విధంగా భావించినందుకు ఆమె చాలా నొచ్చుకున్నది.

"చచ్చేవాడు చస్తుంటే చూసేవాళ్లు మేం చాలా కష్టపడిపోతున్నాం త్యాగం చేస్తున్నామంటారు. హుఁ-లోకంతీరే ఇంత! ఏమంటావు?"

ఆమెకు ఇదంతా అతడికి శారీరకరమైన బాధ కాదని తెలుసు. ఇది జబ్బు పడి లేచిన వాడి లక్షణమా! అదీ అర్థం కావటంలేదు.

"నేనొకమాట చెప్తాను వింటారా?"

"ఊఁ.....చెప్పు. వినటానికేం?"

"చూసేవాళ్ళు శరీరకష్టం చెయ్యగలరు. సానుభూతి చూపించగలరు, జాలి పడగలరు. కాని ఎంత ఆత్మీయులైనా ఏం చెయ్యగలరు అంతకంటే? అన్నం నీళ్ళు లేకుండా కనిపెట్టుకుని కూర్చోగలరు కాకపోతే? అంతకంటె ఏమన్నా ఉందా చెయ్యటానికి? చెప్పండి?" అతడి కళ్ళల్లోకి చూసింది.

"అవున్లే-చస్తుంటే చూస్తూ ఉంటారు. అంతేగా ఎంత చెప్పినా!" ముక్కు-పుటా లెగుర వేస్తూ అన్నాడు.

"ఛా ఛా-అట్లా ఎందు కనుకుంటా రండీ మీరు?" ఆమె కనురెప్పలను దాటి రెండు వెచ్చని కన్నీటిబొట్లు బుగ్గలమీదుగా జాలువారాయి.

జగచ్చక్షువు భూమిలోకి దిగేపోతున్నాడు. పోతూపోతూ వింత వెలుగును లోకమ్మీద వెదజల్లి పోతున్నాడు. ఆ కెంజాయ ఇచ్చే వీడ్కోలు ప్రతిరోజూ ఒకే విధంగా ఉండదు. నిత్యనూతనంగా ఉంటుంది.

అతడు కళ్ళు మూసుకుని పడుకున్నాడు. కాని మేలుకొనే ఉన్నాడు.

"చపాతీ తినే వేళయింది - లేవరూ?" అంతవరకూ కుర్చీమీదనే వెనక్కు-వాలి కళ్ళు మూసుకుని ఆలోచిస్తున్నది పద్మ. చటుక్కున గడియారం చూసుకుంది. అతడిని మెల్లగా భుజమ్మీద తట్టి లేపింది.

కళ్ళు నులుముకుంటూ లేచి "పద్మా" అన్నాడు.

"మీరు చపాతీ తినే వేళయింది. బల్లమీద పెట్టనా?"

"అది సరేగాని మనదేశంలో ముత్తయిదువు చావు చాలా పుణ్యంగా భావిస్తారు కదూ! పూలతో, పసుపు కుంకుమలతో వెళ్ళిపోవటానికి స్త్రీలు ఎంతో పుణ్యం చేసుకోవాలంటారు కదూ?" అతడి పెదవులు పైకి నవ్వుతున్నట్టు కనబడుతున్నా కళ్లు వికృతంగా చూస్తున్నాయి.

"మీరన్నమాట నిజమే కాని - అలాంటి చావు రావద్దూ అందరికీ? మీరన్నట్టు ఎంతో పుణ్యం చేసుకుంటేనేగాని అలాంటి చావు రాదు."

"మగవాడి అదృష్టం ఆడదాని చావుమీద ఆధారపడి ఉంటుంది. చాలా మంది గొప్పవాళ్ళకు ముందుగానే భార్యలు పోవటం చూస్తున్నాం" అతడికి సిగరెట్లు తాగే అలవాటుంది. కాని డాక్టర్లు నిషేధించారు. అయినా అలవాటు చొప్పున కుడిచేతి రెండువేళ్ళూ పెదవులను తాకాయి.

అటువంటి సందర్భంలో పద్మకు పెదవులపైన చిరునవ్వొకటి లాస్యం చేసింది.

భార్యలుచస్తేగాని భర్తలకు అదృష్టం పట్టదంటారా?'' అంది పెదవులు బిగించి.

''అలాగే కనబడుతోంది మరి?'' అన్నాడు చటుక్కున.

మీరు చపాతీ తినండి, టైమయిపోయింది.''

''తింటాలే.''

డాక్టర్లు రెస్టు కావాలంటారు. మీరు ఏమేమో ఆలోచనలు చేస్తూ ఉంటారు. అలా అయితే నేను ఇంటికి వెళ్ళిపోనా?''

''వెళ్ళు - వీడు ఇక్కడ చస్తే చస్తాడు అనుకుంటూ వెళ్ళు. ఇంటికి వెళ్ళి హాయిగా అన్నీ తిని సుఖంగా ఉండు. ఇక నీవు ఒక్కదానివేగా ఉండేది; బ్యాంకులో డబ్బుంది. వడ్డీమీద బతకినా హాయిగా బతకొచ్చు. ఒక్కమాట నిజం చెప్పు పద్మా - నీకు నేను బతకాలని ఉందా అసలు?'' నిలదీసి అడిగినట్టు అడిగాడు ఆమెను.

''అబ్బబ్బ - ఏం మాటలవి? నాకు కాకపోతే ఎవరికి ఉంటుంది మీరు బతకాలని?'' ఆమె కంఠం రుద్ధమయింది.

''అదికాదు పద్మా-ఆడవాళ్ళు చాలామంది డబ్బుంటే కాలు, మొగుడెట్టా చచ్చినా ఫరవా లేదనుకుంటా రవునా కాదా?'' దిండును పక్కకు పెట్టి తల వెంట్రుకలు సవరించుకున్నాడు

పద్మకు అతడిని ఆ సంభాషణనుండి మరల్చటం చేతకావటంలేదు. అర్థం కాక అతడివంకే విస్తుబోతున్నట్లు చూస్తోంది.

''మరొకటి పద్మా మనదేశంలో స్త్రీలు తమ పాతివ్రత్యాన్ని రుజువు చేసుకోవటం కోసం....నాలుగు మూలలా చాటటం కోసం దుర్వ్యసనాలుగల భర్తలనూ రోగాలతో తీసుకునే భర్తలనూ కోరుకుంటారు. అంతే కదూ పద్మా. మన ఆడవాళ్ళ ఆశయాలు?'' అతడి కంఠంలో కొద్దిగా తీవ్రత హెచ్చింది.

''నేను మీతో మాట్లాడలేనండీ, మీకో నమస్కారం'' చేతులుజోడించింది.

అతడి వాక్ప్రవాహం అంతటితో ఆగలేదు.

''భార్యలకు బాగా ఓరిమి ఉందనీ, పతిసేవ బాగా చేయగలరనీ చూపించ టానికి భర్తలకు పెద్ద జబ్బు చెయ్యాలంటావు కదూ ?''

''రామ రామ నేనా మాట అన్నానా ? ఇవాళ మీరు నా మాటలకు పెడార్థాలు తీస్తున్నారు. ప్రతిమాట వక్రంగా మాట్లాడుతున్నారు'' ఆమె యింటికి వెళ్ళటాని కని ప్రయత్నించటంలో ముందు టిఫిన్ కారియరు సర్దసాగింది.

అంతలో డాక్టరు వచ్చాడు దేవుడిలా. మొదట సదాశివాన్ని కాసేపు నవ్విం-చాడు. మరి కొంతసేపు హాస్యం చేశాడు. కులాసా కబుర్లు చెప్పాడు.

ఇతనికి వచ్చినంత సంతోషం కలిగింది సదాశివానికి.

సదాశివం దగ్గర రాత్రిళ్ళు ఉండటానికి సుందరం అలవాటు ప్రకారం వచ్చాడు.

ఆ సందట్లో ఇంటికి వచ్చేసింది పద్మ.

తెల్లవారేసరికి సదాశివం అక్కగారు కామమ్మ వచ్చింది. స్నానం కాఫీ కానిచ్చుకొని. నర్సింగ్‌హోముకు వెళ్ళింది. అతడి మంచమ్మీద కూర్చుని వీపు మీద చెయ్యేసింది. అక్కగానే కాకుండా చిన్నప్పటినుంచీ పెంచిన మమకారం కూడా ఉంది ఆమెకు.

''సదాశివం. నేను మొన్ననేకదా ఇక్కడినుంచి వెళ్ళింది ? అంత అర్జం టుగా రమ్మని ఉత్తరం రాయించావేమిటి ?'' అడిగింది అప్యాయంగా అక్క.

''నిన్ను చూద్దామనిపించి రామన్నాను నా ప్రాణాలు ఇంక నిలిచేటట్టు లేవు అక్కయ్యా, ఆఖరి చూపుగా అందరినీ చూద్దామనిపిస్తోంది'' అన్నాడు నిర్వి కారంగా.

''ఛా ! ఏం మాటలవి ? డాక్టర్లంతా నిన్ను హాయిగా ఇంటికి వెళ్ళమన్నా రటగా ?

''ఆఁ.... వెళ్ళమన్నారు వెళ్ళి ఇంట్లో హాయిగా చావమన్నారు.''

"ఎందుకు మాట్లాడుతావురా ఇటువంటి మాటలు? ఒకరు కాదు ఇద్దరు కాదు నలుగురు డాక్టర్లు నీ ఆరోగ్యం సంతృప్తికరంగా ఉందని రిపోర్టు యిస్తే అవేం మాటల్రా?" గట్టిగా మందలించింది.

"ఆ." అని గాఢంగా నిట్టూర్చి "సరేగాని పద్మ రాలేదేం నీతో?" చటుక్కున జ్ఞాపకం వచ్చినట్టుగా దిగ్గున లేచి కూర్చున్నాడు.

"నిన్న శనివారం కదూ? తలమీద స్నానం చేసిందట. అందుకని నిన్న నల్లా తలనొప్పిట ఇవాళ పొద్దున లేచేటప్పటికి నూటఒకటి జ్వరం. నేనింట్లో అడుగుపెట్టేసరికి మూలుగుతూ ఎదురుగా వచ్చింది"

"అలాగా? కాస్త జ్వరానికే అంత ఇదా? తగ్గడానికి ఆరునెలలు తీసుకుంటుందేమిటి?" హాస్యధోరణిలో అన్నాడు.

"ఛీ. ఛీ. నీ మాటలూ.... నీ ధోరణీను. అయినా ఇలా మారిపోయావేం? ఈ జబ్బు వచ్చినప్పటినుంచి నీ ధోరణంతా వక్రంగా తిరిగింది. పద్మనుచూసి మరీ వికటంగా మాట్లాడుతున్నావట. పాపం జ్వరం వచ్చి అది అఘోరిస్తుంటే" కామమ్మ తమ్ముడి వింత ధోరణికి ఆశ్చర్య పడిపోతూ చీవాట్లు పెట్టింది.

"అక్కయ్యా. ఈ జ్వరాలూ ఈ నొప్పులు అన్నీ ఇప్పుడే కాని, తరువాత ఇక ఉండవు. చూడు- నే చెప్పాగా?"

"అంటే?"

"అంటే ఏముంది? మనం ఎంత మందిని చూడటంలేదు? పెనిమిటి ఉన్నన్నాళ్ళూ ఈసురో మంటూ ఉన్న వాళ్ళు ఆయన పోగానే శుభ్రంగా రాయిలా తిని తిరగటం మామూలే."

ఒక మాదిరిగా నవ్వాడు.

"చూశాంలే? కాని దానికి దీనికి ఏం సంబంధం? నీవు అటువంటి మాటలింక చాలించు రేపు ప్రొద్దున ఎనిమిది గంటలకు నేనూ సుందరం టాక్సీ తీసుకు వస్తాం. సిద్ధంగా ఉండు.... ఇంటికి పోదాం" ఒక గంటసేపు కూర్చొని కబుర్లు చెప్పింది. టిఫిన్ కారియరు సుందరం పట్టుకు వస్తాడని చెప్పి ఇంటికి వచ్చింది.

మరునాడు పెందలాడే లేచి ఇంట్లో సదాశివం గదంతా శుభ్రంచేసి పక్క వేసింది కామమ్మ. ఎనిమిది గంటలకు సుందరం ఒక్కడే బయలుదేరాడు సదాశివం దగ్గరికి డాక్టర్లు వచ్చేవరకూ ఆగి బిల్లులన్నీ చెల్లించి అక్కడ పనిచేసే వాళ్ళకు అయిదూ, పదీ యిచ్చి పది గంటలకు ఇంటికి తీసుకువచ్చాడు.

సదాశివం రాగానే అలసిపోయినట్టుగా వుంటే కామమ్మ గ్లాసుతో ఓవల్‌టిన్ ఇచ్చింది. పది నిమిషాలు పడుకున్నట్టే పడుకుని లేచి ''పద్మ కనబడదేం?'' అని అడిగాడు.

''అడిగో ఆ గదిలో పడుకుంది. ఒళ్ళు తెలియకుండా ఉంది. వెళ్ళి పలకరించు'' అంటూ అతడిని పద్మ గదిలోకి తీసుకువెళ్ళింది.

''పద్మా. సదాశివం వచ్చాడు ఇంటికి. చూశావా?'' ఆమెను తట్టి లేపింది.

పద్మ కళ్ళు తెరిచింది. ఎర్రగా జ్యోతుల్లా ఉన్నాయి. కాని అప్పుడే అవి మూసుకుపోవటం మొదలు పెట్టాయి బలవంతంగా కళ్ళు తెరుస్తూ 'వచ్చారా' అన్నది.

''పద్మా, ఏమిటి ఇలా పడుకున్నావా? మంచమెక్కి మనసు తీర్చుకోవాలనుకుంటున్నావా?'' చురుక్కు మనేటట్టు ఒకమాట జారవిడిచాడు.

''నిన్నటి నా బాధకు తిరిగి మిమ్మల్ని చూస్తాననుకోలేదు వదినె వచ్చిన తరువాత నా భారమెంతో తగ్గింది.'' ఆ మాత్రం మాట్లాడినందుకు చాలా అలసినట్టయింది ఆమెకు.

అంతలో సుందరం డాక్టర్ని తీసుకు వచ్చాడు.

జ్వరం చాలా తీవ్రంగా ఉన్నట్టుంది. నిన్న నేను రాసిచ్చిన మాత్రలు తెప్పించి ఇచ్చారా?'' పరీక్ష చేస్తూ అడిగాడు డాక్టరు.

''వేసుకున్నావా పద్మా? సుందరం తెచ్చిచ్చాడుగా'' అన్నది కామమ్మ.

''వేసుకున్నట్టు లేదు. అన్నీ దిండుకింద పెట్టగా చూశాను'' అన్నాడు సుందరం మంచానికి దగరగా నిలబడి.

"అలా అయితే నేను వచ్చి ఏం లాభం ? మందులు రాపిస్తే ఏం లాభం ? మందు తీసుకోకుండా డాక్టర్ని చూడగానే రోగాలు తగ్గుతాయా ? ఇప్పుడు ఒక ఇంజక్షన్ యిస్తాను. ఇప్పుడైనా ఆ మాత్రలు వాడటం మొదలుపెట్టండి. మళ్ళీ సాయంత్రం వచ్చి చూస్తాను" మందలించాడు డాక్టరు. అతడు సదాశివానికి బాగా తెలిసినవాడు. కుటుంబ మిత్రుడు, అప్పుడప్పుడు అతడి అవక తవక మాటలకు అతణ్ణి చీవాట్లు పెడుతూ ఉంటాడు చనువు కొద్దీ.

డాక్టరుగారూ ప్రమాదమేం లేదు కదా ? ఆతురత కొద్ది అడిగింది కామమ్మ.

"డాక్టర్. ఏమిటీ జబ్బు ? నిజంగా ప్రమాదకరమైనదా ? లేక ఉత్త జ్వరమా ?" అనుమానంగా అడిగాడు సదాశివం.

సదాశివం మాటలకు డాక్టరు ముఖం చిట్లించాడు.

"మిస్టర్ ఉత్తజ్వరాలే ప్రమాదకరమయినవిగా మార్తాయి. మీరిలా అశ్రద్ధ చేస్తుంటే. అన్నిటికంటే రోగి సహకారం ఎక్కువగా కావాలి. రోగికి బ్రతుకుమీద ఆశ ఉంటే తప్పకుండా సహకరిస్తుంది. కాని ఈమె ఏ మాత్రం సహకరించటం లేదు" అన్నాడు డాక్టరు,

అయితే మనమే బలవంతంగా ఇస్తూ ఉండాలి" అన్నది కామమ్మ.

"అక్కయ్యా జ్వరం జ్వరం అంటున్నారు కాని-మనిషి ఏమాత్రం తీసి పోలేదే ? మీరంత ఆదుర్దా పడుతున్నారెందుకో నాకర్దం కావటంలేదు" అన్నాను సదాశివం కనుబొమలు చిట్లించి.

కామమ్మకు సదాశివం మాటలు చికాకు కలిగించాయి. అన్నీ వక్రంగా మాట్లాడుతుంటే చెవులు మూసుకుంటోంది.

"ఉండరా నీ గొడవ మధ్యన ? నీ మాటలు నాకర్థం కావటంలేదు. కాసేపు ఆవతలుండు" విసుక్కుంది కామమ్మ.

రెండు రోజులు కామమ్మే మాత్రలు పద్మ నోట్లో వేసి మంచినీళ్ళిచ్చింది

"ఒదినా ! ఒదినా ! ఒకమారిలా రండి" పద్మ వదినగారిని పిలిచింది మూడోనాడు.

"ఏం పద్మా? నిన్నటికంటె కులాసాగా ఉందా? కొంచెం జావ చేసివ్వనా?" తల వెంట్రుకలు సర్దుతూ అడిగింది కామమ్మ.

విరక్తిగా నవ్వింది పద్మ "నిన్నటి కంటె నయమే.

కాని-ఒదినా నాకు ఎందుకు ఇంత శ్రద్ధగా మందులిచ్చి బతికిస్తున్నారు?"

"అవేం మాటలు పద్మ? నీవు ఎప్పుడు కళ్ళుతెరచి మాట్లాడతావా అని నేను ఎదురుచూస్తుంటె ఇట్లాగా నీవు మాట్లాడేది? ఎందుకిలా నీవు మాట్లాడేది? ఎందుకర్రా ఇలా మారిపోయినారు మీ ఇద్దరూ?" విచిత్రంగా చూసింది కామమ్మ.

దుఃఖం పొంగుకుంటూ వచ్చింది పద్మకు "నయమయితే నాకేమయినా సుఖమా? ఎవరికైనా సంతోషమా?"

"అదేమిటే పిచ్చిదానా! నీకు నయమయితే మాకందరికీ సంతోషం కాదూ? నీవు లేచి మాట్లాడావని సదాశివానికి చేటంత ముఖమయింది చూశావా?" కామమ్మ వింతగా పద్మను చూసింది.

పద్మకు ఏడుపు ఆగలేదు "లేదు ఒదినా లేదు. ఆయనకు జబ్బు చేసినప్పటి నుంచీ స్వభావం మారిపోయింది. ప్రతిదానికీ సాధింపు ఎక్కువయింది. మాటలతో చిత్రవధ చేసేస్తున్నారు ఎందుకు బ్రతికున్నానా అని అనిపిస్తోంది. హాయిగా పునిస్త్రీ చావు చస్తే ఎంతో పుణ్యం కూడాను" ఏడుస్తూ అంది.

"ఎవరు చెప్పారు నీకు?" గట్టిగా అరిచింది కామమ్మ.

"ఆయనే చెప్పారు" దీనంగా ఉంది పద్మ ముఖం.

"ఊరుకో పద్మా వాడేదో నవ్వులాటకని ఉంటాడు నీవు ఆ మాత్రం దానికి దిగులు పడటం బెంగ పెట్టుకోవటమూనా? అసలు జీవితంలో నైరాశ్యం తెచ్చుకోవచ్చా? వాడికి జబ్బు చేసినప్పటి నుంచీ కోపమూ, విసుగూ ఎక్కువయినట్టుంది"

"కాదు ఒదినా కాదు అది రోగులందరికీ వచ్చే సామాన్యమైన కోపం కాదు" ఎర్రబడిన ముఖాన్ని కళ్ళనూ కొంగుతో అద్దుకుంది.

"ఆఁ— కాక మరేమిటే పిచ్చిదానా?" ఆమెకు పద్మ మాటలు వింతగా వినబడుతున్నాయి.

"ఆయనకు తను చచ్చిపోతానన్న భయం పట్టుకుంది. దానితోపాటు ఆరోగ్యంగా ఉన్నవాళ్ళను చూస్తే ఒక విధమైన కోపం, కసీ రోజు రోజూ ఎక్కువ కావటం మొదలయింది. పొద్దున లేచినప్పటినుంచీ ఒకటె సాధింపు——" నేను పోయిన తరువాత నీకూ చింత లేకుండా హాయిగా ఉందామని ఉంది కదూ ?" అంటూ. ఒదినా ! నాకు తను పోయిన తరువాత అంత సుఖంగా ఉంటుందా అసలే ఆయనకీ జబ్బు వచ్చిందని నేను బాధ బాధ పడుతుంటె పైగా ఈ సాధింపులు ఇంతకంటె చస్తే నయం కదూ ?" వదినగారిని పట్టుకుని బావురుమని ఏడ్చింది పద్మ.

ఏమిటే ? ఎక్కడా వినని కబురు వినిపిస్తున్నావు ? పిలిచి నాలుగు చీవాట్లు పెట్టనా ?"

"వద్దు వదినా వద్దు మనమిప్పుడు ఏ మాట మాట్లాడినా ఆయన పెడర్థాలే తీస్తారు. లాభం లేదు" అంతలో అవతలి గదిలో అలికిడి వినిపించి ఆగింది పద్మ.

"అయితే ఏం చేద్దామంటావే మరి" కామమ్మ తల నొక్కుకుంది.

మరునాడు కామమ్మ సదాశివాన్నిచూసి "నీవు వేడినీళ్ళ స్నానం చేశావు కదూ ! ఇలా వచ్చి కూర్చో పది గంటలు కాగానే అన్నం పెడతాను" అప్యాయంగా పిలిచింది.

"అక్కయ్యా నీ చేతి పథ్యం తిన్న తరువాత ప్రాణం లేచి వచ్చినట్లయింది. ఇక్కడే కొన్నాళ్ళు వుండిపోకూడదూ ?" ప్రాధేయపడ్డాడు

"ఉండటానికేంరా ? వుంటాను కాని ఇంట్లో ఇబ్బంది. నీవు లేచి తిరుగుతున్నావుగా, ఇంకెందుకు చెప్పు ?" అతడి ముఖంలోని మార్పులు చూడాలని ప్రయత్నిస్తోంది.

"అక్కయ్యా ! ఒక్కమాట. పద్మ సంగతేమిటి ? డాక్టరేమన్నాడు ?" విసుగ్గా ప్రశ్నించాడు.

"ఆయన చెప్పటమెందుకురా ? నీకు కనబడటంలేదూ ? మనిషిని చూస్తే ఏమనిపిస్తున్నదని" మందలించినట్టుగా అంది.

"నామటుకు నాకు జబ్బుగా ఉన్న మనిషిలా అనిపించటం లేదు" పెదవులు విరుస్తూ అన్నాడు.

"అదేమిట్రా ? పదిహేను రోజులనుండి లంఖణాలు చేస్తుంటే నీకేం కనబడటం లేదూ ? మంచానికి అంటుకు పోతేనూ ?" చీవాట్లు పెట్టింది.

"ఆ.... నిజంగా అన్ని లంఖణాలు చేసినదే అయితే ఈపాటికి ప్రమాదం చేసి ఉండాలి కాని-అలా జరగలేదే ?"

"అలా జరగాలని ఉందా నీకు ? ఏం మాటలివి ? నీ బుద్ధి ఇలావ క్రించి పోతోందేం ? ఆ జ్వరానికి ఉన్న గడువు తీరితేగాని తగ్గిపోదు, నీ పిచ్చిమాటలు తగ్గించి మామూలుగా మాట్లాడు"

ఆమెను వెన్నంటి వంట యింట్లోకి వెళ్ళా౯ "అంత జ్వరం వచ్చిందంటు న్నావు. అన్ని లంఖణాలు చేసిందంటున్నావు. కాని పద్మ మాట్లాడుతూ మంచ మ్మీదనే ఉంది. ఎట్లా నమ్మమంటావు ?"

"ఇంక చాల్లేరా నీ కబుర్లూ నీవూను" ఆమె వంటపని చూసుకోవటం మొదలు పెట్టింది.

సదాశివం ధోరణిలో ఈ మధ్య మార్పు వచ్చింది. ఎవరయినా పలుకరిస్తే ఉలిక్కిపడి అప్పటికప్పుడు ఈ లోకంలోకి వచ్చినట్టుంటాడు. అతడికి ఇప్పుడిప్పుడే ఓపిక వస్తున్నట్టుగా ఉంది. అయినా పద్మ కంటె తను బలహీనంగా ఉన్నాననుకుంటాడు. ఆనాడు పద్మను చూస్తే ఎక్కడలేని కసీ కనబరుస్తున్నారు.

వారం రోజుల తరువాత డాక్టరు వచ్చి సదాశివాన్ని బాగా పరీక్షచేసి "మీరు పూర్తిగా కోలుకున్నారు. విశ్రాంతి కూడా బాగానే తీసుకున్నారు. ఇంక మీరు ఉద్యోగంలో చేరవచ్చు" అన్నాడు.

సదాశివానికి అప్పుడే నీరసంతో తల వాలి పోయినట్లయింది. "ఇంకా పత్తువ రాలేదనిపిస్తోంది డాక్టరుగారూ ! ఉద్యోగంలో చేరిన మూడోనాడే మళ్ళీ మంచం ఎక్కాను కదా ?"

డాక్టరు నవ్వాడు "ఆదంతా మీ భయం మీకు ఇప్పుడు ఏ మాత్రం బలహీనత లేదు. హాయిగా ఉన్నారు మీ తూకం కూడా పెరిగింది. ఇలాగే పుష్టికరమయిన ఆహారం తీసుకోండి."

సదాశివానికి మనసులో భయం, సవాలక్ష సందేహాలు "డాక్టరుగారూ ఒక్కొక్కప్పుడు నాకు మానసికంగా ఒక విధమయిన ఒక విధమయిన డిప్రెషన్ వస్తుందండీ" బాధతో మూలుగుతూ అన్నట్టు అన్నాడు.

"అయితే-అలా వచ్చినప్పుడు మీకేమనిపిస్తుంది? దానికి కారణం కనబడటం లేదే!"

"ఏదో నిస్పృహ కలుగుతూ ఉంటుంది డాక్టరుగారూ! అలా నీరసం వచ్చినప్పుడు ఒక విధమైన ఉద్రేకంకూడా వచ్చినట్టుంది అయోమయంగా ఉంటుంది"

డాక్టరు పగలబడి నవ్వాడు. అతడితోపాటు సుందరంకూడా నవ్వాడు.

"చూడండి మిస్టర్ - మేము రోగులను ఎంతో మందిని చూసి ఉంటాం కదా. పుస్తకాలల్లో రాసిన దానికంటే అనేక రకాల నగ్న సత్యాలను చూస్తాం. ఇది కేవలం అనుభవం మీద చూస్తేనే తెలుస్తుంది. కొందరు రోగులకు కోలుకుంటున్నా సరే, చావు భయమెక్కువ. ఆ భయంతోపాటు ఆరోగ్యంగా ఉన్నవాళ్ళను చూడగానే తమకా ఆరోగ్యం లేదని అసూయగా మంటగా ఉంటుంది. ఎవరిని చూసినా చికాకు-ఏది చూసినా చికాకుగా ఉంటుంది. అంతేనా? ఇలాంటిదేనా మీ బాధ?"

"సరిగ్గా అట్లాకాదు గాని ఎవరిని చూసినా ఏదో చికాకుగా ఉంటుందండి" అన్నాడు సదాశివం.

"అదేలెండి నేను చెబుతున్నాగా ఎంతోమందిని చూశానని? కొంతమందికి జబ్బు చెయ్యగానే చిర చిరలు వస్తాయి."

డాక్టరు మెల్లగా కుర్చీలో సర్దుకుని కూర్చున్నాడు

"మీరనేదంతా పిల్లల విషయంలో ననుకుంటా" సదాశివానికి తెలుస్తోంది — ఇదంతా తన సంగతి కాదు కదా అన్న అనుమానం కూడా వస్తోంది.

డాక్టరు ముఖంలో కొంచెం ఆవేశం కవబడ్డది. "పిల్లలకు కాదు - పెద్దలకు కూడా ఉంటుంది. చివరకు అది ఎంతవరకూ వస్తుందంటే-ఎవరికయినా జబ్బు చేస్తే "ఇంకా చావరే" మనిపిస్తుంది. ఈ లక్షణాలన్నీ జబ్బు నయమయిన తరువాత కోలుకునేటప్పుడు కొందరు రోగులలో కలుగుతాయి" ముఖం రుమాలుతో తుడుచుకున్నాడు డాక్టరు.

ఉలిక్కిపడ్డాడు సదాశివం.

"డాక్టరుగారూ! నా సంగతి చెప్పాడు. నేను వుద్యోగంలో చేరిపోతాను. కాని మా పద్మ సంగతేమిటి!" సదాశివం తల వంచుకునే అడిగాడు.

ఈ ప్రశ్నకోసమే. ఎదురు చూస్తున్నాడు డాక్టరు. ఘాటుగా జవాబివ్వాలనుకున్నాడు.

"మిస్టర్ మీరు చదువుకున్నారు. ఈ పాటికి గ్రహించుకున్నారనుకున్నాను. ఇందాకటినుంచి నేను చెబుతున్నదంతా అక్షరాలా మీపట్ల నిజమని ఋజావు చేసుకున్నారు. మీ మనసులో మార్పు వస్తేనేగాని ఆమె ఆరోగ్యం కోలుకోదు. మీ సూటిపోటీ మాటలు ఆమెను కోలుకోనివ్వటంలేదు. మీకేం ప్రాణ భయంలేదు ఆమెను కూడా బ్రతకనివ్వండి. అసలే ఆమెది సున్నితమైన మనసు" అవేశంతో అన్నాడు డాక్టరు.

"అదేమిటి నా మీద అంత పెద్ద అభాండ వేస్తున్నారు! నా భార్యకు త్వరగా నయం కావాలని నాకు ఉండదా!" కొంచెం తీవ్రంగా అన్నాడు సదాశివం.

"ఉండాల్సిందే. అలా వుండటమే ఆరోగ్యం లక్షణం మిత్రమా, నాదొక చిన్న సలహా. మీ అక్కగారు ఎలాగూ వెళ్ళిపోతానంటున్నారు. మీరూ సుందరం ఇక్కడుండి, ఆమెను మీ అక్కగారితో పంపండి. ఒక నెలరోజులు చాలు, ఇది మీరవశ్యంగా తీసుకోవలసినమందు చాలాసేవయింది. నా నర్సింగ్ హోంలో మీలాంటి రోగులకు ఇలాంటి మందులు బలవంతంగా మింగించాల్సి వుంది. మరి వెళ్లాను" లేచాడు డాక్టరు.

"అసలే రోగిష్టివాడిని, నా కింతచేసి పెట్టకుండా ఆమెను పంపించేస్తే ఎలా డాక్టర అదిరిపడ్డాడు సదాశివం

"మిస్టర్ నేను డాక్టర్‌ని. ఏ రోగానికే మందివ్వాలో నాకు బాగా తెలుసు. నేను చెప్పినట్టు మీరిద్దరూ వినాల్సిందే" లేచి గబ గబా అడుగులు వేస్తూ వెళ్ళి కారులో కూర్చున్నాడు.

మరునాడు పద్మ సామాను సర్దుకొని బండెక్కుతుంటే వీధి వాకిట్లోకయినా రాలేదు. సదాశివం. అతడి కడుపులో తాటాకు మంటలాంటిది భగభగ మండు తున్నది.

(జయశ్రీ - సంక్రాంతి సంచిక)



# మత్తెక్కించే మందహాసం

తులసి ఇంట్లోకి ధూకుడుగా వస్తుంటే- "ఏమోయ్. ఇవాళయినా మనకు పనిమనిషి దొరుకుతుందా? బట్టలుతుకుతుంటే చేతులు గురిజేస్తున్నాయి. గిన్నెలు తోముతుంటే చేతులు మంటలెక్కుతున్నాయి" ఎంతో బాధ పడుతున్నట్టు ముఖం పెట్టింది నందిని.

"చూడు నందినీ, నా పని మరీ అధ్వాన్నంగా ఉంది. రాత్రి ఒళ్ళునొప్పులతో నిద్రపట్టలేదంటే నమ్మ. తెల్లవారి లేవలేకపోయాను. ఆయనకు నన్ను చూస్తే ఒకటే నవ్వు. 'ఎంత సుకుమారివ'ని ఒకటే ఆక్షేపిస్తున్నారు. మరి ఈ మధ్య అలవాటు తప్పిపోయింది కదా. అంట్లుతోమటం బట్టలుతకటం ఎప్పుడూ చేయ లేదనుకో. చిల్లర పనులే కావలసినన్ని కుంగదీస్తుంటే ఈ పనులు కూడా చేయ మంటే సాధ్యమా?" తులసి కంటె నందిని బాగా అలిసిపోయినట్టు కనబడినా గడగడా మాట్లాడింది తులసి

"ఏం చేద్దాం" అనుకుంటూ ఇద్దరూ చిన్నబోయిన ముఖాలతో నిలబడ్డారు.

"నందినీ మనకిక్కడ పనిమనుష్యులు దొరకటం చాలా కష్టం. ఈ శ్రీమంతుల లోకాలిటీకి సామాన్యులు రారు. ఎవరయినా కంటికి కనబడితే సౌకర్ల కోసం వాకబు చెయ్యవచ్చు. మనం ఆ ఎదురుగా ఉన్న కాలనీకి వెళ్ళితే ఏ ఇల్లాలి నడిగినా ఒక మనిషిని పంపే అవకాశం ఉంది. కాని. తెలియని వాళ్ళ యింటికి వెళ్ళటం చాలా కష్టం" తులసి ముక్కు చిట్లించింది.

"ఇదివరకూ ప్రభుత్వం ఒక్కొక్క ఆఫీసరుకు ఇద్దరూ ముగ్గురూ జవాన్లను ఇచ్చేది. ఇస్తే ఒకరిని వంట వాడికింద వేసుకున్నా, మిగతా ఇద్దర్నీ ఇంటిపనుల కింద ఉపయోగించుకునే వాళ్ళం ఇంటికి జవా న్లను ఇవ్వటమే మానేసింది ప్రభుత్వం. ఇది అన్నివిధాలా ఇబ్బందిగా ఉంది"

"మనకు స్వాతంత్ర్యం వచ్చింతరువాత నానాటికి తీసికట్టుగా ఉంది వ్యవహారం.

ఇద్దరూ మాట్లాడడానికేమీ లేదన్నట్టుగా మౌనంగా ఉండిపోయారు. వాళ్ల ముఖాల మీద అంతులేని దిగులు పేరుకుపోయి ఉంది. బిక్క ముఖాలు పడ్డాయి ఇద్దరికీ వారం రోజుల నుండీ వాళ్ళిద్దరికీ ఇంట్లో పాచిపని చేసే నౌకర్లు లేరు. అంతా గచ్చుచేసిన వారికి పెరడూ కనుక తెల్లవారక ముందే రబ్బరు ట్యూబుతో కడిగినట్టు నీళ్లు చల్లేస్తున్నారు. వాకిట్లో ముగ్గులు వెయ్యక్కర్లేదు. సిమెంటు మీద రంగులతో రంగవల్లులు తీర్చిదిద్ది ఉన్నాయి. ఇద్దరూ నీళ్ళగదుల్లో సబ్బుపొడి తీసుకుని స్టీలు గిన్నెలే కనుక కడిగేసుకుంటున్నారు. స్నానాలు కాగానే సర్ఫులో బట్టలు నానబెట్టుకుని ఉతికి అరవేసుకుంటున్నారు.

ఇలా ఒకటి....రెండూ....మూడూ....వారం గడిచింది.

అరక దున్నే రోజులు. విత్తనం చల్లి వస్తామని పనిచేసే ఆడ నౌకర్లు ఊళ్లకు వెళ్లారు కుటుంబాలతో సహా.

కొన్ని ఇళ్లల్లో నౌకర్లు లేకపోయినా దినకృత్యాలు చాలా సులువుగా జరిగి పోతున్నాయి కొన్ని చోట్ల అదొక సమస్యగా లేదు. కాని—అన్నిటికీ నౌకర్ల మీద ఆధారపడే నందినీ తులసీల వంటి వాళ్లకు దినదిన గండంగా ఉంది.

నందినీ తులసీల ఇళ్లు పక్కపక్కనే ఉన్నాయి. ఇళ్ల మధ్యగా ఎప్పుడు బడితే అప్పుడు ఆ గోడల దగ్గర నిలబడి మాట్లాడుకుంటూ ఉంటారు గంటల కొద్దీ.

ఆ రోజు గేట్లకు దగ్గరగా నిలబడి ప్రహారి గోడను ఆనుకుని పనిచేసిన శ్రమంతా పోయేటట్టుగా ఎక్కడెక్కడివో ఎప్పటెప్పటివో కబుర్లు నవ్వుకుంటూ చెప్పుకుంటున్నారు.

"అమ్మా ఓ ముద్ద అన్నం వెయ్యమ్మా ఆకలికి చస్తుండా నిన్నటేలనుంచీ"

అరువు వినబడుతున్నా అది వాళ్ళ సంభాషణకేమీ ఆటంకంగా లేదు.

అతడు మళ్ళీ మళ్ళీ పిలిచాడు.

తులసికంటె నందినికి చికాకెక్కువ తన మాట కేవరయినా అడ్డం వస్తే గుర్రెర్ర చేస్తుంది.

"ఛీ ఎవరు నీవు? అలా అరుస్తావేం? ఏదిలేకపోయినా మనకు బిచ్చగాళ్ళకు కొదువలేదు."

అతడొక చెక్కపీట మీద కూర్చున్నాడు. ఆ చెక్కకు నాలుగు చిన్నచిన్న చక్రాలున్నాయి. అతడు నేలమీద చేతులానించి బండిని ముందుకు జరుపుకుంటు న్నాడు.

ఆశ్చర్యంతో నందిని "చూడు తలసీ" అన్నట్టు కళ్ళతో చూపించింది.

ఇద్దరూ గేటుమీదుగా ఒంగి అతడిని చూస్తున్నారు.

అతడికి పాతికేళ్ళమీద ఒకటి రెండేళ్లు ఉంటాయేమో. తల వెంట్రుకలు రింగులు రింగులుగా తిరిగి పైకి లేచినట్లున్నాయి. రంగు-నలుపే-కాని అది కారు నలుపు కాదు. తారు నలుపు. నిగ నిగ మెరుస్తున్నది. నిండుగా ఉన్న ఆ ముఖంలో తెల్ల తామరపువ్వుల్లా తేజస్సు నింపుకొని వెలిగిపోతున్నాయా కళ్లు ముక్కు కొన ఒంపు తిరిగి పై పెదవి మధ్యగా ఉన్న గుంటను స్ఫుటంగా కనబరుస్తోంది. ఆ పెద వులు బలిష్టంగా ఉన్నా అదొకమాదిరి అందంగా మొగ్గలా ముడుచుకున్నాయి. అతడు మాట్లాడేటప్పుడు గుండ్రటి ఆ తారు నలుపు ముఖంలో- ఆ నల్లటి పెద వుల మధ్య తెల్లటి పలువరుస కనబడీ కనబడకుండా తళుక్ తళుక్ మంటున్నది. ఆ పలువరుస చూడటం కోసం అతడొకసారి నోరు విప్పితే బాగుండుననిపిస్తుంది ఎవరికయినా.

అతడి ఒంటిమీద గోచీతప్ప మరొకటిలేదు. దేహం బలిష్టమైన కండరాలతో మెలిదిరిగినట్లుంది.

అతడికేసి ఎగాదిగా చూస్తున్నారు నందినీ తులసీ.

తనకేసి వాళ్లిద్దరూ అలా చూస్తుంటే అతడికి ఆశ కలిగింది- అడిగితే ఏద యినా పెడతారని.

"అమ్మా గుప్పెడు మెతుకులుంటే వెయ్యండమ్మా" అంటూ కడుపుమీద కొట్టుకుని చూపించాడు అతడు. వాళ్ళకు జాలి కలిగేటట్టుగా చేతులు పైకెత్తి దణ్ణం పెట్టాడు.

"అబ్బీ చూడు. ఇది భోజనాల వేళ కాదు అన్నం పెట్టటానికి" అన్నది తులసి కాస్త కఠినంగా

"అబ్బీ చూడు. మా రెండిళ్ళల్లో నౌకర్లులేదు. ఊళ్ళకు వెళ్ళారు. నీవే మయినా పనిచేసి పెట్టగలవా? చేస్తే అన్నం వండి అయినా పెడతాను" అన్నది నందిని.

"ఇద్దరు తల్లులూ నన్ను చూస్తుండారుగా! లేచి నిలబడిలేను. నడవలేను. కాళ్ళుపడిపోయ్యాయి. ఏదో రోగం అన్నారు. మందేసుకోటానికి డబ్బులులేవు. ఒక అయ్యను కాళ్ళు పట్టుకొంటే ఈ చెక్కకు చక్రాలు పెట్టి ఇచ్చాడు. ముష్టి ఎత్తుకుని తినటమే నా బ్రతుకు, రోజుకో ఊది." నుదురు కొట్టుకున్నాడు.

"పని చెయ్యలేని వాడికి అన్నం ఎలా పెట్టమంటావు చెప్పు? కష్టం చెయ్యి- తిను" తల ఎగరవేస్తూ అన్నది నందిని. అంతటితో ఊరుకోకుండా మావన్లు మేము చేసుకోలేక నానా యాతన పడుతున్నామని చెప్పాగా?" అన్నది కొంచెం చికాకుగా ముఖం పెట్టి.

"మా తల్లులకు దణ్ణం పెడతా. నన్నుచూసి పని చెప్పండి" తలకు దోపిలి కట్టాడు.

"నీ పేరేమిటి?" అడిగింది తులసి.

"నా పేరా?" నవ్వాడతడు.

అతడి ముఖం వంకే చూస్తున్నారిద్దరూ.

"నా పేరు సుబ్బడండి"

"రా లోపలికి! ముందు అన్నం తిను. తరువాత నీకు చేతనైనంత పని చెయ్యి" గేటు తెరిచి దారి చూపించింది తులసి.

సుబ్బడు నేలకు చేతులానించి బండి నెట్టుకుంటూ వెళ్ళాడు.

తులసి విస్తరాకులో అన్నపెట్టి పచ్చడివేసింది. నందిని కూర పులుసు తెచ్చిపెట్టింది. ఆ కిందటిరోజు రసగుల్లా తెచ్చుకున్న ముంత ఖాళీ అయితే దాన్ని కడిగి మంచినీళ్ళు పోసి యిచ్చింది.

సుబ్బడు అవురావురుమంటూ అన్నం కలుపుకుని తింటూ ఉంటే ఇద్దరూ అతడినే చూస్తున్నారు. వాళ్ళిద్దరికీ ఆ లొకాలిటీలో ఆ మధ్య జరిగిన దొంగతనాలను గురించి జ్ఞాపకం వచ్చి ఒళ్ళు జలదరించినట్లయింది. భయం కొద్దీ ఒణుకు పుట్టింది.

ఇంట్లోచేరి దొంగతనం చెయ్యడు కదా?

ఇద్దరికీ అంతలో కళ్లు పెద్దవయ్యాయి. రెండు చేతులూ గుండెలకు చేర్చుకున్నారు.

మళ్ళీ అంతలోకే ధైర్యం వచ్చింది రెండిళ్ళల్లోనూ టెలిఫోన్లు ఉన్నాయి. అతడేమయినా అనుచితంగా ప్రవర్తిస్తే పోలీసుస్టేషన్‌కు వెంటనే ఫోను చేయవచ్చు కదా అనుకున్నారు. మనసులు తేలికపడ్డట్టయి అమ్మయ్య అనుకున్నారు.

అతడు భోజనం చేశాడు. ముంతెడు నీళ్ళు తాగాడు. ఆకలి తీరిన సంతృప్తి ముఖంలో కనబడుతున్నది. విస్తరి మడిచి ఒక చేత్తో పట్టుకుని మరొక చేయి నేల కానించి చెక్క జరుపుకుంటూ బైటికి వెళ్ళి, చెత్తకుండీలోకి విస్తరి విసిరివేశాడు. లోపలికి వచ్చి తాను తిన్నచోట నీళ్లు చల్లాడు.

"అన్నమయితే తిన్నావు. ఇంక పనిచేస్తావా?" అడిగింది నందిని- కొద్దిగా హేళన ధ్వనించేటట్టుగా.

తల ఊపాడు సుబ్బడు.

తులసి లోపలికి వెళ్ళి టబ్బునిండా అంట్ల గిన్నెలు తెచ్చి పంపు దగ్గర పెట్టింది సీకాయానబ్బు పొడీ కలిపి పళ్ళెంలో వేసి ఇచ్చింది

పీచు సబ్బుపొడిలో అద్దుకొని సుబ్బన్న గిన్నెలు తోముతుంటే నందినీ తులసీ ఎదురుగుండా గట్టుమీద కూర్చుని చూస్తున్నారు.

"సుబ్బన్నా! నీవేం పనిచేసే వాడివి? నీదీఊరేనా?" అడిగింది నందిని.

''మేము ఈతపేళ్ళతో బుట్టలల్లుకునే ఓళ్ళం, ఒక లారీనిండా ఈతపేళ్ళేసు కుని ఏ పట్నమయినా పదిమందిమి పెళ్లాం బిడ్డలతోపోతే-పదిరోజుల్లో ఆ పేళ్ళతో బుట్టలల్లి ఆ ఊళ్ళోనే అమ్ముకుని తిరిగివచ్చే ఓళ్ళం. పిల్లలు- పెద్దలు- ఆడా- మగా- అందరం అన్నిరకాల బుట్టలల్లుతమ్'' తలపైకెత్తి కళ్ళు మూసుకున్నాడు. ఏదో బాధ మనసులో మెదిలినట్లుగా.

''అందుకే గిన్నెలు తోమటం నీకు కొత్తగా ఉంది'' అన్నది తులసి.

''ఎట్లనో బతకాలి గదమ్మా'' నొక్కిపెట్టి పీచుతో రుద్దుతున్నాడు సుబ్బన్న.

''ఆ బుట్టలపని ఎందుకు మానేశావు? చేతిలో పనిపెట్టుకుని తిండికిలేదని బాధపడుతున్నా వెందుకు?'' నందిని ప్రశ్నించింది.

బరువుగా నిట్టూర్చాడతడు.

''గుంపులో ఉన్న ఆడా మగా మధ్య తగవులాట లొచ్చినయ్. కాళ్లూ చేతులూ పట్టుకుని నానోట్లో ఏదో పోశారు. తెల్లారి నాకీ గతి పట్టింది. గుంపులో నుంచి తోసినరు. దిక్కులేక గడ్డ బండిలో కూర్చుని ఈ ఊరు చేరిన'' తలవంచు కుని గిన్నెలన్నీ కడిగి టబ్బులో పెట్టాడు.

''నీకు పెళ్ళయిందా?'' నందిని అడుగుదామని నోరు తెరవబోయే లోపల తులసి ఆడగనే అడిగింది.

''అయింది తల్లీ, మాయమ్మ నాకు పెళ్ళికాదేమోనని చిన్నప్పుడే ఒక పోలేరమ్మతో చేసింది.''

''అంటే- నీ భార్య పేరా అది?''

''కాదమ్మా. దాని పేరు రంగి కాని దాని ఎదటబడి ఎవరూ బతకలేరు. అది పోలేరమ్మ అంతది.''

నందినీ తులసీ ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

''అయితే వెళ్ళిపోయిందా?''

"నన్నే ఎళ్ళగొట్టింది."

అతడు చెప్పినదంతా నిజమేననిపించింది వాళ్లకు. దిగువ తరగతుల్లో విడిపోవటానికి చాలా స్వేచ్ఛ కనబడుతుంది. కొందరు ఆడవాళ్లు మగవాళ్లను చాలా ఏడిపిస్తారు. ఇతడు కొంచెం మెత్తటివాడేమో? ఏడిపిస్తోందనిపించింది.

టబ్బులో ఉన్న గిన్నెలన్నీ తులసి లోపల పెట్టుకుని సబ్బులో నానబెట్టిన బట్టలన్నీ తెచ్చి పడేసింది. అతడు వాటిని ఉదికి పిండిపెట్టాడు.

అట్లాగే అతడు జరుగుతూ లోపలికి వెళ్లి ఇల్లు ఊడ్చాడు. ట్యూబుతో చెట్లకు నీళ్లు పట్టాడు.

ఇక్కడ పని కాగానే నందిని ఇంటికి వెళ్లి పనులన్నీ చేశాడు. ఆ రాత్రి భోజనం నందిని ఇంట్లో చేశాడు. తులసి ఇంట్లో గరాజిలో ఒక మూలకు ఆమె ఇచ్చిన గోనె సంచిమీద పడుకుని తెల్లవాల్చేడు.

నందినీ తులసీ అతడి పనికి మురిసిపోయారు. బట్టలు బాగా ఉదికాడు. గిన్నెలు మెరిసేటట్లు తోమాడు. ఇల్లు చక్కగా ఊడ్చాడు. ఆడ నౌకర్లకంటె ఓపికతో పని బాగా చేశాడని మెచ్చుతున్నారు.

సుబ్బన్న తెల్లవారకుండానే వాకిలి ఊడ్చి నీళ్లు చల్లేవాడు. వాళ్లు నిద్రలేవక ముందే చెట్లకు నీళ్లు పట్టేవాడు.

పనిచేస్తున్నంతసేపూ సుబ్బన్నను మాటల్లో పెట్టి నవ్విస్తూ ఉండేది నందిని.

"సుబ్బన్నా. మొన్న మామిడిచెట్టు కింద పడుకుని ఏదో పాటలు పాడావు. సినిమా పాటలు వచ్చా నీకు? నీ గొంతు బాగుంది. సినిమాలల్లో చేరకూడదూ? డబ్బు బాగా వస్తుంది."

విచారంతో కుంగిపోయిన అతడి మనసు మూలిగినా ఆమె మాటలకు అతడి ముఖమ్మీద మందహాసం రేఖామాత్రంగా పొడచూపింది.

అది చాలా విచిత్రంగా తోచింది నందినికి.

మళ్లీ మళ్లీ ఆ విచిత్రమయిన మందహాసం అతడి ముఖంలో చూడాలని ఆమె ఆశించేది.

ఆమె చిత్రకారిణి. అతడు నవ్వినప్పుడు- అతడు మందహాసం చేసినప్పుడు- అతడి ముఖం గంభీరంగా ఉన్నప్పుడు- ఆమెకు తన చిత్రాలలో నిబిడీకృతం చేయ దలచినదేదో ఎదురుగా సాక్షాత్కరించినట్లుండేది.

ఒకనాడతడు అరటిచెట్ల దగ్గర ఉన్న పంపుదగ్గర బట్టలుతుకుతుండగా నందిని చూసింది. ఆమె, గది కిటికీ దగ్గరగా కుర్చీలో కూర్చుని కుట్టుకుంటున్నది. అతడు ఏదో ఆలోచిస్తూ- మధ్యమధ్య ఆకాశం వైపు చూస్తున్నాడు. నవ్వుకుంటు న్నాడు, అంతలోనే నిరాశలాంటిదేదో ముఖమంతా ఆవరించుకున్నట్టుగా ముఖం చిన్నబోతున్నది. మరుక్షణంలో కళ్లు మెరిసేటట్టు చూస్తున్నాడు.

నందిని ఆ దృశ్యంలోని దీప్తులను భద్రం చేసుకున్నది. విచిత్రంగా కనబడు తున్న అతడి ముఖకవళికలు ఆమె కుంచెలో ఇరుక్కున్నాయి.

ఆమె అతడిని ఆ కిటికీలోంచి చూస్తూ వివిధ భంగిమల్లో చిత్రించింది. ప్రతిరోజూ వాటికి మెరుగులు దిద్దుతున్నది. ఇంకా ఏదో ఒకభావం తాను చిత్రించ లేక పోయాననుకుని బాధ పడుతుంది.

సుబ్బన్నకు ఒంటినిండా బట్టా కడుపునిండా భోజనం అమరేసరికి ముఖం మరింత నవనవలాడుతూ మెరిసిపోతోంది. నిండుగా కనబడుతోంది. కాని అతడి ఆ మందహాసం- అభ్రూకుటి- చికిలించిచూసే ఆ కళ్లలోని దీప్తి- నిమిషాల మీద మారుతున్నట్టు కనబడే ఆ భావప్రకటన- అవిటితనంలోకూడా కుంచించుకుపోని పౌరుషోచితమైన ఆ గాంభీర్యమూ తను చిత్రించగలిగిందా ?

ఇంకా ఏదో వెలితిగా అసంపూర్తిగా ఉన్నాయి తన చిత్రాలు.

నందినికి మరొక సమస్య. అతడి మనసులో ఏముంది ? ఎప్పుడూ ఎందు కట్లా ఆలోచిస్తూ ఉంటాడు ? ఎందుకా నిర్లిప్తత ? అతడేం పోగొట్టుకున్నాడు ? అతడికేం కావాలి ?

ఒకనాడు అతడు గిన్నెలు తోమేటప్పుడు పిలిచింది. అతడు తలఎత్తి చూశాడు.

"సుబ్బన్నా, నీకు పిల్లలున్నారా ?"

అతడు తెల్లముఖం వేశాడు.

"చెప్పవేం?"

"ఏం చెప్పమంటారు తల్లీ?"

"అదే ఉన్నారా లేరా అని."

ఆ మాటకు అతడెట్లా జవాబు చెప్తాడు? అప్పుడు అతడి ముఖం ఎలా ఉంటుంది? అది చూడాలని ఆమె తపన.

"లేరు." తల వంచుకున్నాడు.

"పోనీ ఆ పోలేరమ్మను వదలిపెట్టి ఇంకో అమ్మాయిని చేసుకుంటావా?"

విషాదంలో మునిగితేలే ఒక వింత హాసరేఖ అతడి ముఖమంతా అలుముకుపోయింది. కళ్లెత్తి ఆమె ముఖంలోకి చూశాడు

ఆ కళ్లల్లో అదే నిర్లిప్తత.

పెదవుల మీద అదే విచిత్రమయిన మందహాసం.

నందిని మళ్లీ ఆలోచనలో పడిపోయింది.

తులసికీ నందినికీ ఇప్పుడు ఇంటి పనులను గురించిన చింతలేదు. అవి చాలా క్రమంగా జరిగిపోతున్నాయి. ఇంతవరకూ అతడికి భోజనం పెడుతున్నారు. చెరిఒక జతా బట్టలు ఇచ్చారు. కాని- జీతం ఇంత అని మాట్లాడుకోలేదు.

ఏమిటీ మనిషి? జీతం కావాలని అడగడేం?

డబ్బక్కర్లేదా?

నెల కాగానే "జీతమెంత కావాలోయ్" అడిగింది తులసి.

"కడుపునిండా తింటా ఉన్నా. ఒంటినిండా బట్టలేసుకుంటా ఉన్నా. తొంగోటానికి కూసింతచోటు చూయించినరు. ఇంకేం కావాల తల్లీ?" ప్రశ్నార్థకంగా ఆమె ముఖంలోకి చూశాడు.

"అయితే మాత్రం? జీతం వద్దా? నీ కష్టం మాకెందుకు?"

విషాదంగా నవ్వాడు సుబ్బన్న

నోటితో అడగకపోయినా వాళ్ళే ఇస్తారనుకుంటున్నాడేమో ననుకుంది. తులసి.

నందినీ తులసీ ఒకరినొకరు సంప్రదించుకుని నెలకు ఇరవై వంతున అతడి. చేతిలో పెట్టబోయారు

"మీ తాన ఉంచండి తల్లులూ" అన్నాడు ముఖం పక్కకు తిప్పుకుని.

తులసి పెనిమిటి నరసింహం "ఈ కుంటివాడికింత జీతమెందుకని" మూతి మూడు వంకర్లు తిప్పాడు.

"ఇంటి నౌకర్లు దొరకటం కష్టంగా ఉంది. కుంటి అయినా పనులన్నీ వేళకు జరిగిపోతున్నాయి. రేపటికి పనిమనిషి రాదేమోనన్న బెంగ అక్కర్లేదు" సమర్ధించింది తులసి.

ఇప్పుడు తులసీ నందినీ కూడా నౌకర్లు లేక బాధపడిన ఆ వారంలోజులనూ సూలువుగా మరచిపోయారు. సుబ్బన్న కూర్చుని చేసేపనులు ఇంకా ఇంకా ఎక్కువగా చేస్తున్నాడు. ఆ యింట్లో ఈ ఇంట్లో కూరలు తరగటం, బూట్లు పాలిష్ చేయటం, కుర్చీలూ బల్లలూ తుడవటం మొదలుపెట్టాడు.

శుక్రవారంనాడు తలంటి పోసుకోవటం కోసం తులసి తొందరగా లేచింది. సుబ్బన్న ఇంకా పెరడూ వీధివాకిలి ఊడ్చినట్టు లేదనుకుంటూ తలుపులు తీసి చూసింది. సుబ్బన్న ఊడ్చిన జాడ కనబడలేదు. "సుబ్బన్నా సుబ్బన్నా" అనుకుంటూ గరాజిలోకి తొంగి చూసింది. ఇంటి వెనకకు వెళ్లి చూసింది

జామచెట్టు పక్కకు మూటకట్టినట్టు పడి ఉన్నాడు సుబ్బడు. ఒంటినిండా గాయాలు తగిలినట్లున్నాయి. కళ్లు మూసుకుని మూలుగుతున్నాడు.

"ఏం సుబ్బన్నా? ఏమయింది?" తులసి ఆదుర్దాగా ప్రశ్నించింది.

నోటివెంట రక్తం కారినట్టుంది పెదవుల దగ్గర చారికలు కట్టాయి. పెదవులు కదలించలేకపోతున్నాడు. చెయ్యి కష్టమ్మీద కదలించి గోడవైపు చూపించా .

డ్రైనేజి గొట్టం జాయింటునుండి విడిపోయినట్టుంది. వేలాడుతున్నది.

వెంటనే లోపలికి వెళ్ళి నరసింహాన్ని పిలుచుకువచ్చి చూపించింది. అతడు నందిని భర్త విఠల్‌ను తీసుకు వచ్చాడు.

డ్రైనేజి గొట్టం పట్టుకుని పాకుతూ ఎవరోగాని పైకి వెళ్ళటానికి ప్రయత్నం చేశారని వాళ్ళకందరికీ అర్థమయింది.

"సుబ్బన్నా, నీవు పైకి ఎక్కాలని చూశావా ?" మగవాళ్ళిద్దరూ అతడిని అదిరించి బెదిరిస్తున్నారు.

అతడు లేదని తల ఊపుతూ ఒంటినిండా తగిలిన గాయాలను చూపించాడు.

పడ్డందువల్ల తగిలిన గాయాలని వాళ్ళు అనుమానించి పోలీసు రిపోర్టు చేశారు.

పోలీసులు వచ్చేలోగా తులసి కాఫీ చేసింది. నందిని సుబ్బన్న తెరచిన గొంతులో వేడివేడి కాఫీ పోసింది. పోలీసులు వచ్చేసరికి ఎనిమిది గంటలు దాటింది. అతడు ఈ లోపల కొంత తేరుకున్నాడు.

పోలీసులు అడిగిన ప్రశ్నలకు సుబ్బన్న సరిగ్గా చెప్పలేకపోయినా అతడు చెప్పింది వాళ్లకు కొంత తెలిసింది.

ఎవరో రాత్రి పన్నెండు గంటలకు గేటు దూకి లోపలికి వచ్చి డ్రైనేజి గొట్టం పట్టుకుని పైకి ఎక్కటానికి ప్రయత్నిస్తుండగా అలికిడి విని, సుబ్బన్న జామచెట్టు దగ్గరున్న గునపంతో దానిని పగలగొట్టాడనీ జాయింటు ఊడిపోగానే అతడు కిందపడి చేతిలో ఉన్న కర్రతో సుబ్బన్నను చావ బాదాడనీ గ్రహించారు. తరువాత ఆ లైనులో మరో రెండు ఇళ్ళల్లో దొంగతనాలు జరిగాయని తెలిసి పోలీసులు వెళ్లిపోయారు.

ప్రాణానికి తెగించి సుబ్బన్న చేసిన పనికి నరసింహం విఠల్ ఎంత సంతోషించారో అతడు పడుతున్న బాధకంత విచారపడ్డారు. తులసి చెప్పిన మీదట నరసింహం కారులో సుబ్బన్నను తీసుకుని హాస్పిటల్‌కు వెళ్లి ఒక ఇంజక్షను ఇప్పించి కట్లు కట్టించి తీసుకువచ్చాడు. సుబ్బన్నను వాళ్లు వారం రోజులపాటు

పని చెయ్యనివ్వలేదు. ఇంటి పనులు సంతోషంతో చేసుకుని సుబ్బన్నకు కావలసి నన్ని ఉపచారాలు చేస్తున్నారు అందరూ కలిసి

నరసింహం విఠల్ పొద్దునా సాయంత్రం అతడి దగ్గరికి వెళ్లి ఎలా ఉందో అడిగి వస్తున్నారు. అతడికి మంచమొకటి కొనాలని ప్రయత్నించారు. కాని–అతడు తాను ఎక్కలేనని చెప్పాడు.

ఇప్పుడు సుబ్బన్నపట్ల ఆ రెండిళ్లలోనూ జాలీ, అభిమానమూ అంతు లేకుండా పుట్టుకొచ్చాయి.

రోజులు గడుస్తున్నకొద్దీ సుబ్బన్న వాళ్లకొక ఆత్మీయుడయి మరింత సన్నిహితుడిలా మెలగుతున్నాడు.

విఠల్ నరసింహం ఇంటికి రాగానే ''ఏమిటోయ్ సుబ్బన్నా కబుర్లు?'' అంటూ లోపల అడుగు పెడతారు

ఇలా నెలరోజులయినా గడవకముందే ఒకనాడు మధ్యాహ్నంవేళ నల్లగా లావుగా ఉన్న ఆడ మనిషి సుడిగాలిలా గేటు తెరచుకుని అరటిచెట్ల దగ్గర అంట్లు తోముతున్న సుబ్బన్న దగ్గరకొచ్చి అరవటం మొదలుపెట్టింది.

''ఈడికెందుకు వచ్చినవ్'' సుబ్బన్న ముఖం చిట్లించాడు.

''విన్నిడుస్త ననుకున్నవా?'' గర్జించింది.

''నీ పోకడలన్నీ సయించి ఉరుకున్నా గదా?''

''నా పోకడలెందుకొచ్చినయ్? నీ వల్ల. ఆడోళ్లందరినీ చుట్టూ కూకుండబెట్టు కుని ఇకఇకలూ–పకపకలూ, ఎక్కడికెళ్లిన ఆడోళ్లు, నీకు బుద్ధి చెప్పటానికే నేను మొగోళ్లతో తిరిగిన. ఇంకరాలేదా బుద్ధి? ఛీఛీ ఇసుమంటి మొగోణ్ణి ఎక్కడ సూడలే.''

''నేనేం జేసిన? నాలో తప్పేంది?'' మెల్లగా అడుగుతున్నాడతడు.

''అదిగో. ఆ నవ్వే చెడ్డది. అదే ఆడోళ్లను నీ చుట్టూ చేరుస్తది. పిచ్చెక్కిస్తది. అట్ల నవ్వకుండ ఉండలేవు?'' కొట్టటానికి చేయెత్తింది.

"నా నవ్వు తీరే అంత నేనేదయిన తప్పు చేస్తే అడుగు. అయినా నీవు రాముడెంట ఎళ్లినవ్ కదా?"

"ఎళ్లిన-రాముడెంట నీ మీద కసి తీర్చుకోటానికి కాని -"

"ఇంక ఈడు ఎందుకు బతికిండా అని చంపటానికి వచ్చినవా?"

"అవును. నా కసి నీవు చస్తేకాని పోదు. నీ నవ్వు ఈ జగంలో లేకుండా చెయ్యాల-నేను నిదరపోవాల" ఆ దగ్గరలో ఉన్న కట్టె తీసుకుని ఎత్తింది.

ఆమె చేతిలోని కట్టెను ఎవరో లాగేశారు. ఆమెను వెనక్కు పడేటట్టు తోశారు.

"తల్లీ. మీరెందుకొచ్చినరు తల్లీ ఈడికి? అది పోలేరమ్మ. దూరంగ జరగండి" నందినికి దణ్ణం పెట్టాడు సుబ్బన్న.

నందినిని ఆపాదమస్తకం కళ్లు పెద్దవి చేసుకుని చూసింది రంగిని.

"అః నీవు కూడ పడినవా ఆ నవ్వు మత్తులో? ఊః?" ఉరిమి చూసింది రంగి.

రంగి ఆవరణంలోకి వచ్చినప్పటి నుండీ వాళ్ల సంభాషణ విని కుతూహలం కొద్దీ బయటికి వచ్చిన నందిని ఇంక సహించలేకపోయింది.

రంగి బేచి ఒళ్లు దులుపుకుని కట్టె మళ్లీ ఎత్తింది.

నవ్వులోని మత్తు? నవ్వులోని మత్తు? తనకు ఇంతకాలం నుంచీ స్ఫురించనిది ఇదేనా? మత్తు? మత్తు?

మంగి ఎత్తిన కట్టె సుబ్బన్న తల మీద పడకుండా అడ్డగించిన నందిని తల మీద పడ్డది.

"తల్లీ-నా కోసం దెబ్బ తింటివా తల్లీ" రెండు చేతులతో కళ్లు మూసుకున్నాడు సుబ్బన్న.

ఈ అరుపులకు తులసి పరుగుపరుగున వచ్చింది. నందినిని నడిపించుకుంటూ లోపలికి తీసుకు వెళ్లింది. మంచమ్మీద పడుకోబెట్టి చల్లనీళ్లతో ముఖ

మంతా తుడిచింది. తల తడిమి చూసింది తడి తడిగా ఉన్న తలలో వెంట్రుకలు ఒత్తిగించి చూసింది. పెద్ద గాయము కాకపోయినా చర్మం చిట్లి రక్తం స్రవిస్తున్నది. బట్టతో తుడిచి మందు చల్లి దాని మీద దూది పెట్టింది.

రక్తం చూడగానే తులసికి ఎక్కడలేని ఆవేశం వచ్చింది. ఒక్క అంగలో జేమచెట్టు దగ్గరకెళ్లింది

వాళ్లిద్దరూ ఇంకా అక్కడ ఘర్షణ పడుతునే ఉన్నారు.

''ఏమిటి సుబ్బన్నా ఈ అల్లరి?'' అరిచింది.

''ఈ నచ్చినోడి సంగతి నేను చెబుతా- ఇనుకో. ఈడినుంచే ఒకూళ్లో మా గుంపులో కొట్లాడలు వచ్చి పిల్లను తీసుకుని తల్లీతండ్రీ ఇడి పోయినరు. ఇంకో ఊళ్ళో మేడగలోరు పిల్లకు పెళ్లిచేసి దూరంగా పంపించినరు. నా మెడలో పుస్తె గట్టినా బుద్ధి మారలేదీడికి'' సుబ్బన్న వైపు తిరిగి మెటికలు విరిచింది.

''ఏం సుబ్బన్నా. రంగి చెప్పేదంతా నిజమా?''

తల అడ్డంగా తిప్పుతూ తలకు దోసిలి కట్టాడు.

రంగి సుబ్బన్నను చూస్తూ పళ్లు కొరుకుతున్నది. నిప్పులు కురిపిస్తున్నాయామె కళ్లు.

తడబడుతున్న కాళ్ళతో లోపలికి నడిచింది తులసి సుబ్బన్నను పనిలో ఉంచటమా తీయటమా అనుకుంటూ.

ఫోను ఎత్తి ''మీరు తొందరగా ఇంటికి రండి. ఘోరం జరిగిపోయింది'' అంటూ నరసింహాన్ని పిలిచింది.

(ఆలిండియా రేడియో)



# పసిడి చెక్కిళ్లు

శకుంతల వాకిటి అరుగునానుకుని కొంగుతో కళ్ళు ఒత్తుకుంటూ నిలబడి పోయింది. "ఇవాళ నాకేదో దయ్యం పట్టింది. లేకపోతే ఐదేళ్ల పిల్లవాడిని పట్టుకుని అంతంత దెబ్బలు కొడతానా? ఇదివరకూ వాడు ఎన్నిసార్లు మారాము చెయ్యలేదు? వాడు అలా మారాము చేసినప్పుడు తను ఎన్నిసార్లు మరిపించి బుజ్జగించి సర్దలేదు?" పెద్దపిల్ల సుమ దేనికో ఒకదానికి పేచీ పెడుతూనే ఉంటుంది. ప్రతి పండక్కి కొత్త గౌనుకోసమో పరికిణీ కోసమో మారాము చేస్తూ ఉంటుంది. తను సర్ది చెబుతుంది. బ్రతిమిలాడుతుంది. కాని ఎవరిమీదా ఇంతవరకూ చెయ్యి చేసుకోలేదు. తనలో తను గొణుక్కుంటోంది.

శకుంతలకు ఏదో ఆవేదన తపన- ఊపిరాడనీయకుండా ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. వీపుమీద దెబ్బ పడ్డప్పుడల్లా అమ్మో అమ్మో అంటూ గావుకేకలు పెట్టి ఏడ్చిన కిట్టూ కళ్ళముందర నిలబడినట్టుగా ఉంది. కిట్టూను కొట్టిన చేతులను అసహ్యించుకుని గోడకేసి బాదింది. మంటలెత్తిన చేతులను "కిట్టూను నిర్దాక్షిణ్యంగా బాదలేదూ? అంతే, అనుభవించండి" అన్నట్టుగా దూరంగా విసిరింది.

శకుంతల కళ్ళు అప్రయత్నంగా మేడమీది బాల్కనీవైపు మళ్లాయి. రేఖ ఏడాది పసిబిడ్డను ఎత్తుకుని బిస్కెట్టు తినిపిస్తున్నది. ఆ బిడ్డ ఆరోగ్యంగా బొద్దుగా ముద్దుగా నవ్వులు చిందిస్తున్నాడు. ఆ బిడ్డ నవ్వుచూసి రేఖ మురిసిపోతున్నది.

శకుంతల కళ్ళు భగ్గుమన్నట్లయింది. కడుపులో మంట లేచినట్లయింది. "ఏమిటా మరిపెం? పిల్లలు తనకొక్కదానికే ఉన్నారా? వీధి కెదురుగా నిలబడి ఆ ముద్దులేమిటి?" ఈసడించినట్టుగా ముఖం పెట్టింది.

కడుపులో బాధ మెసులుతున్నట్టుగా ఉంది. కిట్టూను కొట్టినచేతులు భగ్గు భగ్గున మండిపోతున్నాయి శకుంతల తనను తాను తిట్టుకున్నది. శపించుకున్నది.

నిజానికి కిట్టూది ఏం తప్పు? ఆ పసి హృదయం చూసినదల్లా కావాలని అడుగుతుంది. తోటి పిల్లలకు ఉన్న వస్తువు తనక్కూడా ఉంటే బాగుంటుందని మనసు ఆక్రోసిస్తుంది. ముగ్గురు పిల్లలకు అన్న అనే పేరేగాని ఇంతాచేస్తే కిట్టూకి ఎన్నేళ్ళని? ఐదు సంవత్సరాలు వెళ్ళి ఆరో ఏడు నడుస్తున్నది. వాడికే ముద్దు జరిగింది? ముద్దుమాట అలా ఉంచి వాడికి ఏ వేళకు కావలసినవి ఆ వేళకు ఏమి అమిరాయి? ఏడాది వెళ్ళీవెళ్ళకుండానే మణికి అన్న అయిపోయాడు. అంతే. ఆ మరునాటి నుంచీ ఏడ్చిన అరగంటకు విసుక్కుంటూ ఇన్ని నీళ్ళపాలు ఎవరో ఒకరు తాగించేవారు. బట్టలు తడుపుకుంటే మార్చేవారు లేరు. ఒంటినే ఎండిపోయేవి. తనకు చెయ్యి తీరదు. అట్లా చూస్తూ ఉండగానే కిట్టూ తరువాత ముగ్గురు పిల్లలు వరుసగా పుట్టారు. నాలుగోబిడ్డ ఇంకా రెండుమూడు నెలల్లో వెలుగు చూడబోతున్నది.

కిట్టూ చాలా తెలివి కలవాడు. బుర్ర చిన్నదేకాని పెద్దపెద్ద ఆలోచనలు చేస్తాడు. వాడు ఒక్కొక్కమాట మాట్లాడితే కడుపు ఉబ్బేటట్టు నవ్వు వస్తుంది. ఒక్కోసారి మాట్లాడితే ఎంతోసేపు ఆలోచిస్తేగాని అర్థం స్ఫురించదు. ఒక్కోసారి బాణం దూసుకుపోయినట్టుగా గుండెలోనుంచి దూసుకుపోతుంది. కొంటె కొంటెగా మాట్లాడినట్టే మాట్లాడి చురక తగిలిస్తాడు. పిల్లలందరిలోకి కిట్టూ అంటే తండ్రికేదో ప్రత్యేకత ఉన్నట్లే చూస్తాడు. తనకయినా అంతే. ఒక చెంప భయంభయంగా ఉంటుంది. ఒక చెప్ప ఏడ్చాడులే అన్న నిర్లక్ష్యం. అయినా ఇదంతా వాడిని చూడగానే ఎక్కడివక్కడ మాయమయిపోతాయి. ఎంతో సంతోషం- ఎంతో గర్వమూ కలుగుతాయి.

వారంరోజుల కిందట మేడమీద కాపరమున్న రేఖ తన పెద్దకొడుకు రఘు పుట్టినరోజుకు ఆ చుట్టుప్రక్కల ఉన్న పిల్లలందరినీ పిలిచి పళ్లూ మిఠాయి పంచిపెట్టింది. ఆ రోజు రఘు రంగురంగుల గళ్ళసూటు వేసుకున్నాడు. నిండైన బుగ్గలతో కన్ను చెదిరే డ్రెస్సుతో మతాబాలా వెలిగిపోతున్నాడు రఘు. సాయంకాలము నాలుగు గంటలకు వెళ్లిన కిట్టూ ఏడు గంటలయినా మేడదిగి రాలేదు. పిల్లలకు అన్నాలు పెట్టి నిద్రబుచ్చి కిట్టూను పిలవటానికి మేడమీదికి వెళ్లింది శకుంతల. రేఖ తనకొడుకు పుట్టినరోజు అంత ఆడంబరంగా చేయటం తన గొప్పతనము చాటుకోవటానికి కాకపోతే ఇంకెందుకు అనిపించింది శకుంతలకు.

రేఖ యింట్లో హాల్లో ట్యూబులైటు వెలుగుతోంది. పిల్లలు మిఠాయి తిన్న ప్లేట్లదొంతర ఒకమూలగా పెట్టి ఉన్నది. అందరూ వెళ్ళిపోయినట్లున్నారు. రఘుకు దగ్గరగా కిట్టూ కూర్చుని అతడి గళ్ళసూటును చేత్తో తాకి చూస్తూ ''చాలా బాగుందోయ్'' అంటున్నాడు

"అమ్మ షాపుకెళ్ళి రెడీమేడ్ తెచ్చింది ఎంతో తెలుసా ; పద్దెనిమిది రూపాయలు చాకలికి వేసినా రంగుపోదట. హేంగరుకు తగిలించి పెట్టుకుని ఎప్పుడు కావాలంటే అప్పుడు వేసుకోవచ్చు. రేపు స్కూలుకు ఇదే వేసుకువస్తాను'' అంటున్నాడు రఘు గర్వంగా

కిట్టూ ఆ సూటువంక ఆశగా చూస్తున్నాడు. ఆ దృశ్యం చూసిన తరువాత కడుపులో బాధ మెలిపెట్టి నట్లయింది శకుంతలకు.

''కిట్టూ ఇంటికి పోదాం రా.'' అన్నది ఆ బాధనుంచి తప్పించుకోవటానికి.

''కొంచెం ఉండమ్మా'' కిట్టూకి ఆ సూటువంక ఎంతసేపు చూసినా తనివి తీరటంలేదు.

శకుంతల మాట వినగానే రేఖ లోపలినుంచివచ్చి "కూర్చోండి'' అన్నది.

''పిల్లలు పడుకొన్నారు. కిట్టూ కోసం వచ్చాను'' అంటూనే ఒక నిమిషం సేపు చాపమీద కూర్చుంది తలతిప్పి నాలుగువైపులా చూస్తూ.

''ఉవాళ మా రఘు పుట్టినరోజు వాడు తన స్నేహితులనందరినీ పిలవమని పట్టుబట్టాడు. వాడి మాటంటే వాళ్ళ నాన్నగారు కూడా సరేనరే అంటారు అందుకనే పిల్లల నందరినీ పిలిచాను'' అన్నది రేఖ.

తల ఆడించింది శకుంతల. "రండి మా యిల్లు చూద్దురు గాని'' అంటూ లోపలికి తీసుకెళ్ళింది రేఖ ఇల్లంతా చూసిన శకుంతల మనసు అదోలా అయిపోయింది. రేఖభర్త తనభర్త ఒక ఆఫీసులోనే పనిచేస్తారు. ఒక గ్రేడులోనే ఉన్నారు కాని తన సంసారానికీ, రేఖ సంసారానికీ ఎంత తేడా కనబడుతోంది ; రేఖ ముఖంలో ఎంతో తృప్తి కనబడుతోంది సంతృప్తితో కూడిన ఆనందమే ఆమె ముఖంలోని వెలుగు. తనకో ; ఎప్పుడూ ఎడతెగని ఆలోచనలు, ఎప్పుడూ చికాకూ- కోపమూ- చిటపటలతో తనకు తిన్నది వంటపట్టదు.

రేఖ సంసారాన్ని చూసిన శకుంతల తన దురదృష్టాన్ని తలచుకుని ముఖం గంటు పెట్టుకుంటూ "రారా కిట్టూ, ఇంటికి పోదాం" అని కేక పెట్టింది.

కిట్టూ "ఇప్పుడే రాను. ఇంకాసేపుంటా"నని మారాముచేస్తున్నా బరబర లాక్కెళ్ళింది.

కిందికి వచ్చిన తరువాత "ఏమిట్రా ! దేబిరి గొట్టులా వాడి ముందుకూర్చు న్నావు ? వేళకు ఇంటికి రావాలని తెలియదూ ?" గది లోపలికి ఒక్క తోపు తోసింది.

కళ్ల నీళ్ళు చేత్తో తుడుచుకుంటూ పైకి ఏడిస్తే తల్లి కొడుతుందని ఏడుపు మింగుతూ లోపలికి వెళ్ళి పెట్టిన అన్నం తిని పడుకున్నాడు కిట్టూ.

కిట్టూ ముఖం చూడగానే శకుంతలకు జాలికలిగింది కళ్ళల్లో నీటిపొర తేలియాడింది. కాని కడుపులో ఏదో చెప్పలేని బాధ-కసి ఆమెకు ఊపిరాడకుండా చేయటం మొదలుపెట్టాయి. పిల్లలను పడుకోబెట్టి వాళ్ళను చూస్తూ గోడకానుకుని కూర్చుని ఎడతెగని ఆలోచనలలో చిక్కుకు పోయింది కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.

తనతండ్రి ఆరువేల రూపాయల కట్నమచ్చి ఈ పెళ్ళి చేశాడు కాపరానికి వస్తూనే పిల్లల సందడి. డాక్టర్లూ మందులూ, మరదులకూ ఆడబడుచులకూ చదువుల కోసం. పెళ్లిళ్ళకోసం డబ్బు పంపాలి. ఎంతకని ఆ జీతం సరిపోతుంది ? ఎన్నిటి కని సరిపెట్టగలుగుతాడు ఆయన మాత్రం ? నెలలో పదిరోజులు డబ్బును గురించిన ఘర్షణలు భార్యాభర్తలకు. ఒకరి నొకరు అర్థం చేసుకోలేకనా ? ఒకరి మీద ఒకరికి అనురాగం లేకనా ?

కాదు.

మరునాడు సెలవు. పిల్లలు ఆలస్యంగా నిద్రలేచారు. కిట్టూ లేచి స్నానం టిఫిన్ చేసిన తరువాత తల్లి దగ్గరచేరి "అమ్మా ! నాకు రఘుకున్నటువంటివంటి గళ్ళసూటు కొనవూ ?" అడిగాడు.

శకుంతల పిల్లవాడి ముఖంలోకి చూసింది. రబ్బరు బొమ్మలా ముద్దొస్తు న్నాడు. అదిగే తీరు చూస్తే మనసు కరిగి పోతున్నది. కాని అంతలోనే మనసు

గట్టి చేసుకుని "ఏమిట్రా? ఏది చూస్తే అదే కావాలంటావు? నీకు కొంటే అందరికీ కొనొద్దూ?" కసిరి కొట్టింది.

"అమ్మా! ఇంకేమీ అడగనమ్మా. అదొక్కటే కొను. ఇప్పుడు కాక పోతే పోనీ-నా పుట్టిన రోజుకు కొనవూ? నా పుట్టిన రోజుకు కూడా నా స్నేహితు లందర్నీ పిలిచి మిఠాయి పెట్టవూ అమ్మా!" దీనంగా చూస్తూ బ్రతిమిలాడుతూ తల్లి కళ్ళలోకి చూశాడు.

"సరేలే. వాళ్లేదో చేశారని నన్ను కూడా చెయ్యమంటావా?" కేకలేసి పనిలో మునిగిపోయింది

ముఖం చిన్న బుచ్చుకుని కిట్టూ అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

శకుంతలకు ఆ కోరిక కిట్టూ కోరినట్టుగా లేదు. ఎవరో గిట్టని వాళ్ళు తనను అవమానపరచటానికి అడుగుతున్నట్టుగా ఉంది. కోపంతో దేహం దహించుకు పోవటం మొదలు పెట్టింది. కిట్టూ మీద అనవసరంగా కోపం వస్తోంది. వాడిని చీటికీ మాటికీ కారణం లేకపోయినా చివాట్లు వెయ్యబుద్ధి పుడుతున్నది.

సరిగ్గా వారానికే కిట్టూ పుట్టిన రోజు వచ్చింది. రేపు పుట్టిన రోజనగా కిట్టూ తల్లిని మళ్ళీ అడిగాడు. "అమ్మా! నాకు రఘుకు ఉన్నటువంటి గళ్ళసూటు కొనవూ? సరిగ్గా అట్లాగే ఉండాలి."

"చూద్దాంలేరా!" తెచ్చిపెట్టుకున్న శాంతంతో జవాబిచ్చింది.

"మరి-మిఠాయి కూడా తేవాలి".

"సరేలేరా."

"మరి నా ఫ్రెండ్సందరినీ పిలవాలి."

"అవన్నీ ఇప్పుడెందుకురా! వెళ్ళి పడుకో" కసిరింది.

రఘు మాదిరిగా తన పుట్టినరోజు కూడా చాలా ఆడంబరంగా సరదాగా జరుగుతుందని తియ్యతియ్యటి కలలు కంటూ తెల్లవార్చాడు కిట్టూ.

తెల్లవారితే ఏముంది? తలంటి పోసుకున్న కిట్టుకి చాలా సామాన్యమయిన సూటు తెచ్చి వేసుకోమన్నాడు తండ్రి.

"ఇదేం వద్దు నాకు. నాక్కావలసింది రోజా అమ్మకు చెబుతూనే ఉన్నా. విసిరి కొట్టాడు కిట్టు.

"ఒరేయ్. అలా విసిరి కొడితే అది కూడా పోతుంది. శేషుకిచ్చేస్తాను నీ కక్కర్లేకపోతే" అంది శకుంతల బెదిరిస్తూ.

"ఏమిట్రా కిట్టూ! నీ కిది నచ్చకపోతే ఇంకోటి కొంటాంలే. ఇప్పటికిది వేసుకో. రేపే ఇంకోటి తెస్తాను సరేనా?" అన్నాడు తండ్రి కొద్దిగా బ్రతిమిలాడుతూ.

తల్లీ తండ్రీ బ్రతిమిలాడి, ఎంతో నచ్చ చెప్పిన తరువాత, రఘుకు ఉన్నటువంటి గళ్ళసూటు ఇంకొకటి కొంటామని ఆశలు పెట్టిన తరువాత కిట్టూ ఎలాగో ముఖం పెట్టి గునుస్తూ ఆ సూటు తొడుక్కున్నాడు. భోజనాల వేళ "అమ్మా మిఠా ఏది?" అన్నాడు దగ్గుత్తికతో.

శకుంతల కొడుకు పుట్టిన రోజని జీడి పలుకులు వేసి పాయసం చేసింది. గిన్నెలో పోసి కిట్టు కిచ్చింది.

"అయితే సాయంత్రం నా ఫ్రెండ్సందరికీ ఇదే పెడతావా?" సున్నిలా మూతిపెట్టి అడిగాడు

"నీ ఫ్రెండ్సుకా! వాళ్ళందరికీ ఎందుకురా? సాయంత్రం మనిద్దరం అలా బైటికి వెళ్దాం. నీకెన్నో తమాషాలు చూపిస్తాను" తండ్రి బుజ్జగించాడు.

కిట్టూ ఆ రోజంతా చాలా విచారంగా ఉన్నాడు. తన పుట్టినరోజు వచ్చిందని ఎంతో సంబరపడ్డ కిట్టూ చిన్నబోయిన ముఖంతో తిరిగాడు. ఆ పసి హృదయానికి ఎంతో ఆశాభంగమయింది. ఆ గళ్ళ సూటును మరిచిపోదామన్నా మరచి పోలేకుండా ఉన్నాడు. రఘు గళ్ళసూటును ఒకసారి చేత్తో తాకి కంటితో చూడాలన్న కోరిక తీగెలు తీగెలుగా ఇంకా సాగుతునే ఉన్నది.

ఒకనాటి సాయంత్రం స్కూలునుంచి ఇంటికి వచ్చిన తరువాత కిట్టూ మెల్లగా మేడ మెట్లెక్కి "రఘూ" అంటూ పిలిచాడు.

రఘు మెల్ల దగ్గరగా వచ్చి "రా కిట్టూ" అంటూ లోపలికి తీసుకువెళ్ళాడు. ఇద్దరూ కిటికీలో నుంచి బైటికి చూస్తూ ఎన్నోకబుర్లు చెప్పుకున్నారు

"రఘూ! నీ గళ్ళసూటు ఒకసారి చూడాలనుందోయ్" అన్నాడు కిట్టూ

రఘు అలమారీలో నుంచి తీసి మడత విప్పి చేతికిచ్చాడు.

ఒక్కసారి సూటంతా పట్టిచూసిన కిట్టూకి ముఖం చేటంతయింది.

"ఇటువంటి సూటు వేసుకోవాలనుందోయ్ నాకు- దీన్ని చూసిన దగ్గర్నుంచి" మురిపెంతో అన్నాడు.

"అయితే నీ పుట్టిన రోజుకు ఇటువంటిది కొనుక్కోలేక పోయావా?" అన్నాడు రఘు.

"లేదోయ్, మా నాన్న ఇటువంటిది కొనమంటే ఇంకేదో తెచ్చాడు." అన్నాడు వస్తున్న కన్నీళ్ళను ఆపుకుంటూ కిట్టూ.

దాన్ని ఇటూ అటూ తిప్పి చూసి "రఘూ, దీన్ని ఒకసారి వేసుకుని చూడాలనుందోయ్" అన్నాడు కిట్టూ.

"వేసుకోవోయ్. వేసుకుని ఈ అద్దంలో చూసుకో" అన్నా రఘు కిట్టూను అద్దం దగ్గరికి తీసుకువెళ్తూ.

సూటు చేతితో పట్టుకుని నిలబడ్డాడు కిట్టూ తలుపు వైపు చూస్తూ.

"అట్లా భయపడుతూ చూస్తావేం? అమ్మ యింట్లో లేదు. సాయంత్రం ఆరు దాటుతుంది వచ్చేసరికి. భయం లేదు వేసుకు చూడు" అన్నాడు రఘు.

కిట్టూ తన బట్టలు విప్పి, రఘు గళ్ల సూటు వేసుకుని అద్దంలో చూసుకున్నాడు. అంతా సరిగ్గా సరిపోయింది. ఆ రంగురంగుల గళ్ళు తన ఒంటికెంతో బాగున్నాయి. ఆ సూటు వేసుకుని అద్దంలో చూసుకుంటే ఎంతో సంతోషంగా, ఎంతో సంబరంగా ఉంది. ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ, చేతులూ కాలరూ సర్దుకుంటూ అద్దంలో మళ్ళీ మళ్ళీ చూసుకుంటున్నాడు కిట్టూ.

"కిట్టూ, కిట్టూ", ఆ కేక ఎంతో భయంకరంగా వినిపించింది కిట్టూకి. అది అమ్మ గొంతు. మెట్లమీద నిలబడి తలుపు కొడుతోంది. అతడికి ఆ భయంలో ఏం చెయ్యాలో తోచక అలా నిలబడిపోయాడు.

రఘు తలుపు తీసి అక్కడే నిలబడ్డాడు ఆమెను చూస్తూ.

"ఏం చేస్తున్నావురా!" భయంకరంగా కేక పెట్టింది శకుంతల. ఆమెకు తెలుసు రఘు ఇంటికి కిట్టు వచ్చాడంటే ఏదో కావాలని పేచీ పెడతాడని.

కిట్టుకి నోటి మాట రాలేదు. కాళ్ళూ చేతులూ గజగజ వణుకుతున్నాయి.

"మళ్ళీ ఆ సూటుకోసము వచ్చావా? అది తొడుక్కుని చూసుకుంటున్నావా? ఛీ ఇంకొకళ్ళది వేసుకోవచ్చా? పైగా అద్దం చూసుకుంటున్నావా వేసుకుని? ఛీ, వెధవ పనులు!" బలవంతంగా ఆ సూటు విప్పేసి కిట్టూ విడిచిన సూటు తొడిగి, చెయ్యి పట్టుకొని బలవంతంగా కిందికి లాక్కొచ్చి కసి తీరా కొట్టింది.

కిట్టు వెక్కివెక్కి ఏడుస్తూ ఒక మూల కూర్చున్నాడు. మిగతా పిల్లలందరూ తమను కూడా అమ్మ కొడుతుందేమోనని భయపడుతూ గోడకానుకొని నిలబడ్డారు.

అంతలో వచ్చారు కిట్టు తండ్రి కామేశ్వరరావు. అతడిని చూడగానే కిట్టుకి దుఃఖం పొంగింది పైకి. అది చూసి శకుంతలకు కోప మెక్కువయింది.

"చూడండి ఈ వెధవ ఎంత పని చేశాడో? ఆ యింటికీ ఈ ఇంటికీ వెళ్ళి వాళ్లు విడిచిన బట్టలు తొడుక్కుంటున్నాడు" అంటూ మళ్ళీ ఒక దెబ్బ కిట్టు వీపు మీద తగిలించింది. "అమ్మో" అంటూ గావుకేక పెట్టాడు కిట్టు తండ్రి వైపుచూస్తూ.

కామేశ్వరరావు కిట్టును ఎత్తుకుని వీపు మీద రాస్తూ "శకుంతలా, చాలా తెలివి తక్కువ పని చేస్తున్నావు. పసివాడనయినా చూడకుండా అంత దెబ్బ కొడతావా? ఈ పసి హృదయానికేం తెలుసు అంతస్తులూ తరతమ భేదాలు? మనం ఈ పసిబిడ్డల చిన్నచిన్న కోరికలనయినా తీర్చలేక పోతున్నాం. ఈ పసిడి చెక్కిళ్లలోని పాలవెన్నెలలను చూడనోచుకోలేదు. ఇంకా కొంతకాలంపోతే పసిబిడ్డలను చూసి సహించలేకపోతామేమో! అమాయకులయిన పసిబిడ్డలను ఆకారణంగా శిక్షించకు. ఇదంతా నా అనాలోచనవల్ల వచ్చిన లోపం. తప్పంతానాది" అంటూ గుండెమీద కొట్టుకున్నాడు కామేశ్వరరావు కిట్టును గుండెకు హత్తుకుంటూ.

(పంచాయతీ ప్రభుత్వ పక్ష పత్రిక)

# మూ గ జీ వు లు

ఆ విశాలమయిన స్థలంలో ప్రహరీగోడ నాలుగడుగుల ఎత్తు- కత్తిరించిన సరుకుచెట్లు ఆరడుగుల ఎత్తు- తెలుపూ పచ్చటిగోడల మాదిరిగా నాలుగువైపులా అందంగా కనబడుతున్నాయి. ఆ చిన్న బంగళా ఆధునిక సౌకర్యాలతో సరికొత్త నమోనాలో ఆవరణంలో మధ్యగా ఒక అందమైన బొమ్మను నిలబెట్టినట్టుగా ఉంది. బంగళాకు ఎదురుగా నాలుగు చదరపు గజాల హావుజ్ నీళ్లతో నిండి ఉంది. దానిలో బంగారు రంగు చేపలు మునుగుతూ తేలుతూ ఈతకొడుతుంటే తోకలు ఝాడిస్తుంటే చూడముచ్చటగా ఉంటుంది, హావుజ్ చుట్టూ పచ్చిక- దానిచుట్టూ పూలతోట కన్నుల పండువుగా ఉంటుంది. వీధివాకిలి వైపు ప్రహరీగోడ నానుకుని ఒక మోటరు గరాజి- దానికి పక్కగా నౌకరుకొక గది- ఆ గది ముందర గోల్డ్ మొహర్ చెట్టు- తెల్లవారేసరికి ఇంతెత్తు పూలరాసివి రాలుస్తూ ఉంటుంది.

ఇది నశీరుద్దీన్ జాగీర్దారుగారి విలాస భవనము.

"రంగన్నా. ఈ తోటా, ఈ బంగళా బాగా చూశావా? ఈ బంగళాను దులిపి తుడిచి ఎప్పుడూ శుభ్రంగా ఉంచాలి. ఈ తోట ఎప్పుడూ పచ్చపచ్చగా ఉంచాలి. ఏ చెట్టు వాడినా- ఎండినా దొర ఊరుకోడు ఆ మూలనున్న ఎరువులు వేసి నీరు బాగా పట్టు. ఎండల్లోనయినా తోట ఇట్లానే ఉండాలె బంగళా మీద దుమ్ము పడనీయకు. రెండుపూటలా ఊడ్చి కుర్చీలూ సోఫాలూ మలుపు. నీ పని కాగానే ఇంతవండుకు తిను. ఈ గేటు దగ్గర గోనె పట్టాయేసుకుని కూకో. నేను సరింగ మూడు నెలలకు తిరిగొస్త" శాయన్న రంగన్నను కూర్చోబెట్టుకుని బంగళా వైపు చూస్తూ చెబుతున్నాడు.

"అదేం? నీవెటు బోతవు?" ఆశ్చర్యపడ్డాడు రంగన్న.

"నీకు తెలియందేముందిర రంగన్న? మా లింగమ్మకు లగ్గంచేసి అత్త గారింటికంపి వస్త. ఏదయిన కొరవడితే తల్లిలేని బిడ్డ ఏడిచి పోతది" శాయన్న తలపాగా విప్పి మళ్లీ చుట్టుకున్నాడు.

"ఈ దొర ఎన్నడు ఈడికొచ్చేది?" రంగన్న ఆ తోటను మరొకసారి పరికించి చూశాడు. కొత్తగా రంగులు వేసిన బంగళా ముచ్చటగా ఉంది చూడటానికతడికి. కళ్లు పెద్దవి చేసుకుని మరీమరీ చూస్తున్నాడు రంగన్న.

''దొర వస్తడుగాని, ఎన్నడు వస్తడో చెప్పలేము. ఇప్పుడో అప్పుడో వస్తడన్నట్టు ఉండాలె నీవు'' అన్నాడు శాయన్న.

''చూడు రంగన్న. ఊరిబయట ఉన్న బంగళా అని భయపడేవు. అరమైలు దూరం దాటితే చిన్నపెద్ద ఇళ్లు చాలా ఉన్నాయి. జనం తిరుగుతూ ఉంటరు'' అన్నాడు మరచిపోయిన మాటను జ్ఞాపకం తెచ్చుకుని చెప్పినట్టుగా.

రంగన్న ఆలోచనా రహితంగా నిలబడిపోయాడు. తను కమతం చేసేచోట పని ఎక్కువ- ఆదాయం తక్కువ. గొడ్డుచాకిరి చేసినా ఒక గుప్పెడు గింజలు ఎక్కువ ఇచ్చేవారు కారు. చేసిన పనికి మెచ్చేవాళ్లూ కారు కాని- తల్లీ తండ్రీ ఆభూకామందు ఇచ్చిందే తింటూ ఆ గొడ్డు ఛాకిరీ చేయాలంటారు కాని- అక్కడి నుంచి కదలరు. తను కూడా అక్కడే ఉండాలంటారు. ముందు తను పెళ్లి చేసుకుంటే తన భార్యా అక్కడే. తనకు పిల్లలు పుడితే వాళ్లూ అక్కడే. ఇలా తరతరాలుగా ఎదగని జీతంతో చాలని భత్యంతో బతకాలి. ఇక తమ జీవితాలు ఎందులోనూ ఎదగకూడదు. చదువుకోకూడదు. ఇంకో నౌకరీ నాలుగు దబ్బులు ఎక్కువ వచ్చేది చెయ్యకూడదు.

ఏమిటిది? ఎంతకాలం? ఏం బ్రతుకులు?

ఆ రాత్రికి రాత్రి బయలుదేరి వచ్చేశాడు రంగన్న ఏదయినా కాస్త మెరుగ్గా ఉన్న నౌకరీ చూసుకోవాలని.

శాయన్నకు అతడిని చూడగానే ఎంతో సంబర మనిపించింది. సంతోషం కొద్దీ మనసు గంతులు వేసింది. తన బిడ్డకు లగ్గం ఎల్లా చేస్తానని బెంగపెట్టుకున్నాడు. చేసిన అప్పు తీరలేదు. అది తీరందీ దొర పోనీయడు. అసలు ఇక్కడి నుంచి బైటపడటానికి మార్గంలేదని క్రుంగిపోయాడు.

''రంగన్న. నీవు దిగులుపడమాక. నేనిప్పిస్త నీకు నౌకరీ. నేనొచ్చిన దాంక నీవు ఈడుంటివా మంచి నౌకరీ ఇప్పిస్త.'' రంగన్న భుజమ్మీద చెయ్యేసి

నమ్మబలికాడు శాయన్న. చేతిలోకి వచ్చిన పిట్ట జారిపోకుండ జాగ్రత్తపడు తున్నాడు.

"చూడు రంగన్న. దొరవస్తడు. వచ్చినప్పుడు తెలివితో చెప్పిన పని జర మంచిగ చెయ్యాలె. వచ్చినప్పుడు నాలుగు నెలల జీతం ఒక్కసారి ఇస్తడు— మళ్ల ఎప్పుడన్న రానీ. నౌకర్లను దొర మంచిగ చూస్తడు. నీకేం ఫికర్ లేదం టున్న గద?" ధైర్యం చెప్పాడు శాయన్న.

రంగన్న కళ్లు ఒప్పగించి చూస్తున్నాడు.

"దొర విసుమంటోడంటే దొరా అనంగనే ఒంటిమీద అంగీ అయిన తీసి ఇస్తడు. నా బట్టలు చూసినవా? అన్నీ దొర ఇచ్చినవే" పెట్టె తెరిచి చూపిం చాడు రంగన్నకు. చలికి వేసుకునే కోట్లు రెండు– మామూలుగా వేసుకునే అంగీలు— ఖరీదయినవి నాలుగు.

"మరి– రేపు పొద్దుగల పోదునా?"

"పోదువులే" రంగన్న మాటలో ఏదో జంకు కనబడుతున్నది. కలిగిన సందేహం తీరలేదు.

"చీకటి పడకుండ తిందామురా" తన గదిలోకి తీసుకువెళ్లాడు. ఇద్దరూ గిన్నెల్లో అన్నం పెట్టుకున్నారు. కుండలోనుంచి ఉల్లిపాయకారం వేసుకున్నారు.

శాయన్నకు మొదటినుంచీ అన్నంలో చల్లపోసుకుని తినే అలవాటు. ప్రతి రోజూ ఊళ్లోకి వెళ్లి ఎవరినయినా అడిగి చిన్నముంతతో చల్ల తెచ్చుకుంటాడు. అదే రెండుపూటలా వాడుకుంటాడు. రంగన్నకోసం ఆ రోజు మరింత తెచ్చాడు. ఇద్దరూ అదే పోసుకు తిన్నారు.

అన్నం తినగానే శాయన్న ఈతాకుల చాప పరచుకొని బీడి కాలుస్తూ పడు కున్నాడు.

రంగన్న తలక్రింద బట్టపెట్టుకుని పడుకున్నట్టే పడుకున్నాడు. శాయన్న గురక వినగానే లేచి చప్పుడు కాకుండా గేటు తెరదుకొని మెల్లగా ఊరి ముఖంగా నడవటం మొదలుపెట్టాడు.

శాయన్న చెప్పినట్టు అరమైలు దాటితేగాని ఊరు రాలేదు. ఊళ్లో పెంకుటిళ్లు- గుడిసెలు- మిద్దెలు- ఐదారు వందల గడప ఉంది మగవాళ్లు ఇళ్లముందర కూర్చుని మాట్లాడుకుంటున్నారు. ఏడు గంటలయినా కాలేదు. ఇంకా నడుస్తూ పోతున్నాడు. ఊరు నాలుగు వీధులూ తిరిగాడు. ఒక్క ఆడదయినా కనబడలేదు. ఒక్క పిల్ల కనబడలేదు.

ఆ ఊరి జనం రంగన్నను చూడగానే మాట్లాడుకోవటం మానేసి- అతడిని అనుమానంగా చూడటం మొదలుపెట్టారు. ఒకచోట పదిమంది చేరి గుసగుసలాడుకోవటం మొదలుపెట్టారు రంగన్న చొరవ తీసుకుని వాళ్ల మధ్యకు వెళ్లి కూర్చున్నాడు.

అందరూ అతడిని ఉలిక్కిపడ్డట్టు చూశారు. చూపులతోనే గుచ్చి గుచ్చి చూశారు అతడిని.

''మన దేవూరు?'' ఆ గుంపులో పెద్ద అడిగాడు.

రంగన్న చెప్పటానికి జంకాడు. వాళ్లంతా తన ఆచూకీ తండ్రికీ భూకామందుకూ చెబుతారేమోనన్న అనుమానంతోపాటు భయం కూడా కలిగింది

అతడు జవాబు చెప్పటానికి జంకినకొద్దీ వాళ్లకు అనుమానం ఎక్కువ కావటం మొదలుపెట్టింది,

''నాది ఇక్కడే. నేను శాయన్న మేనల్లుణ్ణి. చూసిపోదామని వచ్చిన'' అన్నాడు వాళ్లంతా నమ్మేటట్టుగా.

''నీ అనుమంటి మేనల్లుడుంటే శాయన్న పిల్లను ఎందుకివ్వడు?'' ఆ గుంపులోనుంచి ఎవరో సన్నగా అన్నారు చాటుగా కూర్చుని.

''అవును గద. శాయన్న తనకు మేనల్లుడు ఉన్నట్టు ఎన్నడు అనలేదే?'' మరొకరికి సందేహం వచ్చింది.

''చెప్పడు. చెప్పటానికి మనసిరిగి పోయింది. మా నాయనకూ మామకూ మాటల్లేక చాలా దినాలయింది.'' రంగన్న పరిస్థితులను అతుకుపెట్టటానికి ప్రయత్నిస్తున్నాడు.

"మరి ఇప్పుడెట్ల వచ్చినవ్ ?" సందేహాలు పరిష్కృతం కాలేదు.

నవ్వాడు రంగన్న. "మా నాయన చూడకుండ మాయమ్మ పంపింది."

అందరూ తలలూపి ఊరుకున్నారు. వాళ్ల సంభాషణ మరి సాగలేదు.

రంగన్న లేచాడు. తనను వాళ్లు నమ్మటంలేదు. ఆ ఊరేమో కొత్తగా ఉంది- అనుకుంటూ ముందుకు సాగి వెనక్కు మళ్లాడు. చెట్టుకింద ఒక వృద్ధుడు ఒంటరిగా కూర్చుని చుట్ట కాల్చుకుంటున్నాడు.

"తాతా నా బీడీకి కూసింత అగ్గిపెట్టు" దగ్గరగా కూర్చున్నాడు రంగన్న.

తన చుట్టతో అతడి బీడీ వెలిగించి అప్పటినుంచీ అందరూ అడిగిన ప్రశ్న లడిగాడు తాత. రంగన్న ఓపికతో చెప్పాడు.

తాతకు దగ్గుతెర వచ్చి తిప్పుకునేసరికి అరగంట పట్టింది.

"నీవు సూస్తే సురుకైనవాడిగా ఉన్నవు. ఈ నెత్తురు కూడు కాకపోతే ఇంకెక్కడ బతకలేవా ?" మళ్లీ దగ్గాడు తాత.

రంగన్నకంతా అయోమయంగా ఉంది. కాయన్న తననేదో మభ్యపెడు తున్నాడని అర్థమయింది. తాత దగ్గర కూర్చుని మంచి మాటలు మాట్లాడాడు. అసలు సంగతి చెప్పమని తాతను గడ్డం పట్టుకున్నాడు.

"మరెవరితోనయిన అనేవ్" రహస్యంగా చెప్పుకు వచ్చాడు తాత జాగార్దార్ల పుట్టు పూర్వోత్తరాలు చెప్పి కథ సాగించాడు.

నసీరుద్దీన్ సాబ్ వరెండా పై మెట్టు మీద నిలబడ్డాడు.

మూలనున్న నౌకర్ల గదిలో నుంచి కాయన్న వరుగుల మీద వచ్చి ఒంగి దణ్ణం పెట్టి "ఏం దొరా" అన్నట్టు చూశాడు.

"ఇంకా మోటరు రాలేదా ?" అడిగాడు. ఆ భాష తెలంగాణాలో ప్రభువులు నౌకర్లతో మాట్లాడే తురక తెలుగు. ఆ కంఠస్వరము బానిసలతో మాట్లాడే ప్రభువుల కఠిన స్వరము.

"ఇంక రాలేదు దొర. ఆడిదాక పోయెచ్చిన" శాయన్న మోకాళ్లు రెండూ గజగజ వణుకుతూ కొట్టుకుంటున్నాయి.

నసీరుద్దీన్‌సాబ్ కళ్లు ఎర్రపడుతున్నాయి. కనుబొమలు ముడిపడు తున్నాయి పళ్లు పటపట లాడిస్తున్నాడు.

కారు తీసుకుని వెళ్లిన డ్రైవరు అంతులేడు.

శాయన్న మనసు అయోమయంగా ఉంది. దొర ఇక్కడ ఉన్న నాలుగు రోజులు నలుగురు కొత్త మనుష్యులు కావాలి. వాళ్లు మంచి వయసులో ఉండాలి సారా తాగి సీసాను ఇసిరేసినట్టు ఆ ఆడపిల్లలను తెల్లారినంక కాళ్లతో తన్ని తగిలేసి పోవాలి.

ఈ దారుణ కృత్యానికి అటు డ్రైవరు ఇటూ శాయన్న తలపడాలి. రెండు రోజులు గడిచాయి

ఎట్లా గడిచాయో? అది మూడో రోజు.

శాయన్న డ్రైవరు రాములు మధ్యాహ్నం నుంచి ఆ ఊరంతా తిరిగారు. నచ్చిన మనిషి కనబడలేదు. ఊరికి దూరంగా ఎరుకల వాళ్ల గుడిసెలున్నాయి. ఈత పేళ్లతో బుట్టలల్లుకునే జాతి. పేళ్లు ముందరేసుకుని కత్తితో మరింత సన్నగా చీల్చుకుని బుట్టలల్లుతున్నారు. ఆ తండాలో పదిమంది వరకూ పెద్ద వయసు మగవాళ్లున్నారు. ఇద్దరు వయసులో ఉన్నవాళ్లూ-ఇద్దరు ఇరవై ఏళ్ల ఆడపిల్ల లున్నారు. ఐదుగురు నడీడు స్త్రీలు-ముగ్గురు చిన్న పిల్లలూ ఉన్నారు. ఆడవాళ్లూ మగవాళ్లూ కలిపి పాటలు పాడుతున్నారు. పని చకచక సాగిపోతున్నది.

ఆతండాను వాళ్ళ చేతుల్లో ఉన్న కత్తులను చూసేసరికి శాయన్నకు గుండె లయ తప్పినట్లయింది.

వాళ్ళను ఎట్లా అడగటం? ఏమని అడగడం?

"మీరల్లే బుట్టలు గా గా అమ్ముడు పోతాయా? ఎక్కడినుంచి వచ్చారు?" తెలంగాణా యాసలో అడిగాడు.

"మేము అల్ల ఆ ఊరినుండి ఈ పేళ్ళతో లారీలో వచ్చినాం సామీ. ఈ బుట్టలు ఈడ కొనేవాళ్ళు తక్కువ. కొన్ని పోతయి" ఆ తండాలో మధ్యవయసు మగవాడు జవాబిచ్చాడు.

ఆడవాళ్ళ వైపు చూస్తూ కూర్చున్నాడు రాములు.

మెడలో పూసలదండలు చేతులనిండా కొమ్ముగాజులు మాసి చిరిగిన బట్టలు కట్టుకున్న నిండైన విగ్రహాలు. పసిబిడ్డలు పాలు తాగుతున్నారు. పని సాగుతునే ఉన్నది. చిలిపి నవ్వులు- కొంటె నవ్వులు సాగుతున్నాయి. చేతులు పనిచేస్తున్నా పాటలు ఆపి మాట్లాడుతున్నారు.

మధ్యమధ్య తండా పెద్ద ''ఏహే పని గానీయండి'' అదలిస్తున్నాడు. మళ్ళీ పని చురుకుగా సాగుతోంది.

మెల్లగా రాములు తండా పెద్ద దగ్గరగా జరిగాడు.

''ఇవి గాక చిల్లర పన్లేమయినా చేస్తరా?'' జంకుతూ అడిగాడు.

''ఈ పన్లే చాలు మాకు'' కళ్లయినా తిప్పి చూడకుండా అన్నాడు పెద్ద.

''అదికాదు అన్నా. ఈడ పెద్దదొరోళ్ళ ఇంట్ల నిన్న పయోజనం జరిగినాది. అంట్లగిన్నెలు తోమితే అన్నంపెట్టి పైసలిస్తరు. ఎంత- జరసేపు. ఓర్నన్న పంపుతవా?'' రాములు అతడి బుజమ్మీద చెయ్యేశాడు స్నేహపూర్వకంగా.

తల ఊపాడు పెద్ద. ఆలోచించాడు. కొంతసేపటికి ''ఏమిస్తరు?'' అన్నాడు.

''ఎంత పనిచేస్తే అంత'' ఆశ పెడుతున్నట్టుగా మాట్లాడాడు.

''ఎవరన్న పోతరా?' పెద్ద అడిగాడు ఆడవాళ్ల వైపు చూస్తూ.

నడీడు సత్తి ఎల్లివైపు చూసింది. ఎల్లి మంగివైపు చూసింది. మంగి నాలుగు నెలల గర్భిణి. తొలిచూలు. నిగనిగలాడుతోంది నల్లరూపున.

మంగి ఎర్రోడివైపు చూసింది. ఎర్రోడికి కండ బలమెక్కువ. ముక్కుమీద కోపము. మాటకు మీసం మెలివేస్తాడు. ఎర్రోడంటే వెర్రివాడు కాదు. ఆ తండాలోకి ఎర్రటివాడు. చేతిమీద ఎర్రోడన్న పచ్చకూడా పొడిపించుకున్నాడు.

''నీ పేరేంటన్నపు?'' తండా పెద్ద అడిగాడు రాములను చూసి.

''రాములు''

"ఏం పని చేస్తవు?"

"నేను దొర కారు నడుపుత."

"చూడు. మాతండా ఆడది మగోడు లేంది ఎక్కడబోరు. పనిచేసి ఇద్దరు మడుసులు వస్తరు. మంచి ఇనాం ఇచ్చి పంపాలి. బేగి పంపాలి. కాకపోతే తండా అంత వస్తది'' కళ్లు పైకెత్తి గంభీరంగా అన్నాడు.

ఆ మాటలకు బెదిరాడు రాములు.

"నీవెట్ల జెపితే అట్ల'' కంఠస్వరం తగ్గించాడు రాములు.

శాయన్న దూరం నుంచి చూస్తున్నాడు

"మాట తప్పితే చూసుకో'' మళ్లీ అన్నాడు హెచ్చరింపుగా పెద్ద.

ఓ దణ్ణం పెట్టాడు రాములు. పీక నులిపెయ్యి అన్నట్లు రెండు చేతులు మెడకు తగిలించుకున్నాడు.

పెద్ద కనుసైగ చెయ్యగానే ఎర్రోడు మంగి లేచారు. రాములు లేచి నిలబడి దారితీశాడు. వాళ్ళిద్దరూ బట్టలు దులుపుకుని వెంట అడుగులు వేశారు.

"ఎట్టయిన రాములు అనుబవం కలోడు'' అనుకుంటూ శాయన్న నిలు చున్న చోటినుండి కదిలాడు

ఊళ్లోకి నడుస్తుంటే రాములు గుండె దడదడ లాడింది.

మంగి ఎర్రోడు కొత్త జంటలా ఉన్నారు. ముఖాలు లేతగా ఉన్నాయి. రాములూ శాయిలూ చూడకుండా లోపల్లోపల నవ్వుకుంటూ కొంగులు పట్టి లాక్కుంటున్నారు.

బంగళా ముందుకు రాగానే 'లోపలికి పోదాం' రమ్మని రాములు ముందుకు నడిచాడు.

గేటులో అడుగుపెట్టగానే కనబడిన ఎర్రటి పువ్వులకు మంగి ముఖం చేటంతయింది. రాములు చూడకుండా రెండు పువ్వులు కోసి తల్లో తురుముకుంది. శాయన్న చూసీ చూడనట్టూరుకున్నాడు

ఎడమ చేతి వైపు పెరట్లోకి పోవటానికి మరొక గేటు ఉంది. ఆ గేటు తెరిచాడు రాములు.

"ఎక్కడ పని ?" అన్నట్టు చూశాడు ఎర్రోడు. "సీళ్ల బావిలో నుంచి తోడి తొట్టెలో పోసుకో మంగిలోన అంట్ల గిన్నెలు తెస్తది."

రాములు తలుపు గొళ్లెం తీశాడు. మంగి లోపల అడుగుపెడుతూ ఇటూ అటూ చూపింది. పెద్ద సావడి-నాలుగు వైపులా నాలుగు గదులలోకి దరవాజాలు: వాటికి తెరలు.

"ఎల్లవమ్మా-ఎల్లి గిన్నెలు తెచ్చుకో చెల్లెమ్మా" అంటూ వెనక్కు తెరిగాడు రాములు.

మంగి రాములు చూపించిన గదిలో అడుగుపెట్టగానే దభాలున తలుపులు మూసుకున్నాయి.

ఎర్రోడు సీళ్ల తోడి గాబులు నింపాడు.

మంగికోసం చూశాడు.

ఏదీ మంగి ? అరుస్తూ తనూ లోపల అడుగుపెట్టాడు. అక్కడ అతడికి మంగి కనబడలేదు. మంగీ అంటూ తలుపులు బాదాడు.

లోపలి నుంచి గొద్దు అరిచినట్టు అరుపులు వినబడుతున్నాయి.

బైటినుంచి ఎర్రోడు వెర్రిగా తలుపులు బాదుతున్నాడు. లోపలినుంచి వినపించే అరుపులకు ఎర్రోడు బేజారెత్తిపోతున్నాడు. ఎంతబలంగా తన్నినా తలుపులు కదలటం లేదు.

ఎర్రోడు మందిపడుతూ గేటులోనుంచి అంగణంలోకి వచ్చాడు. అక్కడ శాయిలు లేడు. రాములు కంట పడగానే ఎర్రోడు గొంతు పట్టుకున్నాడు. ఇద్దరూ ఎంతసేపు పట్టుపట్టారు. ముందుగా అనుకున్నట్టు రాములు ఎర్రోడివి చెట్టుకు కట్టేశాడు.

అరిచి అరిచి గొద్దు అలిసిపోయినట్టుంది. అరుపులకు బదులు మూలుగు వినిపిస్తోంది. ఎర్రోడికి ముఖం ఎర్రబడ్డది. హుంకరిస్తున్నాడు. కట్టిన తాళ్ళను వదిలించుకోవటానికి గుంజాకుంటున్నాడు.

సింహాద్వారం భడాలున తెరుచుకుంది. క్రాపు సవరించుకుంటూ దొర చరచర గరాజి దగ్గరికి నడిచాడు. తలుపులు తెరిచి కారు బైటికి తీరాడు. కార్లో కూర్చుంటూ ఇటూ అటూ కలయజూశాడు. తాళ్ళమధ్య గింజుకుంటున్న ఎర్రోణ్ణి చూసి లెడదనక్కొకటి నవ్వి కారు తలుపు వేసుకున్నాడు. కారు దూసుకు పోయింది. ఏ దిశన వెళ్ళిందో కూడా తెలియకుండా.

రాములు ఎర్రోడి కట్లన్నీ విప్పి "అంత గింజుకుంటవ్ ఎందుకు!" అన్నట్టు చూశాడు.

ఎర్రోడికంతా అర్థమయింది. సింహంలా రాములు మీదికి ఎగిరాడు. అతడిని గొడకానించి నిలబెట్టాడు. రెండు చేతులతో మెడ పట్టుకుని పటపటలాడే టట్టు మెడ మెలికలు తిప్పాడు. రాములు గుడ్లు బైటికి వచ్చేవరకూ తిప్పాడు. మెడ వాలిపోయే వరకూ తిప్పాడు. కాలితో ఒక తన్నుతన్నాడు. ఛీ. ఛీ. అని ముఖమ్మీద ఉమ్మేశాడు.

పిచ్చెక్కినట్టు జుట్టు పీక్కుంటూ సింహద్వారం లోంచి లోపలికి వెళ్ళాడు.

పెద్దహాలు. ఆ హాలు అందాన్ని మరొకప్పుడయితే ఎర్రోడు చూసి ఆనం డించేవాడే ఒక పెద్దమంచమ్మీద మంగిపడుంది. తల వెంట్రుకలు చిందరవంద రగా ఇటూ అటూ పాయలు పాయలుగా మంచానికి తలవైపున ఆవరించుకుని ఉన్నాయి. మంగి దేహం అస్తవ్యస్తంగా మంచమ్మీద పడి ఉంది. మంగి మెడ లోని పూసల పేరు తెగి మంచమ్మీద పూసలు అక్కడక్కడ పడ్డాయి. చేతి గాజులు, ముంజేతిగోట్లు విరిగిన ముక్కలు గదినావరించుకున్నాయి. మంగి కళ్ళు అరమోడ్పుగా ఉన్నాయి.

మంగిని కదిలించి చూశాడు. కడుపులోనుంచి దుఃఖం అలలు అలలుగా పైకి లేచింది కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. అంతలో అతడికి కళ్ళు పెద్దవయ్యాయి. ఎర్రటి జీరలు మరింత ఎర్రవయ్యాయి. పిచ్చి ఎక్కినట్టు అక్కడి బీరువా తెరిచి దానిలో ఉన్న బట్టలన్నీ మంగిమీద పడేశాడు. ఆ చుట్టుపక్కల ఉన్న దుప్పట్లు దరవాజాలకు కట్టిన తెరలు తెచ్చి పడేశాడు. రగిలిన చెక్కుకున్న బీడీ అవతల పారేసి అగ్గిపుల్ల గీశాడు.

బైటికి రాగానే మళ్ళీ రాములు శవం కనబడ్డది. మళ్ళీ ఒకసారి ఉమ్మేసి ఒక్కసారి బలంగా తన్నాడు.

ఎర్రోడికి నిజంగా పిచ్చే ఎక్కింది. మంగి మంగి అని గొణుక్కుంటూ, ఏడుస్తూ, నోట్లో తలగుడ్డ కుక్కుకుంటూ ఎవరో తరుముతున్నట్టుగా పరుగుతీశాడు ఆ పరుగు తండా దగ్గరికి కాదు- మరొక దిశకు.

నిజాం నవాబు కాలంలో జాగీర్దారు నశీరుద్దీన్‌సాబ్ తన జాగీరులో నాలుగు చోట్ల కట్టిన అందమయిన ఆ భవనాలలో ఇదొక విలాసక్రీడ. ఈక్రీడలకు నౌకర్లూ ఊరివాళ్ళు అలవాటు పడ్డారు. ఆ ఊళ్ళల్లోని స్త్రీలలో ఎప్పుడు ఎవరికి ఏమి మూడుతుందోనని భయపడుతునే ఉంటారు. కొందరు జాగీరు దాటించి మరొక ఊళ్ళొ కుటుంబాలను ఉంచి చూసి వస్తూ ఉంటారు.

''మేము కొంపాగోడు ఇడువలేక ఉండిపోనాము. కాయన్న తన కిక్కడ ఉండబుద్ధి కాటం లేదన్నడు నాతో'' తాత ఆ ఊరి కథ చెప్పాడు.

రంగన్నకాకథ విన్న తరువాత ఒళ్ళు ఝల్లుమన్నది. రోలుపోయి మద్దెలతో మొర పెట్టుకున్నట్టుందనిపించింది.

తిన్నగా అటునుంచి అటే ఊరుదారి పట్టాడు తన కిర్రు చెప్పులతో. అతడు నడుస్తుంటే తండ్రి మాట్లాడిన మనువు భూలక్ష్మి జ్ఞాపకానికి వచ్చింది. అమావాస్య వెళ్లిన ఐదవవాడు లగ్నం. లగ్నం అయిన మరువాడు మట్టితట్టలు మొయ్యటానికి నాగార్జునసాగరు పోయినా ''నాలుగు డబ్బులు కండ్లబడతయ్'' అనుకుంటూ తలకు తువాలు బిగించి ముందుకు అడుగులు వేశాడు

తెల్లవారి లేచి రంగన్నకోపం చూసిన కాయన్నకు గుడ్లు తేలిపోయాయి. తనకీజన్మకు ఆ బంగళా నుంచి విముక్తిలేదని ముఖం వేలాడేసుకుని కూర్చున్నాడు తలమీద చేతులు పెట్టుకుని.

(ఆంధ్రప్రభ - సచిత్ర వార పత్రిక)



# ఆ మాటకు ఈ జవాబు

''నాన్నా ఆఫీసు దగ్గరికి వచ్చేశాం. ఈ దరఖాస్తులో ఉన్నదే కాకుండా ఇంకా జాలి కలిగించేటట్టుగా నా పరిస్థితిని ఆమెకు నీవు చెప్పాలి'' నడుస్తూ చెప్తు తోంది నళిని తండ్రికి.

అలాగే అన్నట్టు తల ఊపాడు నారాయణ.

''ఆమె చాలా మంచిది నాన్నా. అందరూ ఆమెను గురించి ఎంతో చెప్తు కుంటారు. టీచర్ల కష్టసుఖాలు బాగా ఆలోచిస్తుంది. ఆడవాళ్ల కష్టసుఖాలు ఆడ వాళ్లకే బాగా అర్థమవుతాయి నాన్నా.''

''అయితే మరి- నీవు ఆరునెలల నుంచీ చేస్తున్న ప్రయత్నము విఫల మెందుకవుతోంది? నేను వచ్చి మాత్రం చక్కబెట్ట గలనా?'' అంటున్నాడు నారాయణ.

మరో నాలుగడుగుల్లో ఆఫీసు వచ్చింది. ఇద్దరూ మెట్లెక్కేసరికి జవాను ఎదురుగా వరెండాలోనే కనబడ్డాడు.

''అమ్మగారున్నారా?'' అడిగింది మెల్లగా నళిని.

''భోజనం చేయటానికి లోపలికి వెళ్లారు. ఓ గంట కూర్చోండి. భోజనం చేసి అమ్మగారు రెస్టు తీసుకుంటారు'' అతడి పనిమీద వెళ్లిపోయాడు.

వరెండాలో నాలుగు బెంచీలున్నాయి. పదిమంది వరకూ అభ్యర్థినులు కూర్చుని ఉన్నారు. మూడుగంటల తరువాత జిల్లా విద్యాశాఖాధికారుల మీటింగు ఉన్నట్టు తెలిసింది. రెండుగంటల తరువాత- మూడుగంటల లోపల ఆమె ఈ పది మందికీ ఇంటర్వ్యూ ఇవ్వగలదా అని ఆలోచిస్తున్నాడు నారాయణ.

ఆయనకు ఆ బెంచీల మీద కూర్చున్న టీచరు అభ్యర్థినులను చూస్తుంటే జాలిగా ఉంది. వాళ్ల సమస్యలేమిటో? పెళ్లి అయితే సంసారాలు రెండవుతా

యన్న సమస్య. పెళ్లి కాకపోతే పల్లెటూళ్లల్లో ఒక్క పిల్ల ఎట్లా ఉంటుందన్న సమస్య. అందరికీ నగరాలు కావాలని కోరిక. మరి పల్లెటూళ్లల్లో స్కూలు టీచర్లు పనిచేయకపోతే ఎట్లా? ఆడపిల్లలకే ఈ సమస్యలు కాని మగవాళ్లు ఎక్కడికి ట్రాన్స్ఫరయినా మూటాముల్లే కట్టుకుని వెళ్లటం లేదూ?

ఇంకా మన దేశంలో స్త్రీ విద్యనూ, స్త్రీల ఉద్యోగాలనూ సంఘం హృదయపూర్వకంగా హర్షించటంలేదు. కాని-చదువులూ ఉద్యోగాలూ తప్పనిసరి అయిపోయాయి.

నళినికి ఆ పల్లెటూరి నుంచి ట్రాన్స్ఫరు కాకపోతే చాలా ఇబ్బంది. ఏమిటో ఈ అధికారులు? పరిస్థితులను అర్థంచేసుకోరు. తల గోడకానించి కళ్లు మూసుకుని ఆలోచిస్తున్నాడు నారాయణ. తను ఉద్యోగమూ చేశాడు ఊళ్లూ తిరిగాడు. ఎక్కడికి పంపిస్తే అక్కడికి వెళ్లాడు. పిల్లల చదువులకు ఇబ్బంది అయితే రెండు కాపరాలూ పెట్టాడు. అయితే తనంటే మగాడు కనుక సరిపోయింది. కాని-ఆడపిల్ల-అందులోనూ వయసులో ఉన్న ఆడపిల్ల విషయం అట్లా కాదు కదా?

అంతలో ప్యూను వచ్చి "తొందరగా చీటీ లివ్వండి. ఎక్కువ టైములేదు. అమ్మగారు మళ్లీ కమిటీలో కూర్చుంటారు" అంటూ అందరికీ కాగితం ముక్క లిచ్చాడు పేర్లు వ్రాయమని.

ముందు నళిని ఇచ్చిన చీటీ తీసుకువెళ్లాడు. ఆఫీసు రూమ్‌లోనుంచి వస్తూనే "రమ్మంటున్నారు" అన్నాడు.

కొంగు సవరించుకుంటూ నళిని వెళ్లింది. లుంగువా సర్దుకుంటూ నారాయణ కూడా లోపలికి వెళ్లాడు.

ఆమె కెదురుగా ఉన్న కుర్చీలలో కూర్చోమని చేతి సైగచేసి నళిని అందించిన కవరు చేతిలోకి తీసుకుంది విద్యాశాఖాధికారిణి సరోజాక్షి.

దరఖాస్తు చదువుతూ ఒకటి రెండుసార్లు నారాయణను దీక్షంగా చూసింది. దరఖాస్తు చదివి బల్లమీద పడేసి నళినివంక చూసింది.

"మేడమ్. నాకు ఆ ఊరినుంచి ట్రాన్స్‌ఫర్ చాలా అవసరం. మీరు నాకు సహాయం చెయ్యక తప్పదు" చేతులు జోడించింది నళిని.

ఆమె తరువాత నారాయణ అందుకున్నాడు. ముందు టొబేకో కంపెనీలో తన హోదా చెప్పాడు. నళిని తన పెద్దకూతురన్నాడు. తరువాత బదిలీ కావాలని, అడిగాడు.

"బదిలీ ఎందుకు? ఇట్లా అందరూ అడిగితే పల్లెటూళ్లేమయిపోతాయి? అయినా ఉద్యోగానికి వచ్చినవాళ్లు ఎక్కడికి వేస్తే అక్కడికి వెళ్లాలి. ఇది మీ యిష్టమా? ప్రభుత్వం వారు ఎక్కడికి వేస్తే అక్కడికి వెళ్లితీరాలి" అన్నది అధికారిణి.

"అట్లాకాదులెండి. ఈ అమ్మాయిది ప్రత్యేకమయిన కేసు" అన్నాడు.

"అందరూ తమది ప్రత్యేకమనే అంటారు."

"అందరిలాంటిది కాదు ఈ కేసు. పిల్లకు పాతికేళ్లు లేవు. పెనిమిటి వదిలిపెట్టాడు. ఒక్కతే ఉండలేకపోతోంది. అందులో పెనిమిటి వదిలిపెట్టాడంటే మన సంఘం ఒకడేపు ఊపి చూస్తుంది ఆడపిల్లలను. ఈ అమ్మాయితో పంపాలంటే ఇంట్లో తల్లి తప్ప పెద్దవాళ్లు ఎవరూ లేరు. అందులో మరోచిక్కు వచ్చింది. అల్లుడు దీన్ని వదిలిపెట్టిన వాడు వదిలిపెట్టినట్టు ఊరుకోక ఇంకా ఇదేం చేస్తోందో? ఏం చదువుతుందో? ఎక్కడ ఉద్యోగం చేస్తున్నదోనని కనిపెట్టే ఉంటున్నాడు. ఏదయినా చిన్న పొరబాటు వచ్చిందంటే "అదిగో- అందుకే వద్దన్నాను" అంటాడు. మీరు ఎలాగయినా దయ ఉంచాలి. ఈ పిల్లను కనికరించాలి" అంటూ కళ్లద్దాలు తీసి తుడుచుకుని మళ్లీ పెట్టుకున్నాడు.

ఆయన కళ్లద్దాలు తీసినప్పుడూ మళ్లీ పెట్టుకున్నప్పుడు ఆయననే దీర్ఘంగా చూస్తోంది సరోజాక్షి.

ఆమెకు అంగుళం మేరకు పాపిటకు కుడివైపుగా ఒకపాయ నెరిసి తెల్లగా మెరుస్తున్నది. ఆమె కోలముఖానికీ పొడుగైన నాసికకూ విశాలమైన ఫాలభాగానికీ ఆ నెరిసిన పాయ ఒకవింత అందాన్నిస్తున్నది ఫాలభాగానికి మధ్యగా ఎర్రటి

కుంకుమబొట్టు ఎదటివారిని బెదరకొడుతున్నట్టుగా ఉంది. రికార్డు ప్రకారం ఆమె మరో ఐదేళ్లకు రిటైరవవలసి ఉంది. కాని- ఆమె ముఖం చూస్తే అలా అనిపించదు. మరో పదేళ్ల సర్వీసు ఉన్నట్టు కనబడుతుంది. ఆమెకు అధికారదర్పం ఉన్నట్టు కనబడదు కాని అధికారానికి తగిన హుందాతనం ముఖంలో కొట్టవచ్చినట్లు కనబడుతుంది.

మోచేతులు బల్లకానించి, చేతివేళ్లు కలుపుకుంటూ, కళ్లు దించుకుని, ఆలోచనలో పడినట్టుగా కూర్చుంది సరోజాక్షి.

నళిని ట్రాన్స్ఫర్‌ను గురించే ఆలోచిస్తోందనుకున్నాడు నారాయణ. ఆమె పెదవుల విప్పుకుని తనకే శుభవార్త చెబుతుందోనని ఊహించుకుంటున్నాడు.

నళిని కూడా అట్లాగే అనుకుంటోంది.

"మిస్టర్ మాచిరాజు నారాయణ...."

త్రుళ్లిపడ్డాడు నారాయణ- ఆమె సంబోధనకు.

ఆమెకు తన ఇంటిపేరు ఎట్లా తెలుసు? బాగా తెలిసినట్టుగా సంబోధిస్తున్నదే? అంతకాలం తను ఆ కంపెనీలో ఉద్యోగం చేశాడు. తన ఊరూ పేరూ విన్నదేమోననుకుని సర్దుకుని కూర్చున్నాడు.

"చూడండి అసలు ఆడపిల్లలకు చదువులెందుకు? ఉద్యోగాలెందుకు? కొట్టినా తిట్టినా ఆ మొగుడికే ఒప్పగిస్తే సరిపోతుందిగా?" అన్నది కళ్లు పెద్దవి చేసుకుని.

అదిరిపోయాడు నారాయణ. ముక్కుపుటాలదిరిపోతున్నాయా మాటలకు కళ్లల్లో ఎర్రటి జీర.

"చూడండి కన్న తల్లి దండ్రులు చూస్తూ చూస్తూ కసాయి వాళ్లకు ఒప్పచెప్పలేరు కదండీ?" అన్నాడు కని కరిస్తుందనుకొని.

"ప్రతి ఆడపిల్లకూ తల్లిదండ్రులుంటారు. తల్లిదండ్రుల బాధ తల్లిదండ్రులదే కసాయివాళ్ల కరుకుదనం కసాయివాళ్లదే. భూమి గుండ్రంగా ఉంది" అంటూ బెల్ నొక్కింది.

దిగ్గున తండ్రీ కూతుళ్లిద్దరూ లేచారు.

"అయితే మేడమ్ నా కేసు కన్సిడర్ చేయరా?" చిన్నబోయిన ముఖంతో అడిగింది నళిని.

"ఇదివరకూ ఏమయినా ఆలోచించే దానినేమోగాని ఇప్పుడు వీలులేదు" పుల్ల విరిచినట్టు అన్నది సరోజాక్షి.

"వెనకటివి తలుచుకుని పిల్లలను బాధించటం అధికార లక్షణమా?" వెనక్కు తిరుగుతూ అన్నాడు నారాయణ.

"పిల్లలను బాధిస్తే తల్లిదండ్రులు ఎట్లా బాధపడతారో చూపించాలని" సరోజాక్షి అంటుండగానే మరో ఇద్దరు లోపలికి వచ్చారు.

చరచర నడుస్తూ ముఖాలు చిన్న బుచ్చుకుని ఆఫీసు దాటి బయటికి వచ్చారు. వాళ్లకు ఐదు గంటలకు ఊరికి వెళ్లే బస్సు ఉంది.

ఆమె అట్లా ఎందుకు మాట్లాడిందో తెలియక ఆలోచిస్తున్నది నళిని. సాధారణంగా ఆమె ఎప్పుడు ఎవరు వెళ్లినా ముందు ఇంటి సంగతులు అడుగుతుంది ఆప్యాయంగా.

"పెళ్లి అయిందా?" తరువాత ప్రశ్న.

"ఏం ఇంకా ఎందుకు చేసుకోలేదూ?" అంటుంది కాలేదని జవాబిస్తే సానుభూతి చూపిస్తూ.

"ఈ రోజుల్లో సంబంధాలు దొరకటమే కష్టంగా ఉంది. దొరికినా త్రాసు తూగటంలేదు. ప్రేమప్రేమ అంటారుగాని అది నిలిచి-పెళ్లి చేయించే ప్రేమకాదు. ఆడపిల్లలే కాస్త జాగ్రత్తగా మసలుకోవాలి. సవాలు చేస్తూ-పందేలు కాస్తూ-విజృంభిస్తే ఆడపిల్ల జయించలేదు. ఎక్కడయినా మంచివాడిని వెదకి పెళ్లిచేసుకో. కలిసి మెలిసి బ్రతకటం కూడా ఒక కళ" అంటూ సంభాషణను సాగిస్తుంది.

ఏమిటీ ఇలా జరిగింది ఇవాళ?

తండ్రి వచ్చి కాస్త గట్టిగా అన్ని విషయాలూ చెప్పి పని అయేటట్టు చేస్తాడేమోననుకుని బలవంతంగా తీసుకువెళ్లింది.

తల వంచుకుని నడుస్తూ తండ్రి ముఖంకేసి చూసింది. ఆ ముఖం పాలి పోయి ఉంది. చిన్నబోయి ఉంది. ఏదో ఆలోచిస్తూ ఉన్నట్టుగా మధ్య మధ్య కను బొమలు కలుసుకుంటున్నాయి. కళ్లు ఎరుపెక్కాయి. ముక్కు పుటాలు అదురు తున్నాయి.

అనవసరంగా నాన్నను తీసుకువచ్చి అవమానపరచినట్లయింది.

తెగ బాధపడి పోతున్నది నళిని.

బస్సు డిపోకు చేరుకున్నారు. పక్కనున్న కాంటీనులో కాఫీ టిఫిన్ తీసుకున్నారు. బస్సు రావటానికి ఇంకా గంటన్నర పైముంది.

ఇద్దరూ సిమెంటు బెంచీమీద కూర్చున్నారు.

''నాన్నా. ఎండలో నిన్ను అనవసరంగా తిప్పాను. ఏమయినా బాధగా ఉందా?'' నొచ్చుకున్నట్టుగా అడిగింది నళిని.

''ఏం లేదమ్మా- ఏం లేదు. ఈమాత్రం తిరుగుడు లేదేమిటి నాకు? అయినా ఇదెంత దూరమని అట్లా అడుగుతున్నావు?'' మనసులో చెలరేగుతున్న భావాలను పైకి పొంగనివ్వకుండా జాగ్రత్త పడుతూ ముఖం మామూలుగా పెట్టటానికి ప్రయ త్నించాడు.

''ఆమె మీకు ఇదివరకే తెలుసా నాన్నా? ఇంటి పేరుతోసహా సంబోధిం చింది?'' ప్రశ్నార్థకంగా చూసింది ఆయన ముఖంలోకి.

''అబ్బే. ఎప్పుడూ చూసిన ముఖంకాదు. అయితే మనపని కాకపోయిందా?'' కంగారును అణుచుకుంటూ అన్నాడు.

''ఎప్పుడూ చూడకపోయినా చాలా మర్యాదగా మాట్లాడుతుంది. కష్టసుఖాలు అడిగి తెలుసుకుంటుంది. సాధారణంగా అడిగింది కాదనదు. ఏమిటో ఇవాళ ఇలా జరిగింది. ఆమె స్వభావానికి విరుద్ధంగా ప్రవర్తించింది.''

''ఆమెకు ఇల్లూ సంసారం ఉందా?'' చాలా నెమ్మదిగా అడిగాడు.

''ఇల్లా?'' నవ్వింది నళిని. ''ఇల్లు లేకపోవటమేమిటి నాన్నా? ఇల్లు లేక పోతే ఎక్కడుంటోంది? సంసారమంటావా? ఆ సంగతి నాకు తెలియదు.''

"అది కాదమ్మా. సంసారమంటే మొగుడూ పిల్లలూ నన్నమాట" ఆ మాట అంటుంటే ఆయన మనసు చివుక్కుమన్నది. నళినికి సంసారము అంటూ ఏర్పడక ముందే అల్లుడు పేరున ఇంట్లో అడుగుపెట్టిన దశమగ్రహానికి అదివరకే భార్యా పిల్లలున్నారని తెలిసింది ఈ కట్నం డబ్బు తీసుకువెళ్ళి డాబామీద రెండుగదులు వేసి అద్దెకిచ్చాడు. ఆ అద్దెతో పిల్లవాడికి చదువు చెప్పిస్తున్నాడు. తనకాతడి పద్ధతులు నచ్చక, కూతుర్ని పంపనని చెప్పి ఆమెను పట్టభద్రను చేసి, తన పరపతితో ఉద్యోగ మిప్పించాడు. నళిని ప్రథమ సంతానము. తమకిద్దరికీ ఎంతో ప్రాణప్రదమైనది. ఆమెకు ఏ లోపము వచ్చినా గుండె బీటువారినట్లనిపిస్తుంది.

బస్సు వచ్చింది. ప్రయాణీకుల సందడి దిగేవాళ్ళకు దిగాలని తొందర. ఎక్కేవాళ్లకు ఎక్కాలని తొందర. సందు చేసుకుని ఇద్దరూ ఎక్కారు.

ఇంట్లో అడుగుపెడుతూనే అన్నపూర్ణమ్మ వేసిన ప్రశ్నను ఎదుర్కోవాల్సి వచ్చింది.

"ఏమయింది? ట్రాన్స్ఫరు చేస్తానందా?"

ఆయన గబగబా తన గదిలోకి వెళ్ళి ఖండువా చెప్పులు వదలి ముఖం కడుక్కోటానికి బాత్‌రూములోకి వెళ్లాడు. నళిని ముఖమ్మీద కనబడిన నైరాశ్యాన్ని చూసి హతాశురాలయింది అన్నపూర్ణమ్మ.

"కాకపోతే పోనీలే. సెలవు పెట్టు. ఇక్కడే పదిమందికి చదువు చెబితే ఆ జీతమంత డబ్బు రాదా? లేకపోతే తక్కువ జీతానికయినా సరే- ఈ ఊళ్లో ప్రైవేటు స్కూళ్లో దొరక్కపోతుందా? ఏమిటో మీనాన్న ఆశలన్నీ అందలమ్మీద ఉంటాయి. నేను వద్దనే అంటున్నా- విన్నారు కాదు."

నారాయణకు చూడగానే "వంటయింది. భోజనానికి లేవండి. అమ్మాయి అలిసిపోయినట్టుంది. వేడివేడిగా తిని పడుకుంటుంది. ఇవన్నీ ఎప్పుడూ ఉండేలే" ఆమె భోజనాలు అమర్చటానికి వెళ్ళింది.

పది గంటలు దాటింది. ఇంట్లో అందరూ నిద్ర కొరిగారు. కాని-నారాయణ మనసు ప్రశాంతంగాలేదు. ఏమిటో ఆలోచనలు:ఎక్కడెక్కడో పరిభ్రమిస్తున్నాయి:

ఆమె పేరు కమల కదా. సరోజాక్షి ఎట్లా అయింది? పేరంటే మార్చుకో

వచ్చుగాని పోలికలు ఎట్లా మార్తాయి? అసలు తను గుర్తుపట్టకనేపోను. కాని ఆమె ఆడిన మాటలు పట్టిచ్చాయి.

ఆయన మనోవీధిలో ఒక వేదిక ఏర్పడింది. ఆ వేదిక మీద పదహారేళ్ల కమల పైటకొొంగును భుజాలమీదుగా ముందుకులాక్కుని తలవంచుకుని నిలబడ్డది. ఆమె తండ్రి హరిగోపాలం చేతులు నులుపుకుంటూ కోటయ్యను ప్రాధేయపడుతున్నాడు.

"ఈ రెండు నెలలూ ఉండనీయండి. పరీక్ష వ్రాసిన మరునాడే మీ యింటికి వస్తుంది" అంటున్నాడు.

"పరీక్ష ఎవడికి కావాలయ్యా? ఆమెగారు చదివి ఊళ్లేలా? ఉద్యోగాలు చేయాలా? మీరు పంపదలచుకుంటే మాతో పంపండి. లేకపోతే ఇంతే" ఘాటుగా మాట్లాడాడు కోటయ్య.

"రెండే నెలలండీ చాలా కష్టపడి చదివింది. దానికి గోల్డు స్కాలర్ షిప్పు వస్తుందని అనుకుంటున్నారు స్కూల్లో. పై చదువులు లేకపోయినా ఈ పరీక్షయినా కానీయండి. ఇంటికి పెద్దబిడ్డ. దానికి కన్నీళ్లు వస్తే మా ప్రాణాలు అవిసిపోతాయి." ఇంకా దీనంగా ముఖంపెట్టి ప్రాధేయపడుతున్నాడు హరిగోపాలం

"అవన్నీ కుదరవండి రారా నారాయణా" ముందుకు నడిచాడు కోటయ్య.

హరిగోపాలం ఆయనను పోనిచ్చి నారాయణ చేతులు పట్టుకుని "బాబూ, అమ్మాయి దుఃఖపడుతుంది. ఈ రెండు నెలలు ఇక్కడే ఉంచు నాయనా. పరీక్ష లయిన మరునాడే పంపిస్తా. ఇవి చేతులు కావు-కాళ్లనుకో" బ్రతిమిలాడాడు.

కమల ముఖమెత్తి నారాయణ ఏమంటాడోనని ఉత్కంఠతో చూసింది. ఇద్దరి కళ్లు కలుసుకున్నాయి. కమల కళ్లతో అభ్యర్థన

నారాయణ కనుబొమలు ముడిచి చప్పున తండ్రి వెళ్లిన వైపు కళ్లు తిప్పుతున్నాడు.

"మా నాన్న మాటే నా మాట. పంపితే ఇప్పుడే మా వెంట పంపండి. లేకపోతే-ఇంతే సంగతులు" చేతులు విడిపించుకొని తండ్రిని అనుసరించాడు.

హరిగోపాలం కమల స్థాణువులై పోయాదు.

కొంతసేపటికి కమల తేరుకుని "వద్దంటుంటే కాళ్లమీద పడటానికి మనకేం. కర్మ నాన్నా? వెళ్లనీ విశ్చింతగా పరిక్ష వ్రాస్తా. నాకు గోల్డె స్కాలర్‌షిప్పు ఖాయం" తండ్రి చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకు వెళ్లింది. ఆమె అప్పుడే. నిశ్చయించుకుంది తను పై చదువులు చదవాలనీ-ఉద్యోగం చెయ్యాలనీను.

మరుసటి నెలలోనే నారాయణ పక్కన అన్నపూర్ణ వధువుగా కూర్చుంది. వివాహ వేదిక మీద.

అంతే.

ఆ తరువాత వారేమయినారో వీరు వాకబు చెయ్యలేదు. వీరేమయినారో వారు కనుక్కోదలచలేదు.

ఋతుచక్రం విధీ విరామం లేకుండా తిరుగుతునే ఉంది.

నారాయణ కళ్ల ముందర నిలిచిన వేదిక క్రమంగా అంతరించిపోయింది

"ఆఁ ఇదన్నమాట అసలు సంగతి ఆడదయితేనేం? చదువుకుంది. ఉద్యోగిని అయింది. అప్పటి మాటకు ఇప్పుడు జవాబు చెప్పింది ముఖమ్మీద."

ఆడది?? తననెంత లోకువ చేసి మాట్లాడింది?

"ఛీఛీ. అనుభవంలోకి వచ్చినా నీకింకా అహం తగ్గలేదు. ఆమె తండ్రి స్థానంలో ఈనాడు నీ వున్నావు. ఆమె స్థానంలో ఈనాడు నీ కూతురుంది. ఆడది ఆడది అంటూ చులకనగా మాట్లాడకు. నీవు ప్రాణప్రదంగా చూచుకునే నీ కూతురు కూడా ఆడదే" బుద్ధి వీపుమీద అయిదు వేళ్లతో చరచింది వేళ్లు అంటేటట్టుగా.

తల విదిలించుకుంటూ మంచమ్మీద లేచి కూర్చున్నాడు నారాయణ. నగ్న సత్యాన్నీ నిత్యసత్యాన్నీ ఒప్పుకోవటానికి మనసు మొరాయించటం మొదలు పెట్టింది.

పక్కమీద దొర్లిదొర్లి తెల్లవారు జామున ఏనాలుగంటికో అతడు నిద్రలోకి జారుకున్నాడు

మూడోనాడు మధ్యాహ్నం నళినికి ఆమె కోరిన చోటికి బదిలీ చేస్తున్నట్టుగా ఆర్డర్సు వచ్చాయి.

"నాన్నా. నేను చెప్పలేదూ? ఆమె చాలా మంచిది. మనం వెళ్ళినప్పుడు ఏదో చికాకులో ఉన్నట్టుంది" నళిని చాలా సంతోషించి తల్లికీవార్త పరుగున వెళ్లి చెప్పింది.

నారాయణ విర్లిప్తుడుగా పెదవులు ముడిచి సాగదీసుకున్నాడు.

(ఆంధ్ర సచిత్ర వార పత్రిక)



# ప్రియాగమనం

బల్లమీద దీనంగా నీరసంగా పడుకుని ఉన్న ఆమెను చూసి "ఏ వూరమ్మా మీది? మీ వాళ్ళెవరయినా వచ్చారా కూడా" చెయ్యి పట్టుకుని నాడి చూశాడు డాక్టర్.

మంగళ కళ్లు తెరచింది. జ్యోతుల్లా ఉన్నాయి. "ఇక్కడికి పదిమైళ్ళ దూరాన కొత్తగా తయారవుతున్న కాలనీ దగ్గరగా ఉన్న ఇల్లు మాది. నాతో కూడా రావటానికి మంచంలో ఉన్న మా అమ్మ తప్ప మరెవరూ లేరు. నాపేరు మంగళ" చెవిలో చెప్పినట్టుగా చెప్పింది.

"అక్కడ ఏంచేస్తూ ఉంటారు?"

"నేనూ మా అమ్మ ఉంటాము. నేను హిందీ పాఠాలు చెబుతూ ఉంటాను."

"పెళ్ళి అయినట్టుంది. ఆయన ఏం చేస్తాడు?" పరీక్ష చేస్తున్న డాక్టరు గారి ప్రశ్న.

"ఆయన మిలిటరీలో చేరిపోయాడు. స్టోరుకీపరు కాబోలు."

"ఏ ఊరు?" ఆమె కాబోలు అన్నందుకు నవ్వుకుంటూ అడిగాడు డాక్టరు.

"అంబాల"

"నీకీజబ్బు ఎన్నాళ్ళ నుంచి?"

"అప్పుడప్పుడు జ్వరం. దగ్గు- ఆరునెలలు కావచ్చింది. అక్కడ ఒక చిన్న ఆసుపత్రిలో డాక్టరుగారు మందిస్తున్నారు. చివరకు మీ పేరున ఒక ఉత్తరం రాసిచ్చారు- ఇక్కడికి వెళ్ళమని."

"ఈ పని ముందే చేసి ఉండాల్సింది. ఈపాటికి నయమయి ఉండేది" పరీక్ష పూర్తిచేసి కుర్చీలో కూర్చున్నాడు.

"డాక్టరుగారూ. ఎన్నాళ్ళకు తగ్గుతుంది ?"

"తగ్గుతుంది కాని ఎంతకాలమో చెప్పలేను. అయినా ఇంకా మందు మొదలు పెట్టలేదుగా ?"

"ఇరవై రోజుల్లో తగ్గుతుందా డాక్టరుగారూ ?"

"నేను గట్టిగా చెప్పలేను. అయినా ఇరవై రోజులేం లెక్క ?" ఆశ్చర్యంగా ఆమె కళ్ళలోకి చూశాడు.

"ఆయన.... ఆయన ఇరవై రోజులకు వస్తాడు. అప్పటికి నా జబ్బు నయమయిపోవాలి డాక్టరుగారూ ?" చేతులు జోడించింది.

"వస్తానని రాశాడా ?"

"ఆఁ, వస్తానని రాయటమే కాకుండా అక్కడినుంచి వచ్చేవాళ్ళతో చెప్పి పంపాడు."

డాక్టరు ఉలిక్కి పడ్డాడు. "నీకు జబ్బుగా ఉందని ఆయనకు తెలుసా ?"

ఆమె విషాదంగా నవ్వింది. "రాయలేదు. దూరాన ఉన్నవాళ్ళకు ఈ సంగతి తెలిపితే అదుర్దా పడతారు."

"అయితే జబ్బు సంగతి ఆయనకు అసలే తెలియదన్నమాట" డాక్టరు కళ్ళు పెద్దవయ్యాయి.

"తెలియదు. అయినా ఎందుకూ రాయటం ? ఆయన వచ్చేసరికి నేను బాగా ఆరోగ్యంగా ఉంటానుగా ?"

"మొత్తానికి ధైర్యం కలదానివే" ఆయనకు నవ్వు రాబోయింది. కాని అణచిపెట్టాడు

"డాక్టరుగారూ. మంచి మంచి మందులిచ్చి తొందరగా నయం చేయండి. డబ్బుకు వెనుదీయను. ఆయన రాగానే అంతా లెక్కచేసి ఇచ్చేస్తాను."

"ఎంత పిచ్చిదానవమ్మా" డాక్టరు నోటివెంట తటాలున వెలువడింది.

"ఏం డాక్టరుగారూ! నామాట మీద నమ్మకం లేదా?"

"ఎందుకు వచ్చింది. ఆ అనుమానం?"

"నేను ఒకవేళ మీకు బిల్లు ఇవ్వలేకపోతానని మీకేమయినా అధైర్యమేమో? అధైర్యపడకండి. చూడండి. ఇది మా పెళ్ళి ఉంగరం. ఎంతలేదన్నా ఈ రోజుల్లో నాలుగయిదు వందలు చేస్తుంది. ఇది మీ దగ్గర ఉంచండి. ఇంకేం డాక్టరుగారూ?" ఓపిక లేకపోయినా కుర్చీకి తలానించుకుంటూ అన్నది.

"నీవు నిజంగా పిచ్చిదానవమ్మా. నీవు బిల్లు ఇవ్వలేవనీ లేక ఇస్తావనీ నేను ఆలోచించటం లేదు" డాక్టరు కనుబొమలు ముడిచాడు.

"మరి మీ సంకోచం ఏమిటి?" నిలవదీసి నట్టున్నదా మాట.

"అది కాదమ్మా. నీకు ఇంతవరకూ ఏ ఏ మందులు వాడారు? నేనింక ముందు ఏం వాడాలి అని ఆలోచిస్తున్నా. అంతే"

"అవును డాక్టరుగారూ, సరిగ్గా నా ఉద్దేశ్యము కూడా అదే. ఆయన వెళ్ళే నాటికి నేను ఎట్లా ఉన్నానో సరిగ్గా ఇప్పుడు అలా ఉండాలి" నవ్వు ముఖంపెట్టి ఆయన వంక చూసింది. "ఆయన వెళ్ళి ఎన్నాళ్ళయింది?"

"ఎన్నాళ్ళో కాలేదు. డాక్టరుగారూ! సరిగ్గా నాలుగు సంవత్సరాల....ఏడు నెలల....ఇరవై రెండురోజులు ఇవాల్టికి" ఆమె ముఖంలో వింత వెలుగు.

"అబ్బ. రోజులతో సహా జ్ఞాపకం పెట్టుకున్నావే."

"నేను రోజులేకాదు. క్షణాలు కూడా లెక్క బెట్టుకున్నాను. ఆయన వస్తా నన్నది సరిగ్గా ఇరవై రోజులకు, తెల్లవారితే 19 రోజులు. అయితే ఈ లోపల నయమయి పోతుందికదూ? మీరు తలుచుకోవాలిగాని ఎంతలోకి నయం చేస్తారు?" ఆశారేఖలు ఆమె కళ్ళల్లో వింత వెలుగులను విరజిమ్ముతున్నాయి.

"అమ్మాయీ! నీవు ఏ విషయమూ ఆలోచించకుండా మందు తీసుకుంటూ వుండు. మిగతా సంగతులు మనం తరువాత మాట్లాడుకుందాము" డాక్టరు తలవంచుకుని మరొక గదిలోకి వెళ్ళిపోయాడు.

మందులూ, ఉపచారాలూ జరుగుతున్నాయి మంగళకు. ప్రతిరోజూ డాక్టర్ని అడుగుతుంది తన సంగతి ఎలా ఉందని. డాక్టరు కనబడకపోతే నర్సుల నడుగుతుంది.

మంగళ ఆ హాస్పిటల్‌కు వచ్చిన పది రోజులకు మగవాళ్ళ వార్డులో ఒక కొత్త రోగి చేరాడు. డాక్టరు అతడిని చూసి''కొత్త కేసా''అని తన అసిస్టెంటును అడిగాడు.

''అవునం''టూ కేస్ షీటు తీసి చేతికందించాడు.''

షీట్ చదువుతూ "ఊఁ ఏమిటి జబ్బు నీకు.'' అడిగాడు డాక్టరు.

''నాకు ఆయాసంగా ఉంటుంది డాక్టరుగారూ. గుండె బరువెక్కినట్టుంటుంది. ఆహారం కూడా సరిగ్గా తీసుకోలేను'' ఆయాసపడుతూ చెప్పాడు.

"ఎంతకాలమయింది ?"

"నాకు రెండేళ్ళ నుంచీ అప్పుడప్పుడూ అలా అనిపిస్తూ ఉంటోంది. ఒక వారం రోజుల నుంచీ మరీ బాధగా ఉంది. ఆ ఉద్యోగం విరమించుకుని ఇంటికి బయలుదేరాను."

"పేరు"

"చంద్రకాంత్"

''ఎక్కడ ఉద్యోగం చేస్తున్నారు ?"

"అంబాలలో''

''స్టోరు కీపరుగానా ?"

''అవును. కానీ మీకెలా తెలుసు ?''

"ఊరికే అన్నాను. కానీ నాకేం తెలియదు. మరి ఇక్కడెవరున్నారు ?"

"ఇక్కడే-పది మైళ్ళకు సమీపంలో తయారవుతున్న కాలనీకి సమీపంలో మా వాళ్ళున్నారు. అక్కడికి వెళ్తున్నాను.''

"అక్కడెవరున్నారు?"

"నా భార్య ఉంది. పెళ్ళయిన కొద్ది రోజులకే ఆర్మీలో చేరిపోయాను."

"ఆమె పేరు?"

"మంగళ"

"ఆఁహాఁ" అని మాత్రం అనగలిగాడు డాక్టరు.

"అవునండి! ఆమె మీకు తెలుసా?" ఆతురత హెచ్చిందాయువకుడి ముఖంలో.

"అబ్బే! నాకేవరూ తెలియదు. పేరు బాగుందని అలా అన్నాను అంతే. అయితే మీరు ఇంటికి ఇంకా వెళ్ళలేదన్నమాట."

"లేదండీ! ఇక్కడికి వచ్చేసరికి నొప్పి కాస్త ఎక్కువయినట్లనిపించి ఆగిపోయాను. ఓ పది రోజులపాటు ఇక్కడే వుండి, మందు తీసుకుని ఏకంగా ఇంటికి వెళ్దామని మీ దగ్గరికి వచ్చాను"

"అయితే మీ జబ్బు సంగతి ఎవరికీ తెలియదన్నమాట?" డాక్టరు అందరితోనూ కబుర్లలోకి దిగాడు. ఆయన ఇలా ఇతడితో మాట్లాడుతుంటే శివరావుకూ, నర్సుకూ వింతగా ఉంది.

"నేను నా సంగతి ఎవరికీ రాయలేదండీ! మా మంగళ ఉందే-వట్టి పిరికిది. కాస్తకూ, కూస్తకూ ఏడ్చే మనిషి. నేనంటేప్రాణం. తల్లిని వ్యతిరేకించి నన్ను పెళ్ళి చేసుకుంది. నేను డబ్బు సంపాదించాలనీ, ఆమెను సుఖపెట్టాలనీ ఆర్మీలో చేరాను. కానీ అనుకున్నది కాలేదు డబ్బు ఎక్కువ సంపాదించలేదు. చూడండి డాక్టరుగారూ! మీరు కాస్త మంచి మందులిచ్చి త్వరగా నయంచేయాలి. ఈ పది రోజులలో నేను వెనుకటి ఆరోగ్యాన్ని పొందాలి"

"రోగులు షరతులు పెడితే నేను మందులివ్వగలనా?" నవ్వాడు డాక్టరు.

"అది కాదు డాక్టరుగారూ! నేను మంగళ దగ్గరికి వెళ్ళేసరికి ఎలా ఉండాలంటే వాలుగేళ్ళనాడు ఎలా ఉన్నానో అలా ఉండాలి. డబ్బుకు వెనుదీయకండి.

మీరు కోరినంత ఇస్తాను. ఆలోచిస్తున్నారెందుకు!'' సాలోచగా డాక్టరు ముఖం లోకి చూశాడు.

''నాకు ఆలోచన ఎందుకు? మీ మాటలకు నవ్వొస్తున్నది. అందులోనూ పది రోజులలో జబ్బు తగ్గించమంటున్నారు. అదే ఆలోచిస్తున్నా!''

''డాక్టరుగారూ! మీ మేలు మరువను, నన్ను మంచి ఆరోగ్యవంతుడినిచేసి ఇంటికి పంపాలి''

అతడికి ఏం జవాబివ్వాలో తోచక డాక్టరు తలగోక్కున్నాడు. రోగులకు జబ్బులు కొంత, చాదస్తం కొంత-డాక్టర్ల నరాలు తోడేస్తారు

''సరే! నేను గుండె జబ్బుల డాక్టర్ని పిలిచి చూపిస్తాను. మందు ఇప్పటి నుంచే మొదలు పెడతాను. నిశ్చింతగా మందు తీసుకోవాలి. మరేదాన్ని గురించీ అతిగా ఆలోచించవద్దు. తెలిసిందా! చెప్పినట్టు వినాలి'' అంటూ, ఆ రోగి రెండు చేతులూ జోడించినా చూడకుండా ముందుకు నడిచాడు.

డాక్టరు రాత్రి ఎనిమిదింటి వరకూ రోగులను చూస్తూ, వాళ్ళ మందులను గురించి ఆలోచిస్తూ ఇంటికి వెళ్ళటం అలవాటు. భోజనంచేసి, పత్రికలు చదువుకుని పడుకుంటాడు. అతడి భార్య సరళ పెనిమిటి హాస్పిటల్లో ఉన్నంతసేపూ క్లబ్బులో కాలక్షేపం చేస్తుంది. ఆమెకు వృత్తిలో మునిగిపోయిన భర్తను చూస్తే మొదట్లో చికాకుగా ఉండేది. కానీ ఆయనను మార్చలేకపోయింది. ఇప్పుడిప్పుడే అతడి స్వభావాన్ని అర్థం చేసుకోవటం మొదలుపెట్టింది మనసు మళ్ళించుకోవటానికి క్లబ్బులో కాలక్షేపం చేస్తుంది. ఎప్పుడైనా రెండు నెలలకొకసారి అతడితో సినిమా ప్రోగ్రాము పెట్టుకుంటుంది. అడిగితే సరేనరేనంటాడు. కానీ చివరకు హాస్పిటల్లో చిక్కుకుపోతాడు. పది రోజులనాడు సినిమా ప్రోగ్రాము రోగుల ఒత్తిడివల్ల భంగమయింది. ఈసారి అలా కాకూడదని ఎంతో జాగ్రత్తగా రోగుల సంగతి శివరావు ద్వారా తెలుసుకుని, సినిమా ప్రోగ్రాంవేసి. ఆయననడిగి టికెట్లు తెప్పించింది.

సాయంకాలం ఆరుగంటలు కాకముందే ఆయనకిష్టమయిన చీరె కట్టుకుని సోఫాలో కూర్చుని ఆయనకోసం ఎదురు చూస్తోంది సరళ. నిజానికి ఆ సినిమా అంటే ఆయనకెంతో ఇష్టం. మరి ఇంకా రారేం? మరచిపోలేదుకదా?

ఆమెకు విసుగుపుట్టింది. హాస్పిటల్ నుంచి కారు తెప్పించుకుని బయలు దేరింది.

‘‘శివరావ్!’’

అమ్మగారి గొంతు వినగానే శివరావు పరుగెత్తుకొచ్చి కారు తలుపు తీశాడు.

‘‘అయ్యగారున్నారా?’’ కారు దిగకుండానే అడిగింది.

‘‘ఉన్నారమ్మా!’’

‘‘అయిదున్నరకు ఇంటికి వస్తానన్నారు. సినిమా టికెట్లుతెప్పించమన్నారు. వస్తారేమో కనుక్కో!’’ ఎదురుచూసిన అలసట విసుగూ మాటల్లో ధ్వనించాయి.

శివరావు చెప్పగానే బల్లమీద వున్న కేస్ షీట్లన్నీ ఒక్కసారి చూసి బల్ల మీద బొత్తిగా పెట్టుకుని, ‘‘రోగులు జాగ్రత్త’’ అని పదిమార్లు నర్సుకూ, శివ రావుకూ అప్పగించి బయలుదేరాడు డాక్టరు విధిలేనట్టుగా.

సరళను చూడగానే అతడికి తనామెకిచ్చిన మాట జ్ఞాపకానికి వచ్చింది. నొచ్చుకుంటూ, ‘‘సరళా! ఈ టికెట్లమాట మరిచిపోయాను. పద, న్యూస్‌రీల్ జరుగుతూ ఉంటుంది’’ కారెక్కి కూర్చున్నాడు.

‘‘మన ప్రియతములంతా క్షేమమా?’’ అడిగింది సరళ.

‘‘ప్రియతములా?’’ కాసేపటికిగాని ఆ మాట అర్థంచేసుకోలేక తల గోక్కుంటూ ‘‘అ సరళా! నా ప్రియతములు క్షేమంగా ఉంటే నా దగ్గరెందు కుంటారు?’’ అన్నాడు చిరునవ్వుతో.

‘‘డాక్టరు కూడా మనిషేకదండీ! భార్యా పిల్లలు మమతానురాగాలూ సంసా రం ఉంటాయిగా? వృత్తికి వృత్తే-సంసారానికి సంసారమే!’’ ఎంత కోపము వచ్చినా సరళ అతడిని చూడగానే చల్లబడుతుంది. అతడు పడే కష్టానికి జాలిపడు తుంది. సానుభూతి కనబరుస్తుంది. అతడి మనసు బాధపడుతుందనుకుంటే ఆమె గుండె ముక్కలయినట్లవుతుంది. కానీ మొదటి మాట మాత్రం కాస్త కఠినంగా వ్యంగంగా వదులుతుంది.

అతడికి ఆమె అట్లా మాట్లాడకపోతే మనసు చిన్నబోయినట్లవుతుంది. తనను పట్టించుకోనట్టుగా బాధపడతాడు. ఆమె తలమీద చెయివేసి రాస్తూ "సరళా వృత్తిలో వాళ్ళు నాకు ఆప్తులు. నీవన్నట్టు ప్రియతములే. ఒక వింత కేసు వచ్చింది. ఈ మధ్య. ఒక దంపతులు వచ్చారు- ఒకరికొకరు తెలియకుండా. అతడు ఆర్మీ విడదలై వచ్చాడు ఆమె ఇంటినుంచి వచ్చింది. నాలుగేళ్ళనాడు-పెళ్ళయిన కొద్ది కాలానికే అతడు వెళ్ళి ఆర్మీలో చేరాడు. అతడు డబ్బు గణించి అత్తగారి దృష్టిలో గౌరవం సంపాదించటానికి ఆర్మీలో చేరాడు. అతడు ఇప్పుడు రెండువేల రూపాయలు భార్యకొక నెక్లేసుతో ఇంటికి చేరాలన్న ఆశతో ఉన్నాడు. కాని ముదిరి పోయిన గుండెజబ్బుతో బాధపడుతున్నాడు. ఆమె చిల్లులుపడ్డ శ్వాసకోశాలతో కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకుని ఉంది. అతడు ఆమెకు ఉత్తరం రాసిన ప్రకారం ఇంకా పదిరోజులకు వాళ్ళయింట్లో కలుసుకోవాలి. ప్రస్తుతం వీళ్ళిద్దరూ నాకు ప్రియతములు. నా మనసు నీవు కాకపోతే ఎవరు గ్రహిస్తారు?" ఆమె తలలో ఉన్న మల్లెమొగ్గలు అప్పుడప్పుడే విచ్చుకుంటున్నాయి. చప్పున అతడు వాసన చూశాడు.

సరళ గుండె అతడి మాటలతో బరు వెక్కింది.

థియేటరు సమీపించింది. డ్రైవరు తలుపు తీసి పట్టుకున్నాడు.

సరళ తటాలున తలుపు మళ్ళీ మూసింది. "కారు వెనక్కు తీసుకో" దృఢనిశ్చయంతో అన్నట్టుగా ఉంది.

డ్రైవరుతో పాటు డాక్టరు ఆశ్చర్యంతో చూశాడు.

"సినిమా చూడలేను హాస్పిటల్‌కు తీసుకు వెళ్లు"

హాస్పిటల్ ఆవరణంలోకి కారు రాగానే తలుపు తెరచుకొని దిగారు. మంగళ గదిలోకి చేరుకున్నా రిద్దరూ.

చప్పుడుకి మంగళ కళ్లు తెరిచింది ముఖం సంతోషంగా వెలిగి పోతున్న ట్టుగా ఉంది

"డాక్టరుగారూ. ఇవాళ తేలిగ్గా ఉంది. డాక్టరుగారూ. మీతో ఎంతో మాట్లాడాలని ఉంది. ఆయన వచ్చిన తరువాత మీరు నాకోసం ఎంత కష్టపడ్డారో తెలిస్తే మిమ్మల్ని నెత్తిన పెట్టుకుని పూజిస్తారు"

"నేను నా కర్తవ్యం నెరవేరుస్తున్నానమ్మా. అంతే పడుకో. నిద్రమాత్ర యిచ్చారా"

"ఇచ్చారు" పడుకుని దుప్పటి కప్పుకుంది.

అక్కడినుంచి చంద్రకాంత గది దగ్గరికి వచ్చారు. పరదా ఎత్తగానే మూలుగుతూ కనుపించాడు.

"హలో ఎలావున్నారు?" పలకరించాడు. డాక్టరు.

డాక్టరుగారూ, నా ఆశ సన్నగిల్లుతోంది. నా మంగళను చూడలేను. నా దగ్గర ఉన్న డబ్బుతో మీ బిల్లు మినహాయించుకుని మా మంగళకు ఆ నెక్లేసూ డబ్బు పంపండి. మీ తీయటి పలకరింపు ఆదరణ మరచిపోలేను డాక్టరుగారూ. నమస్కారం" అతడికి నిద్రపోవటానికీ బాధ తగ్గినట్లనిపించటానికీ ఒక ఇంజక్షు విచ్చాడు శివరావు డాక్టరు చెప్పినట్టుగా

సరళకు మనసు బరువెక్కింది. రోగులతో కబుర్లేసుకుని కూర్చుంటారని తాను లక్షసార్లయినా గొణిగి ఉంటుంది ఇంతవరకు. భర్త మనసు బాగా అర్థమయింది. ప్రతిరోజూ ఆయనకు భోజనం కూడా అక్కడికే పంపాలని నిశ్చయించుకుంది.

ఆ రాత్రి యిద్దరూ సరిగా భోజనం చెయ్యలేకపోయారు.

తెల్లవారగానే శివరావు ఫోన్ చేశాడు. చంద్రకాంత్ గుండె రాత్రి మూడు గంటలకు ఆగిపోయిందని.

ఆత్రంతో డాక్టరడిగాడు "మంగళ ఎట్లా ఉంద"ని.

రాత్రి పన్నెండున్నరకు ఒక వాంతి అయింది. బాగా ఆయాసం వచ్చింది. ఆక్సిజన్ పెట్టాము. గాని లాభం కలగలేదు. అంతా మీరు చెప్పినట్టే చేశాము"

ఫోను అక్కడ పడేసి "సరళా సరళా" అంటూ కుర్చీలో కూలబడ్డాడు డాక్టరు.

ఆయనకుపచరించటానికి సరళ పరుగు పరుగున వచ్చింది.

(ఆంధ్రభూమి - సచిత్ర వారపత్రిక)



# కాని కాలం వస్తే...

ఫాతిమాబీబీ రెండు చేతులతో తలపట్టుకుని పెరట్లో చెట్టుకింద కూర్చుంది. కనుబొమలు కలుసుకుంటున్నాయి- వెంటనే విడిపోతున్నాయి. ఆమె కడుపులో నుంచి అలలు అలలుగా ఉవ్వెత్తున ఎగిసెగిపడుతున్నది ఉద్రేకం. కుమిలి కుమిలి పోతున్నదా ఉద్రేకానికి దేహం.

కాని- కంటికి నీరులేదు.

కొంతసేపటికి మోకాళ్ళమీద రెండు చేతుల మధ్య తలదాచుకున్నది.

చల్లటిగాలి వీస్తున్నది. కటిక చీకటిలో మనిషికంటికి కనబడకుండా చెట్టు చాటుకు కూర్చున్న ఫాతిమా దగ్గరికి- తనలో తానే కుమిలిపోతున్న ఆమెను పిల్లగాలులు పలకరించిపోతున్నాయి

ఆమె ఆలోచనలకు దరీదాపూ కనబడటం లేదు.

జబ్బమీద చెయ్యిపడి అదుముతున్నట్లనిపించి త్రుళ్ళిపడ్డది.

''భయపడకు. నేను కాశీంను'' ఆమె పక్కన చోటుచేసుకుని కూర్చున్నాడు.

''ఇంకా నిద్రపోలేదూ?'' ఫాతిమా గొణిగినట్టుగా అడిగింది.

''నీవు నిద్రపోలేదూ?'' అతడడిగాడు. జవాబుగా.

ఒకరినొకరు పలకరించుకోవటానికే ఆ మాటలు కాని-అతడికి తెలుసు ఆమె చీకటి పడగానే తిండీతిప్పలు లేకుండా ఆ చెట్టువెనక కూర్చుని కుమిలిపోతోందని. ఆమెకూ తెలుసు అతడు ఆ సాయంత్రం నుంచీ పిచ్చెక్కినట్టు తిరుగుతున్నాడనీ- ఒక పనికి బదులు ఒకపని చేసి యజమానులచేత చివాట్లు తింటున్నాడనీను.

తీసుకురమ్మన్న వస్తువు వెంటనే చేతికందివ్వ లేదని దొరచేత చెంపపెట్టు తిన్నాడు

కాశింకు తలపండిపోయింది. మోకాళ్లు వంగిపోయాయి. ఒక కన్నులేదు. దేహమంతా ముడతలు ముడతలుగా మెరుస్తూ ఉంటుంది.

ఫాతిమా కూడా ఇంచుమించు ఆ ఈడుదే. ఆమెకు పుట్టుకలోనే ఒక కాలు సొట్ట పోయింది. లావుగా ఉండటంవల్ల మరింత కుంటుతూ నడుస్తుంది. పండిన కేశజాలాన్ని ముడిగావేసుకుని తలమీదుగా కొంగు కప్పుకుంటుంది. చేతులకు రెండు వెండి మురుగులు తిరగకుండా బిగుసుకుని ఉంటాయి. చెవులకు ఏడెనిమిది బొడిపెలువంటి బంగారు పోగులు కింది నుంచి పై వరకూ ఉన్నాయి.

వీళ్లిద్దరూ పెళ్లికాగానే ఈ పాయగానవాబు అబ్దుల్‌రహమాన్ యింట్లో ఉండిపోయారు. కాశిం యింట్లో చిల్లర పనులన్నీ చేస్తాడు. ఫాతిమా పిల్లల పెంపకం చూస్తుంది. ఆమె ఆ మహల్లో అడుగుపెట్టిన తరువాతనే నవాబుకు ఇద్దరు కొడుకులు ఇద్దరు కూతుళ్లూ పుట్టారు. ఆమె చేతుల మీదుగానే పెరిగింది నవాబుగారి సంతానం. ఆఖరి పిల్ల నసీమ్ అంటే ఫాతిమాకు ప్రాణం.

ఫాతిమాకు పిల్లలులేరు. నవాబుగారి పిల్లలు కూడా అందరూ పెద్ద వాళ్ల య్యారు. ఫాతిమా ఇప్పుడు ఆడపిల్లల పనుల చేస్తూఉంటుంది. నసీమ్ ఖాళీగా ఉన్నప్పుడు ఫాతిమా ఏవేవో కబుర్లు చెబుతుంది. రాత్రిళ్లు ఆమె పడుకునే వరకూ కథలు చెబుతూ ఉంటుంది. ఆమె పడీపడీ నవ్వుతుంది.

"ఇటువంటివి ఎప్పుడయినా జరుగుతాయా ?" నసీమ్ పలువరస కనబడీ కనబడకుండా నవ్వుతూ అడుగుతుంది.

"ఎందుకు జరగవు. జరిగే ఉంటాయి" అంటుంది ఫాతిమా కళ్లు గుండ్రంగా తిప్పుతూ.

"పోపో నీ మాటలు ఎవరు నమ్ముతారు ?"

నసీమ్ అటువంటి కథలూ కబుర్లు ఫాతిమా నడిగి మరీ మరీ చెప్పించుకుని పదిహేడేళ్ల పిల్లయింది. ఫాతిమా మీద అది అభిమానమో పెంచిన ప్రేమో- అదేదో తెలియదుకాని-నసీమ్ ఫాతిమా మీద ఈగ వాలనీయదు. ఫాతిమాకు బట్టలు కొత్తవి-తను ఏరి ఏరి కొన్నవి తన పుట్టిన రోజునాడు ఇస్తుంది. అవి కట్టుకున్న ఫాతిమా నసీమ్ బుగ్గలు గదిలో ప్రేమతో పుణకాలి. అందరి ఎదురుగా సలామ్

చెయ్యాలి భయ భక్తులతో. ఫాతిమా ఏం తింటుందో రహస్యంగా వెళ్ళి నసీమ్ చూస్తూ ఉంటుంది.

ఫాతిమా ఆలోచనలు నసీమ్ చుట్టూ తిరుగుతాయి. నసీమ్ తెల్లటి తెలుపూ కాదు.-ఎరుపా అంటే ఎరుపూ కాదు. పసుపు తెలుపూ కలిపిన మేలిమి రంగు మీద గులాబీల పొడిచల్లి నట్టుంటుంది. ఆమె మొగల్ చక్రవర్తుల జవానాలో మహారాణి కుండే సౌందర్యంతో మిసమిసలాడుతూ ఉంటుంది. ఆమె అపూర్వంగా చెక్కిన గ్రీకు శిల్పంలా ఉంటుంది. ఆమె నవ్వినా అందమే-కోపగించినా అందమే ఒలుకుతుంది.

ఇటువంటి అపూర్వమైన రత్నానికి నవాబు ఎటువంటి సంబంధం తెస్తాడు?

నసీమ్ తల్లిని పోలింది. తల్లికి తగిన అందగాడు తండ్రి. మహమ్మదీయుల కుటుంబాలలో తల్లీ అక్క చెల్లెళ్లు మేనత్తలూ పిన్నమ్మ పెద్దమ్మలేగాని వరుడు పెళ్లి కాకముందు అమ్మాయిని చూసే ఆచారం లేదు. ఆడవాళ్లు పెళ్లి నఖ శిఖ పర్యంతమూ పరీక్షచేసి కాని పిల్లను ఎన్నిక చేయరు. వధూవరులు వేరొక గదిలో ఉండగా పురోహితుడు శాస్త్రం చదివి సంతకాలు చేయించుకుంటాడు గ్రంథంలో. ఆ గ్రంథం మసీదుల్లో భద్రపరచబడుతుంది. గదిలోకి వెళ్లిన తరువాత ముసుగు కప్పుతున్న వధువును ఆ ముసుగు తొలగించి అద్దంలో చూస్తాడు వరుడు. దానినే పహిలీనజర్ అంటారు. ఆ ప్రథమ వీక్షణములోనే సమ్మోహితుడవుతాడు వరుడు. అతడి చూపులో చూపు కలిపిన వధువు పులకించి విపకురాలవుతుంది.

నసీమ్‌కు అపురూప సౌందర్యవంతుడు ఎక్కడన్నా పుట్టే ఉన్నాడా అను కుంటుంది ఫాతిమా. నా తల్లిని సమ్మోహపరచగలవారెవరబ్బా? నవాబుగారి బంధుజాలంలో ఎవరైనా ఉన్నరా?

ఫాతిమా నవాబు కుటుంబాలలో పెళ్లిళ్లయినప్పుడు కళ్లు ఇంతలు చేసుకుని చూసేది. రంగులో-రూపంలో ఎత్తులో లావులో-దేనిలోనూ ఆమె కీడైన యువ కుడే ఆమె కంటికి కనబడలేదు.

ఆమె మీదగల ప్రేమాతిశయం వల్లనా? లేక తగిన యువకుడు లేకనా? ఆమెకే సందేహంగా ఉండేది.

నసీమ్ అక్క_ వహీదా. తేనెరంగు కళ్లు- ఎరుపుకు తిరిగిన తలవెంట్రుకలు- ఆమెదదొక తీరు అందం. ఆమె స్వభావం నసీమ్ స్వభావానికి విరుద్ధంగా కనబడేది. వాటిలో ప్రధానమైంది ఫాతిమా అంటే చిటపట.

"ఈ ముసలిదాన్ని తీసెయ్యరాదూ?" తలిదండ్రుల దగ్గర విసుక్కునేది.

"పాపం పెద్దది. ఉండనీ. మీ పనులు చేస్తోంది" తల్లి సర్ది చెబుతుంది.

"సెలవుల్లో వచ్చినప్పుడు పెద్ద కొడుకంటాడు- "బాబా, నేను లెక్కలన్నీ చూశాను. శిస్తు బాకీ లక్షలకు చేరింది. మనం చెల్లించి చాలా కాలమైంది. దీనికి మార్గమేదన్నా చూడాలి" సాలోచనగా తండ్రితో అంటూ ఉంటాడు. కాని_ ఈసారి వచ్చినప్పుడు మరీ గట్టిగా చెప్పాడు.

"హైదరాబాదు సంస్థానం పరిస్థితి ఏం బాగాలేదు. నిజాం గారిని అందరూ తలకొకవైపుకు లాగుతున్నారు. ఎప్పుడో కేంద్ర ప్రభుత్వములో లీనము కాక తప్పదు. అప్పుడు మనవంటివారు చెంబూ తప్పేలా వదిలేసి పాకిస్తాన్ పారిపోవలసి వస్తుంది." హెచ్చరించాడు.

తల్లి భయంతో నోరు తెరిచింది. "అయితే మన మహల్ ఎట్లా? మన పాయగా గతి?"

నవాబు అబ్దుల్ రహమాన్ ఆలోచిస్తున్నాడు- "ఆ గొడవేదో తొందరగా జరిగితే బాగుండును. శిస్తు చెల్లించమని ఒత్తిడి ఎక్కువయింది. ఆ గొడవలో అడిగేవాడూ ఉండడు- ఇచ్చేవాడూ ఉండడు."

"బాబా, అట్లా అనకండి. దేనికదే. నేను మన మున్షీ దగ్గర కాగితాలన్నీ చూశాను. మీరూ చూసే ఉంటారు. భూములు జప్తు చెయ్యగా ఇంకా బాకీ చాలా ఉంది" అతడి ముఖం చాలా ఆందోళనగా ఉంది.

మరొకమాట అన్నాడు_ "మన ఇంటి ఖర్చులు తగ్గించండి. కొందరు నౌకర్లను తొలగించండి. ఇంటిని సామాన్యంగా గడపండి. మేమిద్దరం హైదరాబాదులో కూడా ఇంటి ఖర్చు తగ్గిస్తాం. అంత ఇల్లు మా కిద్దరికీ అనవసరం. ఒక గదీ ఒక నౌకరు చాలు"

తల్లిముఖం దిగాలుపడటం చూశాడు. కాని అతడి మనసు మెత్తబడలేదు.

"తనఖాలో ఉన్న భూములన్నీ అమ్మండి. ముందు బేరాలు పెట్టండి. నేను ఈసారి సెలవుల్లో వచ్చినప్పుడు అంతా పరిష్కారం చేస్తాను"

అబ్దుల్ రహమాన్ గుండె బరువెక్కింది. కొడుకు ఉన్నది. ఉన్నట్టు చెప్పగానే గుండె దడదడలాడింది. అతడు భరించలేకపోయాడు.

ఆ యింట్లో నౌకర్లు యజమానులు భోజనాలు చేసేటప్పుడుగాని హాల్లో కూర్చుని మాట్లాడుకునేటప్పుడుగాని ఎదురుగా ఉండరు కాని పిలవగానే పలికేటంత దూరంలో ఉంటారు.

నౌకర్లంతా ఇంటి సంగతి ఇంతో అంతో అర్థం చేసుకున్నారు.

"నౌకర్లను తగ్గించండి" పెద్ద బాబుగారు అన్నమాట అందరి చెవుల్లోనూ గింగురుమంటోంది."

ఎంత మందిని తగ్గిస్తారు?

ఎవరెవరిని?

ఎవరికి వారు తాము లేకపోతే ఇల్లు గడవదనీ తమను తీసివెయ్యలేదనీ నిర్ణయించుకున్నారు.

కాశీం ఫాతిమాల ముఖాలు వాడిపొయ్యాయి.

పెద్దబాబు అటు వెళ్ళగానే సమస్య తీవ్రత తగ్గింది.

నౌకర్ల భయాలూ తగ్గాయి.

ఫాతిమా గుండెలు పీచు పీచు మంటున్నాయి. ఒకవేళ దొరలు వెళ్ళిపొమ్మంటే రను నసీమ్‌ను వదిలిపెట్టి ఎట్లా ఉండగలదు? పోతే కాశీం ఎక్కడైనా పోవచ్చుగాని తాను పోలేదు.

ఫాతిమా అప్పుడప్పుడు నసీమ్‌తో అంటుంది-" అమ్మా. నిన్ను వదలిపెట్టి నేనుండగలనా?"

ఫాతిమా గుండెలోనుంచి ప్రేమాభిమానాలు పొంగిపోయేటట్టు నవ్వుతుంది. నసీమ్-కళ్లల్లో మెరుపులు కనబరుస్తూ.

డిసెంబరులో వెళ్లిన పెద్దబాబు ఫిబ్రవరి నెలలో హఠాత్తుగా ఊడిపడ్డాడు.

తండ్రి హృదయం గతుక్కుమన్నది

అతడి తాతలనాటి నుంచీ ఖాందాన్ (వంశ గౌరవ ప్రతిష్ఠలు) చూసుకుని జల్సాగా జీవించటమేగాని జమా ఖర్చులు చూసుకుని ఎరగరు. సంవత్సరం ఆఖరుకు దేనికి డబ్బు తక్కువయినా అప్పు చేస్తూ ఉంటారు. హైదరాబాదునగరంలో బట్టలు ఖాతా. మరే వస్తువులు కావాలన్నా ఖాతా-నగలు ఖాతా. మళ్లీ ఎప్పుడో వాళ్లు ఉత్తరాలు వ్రాసి, మనుష్యులను పంపి లేక స్వయంగా వచ్చి వడ్డీతో సహా వాయిదాలలో తీసుకు వెళ్లటం ఆచారం. దేనికయినా లేదు అనుకోకుండా డబ్బు ఖర్చు చేయటం ఆ కుటుంబానికి అలవాటు, ఇంట్లో ఏది తగ్గినా నౌకర్లను తీసివేసినా వంశ గౌరవానికి లోపం వస్తుందని భయం.

పెద్దబాబు నస్రుల్లాఖాను గరాజిలో ఉన్న కారును రాగానే బయటికితీశాడు. తండ్రీ తమ్ముడి సంతకాలు తీసుకున్నాడు. తమ పాయగాలో తనఖాలో ఉన్న భూములు పైవాళ్లకు అమ్మాడు. భూములమీద ఉన్న అప్పు తీర్చాడు. హైదరాబాదు వెళ్లి అంత పెద్ద కారును అమ్మకానికి పెట్టాడు. అది చాలా పెద్ద కారు. వెనక సీటుమీద అయిదు మంది సులభంగా కూర్చోగలరు. డిక్కీలో ఒక సంసారానికి కావలసిన సామాను సులభంగా పడుతుంది. ఆ కుటుంబమంతా ఎంతో సౌకర్యంతో ఎంత దూరమయినా ప్రయాణాలు చేసే వారు ఆ కారులో.

ఆ కారును చూసి మోజుపడిన ధనికుడు వెంటనే కొన్నాడు.

పెద్ద బాబు కారు లేకుండా ఇంటికి రాగానే తల్లి డీలా పడిపోయింది. తండ్రికి నోట వెంట మాట రాలేదు.

నౌకర్లు పెదవులు చప్పరించుకుంటూ ఒదిగి నిలిచారు.

ఆ రాత్రికి తండ్రితో చర్చించాడు. ''రాష్ట్రంలో అల్లర్లు జరుగుతున్నా యథాతథపు ఒడంబడిక తరువాత పైకి సద్దుమణిగాయి. చెప్పీచెప్పక చాలా మంది.

పాకిస్తాన్ వెళ్ళిపోతున్నారు. మిగిలిన విషయాలు ఇక్కడ ఉండి నేనూ తమ్ముడూ సర్దుకుంటాము. మీరు వెళ్లిపోండి ''

తండ్రి నిరుత్తరుడయ్యాడు.

''కావాలంటే తమ్ముడు మీతో వచ్చి మీకు కావలసిన వసతులు సమకూరుస్తాడు. నేనిక్కడే ఉంటాను'' ధైర్యం చెప్పాడు.

తండ్రి ఏ మాటకూ అడ్డు చెప్పలేదు. అవునూ కాదూ అనలేదు. కాని ''చూడు. ఈ ఆడపిల్లల పెళ్లిళ్లు చేసి వెళ్లిపోదాం.'' నీరసంగా ధ్వనించింది కంఠస్వరం.

''బాబా, మీతో చెప్పక దాచింది ఒకటే విషయం.'' కంఠం సవరించుకున్నాడు పెద్ద బాబు. చెప్పక తప్పదు. చెప్పలేకపోతున్నాడు.

''ఏమిటలా చూస్తావు? చెప్పు?'' తండ్రి భయం భయంగా చూస్తూ ప్రశ్నించాడు.

''మనం ఖాయం చేసుకున్న సంబంధాలు భూములమ్మగానే చిట్లిపోయాయి'' తల వంచుకున్నాడు.

''ఆఁ....'' తండ్రి విరుచుకుపడిపోయాడు. స్పృహ వచ్చినప్పటి నుండీ గుండెలు బాదుకోవటం మొదలుపెట్టాడు. మళ్లీ స్పృహ లేకుండా పోయింది.

ఆయన మనసును పీడించేవి రెండే విషయాలు. ఇద్దరు ఎదిగిన ఆడపిల్లలు. ఖాందాన్ ననుసరించి పెళ్లిచేయాలి. డబ్బులేదు ఎట్లా?

పెద్దబాబు పశ్చాత్తాప పడ్డాడు కారు అమ్మినందుకు. ఆ కారు ఉంటే తండ్రిని హైదరాబాదు హాస్పిటల్‌కు తీసుకువెళ్లటానికి వీలుగా ఉండేది. అయినా తను ఇంటి ఆర్థిక విషయాలు తండ్రితో కచ్చితంగా చెప్తుండా ఉండవలసింది.

చెప్పక విధిలేదు

తెల్లవారు ఝామున తండ్రి ప్రాణంపోయింది.

ఇదంతా పెదబాబు తెచ్చిన ముప్పని ఇంటిల్లిపాదీ అనుకున్నారు. అతడిని శపించారు.

మతానుసారం నిలభయిరోజులు గడిపారు.

పెదబాబు ముఖం చూడటానికే తల్లి భయపడుతున్నది.

''అమ్మా. మనవాళ్ళు ధైర్యంగా ఇక్కడ ఉండే రోజులు గతించాయి. ఇక హిందువులు తిరగబడతారు. మనవాళ్ళమీద కక్ష దీర్చుకుంటారు. పరిస్థితులు ఒక మాదిరిగా ఉన్నప్పుడే మనం వెళ్ళిపోవాలి.''

''ఎక్కడికి?'' దుఃఖావేశంలో ఆమె గొంతు పైకి లేచింది.

''క్షేమకరమైన చోటికి.''

''ఏది?''

''పాకిస్థాన్''

''నా బిడ్డలు? వాళ్ళ పెళ్ళిళ్ళు? ఈ దేవిడీలో వైభవంగా జరగవలసిన పెళ్ళిళ్ళు ఎక్కడ చేస్తావు? ఎవరికిచ్చి?''

''అమ్మా'' అతడు తల్లిని కౌగలించుకుని బావురుమన్నాడు.

''ఈ పనులన్నీ నేను కావాలని చేయలేదమ్మా. ఇప్పుడు చెయ్యకపోతే మనగతి ఏమవుతుందో నేను చెప్పలేను. అందుకే ముందుగా జాగ్రత్తపడ్డాను. నీవూ తమ్ముడూ ముందుగా వెళ్ళిపోండి. తరువాత నేను వస్తాను. అక్కడ వ్యాపారం చేస్తాను.''

''మన అమ్మాయిలురా? వాళ్ళనెప్పుడు పంపుతావు? విడిగానా? వయసులో ఉన్న పిల్లలను ఒంటరిగా పంపుతావా? వద్దు- వద్దు.''

''నేనేదో చేస్తాగా? అమ్మా. ఇది విపత్కరమయిన పరిస్థితి. మహమ్మదీయులు హిందువులను ఎలా చిత్రహింసలు పెట్టారో వాళ్ల కాలం వచ్చినప్పుడు హిందువులూ పెడతారు. ఆ కాలం వస్తోంది ఇన్నాళ్ల మాదిరిగా మనవాళ్ల ఆటలు సాగవు'' ముఖం పక్కకు తిప్పుకుని గంభీరంగా అన్నాడు.

"అయితే ఏమంటావు? వాళ్లనేం చేస్తావు"? కడుపులో పేగులు చుమ్మలు చుట్టుకుపోతున్నాయామెకు.

"ఏమన్నా అఘాయిత్యం తలపెడతావా? అసలు దేశంలో ఉన్నాయో లేదో గాని నీవు కొండంతలుచేసి చెప్పినందువల్లనే మీ నాయనగారు చనిపోయింది?" చీత్కారం చేసింది.

"అమ్మా, నీవు ఇంట్లో కూర్చుని అంతా బాగుందనుకోగానే సరా? మన వాళ్లు చేసే అఘాయిత్యాలు నీవు వినటం లేదు. గ్రామాలలో ఇళ్లు తగలబెడు తున్నారు. స్త్రీలకు మానభంగాలు చేస్తున్నారు. దోపిడీలుచేస్తున్నారు. ఒకటేమిటి? సర్వనాశనం చేస్తున్నారు. అదంతా కంటితో చూసిన వాళ్లు చెబుతున్నారు. మనం ముందే మేలుకోవటం మంచిది కదమ్మా. నీ కూతుళ్లకు ఆ గతి పట్టకుండా ఉండాలని నా తాపత్రయము."

ఆమె నేల మీద పడి దొర్లి దొర్లి ఏడ్చింది.

"ఇదంతా ఈ మహల్‌కు పట్టిన దుర్దశ. ఇన్ని తరాల నుంచి ఎంత వైభవంగా గడిచింది? మన ఖాందాన్ ఎటువంటిది? మన వంశం? గౌరవ ప్రతిష్ఠలు? అన్నీ ఈ నాటితో సేల మట్టమవుతాయా? మన వంశం ఇంక పేరూ ఊరూ లేని దవుతుందా? ఈ మహల్-ఈ సామాను - ఈ నౌకర్లు-ఈ హోదా-ఈ వైభవం తరతరాలుగా అనుభవించిన మనం పాకిస్తాన్‌లో ఏం చేస్తాం? ఇవన్నీ ఎక్కడ సృష్టించుకుంటాము? ఈ మహల్లో నేననుభవించిన భోగాలు-విలాసాలూ-వినోదాలూ-సుఖసంతోషాలు ఇక నాకెక్కడివి? ఇక్కడ అమీర్ కుటుంబం అక్కడ గరీబ్ కుటుంబంగా బతకాలా? అమ్మాయిలకు వైభవంగా చేయవలసిన పెళ్లిళ్లు ఏ నవాబు కొడుకులనో అల్లుళ్లనుగా తీసుకురావలసిన ఇంటికి బిచ్చగాళ్లను తీసుకు రావాలా? కాలు కింద పెట్టని సుకుమారులను రోడ్ల వెంట తిప్పాలా? నేను భరించలేను. చూడలేను ఈ కళ్లతో బాబూ. నాకింత విషమిచ్చి నీ పనులు నీవు చేసుకో" ఆమె స్పృహ తప్పి పడిపోయింది.

ఆమెను చూసి ఆడపిల్లలిద్దరూ గొల్లుమన్నారు మగపిల్లలు ఆమెకు ఉపచారాలు చేస్తున్నారు. నౌకర్లు చుట్టూ మూగారు.

ఆ మరునాడు వెండి బంగారు సామును బట్టలు తీసుకుని తల్లితో చిన్న కొడుకు ప్రయాణమయ్యాడు. తల్లి వెళ్ళేటప్పుడు కూతుళ్ళిద్దరూ పైకి తల్లికి ధైర్యం చెప్పినా చాటుగా కుళ్ళి కుళ్ళి ఏడ్చారు. నౌకర్లు కంట తడిపెట్టారు.

తల్లి వెళ్ళిన తరువాత ఆ యిల్లంతా తిరిగాడు పెద్దబాబు. తాతలు కట్టించి నదా మహల్. ఆహాలులో పెద్దపెద్ద ఆర్చీలు- నగిషీలతో ఎంత అందంగా ఉన్నాయి? పింగాణీ పలుకలు పరచిన వేల నీడలు కనబడుతూ ఉంది. ఎంతెంత పెద్దగదులు? వాటిలో ఎన్ని సామానులు? ఆ మంచాలు ఆ పరుపులు? ఎన్ని పెద్ద వరెండాలు? ఒక్కొక్క హాలుకు రెండేసి షాలిమర్లు- కళ్ళు జిగేలు మనే కాంతి. మధ్య హాల్లో ఉన్న సోఫాలు బీరువాలు అపూర్వవస్తు జాలం-ఆపాలరాతి బొమ్మలు-ఆ సొగసులు! తిరిగి సమకూర్తాయా? తాతగారు కొన్నిటిని విదేశాల నుండి సేకరించారు. అతిథులకు ముందు వాటి అందాలను గురించి చెప్పేవారు. తరువాత ఎక్కడి నుంచి తెప్పించిందీ చెప్పేవారు. ఆ తరువాత వాటికింద ఎంత ఖర్చు చేసిందీ చెప్పేవారు. ఆ వస్తువులు చూడటానికే ప్రత్యేకంగా వచ్చేవారు చాలా మంది. వాటిని శుభ్రంగా తుడిచి కాపాడేటందుకు ఒక నౌకరు. అతడికి ఆ యింటి భోజనం- ఆ యింటి బట్ట.

వికలమయిన మనసును కూడదీసుకుంటూ పెద్దబాబు తోటలో ప్రవేశించాడు. ఆ తోటలో లేని ఫలవృక్షంగాలి పూలచెట్లు గానిలేదు. వెనక పక్కగా పెద్ద ద్రాక్షతోట పూతమీద ఉంది పూలతోటకు మధ్యగా కొంగ రూపంలో పెద్ద ఫౌంటెను- దాని కిరుపక్కల రంభా మేనకలవంటి అచ్చర భామలు- ఆ ఫౌంటెన్ కెదురుగా అక్కడక్కడ కూర్చోటానికి సిమెంటు బెంచీలు- తోటలో నడవటానికి నాపరాతితో బాటలు- ఎత్తుగా పెంచి, గోడల చుట్టూ దిరిగా చక్కగా కత్తిరించి పూల మొక్కలను ఏ రకానికారకం విభజనగా చూపించే బార్డరులు- వాటికి దూరంగా ఆడవాళ్ళ కొకటీ మగవాళ్ళ కొకటీ, ఈత కొలనులు-వాటిలోకి దూకటానికి నిచ్చెనలు- ఈతకొట్టిన తరువాత స్నానాలు చెయ్యటానికి బాత్‌రూములు. ఆ తోటమాలి చేతిక్రింద నలుగురు కూలీలు. నిత్యమూ ఆ తోటలో ఏదో ఒక పని జరుగుతూ ఉంటుంది. ఆ తోట క్రింద నెలకు పదిహేను వందల ఖర్చు. కొత్త చెట్లు ఎక్కడెక్కడినుంచో ఇంకా తెప్పిస్తునే ఉన్నారు. నాటుతునే ఉన్నారు.

**ఈ భవనం! ఈ తోట!**

**రేపటితో తమకు, ఋణం తీరిపోతుంది వాటితో.**

పాటిని కొనే వారు లేరు.

అద్దె కుండే వారు లేరు.

తాళం వేయటమొక్కటే మిగిలింది.

ఆ మాట అనుకుంటేనే గుండె కలుక్కు మంటున్నది.

ఒక్క చౌకీదారును మాత్రం ఉంచి మిగతా నౌకర్లందరికీ ఇవ్వవలసినది ఇచ్చి వెళ్ళిపోమన్నాడు పెద్ద బాబు. మరునాడు హైదరాబాదుకు ప్రయాణం పెట్టు కున్నాడు చెల్లెళ్ళతో.

కాశిం ఫాతిమా మున్షీలు తప్ప అందరూ పెద్దబాబుకు సలాము చేసి వెళ్ళి పోయారు. వాళ్లు మరునాడు తెల్లవారకుండా వెళ్తారు.

ఫాతిమా పెద్దబాబును పెంచినది కనుక కొంత బెరుకు లేకుండా మాట్లాడ గలుగుతుంది ఆతడితో.

బాబూ, బీబీలను హైదరాబాదులో ఎక్కడికి తీసుకుపోతున్నారు?'' ఒంగి సలాము చేసి ప్రశ్నించింది.

పైకి గంభీరంగా ఒక్కొక్క సమస్యనూ పరిష్కారం చేసుకుంటూ పోతు న్నప్పటికీ సాదరంగా ఎవరయినా పలకరిస్తే కన్నీళ్లు దూకిపడేటట్టున్నాయి పెద్ద బాబుకు.

కనురెప్పలతో తడిని అదిమిపెడుతూ ''దారీ తెన్నూ తెలియటంలేదు. హైదరాబాదులో పురానా వంశంలో పుట్టిన యువకులిద్దరు నాస్నేహితులు. వాళ్ళకిచ్చి పెళ్లి చేసే స్తోమత నాకు లేదు. వాళ్ళకు పుట్టిన రోజు కానుకగా ఇస్తాను. అక్కడ తిండికి బట్టకు కొదువలేకుండా బ్రతుకుతారు. అంతకు తప్ప మార్గం తోచటం లేదు'' అతడు తల వంచగానే కన్నీటి బొట్లు నేలమీద పడ్డాయి

ఆ మాటలకు అదిరిపడ్డది ఫాతిమా.

''బాబూ. డబ్బుగల కుటుంబాలు. పురానా కుటుంబాలే. కాదనను. బీబీలు రాజభోగాలు అనుభవిస్తారు కాని- ఫ్రీగా సుఖపడలేరు. బాబూ. ఈ బిడ్డలను నా చేతుల మీదుగా పెంచాను. మహారాణులవుతారను కున్నాను. కాని బాబూ.

ఈ బంగారు తల్లులను పులులకు ఎరవేస్తారా, నసీమ్. ఎంత మంచి మనసుగల తల్లి? ఎంత సౌందర్యవతి? మీ తోబుట్టువులను మీ చేతులతో మీరే బలి చేస్తారా బాబూ? నేను చూడలేను. నేను చూడిలేను.'' కన్నతల్లికంటె దీనాతిదీనంగా విలపించింది ఫాతిమా.

పెద్దబాబుకు అంతకంటె దుఃఖం పొంగి పొరలింది.

ఈ పుట్టినరోజు కానుకలు ఇచ్చి వాళ్లను చల్లబరచకపోతే వాళ్లకు బాకీ ఉన్న లక్షలు తీరేది ఎట్లా?

అదే పెద్దబాబును వేధించే ప్రశ్న.

ఫాతిమా అన్నమాట నిజమే. మొదటిరోజు ఆ యువకులు వీళ్ళ ముఖాలు చూస్తారు. తరువాత ఉంపుడు కత్తెల జాబితాలో చేరుస్తారు. మళ్ళీ వీళ్ళు ఎప్పుడు జ్ఞాపకానికి వస్తారో వాళ్ళకు?

తన చెల్లెళ్ళకు సంగీతమూ నాట్యమూ బాగావచ్చు. అంతమాత్రాన నాట్య కత్తెలుగా వాళ్ళ దగ్గరికి పంపటమా!

ఆ రాత్రి అతడికి భోజనం సహించలేదు. తోటంతా తిరిగి చెట్టుచెట్టునూ పట్టుకుని పొంగుతున్న ఆవేశాన్ని అణచుకుంటూ– ఇల్లంతా తిరిగాడు. కళ్ళారా ఆ మహల్‌ను చూసుకున్నాడు.

పట్టిపట్టి చూశాడు

ఇదంతా ఎవరూ చూడలేదనుకున్నాడు.

ఫాతిమా అంతా కనిపెడుతునే ఉంది.

ఆ రాత్రి అతడికి కలతనిద్ర– పలవరింతలు.

రాత్రి రెండు గంటలవేళ వహీదా లేచింది. తన బట్టలు ఒక సూట్ కేసులో పెట్టుకుంది. మెల్లగా అడుగులువేస్తూ నౌకర్ల గదులలో చివరిదాంట్లో ఉండే ముస్లీ గది తలుపు తట్టింది.

అతడు తలుపు తెరిచి ఆమెను చూసి తెల్లబోయాడు.

ఆమె గదిలోకి వెళ్లి తలుపువేసి "మున్షీసాబ్, మీ దగ్గర డబ్బు ఎంత ఉంది?" అడిగింది.

"నిన్న పెద్దబాబు అందరికీ జీతాలు ఇచ్చారు. ఏడాది జీతం అంటే పన్నెండు వందలు ఉంది" ఆశ్చర్యపడుతూ చెప్పాడు.

"మున్షీసాబ్ మనం ఈరాత్రి హైదరాబాదు వెళ్దాం. మీకు అభ్యంతరం లేకపోతే నన్ను వివాహం చేసుకోండి" తలవంచుకుంది.

మున్షీ విభ్రాంతుడైపోయాడు. తనకు నలభై ఏళ్లు దాటాయి. ఆటూ ఇటూ ఎవరూ లేరు. ఈ యింట్లోనే చిన్నప్పటి నుండీ పెరిగాడు వాళ్లిచ్చిన బట్ట-వాళ్లు పెట్టిన అన్నం ఈ దేహాన్ని వాళ్లే పెంచారు. వాళ్లే నాలుగు అక్షరమ్ముక్కలు అంకెలు నేర్పించారు. కొంచెం పెద్దవాడయిన తరువాత లెక్కలు రాస్తే నెలకు నూరు రూపాయలు ఇస్తానని నవాబు అన్నాడు అలా కాలం గడుస్తోంది.

వహీదా బి.ఏ, ప్యాసయింది. పర్షియన్ భాషలో పండితురాలు. సంగీత నాట్య కళలలో నిధి. హైదరాబాదు స్త్రీల కళాశాలలో అక్కచెల్లెళ్లిద్దరూ ఫాతిమాతో కాపరంపెట్టి విద్యనభ్యసించారు. తిరిగి ఇంటికి వచ్చి ఏడాది అయింది

వహీదా అందం ముందర మున్షీ వెలవెలబోతాడు.

అతడికెన్నో సందేహాలు. పెద్దవాళ్లకు తెలిస్తే తన తల తీసేస్తారు. ఆమె నవాబు కూతురు తను నిరుపేద.

"మున్షీసాబ్, ఎందుకు సందేహిస్తున్నారు? మూడు గంటలకొక బస్సు న్నది. ఆలోచించకండి. ఆపత్కాలంలో ఆలస్యం చేస్తే ఈ అవకాశం కూడా జారి పోతుంది. నేను మీకు నచ్చలేదా?" సూటిగా అతడి కళ్లల్లోకి చూసింది.

"నన్నూ-నా పరిస్థితులనూ మీకు తెలిసే అడుగుతున్నారా?"

"అవును మున్షీ సాబ్. నేను హైదరాబాదు నవాబుల ఇళ్లలో నాకు వచ్చిన విద్యలు నేర్పి డబ్బు సంపాదిస్తాను. మనకు హైదరాబాదులో ఎటువంటి భయమూ ఉండదు. మీ బట్టలు ఒక పెట్టెలో సర్దుకోండి. నా పెట్టెలో ఇంకా కొంత చోటున్నది."

అతడికి ఒక చేతి సంచీ తప్ప మరేంలేదు. బట్టలు మాత్రం నాలుగు జత లున్నాయి. ఆమె గబగబా వాటిని ఆ చేతి సంచీలో కుక్కింది. గది బైటికి వచ్చి తలుపు గొళ్లెం చప్పుడు కాకుండా పెట్టారు. అడుగులు గబగబ వేస్తూ మహల్ దాటారు.

ఫాతిమా కిటికీలోనుంచి వీళ్లిద్దరినీ చూసింది. కళ్లు చెమర్చాయి. కాశీంను పిలిచి చూపించింది. అతడు ఆశ్చర్యంతోనూ విచారంతోనూ ఆఁ? అంటూ నిల బడిపోయాడు.

"ఇప్పుడు నసీంను ఏంచేద్దాం? వహీదా వంటి తెగువతనం లేని పిల్ల." ఫాతిమా ఆందోళన పడుతోంది.

కాశీం తెల్లవెంట్రుకల గడ్డం వణికింది. "నసీమ్‌ను తీసుకుని బెంగుళూరు వెళ్దాం. ఎక్కడో ఒకచోట తల దాచుకుని బీబీకి వచ్చిన విద్యలతో కాలక్షేపం చెయ్యాలి కొంత కాలం. తప్పదు" అన్నాడు.

తెల్లవారుఝామున, కాచిగూడా స్టేషన్ నుండి బెంగుళూరు వెళ్లే రైలు ఆ స్టేషనుకు వస్తుంది. కాళ్లకు పసుపు పూసుకుని, ముఖానికి పావలా కాసంత బొట్టు పెట్టుకుని సామాన్యమైన చీరె కట్టుకుని మామూలు చెప్పులతో నసీమ్ తయా రయింది. తన బట్టల సూట్‌కేసుతో బయలుదేరింది. ఆమె నౌకర్లుగా కాశీం ఫాతి మాలు పాత ట్రంకు పెట్టెలలో బట్టలు కుక్కుకుని బయటికి వచ్చారు. కాలినడకన స్టేషన్ చేరుకుని రైలెక్కారు.

కాశీం ఫాతిమాల దగ్గరున్న డబ్బులో జీవితాలు గడవాలి. ఈ ముగ్గురూ హిందువులుగా సింధీవాళ్ల మాదిరిగా మసలుకోవాలి. బెంగుళూరు వంటి నగరంలో ఈ మూడు జీవాలూ ప్రాణాలు నిలుపుకోవటమెట్లా అన్న ఆలోచనలు ఎవరికి వారు చేసుకుంటున్నారు.

"తల్లీ. నీవు వీధిముఖం చూడకుండా నిన్ను కాపాడుతాను. నీచేతి పనులు ఇంటింటికీ పోయి అమ్ముతాను. కాళ్లకు పసుపు రాసుకొమ్మన్నానని దుఃఖపడకు. మన మతం మనదే. అదెక్కడికి పోతుంది? మళ్లీ మనకు మంచిరోజులు తప్ప కుండా వస్తాయి." ఫాతిమా ధైర్యం చెబుతోంది.

నసీమ్ తల వంచుకుని పసుపు రాసుకున్న పాదాలను చూసుకుంటోంది.

నిశ్శబ్దంగా ఉన్న ఆ మహల్లో ఉదయం ఏడుగంటలకు పెద్దబాబు పక్కమీద పడుకుని "ఫాతిమా ! కాశీం !" అంటూ కేకలు పెట్టాడు మామూలుగా.

ఎవరు పలుకుతారు?

చెప్పులు తొడుక్కుని చేతిసంచితో గేటు దాటుతున్న చౌకీదారు వెళ్ళుతున్నానని చెప్పటానికి వెనక్కు తిరిగాడు.

(ఆలిండియా రేడియో)



# జీవితానికొక జోడు

మూర్తికి ఆనాడు కోర్టులో వాదించవలసిన కేసు ఉంది. అతడు కోర్టుకు రాగానే ఏదో విషయంలో సలహా అడగాలనుకున్నాడు శ్రీకంఠం. మరో ఇద్దరు లాయర్లు కూడా అతడికోసం ఎదురు చూశాడు.

మూర్తి రాలేదు.

మరో కేసు నడుస్తోంది.

కోర్టు నుంచి వచ్చేటప్పుడు ప్రధాన న్యాయాధిపతి పి.ఏ ను చుట్టుముట్టి "ఇవాళ మూర్తిగారి కేసు ఉండాలి కదా? ఆయన రాలేదేం? మరో కేసు చేపట్టారు?" అంటూ అడిగారు.

"ఆయన తన కేసును పదిహేను రోజులు వాయిదా వేయించుకున్నారు" అంటూ తన ఫైల్సు సర్దుకుని జడ్జీగారి కారులో ఎక్కాడు.

సాధారణంగా మూర్తి కోర్టుకు రాని రోజంటూ లేదు. ఒక నిమిషం కూడా ఆలస్యం చెయ్యడు.

అసలు మూర్తికీ శ్రీకంఠానికీ అరమరికలు లేవు. ఏమాటయినా శ్రీకంఠం చెవిన ముందువేస్తాడు.

తన కేసును పదిహేను రోజులు వాయిదా వేయించుకునేటంతటి పని ఏం వచ్చింది? ఘూములూ ఇళ్లూ ఎక్కడా లేవు- పోనీ- చూసుకోవటానికి వెళ్లాడా- అంటే. దగ్గర బంధువులూ లేరు- ఏదయినా ఆపద వచ్చిందేమో ననుకోవటానికి.

ఇంటికి వెళ్లితే ఇల్లు తాళమువేసి ఉంది.

మరి నాలుగు రోజులకు ఇద్దరు లాయర్లు శ్రీకంఠం దగ్గరికి వచ్చారు ఏదో అడగాలని. సాధారణంగా వాళ్లిద్దరూ శ్రీకంఠం కార్లో వెళ్లతూ ఉంటారు. ఆరోజు

కారెక్కబోతూ "ఏమండీ. సుమిత్రగారు ఇవాళ రాలేదేం? ఆమె కేసుంది ఇవాళ" అడిగారు.

"నాకు తెలియదు ఆవిడగారి సంగతి" అన్నాడు జనసందోహం మధ్య నుంచి కారు మెల్లగా నడుపుతూ.

ఎందుకో ఎందుకో అన్నట్టు ముఖాలు పెట్టారిద్దరూ.

వరుసగా నాలుగురోజులపాటు సుమిత్ర కోర్టులో కనబడకపోవటంతో ఆ విషయం అందరి దృష్టిలోకీ వచ్చింది. ఆమెకూడా కోర్టుకు హాజరు కాకుండా ఉండదు.

ఏం కారణమో? ఎవరిలో వారు ప్రశ్నించుకున్నారు.

ఒకనాడు హఠాత్తుగా శ్రీకంఠానికి ఇదేమిటి మూర్తి రావటం లేదనుకుంటుంటే సుమిత్రగారు కూడా రావటంలేదు? అనిపించింది.

వాళ్లిద్దరినీ మరో నాలుగురోజుల తరువాత ఎవరూ జ్ఞాపకం అంతగా చేసుకోలేదు. మొదట మొదట కలిగిన కుతూహలం తరువాత అందరిలోనూ దానంతట అదే నమసిపోయింది.

సరిగ్గా మూర్తివెళ్లిన పదమూడో రోజున కోర్టులో అతడు కనబడేసరికి అందరూ "ఎక్కడికెళ్లావు? ఎక్కడికెళ్లావు?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించేశారు.

మూర్తి అదోలా నవ్వుతూ "చెప్తాగా?" అంటూ దాటవేశాడు.

బాగా గమనించి చూపిన వాళ్లకు సుమిత్రకూడా ఆనాడే కోర్టులో కనబడ్డది.

ఆ మరునాడు అందరికీ అల్పాహార విందు జూబిలీహాల్లో- మూర్తి సుమిత్రల పేర్లతో.

అందరికీ ఆశ్చర్యమేననిపించింది. అందరినీ ఆ విషయం విస్మయపరచింది. ఎంత కుతూహలంగా ఉందో? వాళ్లిద్దరినీ "ఏమిట్రా ఇది?" అని అడిగెయ్యాలని కొందరికి. కొందరికి "ఇప్పుడా మీకు పెళ్లి?" అని వెక్కిరించాలనిపించింది. మరికొందరికి "కర్రచేతికి వచ్చాక చేసుకోలేదు ఇంకా నయం" అనిపించింది.

ఇంత మందిని ఇలా సంభ్రమంలో ముంచెత్తిన మూర్తి ఏభయి ఆరేళ్ళవాడు. అంతస్థూలకాయం కాదు. కాని తలంతా ఎప్పుడో నెరిసింది. అయినా చూడటానికి బాగా ఉంటాడు. హుందాగా ఉంటాడు. స్నేహపాత్రుడు.

అతడు ఇంతవరకూ ఎందుకు పెళ్లి చేసుకోలేదో ఎవరికీ తెలియదు. భగ్న ప్రేమికుడు కాదు పెళ్లి అయ్యే వయసులో సంబంధం చూపి బలవంతంచేసి పెళ్లి చేసే పెద్దలు లేకపొయ్యారు. వారాలు చేసుకుని, విరాళాలు పోగుచేసుకునీ చదువు కున్న వాళ్లను ఎవరు పట్టించుకుంటారు? ఏ బంధువుల కంటికీ అతడు అనలేదు. కన్యల తండ్రులకూ కన్యలకూ అంతకంటె ఆనలేదు. ఆ తరువాత అతడు పెళ్లి మాటే ఎత్తుకోలేదు. ఇంచుమించుగా విస్మరించాడనుకోవచ్చు.

పార్టీకి వచ్చిన వారంతా ముందు వధూవరుల దగ్గరికి వచ్చి శుభాకాంక్షలు తెలిపి వాళ్లను ఎగాదిగా చూసి ఉపాహారాల బల్లల దగ్గరికి వెళ్లారు.

వధూవరులకేం? ఆరోగ్యంగా ఉన్నారు. చూడటానికి చక్కగా ఉన్నారు. దాంపత్యానికి కావలసినదేమిటి? కాని కొందరు వాళ్లను చూసి చిరునవ్వులు ఒలకపోశారు.

అయితే స్వీట్సు తిన్న తరువాత కాఫీలు త్రాగేటప్పుడు కొందరికి తోచింది "ఈ మూర్తి ఈ వయసులో ఏభయ్యేళ్లు సమీపిస్తున్న సుమిత్రను పెళ్లి చేసుకోవట మేమిట"ని.

"వివాహానికి ఓ వయసంటూ ఉంటుంది కదా?" అని కొందరి మనసుల్లో ఊహలు పరుగులు తీస్తున్నాయి."

"వివాహానికి వయసుతో నిమిత్తమేమిటి? జీవితంలో ఎప్పుడు ఎవరిని చేసుకోవాలనుకుంటే అప్పుడే వివాహం చేసుకోవచ్చు. ఇదేం పూర్వకాలమా? చట్టంలో కూడా వివాహానికి కింది లిమిట్ ఉందిగాని పై లిమిట్ లేదుగా? మన మూర్తి ఇప్పుడయినా చేసుకున్నాడు" అని సంతోషించిన వారూ ఉన్నారు.

పార్టీ ముగిసే ముందర "వీళ్లిద్దరూ తమ పిల్లలకు పెళ్లి చేసిన వాళ్లలా ఉన్నారు" అన్నాడు ఒకాయన. ఆయనను గురించి అందరూ అనేమాట అతడికి మాట్లాడే పద్ధతి తెలియదనీ పల్లెటూరి అనాగరీకుడనీను.

పార్టీ హడావడి అయిపోయింది. పెళ్లి తంతూ హనీమూన్ ట్రిప్పు అంతకు ముందే అయిపోయ్యాయి. ఇదివరకూ ఇద్దరూ చెరిఒక కారులోనూ వచ్చే మూర్తీ సుమిత్రలు ఇప్పుడు ఒక కారులో వస్తున్నారు. మూర్తి ఇల్లు ఖాళీచేసి సుమిత్ర యింటికి మారాడు. అతడికి ప్రత్యేకంగా మేడమీద భాగం ఖాళీచేసి ఇచ్చారు. సుమిత్ర లైబ్రరీ రూమ్ ఆఫీసు రూమ్ ప్రక్కన మూర్తికి రెండుగదులు ఏర్పాటయ్యాయి. మూర్తి పేరుగల బోర్డు గేటుకు మరొక ప్రక్క పెద్దక్షరాలతో వేలాడుతున్నది.

సుమిత్రకు తండ్రి మాత్రమే ఉన్నాడు. ఆయన కాలంనాటి నౌకర్లు ఉన్నారు. ఆయన అలవాట్లు తెలిసిన నౌకరు ఒకడు ప్రత్యేకం ఆయన గదిలో ఉండి ఏది కావాలన్నా అందిస్తూ ఉంటాడు. ఆయన డెబ్భై సంవత్సరాలున్నా హిందూ పేపరు మొదటినుంచి చివరవరకూ చదువుతాడు. లా జర్నల్సు చదువు తాడు. కూతురితో ప్రతిరోజూ ఆనాడు కోర్టులో జరిగిన సంగతులన్నీ అడిగి తెలుసు కుంటాడు చర్చిస్తాడు.

"ఆయన పాయింటు సరిగా అర్థం చేసుకోలేదమ్మా?" అంటాడొకసారి. "తొందరపాటు పనికిరాదంటాడొక"సారి.

ప్రతిరోజూ కూతురికి సలహాలిచ్చి జాగ్రత్తలు చెప్పి కోర్టుకు పంపుతాడు.

"నాన్నా, నేను ప్రతికేసూ గెలుస్తుంటే "నీవే నాకు ట్రైనింగ్ ఇస్తున్నా రని అందరూ అనుమా నిస్తున్నారు" అంటుందొకొక్కసారి సుమిత్ర గునుస్తూ.

"శిక్షణతో పైకి వస్తే మంచిదేగా?" అంటాడాయన నవ్వుతూ.

"నీతో సమానస్థులెవరయినా ఉన్నారా?" అని అడుగుతాడాయన.

"ఓ ఆయన ఉన్నాడు మూర్తి అని" చెప్పింది.

నిజానికి కోర్టులో సుమిత్ర సామాన్యంగా ఎవరితోనూ ఎక్కువగా మాట్లా డదు అందరితో ముభావంగా ప్రవర్తిస్తుంది.

కాని మూర్తికేసులు గెలుస్తుంటే ఆమెకేదో సన్నటి ముల్లు గుండెల్లో గుచ్చుకున్నట్టుండేది.

ఆనాడు లాయరు సుమిత్ర కోర్టుహాలంతా దద్దరిల్లిపోయేటట్టు వాదిస్తోంది.

"భార్యను గొంతుపిసికి చంపి మీద కిరసనాయిలుపోసి అగ్గిపిల్ల గీచి పడే శావు. ఆ తరువాత వాకిలి తలుపు గొళ్ళెంపెట్టి పెరటి తలుపు దగ్గరగా వేసి పారి పోయావు. ఆవెళ్ళేటప్పుడు నీషర్టు అంచులు తలుపుకున్న మేకులకు పట్టుకున్నాయి. నీవు పరుగెత్తటంలో ఆ అంచులు మేకులకు ఉండిపోయాయి. ఇవిగో ఆ ముక్కలు మి లార్డ్. ఇతడే ఆమెను చంపాడని నిరూపించటమయింది కనుక తనను నమ్మిన భార్యను చేతులారా చంపిన ఈ నిందితుడికి ఆ జన్మఖైదు విధించ మని కోరుకున్నాను."

"చూడండి. మూర్తిగారూ. నేనే గెలిచాను" అన్నట్టు ఆయన వైపు విజయగర్వంతో చూస్తూ ముఖాన్ని చేతిరుమాలుతో అద్దుకుంది.

సుమిత్ర కట్టుకున్న నీలం పట్టుచీరె ఎప్పుడూ వాడుకునేదే కాని ఆనాడు ఆ పట్టుచీరె జరీ అంచులు మెరిసిపోతున్నాయి. దానిమీద ఆమె ధరించిన నల్లగౌను ఎప్పటికంటె హుందాగా ఉంది. తలవెంట్రుకలు అక్కడక్కడ వెండితీగెల్లా మెరుస్తున్నాయి. మామూలుగా దువ్వుకుని ముడివేసుకుంది. అంత తెలుపు కాక పోయినా చామనచాయగా కనబడే సుమత్ర అలవాటుగా పెట్టుకున్న పావలా కాసంత బొట్టు కొత్త వచ్చినట్టుగా కనబడుతోంది. నిండయిన చెంపలకు రెండుప్రక్కలా ఎలక్ట్రిక్ బల్బుల మాదిరిగా రవ్వలకమ్మలు ధగధగ మెరిసిపోతున్నాయి. ఆమె తల తిప్పినప్పుడల్లా తళతళ మెరిసిపోతున్నాయి.

ఆమెది ఎప్పటి అలంకారమే కాని ఆనాడు ఆ అలంకారమే మరీ దీప్తి వంతంగా ఉంది.

తన వాదన ఓడిపోయేటట్లుగా ఉన్నా ఆమెను చూస్తున్న కొద్దీ మూర్తికి అలాటి భావం కలగటంలేదు. ఏమిటో- ఆమెను కొత్తగా ఆనాడే చూస్తున్నట్టుగా చూడటం మొదలుపెట్టాడు.

నీ అనుభవమంతా ఇవాళ ఏమయింది? ఏరి ఏరి తీసిన నీ పాయింట్లన్ని టినీ నేను కొట్టిపారేశానంటున్నాయి ఆమె చిలిపి కళ్లు నవ్వుతూ.

మూర్తి ఆమె వైపొకసారి చూసి తల దించుకున్నాడు.

అతడికి మొదటినుంచీ తనకెదురు వాదించేవాళ్లే లేరని తల విసురుకుంటూ నడిచే అలవాటు. నిజానికి ఆయన వాక్పటిమ కూడా అంతటిదే. మూర్తి చేపట్టిన కేసుకు ఎదురు వాదించాలంటే ఇంతవరకూ ఏ లాయరూ ముందుకు రాలేదు.

సుమిత్ర లాయరుగా హైకోర్టులో అడుగుపెట్టింది. ఆమె తండ్రి శ్రీమన్నారాయణ చేతిక్రింద జూనియరుగా పనిచేసింది. వాదనలోని మెలకువలన్నీ కరతలామలకం చేసుకుంది. చిరునవ్వుతో ప్రారంభించిన వాదనను ఆవేశంతో గంభీరంగా పాయింటు తరువాత పాయింటును తీసుకుని హాలు మారుమ్రోగేటట్టు చర్చించి ముగిస్తుంది. భాష తెలియకపోయినా ఆ వాక్ప్రవాహానికి సమ్మోహితులవుతారు ప్రేక్షకులు.

సుమిత్ర వచ్చినప్పటినుంచీ మూర్తి వాదనలో పటుత్వం తగ్గుతోందేమిటని తోటి లాయర్లు గుసగుసలు మొదలుపెట్టారు.

అసలు మూర్తే వాదించటంలో వెనకటి శ్రద్ధ వహించటం లేదని అతడి సన్నిహితుడైన శ్రీకంఠం బాధపడుతూ ఉంటాడు.

ఏమిటి? ఈ పాయింటు మన మూర్తికి తోచలేదా?

ఇలా మూర్తి వాదించలేడా?

ఇంతకంటె బాగా చురుకైన వాదనిపించుకున్న మన మూర్తికి ఏమయింది ఈ మధ్య?

ఇలా ఆలోచిస్తూ ఉంటాడు శ్రీకంఠం. నిరాశా నిస్పృహలకు లోనై అప్పుడప్పుడు హెచ్చరించటం మందలించటం కూడా జరుగుతోందిమధ్య. ఇద్దరి మధ్య కాలేజీలో చదువుకుంటున్నప్పటినుంచీ ఉండే చనువుకొద్దీ చివాట్లు కూడా పెడుతున్నాడు.

ఆనాటి కేసులో ఓడిపోయిన మూర్తి ఎప్పటి మాదిరిగా తను చేపట్టిన కేసు గెలిచినప్పుడు పెట్టే నవ్వుముఖంతో అందరివైపూ చూస్తూ ఇంటికి కారు నడుపుకుంటూ వెళ్ళాడు. ఇద్దరు ముగ్గురు లాయర్లను వాళ్ళ ఇళ్ళదగ్గర దిగబెట్టాడు. మరునాడు చిరునవ్వుతోనే కోర్టుకు వచ్చి అందరినీ పలకరించాడు.

బార్‌కౌన్సిల్లో అతడు ప్రముఖుడు. చీటికీమాటికీ ఏదోమిషమీద పార్టీలు ఇస్తూ ఉంటాడు. అతడు ఒంటరిగాడు. కబ్బులోనే పదిగంటలు దాటేవరకూ కాలక్షేపం చేసి ఇంటికి వెళ్ళగానే భోజనంచేసి పడుకుంటాడు. కేసులు వచ్చినప్పుడు మాత్రం రాత్రిళ్ళు పొద్దుపోయేవరకూ తన లైబ్రరీలో కూనిగారాలు తీస్తూ పుస్తకాలు తిరగవేస్తూ ఉంటాడు.

విజయనగరం నుంచి పార్టీలు వచ్చారొకసారి. అవతల పార్టీవాళ్ళు పేరు మోసిన లాయర్ని ఎక్కడినుంచో పిలిపించుకుని పెట్టుకున్నారు. ఈ పార్టీవాళ్ళు ముఖాలు వేలాడేసుకున్నారు. అయినా అఖరి ప్రయత్నంగా మూర్తి దగ్గరికి వచ్చారు.

అది పార్టిషన్ కేసు. పదేళ్ళ మైనరు ఉన్నాడు. ఈ మైనరు తన అన్నకు పుట్టినవాడు కాదని పినతండ్రి ఏవో కొన్ని ఉత్తరాలు సేకరించాడు. పైగా అన్న చనిపోయిన ఏడు నెలలకు పిల్లవాడు పుట్టాడు. ఈ మైనరు, అతడి తల్లివైపు వాళ్ళు మూర్తిని సంప్రతించారు. అందుకు తగిన ఆధారాలూ సాక్ష్యాలు ఆయనకు ఒప్పగించారు.

ఒకనాడు ఆమైనరును తీసుకుని తల్లి కూడా వచ్చింది. కన్నీటితో తన గాథంతా చెప్పింది మూర్తితో.

"ఆలోచించి చెబుతాను" మూర్తి ఆనాటికి వాయిదా వేశాడు. మరునాడు వాళ్ళు వచ్చేసరికి మూర్తి కేసంతా చదివి "మీకేం భయంలేదమ్మా. న్యాయం మీ వైపు ఉంది. మీ కేమీ భయంలేదు." అంటూ ఆమెకు ధైర్యం చెప్పాడు. ఆమెకు రావలసిన ఆస్తి ఆయిదారు లక్షల విలువగలది. ఆయనకు పాతికవేలు ఫీజు మాట్లాడుకుంది. అప్పటికప్పుడు రెండు వేలిచ్చింది.

మూర్తి చాలా ఆరోగ్యం కలవాడే కాని హఠాత్తుగా జ్వరం వచ్చింది. అప్పటికి సరిగ్గా పదోరోజున కేసు మొదట హియరింగు.

మైనర్‌తల్లి సీమంతినీదేవి మళ్ళీ ఆయనను చూడటానికి వచ్చింది. మూర్తిని చూడగానే ఆమె గుండె జారిపోయినట్లయింది. ఇతడు లేచి తన కేసు గెలిపించగలడా? తీరా సమయానికి ఇట్లా జరిగిందేమిటి?

ఆమె అక్కడ కూర్చుని ఉండగానే డాక్టరు వచ్చాడు.

"టైఫాయిడ్ కావచ్చు. మీరు పడక మీదనే ఉండాలి," అన్నాడు.

మూర్తి సీమంతినదేవి సందేహాన్ని గ్రహించాడు. ఆమెకు అన్యాయం జరగకుండా చూడాల్సిన బాధ్యత తనది. ఆ బాధ్యత తనుగాని మరెవరైనాగాని నిర్వహించి ఆమెకు న్యాయం చేకూర్చాలి.

వెంటనే సందేహాలు, ముఖమాటాలూ అభిమానాలూ అహంకారాలూ అన్నీ వదిలిపెట్టి సుమిత్రకు ఫోనుచేసి ఒకసారి తన యింటికి రమ్మని వేడుకోలుగా అడిగాడు.

ఎప్పుడూ తనను సాటిలాయరుగా పరిగణించని ఆయన ఫోను చేశాడంటే ఏ కేసులోనో అతడికి సందేహాలు వచ్చి ఉంటాయనుకుంది సుమిత్ర. కనీసం ఇప్పుడయినా తనకు ఆయన దృష్టిలో గుర్తింపు వచ్చిందని సంతోషించింది.

చేతులతో తల వెంట్రుకలు సవరించుకుని చుక్క లున్న సాదా చీరె కట్టుకుని కారులో బయలుదేరింది.

మూర్తి యింటికయితే వెళ్లిందిగాని-ఆయన ఇంట్లో ఎవరెవరున్నారో ఆమెకు తెలియదు. ఆయన వ్యక్తిగత జీవితాన్ని గురించి బొత్తిగా తెలియదు.

సంకోచిస్తూ ఇంట్లో అడుగుపెట్టింది. నౌకరు మూర్తి గదిలోకి తీసుకు వెళ్లాడు. మూర్తిని చూస్తూనే ఉలిక్కిపడ్డది.

మంచానికి అంటుకుపోయినట్లున్నాడు. పెద్ద మంచం- దానిమీద ఫోమ్‌బెడ్- అతడు పడుకున్నంత మేరా గుంటగా ఉంది. పట్టుశాలువా మెడవరకూ కప్పు కున్నాడు. ముఖం పీక్కుపోయింది. కళ్లు గుంటలు పడ్డాయి.

ఆమెను చూడగానే "నమస్కారం. కూర్చోండి" అని మంచానికి ఎదురుగా ఉన్న కుర్చీ చూపించాడు మూర్తి.

ఆమె విస్మయపడుతూ కుర్చీలో సర్దుకుని కూర్చుంది

ఎవరో చెప్పినట్టుగా వంటమనిషి కాఫీ తీసుకువచ్చి ఆమె పక్కగా ఉన్న టీపాయి మీద ఉంచాడు.

కాఫీ అట్లా ఉంచి "ఏమిటి సంగతి? ఎందుకు పిలువనంపారు?" మెల్లగా అడిగింది సుమిత్ర.

తన దిండు దగ్గరున్న గంట నొక్కాడు మూర్తి. వెంటనే గుమాస్తా వచ్చాడు. అంతా ఆమెతో చెప్పు అన్నట్టుగా కళ్లతో సైగచేశాడు మూర్తి.

గుమాస్తా ఆమెకు సమీపంలో నిలబడి "అయ్యగారికి జ్వరంగా ఉంది. డాక్టరుగారు కొన్నాళ్లు మంచమ్మీదనే ఉండి మందులు జాగ్రత్తగా తీసుకోమన్నారు. ఈ జ్వరం రాకముందు ఒక కేసు అయ్యగారు చేపట్టారు. పది రోజులలో మొదటి హియరింగు. ఆ కేసు మీరు చేతిలోకి తీసుకుని గెలిపించాలని అయ్యగారు చెప్పమన్నారు. ఫీజు పాతికవేలు. రెండువేలు ముట్టాయి" అంతా చెప్పానన్నట్టు మూర్తి ముఖంలోకి చూశాడు గుమాస్తా.

పైలు తెచ్చివ్వు అన్నట్టు చేతిసైగ చేశాడు మూర్తి. అతడు తెచ్చేటంతలో కాఫీ తీసుకోమని చేత్తో చూపించాడు సుమిత్రకు.

ఆమె కాఫీ తీసుకోగానే మూర్తి ముఖంలో చిరునవ్వు మెరిసింది.

పైలు చేతిలోకి తీసుకుని "కేసు గెలిపించాలి. అంతే కదా మీరు చెప్పదలచుకున్నది? నేను మీ అంత సమర్థురాలిని కాను. చేతనైనంత ప్రయత్నిస్తాను. మీరు ధైర్యంగా ఉండండి. మందులు జాగ్రత్తగా తీసుకోండి" లేచి నిలబడ్డది.

మూర్తి ఒక మాదిరిగా నవ్వాడు. కనుబొమలు పైకి లేచాయి. ముక్కు మీదికి వేలుపోయింది. నాలో హేళన హాస్యం వ్యగ్యం తీసివేతవంటి భావాలు తెలిప్పుడు నీవు సమర్థురాలివని ఏనాడో గ్రహించాను అన్నట్టున్నదా ముఖం.

చిరునవ్వైనా పైకి కనబడనీయకుండా పెదవులు బిగించి పట్టుకుంది సుమిత్ర.

"వస్తాను కేసు గెలిచిన తరువాతనే మళ్లీ మీ యింటికి రావటం" అన్నట్టు చూసి. చేతులు జోడించి మెల్లగా బయలుదేరింది.

కోర్టులో సీమంతినీదేవి కేసు వాదించేటప్పుడు ఆమె కంఠం కోర్టుహాలంతా మారు మ్రోగింది.

"స్త్రీని పురుషుడు శంకించినంత సులభంగా నిరూపించలేడు. కాని-స్త్రీని ఏమాటఅంటే తలవంచుకుని వెనక్కు తగ్గుతుందో పురుషుడికి తెలుసు. ఆ తురుపు ముక్కతోనే ఆమె జీవితంతో పేకాట మొదలు పెడతాడు'' అంటూ ప్రారంభించి సీమంతినీదేవికి ఆస్తి పంచవలసి వస్తుందని ఆమె మరిది ఈ ఎత్తువేశాడని నిరూపించింది. సాక్ష్యాధారాలు చూపించింది. ఆ భార్యా భర్తలు తమ తొలి వంటను గురించి వ్రాసుకున్న జాబులు కోర్టువారి ఎదుట దఖలు పరచింది. మైనరు ముమ్మూర్తులా తండ్రి పోలికలో ఉండటంకంటె సాక్ష్యమింకేమి కావాలని కోర్టు వారిని ప్రశ్నించింది

సుమిత్ర స్త్రీల జీవితాలను గురించి వాళ్ల దుర్భర పరిస్థితులను గురించి వేదనా భరితమయిన వాళ్ల హృదయాలను గురించి కోర్టులో చూపుడు వేలితో నిర్దేశించి పోట్లాడుతుంటే స్త్రీపురుషుల కడుపులోని పేగులు కదిలాయి కన్నీళ్లు జాలువారాయి. న్యాయమూర్తి కూడా కళ్లజోడు తీసి రుమాలుతో కళ్లద్దుకున్నాడు.

సీమంతినీదేవి పక్షాన బలమైన సాక్ష్యాలున్నాయి ఆమె కేసు గెలిచింది. ఆమెకు అయిన ఖర్చులన్నీ అపతల పార్టీ భరించింది.

ఈ కేసుతో సుమిత్ర స్థాయి మరొక మెట్టు పైకెక్కింది.

సాయంత్రము ఆరుగంటలు కావస్తున్నది. మూర్తి గది చుట్టూ చెట్లు ఉండటంచేత త్వరగా చీకటి పడినట్లనిపిస్తున్నది. అప్పుడే పాలు తాగి కన్ను మూసినట్టున్నాడు మూర్తి.

ఇల్లంతా నిద్రపోతున్నట్లనిపించింది.

అడుగులో అడుగువేసుకుంటూ సుమిత్ర ఇల్లంతా తిరిగింది. వంటయింటి వసారాలో ఉన్న వంటమనిషి ఆమెను చూసి నోట్లో ఉన్న సిగరెట్ దూరంగా పారేసి దిగ్గున లేచి నిలబడ్డాడు.

"ఈ యింట్లో ఎవరూ లేరా?'' అడిగింది.

"అయ్యగారు పాలు తాగి పడుకున్నారమ్మా డాక్టరుగారు వచ్చి చూసి వెళ్లారు.''

"అయితే ఇంకెవరూ లేరా ఇంట్లో?''

''అయ్యగారూ నేనేనండి. ఇంకెవరు ఉంటారండి? అయ్యగారికి పెళ్లవ లేదండి.''

''ఓహో! ఇంకా పెళ్లి కాలేదా?'' ఆమెకు అతడిపట్ల జాలి కలిగింది. మూసిన కన్ను తెరవకుండా పడిఉన్నాడు. నౌకరు తప్ప పలకరించే దిక్కులేదు. భార్యా పిల్లలూ ఉంటే ప్రేమతో పలకరిస్తూ ఆపాయ్యంగా పాలో గంజో తాగిస్తారు. రోగి తనకు కావలసినవి కరుణ కలిగించేటట్టు అడుగుతాడు. వాళ్లు ఆర్ద్రహృదయాలతో సమకూరుస్తారు.

మనిషి ఆపదలో ఉన్నప్పుడు అమ్మా అబ్బా అని మూలుగుతా డెందుకని?

ఆర్ద్ర హృదయంతో ఎవరైనా వచ్చి తనను తల్లి మాదిరిగా తండ్రిలా సమాశ్వాసించాలన్న అంతరంగంలోని ఘోషే మనిషిచేత అమ్మా అబ్బ అని అనిపిస్తుంది.

ఎవరు దయతో దగ్గరికిచేరి ఊరడిస్తే వాళ్ళలో అమ్మా అబ్బలను చూసుకోగలుగుతాడు. ఏ వయసులో ఉన్న స్త్రీ కయినా సరే పురుషుడికయినా- సరే మనసు ఊరడింపు కోసం తపించిపోతుంది. ఎంతటి ధీమంతుడైనా దీనిని దాటలేడు.

మూర్తి కూడా అందరి సామాన్యుల వంటి పరిస్థితిలో చిక్కుకున్నాడు.

''అమ్మా'' అంటూ ఒత్తిగిల్లాడు.

సుమిత్రకు బిడ్డలులేరు. అసలు పెళ్ళేకాలేదు. కాని ఆమెది స్త్రీ హృదయం. అతడి పరిస్థితంతా అర్థం చేసుకుంది. తను చిన్నపిల్ల కాదు కనుక మూర్తి విషయంలో సంకోచపడలేదు.

''మూర్తిగారూ. ఎలా ఉన్నారు? ఇంకా జ్వరం తగ్గలేదా? మరీ నీరసించి పోయారు. మందులు తీసుకుంటున్నారా?'' కుర్చీ మంచానికి దగ్గరగా లాక్కుంది.

''ఏమిటో-మందు తీసుకుంటున్నాను. డాక్టరు చెప్పిన ఇరవై ఒక్కరోజు గడిచింది గాని ఇంకా ఓపిక రాలేదండి'' అన్నారు నీరసంగా.

''ఆయిన వాళ్ళనెవరినయినా పిలిపించుకోవాలి ఇటువంటి సమయాలలో.. ప్రాణంకంటె ఎక్కువేముంటుందండీ!'' అంది సానుభూతి కనబరుస్తూ.

పెరిగిపోయిన గడ్డంలో పెదవులు సరిగా కనబడటంలేదు పెదవులు సాగినట్లు కనిపించిన చెంపల కదలికవల్ల అతడు నవ్వినట్టు ఆమె గ్రహించుకుంది.

"ఏం? ఎవరూ వచ్చేవారు లేదా?"

"వచ్చేవారు కాదు అసలే ఎవరూలేరు" దీనంగా ఉన్నాయి అతడి చూపులు.

"ఎవరూ లేకుండా ఆకాశంలో నుంచి ఊడిపడ్డారా మీరు?" కడుపులో కొండంత జాలి-పైకి ఎగతాళిగా నవ్వేసింది.

అతడికీ నవ్వు వచ్చింది. మళ్లీ అంతలోనే విషాద మేఘాలు ముఖాన్ని కమ్ముకుపోయాయి.

"నేను ఇంకా నాలుగు నెలలకు పుడతాననగా మా నాన్న చనిపోయాడు. లాయరు పట్టా పుచ్చుకున్న తరువాత అమ్మ పోయింది. బంధువులెవరో నాకు బాగా తెలియదు" కళ్లు మూసుకుంటూ చెప్పాడు.

"మరి పెళ్లి?"

"అమ్మ సంబంధం కుదిర్చింది. పెళ్లి నెలరోజులుందనగా చనిపోయింది. తరువాత పెళ్లి ప్రశంస నా మనసులోకి రాలేదు."

"అయ్యో" అనుకుంటూ సుమిత్ర చేతివేళ్లు పెదవుల కానించుకుంది.

పావుగంట నిశ్శబ్దం ఆ గదిలో సంచారం చేసింది.

కళ్లు మూసుకున్న మూర్తి ఒక్కసారి కళ్లు తెరిచాడు

ఆమె ముఖాన్ని మరింత దీప్తివంతం చేస్తున్నాయి ఆమె చెవులకున్న రవ్వల కమ్మలు. అవి మెరుపులు విరజిమ్ముతున్నాయి. ఆమె ముఖంలో ఏదో అంత ఆందోళన.

ఆమె కళ్లు గోడకున్న అతడి ఫొటో వంక చూస్తున్నాయి. ఆ కళ్లలో కాంతులు మెరుపుల్లా మెరుస్తున్నాయి.

చటుక్కున స్ఫురించినట్టుగా "మూర్తిగారూ, సీమంతినీదేవి కేసు గెలించింది ఆమె మా యింటికి వచ్చి ఫీజు ఇచ్చి మిమ్ముల్ని మరీ మరీ అడిగా

నని చెప్పమన్నది. ఇదిగో ఆమె ఇచ్చిన డబ్బు అసలు నేను మీకు ఈడబ్బు ఒప్పిగించ టానికే వచ్చాను" లేచి వంద రూపాయల నోట్ల కట్టలున్న పాకెట్ అతడి మంచమ్మీద పెట్టింది.

"అదేమిటి? ఆ కేసు నేను వాదించి గెలిపించానా? నాకెందుకీఫీజు? కష్టపడ్డారు- మీరు తీసుకోండి." చేతులడ్డం పెట్టాడు.

"నా కెందుకు? నేను కావాలని ఈకేసు తీసుకోలేదే? మీరు నన్ను పిలిచి ఈకేసు చూడమన్నారు, కనుక తీసుకున్నాను. సహజంగా ఆ కేసు ఎవరు వాదించినా ఆమెకు గెలుపు ఖాయం. ఇందులో నా గొప్పేముంది?"

"మీరు వాదించిన నాడు కోర్టులో హాజరయిన వాళ్ళు చెప్పారు- హాలంతా దద్దరిల్లి పోయిందట!"

"ఓ! అదా?" పకపక నవ్వింది. "ఆడవాళ్ళకు జరిగే అన్యాయాలను గురించి పెద్ద ఉపన్యాసం దంచేశాను."

ఆమె నవ్వుతుంటే అతడూ నవ్వాడు.

"మీరు మంచి ఆహారం తీసుకుని బలం తెచ్చుకుని కోర్టుకు రండి. ఇంకా ఎన్నాళ్ళు ఇలా మంచమ్మీద ఉంటారు?"

"నేనా? ఇలాగే మంచమ్మీద ఉండిఉండి ఏనాడో రాలిపోతాను" కళ్లు మూసుకుని తల ఆడించాడు.

"ఈ వేదాంతాలకేం గాని- వచ్చే వారానికయినా కోర్టులో ఉండేటట్టు చూసుకోండి" ఆమె మెల్లగా అడుగులు వేసుకుంటూ వచ్చింది. వెళ్ళేటప్పుడు గబగబా నడుచుకుంటూ వెళ్ళి కారులో కూర్చుంది

గేటు దగ్గర వంట మనిషి కనబడ్డాడు.

"ఏమిటి? మీ అయ్యగారికి పథ్యం బాగా చేసిపెట్టు. మాట్లాడే ఓపిక కూడా లేనట్టుగా ఉన్నారు" అంది అతడిని కారు దగ్గరికి పిలిచి

ఏం చేసినా ఎంతబాగా చేసినా తినటం లేదండి. నోటికి హితవుగా లేదంటారండి" అన్నాడు చేతులు నలుపుకుంటూ.

"ఒకటి కాకపోతే మరొకటయినా తింటారు. నాలుగు రకాలుచేసి పెడుతూ ఉండు. బొత్తిగా ఓపిక లేకుండా ఉంది. ఈసారి డాక్టరుగారు వచ్చినప్పుడు చెప్పు టానిక్ రాసిస్తారేమో. లేకపోతే ఇంజక్షన్లు ఇవ్వమను" కారు దూసుకుంటూ వెళ్ళిపోయింది.

ఇంటికి వెళ్ళగానే తండ్రి గదిలోకి వెళ్ళింది. ఆయన భోజనం వేళకు అయినట్టుంది. ఇంక పడుకోటానికి మంచమ్మీద కూర్చున్నారు.

"ఏం నాన్నా? అంతా క్షేమమేనా?" నవ్వుతూ అడిగి భుజమ్మీద చెయ్యేసింది.

"అంతా ఓకే తల్లీ. ఎక్కడికి వెళ్ళావు? చాలా ఆలస్యమైంది?" అడిగారు తల తడుముకుంటూ.

"నాన్నా, మనమిక్కడికి వచ్చిన కొత్తల్లో నాతో పాటు టెన్నిస్ క్లబ్బులో చేరి ఆడుతుండేవాడని చెప్పాను చూడు? ఆయన ఒక ఎడ్వకేటు. నాకు కోర్టులోనూ పోటీగా ఉంటాడు ఈ మధ్య జబ్బుపడి ఒక కేసు నా దగ్గరికి పంపాడు. ఆ కేసు గెలిచింది. ఫీజు ఇచ్చి వద్దామని వెళ్ళాను."

అలాగా అంటూ ఆయన పక్క మీదికి ఒరిగారు.

మరునాడు టిఫిన్ కారియరుతో తన గదిలోకి అడుగు పెడుతున్న సుమిత్రను చూసి తెల్లబోయాడు మూర్తి.

"ఇవాళ ఈ వంటకాలు తిని చూడండి. మీ నోటికి హితవుగా ఉంటాయో లేదో చూద్దాం" పళ్ళెం మంచినీళ్ళు తెప్పించి తను స్వయంగా వడ్డించింది.

టీచరు ఎదుట పాఠం చదివే పిల్లవాడిలా తలవంచుకుని తినటం మొదలు పెట్టాడు మూర్తి.

"ఈ కూర ఒంటికి చాలా మంచిది. మరి కొంచెం వేసుకోండి. భోజనాలో రసం ఇదో గ్లాసెడు తాగాలి. లేకపోతే బలం ఎలా వస్తుంది? కేసులు పట్టుకుని వాదించాలా? అంతసేపు నిలబడ గలగాలా?" కొసరి కొసరి వడ్డించింది మందలిస్తూ.

"కడుపునిండా తినేశాను. కళ్లు బరువెక్కి వాలిపోతున్నాయి. నిద్రపోతానో ఏమిటో ?"

"తినగానే నిద్రపోకూడదు. ఆ పడక్కుర్చీలో అట్లా కూర్చుని పేపరు చదవండి. నిద్ర తేలిపోతుంది" వంట మనిషితో చెప్పి తాను మంచినీళ్లు తెప్పించుకుని తాగింది.

"సరే సరే అన్నంత పనీ జరిగింది. పేపరు చేతిలోంచి పడిపోతోందిగాని సరిగా కూర్చోండి" అన్నది.

"కళ్లు మూసుకుపోతుంటే ఎట్లా కూర్చోను ?"

"అయితే ఒక పని చేయండి. మీరు మొట్టమొదట కోర్టులో ప్రవేశించినప్పుడు మీ స్థితి ఎట్లా ఉండేదో కాస్త చెప్పండి వింటాను."

"ఏముంది చెప్పటానికి నేను పట్టిన కేసును గురించి ఫైలు బాగా చదువుకుని వెళ్లి గట్టిగా వాదించే వాడిని."

"ఆఁ ? ఆఁ? అంతేనా? ఆర్గ్యుమెంటు అంతా బట్టీ పెట్టేసి అద్దం ముందర నిలబడి, ఆ గదే కోర్టనుకుని స్పీచ్ ఇవ్వటం మొదలు పెట్టలేదూ ? ఇంట్లో రిహార్సలు బాగా చేసుకుని ధైర్యం వచ్చిన తరువాత గదా కుర్రలాయర్లు కోర్టులో అడుగుపెట్టేది.? నిజమౌనా కాదా?" పెదవుల పైకి వస్తా వస్తానంటున్న నవ్వును అణిచిపెట్టింది.

"ఆఁ - ఆఁ - - అందరూ అట్లా కాదులెండి అయినా మీకు-మీకు-ఎట్లా తెలుసు ?" వింతగా ఆమె ముఖంలోకి చూశాడు

ఆమె విరగబడి నవ్వింది. "నేనూ లాయర్నే కదండీ" అంటూ ఆపుకో లేక మళ్లీ నవ్వటం మొదలు పెట్టింది.

"మీరూ అలా చేసే ఉంటారు కదూ ?" మళ్లీ నవ్వింది.

ఇలా కబుర్లు చెబుతూ నవ్వుతూ నవ్విస్తూ ఉండగా వంట మనిషి ఇద్దరికీ కాఫీ తెచ్చారు.

ఆమె గంట చూసుకుంది. నాలుగు కావచ్చింది.

''అమ్మో. కోర్టునుంచి ఇంటికి వెళ్ళే వేళయింది'' మెల్లగా లేచి వాకిట్లోకి వచ్చింది. ''అయ్యగారికి రాత్రి బ్రెడ్ పాలు ఇవ్వు చాలు. టానిక్ మర్చిపోకు'' కారు స్టార్టు చేసింది.

ఇలా ప్రతిరోజూ ఆమె కోర్టుకు వెళ్ళినట్టుగా వేళ మీరకుండా టిఫిన్ కారియరు పట్టుకుని మూర్తి ఇంటికి వెళ్ళేది కబుర్లు చెబుతూ ఆయనచేత భోజనం తినేటట్టు చేసేది. తిరిగి నాలుగు గంటల లోపల ఇంటికి చేరేది.

నెల తిరిగేసరికి మూర్తి మామూలు మనిషయ్యాడు. ఇకనుంచి కోర్టుకు వెళ్ళగలనన్న ధైర్యం చేకూరింది. మరునాడు ఉదయం వేళకు లేచాడు. వంట మనిషి యిచ్చిన కాఫీ తీసుకుని పేపరు ఆసాంతం చదివి స్నానంచేసి తనగదిలో కూర్చున్నాడు. మధ్యమధ్య కళ్ళను ద్వారంపైపు తిప్పి చూస్తున్నాడు.

తొమ్మిదిన్నర- పది- పదకొండు గంటలు దాటుతున్నాయి. అతడికి ఆకలి- కడుపులో ఒకటే మంటగా ఉంది.

రోజూ సుమిత్ర టిఫిన్ కారియరుతో అన్నం తీసుకు వస్తున్నదని వంట మనిషి తనవరకే వంట చేసుకున్నాడు. అతడివేళకు భోజనముచేసి గుర్రుపెట్టి నిద్రపోవటం కూడా జరిగింది.

ఏమిటి? సుమిత్ర ఇవాళ ఎందుకు రాలేదు? ఒంట్లో ఏమయినా సుస్తీ చేసిందా? అలా అయితే ఫోను చేయవచ్చు కదా? ఆలోచిస్తూ గ్లాసెడు మంచి నీళ్లు తాగాడు మూర్తి.

ఒంటిగంటయింది. ఇక వంట మనిషిని లేపి వంట చేయించుకుందామని కేకలు పెట్టాడు.

అతడు వంటచేసి బల్లమీద పెట్టేసరికి మధ్యాహ్నం రెండు గంటలయింది. తినగానే నిద్ర వచ్చింది.

సుమిత్ర ఆ తరువాత మూర్తియింటికి రాలేదు. మూర్తికి భోజనం చేసినట్టుగా లేదు. కడుపు నిండినట్టుగా లేదు. ఆమె కబుర్లు చెబుతుంటే ఆనందంగా కాలం గడిచినట్టుగా లేదు.

మళ్లీ ఏమిటో నీరసం-అన్నం సహించకపోవటం ప్రారంభమయింది. కోర్టుకు వెళ్లినా పని చూసుకోలేకపోతున్నాడు. ఎవరితోనూ మాట్లాడాలని కూడా అనిపించటంలేదు. కాని కోర్టులో సుమిత్ర కనబడుతున్నది. చురుకుగా తన పని చేసుకుంటున్నది. ఇతడిని గురించి మాత్రం చూసీ చూడనట్టుగా వెళ్లిపోతున్నది. కాని ఆమెను చూడగానే అతడికి మాట్లాడాలన్న ఆరాటంగా ఉన్నది.

ఒకడికి కోర్టులో తనను కలుసుకునే అవకాశమే ఇవ్వటంలేదు సుమిత్ర.

ఒకనాడు సాయంత్రము సుమిత్ర తండ్రితో కబుర్లు చెబుతూ ఇంటిముందు లానులో కూర్చుంది. మూర్తి మెల్లగా వచ్చి వాళ్ల ముందర నిలబడ్డాడు.

''మూర్తిగారా? వచ్చి ఇలా కూర్చోండి. నాన్నా మూర్తిగారని చెప్పాను. జ్ఞాపకం ఉందా? వారే'' అంటూ పరిచయం చేసింది సుమిత్ర.

కుశల ప్రశ్నల తరువాత మూర్తి ఆయనతో ధైర్యంగా చెప్పాడు-''సుమిత్ర గారు లేకపోతే నేను కేసులూ గెలవలేను. భోజనమూ చెయ్యలేను. చివరకు బ్రతకనూ లేను. నన్ను ఏం చెయ్యమంటారో చెప్పండి'' కూర్చోకుండానే ఆయన వంక చూస్తూ అన్నాడు.

''అదేమిటి అలా అంటున్నారు? కోర్టులో లీడింగ్ లాయరట కదా మీరు? మా సుమిత్ర ఎప్పుడూ చెబుతూ ఉంటుంది మీ కబుర్లు'' అన్నారాయన.

''అదంతా క్రిందటి జన్మ. ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు?'' దీనంగా ఉన్నాయి చూపులు.

''నేనేం చెప్పను?''

''మే మిద్దరం ఒకరినొకరం సంప్రతించుకుంటూ ప్రాక్టీసు చేస్తాం. నాకు సుమిత్ర తోడు కావాలి. దీనికి మీరంగీకరించాలి.''

''నేనా? ఇప్పుడా?'' ఆయన విస్మయంలో నుంచి తేరుకోవటానికి చాలా సేపు పట్టింది.

''సుమిత్రా, ఏమిటమ్మా ఇలేది మాటలు? నీ కర్థమవుతున్నాయా?'' అయోమయంగా ఉందాయనకు.

"ఆయనంతే నాన్నా. సంపాదిస్తారు కాని ఆ డబ్బు దాచటం తెలియదు. మొన్న నేనిచ్చిన డబ్బు ఆబల్లమీద పడేశారు. అంతే. భోజనం కూడా దగ్గరుండి కబుర్లు చెబుతూ పెట్టాలి. ఆభోజనం కూడా అందరి వంటా నచ్చదు. ఒక నెల్లాళ్లకే ఎంతో తీసిపోయారు మనిషి'' ఎంతో ఆదుర్దాగా అంటూ మూర్తి వైపు చిలిపిగా చూపింది.

ఆయనకు వాళ్లిద్దరినీ చూస్తూంటే ఏమనాలో తోచలేదు. కొంతసేపటికి "ఊరికే తోడు కావాలంటే ఏమన్న మాట? కాస్త ఆలస్యమయింది. అయితే మాత్రమేం? తిరుపతిలో వివాహం చేసుకుని హనీమూన్‌కు వెళ్లిరండి'' అన్నాడు సంతోషంగా ఉన్నా గంభీరంగా.

మూర్తీ సుమిత్రలు చివాలున కుర్చీలలోనుంచి లేచి ఆయన పాదాలకు నమస్కరించారు.

(ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక)



# పరుగెత్తే బొమ్మ

సౌజన్య ఇంట్లో అడుగుపెడుతూనే "సైనీ ఏడీ?" అంటూ హాల్లో ఇటూ అటూ చూసింది.

"గదిలో పడుకున్నాడక్కా. వాడికి సన్నగా జ్వరం తగుల్తున్నది. డాక్టరు అన్ని పరీక్షలు చేశాడు. కాని జ్వరం తగ్గటం లేదు. నిన్ననే పెద్ద డాక్టరు దగ్గరికి వెళ్లాము" అంతలో అతడి కంఠస్వరం గద్గదమయింది. తల వంచుకున్నాడు.

"డాక్టరేమన్నాడు? అసలు సైనీ గదిలోకి నన్ను తీసుకు వెళ్లు" తమ్ముడి భుజమ్మీద ఆప్యాయంగా చెయ్యేసింది సౌజన్య. అతడికి కన్నీరాగటంలేదు. "మందిచ్చి చూద్దాం కొన్నాళ్లు. టెస్టు కావాలి" అన్నాడు.

అంతలో ఇద్దరూ సైనీ గదిలోకి వచ్చారు. ఏడేళ్ల పిల్లవాడు కంఠంవరకూ దుప్పటి కప్పుకుని పడుకుని ఉన్నాడు.

సౌజన్య సైనీ పక్కలో కూర్చుని ఫాలభాగమ్మీద చెయ్యేసి రాస్తూ "ఒరే ఆనందూ! నీకు అనవసరమైన భయంగాని-ఈ రోజుల్లో కొద్దిగా జ్వరం తగిలిందంటే భయపడవలసిందేమీలేదు పెద్ద స్పెషలిస్టు దగ్గర జాగ్రత్తగా వైద్యం చేయిస్తే తగ్గిపోతుంది దీనికి భయపడతావేంరా? కమల ఏదీ? ఆవిడ కూడా నీలాగే భయపడుతోందా?" సౌజన్య లేచి వంట యింట్లోకి వెళ్లింది.

కమల కాఫీ గ్లాసు సౌజన్య చేతి కిస్తూ "ఒదినా! చూడు వాడిని నెలకా వచ్చింది" కన్నీళ్లు కార్చింది.

"ఏమిట్రా పిచ్చివాళ్లలా ఉన్నారు చూస్తే మీరిద్దరూ? వాడికేం భయం లేదు. మీరిద్దరూ అందుకేనా ఇట్లా చిక్కి శల్యాల్లా ఉన్నారు?"

మధ్యాహ్నం-భోజనాలయిన తరువాత తీరికగా తమ్ముడినీ మరదల్నీ దగ్గర కూర్చో బెట్టుకుని నవ్విస్తూ కబుర్లు చెప్పింది.

"ఏమిట్రా? ఇవేళేనా లేక ఉద్యోగం మానేసి ఇంట్లోనే ఉంటున్నావా?" పలకరించింది సౌజన్య తమ్ముడిని.

"ఒకనెల సెలవు పెట్టారు ఒదినా. నేను పగలంతా వాడితో ఒంటరిగా ఉండలేక ఆయనను సెలవు పెట్టమన్నాను. నాకసలే భయం. అందులో అత్తయ్య క్షయతో పోయారని విన్నప్పటినుంచీ నాకు మరీ భయంగా ఉంది." బిక్కముఖం పెట్టింది.

"అదిగాక— అక్కయ్యా. సైనీ పాలు తాగమంటే మందు తీసుకోమంటే ఒకటే పేచీ పెడతాడు. తనొక్కతే చూసుకోలేదని సెలవు పెట్టాను" అన్నాడు ఆనందు.

"పిల్లలు పేచీ పెడతారని భయపడుతున్నారా? మిమ్మల్నిద్దరినీ చూసి ఏమనుకోవాలో తెలియటంలేదు. ఒరే ఆనందూ. సైనీని నేను చూసుకుంటాను. నీవు సెలవు క్యాన్సిలు చేసుకుని ఆఫీసుకు వెళ్లు. డాక్టరు ఇవాళా రేపట్లో వస్తాడా? మనమే వెళ్లాలా?" ఇద్దరి భుజాలూ తడుతూ లేచింది సౌజన్య.

ఏడాది క్రిందట చూసిన మేనత్తను సైనీ గుర్తుపట్టాడు.

"అత్తా ఎప్పుడు వచ్చావు? నాకేం తెచ్చావు?" లేచి కూర్చున్నాడు.

"నేను పొద్దున పది గంటలకు వచ్చాను. అప్పుడు సైనీగాడు నిద్ర పోతున్నారు. వారికి బాటరీతో నడిచే బస్సు తెచ్చాను. గంతులు వేసే కోతిని తెచ్చాను" పెట్టెలో నుంచి తీసి చేతికిచ్చింది.

వాటిని సైనీ కిందా మీదా తిప్పి పరీక్ష చేస్తుంటే సౌజన్య అతడిని ఒళ్లో కూర్చోబెట్టుకుని "బాగుందా బస్సు? కోతినాడించు. అయితే ఒక షరతు. నీవు పక్కమీదనే ఉండి వాటిని దగ్గర పెట్టుకోవాలి. లేచి పరుగెత్తకూడదు మరి."

ఈ మాట వినగానే సైనీకి ఏడుపు ముంచుకు వచ్చింది. "అందరూ అంతే. పక్కమీది నుంచి లేవద్దు-లేవద్దు-ఒకటే మాట లేచి ఆడుకుంటా" సౌజన్య చేతుల్లో నుంచి తప్పించుకువెళ్లి బస్సును నాలుగుసార్లు ఇటునుంచి అటూ అటు నుంచి ఇటూ హాల్లో పరుగెత్తించాడు. కోతిచేత గంతులు వేయించాడు. సాయంత్ర మయేసరికి ఒక డిగ్రీ జ్వరం హెచ్చింది

డాక్టరు పక్కమీది నుంచి లేవనీయవద్దని చెప్పాడు. అలసటకు జ్వరము హెచ్చుతుందని హెచ్చరిక చేశాడు.

సౌజన్య పిల్లల మన స్తత్వ శాస్త్రాన్ని బాగా అధ్యయనం చేసింది. లండన్ వెళ్ళి డిప్లొమా తెచ్చుకుంది. బొంబాయిలో టీచరుగా పని చేస్తోంది. తన విజ్ఞానాన్నంతా వినియోగించి ప్రయత్నించటం మొదలుపెట్టింది.

సైనీ మంచం దగ్గర తన మంచం వేయించుకుంది. ఆ మంచానికి మరొక పక్క ఒక కుర్చీ వేసుకుంది సైనీకి పాలూ పళ్ళూ భోజనం అంతా మేనత్త చేతి మీదుగా జరుగుతున్నాయి. సైనీ ఆమెను కోప్పడుతూ ఉంటాడు. విసుక్కుంటాడు. అరుస్తాడు. అలిగి మూతి ముడుచుకుంటాడు.

సౌజన్య నవ్వుతూ బ్రతిమిలాడుతుంది. ఏవేవో ఆశలు కల్పిస్తుంది. కథలు చెబుతుంది. పాట కథలు పాడి వినిపిస్తుంది.

"ఒక రాజుగారికి ఏడుగురు కొడుకులట."

"ఆఁ- ఆఁ. అది నాకు వచ్చు. చేపల కథ" అంటాడు చెవులు మూసుకుని సైనీ.

"ఒక ఏనుగు పొద్దున్నే చెరువులో స్నానం చేసి...."

"ఆఁ. అది నాకూ తెలుసు దర్జీ కథ" విసుక్కుంటాడు కళ్ళు మూసుకుని ముక్కు చిట్లిస్తూ.

"పోనీ ఇంకోటి చెప్తా. ఇది నీవు విననిది. ఒక పిల్ల అడవిలో దారి తప్పి పోయిందట. తిరుగుతూ తిరుగుతూ ఓ యింటికి వచ్చిందట...."

"ఆఁ. ఇది నాకు ఇదివరకే వచ్చు. మూడు ఎలుగుబంట్ల కథ."

"అయితే నీవెప్పుడూ వినని కథ చెప్తా ఉండు సైనీ ఎండాకాలంలో ఒక చెరువు ఎండిపోతుందన్న భయంతో ఒక తాబేలు...."

నవ్వేశాడు సైనీ. "అత్తా. ఈ కథ నాకు రాదనుకున్నావా? తెలివి తక్కువ తాబేలు కొంగలు కర్రను కరిచి పట్టుకోమంటే దారిలో మరిచిపోయి నోరు తెరిచి

కిందబడ్డది అంతే కదూ?'' అత్త ఓడిపోయినందుకు చప్పట్లు కొట్టి మరీ మరీ నవ్వాడు పైనీ.

''ఈసారి నీవు ఎప్పుడూ విననిది చెప్తా చూడు.... ఒక పులిటం- ఊబిలో ఇరుక్కుని పైకి రాలేక బంగారు కడియమిస్తానని దారినపోయేవాళ్లను....''

''అయ్యో. అత్తా. ఈ కథ నాకెప్పుడో తెలుసు.''

''సరేరా పైనీ. నీవు ఎప్పుడూ విననిది కథ చెప్పలేనని కదూ అనుకుంటున్నావు? నీవు పాలు తాగి బ్రెడ్ తింటూ ఉండు. నాకో మంచి కథ వచ్చు. నీకు చెబితే చాలా బాగుందంటావు. ఆ కథ చాలా పెద్దది. చెబుతుంటే నీవు తల కూడా పక్కకు తిప్పలేవు. అన్నం నీళ్లూ అక్కర లేకుండా వింటూ కూచుంటావు.''

''అలాగా? అదేం కథ? అంత పెద్దది ఉంటుందా?'' కళ్లు పెద్దవి చేస్తూ ప్రశ్నించాడు పైనీ.

''అవునురా. పాలు తాగావా? ఆఁ ఆ బ్రెడ్ కూడా తినెయ్యి మంచినీళ్లు కావాలంటే తాగు.''

''తాగేశానత్తా, ఊఁ ఇంక చెప్పు?''

''ఆఁ నీవు బట్టలు మార్చుకోవాలి. ముఖం కాళ్లూ చేతులూ బట్టతో తుడుస్తా ఉండు. బట్టలు మార్చుకునేముందు ఒంటి నిండా పౌడరు పూసుకోవాలి. మీ చాకలి బాగా ఇస్త్రీ చేస్తాడా? లేకపోతే రేపటి నుంచీ నేను చేస్తాలే నీ బట్టలు'' అరగంట సేపు ఇలా కబుర్లు సాగదీసి చెబుతూ గడిపింది.

''అత్తా కథ చెప్పాలి'' మళ్లీ మొదలు పెట్టాడు.

''ఆఁ కథ కదూ నీవడిగింది? చెబుతా విను. నీకు సిపాయిలంటే ఎవరో తెలుసా?''

''ఆ దేశాన్ని కాపాడే వాళ్లు. యుద్ధం చేసే వాళ్లు, కాకిబట్టలు వేసుకునే వాళ్లు'' అంతేనా అన్నట్టు చూశాడు.

''నీవనుకున్నది కాదురా. ఒకసారి ఓ దేశమ్మీదికి శత్రువులు వచ్చారని ప్రతి ఊరికీ తెలిసింది. ప్రతి ఇంటి. నుంచీ ఇద్దరూ ముగ్గురూ బయలుదేరారు.

కాకీనిక్కరు కాకిషర్టూ బూట్లూ వేసుకున్నారు. చేతులూపుకుంటూ లెఫ్ట్ రైట్ అనుకుంటూ నడిచారు.''

''అత్తా వీళ్లంతా ఏం చేస్తారు ?'' అతడి ముఖంలో కూతూహలం కదను తొక్కింది.

''వీళ్లంతానా ? వీళ్లందరూ అంటే వందలూ వేలూ లక్షలూ బయలుదేరి...... ...... ......''

''ఏం చేస్తారత్తా వీళ్లంతా ?'' ఆతురతతో అడిగాడు.

''వీళ్లంతానా ? శత్రువులను అందరినీ చంపి... ... ....''

''ఎట్లా చంపుతారు ?'' ముఖంలో భయం స్పష్టంగా కనబడుతోంది పైసీకి.

''పోనీలే, నీకు భయంగా ఉన్నట్టుంది. ఇంకో కథ చెప్పనా ?''

''వద్దు. ఇదే చెప్పాలి. ఎట్లా చంపుతారు ?'' కూతూహలం పట్టలేక లేచి కూర్చొన్నాడు పైసీ.

''భయపడవు కదా ? ఇంత పొడుగుపాటి కత్తి తీసుకుని శత్రువు కనబడగానే పట్టుకుని పొడిచి... ... ....'' అతడి ముఖంలోకి చూసింది.

''పొడిచి ? తరువాత ఏమైందత్తా ?''భయంతో ఒణకటం మొదలుపెట్టాడు.

''ఈ కథ నీకు చెప్పేది కాదు. నీవు భయపడుతున్నావు. కొంచెంసేపు పడుకో'' అతడిని నిద్ర పుచ్చటానికి ప్రయత్నించింది. ఎంతో సేపు వీపు మీద రాసింది.

మరి కాసేపటికి కళ్లు తెరిచాడు పైసీ. ''అత్తా ! ఆ సిపాయి శత్రువును ఎట్లా పట్టుతున్నాడు ?''

''నీకు భోజనం వేళయింది. వడ్డించిన పళ్లెం తెస్తాను. ముద్దలుచేసి నోట్లో పెడతాను. తింటూ ఉండు''

''నీవు చెబితేనే నేను తింటా'' మొండికేశాడు.

"అయితే సరే. నోట్లో ముద్ద పెట్టుకో. నీవు తింటూ ఉండు. నేను చెబుతూ ఉంటా. ఆఁ. ఆ సిపాయి పరుగెత్తి-పరుగెత్తి-పరుగెత్తి-"

ఆమె మాట పూర్తి చేయకముందే "దారిలో కాలికేం తగల్లేదా?" ప్రశ్నించాడు.

"ఊఁహూఁ. సిపాయి పరుగెత్తి పరుగెత్తి శత్రువును పట్టుకుని కొట్టి కొట్టి కొట్టి...."

"అత్తా, అయితే ఎట్లా చంపాడు?" మళ్లీ ప్రశ్న.

"కత్తితో పొడిచి- పొడిచి- పొడిచి...."

"అయితే సిపాయిలంతా పరుగెత్తారా?"

"ఆ శత్రువులలో ఇంతకంటె బలమైన సిపాయిలున్నారు. వాళ్లు వీళ్లను కొట్టటానికి కత్తులు తీసుకుని పరుగెత్తుకొచ్చారు."

సైనీ పడిపడి నవ్వాడు. "సిపాయిలు పరుగెత్తి పరుగెత్తి పట్టుకున్నారు కదూ అత్తా?"

"అవునురా. ఎట్లా పరుగెత్తా రనుకున్నావు?" ఆమె పలకమీద పరుగెత్తే సిపాయి బొమ్మలు గీసి చూపించింది.

సైనీకి ఆనందం పట్టలేనంతగా ఉంది.

"సిపాయిలు పరుగెత్తి పరుగెత్తి శత్రువులను చంపుతున్నారు. సిపాయిలు పరుగెత్తి- పరుగెత్తి."

"అత్తా. సిపాయిలు పరుగెత్తి శత్రువును ఎలా చంపాడు? బొమ్మ వెయ్యవూ?"

సౌజన్య బొమ్మలు వేసి చూపించింది.

సైనీకి వాటిని చూస్తుంటే విపరీతమైన నవ్వు వస్తోంది.

ఇలా ఇరవై రోజులు గడిచింది. సైనీ మంచమ్మీది నుండి దిగటంలేదు. పరుగెత్తే బొమ్మలు సిపాయిలను చూస్తున్నాడు.

ఒకనాడు సౌజన్య గుర్రం మీద సవారీ చేసే సిపాయిని పలకమీద వేసి చూపించింది

వెంటనే శైనీ "అత్తా! గుర్రాన్ని పరుగెత్తించు" అడిగాడు.

ఆమె పరుగెత్తినట్టు బొమ్మలేసింది.

"అత్తా! గుర్రం ఇంకా పరుగెత్తాలి"

ఆమె గుర్రం కాళ్లు దూరదూరంగా ఉన్నట్టు బొమ్మ వేసింది.

"అత్తా! ఇంకా-ఇంకా-ఇంకా గుర్రం పరుగెత్తాలి" లేచి కూర్చుని చప్పట్లు కొడుతూ నవ్వాడు.

సౌజన్య మరునాడు ఒక బ్లాక్ బోర్డు చాక్‌పీస్ తెప్పించింది.

"ఏరా శైనీ. ఇవాళ ఎవరిని పరుగెత్తిద్దాం?" అడిగింది చాక్‌పీసు పట్టుకుని.

"ఒక సిపాయి ముందు పరుగెత్తాలి. వాడివెనక ఒక గుర్రంమీద సిపాయి కూర్చోవాలి. ఆ గుర్రం పరుగెత్తాలి" అన్నాడు

"పరుగెత్తి?"

"వీడు బాగా పరుగెత్తాలి అప్పుడు ఆ ముందు నడిచే సిపాయి కింద పడి పోవాలి."

సౌజన్య నవ్వుతుంది. శైనీ మనసులో ఏముందో తెలిసిపోతోంది. ఎవరయినా పరుగెత్తాలి. పరుగెత్తి ముందు వాడిని పట్టుకోవాలి అందుకే మంచమ్మీద ఒక క్షణం ఉండకుండా పరుగులు తీసేవాడు. ఇప్పుడు బొమ్మలు పరుగెత్తుతుంటే తను పరుగెత్తినంత సంతోషంగా ఉంది.

"ఒరే శైనీ. నీకింకా ఏం బొమ్మలు కావాలి చెప్పు? నేను బోర్డు మీద గీస్తాను" అంది సౌజన్య.

"బంతి తీసుకుని ఒకడు పారిపోతాడనుకో ఆ బంతికోసం ఇంకోడు వాడివెనక పరుగెత్తాలి. పరుగెత్తి కింద పడిపోవాలి. బంతిచేతిలో ఉన్నవాడు అంద కుండా పారిపోవాలి."

సౌజన్య అతడు చెప్పినట్టే బొమ్మలు వేసింది. "శైసీ. మీ స్కూల్లో ఎవరయినా నీ బంతి తీసుకుని పారిపోయారా?"

"ఆఁ. రమేషని ఒకడున్నాడు. నా బంతి తీసుకోవాలని చూస్తాడు. ఒకసారి నాది తీసుకుని పరుగెత్తబోతే నేను లాక్కుని పారిపోయాను కాని పరుగెత్తలేక ఒకచోట పడ్డా." అతడి పసిముఖంలో విచారం చోటు చేసుకుంది. ముఖం అంతలో చిన్నబోయింది. కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

సౌజన్య శైసీ. కళ్ళు తుడిచి పడుకోబెట్టింది.

"చూడు శైసీ నేనివాళ వేసే బొమ్మలు ఎట్లా ఉంటాయో?"

ఆమె పరుగెత్తే పిల్లలవిద్దరిని బోర్డుమీద వేసింది. ముందు పరుగెత్తే పిల్లవాడి చేతిలో బంతి ఉంది. బంతి పట్టుకుని గబగబా పరుగెత్తుతున్నాడు. ఇంకో పిల్లవాడు వెనకబడ్డాడు. ముందువాడిని అందుకోలేకపోతున్నాడు. కొంతదూరం పరుగెత్తి కిందపడి పోయాడు. ముందు పరుగెత్తే పిల్లవాడు అచ్చంగా శైసీలా ఉన్నాడు. డ్రెస్సు కూడా శైసీ డ్రెస్సే నవ్వుతూ బంతి ఎగరవేస్తున్నాడు.

"చూడు శైసీ ఆ పిల్లలెవరు? గుర్తుపట్టావా?"

బాగా చూశాడు. శైసీ లేచి కూర్చున్నాడు. మరింత దగ్గరగా చూశాడు.

"అత్తా ఆ ముందున్నది నేను కదూ?"

"అవునురా. నీవే. ఆ బట్టలూ ఆ బంతీ నీవే. బాగా కనబడటం లేదూ? బాగా చూడు" అన్నది.

"అవునత్తా నేనే. ఆ రమేష్‌గాడు వెనకబడ్డాడు. వాడికంతే కావాలి. కింద పడ్డాడు కదూ." చప్పట్లు కొడుతూ నవ్వటం మొదలుపెట్టాడు.

"అత్తా. వాడేమో ఒకరోజు నన్ను చచ్చుకాళ్ళవెధవా అన్నాడు" అంతలో ముఖం చిన్న బుచ్చుకున్నాడు శైసీ.

"ఛీ. వాడికేం తెలుసు? నీవి చచ్చు. కాళ్ళయితే అలా పరుగెత్తగలవా? వాడే చచ్చుకాళ్ళవాడు. అందుకే కిందపడ్డాడు"

ఈసారి సౌజన్య రమేష్‌ను కిందబడి దొర్లుతున్నట్టుగా బొమ్మ వేసింది. హైనీని బాగా బలంగా ఉన్నట్లు అతివేగంగా పరుగులు తీస్తున్నట్టు పెద్ద బొమ్మ వేసి బోర్డు మంచానికి దగ్గరగా పెట్టింది.

హైనీ ఆ బొమ్మను చూస్తూ అపరిమితానందం పొందుతున్నాడు. ఏది చేతికిస్తే అది తినేస్తున్నాడు. పది రోజులలో బరువు బాగా పెరిగాడు.

డాక్టరు వచ్చి చూసేసరికి జ్వరంలేదు. మేనత్త రోజూ జ్వరం కొలుస్తునే ఉంది. చార్టు చూపించింది.

''ఇప్పుడు ఎక్కడ చూసినా వైరస్ ఇన్ఫెక్షనూ జ్వరాలూ. హైనీకి తగ్గిపోయింది లెండి ఈ టానిక్కులు జాగ్రత్తగా ఇవ్వండి'' అన్నాడు డాక్టరు.

హైనీ మాత్రం బోర్డువంక చూస్తూ మురిసి పోతున్నాడు.

ఆ మురిపెం ఎందుకో ఆమేనత్తకే తెలుసు.

(ఆలిండియా రేడియో)



# స్వ ర్ణ క మ లా లు

మునసబు రంగారావుగారు సాయంత్రమనగా చెప్పారని ఏడుకొండలు అర కడుపు భోజనంచేసి ఆ రాత్రే చెరువు గట్టున చెట్టుకింద గుడ్డ పరచుకొని పడుకున్నాడు. ఆకాశం వంక చూస్తే అక్కడ చందమామా చుక్కలూ కనబడలేదు. మబ్బు మబ్బుగా ఉంది. చుట్టూ చూస్తే చింతచెట్టు నాలుగుకొమ్మలూ చెరువు గట్టంతా ఆవరించుకొని చీకటి చీకటి చేశాయి. ఆ కొమ్మల నాశ్రయించుకున్న పక్షి జాలం మధ్యమధ్య చేసే కలకలారావాలు గుండెలో గుబులు పుట్టిస్తున్నాయి. వీటితోపాటు ఇంకెవరయినా వస్తారేమోనన్న భయం కడుపులో గుభేలు మంటున్నది.

భయమే. తెల్లవారితే వినాయకచవితి. ఆ తామరకొలనులో ఉన్న ఎరుపూ తెలుపూ కలవపూలను మునసబుగారు పూజకని కోసుకు రమ్మన్నారు. ఆయన పెద్దకూతురు ఐదేళ్ళ కొడుకును ఎత్తుకుని వచ్చింది. ఆ బాబు తొలిసారిగా నావియకుడిని పెట్టుకుని పూజచేసుకుంటాడు. అందుకని పత్రి మిగతా పూలు తీసుకు రావిటానికి మరొక మనిషిని పంపించి ఏడుకొండలుని కలువపూల కోసమని ప్రత్యేకంగా పంపించాడు.

ఏడు కొండలు ఏ పనిమీద వెళ్ళినా పని ఖాయంగా చేసుకువస్తాడు. పనిలో నసుగులేదు. కాని- ఆ ఊళ్ళో వినాయక చవితినాడు అందరి కళ్ళూ ఆ కొలను మీదనే ఉంటాయి. కొలను నిండా నీళ్లు- ఎర్రకలవలూ తెల్లకలవలూ కన్నుచెదిరేటట్టు ఉన్నాయి. అందరికీ కలువపూలు దొరికే చోటదే. అందరికీ పూజలు, అందరూ ఆ కలువలతోనే వినాయకుడిని పూజించాలని ఆశ పడతారు.

ఆ పూలు ముందు కోసుకున్న వాళ్ళకు తప్ప కాస్త ఆలస్యంగా వచ్చిన వాళ్ళకు దొరకటం కష్టము.

మునసబుగారింటికి కండువా నిండా పూలు కోసుకు వెళ్లితే తీపి ఉండ్రాళ్లతో పెద్దమ్మగారు కడుపునిండా అన్నం పెడతారు. తలుచుకుంటేనే కళ్లు మిలమిల్లాడతాయి.

ఏడుకొండలకి కళ్లు మూతలు పడుతున్నాయి. మధ్య మధ్య ఉలికిపాటుతో కళ్లు తెరుస్తున్నాడు. కాస్త మబ్బులు విచ్చుకుని తూరుపుదిశ తెలతెల బారుతుంటే నీళ్లల్లోకి దిగి పూలు కోసుకోవచ్చు.

కాని-ఇంకా మబ్బు మబ్బుగానే ఉంది.

మళ్లీ కళ్లు మూశాడు.

టపటప చినుకులు పై నుంచి పడ్డాయి. చినుకలు ముళ్లు గుచ్చుకున్నట్టుగా గుచ్చుకున్నాయి. పైబట్ట తడిసింది. తుళ్లిపడి లేచాడు. బట్ట కప్పుకుని ముడుచుకుని కూర్చున్నాడు.

చిటపట చినుకులల్లా జడివానయింది.

ఇదేం వాన? పై నుంచి కిందికి ఒకటే ధార-ఆగకుండా.

ఎంతసేపు చూసినా తగ్గే సూచనలు కనబడటంలేదు.

ఏడుకొండలికి ఈ వానలోనే తెల్లవారి పోతుందేమోనన్న భయం పట్టుకుంది. తెల్లవారితే అందరూ వస్తారు. తనకు ఒక్క పూవయినా మిగల్చరు. అమ్మో! మునసబుగారు? వట్టి చేతులతో పోతే తాట ఒలిచేస్తారు.

గజగజలాడుతూ ముడుచుకుని కూర్చున్నాడు ఏడుకొండలు.

పెద్దమ్మగారు పెట్టే భోజనం-విస్తరినిండా అన్నం-తీపిఉండ్రాళ్లు కళ్లకు కట్టినట్టు. కనబడుతున్నాయి నోరూరుతున్నది.

ఏడుకొండలు ఆకాశం వంక ఒకసారి-చెరువు వంక ఒకసారి చూస్తున్నాడు.

ఎప్పుడు తగ్గాలి ఈ వాన? ఇవాళే ముంచుకు రావాలా తనను పరీక్షించినట్టు?

ఏడుకొండలు పదిహేడు పద్దెనిమిదేండ్ల వాడు. నల్లగా నిగనిగలాడుతూ కండలు తేరి ఉంటాడు. చింతాకంత కళ్లయినా చురుగ్గా విశితంగా చూస్తాయి. ఆ ఊరి పిల్లకారులోకల్లాధైర్య సాహసాలు కలవాడు. ఏడుకొండలు పేరు చెబితే కొందరు గజగజలాడతారు.

వాన ఉధృతం క్రమంగా తగ్గుతోంది.

మబ్బులు విచ్చుకుంటున్నాయి.

ఏడుకొండలు లేచాడు. ముసుగుగా కప్పుకున్న బట్ట గట్టిగా పిండి జోలె మాదిరిగా నడుముకు కట్టుకున్నాడు. మెల్లగా అడుగులు వేస్తూ చెరువులోకి దిగాడు. వానపడటంవల్ల చెరువులోకి దిగుతున్న కొద్దీ చలి అనిపించింది. తొడ లోతుకు పోయినప్పుడు మరి కాస్త చలిగా ఉంది. ఇంకా ముందుకు పోవాలి చెరువు మధ్యలో తామరాకులు-వాటి మధ్య పూలు కాడలు పైకి లేచి పూలు నీటిమట్టానికి మూరెడు పైన-తలలూపుకుంటూ తేల ఆడుతున్నాయి. కొన్ని అరవిచ్చినవి-కొన్ని పూర్తిగా విచ్చినవి.

చెరువు మధ్యకు పోతుంటే ఏడుకొండలకు భుజాలు మునిగాయి. మెల్లగా అడుగులు వేస్తున్నాడు. ఆ చెరువులో నీటినాగు ఉందని వారం రోజులనాడు ఎవరో చెప్పారు. జలగలు ఉన్నట్టు ఏడుకొండలికి కూడా తెలుసు. అవే వాటిలు అతడి ఒంటిని పీకుతున్నట్లనిపిస్తోంది.

చేతులతో దేహం నిమురుకుంటూ ముందుకు పోతున్నాడు. నాచులాంటివి ఏవేవో తీగెలూ చెత్తా కాళ్లకు చుట్టుకుని అడుగు పడనివ్వటంలేదు. ఏడుకొండలు కాళ్లు విదిలించుకుంటూ అడుగులు వేస్తున్నాడు. అడుగులు దిగబడుతున్నాయి. బలవంతంగా పైకి లాక్కుంటున్నాడు. తామరాకులచుట్టూ పేరుకునిపోయిన నాచును పక్కకు నెడుతున్నాడు. మధ్య మధ్య పట్టుకుని పీకే జలగలను దులుపుకోవాలని ప్రయత్నం చేస్తున్నాడు. బారలు చాపి తామర పూలను కాడలతో తుంచి ఒడికి కట్టుకున్న జోలెలో వేసుకుంటున్నాడు.

తెల్లవారినట్లనిపించి ఆకాశం వంక చూశాడు. తూరుపు దిశ ఎర్రబారింది. బంతిలా దొర్లుకుంటూ భూమి మీదినుంచి జేగురుముద్దలా బాలభానుడు లేతకిరణాలను ప్రసరింపచేస్తూ పైపైకి ఎగబాకుతున్నాడు.

ఏడు కొండలికి తొందర పుట్టింది. కనపడినంత వరకూ ఎరుపూ తెలుపూ తామర పూలను అందినంతకూ కోసి తన జోలెలో వేసుకున్నాడు. మరొకసారి చెరువంతా కలయజూశాడు. తామరపూలిక లేవు. ఒకటీ అరా ఉన్నప్పటికీ అవి

కుంటీ గుడ్డీ అన్నట్టుగా ఉన్నాయి. మంచివన్నీ తనే కోశాడు. తృప్తిగా వెనక్కు తిరిగాడు.

తిరిగి వచ్చేటప్పుడు చలే అనిపించలేదు. బరువును ఈడ్చుకుంటూ అడుగులు వేస్తూ ఒడ్డుకు చేరుకున్నాడు. నడుముకు కట్టుకున్న బట్టను జాగ్రత్తగా విప్పి నేలమీద పరచాడు.

అబ్బ. ఎన్నిపూలు? ఎన్నిపూలు? అసలెట్లా కొయ్యగలిగాడు- ఇన్నిపూలు? అతడికే ఆశ్చర్యంగా ఉంది

వాటిని చూసి అతడి మనసు ఆనందంతో పొంగి గంతులు వేయటం మొదలుపెట్టింది.

అప్పుడు- అతడికి తన దేహబాధ బాగా తెలిసింది. మొలతాటికి కట్టుకున్న చాకు తీసుకుని తనను అప్పటినుంచీ కొరుకుతున్న జలగలను పట్టుకుని కొయ్యటం మొదలుపెట్టాడు.

జలగలు చచ్చినా పట్టు విడవవు. తన దేహంలోకి చాకు పోనిచ్చి జలగలను లాగిపారేస్తున్నాడు. గాయాలలోనుంచి రక్తం కారుతున్నది.

ఏడుకొండలు మళ్లీ నీళ్లలోకి దిగాడు. ఒళ్లంతా రాచి రాచి కడుక్కున్నాడు. వర్షానికి తడిసిన తలను నీళ్లలో ముంచి రుద్దుకుంటూ తలారా మళ్లీ స్నానం చేశాడు. బట్ట ఒంటిమీదనే పిండుకుంటూ ఒడ్డుకు చేరాడు.

అప్పటికి బాల స్కరుడు మరికొంత పైకి వచ్చాడు కిరణాల నులి వెచ్చదనం తగ్గుతున్నది కాంతితో పాటు వేడి కూడా ఎక్కువవుతున్నది.

బట్టమీద తను కోసిన తామరపూలన్నీ సూర్యుడికి అధో ముఖంగా పేర్చుకుంటూ పోయాడు ఏడుకొండలు అప్పటికి అన్నీ విచ్చుతున్నాయి.

ఏడుకొండలికి పదివరకే లెక్కపెట్టటం వచ్చు. పది పది వంతున లెక్కపెట్టాడు. మూరు: తను వందపూలుకోశాడా? ఇన్ని కోసినట్టే అనిపించలేదు?

ఏడుకొండలు కళ్లు బాగా విప్పి ఆ పూలను చూశాడొకసారి.

సూర్యభగవానుడి కిరణాలు ఆ పూల మీద ప్రసరించి తెల్లటి పూలమీద ఎర్రటి పూలమీద బంగారువుప్పొడి చల్లినట్లనిపిస్తోంది అతడి కళ్లకు కొంత సేపటికి అవి బంగారు పూలేననిపించాయి.

అయితే-ఇవన్నీ బంగారు పూలా? బంగారు తామరపూలా! అతడి మనసు ఆనందంతో గంతులు వేసింది.

ఈ పూలు మునసబు రంగారావుగారి మనమడు పెట్టుకునే వినాయకుడికా?

ఏడుకొండలు మనసు అదోలా అయిపోయింది.

ఇంతవరకూ అతడు పూజలు చేయలేదు-చేస్తుండగా చూడలేదు.

అతడి మనసులో భావవీచిక ఒకటి తళుక్కున మెరిసింది.

ఇంత అందమైన ఈ పూలతో తనే పూజ చేస్తే?

భయంలాంటిదేదో వెన్ను పొడుగునా పాకినట్లయింది. దేహం గగుర్పొడిచింది.

మళ్లీ తనలో తనే సంబాళించుకున్నాడు. భయమెందుకు? తనేం తప్పు చేస్తున్నాడు?

కాని-ఏడుకొండలకి పూజ చెయ్యాలన్న సంకల్పం దృఢంగా కలిగిన తరువాత ఒక సందేహం వచ్చింది.

తనకు వినాయకుడు ఏడీ! వినాయకుడు లేందే పూజ ఎట్లా చెయ్యటం?

మెరుపులాంటి ఊహ మనసులో మెరిసింది.

నేలమీద నీళ్లు చల్లి రెండు చదరపు గజాల స్థలం శుభ్రం చేశాడు. వేలితో వినాయకుడి బొమ్మ గీయటానికి ప్రయత్నించాడు.

వినాయకుడు ఎట్లా ఉంటాడు?

కూర్చున్నట్టు గియ్యటానికి ప్రయత్నించాడు. గీస్తూ తుడుపుతూ కొంత సేపయిన తరువాత వినాయకుడికి తుండం ఇట్లా ఉంటుందని మనసులో ఊహించు

కుని ఒ అక్షరంలా గీశాడు. ఆ రెండు చదరపు గజాల నేలను ఆ తామర పూలతో నింపివేశాడు.

అదృశ్యమతడిని పులకరింప చేసింది.

బంగారు వృష్పొడి చల్లినట్లున్న ఆ తామరపూల మీద సూర్యకిరణాలు పడి మెరిసి పోతున్నాయి.

మనసు నిండా ఆనందం-కళ్లనిండా సంతోషం-శరీరం పులకలు తేలింది.

ఏడుకొండలు ఆ పూల ముందర సాగిల పడ్డాడు. రెండు చేతులూ తల మీద పెట్టుకుని జోడించాడు.

"సామీ! సామీ! సామీ! ఇవి బంగారు పూలు నీ కోసం తెచ్చిన సామీ! నీ కోసం కష్టపడి తెచ్చిన."

కళ్లు గట్టిగా మూసుకున్నాడు. ఆ మూసిన కళ్లనిండా బంగారు తామరలు-కళ్లు తెరిచాడు. అలే బంగారు తామరలు, ఎటు చూసినా అవే బంగారు పూలు.

ఆ సంభ్రమంలో ఏడుకొండలు మునసబు రంగారావుగారు పూజకు పూలు తెమ్మన్నమాట మరచాడు, పెద్దమ్మగారు తీయటి ఉండ్రాళ్లతో పెట్టబోయే భోజనం సంగతి విస్మరించాడు.

ఎనిమిది గంటలు కావచ్చింది. తామరపూల కోసమని క్రిందటి రోజు రాత్రి వెళ్లిన ఏడుకొండలు అంతవరకూ రాలేదని మునసబు రంగారావుగారు పాలేర్ల మీద కోప్పడుతున్నారు. వీధి వాకిట్లో కాలు కాలిన పిల్లిలా తిరుగుతున్నారు.

కొంత సేపటికి "ఒరే మల్లేశం! ఒరే వెంకటేశూ! మీరిద్దరూ చెరువు దగ్గరికి వెళ్లి చూసిరండి. ఏడుకొండలు ఎటన్నా వెళ్లాడా? లేక ఆ చెరువులో మునిగిపోయాడా? చూడండి. కనబడితే ఏడుకొండలిని చేతులుకట్టి లాక్కురండి" ఆజ్ఞాపించారు-మునసబు రంగారావుగారు.

బాణా కర్రలు తీసుకుని మీసాలు మెలివేసుకుంటూ చెరువు దగ్గరికి వచ్చిన వెంకటేశూ మల్లేశూ సాగిలపడిన ఏడుకొండలిని చూసి విస్మయపడ్డారు.

"ఏందిరా ఏడుకొండలూ? మునసబుగారు పూలు కోసుకురమ్మంటే ఈడ సాగిలపడ్డ వేందిరా? పూలుగోశావుగా?" అన్నారు ఇద్దరు.

ఏడుకొండలు కళ్లు తెరిచాడు. బాణా కర్రలనూ వాళ్లనూ చూశాడు.

"యెంకటేశూ! మల్లేశూ! నేను ఇనాయకుణ్ణి ఇక్కడే ఏలితో గీసి ఈ పూలతో పూజ చేసిన. ఇవి చెరువులో పూసిన వట్టి తామరలు కావు. బంగారు తామరలు. మీరు కూడా చెరువులో మునిగి తడిబట్టలతో వచ్చి సాగిలపడి కళ్లు మూసుకోండి. ఏరా. మనమెప్పుడయిన ఈటితో పూజలు చేసినమా? అసలు పూజలు చేసినమా ఎన్నడైన? రండి రండి" అన్నాడు.

వెంకటేశు కళ్లు అదృశ్యం చూడగానే మిరుమిట్లు గొలిపాయి. వెంటనే చెరువులోకి దిగి స్నానంచేసి వచ్చాడు. ఏడుకొండలు చెప్పినట్టు సాష్టాంగ పడ్డాడు.

మల్లేశు "ఏందిరోయ్ యెంకటేశు? మునసబుగారు పంపించింది ఎందుకు? సాగిల పడటానికా?" బాణా కర్ర నేలకు కొట్టి ఒక్క అరుపు అరిచాడు.

"నేరాను. నేరాను." చేతిసైగ చేశాడు వెంకటేశు. "ఏమన్న చేసుకో" ముఖం తిప్పుకున్నాడు.

"నీవు రాకపోతే ఈ పూలు తీసుకుపోతా" అన్నాడు మల్లేశు.

"వాటిని తాకకు. వాటిని తాకకు" ఏడుకొండలు బెదిరించినట్టు అన్నాడు.

మల్లేశుకు ఏడుకొండలు ఎటువంటివాడో తెలుసు. కోపం వస్తే రక్తం కళ్ల జూస్తాడు.

"అయితే నేపోతా. ఆ మునసబు దొరకే మీసంగతి చెప్తా. పదిమందిని పంపిస్తడు గుంజుకు రమ్మని" అంటూ వెనక్కు తిరిగి ఆ పూలనే చూస్తూ మల్లేశు ముందుకు అడుగులు వేశాడు.

అతడి మనను పీకుతున్నది - తనుకూడా చెరువులో మునిగి వెంకటేశు పక్కన సాగిలపడాలని. కాని- మునసబుగారు చేతికిచ్చిన బాణాకర్ర అతడిని ముందుకు నడిపించుకు పోతున్నది.

తామరపూరేకులు వెంకటేశుకూ ఏడుకొండలకూ అభయమిస్తున్నట్టుగా తలలూపుతున్నాయి బంగారు వన్నెలో మెరిసిపోతూ.

(ఆలిండియా రేడియో)



# రచయిత్రి ఇతర గ్రంథాలు

వ్యాస సంపుటాలు :

1. నారీ జగత్తు
2. జీవన సామరస్యము
3. వెలుగుబాటలు
4. కళ్యాణ కల్పవల్లి
5. వ్యాస తరంగిణి

జీవిత సంగ్రహాలు :

6. తేజోమూర్తులు

స్త్రీల పాటల కథలు :

7. జాతి రత్నాలు

నాటికలు :

8. రాగములో రంగులు

నవలలు :

9. దరిచేరిన ప్రాణులు
10. జీవిత వలయాలు
11. వైజయంతి
12. భవతీ భిక్షాందేహి
13. నీ బాంచను కాల్మొక్తా
14. అనుపమ
15. జీవితపాఠం
16. మంచుపిడిన మొగ్గ
17. దూరం చేసిన పొలిమేరలు (అచ్చులో ఉన్నది)
18. తల్లిలేని పిల్ల (అచ్చులో ఉన్నది)
19. పంకంలో తేలిన పద్మాలు (అచ్చులో ఉన్నది)
20. రంగ - వల్లి
21. పెళ్ళికూతుళ్ళు

నవలికలు :

22. బుద్ధి పిలిచింది-మనసు పలికింది
23. కొండంత మబ్బు
24. ఒక గూడి పక్షులు
25. మంచివాడు

అనువాదాలు :

26. Gandhiji the story of his life తెలుగుసేత Grlent Longman Ltd.

27. you and your food తెలుగు సేత National Book Trust India

బాలసాహిత్యము :

కథలు :

28. అదృష్ట వంతులకు చెరిపేవారు లేరు
29. ఉత్తర కుమార ప్రజ్ఞలు

నాటికలు :

30. బాలవీరుడు

జీవిత చరిత్రలు :

31. గాంధీ తాతయ్య
32. ఇందిరా ప్రియదర్శిని



# రచయిత్రివద్ద లభించే గ్రంథాలు

**తేజోమూర్తులు:** వెల రూ. **10-00**

ప్రథమ ముద్రణ-1976.

అలనాటి హైదరాబాదు సంస్థానం స్వాతంత్ర్య పిపాసువులకు చీకటి ఎడారి. తెలంగాణాప్రజలలో సాంఘిక రాజకీయ విద్యా వైజ్ఞానికంగా వెలుగులు వెదజల్లిన పదిమంది తేజోమూర్తుల జీవితసంగ్రహాలు ఈ గ్రంథంలో నిక్షిప్తం చేయ బడ్డాయి. ఈ గ్రంథం నేటితరానికీ రానున్న తరాలకూ మహత్తర సందేశాలను అందించేది. చరిత్రలోని అనేక విశేషాలను తెలియచేస్తూ ఆ తేజోమూర్తులను సుస్పష్టంగా సాక్షాత్కారింపచేశారు రచయిత్రి.

డాక్టరు దాశరథి
ఆస్థాన కవి

* * *

సరస్వతీదేవిగారు ఈ పదిమంది తేజోమూర్తులను సకలాంధ్రులకూ పరిచయము చేసి భావ సమైక్యతకు దోహదం చేశారు. ఆంధ్రలో పుట్టి, తెలంగాణాలో మెట్టిన ఈమె ఈ రెండు ప్రాంతాలకు వంతెన వంటివారు.

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమీ.

* * *

ప్రసిద్ధ తెలంగాణా నిర్మాతల జీవిత చిత్రాలను చక్కగా గీసి చూపిందారు రచయిత్రి. విషయం, వివరణ, శైలి పాఠకుడిని అలా పగ్గమేసి లాక్కుపోయే టట్టుగా ఉన్నాయి ఈ తేజోమూర్తులలోని జీవిత సంగ్రహవ్యాసాలు

డాక్టరు సి. నారాయణరెడ్డి
ప్రొఫెసరు తెలుగుశాఖ
ఉస్మానియా యూనివర్సిటీ

## కళ్యాణ కల్పవల్లి: వెల రూ. 15-00

ప్రథమ ముద్రణ-1976.

కళ్యాణ కల్పవల్లిలో నలభై వ్యాసాలు వివిధ విషయాలపై రచింపబడ్డాయి. అన్నీ మహిళాభ్యుదయానికి మార్గం చూపేతే కావి-వివిధ సమస్యలలో పడి తిక మక పడుతున్న యువతీ యువకులకూ వయసు మళ్లిన వారికీ మనశ్శాంతిని కలిగించి, ఒక చక్కని నిర్ణయానికి రప్పించగలిగినవీ వ్యాసాలు. ఈ వ్యాసాలు సర్వసతీదేవి గారి బహుముఖ విజ్ఞానానికీ లోకానుభవానికీ తార్కాణాలు.

ఆంధ్రప్రభ దినపత్రిక



## వ్యాసతరంగిణి: వెల రూ. 12-00

ప్రథమ ముద్రణ-1978

ఈ వ్యాస సంపుటిలో మాతృమూర్తి మదర్ థెరసా యుక్తంగా సుప్రసిద్ధ నారీమణులవీ సంఘసేవికలవీ జీవితాలకు సంబంధించిన వివరాలున్నాయి. అనేక ఇతర అంశాల మీద కూడా కొన్ని వ్యాసాలున్నాయి. ఇవన్నీ నిత్యజీవితంలో మనకు ఎదురయ్యే సమస్యలే, ఈ ముప్పైఏయయిదు వ్యాసాలు చదువటానికి సరళమైన శైలిలో ఉండటమేకాక-అత్యంతోపయోగకరమైనవని చెప్పవచ్చు.

ఆంధ్రప్రభ సచిత్రవార పత్రిక.